# 315



# సీనియర్ సెకండరీ స్థాయి కోర్సు

[ ఇంటర్మీడియట్ (APOSS) కోర్సు ]

# చరిత్ర - 2

**(కోర్ మాడ్యూల్స్)**






**ఎ.పి.స్టేట్ ఓపెన్ స్కూల్**

(APSOS) హైదరాబాద్

యస్.సి.ఇ.ఆర్.టి. క్యాంపస్, యల్.బి.స్టేడియం,

ఇ-గేట్ ఎదురుగా, బషీర్‌బాగ్, హైదరాబాద్ - 500 001

Website: www.apopenschool.org/html
Email : diraposshyd@yahoo.in

# ఈ తెలుగుసేతకు ముందుమాట

ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఓపెన్ స్కూల్, హైదరాబాద్ 2010 – 11 సంవత్సరము నుండి దూరవిద్యలో ఇంటర్మీడియట్ కోర్సును ప్రభుత్వ ఉత్తర్వు G.O. Ms,No 170 Higher Education (IE-II), dt.04. 09. 2010 ప్రకారం ప్రారంభించిందని తెలుపుటకు సంతోషిస్తున్నాను. ఈ కోర్సులో ప్రవేశం పొందిన అభ్యాసకులందరికీ నా అభినందనలు. దూరవిద్యలో ప్రారంభించబడిన ఈ కోర్సు రెగ్యులర్ ఇంటర్మీడియట్ (బోర్డు ఆఫ్ ఇంటర్మీడియట్, ఆంధ్రప్రదేశ్, హైదరాబాద్) కోర్సుకు సమానమైనది. ఏదో ఒక కారణముచే ఇంటర్మీడియట్ కోర్సు చేయని లేక పూర్తిచేయని అభ్యాసకులకు ఈ కోర్సు ఒక సువర్ణ అవకాశం.

ఈ పాఠ్యపుస్తకమును నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఓపెన్ స్కూలింగ్ (NIOS). నోయిడా వారి అనుమతితో వారి సిలబస్ ప్రకారము వారి ఆంగ్ల మాధ్యమ పుస్తకము అనువాదం చేయబడినది (Vide letter of charman NIOS/CMD/ MISC/10/314 Dt 27.10.2010 ). సంబంధిత విషయములలో నిష్ణాతులైన, మరియు అనుభవజ్ఞులైన ఆచార్యులు, రీడర్స్, లెక్చరర్స్ చే NIOS పాఠ్యగ్రంథములు అనువాదం చేయబడినవి. ఈ పాఠ్య పుస్తకంలోని అంశాలన్నీ NIOS వారి సంబంధిత పుస్తకంలోని మౌలిక భావనలను దృష్టియందుంచుకొని, తెలుగులోకి అనుసృజనగావించబడినది. అవసరమైన చోట అవగాహన నిమిత్తం అనువాద పదంతోపాటు ఆంగ్ల పదాలను కూడా ఇవ్వడం జరిగింది. అభ్యాసకులకు అర్థమయ్యే రీతిలో సరళమైన భాష వాడబడింది. అభ్యాసకుల సులభ అవగాహన కోసం చిత్ర పటాలు, రేఖా పటాలు పొందుపరిచాము. ఈ పాఠ్య పుస్తకము అభ్యాసకులకు ప్రభుత్వం వారు ఉచితముగా పంపిణీ చేయడం ఎంతో సంతోషాన్ని కలిగిస్తుంది. అభ్యాసకుల స్వీయ అధ్యయనం కోసం పాఠ్యాంశాలను శీర్షికలుగా విభజించటమే కాక, పాఠ్యప్రశ్నలకు జవాబులు కూడా ఇవ్వడం జరిగింది. అభ్యాసంలోని ప్రశ్నలకు విధ్యార్థులే స్వయంగా సమాధానములు వ్రాసుకోవాలి. వారికి బోధించే అధ్యాపకులు ఎప్పటికప్పుడు అభ్యాసకుల ప్రగతిని పరీక్షించాలి. అవసరమైన చోట ప్రోత్సాహము అందించాలి. వారి ప్రగతిలో లోపాలున్నట్లైతే సరిచేయాలి. ఈ అంశాలపై అభ్యాసకులకు ఇవ్వబడిన అసైన్‌మెంట్స్ (Assignments) / ప్రాజెక్టులు ఎప్పటికప్పుడు దిద్ది వారి జ్ఞానాన్ని, అవగాహనను పరిపుష్టం చేయాలి. వారి భవిష్యత్తుకు బంగారు బాటలు వేయాలి.

ఈ సందర్భంగా అనువాదమునకు అనుమతించిన ఛైర్మన్, NIOS గారికి, NIOS సెక్రటరీ గారికి, వారి సంబంధిత సిబ్బందికి కృతజ్ఞతలు. ఈ అనువాదంను, తెలుగులో అనుసృజనరీతిలో తీర్చిదిద్దిన సంపాదకులు, అనువాద బృందానికి, అధ్యాపకులకు, దోహదపడిన విద్యాశాఖ ప్రభుత్వ ముఖ్య కార్యదర్శి శ్రీమతి చందనాఖాన్ I.A.S గారికి, మన రాష్ట్రంలోని విశ్వవిద్యాలయ ఉపకులపతులకు, డీన్‌లకు, వివిధ సంచాలకులు, ఇంటర్మీడియట్ విద్య, ఉన్నత విద్య, పాఠశాల విద్య వారికి, సెక్రటరీ బోర్డ్ ఆఫ్ ఇంటర్మీడియట్ గారికి మా అభివాదములు. దీనిని ముద్రించు సంచాలకులు Govt Text Book Press శ్రీ జేసుపాదం గారికి, వారి సిబ్బందికి వందనాలు.

తగిన రీతిలో ఈ కార్యక్రమాన్ని సమన్వయ పరచిన మా APOSS కార్యాలయ సమన్వయ బృందానికి, సిబ్బందికి కృతజ్ఞతలు.

ఈ పాఠ్యగ్రంథంలో భావనలలోగాని, భాషలో గాని, అభివృద్ధి దిశలో ఏవైన మార్పులు, చేర్పులు, కూర్పులు, తొలగింపులు, తత్సంబంధ సూచనలున్నచో తెలుపవలసినదిగా సంబంధితులందరిని కోరుతున్నాను.

అభ్యాసకులకు మంచి భవిష్యత్తును కాంక్షిస్తూ

20/1/2011

**(కె. ఆనందకిశోర్)**

**సంచాలకులు**

**ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఓపెన్ స్కూల్, హైదరాబాద్.**

## The Subject Team

Chairman (Module-3)
**Dr.B.B.Aggarwal**
Head, Dept. of Education University of Delhi, Delhi

Chairman (Module - 4 & 5)
**Dr.G.D.Gulati**
Lecturer, Satyawati College, Delhi.

## Editors

**Dr.B.B.Aggarwal**
Head, Dept. of Education University of Delhi, Delhi

**Dr.G.D.Gulati**
Lecturer, Satyawati College, Delhi.

**Mrs.Asha Chaubey**
Lecturer, Indraprastha College , Delhi

**Ms.Anita Priyadarshini**
Tutor, History National Open School, New Delhi

## Evaluation Experts

**Dr.Qamar Uddin**
Reader, DMESDP, NCERT, New Delhi

## Lesson Writers

**Mrs.Rajana Bhattacharya**
Maitreyi College
New Delhi

**Mr.Anil Chauhan**
Delhi College of Arts and Commerce
New Delhi

**Dr.Surjit Jolly**
Lecturer, Vivekanand Mahila College
Delhi

**Mrs.Sangeeta L.Sharma**
Lady Shri Ram College,
New Delhi

**Mr.M.K.Das**
Dept.of Education University of Delhi
Delhi

**Mrs. Anita Devraj**
DAV Public School
Bahadurgarh (Haryana)

**Mr.Asha S.Chaubey**
Lecturer, Indraprastha College
Delhi

**Mrs.Tripta Verma**
Lecturer, Mata Sunderi Collge
New Delhi

**Mrs.Kamla Khanna**
PGT (Retd.)
Bal Bharti Air Force School

**Mr.P.P.Girhotra (PGT)**
Govind Ram Gurukul
Sr.Sec.School, Delhi

**Mr.C.P. Rai Bhatnagar**
PGT (Retd)
Teacher Training Institue
Darya Ganj, New Delhi

## Translator

**Mr.C.P. Rai Bhatnagar**
PGT (Retd)
Teacher Training Institue
Darya Ganj, New Delhi

## Course Co-ordinator

**Ms.Anita Priyadarshini**
Tutor,
History National Open School,
New Delhi

## Graphic Artist

**Mr.M.L.Zharotia**
National Open School,
New Delhi

# తెలుగులో అనుసృజన

## ప్రధాన సంపాదకులు

**శ్రీ కలపాల ఆనందకిశోర్,**
యమ్.యస్సీ.,యమ్.ఎడ్, పి.ఇ, డిప్లొమా ఇన్ ఎడ్యుకేషన్ (లండన్)
**సంచాలకులు**
**ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విద్యాపీఠం, బషీర్‌బాగ్, హైదరాబాద్.**

## సంపాదకులు

**ప్రొఫెసర్ ఇ.సుధారాణి,** M.A., M.Phil, Ph.D.,
Head, Department of History & Dean, Faculty of Social Sciences,
Dr.B.R. Ambedkar Open University, Hyderabad

## అనువాదకులు

**డా॥వడ్డాణం శ్రీనివాసరావు**
యం.ఏ, పి.హెచ్.డి.,
అసిస్టెంట్ ప్రొఫెసర్
డా॥ బి.ఆర్.అంబేద్కర్ సార్వత్రిక
విశ్వవిద్యాలయం, హైదరాబాద్

**శ్రీ జె.నీలకంఠం**
యం.ఏ., యం.ఇడి.,
అసిస్టెంట్ ప్రొఫెసర్, ఇఆర్‌టిడబ్ల్యు
బోర్డ్ ఆఫ్ ఇంటర్మీడియట్
ఎడ్యుకేషన్, హైదరాబాద్

**శ్రీ పి.సుందరరావు**
యం.ఏ., బి.ఇడి.,
హిస్టరీ లెక్చరర్
ప్రభుత్వ డిగ్రీ కళాశాల,
వినుకొండ

**శ్రీ కె.సాంబశివరావు**
యం.ఏ, డి.ఎల్.ఎస్‌సి.,
రిటైర్డ్ హెడ్ ఆఫ్ డిపార్ట్‌మెంట్ ఆఫ్
హిస్టరీ, జె.కె.సి. కళాశాల, గుంటూరు

**శ్రీ ఐ.ఎల్.ఎన్.చంద్రశేఖర్**
యం.ఏ., యం.ఇడి.,
లెక్చరర్, ప్రభుత్వ డిగ్రీ కళాశాల,
కడప

**శ్రీ యం.చక్రపాణి**
యం.ఏ., బి.ఇడి.,
డైరెక్టర్
యం.యస్.ఆర్.అకాడమీ, గుంటూరు.

## సమన్వయకర్త

**శ్రీ ఆర్.వెంకటేశ్వరరావు,** M.A.,(Litt.) M.A., M.Ed., M.Phil.
State Coordinator
Ap State Open School, Hyderabad.

# మీతో ఒక మాట

**ప్రియమైన అభ్యాసకులారా!**

ఈ సరికి మీరు ఈ కోర్సులోని మొదటి పుస్తకాన్ని చదివి ఉంటారు. ఈ పుస్తకంలో మనం ప్రాచీన భారత చరిత్ర పఠనాన్ని కొనసాగించి ఆ తరువాత మధ్యయుగ భారతదేశ చరిత్ర పఠనం చేపడదాం.

ఈ పుస్తకంలో మూడు మాడ్యులున్నాయి. మొదటి మాడ్యూల్ ప్రాచీన భారత చరిత్రను సూచిస్తుంది. అది మధ్య ఆసియా, ఆఫ్ఘనిస్తాన్, చైనా, టిబెట్, మరియు ఆగ్నేయాసియాలలో భారతీయ సంస్కృతీ విస్తరణను తెలుపుతుంది. ఈ మాడ్యూల్‌లోనే మనం ప్రాచీన భారత యుగం నాటి సామాజిక, ఆర్థిక అభివృద్ధి అంశాలకు సంబంధించిన అభివృద్ధి అంశాల గురించి చర్చిస్తాం. దాని ద్వారా నాటి సామాజిక వ్యవస్థ నిర్మాణంపై వాణిజ్యాభివృద్ధి, వ్యవసాధారిత ఆర్థిక వ్యవస్థ పరిణామాలు, భూస్వామ్య వర్గాల ఆవిర్భావం వంటి వాటి ప్రభావాన్ని మీరు విశ్లేషించగలరు. అటువంటి కారణాలు ప్రాచీన సమాజం నుంచి మధ్యయుగ సమాజానికి రూపాంతరం చెందటానికి దారితీశాయి.

ప్రాచీన భారత యుగం నాటి సాంస్కృతిక రంగంలో జరిగిన అనిర్వచనీయ ఉన్నతిని గూర్చి కూడా ఈ విభాగం చర్చిస్తుంది.

రెండవ మాడ్యూల్‌లో మనం భారతదేశ ప్రాచీన యుగం నుండి మధ్య యుగానికి పయనిస్తాం. ఇక ఇందులో మనం తురుష్కులు ఇల్‌టుట్‌మిష్, రజియాసుల్తానా, బాల్బన్ ఇంకా ఇతర తురుష్కులేక మామ్లుక్ సుల్తాన్‌ల క్రింద ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్య చరిత్రను, దానికి వారు చేసిన సేవలను గురించి చదువుతాం. వారిననుసరించి పాలించిన ఖల్జీలు, తుగ్లక్‌లు, వారిలో పేరెన్నికగన్న అల్లాఉద్దీన్ ఖల్జీ మరియు మహ్మద్‌బిన్ తుగ్లక్ వంటి వారి సేవలను గూర్చి ప్రత్యేకంగా చదువుతాం. ఆఫ్ఘన్ పాలకులైన లోడీల గురించి ఢిల్లీ సుల్తాన్‌ల రాజకీయ సమగ్రతలు, విచ్ఛిన్నానంతరం ఆవిర్భవించిన భోన్‌పూర్, మాల్వా, గుజరాత్ మరియు బెంగాల్ వంటి ప్రాంతీయ రాజ్యాలను గురించి మనం చదువుతాం. ఈ రాజ్యాలు ఉత్తరాన కాశ్మీర్, దక్షిణాన బహమనీ మరియు విజయనగరం రాజ్యాల వలె వారివారి వాస్తు శిల్పకళా రంగాల అభివృద్ధిని సాధించి భారతదేశ చరిత్రను పరిపుష్టం చేశాయి.

భారతీయ జీవనానికి పునరుత్తేజనివ్వటం వల్ల ఢిల్లీ సుల్తానుల యుగం ప్రత్యేకతను పొందింది. నాటికే భారత దేశమందున్న సంప్రదాయాలతో సమ్మిళితమైన నూతన భావాలను, వ్యవస్థలను, సాంకేతిక నైపుణ్యం, భాష, సంస్కృతులను ఈ యుగం తీసుకువచ్చింది. అంతేకాక ఈయుగం భారతదేశ భారతీయ సమాజానికి ప్రత్యేక గుర్తింపు తెచ్చిన వివిధ సంస్కృతుల వ్యాప్తికి సాక్ష్యంగా నిలిచింది.

మూడవ మాడ్యూల్‌లో మనం ఢిల్లీ సుల్తాన్ యుగం నుండి క్రీ.శ1526లో నూతన క్రొత్త యుగానికి నాందిపలికిన మొగల్ యుగానికి పయనిస్తాం. మొగలులు, రాజకీయ, పరిపాలన మరియు సాంస్కృతిక రంగాలలో చెప్పుకోదగిన, శాశ్వతమైన అనేక మార్పులను తీసుకువచ్చారు. భారతదేశ ఐక్యతను సాధించటం వారి ప్రముఖ విజయంగా చెప్పవచ్చు. ఈ మాడ్యూల్‌లో బాబర్ నుండి ఔరంగజేబు వరకు ప్రత్యేకంగా గొప్పవాడైన అక్బర్ వంటి చక్రవర్తుల ఘనకార్యములను గురించి చదువుతాం. అక్బర్ సామ్రాజ్య సుస్థిరతను సాధించి, పరిపాలన సంస్కరణలను ప్రవేశపెట్టి సైన్యంను, కులీన (ప్రభు) వర్గాలను చాకచాక్యంగా నిర్వహించాడు. మతసహనం అతని పాలనలో ఒక ప్రముఖ అంశం. ఆ విధంగా అతడు మంచి పాలనేగాక సామ్రాజ్యానికి శాంతిని, సమైక్యతను అందించాడు. అతడు జహంగీర్, షాజహాన్‌లకు అనుసరణీయ మార్గాలను సూచించాడు.

మొగలు కాలంలో చక్రవర్తి పదవి విధేయతను, గౌరవ మర్యాదలను పొందింది. మొగల్ చక్రవర్తి సమైక్య భారతానికి చిహ్నంగా నిలిచాడు. మొగల్ సామ్రాజ్య వారసత్వం పరిపాలన సంస్కృతి మరియు అనేక ఇతర రంగాలలో నేటికీ సజీవంగా నిలిచి ఉన్నది. కావున భారతదేశ చరిత్రలో అది ముఖ్య ఘట్టాన్ని ఆవిష్కరించింది.

# విషయసూచిక

‘ అవగాహన’ అని నిర్దేశించిన పాఠములు, విద్యార్థుల విషయ పరిజ్ఞానము కొరకు, మరియు పోటీ పరీక్షలకు ఉపయోగపడుతుంది. ‘అధ్యయనము’ అని నిర్దేశించిన పాఠములు విషయ పరిజ్ఞానము కొరకే కాక వీటి నుండి మాత్రమే పబ్లిక్ పరీక్షలకు ప్రశ్నలు ఇవ్వబడును.

315



# సీనియర్ సెకండరీ స్థాయి కోర్సు

[ ఇంటర్మీడియట్ (APOSS) కోర్సు ]

# చరిత్ర - 3

(కోర్ మాడ్యూల్స్)





**ఎ.పి.స్టేట్ ఓపెన్ స్కూల్**

(APSOS) హైదరాబాద్

యస్.సి.ఇ.ఆర్.టి. క్యాంపస్, యల్.బి.స్టేడియం,

ఇ-గేట్ ఎదురుగా, బషీర్‌బాగ్, హైదరాబాద్ - 500 001

Website: www.apopenschool.org/html
Email : diraposshyd@yahoo.in

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారిచే ఉచిత పంపిణీ

# ఈ తెలుగుసేతకు ముందుమాట

ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఓపెన్ స్కూల్, హైదరాబాద్ 2010 – 11 సంవత్సరము నుండి దూరవిద్యలో ఇంటర్మీడియట్ కోర్సును ప్రభుత్వ ఉత్తర్వు G.O. Ms,No 170 Higher Education (IE-II), dt.04. 09. 2010 ప్రకారం ప్రారంభించిందని తెలుపుటకు సంతోషిస్తున్నాను. ఈ కోర్సులో ప్రవేశం పొందిన అభ్యాసకులందరికీ నా అభినందనలు. దూరవిద్యలో ప్రారంభించబడిన ఈ కోర్సు రెగ్యులర్ ఇంటర్మీడియట్ (బోర్డు ఆఫ్ ఇంటర్మీడియట్, ఆంధ్రప్రదేశ్, హైదరాబాద్) కోర్సుకు సమానమైనది. ఏదో ఒక కారణముచే ఇంటర్మీడియట్ కోర్సు చేయని లేక పూర్తిచేయని అభ్యాసకులకు ఈ కోర్సు ఒక సువర్ణ అవకాశం.

ఈ పాఠ్యపుస్తకమును నేషనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఓపెన్ స్కూలింగ్ (NIOS). నోయిడా వారి అనుమతితో వారి సిలబస్ ప్రకారము వారి ఆంగ్ల మాధ్యమ పుస్తకము అనువాదం చేయబడినది (Vide letter of charman NIOS/CMD/ MISC/10/314 Dt 27.10.2010 ). సంబంధిత విషయములలో నిష్ణాతులైన, మరియు అనుభవజ్ఞులైన ఆచార్యులు, రీడర్స్, లెక్చరర్స్ చే NIOS పాఠ్యగ్రంథములు అనువాదం చేయబడినవి. ఈ పాఠ్య పుస్తకంలోని అంశాలన్నీ NIOS వారి సంబంధిత పుస్తకంలోని మౌలిక భావనలను దృష్టియందుంచుకొని, తెలుగులోకి అనుసృజనగావించబడినది. అవసరమైన చోట అవగాహన నిమిత్తం అనువాద పదంతోపాటు ఆంగ్ల పదాలను కూడా ఇవ్వడం జరిగింది. అభ్యాసకులకు అర్థమయ్యే రీతిలో సరళమైన భాష వాడబడింది. అభ్యాసకుల సులభ అవగాహన కోసం చిత్ర పటాలు, రేఖా పటాలు పొందుపరిచాము. ఈ పాఠ్య పుస్తకము అభ్యాసకులకు ప్రభుత్వం వారు ఉచితముగా పంపిణీ చేయడం ఎంతో సంతోషాన్ని కలిగిస్తుంది. అభ్యాసకుల స్వీయ అధ్యయనం కోసం పాఠ్యాంశాలను శీర్షికలుగా విభజించటమే కాక, పాఠ్యప్రశ్నలకు జవాబులు కూడా ఇవ్వడం జరిగింది. అభ్యాసంలోని ప్రశ్నలకు విధ్యార్థులే స్వయంగా సమాధానములు వ్రాసుకోవాలి. వారికి బోధించే అధ్యాపకులు ఎప్పటికప్పుడు అభ్యాసకుల ప్రగతిని పరీక్షించాలి. అవసరమైన చోట ప్రోత్సాహము అందించాలి. వారి ప్రగతిలో లోపాలున్నట్లైతే సరిచేయాలి. ఈ అంశాలపై అభ్యాసకులకు ఇవ్వబడిన అసైన్‌మెంట్స్ (Assignments) / ప్రాజెక్టులు ఎప్పటికప్పుడు దిద్ది వారి జ్ఞానాన్ని, అవగాహనను పరిపుష్టం చేయాలి. వారి భవిష్యత్తుకు బంగారు బాటలు వేయాలి.

ఈ సందర్భంగా అనువాదమునకు అనుమతించిన ఛైర్మన్, NIOS గారికి, NIOS సెక్రటరీ గారికి, వారి సంబంధిత సిబ్బందికి కృతజ్ఞతలు. ఈ అనువాదంను, తెలుగులో అనుసృజనరీతిలో తీర్చిదిద్దిన సంపాదకులు, అనువాద బృందానికి, అధ్యాపకులకు, దోహదపడిన విద్యాశాఖ ప్రభుత్వ ముఖ్య కార్యదర్శి శ్రీమతి చందనాఖాన్ I.A.S గారికి, మన రాష్ట్రంలోని విశ్వవిద్యాలయ ఉపకులపతులకు, డీన్‌లకు, వివిధ సంచాలకులు, ఇంటర్మీడియట్ విద్య, ఉన్నత విద్య, పాఠశాల విద్య వారికి, సెక్రటరీ బోర్డ్ ఆఫ్ ఇంటర్మీడియట్ గారికి మా అభివాదములు. దీనిని ముద్రించు సంచాలకులు Govt Text Book Press శ్రీ జేసుపాదం గారికి, వారి సిబ్బందికి వందనాలు.

తగిన రీతిలో ఈ కార్యక్రమాన్ని సమన్వయ పరచిన మా APOSS కార్యాలయ సమన్వయ బృందానికి, సిబ్బందికి కృతజ్ఞతలు.

ఈ పాఠ్యగ్రంథంలో భావనలలోగాని, భాషలో గాని, అభివృద్ధి దిశలో ఏవైన మార్పులు, చేర్పులు, కూర్పులు, తొలగింపులు, తత్సంబంధ సూచనలున్నచో తెలుపవలసినదిగా సంబంధితులందరిని కోరుతున్నాను.

అభ్యాసకులకు మంచి భవిష్యత్తును కాంక్షిస్తూ

20/1/2011

**(కె. ఆనందకిశోర్)**

**సంచాలకులు**

**ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఓపెన్ స్కూల్, హైదరాబాద్.**

## The Subject Team

Chairman (Module-3)

**Dr.B.B.Aggarwal**

Head, Dept. of Education University of Delhi, Delhi

Chairman (Module - 4 & 5)

**Dr.G.D.Gulati**

Lecturer, Satyawati College, Delhi.

## Editors

**Dr.B.B.Aggarwal**

Head, Dept. of Education University of Delhi, Delhi

**Dr.G.D.Gulati**

Lecturer, Satyawati College, Delhi.

**Mrs.Asha Chaubey**

Lecturer, Indraprastha College , Delhi

**Ms.Anita Priyadarshini**

Tutor, History National Open School, New Delhi

## Evaluation Experts

**Dr.Qamar Uddin**

Reader, DMESDP, NCERT, New Delhi

## Lesson Writers

**Mrs.Rajana Bhattacharya**

Maitreyi College

New Delhi

**Mr.Anil Chauhan**

Delhi College of Arts and Commerce

New Delhi

**Dr.Surjit Jolly**

Lecturer, Vivekanand Mahila College

Delhi

**Mrs.Sangeeta L.Sharma**

Lady Shri Ram College,

New Delhi

**Mr.M.K.Das**

Dept.of Education University of Delhi

Delhi

**Mrs. Anita Devraj**

DAV Public School

Bahadurgarh (Haryana)

**Mr.Asha S.Chaubey**

Lecturer, Indraprastha College

Delhi

**Mrs.Tripta Verma**

Lecturer, Mata Sunderi Collge

New Delhi

**Mrs.Kamla Khanna**

PGT (Retd.)

Bal Bharti Air Force School

**Mr.P.P.Girhotra (PGT)**

Govind Ram Gurukul

Sr.Sec.School, Delhi

**Mr.C.P. Rai Bhatnagar**

PGT (Retd)

Teacher Training Institue

Darya Ganj, New Delhi

## Translator

**Mr.C.P. Rai Bhatnagar**

PGT (Retd)

Teacher Training Institue

Darya Ganj, New Delhi

## Course Co-ordinator

**Ms.Anita Priyadarshini**

Tutor,

History National Open School,

New Delhi

## Graphic Artist

**Mr.M.L.Zharotia**

National Open School,

New Delhi

# తెలుగులో అనుసృజన

## ప్రధాన సంపాదకులు

**శ్రీ కలపాల ఆనందకిశోర్,**
యమ్.యస్సీ.,యమ్.ఎడ్, పి.ఇ, డిప్లొమా ఇన్ ఎడ్యుకేషన్ (లండన్)
**సంచాలకులు**
**ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విద్యాపీఠం, బషీర్‌బాగ్, హైదరాబాద్.**

## సంపాదకులు

**ప్రొఫెసర్ ఇ.సుధారాణి,** M.A., M.Phil, Ph.D.,
Head, Department of History & Dean, Faculty of Social Sciences,
Dr.B.R. Ambedkar Open University, Hyderabad

## అనువాదకులు

**డా॥వడ్డాణం శ్రీనివాసరావు**
యం.ఏ, పి.హెచ్.డి.,
అసిస్టెంట్ ప్రొఫెసర్
డా॥ బి.ఆర్.అంబేద్కర్ సార్వత్రిక
విశ్వవిద్యాలయం, హైదరాబాద్

**శ్రీ జె.నీలకంఠం**
యం.ఏ., యం.ఇడి.,
అసిస్టెంట్ ప్రొఫెసర్, ఇఆర్‌టిడబ్ల్యు
బోర్డ్ ఆఫ్ ఇంటర్మీడియట్
ఎడ్యుకేషన్, హైదరాబాద్

**శ్రీ పి.సుందరరావు**
యం.ఏ., బి.ఇడి.,
హిస్టరీ లెక్చరర్
ప్రభుత్వ డిగ్రీ కళాశాల,
వినుకొండ

**శ్రీ కె.సాంబశివరావు**
యం.ఏ, డి.ఎల్.ఎస్‌సి.,
రిటైర్డ్ హెడ్ ఆఫ్ డిపార్ట్‌మెంట్ ఆఫ్
హిస్టరీ, జె.కె.సి. కళాశాల, గుంటూరు

**శ్రీ ఐ.ఎల్.ఎన్.చంద్రశేఖర్**
యం.ఏ., యం.ఇడి.,
లెక్చరర్, ప్రభుత్వ డిగ్రీ కళాశాల,
కడప

**శ్రీ యం.చక్రపాణి**
యం.ఏ., బి.ఇడి.,
డైరెక్టర్
యం.యస్.ఆర్.అకాడమీ, గుంటూరు.

## సమన్వయకర్త

**శ్రీ ఆర్.వెంకటేశ్వరరావు,** M.A.,(Litt.) M.A., M.Ed., M.Phil.
State Coordinator
Ap State Open School, Hyderabad.

# మీతో ఒక మాట

**ప్రియమైన అభ్యాసకులారా!**

మీరు రెండవ పుస్తకంలో ఇవ్వబడిన మధ్యయుగ భారతదేశ చరిత్ర గురించి చదివే ఉంటారని తలుస్తాం. ఈ పుస్తకంలో మనం మధ్యయుగ భారతదేశ చరిత్రకు ముగింపు పలికి ఆధునిక భారతదేశ చరిత్రవైపు ముందుకు వెళదాం. ఈ పుస్తకంలో మూడు మాడ్యూల్స్ ఉన్నవి.

ఈ పుస్తకంలోని మొదటి మాడ్యూల్ మధ్యయుగ భారతానికి సంబంధించిన పరిపాలన, సామాజిక, ఆర్ధిక, మత మరియు సాంస్కృతిక జీవనాన్ని గురించిన ముఖ్య లక్షణాలను ప్రత్యేకంగా వివరిస్తుంది. ఈ మాడ్యూల్‌లో మీరు తురుష్క మరియు మొగలుల నాటి సంప్రదాయాలు, పద్ధతులు, వ్యవస్థలు ఆచారాలు స్వదేశీయ విషయాలతో మధ్యయుగంలో ఏవిధంగా మిళితమై పోయాయో తెలుసుకుంటారు. ఈ కలయిక భారతీయ మిశ్రమ సంస్కృతి మరింత అభివృద్ధి చెందటానికి దోహదం చేసింది.

ఈ పుస్తకం రెండవ మాడ్యూల్‌లో మనం భారతదేశ ఆధునిక చరిత్రలోకి అడుగిడతాం. అందులో మనం బ్రిటిష్‌వారు భారతదేశానికి రావటం, వారి పరిపాలనను స్థాపించడం వంటి విషయాలను గూర్చి చదువుతాం. బ్రిటిష్ ప్రభుత్వ ద్వంద్వ పరిపాలన, సైన్యసహకార పద్ధతి మరియు దత్త స్వీకార సిద్ధాంతం వంటి విధానాల ద్వారా భారత రాజ్యాలపై బ్రిటిష్‌వారు ఏవిధంగా భౌగోళిక మరియు ఆర్థిక నియంత్రణ సాధించగలిగారో అర్థమౌతుంది. ఆవిధంగా, బ్రిటిష్ తూర్పు ఇండియా, వర్తక కంపెనీ ఒక వ్యాపార సంస్థ నుండి ఒక సార్వభౌమశక్తిగా ఏవిధంగా ఎదిగిందో ఈ మాడ్యూల్‌లో తెలుసుకుంటారు.

భారతదేశంలో బ్రిటిష్‌వారి పాలనవల్ల ఆధునిక భావాల అభివృద్ధి రాజకీయ ఐక్యత, ఆంగ్ల విద్య ద్వారా పశ్చిమ (పాశ్చాత్యా) ప్రపంచంతో భారత్‌కు సంబంధాలు సంబంధాలు అభివృద్ధి చెందటం, 19వ శతాబ్దంలో భారతీయులలో సామాజిక సాంస్కృతిక జాగృతి కలగడం వంటి ప్రయోజనాలున్నప్పటికీ మొత్తం మీద బ్రిటీష్ వారి పాలన మౌలికంగా దోపిడీ విధానమునే అవలంభించింది. దీనివల్ల భారతీయులలో అసంతృప్తి మొదలైంది. ఈ మాడ్యూల్‌లో భారత్‌లో జాతీయ ధృక్పథం, జాగృతీ జననం మొట్టమొదటగా అది 1857లో జరిగిన తిరుగుబాటులో ప్రస్ఫుటంగా వ్యక్తమవటం వంటి విషయాలను గూర్చి కూడా చర్చిస్తాం.

మూడవ మాడ్యూల్‌లో 1858 సంవత్సరానంతర కాలం గురించి భారత స్వాతంత్ర్య పోరాటం గురించి చదువుతాం. ఇక్కడ మేము 1947 భారత స్వాతంత్ర్య సిద్ధి సమయంలో అత్యున్నత దశకు చేరుకున్న ఆధునిక భారత చరిత్రలోని అతి ముఖ్య మరియు సంబంధిత కాలాన్ని గూర్చి వివరిస్తాం. ఆ కాలం అతి ముఖ్యమైనది, ప్రత్యేకంగా చెప్పుకోదగినదీ ఎందుకంటే అది బ్రిటిష్ పాలకులకు ఒక పెనుసవాలుగా మారడమేగాక, బ్రిటిష్ వారిని భారతదేశం నుండి వెళ్ళగొట్టగలిగినంత మహాశక్తిని జనింపజేసిన ఇటీవల ప్రపంచ చరిత్రలో చోటుచేసుకున్న ఒక అతిపెద్ద మహోన్నత ప్రజాఉద్యమం పెల్లుబికిన కాలమిది. నిజానికి జాతీయ ఉద్యమం దానికన్నా ఎంతో గొప్పది. అది ఒక విశాల ధృక్పథమున్న ఉద్యమం. అంతేగాక, జాతీయ సమైక్యత, ఆర్థికాభివృద్ధి, మహిళా విమోచన, సామాజికంగా అణగారిన, వెనుకబడిన వర్గాల ఉద్ధరణ వంటి విషయాలపై కూడా జరిగిన పోరాటమిది. దానికి తోడు సామ్రాజ్యవాద మరియు జాతివిద్వేష విధానాలను అంతర్జాతీయంగా ఎదుర్కొన్న ఉద్యమమిది. వాటిని మనం నేటికీ ఆచరిస్తూనే ఉన్నాం. క్లుప్తంగా చెప్పాలంటే స్వాతంత్ర్యానంతర భారతదేశ విధానాలకు స్వాతంత్ర్య పోరాట సమయంలోనే బీజం పడింది. అందువల్లనే అది మన భారతదేశ చరిత్ర పాఠ్యాంశంలలో అతి ముఖ్య అంశమయింది.

శుభాకాంక్షలతో

**చరిత్ర అధ్యాపకుడు**

# విషయసూచిక

‘ అవగాహన’ అని నిర్దేశించిన పాఠములు, విద్యార్థుల విషయ పరిజ్ఞానము కొరకు, మరియు పోటీ పరీక్షలకు ఉపయోగపడుతుంది. ‘అధ్యయనము’ అని నిర్దేశించిన పాఠములు విషయ పరిజ్ఞానము కొరకే కాక వీటి నుండి మాత్రమే పబ్లిక్ పరీక్షలకు ప్రశ్నలు ఇవ్వబడును.

# 23

# విదేశాలలో భారతీయ సంస్కృతి

## 23.1 పరిచయం

ప్రాచీన కాలం నుండి భారతదేశం బయట ప్రపంచంతో సంబంధాలు కలిగి ఉండేది. హరప్పా ప్రజలకు మెసపటేమియన్లతో వాణిజ్య సంబంధాలుండేవి. మౌర్యులు పశ్చిమ దేశాలకు రాయబారులను పంపేవారు. కుషాణులకు రోమన్, చైనా రాజ్యాలతో సంబంధాలుండేవి. దక్షిణ భారత రాజ్యాలు ఆగ్నేయాసియా దేశాలతో వ్యాపారం చేసేవి. ఆ విధంగా పొరుగు రాజ్యాలతోను దూర దేశాలతోను సత్సంబంధాలు ఏర్పరచుకోవడం అనేది భారతదేశంలో పాతుకుపోయిన ఒక విధానంగా ఉంది.

ఈ పాఠంలో మనం భారతదేశ సంస్కృతి వ్యాప్తి చెందిన రెండు ప్రాంతాలను తీసుకున్నాం. అవి ఒక వైపున ఆఫ్ఘనిస్తాన్‌తో కూడిన మధ్య ఆసియా, చైనా మరియు టిబెట్ కాగా, మరొకవైపున ఆగ్నేయాసియా ప్రాంతం. భావాల పరస్పర మార్పిడికి, బయట ప్రపంచంలో భారతీయ సంస్కృతి విస్తరణకు మతం, మరియు వాణిజ్యం అతి ముఖ్య సాధనాలని మీకు అర్థమవుతుంది. భారతీయ తత్వం, కళలు, సాహిత్యం, మరియు వాస్తు కళలోని ఎన్నో విషయాలు స్థానిక సంస్కృతులు గ్రహించి ఆయా ప్రాంతాలలో ఒక ప్రత్యేక లక్షణాలు గలిగిన మిశ్రమ సంస్కృతి ఆవిర్భావం జరిగింది.

## 23.2 లక్ష్యాలు

ఈ పాఠం చదివిన తరువాత ఈ క్రింది అంశాలను మీరు తెలుసుకొంటారు.

1. ప్రాచీన కాలంలో భారతీయ సంస్కృతి విస్తరించని ప్రాంతాలను గుర్తించటం.
2. విదేశాలలో భారతీయ సంస్కృతీ విస్తరణకు మతం, వాణిజ్యాలు ముఖ్య సాధనాలని గుర్తించటం.
3. బౌద్ధమత అధ్యయనానికి మధ్య ఆసియా ఒక ముఖ్య కేంద్రంగా వృద్ధి చెందిన విషయం.
4. భారతీయ కళలు మరియు సాహిత్య ప్రభావం ఉన్న రాజ్యాలుగా ఖోతాన్ మరియు కుచ్చిలను గుర్తించటం.
5. ఆఫ్ఘనిస్తాన్‌తో సంస్కృతి మార్పిడికి ప్రతిబింబాలుగా బెగ్రాం (Begram), మరియు బమియన్ (Bamiyan)లోని బౌద్ధ దాతువులు, బుద్ధ విగ్రహాలను గుర్తించటం.

6. చైనాతో సంస్కృతిక సంబంధాలు పటిష్ట పరచడంలో కుమార జీవ మరియు పాహియాన్ వంటి పండితుల పాత్ర.
7. ఆగ్నేయాసియాలో హిందూ రాజ్యాల అభివృద్ధికి ముఖ్య మతశక్తిగా బ్రాహ్మణ మతాన్ని గుర్తించటం.
8. జావాలోని బోరోబుదూర్ (Borobudur)ను బౌద్ధమత ప్రభావానికి ప్రతీకగా కాంబోజలోని అంగ్కోర్‌వాట్ (Angcorvat) బ్రాహ్మణ మత ప్రతీకగా గుర్తించటం.
9. చంప మరియు కాంభోజలు హిందూరాజ్యాలుగా అభివృద్ధి.
10. బర్మా, థాయిలాండ్ సంస్కృతులు భారతీయ సంస్కృతిలోని అనేక అంశాలను అలవర్చుకొన్నాయన్న విషయం.
11. భారతీయ సంస్కృతి ఇక్కడి స్థానిక సంస్కృతి మిశ్రమం వల్ల ప్రత్యేక లక్షణాలు కలిగిన ఒక మిశ్రమ సంస్కృతి ఈ ప్రాంతాలలో అభివృద్ధి.

## 23.3 మధ్య ఆసియాతో భారతదేశ సంబంధాలు

మౌర్యుల కాలానికి ముందే రష్యన్ మరియు చైనీస్ తుర్కిస్థాన్‌ను కలిగియున్న మధ్య ఆసియా భారతీయ సంస్కృతికి కేంద్ర స్థానమైంది. పశ్చిమాసియాకు అవక్షకుడు రాయబారులను, మత ప్రచారకులను పంపినట్లు తెలుస్తుంది. కనిష్కుని కాలంలో పటిష్టమైన సంబంధాలు ఏర్పడినవి. క్రీ.శ. 3వ శతాబ్ది ప్రారంభం నాటికి కాష్గర్ నుండి చైనా సరిహద్దు వరకు గల తూర్పు తుర్కిస్థాన్ మొత్తం భారతీయ సంస్కృతి ప్రభావానికి లోనైందనేది సుస్పష్టం. వాణిజ్య మార్గాల వెంట నివాసాలేర్పరచుకున్న ప్రజలు బౌద్ధ మతాన్ని అనుసరించారు. యార్ఖండ్ (Yarkhand), ఖొటాన్ (Khotan), ఖాష్గర్ (Khashgar), కుచ్చి (Kuchi), ఖరషహర్ (Qarashahr) తున్ హువంగ్ (Tun Huang)లలో బౌద్ధ విహారాలు (Monashries) వెలిశాయి. భారతీయ శైలిలో నిర్మించిన స్థూపాలలో, విహారాలలో, పవిత్ర ప్రదేశాలలోని అవశేషాలలో లభించిన బుద్ధ విగ్రహాలను బట్టే గాక మధ్య ఆసియాలో లభించిన సంస్కృత ప్రాకృత మరియు స్థానిక భాషా గ్రంథాల నుండి బౌద్ధ మతం ఈ ప్రాంతంలో ముఖ్యమతంగా విలసిల్లిందని తెలుస్తుంది. రాయటానికి వారు చెక్క బిళ్లలను (Wooden tablets) తోలు, కాగితం, మరియు సిల్కులను వాడారు. చెక్క బిళ్లలను అధికారిక అవసరాల కోసం మాత్రమే వాడినట్లు తెలిసినప్పటికీ అక్కడక్కడ వ్యక్తిగత అవసరాలకు కూడా వాడిన ఆధారాలున్నవి. చెక్క బిళ్లలను సంక్షిప్త సమాచారం కోసం వాడేవారు. తోలు పత్రాలు, కాగితపు పత్రాలు ఒకే విధంగా ఉండేవి. ఆసక్తికర విషయమేమంటే వారు దైవారాధనలో ఆలపించే కొన్ని సూక్తులు కుషాణుల కాలం నాటి భారతీయ శాసనాలలో కనిపించే పదాలతో దాదాపు సరిపోల్చదగినవిగా ఉన్నవి.

మధ్య ఆసియాలో వెలసిన వివిధ రాజ్యాలలో భారతీయ సంస్కృతి వ్యాప్తికి దక్షిణాన ఉన్న ఖొటోన్, ఉత్తరాన ఉన్న కుచ్చి ప్రముఖ కేంద్రాలైనవి. మధ్య ఆసియాలోనున్న ఈ కేంద్రాల ద్వారా బౌద్ధ మతం మరియు భారతీయ సంస్కృతి మొదట చైనాకు ఆతర్వాత జపాన్‌కు వ్యాపించడంవల్ల మధ్య ఆసియాలోని ఈ రాజ్యాలు ముఖ్య రాజ్యాలుగా పేరొందినవి. మధ్య ఆసియాలోని ఈ కేంద్రాలలో భారతీయ ప్రభావానికి, చైనా యాత్రికులైన పాహియాన్ మరియు హ్యుయాన్‌త్సాంగ్‌ల రచనలు ముఖ్య ఆధారాలు. ఈ కేంద్రాల గురించి కొంత వివరంగా తెలుసుకుందాం.

ఖొటాన్ : ఖొటాన్‌లోని భారతీయ రాజ్యం మౌర్య చక్రవర్తి అశోకుని కుమారునిచే స్థాపించబడినట్లు చెప్పవచ్చు.

ఈ ప్రాంతంలో అనేక బౌద్ధ మతాలు స్థాపించబడినవి. గొప్ప విద్యా కేంద్రములుగా విలసిల్లిన గౌస్రింగ్ (Gousringa) మరియు గోమతి (Gomati) విహారాలు ప్రముఖమైనవి. ఖొటాన్‌లో సంస్కృత మరియు ప్రాకృత భాషలు రెంటిలోను అధ్యయనం జరిగేది. ఖొటాన్ మరియు ఇతర ప్రాంతాలో బ్రాహ్మణ మతం తాలూకు ఆధారాలు లభించాయి.

మతంతో పాటుగా భారతీయ ప్రభావం వాస్తు శిల్ప కళలపై కూడా ఉంది. కొటాన్ నుండి కొందరు భారతీయ కళాకారులు చైనాకు వలస వెళ్ళినట్లుగా భావించబడుతుంది. కొన్ని కుడ్య చిత్రాలు (Frescos) (గోడలపై గీయబడిన బొమ్మలు) తాలూకు అవశేషాలు అవి బౌద్ధ చిత్రకళకు సంబంధించినవే అని నిస్సందేహంగా తెలియజేయుచున్నది. బొమ్మలు గీసే విధానంలోను, సంప్రదాయాలలోను, కవళికలలోను అనేక సామ్యములు కనిపించుచున్నవి. గాంధారీలోని శిల్పాలలో శుద్ధ బొమ్మలు(Stucco figures) రూపుదిద్దుకొన్నాయి.

చైనా యాత్రీకుడైన పాహియాన్ క్రీ.శ. 400 ప్రాంతంలో భారతదేశానికి వచ్చే మార్గంలోనే ఖొటాన్‌లోగల గోమటి విహారమనే మహా విహారంలో (Monestery) కొంత కాలం గడిపాడు. అక్కడ బౌద్ధ మతం బహుళ ప్రాచుర్యంలో నున్నట్లు అతడు గుర్తించాడు. సంస్కృతం సంస్కృతి యొక్క భాష అని అతడు ధృవపరిచాడు. ఖొటాన్‌లోను పరిసర ప్రాంతాలలోను అమితంగా లభించిన చేతి రాత ప్రతుల ఖండములు (Fragments), చిత్రాలు, బౌద్ధ కట్టడాలు మొదలైవి ఈ ప్రాంతంలో బౌద్ధం ఒక ప్రముఖ మతంగా విలసిల్లిందని ఋజువు చేయుచున్నవి.

కుచ్చి (Kuchi) : చైనాలోని త్సిన్ (Tsin) వంశ చరిత్రలో కుచ్చి క్రీ.శ. 4 మరియు 5వ శతాబ్ది కాలంలో ఒక బౌద్ధ మత కేంద్రంగా వర్ణించబడింది. రాజులు భారతీయ నామాలను ధరించారు. ఉదా: సువర్ణపుష్ప, హరిపుష్ప, హరిదేవ మొదలైనవి. భారతీయ సంగీతం కూడా కుచ్చిలో ప్రవేశపెట్టబడటమేగాక అక్కడి నుండి అది చైనా మరియు జపాన్‌కు చేరింది. అక్కడి ప్రజలు మాట్లాడే ఒక ఇండో – యూరోపియన్ భాషకు కొందరు పండితులు ఆర్సి (Arsi) అని, మరికొందరు పండితులు కుచ్చియన్ (Kuchean) అని పేరు పెట్టారు. ఈ ప్రాంతంలో అనేక దేవాలయాలు మరియు స్థూపాలు కూడా మనకు కనిపిస్తాయి.

| భారతీయ సంస్కృతి రాజుల, మత ప్రబోధకుల మరియు వ్యాపారుల ద్వారా దక్షిణాసియాలో విస్తరించింది. ఈ ప్రాంతంలో భారతీయ ప్రభావం కలిగిన రాజ్యాలు వెలిశాయి. ఈ ప్రాంతంలో బౌద్ధ స్థూపాలు విహారాలు మనకు కనిపిస్తాయి. |
|---|

## 1.పాఠ్య ప్రశ్నలు 23 ఎ

ఈ క్రింది ఐదు వాక్యాలు ఇవ్వబడినవి. ఒక వాక్యం 23.3 విభాగం ముఖ్య విషయాన్ని తెలియజేస్తుంది. మూడు వాక్యాలు దానిని బలపరచే భావాన్నిస్తాయి. కాగా ఒక వాక్యం సంబంధంలేని విషయాలను సూచిస్తుంది. ముఖ్య భావననిచ్చే వాక్యానికి 'M' అని, బలపరచే భావననిచ్చే వాక్యానికి 'S' అని సంబంధంలేని విషయాన్నిచ్చే వాక్యానికి 'u' అని వ్రాయండి.

1. దక్షిణాసియాలో లభించిన అనేక స్థూపాలు, విహారాల ద్వారా ఆ ప్రాంతంలో బౌద్ధ మత వ్యాప్తి జరిగినట్లు తెలుస్తుంది ( )
2. భారతీయ సంస్కృతీ ప్రభావానికి లోనైన రాజ్యాలకు ముఖ్య ఉదాహరణలు కుచ్చి (Kuchi) మరియు ఖొటాన్ (Khotan) ( )

3. ఈ ప్రాంతంలో ఇప్పుడు ఇస్లాం ముఖ్య మతం ( )

4. మధ్య ఆసియాలో అనేక ప్రాంతాలలో భారతీయ సంస్కృతీ విస్తరణ జరిగినటుల అనేక ఆధారాలున్నవి ( )

5. ఖోటాన్‌లోని బౌద్ధ విహారమును పాహియాన్ దర్శించెను. ( )

2. వాణిజ్య రహదారి పేరిట అభివృద్ధి చెందిన రెండో బౌద్ధ చైత్యముల పేర్లు వ్రాయుము?

## 23.4 ఆఫ్ఘనిస్థాన్

మౌర్యుల కాలం నుండే ఆఫ్ఘనిస్తాన్ మరియు బెలూచిస్థాన్‌లపై ఒక పటిష్టమైన నియంత్రణను కలిగియున్నందువల్లే ఇస్లాం ప్రవేశించకముందు వరకు బౌద్ధ మతం , బ్రాహ్మణ మతం ఈ ప్రాంతాలలో బలీయమైన ప్రభావాన్ని కలిగియున్నవి. ఆఫ్ఘనిస్తాన్‌ను పాలించిన అనేక రాజవంశాలు అక్కడ వేళ్ళూనుకొన్న భారతీయ సంస్కృతీ ప్రభావానికి లోనైనవే. ఈ ప్రాంతం నాణెములు, శాసనములు, మతం, సాహిత్యం మరియు కళలు మొదలైన భారతీయ లక్షణాలను పుణికిపుచ్చుకొన్నవి. ప్రాచీన కాలంలో తూర్పు ఆఫ్ఘనిస్తాన్ రాజకీయంగా కాని సాంస్కృతికంగా కాని వాయువ్య భారతదేశంలో ఒక భాగంగా గుర్తించబడింది. గ్రీకు భూగోళ శాస్త్రజ్ఞుడు టాలమీ (Ptolomy) క్రీ.శ. రెండవ శతాబ్దంలో గీసిన ప్రపంచ పటంలో ఈ ప్రాంతాన్ని భారతదేశంలో కలిపి చూపాడు.

ఆఫ్ఘనిస్తాన్‌లో అనేక బుద్ధ విగ్రహాలు మరియు చైత్యాలు కనిపిస్తాయి. ఆఫ్ఘనిస్తాన్‌కు ఉత్తరంగా బౌద్ధ ధాతువులకు ప్రసిద్ధి పొందిన కేంద్రాలైన బెగ్రాం (Begram) మరియు బమియన్ (Bamiyan)లు ఉన్నవి. బెగ్రాంలో కుషాణుల కాలం నాటి దంతపు వస్తు కళ (Ivory work)కు సరిపోల్చదగినవే బెగ్రాం దంతపు వస్తు కళ కనిపిస్తుంది. బమియన్‌లో క్రీ.శ. తొలి శతాబ్దాల నాటి అతి ఎత్తయిన రాతి బుద్ధ విగ్రహం కనిపిస్తుంది. బౌద్ధ బిక్షువులు నివాసమున్న అనేక సహజసిద్ధమైన లేదా కృత్రిమ గుహలు ఇక్కడ కనుగొనబడినవి.

బమియన్‌లో రంగులతో గీయబడిన కుడ్య చిత్రాలు (Frescos) మరియు సంస్కృతంలో నున్న చేతి వ్రాత పతులు లభించాయి. కాబూల్‌కు వాయువ్య ప్రాంతంలో ఒక సూర్య విగ్రహం, గుప్తుల శైలిలో నిర్మించిన ఆలయ శిధిలాలు లభించాయి. గుప్తుల కాలంలోని భారతీయ సంస్కృతి ప్రభావమును ఇక్కడ లభించిన మట్టి విగ్రహాలు మరియు కుడ్య చిత్రాల (Mural paintings)లలో స్పష్టంగా కనిపిస్తుంది.

## 23.5 చైనా మరియు టిబెట్‌తో భారత్ సంబంధాలు

మీరు చదివినట్లుగా, క్రీ.శ. తొలి శతాబ్దాలలోనే భారతీయ సంస్కృతి మధ్య ఆసియాలో వ్యాపించింది. అనతికాలంలోనే చైనా కూడా దాని ప్రభావానికి లోనైంది. చైనాకు భారతదేశమిచ్చిన గొప్పవరం బౌద్ధ మతం. వాస్తవానికి ఈ మతం ఇక్కడి నుండే తూర్పు దిశగా కొరియా మరియు జపాన్‌లలో వ్యాపించి అక్కడ నేటికి ప్రబల శక్తిగా ఉంది.

క్రీ.శ. 69లో బౌద్ధమతం, చైనాకు తేబడింది. టిబెటిన్ మరియు చైనీయుల రాతలను బట్టి మౌర్యుల కాలంనుండే భారతదేశం ఈ దేశాలతో సంబంధం కలిగివున్నా అది అంత బలంగా ప్రభావవంతంగా ఉన్నట్లు కన్పించదు. కేవలం మలి హన (Han) వంశ పాలన చివరలో (క్రీ.వ. 23-220) మాత్రమే బౌద్ధమతం ఒక స్వతంత్ర్య మతంగా చైనాలో గుర్తింపు పొందింది. బహుశా చైనీయుల సాంప్రదాయాలు, భావాలు, సమాజం మొదలైనవి ఈ కాలంలోనే విచ్ఛిన్నం

చెందటం ప్రారంభమైంది. వివిధ పద్ధతులలో బౌద్ధమతం చైనీయ సమాజంలో అన్నివర్గాల వారిని ఆకట్టుకుంది. చైనాలో బౌద్ధ ఆలయాల నిర్మాణం ప్రారంభమవటమేగాక బౌద్ధమతం స్వీకరించే వారి సంఖ్య గణనీయంగా పెరిగింది. బౌద్ధ మతంను గురించి తేలికగా అర్థం చేసుకోడానికి క్రీ.శ. మొదటి శతాబ్దానికి ముందే హీనయాన తత్వానికి చెందిన ఒక సరళమైన కథనం వ్రాయబడింది. క్రీ.శ. మూడవ శతాబ్ది చివరి నాటికి బౌద్ధ మత వ్యాప్తిలో మరికొంత కృషి జరిగింది. ధర్మరక్ష (క్రీ.శ. 260-313) అనే బౌద్ధ బిక్షువు తన జీవితం మొత్తం బౌద్ధ మత వ్యాప్తిలోను సంస్కృత గ్రంథాలను చైనా భాషలోకి అనువదించుటం కోసం వెచ్చించాడు. కుమార జీవుడనే మరొక ప్రముఖ బౌద్ధ బిక్షువు మధ్య ఆసియా నుండి చైనాకు పయనించి అక్కడే క్రీ.శ. 401 నుండి 412 వరకు 11 సంవత్సరాలపాటు గడిపాడు. అతడు అనేక భారతీయ సూత్రాలను, ఇతర బౌద్ధ మత సూత్రాలను చైనా భాషలోకి అనువదించాడు. అంతకుముందే, కనిష్కుని కాలంలో చాలా మంది భారతీయ సన్యాసులు, మత ప్రచారకులు చైనాకు వెళ్ళారు. దానికి బదులుగా అనేక మంది చైనా పండితులు బుద్ధుని అవశేషాల సేకరణ నిమిత్తం భారతదేశానికి వచ్చారు. క్రీ.శ. 399లో చంద్రగుప్త విక్రమాదిత్యుని ఆ స్థానంను సందర్శించిన పాహియాన్ మరియు 14 సంవత్సరాలు భారతదేశంలో గడిపిన హ్యుయాన్ త్సాంగ్ మీకు గుర్తుండే ఉంటారు. నలందా వంటి అనేక విశ్వవిద్యాలయాలు కూడా చైనా పండితులను, విద్యార్థులను, పరిశోధకులను ఆకర్షించినవి.

భారతదేశంలోగల అటువంటి సంబంధాల పర్యవసానంగా, భారతీయ సంగీతం, ఖగోళ శాస్త్రం, గణితం, మరియు వైద్య శాస్త్రాలు చైనాలో బహుళ ప్రాచుర్యం పొందాయి. భారతీయులు చైనా నుండి పట్టు ఉత్పత్తిని నేర్చుకొన్నారు. భారతదేశంలో పట్టును చిన్నా పట్టా (Chinna patta) అనేవారు.

వ్యాపారుల ద్వారా సరుకులతోపాటు భావాలు కూడా చేరవేయబడి, రెండు సంస్కృతుల మధ్య పరస్పర ప్రభావానికి దారితీసింది. భారతీయ శిల్ప కళ యొక్క ప్రభావం చైనా మరియు మధ్య ఆసియాలలో వృద్ధి చెందిన కళా రూపములలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. చైనాలో బౌద్ధ మతం ప్రాచుర్యంలోకి రాక పూర్వం, చైనా శిల్పులు, పూర్వీకుల ఆరాధనా సంప్రదాయాన్ననుసరించి, పెద్ద పెద్ద ఖనన ఏర్పాట్లలో (శ్మశాన వాటికలు) నిమగ్నమై ఉండేవారు. కాని బౌద్ధ మతం చైనాలో ప్రవేశించటంతో చైనా శిల్ప కళలో మార్పులు వచ్చాయి. తర్వాత చైనా శిల్పులు గాంధార ప్రాంతంలో నున్న బుద్ధ విగ్రహాలను పోలిన బుద్ధ విగ్రహాలను మలచటం ప్రారంభించారు. చైనా శిల్పులు చేసిన ఒకే ఒక మార్పు ఏమిటంటే, బుద్ధుని ముఖ కవళికలను సంక్షిప్తరూపంలో (Abstract form) చూపటం.

చైనీయులు భారతదేశం నుండి బౌద్ధ చిత్తరువులను గీసే విధానం (Painting) నేర్చుకున్నారు. అజంతా చిత్రకళ యొక్క ప్రభావం చైనాలో కనిపిస్తుంది. చైనీయుల ఉచ్ఛారణ శాస్త్రం (Phonetics)పై కూడా సంస్కృతం ప్రభావం చాలా ఉంది. చైనా తత్వశాస్త్రాన్ని గూడా బౌద్ధ మతం ఎంతో ప్రభావితం చేసింది.

పశ్చిమాన మధ్య ఆసియా మరియు ఆఫ్ఘనిస్థాన్ నుండి తూర్పున చైనా మరియు టిబెట్ వరకు భారతీయ ప్రభావంను మనం గుర్తించవచ్చు. వ్యాపారులు మరియు మత ప్రచారకులు సంస్కృతీ రాయబారులుగా సేవ చేశారు. వారి ప్రభావం నేటికీ కనిపిస్తుంది. ఈ విషయంలో బౌద్ధ మతం ఎంతో ముఖ్య పాత్ర పోషించగా, బౌద్ధ ధాతువులు, కట్టడాలు, మరియు విగ్రహాలు అన్ని ప్రాంతాలలో కనిపిస్తాయి. టిబెట్‌లో నేటికీ బౌద్ధమతం ప్రాచుర్యంలో ఉంది. అయితే క్రీ.శ. 7వ శతాబ్దంలో ఇస్లాం మత ఆవిర్భావంతో మధ్య ఆసియా మరియు ఆఫ్ఘనిస్తాన్‌లో బౌద్ధమతం అంతరించింది.

## 23.బి పాఠ్య ప్రశ్నలు

1. ఈ క్రింద కొన్ని వ్యాఖ్యానాలు ఇవ్వబడినవి. వీటిని మీరు గుర్తించగలరేమో చూడండి :

ఎ) రాతిలో తొలిచిన అతి ఎత్తయిన బుద్ధ విగ్రహం ఉన్న ఆఫ్ఘనిస్థాన్‌లోని ఒక ప్రదేశం________________

బి) ఈ భూగోళ శాస్త్రజ్ఞుడు ప్రపంచ పటం గీశాడు________________

సి) ఈ భారతీయ విశ్వవిద్యాలయంలో అనేక మంది చైనా విద్యార్థులున్నారు________________

డి) అది భారతీయులు 'చిన్నా-పట్టా' అని పిలచే ఒక పదార్థం ________________

2. ఈ క్రింది ప్రశ్నలకు సమాధానములు వ్రాయుము?

ఎ) చైనీయులు నుండి భారతీయులు నేర్చుకొన్న ముఖ్యమైన వ్యాపార సంబంధ ప్రక్రియ ఏది?

బి) ఒక భారతీతయ కళా సంప్రదాయముపై చైనా కళా సంప్రదాయము ప్రభావం చూపింది. దాని పేరేమిటి?________________

సి) బౌద్ధ మత గ్రంథాలను చైనా భాషలోకి అనువదించిన ఇద్దరు పండితుల పేర్లు వ్రాయుము?________________

## 23.6 ఆగ్నేయాసియా

'ఆగ్నేయాసియా' అనే పదం నేడు వివిధ దేశాలను కలుపుకొని ఉన్న ఒక విశాల ప్రాంతం. ఏదిఏమైనా భారత సంస్కృతితో స్పష్టమైన సంబంధం కలిగిన ఒక ఏకీకృత అంశం ఈదేశాల అన్ని సంస్కృతులలో ఇమిడి ఉన్నది.

మనం మొదటగా ఆగ్నేయాసియాలో ఏఏ దేశాలున్నవో తెలుసుకుందాం. అవి మాన్‌మార్, థాయ్‌లాండ్, ఇండో-చైనా (వియత్నాం, కంపూచియా, లాంగోస్ బర్మా మొదలైనవి), మలేసియా మరియు ఇండోనేషియా (జావా, సుమత్రా, బోర్నియో).

ఈ దేశాలలో భారతదేశంపై బంధం, క్రీస్తు శకం తొలి శతాబ్దాలలో భారతీయులు ఈ దేశాలలో వలసలు (Colonies) ఏర్పాటుచేసుకొన్న కాలం నాటిది. భారతీయ వ్యాపారులు, మత ప్రచారకులు, సాహస యాత్రీకులు బంగాళా ఖాతమును దాటి ఈ ప్రాంతాలలోని స్వదేశీయులతో కలిసిపోయారు. అటువంటి పరస్పర కలయిక (interaction) భారతీయ నాగరికత, సంస్కృతి తూర్పు ప్రాంత వ్యాప్తికి, చాలా మంది పండితులు తరచూ చెప్పే 'విస్తృత భారత్' (Greater Indian or Farther India) స్థాపనకు దారితీసింది.

ఈ ప్రాంతాలలో శిల్ప కళకు, చిత్ర కళకు, నాటక కళకు (Theater art) ఈనాటికి రాముడు, సీత, హనుమంతుడు ప్రీతిపాత్రమైన నమూనాలని తెలుసుకుంటే ఆశ్చర్యం కలుగకమానదు. భారతదేశంలోనే ఏనాడో మరచిపోయిన భారతీయ ఆలోచనలు, పద్ధతులు, సంప్రదాయాలు ఇముడ్చుకొన్న ఒక విశాలమైన హిందూ సంస్కృతి నేటికీ బాలి (Bali)లో భాసిల్లుతుంది.

ఈ ప్రాంతాలను భారతీయ వలసలుగా పేర్కొన్నప్పటికీ ఆధునిక వలసలకు, వీటికీ ఎంతో తేడా ఉందని మనం గ్రహించాలి. ఆ తేడాకు ముఖ్య కారణం భారతదేశం తన ఎల్లలు దాటి ఏర్పాటుచేసిన వలసలు యుద్ధాలు చేసి శాశ్వత ప్రాతిపదికన జయించినవి కావు. ఈ వలస ప్రక్రియ ఒక శాంతియుత మార్గం ద్వారా జరిగింది. ఈ వలసలు భారతదేశాన్నుండి భావజాలమును, మతంను, సంస్కృతిని గ్రహించాయి. ఈ వలసలు మాతృ భూమికి ఎటువంటి

ప్రయోజనాన్ని చేకూర్చి పెట్టలేదు. మాతృ భూమి కోసం ఎటువంటి వలస సంపదలు గాని, వనరులుగాని దోపిడీ జరగలేదు.

ప్రాచీన భారతీయులు మాన్‌మార్ (బర్మా)లోని కొన్ని భూభాగాలను 'సువర్ణ భూమి' అనే వారు. ఈ ప్రాంతం బంగారం, సిరిసంపదలుగల భూమిగా పేరుగాంచింది. బరుకచ్ఛము (Broach) వారణాసి (Benaras) భాగల్పూరు (Bhagalpur) కు చెందిన వ్యాపారులు బర్మాతో వాణిజ్యం చేశారు. జావా, సుమత్రాదీవులు (ఇండోనేషియా) 'సువర్ణ ద్వీపం' అని పిలవబడేవి. 'మిళింద పన్హ' (Milindapanha) మరియు 'పెరిప్లస్ ఆఫ్ ది ఎరిత్రియన్ సీ' (Periplus of the Erythrean Sea) వంటి ప్రాచీన సాహిత్యం ఈ దేశాలతోగల వాణిజ్య సంబంధాలను ఉదహరించుచున్నది. ఈ గ్రంథాల ప్రకారం తామ్రలిప్తి (బెంగాల్) పాలూర (ఒరిస్సా) మసులీపట్నం (మద్రాసు) వంటి దేశాలు ఆగ్నేయాసియా అంతర్భాగాల నుండి వ్యాపారులు నదుల ద్వారా గాని రహదారుల ద్వారాగాని ఈ రేవు పట్టణాలకు చేరేవారు. చాలా మంది చరిత్రకారుల అభిప్రాయం ప్రకారం భారతదేశానికి ఈ ప్రాంతాలతో రాజకీయ మరియు సాంస్కృతిక సంబంధాలు ఏర్పడటానికి వ్యాపార కార్యకలాపాలు ముఖ్య కారణమయ్యాయి.

మతమనే మాధ్యమం ద్వారా భారతీయ సంస్కృతి వ్యాప్తి అత్యధికంగా జరిగింది. వ్యక్తిగత సన్యాసులే గాక మత ప్రచారకుల సమూహాలు తమ మత ప్రచారం కోసం బహుదూరం ప్రయాణించేవారు. చైనా, జపాన్ మరియు మధ్య ఆసియా దేశాలలో భారతీయ సంస్కృతీ వ్యాప్తికి బౌద్ధ మతం ఒక ప్రధాన సాధనంగా ఉండేదని మీకు జ్ఞాపకం ఉంటుంది. ఐతే బర్మా తప్ప మిగతా ఆగ్నేయాసియాలలో భారతీయ సంస్కృతీ, వ్యాప్తికి బ్రాహ్మణ మతం సాధనంగా ఉండేది. ప్రాచీన కాలానికి చెందిన పురావస్తు అవశేషాలలో ఎక్కువ భాగం విష్ణువు లేదా శివలింగ ప్రతిమలే నాడు, చాలా ప్రాంతాలలో ప్రజలు మాట్లాడే భాష సంస్కృతం. నేటి భాషలైన మలయ్ (Malay) మరియు జావనీస్ (Javanese)లలో అనేక సంస్కృత మరియు ద్రావిడ పదాలు కనిపిస్తాయి. థాయ్ వంటి కొన్ని భాషలు భారతీయ నమూనాలతో ఏర్పడిన లిపులలలో వ్రాయబడుచున్నవి.

## 23.7 జావా, సుమత్రా, బాలి మరియు బోర్నియో

భారతీయులు జావా, సుమత్రా, బాలి, బోర్నియోలిలో వలసలు స్థాపించారు. భారతీయ సంస్కృతి తాలూకు ఛాయలు అక్కడ మనకు లభిస్తాయి. క్రీ.శ. 56కు ముందే జావాలో ఒక భారతీయ సంస్థ ఉండేది. క్రీ.శ. 5వ శవతాబ్దంలో ఈ ప్రాంతంలో పర్యటించిన పాహియాన్ (Fa-hien) అక్కడ బ్రాహ్మణ మతం ప్రాచుర్యంలో ఉన్నట్లు కనుగొన్నాడు. అక్కడి ప్రజలు శివ మరియు విష్ణువులను ఆరాధించేవారు. క్రీ.శ. 5వ శతాబ్దంలో జావాలో శైలేంద్ర రాజులు సింహాసన మదిష్టించారు. వారు బౌద్ధ మతము అవలంభించారు. వారి కాలంలో బౌద్ధ మతం వికసించింది.

జావాలోని భారతీయ సంస్కృతీ వికాసానికి అతి పెద్ద సాక్ష్యం 8వ శతాబ్దంలో నిర్మించిన బోరోబుదూరు మందిరం. ఈ దేవాలయం ప్రపంచంలో కెల్లా అతి పెద్ద బౌద్ధ ఆలయంగా ప్రసిద్ధి కెక్కింది. ఇక్కడ వాస్తు నమూనా బుద్ధుని తత్వానికి ప్రతీకగా నున్నది. ఈ కట్టడమునకు ఐదు అంచెలున్నవి. ఒక్కొక్కటి, నిర్వాణం (nirvana) పొందటానికి ఒక్కొక్క మెట్టుగా నిలిచి ఉంది. క్రింది అంచెలు శిల్పకళతో అద్భుతంగా అలంకరించబడి యున్నవి. ఈ ఆలయంలో 436 బుద్ధ విగ్రహాలు చెక్కబడి ఉన్నవి.

భారతీయ ప్రభావం సుమత్రా వలసలలో కూడా కనిపిస్తుంది. క్రీ.శ. 8వ శతాబ్దంలో సుమత్రాలో పల్లవులు

వలసలు స్థాపించారు. ఆ వలసలే తర్వాత కాలంలో 'శ్రీ విజయ రాజ్యం'గా రూపుదిద్దుకొన్నవి. ఏది ఏమైనా క్రీ.శ. 10వ శతాబ్దం వరకు అది భారతీయ సంస్కృతికి కేంద్రంగా భాసిల్లింది. ఆగ్నేయాసియా ప్రాంతాలకు తమిళరాజ్యములకు ముఖ్యంగా చోళుల కాలంలో సత్సంబంధాలున్నట్లు శాసనాలు చెప్పుచున్నవి. పశ్చిమ సుమత్రాలలో తమిళ వర్తక కేంద్రాలు నెలకొల్పటం జరిగింది. భారతదేశంలో చోళ ప్రాంతంలో నున్న దేవాలయాలకు ఇండోనేషియా పాలకులు దాన ధర్మాలిచ్చేవారు. 11వ శతాబ్దంలో చోళలు మొదటి రాజరాజు, ఆయన కుమారుడు రాజేంద్ర చోళుడు ఆగ్నేయాసియా దేశాలపైకి నౌకాదళ దండయాత్రను నడిపారు. అందువల్లనే ఆగ్నేయాసియా వాస్తు శిల్ప కళలో చోళ సంస్కృతికి సంబంధించిన అనేక లక్షణాలు కనిపిస్తాయి.

భారతీయ సంస్కృతి బాలి, బోర్నియో వంటి చిన్న చిన్న ద్వీపాలకు సైతం వ్యాపించింది. ఆ ప్రాంతంలో నేడు ఇస్లాం ముఖ్య మతమైనప్పటికీ, అక్కడి సంప్రదాయాలు మరియు నృత్య రీతులు భారతీయ సంస్కృతిని ప్రతిబింబిస్తాయి. ఇండోనేషియా భాష అయిన 'భాస ఇండోనేషియా' (Bhasa Indonesia)లో అనేక సంస్కృత పదాలు కనిపిస్తాయి.

క్రీ.శ. మొదటి శతాబ్దాలలో భారతీయ సంస్కృతి ఇండోనేషియాలో ప్రవేశించింది. జావాలో బోరోబుదూర్ ఆలయం బౌద్ధ మత వ్యాప్తికి తార్కాణంగా నిలిచిన ఒక ప్రముఖ కట్టడం. ఈ ప్రాంతంలో భారతీయ సంస్కృతీ విస్తరణకు భారతదేశపు దక్షిణాది రాజ్యాలు ప్రముఖ పాత్ర పోషించాయి.

**పాఠ్య ప్రశ్నలు:**

1. సరైన సమాధానమును ఎంపిక చేయుము?

ఎ) ఆగ్నేయాసియాలోని భారతీయ వలసలను అనేకమంది పండితులు ______________ అని పిలిచేవారు? (ఇండో చైనా, విస్తృత భారతం, గ్రేటర్ ఇండియా)

బి. ప్రాచీన భారతీయులు ______________ ను 'సువర్ణ భూమి' అనేవారు. (బర్మా, జపాన్)

సి. బోరోబుదూర్ ఒక ______________ ఆలయం (బౌద్ధ, వైష్ణవ).

డి. ఆగ్నేయాసియా ప్రాంతం ______________ భారత రాజ్యాలతో సత్సంబంధాలు కలిగి ఉండేది (ఉత్తర, దక్షిణ).

2. ఆగ్నేయాసిలో నెలకొల్పబడిన భారతీయ వలసలు ఆధునిక వలసలకు ఏ విధంగా వేరుగా ఉండేవి?

3. భారతదేశం, ఆగ్నేయాసియా దేశాల మధ్యగల వ్యాపార సంబంధాలను ఋజువు చేసే ఆధారములు ఏవి?

4. తమిళ రాజ్యములకు ఇండోనేసియాకు మధ్య సంబంధాలున్నట్లు తెలియజేసే ఒక ఆధారమును చూపుము.

## 23.8 ఇండో చైనా

ఇండోనేషియా మాదిరిగానే భారతీయ సంస్కృతి శాంతి యుత మార్గాల ద్వారానే ఇండో చైనా భూభాగంలో ప్రవేశించింది. ఈ భూభాగంలో 'చంప' మరియు కాంభోజ అనే రెండు శక్తివంతమైన రాజ్యాలు వెలిశాయి.

హిందూ రాజ్యాన్ని 'చంప' అనేవారు. ఈ రాజ్యం నేటి దక్షిణ వియత్నాం ప్రాంతం చంపారాజ్య రాజధాని 'చంపా నగరి' (Champa nagari) ఈ ప్రాంతంలో క్రీ.శ. 2వ శతాబ్దంలో హిందూ రాజ్యం స్థాపించబడినట్లు తెలుస్తుంది. చమ్స్ (చంపా ప్రజలు) మరియు చైనీయుల మధ్య నిరంతర సంబంధాలు సాగుతున్నట్లు చైనీయుల రాతలను బట్టి

తెలియుచున్నది. చైనీయుల రాతల ద్వారా ఈ రాజ్యం పేరు 'చంప' అని మనకు తెలియుచున్నది. క్రీ.శ. 10వ శతాబ్ది ప్రాంతంలో 'చాప' చాలా శక్తివంతమైన రాజ్యంగా విలసిల్లిందని తెలుస్తుంది. 'చంప' రాజ్య రాజులైన పరమేశ్వర దర్మ మరియు జయసింహవర్మ రాజ్య విస్తరణకు పూనుకున్నారు. అయితే తర్వాత కాలంలో చంప రాజ్యం కాంభోజ రాజ్యం చేతిలో ఓడిపోయింది.

మరొక ప్రముఖ రాజ్యమైన కాంభోజ లేక ఫునాన్ (Funan) ప్రస్తుతమున్న కంపూచియా (కంబోడియా) ప్రాంతంలో ఉండేది. ఈ రాజ్యాన్ని కౌండిన్యుడనే బ్రాహ్మణుడు స్థాపించాడు. అతడు స్థానిక రాకుమారిని వివాహమాడి అక్కడ భారతీయ సంస్కృతీ సంప్రదాయాలను, లక్షణాలను పరిచయం చేశాడు. ఫునాన్ (Funan) రాజుల వారసులుగా పాలించిన ఖైమర్ (Khymer) పాలకులు కూడా వారి పుట్టుకకు ఇదే ఉదంతాన్ని చెప్పేవారు. కాంభోజ రాజులు రాజ్య విస్తరణను చేపట్టి 'సయాం'లో అతి పెద్ద భాగం (థాయ్‌లాండ్), లావోస్ (Laos) మరియు మలయా (Malay) భూభాగాలను తమ ఆధీనంలోకి తెచ్చుకున్నారు. మొదటి జయవర్మ (క్రీ.శ. 802–50) వంటి పాలకుల ఏలుబడిలో కాంభోజ సిరిసంపదలతో తులతూగింది.

ఖైమార్ పాలకులు భారతీయ సంస్కృతిని ప్రోత్సహించిరి. సంస్కృత భాషాధ్యయనమునకు కాంభోజ ఒక ప్రముఖ కేంద్రమైంది. తొలి శాసనాలు ఇటు సంస్కృతంలోను అటు స్థానిక లిపులలోను వ్రాయబడినవి. అందు చాలా లిపులు భారతీయ లిపుల నుండే గ్రహించబడినవి. ఖైమార్ పాలకులు హిందూ మతమును అవలంభించిరి. వారు శివుని మరియు విష్ణువును ఆరాధించారు. వారు రమణీయమైన అనేక దేవాలయాల నిర్మాణం చేశారు. వాటన్నింటినిలో ప్రసిద్ధి చెందినది క్రీశ. 12వ శతాబ్దంలో సూర్యవర్మచే నిర్మించబడిన అంగ్కోర్‌వాట్ (Angkorvat) దేవాలయం. ఈ దేవాలయం విష్ణుమూర్తికి అర్పించబడింది. ఆ దేవాలయం 900 మీటర్ల విస్తీర్ణంలో వ్యాపించి, మేడల (Terraces)తో, గోపురాలతో (Towers)తో లతలు(Spirals)తో నిండి ఉంది. దాని గోడలపై రామాయణ మరియు మహాభారత గాథలు చిత్రీకరించబడి ఉన్నవి. ఈ మధ్య కాలం వరకు ఈ అద్భుత ఆలయం అడవులలో చిక్కుకొని ఉంది. ఈ ఆలయ ఆవిష్కరణ వలన భారత – చైనాల మధ్య సాంస్కృతిక సంబంధాలు మరింత పటిష్టమయ్యాయి. ప్రస్తుతం భారత మరియు ఆయా దేశాల అనుభవజ్ఞులైన పురావస్తు నిపుణులు మరియు శాస్త్రవేత్తల బృందాలు ఈ ఆలయాలను పునరుద్ధరించి పరిరక్షించే (Preserve) ప్రయత్నంలో ఉన్నారు.

## 23.9 బర్మా మరియు థాయ్‌లాండ్

భారతదేశానికి అతి దగ్గరలోని బర్మా (మ్యానమార్) మరియు థాయ్‌లాండ్‌లకు భారతీయ సంస్కృతి వ్యాపించింది. స్థానిక బర్మా సంప్రదాయం ప్రకారం, కళింగ ప్రజలు బంగాళా ఖాతం గుండా పయనించి ఐరావతి (Irrawathy) నదీ డెల్టాలో నివాసాలు ఏర్పరచుకున్నారు. ఈ ప్రాంతానికి చెందిన అనేక ప్రదేశాల సంస్కృత నామాలను టాలమీ(Ptolemy) ఉదాహరించెను. అంటే ఈ వలసలు క్రీ.శ. తొలి శతాబ్దాలలో ఏర్పాటుచేయబడి ఉంటాయి. బర్మాలోని పురావస్తు అవశేషాలు, అక్కడ భారతీయ వాస్తకళ, భాషలు ముఖ్యంగా సంస్కృతం మరియు పాళీ వంటి ప్రాచుర్యంలో ఉన్నట్లు తెలియజేయుచున్నవి. ఇక్కడ ఉదహరించవలసిన విషయమేమంటే ఆగ్నేయాసియా మొత్తంలో వలసీకరణకు బ్రాహ్మణ మతం వాహకంగా ఉండగా బర్మాలో వలసీకరణకు మాత్రం బౌద్ధమతం ఉపయోగపడింది. బర్మాలో నేటికీ బౌద్ధ మతం బహుళ ప్రజాదరణ పొందిన మతం.

థాయ్‌లాండ్ యొక్క సాంస్కృతిక వారసత్వం భారతీయ ప్రభావాన్ని ప్రతిబింబిస్తుంది. క్రీ.శ. 14, 15 శతాబ్దాల వరకు థాయ్ పాలకులు దళారులను బెంగాల్‌కు పంపి వాస్తు నమూనాలను తెప్పించుకొనేవారు. వాటి ఆధారంగా వారి అధికారిక వాస్తు శిల్పకళ అభివృద్ధి చేయగలిగేవారు. థాయ్ వాస్తు నిపుణులు బుద్ధ గయ స్థూప ప్రతిరూపాలను నిర్మించేవారు. థాయ్ కళాకారులు మలిచిన బౌద్ధ శిల్పాలలో బుద్ధుని శిరస్సు భారతీయ, స్థానిక కళా సంప్రదాయముల సంపూర్ణ మిశ్రమంగా కనిపిస్తుంది.

ఈ పాఠంలో వారు ఆగ్నేయాసియా వాస్తు శిల్ప కళా సంప్రదాయాలపై భారతీయ ప్రభావంను గూర్చి తెలుసుకున్నారు. అయినప్పటికీ అవి నూటికి నూరు పాళ్ళు భారతీయ కళారూపాల నకళ్ళు అని చెప్పలేము. వాటిలో ఆగ్నేయాసియా ప్రత్యేక లక్షణాలు తప్పక కనిపిస్తాయి. అవి భారతీయ మరియు స్థానిక కళా సంప్రదాయముల మేళవింపు రూపాలు. అందుకే పండితులు వాటిని భారతీయతకు లోనైన (Indianised) కళారూపాలు అన్నారుకాని భారతీయ (Indian) కళా రూపాలు అనలేదు.

చంప మరియు కాంభోజ అనేది ఇండో చైనాలో ఉద్భవించిన హిందూ రాజ్యములు. కాంభోజ పాలకులే అంగ్కోర్ వాట్ విష్ణుమూర్తి దేవాలయ నిర్మాతలు. బర్మా సంస్కృతిపై బౌద్ధ మత ప్రభావం సుస్పష్టంగా ఉంది. భారతదేశం మాదిరి ఆగ్నేయాసియాలో కూడా ఒక ప్రత్యేకమైన మిశ్రమ సంస్కృతి అభివృద్ధి చెందింది.

## పాఠ్య ప్రశ్నలు

1. ఈ క్రింది వాటిని జతపరుచుము :

1. ఫునాన్ ఎ) దక్షిణ వియత్నాం

2. అంగోర్‌వాట్ బి) థాయ్‌లాండ్

3. చంప సి) కాంభోజ

4. సాయం డి) విష్ణుమూర్తి.

2) ఇండో చైనా గురించిన సమాచారమును తెలుసుకొనుటకు ముఖ్య ఆధారాలు ఏవి?

3) ఆగ్నేయాసియాలోని ఏ ప్రాంతంలో భారతీయ సంస్కృతీ వ్యాప్తికి బౌద్ధ మతం సాధనమైంది?

4) ఆగ్నేయాసియా వాస్తు శిల్పకళల ప్రత్యేక లక్షణమేమి?

## సారాంశం

ప్రాచీనయుగంలో భారతీయ సంస్కృతి పశ్చిమ మరియు ఆగ్నేయాసియా ప్రాంతాలకు వ్యాపించింది. ఈ సాంస్కృతిక వ్యాప్తి మతం మరియు వాణిజ్యములు ప్రధాన సాధనములు బౌద్ధ బిక్షువులు. బౌద్ధ మత వ్యాప్తి కొరకు మధ్య ఆసియా కఠినమైన మంచు పర్వతాల గుండా పయనించారు. బౌద్ధ మఠాలు, స్థూపాలు మరియు అనేక బౌద్ధ గ్రంథాలు ఈ ప్రాంతంలో కనుగొనబడినవి. వాణిజ్య మార్గముల వెంట అనేక విహారాలు స్థాపించబడినవి. మధ్య ఆసియాలో ఉద్భవించిన ఖొటాన్ మరియు కుచ్చి వంటి రాజ్యాలు భారతీయ సంగీతమును, కళలను ప్రోత్సహించెను. ఆ రాజ్యాల రాజులు భారతీయ నామాలను ధరించారు. ఆఫ్ఘనిస్థాన్ సైతం బౌద్ధ ప్రభావానికి లోనైంది. అతి ఎత్తయిన బుద్ధ విగ్రహం బమియన్ (Bamiyan)లో కనుగొన్నారు. బౌద్ధ బిక్షువులు నివాసమున్న అనేక గుహలు కూడా

ఆవిష్కరించబడినవి. చైనా మరియు టిబెట్‌లకు కూడా బౌద్ధ మతం విస్తరించింది. 'ధర్మ రక్ష' మరియు కుమార జీవుని వంటి ప్రముఖ పండితులు, అనేక బౌద్ధ గ్రంథాలకు చైనా భాషలోకి అనువదించారు. చైనాలో భారతీయ సంగీతం మరియు శిల్పకళ ప్రాచుర్యం పొందాయి. బదులుగా భారతదేశం చైనా నుండి పట్టును ఉత్పత్తి చేసే కళను నేర్చుకుంది.

ఆగ్నేయాసియా (బర్మాతప్ప) విషయంలో బ్రాహ్మణ మతం భారతీయ సంస్కృతి వ్యాప్తికి దోహదపడింది. బంగారం మరియు సుగంధ ద్రవ్యాల అన్వేషణ చేస్తూ భారతీయ వ్యాపారులు ఇండోనేషియాలో వ్యాపార కేంద్రాలు నెలకొల్పారు. ఇండోనేషియాను పాలించిన తొలి రాజులు బ్రాహ్మణ మతమును అవలంభించారు. శైలేంద్ర రాజుల పాలనలో బౌద్ధ మతం ప్రముఖ మతమైంది. ప్రపంచంలోకెల్లా పెద్ద దైన బోరోబుదూర్ బౌద్ధ ఆలయం ఇండోనేషియాలో ఉంది. విదేశాలలో భారతీయ సంస్కృతికి అతి ముఖ్యమైన సజీవ సాక్ష్యం అంగ్కోర్ వాట్ (Angkorvat) అనే విష్ణుమూర్తి ఆలయం. భారతీయ సంస్కృతి థాయ్ మరియు బర్మీయుల సాంప్రదాయాలను సైతం ప్రభావితం చేశాయి.

## అభ్యాసం

1. పటంపై ఈ క్రింది ప్రదేశాలను గుర్తించుము?

   ఎ) ఆఫ్ఘనిస్థాన్ బి) భూటాన్ సి) బమియన్ డి) టిబెట్

   ఇ) టున్ మునాంగ్ ఎఫ్) జావా జి) కంపూచియా

   హెచ్) థాయ్‌లాండ్ ఐ) బర్మా జె) సుమత్రా.

2. మధ్య ఆసియాలో భారతీయ సంస్కృతి ప్రభావమును గూర్చి వ్రాయుము?
3. ప్రాచీన కాలంలో భారత్–చైనాల మధ్య సాంస్కృతిక సంబంధాలపై ఒక వ్యాసము వ్రాయుము?

4) ఇండోనేషియాలో భారతీయ సంస్కృతి విస్తరణను వర్ణించుము.
5) ఇండోనేషియాలో భారతీయ సంస్కృతి వ్యాప్తిలో మతం పాత్రను వివరించుము.
6) ఆగ్నేయాసియా సంస్కృతి భారతీయ సంస్కృతి అనే కన్నా 'భారతీయత'కు లోనయింది (Indianised) అని ఎట్లుచెప్పగలవు?
7) ఈ క్రింది వానిపై లఘు వ్యాఖ్యలు వ్రాయుము.

   ఎ) కుమార జీవ బి) బోరోబుదూర్

   సి) అంగ్కోర్‌వాట్.

## అదనపు సమాచారం

ఈ పాఠంలో మీరు ఆగ్నేయాసియా సంస్కృతి వారసత్వ సంపదలో అతి ముఖ్యమైన బోరోబుదూర్ మరియు అంగ్కోర్‌వాట్ ఆలయాల గురించి చదువుకున్నారు. ప్రస్తుతం ఈ రెండు ఆలయాలను ప్రకృతి మరియు మానవుల నుండి ఏర్పడే ముప్పు నుండి పరిరక్షించవలసి ఉంది. అటువంటి కట్టడములు ప్రపంచంలో అనేకం ఉన్నాయి. యునెస్కో 'World Heritage List' ప్రచురించింది. దానిననుసరించి ఆ ఆలయాలను పరిరక్షించవచ్చును.

సమాచారం కోసం మీకు భారతదేశంలోని కొన్ని వారసత్వ సంపదలను ఈ పట్టికలో ఇవ్వడం జరిగింది.

| దేశం పేరు | కట్టడం పేరు |
|---|---|
| భారతదేశం | 1) అజంతా గుహలు |
| | 2) ఎల్లోరా గుహలు |
| | 3) ఆగ్రా కోట |
| | 4) తాజ్‌మహల్ |
| | 5) సూర్యదేవాలయం, కోణార్క్ |
| | 6) మహాబలిపురం దేవాలయ సముదాయం |
| | 7) హంపి దేవాలయ సముదాయం |
| | 8) ఫతేపూర్ సిక్రీలోని కట్టడాల సముదాయం |
| | 9) కజిరంగ నేషనల్ పార్క్ |
| | 10) మానస్ వైల్డ్ లైఫ్ సాంక్చువరీ |
| | 11) కియోలాడియో నేషనల్ పార్క్ |

**పాఠ్య ప్రశ్నలకు జవాబులు :**

**23.ఎ**

1) S 2) S 3) U 4) M 5) S

2. యార్ఖండ్, ఖొటాన్, కాష్గర్, కుచ్చి, ఖురాషాహి, టున్‌హువాంగ్ (ఏదైనా రెండు)

**23 బి**

1. ఎ) బమియన్ బి) టాలమీ

   సి) నలందా డి) పట్టు.

2) ఎ) పట్టు తయారీ ప్రక్రియ

   బి) గాంధారీ శిల్ప కళా సంప్రదాయం

   సి) ధర్మ రక్ష, కుమార జీవ

**23 సి**

ఎ) విస్తృత భారత్ (గ్రేటర్ ఇండియా)

బి) బర్మా

సి) బౌద్ధ

డి) దక్షిణాది రాజ్యములు.

2) పురాతన భారతీయ వలసలు శాంతియుత మార్గముల ద్వారా నెలకొల్పబడినవి. అది స్థానిక రాజ్యముల అభివృద్ధి, వికాసములకు ఎటువంటి ఆటంకమును కలుగజేయలేదు. ఈ ప్రాంతముల నుండి మాతృ దేశాలకు ఎటువంటి సహజ వనరుల లేదా సిరిసంపదల దోపిడీగాని జరగలేదు.

3) మిళిందపన్హ, పెరిప్లస్ ఆఫ్ ది ఎరిత్రియన్ సీ

4) 1. సుమత్రాలో తమిళ వ్యాపార కేంద్రాలు నెలకొల్ప బడినవి.

2) ఇండోనేషియా పాలకులు చోళ రాజ్య ప్రాంతాలలోని దేవాలయాలను దాన ధర్మాలు చేశారు.

**23 డి**

1. సి, 2. డి, 3. ఎ, 3. బి

2) చైనా ఆధారాలు

3) బర్మా

4. అది స్వదేశీ మరియు భారతీయ రూపాల మిశ్రమ సంస్కృతి రూపం. అది ఒక అద్వితీయమైన ప్రత్యేక సంస్కృతి.

# 24

# ప్రాచీన భారతదేశంలో సామాజిక ఆర్థిక పరిణామాలు

## 24.1 పరిచయం

భారతదేశ ప్రాచీన చరిత్ర గురించి, మీరు ఇంతకు ముందు విభాగాలలో తెలుసుకున్నారు. మన పురాతన సంప్రదాయాలు మరియు పద్ధతులను గురించిన అవగాహన మనకెంతో అవసరం. ఎందుకంటే వాటిని అర్థం చేసుకుంటే మనం ప్రస్తుతాన్ని అర్థం చేసుకోగలం. ఈ రోజు మనం చూచే ఈ సమాజం, ఆర్థిక వ్యవస్థ మరియు సంస్కృతి అనేవి మన చరిత్ర చేతనే ఒక రూపాన్ని పొందాయి. మన సామాజిక కట్టుబాట్లు, మత నమ్మకాలు, వాస్తు శిల్పకళలు, సంగీతం, చిత్రలేఖనం మొదలైనవి అన్నీ మన వారసత్వ సంపదలో భాగాలే. ఎందుకంటే అవి అనాది నుండి ఒక తరం నుండి మరొకతరానికి అలా సంక్రమిస్తూనే ఉన్నాయి. మన వారసత్వ సంపదను సంరక్షించుకోవడం అత్యావశ్యకం ఎందుకంటే మనం ఆ విధంగా చేయగలిగితే మన వారసత్వ సంపద పునాదులు దృఢంగాను మరియు బలంగాను ఉంటాయి.

రాబోయే పాఠాలలో, మనం సమాజం, ఆర్థిక వ్యవస్థలతోపాటు సాంస్కృతిక వారసత్వ సంపదకు సంబంధించిన కొన్ని విషయాలను తీసుకున్నాం. అందులో మొదటి భాగంలో ఆర్య మరియు అనార్యుల మధ్య సంస్కృతీ సంపర్కాన్ని గురించి తెలుసుకుంటాం. మిగిలిన విభాగాలలో, ప్రాచీన కాలంలో వచ్చిన సామాజిక ఆర్థిక మార్పులను గురించి తెలుసుకుంటాం. ఆ తర్వాత పాఠం సాంస్కృతిక వారసత్వ సంపదను గురించి తెలుపుతుంది.

## 24.2 లక్ష్యాలు

ఈ పాఠం చదివిన తరువాత ఈ కింది అంశాలను మీరు నేర్చుకుంటారు :

1. ఆర్య అనార్య సంస్కృతుల మధ్య సంగమం(Synthesis) నకు చెందిన అనేక ఋజువులకు ఉదాహరణలను చూపగలరు.
2. ప్రాచీన కాలంలో వ్యవసాయ భారత ఆర్థిక వ్యవస్థ అభివృద్ధిని గురించి చర్చించగలరు.
3. భూదాన సంప్రదాయాల వల్ల పుట్టుకొచ్చిన భూస్వామ్యవర్గాల గురించి వివరించగలరు.
4. ప్రాచీన దశలో వర్ణ వ్యవస్థలో వచ్చిన పరిణామాలను చర్చించగలరు.

## 24.3 ఆర్య ఆర్యేతర సంగమం

**(Aryan and Non-Aryan Synthesis) :**

క్రీ.పూ. 1500 ప్రాంతంలో ఆర్యులు వాయువ్యదిశలోను కనుమలగుండా భారతదేశంలో ప్రవేశించారు. ఐతే వారి జన్మభూమి గురించి ఎంతో వివాదం ఉన్నప్పటికీ వారు సోవియట్ దక్షిణ ప్రాంతం నుండి భారతదేశానికి వచ్చారనేది అందరూ ఆమోదించే విషయం. రుగ్వేద కాలంలో ఆర్యుల నివాసాలు సప్త సింధు ప్రాంతానికి మాత్రమే పరిమితమైనట్లు మీకు గుర్తుండే ఉంటుంది. ఆ కాలంలో ఆర్యుల ప్రధాన వృత్తి పశువుల పెంపకంకాగా, వారు సంచార జీవనం గడిపేవారు. పశువుల పెంపకం వ్యవసాయానికి దారితీయగా, ఆర్యులు తమ నివాసానికి అనువైన స్థావరాల కోసం అన్వేషించడం ప్రారంభించారు. వ్యవసాయాధారిత ఆర్థిక వ్యవస్థకు అనువగు ప్రదేశాలను వెదుకుచూ ఆర్యులు మలివేద కాలంలో తూర్పుగా ప్రస్తుత బీహార్ ప్రాంతంలోని 'వైదేహ' (Videha) వరకు పయనించారు.

వారి పయనంలో ఆర్యులు ఉత్తర భారతదేశంలోని స్థానికులైన కొందరు ఆర్యేతరులతో పరిచయం పెంచుకున్నారు. వైదిక గ్రంథాలు ఈ స్వదేశీ ఆర్యేతరులను పాణులు (Panis) మరియు దస్యులు (Dasas)గా పేర్కొనుచున్నవి. పాణులు ఆర్యుల పశు సంపదను కొల్లగొట్టి వారిని ఇబ్బందులపాలు చేసేవారు. ఆర్యేతరులు ఆర్యులకు పూర్తి భిన్నమైన దేవతలను ఆరాధించేవారు. ఆర్యేతరులు లావుగాను, నల్లగాను ఉండేవారు. చక్కని శరీర వర్ణం కలిగిన తెలివైన ఆర్యులు తరచుగా వీరిని చులకనగా చూసేవారు. వారు మాట్లాడే భాష గాని వారి జీవన విధానంగాని పూర్తి భిన్నంగా, ప్రత్యేకంగా ఉండేది. ఆ విధంగా తొలి రోజులలో ఆర్యులు అనార్యుల మధ్య సాంగత్యం చాలా తక్కువగా ఉండేది.

అయితే కాలం గడిచే కొలదీ, ఆర్య అనార్య జాతుల సంస్కృతులు వేరైనప్పటికీ వారి మధ్య సంబంధాలు పెరగసాగాయి. అంటే ఆర్య – అనార్య మిశ్రమ లక్షణాలు రాజకీయ, ఆర్థిక, సామాజిక మరియు మత రంగాలలో ఎంతవరకు ఉన్నదనే విషయం మనం చర్చించవచ్చు. మనం గిరిజన గణ యుద్ధాలలో (tribal wars) ఆర్యుల తరపున యుద్ధం చేసిన 'దాస' (Dasa) అనే యోధులను గురించి వింటాం. ఆర్యులతో చేసిన అనేక యుద్ధాలలో ఓడిపోయిన దస్యు తెగవారు ఆర్యులకు సేవకులుగా మారారు. 'దాస' అనే పదానికి తర్వాత కాలంలో బానిస అనే అర్థం చెప్పబడింది. ఆర్యేతరులు మాట్లాడే భాషలోని అనేక పదాలు వైదిక సంస్కృతంలో ప్రవేశించాయి.

ఆర్యేతర మూలాలున్న అనేక క్రతువులను అథర్వణ వేదం వివరించుచున్నది. మౌలికంగా ప్రకృతి ఆరాధకులైన ఆర్యులు స్వదేశీ ఆరాధనా సంప్రదాయాలు ఇముడ్చుకొనసాగారు. సర్పారాధన లేక నాగారాధన (Snake worship), రావివృక్షారాధన (Pipal worship) శక్తి లేదా అమ్మతల్లి ఆరాధన వంటివి ముఖ్యమైన ఉదాహరణలు. అలవాట్లను, సంప్రదాయాలను స్వీకరించటం కేవలం ఒక వైపు నుండే జరగలేదు. కొన్ని ఆర్యేతర తెగలవారు కూడా వైదిక శ్లోకాలను సంకలనం చేశారు. మొదట్లో ఆర్యులు ఆర్యేతర తెగలతో వివాహ సంబంధాలను ఇష్టపడకపోయినప్పటికీ కాలంగడిచే కొలదీ కొన్ని వివాహ సంబంధాలు ఏర్పడిన ఫలితంగా మిశ్రమ జాతి సంతతి జనించారు. ఈ పరిణామం సామాజిక వ్యవస్థలో కులాలు మరియు ఉప కులాలు విపరీతంగా పెరగడానికి దోహదం చేసింది. ఆ విధంగా ఆర్య ఆర్యేతర సంస్కృతీ సంయోగ ప్రభావం వైదిక సమాజంపైన, మౌలికమైన నాలుగు వర్ణములకు తోడుగా పుట్టిన అనేక నూతన కులాలు మరియు ఉప కులాలపై పడింది. ఆ విధంగా ఆర్య సంస్కృతి మొదటి నుండి ఖచ్చితమైన ఆర్య సంస్కృతిగా లేకపోవడంవల్ల దానికి సరైన పదం 'వైదిక సంస్కృతి' అని ప్రాచుర్యంలోకి వచ్చింది.

ఆర్య అనార్య మిశ్రమం ఆర్థిక రంగంలో కూడా చోటు చేసుకుంది. ఆర్యుల ఆర్థిక వ్యవస్థకు మూలాధారం వ్యవసాయం కాగా, వేట, తోళ్ళ పరిశ్రమ, వంటి అనేక వృత్తులు ఆర్యేతర ప్రభావం వల్ల ఏర్పడినవి. ఈ వృత్తులను అనుసరించి ఆర్యేతరులు క్రమక్రమంగా ఆర్యుల ఆర్థిక వ్యవస్థలో స్థానం సంపాదించుకున్నారు.

ఆ విధంగా మైదాన ప్రాంతాలన్నింటిలో చురుకైన ఆర్య–ఆర్యేతర సంయోగం కనిపిస్తుంది. ఆర్య ఆర్యేతరుల మధ్య ఈ కలయిక కేవలం ప్రాచీన కాలానికే పరిమితం కాలేదు. ఈ ఇచ్చిపుచ్చుకొనే ధోరణి భారతీయ చరిత్ర ప్రత్యేక లక్షణంగా ఉండేది. భారతదేశం నూతన భావములను స్వీకరించి తనలో ఇముడ్చుకోటానికి ఏనాడూ సంశయించలేదు. పారశీక మరియు గ్రీకుల దండయాత్రలను తర్వాత కాలంలో జరిగిన శకుల, పార్థియన్ల మరియు కుషాణుల దాడులను గుర్తు తెచ్చుకోండి. ఈ విదేశీ తెగలు చివరకు ఏమయ్యాయో తెలుసుకుంటే ఆశ్చర్యం కలుగుతుంది. వీరెవరూ మధ్య ఆసియాలోని వారి మాతృభూమికి తిరిగి వెళ్ళలేదు సరికదా, దానికి బదులుగా వారు భారతదేశాన్ని తమ మాతృభూమిగా చేసుకొని ఇక్కడే స్థిరపడ్డారు. ఇక్కడ వారు అనేక భారత సంప్రదాయాలను, ఆచారాలను అలవర్చుకోవడమేగాక వారి స్వదేశీ సంస్కృతిని అభివృద్ధి చేసుకొనడానికి ఎంతో కృషి చేశారు. వారు అనతికాలంలో ఇక్కడి కళలకు, మతమునకు సేవలందించారు. బౌద్ధ మతంలోని కొన్ని ముఖ్య పరిణామములు, గాంధార మరియు మధుర ప్రాంతాలలో అభివృద్ధి చెందిన వాస్తు, శిల్ప కళారీతులు వారి కృషివలన అభివృద్ధి చెందినవే. సంస్కృత నాటకం మరియు పద్య కవిత్వం వీరి ఆస్థానాలలోనే వికసించాయి.

పై మిశ్రమమును దృష్టిలో నుంచుకొని మన సంస్కృతిలోని ఏ ఒక్క అంశమైనా అటు పూర్తి ఆర్య సంస్కృతికి సంబంధించినదా? లేక ఆర్యేతర సంస్కృతికి సంబంధించినదా అని చెప్పగలగడం సందేహాస్పదం. అదేవిధంగా ఒక భారతీయుడు ద్రావిడుడు కావచ్చు, ఆర్యుడు కావచ్చు, ఆస్ట్రోలాయిడ్ కావచ్చు లేదా మంగోలాయిడ్ అయినా కావచ్చు. అతని జుట్టు తెల్లగా ఉండవచ్చు లేదా నల్లగా ఉండవచ్చు, వంపులు తిరిగి ఉండవచ్చు లేదా సాఫీగా ఉండవచ్చు, అతని శరీర ఛాయ చాలా తెల్లగా ఉండవచ్చు, ఛామన ఛాయలో ఉండవచ్చు లేదా నల్లగా ఉండవచ్చు. అతడు ఎలా ఉన్నా సరే అతడు భారతీయుడనే స్వచ్ఛమైన ముద్ర పొంది ఉన్నాడు.

అనేక సంస్కృతుల కలయిక ఫలితంవల్ల ఏర్పడినదే భారతీయ సంస్కృతి. భారతీయ వారసత్వ సంపదలో ఇచ్చి పుచ్చుకొనే ధోరణి అభివృద్ధి చెందింది.

## పాఠ్య ప్రశ్నలు 24.ఎ

1. భారతదేశంలో మొదటిగా స్థిర నివాసమేర్పరచుకున్నవారికి వైదిక గ్రంథాలు ఇచ్చిన పేరేమి?
2. భారతదేశంనే తమ జన్మభూమిగా చేసుకొన్న మధ్య ఆసియా ప్రజలకు ఒక ఉదాహరణ ఇవ్వండి.
3. విదేశీ లక్షణాల ప్రభావమున్న గ్రంథాలకు ఒక ఉదాహరణను వ్రాయండి.

## 24.4. : వ్యవసాయాధారిత ఆర్థిక వ్యవస్థ

మనం ఇపుడు ప్రాచీన భారత చరిత్రలో ఆర్థిక విధాన లక్షణాలను గూర్చి తెలుసుకుందాం.

మన ఆర్థిక వ్యవస్థకు ఎల్లప్పుడూ వ్యవసాయమే వెన్నెముక వంటిది. మన జనాభాలో 70 శాతంపైగా ప్రజలు వ్యవసాయమునే ఆధారంగా చేసుకొని జీవించుచున్నారు. ప్రాచీన కాలంలో సైతం, మన ఆర్థిక వ్యవస్థ మౌలికంగా

వ్యవసాయంపైనే ఆధారపడింది. కాలిబంగన్‌లో దున్నిన పొలాలను, మొహెంజోదారోలో ధాన్యాగారమును, హరప్పాలో ధాన్యం మార్పిడికై ఏర్పాటుచేయబడిన కళ్ళములు (Working floors) మనం ఒకసారి గుర్తు చేసుకుందాం.

క్రీ.పూ. 1500 కాలంలో సప్తసింధు ప్రాంతంలో స్థిరపడిన రుగ్వేద ప్రజలు పశువుల కాపరులుగా సంచార జీవనం గడిపేవారు. వారి ముఖ్య వృత్తి పశువుల పెంపకం కాగా, ఆవువారి ముఖ్య జంతువు. గో సంపద అధికంగా ఉన్నవారే ధనవంతులుగా పరిగణింపబడేవారు. క్రీ.పూ. 1000 ప్రాంతంలో మలివేదకాలంనకు చెందిన సారవంతమైన గంగాలోయలోనికి బాగా చొచ్చుకొని వెళ్ళి వ్యవసాయ పనిముట్లకు ఉపయోగపడే ఇనుప ఖనిజం అందుబాటులోకి తెచ్చుకోగలిగారు. క్రమేపీ వారు వ్యవసాయానికి అలవాటుపడి స్థిర నివాసాలేర్పరచుకోవడం ఆరంభించారు. ఎద్దులచే లాగబడుతూ నాగలికర్రులతో (Plough share) వ్యవసాయం చేసేవారని ఈ కాలంనాటి సాహిత్య గ్రంథాలు ఉదాహరణలనందించుచున్నవి.

క్రీ.పూ. 6వ శతాబ్దంలో బౌద్ధ జైన మతముల ఆవిర్భావమునకు గల ఆర్థిక కారణములలో వ్యవసాయానికి ప్రాధాన్యత పెరగటం ఒకటి. ఈ ఉద్యమాలు 'గోరక్ష' నినాదమిచ్చి, వైదిక కర్మకాండల నుండి పశుసంపదను కాపాడే కార్యమును చేపట్టినవి. ఎందుకంటే అరక దున్ని వ్యవసాయం చేయాలంటే పశుసంపద అవసరం. బుద్ధుడు పశువులను దాతలు (givers)గా వర్ణిస్తూ అవి మన తల్లులు, తండ్రులు, అన్నదమ్ములు లేదా రక్త సంబంధీకుల వలె మన ముఖ్య బంధువులు, స్నేహితులని, వాటి వల్లనే మన మొక్కలు పెరిగి పంటలు పండుతాయని' భావించాడు. అంతకుముందే జైన మతం కూడా అంతే కఠినమైన భాషలో, జంతు బలులను తిరస్కరించింది. వ్యవసాయం ద్వారా వచ్చే మిగులు, ప్రత్యక్షంగా వ్యవసాయ వృత్తిలో లేని వారికి కూడా ఆధారం నిచ్చుచున్నందువల్ల, వ్యవసాయ వికాసం కళలు, చేతివృత్తుల వంటి వాటి ఉన్నతికి దోహదపడింది.

మౌర్యుల కాలంలో రాజ్యం వ్యవసాయంపై ప్రత్యేక శ్రద్ధ నుంచింది. రాజ్య (కేంద్ర) ప్రోత్సాహంలో గ్రామీణ ఆర్థిక వ్యవస్థ మరింత బలం పుంజుకుంది. అత్యధిక జనావాస ప్రాంతాల నుండి మిగులు జనాభాను తరలించడం ద్వారా నూతన వ్యవసాయ ఆవాసాలు (agranian settlements) నెలకొల్పబడినవి. ఈ కాలంలో భూమిలో చాలా భాగం రాజ్యం ఆధీనంలో ఉండేది. దానిని 'సీతా భూమి' (Sita land) అనిపిలిచేవారు. రాజ్యానికి చెందిన వ్యవసాయ భూములను 'సీతాద్యక్ష' (Superintendent) కార్యాలయం పర్యవేక్షించేది. మౌర్య చక్రవర్తులు ఈ భూములలో పనిచేయడానికి వేతన కూలీలను నియమించారు. రాజ్యం, వ్యవసాయానికి ఆటంకం కలగకుండా మంచినీటి పారుదల సదుపాయాలను కల్పించింది. అర్థశాస్త్రం (కౌటిల్యునిచే రాయబడింది) ప్రకారం భూమిని అటవీ భూమి, ఎడారి భూమి, బీడు భూమి, వ్యవసాయ భూమి, గడ్డి భూమి అనే విధాలుగా వర్గీకరించబడటం మొదలైంది. దీంతోపాటు 'సీతా భూమి' లేదా చక్రవర్తి సొంత భూమి కూడా ఉండేది. అయితే దీనికి ఉదాహరణలు బహు స్వల్పం. భూమిలో అధిక భాగం రాజ్యం ప్రత్యక్ష నియంత్రణలో ఉండటం వల్ల రాజ్యానికి ప్రధాన ఆదాయ వర్గం వ్యవసాయమే. రాజ్యం, వ్యవసాయ ఉత్పత్తులపైన సాగునీటి సౌకర్యాలపైన పన్నులు విధించింది. అవసరమైనపుడు వ్యవసాయదారులు రెండవ పంట పండించమని రాజాజ్ఞ సైతం జారీ చేయబడేది.

క్రీ.పూ. 200 మరియు క్రీ.శ. 300 మధ్యకాలంలో మనకు రాజ్య (ప్రభుత్వ) భూములు (State farms) లేదా కూలీలు ప్రస్తావన కనిపించదు. అంటే భూములు రాజ్యం యొక్క అధీనం నుండి వ్యక్తిగత సొంతదారుల చేతిలోకి రావడం ప్రారంభమైంది. రాజ్యభూములు శీఘ్రంగా వ్యక్తుల స్వాధీనం కాసాగాయి. మిళిందపన్హ

(Milindapanho) ప్రకారం, ఎవరైనా అడవిని నరికి, భూమిని చదును చేసి వ్యవసాయ యోగ్యం చేసి, అందు వ్యవసాయం చేయువారిని దాని 'సొంతదారులు' అనడం జరుగుతుంది. మన ధర్మ శాస్త్రం ప్రకారం, 'ఎవరైతే అడవులను నరికి చదును చేస్తారో వారికే ఆ భూమి చెందుతుందని, ఎవరైతే జింకను మొదట గాయపరుస్తారో వారికే ఆ జింక చెందుతుందని" ఋషులు ప్రకటించారు. వ్యవసాయాభివృద్ధిని ప్రోత్సహించి వ్యవసాయ భూమిని పెంచేందుకు ఇటువంటి సూత్రాలు రాయబడినవి. ఈలోగా శాతవాహన రాజులు పురోహితులకు భూదానములు ఇచ్చే ఆచారం ప్రారంభించారు. ఈ భూదానములు మత సంబంధ బాధ్యతలు నెరవేర్చుకొనడానికే అని అనిపించినప్పటికీ, అంతర్లీనంగా భూమిని సాగులోనికి తేవలెననెడి వ్యూహం ఇందు దాగి ఉండవచ్చు. సమాజంపైన ఆర్థిక వ్యవస్థపైన భూములు దానాలిచ్చే ఆచారం లోతైన ప్రభావమును చూపింది. అదే భూస్వాములనే నూతన సామాజిక వర్గ ఆవిర్భావానికి దారితీసింది. ఈ నూతన వర్గం గురించి, ఆ వర్గం ఆవిర్భావానికి దారితీసిన కారణాల గురించి రాబోయే విభాగంలో వివరంగా తెలుసుకుందాం.

భూమికి వ్యక్తిగత సొంతదారులు పెరుగుచున్నప్పటికీ, రాజ్యం భూమిపై తన హక్కులను కాపాడుకొంటూనే ఉంది. ఆ కాలంలో విదేశీ దండయాత్రల వలన బాగా కుంటుపడిన వ్యవసాయమును గాడిలో పెట్టేందుకు, వ్యవసాయాన్ని సంరక్షించే ప్రక్రియలో భాగం రాజ్యం కొన్ని నిబంధనలను కూడా అమలు చేసినట్లు తెలుస్తుంది. ఈ కాలంలో అంటే క్రీ.పూ. 200 క్రీ.శ. 300 మధ్య కాలంలో, వ్యవసాయంతో పాటుగా చేతివృత్తులు, వ్యాపారం వంటి ఇతర వృత్తులు గణనీయంగా వృద్ధి చెందాయి. భారతదేశానికి ఎంతో లాభదాయకంగా ఉండే, భారత్ రోమన్ సామ్రాజ్యం మధ్య జరిగిన వాణిజ్యం గురించి గుర్తు చేసుకోవాలి. ఐతే ఆర్థిక విషయాలలో అటువంటి సానుకూల స్థితి ఎక్కువ కాలం కొనసాగలేదు. క్రీ.శ. 4వ శతాబ్దం తర్వాత ఇండో-రోమన్ వాణిజ్యం అంత లాభదాయకంగా లేదు. భారతీయ ఆర్థిక వ్యవస్థలో సమాజం కూడా తీవ్రమైన సమస్యలనెదుర్కొంది. రాబోయే రెండు విభాగాలలో ప్రాచీన భారతదేశంలోని సమాజంలోనూ, వ్యవసాయాధారిత ఆర్థిక వ్యవస్థలోను వచ్చిన మార్పులను గురించి చదువుకుంటాం.

| ప్రాచీన కాలంలో వ్యవసాయం, భారత ఆర్థిక వ్యవస్థ యొక్క అతి ముఖ్యమైన అంశంగా ఉండేది. |
|---|

### ప్రశ్నలు

1. పై విభాగంలో మీరు ఇనుప అరకల (Ploughshare) వ్యవసాయం పశువులపై ఆధారపడి ఉందని చదివారు. దీనికి కారణమేమి?
2. 'సీతా' అనేది ఏ రకపు భూమి?
3. క్రీ.పూ. 200 క్రీ.శ. 300 మధ్య కాలం నాటి ఆర్థిక వ్యవస్థ ముఖ్య లక్షణం ఏది?

## 24.5 భూస్వామ్య వర్గం ఆవిర్భావం :

క్రీ.పూ. 200 మరియు క్రీ.శ. 300 మధ్య భూస్వామ్య వర్గమనే నూతన సామాజిక వర్గం ఆవిర్భావం గురించి మనం ఇంతకుముందే చదువుకున్నాం. ఈ ధోరణి గుప్తుల కాలం నాటికి మరింత వేగం పుంజుకొంది. దానికి కారణం రాజులు భూదానాలిచ్చే సంప్రదాయం బాగా పెరగటమే. ఈ సంప్రదాయం గుప్తులకు ముందే అమలులో ఉంది. దక్కన్‌లో శాతవాహన పాలకులు బ్రాహ్మణులకు, బౌద్ధ బిక్షువులకు భూదానములు ఇచ్చారు. మొదట్లో ఈ భూదానాల

వెనుక మత ఆధ్యాత్మిక ఘనత సాధించాలనే కోరిక ఉండేది. తర్వాత కాలంలో క్షత్రియులకు కూడా భూదానాలు ఇవ్వబడినవి. గుప్త చక్రవర్తులు ఈ సంప్రదాయమును కొనసాగించారు. చాలా సందర్భాలలో వారిచ్చిన భూదానములపై వచ్చే ఆదాయ వనరులపై రాజ్యం కొంత నియంత్రణ కలిగి ఉండేది. భూదాన గ్రహీతలు రాజ్యం వారి భూములకు రక్షణనిచ్చినందులకుగాను పన్నులు సక్రమంగా కట్టవలసి ఉండేది. ఈ సంప్రదాయం వల్ల కలిగిన ముఖ్య ఫలితమేమంటే, కేవలం వైశ్యులు శూద్రుల సేవలపై జీవనం సాగించిన ఉన్నత వర్ణాలైన బ్రాహ్మణ మరియు క్షత్రియులు నూతనంగా భూస్వాములనే నూతన పాత్రను పోషించారు.

ఇండో–రోమన్ వాణిజ్యం క్షీణించటంలో పరిస్థితులలో మార్పులు రాసాగాయి. మన పురాతన సాహిత్యం ముఖ్యంగా పురాణాలలో క్రీ.శ. 4వ శతాబ్దం మొదలుగా గల కాలాన్ని 'కలియుగం' లేదా 'కలికాలం'గా చెప్పడం జరిగింది. ఈ కాలంలో ఆర్థిక మరియు సామాజిక వ్యవస్థ కొంత దెబ్బతిన్నది. ముందు చెప్పినట్లుగా దానికి ఒక కారణం లాభదాయకమైన ఇండో రోమన్ వాణిజ్యం క్షీణించడం, కలికాలంలో వైశ్యులు మరియు శూద్రులు పన్నులు చెల్లించటానికి నిరాకరించారని కూడా పురాణాలు చెప్పుచున్నవి. తత్ఫలితంగా ఖజానాలో లోటు ఏర్పడింది. అటువంటి పరిస్థితులలో పన్నులు వసూలు చేసి ఉద్యోగులకు, పురోహితులకు పంపిణీ చేయటం రాజ్యానికి కష్టతరమైంది. కాబట్టి భూదానాలిచ్చే సంప్రదాయం సర్వసాధారణమైంది. మొదట భూదానాలు చాలా వరకు ఆధ్యాత్మిక ఆధిక్యత (పుణ్యం) సాధించుటకు ఇవ్వబడగా క్రీ.శ. 4వ శతాబ్ది అనంతర కాలంలో అధికారులకు రాజ్యం జీతాలు పూర్తి ధనరూపంలో ఇవ్వలేక దీనికి బదులుగా భూదానాలు ఇచ్చినట్లు తెలుస్తుంది. భూదానాలు ఇవ్వటంతోపాటు దానిపై వచ్చే అన్నిరకాల ఆర్థిక ప్రయోజనాలు వారే పొందేటట్లుగా కూడా అనుమతి నివ్వటం జరిగింది. యాజ్ఞవల్క్యుడు (Yagnavalkya) భూమి ఆర్థిక నిర్వహణలో ఈ కాలంలో మూడు దశలున్నట్లు పేర్కొన్నాడు. అవి ఏమంటే, మహిపతి (Mahipati) (రాజు), క్షేత్ర స్వామి (Kshetra Swami) భూమి సొంతదారుడు (Land owner) మరియు కర్షకుడు (Karshaka) (వ్యవసాయదారుడు).

కాలం గడిచే కొలదీ, భూమిని సాగుచేయడానికి, పన్నులు వసూలుచేయడానికి హక్కులను పొందిన భూస్వామ్య వర్గం, వారికిచ్చిన భూభాగములపై పరిపాలన మరియు సైనిక (రక్షణ) బాధ్యతలు కూడా పొందారు.

భూదాన గ్రహీతలు చాలా అరుదుగా సొంత వ్యవసాయం చేసే వారు. వారి భూములు తాత్కాలిక రైతులచే సాగుచేయబడేవి. చైనా యాత్రీకుడు ఇత్సింగ్ రాతలను బట్టి బౌద్ధ విహారాలకు పొలాలు, తోటలు పండించేందుకు రైతులు మరియు పశువులతో సహా దానములిచ్చేవారు. బ్రాహ్మణులు జీతాలు పొందే ఉద్యోగుల విషయంలో కూడా అదే జరిగింది. దానికి కారణం వారికివ్వబడిన భూములకు చాలా దూరంలో వారు నివాసముండటం. ఆ విధంగా భూమిని సాగుచేసి రాజుకు నేరుగా పన్ను కట్టే స్వతంత్ర రైతులు బాగా తగ్గిపోయారు.

భూస్వామి రైతులపై ఆధారపడి ఉండటంవల్ల, రైతులు భూమితో పాటే ఉండేటట్లు చేయవలసి వచ్చింది. ఆ విధంగా క్రీ.శ. 6వ శతాబ్దం నుండి కౌలుదార్లు (Share Croppers) రైతులు భూమివద్దనే ఉండాలనే ప్రత్యేకంగా నిబంధన విధించడం జరిగింది. ఈ కాలం నాటి గ్రంథాలు కూడా వ్యవసాయదారుల చలనమును ప్రోత్సహించలేదు. మీరు ఇంతకుముందు పాఠాల నుండి వాణిజ్యం క్షీణించడం పట్టణ కేంద్రాలు వెనుకబడటం అనే పరిస్థితులు వ్యాపారుల మరియు వాణిజ్యవేత్తల చలనంపై ప్రభావితం చూపినవి అని గుర్తుచేసుకొంటారు. వారు వారి వస్తు సామాగ్రిని దగ్గరలోని గ్రామాలలో లేదా పట్టణాలలో అమ్మాలనే ఆంక్ష విధించబడింది. ఇటు వర్తకుల, అటు వ్యవసాయదారుల చలనం

పూర్తిగా స్థంభించడంలో ఆర్తిక వ్యవస్థ సంవృత ఆర్థిక వ్యవస్థ (Closed economy)గా మారింది. అది ఇంకా గ్రామీణ ఆర్థిక వ్యవస్థ ప్రాధాన్యతను పెంచడంతోపాటు, భూస్వాముల (జమీందారుల) నియంత్రణలో గ్రామం ఒక స్వయం సమృద్ధిగల ఆర్థిక పరిపాలనా విభాగంగా అభివృద్ధి చెందడానికి దారితీసింది.

భూదాన గ్రహీతలకు ప్రత్యేక గుర్తులు, హోదాను తెలిపే చిహ్నాలు కేటాయించబడినవి. హర్షవర్ధన అనంతర కాలానికి చెందిన మధ్యయుగ గ్రంథాలు భూస్వాములను గుబురు మీసాల గలవారు (fly-whisks) ఆశ్వారూఢులుగా ఛత్రపతులుగా అభివర్ణించాయి. వారికి 'ఠాకూర్' అని నాయక్ అని సైనిక మరియు పరిపాలనా హోదాను తెలుపు బిరుదులు కూడా ఇవ్వబడినవి. వ్యవసాధారిత ఆర్థిక వ్యవస్థలో ఈ మార్పు వల్ల, ఒకవైపు రాజ్యం అధికారం క్షీణించగా మరోవైపు భూస్వాముల ఆర్థిక సామర్థ్యం, పాలనా పటిమ బాగా పెరిగాయి.

పరిపాలనా సంబంధమైన మరియు ఆర్థిక సమస్యలను తీర్చటంతోపాటు, బ్రాహ్మణులకు భూదానాలిచ్చే ఆచారమువల్ల వెనుకబడిన ప్రాంతాలలో బ్రాహ్మణ సంస్కృతి వ్యాప్తిలోకి వచ్చే అవకాశం కలిగింది. అనాది నుండి అదే ప్రాంతాలలో అనేక మంది రైతు కుటుంబాల వారు బ్రాహ్మణ సంస్కృతిని అలవర్చుకొని శూద్రవర్ణంలో కలిసిపోయారు. శూద్రులకు వ్యవసాయంతో అనుబంధం ఏర్పడటం మొత్తం మీద రైతువర్గం స్థానం క్షీణించింది. వారు, రకరకాల పన్నులు వసూలు చేసే భూస్వాముల దయాదాక్షిణ్యములపై ఆధారపడవలసి వచ్చేది.

భూదానములిచ్చే సంప్రదాయం శాతవాహనుల కాలంలో ప్రారంభమైంది. కలికాలం (యుగం) సంక్షోభంతో ఈ సంప్రదాయం సర్వసాధారణమైంది. ఈ సంప్రదాయం సామాజిక ఆర్థిక వ్యవస్థలపై ఎంతో ప్రభావం చూపింది.

### పాఠ్య ప్రశ్నలు 24.సి

1. కలియుగ సంక్షోభం గురించి తెలిపే గ్రంథాలేవి?

2. ఈ క్రింద ఇవ్వబడిన వాక్యములను చదివి ఇచ్చిన ప్రశ్నలకు జవాబులు వ్రాయుము.

3. వేదకాలంలో బహుశా రాజకుమారులే బ్రాహ్మణులకు భూదానములిచ్చే అధికారం కలిగి ఉండేవారు. అయితే ఇపుడు ఆ అధికారాన్ని పాలకుడు (ruler) కబళించి భూదానాల ద్వారా ఆ వర్గంలోని ముఖ్య సభ్యులను ఆకట్టుకున్నారు. ఆ విధంగా లబ్దిపొందిన వారు కూడా శాంతి భద్రతల నిర్వహణాధికారమును పొందారు.

ఎ) భూదానాలు పాలకుని ఏ సమస్యలు తీర్చినవి?

బి) పాలకుని మరియు రైతు మధ్యగల సంబంధాలపై ఈ సంప్రదాయం ఏ విధంగా ప్రభావం చూపింది.

## 24.6 వర్ణ వ్యవస్థలో మార్పులు

భారతదేశంలో భూస్వామ్య ఆర్థిక వ్యవస్థ ఆరంభం గురించి మనం చదువు కున్నాం. సామాజిక ఆర్థిక జీవనం ఒక దానితో ఒకటి అవినాభావ సంబంధం కలిగి ఉన్నందువల్ల ఒక అంశంలో మార్పు రెండవ అంశంలో మార్పుకు దారితీసింది. ఆ విధంగా క్రీ.శ. 3, 4 శతాబ్దాలలో వ్యవసాయాధారిత ఆర్థిక వ్యవస్థలో వచ్చిన పరిణామాలు. సహజంగానే సామాజిక వ్యవస్థపై గూడా ప్రభావం చూపింది. 'భూస్వామ్య వర్గం' అనే నూతన సామాజిక వర్గం ఏర్పడిందనివారు తెలుసుకున్నారు. మనం వర్ణ వ్యవస్థలో వచ్చిన మార్పులను గురించి తెలుసుకుందాం.

వేద కాలం నాటి సమాజం బ్రాహ్మణ, క్షత్రియం, వైశ్య శూద్ర అనే నాలుగు వర్ణాలుగా విభజించబడిందని మీకు గుర్తుండే ఉంటుంది. వైదిక వాఙ్మయములో (texts)పై మూడు ఉన్నత వర్గాలకు శూద్రులకు మధ్య ఒక ఖచ్చితమైన హద్దు గీయబడినప్పటికీ, వర్ణ వ్యవస్థలోని విభజనలు అంత ఖచ్చితంగా అమలుకాలేదు.

క్రీ.పూ. 6వ శతాబ్దంలో ఇనుప పనిముట్ల వాడకం మరియు వ్యవసాయం, వల్ల వేదకాలపు నాటి దాదాపు సమసమాజం (egalitarian) వ్యవసాయాధారిత మరియు వర్ణ విభజిత సామాజిక వ్యవస్థగా రూపాంతరం చెందింది. వ్యవసాయంలో నూతన మెళకువ వలన వ్యవసాయోత్పత్తి బాగా పెరిగి మిగులు కూడా ఏర్పడింది. ఈ మిగులు ఉత్పత్తిలో చాలా వరకు కూలీల, రైతుల వద్ద నుండి రాకుమారులు మరియు పురోహితులు రాబట్టారు. కొందరు పండితుల అభిప్రాయం ప్రకారం, ప్రజలు పాలకుల (prince) అవసరమును అంగీకరించి, అతనికి పన్నులు చెల్లించి, పురోహితులకు బహుమానములందించాలని నచ్చచెప్పటానికే వర్ణ వ్యవస్థ ఏర్పడింది. వర్ణ వ్యవస్థ ప్రకారం పై మూడు ఉన్నత వర్ణాల వారు సాంప్రదాయకంగా నాల్గవ వర్ణం నుండి వేరు చేయబడ్డారు. మొట్టమొదటి వారు వేదాధ్యయనానికి అర్హులు మరియు వారు రెండుసార్లు జన్మించినవారు (ద్విజులు). ఐతే ఈ వ్యవస్థలోని వర్గంలలో సైతం విభేదాలు పుట్టాయి. శారీరక శ్రమ నుండి విముక్తుడైన వాడు పవిత్రుడు (పుణ్యాత్ముడు Pure)గా పరిగణింపబడినాడు. ముఖ్యమైన పన్ను చెల్లింపుదారులు మరియు ఉత్పత్తిదారులు అయినప్పటికీ వైశ్యులు హీనంగానే చూడబడ్డారు. బ్రాహ్మణులు, క్షత్రియులు పోరాటానికి దగ్గరకాగా ఈ రెండు వర్గముల మధ్య వైరం, వైశ్యులు, శూద్రుల నుండి వ్యతిరేకతను ఎదుర్కొనవలసినపుడు తరచుగా పరిష్కారమయ్యేవి.

చాలా శతాబ్దాల కాలం ఈ విధానం విజయవంతంగా పనిచేసింది. క్రీ.శ. మొదటి, రెండు శతాబ్దాలలో వృద్ధిచెందిన రోమన్ వ్యాపార కళలు, చేతివృత్తుల అభివృద్ధికి దోహదం చేసింది. ఈ కాలంలో వృత్తి సంఘాలు, శ్రేణుల వృద్ధి మీకు గుర్తుండే ఉంటుంది. ఐతే గుప్త మరియు గుప్తానంతర కాలంలో వాణిజ్యం దెబ్బతింది. పురాణాలు క్రీ.శ. 3 మరియు 4 శతాబ్దాల కాలంను 'కలికాలం'గా వర్ణించాయి. ఈ గ్రంథాల ప్రకారం ఈ కాలం ఒక సామాజిక సంక్షోభ కాలం వంటిది. అంతకుముందు బ్రాహ్మణ మరియు క్షత్రియ వర్ణాలకు సేవలందించిన వైశ్య, శూద్ర వర్ణాలవారు ఉత్పత్తి సంబంధ కార్యకలాపాలు నిర్వహించడానికి, పన్నులు కట్టడానికి లేదా వారి శ్రమ శక్తిని అందించడానికి తిరస్కరించారు. వర్ణ కట్టుబాట్లపై తిరగబడ్డారు. తొలి పురాణాలు వర్ణ సంకరంను ప్రత్యేకంగా ఉదాహరిస్తూ ఈ దురాచారంను ఖండించాయి. దీనిని బట్టి ఉన్నతవర్ణాల మరియు శూద్రుల మధ్య వర్ణాంతర వివాహాలు మరియు సహపంక్తి భోజనాలపై అంతకుముందున్న నిషేధం కలికాలంలో ఆచరణలో విఫలమైంది.

గుప్తుల మరియు గుప్తానంతర కాలంలో జరిగిన ముఖ్య పరిణామం కులాల సంఖ్య గణనీయంగా పెరగటం. అంటే, దానిని బట్టి అపుడు అమలులో ఉన్న కులాలు విభజించబడి అనేక ఉప కులాలు పుట్టాయి. వాటి సంఖ్య గణనీయంగా పెరిగింది. వెనుకబడిన ప్రాంతాలలో బ్రాహ్మణులకు భూదానాలు ఇవ్వబడిన విషయం మీకు గుర్తుండే ఉంటుంది. దీని వల్ల ఇటు బ్రాహ్మణులలో అటు శూద్రులలోను స్థాయిలు (ranks) గణనీయంగా పెరిగాయి. బ్రాహ్మణులలో వారి వైదిక జ్ఞానం, గోత్రం లేదా వారి జన్మస్థలం (గ్రామం)ను బట్టి విభజింపబడ్డారు. గిరిజన జాతుల విషయానికొస్తే దాదాపు ప్రతి జాతి ఒక వేరె కులం అయింది. రాజపుత్రుల వంటి కొన్ని నూతన వంశాలవారు చేరటంతో క్షత్రియ వర్ణంలో సైతం స్థాయిల పెరిగాయి. క్రీ.శ. 5 మరియు 6వ శతాబ్దాల నుండి మనం సోలంకీలు, పరమారులు మరియు తోమారుల వంటివారి గురించి వింటాం (Solankis, Paramaras and Tomaras).

చేతి వృత్తులే కులాలుగా పరిణామం చెందటం, కులాల సంఖ్య విపరీతంగా పెరగటానికి మరొక ముఖ్య కారణం. గుప్తానంతర కాలంలో విదేశీ వ్యాపారం క్షీణించటంతో చేతివృత్తులు నిశ్చలం (Stagnent) వంశ పారంపర్యం మరియు మరింత స్థానికమైనవి. ఐతే కాలంగడిచే కొలదీ వ్యాపారాలు మరియు శ్రేణులు క్రమేపీ కులాలకు ప్రతిరూపాలైనవి.

కలియుగంలో ఏర్పడిన సంక్షోభం ఎదుర్కొనేందుకు రాజ్యం భూదానాలు ఇచ్చే సంప్రదాయంను చేపట్టిందని మీకు గుర్తుండే ఉంటుంది. ఈ సంప్రదాయం వర్ణ వ్యవస్థలో కొన్ని మార్పులకు శ్రీకారం చుట్టింది. వర్ణ వ్యవస్థలో భూస్వాములకు ఒక నూతన స్థానం కల్పించబడింది. తరచుగా కొన్ని శూద్ర కులాల నుండి కొందరు భూములను, అధికారమును సంపాదించినా సామాజిక ఉన్నత స్థితి పొందలేకపోయారు. వారు క్రింది కులాలలో పుట్టడమే దానికి కారణం. అందువల్లనే క్రీ.శ. 6వ శతాబ్ది నాటికొన్ని గ్రంథాలు, నూతనంగా జనించిన భూస్వామ్య వర్గమును గుర్తించే దిశగా జరిగిన మార్పులను సూచించుచున్నాయి. ఆ విధంగా, సామాజిక స్థాయి కేవలం వర్ణ వ్యవస్థపై ఆధారపడి మాత్రమే ఎక్కువ కాలం నిలబడలేదని తెలుస్తుంది.

ఈలోగా శూద్రులలో కూడా అనేక మార్పులు వచ్చాయి. గుప్తానంతర కాలంలో మనకు వేతన కూలీలనేవారు కన్పించకపోగా, వ్యవసాయదారులే ఉన్నారు. ఐతే స్వతంత్ర వైశ్య రైతుల పరిస్థితి దిగజారింది. కాబట్టి గుప్తుల కాలం నుండి వైశ్యులు మరియు శూద్రులు దగ్గర కాసాగారు.

ఆ విధంగా మధ్యయుగం నాటికి వర్ణ వ్యవస్థ అనేక మార్పులు వచ్చాయి. భూమిపై కేంద్ర నియంత్రణ క్షీణించి అనేక మంది భూస్వామ్య మధ్యవర్తులు పుట్టారు. కొత్తగా ఆవిర్భవించిన వ్యవసాయాధార ఆర్థిక వ్యవస్థ, వ్యాపార క్షీణత, వర్ణ వ్యవస్థలో వచ్చిన మార్పులు, ప్రాచీన యుగం నుండి మధ్యయుగానికి రూపాంతరం చెందే దశకు చిహ్నాలు.

కాలం గడిచే కొలదీ మరియు పరిస్థితులలో వచ్చిన అనేక మార్పుల వల్ల సాంప్రదాయ చాతుర్వర్ణ వ్యవస్థ విచ్ఛిన్నం చెందింది. భూస్వామ్య వర్గాల ఆవిర్భావం, వ్యాపారక్షీణత, గిరిజన ప్రాంతాలకు బ్రాహ్మణమతం విస్తరించడం వంటి పరిణామాలవల్ల వర్ణ వ్యవస్థ మార్పులకు లోనైంది. కలికాలపు మౌలిక లక్షణం వర్ణ సంకరం.

## ప్రశ్నలు 24 డి

1. 'వర్ణ సంకరం' అంటే ఏమిటి?
2. వ్యాపారాభివృద్ధి వర్ణ వ్యవస్థను ఎలా ప్రభావితం చేసింది?

**సారాంశం :**

భారతీయ సంస్కృతి ఎన్నో సంస్కృతులను ఇచ్చి పుచ్చుకొనే ధోరణిలో ఇముడ్చుకొని అత్యంత పరిపుష్టం చెందింది. ఇటువంటి కలయికకు ఆర్యులరాకతో తొలి ఉదాహరణ లభిస్తుంది. మొదట్లో ఆర్య ఆర్యేతర సంస్కృతుల మధ్య సంగమం చాలా తక్కువగా ఉన్నప్పటికీ, కాలం గడిచే కొలదీ, ఇరు సంస్కృతులకు చెందిన ప్రజలు పరస్పరం ఎదుటివారి ఆచారాలను అవలంభించారు.

సామాజిక, ఆర్థిక పరమైన ఎన్నో సమకాలీన ఉదాహరణలు మనకు కనిపిస్తాయి. దీంతోపాటుగా తర్వాత కాలంలో ఇతర సంస్కృతులు మన సంస్కృతిలో ఇమిడిపోవడం కూడా మనం గమనించవచ్చు. శకులు, కుషాణులు,

మౌణులు మొదలైనవారందరూ భారతీయ సమాజంలోగా ఒక భాగమయ్యారు. వాస్తు, శిల్ప కళలలో ఈ ప్రభావం మరింత ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

భారతీయ ఆర్థిక వ్యవస్థ అనాది నుండి వ్యవసాయాధారితమైనదే. లిఖిత మరియు పురావస్తు ఆధారములను బట్టి వ్యవసాయాభివృద్ధికి ఇనుప గొర్రులను (Plugh share) వాడినట్లు తెలియుచున్నది. మహావీరుని మరియు బుద్ధుని బోధనలు కూడా పశువులను పరిరక్షించి వ్యవసాయమును వృద్ధి చేయమని సూచించాయి. మౌర్యులు కూడా వ్యవసాయంను ప్రోత్సహించారు. రాజ్య (ప్రభుత్వ) వ్యవసాయ క్షేత్రాలుండేవి. భూమి వివిధ తరగతులుగా వర్గీకరించబడింది. క్రీ.పూ. 200 క్రీ.శ. 300 మధ్య కాలంలో పశ్చిమ దేశాలతో వర్తకం వృద్ధి చెందింది. శాతవాహన రాజులు బ్రాహ్మణులకు మరియు బౌద్ధ బిక్షువులకు భూదానములిచ్చే సంప్రదాయంను ప్రారంభించారు. ఐతే ప్రభుత్వం కొన్ని అధికారాలను తన చేతిలో ఉంచుకుంది.

క్రీ.శ. 3వ శతాబ్ద కాలంలో సామాజిక వ్యవస్థలో ఒక తీవ్ర సంక్షోభం ఏర్పడింది. వర్ణ వ్యవస్థ క్రింది తరగతుల వారు వారికి కేటాయించబడిన బాధ్యతలను నిర్వహించడానికి తిరస్కరించారు. పాలన మరియు ఆర్థిక సమస్యలను పరిష్కరించటానికి, పాలకులు, పురోహితులకు, ఉద్యోగులకు భూదానాలు ఇవ్వడం ప్రారంభించారు. ఈ ప్రక్రియ ఒకవైపు భూస్వామ్య వర్గమనే నూతన కార్యవర్గమును సృష్టించగా, మరొకవైపున వేతన కూలీలు, స్థానిక వ్యవసాయ దారులు (శూద్ర వర్ణం వారు) పూర్తి స్థాయి రైతులుగా పరిణామం చెందారు. తర్వాత కాలంగడిచేకొలది ఆర్థిక, సైనిక, పాలనా మరియు ముఖ్య సంబంధ సేవలన్నీ భూదానాలతో ముడిపెట్టడం జరిగింది. దాంతో ఆర్థిక, సామాజిక వ్యవస్థలో భూస్వామ్య వర్గం ఆవిర్భావం జరిగే అవకాశం ఏర్పడింది.

## అభ్యాసాలు

1. భారత సంస్కృతి ఎందుకు మిశ్రమ సంస్కృతిగా పిలవడుతుంది?
2. ఋగ్వేద మరియు మలివేద ఆర్థిక వ్యవస్థల మధ్య గల తేడాలు ఏవి?
3. ప్రాచీన భారతదేశంలో వ్యవసాయాధారిత ఆర్థిక వ్యవస్థలో గల దశలను పేర్కొనుము?
4. భూస్వామ్య వర్గం అంటే ఎవరు. ఏ రాజ్యం మొదటగా భూదానాలు ఇవ్వడం ప్రారంభించింది? ఎందుకు?

## ప్రశ్నలకు జవాబులు :

**24 ఎ**

ఎ) దాసులు మరియు పణులు.

2. శకులు, కుషాణులు, పార్థియన్లు

3. సంస్కృత భాషావికాసం, శక పాలకుడైన రుద్రదమనుడు సంస్కృత భాషను పోషించాడు.

**24 బి**

1. పొలందున్నే పనిలో బరువైన ఇనుప గొర్రు (Ploughshare)ను లాగటానికి పశువుల అవసరం ఏర్పడింది.

2 చక్రవర్తి భూమి

3. అభివృద్ధిలోనున్న ఇండో రోమన్ వాణిజ్యం చేతివృత్తులు పెరగడానికి దోహదం చేసింది.

**24 సి**

1. పురాణాలు

2. ఎ) పాలనా పరమైన మరియు ఆర్థిక సమస్యలు

బి) భూదానమును పొందిన లబ్దిదారులు రాజుకు మరియు రైతుకు మధ్య ఒక మధ్యవర్తివర్గం (దళారీ వ్యవస్థ)గా ఉద్భవించారు. రాజుకు నేరుగా పన్నుకట్టే రైతుల సంఖ్య బాగా తగ్గింది.

# 25

# మన సాంస్కృతిక వారసత్వం

## 25.1 పరిచయం

ముందు పాఠంలో మీరు మన సమాజంలో మరియు ఆర్థిక రంగంలో వచ్చిన మార్పులు చదివారు. మన కోర్సునందు ప్రాచీన భారతదేశంపై వ్రాయబడిన ఈ చివరి పాఠంలో వివిధ శాస్త్రాలు, సారస్వతం మరియు కళల అభివృద్ధికి సంబంధించిన చరిత్రను గురించి తెలుసుకుందాం. ఈ రంగాలలో జరిగిన అభివృద్ధి (మార్పులు) చెప్పుకోదగ్గవే గాక విశిష్టమైనవి. గణిత సిద్ధాంతాలు ఖచ్చితమైనవే గాక శాస్త్రీయంగా నిరూపించబడ్డాయి. మన ప్రాచీన శిల్పకళా సంపద కేవలం భారతదేశంలోనే కాకుండా, ఇతర దేశాలలో కూడా ప్రదర్శనశాలలు మరియు వస్తుకళా ప్రదర్శన లందు ప్రదర్శింపబడ్డాయి. ప్రస్తుతం మనం ఈ పాఠంనందు ప్రాచీన భారతదేశం సాంస్కృతిక భావనలను గురించి చదువుదాం.

## 25.2 లక్ష్యాలు

ఈ పాఠం చదివిన తర్వాత మీరు ఈ క్రింది అంశాలను మీరు నేర్చుకొంటారు.

1. హిందూ, బౌద్ధ మరియు జైన మతాల మధ్య ఉన్న దగ్గరి సంబంధం.
2. భారతదేశంలోని క్రైస్తవ మతం క్రీ.శ 1వ శతాబ్ధంలో ప్రవేశించడం.
3. గణిత, విజ్ఞాన రంగాలలో మన (ప్రాచీన) భారతీయులు ముందంజలో ఉండడాన్ని గుర్తించటం.
4. లౌకిక మరియు మత సంబంధ రచనలను
5. ప్రాచీన భారతదేశంలో విభిన్నమైన తత్వశాస్త్ర సంప్రదాయాల మధ్య భేదం.
6. శిల్పకళ, వాస్తుశాస్త్రం మరియు చిత్రకళలలో, ప్రాచీన కాలంలో జరిగిన అభివృది.

## 25.3 హిందూ-జైన-బౌద్ధ మత పరస్పర ప్రభావం

భారతదేశంలో హిందూ, జైన మరియు బౌద్ధ మతాలు అత్యంత ప్రముఖ ప్రాచీన మతాలు. హిందూమతం ఏ ఒక్క చారిత్రక పురుషుని బోధనల వల్లనో లేక ఏ ఒక్క తరానికి సంబంధించినదో కాదు అని మీకు తెలిసే ఉండవచ్చు. నిజానికి ఇది అనేక శతాబ్దాల నుండి క్రమేణా ఉద్భవించింది అంతేకాక దీనిలో అనేక విశ్వాసాలు, ఆరాధనా పద్ధతులు

గ్రహించబడ్డాయి. మరొక వైపున మహావీరుడు మరియు గౌతమబుద్ధడు క్రీ.పూ6వ శతాబ్ధంలో వరుసగా జైన మరియు బౌద్ధ మతాలను స్థాపించారు. ఐతే వీరిలో ఎవరూ కొత్త మతాలను స్థాపించాలనే అభీష్టం కలిగిలేరని, మీకు ముందు పాఠాల నుండి పునశ్చరణ చేయగలరు. వీరు నాటి సమాజంలో ఉన్న మతపరమైన మరియు సామాజిక పరిస్థితులలో సంస్కరణలు చేయాలని కోరుకున్నారు. ఆవిధంగా భారతదేశ చరిత్రలో ఏ దశలో కూడా ఈ మూడు మతాలు అనగా హిందూ, జైన మరియు బౌద్ధ మతాలను విడదీయటం పొరపాటే. నిజానికి ఇవి ఒక స్థిరమైన పరస్పర ప్రభావాన్ని కలిగి ఉన్నాయి. ప్రాచీన కాలంలోని తత్వం, సారస్వతం, కళ మరియు వాస్తు శాస్త్రాలు పై విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. నేటికి కూడా, ఆయా మతాల్ని అనుసరించే వారు చాలా స్వేచ్ఛగా ఎటువంటి అరమరికలు లేకుండా కలిసి పోతున్నారు మరియు వివాహాలు కూడా చేసుకుంటున్నారు. ఇప్పుడు మనం ఒక మతంపై మరొక మత ప్రభావాన్ని గురించి క్షుణ్ణంగా అధ్యయనం చేద్దాం.

హిందూ మతం యొక్క మూలాలు వైదిక మతంలో కనుగొనవచ్చు. ఋగ్వేద ప్రజలు ప్రకృతి శక్తులను పూజించేవారు. వేదకాలం చివర్లో కర్మకాండలు(rituals) మరియు యాగాలు(sacrifices) ప్రధానపాత్ర పోషించాయి. ఏదేమైనా సామాజిక ఆర్థిక జీవనంలో సంభవించిన మార్పులతో, మతంలో కూడా మార్పులు వచ్చాయి. వివిధ తత్వ సాంప్రదాయాలు ఉద్భవించి, జీవన విధానానికి మార్గాన్నిచూపి జీవితంలో ఎదుర్కొనే అనేక ప్రశ్నలకు సమాధానాలనిచ్చాయి. ప్రత్యేకంగా ఉపనిషత్తులు అత్యంత మేధోపరమైన తాత్విక భావాలను కలిగి ఉన్నాయి. ప్రాచీన భారత రాజులు ఆయా మతాలను ఆదరించారు. అశోకుడు మరియు కనిష్కుడు బౌద్ధ మత వ్యాప్తికి తోడ్పడ్డారని, కొందరు శాతవాహన రాజులు జైన మతాన్ని అనుసరించారని మరియు గుప్తరాజులు హిందూమతాన్ని అనుసరించారని మనకు తెలుసు. ఇదే సమయంలో, ఈ పాలకులందరూ పరమత సహనాన్ని పాటించారు. అందుచేతనే, హిందూ, జైన మరియు బౌద్ధ దేవాలయాలు, స్థూపాలు, మఠాలు మరియు గుహలు చాలాచోట్ల ప్రక్కప్రక్కనే నిర్మించబడ్డాయి. ఈ మూడు మతాలలో ఒకే తాత్విక భావనలు కలిగి ఉండటం కూడా ఈ మతాలు ఒకదాన్ని మరొకటి ప్రభావితం చేశాయనే విషయం నిరూపించుచున్నది. నమ్మకస్థాయి వేరుగా ఉన్నా, ఈ మూడు మతాలు అహింసను బోధించాయి. ఉదాహరణకు జైనులు ఈ విషయంలో చాలా కఠినంగా ఉండేవారు. జైనుల విశ్వాసం ప్రకారం 'ఆత్మ' అనునది జీవులలోనే కాక నిర్జీవులలో కూడా ఉంటుంది. 'కర్మ' లేక పని గురించి నమ్మకాన్ని ఈ మూడుమతాలు కలిగి ఉన్నాయి. ప్రత్యేకంగా గుప్తుల కాలంలో, ఈ మతాల నమ్మకాలు చాలా ఎక్కువగా పరస్పరం కలిసిపోయాయి. గుప్తుల తర్వాతి కాలంలో, జీవతాత్విక చర్చలు (శాస్త్రార్ధ)అనునవి, హిందూ మరియు జైన మతాల మధ్య పరస్పర ప్రభావాన్ని కలిగించాయి. బుద్ధుని, విష్ణువు యొక్క ఒక అవతారంగా భావించేవారు. విగ్రహారాధన, 'పూజ'లు చేయడం, దేవుని యొక్క భావనలు అన్నియూ కూడా మహాయాన బౌద్ధ మతంలో అంతర్భాగమై పోయాయి. క్రీ.శ. 5వ శతాబ్ధంలో స్త్రీ దేవతలను ఆరాధించడమనే ప్రధాన హిందూ ఆచారంను బౌద్ధమతం అనుసరించింది.

బౌద్ధమతంలో మూడవ శాఖ ఐన వజ్రయాన బౌద్ధమతం మీకు గుర్తుండే ఉంటుంది. ఈ శాఖను అనుసరించే వారు బుద్ధునికి 'తారలు'గా చెప్పబడే వారిని ప్రతిరూపములు(Counter parts) గా చెప్పేవారు. ఈ 'తార' ఆరాధన హిందూ మతంలో 'శక్తి' ఆరాధనకు చాలా దగ్గరగా ఉంటుంది. ఈ మూడు మతాలలో కన్పించిన మరొక సాధారణ అంశం, ఒకే సాధారణ భాష. వీరందరూ సంస్కృతాన్ని ప్రధాన భాషగా వినియోగించారు మరియు ఇది వారిలో పరస్పర కలయికకు తోడ్పడింది. జైన, బౌద్ధ మతాలు, హిందూ మత కళ, శిల్పకళ, సారస్వతం మరియు వాస్తుకళలను చాలా ప్రభావితం చేశాయి. భారతదేశంలోని అనేక ప్రాంతాలలో హిందూ, బౌద్ధ స్థూపాలు, దేవాలయాలు మరియు

మతపరమైన నిర్మాణాలు ఒకదాని ప్రక్క మరొకటి నిర్మింపబడటం మీరు గమనించగలరు. ఉదాహరణకు మధ్యప్రదేశ్‌లోని సాంచి, మహారాష్ట్రలోని అజంతా, ఎల్లోరాలు, ఒరిస్సా, తమిళనాడు మొదలగునవి. ప్రాచీన భారతదేశంలోని సామాజిక మరియు కులవ్యవస్థ లలో కూడా జైన, బౌద్ధ మతాలు ప్రవేశించిన తర్వాత ముఖ్యమైన మార్పులు సంభవించాయి.

హిందూ, జైన మరియు బౌద్ధ మతాల మధ్య చెప్పుకోదగిన రీతిలో పరస్పర ప్రభావం ఉంది. ప్రాచీన తత్వశాస్త్రం, కళ మరియు శిల్పకళలపై ఈ మూడు మతాల మధ్య కలయిక ప్రభావం కన్పిస్తుంది.

## 25.4 క్రైస్తవ మతరాక

భారతదేశంలో ప్రాచీన కాలంలో విలసిల్లిన ప్రాచీన, ప్రముఖమైన మూడుమతాలైన హిందూ, జైన మరియు బౌద్ధ మతాల గురించి మీరు ఇప్పుడే చదివారు. కానీ ఈ రోజున మనదేశంలో ఈ మూడు మతాలే కాక ఇతర మతాల్ని కూడా ప్రజలు అనుసరిస్తున్నారు. మత ప్రమేయం లేని రాజ్యమైన భారతదేశంలో క్రైస్తవులు, ముస్లింలు మరియు సిక్కులు కూడా కలిసి జీవిస్తున్నారు. ప్రస్తుతం మనం క్రైస్తవ మతం భారతదేశంలో ఏవిధంగా వేళ్లూనిందో చూద్దాం. తర్వాత భారతదేశంలో ఇస్లాం మత రాక మరియు సిక్కుమత ఉద్భవముల గూర్చి చూద్దాం.

సంప్రదాయం ప్రకారం క్రైస్తవ మతం, భారతదేశంలోకి క్రీ.శ 1వ శతాబ్దంలో సెయింట్ థామస్ ద్వారా ప్రవేశపెట్టబడింది. ప్రచారంలో ఉన్న కథల ద్వారా, పార్థియన్ రాజు గన్డొఫెర్నెస్(క్రీ.శ 19–45)(Gondophernes) తనకు ఒక కొత్త నగరాన్ని నిర్మించుటకు ఒక నేర్పరి అయిన శిల్పి కావాలని సిరియాకు ఒక దూతను పంపించాడు. ఆ దూత తనతో పాటు సెయింట్‌థామస్‌ని తోడ్కొని వచ్చాడు. ఈయన, గన్డొఫెర్నెస్‌ను మరియు అతని సభలోని అనేకమందిని క్రైస్తవ మతంలోకి మార్చినట్లుగా చెప్పబడింది. అయితే ఈ కథలోని వాస్తవం సందేహాస్పదం. ప్రధానంగా భారతదేశం మరియు పశ్చిమ దేశాల మధ్య తరుచుగా జరిగిన వ్యాపార మరియు రవాణా, ఏసుక్రీస్తు అనుచరుడైన ఇతడు భారతదేశంలోకి అడుగిడటానికి కారణమని మనకు తెలుస్తోంది. వర్తకులు, వ్యాపారులు మరియు ఇతర వృత్తుల వారు కూడా ప్రముఖ భూ మరియు సముద్ర మార్గాల ద్వారా ప్రయాణించారని మీరు గుర్తుకు తెచ్చుకోగలరు. సెయింట్ థామస్, భారతదేశంలోని అనేక ప్రాంతాలలో క్రైస్తవ మతాన్ని ప్రబోధించాడు. ఈయన, మద్రాస్ సమీపంలోని మైలాపూర్ వద్ద చంపబడ్డాడు. సెయింట్ థామస్ సమాధిని నేటికీ అదేప్రాంతం వద్ద మనం చూడవచ్చు. నేటికీ క్రైస్తవులలో ఒక పెద్ద శాఖ అయిన సిరియాక్రైస్తవులు కేరళలో నివసిస్తున్నారు.

క్రైస్తవ మతం కార్యకలాపాలు మధ్యయుగంలో కూడా కనిపిస్తాయి. 17వ శతాబ్దంలో అక్బర్ రాజు మతవిషయాలను చర్చించడానికి తన సభకు కొంతమంది క్రైస్తవ మత బోధకులను ఆహ్వానించాడు. అక్బర్ నుండి వచ్చిన 'ఫర్మాన్'లో ఆజ్ఞాపించిన విధంగా ఆగ్రాలో ఒక చిన్న చర్చి నిర్మించబడింది. భారతదేశంలోకి ఐరోపావారు ప్రవేశం మరియు తూర్పు ఇండియా వర్తక సంఘం(East India Company) నెలకొల్పడంతో 18వ శతాబ్దం తర్వాత క్రైస్తవ మత కార్యకలాపాలు పెరిగాయి. ఐరోపా వర్తకులు, పాలకులతో పాటు క్రైస్తవ ఉపాధ్యాయులు, క్రైస్తవ మత బోధకులు వచ్చేవారు. వారిలో ఎక్కువమంది ఇక్కడ స్థిరపడి, మిషనరీ (మతబోధనా) కార్యకలాపాలు చేపట్టేవారు. ఈ ఉద్దేశ్యంతోనే వారు అనేక చర్చిలు, విద్యాసంస్థలు, ఆసుపత్రులను నిర్మించారు. మనం నేటికి కూడా వీనిలో చాలావాటికి సంబంధించిన ఋజువులు చూడవచ్చు.

క్రైస్తవ చర్చిలలో ప్రధాన వర్గాలు రోమన్–కాథలిక్ చర్చి మరియు ప్రొటెస్టెంట్ చర్చిలు. క్రైస్తవుల పవిత్రగ్రంధం 'బైబిలు'. బైబిలు నందు పాత నిబంధన (old testarment) మరియు కొత్త నిబంధన(new testarment) అను రెండు ప్రధాన భాగాలు కలవు. ఈరోజు ఈ బైబిలు మనదేశంలోని అన్ని ప్రధాన భాషలలో ప్రచురించబడి లభ్యమవుతోంది.

ఈరోజు, భారతదేశంలో షుమారు $1^1/_2$ కోటి మంది కంటే ఎక్కువ క్రైస్తవులు నివసిస్తున్నారు. వీరి ఆదరణలో అనేక ధార్మిక సంస్థలు మనదేశంలోని అనేక ప్రాంతాలలో నెలకొల్పబడి, సేవలు చేస్తున్నాయి. బహుశా, వీరిలో అత్యంత ప్రఖ్యాతిచెందిన క్రైస్తవ సంఘసేవకురాలు 'మదర్ థెరిసా'. ఈమె మనదేశంలోని పేదవారు మరియు ఇళ్ళులేని నిరుపేదల సంక్షేమానికి ఎంతోపాటు పడింది.

క్రైస్తవమతం మనదేశంలోని క్రీ.శ 1వ శతాబ్ధంలో సెయింట్ థామస్ చే ప్రవేశపెట్టబడింది. నేడు, మనదేశంలో చాలా ఎక్కువ సంఖ్యలో క్రైస్తవులు ఉన్నారు. వీరు అన్ని రంగాలలో ముఖ్యంగా విద్య మరియు సంక్షేమ కార్యకలాపాలలో గొప్ప పాత్ర వహిస్తున్నారు.

## పాఠ్య ప్రశ్నలు 25 ఎ

1. భారతదేశంలో క్రైస్తవ మతం ఎన్నేళ్ళుగా ఒకమతంగా వర్ధిల్లుతోంది?
2. బైబిలు నందలి రెండు ప్రధాన భాగాలు ఏవి?
3. ఏ రెండు రంగాలలో క్రైస్తవుల పాత్ర చెప్పుకోదగిన విధంగా ఉంది?
4. డిసెంబర్ 25న మనం ఎందుకు క్రిస్‌మస్‌డే గా ఉత్సవం చేసుకొంటున్నాం?

## 25.5 గణితం మరియు వైద్య విజ్ఞాన శాస్త్రం

గణితరంగంలో భారతదేశానికి ప్రపంచం ఎంతగానో ఋణపడి ఉందని చెప్పవచ్చు. భారతీయులు చరిత్ర తొలినాళ్ళలోనే నూతన రేఖాగణిత విధానంను రూపొందించి బీజగణితంలో మౌలిక అంశాలను కనుగొన్నారు. భారతదేశంలో ప్రాచీన కాలం నుండి గణితంలో దశాంశపద్ధతి, 'సున్న'భావన, 'పై', వృత్తం భావన ప్రాచీన భారతం సాధించిన అంశాలు. అరబ్బులు, గణితాన్ని 'హిందిసా' లేక 'భారతీయ కళ'గా పిలిచేవారు. భారతదేశానికి చెందిన గొప్ప గణిత మేధావులైన బ్రహ్మగుప్తుడు, మహావీరుడు మరియు భాస్కరుడు కనిపెట్టిన అంశాలు ఆతర్వాత చాలాకాలం వరకు ఐరోపా వారికి తెలియదు. ప్రాచీన కాలంలో, గొప్ప శాస్త్రవేత్తలలో ఒకరిగా మరియు గణితవేత్తగా 'ఆర్యభట్టు' పరిగణింపబడటం గురించి మీరు ముందే చదివారు. ఆయన వ్రాసిన 'ఆర్యభట్టీయం' నందు బీజగణితం(algebra) , రేఖాగణితం(geometry) మరియు త్రికోణమితి(trigonemetry) లకు సంబంధించిన అనేక సమస్యలకు పరిష్కారాలు కనుగొన్నాడు. ప్రాచీన కాలంలో గణితశాస్త్రం ఆవిధంగా అభివృద్ధి చెందకుండా ఉంటే, నేటి గొప్ప ఆవిష్కరణలలో ఎక్కువభాగం సాధ్యమై ఉండేవి కావు.

భారతీయులు అభివృద్ధి సాధించిన మరొక అంశం ఖగోళ మరియు జ్యోతిష్య శాస్త్రములందు సాధించిన ప్రగతి. భూమి తన అక్షం మీద భ్రమణం చేస్తుందని కనుక్కొన్న ప్రధమ భారత ఖగోళ శాస్త్రవేత్త ఆర్యభట్టు. ఈయన భూమి, సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తుందని అంతేకాని సూర్యుని చుట్టూ భూమి పరిభ్రమించడం లేదని కూడా కనుగొన్నాడు.

ఆర్యభట్టు 'పై' యొక్క విలువ 3.146గాను మరియు సౌరసంవత్సరం అనగా 365.3586805 రోజులుగాన గణించారు. ఈ రెండు విలువలు కూడా ఆధునిక అంచనాలకు చాలా దగ్గరగా వున్నాయి. వరాహమిహిరుడు మరియు బ్రహ్మగుప్తుడు ప్రాచీన భారత ప్రఖ్యాతి గాంచిన ఖగోళ శాస్త్రవేత్తలుగా చెప్పవచ్చు. వరాహమిహిరుడు, బృహత్సంహితను వ్రాశాడు. ఆయన చంద్రుడు, భూమి చుట్టూ మరియు భూమి, సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తుంటాయని తెలియపర్చాడు.

లోహ సంగ్రహణ శాస్త్రం కూడా చెప్పుకోదగ్గ ప్రగతి సాధించింది. ఈ విషయాన్ని ఢిల్లీ దగ్గర మెహ్రౌలిలో నిర్మించబడిన ఇనుపస్తంభం ద్వారా మనం గమనించవచ్చు. లోహసంగ్రహణ వేత్తలు లోహసంగ్రహణ మరియు లోహమూసల తయారీ యందు నిపుణులు.

వైద్యశాస్త్ర రంగంలో కూడా గణనీయ అభివృద్ధి సాధించబడింది. భారతీయ వైద్యానికి సంబంధించిన మూలాధార గ్రంధాలు 'చరక సంహిత' (క్రీ.శ1-2 శతాబ్దాలు)(collection of charaka) మరియు శుశ్రుత సంహిత(క్రీ.శ 4వ శతాబ్దం)లు పూర్తిగా అభివృద్ధి చెందిన పద్ధతుల రూపాలు. ప్రముఖ బౌద్ధ పండితుడు నాగార్జునుడు కూడా ఒక వైద్య విద్యార్ధి మరియు ఆయన అనేక కొత్త ఔషధాలను కనుగొన్నాడు. ప్రముఖ వైద్యాచార్యుడు ధన్వంతరి, ఆయుర్వేద వైద్యాన్ని ఎంతో అభివృద్ధి పరిచాడు. 'యోగ' సహాయంతో శరీరధర్మ శాస్త్రం(physiology) లో పెరిగిన ఆసక్తి, వైద్య పరిజ్ఞానాన్ని ఇంకొంత ముందుకు తీసుకెళ్ళింది. ప్రాచీన భారతీయులు, సిజేరియన్ శస్త్ర చికిత్సలవంటి అభివృద్ధి చెందిన పద్ధతులను వెలుగులోకి తెచ్చారు మరియు 'ఎముకలను అమర్చుట(bone setting) లో గొప్ప నైపుణ్యాన్ని సాధించారు. 'ప్లాస్టిక్ సర్జరీ' నందు కూడా నైపుణ్యం సాధించబడింది. ప్రాచీన భారత శస్త్ర చికిత్స నిపుణులు, యుద్ధాలలో గాని లేక ఇతరంగా గాయపడిన వారికి ముక్కు, చెవి మరియు పెదాలను సరిచేయడంలో నిపుణులు.

శుశ్రుత సంహితలో, శస్త్ర చికిత్సను 121 విధానాలలో చేయవచ్చని తెలియజేయబడింది. చరకసంహితలో వివిధ రకాలైన జ్వరాలు, కుష్టువ్యాధి, మూర్ఛ మరియు క్షయ వ్యాధులను గురించి వివరించబడింది.

పశువైద్యం కూడా ఆచరణలోకి తేబడింది. హస్త్యాయుర్వేదం(Hastasyurveda) మరియు అశ్వశాస్త్రాలు జంతు వ్యాధుల పై మనం సాధించిన ప్రగతిని నిరూపిస్తాయి.

రసాయనిక శాస్త్రవేత్తలు, వైద్యానికి సంబంధించిన ఔషధాల తయారీలో కృషి చేయడం వల్ల, ప్రాచీన భారతదేశంలో వైద్యంతో పాటు రసాయనశాస్త్రం కూడా అభివృద్ధి చెందింది. వారు అనేక ముఖ్యమైన క్షారాలు (alkalis), ఆమ్లాలు(acids) మరియు లోహలవణాలు (metallic salts) ను ఉత్పత్తి చేశారు. భారతీయ అద్దకపు పనివారు, బహుకాలం నిలిచి ఉండే రంగులను కనుగొన్నారు. భారతీయ అద్దకపు పనివారు, మొక్కల నుండి 'నీలి' రంగును కనుగొన్నారు. అందుకే దీనిని 'ఇండిగోనీలి'(Indigo blue) రంగు అంటారు. (ఇండికోస్ అనునది భారతదేశం అని అర్థం వచ్చే ఒక గ్రీకు పదం).

ప్రాచీన భారతీయులు గణితం మరియు వైద్యశాస్త్ర(Science) రంగాలలో ముఖ్యపాత్ర పోషించారు. వారికి రేఖాగణితం, బీజగణితం మరియు త్రికోణమితిలపై మంచి పరిజ్ఞానం ఉంది. వైద్యశాస్త్రంలో కూడా ఎంతో అభివృద్ధి సాధించబడింది.

## 25.6 భాష, సారస్వతం మరియు తత్వశాస్త్రం

**భాష మరియు సారస్వతం :**

ప్రాచీన భారతీయులు సంస్కృతం, ప్రాకృత మరియు పాళి భాషలలో ఒక గొప్ప, విభిన్న సారస్వతాన్ని అభివృద్ధి

చేశారు. మన ఆధునిక భారతీయ భాషలలో చాలా భాషలు ఈ ప్రాచీన భాషల నుండే పుట్టాయి. ఇప్పటికీ సంస్కృత భాష, అనేక రంగాలలో ముఖ్యంగా తత్వశాస్త్రంలో ఉదాహరణకు వేదాలు మరియు ఉపనిషత్తులలో జ్ఞానసముపార్జనకు ప్రధాన ఆధారంగా ఉంది. పాశ్చాత్య దేశాలవారు సంస్కృత భాష ఆవిష్కరణ జరిగిన తర్వాతే, ఐరోపాలో ఉచ్చారణ శాస్త్రం(Chometics) నకు సంబంధించి అభివృద్ధి జరిగింది. ఉచ్చారణ శాస్త్రం భాషలో 'ధ్వని'ని గూర్చి అధ్యయనం చేస్తుంది. ఈ రంగంలో పాణిణి వ్యాకరణం 'అష్టాధ్యాయ'లని అతిగొప్ప రచనలలో ఒకటిగా చెప్పవచ్చు. పాణిణి కాలం నుంచే ఈ భాషను 'సంస్కృతం' అని పిలిచేవారు. దీని అర్థం, 'సరియైనది' లేక 'పరిశుద్ధమైనది'. ఇది 'ప్రాకృత' భాషకు వ్యతిరేకమైంది. దీని అర్థం పరిశుద్ధం కానిది. ఈ రెండవ (ప్రాకృత) నామం సహజంగా అభివృద్ధి చెందిన ప్రముఖ మాండలికాలకు ఇవ్వబడింది.

సంస్కృతంలో నాలుగు వేదాలు, బ్రాహ్మణాలు మరియు ఉపనిషత్తులు అత్యంత ప్రాచీన రచనలు(గ్రంధాలు)గా చెప్పవచ్చు. వీటిలో కొన్ని హిందూ తత్వానికి సంబంధించిన మేధోపరమైన తాత్విక భావనలు మరియు సిద్ధాంతాలు వ్రాయబడి ఉన్నాయి.

భారత సారస్వతంలో ఆధ్యాత్మిక స్వభావం కలిగిన ప్రఖ్యాతి చెందిన రచనలలో, రెండు ప్రధాన ఇతిహాసాలైన మహాభారతం, రామాయణంలను చెప్పవచ్చు. నేడు ఈ రెండు ఇతిహాసాలు చాలా ప్రఖ్యాతి గాంచాయి. మీకు ఈ రెండింటి కథలు సుపరిచితమే. ఆధ్యాత్మికరచనలకు ఉదాహరణలుగా మరికొన్ని ఇతర పురాణాలు మరియు ధర్మ శాస్త్రాలను పేర్కొనవచ్చు.

శాస్త్రీయ సంస్కృత కవిత్వం మానసికోల్లాసాన్నిచ్చేది. పురాతన సంస్కృత కవిత్వానికి సంబంధించిన బౌద్ధకవి అశ్వఘోషుడు (క్రీ.శ. 1వ శతాబ్దం) రాసిన కవిత్వాన్ని చెప్పవచ్చు. ఇతడు బుద్ధునికి సంబంధించిన అన్ని వివరాలతో 'బుద్ధ చరిత్ర'ను వ్రాశాడు. గుప్తుల కాలంలో నివసించిన కాళిదాసు రచనలు నేటికీ పాఠకుల్ని ఆనంద పరవశుల్ని చేస్తున్నాయి. అతని రచనలు అభిజ్ఞాన శాకుంతల ((Abhignana Shakuntalam), మేఘదూతం(Meghadutam) ప్రపంచ ఖ్యాతి నార్జించాయి. కవిత్వంలో ప్రధానాంశాలు ప్రేమ, ప్రకృతి, నీతి మరియు రాజకీయాలు ఉన్నాయి. ప్రాచీన కాలంలో భాసుడు, శూద్రకుడు, విశాఖదత్తుడు మరియు భవభూతి మొదలైన వారిని కొందరు ప్రఖ్యాత నాటక రచయితలుగా పేర్కొనవచ్చు.

క్రీ.శ 150 నాటి రుద్రదమనుని జునాగడ్(Junagadh) శాసనం, సంస్కృత గద్యరచనకు సంబంధించిన ముఖ్యమైన ప్రాథమిక ఉదాహరణలుగా తెల్పవచ్చు. ప్రాచీన సారస్వతంలో, సంస్కృత గద్య రచనకు సంబంధించి బాణుడు, దండిన్(Dandin) మరియు సుబంధు(Subandhu)లను ప్రముఖ రచయితలుగా పేర్కొనవచ్చు. నేటికీ పంచతంత్రం (ఐదు గ్రంథాలు)లో వ్రాయబడిన కథలంటే పిల్లలు అమితంగా ఇష్టపడతారు. ఈ నీతికథలను విష్ణుశర్మ అనే బ్రాహ్మణుడు, యువరాజులకు విద్యా(జ్ఞాన) బోధన చేయడానికి సంకలనం చేశాడు. ఈ సంస్కృత రచన యొక్క తర్జుమా(version)ను 12వ శతాబ్దంలో నారాయణుడు 'హితోపదేశం' పేరుతో వ్రాశాడు. ఈ ఖండం ముగింపులో ఇవ్వబడ్డ పంచతంత్ర కథను మీరు చదివి దాని అర్థాన్ని తెలుసుకోండి.

పాళీభాష సామాన్య ప్రజలు మాట్లాడే భాషే కాక సంస్కృతం కంటే మరింత సరళమైన శైలిని కలిగి ఉంటుంది. పాళీ సారస్వతంలో, పంచతంత్ర కథలకు సారూప్యమైన జాతక కథలు చాలా ప్రసిద్ధి గాంచాయి. 'తెరాగత'(Theragatha), 'తెరీగతా'(Therigatha)మరియు 'మహావంశం'(Mahavamsa) వంటివి పాళీ పద్యకవిత్వానికి కొన్ని ఉదాహరణలు.

జైన సారస్వతం ఎక్కువగా ప్రాకృత భాషలో రాయబడింది. సూత్రకృతంగ(Sutra kritanga), సేలుకంధ(Selukamdha) గౌడవధ(Gowdavadha)లు కొన్ని ప్రముఖ ప్రాకృత రచనలు.

## తమిళభాష మరియు సారస్వతం

భారతదేశ సంస్కృతికి, తమిళభాష సారస్వతాలు దోహదపడిన తీరు గమనించదగ్గది. తమిళభాష, దక్షిణ భారతదేశంలో అతిప్రాచీన భాష మరియు క్రీస్తు శకానికి చెందిన తొలి శతాబ్దాల నుండి దీని మూలాలున్నాయని చెప్పవచ్చు. నేడు తమిళభాషలో ప్రాచీన సాహిత్యంగా చెప్పబడుతున్న 'సంగం సారస్వతం' నందు తమిళదేశం గురించిన అంశాలు వివరంగా తెల్పబడ్డాయి. సంగం అనునది ఒక 'కవి సమ్మేళనం' అని మీకు తెలుసు. మొట్టమొదటి సంగం మదురై దగ్గర జరిగింది.

తమిళ సారస్వతంలో తొలినాళ్ళలో 'తిరుకురల్'(Tirukural)ఒక ప్రసిద్ధ రచనగా చెప్పవచ్చు. ఇది సామెతలు మరియు బోధనలతో నిండియున్నది. 'నాలాడియార్(Naladiyar)అనునది మరొక రచన, దీనియందు కొన్ని ఉన్నతమైన మరియు నైతిక అంశాలు వ్రాయబడి ఉన్నాయి. 'తిరుకురల్' నుండి కొన్ని సామెతలు క్రింద ఇవ్వబడ్డాయి.

"అహంకారం అనే రాజ్యం అన్ని మంచి విషయాలను కలిగి ఉంటుంది కాని పాలకుడు మరియు పాలితుల మధ్య ఎటువంటి ప్రేమ ఉండదు".

"నీవు కష్టపడి సంపాదించిన గంజి(rice gruel)కంటే తీయనైన ఆహారం ఏమీ ఉండదు".

క్రీ.శ 6వ శతాబ్ధం నాటికి, భారతదేశ దక్షిణ మరియు ఉత్తర ప్రాంతాల మధ్య సంబంధాలు గణనీయంగా మెరుగుపడినందున, తమిళ సారస్వతంపై, సంస్కృత సారస్వతం ప్రభావం పడింది. తమిళ కవులు, సంస్కృత పదమైన 'కావ్యం' పేరుతో పెద్ద పద్యకవితలు వ్రాయడం ప్రారంభించారు. వీటిలో మొదటిది మరియు గొప్పది 'శిలప్పదికారమ్'(Silappadikaram). దీని తర్వాత వ్రాయబడిన మణిమేఖల(Manimekhalai).

తత్వశాస్త్రం : పైన తెల్పిన విధంగా తత్వశాస్త్రం ప్రాచీన కాలంలో వేదాలు, బ్రాహ్మణులు మరియు ఉపనిషత్తుల వంటి వాని ద్వారా గణనీయ అభివృద్ధిని సాధించింది. వాస్తవానికి, ఉపనిషత్తులు భారత తత్వశాస్త్రానికి తలమానికంగా పిలవబడతాయి. ఉపనిషత్తులనుండి ముఖ్యమైన తాత్విక భావనలు కలిగిన పద్య మొకటి క్రింద ఇవ్వబడింది. దీనిని జాగ్రత్తగా చదివి, మీరు ఏ అర్థం చేసుకున్నారో వివరించండి.

" ఒక మర్రి పండును నాకు తెచ్చివ్వు."

" ఇదిగోండి, అయ్యా."

" దానిని పగులగొట్టు."

" నీవు ఏం చూశావు?"

" చిన్న చిన్న విత్తనాలనయ్యా."

" ఒక విత్తనాన్ని పగులగొట్టు."

" పగుల కొట్టానయ్యా."

" ఇప్పుడేం చూశావు?"

" ఏమీలేదయ్యా."

పుత్రా, నీవు అర్థం చేసుకోలేని విషయం దాని సారాంశం. ఆ సారాంశంలోనే అతిపెద్ద మర్రిచెట్టు కన్పిస్తుంది. నా కుమారుడా, నన్ను నమ్ము, ఆ సారాంశంలోనే దాని ఆత్మ ఉంటుంది. అదే సత్యం, అదే 'నేను' అనేది. అంతేగాదు, శ్వేతకేతూ నీవే ఆ ఆత్మ అని తండ్రి అన్నాడు.

చాందోగ్య ఉపనిషత్తు

భారతదేశ తత్వశాస్త్రం, వివిధ తత్వ సంప్రదాయాలచే అభివృద్ధి చేయబడింది. ఈ సంప్రదాయాలు మోక్షాన్ని సాధించడానికి మార్గాలను సూచించాయి. వేదాల ఆధిక్యతను కొంతమంది అంగీకరిస్తే, మరికొంతమంది తిరస్కరించారు. కొంతమంది ప్రపంచం వాస్తవ దృశ్యాన్నిస్తే, మరి కొంతమంది ఆదర్శ వాదాన్ని అభివృద్ధి చేశారు.

ఇంతకుక్రితం పాఠాలందు, మీరు తత్వం ఆరు సంప్రదాయాను, షడ్దర్శనం(saddarshana)గురించి చదివారు. ఇవి ఒక దానితో మరొకటి సంబంధం కలిగి సంపూర్ణంగా ఉన్న రెండు సమూహాలుగా విభజింపబడ్డాయి. ఇవి 'న్యాయం'(nyaya) మరియు 'వైశేషిక'(vaiseshika)లు,'సాంఖ్య'(sankhaya)మరియు 'యోగ'(yoga), 'మీమాంస'(mimamsa)మరియు వేదాంతాలు(vedantha). న్యాయ సంప్రదాయం తర్కానికి ప్రాధాన్యత నిస్తుంది. మరియు తార్కిక వాదనను, మోక్ష సాధనకు మరియు అనంత ఆనందాన్ని పొందటానికి మార్గంగా భావిస్తుంది. వైశేషిక సాంప్రదాయం భౌతికశాస్త్రం పై ఆధారపడి ఉంటుంది. ఇదివిశ్వం పరిమాణు ప్రవృత్తిని, దాంతోపాటు ఆత్మ నుండి దీని భేదాన్ని గుర్తించింది.

బహుశ సాంఖ్య సాంప్రదాయం అన్నింటిలో అతి ప్రాచీనమైనది అయి ఉండవచ్చు. ఇది ఇరవై ఐదు మౌలిక సూత్రాల (తత్వాలు) ప్రాచుర్యం గురించి మరియు వానిలో మొదటిది ప్రకృతి(పదార్థం)ని గురించి బోధిస్తుంది. ఈ సంప్రదాయం ప్రకారం, సృష్టి లేక పరిణామం అనునది దైవానికి సంబంధించిన కార్యం కాక ప్రకృతి యొక్క స్వాభావిక ప్రవృత్తి అని తెలియజేస్తుంది. 'యోగం' మోక్షాన్ని సాధించడానికి, మానసిక శిక్షణ ముఖ్య సాధనగా వక్కాణిస్తుంది. విశాల భావనలో 'యోగా' అనునది ప్రతి భారతవర్గం(sect)లో బోధనలో ఒక భాగమై పోయింది. నిజానికి, పాశ్చాత్య దేశాలవారు 'యోగా' లోని సూత్రాలను అనుకరిస్తున్నారు. మీమాంస(Meemamsa) అనగా విచారణ. ఈ సాంప్రదాయం ముఖ్యోద్దేశ్యం వేదాలను వివరించడం మరియు అవి శాశ్వతమైనవనీ స్వయంగా మనగలవని వివరించడమే. వేదాంతాన్నే ఉత్తర మీమాంస(Uttara memamsa)అని పిలువబడుటమే గాక ఆను సాంప్రదాయాలలో ఇది అతి ముఖ్యమైందిగా పరిగణింప బడుతుంది. వేదాంతాల్లోని సిద్ధాంతాలు ఉపనిషత్తులపై ఆధారపడి ఉంటాయి. ఆధునిక వేదాంత శాస్త్రవేత్తలైన వివేకానందుడు మరియు అరవింద్ ఘోష్ వంటివారు ఈ సాంప్రదాయాన్ని అనుసరించారు.

పైన తెల్పబడిన సాంప్రదాయాలతో పాటు, మరికొన్ని భాగాలైన 'అజీవకులు'(Ajivakas) అనే శాఖ కలదు. వీరు కఠిన సన్యాసత్వాన్ని ఆచరించారు. ప్రతి మనిషి విధి ముందుగానే నిర్ణయించబడుతుందని మరియు దీనిని మార్చుడం అసాధ్యమని వీరు నమ్మేశారు. చార్వాకులు(Charvakas)లేక లోకాయతలు(Lokayathas)బోధించిన వాస్తవిక(భౌతిక) తత్వానికి సంబంధించిన భావాలు కూడా భారతీయులలో పెంపొందినాయి. వారి అభిప్రాయంలో, మత పరిశీలనలు మరియు నైతికతల వల్ల ఉపయోగం లేదు. మానవుల ముఖ్యోద్దేశ్యం ప్రాపంచిక జీవితానికి సంబంధించిన సుఖాలు సంతోషాలన్నీ అనుభవించటమే ఈ సాంప్రదాయానికి సంబంధించిన ఒక వాక్యసంగ్రహం (text) ప్రకారం, మానవుడు ఆనందంగా నివసించాలని మరియు అప్పులలో ఉన్నప్పుడూ కూడా నేతిని తాగాలని, అంటే అప్పు చేసి

పప్పుకూడు తినాలని చెబుతోంది. భారతీయ తత్వాన్ని, జైన మరియు బౌద్ధ మత సిద్ధాంతాలు ఉన్నతంగా చేశాయి. మీరు ఇంతకుముందు బౌద్ధ,జైన మత సిద్ధాంతాల గురించి చదివారు. మహావీరుడు, తీవ్ర ఆత్మ తిరస్కారం, సన్యాసత్వములను బోధించగా, బుద్ధుడు చాతురార్య సత్యాలు, అష్టాంగ మార్గాలను బోధించాడు. జైనమతం ఆ తర్వాత కాలంలో దిగంబరులు మరియు శ్వేతాంబరులు అనే శాఖలుగా విభజింపబడగా బౌద్ధమతం మహాయానం, హీనాయానలుగా చీలిపోయింది. ఆ తర్వాతి కాలంలో జైన, బౌద్ధ మరియు హిందుమతాల మధ్య అభిప్రాయాలు పరస్పర మార్పిడి వల్ల ఈ మతాలు గొప్పవిగాను మరియు ఆయా తత్వవేత్తలలో అనేక సాధారణ అంశాలు కన్పించాయి.

ఆవిధంగా ప్రాచీన భారతీయ తత్వాన్ని ఎంతలోతైనదో, అంతే విభిన్నమైనదిగా మనం గమనించవచ్చు. మోక్ష సాధనకు అక్కడ ఒక ప్రత్యేక లేక నిర్ధేశించబడిన నియమం అంటూలేదు. మోక్ష సాధనకు వివిధ మార్గాలు సూచించబడటమే గాక ప్రతిమార్గం, మిగిలిన మార్గం పట్ల సహనం(tolerant)కలిగినదిగా చెప్పవచ్చు.

ప్రాచీన భారతీయులు, తత్వ శాస్త్రాభివృద్ధికి, ఎంతో దోహద పడ్డారు. వివిధ భావ సాంప్రదాయాలు, వివిధ మార్గాలలో మోక్ష సాధనను బోధించాయి. ప్రతి సాంప్రదాయం భారతదేశం తత్వశాస్త్రాన్ని పరిపుష్టం చేశాయి.

## పాఠ్య ప్రశ్నలు 25.బి

1. క్రీ.శ 1543లో పోలెండ్ శాస్త్రజ్ఞుడు, కోపర్నికస్, గ్రహాలు సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తాయని చెప్పాడు. ఈ అభిప్రాయాన్ని చాలా ముందుగానే చెప్పిన భారత గణితవేత్త ఎవరు?

2. క్రింది వానిలో ప్రతిదానికి ప్రాచీన భారతదేశం నుండి ఒక ఉదాహరణ నివ్వండి.

1. సంస్కృత వ్యాకరణ గ్రంధం

2. తత్వశాస్త్ర గ్రంధం

3. మతరహిత సారస్వత గ్రంధం

4. మత సారస్వత గ్రంధం

3. 'తిరుకురల్(Tirukural) నందున్న సారస్వతం ఏరకమైనది?

4. క్రిందటి విభాగం నందు చాందోగ్య ఉపనిషత్తుల నుండి తీసుకోబడిన విషయ సంగ్రహంను మీరు చదివియున్నారు. దాని అర్ధమేమి?

5. ప్రాకృతం వలన వచ్చిన పరిణామం గురించి, భారతదేశ తత్వానికి సంబంధించిన ఏ సాంప్రదాయం చెబుతోంది?

6. లోకాయత తత్వం స్వభావం ఏమిటి?

## 25.7 శిల్పకళ, వాస్తుకళ మరియు చిత్రకళ

(Sculpture, Architecture and Painting)

మతం, భాష, తత్వశాస్త్రం, గణితం మరియు విజ్ఞానశాస్త్రం వంటి వివిధ రంగాలలో ప్రాచీన భారతదేశ పాత్రను గురించి మీరు ఇప్పుడే చదివారు.

ప్రస్తుతం మనం భారతదేశం ప్రముఖ పాత్ర వహించిన మరియొక కళారంగం గురించి చదువుదాం. ఇందు మనం శిల్పకళ, వాస్తుకళ మరియు చిత్రకళలను గూర్చి విస్తృతంగా చర్చిద్దాం.

ప్రాచీన భారత కళావశేషాలు హిందూమతం చేతనో, బౌద్ధమతం వలననో లేక జైనమతం చేతనో స్ఫూర్తిని పొందినవేనని చెప్పవచ్చు. మరియొక గుర్తుంచుకోదగ్గ విషయమేమిటంటే వాస్తు మరియు శిల్పకళా రంగాలలో కూడా ఈ మూడు మతాల మధ్య వారి వారి అభిప్రాయాల పరస్పర మార్పిడి చాలా స్థిరంగా జరిగింది. అంతేగాక ప్రాచీన భారతీయులు వారి స్వదేశీ కళారూపాలకు తరచుగా విదేశీ పద్ధతులు, భావాలను జోడించారు. ఈ విధంగా పరస్పర విలీనం ఫలితంగా వాస్తు, శిల్ప, చిత్రకళలలో అత్యంత చక్కని నమూనాలతో ఒక ప్రత్యేక అనుపమాన రీతిలో అభివృద్ధి చెందాయి.

**శిల్పకళ** (Sculpture)

మన ప్రాచీన భారత శిల్పకళకు సంబంధించిన తొలి నమూనాలు మనకు హరప్పా నాగరికతకు చెందిన అనేక బంకమట్టి(terracotta)వస్తువుల రూపంలో లభ్యమైనాయి. వాటిలో ఖచ్చితంగా మతపరమైన ప్రాధాన్యత కల్గిన అమ్మతల్లి విగ్రహం కూడా ఉంది. హరప్పా నాగరికత అంతమైన నాటి నుండి మౌర్యుల రాకకు ముందు గల కాలంలో శిల్పకళకు సంబంధించి చెప్పుకోదగిన సాక్ష్యాలేమీ లేవు. బహుశా శీతోష్ణస్థితిలో మార్పులు మరియు ఇతర కారణాల వల్ల అవశేషాలు శిధిలమైపోయి లభ్యం కావటం లేదు. మౌర్యుల నాటి నాణ్యమైన అత్యున్నత శిల్ప సంపదను బట్టి వారికాలంలో ఈ కళ సజీవంగా వర్ధిల్లిందని నిరూపించబడింది. జంతు మకుటాలు కల్గిన అశోకుని స్థంభాల వంటి అతి ముఖ్యమైన శిల్ప అవశేషాలు మనకు లభ్యమవుతున్నాయి. మౌర్య శిల్పకళ, పర్షియా నుండి గ్రీకుల సంప్రదాయ శిల్పకళ కూడా సజీవంగా నిలిచింది. మౌర్యానంతర కాలంలో బాసిల్లిన శిల్పకళకు సంబంధించిన అతి ముఖ్యమైన శిల్ప అవశేషాలు బార్హుట్, సాంచి, గయల వద్ద గల బౌద్ద స్థూపాల ముఖద్వారాలపై ప్రహరీ(railing)పై చెక్కించబడినాయి.

మీరు ఇంతకు ముందు చదివినట్లుగా, స్థూపం అనునది బుద్ధుని జ్ఞాపక చిహ్నాలు కలిగిన ఒక ఘనరూపంలో నున్న రాతి నిర్మాణం. దీని చుట్టూ సాధారణంగా బుద్ధుని చరిత్రకు సంబంధించిన అంశాలు, జాతక కధలు మరియు దైనందిన జీవితానికి చెందిన అంశాలు చెక్కబడియున్న ఒక ఎత్తైన(కంచె) ప్రహరీ(railing)నిర్మించబడి ఉంటుంది. ఇచ్చట బుద్ధనికి సంబంధించి ప్రతిమలు లభించలేదు. కాబట్టి సాంచి స్థూపంపై హీనయానానికి లేక బౌద్ధమతానికి చెందిన తొలినాళ్ళకు చెందిన చిత్రాలున్నాయి. దీనికి బదులుగా, పాదముద్రలు, బోధివృక్షం, ఒక ఖాళీ సింహాసనం లాంటి గుర్తులు బుద్ధుని గూర్చి తెలుపుతున్నాయి. ఆ తర్వాత మహాయాన బౌద్ధమతం వ్యాప్తి చెందటంతో స్థూపాలు, బుద్ధని ప్రతిమలు(మూర్తులు)తో అలంకరించబడ్డాయి. మౌర్యుల తర్వాతి కాలంలో గాంధార శిల్పకళా సంప్రదాయం (Gandhara school of art) మరియు మధుర శిల్పకళా సంప్రదాయం(Mathura school of art) అనే రెండు సంప్రదాయాలు భాసిల్లినాయి. ఈ రెండు అంశాల గురించి తర్వాతి పాఠాలలో విపులంగా చదువుతాం.

శాతవాహనుల కాలంలో అమరావతి ప్రాంతంలో అనేక స్థూపాలు నిర్మించబడ్డాయి. నాగార్జున కొండ వద్ద ఉన్న శిల్పాల ద్వారా కూడా బుద్ధుని చరిత్ర గురించిన వివరాలు తెలుస్తున్నాయి. గుప్తుల కాలంలో బోధ చేయుచున్న బుద్ధుని(Preaching Buddha)మరియు నిలిచి ఉన్న బుద్ధ(Standing Buddha)శిల్పాలున్న కళారూపాలు సారనాథ్‌లో లభ్యమగుచున్నవి. అ అత్యుత్తమ కళాఖండాలు గుప్తుల యొక్క ఒక భావనను చిత్రీకరిస్తున్నాయి. దేవఘడ్(Devagadh)లోని

దశావతార ఆలయంలో చెక్కబడిన శిల్పాలు మరొక భావనను అనగా హిందూదేవతలు మరియు పురాణ దృశ్యాలను సూచిస్తున్నాయి.

ఉత్తర భారతంలో వలెనే దక్షిణ భారతంలో కూడా శిల్పకళ అభివృద్ధి సాధించింది. దక్షిణ భారతంలో చాళుక్యుల శిల్పాకళా నైపుణ్యాన్ని చాటి చెప్పే దేవాలయాలు ఐహోల్(Aihole)మరియు బాదామిల వద్ద నిర్మించబడ్డాయి. వీటిలో అయహోల్ వద్ద లడ్ఖాన్ (Ladhkhan)మరియు దుర్గా మాతాలయాలు, పట్టదకల్ వద్ద పాపనాధ మరియు విరూపాక్ష దేవాలయాలున్నాయి. పల్లవరాజుల శిల్పకళా నైపుణ్యానికి ప్రతీకలైన మహాబలిపురం వద్ద నిర్మించబడిన రాతి ఆలయాలు చాలా ముఖ్యమైనది. ఇంకా, పల్లవులు తీరదేవాలయం(Share temple)వంటి చక్కటి కళానైపుణ్యాన్ని సూచించే ఆలయాలను నిర్మించారు. కైలాసనాధ దేవాలయం(Kailash nath temple)మరియు వైకుంఠ పెరుమాళ్(Vaikunta perumal) దేవాలయాలపై చెక్కబడిన పురాణ దృశ్యాలు మరియు ఆభరణాలు ఆకృతులు భారతదేశంలోని చక్కటి శిల్పకళా ప్రాభవానికి సూచికలు. హోయసాలుల ఆలయాలు కూడా శిల్ప కళా నైపుణ్యాన్ని సూచిస్తున్నాయి. ప్రఖ్యాతి గాంచిన హాలిబీడు వద్ద నిర్మించబడిన హొయసాలేశ్వర ఆలయం (Hoyasaleswara temple) మూలభాగం(base) అసంఖ్యాక దృశ్యాలు, ఆకృతులతో అలంకరించబడింది.

వీనితోపాటు క్రీ.శ తొలి శతాబ్ధాల నాటి గ్రీకు శైలికి చెందిన లోహ సంబంధమైన అనేక(works)కళారీతులు వాయువ్య భారతదేశంలో లభించాయి.

### గాంధార మరియు మధుర కళా సంప్రదాయాలు :

భారతదేశంలో ప్రాచీనకాలంలో వివిధ కళారంగాలలో మనం సాధించిన ప్రగతిని గురించి చదవడానికి ముందు, మనం గతంలో మనదేశంలో పుట్టి, ఆ తర్వాత విరాజిల్లిన రెండు శిల్పకళా సంప్రదాయాలైన గాంధార మరియు మధుర శిల్పకళా సంప్రదాయాల గురించి అధ్యయనం చేద్దాం. ఈ రెండు సంప్రదాయాలు మన ప్రాచీన సంస్కృతి అభివృద్ధికి ఎంతో దోహదం చేశాయి.

గాంధార కళనే గ్రీకో–రోమన్(Greeco-Roman),గ్రీకో–బౌద్ధ(Greeco-Buddhist), ఇండో–గ్రీకు(Indo-Greek) కళలుగా పేర్కొనవచ్చు. దీనిపై రోమన్ మరియు గ్రీకు కళల ప్రభావం పడటమే దానికి కారణం. శకులు మరియు కుషాణులు ఈ సాంప్రదాయాన్నే ఆదరించారు. బుద్ధుని యొక్క మొట్టమొదటి మానవరూప విగ్రహాలు గాంధార శైలిలో తయారు చేయబడ్డాయి. ఈ కళ మనదేశంలోని వాయువ్య ప్రాంతంలోని గాంధార అనే ప్రాంతంలో విరాజిల్లింది. బంకమట్టితో తయారుచేయబడిన అనేక బుద్ధ ప్రతిమలు బీమరాన్(Bimaran), షా–జి–కీ–దేరి(Sha-ji-ki-dheri), హడ్డా(Hadda), మరియు తక్షశిల(Taxila)ప్రాంతాలలో లభించాయి. గాంధార సాంప్రదాయం యొక్క ముఖ్యలక్షణం మానవ చిత్రాలను వాస్తవంగా చూపించడమే. ఈ గాంధార కళా సాంప్రదాయం భారత శిల్పకళా సంప్రదాయాలలో అత్యున్నత సంప్రదాయంగా గుర్తించబడటమే గాక, ఈ శైలిలో నిర్మించబడిన బుద్ధుని ప్రతిమలు భారతకళకు సంబంధించిన అత్యున్నత ఉదాహరణలుగా పరిగణించబడుతున్నాయి.

మధుర శిల్పకళా సంప్రదాయం క్రీ.శ 1వ శతాబ్ధంలో పుట్టినట్లుగా ఆధారాలు లభ్యమయ్యాయి. ఈ సంప్రదాయం ఎంతగా విరాజిల్లిందో,ఈ మధుర కళారీతిలో నిర్మించబడ్డ ప్రతిమలు తక్షశిల, పశ్చిమాన మధ్య ఆసియా, తూర్పునందు సరస్వతి మరియు సారనాధ్‌లకు ఎగుమతి చేయబడటాన్ని బట్టి అర్ధమౌతుంది. భారతదేశమంతటా ఆరామాలలో ఇది ప్రతిష్ఠించబడ్డాయి. గాంధార సంప్రదాయానికి భిన్నంగా, మధుర కళారీతిలో నిర్మించబడిన ప్రతిమ ఎర్ర ఇసుక

రాతి(sandstone)తో తయారుచేయబడి ఆ తర్వాత నునుపు చేయబడ్డాయి. గాంధార కళా ప్రతిమలు జీవకళను ప్రతిబింబిస్తుంటే, మధుర కళా ప్రతిమలు, భక్తులలో అత్యంత భక్తి ప్రపత్తులను రేకెత్తించే విధంగా దైవత్వాన్ని సూచించే గాంభీర్యతను వ్యక్తపరిచే విధంగా ఉంటాయి. ప్రఖ్యాతి గాంచిన 'శిరస్సులేని కనిష్కుని విగ్రహం', 'మధుర నగరాజ', నిల్చున్న యక్షిణి'లతో నిర్మించబడిన అనేక బుద్ధుని మరియు బోధిసత్త్వుని ప్రతిమలు, యక్షులు మరియు యక్షిణులు ఈ సంప్రదాయానికి చెందినవే. మధుర శిల్పులచే చెక్కబడిన ధ్యానంలో ఉన్న పద్మాసన(Cross legged), తీర్థంకరుల విగ్రహాలను చూసిన మీదట, బహుశా ఈ సంప్రదాయం తొలిరోజులలో జైనమతం చే స్ఫూర్తిని పొంది ఉంటుందని భావించబడుతోంది.

ప్రాచీన భారతదేశపు కళపై మతం చాలా గొప్ప ప్రభావాన్ని చూపింది. బార్హుత్ మరియు సాంచిలలో లభ్యమైన చక్కని శిల్పాలు బుద్ధుని బోధనలతో కూడి ఉన్నాయి. గుప్తుల కాలంలో దేవాలయాలపై హిందూ పౌరాణిక దృశ్యాలు చెక్కబడ్డాయి. దక్షిణ భారత సామ్రాజ్యాలు కూడా దేవాలయాల నిర్మాణం పై చాలా వనరులను ఖర్చు చేశాయి.

**వాస్తుకళ** (Architecture) :

ప్రాచీన భారతీయ వాస్తుకళ చరిత్ర, హరప్పా నాగరికతలో ఇటుకలతో నిర్మితమైన భవనాలతో మొదలవుతుంది. శిల్పకళకు లాగానే ఈ కళయందు కూడా రాతిని చాలా తక్కువగా ఉపయోగించడం వల్లనేమో, హరప్పా నాగరికత, మౌర్యుల కాలాలకు మధ్య వాస్తుకళా అవశేషాలు మనకు పెద్దగా లభ్యం కాలేదు.

బౌద్ధమతం బహుళ ప్రాచుర్యం పొందటంతో దీని ప్రభావం ప్రాచీన భారతదేశం వాస్తుకళపై కూడా పడింది. అశోకుడు, కనిష్కుడు వంటి రాజులు అనేక బౌద్ధ స్థూపాలను నిర్మించారు. నిజానికి, మౌర్యులు, గుప్తుల కాలాలకు మధ్య కాలంలో బౌద్ధ వాస్తుకళపై చాలా సంపద ఖర్చు పెట్టబడింది. ప్రత్యేకంగా బార్హుత్, సాంచి మరియు అమరావతి స్థూపాలు చాలా ప్రసిద్ధి గాంచాయి. వీటితోపాటు బౌద్ధ మతస్థులు తక్షశిల మరియు నలందల వద్ద అనేక బౌద్ధ విహారాలు, విశ్వవిద్యాలయాలను కూడా నిర్మించారు. బౌద్ధ మరియు జైన మతాల ప్రభావం రాతి గుహలపై కూడా పడింది. మతపరమైన కార్యకలాపాలతో నిమగ్నమై ఉండే బౌద్ధ, జైనమత సన్యాసులు ఈ గుహలలో ఆశ్రయం పొందేవారు. గయవద్ద గల బర్బార్(Barbar)కొండల గుహలు, ఒరిస్సాలోని ఉదయగిరి(Udayagiri) ఖండగిరి(khandagiri)కొండ గుహాలు, ఎల్లోరా గుహలు, నాసిక్ మరియు అజంతా గుహలు, ప్రాచీన భారతీయ వాస్తుకళకు ప్రతీకలుగా నిలిచాయి.

గుప్తుల కాలం నుండి మనం ఊర్ధ్వరేఖాకృతిలో సాధారణ శైలిలో నున్న దేవాలయాలను కనుగొనవచ్చు. సాంచివద్ద, ఒక సాధారణ చతురస్రాకార గది ఆధారంగా ఒక మండపం నిర్మించబడగా స్తంభాలపైన గంట ఆకారపు ఇనుప శిఖరాలు కలిగిన సాధారణ శైలి(free standing)లో నిర్మించిన దేవాలయాన్ని మనం చూడవచ్చు. గుప్తుల కాలంలో ప్రథమ దేవాలయాన్ని మధ్యప్రదేశ్‌లోని దేవఘుర్(Devagarh)లో చూడవచ్చు. ఇచ్చట మనం అనంతనాద(శేషసాయి)పై పవళించి ఉన్న విష్ణుమూర్తి ప్రతిమ చూడవచ్చు. ఈ మొత్తం విగ్రహం రాతితో నిర్మించగా రాతిస్తంభాల వివిధ వ్రాతలు చెక్కబడిన అనేక ఆకృతులు కలిగిఉన్నవి.

భారతీయ దేవాలయ వాస్తుకళ ప్రధానంగా రెండు శైలులలో ఉన్నది. అవి ఉత్తర భారతదేశ శైలి మరియు దక్షిణ భారతశైలి. దక్షిణ భారతదేశంలో దేవాలయాల నిర్మాణాన్ని ఎక్కువగా ప్రోత్సహించిన రాజులు పల్లవులు మరియు చాళుక్యులు. మహామల్లిపురం(మహాబలిపురం), బాదామి మరియు అయహోల్‌ల వద్ద చక్కని దేవాలయాలు నిర్మించారు.

వీటిలో అత్యంత అందమైనది మహామల్లపురం వద్ద నిర్మించబడిన తీరదేవాలయం మరియు కైలాసనాథ దేవాలయాలు ఆ తర్వాత కాలంలో చోళ వంశస్తులు దేవాలయ వాస్తుకళను ఆదరించి అభివృద్ధి పరిచారు.

**చిత్రకళ** (Painting) :

ప్రాచీన భారతదేశంలో చిత్రకళ బాగా అభివృద్ధి చెందిందని, మనకు అనేక సారస్వత ఆధారాల(ఉదా॥కాళిదాసు రచనలలో "చిత్రశాలలు" లేక ఆర్ట్‌గాలరీలు ఉదాహరించబడ్డాయి) ద్వారా తెలుస్తోంది. ప్రస్తుతం మనకు లభ్యమవుతున్న కొన్ని చిత్రాలు ఈ అభిప్రాయాన్ని దృఢపరుస్తున్నాయి. మానవ నాగరికత మొదలైన కాలం నుండి మానవునికి చిత్రకళ గురించి తెలుసు. మనకు కొన్ని గుహలలో లభ్యమైన కుడ్యచిత్రాల నమూనాలు మనకు లభించాయి. ఉదాహరణకు మధ్యప్రదేశ్‌లోని రాతియుగం నాటి భీంబెక్తా(Bhimbhekha)గుహాలు. కాలం గడిచేకొలదీ ఈ కళ పరిణతి చెంది, ఇంకొంత మెరుగుపడింది. అజంతా మరియు ఎల్లోరా గుహల గోడలమీది చిత్రాలు(కుడ్యచిత్రాలు) చాలా ప్రసిద్ధి గాంచినవి. వీనిలో ఎక్కువ చిత్రాలు ప్రాచీన కాలంనాటి సామాజిక పరిస్థితులను ప్రతిబింబిస్తున్నప్పటికీ, మతానికి సంబంధించిన అంశాలను కూడా గమనించవచ్చు. ఈ చిత్రాలలో ఉపయోగించిన రంగులు నేటికీ చాలా కాంతివంతంగా, వివరణాత్మకంగా(glossy)ఉండటాన్ని బట్టి ఈ కళ యొక్క ఉన్నతస్థాయిని మనం గమనించవచ్చు. అజంతా, ఎల్లోరాలతో పాటు, మనకు బాగ్‌గుహల చిత్రాలు మరియు దక్షిణ భారతదేశంలోని తంజావూరులో గల రాజరాజేశ్వర(బృహదీశ్వర) ఆలయంలో వేయబడిన చిత్రాలు మనకు లభించుచున్నవి.

భారతదేశంలో ప్రాచీన కాలంలో వాస్తుకళా సంపత్తికి నిదర్శనాలుగా స్తూపాలు, విహారాలు మరియు ఆలయాలు నిలిచాయి. వాస్తుకళా సంపదకు సాక్ష్యాలు లోపించడానికి కారణం శీతోష్ణస్థితి మరియు కాలాలను కారణాలుగా చెప్పవచ్చు. చిత్రకళకు (paintings)కు సంబందించనంత వరకు, అజంతా మరియు బాగ్ గుహలు మంచి ఉదాహరణలు.

### పాఠ్య ప్రశ్నలు 25.సి

1. సరియైన సమాధానాన్ని ఎంపిక చేసి, ఖాళీలను నింపండి.

   i అశోకుని శిలా స్తంభాలలో(columns) __________________శిల్పకళా భావాలు కనిపిస్తాయి. (ఈజిప్టువారి, పర్షియావారి, చైనావారి)

   ii స్తూపము__________________ మతానికి సబంధించిన నిర్మాణం. (హిందూ, జైన, బౌద్ధ)

   iii సాంచీ వద్ద గల ఊర్ధ్వ, సాధారణ శైలిలో నిర్మించిన దేవాలయం __________________ కాలానికి చెందినది. (పూర్వ చారిత్రక, శాతవాహనుల, శకుల)

2. హీనయాన బౌద్ధమతం మరియు మహాయాన బౌద్ధ మతాలకు చెందిన శిల్ప కళలకు గల భేదమేమి?
3. ప్రాచీన భారతంలో 'కళ'ను ప్రభావితం చేసిన ఏకైక కారకం ఏమిటి?
4. మధుర శిల్పకళా సంప్రదాయానికి చెందిన ప్రతిమలలో ఎక్కువ భాగం ఏ పదార్థంతో తయారు చేయబడ్డాయి?

### సారాంశం :

మన సాంస్కృతిక వారసత్వ సంపదకు ప్రాచీనకాలం ఎంతగానో దోహదం చేసింది. ఆ రోజులలో గల ఉన్నత స్థాయి సారస్వతం మరియు కళా వైభవానికి సంబంధించి మనకు అనేక సాక్ష్యాలు లభ్యమైనాయి. జీవితంలోని

అధిక భావనలు మతంచే ప్రభావితం చేయబడతాయి. భారతదేశ ప్రాచీన కాలంలో గల పెద్దవైన హిందూ, బౌద్ధ మరియు జైన మతాలను వేర్వేరు రాజులు ఆదరించారు. అయితే వీరి పరమత సహనం వలన, ఆయా మతాల మధ్య తత్వం మరియు కళల యందు పరస్పరం ఇచ్చిపుచ్చుకునే ధోరణి కన్పించింది. తొలి శతాబ్దాలలో భారతదేశంలోకి ప్రవేశించిన క్రైస్తవ మతం కూడా భారతదేశ చరిత్రను ప్రభావితం చేసింది.

ప్రాచీన భారతీయులు గణితం మరియు విజ్ఞానశాస్త్ర రంగాలలో లోతుగా అధ్యయనం సాగించారు. ఆర్యభట్ట, వరాహమిహిరుడు లాంటి గణిత మేధావులు నేటికీ ఆమోదయోగ్యమైన కొన్ని గణిత సిద్ధాంతాలను ప్రతిపాదించారు. వైద్యరంగం నందు కూడా గొప్ప అభివృద్ధి సాధించబడి, అనేక వ్యాధులకు మందులు కలిపెట్టబడినాయి. మన ప్రాచీనులు రసాయన శాస్త్రం, ఖగోళ శాస్త్రం, జ్యోతిష్యశాస్త్రాలలో కూడా మంచి పరిజ్ఞానాన్ని సాధించారు. ఈ కాలంలోనే అసంఖ్యాకంగా మత మరియు లౌకిక గ్రంధాలు వ్రాయబడినాయి. వీనిలో ఎక్కువ రచనలు నేటికీ ప్రముఖంగా అధ్యయనం చేయబడుతూ అనేక భారతీయ భాషల్లోకి అనువదించబడ్డాయి. ఈ రచనలకు రామాయణం, మహాభారతం, అభిజ్ఞాన శాకుంతలం, ముద్రరాక్షసం, తిరుకురల్ (Tirukural) కొన్ని ముఖ్య ఉదాహరణలు. ప్రాచీన ప్రజలు కూడా వారి సమయంలో ఎక్కువ భాగాన్ని తత్వ శాస్త్రానికి అంకితం చేశారు. అనేక భావ సంప్రదాయాలు అభివృద్ధి చెందాయి. సద్దర్శన అనేది ఆరు రకాల భావ సంప్రదాయాలుగా చెప్పవచ్చును. దీంతోపాటు భౌతిక(materialistic)మరియు ఆదర్శ(idealistic) సంప్రదాయాలు మోక్ష సాధనకు భిన్న మార్గాలను సూచించాయి. అయితే అన్ని సంప్రదాయాలు పరస్పర సహనాన్ని పాటించాయి. భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో లభించిన అనేక శిల్పకళా ఖండాలు ప్రాచీన కాలపు కళానైపుణ్యం, చక్కని పనితనానికి ఉదాహరణలుగా నిలుస్తున్నవి. గాంధార మరియు మధుర శిల్పకళా శైలికి చెందిన భిన్నమైన అనేక బుద్ధ ప్రతిమలు మనకు లభించాయి. ఉత్తర మరియు దక్షిణ భారత రాజ్యాల నేలిన రాజులు స్తూపాలను మరియు దేవాలయాలను అసంఖ్యాకంగా నిర్మించారు. సాంచి, అమరావతి స్థూపాల చుట్టూ అలంకరించబడిన స్తంభాలపై జాతక కథలు చెక్కబడ్డాయి. హిందూ దేవీ దేవతలకు సంబంధించిన శిల్పాలకు దేవఘర్ దేవాలయం ఒక చక్కటి ఉదాహరణగా పేర్కొనవచ్చు. జైన శిల్పాలు ఎక్కువగా రాళ్ళపై చూడవచ్చు. దక్షిణ భారతదేశంలో చాళుక్యులు, పల్లవులు అయహోల్ మరియు కాంచీపురం వద్ద దేవాలయాలు నిర్మించారు. చోళులు కూడా వాస్తుకళను ప్రోత్సహించారు. అజంతా చిత్రాలు, మన ప్రాచీన కళాకారుల అత్యున్నత స్థాయిని సూచించే ప్రతీకలుగా చెప్పవచ్చు.

## అభ్యాసం

1. క్రింద ఇవ్వబడిన ప్రశ్నలకు 50 కంటే ఎక్కువ పదాలలో సమాధాన మివ్వండి.
   i) గొండొపెర్నెస్ పాలనాకాలంలో సెయింట్ థామస్ భారత సందర్శన భారతదేశ సామాజిక పరిణామ క్రమాలలో ఒక ముఖ్యఘట్టంగా ఎందుకు భావించబడుతోంది?
   ii) మత సారస్వతం మరియు మత లౌకిక సారస్వతాల మధ్యగల భేదమేమి?
   iii) బౌద్ధ మరియు జైన మతాలలో ఒక్కొక్కటి రెండు ప్రధాన శాఖలుగా చీలిపోయినాయి. అవిఏవి?
2. ప్రాచీన భారతదేశంలో బౌద్ధ మరియు జైన మతాలు ప్రధాన మతాలై ఉన్నాయి. నేడు ఈ మతాలకు హిందూమతంతో గల సంబందాన్ని తెల్పండి.
3. ప్రాచీన భారత గణిత మేధావులు మరియు శాస్త్రజ్ఞులు సాధించిన ప్రగతి వెలకట్టలేనిది. ఎందువల్ల?

4. ఉత్తర మరియు దక్షిణ భారతదేశంలో ప్రాచీన కాలంలో జరిగిన సారస్వతాభివృద్ధిని చర్చించండి.
5. ప్రాచీన భారతదేశంలో అభివృద్ధి చెందిన వివిధ తత్వశాస్త్ర సంప్రదాయాలు ఏవి? ఈ సంప్రదాయాల ప్రధాన అంశాలను వివరించండి.
6. ప్రాచీన భారతదేశంలో వాస్తు, శిల్ప, చిత్రకళలలో జరిగిన అభివృద్ధిని చర్చించండి.

**కృత్యం :**

భారతదేశంలోని ప్రముఖ చర్చీల చిత్రాలతో ఆల్బమ్ తయారుచేయండి. వీలైతే ఆయా చర్చిలు స్థాపించబడిన తేదీలను ఇవ్వండి.

## పాఠ్య ప్రశ్నలకు సమాధానాలు :

**25.ఎ**

1) క్రీ.శ మొదటి శతాబ్ధం నుండి
2) పాత మరియు కొత్త నిబంధనలు
3) విద్య మరియు ఆసుపత్రులు (సంక్షేమం)
4) ఈ రోజున యేసుక్రీస్తు జన్మించాడు

**25.బి**

i) ఆర్యభట్ట ii) అష్టాధ్యాయ

iii) ఉపనిషత్తులు iv) అభిజ్ఞాన శాకుంతలం

v) రామాయణం, మహాభారతం

3. సామెతలు మరియు బోధనలు
4. బ్రాహ్మణం (వాస్తవం లేక సారాంశం) ఆత్మ లేక అహం రూపంలో ఉంటుంది.
5. సాంఖ్య
6. మానవుల ముఖ్య లక్షణం ఇహలోక సుఖాలను ఆనందించే విధంగా ఉండాలి.

**25.సి**

1. i. పర్షియన్ ii. బౌద్ధ మతం iii. గుప్త iv. పూర్వచారిత్రక
2. హీనయాన శిల్పకళ బుద్ధుని తెలుపుటకు కేవలం కొన్ని సంజ్ఞలు ఉపయోగించింది. మహాయన శిల్పకళ బుద్ధుని యొక్క ప్రతిమలు ఉపయోగించింది.
3. మతం
4. ఎర్ర ఇసుకరాయి (Red sand stone)

ఈ క్రింద ఇవ్వబడిన చిత్రం బార్హుత్ స్థూపం తాలూకు శిల్పమునకు చెందినది. ఆ శిల్పం సువర్ణమృగ(suvaranamriga) జాతక కథను తెలుపుతున్నది. కథను చదివి, శిల్పమును చూచి క్రింద అడిగిన ప్రశ్నలకు సమాధానములు వ్రాయము.

ఒకానొకప్పుడు బ్రహ్మదత్తుడు బెనారస్‌ను పాలిస్తున్న కాలంలో బోధిసత్వుడు ఒక యువ దుప్పిగా జన్మించి బంగారు వర్ణంలో చక్కని, ముచ్చటైన జంతువుగా పెరగసాగాడు. తన స్నేహితురాలైన జింకకూడా అందమైనదే. వారిద్దరు సంతోషంగా కలిసి మెలిసి జీవించసాగారు. ఎనిమిది, మచ్చల జింకలు కూడా బోధిసత్వుని గుంపులో కలిసి జీవించసాగాయి. ఆ విధంగా వారు నివసించుచున్న సమయంలో ఒక వేటగాడు వాటిపై వలపన్నెను. ఒకనాడు బోధిసత్వుడు తన సమూహమును నడుపుకొని వెళ్ళుచుండగా తన పాదం వలలో చిక్కుకుంది.



అపుడు ఆడజింక తన ప్రభువును భయపడవద్దని ఇలా అంది. "నేను నా శక్తితో వేటగాణ్ణి అవసరమయితే నీ బదులు నా జీవితాన్నర్పించి ఒప్పించి నిన్ను కాపాడుకుంటాను"అంది. వేటగాడు ఖడ్గం, చేతిలో బల్లెముతో దగ్గరకు రాగానే ఆ జింక నమస్కరించి ఇలా అంది. ఓ మహానుభావా! నా భర్త బంగారు రంగు కలిగిన సద్గుణ సంపన్నుడు. ఎనిమిది జింకపిల్లలకు రాజు". ఆవిధంగా బోధిసత్వుని సద్గుణాలను పొగుడుతూ తనను చంపమని అర్థించి రాజును విడిచిపెట్టమని కోరింది.

అది విని ఆశ్చర్య చకితుడైన వేటగాడు "మానవమాత్రులు కూడా తమ రాజు కొరకు ప్రాణాలర్పించరు. మరి మానవుల కంటే చాలా తక్కువైన ఈ జంతువు ఏమిటి ఇలా? దీని అర్ధమేమిటి? ఈ జంతువు మానవుల భాషలో చక్కగా మాట్లాడుచున్నది. ఈ రోజు ఆ జింకకు, దాని సహచరుడికి జీవితాన్నిస్తాను" అని అనుకుని ఆమె మాటలకు కడు సంతసించిన వేటగాడు ఆ జింకను, దాని సహచరుణ్ణి వదలివేస్తున్నట్లు చెప్పెను.

ఆడజింక మరియు బోధిసత్వుడు ఇలా తలచాయి. " ఈ వేటగాడు మనకు మరియు ఎనిమిది జింకలకు జీవితాన్నిచ్చాడు. అతడే మనకు రక్షకుడయ్యాడు. అతని రుణం తీర్చుకోవలసిన అవసరం ఉంది". సద్గుణ సంపన్నుడైన ఆ పాత్రలో బోధిసత్వుడు ఇలా అనుకున్నాడు. "ఉపకారికి సరైన రీతిలో ప్రత్యుపకారం చేయాలి" ఆ విధంగా తలచిన అతడు వేటగాడికి, వారికి ఆహార క్షేత్రంలో దొరికిన ఒక అద్భుత రత్నమునిచ్చి మిత్రమా ఇకముందు ఎవరినీ చంపవద్దు. నీవు భార్య పిల్లలతో కుటుంబీకుడవుకమ్ము. దానధర్మాలు చేయి, మంచి పనులు చేయి", అని చెప్పి అడవిలో మాయమైంది.

1. ఈ జాతక కథ చదివిన తర్వాత బుద్ధుని ముఖ్య బోధన ఏమై ఉంటుందని నీవు తలచుచున్నావు?
2. ' అహింస' అనే భావన అర్ధం ఏమిటి?
3. జంతువులు, బలులు(యాగాలు), వేట, ఇతరులను గాయపరచుట వంటి వాటిపట్ల బౌద్ధ దృక్పథం ఏమిటి?

## పంచతంత్రం నుండి ఒక కథ

'పంచతంత్రం' అనేది నేటికీ అందరిచేత చదువబడుచున్న కథాసంకలనం. ఈ క్రింద ఇవ్వబడిన పంచతంత్ర కథను చదివి దాని అర్థం వ్రాయుము.

ఎవరైనా మాటకారియైన మోసకారిని తనవాడని నమ్మితే మేకను పోగొట్టుకున్న బ్రాహ్మణునివలె మోసపోవలసిందే

'అది ఎట్లు జరిగింది' అని రాజు అడిగాడు

మేఘవర్మ ఇలా చెప్పసాగాడు. " యజ్ఞాలకు పేరొందిన ఒక బ్రాహ్మణుడుండేవాడు. ఒకసారి అతడు ఒక గ్రామానికి వెళ్ళి యాగానికి ఒక మేకను కొన్నాడు. అతడు దానిని భుజంపైన నెత్తుకొని ఇంటికి కొనిపోవుచుండగా అతనిని ముగ్గురు మోసకారులు చూశారు. వారు తమలో తాము" మనం ఎలాగైనా ఒక పన్నాగం పన్ని ఈ మేకను దక్కించుకోవాలి. అని అనుకున్నారు. ఆ విధంగా ఆలోచించి వారు ఒక్కొక్క కోసు (2మైళ్ళు) దూరంలో ఒక్కొక్క చెట్టుక్రింద ఉన్నారు. బ్రాహ్మణుడు వెళుతూ ఉండగా మొదటి మోసగాడు "ఓ బ్రాహ్మణుడా నీవు ఎందుకు ఒక కుక్కను నీ వీపుపై మోయుచున్నావు" అని అడిగెను. దానికి బ్రాహ్మణుడు 'ఇది కుక్క కాదు, మేక. దీనిని యజ్ఞం కోసం కొనిపోవుచున్నాను' అని బదులిచ్చెను.

తర్వాత మరొక మోసగాడు కూడా అదేవిధంగా అన్నాడు. ఈసారి బ్రాహ్మణుడు తన భుజం మీదున్న మేకను క్రిందకి దించి దానిని తీక్షణంగా చూచి తన భుజాన వేసుకొని బయలుదేరాడు. తన మనసు ఊయలవలె భ్రమించుచుండెను. అంటే మోసగాళ్ళ మాటలు సత్పురుషుని మనసును కూడా భ్రమింపజేస్తాయి.

ఈలోగా బ్రాహ్మణుడు మూడవ మోసగాడి దగ్గరకు వచ్చాడు. అతడు కూడా అదేవిధంగా చెప్పాడు. ఈసారి తన జ్ఞానేంద్రియాలు లోపభూయిష్టమైనవ"ని నిర్ణయించుకున్నాడు. కావున అతడు ఆ మేకను అక్కడే వదలి ప్రక్షాళనగావించుకొని ఇంటికి చేరాడు. ఇదిలా ఉండగా మోసగాళ్ళు మేకను తీసుకొనిపోయి సంతోషంగా భుజించి ఇలా అనుకున్నారు.

| ఎవరైనా మాటకారియైన మోసకారిని తనవాడని నమ్మితే మేకను పోగొట్టుకున్న బ్రాహ్మణునివలె మోసపోవలసిందే |
|---|

**ఈ క్రింది సాంచి స్తూపం. ఈ బొమ్మలను చూచి ప్రశ్నలకు జవాబులు వ్రాయుము.**



1. స్తూపమును ఎట్లు వర్ణిస్తావు?

2. ఈ స్తూపం ఏ ఆకారంలో ఉన్నది?

3. ఈ స్తూపమును నిర్మించటానికి ఏ పదార్థం వాడినారు?



4. తోరణం మరియు ప్రహరీ పై గల అలంకరణలను వర్ణించుము.

5. బౌద్ధమతం భారతదేశం నుండి ఇతర దేశాలకు వ్యాపించింది వాటి పేర్లేమి?

6. భారతదేశంలో గల నాలుగు ముఖ్యమైన బౌద్ధమత యాత్రా స్థలాల పేర్లు వ్రాయుము.

## శిలప్పదికారం

(Silappadigaram)

ప్రముఖ తమిళ ఇతిహాసం 'శిలపుదికారం' గురించి మీరు చదివారు. ఆ ఇతిహాస ముఖ్య రూపాన్ని ఈ క్రింద ఇవ్వటం జరిగింది.

పుగార్ లేక కావేరి నగరంలో ఒక ధనవంతుడైన వ్యాపారి కుమారుడైన కోవలన్ మరొక వ్యాపారి ముద్దుల కుమార్తె అయిన 'కన్నగి'ని వివాహమాడాడు. కొన్నాళ్ళపాటు ఇద్దరూ కలసి సంతోషంగా జీవితాన్ని గడిపారు. రాజస్థాన్‌లో జరిగిన ఒక ఉత్సవంలో కోమలన్ మాధవి అనే నర్తకిని కలిసి ఆమెతో ప్రేమలో పడ్డాడు. అతడు బుద్ధిహీనుడై వ్యవసపరుడై ఆ నర్తకికి బహుమానాలు కొనివ్వటమే గాక కన్నగిని, తన గృహాన్ని మరచిపోయాడు. అచిరకాలంలో తన సంపదనంతా చివరకు కన్నగి నగలను సైతం ఆమెకు అర్పించాడు. చిల్లిగవ్వ మిగలని పశ్చాత్తాపంతో భార్యవద్దకు తిరిగి వచ్చాడు. అదృష్టవశాత్తు ఆమె వద్ద మిగిలిన విలువైన అందెలజతను కన్నగి మనఃపూర్వకంగా తన భర్తకు ఇచ్చింది. వీటితో వారు మదురై మహానగరానికి వెళ్ళి వ్యాపారం చేసి డబ్బు సంపాదించుదామను కున్నారు.

వారు మదురైకి రాగానే ఒక గుడిసెలో నీడ లభించగా, కోమలన్, కన్నగికి చెందిన ఒక అందెను అమ్మటానికి విపణివీధి(market)కి వెళ్ళాడు. కాని పాండ్యరాజుకు నెడుంజెలియన్(nedunjeliyan) రాణికి చెందిన అదే రకమైన అందెను ఆస్థాన స్వర్ణకారుడు ఆ సమయంలోనే దొంగిలించాడు. ఆ స్వర్ణకారుడు కన్నగి అందెతో ఉన్న కోమలన్‌ను చూచి దానిని రాజభటులు తీసుకొని పోగా ఎట్టి విచారణ చేయకుండానే రాజు అతనిని చంపించాడు. ఆ వార్త విన్న కన్నగి మూర్ఛిల్లి వెంటనే తేరుకొని తన కళ్ళు కోపంతో మండుచుండగా, ఆమె తనవద్దనున్న మరొక అందెను తన భర్త నిర్దోషిత్వానికి రుజువుగా చూపుతూ పట్టణంలో ప్రవేశించింది.

కన్నగి ఆ అందెను రాజుకు చూపింది. దానిని రాణికి చెందిన జతలోని రెండవ అందెతో పరీక్షించి చూచిన రాజు కోమలన్ అమాయకుడని గ్రహించాడు.

రాజు, తాను కోమలన్‌ను పొరపాటున శిక్షించానని గ్రహించి రాజు దిగ్భ్రంతో మరణించాడు. కన్నగి మదురై నగరాన్ని శపించిన ఫలితంగా నగరం మొత్తం మంటలంటుకున్నాయి. ఆ నగర దేవత కన్నగిని ప్రార్థించగా శాంతించిన ఆమె తన శాపాన్ని ఉపసంహరించుకొంది. చివరకు కన్నగి నగరాన్ని విడిచివెళ్ళిన తర్వాత కొన్నాళ్ళకే మరణించింది. కాని ఆమె, ఆమె భర్త స్వర్గంలో తిరిగి కలుసుకున్నారు.

### మీకు తెలుసా?

1. ఉత్తర భారతంలో 'రామాయణం' వలె దక్షిణ భారతంలో 'శిలప్పదికారం' ఇతిహాసం సుప్రసిద్ధమైనది.

2. 'శిలపుదికారం' ఇతిహాసం ఆంగ్లంలో 'రత్న కబిత అందె' గా పేరొందింది?

3. కన్నగి 'మహిళా సద్గుణాల రాశి' గా భావించబడుతుంది.

# 26

# భారత్‌లో తురుష్క రాజ్య స్థాపన మరియు మామ్లుక్ సుల్తానులు

## 26.1 పరిచయం

అనాదిగా భారతదేశానికి పశ్చిమ దేశాలకు, ఆగ్నేయాసియాకు చైనాకు వర్తక, సాంస్కృతిక సంబంధాలు కలవని మనం చదివాం. సింధు ప్రజలు సైతం సమకాలీన మెసపటోమియా (ఇరాక్) నాగరికతతో వర్తక సంబంధాలు కలవు. హర్షవర్ధనుని మరణానంతరం భారతదేశం రాజకీయ సమైక్యతను కోల్పోయి అనేక స్వతంత్ర రాజ్యాలు(పెద్దవి, చిన్నవి)గా విభక్తమైంది. ఈ కాలంలో అరబ్ వర్తకులు పశ్చిమతీరంలో స్థిరపడి వర్తక, వాణిజ్యాలు కొనసాగించారు. ఇస్లాం విజృంభణ తరువాత క్రీ.శ.7వ శతాబ్దంలో అరబ్బులు క్రియాశీలక పాత్ర వహించారు.

ఈ పాఠంలో అరేబియాలో ఇస్లాం విజృంభణ, భారత్‌లో ఇస్లాం ప్రవేశం, క్రీ.శ. 712లో అరబ్బుల సింధు విజయం, భారత్‌పై దాని ప్రభావం, ఘజనీ మహమ్మద్ దండయాత్రలు, మహమ్మద్ ఘోరీ ఉత్తర భారతంపై సాగించిన టర్కిష్ దండయాత్ర మరియు మామ్లుక్ సుల్తానులు ఢిల్లీ సుల్తానత్ రాజ్యస్థాపన – మున్నగు అంశాలను చదువుతాం.

## 26.2 లక్ష్యాలు

ఈ పాఠం చదివిన తరువాత ఈ క్రింది విషయాలు తెలుసుకుంటారు.

1. ఇస్లాం వ్యాప్తికి దోహదం చేసిన అరేబియా రాజకీయ పరిస్థితులు.
2. ఇస్లాంను భారత్‌కు తీసుకొని వచ్చుటలో అరబ్ వర్తకుల పాత్ర.
3. క్రీ.శ. 8వ శతాబ్దంలో ఉత్తర భారత రాజకీయ పరిస్థితులు.
4. అరబ్బుల సింధు విజయానికి గల కారణాలు, ఫలితాలు
5. ఘజినీ మహమ్మద్ దండయాత్రలు
6. భారత్‌లో ఘోరీ మహమ్మద్ టర్కిష్ రాజ్యస్థాపనకు దోహదం చేసిన పరిస్థితులు
7. కుతుబుద్దిన్ ఐబక్, ఇల్‌టుట్‌మిష్, రజియా, బాల్బన్‌ల కాలంలో ఢిల్లీ సుల్తానత్ రాజ్య విస్తరణ.

## 26.3 ఇస్లాం విజృంభణ, వ్యాప్తి

ఇస్లాం విజృంభణకు పూర్వం అరబ్బులు బహుదేవతారాధకులు, విగ్రహారాధకులు, జూదరులు, వ్యభిచారులు. వీరు అనేక తెగలుగా విభక్తమై, ప్రతి తెగ ఒక అధిపతి ఆధీనంలో యుండేది. ఈ భూమిలోనే ఇస్లాం మత స్థాపకుడైన

మహమ్మద్ ప్రవక్త (క్రీ.శ. 570–632) జన్మించాడు. ఇస్లాం మత ఆవిర్భావంతో అరబ్బుల రాజకీయ, మత, సామాజిక జీవన విధానం పూర్తిగా మారిపోవుటయే గాక, మిగిలిన ప్రపంచంపై కూడా దాని ప్రభావం ప్రసరించింది. ఇస్లాం, భగవంతుడొక్కడే అతడే 'అల్లా' యని చెబుతుంది. ఖురాన్ దీని పవిత్ర గ్రంథం. ప్రతి ముస్లిం రోజుకు ఐదుసార్లు ప్రార్థన చేయాలని, రంజాన్ మాసంలో ఉపవాసముండి దానధర్మాలు చేయాలని, వీలైతే పవిత్ర మక్కా యాత్ర చేయాలని ఖురాన్ నిర్దేశిస్తుంది. మాంసాహారభక్షణను, జూదాన్ని, మద్యపానం సేవించటాన్ని ఖురాన్ నిషేధిస్తుంది. స్త్రీలకు గౌరవ స్థానాన్ని కల్పిస్తూ, వితంతువులు, అనాథల వారి వారసత్వపు హక్కులపై విస్తృత న్యాయ సూత్రాలను ఖురాన్ వివరించింది.

మహమ్మద్ ప్రవక్త ప్రవచించిన ఇస్లాంను అర్థం చేసుకోవటం, అనుసరించటం సులభం. అనతికాలంలోనే ఇస్లాం అరేబియా అంతటా వ్యాపించి అరబ్బులను సమైక్య పరచి, సంఘటిత శక్తిగా మార్చింది. మహమ్మద్ ప్రవక్త మరణానంతరం (క్రీ.శ.632) ఖలీఫాలు ఇస్లాం మతాధికారులై రాజ్యాధికార విస్తరణను చేపట్టారు.

'కలీఫ్' అనే పదం అరబిక్ పదమైన 'ఖలీఫా' నుండి జనించింది. ఖలీఫా అనగా 'డిప్యూటీ' (ప్రవక్త తరువాతవాడు) అని అర్థము. మహమ్మద్ ప్రవక్త అనంతరం ఇస్లాం వారసత్వాన్ని స్వీకరించిన వారికిచ్చే బిరుదు – "ఖలీఫా"

క్రీ.శ.632–661 సంవత్సరాల మధ్య నలుగురు ఖలీఫాలు ఇస్లాం మతాధికారులైనారు. వీరి నేతృత్వంలో ఇస్లాం వేగవంతంగా వ్యాప్తి చెందుటేగాక, బలీయమైన రాజకీయ శక్తిగా రూపొందింది. అరబ్బులు పశ్చిమాసియా, జోర్డాన్, సిరియా, ఇరాక్, టర్కీ, పర్షియాలనే గాక, ఉత్తర ఆఫ్రికా, దక్షిణ ఐరోపా రాజ్యాలను సైతం జయించారు. క్రీ.శ. 636 నాటికే అరుబ్బుల నౌక బొంబాయి చేరువకు చేరింది. క్రీ.శ. 661–750 సంవత్సరాల మధ్య ఉమ్మయద్ వంశీయులు ఖలీఫాలై ముస్లిం అధికారాన్ని పటిష్టం చేశారు. వీరి నేతృత్వంలో అరబ్ సైన్యం చైనా శిల్కు రహదారిపై ఆధిపత్యం వహించి, భారత్‌పై దాడులు నిర్వహించటానికి వీలు కల్గింది. క్రీ.శ.7వ శతాబ్ది మధ్యభాగం నాటికి అరబ్బులు దక్షిణ ఆఫ్ఘనిస్థానాన్ని జయించి, సింధుపై దృష్టిని మరల్చారు.

క్రీ.శ. ఏడవ శతాబ్దిలో మహమ్మద్ ప్రవక్త అరేబియాలో ఇస్లాం మతాన్ని స్థాపించి, వ్యాపింపచేశాడు. ఇస్లాం అరబ్బులను సమైక్యం చేసి ఒక రాజకీయ శక్తిగా తీర్చిదిద్దింది. ఖలీఫాలు, ఉమ్మయద్‌ల నేతృత్వంలో ఇస్లాం ఇతర దేశాలకు వ్యాప్తి చెందింది. ఖలీఫాలు వ్యాపారాన్ని ప్రోత్సహించుట వలన క్రీ.శ. 7వ శతాబ్ది నుండి అరబ్బులు భారత్‌కు రావటం మొదలైంది.

## 26 ఎ. పాఠ్య ప్రశ్నలు

1. క్రింది వానికి ఒక పదములో సమాధానములిమ్ము
   - i) ____________________. ఇస్లాం మతాన్ని స్థాపించాడు.
   - ii) ____________________. ఇస్లాం పవిత్ర గ్రంథం
   - iii) నల్గురు ఖలీఫాల అనంతరం రాజ్యానికి వచ్చిన రాజవంశం ____________________
2. 'కాలిఫ్' అనగా అర్థమేమి?
3. ఇస్లాం మతవ్యాప్తికి కృషి చేసిన రెండు పేర్లను తెలుపుము.

## 26.4 సింధు విజయం (క్రీ.శ. 712)

క్రీ.శ. 8వ శతాబ్ది తొలి పాదంలో ఉమ్మాయదల అధికారం పరాకాష్టకు చేరుకుంది. వీరు ఇస్లాం మతాన్ని వ్యాప్తి చేయాలనే ఆవేశంతో భారతదేశ సిరి సంపదలను గూర్చి అరబ్ వర్తకులు చెప్పిన కథనాలను విని భారత్‌పై దండెత్తుటకు నిర్ణయించారు. అరబ్బుల సింధు దండయాత్రకు తక్షణ కారణం సింహళ పాలకుడు ఖలీఫా రాజ్యంలోని తూర్పు రాష్ట్రాలకు గవర్నర్‌గా ఉన్న 'హజన్ బిన్ యూసఫ్ సఖాఫీ'కి ఎనిమిది ఓడలలో కానుకలను పంపెను. కాని ఈ నౌకలు సింధునది ముఖద్వారమున దేబల్ రేవు పట్టణమునకు చేరుకోగానే అచట ఓడదొంగలు వారిని దోచుకున్నారు. ఈ వార్త విన్నంతనే హజన్ సింధును పాలించు దాహిర్‌ను ఓడ దొంగలను శిక్షించి తమ నౌకలకు నష్టపరిహారం చెల్లించవలసినదిగా కోరాడు. దాహిర్ ఓడ దొంగలు తమ పరిధిలో లేరని నష్టపరిహారం చెల్లించలేనని నిస్సహాయతను వ్యక్తం చేశాడు. అంతట సింధును జయించడానికి హజన్ పంపిన తొలి రెండు దండయాత్రలు విఫలమయ్యాయి. దీనితో ఉగ్రుడై హజన్ పెద్ద సైన్యమును సమకూర్చి మహమ్మద్‌బీన్ ఖాసిం నేతృత్వంలో మూడవ పర్యాయం సింధుపై దాడికి పంపాడు.

### సంఘటనలు:

క్రీ.శ. 711-712 సంవత్సరాల మధ్య మహమ్మద్‌బీన్ ఖాసిం సింధుకు చేరుకుని దేబల్ రేవు పట్టణమును సునాయాసముగా హస్తగతం చేసుకొన్నాడు. ఆ తదుపరి సింధునదిని దాటి రేవార్ వైపు పురోగమింపగా దాహిర్ సైన్యములు వీరోచితముగా పోరాడినాయి. ఖాసిం ఓటమి తప్పదు అనే సమయంలో దాహిర్ అధిరోహించిన ఏనుగు బాణానికి గురై నేలకూలగా దాహిర్ క్రింద పడిపోయాడు. ఈ సంఘటన తమ రాజు యుద్ధం నుండి పారిపోయాడనే తప్పుడు సంకేతాన్ని సైన్యానికి కలిగించడం వల్ల, ఆత్మ సైన్యం కోల్పోయి దాహిర్ సైన్యం పలాయనం చిత్తగించింది. దీనిని అవకాశంగా తీసుకుని ఖాసిం, దాహిర్‌నేగాక అసంఖ్యాకమైన అతని సైన్యాన్ని కూడా వధించారు. ఈ విజయానంతరం ఖాసిం బ్రాహ్మణాబాద్ వంటి నగరాలను జయిస్తూ సింధును ఆక్రమించాడు.

### ఖాసిం సింధు దండయాత్ర ఫలితాలు:

ఖాసిం దండయాత్రతో సింధు ఆర్థిక వ్యవస్థ చిన్నాభిన్నమైంది. అసంఖ్యాక ప్రజలు, వర్తకులు సింధు విడిచి వెళ్లిపోయారు. ఖాసిం సింధులో అత్యధిక భాగాన్ని జయించి సుస్థిర పాలన ప్రవేశపెట్టాడు. సింధును ఖాసిం మూడు సంవత్సరాలు పాలించాడు. కానీ మాతృదేశంలో కొత్తగా అధికారంలోనికి వచ్చిన ఖలీఫా ఖాసిం పట్ల వ్యతిరేకతతో అతనిని స్వదేశానికి పిలిపించాడు. ఖాసిం వెళ్లిన రెండు సంవత్సరాలకు సింధు ప్రజలు తిరుగుబాటు చేసి అరబ్బులను పారద్రోలిరి. ఈ విధంగా అరబ్బుల సింధు విజయం తాత్కాలికమైన లేన్‌పూల్ పండితుడు నుడివినట్లు "చరిత్రలో సత్ఫలితములీయని ఘన విజయం"గా మిగిలిపోయింది.

కాని అరబ్బుల సింధు విజయం కొన్ని సత్ఫలితములను కలిగించెను. అనేకమంది అరబ్బులు సింధులో స్థిరపడి స్థానికులతో సన్నిహిత సంబంధాలను కలిగియుండిరి. ఈ విషయాన్నే 10వ శతాబ్దిలో సింధు ప్రాంతాన్ని సందర్శించిన భౌగోళిక అన్వేషకుడు, యాత్రికుడైన ఇబెన్‌హకల్ (Ibn Hauqual) ప్రస్తావించాడు. ఇచట హిందువులు, ముస్లింలు కలిసిమెలసి స్నేహపూర్వకంగా మెలగుచున్నారని వీరందరూ అరబిక్, సింధీ భాషలను స్వేచ్ఛగా మాట్లాడేవారని హకల్ పేర్కొన్నాడు. నేటికిని సింధు ప్రాంతంలో అధిక సంఖ్యాకులు ముస్లింలు. వీరి ప్రధాన వృత్తి వ్యాపారం. అరబ్ లిపిలో

సింధీ భాష వ్రాయబడింది.

భారతీయ సంస్కృతితో పరిచయం వలన అరబ్బులు భారతీయ ఖగోళ, గణిత, వైద్య, తత్వ మున్నగు శాస్త్రములను నేర్చుకుని వాటిని అరేబియాలో ప్రవేశపెట్టారు. ఈ దండయాత్ర వలన భారతదేశానికి, పశ్చిమదేశాలకు వర్తక వాణిజ్యాలు బాగా వృద్ధి చెందాయి. క్రీ.శ. 12వ శతాబ్ది వరకు ఈ ప్రాంత ఆధిపత్యము అరబ్బులదే.

మహమ్మద్‌బిన్ ఖాసిం నేతృత్వంలో క్రీ.శ. 712లో అరబ్బుల సింధు ఆక్రమణ జరిగింది. అరబ్బుల సింధు ఆక్రమణ రాజకీయంగా ఎట్టి ఫలితం లేకపోయినా కొన్ని సత్ఫలితాలను అందించింది. అరబ్బులు భారతీయ సంస్కృతి నుండి ఎన్నో విషయాలను గ్రహించారు. వర్తక, వాణిజ్యాలు వృద్ధి చెందాయి. అసంఖ్యాక ముస్లింలు సింధులో స్థిరపడ్డారు.

## 26.5 ఘజినీ మహ్మద్ దండయాత్రలు:

క్రీ.శ. 750లో ఉమ్మాయద్ వంశ పతనం అనంతరం అబ్బాసిద్‌లు అధికారంలోనికి వచ్చారు. క్రీ.శ. 9వ శతాబ్ది అంతము నాటికి అబ్బాసిద్‌ల అధికారం క్షీణించి వారి స్థానంలో సుల్తాన్ అను బిరుదుతో అనేక స్వతంత్ర రాజ్యాలు వెలిశాయి. వీరిలో సమానిడ్‌లు (Samanids) ట్రాన్సోక్షియానా, ఖోరసాన్, ఇరాన్ వంటి ప్రాంతాల్ని పాలించారు. క్రీ.శ. 998లో మహమ్మద్, ఘజినీ పాలకుడైనాడు. మహమ్మద్ మధ్య ఆసియాలో ఘజినీని శక్తివంతమైన రాజ్యంగా తీర్చిదిద్దుటానికై భారతదేశ సిరిసంపదలను కొల్లగొట్టాలని అనేక పర్యాయాలు దాడులు చేశాడు. ధనార్జనే కాని అతనికి ఎట్టి సామ్రాజ్య కాంక్ష లేదు.

ఈ సమయంలో ఉత్తర భారతం అనేక స్వతంత్ర రాజ్యాలుగా విభక్తమై పరస్పర కలహాలతో నిమగ్నమైంది. తత్ఫలితముగా వాయువ్యం నుండి వచ్చే దండయాత్రల నుండి తమ రాజ్యాలను కాపాడుకోలేకపోయారు.

క్రీ.శ. 1000–1026 సం॥ల మధ్య మహమ్మద్ 17 పర్యాయాలు భారత్‌పై దండెత్తాడు. తొలి దండయాత్రలో తూర్పు ఆఫ్ఘనిస్థాన్, పంజాబ్‌ను పాలించు హిందూషాహీ పాలకుడైన జయపాలుని ఓడించాడు.

క్రీ.శ. 1004–1006 మధ్య మహమ్మద్ దిగువ సింధు ప్రాంతంలో కీలక స్థానం వహించిన ముల్తాన్‌పై దండెత్తి దానిని ఆక్రమించాడు. తదనంతరం జయపాలుని తరువాత రాజ్యానికి వచ్చిన ఆనందపాలుని వైహింద్ (హిందూషాహీ రాజధాని) వద్ద ఓడించెను. మహమ్మద్ చేతిలో ఓటమిపాలైన ఆనందపాలుడు ఉజ్జయిని, గ్వాలియర్, కనోజ్, ఢిల్లీ, అజ్మీర్, కలింజర్ మున్నగు రాజ్య కూటమిలో చేరి మహమ్మద్ నెదుర్కొనగా మహమ్మద్ ఈ కూటమిని చిత్తుగా ఓడించెను. ఈ విధంగా పంజాబ్ మహమ్మద్ పాదాక్రాంతమైనది. వైహింద్ విజయానంతరం ముల్తాన్‌ను లోబరచుకొని నాగర్‌కోట (కాంగ్రా) దేవాలయాన్ని దోచుకొనెను. క్రీ.శ. 1014–1019 సంవత్సరాల మధ్య తానే స్వయంగా కనోజ్, మధుర మున్నగు చోట్ల గల సుప్రసిద్ధమైన దేవాలయాలన్నిటిని దోచుకుని, వాటిని ధ్వంసం చేసెను.

ఇతని దండయాత్రలలోకెల్లా ప్రముఖమైనది (1025–1026) సోమనాథ్ దేవాలయ ముట్టడి. ఈ దాడిలో దేవాలయ అపార సంపదను కొల్లగొట్టుటమే గాక, అందలి శివలింగమును బద్ధలు చేశాడు.

మహమ్మద్ గొప్ప విజేతయేగాక గొప్ప సారస్వత కళాభిమాని. భారత్‌లో తాను కొల్లగొట్టిన ధనంతో ఘజినీని సర్వాంగ సుందరంగా రూపొందించెను. అనేకమంది భారతీయ వృత్తి పనివాళ్లను ఘజినీకి తీసుకొని వెళ్లాడు. పారశీక

కళా సారస్వతములు అతని కాలంలో ఉన్నత స్థితికి చేరుకొన్నాయి. 'షానామా' రచయితయైన ఫిరదౌసీ ఇతని ఆస్థానంలో కలడు. ఈ పారశీక సంస్కృతినే తురుష్కులు భారతదేశంలో ప్రవేశపెట్టారు.

ఘజినీ పాలకుడైన మహమ్మద్ 17వ పర్యాయాలు భారతదేశంపై దండయాత్రలు నిర్వహించాడు. భారతదేశ సిరి సంపదలను కొల్లగొట్టుటయే ఈ దండయాత్రల లక్ష్యం. ఈ దాడుల ఫలితాలేమనగా:

a) పంజాబ్ ఆక్రమణ

b) ఉత్తర భారతదేశ రాజ్యాల సైనిక బలహీనత బహిర్గతమగుట.

c) భారతదేశం ఆర్థిక దోపిడీకి గురియగుట.

## 26.6 రాజపుత్ర రాజ్యాల ఆవిర్భావం:

క్రీ.శ. 10వ శతాబ్దిలో రాజపుత్రులు అనే ఒక శక్తివంతమైన నూతన వర్గం ఉత్తర భారతదేశంలో ఆవిర్భవించి అనేక స్వతంత్ర రాజ్యాలను ఏర్పరచుకున్నారు. వారే అజ్మీర్ పాలకుడైన చౌహాన్‌లు, కనోజ్ పాలకులైన గహద్వాలులు, గుజరాత్ పాలకుడైన శోలంకీ చాళుక్యులు, బెంగాల్ పాలకుడైన పాల-సేన వంశీయులు. వీరుగాక బుందేల్‌ఖండ్, మాళ్వా, రాజస్థాన్‌లోని అనేక ప్రాంతాలలో సైతం రాజపుత్రులే పరిపాలించుచుండిరి.

రాజపుత్రులు గొప్ప యుద్ధవీరులు. యుద్ధం వారికి ఒక క్రీడ. స్వల్ప కారణాలతో వారు పరస్పర కలహాలతో నిమగ్నులై ఉండుట వలన బలహీనపడ్డారు. వారిలో సంఘీభావం, సమైక్యత కొరవడుట వలన ఉత్తర భారతం విదేశీయుల పాదాక్రాంతమైంది. క్రీ.శ. 12వ శతాబ్ది చివరిలో షహబుద్దీన్ మహమ్మద్ భారతదేశ సరిహద్దులలో విజృంభించాడు.

## 26.7 షహబుద్దీన్ మహమ్మద్ దండయాత్రలు:

షహబుద్దీన్ మహమ్మద్ రాక పూర్వం మధ్య ఆసియాలో జరిగిన రాజకీయ పరిణామాలు తెలుసుకుందాం.

క్రీ.శ. 1030లో ఘజినీ మహమ్మద్ మరణంతో మధ్య ఆసియాలో సెల్‌జుక్ తురుష్కులు శక్తివంతులై ఘజినీ రాజ్యాన్ని హస్తగతం చేసుకున్నారు. 12వ శతాబ్దిలో సెల్‌జుక్ రాజ్యం పతనం కాగా దాని శిథిలాలపై రెండు శక్తివంతమైన రాజ్యాలు వెలిశాయి. అవి.

1. ఇరాన్‌లో క్వారిఓమి సామ్రాజ్యం 2. ఆఫ్ఘనీస్థాన్ పశ్చిమ ప్రాంతాలలో ఘోర్ సామ్రాజ్యం. ఘోర్‌లు ఘజినీ సామాంతులుగా ఉండి వారు బలహీనం చెందగానే వారిని పదవీభ్రష్టులను చేసి అధికారం హస్తగతం చేసుకొన్నారు.

క్రీ.శ. 1173లో షహబుద్దీన్ మహమ్మద్ (1173-1206) ఘోర్ పాలకుడయ్యెను. ఇతనినిని మోజీయుద్దీన్ మహమ్మద్‌బిన్ శాన్ అని కూడా పిలుస్తారు. ఘోర్‌లో కోరసాన్ ప్రాంతం కొరకు క్వారిజోమి పాలకులతో సంఘర్షణ పడ్డా ప్రయోజనం లేకపోయింది. ఈ స్థితిలో ఘోర్ పాలకులు తమ రాజ్య విస్తరణకు భారత్‌పై దృష్టి మరల్చారు.

భారతదేశ సిరిసంపదలు కొల్లగొట్టుట కంటే భారతంలో తురుష్క రాజ్యస్థాపనే ఘోర్ మహమ్మద్ లక్ష్యం. అందుకు చక్కని ప్రణాళికను సిద్ధం చేసి తాను జయించిన ప్రాంతాలలో గవర్నర్‌లను నియమించి పాలన సాగించాడు.

ఘోర్ దండయాత్ర ఫలితంగా ఉత్తర భారతంలో తురుష్క సుల్తానత్ రాజ్యస్థాపన జరిగింది. ఈ రాజ్యస్థాపన ఎలా జరిగిందో ఈ కింది సంఘటనల వల్ల తెలుస్తుంది.

**పంజాబ్-సింధు ఆక్రమణ:**

క్రీ.శ. 1175లో ముల్తాన్‌ను ఆక్రమించి, భట్టి రాజపుత్రులను ఓడించి, ఉచ్ రాజ్యాన్ని ఆక్రమించాడు. ఈ రెండుచోట్ల పాలనా బాధ్యతలను తన గవర్నర్‌లకు అప్పగించి స్వదేశమునకు వెళ్లాడు. మూడు సంవత్సరాలు అనంతరం అనగా క్రీ.శ. 1178లో గుజరాత్‌పై దండెత్తగా చాళుక్య రాజగు రెండవ భీముడు "అనిహిల్‌వాడ్" యుద్ధంలో మహమ్మద్‌ను చిత్తుగా ఓడించెను. ఈ ఓటమితో నిరాశ చెందక మహమ్మద్ భారతదేశ దండయాత్రలకు పంజాబ్ అనువైన స్థావరంగా గుర్తించి తన భవిష్యత్ ప్రణాళికను సిద్ధం చేసుకొన్నాడు.

మహమ్మద్ పంజాబ్‌లోని ఘజినీల ఆధీనంలో ఉన్న రాజ్యాలపై దాడులు నిర్వహించాడు. ఈ విధంగా క్రీ.శ.1179-80లో పెషావర్‌ను 1186లో లాహోర్‌ను ఆ తదుపరి సియోల్‌కోట కోటను, దేబాల్‌ను వశపరచుకున్నాడు. ఇట్లు క్రీ.శ.1190 నాటికి ముల్తాన్, పంజాబ్, సింధులను ఆక్రమించి గంగా మైదానంపై దాడులకు సిద్ధపడినాడు.

**మొదటి తరైన్ యుద్ధం క్రీ.శ.1191**

గంగా-యమున అంతర్వేది ప్రవేశించుటంతో రాజపుత్ర వీరుడైన పృథ్వీరాజ్ చౌహాన్‌తో ప్రత్యక్ష సంఘర్షణ తప్పలేదు. పృథ్వీరాజ్ అనేక చిన్న రాజపుత్ర రాజ్యములను జయించి ఢిల్లీని ఆక్రమించి తన అధికారాన్ని పంజాబ్‌కు విస్తరించదలచాడు. ఇట్లు ఇరువురి మధ్య యుద్ధం అనివార్యమైంది. ఇందుకు భటిండా ముఖ్య కేంద్రమైంది. ఇట్లు 1191లో జరిగిన మొదటి తరైన్ యుద్ధంలో ఘోర్ పరాజితుడై తృటిలో ప్రాణాలను దక్కించుకొనెను. భటిండా పృథ్వీరాజ్ వశమైంది. ఈ విజయానంతరం పృథ్వీరాజ్ పంజాబ్ నుండి ఘోర్‌లను తరిమివేయుటకు యత్నించలేదు. దీనిని అవకాశంగా తీసుకొని మహమ్మద్ తన శక్తియుక్తులను సమీకరించుకొని ప్రతీకారేచ్ఛతో మరలా భారత్‌పై దాడికి కృతనిశ్చయుడైనాడు.

**రెండవ తరైన్ యుద్ధం క్రీ.శ. 1192:**

భారతదేశ చరిత్ర గతిని మార్చిన యుద్ధములలో ముఖ్యమైనది రెండవ స్థానేశ్వర యుద్ధం. ఈ యుద్ధంలో పృథ్వీరాజ్ ఉత్తర భారతంలోని రాజపుత్రులందరిని సమీకరించి ఒక కూటమిగా ఏర్పర్చి మహమ్మద్‌ను మరలా స్థానేశ్వరం వద్దే ఎదుర్కొన్నాడు. ఈ కూటమిలో కనోజ్ పాలకుడైన జయచంద్రుడు చేరలేదు. ఈ రెండవ తరైన్ యుద్ధంలో అసంఖ్యాక రాజపుత్ర కూటమి సైన్యములు యుద్ధతంత్రం నైపుణ్యం గల మహమ్మద్ అశ్వక దళం చేతిలో చిత్తుగా ఓడెను. విజేతలైన ముస్లిం సేనలు హన్సి, సర్‌సుతి, సమానా కోటలను ఆక్రమించి అజ్మీర్‌ను సైతం ఆక్రమించెను. యుద్ధంలో పరాజయం పొందిన పృథ్వీరాజ్ చౌహాన్‌ను తన సామంతుడుగా అజ్మీర్ పాలనా బాధ్యతలు అప్పగించాడు. కానీ పృథ్వీరాజ్ చౌహాన్ దేశద్రోహ నేరమునకు పాల్పడుచున్నాడను నెపమున ఉరితీయబడ్డాడు. ఆ తదుపరి అతని కుమారుడు అజ్మీర్ పాలకుడిగా నియమింపబడ్డాడు. దీనిని అవమానంగా భావించిన పృథ్వీరాజ్ చౌహాన్ సోదరుడు తిరుగుబాటు చేయగా మహమ్మద్ సేనానులలో ఒకడైన ఐబక్ తన సైనికులతో అణచివేశాడు. ఇలా అజ్మీర్ తురుష్కుల వశమైంది.

భారతదేశ చరిత్రలో రెండవ తరైన్ యుద్ధం ప్రముఖమైనది. తొలుత మహ్మద్ రాజ్యవిస్తరణ ఢిల్లీ ముఖద్వారాన్ని తాకింది. ఢిల్లీలో రాజపుత్ర పాలన అంతమై తురుష్కులు గంగా మైదానంలో విస్తరించడానికి ఢిల్లీ స్థావరమైంది. ఈ విధంగా ఢిల్లీ పరిసర ప్రాంతాలు, తూర్పు రాజపుత్ర స్థానం తురుష్కుల పాలనలోకి వెళ్లాయి. ఈ యుద్ధంలో రాజపుత్రులు దాదాపు సమైక్యంగా పోరాడినా కొన్ని రాజపుత్ర రాజ్యాలు తమ స్వీయ ప్రయోజనాల కొరకు రాజపుత్ర కూటమి దూరంగా ఉండటం వల్ల మహమ్మద్ విజయాన్ని సాధించాడు.

తరైన్ యుద్ధానంతరం మహమ్మద్ తాను జయించిన ప్రాంతాలకు తనకు విశ్వాస పాత్రుడైన బానిస సేనానియైన కుతుబుద్దీన్ ఐబక్‌ను రాజ ప్రతినిధిగా నియమించి స్వదేశానికి మరలాడు. మహమ్మద్ మరలా క్రీ.శ.1194లో 50వేల అశ్వక దళంతో కనోజ్‌పై దండెత్తి చందావార్ యుద్ధంలో జయచంద్రుని ఓడించి కనోజ్ రాజ్యాన్ని హస్తగతం చేసుకొన్నాడు.

ఇట్లు రెండవ తరైన్, చందావార్ యుద్ధాలు ఉత్తర భారతదేశంలో తురుష్క సామ్రాజ్య స్థాపనకు దోహదం చేశాయి.

క్రీ.శ. 1206లో మహమ్మద్ అకాల మరణంతో ఐబక్ భారతదేశంలో మహమ్మద్ జయించిన ప్రాంతాల పాలనను స్వీకరించాడు.

> మధ్య ఆసియా రాజకీయ పరిస్థితులు షహబుద్దీన్ మహమ్మద్ దృష్టిని భారత్‌పైకి మరల్చెను. భారతదేశ సిరిసంపదలు కొల్లగొట్టుట కంటె రాజ్యస్థాపనే అతని ధ్యేయం. అనిహిల్‌వాడ్, మొదటి తరైన్ యుద్ధాలలో పరాజయం పొందినా రాజపుత్రుల మధ్య నెలకొన్న ఆధిపత్య పోరాటం వలన మహమ్మద్ రెండవ తరైన్ యుద్ధంలో విజయం సాధించగలిగాడు.

## 26. ఔ. పాఠ్యప్రశ్నలు

**I. సరైన సమాధానం వ్రాయుము.**

a) సుల్తాన్ మహమ్మద్ ఈ రాజ్య పాలకుడు ______

1. ఘోరీ 2. గజిని 3. పంజాబ్

b) ఫిరదౌశి ______ రాజు కాలంలో ఉన్నాడు.

1. మహమ్మద్ 2. మోజీయుద్దీన్ మహమ్మద్ 3. ఐబక్

c) మొదటి తరైన్ యుద్ధం వీరిరువురి మధ్య జరిగింది.

1. మహమ్మద్, హిందూషామీల మధ్య 2. పృథ్వీరాజ్, మోజీయుద్దీన్ మహమ్మద్ మధ్య
3. పృథ్వీరాజ్, జయచంద్రుల మధ్య

d) ఘోరీ మహమ్మద్ భారత్‌లో తాను జయించిన ప్రాంతాలను ఈ కింది వానికి అప్పగించాడు.

1. కుతుబుద్దీన్ ఐబక్ 2. పృథ్వీరాజ్ చౌహాన్ 3. ఇల్‌టుట్‌మిష్

**II.** ఘజినీ మహమ్మద్ దండయాత్రలకు, మహమ్మద్ ఘోరీ దండయాత్రలకు మధ్య గల ప్రముఖ తేడా ఏమిటి?

**III** మహమ్మద్ ఘోరీ మధ్య ఆసియా విస్తరణ కంటె భారత్ విస్తరణకు ఎందుకు మొగ్గు చూపాడు?

### మామ్లుక్ సుల్తానులు

మామ్లుక్ అనే అరబిక్ పదానికి సొంతదారుడని అర్థం. ఈ పదాన్ని విదేశీ తురుష్క బానిసలను గృహ అవసరాలకు వినియోగించుకొని ఆ తదుపరి వారికి సైనిక నిర్వహణ బాధ్యతలు అప్పగించిన వారిని మామ్లుక్‌లుగా పిలవడం జరుగుతుంది. కుతుబుద్దీన్ రాకతో మామ్లుక్ పాలన ప్రారంభం అయ్యింది. మామ్లుక్ సుల్తాన్‌లు క్రీ.శ. 1206 నుండి

1290 వరకు పాలించారు. వీరు మొత్తం పది మంది. వీరు కుతుబుద్దీన్ ఐబక్, షంషుద్దీన్ ఇల్‌టుట్‌మిష్, ఘియాజుద్దీన్ బాల్బన్ అను మూడు కుటుంబాలకు చెందినవారు.

**మామ్లుక్ వంశం**

| | సుల్తాన్ | పాలనాకాలం | సంవత్సరాలు |
|---|---|---|---|
| 1. | కుతుబుద్దీన్ ఐబక్ | 1206-1210 | 4 సంవత్సరాలు |
| 2. | ఆరామ్ షా | 1210 | 8 నెలలు |
| 3. | షంషుద్దీన్ ఇల్‌టుట్‌మిష్ | 1211-1236 | 25 సంవత్సరాలు |
| 4. | రుక్‌నుద్దీన్ ఫిరోజ్ | 1236 | 7 నెలలు |
| 5. | రజియా | 1236-1240 | సుమారు 4 సంవత్సరాలు |
| 6. | మౌజుద్దీన్ బహ్‌రాం | 1240-1242 | 2 సంవత్సరాలు |
| 7. | అల్లాఉద్దీన్ మాసూద్ | 1242-1246 | 4 సంవత్సరాలు |
| 8. | నసీరుద్దీన్ మహమ్మద్ | 1246-1266 | 20 సంవత్సరాలు |
| 9. | ఘియాసుద్దీన్ బాల్బన్ | 1266-1287 | 20 సంవత్సరాలు |
| 10. | మౌజుద్దీన్ కైకుబాద్ | 1287-1290 | 3 సంవత్సరాలు |

**ఈ సుల్తానులలో ముఖ్యులు కుతుబుద్దీన్ ఐబక్, ఇల్‌టుట్‌మిష్, రజియా, నజీరుద్దీన్ మహమ్మద్, బాల్బన్**

## 26.8 కుతుబుద్దీన్ ఐబక్ (క్రీ.శ. 1206-1210)

తురుష్క బానిసయైన కుతుబుద్దీన్ ఐబక్, తన ప్రతిభతో మహమ్మద్ ఘోరీ సైన్యంలో ఉన్నత హోదాను పొందాడు. క్రీ.శ. 1192-1205 సంవత్సరాల మధ్య భారత్‌లో సాగించిన దిగ్విజయాలన్ని, ఐబక్ సాధించినవే. మహమ్మద్ ఘోర్ మరణించిన తరువాత భారత్‌తో తన అధికారాన్ని సుస్థిరపరచుకొని, స్వతంత్రుడై ముస్లిం రాజ్యస్థాపన చేసిన తొలి టర్కిష్ సుల్తాన్‌గా ఐబక్ గణనకెక్కాడు.

సుల్తాన్‌గా ఐబక్ అనేక సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చెను. ఘజినీ పాలకుడైన యల్‌డజ్ ఢిల్లీ సింహాసన మధిష్టింప యత్నించుచుండెను. ముల్తాన్, ఉచ్‌ల గవర్నరైన నజీరుద్దీన్ కుబాచా, బెంగాలు గవర్నరైన ఆలీమర్దాన్‌ఖాన్ స్వతంత్రులు కాదల్చిరి. దీనికితోడు స్థానిక తిరుగుబాట్లు చెలరేగెను. అంతట ఐబక్ వివేకవంతంగా ఈ సమస్యలను అధిగమించాడు. యలడ్‌జ్‌ను ఓడించి ఘజినీ నాక్రమించెను. మరల యల్‌డజ్ ఘజినీతో ప్రత్యక్షంగా, ఐబక్ లాహోర్ చేరుకొని అతనిని అడ్డుకట్ట వేసెను. దీనితో ఢిల్లీ సుల్తాన్‌తో ఘజినీ రాజ్యంనుండి వేరయ్యింది. తత్ఫలితంగా భారత్ మధ్య ఆసియా రాజకీయాలలో జోక్యం చేసుకోకుండా నివారింపబడింది. ఈ తిరుగుబాట్లు తాత్కాలికంగా సమసిపోయినా, వానిని పూర్తిగా అణచివేసే బాధ్యత ఐబక్ అనంతరం రాజ్యానికి వచ్చిన ఇల్‌టుట్‌మిష్‌పై పడింది.

## 26.9 ఇల్‌టుట్‌మిష్ (క్రీ.శ. 1211-1236)

కుతుబుద్దీన్‌ఐబక్ మరణానంతరం అతని కుమారుడైన ఆరామ్‌షా సుల్తానయ్యాడు. కాని అతడు బలహీనుడు. అసమర్ధుడగుట వలన ఆస్థానమండలి తురుష్క ప్రభువుల మద్దతుతో, ఐబక్ అల్లుడైన ఇల్‌టుట్‌మిష్ అతనిని పదవీభ్రష్టుని చేసి ఢిల్లీ సింహాసన మధిష్టించాడు. దీనితో వంశపారంపర్యపు రాజరిక హక్కు (అనగా తండ్రి అనంతరం కుమారుడు రాజ్యాధినేత అయ్యే సంప్రదాయం)కు స్వస్తి చెప్పబడింది. బలమున్నవాడిదే రాజ్యం అని గుర్తింపబడింది. ఢిల్లీ సుల్తానత్‌కు సుస్థిరతను ప్రసాదించిన ఘనత ఇల్‌టుట్‌మిష్‌దే. ఇతడు క్రీ.శ. 1211 నుండి 1236 వరకు పాలించెను.

ఇల్‌టుట్‌మిష్‌కు ఢిల్లీ సింహాసనం పూలపాన్పుగా లేదు. ఇతడు కష్టాల కడలిలోయున్నాడు. ఘజనీ పాలకుడైన యల్‌డజ్, సింధు పాలకుడైన కుబాబా, బెంగాల్ పాలకుడైన అలీమిద్దాన్‌ఖాన్ సుల్తానత్ అధికారాన్ని ధిక్కరించి స్వతంత్రులు కాదల్చిరి. ఈ లోపల జులోర్, రణతంభీర్, రాజపుత్రులు, గ్వాలియర్, లోఎంజర్ పాలకులతో చేయి కలిపి స్వతంత్రులైరి. దీనికితోడు మంగోలులు చెంఘిజ్‌ఖాన్ నేతృత్వంలో విజృంభించి సుల్తానత్ వాయువ్య సరిహద్దు ప్రాంతానికి ముప్పుగా పరిణమించారు.

ఇట్లు బాల్య దశనుండే శైశవ దశను పొందబోవు ఢిల్లీ సుల్తానత్‌ను ఇల్‌టుట్‌మిష్ కాపాడి, దాని పునాదులను సుస్థిరపరచెను. తొలుత యల్‌డజ్, కుబాబాలపై దాడి చేసి వారిని వధించాడు. క్రీ.శ.1220లో చెంఘిజ్‌ఖాన్ క్వారజాం సామ్రాజ్యంపై దండెత్తాడు. అంతటి ఆ రాజ్యపాలకుడైన జలాలుద్దీన్ మంగబార్నీ పంజాబుకు పారిపోయి ఇల్‌టుట్‌మిష్ సాయమర్థించాడు. మంగబార్నీకి సాయం చేసిన యెడల మంగోలుల సంఘర్షణ తప్పదని భావించి, ఇల్‌టుట్‌మిష్ అతనికెట్టి సాయం చేయలేదు. ఇల్‌టుట్‌మిష్ ప్రదర్శించిన రాజకీయ విజ్ఞత వలన ఢిల్లీ సుల్తానత్‌కు మంగోలుల బెడద తప్పింది.

క్రీ.శ. 1225 నుండి ఇల్‌టుట్‌మిష్ బెంగాల్ నందలి తిరుగుబాట్లను అణచుటలో నిమగ్నుడయ్యాడు.. అలీమర్దాన్‌ఖాన్ అనంతరం ఐవాజ్‌ఖాన్ బెంగాల్ పాలకుడయ్యాడు. ఇల్‌టుట్‌మిష్ వాయువ్య ప్రాంతంపై దృష్టిని కేంద్రీకరించుటను అవకాశంగా తీసుకొని ఐవాజ్‌ఖాన్ స్వతంత్రుడుగా పాలన సాగించాడు. క్రీ.శ. 1226-27 సంవత్సరంలో ఇల్‌టుట్‌మిష్ కుమారుడైన నజీరుద్దీన్ మహమ్మద్ బెంగాల్‌పై దండెత్తి, ఐవాజ్‌ఖాన్ వధించి, బెంగాల్ రాష్ట్రాన్ని తిరిగి సుల్తానత్‌కు పునరుద్ధరించాడు. అలాగే రాజపుత్ర రాజ్యాలపై దండెత్తి రణతంభీర్‌ను ఆక్రమించి, జాలోర్, మాంజోర్, బయనా, గ్వాలియర్ రాజ్యాలపై తన ఆధిపత్యాన్ని నెలకొల్పాడు.

గుజరాత్‌ను వశపరచుకొనుటలో ఇల్‌టుట్‌మిష్ విజేత గాకపోయినా, ఐబక్ అసంపూర్ణంగా వదలివెళ్లిన సమస్యలను ఇల్‌టుట్‌మిష్ పూర్తి చేసి ఢిల్లీ సుల్తానత్‌ను సుస్థిరపరచాడు. పరిపాలనా పాటవాన్ని పెంచుటకు ఇల్‌టుట్‌మిష్ 'చిహల్‌గనీ టర్కిష్' అనే ప్రభువర్గాన్ని ఏర్పరచాడు.

## 26.10 రజియా (క్రీ.శ. 1236-40)

ఇల్‌టుట్‌మిష్ తన కుమార్తెయైన రజియా శక్తి సామర్థ్యాలను గుర్తించి, తన కుమారులను విస్మరించి, ఆమెను తన వారసురాలిగా ఎంపిక చేసెను. ఇది గిట్టని కొందరు సర్దారులు (ప్రభువులు) ఇల్‌టుట్‌మిష్ కుమారుడైన రుక్నుద్దీన్ ఫిరోజ్‌ను సుల్తాన్‌గా ప్రకటించిరి, కాని రజియా ఢిల్లీ ప్రజల అండదండలతో కొంతమంది సైనికాధికారుల మద్దతుతో రుక్నుద్దీన్ ఫిరోజ్‌ను వధించి సింహాసన మధిష్టించాడు.

రజియా అనేక సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చింది. ముఖ్యంగా ఆమె సోదరులు, చహలగనీ సర్దారులలో ఒక వర్గం ఆమెకు వ్యతిరేకంగా కుట్ర పన్నుచున్నారు. పాలనను చక్కబరచాలంటే చహల్‌గనీ సర్దురుల అధికారాలకు కళ్లెం వేయాలని ఆమె భావించింది. తదనుగుణంగా తురుష్కేతరులను అనేక ఉన్నత పదవులతో నియమించెను. తన తండ్రి వలె రాజకీయ విజ్ఞతతో మంగోలులకు వ్యతిరేకంగా ఒప్పందం కుదుర్చుకోవాలని ఖ్వారజాం ప్రభువు పంపిన ఆహ్వానాన్ని ఆమె తిరస్కరించింది.

పరిపాలనా నిర్వహణలో యుద్ధతంత్ర నిపుణతలో సమర్థవంతంగా వ్యవహరించింది. పాలనలో ప్రత్యక్షంగా పాల్గొనటం, ప్రజా దర్బారు నిర్వహించటం యుద్ధంలో సైన్యానికి నాయకత్వం వహించటం ఆమె పాలనా దక్షతకు నిదర్శనం.

ప్రభువర్గం రజియా తమ చెప్పుచేతలలో మసలే కీలుబొమ్మ కాదని గ్రహించారు. తురుష్కేతరులను ఉన్నత పదవులందు నియమించుట వారికి గిట్టలేదు. ఇట్టి స్థితిలో ఆమెను అంతం చేయుటే ఏకైక మార్గమని వారు భావించారు. పైగా అబిసీనియన్ అశ్వకదళాధిపతియైన యాకుత్‌ఖాన్‌తో ఆమె సన్నిహితంగా ఉండుటతో ఆమె శీలాన్ని శంకించారు. ఇట్లు జీవితాంతం ప్రభువర్గంతో, సోదరులతో సంఘర్షణ పడుతూ చివరకు దారిదోపిడీ దొంగల చేతిలో హతమైంది.

## 26.11 నజీరుద్దీన్ మహమ్మద్ (క్రీ.శ. 1246-66)

ప్రధానమంత్రిగా బాల్బన్: రజియా కాలంలో సుల్తాన్‌కు, చహలగనీ సర్దారులకు మధ్య ప్రారంభమైన ఆధిపత్య పోరాటం ఆమె మరణానంతరం కొనసాగింది. రజియా మరణానంతరం చహల్‌గనీ సర్దారులు శక్తివంతులై రాజ్య నిర్మాతలుగా మారారు. క్రీ.శ. 1246లో చహలగనీ సర్దారులలో నొకడైన ఉల్గుఖాన్ ఇల్‌టుట్‌మిష్ మనుమడైన, నజీరుద్దీన్‌ను సుల్తానుగా చేశాడు.. ఉల్గుఖాన్ (ఇతడే బాల్బన్‌గా సుల్తానయ్యాడు) తన కుమార్తెను నజీరుద్దీన్‌కిచ్చి వివాహం చేసి ప్రధానమంత్రి పదవిని పొందెను. ఇది గిట్టని కొంతమంది తురుష్క సర్దారులు అతనిపై కుట్ర పన్ని 1250లో పదవి నుండి తొలగించి ఇమాదుద్దీన్ అనే భారతీయ ముస్లింను ప్రధానిగా చేశారు. అయితే ఉల్గుఖాన్ సామ, దాన, భేద, దండోపాయాలచే తన శత్రువులందరిని అణచివేసి తిరిగి ప్రధాని పదవిని పొందుటేగాక రాజరిక హోదాను సూచించు “ఛత్ర” అని బిరుదు కూడా ధరించాడు. క్రీ.శ. 1265లో నజీరుద్దీన్ మరణానంతరం ఉల్గుఖాన్ ‘బాల్బన్’ అనే పేరుతో ఢిల్లీ సుల్తానయ్యెను. విష ప్రయోగంతో నసీరుద్దీన్‌ను బాల్బన్ చంపాడని కథనం. బాల్బన్ రాకతో నిరంకుశ కేంద్రీకృత పాలనా వ్యవస్థకు నాంది పలికింది.

## 26.12 బాల్బన్ (క్రీ.శ. 1266-87)

బాల్బన్ సుల్తాన్ అయినప్పుడు ఢిల్లీ సింహాసనం సురక్షితంగా లేదు. తురుష్క సర్దారులలోని ఒకవర్గం ఆయనకు వ్యతిరేకం. వాయువ్య ప్రాంతంలో మంగోలు బెడద తీవ్రతరమైంది. రాజ్యానికి దూరంగా ఉన్న రాష్ట్ర పాలకులు స్వతంత్రులగుటకు యత్నిస్తున్నారు. రాజపుత్రులు సైతం స్వాతంత్ర్యం కోసం ఏ క్షణాన్నైనా తిరుగుబాటు చేసేటట్లు ఉన్నారు. ఢిల్లీ పరిసర ప్రాంతాలు మెవాటిస్ అనే దారి దోపిడులకు గురియై, ప్రజలలో భయభ్రాంతులు సృష్టిస్తున్నాయి.

ఇట్టి స్థితిలో బాల్బన్ నిరంకుశంగా, నిర్దాక్షిణ్యంగా వ్యవహరించి పరిస్థితులను చక్కబరచాడు. ఈ సిద్ధాంతాన్ని చరిత్రకారులు ‘ఉక్కుపాద సిద్ధాంతం’ (Policy of Blood and Iron) అని అభివర్ణించారు. సుల్తాన్ అధికారాన్ని, హోదాను,

ప్రతిపత్తిని పెంచుటకు అనేక చర్యలు గైకొన్నాడు. సర్దారులు శక్తివంతులు గాకుండా వారిపై ఆంక్షలు విధించాడు. రాజు దైవాంశ సంభూతడనే నూతన రాజరిక సిద్ధాంతాన్ని ప్రవచించాడు.

సైన్యాన్ని పునర్వ్యవస్థీకరించి, వానిని దేశవ్యాప్తంగా కీలకమైన ప్రాంతాలలో నుంచి ఎట్టి తిరుగుబాటునైనా అణచుటకు సంసిద్ధం చేశాడు. దో-ఆబ్‌లో శాంతిభద్రతలు నెలకొల్పుటకు పెక్కు చర్యలు గైకొన్నాడు. అడవులను నరికి, రహదారులు నిర్మించి, దుర్గములను పటిష్టం చేశాడు. దారిదోపిడీ దొంగలను కఠినంగా శిక్షించాడు. మేవాట్, దో-ఆబ్, అయోధ్య, కతౌహర్‌లందు చెలరేగిన తిరుగుబాట్లను నిర్దాక్షిణ్యంగా అణచివేశాడు. అజ్మీర్, నగౌర్ రాజపుత్ర రాజ్యాలపై తన ఆధిపత్యాన్ని నెలకొల్పాడు. కాని గ్వాలియర్, రణతంభీర్‌లను బాల్బన్ వశపరచుకోలేకపోయాడు.

బాల్బన్ కాలంలో బెంగాల్ పాలకుడైన తుగ్రిల్‌బేగ్ స్వతంత్రుడై, సుల్తానుగా ప్రకటించుకొని, తనపేర నాణేలను కూడా ముద్రించాడు. అంతట బాల్బన్ స్వయంగా రెండు లక్షల సైన్యంతో బెంగాల్ రాజధానియైన లక్నౌలని హస్తగతం చేసికొని తుగ్రిల్‌బేగ్‌ను వధించి, తన రెండవ కుమారుడైన బుగ్రాఖాన్‌కు బెంగాల్ పాలకుడుగా నియమించెను.

బాల్బన్ కాలంలో మంగోలుల బెడద ఎక్కువైంది. మంగోలులు సింధు నది పశ్చిమ ప్రాంతమును హస్తగతం చేసుకొని పంజాబ్‌పై దాడులు చేయుటకు సన్నాహాలు చేస్తున్నారు. మంగోలు దాడుల నెదుర్కొనుటకు బాల్బన్ పాత దుర్గములను మరమ్మతు చేయుటేగాక, కీలకమైన ప్రాంతాలలో నూతన దుర్గాలను నిర్మించాడు. వీనిని సుశిక్షితమైన సైన్యం ఆధీనంలో ఉంచాడు. వాయువ్య ప్రాంత రక్షణ బాధ్యతను తన పెద్ద కుమారుడైన మహమ్మద్‌కు అప్పగించెను. క్రీ.శ. 1285లో తైమూర్‌ఖాన్ నాయకత్వంలో జరిగిన మంగోలు దాడిలో మహమ్మద్ మరణించెను. అయితే మంగోలు నాయకుడైన హలకు (Halaku) బాల్బన్‌తో స్నేహ సంబంధాలు కాంక్షించి తన రాయబారిని ఢిల్లీకి పంపాడు. బాల్బన్ రాజకీయ విజ్ఞతతో ఈ అవకాశంను వినియోగించుకొని వారితో సఖ్యతను నెలకొల్పాడు.

క్రీ.శ. 1287లో బాల్బన్ మరణించాడు. నాటికే తన ఇద్దరు కుమారులు మరణించుట వలన సర్దారులు బాల్బన్ మనుమడైన కైకుబాద్‌ను సుల్తాన్‌గా చేసిరి. కైకుబాద్ బలహీనుడు, అసమర్థుడు ఇతని కాలంలో సైతం ఆస్థానంలో ప్రభువర్గం తగాదాలలో నిమగ్నమైంది. కైకుబాద్ పక్షవాతానికి గురియగుటచే, అతని కుమారుడైన బాలుడైన కయూమార్స్ సుల్తానయ్యాడు. ఇట్టి సమయంలో తురుష్కేతరులు, భారత ముస్లింలు సమైక్యమై క్రీ.శ. 1290లో కయూమార్స్‌ను తొలగించి జలాలుద్దీన్ ఖిల్జీని ఢిల్లీ సుల్తానుగా చేసిరి. దీనితో మమ్లుక్ పాలన అంతమైంది.

## పాఠ్య ప్రశ్నలు

1. మామ్లుక్ బానిసలకు, గృహ బానిసలకు తేడా ఏమి?
2. ఢిల్లీ సుల్తానత్ తొలి పాలకుడెవరు?
3. మంగోలు బెడదను ఇల్‌టుట్‌మిష్ ఎలా నివారింపగల్గాడు?
4. బాల్బను అనుసరించిన నిరంకుశ విధానాలను ఏ పేరుతో పిలుస్తారు?

## సారాంశం

అరేబియాలో పుట్టిన ఇస్లాం, ఖలీఫాల నేతృత్వంలో బాగా వ్యాప్తి చెందింది. అరేబియన్ సైన్యాలు మధ్య ఆసియాలోని అత్యధిక భాగాన్ని ఆక్రమించాయి. అనాదిగా భారత్‌కు అరేబియాకు వర్తక సంబంధాలు కలవు. క్రీ.శ. 712లో

మహమ్మద్‌బిన్ ఖాసిమ్ నాయకత్వంలో అరబ్ సైన్యాలు సింధును ఆక్రమించాయి. ఈ ఆక్రమణ ముఖ్య ధ్యేయాలు – భారతదేశ సిరిసంపదలను కొల్లగొట్టుట, ఇస్లాం మత వ్యాప్తి.

ఆ తరువాత ఘజినీ పాలకుడైన మహమ్మద్ భారత సిరిసంపదలను కొల్లగొట్టి తన రాజ్యాన్ని సుస్థిరపరచుకోవాలని 17సార్లు దండెత్తాడు. నాటి ఉత్తర భారత రాజులలో ఐక్యత కొరవడుట వలన మహమ్మద్ లక్ష్యాలు సునాయాసంగా నెరవేరాయి.

క్రీ.శ. 12వ శతాబ్దిలో ఉత్తరభారతం అనేక చిన్న రాజ్యాలుగా విభక్తమై రాజపుత్రులచే పాలింపబడుతున్నాయి. రాజపుత్రులు యుద్ధవీరులు, ధైర్యసాహసాలు కల్గినవారు. కాని వారిలో ఐక్యత లేదు. పైగా ఆధిపత్య పోరాటంతో పరస్పరం సంఘర్షణ పడుతున్నారు. ఈలోపల ఘోర్ పాలకుడైన మహమ్మద్ మధ్య ఆసియాకు తన రాజ్య విస్తరణ కష్టమని భావించి భారత్‌పై దృష్టి పరల్చాడు. భారత్‌లో సామ్రాజ్య స్థాపనే ఘోరీ మహమ్మద్ లక్ష్యం. క్రీ.శ. 1191 మొదటి తరైన్ యుద్ధంలో ఘోరీ మహమ్మద్ పృథ్వీరాజ్ చౌహాన్ చేతిలో ఓడినా, ఆ మరుసటి సంవత్సరం (క్రీ.శ. 1192) జరిగిన రెండవ తరైన్ యుద్ధంలో పృథ్వీరాజ్ ఏర్పరచిన రాజపుత్ర కూటమిని ఓడించి, ఢిల్లీని ఆక్రమించెను.

ఘోరీ మహమ్మద్ తాను భారత్‌లో జయించిన రాజులకు తనకు విశ్వాసపాత్రుడైన తురుష్క బానిస సేనానియైన కుతుబుద్దీన్ ఐబక్‌కు అప్పగించాడు. ఐబక్ ఢిల్లీ సుల్తానత్ రాజ్య స్థాపన చేశాడు. ఇల్‌టుట్‌మిష్ ఆంతరంగిక తిరుగుబాట్లను అణచి, చహల్‌గనీ సర్దారుల కూటమిని ఏర్పాటు చేసి, వారి మద్దతుతో సుల్తానత్‌ను సుస్థిరపరచాడు. ఇతని కాలంలోనే మంగోలుల బెడద ప్రారంభమైంది. ఇల్‌టుట్‌మిష్ అనంతరం సింహాసన మధిష్టించిన రజియా చహల్‌గనీ సర్దారుల అధికారదాహాన్ని అణచటానికి యత్నించింది. కాని చహల్‌గనీ కుట్రలకు ఆమె బలి అయింది. ఈ సుల్తానులలో ఉక్కు మనిషి–బాల్బన్. 20 సంవత్సరాలు ప్రధానిగా (నాయబ్), 20 సంవత్సరాలు సుల్తాన్‌గా ఢిల్లీ సుల్తానత్‌ను పాలించి, దానికి సుస్థిరతను, భద్రతను సమకూర్చాడు. చహల్‌గనీ సర్దారుల దర్పాన్ని అణచాడు. సుల్తాన్ గౌరవ ప్రతిపత్తులను ఇనుమడింపచేశాడు. తిరుగుబాట్లు అణిచి శాంతిభద్రతలు నెలకొల్పాడు. మంగోలు దాడుల నుండి సుల్తానత్‌ను కాపాడాడు. బాల్బన్ మరణానంతరం బలహీనులు రాజ్యానికి రావటం వలన సుల్తానత్ ఖిల్జీల వశమైంది.

## అభ్యాసం

1. ఇస్లాం విజృంభణకు, వ్యాప్తికి అరేబియా రాజకీయ పరిస్థితులెట్లు దోహదం చేశాయి?
2. అరబ్బుల సింధు విజయానికి గల కారణాలు, ఫలితాలను వివరింపుము.
3. ఘజినీ మహమ్మద్ ఎవరు? భారతదేశంపై ఎందుకు దాడి చేశాడు?
4. మధ్య ఆసియాలోని ఏ రాజకీయ పరిస్థితులు ఘోర్ మహమ్మద్‌ను భారత్‌పై దృష్టిని మరల్చుటకు దోహదం చేసెను?
5. మామ్లుక్ సుల్తానులనగా ఎవరు? ఇల్‌టుట్‌మిష్ తన అధికారాన్ని ఎలా సుస్థిరపరచుకొన్నాడు?
6. ఆంతరంగిక, విదేశీ దాడుల నుండి ఢిల్లీ సుల్తానత్‌ను కాపాడుటకు బాల్బన్ గైకొన్న చర్యలేమి?
7. భారత్‌లో తురుష్క రాజ్యస్థాపనకు దోహదం చేసిన అంశాలేమి?

## అదనపు సమాచారం

### మంగోలులు

'మంగోల్' అనే పదం 'మాంగ్' (Mong) అనగా ధైర్యం అనే పదం నుండి జనించింది. క్రీ.శ. 13వ శతాబ్దిలో మంగోలులు శక్తివంతమైన, ఆగ్రహావేశపూరితమైన ధైర్యసాహసాలు గల జాతిగా రూపాంతరం చెందారు. చెంఘిజ్‌ఖాన్ నేతృత్వంలో వీరు సువిశాల రాజ్యాన్ని నెలకొల్పి నాటి తూర్పు, పశ్చిమ దేశాలకు సింహస్వప్నంగా హింసించేవారు. వీరు మధ్య ఆసియాలోని ఖ్వాజిమియాన్, అబ్బాసిగ్‌ల రాజ్యాలను జయించి ఆక్రమించారు.

చెంఘిజ్‌ఖాన్ మంగోలులకు సైనిక క్రమశిక్షణ, యుద్ధతంత్ర నిపుణతలో తర్ఫీదునిచ్చి ప్రపంచంలో సుప్రసిద్ధ వీరులుగా తీర్చిదిద్దాడు. కనుకనే చరిత్రకారులు చెంఘిజ్‌ఖాన్ "దుమ్ము, ధూళి నుండి ఒక రాజ్యాన్ని" తయారు చేశాడని శ్లాఘించారు.

మంగోలులు సైన్యం కదిలే అశ్వికదళం. వీరు దాడులకు వెళ్లేటప్పుడు తమ కుటుంబాలను కూడ తమ వెంట తీసుకొని వెళ్లేవారు. అందువలన వీరు మోసుకుపోయే యుద్ధ సామాగ్రి స్వల్పం. ఈటె, ధనుస్సు, విల్లంబు, శత్రువును ఈడ్చుకెళ్లటానికి గొళ్లం మాత్రమే వారి ఆయుధ సంపత్తి. బరానీ అను చరిత్రకారుడు మంగోలుల గూర్చి చెబుతూ వారు పెద్ద యుద్ధాలను కూడా ఒక రాత్రిలో ముగించేవారని, అవసరమైతే వెనుతిరగడాన్ని అగౌరవంగా భావించేవారు కాదని చెప్పాడు. మార్కొపొలో సైతం వారిని యుద్ధతంత్ర నిపుణతను గూర్చి ప్రశంసిస్తూ వారు వెనుతిరిగినట్లు నటించి, అకస్మాత్తుగా ఎదురు తిరిగి శత్రువును మట్టుబెట్టేవారని పేర్కొన్నాడు.

కుబ్లైఖాన్ అనే మరో మంగోలు నాయకుడు క్రీ.శ. 1294 వరకు పాలించాడు. కుబ్లైఖాన్ మరణానంతరం మంగోలుల మధ్య కలతలు చెలరేగి వారి సామ్రాజ్యం రెండుగా చీలిపోయింది. అవియే పర్షియాలోని ఐఖన్ రాజ్యం, ట్రాన్సోగ్జియానాలోని చాగతై. వారికెప్పుడైన విశ్రాంతి లభించినప్పుడు కలసికట్టుగా భారత్‌పై దాడులు నిర్వహించేవారు. ఇట్లు ట్రాన్సోగ్జియానా పాలకుడైన దవాఖాన్ అనేక పర్యాయాలు భారత్‌పై దాడి చేశాడు. ఇట్టి మంగోలుల నెదుర్కొనుటకు అల్లాఉద్దీన్ ఖిల్జీ అనేక పాలనా, సైనిక చర్యలు గైకొనవలసి వచ్చింది. తుఘ్లక్‌ల కాలంలో మంగోలు జాతికి చెందిన (తల్లి వైపు) తైమూర్ భారత్‌పై దండెత్తాడు. తైమూర్ వారసుడైన బాబర్ మన దేశంలో మొఘల్ సామ్రాజ్య స్థాపన చేశాడు. ఇట్లు మంగోలులతో భారత్ సంబంధాలు చాలాకాలం కొనసాగాయి.

## పాఠ్య ప్రశ్నలకు జవాబులు

**26.ఎ**

i) మహమ్మద్ ప్రవక్త

ii) ఖురాన్

iii) ఉమ్మయద్ వంశం

2. ప్రధాని (Deputy)

3. అరబ్ వర్తకులు, సైనికులు

**26.బి**

1. ఎ) ఘజినీ బి) మహమ్మద్, సి) పృథ్వీరాజ్, షహబుద్దీన్ మహమ్మద్‌ల మధ్య డి) కుతుబుద్దీన్ ఐబక్

2. ఘజినీ మహమ్మద్ భారతదేశ సిరిసంపదలను కొల్లగొట్టాలన్నదే లక్ష్యం కాగా, ఘోర్ మహమ్మద్ భారత్‌లో రాజ్యస్థాపన చేయుటే ధ్యేయంగా ఎంచాడు.

3. మధ్య ఆసియాలోని ఖ్వారిజియన్ సామ్రాజ్యం శక్తివంతమైనందున

**26.సి**

1. మామ్లుక్ బానిసలు సైనిక అవసరాలను తీర్చు బానిసలు

2. కుతుబుద్దీన్ ఐబక్

3. మంగోలులచే తరిమివేయబడిన జలాలుద్దీన్ మంగబార్నికి సాయం చేయ నిరాకరించుట

4. ఉక్కుపాద సిద్ధాంతం (Blood and Iron Policy)

# 27

# తురుష్క రాజ్యస్థాపన మరియు మామ్లుక్ సుల్తానులు

## 27.1 పరిచయం

క్రితం పాఠంలో మనం తురుష్కులు భారత్‌పై దండయాత్ర, మామ్లుక్ సుల్తానులు ఢిల్లీ సుల్తానత్ స్థాపనను గురించి చదివాం.

ఈ పాఠంలో ఈ కాలానికి చెందిన కొన్ని ప్రత్యేక విషయాలను గూర్చి తెలిసికొందాం. ముఖ్యంగా ఘజినీ మహమ్మద్, ఘోర్ మహమ్మద్‌ల దండయాత్రల లక్ష్యాలు భిన్నమైనవని, ఒకరు భారత సిరి సంపదలను కొల్లగొట్టాలనుకుంటే, మరొకరు భారత్‌లో రాజ్యస్థాపన చెయ్యాలని భావించాడు. ఒకరి దండయాత్ర వలన భారతదేశ సిరిసంపదలు తరలిపోగా మరొకరి దండయాత్ర వలన భారత్‌లో తురుష్క రాజ్య స్థాపన జరిగింది. ఈ పాఠంలో భారతదేశ రాజకీయ పరిస్థితులు, సామాజిక వ్యవస్థ ఎట్లా క్షీణించాయో, తురుష్కుల దాడులను ఎందువలన అరికట్టలేకపోయారో ఈ పాఠంలో చదువుదాం.

ఇంకా ఈ పాఠంలో ఢిల్లీ సుల్తానత్ పాలించిన వారిలో సుప్రసిద్ధమైన ఇల్‌టుట్‌మిష్, బాల్బన్‌ల గురించి చదువుతాం. ఇల్‌టుట్‌మిష్ సుల్తానత్‌కు నిజమైన స్థాపకుడైతే, బాల్బను సుల్తాన్ గౌరవ ప్రతిపత్తులను ఇనుమడింప చేసిన పాలనాదక్షుడు.

## 27.2 లక్ష్యాలు

ఈ పాఠం చదివిన తరువాత ఈ కింది విషయాలు తెలుసుకుంటారు.

1. ఘజినీ మహమ్మద్ దాడుల లక్ష్యాలు.
2. ఘజినీ మహమ్మద్ దాడులు మహమ్మద్ ఘోర్ విజయానికి దోహదం చేసిన వైనం
3. ఘోర్ మహమ్మద్ విజయాలు, భారత్‌లో తురుష్క రాజ్యస్థాపన
4. ఘజినీ మహమ్మద్, ఘోర్ మహమ్మద్‌ల దాడులు ప్రముఖంగా మతపరమైనవి కావని.
5. తురుష్కుల, రాజపుత్రుల మధ్య సంఘర్షణలో రాజపుత్రుల పరాజయానికి దోహదం చేసిన రాజకీయ, సైనిక, సాంఘిక కారణాలు.
6. ఇల్‌టుట్‌మిష్ ఎదుర్కొన్న రాజకీయ, పాలనా సమస్యలు.
7. ఢిల్లీ సుల్తానత్‌కు నిజమైన స్థాపకుడుగా ఇల్‌టుట్‌మిష్‌ను గుర్తించుట.

8. ఇల్‌టుట్‌మిష్ సైనిక, పాలనా, ఆర్థిక రంగాలలో సాధించిన విజయాలు.

9. ఇల్‌టుట్‌మిష్ కాలంలో సుల్తానత్‌కు మొదటిసారిగా మంగోలుల బెడద ప్రారంభమై తరుచుగా కొనసాగిందని.

10. సింహాసన మధిష్టించిన వెంటనే బాల్బన్ ఎదుర్కొన్న సమస్యలు.

11. బాల్బన్ రాజధర్మ స్వభావం, సాధించిన విజయాలు.

## 27.3 ఘజినీ మహమ్మద్, ఘోర్ మహమ్మద్‌లు సాధించిన విజయాల తులనాత్మక విశ్లేషణ

ఘజినీ మహమ్మద్, ఘోర్‌మహమ్మద్‌లు సాధించిన విజయాలను బేరీజు వేసేముందు ఆ విజయాలను నిర్దేశించిన వారి రాజకీయ, ఆర్థిక, సైనిక లక్ష్యాలు, నాటి మధ్య ఆసియా, భారత్‌లలోని రాజకీయ పరిస్థితులను క్షుణ్ణంగా అధ్యయనం చేయాలి. పైగా ఈ రెండు దాడుల మధ్య చాలా సంవత్సరాల వ్యవధి ఉంది. ఘజినీ మహమ్మద్ దాడులు క్రీ.శ. 1001–1026 సంవత్సరాల మధ్య జరగగా, ఘోర్ మహమ్మద్ దాడులు క్రీ.శ. 1175–1206 సంవత్సరాల మధ్య జరిగాయి.

### ఘజినీ మహమ్మద్, ఘోర్ మహమ్మద్ దాడుల లక్ష్యాలు భిన్నమైనవి

ఘజినీ మహమ్మద్ భారతదేశ సిరిసంపదలను కొల్లగొట్టాలనే దాడులు నిర్వహించాడు. రాజ్యస్థాపనకు కాదు. భారత సిరిసంపదలతో తన మధ్య ఆసియా రాజ్యాన్ని (ఖోరసాన్) సుస్థిరపరచి, విస్తరింపదలచాడు. షహబుద్దీన్ మహమ్మద్ భారత సిరిసంపదలను దోచుకున్నా భారత్‌లో సామ్రాజ్య స్థాపనే అతని ధ్యేయం. దీనికి ముఖ్య కారణం మధ్య ఆసియా విస్తరణలో ఖారిజిమయన్ చేతలలో చిత్తుగా ఓడటం. ఇట్టి స్థితిలో రాజ్యవిస్తరణకు, భారత్‌లో సుస్థిర రాజ్యస్థాపనకు అతడు లక్ష్యంగా పెట్టుకోక తప్పలేదు.

ఘజినీ మహమ్మద్ తన దాడులలో బలహీనమైన భారతదేశ రాజ్యాలను ఎదుర్కొనగా, ఘోరీ మహమ్మద్ శక్తివంతమైన రాజ్యాలను ఎదుర్కొనవలసి వచ్చింది. హుణులు భారతీయ సమాజంలో చేరిపోగా అరబ్బుల విజయం వలన ఎట్టి ముప్పు సంభవింపలేదు. ఆ తదుపరి నాల్గు శతాబ్దాలు భారత్ విదేశీ దాడుల ప్రమాదం లేదు. ఇట్టిస్థితిలో భారత్‌లోని రాజ్యాలు పరస్పర కలహాలలో నిమగ్నమై విదేశీ దాడుల నెదుర్కొనుటకు సంసిద్ధులుగా లేవు. అయినా ఘోర్ మహమ్మద్ బలమైన రాజపుత్ర రాజ్యాలను ఎదుర్కొనక తప్పలేదు. ఆ రాజ్యాలు అజ్మీర్ పాలకులైన చౌహాన్‌లు, మాళ్వా పాలకులైన పరమారులు, కనూజ్ పాలకులైన గహద్వాలులు, గుజరాత్ పాలకులైన చాళుక్యులు. ఈ నేపథ్యంలో ఘజినీ మహమ్మద్, ఘోర్ మహమ్మద్‌ల విజయాలను అంచనా వేయాలి.

యుద్ధవీరుడుగా, సైన్యాధిపతిగా ఘోరీ మహమ్మద్ కంటె ఘజినీ మహమ్మద్ ఎక్కువ విజయాలను సాధించాడు. క్రీ.శ. 1001–1026 సంవత్సరాల మధ్య ఘజినీ మహమ్మద్ ప్రతి సంవత్సరం అటు మధ్య ఆసియాపైగాని, ఇటు భారత్‌పైగాని దాడులు కొనసాగించాడు. ఈ దాడులలో ఘన విజయాలను సాధించాడే కాని, ఓటమి నెరుగడు. భారత్‌లో ఉజ్జయినీ, గ్వాలియర్, కలింజర్, ఢిల్లీ, అజ్మీర్ ఏర్పరచిన రాజపుత్ర కూటమిని సైతం చిత్తుగా ఓడించాడు. కాని ఘోరీ మహమ్మద్ దాడులు పరాజయాలతో కూడుకొనినవి. ఘోరీ మహమ్మద్ క్రీ.శ.1178లో జరిగిన అనిహిల్‌వాడ యుద్ధంలో గుజరాత్ చాళుక్యుల చేతిలో, క్రీ.శ. 1191లో జరిగిన మొదటి తరైన్ యుద్ధంలో పృథ్వీరాజ్ చౌహాన్ చేతిలో చిత్తుగా ఓడిపోయాడు. ముఖ్యంగా మొదటి తరైన్ యుద్ధంలో ప్రాణం దక్కించుకోగలిగాడు.

రాజకీయంగా ఘజినీ మహమ్మద్ కంటే ఘోరీ మహమ్మద్ ఘన విజయాన్ని సాధించాడు. ఘోరీ మహమ్మద్ అనిహిల్‌వాడ్, మొదటి తరైన్ యుద్ధాలలో ఓడినా, మొక్కవోని పట్టుదలతో భారత్‌లో సామ్రాజ్య స్థాపన చేయగలిగాడు. ఆయన దాడులు ఆక్సస్ నది నుండి యమునా నది వరకు విస్తరించాయి. రెండవ తరైన్, చాందాదార్ యుద్ధాలలో విజయాన్ని సాధించి ఢిల్లీ, అజ్మీర్, కనూజ్‌ల హస్తగతం చేసుకున్నాడు. స్వదేశానికి వెళ్తూ భారత్‌లో జయించిన ప్రాంతాలకు ఐబక్‌ను రాజప్రతినిధిగా నియమించాడు. క్రీ.శ. 1206లో ఘోరీ మహమ్మద్ మరణించినా, ఐబక్ ఢిల్లీ సుల్తానత్ రాజ్యస్థాపన చేసి ఆయన లక్ష్యాన్ని నెరవేర్చాడు. ఇట్లు భారత్‌లో ముస్లిం రాజ్యస్థాపన చేసిన ఘనత ఘోర్ మహమ్మద్‌దే.

ఘజినీ మహమ్మద్ ప్రతి సంవత్సరం భారత్‌పై దాడులు నిర్వహించినా రాజకీయంగా ఎట్టి శాశ్వత ఫలితం చేకూరలేదు. పంజాబు, ముల్తాన్‌లను ఆక్రమించినా అవి ఒకటిన్నర శతాబ్ది కాలం మాత్రమే వారి ఆధీనంలో ఉంది. దీనిని ఘోరీ మహమ్మద్ హస్తగతం చేసుకున్నాడు. ఘజినీ మహమ్మద్ లక్ష్యం భారతదేశ సిరిసంపదలను కొల్లగొట్టుటే గనుక, తాను జయించిన ప్రాంతాలపై తన ఆధిపత్యాన్ని నెలకొల్పటానికి ఎట్టి చర్యలు గైకొనలేదు. కాని ఘజినీ మహమ్మద్ దాడులు పరోక్షంగా ఘోరీ మహమ్మద్ విజయాలకు దోహదం చేశాయి. అదెట్లనగా వాయువ్య ప్రాంతాన నున్న పర్వత శ్రేణులు దాటివచ్చే మార్గాన్ని సుగమం చేయటం, భారత్‌పై దాడుల వలన ఆ రాజ్యాల సైనిక సంపత్తిని నాశనం చేసి, ఆ రాజ్యాల సిరిసంపదలను దొచుకొని వాని ఆర్థిక వ్యవస్థను దెబ్బతీయటం వలన ఘజినీ మహమ్మద్ తనకు తెలియకుండా ఘోరీ మహమ్మద్ విజయానికి కారకుడయ్యాడు.

కొందరు చరిత్రకారులు ఘజినీ మహమ్మద్, ఘోరీ మహమ్మద్‌ల దాడులకు మతాన్ని కారణంగా ఆపాదించారు. వీరిరువురు తమ యుద్ధాలను జీహాద్‌లుగా (పవిత్ర యుద్ధాలుగా అనగా ముస్లిమేతరులపై సాగించే యుద్ధాలు) ప్రకటించటం, దేవాలయంలోని విగ్రహాలను ధ్వంసం చేయటం ఇందుకు ఉదాహరణగా పేర్కొన్నారు. కాని నేడు కొందరు చరిత్రకారులు వీనికి వేరే భాష్యం చెబుతున్నారు. భిన్నజాతులు అనగా తురుష్కులు, పర్షియన్లు, ఆఫ్ఘనులతో మిళితమైన ముస్లిం సైన్యంలో సంఘీభావాన్ని పెంపొందించుటే జీహాద్ అనే నినాదం తెరపైకి వచ్చిందని, దేవాలయాల సిరిసంపదలను కొల్లగొట్టడం మరొకరి ధ్యేయం. రాజ్యస్థాపనా కాంక్ష తప్ప మరేమి కాదు. కేవలం మత కారణంగా హిందువులను చంపారనటం సరికాదు. ఎందువలనంటే మధ్య ఆసియా దాడులలో వారు వారి మతస్థులనే చంపారు కదా. అయితే ముస్లింల మతావేశాన్ని విస్మరింపరాదు.

సారస్వత, కళాభిమానిగా ఘోరీ మహమ్మద్ అనామకుడు. దీనికి భిన్నంగా ఘజనీ మహమ్మద్ నాటి మధ్య ఆసియాలో పేరు మోసిన ఫిరదౌశి, ఉత్బ, ఫరాచి వంటి కవులను పోషించాడు. ఘజినీలు ఒక గ్రంథాలయాన్ని, ఒక ప్రదర్శనశాలను నెలకొల్పాడు. సమకాలీన ఇస్లామిక్ వాస్తు కళల మేలి కలయికతో ఘజినీలో గొప్ప మసీదును నిర్మించాడు.

ఘజినీ మహమ్మద్ భారతదేశ సిరి సంపదలను కొల్లగొట్టటానికే భారత్‌పై దాడులు నిర్వహించాడు. కాని ఘోరీ మహమ్మద్ దాడుల లక్ష్యం – భారత్‌లో రాజ్యస్థాపన

## 27 ఎ. పాఠ్య ప్రశ్నలు

1. ఈ కింద పేర్కొన్న విషయాలు లేక అంశాలు ఎవరికి వర్తించును? ఘజినీ మహమ్మద్‌కా లేక ఘోరీ మహమ్మద్‌కా గుర్తింపుము.

i) భారతదేశ సిరిసంపదలను కొల్లగొట్టుట

ii) భారత్‌లో రాజ్యస్థాపన

iii) ఆల్‌బెరూనీ, ఉత్బీ, ఫరాచీ, ఫిరదౌశి

iv) కుతబుద్దీన్ ఐబక్ అనే బానిస సేనాని రాజప్రతినిధిగా నియమించాడు.

v) 1178 అనిహిల్‌వాడ్ యుద్ధం

vi) మొదటి, రెండవ తరైన్ యుద్ధాలు

vii) ఖురాసాన్ (మధ్య ఆసియా) రాజు

viii) ఖార్‌జమియాన్ రాజవంశీయుల చేతిలో ఓటమి

**2. ఈ కింది ఖాళీలను పూరింపుము.**

i) భారత్ దాడుల విషయంలో ______________ సాధించిన విజయాలు గొప్పవి.

ii) ______________ సోమనాథ దేవాలయాన్ని ముట్టడించాడు.

iii) ______________ భారత్‌లో తమ దాడులను సుస్థిరపరచుకోవాలని లక్ష్యం లేదు.

iv) ______________ ధ్యేయం భారత్‌లో తురుష్క రాజ్యస్థాపన

3. ఘజినీ మహమ్మద్, ఘోర్ మహమ్మద్‌లు తమ దండయాత్రలలో జీహాద్ అనే నినాదం ఎందుకిచ్చారు?

## 27.4 తురుష్కుల ఉత్తర భారత విజయానికి వారి నెదుర్కొనుటలో రాజపుత్రుల పరాజయానికి గల కారణాలు

తురుష్కుల విజయానికి, వారినెదుర్కొనుటలో రాజపుత్రల వైఫల్యానికి ముఖ్య కారణాలు – రాజపుత్రుల రాజకీయ, సామాజిక బలహీనతలు, ఆర్థిక, సైనిక రంగాలలో దినదినాభివృద్ధి చెందుతున్న వెనుకబాటుతనం.

రాజపుత్రుల రాజకీయ వ్యవస్థలో అనేక లోపాలున్నాయి. క్రీ.శ. 11, 12వ శతాబ్దిలో వీరు అనేక స్వతంత్ర రాజ్యాలుగా విభక్తమై, పరస్పర కలహాలతో నిమగ్నమై యున్నారని మనం చదివాం. ఈ యుద్ధాలు రాజ్య విస్తరణకేగాక, వ్యక్తిగత అధికార దర్పానికి, తరచూ స్వల్ప కారణాలకు జరిగాయి. ఈ నిరంతర యుద్ధాల వలన రాజపుత్రుల ఆర్థిక వ్యవస్థ, సైనిక పాటవం దెబ్బతిన్నాయి. రాజపుత్రులకు యుద్ధం అనేది ధైర్యసాహసాల క్రీడ.

రాజపుత్రుల బలహీనతకు మరొక కారణం – రాజపుత్ర రాజ్యాలలో నెలకొన్న భూస్వామ్య వ్యవస్థ. రాజపుత్ర రాజ్యాలలో భూస్వాములే పాలకులు. వీరు రెవెన్యూ వసూలు చేసి, సైన్యాన్ని పోషించి యుద్ధ సమయాలలో రాజుకు సాయపడెడివారు. ఇట్టి వ్యవస్థలో రాజుకు సైనికునికి, రాజుకు ప్రజలకు ప్రత్యక్ష సంబంధముండదు. అందువలన సైన్యం, ప్రజలు రాజుకంటె భూస్వాములకే ఎక్కువ విశ్వాసపాత్రులై మసలుతారు. రాజు తన మనుగడకు భూస్వాములపై ఆధారపడే దుస్థితి ఏర్పడింది. భూస్వాములు స్వార్థపరులై సొంత సైన్యాన్ని సమకూర్చుకొని రాజును ధిక్కరించేవారు. ఇట్లు స్థానిక పాలకులపై కేంద్ర అధికారం, అజమాయిషీ సమర్థవంతంగా లేకపోవుట తురుష్కులకు చక్కని అవకాశం.

సైనికపరంగా రాజపుత్రుల సైన్యాల కంటె తురుష్క సైన్యాలకు ఎక్కువ అనుకూల పరిస్థితులున్నాయి. తురుష్క

అశ్వదళము శక్తివంతమైంది. వీరు బలిష్టమైన, శక్తివంతమైన మధ్య ఆసియా అశ్వాలను సమకూర్చుకోగా, రాజపుత్రులు నాసిరకమైన వానిని సమకూర్చుకున్నారు. అశ్వికులు తేలికపాటి యుద్ధ సామగ్రిని తన వెంట తీసుకొని యుద్ధంలో వేగవంతంగా పనిచేయుట సులభమయ్యెను. క్రీ.శ. పదవ శతాబ్ది నుండి మధ్య ఆసియాలో అశ్వికులు విలుకాండ్రుగా మారుటతో యుద్ధ గతియే పూర్తిగా మారిపోయింది. కాని రాజపుత్రులు అధిక యుద్ధ సామగ్రిని మోసుకొనిపోవుట, మందకొడిగా కదిలే గజబలం, కాల్బలంపై ఆధారపడి ఉండుట వారి ఓటమికి కారణభూతమైంది.

రాజపుత్రుల సైనిక నిర్మాణం లోపభూయిష్టమైంది. భూస్వాములు పంపే సైన్యంలో సమైక్యత, సంఘీభావం కొరవడింది. సైనికులు తమ భూస్వామికే ఎక్కువ విధేయత కలిగి ఉండటం, భూస్వాముల మధ్య పరస్పర సహకారం లేకపోవట మరొక బలహీనత. పరస్పర కలహాల వలన రాజపుత్ర సైన్యం యుద్ధ అలసటకు గురైంది. పైగా రాజపుత్రుల ఆర్థిక వనరులు దెబ్బతిన్నాయి. దీనికి భిన్నంగా తురుష్క సైన్యాలు కేంద్ర నియంత్రణలో ఉండటం, జీహాద్ అనే నినాదంతో, ఆవేశంతో, భారతదేశ సిరిసంపదలను కొల్లగొట్టాలనే ధనాశతో యుద్ధానికి సంసిద్ధమైనాయి.

వాయువ్య సరిహద్దు రక్షణ బాధ్యత తమదని రాజపుత్రులకు అవగాహన లేకపోవుట – రాజపుత్రుల ఓటమికి మరొక కారణం. ఘజినీ దాడులు భారత్‌లోనికి చొచ్చుకొని రావటాన్ని రాజపుత్రులు తీవ్రంగా పరిగణింపలేదు. దీనికి కారణం పంజాబు శతాబ్దాల తరబడి మధ్య ఆసియా రాజకీయాలతో ముడిపడి ఉంది. మధ్య ఆసియా వాసులైన శకులు, కుషాణులు, హుణులు పంజాబును ఆక్రమించి, తదుపరి భారత్‌పై దాడులు చేసినా, వారు భారతీయ సమాజంలో చేరిపోయారు. కనుక మధ్య ఆసియా వాసులైన తురుష్కులు అట్లాగే భారతదేశంలో స్థిరపడతారని రాజపుత్రులు భావించారు.

తురుష్కులు ప్రతిఘటించుటలో రాజపుత్రులు జాతీయ స్థాయిలో ఒక కూటమిగా ఏర్పడలేదు. రక్షణ అనగా తమ రాజ్య రక్షణకు ఇతరులకు సాయం చేయటం అనేది వారి భావన. క్రీ.శ. 1193–1203 సంవత్సరాల మధ్య ఘోర్ మహమ్మద్, ఐబక్ పూర్తిగా తమ అధికారాన్ని సుస్థిర పరచుకోలేదు. ఇట్టి స్థితిలో రాజపుత్రులు సమైక్యమై వారిని తరిమివేసే అవకాశం లభించింది. కాని ఈ అవకాశాన్ని రాజపుత్రులు జారవిడచారు.

భారతీయ సామాజిక వ్యవస్థా నిర్మాణం, ముఖ్యంగా కులభేదాలు సైతం రాజపుత్రుల ఓటమికి ప్రముఖ కారణం. సామాజిక, రాజకీయ ఐక్యతను కుల భేదాలు దెబ్బతీశాయి. రాజ్యపాలన, సైనిక విధులు, క్షత్రియ కులస్థులదే. క్షత్రియేతరులకు సైన్యంలో చోటు లేదు. ఇట్ల రాజపుత్ర సైన్యం దేశభక్తి స్ఫూర్తితో తురుష్కులను ప్రతిఘటింపలేదు. భారతీయులలో అధిక సంఖ్యాకులు విదేశీ దండయాత్రలంటే పాలనా మార్పు తప్ప తమ దైనందిన జీవితంలో ఎట్టి మార్పు యుండదని భావంపై గాఢంగా ఉంది.

క్రీ.శ. 11, 12వ శతాబ్దిలందు సామాజిక వ్యవస్థలో అగ్రకులజులైన, విజ్ఞులైన బ్రాహ్మణుల ఏకాంత విధానం, అహంకార భావం భారతదేశ వెనుకబాటు తనమునకు ముఖ్యకారణం. వీరు విదేశాలలో జరిగే శాస్త్రీయ, సాంకేతిక, యుద్ధ రంగాలలో జరిగే అభివృద్ధిని గ్రహింపలేదు. విదేశాలతో సంపర్కం వలన తమ వ్యవస్థ నాశనమైపోతుందని భావించారు. పైగా వీరికి గర్వాహంకారములు మెండుయని, మనదేశంలో పది సంవత్సరాలు గడిపిన, మధ్య ఆసియా పండితుడైన ఆల్‌బెరూనీ పేర్కొన్నాడు. ఆయన మాటలో చెప్పాలంటే "వారికి తమ దేశం వంటి దేశం గాని, తమ జాతి వంటి జాతి గాని, తమ రాజుల వంటి రాజు గాని, తమ శాస్త్ర పరిజ్ఞానమంతటి పరిజ్ఞానం ప్రపంచమందెక్కడా లేదని వారి విశ్వాసం.

ఈ అహంకార గుణమే వారి బలహీనత. ఆర్థికరంగంలో రాజపుత్రులు గ్రామీణ స్వయం పోషకత్వానికి

ప్రాధాన్యతనిచ్చి, విదేశీ వాణిజ్యాన్ని నిర్లక్ష్యం చేశారు. తత్ఫలితంగా క్రీ.శ.11, 12 శతాబ్దిలందు భారత్ ఆర్థిక పురోగతిని సాధించి పశ్చిమ దేశాలతో ధీటుగా నిలవలేకపోయింది. ఇట్లు విదేశీ వ్యాపార నిర్లక్ష్యం కూడా పరోక్షంగా రాజపుత్రుల పరాజయాన్ని ప్రభావితం చేసింది.

**తురుష్కుల విజయానికి, రాజపుత్రుల పరాజయానికి గల కారణాలు**

1. రాజకీయ కారణాలు:

   – రాజపుత్రులు అనేక చిన్న చిన్న స్వతంత్ర రాజ్యాలుగా విభక్తమగుట, పరస్పర కలహాలలో నిమగ్నమగుట.

   – రాజపుత్ర రాజ్యాలలో నెలకొన్న భూస్వామ్య వ్యవస్థ

2. సైనిక కారణాలు:

   – రాజపుత్రులు ఎక్కువ యుద్ధ సామాగ్రిని మోయుట, వేగంగా కదలని గజబలంపై ఆధారపడుట. తురుష్కులు తేలికపాటి యుద్ధ సామగ్రిని ఉపయోగించి, శక్తివంతమైన అశ్విక దళాన్ని సమకూర్చుకొనుట.

   – రాజపుత్ర సైన్యాల భూస్వామ్య స్వభావం

   – వాయువ్య ప్రాంత రక్షణకు రాజపుత్రులు సంసిద్ధులుగా లేకపోవుట.

3. సాంఘిక, ఆర్థిక కారణాలు:

   – భారతీయ సమాజంలోని కుల భేదాలు, వైషమ్యాలు.

   – బ్రాహ్మణుల ఏకాంత విధానం, విదేశాలలో జరిగే శాస్త్రీయ, యుద్ధ, సాంకేతిక రంగాలలోని ప్రగతిని ఆకళింపు చేసుకొనకపోవుట.

## 27.బి పాఠ్య ప్రశ్నలు

1. ఈ కింది వానికి ఒక కారణం తెలుపుము.

i) రాజపుత్రుల ఓటమికి రాజకీయ కారణం

ii) రాజపుత్రుల ఓటమికి సైనిక కారణం

iii) భారత్ వెనుకబాటుతనానికి కారణం

2. బాహ్య ప్రపంచంలో జరిగే అభివృద్ధిని విద్యావంతులైన భారతీయులు ఆకళింపు చేసికొన ఏకాంత విధానాన్ని ఎందుకు అనుసరించారు?

3. తురుష్కుల నెదుర్కొనుటకు రాజపుత్రులు ఒక సంఘటిత శక్తిగా ఎందుకు ఎదగలేదు?

## 27.5 ఇల్‌టుట్‌మిష్ సాధించిన విజయాలు

ఇల్‌టుట్‌మిష్ ఢిల్లీ సింహాసనమధిష్టించినపుడు అత్యంత క్లిష్ట పరిస్థితులను ఎదుర్కొనవలసి వచ్చెను. నాడు ఢిల్లీ సుల్తానత్‌కు నిర్దిష్టమైన రాజ్య సరిహద్దులుగాని, రాజరిక సిద్ధాంతంగాని లేవు. ఉత్తర భారతమంతా స్వతంత్ర రాజ్యములై ఢిల్లీ సుల్తానత్‌కు బెడదగా పరిణమించెను. ఘజనీ పాలకుడైన యల్‌దజ్ తను ఘోర్ మహమ్మద్ వారసుడునని ఢిల్లీ

రాజ్యమును కైవసము చేసికొన యత్నించుచున్నాడని సింధు పాలకుడైన కుబాచా స్వతంత్రుడై తన అధికారాన్ని లాహోర్, పంజాబులలో విస్తరింప చేయుటకు సంసిద్ధుడైనాడు. బెంగాల్‌తో ఆలీ మర్దాన్‌ఖాన్ స్వతంత్రుడైనాడు. ఢిల్లీ అమీరులలోని ఒక వర్గం (ఆరాంషా అనుయాయులు) ఇల్‌టుట్‌మిష్‌ను ప్రతిఘటించుచున్నారు. గ్వాలియర్, రణతంభీర్, కనింజర్, అజ్మీర్, బయానా–రాజపుత్రులు తురుష్కుల అధికారాన్ని అంతం చేసి స్వతంత్రులైరి. దీనికితోడు వాయువ్య ప్రాంతమున మంగోలు దాడులు ప్రారంభమయ్యెను. ఇట్లు ఢిల్లీ సుల్తానత్ మనుగడే ఒక సవాలుగా పరిణమించెను. ఇట్టి స్థితిలో ఇల్‌టుట్‌మిష్ విజ్ఞతతో, ధైర్యంగా వీనినెదుర్కొని ఢిల్లీ సుల్తానత్‌కు ఒక రాజ్యాన్ని, హోదాను, రాజరికపు ప్రభుత్వాన్ని, పాలనా వ్యవస్థను ప్రసాదించాడు. ముఖ్యంగా తన యజమానియైన ఘోరీమహమ్మద్ జయించిన రాజ్యాలన్నింటిని సమైక్యం చేసి ఢిల్లీ సుల్తానత్‌కు నిజమైన పునాదులు వేసెను.

తొలుత ఢిల్లీ అమీరులనణచి, ఢిల్లీ ఏలుబడిలో నున్న అయోధ్య బదేన్, బెనారస్, సిలేఎల్ మున్నగువానిని పూర్తిగా తన ఆధీనంలోనికి తెచ్చుకొనెను. క్రీ.శ. 1216లో యల్‌డజ్ నోడించి లాహోర్‌ను ఆక్రమించెను. ఈ విజయంతో ఘజనీ, ఘోర్ రాజ్యాలతో అనగా మధ్య ఆసియా రాజకీయాలతో తెగతెంపులు చేసికొని, ఢిల్లీ సుల్తానత్ పూర్తి స్వతంత్ర ప్రతిపత్తిగల రాజ్యంగ తీర్చిదిద్దుకుంది. కుబాచాను ఓడించి అతని మరణానంతరం ముల్తాన్, ఉచ్, సింధ్ ప్రాంతముల నాక్రమించెను. క్రీ.శ. 1224–29 సంవత్సరాల మధ్య బెంగాల్‌పై దాడులు చేసి ఖిల్జీల నణచి, బెంగాల్‌ను వశపరచుకొనెను. కాని గుజరాత్, మాల్వాలను హస్తగతం చేసుకోవాలనే ఇల్‌టుట్‌మిష్ ఆకాంక్ష నెరవేరలేదు. గుజరాత్‌పై దాడిని చాళుక్యులు తిప్పికొట్టారు. మాల్వాపై దాడి చేసి ఖిల్సా కోటను ఆక్రమించి, ఉజ్జయినీ నగరాన్ని దోచుకున్నా శక్తివంతులైన పరమారులను లొంగదీసుకోలేకపోయాడు.

ఇట్టి ఘన విజయములను సాధించుటచే బాగ్దాద్ అబ్బా సిడ్ ఖలీఫా ఆయనకు "నాజర్ అమీల్ ఉల్‌మమినిన్" (Aid of the commander of the faithful) అనే బిరుదునిచ్చి, ఢిల్లీ రాజ్యాధినేతగా గుర్తిస్తూ 1229లో అధికార పత్రాన్ని (Letter of Investitute) అందజేశాడు. దీనితో ఇల్‌టుట్‌మిష్‌కు న్యాయపరంగా పూర్తి సార్వభౌమాధికారం లభించింది.

మంగోలుల బెడద నివారించుటలో ఇల్‌టుట్‌మిష్ విజ్ఞతతో వ్యవహరించాడు. మంగోలులు చెంఘిజ్‌ఖాన్ నాయకత్వంలో మధ్య ఆసియా రాజ్యాలను హస్తగతం చేసికుంటూ సింధు నది వరకు వచ్చాడు. అప్పుడు చెంఘిజ్‌ఖాన్ చేతిలో ఓడిన క్వారజాం ప్రభులైన జలాలుద్దీన్ మంగబార్నీ పంజాబ్‌కు పారిపోయి ఇల్‌టుట్‌మిష్ సాయమర్థించెను. మంగబార్నికి సాయం చేస్తే మంగోలులతో యుద్ధం తప్పదని భావించి ఇల్‌టుట్‌మిష్ అతని సాయం చేయలేదు. ఇట్టి ఇల్‌టుట్‌మిష్ రాజనీతిజ్ఞత వలన ఢిల్లీ సుల్తానత్‌కు మంగోలుల బెడద తప్పింది

నాటి అరాచక రాజకీయ పరిస్థితులను అధిగమించి ఇల్‌టుట్‌మిష్ రాజరిక ప్రభుత్వాన్ని నెలకొల్పాడు. సుల్తాన్ అధికారాన్ని పటిష్టం చేయటానికి, తురుష్క బానిస అధికారులతో కూడుకొనిన తుర్కాన్. ఇ–చహల్‌గనీ అనే సర్దారుల కూటమిని ఏర్పరచాడు. వీరికి అత్యంత గౌరవమిచ్చాడు. పాలనా నిర్వహణకై తురుష్కేతర విదేశీయులను నియమించి వారి మద్దతును పొందాడు. రాజుకు కప్పం చెల్లిస్తూ, సైనిక సహాయం చేయు స్థానికాధికారుల సహకారాన్ని సైతం పొందాడు. వీరికి గల వంశపారంపర్యపు హక్కులను గుర్తించి, వారు కప్పం చెల్లింపకపోతే తప్ప లేక తిరుగుబాటు చేసే తప్ప వానిని తొలగించేవాడు కాదు.

ఇట్లు రాజ్యంలో నున్న భిన్న ప్రముఖ రాజకీయ శక్తులన్నింటిని కలిపి ఒకే పాలనా వ్యవస్థలోనికి తీసుకొచ్చాడు. చహలగనీ సర్దారులు ఇల్‌టుట్‌మిష్ కాలంలో సుల్తానత్‌కు సుస్థిరతను ప్రసాదించాడు. కాని ఇల్‌టుట్‌మిష్ మరణానంతరం

ఈ సర్దారులు స్వార్థపరులై అధికార వ్యామోహంతో, పరస్పర కలహాలతో నిమగ్నమై, సుల్తాన్ అధికారాన్నే ధిక్కరించే స్థాయికి ఎదిగారు. అయితే వీరి దర్పాన్ని చహలగనీ సర్దారులలో నొకడైన, ఢిల్లీ సుల్తాన్‌యైన బాల్బన్ అణచివేశాడు.

ఢిల్లీ సుల్తానత్ పాలనా వ్యవస్థకు సైతం ఇల్‌టుట్‌మిష్ గణనీయమైన సేవ చేశాడు. రాజ్యాన్ని 'ఇక్తా' అను సైనిక రాష్ట్రాలుగా విభజించి, ఇక్తాదార్ ఆధీనంలో ఉంచాడు. ఇక్తాదార్ తనకు కేటాయించిన ఇక్తా (భూమి) నుండి పన్ను వసూలు చేసి, అందులో కొంత భాగాన్ని సైన్య పోషణకు వెచ్చించేవాడు. ఇక్తా పాలనా బాధ్యత – ఇక్తాదార్ దే. పరిపాలనా, శాంతిభద్రతలను కాపాడుట ఇక్తాదార్ ముఖ్య విధులు. ఇల్‌టుట్‌మిష్ నాణేలను సంస్కరించి రెండు రకాలైన నాణేలు ముద్రించాడు. 1) టంకా–వెండి నాణెం 2) జిట్టల్ – రాగి నాణెం.

దో–ఆబ్ ఆర్థిక పరిపుష్టి కల్గిన ప్రాంతమని గుర్తించి, ఈ ప్రాంతంలోనే ఎక్కువ ఇక్తాలను ఇల్‌టుట్‌మిష్ ఏర్పాటు చేశాడు. అయితే 'ఇక్తా' పద్ధతిలో కూడా కొన్ని లోపాలు లేకపోలేదు.

ఇల్‌టుట్‌మిష్ అనుసరించిన విధానాలు సనాతన ముస్లిం మతాధికారుల ప్రభావానికి లోనుకాలేదు. ముస్లిం మతాధికారుల (ఉలేమా)లోని ఒక వర్గం ఇస్లామిక్ న్యాయ సూత్రాలను ప్రవేశపెట్ట వలసిందిగా ఇల్‌టుట్‌మిష్ కోరాడు. ఈ సూచనను ఇల్‌టుట్‌మిష్ తిరస్కరించాడు. ఈ సూచనను అమలు పరచిన యెడల అధిక సంఖ్యాకులైన ముస్లిమేతరుల మద్దతును కోల్పోయే ప్రమాదముందని, తత్ఫలితంగా బాల్యదశలో ఉన్న సుల్తానత్‌కు తీవ్ర నష్టం కల్గునని భావించాడు.

ఇల్‌టుట్‌మిష్ "తుర్కన్–యి–చహల్‌గని" అనే టర్కిష్ ప్రభు వర్గాన్ని నలభై మందితో ఏర్పాటు చేశాడు. ఇల్‌టుట్‌మిష్ మరణానంతరం చహల్‌గనీ" అధికార దాహంతో, పరస్పర కలహాలతో సుల్తాన్‌ను ధిక్కరించే స్థాయికి ఎదిగారు. అయితే బాల్బను వీరిని అణచాడు.

## 27.5 పాఠ్య ప్రశ్నలు

1. ఇల్‌టుట్‌మిష్ సింహాసన మధిష్టించినపుడు ఎదుర్కొన్న సమస్యలలో రెండింటిని పేర్కొనుము.
2. సుల్తానత్‌ను శక్తివంతంగా తీర్చిదిద్దుటకు ఇల్‌టుట్‌మిష్ గైకొన్న చర్యలేమి?
3. 'తుర్కన్–యి–చహల్‌గనీ' సర్దారుల కూటమినేర్పరచుటలో ఇల్‌టుట్‌మిష్ లక్ష్యమేమి?
4. దోఆబ్ ప్రాంతంలో ఇల్‌టుట్‌మిష్ ఎక్కువ ఇక్తాలు ఇవ్వటానికి గల కారణమేమి?
5. సుల్తానత్‌లో ముస్లిం న్యాయ సూత్రాలను ఇల్‌టుట్‌మిష్ ఎందువలన ప్రవేశపెట్టలేదు?

## 27.6 బాల్బన్ సాధించిన విజయాలు

క్రీ.శ. 1266లో బాల్బన్ ఢిల్లీ సుల్తానైనపుడు రాజ్యం అనేక క్లిష్ట సమస్యల నెదుర్కొనవలసి వచ్చెను. తొలుత చహల్‌గనీ సర్దారులతో సంబంధాలను పునర్వ్యవస్థీకరించారు. ఇల్‌టుట్‌మిష్ మరణానంతరం చహల్‌గనీ సర్దారులందు అధికార వ్యామోహం, ద్రోహ చింత, స్వార్థం పెచ్చు పెరిగి సుల్తాన్ అధికారాన్నే ధిక్కరించే స్థాయికి ఎదిగారు. మొన్నటిదాక ఇందులో సభ్యుడైన బాల్బన్ కీలకపాత్ర వహించాడు. కాని నేడు అధికారాన్ని సవాల్ చేసే స్థాయికి వారు ఎదగడం వలన బాల్బన్ నూతన రాజధర్మ సిద్ధాంతాన్ని ప్రవచించాడు. రాజపుత్రులను పూర్తిగా తన ఆధీనంలోనికి తెచ్చుకోవాలి.బియాస్ నది వరకు విస్తరించి, నిరంతరం సాగే మంగోలు దాడులను సమర్థవంతంగా ఎదుర్కోవడం,

ఢిల్లీ, దో–ఆబ్ ప్రాంతాలపై దోపిడీలకు పాల్పడే మేవాటిస్ వలన శాంతి, భద్రతల సమస్య ఏర్పడింది. సుల్తాన్ అంటే భీతి గాని, గౌరవం గాని లేవు. బరానీ చరిత్రకారుని మాటలో చెప్పాలంటే "దేశ పరిస్థితి కడు దీనావస్థలో ఉంది". ఇట్టి స్థితిలో బాల్బన్ రాజ్య విస్తరణ కంటే రాజ్య సుస్థిరతకే ప్రాధాన్యమిచ్చి ఉక్కు మనిషిగా వ్యవహరించాడు.

### రాజ్యవిస్తరణను కాంక్షించకుండుటకు గలకారణములు

1. రాజధానిని వీడి దండయాత్రలకు వెళితే, ఇదే అదనుగా భావించి మంగోలులు ఢిల్లీ, దో–ఆబ్‌లపై బడి దోచుకొను ప్రమాదం కలదు.
2. ఆంతరంగికముగా చహల్‌గనీ సర్దారులు తిరుగుబాట్లు, రాజపుత్రుల స్వాతంత్ర్యకాంక్ష వలన సుల్తానత్‌కు భద్రత లేదు.
3. తాను జయించిన రాజ్యాలలో పాలన సజావుగా సాగాలంటే సమర్థులైన అధికారులు, బలమైన సైన్యం కావాలి. ఇట్టి పరిస్థితిలో వారి సేవలను మరొక విధంగా వినియోగించదలచుకోలేదు. కనుక బాల్బన్ విజ్ఞతతో రాజ్య విస్తరణ కంటే సుస్థిరకే ప్రాధాన్యమిచ్చాడు.

రాజ్య సుస్థిరతలో భాగంగా తొలుత రాజ్యంలో, ఢిల్లీ పరిసర ప్రాంతాలలో శాంతిభద్రతలను పునరుద్ధరింప దలచెను. నిత్యం దారిదోపిడీలకు పాల్పడే మెవాటిన్స్ దారిదోపిడీ దొంగలను వేటాడి చంపెను. దోఆబ్‌లో అడవులనరికి, రహదారులను వేయించి, సైనిక స్థావరములను ఏర్పాటు చేసి దారిదోపిడీలను నివారించుటేగాక, రాజపుత్రుల తిరుగుబాట్లను సైతం సునాయాసంగా అణచుటకు వీలు కల్పించెను. ఈ చర్యల వలన "దారిదోపిడీ దొంగల బారి నుండి రహదారుల భద్రతకు 60 సంవత్సరాలు పట్టిందని" బరానీ పేర్కొన్నాడు. బెంగాల్‌లో తుఘ్రిక్‌ఖాన్ తిరుగుబాటు నణచి, తన రెండవ కుమారుడైన బుగ్రాఖాన్‌ను పాలకుడిగా నియమించెను.

రాజరిక ఔన్నత్యాన్ని ఇనుమడింప జేయుటకు బాల్బన్ రాజు దైవాంశ సంభూతడను నూతన సిద్ధాంతాన్ని ప్రవచించాడు. "జిల్లి ఇల్లహ" అను బిరుదు వహించి, రాజుకు మిగిలిన మానవాళికి ఎట్టి పోలిక లేదని రాజు హృదయం భగవదనుగ్రహానికి నిలయమని ఉద్ఘాటించాడు. ఈ సిద్ధాంతం రాజ్యాధికారం భగవంతుని ప్రసాదమే తప్ప ప్రభువర్గానికి కాని, ప్రజలది గాని కాదని, రాజు ఎవ్వరికీ సమాధానం చెప్పనవసరం లేదని, తనను ప్రశ్నించే అధికారం ఎవ్వరికీ లేదని విదితం చేసింది. ఈ సిద్ధాంతం నిరంకుశ రాజరికాన్ని శక్తివంతం చేసింది.

రాజరిక ఔన్నత్యాన్ని పెంపొందించుటకు అనేక చర్యలు గైకొనెను. తాను తురుష్క పురాణ గాథలలోని వీర పురుషుడైన (ఫిరదౌసి షానామాలో పేర్కొన్న) అఫ్రాసియబ్ సంతతికి చెందినవాడనని తన ఔన్నత్యమును పెంచుకొనెను. అనేక పారశీక సంప్రదాయాలను అనగా సాష్టాంగ దండ ప్రణామం, సుల్తాన్ పాదంను గాని, సింహాసనంను గాని ముద్దు పెట్టుకొనుట మున్నగువానిని ప్రవేశపెట్టెను. క్రమశిక్షణను పాటించి తానెల్లప్పుడూ రాజదుస్తులలోనే దర్శనమిచ్చేవాడు. తానెవ్వరితోను సభాముఖమున తప్ప మాట్లాడేవాడు కాదు. బయటకు వెళ్ళునప్పుడు రాజకీయ పటాటోపముతో సాగేవాడు. ఇట్టి చర్యల వలన ప్రజలు తిరుగుబాటు స్వభావం కలవారు విధేయులుగా మసలునట్లు చేసెను. సుల్తాన్ పట్ల ప్రజలలో భీతి, గౌరవం పెరిగింది.

బాల్బన్ తురుష్క ప్రభువర్గ ఔన్నత్యానికే పాటుపడ్డాడు. హీనకులజులను ప్రభుత్వ శాఖలలోని కీలక పదవుల నుండి తొలగించాడు. "హీనకులజుని చూడగానే ఆయన కళ్లు ఎరుపు ఎక్కేవని, ఆ కోపంతో ఆయన చేయి కత్తిమీదకు

పోయేదని" బాల్బన్ అన్నట్లు బరానీ చరిత్రకారుడు వ్రాశాడు. ఈ చర్యల వలన అసంఖ్యాక భారతీయ ముస్లింలు తమ పదవులను కోల్పోయారు. ఇందుకు ముఖ్య కారణం తురుష్కేతర ముస్లింయైన ఇమ్మనుద్దీన్ రైహన్ క్రీ.శ. 1252-53 సంవత్సరాల మధ్య నజీరుద్దీన్ మహమ్మద్ కాలంలో బాల్బన్‌ను ప్రధానిగా తొలగించుటే.

తురుష్క ప్రభు వర్గ ఔన్నత్యానికి పాల్పడినా, వారితో అధికారాన్ని పంచుకోవటం బాల్బన్‌కు ఇష్టం లేదు. ఇల్‌టుట్‌మిష్ కుటుంబీకులను, శక్తివంతుడైన తన అధికారాన్ని ధిక్కరించే సర్దారులను, తుదకు తన బంధువైన షేర్‌ఖాన్ సైతం పదవుల నుండి తొలగించెను. తురుష్క ముస్లిమేతరులను అణచుటలో తురుష్క ప్రభు వర్గాన్ని వాడుకున్నాడు. తురుష్క సర్దారులపై కఠిన ఆంక్షలు విధించి, వారి దర్పాన్ని అణచి, తనకు విధేయులుగా మసలునట్లు చేశాడు.

బాల్బన్ న్యాయ నిర్వహణలో నిష్పక్షపాతిగా వ్యవహరించాడు. ప్రజల విశ్వాసాన్ని పొందటానికి, ప్రభువర్గ అధికారాలకు హెచ్చరికగా, తన అధికారాన్ని ధిక్కరించిన ఎంతటి అత్యున్నత స్థాయి వ్యక్తినైనా బాల్బన్ శిక్షించుటలో వెనుకాడలేదు. అయోధ్య ఇక్తాదార్‌యైన హెబత్‌ఖాన్, బదేన్ పాలకుడైన మక్‌బక్‌లు తమ బానిసల పట్ల క్రూరంగా ప్రవర్తించాడు, వారిని కఠినంగా శిక్షించాడు.

బాల్బన్ బలమైన కేంద్రీకృత పాలనా వ్యవస్థకు శ్రీకారం చుట్టాడు. తాను అధికారంలోనూ రావటానికి సృష్టించిన నాయబ్ (ప్రధాని) పదవిని రద్దు చేసి, తానే వజీర్‌గా ఆర్థిక, సైనిక పాలనా బాధ్యతలు స్వీకరించాడు. అన్ని నియామకాలను తనే స్వయంగా నిర్వహించి, ప్రభువర్గం, రాష్ట్ర పాలకులపై గూఢచారీ నిఘా పెంచి తుగ్రిల్‌ఖాన్ వంటి తిరుగుబాట్లు చెలరేగకుండా జాగ్రత్త వహించాడు.

ఢిల్లీ సుల్తానత్‌కు బలిష్టమైన సైన్యమవసరమని బాల్బన్ గుర్తించాడు. బాల్బన్ సైనిక శాఖను (దివాన్-ఇ-అరిజ్) పునర్వ్యవస్థీకరించాడు. సైనికుల జీతాలు పెంచి, వారు సర్వదా యుద్ధానికి సంసిద్ధులగునట్లు తర్ఫీదు నిచ్చాడు. సైనికులుగా అర్హతలేని వారిని తొలగించి ఫించన్లు ఇచ్చెను. అయితే అవినీతిలో కూరుకుపోయిన ఇక్తాదార్ వ్యవస్థలో ఎట్టి మార్పులు చేయలేదు. కాని ఇక్తాల నుండి వచ్చే మిగులు ఆదాయాన్ని కేంద్ర ఖజనాకు జమచేసే బాధ్యతను నిర్వర్తించుటకు 'కురాజ' అనే అధికారిని నియమించాడు.

మంగోలు దాడులనెదుర్కొనుటకు సకల చర్యలు గైకొన్నాడు. వాయువ్య సరిహద్దు ప్రాంతంలో నున్న పాత దుర్గములను మరమ్మతులు చేయించి, కీలక ప్రాంతాలలో నూతన దుర్గాలను నిర్మించాడు. వాయువ్య సరిహద్దు ప్రాంతాన్ని ముల్తాన్, సమీనా అను రెండు రాష్ట్రాలుగా విభజించి, అక్కడ సైనిక స్థావరాలను ఏర్పాటు చేసి, వాని పాలనా నిర్వహణను తన పెద్ద కుమారుడైన మహమ్మద్‌కు అప్పగించాడు. ఈ దాడులలో మహమ్మద్ మరణించినా బాల్బన్ మంగోలు దాడులను విజయవంతంగా తిప్పికొట్టెను. ముల్తాన్ సుల్తానత్‌లో అంతర్భాగమైంది.

ఇట్లు బాల్బన్ సుల్తాన్ గౌరవ ప్రతిపత్తులను ఇనుమడింపచేసి, సుల్తానత్‌కు స్థిరత్వమును, రక్షణను ప్రసాదించి, శాంతిభద్రతలను నెలకొల్పి ఢిల్లీ సుల్తానత్ ముఖ్య నిర్మాతగా గణతికెక్కాడు. కాని తురుష్క ముస్లిమేతరులను పదవుల నుండి తొలగించి, వారిలో తీవ్ర అసంతృప్తికి కారకుడై ఆయన మరణానంతరం వారు అలజడులు సృష్టించుటకు దోహదం చేశాడు.

బాల్బన్ రాజ్య విస్తరణ కంటే రాజ్య సుస్థిరతే తన ధ్యేయంగా పాలించాడు. ఆయన నూతన రాజరిక సిద్ధాంతాన్ని ప్రవచించి, సుల్తాన్‌కు ప్రభువర్గానికి మధ్య సంబంధాలకు నూతన భాష్యం చెప్పాడు. బలమైన కేంద్రీకృత పాలనా వ్యవస్థకు శ్రీకారం చుట్టాడు.

**27.డి ఈ కింది వాక్యాలలో బాల్బన్‌కు సంబంధించిన విషయాలలో ఏవి సరియైనవో గుర్తించుము.**

i) సుల్తాన్ యొక్క గౌరవ ప్రతిపత్తులను పెంచాడు.

ii) గుర్రములకు రాజముద్రలు వేయించాడు.

iii) చహలగనీ సర్దారుల కూటమిని (Group of Forty) ఏర్పరచాడు.

iv) వాయువ్య సరిహద్దు ప్రాంత రక్షణకు నూతన దుర్గాలను నిర్మించి, సైనిక పాటవాన్ని సమకూర్చాడు.

v) తురుష్క ముస్లిమేతరులకు ఉన్నత పదవులిచ్చాడు.

2. సింహాసనమధిష్టించిన నాడు బాల్బన్ ఎదుర్కొన్న రెండు సమస్యలను పేర్కొనుము.

3. ప్రభువర్గం సుల్తాన్ కంటె తక్కువ స్థాయి కలవారని సూచిస్తూ బాల్బన్ గైకొన్న చర్యలేమి?

4. అయోధ్య ఇక్తాదారైన హైబల్‌ఖాన్‌కు బాల్బన్ కఠిన శిక్ష ఎందుకు విధించాడు?

## సారాంశం

ఘజనీ మహమ్మద్ భారతదేశ సిరిసంపదలను కొల్లగొట్టాలనే ధ్యేయంతో భారత్‌పై దాడులు నిర్వహించాడు. తనకు సామ్రాజ్య స్థాపనా కాంక్ష లేనప్పటికీ, పంజాబ్ ఆక్రమణతో ఘోరీ మహమ్మద్ గంగా మైదానంలోనికి చొచ్చుకొని రావటానికి, తదుపరి ఘోరీ మహమ్మద్ రాజ్యస్థాపన చేయటానికి సుగమమైన మార్గాన్ని ఏర్పరచాడు. ఘోర్ మహమ్మద్ తాను జయించిన రాజ్యాలకు తన బానిస సేనానియైన కుతుబుద్దీన్ఐబక్ పాలకునిగా నియమించెను. రాజపుత్రుల రాజకీయ, సామాజిక, ఆర్థిక, సైనిక బలహీనత వలన తురుష్కులు విజయాన్ని సాధించారు. క్రీ.శ. 11, 12వ శతాబ్దిలలో ఉత్తర భారతం అనేక రాజపుత్ర స్వతంత్ర రాజ్యాలుగా విభక్తమై, పరస్పర కలహాలలో నిమగ్నమై యున్నాయి. రాజపుత్ర రాజ్యాలలో నెలకొన్న భూస్వామ్య విధానం కేంద్ర ప్రభుత్వ అధికారాన్ని బలహీనం చేసింది. కుల వివక్ష వారి సామాజిక, రాజకీయ ఐక్యతను నాశనం చేసింది. రాజపుత్రుల సైనిక బలం, యుద్ధతంత్రం పురాతనమై బలహీనం చెందగా, తురుష్కులు మధ్య ఆసియాలో బాగా అభివృద్ధి చెందిన నూతన యుద్ధ తంత్ర నిపుణత కల్గిన అశ్వికదళాన్ని కల్గిన శక్తివంతమైన సైన్యంగా రూపుదిద్దుకున్నారు. దీనికితోడు విజ్ఞానాన్ని ఆర్జించిన అగ్రవర్ణముల వారు (బ్రాహ్మణులు) ఏకాంత విధానంననుసరించి, బాహ్య ప్రపంచంలో సైనిక, శాస్త్రీయ, సాంకేతిక రంగాలలో జరిగే ప్రగతికి దూరమయ్యారు. తత్ఫలితంగా భారత్ వెనుకబడిపోయింది.

ఘోర్ మహమ్మద్ భారత్‌లో తురుష్క సామ్రాజ్య స్థాపన చేయగా, అతని బానిస సేనానియైన ఐబక్ దానిని జాగ్రత్తగా కాపాడాడు. వాస్తవంగా ఢిల్లీ సుల్తానత్ సుస్థిరతకు ముఖ్య కారకుడు – ఇల్‌టుట్‌మిష్. తన అధికారానికి సవాల్‌గా నిలిచిన ఘజనీ పాలకుడైన యల్‌డజ్, ముల్తాన్ పాలకుడైన కుబాచా, బెంగాల్ పాలకుడైన ఆలీమర్దాన్‌ఖాన్, రాజపుత్రులను అణచివేశాడు. ఇతని అధికారాన్ని ఇస్లాం న్యాయబద్ధం చేస్తూ ఖలీఫా ఇతనికి "నాజర్ అమీర్ ఉల్‌ముమినిన్" అను బిరుదు నిచ్చాడు. ఖ్వారజాం ప్రభువైన జలాలుద్దీన్ మంగబార్నీ మంగోలులచే తరిమివేయబడగా సాయమర్థించెను. ఇల్‌టుట్‌మిష్ రాజకీయ విజ్ఞతను ప్రదర్శించి అతనికి సాయపడుతూ మంగోలు దాడుల ప్రమాదం నుండి సుల్తానత్‌ను కాపాడాడు. రాజరిక వ్యవస్థను పటిష్టం చేయటానికి 'చహల్‌గనీ' అనే తురుష్క ప్రభు వర్గ కూటమిని ఏర్పాటు చేశాడు.

ఢిల్లీ సుల్తానత్ పాలనా వ్యవస్థలో నూతన నాణేలు ముద్రించి, ఇక్తా అను సైనిక రాష్ట్రాలు ఏర్పాటు చేసి పటిష్టమైన సైన్యాన్ని సమకూర్చాడు. సనాతన ముస్లిం మతాధికారుల ప్రభావానికి లోనుకాకుండా రాజ్యపాలన చేశాడు.

ఇల్‌టుట్‌మిష్ మరణానంతరం నుండి బాల్బన్ రాక వరకు ఢిల్లీ సుల్తానత్ అనేక ఒడుదుడుకులకు లోనయ్యెను. సుల్తాన్‌కు చహల్‌గనీ సర్దారుల మధ్య ఘర్షణ, రాజపుత్రుల విజృంభణ, రాజ్యంలో అరాజకశక్తుల విజృంభణ, వాయువ్య ప్రాంతంన మంగోలుల బెడద – మున్నగు సమస్యలతో సుల్తానత్ సతమతమైంది. ఇట్టి స్థితిలో ఉక్కు మనిషిగా పేరు గాంచిన బాల్బన్ రాజ్య విస్తరణ కంటె రాజ్య సుస్థిరతయే ధ్యేయంగా నెంచి పాలించాడు. రాజు దైవాంశ సంభూతుడను నూతన సిద్ధాంతాన్ని ప్రవచించి రాజరిక ఔన్నత్యాన్ని పెంపొందించాడు. తురుష్క ప్రభువర్గ హక్కులను పరిరక్షించి, స్వదేశీ ముస్లింలను వారి పదవుల నుండి తొలగించెను. తురుష్క ప్రభు వర్గ అధికారాలను తగ్గించి, సుల్తాన్‌ను విధేయత కల్గునట్లు చేశాడు. సైనిక వ్యవస్థను పూర్తిగా పునరవ్యస్థీకరించి, మంగోలు దాడులను సమర్థవంతంగా ఎదుర్కొనెను. ఈ విధంగా బాల్బన్ ఢిల్లీ సుల్తానత్‌కు నిజమైన నిర్మాతగా కీర్తిని గాంచాడు

## అభ్యాసం

1. తురుష్కుల చేతిలో రాజపుత్రుల పరాజయానికి గల రాజకీయ, సాంఘిక, సైనిక కారణాలను వివరింపుము.
2. ఏ అంశాలలో ఘజనీ మహమ్మద్ దాడులు, ఘోర్ మహమ్మద్ దాడులకు భిన్నమైనవి?
3. ఇల్‌టుట్‌మిష్ ఎదుర్కొన్న సమస్యలేమి? వాని నెలా అధిగమించాడు?
4. ఇల్‌టుట్‌మిష్ ఢిల్లీ సుల్తానత్‌కు నిజమైన స్థాపకుడని ఏల చెప్పగలవు?
5. ఢిల్లీ సుల్తానత్‌లో కేంద్రీకృత పాలనా వ్యవస్థను నెలకొల్పటానికి బాల్బన్ గైకొన్న చర్యలేమి?
6. ఢిల్లీ సుల్తానత్ సుస్థిరతకు మామ్లుక్ సుల్తానులు చేసిన సేవలెట్టివి?
7. ఇల్‌టుట్‌మిష్, బాల్బన్‌లు సాధించిన విజయాలను గణన చేయము.

## పాఠ్య ప్రశ్నలకు జవాబులు

### 27.ఎ పాఠ్య ప్రశ్నలు

1.

i) ఘజనీ మహమ్మద్

ii) ఘోరీ మహమ్మద్

iii) ఘజినీ మహమ్మద్

iv) ఘోరీ మహమ్మద్

v) ఘోరీ మహమ్మద్

vi) ఘోరీ మహమ్మద్

vii) ఘజినీ మహమ్మద్

viii) ఘోరీ మహమ్మద్

2.

i) ఘోరీ మహమ్మద్ యొక్క

ii) ఘజినీ మహమ్మద్ యొక్క

iii) ఘజినీ మహమ్మద్ యొక్క

iv) ఘోరీ మహమ్మద్ యొక్క

3. తమ సైన్యాన్ని సమైక్యపరచి వారిలో నూతనోత్సాహాన్ని కల్గించటానికి అనే నెపంతో తమ దాడులను సమర్థించుకున్నారు.

## 27.బి పాఠ్య ప్రశ్నలు

1.

i) అనేక స్వతంత్ర రాజ్యాలుగా విభక్తమగుట

ii) భూస్వామ్యబద్ధమైన, భిన్నత్వ స్వభావం గల రాజపుత్ర సైన్యం

iii) వివేకవంతమైన వర్గం (బ్రాహ్మణులు) ఏకాంత విధానం. విదేశాలతో సంబంధాన్ని గట్టిగా వ్యతిరేకించటం

2. తమ దేశం వంటి దేశం లేదని, తమ మత, సంస్కృతులకు మించిన మత సంస్కృతులేవనే విజ్ఞానవర్గ (బ్రాహ్మణుల) గర్వాహంకారం.

3. రాజకీయ అనైక్యత సామాజిక వ్యవస్థలోని లోపం.

## 27.సి పాఠ్య ప్రశ్నలు

1.

i) సుల్తానత్ రాజ్య సరిహద్దులు నిర్దిష్టంగా లేకపోవట.

ii) కుంటుపడిన పాలనా వ్యవస్థ

iii) నిర్దిష్టమైన రాజరిక ధర్మ సిద్ధాంతం లేకపోవుట

iv) అమీరులలోను, ప్రభువర్గంలోను నెలకొన్న అసంతృప్తి, తిరుగుబాట్లు

2.

i) రాజరిక ప్రభుత్వ విధానం, పాలనావర్గ సమైక్యత

ii) తిరుగుబాటుల నణచుట.

iii) ఖలీఫా నుండి సుల్తాన్‌పదవికి ఇస్లాం న్యాయబద్ధత కల్పించుట.

3. రాజరికానికి మద్దతు

4. దోఆబ్‌లో పాలనా, ఆర్థిక నియంత్రణను సాధించటం

5. ముస్లిమేతర జనాభాను పెంచేయకుండా ఉండుటకు.

## 27.డి పాఠ్య ప్రశ్నలు

1.

i), iv)

2.

i) అధికార కాంక్షాపరులైన తురుష్క ప్రభువర్గం

ii) అధికారాన్ని ధిక్కరించే రాజపుత్రులు

iii) మంగోలుల బెడద

iv) ఢిల్లీ పరిసర ప్రాంతాలలో శాంతిభద్రతల సమస్య.

3. సుల్తాన్ గౌరవ ప్రతిపత్తులు ఇనుమడింప చేయటం, క్రమశిక్షణతో కూడిన రాజ ఆస్థానం, సాష్టాంగ దండ ప్రణామం, సుల్తాన్ పాదాలకు ముద్దు పెట్టుకొను సంప్రదాయాలను ప్రవేశపెట్టుట.

4. బానిసల పట్ల క్రూరంగా వ్యవహరించినందుకు.

# 28

# ఖిల్జీలు మరియు తుగ్లక్‌లు

## 28.1 పరిచయం

క్రీ.శ. 1290లో మామ్లుక్ సుల్తానుల పాలన అంతమై, ఖిల్జీ రాజ్యస్థాపన జరిగిందని మనం క్రితం పాఠంలో చదివాం. ఖిల్జీ రాజ్య స్థాపకుడు జలాలుద్దీన్ ఫిరోజ్ ఖిల్జీ. ఖిల్జీ వంశీయులు క్రీ.శ. 1290 నుండి 1320 వరకు పాలించారు. ఖిల్జీ వంశీయులలో గొప్పవాడు. అల్లాఉద్దీన్ ఖిల్జీ. ఇతడు గొప్ప విజేత, పాలనాదక్షుడు. ఇతని పాలనలో ఢిల్లీ సుల్తానత్ అతి శక్తివంతమైన రాజ్యంగా బాసిల్లింది. ఇతని పాలనా సంస్కరణలను గూర్చి తరువాత పాఠంలో చదువుతాం.

క్రీ.శ. 1320లో ఖిల్జీలనంతం చేసి తుగ్లక్‌లు ఢిల్లీ సింహాసనమధిష్టించారు. తుగ్లక్ వంశ స్థాపకుడు ఘియాజుద్దీన్ తుగ్లక్. తుగ్లక్ వంశీయులు క్రీ.శ. 1320 నుండి – 1414 వరకు పాలించారు. తుగ్లక్ వంశీయులలో పేరుమోసిన సుల్తానులు –ఘియాజుద్దీన్ తుగ్లక్, మహమ్మద్‌బిన్ తుగ్లక్, ఫిరోజ్ తుగ్లక్, వీరి పాలనలో సుల్తానత్ అత్యున్నత స్థాయికి చేరుకుంది. కాని తుగ్లక్ పాలనా చివరి రాజులలో రాజ్య విచ్ఛిన్నం ప్రారంభమై, ఫిరోజ్ తుగ్లక్ మరణానంతరం చిన్న రాజ్యాలుగా విభక్తమైంది.

ఈ పాఠంలో ఈ రెండు రాజవంశాలు సాధించిన విజయాలు, మంగోలు దండయాత్రలు, అల్లా ఉద్దీన్ ఖిల్జీ సరిహద్దు విధానం గురించి కూడ చదువుతాం.

## 28.2 లక్ష్యాలు

ఈ పాఠం చదివిన తరువాత ఈ కింది విషయాలు తెలుసుకుంటాం.

1. జలాలుద్దీన్ ఫిరోజ్ ఖిల్జీ సింహాసనమధిష్టించిన రీతి.
2. జలాలుద్దీన్ ఫిరోజ్ ఖిల్జీ సాధించిన విజయాలు
3. అల్లా ఉద్దీన్ ఖిల్జీ రాజకీయ విజయాలు (దిగ్విజయాలు)
4. మాలిక్‌కపూర్ దక్షిణదేశ దండయాత్ర
5. అల్లాఉద్దీన్ ఖిల్జీ కాలంలో మంగోలు దండయాత్రలు

6. తుగ్లక్ రాజ్యస్థాపనలో ఘియాజుద్దీన్ పాత్ర

7. మహమ్మద్ బిన్ తుగ్లక్ ఢిల్లీ సుల్తానైన వైనం

8. ఘియాజుద్దీన్, మహమ్మద్ బిన్ తుగ్లక్‌ల నేతృత్వంలో ఢిల్లీ సుల్తానత్ విస్తరణ.

## 28.3 జలాలుద్దీన్ ఫిరోజ్ ఖిల్జీ (క్రీ.శ. 1290-96)

మాలిక్ ఫిరోజ్ తురుష్క జాతిలోని ఖిల్జీ తెగకు చెందినవాడు. ఈయన పూర్వీకులు టర్కీ స్థానవాసులు. వీరు తమ దేశం వీడి భారత్ వచ్చి తురుష్క సుల్తానుల కొలువులో చేరారు.

బాల్బన్ కాలంలో ఫిరోజ్ వాయువ్య సరిహద్దు పాలనా బాధ్యతలను స్వీకరించి మంగోలులతో అనేక యుద్ధాలు చేసి విజేతగా నిలిచాడు. సమాన (ముక్తా) రాష్ట్ర పాలకుడై పాలనాదక్షుడుగా పేరుపొందాడు. ఇతని ప్రతిభను గుర్తించి బాల్బన్ అతనికి 'షయిస్తాఖాన్' అను బిరుదును ప్రసాదించాడు. తదుపరి సుల్తానత్‌లో యుద్ధమంత్రి (Ariz-i-Mumalik) గా పదోన్నతి పొందాడు. ఇతని అధికారాన్ని గిట్టని తురుష్క సర్దారులు ఇతనిని పదవీ భ్రష్టుని చేయయత్నించారు. ఈ కుట్రలన్నింటినీ అణచి బాలుడైన సుల్తాన్ కయూమార్స్‌కు సంరక్షకుడుగా పాలన సాగించెను. చివరిగా క్రీ.శ. 1290లో ఫిరోజ్ అధికార కాంక్షతో కయూమార్స్‌ని, పక్షపాతానికి గురియైన అతని తండ్రి కైకుబాద్‌ని వధించి ఢిల్లీ సింహాసనాన్ని హస్తగతం చేసికొన్నాడు. ఈ సంఘటనను “1290 వంశ విప్లవంగా (dynastic revolution of 1290) కొందరు చరిత్రకారులు అభివర్ణించారు. దీనితో బానిస వంశపాలన అంతమై ఢిల్లీలో ఖిల్జీల పాలన ప్రారంభమైంది. జలాలుద్దీన్ ఖిల్జీ అను బిరుదుతో ఫిరోజ్ ఢిల్లీ సింహాసనాన్ని అధిష్టించాడు.

సింహాసనమధిష్టించునాటికి జలాలుద్దీన్ డెబ్బది ఏండ్ల వృద్ధుడు. తాను గొప్ప సేనానియైనా, సుల్తానైన పిమ్మట శాంతి కాముక విధానాన్ని అనుసరించాడు. ఖిల్జీలు తురుష్కేతరులని భావించి తురుష్క సర్దారులు అతనికి పూర్తి మద్దతునీయలేదు. దీనికితోడు అల్లాఉద్దీన్ నేతృత్వంలో ఖిల్జీలు రాజ్యకాంక్షతో యుండటం తురుష్క సర్దారులకు గిట్టలేదు. దీనితో జలాలుద్దీన్‌కు కష్టాలు తప్పలేదు.

జలాల్ సహనశీలిగా ప్రభువర్గాన్ని మచ్చిక చేసుకోవటానికి పెక్కు చర్యలు గైకొన్నాడు. తన అధికారాన్ని ధిక్కరించిన వారిని సైతం శిక్షింపలేదు. పైగా వారిని క్షమించి బహుమానములిచ్చాడు. ఇందుకు ఉదాహరణ – కారా పాలకుడైన మాలిక్ చజ్జూ ఉదంతం. మాలిక్‌చజ్జూ కారాలో స్వతంత్రుడై సుల్తాన్ బిరుదు వహించి, జలాల్‌పై తిరుగుబాటు చేశాడు. అంతట జలాల్ అతనిని ఓడించి, బందీగా ఢిల్లీకి తీసికొనివచ్చి, అన్నపానాదులిచ్చి, బహుమానములతో ముల్తాన్‌కు పంపెను. అల్లాఉద్దీన్ కారా పాలకుడిగా నియమింపబడ్డాడు. ఈ చర్య అతని బలహీనతకు తార్కాణమని అతని అనుయాయులు భావించారు. కాని అన్ని సందర్భాలలో జలాల్ దాక్షిణ్యం చూపలేదు. సిద్ధిమౌలా అనే మతాధికారి బాల్బన్ కాలంలో ఢిల్లీ చేరి, నజీరుద్దీన్ మహమ్మద్ కుమార్తెను వివాహమాడి, కొంతమంది ప్రభువర్గ మద్దతుతో జలాల్‌ను పదవీ భ్రష్టుని చేయుటకు కుట్రలు పన్నుచున్నాడని గ్రహించి, అతనిని వధించాడు. అతని అనుయాయులను నిర్బంధించాడు. జలాల్ పెద్ద యుద్ధాలు చేయలేదు. కాని క్రీ.శ. 1290లో రణతంభోర్‌పై దండెత్తి, హంవీరదేవుని ఓడించి, అనేక మంది ముస్లింలు మరణిస్తారనే భారంతో ఆ దుర్గంను వశపరచుకొనలేదు. అయితే క్రీ.శ. 1292లో మందావార్ (మండోర్)ను రాజపుత్రుల నుండి తిరిగి కైవసం చేసికొన్నాడు.

జలాలుద్దీన్ కాలంలో అతని అల్లుడైన అల్లాఉద్దీన్‌ఖిల్జీ రెండు దండయాత్రలు చేశాడు. క్రీ.శ. 1292లో మాల్వాపై

దండెత్తి ఖిల్సా (విదేశ)ను ఆక్రమించెను. ఇచట దక్కన్‌లోని దేవగిరి ధనరాసులను గూర్చి తెలుసుకొని క్రీ.శ. 1294లో దేవగిరిపై దండెత్తి, రామచంద్రదేవుని ఓడించి అపార సంపదను కొల్లగొట్టాడు. ఈ కొల్లగొట్టిన ధనంలో కొన్ని వేల పౌండ్ల బంగారం ముత్యాలు, రత్నాలు, వెండి, వేయిముక్కల పట్టు వస్త్రాలు ఉన్నాయి.

క్రీ.శ. 1292 మంగోలులు హులకు (hulaku) నాయకత్వంలో పంజాబ్‌పై దండెత్తి, సునమ్ (sunam) వరకు పురోగమింపగా, జలాల్ వారిని చిత్తుగా ఓడించాడు. మంగోలులు శాంతిని కాంక్షించి, చెంఘిజ్‌ఖాన్ వారసుడైన ఉల్గుఖాన్ (Ulghu) నాయకత్వమున సుమారు నాలుగువేల మంది ఇస్లాం మతాన్ని స్వీకరించి, సుల్తాన్ కొలువులో చేరారు. వీరే నయా ముస్లింలుగా ప్రసిద్ధి చెందారు. జలాల్ తన కుమార్తెను ఉల్గుఖాన్‌కిచ్చి వివాహం చేశాడు.

జలాలుద్దీన్ శత్రువుల పట్ల ఉదారంగా వ్యవహరించుట వలన ప్రభువర్గం అతని అధికారాన్ని ధిక్కరించింది. జలాల్ అనుసరించిన విధానాలు సుల్తానత్‌కు మేలు చేకూరకపోగా అనేక సమస్యలను సృష్టించింది. ఇట్టి అనిశ్చిత పరిస్థితులలో జలాల్ అల్లుడైన అల్లాఉద్దీన్ ఖిల్జీ, క్రీ.శ. 1296లో జలాల్‌ను వధించి ఢిల్లీ సింహాసన మధిష్టించెను. జలాల్ ఆరేండ్ల పాలన ముగిసింది.

జలాలుద్దీన్ ఖిల్జీ, ఖిల్జీ రాజ్యాన్ని స్థాపించాడు. అతడు తన అధికారాన్ని ధిక్కరించిన వారిని కఠినంగా శిక్షింపక, క్షమించి సాయం చేశాడు. ఇతని కాలంలో దక్కన్‌పై దాడులు సాగాయి.

## 28.ఎ పాఠ్య ప్రశ్నలు

1. ఈ కింద ఖాళీలను పూరించుము.

i) ఫిరోజ్ కు ____________________ బిరుదు కలదు.

ii) జలాలుద్దీన్ ఖిల్జీ ____________________ గవర్నర్‌గా పనిచేశాడు.

iii) జలాలుద్దీన్ ఖిల్జీ ఢిల్లీకి పిలువనంపబడి ____________________ పదవిలో నియమింప బడ్డాడు.

2.. తురుష్క ప్రభు వర్గం జలాలుద్దీను ఎందుకు వ్యతిరేకించింది?

3. నయా ముస్లిం లనగా ఎవరు?

4. జలాలుద్దీన్ కాలంలో జరిగిన దండయాత్రలను తెలుపుము?

## 28.4. అల్లా ఉద్దీన్ ఖిల్జీ క్రీ.శ 1296-1316

జలాలుద్దీన్ అల్లుడైన అల్లాఉద్దీన్ ఖిల్జీ అత్యున్నత సైనిక శిక్షణను పొందిన సాహసి, ధైర్యశాలి. తన మామగారు అధికారం కైవశం చేసుకోవడంలో సాయపడి 'అమీర్-ఇ-తుజక్' (Master of Ceremonies) గా నియమింపబడ్డాడు. మాలిక్ చజ్జు తిరుగుబాటు అణిచిన అనంతరం కారా రాష్ట్ర పాలకుడిగా నియమింపబడ్డాడు.

జలాలుద్దీన్ కాలం లో అల్లాఉద్దీన్ రెండు పర్యాయములు దక్కన్ పై దండెత్తెను. క్రీ.శ 1292 లో మాళ్వాపై దండెత్తి 'బిల్సా'ను ఆక్రమించాడు. ఈ విజయంతో అల్లా ఉద్దీన్ అయోధ్య పాలకుడుగా యుద్ధ మంత్రిగా (Ariz-i-Mumalik) నియమింపబడ్డాడు. క్రీ.శ 1294 లో దేవగిరిపై దండెత్తి అపార ధన కనక రాశులను కొల్లగొట్టెను. ఈ

విజయములతో అల్లాఉద్దీన్ గొప్పయోధుడని, ధైర్యవంతుడని, శక్తి సామర్థ్యములు కలవాడని నిరూపితమయ్యేను. ఈ విజయోత్సాహంతో ఢిల్లీ సింహాసనం ను హస్తగతం చేసుకోవాలని కాంక్ష ప్రబలింది.

క్రీ.శ 1296 జూలైలో తన మామగారైన జాలాలుద్దీన్ చంపి అల్లాఉద్దీన్ సుల్తాన్ పీఠాన్ని అలంకరించాడు.

అల్లాఉద్దీన్ తన వ్యతిరేకుల పట్ల, శత్రువులపట్ల విజ్ఞతతో వ్యవహరించాడు. దేవగిరి నుండి కొల్లగొట్టిన ధనాన్ని తన శత్రువులందరికి పంచిపెట్టాడు. ఈ చర్యతో వారు అతని దుర్చర్యను మరచి అతని దాతృత్వం గురించి కొనియాడారు.తన అధికారాన్ని ధిక్కరించిన వారిని వర్గం మొక్క పూర్తి మద్దతును అల్లాఉద్దీన్ పొందాడు.

బాల్బన్ రాజ్యధర్మ సిద్ధాంతాన్ని అల్లాఉద్దీన్ తిరిగి పునరుద్ధరించాడు. రాజు దైవాంశ సంభూతుడని విశ్వసించాడు. ప్రజల కంటె సుల్తాన్ విజ్ఞుడని, అతని మాటే శాసనమని ఉద్ఘాటించాడు. రాజరికానికి బంధుత్వాముండదని, ప్రజలందరూ ఆయన సేవకులు లేక పాలితులని ఎంచాడు. ప్రభువర్గంకాని ఉలేమాలు కాని తన అధికారంలో జోక్యం చేసుకోవడాన్ని సహించేవాడుకాదు. ఖలీఫా ను తన రాజకీయ అధికారిగా గుర్తింప లేదు. ఇస్లాం సంప్రదాయాన్ని కొనసాగించడం కోసం తాను ఖలీఫా ప్రతినిధిని అని మాత్రమే చెప్పుకున్నాడు.

అల్లాఉద్దీన్ తొలి రోజులలో నాలుగు తిరుగుబాట్లు సంభవించాయి. మొదటిది మంగోలు దండయాత్ర. క్రీ.శ 1299లో గుజరాత్ పై దండెత్తాడు. కర్ణ దేవుని ఓడించి అపార ధన, కనక రాశులను కొల్లగొట్టాడు. గుజరాత్ దాడిలో దోచుకున్న ధన పంపకంలో తమకు సరైన వాటా లభింపలేదని నయా ముస్లింలు తిరుగుబాటు చేసి అల్లాఉద్దీన్ బంధువుని (Nephew) , గుజరాత్ దాడికి నాయకత్వం వహించిన నజరత్ ఖాన్ సోదరుని చంపారు. అంతట ఈ నయా ముస్లింలను సుమారు 30 వేల మందిని వారి కుటుంబీకులతో సహ వధించాడు. అగత్‌ఖాన్, మాలిక్ ఉమర్, మంగూఖాన్, హగిమౌలా మున్నగువారి తిరుగుబాట్లను సైతం అణచివేశాడు.

“తారిక్–ఇ–ఫిరోజ్‌షాహి” గ్రంథకర్తయైన బరానీ ఈ తిరుగుబాట్లకు నాలుగు ప్రధాన కారణములు ఉన్నట్లుగా అల్లాఉద్దీన్ చెప్పాడని పేర్కొన్నాడు.

అవి ఏమనగా 1. గూఢచారి వ్యవస్థ అసమర్థత.

2. మత్తు పానీయములు సేవించుట.

3. ప్రభువర్గాల మధ్య సన్నిహిత సంబంధాలు, వివాహాలు.

4. కొంత మంది ప్రభువర్గం దగ్గర అపార ధనరాశులుండుట.

తరుచుగా సంభవించే తిరుగుబాట్లు అణచి వేయుటకు, రాజద్రోహాన్ని నిర్మూలించుటకు అల్లాఉద్దీన్ నాలుగు దాఖాలను జారీ చేసెను.

1. ప్రభువర్గం అనుభవించు ఈ నాం భూములనుండి భూమి భూమి శిస్తు చెల్లింపవలసిందిగా ఆదేశించాడు. ఈ చర్య వలన ప్రభువర్గమిగులు ధనార్జాన అరికట్టబడెను.

2. గూఢచారి వ్యవస్థను పటిష్టం చేశాడు.

3. మద్యపానాన్ని, మాదక ద్రవ్యాల సేవనాన్ని నిషేధించాడు.

4. సుల్తాన్ అనుమతి లేనిదే సర్దారుల మధ్య ఎట్టి సమావేశాలు గాని, విందులుగాని, వివాహ శుభకార్యములుగాని జరుపరాదు.

ఈ రాజాజ్ఞలను ధిక్కరించిన వారిని కఠినంగా శిక్షించాడు.

తన అధికారాన్ని సుస్థిర పరచుకోవడానికి, తిరుగుబాట్లను అణచడానికి, మంగోలుల దాడుల నుండి రాజ్యాన్ని కాపాడటానికి అల్లాఉద్దీన్ సువిశాల, స్థిరమైన సైన్యాన్ని సమకూర్చాడు. ఈ సైన్య పోషణార్ధం అనేక రెవిన్యూ సంస్కరణలు ప్రవేశపెట్టి, మార్కెట్ ధరలను అదుపులో ఉంచి రాజ్య ఆర్ధిక వనరులను పెంపొందించాడు.

| 1296లో అల్లాఉద్దీన్ ఢిల్లీ సుల్తాన్ అయ్యాడు. తన శక్తి సామర్ధ్యాలతో ఆర్ధిక వనరులతో శత్రువులను అణచివేశాడు. అతని నేతృత్వంలో రాజ్య విస్తరణకై దండయాత్రలు ప్రారంభించాడు. |
|---|

## 28.బి పాఠ్య ప్రశ్నలు

1. ఖాళీలను పూరించుము.

i) అల్లాఉద్దీన్ జలాలుద్దీన్ ____________, ____________.

ii) తారిఖ్-ఇ-ఫిరోజ్‌షాహి గ్రంథకర్త ____________

2. సింహాసం అదిష్టించినపుడు అల్లాఉద్దీన్ ఎదుర్కొన్న సమస్యలేమి?

3. తిరుగుబాట్లను అణచుటకు అల్లాఉద్దీన్ జారీ చేసిన నాలుగు రాజాజ్ఞలను పేర్కొనుము?

## 28.5. ఢిల్లీ సుల్తానత్ రాజ్యవిస్తరణ:-

అల్లాఉద్దీన్ ఖిల్జీ గొప్ప సామ్రాజ్య నిర్మాత. అతని కాలంలో సామ్రాజ్యవాదం అత్యున్నత స్థాయికి చేరుకుంది. ఢిల్లీ సుల్తానత్‌ను పరిపాలించిన చక్రవర్తులలో కెల్లా అగ్రగణ్యుడు. తన తొలి విజయములతో లభించిన ఉత్సాహములతో అలెగ్జాండర్ వలె యావత్ ప్రపంచాన్ని జయించాలని కాంక్షించాడు. కాని తన మిత్రుడగు ఢిల్లీ కొత్వాల్ ఐన్-ఉల్-ముల్క్ సలహా మేరకు తన దిగ్విజాలను భారతదేశంకు మాత్రమే పరిమితం చేశాడు. ఈ లక్ష్యంతోనే ఉత్తర భారతదేశంలోని గుజరాత్, రణతంభోర్, చిత్తోర్‌ఘడ్, శివానా, జాలోర్, మాళ్వా-రాణాలను, దక్షిణ భారతదేశంలోని దేవగిరి, వరంగల్, మాబార్, ద్వార సముద్రం రాజ్యాలపై విజయవంతమైన దాడులు నిర్వహించాడు.

గుజరాత్ దండయాత్రలతో అల్లాఉద్దీన్ ఖిల్జీ రాజ్యవిస్తరణ ప్రారంభమైంది. తొలి సుల్తానులు తమ అధికారాన్ని సుస్థిర పరచుకొనుటలో నిమగ్నమై యుండుట వలన రాజ్య విస్తరణకు పాల్పడలేదు. సామ్రాజ్యకాంక్ష, గుజరాత్ ఆర్ధిక వనరులు, అల్లాఉద్దీన్‌కు గుజరాత్‌పై ఆశక్తి కల్గించాయి. గుజరాత్ తీరంలో అనేక రేవు పట్టణములు కలవు. వీని ద్వారా విదేశాలతో విస్తృత వాణిజ్య సంబంధాలు కలిగియుండుట వలన అపార బంగారు, వెండి నిల్వలు మన దేశానికి తరలివచ్చాయి. కనుకనే మంగోలులు ఈ ప్రాంతమునకు చొచ్చుకొని వచ్చారు. ఈ ఆర్ధిక వనరులను తన తదుపరి దండయాత్రలకు వినియోగించుకోవడానికి, ఈ రేవు పట్టణముల ద్వారా అరేబియా నుండి అశ్వములను దిగుమతి చేసుకొని తన అశ్వక దళాల్ని బలవత్తరం చేయడానికి అల్లాఉద్దీన్ ఉద్దేశించాడు.

క్రీ.శ 1299లో అల్లాఉద్దీన్ తన సేనానులగు ఉల్లుఖాన్, నస్రత్ ఖాన్‌ల నేతృత్వంలో గుజరాత్ పై దాడికి పంపాడు. ఈదాడిలో గుజరాత్ పాలకుడైన కర్ణదేవుడు పారిపోగా, సోమనాధ్ దేవాలయమును ధ్వంసం చేసి

దోచుకొనెను. చివరకు సంపన్నులైన ముస్లిం వర్తకులను 'ఖ్వాజాలు' సైతం దోచుకొని అపార ధనంతో ఢిల్లీ వెళ్లాడు. అనేక మంది బానిసలను బందీలుగా పట్టుకున్నాడు.వీరిలో ఒకడైన మాలిక్‌కపూర్ అల్లాఉద్దీన్ ఖిల్జీ సేనానియై దక్కన్ దేశ దండయాత్రలను నిర్వహించాడు.

గుజరాత్ అనంతరం అల్లాఉద్దీన్ తన దృష్టిని రాజపుత్ర స్థానంపై మరల్చాడు. మొదట చిరకాలంగా ఢిల్లీ సుల్తాన్‌లను ధిక్కరించిన రణతంభోర్‌పై దాడి చేశాడు. ఇందుకు తక్షణ కారణం గుజరాత్ దండయాత్రలో తిరుగుబాటు చేసిన కొంతమంది నయా ముస్లింలకు గుజరాత్ పాలకుడైన హమ్మీర్‌దేవ్ ఆశ్రయ మిచ్చుట. రణతంభోర్ దుర్గాన్ని వశపరుచుకోవడానికి చేసిన యత్నాలు విఫలమగుయే గాక ఈ దాడికి నాయకత్వం వహించిన నస్రత్‌ఖాన్ సైతం ప్రాణములు కోల్పోయాడు. అంతట అల్లాఉద్దీన్ స్వయంగా జోక్యంచేసుకొని హమ్మీర్‌దేవ్ ప్రధాన మంత్రి యగు 'రాణ్‌మల్‌ను' వశపరుచుకొని క్రీ.శ 1301 లో రణతంభోర్‌ను ఆక్రమించాడు.

క్రీ.శ 1303లో రాజపుత్ర స్థానంలో బలీయమైన చిత్తోర్‌పై అల్లాఉద్దీన్ దండెత్తాడు. ఈ దండయాత్రకు ముఖ్యకారణం చిత్తోర్ పాలకుడైన రాణా రతన్‌సింగ్ భార్యయగు పద్మినిని వశపరుచుకొనుటయేనని కొందరి చరిత్రకారుల అభిప్రాయం. కాని ఇది సత్యదూరం. ఎందువలననగా ఈ వృత్తాంతం 'మాలిక్ మహమ్మద్ జయసి' విరచితమైన 'పద్మావత్ కావ్యం వంద సంవత్సరముల తరువాత వ్రాయబడింది. చిత్తోర్ ముట్టడిని అమీర్ ఖుస్రూ స్వయంగా చూచివ్రాశాడు ఈ యుద్ధాన రతన్‌సింగ్ వధించబడగా అంత:పుర రాజపుత్ర స్త్రీలు జోహర్ ఆత్మహుతి చేసికొనిరి చిత్తోర్ అల్లాఉద్దీన్ పాదాక్రాంతమైంది. పిమ్మట తన కుమారుడైన ఖిజిర్‌ఖాన్‌ను చిత్తోర్ గవర్నర్‌గా నియమించెను. ఈ లోపల మంగోలులు ఢిల్లీపై తరలి వస్తున్నారని విని అల్లాఉద్దీన్ రాజధాని మరలెను.

చిత్తోర్‌ను వశపరచుకున్న పిమ్మట అల్లాఉద్దీన్ మాళ్వా, ఉజ్జయిని, మాండూ, థార్, చందేరి మున్నగు రాజ్యములను సైతం ఆక్రమించాడు.

మాల్వా విజయానంతరం మౌలిక్‌కపూర్‌ను దక్షిణదేశ దండయాత్రలకు పంపి తాను శివానా, జౌలోర్ మున్నగు రాజపుత్ర రాజ్యాలను హస్తగతం చేసుకున్నాడు.

క్రీ.శ 1311 నాటికి అల్లాఉద్దీన్ ఉత్తర భారతాన్ని తన ఆధీనంలోకి తెచ్చుకున్నాడు. ఈ విజయములు తాత్కాలికమే. స్వేచ్ఛా స్వాతంత్ర పిపాసకులైన రాజపుత్రులు ముఖ్యంగా రణతంభోర్, చిత్తోర్, జౌలోర్ ఇట్లు పాలకులు తమ రాజ్యాలను తిరిగి వశపరచుకున్నారు. అధిక వ్యయ ప్రయాశలతో కూడిన ఈ యుద్ధాల వలన అల్లాఉద్దీన్ రాజపుత్రులను పూర్తిగా అణచలేకపోయాడు.

## దక్షిణ దేశ దండయాత్రలు

యావత్ భారతాన్ని ఆక్రమించుకోవాలనే సామ్రాజ్య కాంక్షతో, అల్లాఉద్దీన్ దక్షిణ దేశాన్ని కూడా జయించాలనుకున్నాడు. ముఖ్యంగా దక్షిణదేశ రాజ్యాల ఆర్థిక వనరులను ఆయనకు ఆకర్షించాయి. సువిశాల సైన్య పోషణకు ఆర్థిక వనరులు కీలకం గనుక దక్షిణదేశ దండయాత్రలు అత్యంత ఆవశ్యకం. దీనికితోడు దేవగిరి పాలకుడైన రామచంద్రదేవుడు సుల్తాన్‌కు కప్పం చెల్లించటం మానివేశాడు. ఇట్టి పరిస్థితులలో దక్షిణదేశంపై తన అధికారాన్ని నెలకొల్పటానికి అల్లాఉద్దీన్ దాడులు చేశాడు. నాడు దక్కన్‌లో నాల్గు శక్తివంతమైన రాజ్యాలు కలవు.

అవి ఏమనగా..

1. నేటి మహారాష్ట్ర హద్దులుగా నాడున్న దేవగిరి యాదవ రాజ్యం.

2. వరంగల్ రాజధానిగా తెలంగాణా ప్రాంత హద్దుగా కాకతీయ రాజ్యం

3. ద్వారసముద్రం రాజధానిగా హోయసాల రాజ్యం (కర్ణాటక రాష్ట్రం)

4. మధురై రాజధానిగా పాండ్యరాజ్యం

ఉత్తర భారత దండయాత్రలలో ఆ రాజ్యాలను జయించి, ఆక్రమించి, ప్రత్యక్షంగా పాలింపగా, దక్షిణ దేశ దండయాత్రలలో ఆ రాజ్యాలను జయించి, కప్పం తీసికొని సామంత రాజ్యాలుగా మార్చాడు. ఇట్లు చేయుటలో యావత్ భారతాన్ని స్వయంగా పాలించుటలో గల సాధక బాధకాలను గుర్తించుటే. ఇట్టి గుర్తింపులో అతని రాజనీతిజ్ఞత విదితమగుతుంది. దక్షిణ దేశ రాజ్యాల సిరిసంపదలను (కామధేనువు) దోచుకొనుటే అల్లాఉద్దీన్ లక్ష్యం. దక్షిణదేశ దండయాత్రలకు నాయకత్వం వహించినవాడు అతని సేనాధిపతియైన, నమ్మినబంటుయైన మాలిక్‌కపూర్.

తొలుత గుజరాత్ నుండి పారిపోయి బెగ్లానాను కేంద్రంగా చేసికొని పాలన సాగించుచున్న కర్ణదేవుని, ఆల్ఫ్‌ఖాన్ నేతృత్వంలోని ఖిల్జీ సేనాలు ఓడించాయి. తదుపరి మాలిక్‌కపూర్ నాయకత్వంలో ఖిల్జీ సేనలు దేవగిరిపై దండెత్తాయి. దేవగిరి పాలకుడైన రామచంద్రదేవుడు ఎట్టి ప్రతిఘటన లేకుండానే లొంగిపోయాడు. రామచంద్రదేవుని ఢిల్లీకి రప్పించి, అతిథి మర్యాదలతో లక్ష టంకాలు, బంగారు వర్ణం గల వస్త్రాన్ని, రాయ్‌రాయన్ అను బిరుదునిచ్చి సత్కరించాడు. రామచంద్రదేవుని కుమార్తెయగు దేవలదేవిని తన కుమారుడగు ఖజీర్‌ఖాన్‌తో వివాహం జరిపించాడు. రామచంద్రదేవునితో అల్లాఉద్దీన్ సన్నిహితంగా మెలగుటకు దక్షిణదేశ దండయాత్రకు దేవగిరి కీలకస్థానముగా నుండుటేనని కొందరి చరిత్రకారుల అభిప్రాయం.

కాకతీయ రాజ్యంపై పంపిన తొలి దాడులు విఫలమగుటతో ప్రతాపరుద్రుడు ఢిల్లీకి రాకపోయినా, కానుకలుఇచ్చి సామంతుడుగా యుండునట్లు అంగీకరించినా తృప్తిపడవలసిందిగా అల్లాఉద్దీన్, మాలిక్‌కపూర్‌కు ఆదేశాలిచ్చినట్లు బరానీ వ్రాశాడు. దీనిని బట్టి రాజ్యవిస్తరణ కంటె ధనార్జనే అల్లాఉద్దీన్ దక్షిణ దేశ దండయాత్ర లక్ష్యమని తెలుస్తుంది. ఆశించినట్లే ప్రతాపరుద్రుడు స్వల్ప సంఘర్షణ అనంతరం అపార ధనరాసులను కానుకగా ఇచ్చి సుల్తాన్‌తో సంధి చేసుకొన్నాడు.

వరంగల్ విజయానంతరం మాలిక్‌కపూర్ హోయసాల రాజ్యంపై దండెత్తగా, ఆ రాజ్య పాలకుడైన మూడవ వీరభల్లాలుడు ఎట్టి ప్రతిఘటన లేకుండానే సంధి చేసుకొని కప్పం చెల్లించాడు. తుదకు పాండ్య రాజ్యంపై దండెత్తినా, పాండ్య రాజైన వీరపాండ్యుని లోబరచుకొనలేకపోయినా, అతని వద్ద నుండి అపార ధనరాసులను కైవసం చేసుకున్నాడు. అమీర్‌ఖుస్రూ రచనల ప్రకారం 512 ఏనుగులు, 5000 అశ్వాలు, 500 మణుగుల బంగారు విలువైన రాళ్లతో కపూర్ ఢిల్లీ చేరాడు. ఈ విషయములకు ముగ్ధుడై సుల్తాన్ మాలిక్‌కపూర్‌ను మాలిక్–నాయబ్‌గా (ఉప సుల్తాన్‌గా) నియమించాడు.

ఈ లోపల దేవగిరిలో రాజ్యానికి వచ్చిన శంకరదేవుడు సుల్తాన్‌కు కప్పం చెల్లించుట మాని స్వతంత్రుడు కాదలచెను. అంతట మాలిక్‌కపూర్ క్రీ.శ. 1315లో దేవగిరిపై దండెత్తి, శంకర దేవుని వధించి దేవగిరిని సుల్తానత్ సామ్రాజ్యంలో విలీనం చేశాడు.

అల్లాఉద్దీన్ తన సామ్రాజ్య మంతటా సైనిక స్థావరాలను ఏర్పాటు చేసి తన సామ్రాజ్యానికి భద్రత కల్పించాడు. తుగ్లక్‌ల కాలంలోనే సుల్తానత్ రాజ్యవిస్తరణ దాక్షిణాత్యానికి ప్రాకింది.

అల్లాఉద్దీన్ సామ్రాజ్యవాది. రాజరిక ఔన్నత్యానికి, రాజ్యవిస్తరణకు, ఆర్థిక వనరుల కొల్లగొట్టుటకు దండయాత్రలు సాగించాడు. ఉత్తర భారతంలో గుజరాత్, రాజపుత్ర రాజ్యాలను జయించి ఆక్రమించాడు. దక్షిణ దేశ దండయాత్రలను అల్లాఉద్దీన్ సేనానియగు మాలిక్‌కపూర్ నిర్వహించాడు.

## 28.సి పాఠ్య ప్రశ్నలు

1. అల్లాఉద్దీన్ దండయాత్రల ముఖ్య లక్ష్యాలేమి?
2. ఉత్తరభారత్‌లో అల్లాఉద్దీన్ జయించిన మూడురాజ్యాలు, వాని పాలకుల పేర్లు వ్రాయుము.
3. రాజ్య విస్తరణలో ఉత్తరభారత్‌లో అనుసరించిన విధానానికి దక్షిణదేశంలో అనుసరించిన విధానానికి గల తేడా ఏమిటి?
4. దక్కన్‌లోని నాలుగు శక్తివంతమైన రాజ్యాల పేర్లను రాయుము.
5. అల్లాఉద్దీన్ తరపున దక్షిణదేశ దండయాత్రలకు నాయకత్వం వహించిన వాడెవరు?

## 28.6 మంగోలు దండయాత్రలు

తురుష్కులు ఢిల్లీలో రాజ్యస్థాపన చేసే తరుణంలో మంగోలులు చెంఘిజ్‌ఖాన్ నాయకత్వంలో శక్తివంతమైన సైన్యంగా రూపొంది, చైనా, మధ్య ఆసియాలను జయించి, ఆక్రమించి క్రీ.శ. 1221లో ఇల్‌టుట్‌మిష్ కాలంలో వాయువ్య ప్రాంతంలో మొట్టమొదట ప్రవేశించారని చదివేఉన్నారు.

నాటినుండి సుల్తానత్ వాయువ్య సరిహద్దు ప్రాంతం మంగోలు దాడులకు గురైంది. ఢిల్లీ సుల్తానులు మంగోలు దాడులనెదుర్కొనటానికి అనేక చర్యలు గైకొన్నారు. జలాలుద్దీన్ ఫిరోజ్ ఖిల్జీ కాలంలో కొంతమంది మంగోలులు సుల్తాన్‌తో సంధి చేసికొని, ఇస్లాంను స్వీకరించి నయా ముస్లింలుగా ఢిల్లీ పరిసర ప్రాంతాలలో స్థిరపడ్డారు. అల్లాఉద్దీన్ గుజరాత్ దాడిలో పాల్గొన్న ఆసియా ముస్లింలు యుద్ధమున కొల్లగొట్టిన ధన పంపకంలో తిరుగుబాటు చేయగా, వారిని అల్లాఉద్దీన్ దారుణంగా వధించాడు.

అల్లాఉద్దీన్ కాలంలో మంగోలు దాడులు తీవ్రమయ్యాయి. వీరు సరిహద్దు పంజాబ్, ముల్తాన్, సింధు రాజ్యాలపైనేగాక సస్యశ్యామలమైన గంగ–యమున అంతర్వేదిపై సైతము దాడులు ప్రారంభించారు.

ఈ లోపల మధ్య ఆసియా రాజకీయాలలో మార్పు సంభవించింది. మధ్య ఆసియా రాజైన, మంగోలు నాయకుడైన దావూద్‌ఖాన్ (Daud Khan) సుల్తానత్‌కు మిత్రదేశమైన పర్షియాను జయించి, అచటి ఇల్కాన్ (Ilkhan) రాజ్యాన్ని అంతం చేయాలనుకున్నాడు. ఈ తుర్పు దాడులు మంగోలులను భారత్‌ను దగ్గరకు చేర్చాయి.

అల్లాఉద్దీన్ సింహాసనమధిష్టించిన తొలి రోజులలోనే మంగోలులు క్రీ.శ. 1297లో సుల్తానత్‌పై దాడి చేశారు. ఈ దాడులను అల్లాఉద్దీన్ మిత్రుడగు జఫర్‌ఖాన్ విజయవంతముగా తిప్పికొట్టెను.

క్రీ.శ. 1299లో జరిగిన రెండవ మంగోలు దండయాత్రను సైతం జఫర్‌ఖాన్ ఎదుర్కొని విజేతయై, మంగోలు నాయకుడును, 1700 మంది అతని అనుచరులను బంధీ గాంచి, వధించెను.

మంగోలుల మూడవ దాడి క్రీ.శ. 1299లో కుట్లుగ్‌క్వాజా (Qutluq Khawaja) నేతృత్వంలో జరిగింది. ఈ

దాడిలో రెండు లక్షల మంది మంగోలు సైనికులు పాల్గొన్నారు. ఈసారి దోచుకొనుట కంటె ఢిల్లీ రాజ్యాన్ని హస్తగతం చేసుకొనుటే కుట్లుగ్ లక్ష్యం. ఈ దాడిని రక్షక విధానం ద్వారా ఎదుర్కోవాలని ఢిల్లీ కొత్వాల్ సూచించినా అల్లాఉద్దీన్ వారిని బాహాటంగానే ఎదుర్కోవాలని నిశ్చయించుకున్నాడు. సుప్రసిద్ధ సేనానులైన జఫర్‌ఖాన్, నస్రత్‌ఖాన్, ఉల్లుఖాన్ నేతృత్వంలో సుల్తాన్ సైన్యం మంగోలులను చావుదెబ్బ తీసింది. కాని ఈ యుద్ధంలో జఫర్‌ఖాన్ ప్రాణాలు కోల్పోయాడు. సుల్తాన్ సైన్యం మంగోలులలో ఎంతటి భయభ్రాంతులు సృష్టించాయంటే జఫర్‌ఖాన్ పేరు చెబితే, వారి అశ్వాలు నీళ్లు కూడా ముట్టేవి కాదట.

మంగోలుల నాల్గవ దండయాత్ర క్రీ.శ. 1303లో అల్లాఉద్దీన్ చిత్తోర్ దాడిలో నిమగ్నమైయున్నప్పుడు జరిగింది. తార్గీ (Targia) నాయకత్వంలో 12వేల మంది మంగోలులు ఢిల్లీపై దాడి చేశారు. అకస్మాత్తుగా జరిగిన ఈ దాడిని తిప్పికొట్టటానికి రాష్ట్ర పాలకులు సకాలంలో సైన్యాన్ని పంపలేకపోయాడు. గత్యంతరం లేక అల్లాఉద్దీన్ సిరికోటలో తలదాచుకొనగా, రెండు నెలలు మంగోలుల ఈ కోటను తమ ఆధీనంలో ఉంచుకున్నారు. మంగోలులు ఢిల్లీ, దాని పరిసర ప్రాంతాన్ని దోచుకొన్నారు. దీర్ఘకాలిక దాడులకు సంసిద్ధముగా లేని మంగోలులు మూడు నెలల అనంతరం వెనుతిరిగారు.

ఢిల్లీపై దాడితో కలవరపడి అల్లాఉద్దీన్ వాయువ్య ప్రాంత రక్షణకు బాల్బన్ వలె అనేక చర్యలు గైకొన్నాడు. పాత దుర్గాలైన పంజాబ్, ముల్తాన్, సింధులను బాగు చేయించి, కొత్త దుర్గాలను నిర్మించి అందు బలీయమైన సైన్యాన్ని ఉంచాడు. వాయువ్య ప్రాంత పరిరక్షణకు ఒక ప్రత్యేక గవర్నర్‌ను (warden of the marcher) నియమించాడు.

అల్లాఉద్దీన్ ఎన్ని చర్యలు గైకొన్నా మంగోలులు చెంఘిజ్‌ఖాన్ వారసుడైన ఆలీబేగ్ నాయకత్వంలో పంజాబ్‌పై దండెత్తి, మార్గమధ్యమున అనేక ప్రాంతాలను దోచుకొని, దగ్ధం చేస్తూ అమ్రోరా చేరారు. మాలిక్‌నాయబ్ వీరిని అడ్డుకొని, వధించి ఏనుగులచే తొక్కించాడు.

క్రీ.శ. 1306లో మరల మంగోలులు దాడులు చేశారు. వీరు ముల్తాన్ దగ్గర సింధునదిని దాటి హిమాలయములపై పురోగమిస్తూ మార్గమధ్యంలో అనేక ప్రాంతాలను దోచుకున్నారు. అల్లాఉద్దీన్ సేనానియగు ఘజిమాలిక్ వీరి పురోగమనాన్ని అడ్డుకొని వారి నాయకునితో సహా ఐదువేల మందిని బందీలుగావించి, తదుపరి వారిని, వారి కుటుంబీకులను దారుణంగా వధించాడు. వారి పిల్లలను బానిసలుగా అమ్మాడు.

ఈ దాడి అనంతరం మంగోలు దాడులు దాదాపు ముగిశాయి. వీరు ఇరువది సంవత్సరాల వరకు భారత్‌పై దాడి చేయలేదు. వారి నాయకుడైన దావూద్‌ఖాన్ మరణించటం, ఆ తదుపరి వారసత్వ యుద్ధం జనించటం, వారి మధ్య అంతఃకలహాలు ఏర్పడడం – మున్నగు కారణాల వలన మంగోలు దాడులు వెనక్కి తగ్గాయి.

మంగోలు దాడుల వలన అల్లాఉద్దీన్ చాలా ఇబ్బందులు పడ్డాడు. వీరిని ఎదుర్కొనటానికి సువిశాల సైన్యాన్ని అల్లాఉద్దీన్ సమకూర్చుకొనవలసి వచ్చింది. ఈ సైన్య పోషణకు ఖర్చుల భరించుటకే అల్లాఉద్దీన్ అనేక పాలనా, రెవిన్యూ సంస్కరణలను ప్రవేశపెట్టాడు. వీనిని గురించి తరువాత పాఠంలో చదువుదాం.

అల్లాఉద్దీన్ పాలనా కాలమంతా మంగోలుల దాడులతోనే గడిసింది. వీనిని ఎదుర్కొనటానికి శక్తియుక్తులైన సేనానులను, సువిశాల సైన్యాన్ని ఏర్పాటు చేశాడు. ఈ సైనికావసరములు తీర్చుటకే అతడు అనేక ఆర్థిక, రెవిన్యూ సంస్కరణలు ప్రవేశపెట్టాడు.

## 28.డి పాఠ్య ప్రశ్నలు

1. అల్లాఉద్దీన్ పాలనా విధానాలపై మంగోలు దాడుల ప్రభావమేమి?
2. మంగోలు దండయాత్రలకు గల ముఖ్య కారణమేమి?
3. మంగోలు దాడులనెదుర్కొనటానికి అల్లాఉద్దీన్ గైకొన్న చర్యలేమి?
4. మంగోలులతో పోరాడిన ముగ్గురు అల్లాఉద్దీన్ సేనానుల పేర్లు తెలుపుము.

### ఖిల్జీ రాజ్య పతనం

క్రీ.శ. 1316లో అల్లాఉద్దీన్ మరణంతో సుల్తానత్‌లో అల్లకల్లోల పరిస్థితులేర్పడెను. మాలిక్‌కఫూర్ కొన్నాళ్లు పాలించగా, అతనిని పదవీ భ్రష్టుని చేసి కుతుబుద్దీన్ ముబారక్‌షా ఢిల్లీ సుల్తానయ్యాడు. ఇతని కాలంలో దేవగిరిలో తిరుగుబాటు సంభవించింది. దీనిని ముబారక్‌షా పూర్తిగా అణచాడు. ఖుస్రాక్ అనువాడు ముబారక్‌షాను వధించి సుల్తానయ్యాడు. ఇతని పాలన సజావుగా సాగలేదు. గియాజుద్దీన్ తుగ్లక్ నేతృత్వంలో ప్రభువర్గం ఖుస్రోత్‌ను చంపి, అధికారాన్ని ఘియాజుద్దీన్‌కు అప్పగించాడు. దీనితో ఢిల్లీలో ఖిల్జీపాలన అంతమై తుగ్లక్‌ల పాలన ప్రారంభమైంది.

## తుగ్లక్‌లు (1320 - 1414)

## 28.7 ఘియాజుద్దీన్ తుగ్లక్ (క్రీ.శ. 1320-1325)

ఘజీమాలిక్ ఖిల్జీ రాజ్యాన్ని అంతం చేసి ఘియాజుద్దీన్ తుగ్లక్ అను పేరుతో క్రీ.శ. 1320లో తుగ్లక్ సామ్రాజ్యాన్ని స్థాపించాడు.

స్వశక్తితో ఉన్నత పదవులను పొందిన ధీశాలి- ఘియాజుద్దీన్. అల్లాఉద్దీన్ ఖిల్జీ కాలంలో దీపాల్‌పూర్ కేంద్రంగా వాయువ్య సరిహద్దు ప్రాంతాధికారిగా నియమింపబడ్డాడు. అల్లాఉద్దీన్ కాలంలో జరిగిన మంగోలుదాడులను విజయవంతంగా తిప్పికొట్టుటేగాక ఘజనీ, కాబూల్, కందహార్ పరిసర ప్రాంతాలపై దాడులు చేశాడు. ఘియాజుద్దీన్ రాజనీతిజ్ఞుడు, ప్రజలకు సుఖశాంతులను ప్రసాదించిన పాలనాదక్షుడు. బరానీ మాటలలో చెప్పాలంటే, "అల్లాఉద్దీన్ తిరిగి వచ్చాడని ప్రజలు భావించారు".

ఘియాజుద్దీన్ అనేక ఆంతరంగిక, బాహ్య సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చింది. సుల్తాన్ గల గౌరవ ప్రతిపత్తులు సన్నగిల్లాయి. ప్రభువర్గం, ఆస్థానమందున్న అధికారులు తమ బాధ్యతలను విస్మరించారు. రాష్ట్ర పాలకులు, భూస్వామ్య వర్గం సుల్తాన్‌ను పదవీ భ్రష్టుని చేయాలనే లక్ష్యంతో అవకాశం కొరకు వేచియున్నారు. దీనికితోడు అల్లాఉద్దీన్ ప్రవేశపెట్టిన పాలనా వ్యవస్థ అతని వారసుల కాలంలో చిన్నాభిన్నమైంది.

ఘియాజుద్దీన్ ఈ సమస్యలన్నింటిని ధైర్యంగా ఎదుర్కొన్నాడు. రాజనీతిజ్ఞుడుగా ప్రభువర్గం పట్ల ఉదారంగా వ్యవహరించి వారి మద్దతును పొందాడు. రాజ్య ఆర్థిక వనరులను పెంపొందించుటకు వ్యవసాయాభివృద్ధికి కృషి చేశాడు. నీటిపారుదల సౌకర్యాలు కల్పించి వ్యవసాయ విస్తరణ గావించాడు. రైతుల సంక్షేమాన్ని కాపాడాడు. అధిక భూమిశిస్తు రేటును తగ్గించాడు.

భూమిశిస్తును సాలుకు పదవ వంతు కంటె ఎక్కువ పెంచరాదని ఆదేశించెను. అల్లాఉద్దీన్ కాలంలో నున్న

భూమి సర్వే, భూమి కొలతల విధానానికి స్వస్తి చెప్పి పాల పద్ధతిని పునరుద్ధరించాడు. ఈ పద్ధతిలో వ్యవసాయదారుడు ప్రభుత్వం పంటను (Narq and Batai) పంచుకుంటారు. రెవిన్యూ కలెక్టర్‌కు శిస్తు చెల్లించనవసరం లేకుండా భూములు వేతనం కింద కేటాయింపబడ్డాయి.

ఘియాజుద్దీన్ పరిపాలనలో క్రమశిక్షణను పాటించాడు. ప్రభుత్వ ఉద్యోగుల వేతనాలు పెంచాడు. అవినీతిని అరికట్టాడు. రైతుల పట్ల క్రూరంగా వ్యవహరించవద్దని, ఉదారంగా వ్యవహరించాలని ప్రభుత్వ ఉద్యోగులను ఆదేశించాడు. ప్రజల అభిమానాన్ని చూరగొనే రీతిలో పోలీసు, న్యాయశాఖలను పునర్వ్యవస్థీకరించాడు. రహదారుల వెంట చోరభయం లేకుండా చేశాడు. సైనికులు సమర్థవంతంగా, నీతివంతంగా యుండుటకు వారికి అన్ని సదుపాయాలు కల్పించాడు. ప్రభుత్వ నిధులు దుర్వినియోగం గాకుండా చర్యలు గైకొన్నాడు. సుప్రసిద్ధ సేనానియైన ఘియాజుద్దీన్ సైనికులను తాను కన్నబిడ్డల వలె ప్రేమించేవాడని బరానీ పేర్కొన్నాడు. అల్లాఉద్దీన్ మాదిరిగా సైనికులకు ఆనవాళ్లు రాయుట, గుర్రములకు రాజముద్రలు వేయుట వంటి సైనిక సంస్కరణలు ప్రవేశపెట్టాడు.

### సామ్రాజ్య విస్తరణ-తిరుగుబాటులనణచుట

ఘియాజుద్దీన్ పాలనా యంత్రాంగాన్ని గాడిలో పెట్టిన తరువాత రాజ్య విస్తరణకు పూనుకొన్నాడు. అల్లాఉద్దీన్ కంటే ఘియాజుద్దీన్‌యే గొప్ప సామ్రాజ్యవాదియని కొందరి చరిత్రకారుల అభిప్రాయం. అల్లాఉద్దీన్ దక్షిణదేశ దండయాత్రలలో కప్పంను తీసుకొని మాత్రమే తృప్తి పడ్డాడు. కాని గియాజుద్దీన్ దక్షిణదేశ రాజ్యాలను జయించాలని లక్ష్యంతో దాడులు నిర్వహించాడు. ఘియాజుద్దీన్ దాడులలో ముఖ్యమైనవి దక్షిణదేశ రాజ్యాలైన వరంగల్, మాచార్‌ల ఆక్రమణ. బెంగాల్‌లో ఆధిపత్యాన్ని నెలకొల్పుట.

తెలంగాణ పాలకుడైన రెండవ ప్రతాపరుద్ర దేవుడు కప్పం చెల్లించుట లేదని ఘియాజుద్దీన్ తన కుమారుడైన జూనాఖాన్‌ను వరంగల్ (ఓరుగల్లు)పైదాడికి పంపాడు. జునాఖాన్ తొలి యత్నం విఫలమైనా, క్రీ.శ. 1321లో జరిపిన రెండవ దండయాత్రలో విజేతయై ప్రతాపరుద్రుని బంధీగావించి, ఓరుగల్లు నాక్రమించి "సుల్తాన్‌పూర్"గా పేరిడి ఢిల్లీ రాజ్యమున చేర్చెను. తదుపరి జునాఖాన్ దక్షిణప్రాంత రాజ్యాలైన మాబార్, మధురైలను సైతం జయించి ఆక్రమించెను. ఒరిస్సాలోని జాజ్‌నగర్‌పై దండెత్తి అపార సంపదను దోచుకున్నాడు.

బెంగాల్‌లో బుగ్రాఖాన్ మరణానంతరం అతని కుమారుల మధ్య వారసత్వ యుద్ధం ప్రారంభమైంది. వీరిలోనొకడైన నసీర్ ఉద్దీన్ సుల్తాన్ సాయమర్థించాడు. అంతట ఘియాజుద్దీన్ స్వయంగా తరలివెళ్లి నసీరుద్దీన్‌ను పాలకునిగా నియమించి తన సామంతుడుగా చేసికున్నాడు. తిరుగు ప్రయాణంలో తిర్హట్ నాక్రమించినట్లు ఇసామీ వ్రాశాడు.

తుగ్లక్ సామ్రాజ్య స్థాపకుడు - ఘియాజుద్దీన్ తుగ్లక్ ఇతడు సుల్తాన్ రాజ్యాన్ని సమర్థవంతంగా పాలించాడు. వ్యవసాయాన్ని అభివృద్ధి చేసి దేశ ఆర్థిక వనరులను పెంచాడు. ఇతని కాలంలో దక్కన్‌లోని చాలా ప్రాంతాలు, బెంగాల్, ఢిల్లీ రాజ్యంలో కలిశాయి.

## 28.ఇ పాఠ్య ప్రశ్నలు

1. ఘజీమాలిక్ ఏ బిరుదముతో క్రీ.శ. 1320లో సింహాసన మధిష్టించాడు?
2. వ్యవసాయం పట్ల ఘియాజుద్దీన్ గల లక్ష్యాలేవి?

3. ఘియాజుద్దీన్ సైనిక పాటవాన్ని ఎందుకు పెంచాడు?

4. ఘియాజుద్దీన్ దక్కన్‌పై దాడికి ఎందుకు పంపాడు?

## 28.8 మహమ్మద్ బిన్ తుగ్లక్ (1325-'51)

ఘియాజుద్దీన్ మరణాన్ని గురించి చరిత్రకారులలో భేదాభిప్రాయాలు కలవు. కొందరు ఇతడు ప్రమాదవశాత్తు మరణించాడని పేర్కొనగా, సమకాలీన చరిత్రకారులైన ఇసామీ, ఇబన్ బటూట ఇతని మరణానికి అతని కుమారుడైన జునాఖాన్‌యే కారకుడని చెబుతున్నారు. ఇబన్‌బటూట రచనల ప్రకారం ఘియాజుద్దీన్ బెంగాల్‌లో ఉన్నప్పుడు జూనాఖాన్ తన బలాన్ని పెంచుకొని సుఫీ గురువైన షేక్‌నిజాంఉద్దీన్ ఆలియాతో చేతులు కలిపి అధికారాన్ని హస్తగతం చేసుకోవటానికి యత్నిస్తున్నాడని సమాచారం అందింది. సుల్తాన్ ఆలియాను, యువరాజును శిక్షించాలనుకున్నాడు. బెంగాల్ విజయంతో రాజధాని వచ్చే ఘియాజుద్దీన్‌ను జూనాఖాన్ సన్మానించటానికి, ఢిల్లీకి ఆగ్నేయంగా ఆరుమైళ్ల దూరంలో కలపతో వేయబడిన వేదికను ఏర్పాటు చేశాడు. గియాజుద్దీన్, అతని అనుచరులు విందు ఆరగించుచుండగా వేదిక కూలి సుల్తాన్ మరణించాడు. ఇట్లు ఘియాజుద్దీన్ మరణానికి యువరాజైన జూనాఖాన్ కారణమని ముస్లిం రచనలు చెబుతున్నాయి.

మహమ్మద్‌బిన్ తుగ్లక్ అను బిరుదుతో జునాఖాన్ ఢిల్లీ సుల్తానయ్యాడు. సుల్తానుగా బాధ్యతలు స్వీకరించగానే తన చర్యను గర్వించిన వారికి ధన కనకరాసులను, పదవులను ఇచ్చి వారి మద్దతు పొందాడు.

మహమ్మద్ బహుభాషా కోవిధుడు, విజ్ఞుడు. ఉలేమాల ప్రభావం నుండి విముక్తుడై తానే స్వయంగా నిర్ణయాలు తీసుకొని, అమలు పరచేవాడు. అల్లా ఉద్దీన్ కాలం నుండి సుల్తానత్‌కు సేవ చేయు విదేశీయులు, స్వదేశీ ముస్లింలు, హిందువులు గాక కొత్తవారికి ఉద్యోగములిచ్చాడు. పరమత సహనాన్ని పాటించిన తొలి ముస్లిం చక్రవర్తి మహమ్మద్ బిన్ తుగ్లక్. మహమ్మద్ హిందువుల పండుగయైన హోలి వేడుకల్లో పాల్గొన్నాడని ఇసామీ రాశాడు. యావత్ భారతదేశాన్ని సమైక్యం చేయాలనే లక్ష్యంతో, పాలనా సౌలభ్యం కోసం మహమ్మద్ తన రాజధానిని రాజ్యానికి కేంద్ర బిందువుగా నున్న దౌలతాబాద్ (దేవగిరి)కు మార్చాడు. ఇతని కాలంలో సుల్తానత్ సామ్రాజ్యం మహోన్నత స్థాయికి చేరింది. ఇంతటి సువిశాల సామ్రాజ్యంపై పాలనా, ఆర్థిక నియంత్రణ కష్టతరమైంది. అందువలననే మహమ్మద్ పాలనా కాలం తొలి సంవత్సరాలు (1325-35) సామ్రాజ్యమున శాంతి, సౌభాగ్యంతో తులతూగితే, పాలనాకాలపు మలి సంవత్సరాలలో (1335-51) విచ్ఛిన్నకర శక్తులు ప్రబలెను.

సింహాసన మధిష్టించినంతనే మహమ్మద్ కాలనూర్, పెషావర్‌లపై దండెత్తి, వానినాక్రమించెను. మంగోలులు అర్మాషిరిన్ నేతృత్వంలో దాడి చేసినా సుల్తానత్‌కు పెద్దగా నష్టమేమి జరగలేదు. మహమ్మద్ ఖురాసాన్‌పై దండెత్తుటకు సన్నాహాలు చేశాడు. చైనాతో సత్సంబంధాలను నెలకొల్పాడు, రాయబారులు మార్పిడి జరిగింది. ఆంతరంగిక సమస్యల వలన మహమ్మద్ చురుకైన, వివేకవంతమైన విదేశాంగ విధానాన్ని అనుసరింపలేకపోయాడు.

క్రీ.శ. 1326లో సాగర్ పాలకుడైన బహుద్దీన్ గుర్షాప్ తిరుగుబాటు చేయగా అతనినోడించి, సాగర్‌ను ఆక్రమించాడు. బహుద్దీన్ గుర్షాప్‌కు ఆశ్రయమిచ్చి నాజ్‌ను నెపమున అనెగొంది పాలకుడైన కంపిలిరాయలను వధించి, అనెగొందినాక్రమించెను. గుర్షాప్‌ను ద్వారసముద్ర పాలకుడైన హోయసాల వీరభిల్లాలోనికి కంపిలిరాయలు పంపాడని ఇసామీ పేర్కొన్నాడు. కాని ఐబన్‌బటూటా సుల్తాన్‌తో కంపిలిరాయలు ఘర్షణ పడుటకిష్టపడక గుర్షాప్‌ను సుల్తాన్‌కు

అప్పగించాడని వ్రాశాడు. ఏమైనా గుర్షాఫ్ పట్ల సుల్తాన్ క్రూరంగా వ్యవహరించాడు. క్రీ.శ. 1328లో ముల్తాన్ రాష్ట్ర పాలకుడైన ఖిష్యాఖాన్ క్రీ.శ. 1330లో బెంగాల్, తదుపరి సింధ్ పాలకులు సైతం తిరుగుబాటు చేయగా, సుల్తాన్ పనిని సునాయాసంగా అణచివేశాడు.

దోబ్ నందు కరువు సంభవించగా, సుల్తాన్ సహాయక చర్యలు చేపడుతున్న సమయంలో క్రీ.శ.1335లో రోమాబార్ పాలకుడు స్వతంత్రుడయ్యెను. అయినా సుల్తాన్ సైన్యం మాబార్‌వైపు పురోగమిస్తూ వరంగల్ చేరింది. అచట ప్లేగు వ్యాధి ప్రబలుట వలన అపారసైన్యం ప్రాణాలు కోల్పోయారు. తుదకు సుల్తాన్ కూడా ప్లేగు వ్యాధి బారిన పడ్డాడు. ఇట్టి విపత్కర పరిస్థితులలో సుల్తాన్ సైన్యం వెనుతిరగక తప్పలేదు. మాబార్ శాశ్వతంగా సుల్తానత్ నుండి విముక్తి చెంది స్వతంత్ర దేశమైంది. మాబార్ పోగొట్టుకొనుట మహమ్మద్ ప్రాభవానికి చావు దెబ్బ.

క్రీ.శ. 1337లో ఫక్రుద్దీన్ ముబారక్‌షా బెంగాల్‌లో స్వతంత్రుడై లక్నోతి, సోనాడ్‌గాంధలనాక్రమించి, తన పేర నాణేలు ముద్రించాడు. కాని షమ్సుద్దీన్ ఇలియాస్‌షా లక్నో నాక్రమించి స్వతంత్రుడయ్యాడు. ఇట్లు వీరిరువురు సంఘర్షణకు పాల్పడిరి. కాని మహమ్మద్ ఈ సదవకాశంను వినియోగించుకొని ఈ తిరుగుబాటు నణచలేకపోయాడు. దోఅబ్‌లందు సంభవించిన కరువు సహయక చర్యలలో మహమ్మద్ నిమగ్నమై యుండుట వలన, తగిన సాధన సంపత్తి లేకపోవుట వలన మహమ్మద్ బెంగాల్‌ను వశపరచుకొనుటకు యత్నింపలేదు. ఇట్లు బెంగాల్ శాశ్వతంగా ఢిల్లీ సుల్తానత్ నుండి విడిపోయింది.

ఇట్టి క్లిష్ట సమయంలో క్రీ.శ. 1336లో తుంగభద్ర నదీ తీరమున సంగమ సోదరులు విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించారు. వీరి గురించి తర్వాతి పాఠంలో చదువుతారు.

వరంగల్ నందు కాపయ నాయకుడు ముస్లిం గవర్నరైన మాలిక్ మల్‌బల్‌ను పారద్రోలి, వరంగల్‌ను ఆక్రమించాడు. ఇదే అదనుగా కంపిలి కూడా సుల్తానత్ నుండి విడిపోయి స్వతంత్ర రాజ్యమైంది. సుల్తానత్‌కు వారసత్వంగా వచ్చిన రాజ్యం, దేవగిరి, గుజరాత్‌లు మాత్రమే మహమ్మద్ ఆధీనంలో ఉన్నట్లు బరానీ పేర్కొన్నాడు.

దీనికితోడు ప్రభువర్గం కూడా మహమ్మద్‌కు సమస్యలు సృష్టించారు. తన సవతి సోదరుడు తనపై కుట్ర పన్నుచున్నాడని అతనిని ఉరితీయించాడు. కారా, బీదర్, గుల్బర్గాలందు చెలరేగిన తిరుగుబాట్లను అణచివేశాడు. సునాయ్, సమానాలందు రైతులు తిరుగుబాటు చేసి ప్రభుత్వానికి పన్నులు చెల్లించటం మానివేశాడు. ఈ తిరుగుబాటులో కెల్ల ప్రముఖమైంది – అయోధ్య గవర్నరైన, మహమ్మద్‌కు విశ్వాసపాత్రుడైన ఐన్–ఉల్–ముల్క్ తిరుగుబాటు. ఐన్–ఉల్–ముల్క్ దోఆబక్ష కరవు సహాయక చర్యలలో చురుకుగా పాల్గొని ప్రజల మన్నలను పొందాడు. ఐన్–ఉల్–ముల్క్ ప్రజాదరణ మహమ్మద్‌లో అనుమానాలు రేకెత్తించాయి. ఐన్–ఉల్క్–ముల్క్ భారతీయుడగుట వలన గిట్టని విదేశీ అమరులు మహమ్మద్ మనస్సును విషతుల్యం చేశారు. ఐన్–ఉల్–ముల్క్‌ను శిక్షించాలని అతనిని దౌలతాబాద్‌కు మార్చాడు. ఈ ఆదేశాన్ని ధిక్కరించి ఐన్–ఉల్–ముల్క్ తిరుగుబాటు చేశాడు. మహమ్మద్ ఈ తిరుగుబాటునణచాడు.

మహమ్మద్ వ్యవహార శైలి నచ్చక దక్కన్‌లోని సాదా అమీరులు తిరుగుబాటు చేయగా, వారిని తొలగించి మాల్వా, గుజరాత్, బీదర్‌లకు కొత్త గవర్నర్లను నియమించాడు. అయినా గుజరాత్ తిరుగుబాటు బావుటా ఎగరవేసింది. ఈ తిరుగుబాటును అణచటంతోసాదాఅమరులలోతీవ్ర అసంతృప్తి జనించింది. అదేవిధంగా దౌల్తాబాద్‌లో తిరుగుబాటు జరిగింది. మహమ్మద్ దౌలతాబాద్‌ను తిరిగి వశపరచుకొని అచటి స్థానిక ప్రభువర్గానికి ఇక్తా పాలకులుగా నియమించాడు. ఈ లోపల గుజరాత్‌లో మరల తిరుగుబాటు చెలరేగింది. ఈ తిరుగుబాటు నణచుటకు మహమ్మద్ దౌలాబాద్ పాలనా

బాధ్యతలను ఒక పాలనా మండలం అప్పగించి గుజరాత్ పయనమైనాడు. ఈ మండల స్థానిక ప్రభువర్గాన్ని అదుపులో ఉంచలేకపోయింది. క్రీ.శ. 1347లో స్థానిక ప్రభువర్గం తిరుగుబాటు చేసి పాలనా మండలి సభ్యులను వధించి బహమనీ రాజ్యస్థాపన చేసింది. ఇట్లు దౌలతాబాద్‌ను సుల్తాన్ కోల్పోయాడు.

గుజరాత్‌లో తిరుగుబాటు చేసిన థాగీ సుల్తాన్‌ను శిక్షింప, అతనిని వెంటాడుతూ మార్గమధ్యమున జ్వరపీడితుడై క్రీ.శ. 1351లో సింధు ప్రాంతంలోని థట్టా సమీపమున అసువులు బాసెను.

ఇట్లు మహమ్మద్ సువిశాల రాజ్యాన్ని పొందినా, తాను మరణించే కాలం నాటికి చాలా ప్రాంతాలు స్వతంత్రమై, రాజ్యం విచ్ఛిన్నమైంది. సరియైన రవాణా, సమాచార సదుపాయాలు లేకపోవుటవలన యావత్ భారతాన్ని ఒకే కేంద్రం నుండి పాలించుట క్లిష్టమైంది. ముఖ్యంగా దక్కన్ సుల్తాన్‌కు సవాల్‌గా మారింది. దక్కన్ రాజ్యాల పట్ల అల్లాఉద్దీన్ వారి వద్ద నుండి కప్పాన్ని మాత్రమే  తీసుకొని సామంతరాజ్యాలకు .... కాని మహమ్మద్ దీనికి భిన్నంగా దక్కన్ రాజ్యాలను హస్తగతం చేసుకొని తనే పాలన సాగించాడు. దీనిని దక్కన్ పాలకులు తీవ్రంగా వ్యతిరేకించి అవకాశం దొరికినపుడల్లా తిరుగుబాట్లు చేశారు. ఈ తిరుగుబాట్లు నణచటానికి అపార ధనం, కాలం వెచ్చించవలసి వచ్చింది. దీనికితోడు మహమ్మద్ కాలంలో సంభవించిన ప్లేగు వ్యాధి, కరవు రాజ్య ఖజానాపై, సైన్యంపై తీవ్ర ప్రభావాన్ని కలిగించింది. పైగా మహమ్మద్ ప్రవేశపెట్టిన బృహత్ పథకాలు ఆచరణలో విఫలమై ప్రజలలో తీవ్ర అసంతృప్తిని కల్గించుటేగాక, ఆర్థిక వ్యవస్థను చిన్నాభిన్నం చేసింది. ఈ నేపథ్యంలో సుల్తాన్ ఎంతటి విజ్ఞుడైనా సుల్తానత్ విచ్ఛిన్నతను అరికట్టటంలో విఫలమైనాడు.

ఢిల్లీ సుల్తానత్ పాలకులలో మహమ్మద్ గణనీయమైనవాడే. అతడు సువిశాల సామ్రాజ్యాన్ని పొందాడు. కాని సామ్రాజ్య విశాలత, ప్లేగు, కరవు సంభవించుట, బృహత్ పథకాల వైఫల్యం వలన ప్రభుత్వ ఖజానా తగ్గిపోయింది. అందువలన తాను విజ్ఞుడైనా సామ్రాజ్య విచ్ఛిన్నాన్ని అడ్డుకోలేకపోయాడు.

## 28.ఎఫ్ పాఠ్య ప్రశ్నలు

1. ఖాళీలను పూరించుము.

i) ఉలేమాల పట్ల మహమ్మద్‌బిన్ తుగ్లక్ అనుసరించిన వైఖరి ____________ స్నేహమా/స్నేహము కాదు

ii) అధికారులను మహమ్మద్ ____________ ప్రాతిపదికన ఎంపిక చేశాడు. ప్రతిభ/మతం

iii) క్రీ.శ. 1335లో ____________ రాష్ట్ర పాలకుడు తిరుగుబాటు చేయుట సుల్తానత్‌కు చావుదెబ్బ తగిలింది(మాబార్/అయోధ్య)

2. మహమ్మద్ తన అధికారాన్ని నిలబెట్టుకొనలేకపోవుటకు ఒక ప్రముఖ కారణాన్ని తెలుపుము?

3. క్రీ.శ. 1337లో మహమ్మద్ బెంగాల్‌పై దండెత్తటానికి ఏర్పడిన అవరోధమేమి?

## సారాంశం

క్రీ.శ. 1290లో జలాలుద్దీన్ మామ్లుక్ వంశీయుల (బలహీనులైన బాల్బన్ వారసులను) నంతం చేసి ఖిల్జీ

రాజ్యస్థాపన చేశాడు. ఖిల్జీల రాకతో ఢిల్లీలో తురుష్క అధికారానికి అడ్డు పడింది. తురుష్కేతరులు, భారతీయ ముస్లింలు అధికారాన్ని కైవసం చేసుకున్నారు. జలాల్ శాంతికాముకుడు, శత్రువులను శిక్షించటానికి బదులు మన్నించేవాడు. ఆయన ఎట్టి దండయాత్రలు చేయలేదు. కాని అతని అల్లుడైన అల్లాఉద్దీన్ మాల్వా, దేవగిరిలపై దండెత్తి విజయాన్ని సాధించాడు. సుల్తాన్ పట్ల అసంతృప్తితో నున్న ప్రభువుల అండదండలతో అల్లాఉద్దీన్ క్రీ.శ. 1296లో మహమ్మద్‌ను వధించి సింహాసనమధిష్టించాడు.

అల్లాఉద్దీన్ పాలనాకాలం విశిష్టమైంది. ఇతడు సుల్తాన్ గౌరవ ప్రతిష్టలను ఇనుమడింప చేశాడు. ప్రభువర్గాన్ని అణచి, నిరంకుశంగా పాలించాడు. ఇతని రాకతో ఖిల్జీ సామ్రాజ్యవాదం ప్రారంభమైందని చరిత్రకారులు అభివర్ణించారు.

అల్లాఉద్దీన్ దిగ్విజయాలలో కీలకపాత్ర పోషించినవారు – ఆయన ప్రముఖ సేనానులైన అల్ఫ్‌ఖాన్, నస్రత్‌ఖాన్, జఫర్‌ఖాన్, ఉల్గుఖాన్, మాలిక్‌కఫూర్. రాజపుత్రస్థాన విజయాలు ఆయన కీర్తి ప్రతిష్టలను పెంచితే, దక్కన్ విజయాలు ఆయనకు అపార సంపదను సమకూర్చి పెట్టింది. అల్లాఉద్దీన్ అనేక మంగోలు దండయాత్రలను ఎదుర్కొనవలసి వచ్చింది. వీనిని ఎదుర్కోవటానికి వాయువ్య సరిహద్దు ప్రాంతంలో సైన్యాలను సమాయత్తం చేశాడు. ఈ విదేశీ దాడులే అతనిని సైనిక, ఆర్థిక, రెవిన్యూ సంస్కరణలు ప్రవేశపెట్టటానికి దోహదం చేశాయి.

క్రీ.శ. 1320లో ఘియాజుద్దీన్ ఖిలీలనంతం చేసి ఢిల్లీలో తుగ్లక్ వంశాన్ని స్థాపించాడు. ఇతని కుమారుడైన జునాఖాన్ నేతృత్వంలో జరిగిన దాడుల వలన తెలంగాణా, మధురై ప్రాంతాలు తుగ్లక్ సామ్రాజ్యంలో చేరాయి. బెంగాల్‌లో చెలరేగిన వారసత్వ యుద్ధం సుల్తాన్‌కు వరంగా మారి, అచట తన అధికారాన్ని నెలకొల్పటానికి వీలు కల్గింది. ఇతడు సైన్యంలో క్రమశిక్షణను పెంపొందించి అనేక ప్రజాహిత సంస్కరణలను ప్రవేశపెట్టాడు. ముఖ్యంగా రైతుల సంక్షేమానికి పాటుపడ్డాడు.

ఘియాజుద్దీన్ మరణానంతరం అతని కుమారుడైన మహమ్మద్ క్రీ.శ. 1325లో సింహాసనమధిష్టించాడు. ఇతని పాలనా కాలంలో సుల్తానత్ విచ్ఛిన్నం ప్రారంభమైంది. సామ్రాజ్యవిస్తరణ, ప్లేగు, కరువు వలన సంభవించిన ఆర్థిక దుస్థితి – మున్నగు కారణాల వలన దేశవ్యాప్తంగా చెలరేగిన తిరుగుబాటులను అణచుటలో విఫలమైనాడు. తత్ఫలితంగా తను క్రీ.శ.1351లో మరణించే కాలం నాటికి సుల్తానత్ రాజ్యం బాగా క్షీణించింది.

## అభ్యాసం

1. క్రీ.శ. 1290లో జలాలుద్దీన్ ఖిల్జీ సింహాసనమధిష్టించుట వంశ విప్లవంగా ఏల పిలువబడింది?
2. జలాలుద్దీన్ వెలుసుబాటు గల పాలకుడని రెండు ఉదాహరణలను పేర్కొనుము.
3. అల్లాఉద్దీన్ ఖిల్జీ రాజధర్మ స్వభావమెట్టిది?
4. తిరుగుబాట్లు అణచుటకు అల్లాఉద్దీన్ గైకొన్న చర్యలేవి?
5. అల్లాఉద్దీన్ ఖిల్జీ ఢిల్లీ సుల్తానత్‌ను ఎట్లు విస్తరించాడు?
6. మాలిక్‌కఫూర్ ఎవరు? సుల్తానత్ విస్తరణకు అతని సేవ ఎట్టిది?
7. అల్లాఉద్దీన్ ఖిల్జీకాలంలో జరిగిన మంగోలుల దాడులను గూర్చి వ్రాయుము.
8. సుల్తానత్ ఆర్థిక స్థితిగతులను, పరిపాలనను మెరుగుపరచటానికి ఘియాజుద్దీన్ తుగ్లక్ గైకొన్న చర్యలేమి?

9. మహమ్మద్‌బిన్ తుగ్లక్ కాలం ఎందువలన విశిష్టమైంది? అతని కాలంలో సంభవించిన తిరుగుబాట్లను గూర్చి వ్రాయుము.

## అదనపు సమాచారం

**ఢిల్లీ హనోజ్ దుర్-అస్త్ (Hanoz- Dur - Ast)**

హనోజ్ ఢిల్లీ దుర్‌అస్త్ లేక ఢిల్లీ దుర్ అస్త్ అనే నానుడి మీరు వినేవింటారు. దీని అర్థం అనుకొన్న లక్ష్యాన్ని సాధించకపోవటం లేదా పూర్తి చేయలేకపోవటం. ఈ నానుడికి ఒక కథ ఉంది.

ఈ కథ ఘియాజుద్దీన్ తుగ్లక్‌కు సుఫీ ప్రవక్తయైన షేక్ నిజాం ఉద్దీన్ ఆలియాకు సంబంధించినది. ఈ కథ పుట్టుపూర్వోత్తరాలను గూర్చి రెండు భిన్న కథనాలు ప్రచారంలో ఉన్నాయి. సాధారణ కథనమే ... ఘియాజుద్దీన్‌కు నిజాం ఉద్దీన్‌కు మధ్య సంబంధాలు సజావుగా లేవని, నిజాం ఉద్దీన్ ఆలియాను ఢిల్లీ వదలి వెళ్లవలసిందిగా ఘియాజుద్దీన్ ఆజ్ఞాపించాడు. బెంగాల్ తిరుగుబాటు నణచి ఘియాజుద్దీన్ ఢిల్లీకి చేరువలో ఉన్నాడన్న వార్త విన్న నిజాం ఉద్దీన్ ఆగ్రహంతో అతడు ఢిల్లీ చేరడని శపించాడు. ఆయన శపించినట్లే ఘియాజుద్దీన్ తన కుమారుని చేతిలో దారు శిబిరం మారిపోయి మరణించాడు. అనగా నిజాం ఉద్దీన్ శపం వలన గియాజుద్దీన్ మరణించాడు.

మరొక కథనం ఏమిటంటే తొలుత ఘియాజుద్దీన్‌కు షేర్‌కు మధ్య సంబంధాలు సజావుగా లేకపోయినా, తరువాత సత్సంబంధాలు నెలకొన్నాయి. బెంగాల్ నుండి తిరిగి వచ్చిన తరువాత సుల్తాన్, షేర్‌ను కలవాలనుకున్నాడు. ఇందుకు అనుగుణంగా తాను ఢిల్లీ చేరేసరికి ఢిల్లీకి రావలసిందిగా షేర్‌కు వర్తమానం పంపాడు. ఘియాజుద్దీన్ లక్నోతి వద్ద నుండగానే తాను ఢిల్లీ చేరానని రెండవ వర్తమానం పంపాడు కాని భగవంతుడు (అల్లా) ఢిల్లీ హనోజ్‌దుర్‌అస్త్ అనగా సుల్తాన్ ఢిల్లీ చేరేలోపలే షేర్ మరణిస్తాడని ప్రవచించాడు. అందువలనే సుల్తాన్ ఢిల్లీకి చేరబోయే రెండు నెలల ముందే షేర్ మరణించాడు.

ఏదిఏమైనా ఈ కథనాలలో సత్యమెలాయున్నా ఈ నానుడి ప్రజలలో బాగా ప్రచారంలో ఉంది.

## పాఠ్య ప్రశ్నలకు జవాబులు

### 28.ఎ

1. i) షయిస్తాఖాన్ ii) సమానా iii) అరీజ్-ఇ-ముమాలిక్
2. ఖిల్జీలు తురుష్కేతరులని భావన
3. ఇస్లాం మతాన్ని స్వీకరించి, ఢిల్లీ దగ్గర స్థిరపడిన మంగోలులు
4. రణతంభోర్, మాండోర్, ఖిల్సా, దేవగిరి

### 28.బి

1. i) అల్లుడు సోదరుని కుమారుడు

   ii) బరానీ

2. i) గూఢచారి వ్యవస్థ అసమర్థత

ii) మత్తుపానీయాలు సేవించుట

iii) ప్రభువర్గం మధ్య సమావేశాలు, వివాహాలు

iv) కొంతమంది ప్రభువర్గం చేతిలో అపార సంపద యుండుట

3. i) ఇనాం భూములను అనుభవించు కుటుంబాలవారు ప్రభుత్వానికి భూమిశిస్తు చెల్లించాలి. ఈ చర్య వలన వారి సంపద తగ్గుతుంది.

ii) గూఢచారి వ్యవస్థను పటిష్టం చేశాడు.

iii) మత్తుపానీయాలు, మాదకద్రవ్యాలు సేవించుట నిషేధింపబడింది.

iv) సుల్తాన్ అనుమతి లేనిదే ప్రభువర్గం విందులుగాని, సమావేశాలుగాని, వివాహ సంబంధాలను గాని జరుపుకొనరాదు.

**28.సి**

1. i) స్వీయ లక్ష్యంతో కూడిన సామ్రాజ్యవాదం

ii) స్వతంత్ర రాజ్యాల ఆర్థిక సంపద

2. గుజరాత్ – రాజా కర్ణదేవుడు

రణతంభోర్ – హమ్మీర్‌రదేవుడు

చిత్తూర్‌జగ్ – రాణా రతన్‌సింగ్

3. ఉత్తర భారతంలో జయించిన రాజ్యాలను ఆక్రమించి, రాష్ట్ర పాలకులను నియమించి స్వయంగా పాలించాడు. దక్కన్‌లో ఆ రాజ్యాలను జయించి, కప్పం వసూలు చేసి, సామంత రాజ్యాలుగా మలచాడు.

4. i) దేవగిరి ii) తెలంగాణా iii) హోయసాల రాజ్యం iv) పాండ్య రాజ్యం

5. మాలిక్‌కపూర్

## 28.డి

1. సైనిక, ఆర్థిక మార్కెట్ సంస్కరణలను చేపట్టవలసి వచ్చెను.

2. మధ్య ఆసియా రాజకీయాలలో వచ్చిన మార్పులు

3. పాత దుర్గాలను బాగు చేయించాడు. కొత్త దుర్గాలను నిర్మించాడు. సువిశాల సైన్యాన్ని సమకూర్చి, వాయువ్య ప్రాంత సంరక్షణకు ప్రత్యేక గవర్నర్‌ను నియమించాడు.

4. జఫర్‌ఖాన్, మాలిక్‌నాయర్, ఘజీమాలిక్

## 28. ఇ

1. ఘియాజుద్దీన్ తుగ్లక్
    2. రైతుల స్థితిగతులు మెరుగుపరచటం, వ్యవసాయ విస్తరణ
    3. హులియా, దఘ్ సంప్రదాయాలను ప్రవేశపెట్టాడు. జీతాల దుర్వినియోగాన్ని అరికట్టాడు. సైనికులను కన్నబిడ్డల వలె ప్రేమించి, ఆదరించాడు.
    4. అతని కుమారుడైన జునాఖాన్

## 28. ఎఫ్

1. i) స్నేహపూరితం కాదు ii) ప్రతిభ iii) మబార్
    2. సామ్రాజ్య విశాలత, సరియైన రవాణా, సమచార సౌకర్యాలు లేకపోవుట, స్థానిక పాలకులు సుల్తాన్ పాలన పట్ల వ్యతిరేకత, సాదా అమీరుల స్వాతంత్ర్య పిపాస. (దీనిలో ఏ ఒక్కటైనా) దోఆబ్‌లో సంభవించిన కరవు.

# 29

# ఖిల్జీలు తుఘ్లక్‌లు (11)

## 29.1 పరిచయం

క్రితం పాఠంలో ఖీల్జీ, తుగ్లక్ రాజ్యస్థాపన గురించి చదివాం. ఈ రెండు వంశాలలో ఇద్దరు సుప్రసిద్ధ సుల్తానులు కలరు. ఒకరు అల్లాఉద్దీన్ ఖిల్జీ, మరొకరు మహమ్మద్ బీన్ తుగ్లక్. అల్లాఉద్దీన్ తన సైనిక, రెవిన్యూ సంస్కరణల వలన సుల్తాన్‌లో బలీయమైన శక్తిగా ఎదిగింది. కాని మహమ్మద్ బీన్ తుగ్లక్ ప్రవేశ పెట్టిన బృహత్ పథకాలు మంచివేయైన, అవి విఫలమై ఢిల్లీ రాజ్య విచ్ఛిన్నతకు దోహదం చేశాయి. ఈ పాఠంలో ఈ ఇద్దరు చక్రవర్తుల పాలన సంస్కరణలను గూర్చి చదువుతాం.

## 29.2 లక్ష్యాలు

**ఈ పాఠం చదివిన తర్వాత ఈ క్రింది విషయాలు తెలుసుకుందాం**

1. అల్లాఉద్దీన్ సంస్కరణలు చేపట్టుటకు గల ఆవశ్యకత.
2. అల్లాఉద్దీన్ సైనిక నిర్మాణం.
3. అల్లాఉద్దీన్ తన సైన్యాన్ని శక్తి వంతంగా, కేంద్రీకృతంగా తీర్చిదిద్దుటకు గైకొన్న చర్యలు.
4. రైతులలో ప్రత్యక్ష సంబంధాలు నెలకొల్పుకున్న తొలి సుల్తాన్‌గా అల్లాఉద్దీన్.
5. అల్లాఉద్దీన్ రెవిన్యూ సంస్కరణలను ప్రవేశ పెట్టటానికి ఆంతర్యం.
6. అల్లాఉద్దీన్ మార్కెట్, ధరల విధానం.
7. అల్లాఉద్దీన్ పాలనా సంస్కరణలలోని మంచి, చెడులను బేరీజు వేయుట.
8. మహమ్మద్‌బీన్ తుగ్లక్ ప్రవేశపెట్టిన ప్రయోగాత్మక సంస్కరణలు.
9. ఢిల్లీ నుండి దౌలతాబాద్‌ను రాజధాని మార్చిడి.
10. దో–ఆబ్‌లో పన్నులు పెంచుటకు కారణాలు.
11. నాణెముల ముద్రణా వైఫల్యం.
12. బృహత్ పథకాల ప్రభావం.

## అల్లాఉద్దీన్ పాలనా సంస్కరణలు

### 29.3 నేపథ్యం :-

సైనిక శక్తిని పెంచటానికి, ప్రభు వర్గాన్ని అణచటానికి, సుల్తాన్‌కు రైతుకు మధ్య ప్రత్యక్ష సంబంధాన్ని నెలకొల్పటానికి, మార్కెట్ ధరల నదుపులో యుంచటానికి అనేక సంస్కరణలు ప్రవేశపెట్టాడు. ఈ సంస్కరణలు సుల్తాన్ అధికారాన్ని మహోన్నత స్థాయికి చేర్చాయి.

ఈ సంస్కరణలను అల్లాఉద్దీన్ ఎందుకు ప్రవేశపెట్టాడో అందుకు దోహదంచేసిన అంశాలేమిటో మొదట తెలుసుకుందాం.

సైన్యాన్ని పూర్తిగా పునరవ్యవస్థీకరించటానికి రెండు అత్యవసర కారణాలు కలవు. i) ప్రపంచాన్నంతటినీ జయించాలనే అల్లావుద్దీన్ సామ్రాజ్య కాంక్ష, ii) మంగోలు దండయాత్రలు, సువిశాల, సురక్షిత సైన్యంలేనిదే రాజ్యవిస్తరణగాని, రాజ్య రక్షణగాని సాధ్యం కాదు.

క్రీ.శ. 13వ శతాబ్దం నుండి భారత్‌పై మంగోలు దాడులు ప్రారంభమైనాయి. ముఖ్యంగా తుగ్లక్‌ల కాలంలో వీరి దాడులు పెరిగాయి. తొలి మామ్లుక్‌లు, బాల్బన్ వీరిని ఎదుర్కొన్నారు. బాల్బన్ వలె అల్లావుద్దీన్ మంగోలులను తక్కువగా అంచనావేయలేదు. వారిని ఎదుర్కోవటానికి అనేక చర్యలు గైకొన్నాడు. సైన్యాన్ని బలవత్తరంచేసి, రాజ్యానికి నాల్గు మూలస్థంభాలుగా నిలబడగల్గారు. సుప్రసిద్ధ సేవకులైన ఉల్గుఖాన్, జఫర్‌ఖాన్, అల్పఖాన్, నస్రత్‌ఖాన్‌ల నేతృత్వంలో యుంచాడు.

సైన్యాన్ని సమకూర్చుటేగాక, దానిని యుద్ధానికి సంసిద్ధంగా చేయుట ముఖ్యం. అందుకు అల్లావుద్దీన్ రోజూవారీ వ్యాయామం, కవాతు, స్వయంగా పర్యవేక్షణ, గుఱ్ఱాలకు రాజముద్రలు మున్నగు సంస్కరణలను ప్రవేశపెట్టాడు. దీనిని గూర్చి తరువాత భాగంలో చదువుతాం.

అల్లావుద్దీన్ విజ్ఞుడైన పాలకుడు. తగు ఆర్థిక వనరులు లేనిదే సువిశాల సైన్యాన్ని పోషించటం కష్టమని భావించి, అల్లావుద్దీన్ రాజ్య ఆర్థిక పరిపుష్టితకు చర్యలు గైకొన్నాడు. రైత్వారీ విధానాన్ని ప్రవేశపెట్టాడు. మార్కెట్ ధరలను అదుపులో యుంచాడు. నిత్యావసర సరకుల ధరలను నియంత్రించి, అవే చౌకగా ప్రజలకు, సైనికులకు అందుబాటులో నుండునట్లు చేశాడు.

### 29.4 సైనిక సంస్కరణలు

అల్లావుద్దీన్ సింహాసన మధిష్టించినపుడు అనేక సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చెను. రాజపుత్రుల స్వాతంత్ర కాంక్ష, అసంతృప్తికిలోనై ప్రభువర్గం తిరుగుబాట్లు, మంగోలు దండయాత్రలు, ప్రంపంచాన్ని జయించాలనే అల్లావుద్దీన్ కాంక్ష–సువిశాల, స్థిరమైన సైన్యాన్ని సమకూర్చుకొనవలసిన ఆవశ్యకత అల్లావుద్దీన్‌కు ఏర్పడింది.

అల్లావుద్దీన్ తన సైన్యాన్నీ తురుష్కుల మాదిరిగా దశాంశ పద్ధతిలో సైనిక విభాగాలను విభజించాడని బరానీ రచనల వలన తెలుస్తుంది. అల్లావుద్దీన్ సైనిక విభాగాలు ఈ క్రింద ఈయబడిన నమూనాలో మాదిరిగా యున్నాయి.

సుల్తాన్ సైన్యంలో 4,75,00 మంది అశ్వకులున్నారని ఫెరిస్టా వ్రాత. అల్లావుద్దీన్ సైన్యంలో కాల్బలం, అశ్వకదళం,

గజబలం కలవు. సైనికులు ప్రత్యక్షంగా ఎంపిక చేయబడేవారు. సైన్యం సాయుధ సంపత్తితో సర్వ సిద్ధంగా రూపొందింపబడింది. సైనికులకు నగదు రూపంలో జీతాలు చెల్లించిన తొలి సుల్తాన్ – అల్లావుద్దీన్. సైనికుని జీతం సాలుకు 234 టంకాలు. ఈ జీతంతో ఒక గుర్రాన్ని, సామాగ్రిని, తనకుతాను పోషించుకోవాలి. ఒక అశ్వాన్ని పోషించే వారిని 'దో అస్ప' (do aspa) అని పిలవబడతారు. రెండవ అశ్వన్నీ పోషించేవారికి 78 టంకాలు అదనంగా చెల్లింపబడతాయి. సైనికులకు జాగీరిచ్చుటకు గాని, ఎక్కువ వేతరాలు చెల్లించుటకుగాని అల్లావుద్దీన్ వ్యతిరేకం.

సైన్యాన్ని నియమించే పద్ధతి, నగదు రూపంలో జీతాలు చెల్లించే పద్ధతి వలన అల్లావుద్దీన్ సైన్యం శక్తివంతమైందిగా, కేంద్రీకృతమైందిగా రూపుదిద్దుకుంది.

సైనిక నిర్వహణతో క్రమశిక్షణను పాటించెను. ముఖ్యంగా అవినీతిని నిర్మూలించుటకు హులియా, దగ్ (dagh) అను చర్యలు గైకొనెను. మస్తర్ సమయాలలో మంచి గుఱ్ఱాలకు బదులు, పనికిరాని గుఱ్ఱముల మార్పిడిని నిరోధించుటకు, ప్రభుత్వ గుఱ్ఱములకు రాజముద్రలు వేయించెను. దీనినే 'దగ్' అంటారు. సైనిక కవాతులలో దొంగ హాజరును నివారించుటకు సైనికులకు ఆనవాళ్ళు వేయించెను. దీనినే హులియా అందురు. సైనికుల హాజరు పట్టీని దివాన్–ఇ–అరీజ్ (హాజరు మంత్రి) చేసేవాడు.

దుర్గాల నిర్మాణం పట్ల అల్లావుద్దీన్ కడుశ్రద్ధ వహించాడు. మంగోలు దాడుల నెదుర్కొనటానికి బాల్బన్ వలె వాయువ్య ప్రాంతాన పాత దుర్గాలను బాగు చేయించి, పటిష్టమైన నూతన దుర్గాలను నిర్మించాడు. ప్రతి దుర్గంలో ఆహారం, పశుగ్రాసం, యుద్ధ సామాగ్రీ నిండుగా యుండేవి. కోత్వాల్ అనే ఉద్యోగి దుర్గాధిపతి.

యుద్ధసామాగ్రిని సైతం మెరుగు పరచాడు. రాళ్ళను విసిరి వేసే ఫిరంగి వంటి ఏక యంత్రాన్ని ప్రవేశపెట్టాడు. శత్రుసేనల కదలికల గురించి, శత్రు రాజుల కార్యకలాపాల గురించి తెలుసుకోవడానికి గూఢాచారులను నియమించాడు. సైనికాధికారులకు, సైనికులకు, శత్రుసేనలకు సంబంధించిన సమాచారాన్ని అందించేవారు. ఇందుకు అనుగుణంగా తపాలా పద్ధతి, రవాణా సౌకర్యాలను, గూఢాచారీ వ్యవస్థను మెరుగు పరచాడు.

## 29.ఎ. పాఠ్య ప్రశ్నలు

**1. సరియైన సమాధానమును ఎంపిక చేసి ఖాళీలను పూరించుము.**

i) అల్లాఉద్దీన్ 'సైన్యం ____________ పద్ధతిలో రూపుదిద్దబడింది.

(బ్రిటీష్, ఇండియన్, తురుష్క)

ii) అల్లాఉద్దీన్ సైనికులకు ____________ రూపంలో జీతాలు చెల్లించాడు.

(జాగీరు, నగదు, బంగారం మరియు వెండి)

iii) ____________ మాదిరిగా అల్లాఉద్దీన్ నూతన దుర్గాలను నిర్మించాడు.

(బాల్బన్, ఐబక్, మహమ్మద్‌బీన్ తుగ్లక్)

2. యల్ అస్ప, దోఅస్పము గల తేడా ఏమిటి?

3. అల్లావుద్దీన్ సైనిక సంస్కరణలో దుర్గముల నిర్మాణానికి గల ప్రాముఖ్యమేమి?

## 29.5 రెవెన్యూ సంస్కరణలు

రాజ్యంలో నెలకొన్న కొన్ని ప్రత్యేక పరిస్థితులు అల్లావుద్దీన్ రెవిన్యూ సంస్కరణలను ప్రవేశ పెట్టటానికి ముఖ్యకారణం. సువిశాల సైన్యాన్ని పోషించటానికి అపార ధనం అవసరం. ఇక్తాదార్లు వయోవృద్ధులై బలహీనులై సైన్యాన్ని సరఫరాచేసే స్థితిలో లేరు. వీరు తమ హక్కులను వదలు కొనటానికి ఇష్టపడక, ఇక్తా నుండి ఎట్టి శిస్తు సుల్తాన్‌కు చెల్లింపక, తోటి ఇక్తాదారులతో కలసి తిరుగుబాటు చేయటానికి సంసిద్ధమయ్యారు. ఉలేమాలు తాము అనుభవించే భూములు తమ సహజ హక్కుగా భావించి ప్రభుత్వానికి ఒక్క పైసా కూడ చెల్లించలేదు. అలాగే గ్రామ భూస్వాములు (మక్‌దమ్స్–Muquddems), చిన్న కమతాల భూస్వాములు (Khuts =కుత్‌లు) సైతం పన్నులు చెల్లించలేదు. ఇక పన్నుల భారమంత రైతులపై పడింది.

> కేంద్రానికి ఆర్థిక వనరుల కొరత, ఇక్తాదార్లు, ఉలేమాలు తమ హక్కులను వదలుకోవటానికి ఇష్టపడకపోవటం, రైతుల దోపిడీ – మున్నగు కారణాలు అల్లావుద్దీన్ రెవిన్యూ సంస్కరణలు చేపట్టటానికి దోహదం చేశాయి.

ఆర్థిక సంస్కరణలో తొలి చర్యగా ప్రభువర్గం, ప్రభుత్వ ఉన్నతోద్యోగులు ఉలేమాలు అనుభవించు భూములు, భరణాలు ఇనాంలు, అల్లావుద్దీన్ రద్దు చేశాడు. మిల్క్ (యాజమాన్యపు హక్కులు), ఈనాం (బహుమానాలు), అదాలత్ (భరణాలు), వక్ఫ్ (మతానికి సంబంధించి భూములు) మున్నగు వానిని ప్రభుత్వ భూములు (ఖలీసా–khalisa)గా మార్చాడు. నగదు రపంలోనే దానిని ప్రభుత్వ లావాదేవీలు జరిగేటట్లు చేశాడు. ఇక్తాదార్ల వ్యవస్థ రద్దు చేయబడక పోయినా వారు ఇక్తా నుండి పొందే మిగులు వనరులను ప్రభుత్వానికి జమచేయాలని ఆదేశించాడు.

గ్రామాలలో రెవిన్యూ వసూలు చేసే దళారుల అనగా మక్‌దయ్, కుత్‌ల అధికారాలను రద్దు చేశాడు. దోఆబ్‌లో రెవిన్యూ వసూలు చేసే బాధ్యతను ప్రభుత్వ ఉద్యోగులైన 'అమీర్' లకు అప్పగించాడు. దళారుల దోపిడీ అరికట్ట బడింది, వీరు ప్రభుత్వాన్ని రైతు చెల్లించవలసిన దాని కంటే ఎక్కువ వసూలు చేయరాదని శాసింపబడింది. ఈ చర్య వలన కుత్‌లు కడు పేదవారుగా మారారని, వారి ఇండ్లలో బంగారు, వెండి నగలు మాయమయాయని బరనీ పేర్కొన్నాడు.

అల్లాఉద్దీన్ గైకొన్న సాహసోపేతమైన చర్య భూమిశిస్తును ఏభై శాతానికి పెంచటం. తొలిసారిగా భూమిని సర్వే చేయించి భూమి శిస్తును నిర్ణయించిన తొలి సుల్తాన్–అల్లాఉద్దీన్. భూమిని కొలుచుటలో బిస్వా (Biswa) అనే సాధనాన్ని ఉపయోగించినట్లు బరనీ వ్రాశాడు. భూమిశిస్తు వస్తు రూపంలోగానీ, లేక నగదు రూపంలోగాని చెల్లింపడేది. వస్తు రూపంలో చెల్లించుట వలన ప్రభుత్వ గోదాములు నిత్యం ఆహారపదార్థాలతో నిండేవి.

వ్యవసాయం నుండి అధిక రాబడి వచ్చుట వలన, రెవిన్యూ (అమల్) ఉద్యోగులలో అవినీతి, లంచగొండి తనాన్ని నిర్మూలించటానికి పెను చర్యలు గైకొన్నాడు. వారి జీతాలు పెంచాడు. రెవిన్యూ అధికారులు సమర్పించే గణాంక వివరాలు, రైతులు చెల్లించే శిస్తుతో సరిపోల్చాడు. అవినీతిని, ద్రోహచింతకు పాల్పడిన వారిని ఖఠినంగా శిక్షించాడు.

## 29.బి. పాఠ్య ప్రశ్నలు

**1.ఈ క్రింది వానిని జతపరచుము**

| | |
|---|---|
| a) కుత్ | V) భూమి కొలుచు సాధనం |
| a) అమీల్ | W) మత సంస్థలకు చెందిన భూమి |
| a) బిస్వా | X) స్థానిక దళారి |
| a) ఖలీసా | Y) ప్రభుత్వ రెవిన్యూ ఉద్యోగి |
| a) వక్ఫ్ | Z) సుల్తాన్ భూమి |

2. ప్రభు వర్గానికి వ్యతిరేకంగా అల్లాఉద్దీన్ ప్రవేశ పెట్టిన రెవిన్యూ సంస్కరణ లేమి?

3. అమీల్ ఉద్యోగుల జీతాలు పెంచటం వలన అవినీతిని ఎలా నిరోధింప గల్గుతారు?

## 29.6 మార్కెట్ ధరలను అదుపులో ఉంచుట

అల్లావుద్దీన్ సంస్కరణల కెల్లా మకుటాయమానమైంది. మార్కెట్ ధరలనదుపులో నుంచుట మంగోలు దాడుల నెదుర్కొనటానికి. ప్రభువర్గ తిరుగుబాట్లను అణచివేయటానికి సువిశాల సైన్యం అవసరమన్న విషయాలు మనం చదివాం. ప్రభుత్వ ఖజానా పట్టి పోకుండా సైనికులకు తక్కువ జీతాలు చెల్లించాలని అల్లాఉద్దీన్ నిర్ణయించాడు. అందుకు నిత్యావసర వస్తువుల ధరలను చౌకగా లభ్యమయ్యేటట్లు చేశాడు. తత్ఫలితంగా, సైనికుల కొనుగోలు శక్తి పెరిగి, ఆర్థిక ఇబ్బందులకు లోనుకాకుండా జీవించగలరు.

ఢిల్లీ ఆర్థిక పరిస్థితులు కూడ ధరల నిర్ణయాన్ని ప్రభావితం చేశాయి.అల్లాఉద్దీన్ కాలంలో ఢిల్లీ సకల కార్యకలాపాలకు కేంద్రం. ఢిల్లీ సువిశాల సామ్రాజ్యానికి రాజధాని. పెద్ద కంటోన్‌మెంట్ ఏరియా, కేంద్రీయ మార్కెట్‌కు కేంద్రం. ఢిల్లీ జనాభా రోజు రోజుకు పెరుగుతుంది. దీనికి తోడు వ్యాపారులు వస్తూ, పోతూ ఉంటారు.. ఇవ్విధమున ధన ప్రవాహము పెరిగి, ఆహార ధాన్యాలకు గిరాకీ ఏర్పడుతుంది. తత్ఫలితంగా వర్తకులు కృత్రిమ కొరతను సృష్టించి, ధరలను పెంచే ప్రమాదం కలదు. పైగా ఇది ద్రవ్యోల్బణానికి దారితీస్తుంది. అందువలన అల్లాఉద్దీన్ ధరల పెరుగుదలను, వర్తకుల అక్రమార్జానను అరికట్టాలని నిర్దేశించాడు.

ఇందులో భాగంగా నిత్యావసర వస్తువులు అనగా ఆహార పదార్థాలు, కూరగాయలు, రొట్టెలు, వస్త్రములు, గుఱ్ఱాలు, బానిసలు మున్నగు వాని ధరల పట్టికను తయారు చేశాడు. మూడు ప్రధాన వస్తువులకు మూడు ప్రత్యేక మార్కెట్‌లు ఏర్పాటు చేశాడు. అవి ఏమనగా, ఆహార పదార్థాల మార్కెట్ (మండి), వస్త్ర మార్కెట్ (సరై అదల్) మరియు పశువులు, గుఱ్ఱాలు, బానిసలకు మరొక మార్కెట్.

ఇట్లు అన్ని వస్తువుల ధరలు నిర్ణయింపబడేవి. వర్తకులు నిర్ణయించిన ధరల కంటె ఒక్క పైసా కూడ, తుదకు కరువు కాటకాలు సంభవించినప్పుడైనా ఎక్కువ అమ్మరాదని శాసించెను. “మార్కెట్ ధరల స్థిరీకరణ (హెచ్చు, తగ్గులు లేకుండా) నాటి ప్రపంచంలోనే అద్భుతమని” – బరనీ ప్రశంసించాడు.

నిర్దేశించిన ధరలు సరిగా అమలగుచున్నావో పర్యవేక్షించుటకు (షహనా ఇ-మండి) (మార్కెట్ అధ్యక్షుడు) అనే అధికారిని నియమించాడు. ఇతని హోదాకు తగ్గట్టు అతనికి సువిశాల ఇక్తా, అశ్విక, పదాతిదళాలు, సహాయకులు (నాయబ్ షహానా) నియమించాడు. ఇతను గాక మార్కెట్ కార్యకలాపాల రోజువారి నివేదికలను తెప్పించుకొనటానికి స్వతంత్ర ప్రతిపత్తి కల్గిన అధికారులను అనగా బరీద్ (నిఘా అధికారి), మున్హియార్లు అనగా రహస్య గూఢాచారులను నియమించాడు.

ధరల స్థిరీకరణ నిరంతర ఆహార పదార్థాల సరఫరాపై ఆధారపడి ముంటుందని గుర్తించి అందుకు తగిన చర్యలు గైకొన్నాడు. ప్రభుత్వ భూముల నుండి వచ్చు ఫల సాయాన్ని దోఆబ్ ఏభై శాతం వరకు పెంచిన భూమిశిస్తును వస్తు రూపంలో వసూలు చేయాలని ఆదేశించాడు. అధీకృత ధాన్య డీలర్ల (బంజారాలు) రక్షణలోఈ ధాన్యం ఢిల్లీకి రవాణా చేయబడేది. ఈ ధాన్యాన్ని ప్రభుత్వ గోదాములలో నిల్వ ఉంచేవారు.

ధాన్యపు వ్యాపారుల లావాదేవీలపై కఠినమైన నిఘా ఉంచాడు. సుల్తానత్‌లోని ధాన్యపు వ్యాపారులందరు "షహనా–ఇ– మండి" వద్ద నమోదు చేసుకోవాలి. ధాన్యపు వ్యాపారులు తమ పేరు నమోదు చేసుకొనుటయే గాక, ప్రభుత్వానికి నిత్యం ఆహార పదార్థాలను సరఫరా చేస్తామని, నిర్ణయించిన ధరలకే అమ్ముతామని ఒడంబడిక పత్రాలపై సంతకం చేయాలి. ఈ ప్రక్రియ పూర్తయ్యే వరకు వారి నాయకులను నిర్బంధించేవారు. వీరందరూ యమునా నది ఒడ్డున తమ కుటుంబాలతో నివసించే వారు. వీరిపై ప్రత్యేక, ప్రత్యక్ష నియంత్రణాధికారి యుంటాడు.

రైతులు ధాన్యాన్ని నిల్వ చేయుటకు, నిరోధించటానికి ప్రభుత్వం నిర్ణయించిన ధరలకే ధాన్యాన్ని తరలించుకోవాలని ఆదేశించాడు. ఈ ఆదేశాలు సరిగా అమలగుతున్నాయో లేదో పర్యావేక్షించే అధికారాన్ని మెజిస్ట్రేట్, రెవిన్యూ కలెక్టర్లకు అప్పగించాడు.

అల్లాఉద్దీన్ గైకొన్న చర్యల వలన గోదాములు ఎల్లప్పుడూ నిండుగా యుండేవి. అత్యవసర పరిస్థితులలో గోదాముల నుండి ధాన్యాన్ని విడుదల చేసి, రేషనింగ్ ద్వారా పంపకం చేసేవారు. ఈ చర్యల వలన ఢిల్లీ ఏనాడు కరువు కాటకాలు ఎరుగదని బరానీ వ్రాశాడు.

వస్త్ర మార్కెట్ (సరైఅదల్) పాలన కూడ ఆహార పదార్థాల మార్కెట్ తరహాలోనే నిర్వహింపబడింది. వస్త్రాల కొనుగోలులో దూర ప్రాంతాలైన ముల్తాన్, దేవగిరి వర్తకులను ప్రభుత్వం నిర్ణయించిన ధరలకే అమ్మాలని శాసించలేదు. వారు వారి మార్కెట్ వర్తకులకే ఆ వస్త్రాలను అమ్ముకుంటారు. ఉదా: ముల్తాన్‌లో తయారయ్యే వస్త్రాలను ముల్తాన్ వర్తకునే కొనుగోలు చేస్తారు. ఈ కొనుగోలుదారులకు ప్రభుత్వం రెండు మిలియన్ టంకాల వరకు అప్పు ఇస్తుంది. ఇట్లు కొనుగోలు చేసిన వస్త్రాలు వస్త్ర మార్కెట్‌లో ప్రభుత్వం నిర్ణయించిన ధరలకు అమ్ముతారు. భిన్న వస్త్రాలను దూర ప్రాంతాలలో స్థానిక రేట్లలో కొనుగోలు చేసి, వస్త్ర మార్కెట్‌కు వస్త్రాల సరఫరా నిత్యం కొనసాగేట్లు చర్యలు గైకొన్నాడు.

అశ్వాల కొనుగోలులో దళారీ వ్యవస్థను నిర్మూలించటానికి, పశువుల మార్కెట్‌లో తక్కువ ధరకే అశ్వాలను కొనుగోలు చేసే పద్ధతి ప్రవేశపెట్టడం దీనితో అశ్వాల వ్యాపారస్థులు, దళారులు పూర్తిగా తుడిచిపెట్టుకుపోయారు.

మార్కెట్ ధరల నదుపులో నుంచెడి చర్య కేవలం ఢిల్లీకే పరిమితమా? లేక రాజ్యవ్యాప్తమా? అనేది చరిత్రకారుల మధ్య వివాదాంశంగా మారింది.

అల్లాఉద్దీన్ నిత్యావసర వస్తువుల ధరలను నిర్ణయం ప్రజలకు అందుబాటులో నుండునట్లు చేశాడు. మార్కెట్లను ఏర్పాటు చేసి వస్తువులను ప్రభుత్వం నిర్ణయించిన ధరలకే అమ్మేటట్లు చేశాడు. రైతులు, వర్తకులు ఈ మార్కెట్లకు నిరంతరం వస్తువులను సరఫరా చేసేటట్లు సమాయత్తం చేశాడు.

## 29.సి. పాఠ్య ప్రశ్నలు

**1. ఈ కింద ఈయబడిన వానిలో కొన్ని కారణాలు ఈయబడ్డాయి. వాని ఫలితాలేమిటో వివరింపుము?**

a) ఢిల్లీ పెద్ద వర్తక కేంద్రం. దాని ఫలితమేమి?

b) దోఆబ్ నుండి భూమిశిస్తు వస్తు రూపంలో వసూలు చేయబడి ఢిల్లీకి రవాణా అయ్యేది. ఎందువలన?

c) షహనా-ఇ-మండి వర్తకులపై నిఘా వహించాడు. ఎందువలన?

d) వర్తకులు తమ వస్తువులను మార్కెట్‌లో ప్రభుత్వం నిర్ణయించిన ధరలకే అమ్మాలని ఆదేశించింది. తత్ఫలితమేమి?

2. అల్లాఉద్దీన్ స్థాపించిన మూడు మార్కెట్‌లు ఏవి?

3. వస్త్ర మార్కెట్‌కు నిరంతరం వస్త్రాల సరఫరా అయ్యేటట్లు అల్లాఉద్దీన్ ఎలా చేయగల్గాడు?

## 29.7 అల్లాఉద్దీన్ సంస్కరణల సమీక్ష

పెక్కు పాలనా సంస్కరణలను ప్రవేశపెట్టిన తొలి సుల్తాన్ – అల్లాఉద్దీన్. సువిశాల సైన్య పోషణార్థం, ప్రభువర్గ తిరుగుబాట్లు నణచుటకు, ఆర్థిక, రెవిన్యూ నియంత్రణల ద్వారా రాజ్య ఖజానా నింపుటకు ఈ సంస్కరణలు చేపట్టాడు.

మధ్యయుగ రాజరిక వ్యవస్థ సైనిక శక్తిపై ఆధారపడి ఉంది. సైనిక బలంతోనే అల్లాఉద్దీన్ అధికారాన్ని హస్తగతం చేసుకున్నాడు. కనుక సైనికుల సంతృప్తి పరచి, వారి విశ్వాసాన్ని చూరగొనుటకే పెక్కు చర్యలు గైకొన్నాడు. ఖిల్జీ రాజ్యం సైనిక బలంపై ఆధారపడింది.

అల్లాఉద్దీన్ ప్రవేశపెట్టిన సైనిక సంస్కరణలు సైన్యంలో క్రమశిక్షణను పెంపొందించాయి. ఈ సైనిక క్రమశిక్షణ వలననే అల్లాఉద్దీన్ సైన్యం మంగోలు దాడులనెదుర్కొనటే గాక, అతని రాజ్యం దక్కన్‌లోని మధురై వరకు విస్తరించగల్గింది. సైనికులకు జాగీరులకు బదులు నగదు రూపంలో జీతాలు చెల్లించి, వారు సంపన్నులుగాకుండా నిరోధించాడు.

రాజ్య ఆర్థిక వనరులను పెంపొందించుటకు అల్లాఉద్దీన్ గైకొన్న చర్యలు అణచివేత చర్యలని పెక్కు చరిత్రకారుల అభిప్రాయం. దేశ ప్రజలను కడు దరిద్రులుగా మార్చి, వారి నోట తిరుగుబాటు అను మాట ఉచ్చరింపకుండా చేయుటే అతని లక్ష్యం. దుష్పరిపాలనను అంతం చేయటానికి అనేక చర్యలు గైకొన్నాడు. ప్రభుత్వానికి చెల్లించవలసిన బకాయిలను వెలికి తీయటానికి 'దివాన్-ఇ-ముస్తాఖారజ్'ను ఏర్పాటు చేశాడు. రెవిన్యూ ఉద్యోగులు ఎంత కఠినంగా వ్యవహరించే వారంటే వారికి తమ కుమార్తెను ఇచ్చి వివాహం జరిపించటానికి ఎవ్వరూ ఇష్టపడేవారు కాదని బరానీ పేర్కొన్నాడు. ఒకవంక రైతులపై పన్నుల భారాన్ని పెంచి, మరొక వంక వారిని స్థానిక భూస్వాముల దోపిడీ నుండి కాపాడాడు. భూస్వాములను రైతులతో సమానులుగా మార్చాడు.

ప్రభువర్గం, ఉలేమాలపై గైకొన్న ఆర్థిక చర్యల వలన సుల్తాన్ గౌరవ ప్రతిపత్తి పెరుగుటేగాక, రాజ్య ఖజానాకు

చాలా లాభం సమకూరింది. ఇక్తా వ్యవస్థ రద్దుగాక పోయినా ప్రభువర్గం మిగులు సంపదను అనుభవించే స్థితి లేదు. రాజ్యపాలనలో కీలక పాత్ర పోషించే ఉలేమాలు అల్లాఉద్దీన్ కాలంలో కనుమరుగైనారు.

మార్కెట్ నిబంధనలు వర్తకులకు, రైతులకు సైతం నష్టాన్ని కలుగ చేశాయి. వర్తకులు పూర్తిగా ప్రభుత్వ నియంత్రణకు లోబడి వ్యాపారం చేయాలి. వారికెట్టి ప్రోత్సాహకాలు లేవు. వారు అధిక లాభాలు గడించటానికి వీలులేదు. రైతులు తాము పండించిన ధాన్యాన్ని చౌకగా ప్రభుత్వం నిర్ణయించిన ధరలకే అమ్మాలి. వారు స్వేచ్ఛగా మార్కెట్‌లో తమ కిష్టమైన ధరకు అమ్ముకోవటానికి వీలు లేదు. కాకపోతే వీరికి దళారుల బెడద తప్పించి, తమ ఉత్పత్తులను పట్టణాలకు రవాణా చేసే బాధ్యత తొలగింది. ఏమైనా మార్కెట్ నిబంధనల వలన లబ్ది పొందినవారు సైనికులు, ప్రభుత్వ ఉద్యోగులు. ఈ నిబంధనలు ప్రజలపై పరోక్ష పన్ను భారం మోపుట వలన రాజ్యానికి ఆర్థిక పరిపుష్టి సమకూరింది.

## 29.8 మహమ్మద్‌బిన్ తుగ్లక్ ప్రయోగాత్మక సంస్కరణలు

మహమ్మద్‌బిన్ తుగ్లక్ అనేక బృమత్తర పథకాలు ప్రవేశపెట్టిన సుల్తాన్‌గా చరిత్రలో ప్రసిద్ధికెక్కాడు. ఈ పథకాలన్ని ఆయన ఆదర్శ భావాలకు, విజ్ఞతకు ప్రతీక. దురదృష్టవశాత్తు ఈ పథకాలన్నీ విఫలమై ప్రజల తీవ్ర అసంతృప్తికి కారణమైనాయి. అందువలన ఆయనను 'గ్రహచారం బాగాలేని ఆదర్శవాది' (ill-starred idealist) యని అభివర్ణించారు. ఈ పథకాలకు కారకమైన ఆయన దృక్పథాన్ని గూర్చి తొలుత తెలుసుకుందాం.

మహమ్మద్‌బిన్ తుగ్లక్ విశిష్టమైన వ్యక్తిత్వం గలవాడు. ఇతడు బహుభాషా కోవిధుడు. మత, తర్క, గణిత, తత్వ, ఖగోళ, మున్నగు శాస్త్రాలకు బాగా అధ్యయనం చేసిన మేధావి. ఇతనికి అద్భుతమైన జ్ఞాపకశక్తి, అపారమైన జ్ఞానతృష్ట, మంచి వాదనా పటిమ కలదు. పెద్ద పెద్ద విద్వాంసులు సైతం ఆయనతో చర్చలకు సంసిద్ధం కావాలంటే జంకేవారు. మత, సామాజిక హోదాను బట్టిగాక ప్రతిభను బట్టి ఉన్నత పదవులు ఇచ్చాడు. కనుకనే బరానీ అతని ప్రతిభను గుర్తించి 'సృష్టి వైపరీత్యం' గల వ్యక్తియని శ్లాఘించాడు.

అల్లాఉద్దీన్ మాదిరిగా మహమ్మద్ పాలనలో ఉలేమాల జోక్యంను అనుమతించలేదు. ప్రజలందరినీ సమానంగా నెంచి, ముస్లిమేతరులను హింసించుట మానివేశాడు. పరమత సహనం పాటించాడు. తన స్వేచ్ఛా, తత్వభావాలు సనాతన ముస్లింలకు, చరిత్రకారుడైన బరానీకి కూడా గిట్టలేదు.

మహమ్మద్ సామ్రాజ్య కాంక్ష గలవాడు. యావత్ భారతాన్నే గాక, మధ్య ఆసియాను (ఖోరసాన్) కూడా జయించాలని కాంక్షించాడు.

మహమ్మద్ బృహత్తర పథకాలను గురించి చదువుతారు.

## 29.9 రాజధాని మార్పిడి

మహమ్మద్ ప్రవేశపెట్టిన పథకాలలో తీవ్ర విమర్శకు గురియైంది –రాజధానిని ఢిల్లీ నుండి దేవగిరి (దౌలతాబాద్)కి మార్చుట. రాజధాని మార్పిడికి అనేక కారణాలు కలవు. ఇబున్ బటూటా రచనల ప్రకారం ఢిల్లీ నందలి ప్రజలు మహమ్మద్‌పై అనేక అపనిందలు వేస్తూ ఉత్తరాలు రాస్తున్నారు. వీరిని శిక్షించటానికి రాజధానిని మార్చాడు. ఈ చర్యకు మిగిలిన కారణాలేమంటే – దక్కన్ ఎప్పుడు సమస్యలమయమే. దక్కన్ రాజ్యాలు సదా తిరుగుబాటు చేసి స్వాతంత్ర్యాన్ని ప్రకటిస్తున్నాయి. వీరిని అణచాలంటే ఢిల్లీ నుండి సైన్యాన్ని సమాయత్తం చేయుట. అధిక వ్యయ ప్రయాసలతో కూడుకొన్నది.

దీనికితోడు ఢిల్లీలోని ప్రభువర్గం సుల్తాన్ పట్ల విధేయతగా నుండక స్వతంత్రులై అధికారాన్ని అందిపుచ్చుకోవాలని యత్నిస్తున్నారు. ఈ రెంటికి పరిష్కారంగా దేవగిరిని రెండవ రాజధానిగా మహమ్మద్ చేయ సంకల్పించాడు. ఢిల్లీ, దౌలతాబాద్‌ల రెంటిని రాజధానులుగా యుంచాలన్నదే మహమ్మద్ లక్ష్యమని ఆచార్య మహదీ హుస్సేన్ (Mahdi Hussain) అభిప్రాయం.

సువిశాల సామ్రాజ్యానికి మధ్యస్తంగా కీలక కేంద్రంగా ఉండుట వలన రాజధాని మార్పిడి జరిగిందని బరానీ వ్రాత. నిత్యం మంగోలుల బెడదకు గురయ్యే వాయువ్య ప్రాంతానికి దూరంగా రాజధాని ఉంటే తగు రక్షణ ఉంటుందని భావించినట్లు ఇసామీ చరిత్రకారుడు పేర్కొన్నాడు.

సమకాలీన చరిత్రకారులు రాజధాని మార్పిడిలో ఢిల్లీ పౌరులందరినీ నూతన రాజధానికి వెళ్లవలసిందిగా సుల్తాన్ ఆదేశించాడని చెబుతున్నారు. డా.యమ్.హుస్సేన్, ఢిల్లీ రాజధానిగా ఏనాడు విసర్జింపబడలేదని, ఢిల్లీ నగరం ఏనాడు నిర్జన ప్రాంతంగా ఉండలేదని అభిప్రాయపడ్డాడు. ఏదిఏమైనా ఢిల్లీ పౌరులందరినీ సుల్తాన్ ఆదేశించే మూర్ఖుడు కాదు. వాస్తవంగా ప్రభువర్గాన్ని, ఉలేమాలను, షేక్‌లను, మేధావివర్గాన్ని మాత్రమే దౌలతాబాద్‌కు మార్చినట్లు విదితమగుతుంది. ఢిల్లీ నుండి దౌలతాబాద్‌కు మధ్య గల 700 మైళ్ల పొడవునా రాజధాని మార్పిడిలో విస్తృత ఏర్పాటు చేశాడు. దారిపొడవునా నీడనిచ్చే చెట్లను నాటటం, ఉచిత భోజన, నీటి సదుపాయాలు కల్పించటం వంటి ప్రయాణ సౌకర్యాలు కల్పించాడు. ఈ చర్య వలన నష్టపోయిన వారికి పరిహారం చెల్లించాడు. ఎన్ని సౌకర్యాలు కల్పించినా ప్రజలు పడ్డ కష్టాలు వర్ణనాతీతం. ఇట్లు ప్రజలలో తీవ్ర అసంతృప్తి నెలకొనగా, వాయువ్య ప్రాంతమున మంగోలు దాడులు విస్తృతమైనాయి. దీనితో దక్కన్‌నుండి ఉత్తర భారతాన్ని నియంత్రించుట కష్టమని భావించి సుల్తాన్ రాజధానిని మరల దౌలతాబాద్ నుండి ఢిల్లీకి మార్చాడు. సుల్తాన్ రాజధాని మార్పిడి ప్రయోగం విఫలమైనా ఉత్తర, దక్షిణ భారత్‌ల మధ్య సాంస్కృతిక సంబంధాలను మెరుగు పరచింది.

> మహమ్మద్ రాజధాని మార్పిడికి దక్కన్‌లో చెలరేగే తిరుగుబాట్లు, రాజ్యానికి మధ్యస్తంగా ఉండుట, మంగోలుల బెడద, మున్నగు కారణాలు కలవు.

## 29.10 అంతర్వేదిలో భూమిశిస్తు పెంపు

రాజ్య ఆర్థిక వనరులను పెంచటానికి సారవంతమైన గంగ-యమున అంతర్వేదిలో భూమిశిస్తును మహమ్మద్ పెంచాడు. ఈ శిస్తు ఏ మేరకు పెంచాడనే దానిపై చరిత్రకారులలో ఏకాభిప్రాయం లేదు. ఈ శిస్తును 10 లేక 20 రెట్లు పెంచాడని బరానీ, మూడు లేక నాల్గు రెట్లు పెంచాడని ఫెరిస్టా పేర్కొన్నారు.

అయితే బరానీ రచనలు నమ్మశక్యంగా లేవు. ఏదిఏమైనా భూమిశిస్తు పెంచటం జరిగింది. దురదృష్టవశాత్తు ఇదే సమయంలో వర్షాభావం వలన అంతర్వేదిలో కరువు సంభవించింది. దీనితో రైతులు పన్నులు చెల్లింపలేక, భూములు వదలి, దారిదోపిడీలకు పాల్పడ్డారు.

దోఆబ్ సారవంతమైన భూమి కనుక భూమిశిస్తు పెంచటంలో ఔచిత్యముంది. అల్లాఉద్దీన్ ఖిల్జీయే ఏభై శాతం భూమిశిస్తును వసూలు చేసినట్లు మనం చదివాం. దురదృష్టమేమంటే ఈ ప్రాంతంలో కరువు సంభవించిన సమయంలో ఈ శిస్తు పెంచటం, చివరకు పెంచిన భూమిశిస్తు సంగతి ఎలాయున్నా, రైతులు అసలు భూమిశిస్తు కూడా చెల్లించే

స్థితిలో లేరు. విషయం తెలుసుకున్న మహమ్మద్ అనేక క్షేమ నివారణ చర్యలు గైకొని రైతులకు అప్పులిచ్చి, శిస్తు వసూలును నిలుపదల చేశాడు. కాని ఈ చర్యలు ఆలస్యంగా గైకొనుట వలన రైతులకెట్టి ప్రయోజనం కలుగలేదు.

వ్యవసాయ విస్తరణకు మహమ్మద్ కృషి చేశాడు. ఎక్కువ భూములను సాగులోనికి తీసుకు రావటం కోసం, రైతులు ఉత్తమ పంటలను పండించేందుకు ప్రోత్సహించటం కోసం 'దివాన్–ఇ–కోహి' అనే వ్యవసాయ శాఖను ఏర్పాటు చేసి, నిధులను కేటాయించాడు. అయితే వ్యవసాయ శాఖను ఏర్పాటు చేసి, నిధులను కేటాయించాడు. అయితే వ్యవసాయ శాఖ ఉద్యోగుల అసమర్థత, అవినీతి, లంచగొండితనం వలన ఒక్క ఎకరం భూమి కూడా సాగులోనికి రాలేదు. ఈ పథకం పూర్తిగా విఫలమై ఖజానాకు తీరని నష్టం కలిగింది.

## 29.డి. పాఠ్య ప్రశ్నలు

1. సరియైన సమాధానమును ఎంపిక చేసికొని ఖాళీలను పూరింపుము.

   i) మహమ్మద్‌బిన్ తుగ్లక్ ____________ ప్రాతిపదికగా ఉన్నతోద్యోగములనిచ్చెను.
   (ప్రతిభ/ మతం/ పుట్టుక)

   ii) మహమ్మద్ తన రాజధానిని ఢిల్లీ నుండి ____________ కు మార్చాడు.
   (గ్వాలియర్, తెలంగాణా, దేవగిరి)

   iii) దో–ఆబ్‌లోని ప్రజలు పెంచిన భూమిశిస్తును చెల్లింపలేకపోవుటకు గల కారణం ____________
   (కరువు, వరదలు, భూకంపం)

2. రాజధాని మార్పిడిలో మహమ్మద్ రాజకీయ లక్ష్యాలు ఏమిటి?

3. ఉత్తర, దక్షిణ భారత సంబంధాలలో రాజధాని మార్పిడి ఎట్టి ప్రభావాన్ని కల్గించింది?

4. వ్యవసాయ విస్తరణకు మహమ్మద్ గైకొన్న చర్యలేమి?

## 29.11 నూతన నాణేలు ప్రవేశపెట్టుట

మహమ్మద్ ప్రవేశపెట్టిన మరొక పథకం – నూతన నాణేలు ముద్రణ. రైతుల దుస్థితి, తిరుగుబాట్లు, కరువు కాటకాలు, సైనిక వ్యయం, వినూత్న సంస్కరణలను ప్రవేశపెట్టాలనే మహమ్మద్ ఆకాంక్ష ఈ సంస్కరణలకు కారణాలు.

సుల్తాన్ దండయాత్రల వలన, అతని కారుణ్యం వలన రాజ్య ఖజానా ఖాళీయైనందునే నూతన నాణేల ముద్రణకు మహమ్మద్ ఒడిగట్టాడని బరానీ వ్రాశాడు. చైనా పాలకుడైన కుబ్లైఖాన్ 'చావో' అనే కాగితపు కరెన్సీ ప్రవేశపెట్టుట, సుల్తాన్‌ను నూతన కరెన్సీకి ప్రేరేపించి ఉండవచ్చు. నాడు ప్రపంచవ్యాప్తంగా భారత్‌తో సహా వెండి కొరత ఉంది. కనుక నిత్యం చలామణిలో ఉండే నాణేలు విరివిగా లభించే రాగిలో ముద్రించాలని సుల్తాన్ భావించాడు.

నూతన నాణేల చలామణి అనేది భారత్‌కు కొత్త. దీనిని వర్తకులు, ప్రజలు ఆమోదింపలేకపోయారు. నకిలీ నాణెల ముద్రణను అరికట్టుటలో ప్రభుత్వం పూర్తిగా విఫలమైంది. ప్రతి గృహం టంకశాలగా మారి అసంఖ్యాక దొంగ నాణేలు చలామణిలోనికి వచ్చాయి. తత్ఫలితంగా డబ్బుల విలువతగ్గి, ధరలు పెరిగాయి. ప్రజలు విదేశీ వర్తకులకు ప్రభుత్వ నాణేలేవో, నకిలీ నాణేలేవో తెలియక నూతన నాణేలను తిరస్కరించారు. దీనితో సర్వత్రా గందరగోళం, అనిశ్చితి ఏర్పడింది.

ప్రతివారు బంగారు, వెండి నాణేలు దాచుకొని నూతన నాణేలనే పన్నుల రూపంలో చెల్లించటం ప్రారంభించారు. బంగారు, వెండి నాణేల కొరతతో నూతన నాణేలు ప్రభుత్వానివో, నకిలీవో తెలియక విదేశీ వాణిజ్యం స్తంభించింది. ఇట్టి స్థితిలో మహమ్మద్ నూతన నాణేలు ఉపసంహరించుకొన్నాడు. ప్రజలు నష్టపోకుండా నూతన నాణేల విలువకు సరిపోవు బంగారు, వెండి నాణేలు ఇచ్చాడు. ఈ నకిలీ నాణేలు యమునానది ఒడ్డున కుప్పలుగా పోయబడి, చాలా సంవత్సరాలు అలాగే ఉన్నాయని బరానీ పేర్కొన్నాడు.

## 29.12 ఖోరసాన్ దండయాత్ర

యావత్ భారతాన్ని తన ఆధీనంలోనికి తెచ్చుకున్న మహమ్మద్ సరిహద్దు రాజ్యాలను సైతం జయించాలని సంకల్పించాడు. ఏ చక్రవర్తి కైనా రాజ్య విస్తరణ సహజం.

తొలి రోజులలో మహమ్మద్ మంగోలు దాడులను విజయవంతంగా ఎదుర్కొని, కాలనుర్‌ను సైతం కొన్నాళ్లు ఆక్రమించాడు. దీనితో సుల్తాన్ అధికారం పెరిగింది. ఈ లోపల మధ్య ఆసియా పాలకులైన ఇల్కన్‌ల అధికారం క్షీణించి, రాజకీయ అనిశ్చితి ఏర్పడింది. మహమ్మద్ ఆస్థానానికి ఇరాక్, ఖోరసాన్‌ల నుండి వలస వచ్చినవారు, సైనికులు మధ్య ఆసియాపై దండెత్త వలసిందిగా సుల్తాన్‌ను ప్రోత్సహించారు.

ఖోరసాన్ దాడికి సువిశాల సైన్యాన్ని సమకూర్చాడు. బరానీ ఈ సైన్యంలో 3,70,000 మంది ఉన్నారని రాశాడు. ఈ దాడికి అపార ధనం వెచ్చించాడు. సైనికులకు ఒక సంవత్సరం జీతం ముందుగానే చెల్లించాడు. ఈ ఖర్చులన్నీ ఖోరసాన్ ముట్టడిలో తిరిగి పొందవచ్చని భావించాడు. కాని పరిస్థితులు మారిపోయాయి. హిమాలయాల దాటుటలో గల కష్టనిష్టూరాలను, ఆర్థిక ఇబ్బందులను గుర్తించి ఖోరసాన్ జయించు యత్నాన్ని విరమించి, సైన్యాన్ని రద్దు చేశాడు. దీనితో సుల్తాన్ అధికారం సన్నగిల్లగా, ఈ దాడికి సమాయత్తమైన సైన్యం నిరుద్యోగులై నిరాశ, నిస్పృహలకు లోనైనారు.

మహమ్మద్ జరిపిన మరొక నిష్ఫలమైన దండయాత్ర హిమాలయాలలోని కారజాల్ ప్రాంతం. ఈ కొండ జాతి నాయకులు మహమ్మద్‌కు లొంగిపోయారు. కాని తిరుగు ప్రయాణంలో సుల్తాన్ సైన్యాలు వర్షాలకు, రోగాల బారిన పడ్డాయి. దీనినవకాశంగా గైకొని కొండజాతి ప్రజలు వారిపై దాడి చేశారు. చివరకు పదిమంది సైనికులు మాత్రమే ఈ దాడి నుండి బయటపడి రాజధాని చేరారని బరానీ వ్రాశాడు.

## 29.13 ఇబన్‌బటూట

ఇబన్‌బటూట పేరు ప్రస్తావన లేకుండా మహమ్మద్‌బిన్ తుగ్లక్ చరిత్ర అసంపూర్ణమగుతుంది. ముస్లిం యాత్రికుడైన ఇబన్‌బటూట తన జీవితంలో ఎక్కువ సంవత్సరాలు అనేక దేశాలను సందర్శిస్తూ గడిపాడు. తన రచనలలో మధ్య ఆసియా, ఇరాన్, అరేబియా నగరాల గురించేగాక, ముఖ్యంగా భారత్‌లోని అనేక నగరాల గురించి విపులంగా ప్రస్తావించాడు. తన పర్యటనలోని అనుభవాలను 'రెహ్లా' (సఫానామా) అనే గ్రంథంలో పొందుపరచాడు. ఈ గ్రంథం మహమ్మద్‌బిన్ తుగ్లక్ ఆస్థానాన్ని గురించి, నాటి ప్రజల స్థితిగతులను గురించి తెలిసికొనుటకు ముఖ్య ఆధారం.

ఇబన్‌బటూట మొరాకోలోని టాంగీర్ నందు క్రీ.శ. 1304లో జన్మించాడు. క్రీ.శ. 1325లో స్వదేశంనుండి బయలుదేరి ముల్తాన్, సిర్‌సత్, హన్సి, పాలం మీదుగా ఢిల్లీ చేరుకున్నాడు. ఢిల్లీలో మహమ్మద్‌బిన్ తుగ్లక్ అతనిని సాదరంగా ఆహ్వానించి, జాగీరుఇచ్చి, రాజధానికి క్వాజీగా నియమింపబడ్డాడు. ఢిల్లీ కొలువులో ఇబన్‌బటూట ఎనిమిది

సంవత్సరాలు ఉండి, ప్రముఖమైన వ్యక్తిగా వెలుగొందాడు. సుల్తాన్ రాయబారిగా బటూట క్రీ.శ. 1342లో చైనా వెళ్లాడు. చైనానుండి తిరిగి వచ్చిన తరువాత భారత్ చేరుకుని కాలికట్ నుండి ఓడ ప్రయాణంతో స్వదేశం చేరుకున్నాడు.

సమకాలీన చరిత్రకు ఇబున్‌బటూటా 'రెహ్లా' అమూల్యమైన ఆధారం. కాని 'రెహ్లా'లోని విషయాలన్నీ పూర్తిగా యదార్థాలని చెప్పలేము. చాలా సందర్భాలలో చారిత్రక అంశాలు, పిచ్చాపాటితో మిళితం చేయబడి గందరగోళంగా మారింది. అందువలన బటూట నుదహరించిన అంశాలను యథాతథంగా ఆమోదింపక, క్షుణ్ణంగా పరిశీలించి సత్యాన్ని గ్రహించవలసిన అవసరం ఎంతైనా ఉంది. అయితే నాటి ప్రజల జీవన విధానాన్ని గూర్చి, ఢిల్లీ కొలువులో నెలకొన్న ముఠా తగాదాల గురించి తిరుగుబాట్లకు గల కారణాలు గూర్చి బటూటా అందించిన సమాచారం, బరానీ అందించిన సమాచారానికి అదనంగా ఉపకరిస్తుంది.

మహమ్మద్‌బిన్ తుగ్లక్ వ్యక్తిత్వాన్ని గూర్చి ఇబన్‌బటూటా వర్ణించాడు. విదేశీయులన్న అత్యంత గౌరవమని వారికిఉన్నత పదవులిచ్చాడని శ్లాఘిస్తూ, అతడు క్రూర స్వభావం కలవాడని తీవ్ర విమర్శ చేశాడు. మహమ్మద్ ప్రజలను ప్రేమించి దానధర్మాలు చేసే దయార్ధ హృదయుడని, యుద్ధ రక్తపిపాసియని 'బటాటా' పేర్కొన్నాడు.

మహమ్మద్ ప్రవేశపెట్టిన బృహత్ పథకాలకు బటూటా తనదైన కారణాలను ఉదహరించాడు. బటూటా నాటి రాజకీయాలపై సరియైన అధ్యయనం గాని, విశ్లేషణగాని చేయలేదు. అందువలన అతని 'రెహ్లా'ను ప్రామాణికంగా తీసికొనరాదు.

| ఇబన్‌బటూటా విదేశీ యాత్రికుడు. మహమ్మద్‌బిన్ తుగ్లక్ ఆస్థానంలో ఎనిమిది సంవత్సరాలు ఉన్నాడు. ఆయన రచన 'రెహ్లా' నాటి సమకాలీన స్థితిగతులను తెలిసికోవటానికి ముఖ్య ఆధారం. |
|---|

## 29.14 మహమ్మద్ బిన్ తుగ్లక్ పాలనా యుగ సమీక్ష

సదుద్దేశములు కలిగి, ఆచరణలో పెట్టలేక, ఘోర వైఫల్యం పొందిన మహమ్మద్‌బిన్ తుగ్లక్ 27 సంవత్సరాల పాలనా కాలం ఒక విషాద గాథ.

మహమ్మద్ గొప్ప మేధావి. గణిత, తర్క, తత్వశాస్త్రాలలో ఉద్దండ పండితుడు. తన చర్యలన్నీ హేతువాదబద్ధమైనవే గాని, మతపరమైనవి కావు యావత్ భారతదేశ రాజకీయ, సాంస్కృతిక సమైక్యత సాధించుటే ఆయన ధ్యేయం. రాజధాని మార్పిడి వలన ఉత్తర, దక్షిణ భారతదేశాలకు మధ్య నున్న అడ్డగోడలను తొలగించాలన్నదే ఆయన ఆకాంక్ష.

మహమ్మద్ ప్రవేశపెట్టిన పథకాలు అతని అభ్యుదయ భావాలకు నిదర్శనం. అయితే దానిని ప్రవేశపెట్టుటలో ప్రజల మనోగత భావాలను పరిగణనలోని తీసుకొనలేదు. అతని అనుమాన స్వభావం ప్రజలను మరింత దూరం చేసింది. తాను ప్రవేవపెట్టిన సంస్కరణలు ఒకదాని వెంట మరొకటి విఫలమగుటతో ప్రజలు నానా ఇక్కట్ల పాలై సుల్తాన్‌కు శాశ్వతంగా దూరమయ్యారు.

వ్యవసాయ విస్తరణకు మహమ్మద్ గైకొన్న చర్యలు ముందుచూపుతో కూడుకొన్నవి. వ్యవసాయాన్ని సాధారణ స్థాయికి పునరుద్ధరించటానికి రాజధానిలో నాల్గు సంవత్సరాలు గడిపాడని బరానీ వ్రాశాడు. కరువు సంభవించినపుడు ఢిల్లీ వెలుపల బావులు త్రవ్వించి, పంటలు పండించాడని ఇబన్‌బటూటా పేర్కొన్నాడు. ఇందుకు రైతులకు విత్తనాలు సరఫరా చేసి, రుణ సౌకర్యాలు కల్పించాడు. ఈ చర్యలన్నీ అతని సదుద్దేశాలకు నిదర్శనం.

## 29.ఇ. పాఠ్య ప్రశ్నలు

1. నూతన నాణేల ముద్రణలో మహమ్మద్ లక్ష్యమేమి?
2. నూతన నాణేల ముద్రణ ఎందుకు విఫలమైంది? ఇందుకు ఒక ముఖ్యకారణాన్ని తెలుపుము.
3. ఖజానా ఖాళీయగుట వలననే మహమ్మద్ నూతన నాణేలు ముద్రించాడని బరానీ పేర్కొనుట సత్యదూరమని ఏల చెప్పగలవు?
4. ఖోరసాన్ దండయాత్రకు గల ముఖ్య లక్ష్యాలేమి?
5. బటూటా ఎవరు? అతని యాత్రా విశేషాలను తెలిపే సమాచారాన్ని ఏమని పిలుస్తారు?

## సారాంశం

అల్లాఉద్దీన్ సుల్తానైనపుడు అనేక ఆంతరంగిక, బాహ్య సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చింది. స్థానిక పాలకుల తిరుగుబాట్లు, మంగోలు దాడులు, వ్యక్తిగత సామ్రాజ్య కాంక్ష అతనిని సువిశాల స్థిరమైన సైన్యాన్ని ఏర్పాటు చేసుకోవాలనే ఆవశ్యకతను కలుగచేశాయి. అల్లాఉద్దీన్ తన సైన్యాన్ని తురుష్కుల మాదిరిగా సంస్కరించాడు. సైనికులకు నగదు రూపంలో జీతాలు చెల్లించిన తొలి సుల్తాన్ – అల్లాఉద్దీన్. గుర్రాలకు రాజముద్రలు వేయటం (దగ్), సైనికులకు ఆనవాళ్ల వ్రాయటం (హులియా) వంటిసంస్కరణలు ప్రవేశపెట్టాడు. మంగోలు దాడులనెదుర్కోవటానికి బాల్బన్ వలె వాయువ్య ప్రాంతమున పాత దుర్గాలను బాగు చేయించి, కొత్త దుర్గాలను నిర్మించాడు.

ప్రభువర్గం, ఉలేమాలను బలహీనపరచటానికి అనేక చర్యలు గైకొన్నాడు. వారు అనుభవించు ఈనాం భూములను రద్దు చేశాడు. భూమిశిస్తు వసూలులో దళారులను తొలగించి, రైతులతో ప్రత్యక్ష సంబంధాలు పెట్టుకున్నాడు. భూమిని సర్వే చేసి, భూమిశిస్తును ఏభై శాతానికి పెంచి, అమీల్ అను ఉద్యోగిని రెవిన్యూ వసూలుకు నియమించాడు.

దేశవ్యాప్తంగా మార్కెట్‌లను నెలకొల్పి, సరకులన్నింటిని ఈ మార్కెట్‌లకు తరలింపచేసి ఆ సరుకుల ధరలన్నింటినీ నిర్ణయించి ప్రజలకు చౌకగా లభ్యమగునట్లు చేశాడు. ఏ వర్తకుడు నిర్ణయించిన ధర కంటే ఎక్కువ అమ్మరాదని శాసించి, వారు అధిక లాభాలు గడించకుండా నిరోధించాడు. దొంగ వ్యాపారం, సరకుల అక్రమ నిల్వలు, అవినీతిని అరికట్టటానికి ప్రత్యేక ఉద్యోగులను నియమించాడు.

చరిత్రలో అనేక బృహత్తర పథకాలు ప్రవేశపెట్టిన ఘనత మహమ్మద్‌బిన్ తుగ్లక్‌ది. వీనిలో ఢిల్లీ నుండి దౌలతాబాద్‌కు రాజధాని మార్పిడి ఒకటి. సామ్రాజ్యానికి కేంద్ర బిందువుగా చేసుకొని పాలిస్తే ఉత్తమమని, ఉత్తర, దక్షిణ భారతదేశాల మధ్య సన్నిహిత సాంస్కృతిక సంబంధాలు నెలకొల్పాలనే లక్ష్యంతో ఈ పథకానికి శ్రీకారం చుట్టాడు. కాని ఈ పథకం విఫలమైంది. ఖజానా నింపటానికి దోఆబ్‌లో భూమిశిస్తును పెంచాడు. కాని ఇదే సమయంలో దోఆబ్ కరువు సంభవించుట వలన రైతులు శిస్తును చెల్లింపలేక, భూములు వదలి పారిపోయారు. ఫలితంగా తిరుగుబాట్లు చెలరేగాయి.

నూతన నాణేల ముద్రణ పథకం కూడా, ప్రభుత్వ అసమర్థత వలన అనగా దొంగ నాణేల ముద్రణను నియంత్రించటంలో విఫలమగుట వలన అది కూడావిఫలమైంది. అలాగే ఖోరసాన్ దండయాత్ర పథకాన్ని రద్దు చేయటం, సుల్తాన్ బలహీనతను బహిర్గం చేసింది. ఇట్లు మహమ్మద్ గైకొన్న చర్యల వలన సర్వదా తీవ్ర అసంతృప్తి నెలకొని సుల్తానత్ విచ్ఛిన్నతకు దోహదం చేసింది.

## అభ్యాసం

1. అల్లాఉద్దీన్ ఖిల్జీ సైనిక విభాగాలను ఏర్పరచిన రీతిలో పట్టికను పూర్తిచేయుము.

2. అల్లాఉద్దీన్ ఖిల్జీ సైనిక సంస్కరణలను ప్రవేశ పెట్టుటకు గల కారణములేమి?
3. అల్లాఉద్దీన్ ఖిల్జీ ప్రవేశపెట్టిన ముఖ్య సైనిక సంస్కరణలేమి?
4. రైతులతో ప్రత్యక్ష సంబంధాలను నెలకొల్పుకోవటానికి అల్లాఉద్దీన్ గైకొన్న చర్యలేమి?
5. ఆర్థిక సుస్థిరతను సాధించటానికి అల్లాఉద్దీన్ గైకొన్న చర్యలేమి? అవి ఎంతవరకు విజయవంతమైనాయి?
6. మహమ్మద్‌బిన్ తుగ్లక్ ప్రవేశపెట్టిన రాజధాని మార్పిడి, నూతన నాణెల ముద్రణ – పూర్వాపరాలను తెలుపుము.
7. మహమ్మద్‌బిన్ తుగ్లక్ ప్రవేశపెట్టిన బృహత్తర పథకాలు సుల్తానత్ విచ్ఛిన్నతకు దోహదం చేశాయని నీవు భావింతువా?
8. ఈ కింది వానికి లఘు వ్యాఖ్యలు వ్రాయుము.

i) హులియా, దగ్

ii) ఇబన్ బటూట

iii) మహమ్మద్‌బిన్ తుగ్లక్ ఖోరసాన్ దండయాత్ర

## విజ్ఞానం కోసం

1. తురుష్క సైన్య నమూనాలో అల్లాఉద్దీన్ సైన్య నిర్మాణాన్ని మీరు చదివారు. ఈ నమూనాను ఆధునిక భారత సైన్యంతో పోల్చుము.
2. అల్లాఉద్దీన్ ఖిల్జీ మార్కెట్ సంస్కరణల నేపథ్యంలో ఆధునిక యుగంలో మార్కెట్‌ను నియంత్రించుటకు కొన్ని సూచనలు చేయుము.

   మహమ్మద్ నూతన నాణేల ముద్రణ నాడు విఫలమైంది. నేడు ప్రజాదరణను పొందింది ఎందువలన?

## అదనపు సమాచారం

మధ్యయుగ భారత పారశీక ఇతిహాసిక చరిత్రకారుడు – జియాఉద్దీన్ బరానీ. ఆయన రచించిన 'తారీఖ్ ఇ–ఫిరోజ్–షాహి' ఢిల్లీ సుల్తానత్ చరిత్రకు అమూల్యమైన ఆధారం. ఈ గ్రంథంలో ఘియాజుద్దీన్ కాలం నుండి ఫిరోజ్‌షా తుగ్లక్ పాలనాకాలంలో ఆరవ సంవత్సరం వరకు జరిగిన పెక్కు సంఘటనలు. విశేషాలు పొందుపరచబడ్డాయి. ఈ గ్రంథం ఫిరోజ్‌షా తుగ్లక్‌కు అంకితమీయబడింది. ఈ గ్రంథంలో తొమ్మిదిమంది సుల్తానుల గురించి ప్రస్తావింపబడింది. వారెవరనగా ఘియాజుద్దీన్ బాల్బన్, మొయిజుద్దీన్ కైకుబాద్, జలాల్ ఉద్దీన్ ఖిల్జీ, అల్లాఉద్దీన్ ఖిల్జీ, కుతుబుద్దీన్ ముబారక్ షా ఖిల్జీ, నజీరుద్దీన్ ఖుస్రుఖాన్, ఘియాజుద్దీన్ తుగ్లక్, మహమ్మద్‌బిన్ తుగ్లక్, ఫిరోజ్‌షా తుగ్లక్. ఈ గ్రంథంలో ప్రముఖంగా సుల్తానుల సింహాసన మధిష్టించిన వైనం. దండయాత్రలు, మంగోలు దండయాత్రలు, సుల్తానులు ప్రవేశపెట్టిన

ఆర్థిక, పాలనా సంస్కరణలు, ప్రజల జీవన విధానం వివరింపబడ్డాయి.

'తారీఖ్-ఇ-ఫిరోజ్ షాహి'లో మహమ్మద్‌బిన్ తుగ్లక్ ప్రవేశపెట్టిన బృహత్ పథకాలకు గల కారణాలు, మహమ్మద్ లక్ష్యాలు గురించి వ్రాసిన సమాచారాన్ని యథాతథంగా అంగీకరించటానికి వీలులేదు. ఇందుకు ముఖ్య కారణం మహమ్మద్‌బిన్ తుగ్లక్ తత్వం ఇస్లాం వ్యతిరేకమని బరానీ భావం. అందువలన మహమ్మద్‌లోని లోపాలను బాహాటంగా పక్షపాత ధోరణిలో అభివర్ణించాడు. పైగా ఇతని రచన కాలక్రమంలో వ్రాయబడలేదు. కొన్ని విషయాలు గందరగోళంగా ఉన్నాయి.

బరానీ 'ఫతావా-ఇ-జహందరి' అనే గ్రంథాన్ని తారీఖ్-ఇ-ఫిరోజ్‌షాహికి అనుబంధంగా వ్రాశాడు. ఈ రెండు పుస్తకాలలో వెలుబుచ్చిన రాజకీయ భావాలు ఒకటేయైనా, ఫతవా-ఇ-జహందరీలో వివరణలు ఎక్కువ. ఇది ముస్లిం చక్రవర్తుల అనుసరించే ఒక రాజకీయ కోడ్. ఇందు ప్రజల పట్ల సుల్తాన్ విధులు, సుల్తాన్‌కు రాష్ట్ర పాలకుల సంబంధాలు, ఇంకా అనేక విషయాలు, చివరకు చరిత్ర రచనలో చరిత్రకారుని విధులను గూర్చి కూడా ప్రస్తావించటం జరిగింది.

## పాఠ్య ప్రశ్నలకు జవాబులు

### 29.ఎ.

1. i) తురుష్క ii) నగదు iii) బాల్బన్

2. 'యన్‌అస్ప' అనగా సాలుసరి జీతం 234 టంకాలు తీసికొని, ఒక అశ్వాన్ని పోషించేవాడు. 'దోఅస్ప' అనగా సాలుకు 312 టంకాలు జీతం తీసుకొని రెండు అశ్వాలను పోషించేవాడు.

3. a) దుర్గములు సైనిక గస్తీ కేంద్రాలుగా ఉపకరించుట.

   b) మంగోలు దాడులను కాపాడినాయి

   c) వారు సైనికులకు ఆహారాన్ని, అశ్వాలను సమకూర్చేవారు

### 29.బి.

1. a)-X, b)-Y, c) V, d)-Z, e)-W

2. ప్రభువర్గానికి, ఉలేమాలకు ఈయబడిన బహుమానాలు, ఈనాంలు, పారితోషికాలు రద్దు చేసి, వారికి నగదు రూపంలో చెల్లించాడు.

3. అమీల్ ఉద్యోగులు లంచం తీసుకోవాలనే ప్రలోభం లేకుండా ఉంటారని భావన.

### 29.సి.

1. a) ద్రవ్య చలామణి విపరీతంగా పెరిగి, ద్రవ్యోల్బణం ఏర్పడింది.

   b) ఢిల్లీ ధాన్యాగారాలకు నిరంతరం ఆహార పదార్థాల సరఫరా యగుటకు.

   c) దొంగ వ్యాపారాన్ని, అవినీతిని అరికట్టుటకు

d) అధిక లాభాలు పొందలేక వర్తకులు బాధపడ్డారు.

2. ఆహార మార్కెట్, వస్త్ర మార్కెట్, పశువుల మార్కెట్ (గుర్రాలు, జంతువులు)

3. వస్త్ర మార్కెట్‌ను ముల్తానీ వర్తకులకు అప్పగించి, వారికి అప్పు ఇచ్చి రాజ్యంలోని అన్ని ప్రాంతాల నుండి వస్త్రాలను కొని వస్త్ర మార్కెట్‌కు తరలించి, ప్రభుత్వం నిర్ణయించిన ధరలకే వానిని అమ్మేటట్లు చేశాడు.

## 29. డి.

1. i) ప్రతిభ ii) దేవగిరి iii) కరువు

2. a) దక్కన్‌పై ఆధిపత్యాన్ని కొనసాగించటం కొరకు.

   b) రాజ్యానికి కేంద్ర బిందువుగా యుండుటకు.

3. ఉత్తర భారత సామాజిక, సాంస్కృతిక, మతభావాలు దక్షిణ భారతానికి విస్తరించుట.

4. i) 'దివాన్-ఇ-కోహి' అనే వ్యవసాయ శాఖ ఏర్పాటు

   ii) రైతులకు రుణాలిచ్చాడు.

   iii) పంట మార్పిడిని ప్రవేశపెట్టాడు

   iv) బావులు త్రవ్వించాడు

## 29. ఇ.

1. సుల్తాన్ ప్రవేశపెట్టిన నాణెం వెండి టంకాకు సమానం

2. ప్రభుత్వం ప్రైవేటు వ్యక్తులు ముద్రించే నాణేలను నిరోధించుటలో విఫలమగుట వలన, అసంఖ్యాక నకిలీ నాణేలు చలామణిలోనికి వచ్చాయి.

3. నూతన నాణేలకు బదులు బంగారు, వెండి నాణేలను మహమ్మద్ చెల్లించినట్లు బరానీ పేర్కొనుట వలన ఖజానా ఖాళీ కాలేదని తెలుస్తుంది.

4. i) మధ్య ఆసియా రాజకీయాలలో ఏర్పడిన అనిశ్చితి, మహమ్మద్‌ను దండయాత్రకు ప్రేరేపించింది.

   ii) ఇరాన్ నుండి మహమ్మద్‌బిన్ తుగ్లక్ ఆస్థానానికి వచ్చిన యువరాజులు, ప్రభువర్గం. దండయాత్ర చేయమని ప్రోత్సహించుట.

   ఇబన్‌బటూట అనే మొరాకో యాత్రికుడు మహమ్మద్‌బిన్ తుగ్లక్ ఆస్థానంలో చాలా సంవత్సరాలున్నాడు. అతడు 'రెహ్లా' (సఫర్‌నామా) అనే గ్రంథాన్ని వ్రాశాడు.

# 30

# ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్య విచ్ఛిన్నం మరియు ప్రాంతీయ రాజ్యాల ఆవిర్భావం (1)

## 30.1 పరిచయం :

మహమ్మద్ ఘోరీ మరణానంతరం కుతుబుద్దీన్ ఐబక్ క్రీ.శ 1206లో ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్య స్థాపన చేశాడు అని మీరు ఇంతకు ముందే చదివారు. ఇల్‌టుట్‌మిష్, బాల్బన్‌లు సుల్తాన్ సామ్రాజ్యాన్ని సుస్థిరం చేశారు. తన విజయ యాత్రల ద్వారా అల్లావుద్దీన్ ఖిల్జీ ఢిల్లీ సామ్రాజ్య సరిహద్దులను విస్తరింపచేశాడు. అంతేగాక అతడు చాలామంది దక్షిణ భారతదేశ పరిపాలకులను తన సార్వభౌమత్వం అంగీకరించేటట్లు ఒత్తిడి చేశాడు. ఘియాజుద్దీన్ తుగ్లక్ దక్షిణ రాజ్యాలను తన సామ్రాజ్యంలో కలుపుకున్నాడు. కాని మహమ్మద్ బీన్ తుగ్లక్ పరిపాలనా కాలంలో దక్షిణ రాజ్యాలు ఢిల్లీ సామ్రాజ్యానికి తమ అవిధేయతను ప్రకటించాయి. దక్షిణాన విజయనగరం, బహ్మనీ స్వతంత్ర రాజ్యాలుగా ఆవిర్భవించాయి. బెంగాల్, సింధులు కూడా సుల్తాన్ సామ్రాజ్యం నుండి వేరయ్యాయి. ఫిరోజ్ తుగ్లక్ కోల్పోయిన రాజ్య భాగాల మీద ఆధిపత్యం పునఃప్రతిష్టించాలని కృషి చేశాడు కాని విఫలుడైనాడు. బలహీనులు, అసమర్థులు అయిన ఫిరోజ్ తుగ్లక్ వారసుల పరిపాలనా కాలంలో విచ్ఛిన్న ప్రక్రియ వేగం పుంజుకొంది. నసీరుద్దీన్ తుగ్లక్ పరిపాలనా కాలంలో క్రీ.శ 1398లో తైమూర్ భారతదేశంపై దండెత్తాడు. ఇది పతనావస్థలో ఉన్న సుల్తాన్ సామ్రాజ్యాన్ని చావు దెబ్బతీసింది. పర్యవసానంగా ఎన్నో ప్రాంతీయ రాజ్యాలు తమ స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నాయి. ఢిల్లీ సామ్రాజ్యం ఒక చిన్న సంస్థాన రాజ్యం స్థాయికి క్షీణించింది. మీరు ఢిల్లీ సామ్రాజ్యం, చిన్నాభిన్నమగుటకు ఏమి జరిగింది అని మీరు తప్పక ప్రశ్నించవచ్చు. ఈ పాఠంలో మీరు సుల్తాన్ సామ్రాజ్య విచ్ఛిన్నతకు కారాణాలను, ప్రాంతీయ రాజ్యాల ఆవిర్భావం మరియు వాటి ఘన కార్యాలను గురించి చదువుతారు.

## 30.2 లక్ష్యాలు

ఈ పాటం చదివిన తర్వాత మీరు క్రింది విషయాలు తెలుసుకొంటారు.

1. ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్య విచ్ఛిన్నానికి కారణాలు జాబితా
2. ఫిరోజ్ తుగ్లక్‌ను బలహీనులైన అనుభవరహితులైన వారసులు అనుసరించారన్న విషయం
3. తైమూర్ దండయాత్రను వర్ణించటం

4. ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్య విచ్ఛిన్నత కారణంగా స్వాతంత్ర్యాన్ని పొందిన ప్రాంతీయ రాజ్యాల జాబితా తయారు చేయగలుగుట
5. ప్రాంతీయ రాజ్యాల ఆవిర్భావం మరియు వాటి రాజ్య విస్తరణ
6. ప్రాంతీయ రాజ్యాల విజయాలు

## 30.3 ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్య విచ్ఛిన్నత :

మహమ్మద్ తుగ్లక్ పరిపాలనా కాల ద్వితీయార్ధంలో సర్దార్ల తీవ్ర అసంతృప్తికి మూలకారణమై ఒకదాని తర్వాత మరొకటిగా సామ్రాజ్యమంతటా తిరుగుబాట్లకు దారితీసిన అతని ప్రయోగాల వైఫల్యాన్ని గురించి మీరు చదివారు. ఈ తిరుగుబాట్లు ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్య పతనాన్ని స్పష్టంగా సూచించాయి. మహమ్మద్ బీన్ తుగ్లక్ ఏ ఇతర వ్యక్తిపై నమ్మకం లేనందున తిరుగుబాట్లను అణించేందుకు ఇతడు సామ్రాజ్యం ఒక చివర నుండి మరొక చివరకు స్వయంగా పరుగులు తీసేవాడు. అవధ్, గుజరాత్ మరియు సింధ్‌లలో తిరుగుబాట్లను విజయవంతంగా అణచివేయగలిగాడు. కాని దక్షిణాపథంలో భంగపడ్డాడు. ఇది ఎంత తీవ్రమైన దెబ్బంటే, మహమ్మద్ తుగ్లక్ ఈ నష్టాన్ని తిరిగి పూడ్చుకోలేక పోయాడు. ఇతడు దక్షిణాపథం నుండి వెను తిరగగానే, ఇరువురు విజయనగర సోదరులైన హరిహరరాయులు, బుక్కరాయులు తిరుగుబాటు చేసి విజయనగర సామ్రాజ్యానికి పునాది వేశారు. జాఫర్‌ఖాన్ విజయ నగరానికి ఉత్తరాన బహ్మనీ రాజ్యన్ని స్థాపించాడు. ఈ రెండు రాజ్యాలను గురించి మీరు వేరొక పాఠంలో చదువుతారు. మహమ్మద్ తుగ్లక్ పరిపాలనా కాలంలో, బెంగాల్ కూడ ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యానికి అవిధేయతను ప్రకటించింది.

## 30.4 ఫిరోజ్ తుగ్లక్

మహమ్మద్ బీన్ తుగ్లక్ మరణానంతరం అమీర్లు, ఉలేమాలు అతని సమీప బంధువైన (పినతండ్రి కుమారుడు) ఫిరోజ్‌షా తుగ్లక్‌ను సింహాసనంపై ప్రతిష్టించారు. ముప్పై ఏడు సంవత్సరాల ఫిరోజ్ పరిపాలనా కాలం ప్రశాంతత, సుసంపన్నతకు మారుపేరుగా గుర్తించబడ్డది. కాని ఈ కాలంలో సుల్తాన్ రాజకీయ అధికారం తీవ్ర క్షీణతకు లోనైంది. అసమర్ధత, అవినీతి సర్వ సాధారణమైనవి. ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్య అంతం దగ్గరలోనే ఉన్నదని తెలుస్తుంది.

బరానీ ప్రకారం ఫిరోజ్‌షా పట్టాభిషేకం హింసారహిత ఘటన, ఇతడు నిజమైన రాజార్హుడైన లాంఛనాలు, శోభలతో సింహాసనాన్నధిరోహించాడు. ఇతడు తక్షణమే మహమ్మద్ బీన్ తుగ్లక్ విధానాల వలన జరిగిన నష్టాలను భర్తీ చేయ ప్రారంభించాడు. వజీర్ (ప్రధానమంత్రి) సలహాను అనుసరించి మహమ్మద్ తుగ్లక్ వ్యవసాయాభివృద్ధి కొరకు రైతులకు ఋణాలుగా ఇవ్వబడ్డ పెద్ద మొత్తాలను రద్దు చేశాడు. తన పూర్వపు సుల్తాన్‌చే తొలగించబడిన ఉలేమాలను, అమీర్‌లను పునర్నియమించాడు. వాస్తవానికి ఇతడు సుల్తాన్ మహమ్మద్‌చే మరణించిన, క్రూరమైన హింసల పాలైన లేక వికలాంగులైన వారి వారసులకు తగిన నష్ట పరిహారాలను మరియు క్షమాపణ పత్రాలను అందించాడు.

ఫిరోజ్ అమీర్లు, ఉలేమాల సహాయంతో సింహాసనాన్నధిరోహించాడు. కాబట్టి ఇతడు వారిపట్ల ఉదారవైఖరిని అవలంభించాడు. ఇతడు 'ఇక్తా' విధానాన్ని పునః ప్రవేశపెట్టి దానిని వంశపారంపర్యం చేశాడు. ఇతడు సైన్యాన్ని

వంశపారంప్య విధానం ఆధారంగా పునర్నియమించి వారికి భూములను ఇనాంగా ఇచ్చాడు. ఉలేమాల విషయంలో తాను నిజమైన ముస్లింనని నిరూపించుకొనేందుకు ఇతడు కృషి చేశాడు. ఇతడు షరియత్‌ని పునరుద్ధరించాడు కాని వాస్తవానికి తీవ్రవాద శక్తులకు తలొగ్గాడు. ఉలేమాల సిఫారసులను అనుసరించి ఇతడు అంతకుముందు ఎప్పుడూ పన్నులు చెల్లించని బ్రాహ్మణులతో సహా హిందువుల మీద జిజియాపన్ను విధించాడు. ఇతడు షియాలు మరియు ఇతర ముస్లిం అసమ్మతి వాదులందరి పట్ల కూడా ఇటువంటి మత అసహన విధానం నవలంభించాడు. ఈ విధంగా ఇతడు అమీర్‌లలో వ్యాపించిన అవినీతికి, పతనానికి బాధ్యుడైనాడు. ఫిరోజ్ మత సంకుచితత్వం కూడా సుల్తాన్ సామ్రాజ్యానికి ప్రమాదకారి అని అంతమంగా ఋజువైంది. రాబోయే పాఠంలో ఫిరోజ్ సంస్కణ ప్రభావాన్ని గురించి వివరంగా చదువుతారు.

| జిజియాపన్ను అనగా ఇది మత సంబంధ పన్ను కాదు. ఇది ముస్లిమేతరులందరి మీద సైనిక సేవల కోసం విధించబడేది కాబట్టి ఇది వృద్ధులు, స్త్రీలు, పిల్లలు మరియు వికలాంగులపై విధించబడేది కాదు. |
|---|

సుల్తాన్‌గా ఫిరోజ్ తుగ్లక్ కేంద్రానికి దగ్గరలో ఉన్న ప్రాంతాలపై మాత్రమే నియంత్రణను కలిగి ఉండేవాడు. ఇతడు రెండుసార్లు బెంగాల్‌ని తిరిగి స్వాధీనం చేసుకుందామని ప్రయత్నించాడు కాని విఫలుడైనాడు. బెంగాల్ స్వాతంత్ర్యం ప్రకటించుకుంది. ఫిరోజ్ జాజ్ నగర్‌ను (ఒరిస్సాను) ఆక్రమించి దానిని దోచుకున్నాడు. కాని తన సామ్రాజ్యంలో కలుపుకోలేదు. ఇతడు కాంగ్రా (Kangra) ను కూడా దోచుకున్నాడు. గుజరాత్, తట్టా (సింద్) లలో తిరుగుబాట్లను అణచివేశాడు. కాని ఇతని సైన్యం కచ్ సింధశాఖ (Rann of kutch) లో దారితప్పినప్పుడు ఓన్నో బాధలకు గురైంది.

ఎన్నో మానవతా సంస్కరణలను ప్రవేశపెట్టిన ఫిరోజ్ ఒక నిదానమైన పరిపాలకుడు వ్యవసాయాభివృద్ధి కొరకు ఇతడు కాలువలను, చెఱువులను త్రవ్వించి బావులను నిర్మించాడు. ఇతడు షఫాఖానాలు (Shafa Khanas) అనే ఉచిత వైద్యశాలలను ప్రారంభించాడు. ఇతడు ముస్లిం ఉపాధ్యాయులకు ఉపకార వేతనాలను ఏర్పాటు చేసి, ముస్లిం వితంతువల కుమార్తెల వివాహాల కోసం ఆర్థిక సహాయం కూడా చేశాడు. ఇతడు చాలామంది బానిసలను పోషించాడు. ఒక చారిత్రిక ఆధారం ప్రకారం ఇతనికి ఒక లక్షా ఎనభైవేల మంది బానిసలు ఉండేవారని, వారిలో కొంతమంది ఖార్ఖానాలు, అనేక కర్మాగారాలలో పనిచేయగా మరికొందరు సైన్యంలో పనిచేసేవారని తెలుస్తుంది. సైన్యంలో ఉండే బానిసలను ఫిరోజ్ బానిసలు (Firozi Slaves) అనేవాళ్ళు. ఫిరోజ్ తుగ్లక్ సంస్కరణలు అతని సామ్రాజ్యం మీద ఎట్టి ప్రభావాన్ని చూపినవో తదుపరి పాఠంలో చదువుతారు.

## 30.5 ఫిరోజ్ తుగ్లక్ వారసులు

ముస్లింలకు వారసత్వానికి సంబంధించి ఏ స్థిరమైన చట్టాలు లేవు అని మీకు గుర్తుండే ఉంటుంది. ఫిరోజ్‌షా తుగ్లక్ మరణానంతరం ఇతని వారసులు సర్దార్ల సహాయం లేనిదే తమ అధికారాన్ని అనుభవించడం కష్టమని కనుగొన్నారు. కాబట్టి ఇది సుల్తాన్, కులీనుల మధ్య పోరాటానికి దారి తీసింది. ఈ స్థితిలో ఇక్తాదార్లు (సర్దార్లు) మరియు ప్రాంతీయ పాలకులు స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకునేందుకు ప్రయత్నించారు.

క్రీ.శ 1388లో ఫిరోజ్ తుగ్లక్ మరణానంతరం అతని మనుమడైన అబూ బకర్ (Abu Bakr) సింహాసనంపై ప్రతిష్టించబడ్డాడు. అదే సమయంలో ఫిరోజ్‌షా తుగ్లక్ కుమారుడైన మహమ్మద్ ఐందరు ఫిరోజీ బానిసల సహాయంతో

తనను తాను ఢిల్లీ సుల్తాన్‌గా ప్రకటించుకున్నాడు. ఇది ప్రత్యర్థులైన ఈ ఇరువురు సుల్తాన్‌ల మధ్య పోటీకి దారి తీసింది. చివరలో మహమ్మద్‌కు అనుకూలంగా అబూబకర్ లొంగిపోవలసి వచ్చింది. తన పదవిని సుస్థిరపరచుకున్న తర్వాత ఇతడు ఫిరోజ్ బానిసల స్థితిని బలహీన పరిచేందుకు వివిధ మార్గాను, పద్ధతులను అవలవంభించాడు.

మహ్మద్ అనంతరం రాజ్యానికి వచ్చి క్రీ.శ 1412 వరకు పాలించాడు. అతడు అత్యాశాపరులైన సర్ధారులను నియంత్రించటంలో వైఫల్యం చెందాడు.

## 30 ఎ పాఠ్య ప్రశ్నలు

**ఈ క్రింది ప్రశ్నలకు సమాధానములిమ్ము**

1. మహ్మద్ బీన్ తుగ్లక్ పాలనాకాలంలో స్వాతంత్ర్యం ప్రకటించుకున్న ఒక దక్షిణాపథ రాజ్యం పేరు వ్రాయుము.
2. ఫిరోజ్ షా తుగ్లక్ కాలంలో ఏ పద్ధతి (విధానం) వల్ల సైన్యం బలహీనమైంది?
3. ఫిరోజ్ షా తుగ్లక్ వారసులు ఎందువల్ల విజయవంతంగా పరిపాలించలేక పోయారు?

**ఈ క్రింది వాక్యాలను (ఖాళీలను) పూరించుటకు సరైన పదమును ఎంపిక చేయుము.**

1. మహ్మద్ బీన్ తుగ్లక్ కాలంలో స్వాతంత్ర్యం పొందిన రాష్ట్రం ____________________

   ఎ. బెంగాల్     బి. కామరూప     సి. జాజ్‌నగర్(ఒరిస్సా)

2. ఇక్తా పద్ధతిని ఫిరోజ్ తుగ్లక్ ____________________

   ఎ. ప్రవేశపెట్టాడు     బి. తిరిగి ప్రవేశపెట్టాడు     సి. వంశపారంపర్యం చేశాడు

## 30.6 తైమూర్ దండయాత్ర (క్రీ.శ 1398)

తైమూర్ తురుష్కులలో చాగ్‌చాయ్ శాఖకు చెందిన నాయకుని కుమారుడు. ఇతడు అత్యాస గలవాడు, ధైర్యశాలి మరియు ఉత్సాహవంతుడు. ఇతడు 'సమర్‌ఖండ్' సింహాసనాన్ని అధిష్టించినంతనే దండయాత్రలు ప్రారంభించాడు. ఇతడు భారతదేశాన్ని ఆక్రమించేటప్పటికి దాదాపు మధ్య ఆసియా మొత్తానికి అధిపతిగా నుండెను.

తైమూర్ దేశంలోని సంపదను కొల్లగొట్టే ఉద్దేశంతో భారతదేశంపై దండెత్తాడు. తైమూర్ ముందుగా తన రక్షక దళాన్ని తన మనుమడు పీర్ మహ్మద్ (Pir Mahammad) ఆధ్వర్యంలో భారతదేశానికి పంపాడు. తైమూర్ 'ముల్తాన్'ను జయించి, రావీనది తీరాన్ని చేరాడు. సింధు, జీలం నదులను దాటి 1398 ఏప్రిల్‌లో పీర్ మహ్మద్‌ను కలిశాడు. దారిలో అనేక పట్టణాలను దోచి, అక్కడి ప్రజల సామూహిక నరమేధం (massacre) చేశాడు. అసంఖ్యాక ప్రజలను బందీలుగా కూడా చేశాడు. సుల్తాన్ నసీరుద్దీన్ మరియు అతని వజీరు (ప్రధాని) మల్లూ ఇక్బాల్ తైమూర్‌ను ఎదిరించి ఓడిపోయారు. సుల్తాన్ నసీరుద్దీన్ తన ప్రాణ రక్షణార్థం పారిపోగా, మల్లూ ఇక్బాల్ 'బులంద్‌శహర్' (Bulad Shahr) కు శరణార్థిగా చేరాడు.

ఈ యుద్ధం తర్వాత తైమూర్ ఢిల్లీలో 15రోజులు మకాం చేశాడు. ఇతడు సామూహిక ఊచకోతకు (massacre) ఆదేశించాడు. మహిళలు, పిల్లలతో సహ అసంఖ్యాక హిందువులు, ముస్లిమ్‌లు హతులయ్యారు. భారతదేశాన్ని వదిలి వెళ్ళే ముందు ఈతడు 'ఖైజిర్‌ఖాన్' (Khizr khan) ని తన ప్రతినిధిగా నియమించాడు.

ఇతడు భారతదేశం నుండి బంగారము, వెండి, వజ్రాలు మరియు ముత్యాల రూపంలో అపార సంపదను దోచుకెళ్ళాడు. తనతో ఎంతోమంది చేతి వృత్తుల వాళ్ళను కూడా తీసుకెళ్ళాడు. ఈ పనివారు ఈతని రాజధాని అయిన సామర్ఖండ్‌ని వైభవోపేతం చేయడానికి ఎన్నో సుందర హర్మ్యాలను నిర్మించారు. ఇతని దండయాత్ర ఢిల్లీ సుల్తాన్‌ల పతనాన్ని సూచించింది. ఇది ఢిల్లీ సుల్తాన్‌ల సామ్రాజ్యమంతటా అయోమయాన్ని సృష్టించింది. ఈ పరిస్థితిని అవకాశంగా తీసికొని జాన్‌పూర్, గుజరాత్, మాల్వాలు స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నాయి. ఈ ప్రాంతీయ స్వతంత్ర రాజ్యాల్ని గురించి మరియొక విభాగంలో చదువుతారు.

## 30.7 సయ్యద్ వంశం (క్రీ.శ. 1414 - 1450)

తైమూర్ ఖిజిర్ ఖాన్‌ని ముల్తానీ పరిపాలకుడు (గవర్నర్)గా నియమించిన విషయాన్ని మీరు గుర్తుకు తెచ్చుకోగలరు. ఇతడు సుల్తాన్ దౌలత్‌ఖాన్‌ని ఓడించి, ఢిల్లీని ఆక్రమించి, సయ్యద్ వంశ పాలనకు పునాది వేశాడు. ఇతడు 'సుల్తాన్' బిరుదును స్వీకరించలేదు. రాయత్-ఇ-ఆలా (Rayat-i-Ala) తో తృప్తి పడ్డాడు. ఇతడు తైమూర్ వారసుడైన షారుఖ్‌కి ప్రతినిధిగా మాత్రమే వ్యవహరించాడు. ఇతడు షారుఖ్‌కు క్రమం తప్పకుండా కప్పాన్ని చెల్లించేవాడని తెలుస్తుంది.

ఖిర్జ్ ఖాన్ సయ్యద్ వంశ పరిపాలనలో సమర్థుడు. ఇతడు చట్టాన్ని, శాంతిభద్రతలను పునరుద్ధరించడానికి, విప్లవాలను అణచడానికి ప్రయత్నించాడు కానీ, అతి స్వల్ప విజయాన్ని మాత్రమే సాధించాడు. 'ఫెరిస్టా' అభిప్రాయాన్ని అనుసరించి ఖిజిర్‌ఖాన్ ఒక న్యాయబద్ధుడైన, ఉదార పరిపాలకుడే కాని ఆ క్లిష్ట సమయములో ఢిల్లీ పాలకునకు ఆవశ్యకమైన సామర్థ్యం, శక్తి, వ్యక్తిత్వము మొదలైనవి ఇతనిలో లేవు.

ఖైజిర్ ఖాన్ మరణానంతరం ఒకరి తర్వాత ఒకరు ముబారక్ షా మహ్మద్‌షాలు సింహాసనాన్ని అధిష్టించారు. కాని వారు సర్ధారుల కుట్రల వలన విఫలురుగా నిరూపించుకున్నారు.

క్రీ.శ 1445లో ఆలంసా ఢిల్లీ సింహాసనాన్ని అధిష్టించి సుల్తాన్ అయ్యాడు. ఈతడు నూటికి నూరుపాళ్ళు అసమర్ధునిగా నిరూపించుకున్నాడు. ఈతని ముఖ్యమంత్రి (వజీరు) అయిన హమీద్ ఖాన్ బహలోల్ లోడీని సైన్యాధిపత్యాన్ని స్వీకరించడానికి ఆహ్వానించాడు. అతడు దానిని అంగీకరించి ఆచరించాడు. తను సుల్తాన్‌గా కొనసాగడం అసాధ్యమని గ్రహించిన ఆలంషా బదాన్‌కి వెళ్ళిపోయాడు.

### లోడీ వంశం (1451 - 1526)

### బహలోల్ లోడీ (1451 - 1485)

వజీర్ హమీద్ ఖాన్ సహాయ సహకారాలతో బహలోల్ లోడీ సైన్యాధిపత్యాన్ని స్వీకరించాడు. కాని ఇతడు హమీద్‌ఖాన్‌తో కలిసి అధికారాన్ని పంచుకోవడానికి ఇష్టపడలేదు. ఒక పథకం ప్రకారం హమీద్‌ఖాన్‌ని బంధించి తానే సుల్తాన్ అయ్యాడు. ఈ విధంగా ఇతడు ఆఫ్ఘన్ పాలకులను చెందిన లోడీ వంశానికి పునాది వేశాడు.

సుల్తాన్ బహలాల్ లోడీ సమర్ధుడు, విజయవంతుడైన సైన్యాధిపతి. అతని తక్షణ కర్తవ్యం సుల్తాన్ సామ్రాజ్యంపైన, ప్రత్యేకంగా అంతర్వేది (Doab) మరియు పరిసరాలలో తన అధికారాన్ని పునరుద్ధరిండం. ఇది సమర్ధులైన ఆఫ్ఘన్ సర్ధారుల సహాయ సహకారాలతోనే సాధ్యమవుతుంది. ఆఫ్ఘన్ సర్ధారులు వారి అనుచరులు తరుష్క రాజరికాన్ని

అంగీకరించరని ఒక సైనిక పరిపాలకునిగా అతనికి తెలుసు. కాబట్టి ఇతడు తనను తాను ఆఫ్ఘన్ వీరులలో ఒకడుగా మాత్రమే పరిగణిస్తున్నాని, రాజుగా కాదని బహిరంగంగా ప్రకటించాడు. అతడు సింహాసనం మీద కూర్చొనేవాడు కాదు. తన సర్దారులు ఆస్థానంలో నిలబడి ఉండటంపై కూడా పట్టుపట్టులేదు. ఈ విధానం ఇతని సుదీర్ఘ పరిపాలనా కాలమంతా చక్కగా పనిచేసింది. అంతేగాక శక్తివంతులైన ఆఫ్ఘన్ సర్దారుల నుండి ఇతడు ఎటువంటి సమస్యలను ఎదుర్కొనలేదు.

ఆఫ్ఘన్ సర్దారుల సహాయంతో బహలాల్ లోడీ మేవార్ మరియు అంతర్వేది ప్రాంతాలలో చెలరేగిన తిరుగుబాట్లను విజయవంతంగా అణచివేశాడు. ఈతడు చాలాకాలానికి క్రీ.శ 1476లో 'జోన్‌పూర్' సుల్తాన్‌ని ఓడించి దానిని సుల్తాన్ సామ్రాజ్యంలో కలుపుకొన్నాడు. ఇతడు కల్పి (Kalpi) మరియు ధోల్‌పూర్ (Dholpur) పరిపాలకులను కూడా ఢిల్లీ ఆధిపత్యాన్ని అంగీకరించేటట్లు ఒత్తిడి చేశాడు. ఏదేమైనా ఇతడు బెంగాల్, గుజరాత్ మరియు దక్కన్‌లను తిరిగి జయించడంలో వైఫల్యం చెందాడు.

సుల్తాన్ బహలాల్‌లోడీ తాను విద్యావంతుడు కాక పోయినప్పటికీ పండితులను పోషించాడని అంటారు. ఈతడు గొప్ప భక్తుడే అయినప్పటికీ మతమౌఢ్యం లేనివాడు.

## సికిందర్ లోడీ (క్రీ.శ1489 - 1517)

సుల్తాన్ బహలాల్ లోడీ మరణానంతరం సికిందర్ లోడీ సింహాసనాన్ని అధిష్టించాడు. హిందూ తల్లికి జన్మించినందువల్ల ఇతడు సాటి ఇస్లాం మతావలంబికులకు తాను కూడా నిజమైన ముస్లిమ్‌నని ఆఫ్ఘన్ వంశస్థులకు ఏమాత్రం తీసిపోనని నిరూపించుకొనేందుకు ఆత్రుత చూపాడు. ఫిరోజ్ తుగ్లక్ వలె ఇతడు కూడా ఎన్నో దానధర్మాలు చేశాడు. ముస్లిం పండుగలకు పెద్ద మొత్తంలో ధనాన్ని దానం చేసేవాడు. ఉలేమాలకు ముస్లిం పండితులకు పేద ప్రజలకు జీతాలను, జీవనాధార భత్యాలను మంజూరు చేశాడు. ముస్లిం వితంతువుల పిల్లల వివాహాలకు ఆర్థిక సహాయం చేశాడు.

సికిందర్ లోడీ ముస్లిమేతరులపై సహనాన్ని చూడలేదు. దేవాలయాలను పడగొట్టి, మసీదులను నిర్మించాడు. హిందువులపై 'జిజియా'పన్నును పునర్విధించాడు. ఇస్లాంను ప్రచారం చేయటానికి ఇతడు తన యావచ్ఛక్తిని వినియోగించి ప్రయత్నించాడు. దీనిని గురించి "తబకత్-ఇ-అక్బరీ" (Tabkat-i-Akbari), "మసీద్-రిహానీ"(Masir-Rihani), గ్రంథ రచయితలు. "ఇతని పరిపాలనలో మత దురభిమానం, పరాకాష్టకు చేరింది" అని రాశారు. తత్ఫలితంగా ఇతడు ముస్లిమేతరుల మద్ధతు, సహకారాలను పొందలేకపోయాడు.

కులీనులపై సుల్తాన్ ఆధిపత్యాన్ని పెంచుకోవడానికి సికిందర్ లోడీ అనేక మార్గాలను అవలంబించాడు. తన దర్బార్ (ఆస్థానం)లోపల, వెలుపల సుల్తాన్‌కి విధేయతను ప్రకటించటానికి తన సర్దారులను, అమీర్‌లను(ధనవంతులు) సాంప్రదాయక మర్యాదలను పాటించేట్లు ఒత్తిడి చేశాడు. తన ఆఫ్ఘన్ సర్దారుల స్వతంత్ర ధోరణిని అణచడానికి కూడా ఇతడు ప్రయత్నించాడు. ఇలాంటి పద్ధతుల ద్వారా ఇతడు పరిపాలనలో క్రమశిక్షణను పాటింపచేశాడు. కాని ఇది తర్వాత కాలంలో ఆఫ్ఘన్ సర్దారులలో అసంతృప్తికి కారణమైంది.

సుల్తాన్ సికిందర్ లోడీ బీహార్, ధోల్పూర్, మార్వార్, గ్వాలియర్ రాజ్యంలో కొంతభాగం, మరియు నగరాలను ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యంలో మళ్ళీ కలిపివేశాడు.

### ఇబ్రహీమ్ లోడీ (క్రీ.శ 1517 - 1526)

1517లో సికిందర్ లోడీ మరణానంతరం అతని సర్ధారులంతా ఏకగ్రీవంగా ఇబ్రహీంలోడీని సుల్తాన్‌గా గద్దె నెక్కించారు. ఇబ్రహీంలోడీ పరిపాలనా దక్షత, తెలివితేటలు, ధైర్యం లేనివాడు. ఇతని పరిపాలనా కాలమంతా 'విప్లవాల కాలం'గా నిరూపితమైంది. ప్రప్రథమంగా స్వయానా ఇతని తమ్ముడైన జలాల్‌ఖాన్ తిరుగుబాటు చేశాడు. సుల్తాన్ ఇబ్రహీం ఇతనిని హత్య గావించాడు. బీహార్ స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకుంది. రాణా సంగ్రాంను అణచి వేయడానికి ఇతడు సైన్యాన్ని పంపించాడు. కాని ఆ సైన్యము రాణా చేతిలో ఘోర పరాజయాన్ని చవిచూసింది. పంజాబ్ గవర్నరైన దౌలత్‌ఖాన్ కూడా తిరుగుబాటు చేశాడు. సుల్తాన్ యొక్క ప్రవర్తన, పరిపాలనా వైఖరి సర్ధారులో తీవ్ర అసంతృప్తిని కలిగించింది. విప్లవ స్వభావి దౌలత్‌ఖాన్ కాబూల్‌లో ఉన్న బాబరుకు భారతదేశాన్ని ఆక్రమించమని ఆహ్వానం పంపాడు. 1526లో పానిపట్ వద్ద జరిగిన యుద్ధంలో బాబర్ ఇబ్రహీంలోడీని ఓడించాడు. ఈ విధంగా ఢిల్లీ సుల్తాన్‌ల పరిపాలన అంతమయింది.

పై విభాగముల నుండి "మహమ్మద్ బీన్ తుగ్లక్, ఫిరోజ్ తుగ్లక్‌లు ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యం విచ్ఛిన్నం అవడానికి కొంతవరకు కారకులు" అని స్పష్టంగా తెలుస్తుంది. ఈ చర్చవల్ల సుల్తాన్ మరియు సర్ధారులు, ప్రాంతీయ నాయకులు తిరుగుబాటుదార్లయిన జమీందార్ల మధ్య సంబంధం ఒక సమస్యగా మిగిలిందని స్పష్టమౌతుంది. ప్రతి ఒక్క సుల్తాన్ ఈ సమస్యను పరిష్కరించడానికి తన స్వంత మార్గంలో ప్రయత్నించారు. కాని ఏ ఒక్కరూ శాశ్వత పరిష్కారాన్ని కనుగొన లేకపోయారు. అల్లాఉద్దీన్ ఖిల్జీ తప్ప మిగిలిన సుల్తానులంతా ఆర్థికస్థితిని బలోపేతం చేయటానికి ప్రయత్నించలేదనే విషయాన్ని మీరు గ్రహించే ఉంటారు. మమమ్మద్ బీన్ తుగ్లక్ దీనికి విరుద్దంగా తన పరిపాలనా ప్రయోగాల మీద ఎంతో ధనాన్ని వృధా చేశాడు. ఆ విధంగా అతడు దేశ ఆర్థిక స్థితిని బలహీన పరిచాడు. ఫిరోజ్ షా తుగ్లక్ పరిపాలనా కాలంలో సర్ధారులకు, ఉలేమాలకు భూములను 'ఇనాం'గా ఇవ్వడం జరిగింది. ఇది కూడా రాజ్య ఆర్థిక స్థితిపై వ్యతిరేక ప్రభావాన్ని చూపింది.

### 30.బి పాఠ్యాంశ ప్రశ్నలు

1. సయ్యద్ వంశ సుల్తాన్‌లు ఎందువల్ల ఎక్కువ కాలం పరిపాలించలేక పోయారు?

2. సుల్తాన్ బహలాల్ లోడీ యొక్క తక్షణ కర్తవ్యం ఏమిటి?

3. ఆఫ్ఘన్ సర్ధారుల సహకారం పొందేందుకు బహలాల్ లోడీ అవలంభించిన విధానమేది?

4. సుల్తాన్ యొక్క మర్యాద, హోదాలను మెరుగు పరచడానికి సికిందర్ తీసుకొనిన చర్యలు ఏవి?

5. ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్య విచ్ఛిన్నతకు దారితీసిన రెండు సమస్యలను పేర్కొనుము.

6. కాబూల్ నుండి పానిపట్ వరకు గల తన మార్గంలో బాబర్ ఎటువంటి ప్రతిఘటనను ఎదుర్కొనక పోవటానికి కారణం ఏమిటి?

### ప్రాంతీయ రాజ్యాల ఆవిర్భావం

మహమ్మద్ బీన్ తుగ్లక్ పరిపాలనా కాలంలోనే సామ్రాజ్య విచ్ఛిన్న ప్రక్రియ ప్రారంభమైందని మీరు చదివారు. ఐతే ఫిరోజ్ తుగ్లక్ ఈ పరిస్థితిని చక్కదిద్దటానికి ప్రయత్నించాడు. కాని విఫలుడైనాడు. ఇతని వారసుల పరిపాలనా

కాలంలో జరిగిన తైమూర్ దండయాత్ర ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యంను చావు దెబ్బ తీసింది. ఈ పరిస్థితులలో కొంతమంది ప్రాంతీయ పరిపాలకులు ఢిల్లీ సామ్రాజ్యానికి తమ మద్ధతులను ఉపసంహరించి స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నారు. ఈ క్రింది పుటలలో మీరు ఇటువంటి కొన్ని ప్రాంతీయ రాజ్యాలను గురించి చదువుతారు.

## 30.9 జోన్‌పూర్ (Jaunpur)

జోన్‌పూర్ ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యం తూర్పు భాగంలో ఉన్న ఒక సుసంపన్నమైన ప్రాంతం. దీని గవర్నరు మాలిక్ సర్వార్ క్రీ.శ 1394లో నసీరుద్దీన్ మహమ్మద్ ఇతనికి సుల్తాన్ – షార్క్ (Sultan - sharg) అనగా "తూర్పు భాగాధిపతి"అనే బిరుదును ఇచ్చాడు. ఈ విధంగా ఇతడు కనోజ్ నుండి బీహార్ వరకు ఉన్న ప్రాంతాల్ని పరిపాలించాడు. కొద్ది కాలంలోనే ఇతడు కనోజ్, కారా, అవధ్, సందీల్స్, ఉల్మోవ్, బీహార్, తిర్‌హట్ (Tirhut) లకు పరిపాలకుడయ్యాడు. జాజ్‌నగర్, లఖ్నాతిల పరిపాలకులు కూడా ఇతనిని గౌరవించేవారు.

క్రీ.శ 1398లో తైమూర్ దండయాత్ర తర్వాత ఢిల్లీ సామ్రాజ్యమంతటా అయోమయం నెలకొంది. తన కోరికలకు ఒక రూపాన్ని కల్పించేందుకు మాలిక్ సర్వార్ దీనిని సదవకాశంగా చేసుకొన్నాడు. కాబట్టి ఇతడు 'సుల్తాన్' బిరుదును స్వీకరించక పోయినప్పటికీ రాజులా ప్రవర్తించడం ప్రారంభించాడు. ఈవిధంగా ఇతడు జోన్‌పూర్‌లో షార్కీ వంశ పాలనకు పునాది వేశాడు.

క్రీ.శ 1339లో మాలిక్ సర్వార్ మరణించగా, అతని వారసుడు, దత్త పుత్రుడైన మాలిక్ కరన్‌ఫూల్ సింహాసనాన్ని అధిష్టించాడు. ఇతడు 'ముబారక్ షా' (Mubarak shah) బిరుదును స్వీకరించాడు. ఈ విధంగా ఇతడు షార్కీ వంశానికి మూల పురుషుడు అయ్యాడు. ఇతడు తన పేరుతో నాణెములను ముద్రింపజేసి, ఖుద్బాను చదివించాడు.

ముబారక్ షా జోన్‌పూర్ పరిపాలించే కాలంలో ఢిల్లీ సుల్తాన్ అయిన మహ్మద్ బీన్ తుగ్లక్, మల్లు ఇక్బాల్ చేతిలో కీలు బొమ్మగా ఉండేవాడు. మల్లు ఇక్బాల్ జోన్‌పూర్‌ను తిరిగి స్వాధీనం చేసుకోవడానికి దండయాత్ర చేశాడు. కాని విఫలుడైనాడు. ఢిల్లీ, జోన్‌పూర్‌ల మధ్య శత్రుత్వానికి బీజం పడింది. ఇది ఢిల్లీ, జోన్‌పూర్ రాజవంశాల మధ్య సుదీర్గమైన సంఘర్షణకు దారితీసింది. క్రీ.వ. 1402లో ముబారక్ షా మరణానంతరం, అతని తమ్ముడైన ఇబ్రహీం సింహాసనాన్ని అధిష్టించాడు. ఇతడు సుమారుగా 34 సంవత్సరాలు పరిపాలించాడు.

ఇబ్రహీం పరిపాలనా కాలంలో ఢిల్లీ, జోన్‌పూర్‌ల మధ్య సంబంధాలు బాగా దెబ్బతిన్నాయి. ఢిల్లీ సుల్తానైన మహమ్మద్ బీన్ తుగ్లక్ మల్లు ఇక్బాల్ నిరంకుశత్వాన్ని భరించలేక జోన్‌పూర్‌కి పారిపోయాడు. ఇతడు ఇబ్రహీం సహాయాన్ని అర్థించాడు. కాని పొందలేక పోయాడు. కాబట్టి ఇతడు జోన్‌పూర్ రాజ్యంలో భాగమైన కనోజ్‌ను బలవంతంగా స్వాధీనం చేసుకున్నాడు. మల్లు ఇక్బాల్ ఆకస్మిక మరణం మహమ్మద్‌కు ఢిల్లీని ఆక్రమించే అవకాశాన్ని ఇచ్చింది. ఈ సమయంలో ఇబ్రహీం కనూజ్‌ను ఆక్రమించేందుకు ప్రయత్నించాడు. నాలుగు నెలల ముట్టడి తర్వాత తిరిగి స్వాధీనం చేసుకున్నాడు. ఇతడు బెంగాల్‌పై దండెత్తాడు. కాని జయించలేక పోయినాడు.

ఇబ్రహీం షార్కీ వంశంలో అతి గొప్ప పరిపాలకుడు. ఇతడు పండితుడే కాక విద్యా పోషకుడు. ఇతని పరిపాలనా కాలంలో ముస్లిం మత విజ్ఞానం, చట్టం, న్యాయం ఇతర విషయాలపై గొప్ప పాండిత్య గ్రంథాలు వ్రాయబడినాయి. ఇతడు సంగీతము, మరియు ఇతర లలిత కళా ప్రియుడు. ఈతని కాలంలో 'షిర్కీ' వాస్తువు అని పిలువబడే ఒక ప్రత్యేక వాస్తు శైలి ప్రాచుర్యంలోకి వచ్చింది. జోన్‌పూర్ మసీదులు చూడడానికి అందంగా ఉండి సాధారణ మినారెట్లు(minrets)

లేకుండా ఉన్నాయి. ఈ రకపు శిల్పశైలిలో హిందూ ప్రభావం కూడా కనిపిస్తుంది.

ఇబ్రహీం వారసుడైన మహమూద్ 'చునార్' కోటను జయించాడు. కల్పిని కూడా జయించటానికి ప్రయత్నించాడు కాని విఫలుడైనాడు. ఇతడు ఢిల్లీపై దండెత్తాడు కాని బహలాల్ లోడీ చేతిలో ఓడిపోయాడు. మహమూద్ తర్వాత జోన్‌పూర్ మహమ్మద్ షా, హుస్సేన్‌షాల పరిపాలనకు లోనయింది.

హుస్సేన్ సా పరిపాలనా కాలంలో ఢిల్లీ, జోన్‌పూర్‌ల మధ్య వైరం తారాస్థాయికి చేరి, దీర్ఘకాల యుద్ధంగా పరిణమించింది. క్రీ.శ 1458లో హుస్సేన్ షా బహలాల్ లోడీతో నాలుగు సంవత్సరాల తాత్కాలిక సంధి చేసుకున్నాడు. హుస్సేన్‌షా తిర్హట్ (Tirhut)లో జమీందార్ల తిరుగుబాటును అణచివేశాడు. ఇతడు జాజ్‌నగర్(ఒరిస్సా)పై దండెత్తి వారిని పెద్ద మొత్తంలో నష్ట పరిహారం చెల్లించడానికి ఒప్పించాడు. క్రీ.శ. 1466లో గ్వాలియర్‌పై దండయాత్రను చేపట్టాడు. కాని దానిని స్వాదీనం చేసుకోలేక పోయాడు. ఢిల్లీ జోన్‌పూర్‌ల మధ్య శత్రుత్వం పెరిగింది. బహలాల్ లోడీ హుస్సేన్‌పై దాడిచేసి ఓడించాడు. హుస్సేన్ షా జోన్‌పూర్ జమీందార్ల మధ్య తిరుగుబాట్లను రెచ్చగొట్టి ఢిల్లీ సుల్తాన్‌ను ఇబ్బంది పెడ్తూనే ఉండేవాడు. బహలాల్ లోడీ వారసుడైన సికందర్ లోడీ జోన్‌పూర్‌ను ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యంలో విలీనం చేశాడు. క్రీ.శ 1500లో హుస్సేన్ షా మరణంతో షార్కీ వంశపాలన కూడా అంతమైంది.

## 30.సి పాఠ్యాంశ ప్రశ్నలు

1. జోన్‌పూర్ అనధికార పరిపాలకుని (defactoruler) పేరు ఏమిటి?
2. తన పేరుతో 'ఖుద్బా'ని చదివించుకున్న జోన్‌పూర్ సుల్తాన్ పేరేమిటి?
3. షార్కీ వంశంలో ప్రధమ సుల్తాన్ ఎవరు?
4. ఢిల్లీ పాలకుడైన సుల్తాన్ మహమూద్ ఏ లక్ష్యంతో జోన్‌పూర్ చేరాడు?
5. జోన్‌పూర్ మసీదు ప్రత్యేక లక్షణాలు ఏమిటి?

## 30.10 మాళ్వా

మాళ్వా, ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యంలో నైరుతీ భాగంలో ఒక ప్రాంతం. క్రీ.శ 1310లో సుల్తాన్ అల్లాఉద్దీన్ ఖిల్జీ జయించినప్పటి నుంచి సుల్తాన్ ఫిరోజ్ తుగ్లక్ మరణం వరకు ఇది ఢిల్లీ సామ్రాజ్యంలో అంతర్భాగంగా ఉంది. ఫిరోజ్ తుగ్లక్‌చే నియమించబడిన దిలావర్‌ఖాన్ దీనికి చివరి రాజప్రతినిధి(గవర్నర్) క్రీ.శ 1401లో తైమూర్ దండయాత్ర తర్వాత దిలావర్ ఖాన్ ఢిల్లీకి తన అవిధేయతను ప్రకటించి తాను సుల్తాన్ బిరుదును స్వీకరించక పోయినప్పటికీ అనధికార సుల్తాన్‌గా తయారయ్యాడు. క్రీ.శ 1405లో ఇతని మరణానంతరం ఇతని కుమారుడైన ఆలంఖాన్ 'హోషంగ్‌షా'(Hoshang shah) బిరుదుతో సింహాసనాన్ని అధిష్టించాడు. ఇతడు 'మండూ'ను తన రాజధానిగా చేసుకొని, తన నూతన రాజధానిని సుందర హర్మ్యాలతో తీర్చిదిద్దాడు. హిందోళ మహల్(Hindola Mahal), జహాజ్ మహల్(Jahaz Mahal), జమా మసీదు(Jama Masjid) వంటి హిందూ వాస్తుశైలికి సజీవ తార్కాణాలు. రంగు రంగుల మరియు మెరిసే పెంకులను/బిళ్ళలను(tiles)వాడటం ఈ వాస్తు నిర్మాణాల ప్రత్యేకత.

మాళ్వా తన భౌగోళిక ఉనికి, సారవంతమైన భూమి మరియు సుసంపన్నతల కారణంగా ఢిల్లీ, జోన్‌పూర్ మరియు గుజరాత్‌లో శత్రుత్వాన్ని సంపాదించుకుంది. గుజరాత్‌లో జరిగిన ఒక యుద్ధంలో గుజరాత్ సుల్తాన్ హోషంగ్

షాని బంధించాడు. కానీ మాళ్వాను నియంత్రించడం కష్టమని గ్రహించి, హోషంగ్ షాను విడుదల చేసి పరిపాలకునిగా పునఃప్రతిష్టించాడు.

ఘాజీఖాన్(Ghazikhan)హోషంగ్‌షా వారసుడైనాడు. కాని ఇతడు క్రీ.శ 1436లో తన మంత్రి అయిన మహమ్మద్ ఖాన్ ఖిల్జీచే తొలగింప బడ్డాడు. మహమ్మద్ 'షా' (Shah)బిరుదును స్వీకరించి మాళ్వాలో ఖిల్జీ వంశానికి పునాది వేశాడు.

మహమూద్ పరిపాలనలో మాల్వా ఒక బలమైన సంపన్న రాజ్యంగా తయారయింది. ఇతడు ధైర్యశాలి. పెక్కు యుద్ధాలు చేశాడు. ఇతడు తన జీవితమంతా సైనిక శిబిరాలలోనే గడిపాడని అంటారు. ఇతని గుడారమే ఇతని గృహంగా, యుద్ధరంగమే ఇతని విశ్రాంతి స్థలంగా తీసుకోకుండా కనీసం ఒక్క సంవత్సరం కూడా గడవలేదు.

ఇతడు తన రాజ్యాన్ని దండయాత్రల ద్వారా విస్తరింపచేశాడు. ఇతడు దీనిని దక్షిణాన సాత్పురు పర్వతాల వరకు, పశ్చిమాన గుజరాత్ ప్రాంతం వరకు, తూర్పున బుందేల్ ఖండ్, ఉత్తరాన మాళ్వా వరకు విస్తరింపచేశాడు.

మహమూద్ ఖిల్జి న్యాయబద్ధుడైన, ఉదారపాలకుడు. 'ఫెరిస్తా' రచనల ప్రకారం ఇతడు వినయశీలి, ధైర్యశాలి మరియు విద్యాంసుడు. ఇతని పరిపాలనా కాలంలో ఇతడు తన తీరిక సమయాలను ప్రపంచంలోని వివిధ రాజుల చరిత్రలను, వారి ఆస్థానముల జ్ఞాపకాలను గురించి వినడానికి వినియోగించేవాడు.

అత్యాశాపరుడైన మహమూద్ ఖిల్జీ క్రీ.శ 1440లో ఢిల్లీపై దండయాత్ర చేశాడు. కానీ బహలాల్ లోడీచే నిలువరించబడ్డాడు. మహమూద్‌కి మేవార్ రాజు అయిన కుంభరాణాకు మధ్య జరిగిన యుద్ధం ఇరువైపుల వారు విజయం తమదేనని చెప్పుకోవడం వల్ల అనిశ్చితంగా తయారైంది. తన విజయానికి జ్ఞాపకార్థంగా కుంభరాణా చిత్తోర్‌లో విజయ స్థంభాన్ని నిర్మించాడు. మరోవైపున తన విజయాన్ని సూచిస్తూ మహమూద్ ఖిల్జీ మండూలో ఏడంతస్తుల భవనాన్ని నిర్మించాడు.

ఘియాజుద్దీన్, నసీరుద్దీన్‌లు మహమూద్ ఖిల్జీని అనుసరించారు. వీరు పరిపాలనా కాలంలో గుర్తించదగిన సంఘటనలు ఏమీ లేవనే చెప్పాలి. క్రీ.శ 1510లో రెండవ మహమూద్ మాళ్వా సింహాసనాన్ని అధిష్టించాడు. ఇతడు తన విధేయులైన సర్ధార్లను అణగద్రొక్కడానికి 'మేదినీరాయ్'(Medini Rai)అనే శక్తివంతుడైన రాజపుత్రుడిని పిలిపించి, అతనిని తన ప్రధానమంత్రిగా నియమించాడు. ఆస్థానములో రాజపుత్రుల ప్రాబల్యము ముస్లిం ప్రభువులలో ఈర్ష్యను సృష్టించింది. వీరు మేదినీరాయ్‌కి వ్యతిరేకంగా గుజరాత్ సుల్తాన్ సహాయాన్ని కోరారు. గుజరాత్ సుల్తాన్ మాల్వాను జయించి గుజరాత్‌లో కలుపుకున్నాడు. హుమాయూన్ గుజరాత్‌ను జయించేంత వరకు ఇది గుజరాత్‌లో ఒక భాగంగా మిగిలింది.

## 30.డి పాఠ్యాంశ ప్రశ్నలు

1. క్రీ.శ 1310లో మాళ్వాని ఎవరు ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యంలో భాగంగా చేశారు?
2. మండూ వాస్తు కళ యొక్క ప్రముఖ లక్షణాలు ఏవి?
3. చిత్తోర్‌లో విజయ స్తంభాన్ని ఎవరు నిర్మించారు?
4. రెండవ మహమ్మద్ పరిపాలనా కాలంలో ముస్లిం సర్ధారుల అసంతృప్తి ఎలా బయట పెట్టబడింది?

## 30.11 గుజరాత్

గుజరాత్ తన భౌగోళిక స్థితి, సంపన్నత, సారవంతమైన నేలల కారణంగా ఎల్లప్పుడు దండయాత్రీకులను ఆకర్షిస్తూనే ఉండేది. ఘజనీ మహ్మద్ ఈ ప్రాంతాన్ని దోచుకెళ్ళిన సంగతిని మీరు గుర్తుకు తెచ్చుకోగలరు. గుజరాత్‌ని ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యంలో కలిపిన మొదటి సుల్తాన్ అల్లాఉద్దీన్ ఖిల్జీ. అప్పటి నుండి అది తురుష్క రాజప్రతినిధులు(governors) చేతిలోనే ఉండేది. ఈ గవర్నర్లు ఢిల్లీ సుల్తాన్‌కి బాధ్యత వహించేవారు. కాని వారి విధేయత సుల్తాన్ యొక్క అధికార బలం, బలహీనతపై ఆధారపడి మారుతూ ఉండేది. తైమూర్ దండయాత్రా కాలంలో జాఫర్‌ఖాన్ (Zafar khan) ఈ ప్రాంతానికి గవర్నరుగా ఉండేవాడు.

తైమూర్ దండయాత్ర సుల్తాన్ సామ్రాజ్యామంతటా అయోమయాన్ని సృష్టించింది అని మీరు చదివారు. ఈ పరిస్థితిని అవకాశంగా తీసుకొని, జాఫర్‌ఖాన్ ఢిల్లీ సుల్తాన్‌కు తన విధేయతను ప్రకటించి క్రీ.శ1410లో ఇతడు గుజరాత్‌కు స్వతంత్ర పరిపాలకుడు అయ్యాడు.

జాఫర్‌ఖాన్ కుమారుడైన తాతర్‌ఖాన్, కొంతమంది అసంతృప్తులైన సర్ధారుల సహాయంతో జాఫర్‌ఖాన్‌ను సింహాసనం నుంచి దించివేశాడు. అతడు నసీరుద్దీన్ మహమ్మద్ అనే బిరుదుతో తనను తాను రాజుగా ప్రకటించుకున్నాడు. అయితే ఇతడు అచిరకాలంలోనే సంహరింపబడటంతో, జాఫర్‌ఖాన్ తన సింహాసనాన్ని మరల దక్కించుకున్నాడు. ఇతడు 'సుల్తాన్ ముజఫర్‌షా' బిరుదుతో రాజ్యపాలన చేశాడు. తన బలాన్ని, హోదాని పెంచుకొనేందుకు ఇతడు ధార్‌ను జయించాడు. అతడు ఇంకా ఎన్నో దండయాత్రలు కూడా చేశాడు.

గుజరాత్ పరిపాలకులలో మిక్కిలి గొప్పవాడు అహ్మద్‌షా (క్రీ.శ 1411 నుండి 1441). ఇతడు ధైర్యశాలి, సాహసవంతుడు మరియు అత్యాశాపరుడు. తన రాజ్యాన్ని విస్తరించేందుకు ఇతడు రాజపుత్ర రాజ్యాలను, ఝులావర్, బుండి, దుర్గాపూర్‌లను స్వాధీనం చేసుకొన్నాడు. ఇతడు సౌరాష్ట్రములోని గిర్నార్‌ను జయించి కప్పం చెల్లించ వలసినదిగా అక్కడి రాజును నిర్భంధించాడు.

అహ్మద్‌షా అహ్మద్‌బాద్ నగరానికి పునాదివేసి దానిని సుందర భవనాలతో తీర్చిదిద్దాడు. అహ్మద్‌బాద్‌లో జామామసీదు, తీన్ దర్వాజాలను ఇప్పటికీ దర్శించగలము. ప్రస్తుతము అహ్మదాబాద్ వస్త్ర పరిశ్రమకు ఒక ముఖ్యకేంద్రం.

అహ్మద్‌షా ఒక సనాతన మహమ్మదీయుడు. ఇతడు గుజరాత్‌లోని హిందువుల మీద జిజియా పన్ను విధించాడు. తన దండయాత్రలో ఎన్నో దేవాలయాలను ధ్వంసం చేశాడు. కాని అదే సమయంలో హిందువులకు తన రాజప్రతినిధులుగా నియమించాడు. అహ్మద్‌షా న్యాయపాలనలో ప్రఖ్యాతిగాంచాడు. అతడు న్యాయ విచారణ చేసేటప్పుడు అపరాధిని మాత్రమే చూసేవాడు కాని అతని కుటుంబాన్ని గాని, స్థితిగతులు గాని, హోదాను కాని పట్టించుకొనేవాడు కాదు. ఒకసారి ఇతడు ఒక నిరపరాధిని హత్యగావించిన తన అల్లుణ్ణి బహిరంగంగా ఉరితీయించాడు. మీరట్–ఇ–సికంద్రి(Mirut-i-Sikandri) రచయిత "ఈ ఆదర్శవంతమైన శిక్షల ప్రభావము ఇతని పరిపాలనా కాలమంతా ఉండేది" అని వాస్తవం చెప్పాడు. ఈ కారణము చేత మాత్రమే సర్ధారులు కాని సైనికులు కాని హత్య చేయడానికి ధైర్యం చేసేవారు కాదు.

క్రీ.శ 1441లో అహ్మద్‌షా మరణించగా అతని పెద్ద కుమారుడైన మహ్మద్‌షా సింహాసనాన్ని అధిష్టించాడు. ఇతడు ఇతడు "జార్–బక్ష్–'గా సుప్రసిద్ధుడు. ఇతడు చాంపానీర్, మాల్వాల సంయుక్త సైన్యముతో యుద్ధం చేస్తున్నపుడు ఇతనిని హత్య చేసేందుకు సర్ధారులు కుట్ర పన్నారు. ఈ కుట్రదారులు ఇతనిని క్రీ.శ 1451లో సంహరించారు. ఇతని

అనంతరం బలహీనులైన ఇద్దరు పరిపాలకులు రాజ్యపాలన చేశారు.

ఈ అసంతృప్తులైన సర్దారులు అహ్మద్‌షా మనుమడైన 'ఫతేఖాన్'ను గద్దె నెక్కించారు. ఇతడు 'మహమ్మద్' పరిపాలించాడు. మహమ్మద్ ఆ వంశంలోనే అత్యంత సమర్ధుడైన పరిపాలకుడు. ఇతడు గొప్ప యోధుడు, విజేత మరియు పరిపాలనాదక్షుడు. ఇతడు 52 సంవత్సరాలు పరిపాలించాడు.

ఢిల్లీ మహమ్మద్ నిజామ్‌షా బహ్మనీ విషయమై మహమ్మద్ ఖిల్జీని ఓడించాడు. ఇతడు కచ్ ప్రభువును కూడా జయించి గిర్నార్ (జునాగడ్) పరిపాలకుని తన సార్వభౌమత్వమును అంగీకరింపజేశాడు. ఇతడు రాజపుత్రుల నుండి చాంపనీర్(Campaner)కోటను కూడా జయించాడు. ఇతడు బలమైన మూడు దుర్గాలను(గడ్) జయించినందువలన "మహ్మద్ బీ గడ్"గా పిలువబడ్డాడు.

క్రీ.శ 1507లో మహమ్మద్ దేశ పశ్చిమ తీరంలో స్థిరపడి భారత సముద్ర వర్తకంపై గుత్తాధిపత్యము వహిస్తున్న పోర్చుగీసు వారిపై దండయాత్ర చేశాడు. వీరి గుత్తాధిపత్యము ముస్లిం వర్తకులకు ఎంతో నష్టాన్ని కలిగించేది. పోర్చుగీసుల గుత్తాధిపత్యాన్ని నివారించేందుకు ఇతడు టర్కీ సుల్తాన్ సహాయాన్ని అర్ధించాడు. కాని విఫలుడైనాడు. చివరకు మహమ్మద్ వారికి డయ్యూ వద్ద కర్మాగారానికి స్థలాన్ని కేటాయించవలసి వచ్చింది.

మహమ్మద్ క్రీ.శ. 1511లో మరణించాడు. ఇతని తర్వాత చాలామంది సుల్తాన్‌లు అనుసరించారు. క్రీ.శ 1572లో అక్బర్ గుజరాత్‌ను జయించి మొఘల్ సామ్రాజ్యంలో కలుపుకున్నాడు.

## 30.ఇ పాఠ్య ప్రశ్నలు

1. ఢిల్లీ సుల్తాన్‌లకు గుజరాత్‌ని జయించడం ఎందుకు ప్రధానం అయింది?
2. జాఫర్‌ఖాన్ ఏ బిరుదుతో సింహాసనాన్ని అధిరోహించాడు?
3. అహ్మదాబాద్ నగరాన్ని ఎవరు నిర్మించారు? ఇది ప్రస్తుతం దేనికి ప్రఖ్యాతి చెందింది?
4. మహమ్మద్‌చే గర్వా ఏ రెండు దుర్గాలను జయించాడు?
5. మహమ్మద్ పోర్చుగీసు వారిపై ఎందుకు దండయాత్ర చేశాడు?

## 30.12 బెంగాల్

బెంగాల్ ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యంలో సుదూర తూర్పున ఉన్న ప్రాంతం. దీని శీతోష్ణస్థితి దేశంలోని మిగిలిన భాగాలకంటే విలక్షణమైనది. సుదూరంగా ఉండటం, తగినన్ని రవాణా సాధనాలు, సమాచార సౌకర్యాలు లేకపోవడం వల్ల ఈ ప్రాంతాన్ని నియంత్రించటం కష్టమయింది. కాబట్టి బెంగాల్‌ను ఎన్నోసార్లు ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యం తనలో కలుపుకొన్నప్పటికీ, ప్రతిసారీ అది స్వతంత్రాన్ని సంపాదించుకొంది.

12వ శతాబ్ధపు చివరి దశాబ్ధ కాలంలో మహమ్మద్ బీన్ భక్తియార్ బెంగాలును మహమ్మద్ ఘోరీ జయించిన ప్రాంతంలో కలిపాడు. అయితే అతని మరణానంతరం, అతని వారసులు స్థానిక ప్రజల మద్ధతుతో స్వాతంత్ర్యం సంపాదించుకున్నారు. బాల్బన్ బెంగాల్ ఢిల్లీ సార్వభౌమత్వం అంగీకరించేటట్లు ఒప్పించి, తన కుమారుడైన భుగ్రాఖాన్‌ని బెంగాలు గవర్నరుగా నియమించాడు. కాని బాల్బన్ మరణానంతరం ఇతడు స్వతంత్రం ప్రకటించుకున్నాడు. సుల్తాన్

ఘియాజుద్దీన్ తుగ్లక్ బెంగాలును లఖ్నాతి(Lakhananti) సత్గాన్(Satgaon)మరియు సోనర్‌గావ్(Sonargaon)అనే మూడు స్వతంత్ర పరిపాలనా విభాగాలుగా విభజించటం ద్వారా ఈ సమస్యను పరిష్కరించేందుకు ప్రయత్నించాడు. అయితే ఇది సమస్యను పరిష్కరించలేకపోయింది. మహమ్మద్ బీన్ తుగ్లక్ బెంగాల్ మీద ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యపు ఆధిక్యతను ధృవీకరించ ప్రయత్నించాడు. కాని ఇతడు సామ్రాజ్యంలోని తిరుగుబాట్లును అణగద్రొక్కడంతో నిమగ్నుడై ఉన్నపుడు, బెంగాల్ ఢిల్లీతో సంబంధాన్ని త్రెంచి వేసుకుంది.

హాజీ ఇలియాస్ (Haji Iliyas)అనే సర్ధారు బెంగాలును సమైక్యం చేసి 'షంషుద్దీన్–ఇలియాస్–షా'(Shamsh-ud-din-Iliyas)బిరుదుతో దానికి పాలకుడైనారు. ఇతడు ఔత్సాహికుడు మరియు అత్యాశ గల పరిపాలకుడు. ఇతడు ఒరిస్సా మరియు తిర్హట్‌లపై దండయాత్ర చేసి వారిని కప్పం చెల్లించమని నిర్బంధించాడు. హాజీ ఇలియాస్ యొక్క ప్రాబల్యం పెరగడం గమనించిన ఫిరోజ్ తుగ్లక్ బెంగాలుపై దండెత్తాడు. కాని ఇతడు బెంగాల్‌ను తిరిగి స్వాధీనం చేసుకోలేక సంధికి ఒప్పుకొన వలసి వచ్చింది. ఈ సంధి ప్రకారం కోసీ నదిని ఈ రెండు రాజ్యాల మధ్య సరిహద్దు రేఖగా అంగీకరించారు. దీనిని అవకాశంగా తీసుకొని బెంగాల్ సర్ధార్ల అభిమానాన్ని సంపాదించేందుకు ఫిరోజ్ తుగ్లక్ వారికి ఉదారంగా భూములను 'ఇనాం'గా ఇచ్చాడు. కాని అది నిష్ప్రయోజమైంది. కాని ఏదేమైనా హాజీ ఇలియాస్ ప్రాభవాన్ని వెలుగులోకి తేగలిగింది.

క్రీ.శ 1357లో హాజీ ఇలియాస్ మరణించగా అతని కుమారుడైన సికిందర్ వారసుడైనాడు. ఇతని కాలంలో ఫిరోజ్ తుగ్లక్ బెంగాల్‌ను జయించేందుకు ప్రయత్నించాడు కాని విఫలుడైనాడు. సికిందర్ మరణానంతరం ఘియాజుద్దీన్ అజామ్ సింహాసనాన్ని అధిష్టించాడు. ఇతడు తన మతానికి అంకితమయ్యాడు. ఇతడు తన న్యాయ పాలనకు ప్రఖ్యాతి చెందాడు. ఇతడు పొరపాటున ఒక వితంతువు కుమారుని చంపాడని అంటారు. ఆ వితంతువు ఖాజీ దగ్గర ఫిర్యాదు చేసింది. ఖాజీ పరిపాలకుడైన ఘియాజుద్దీన్‌ను న్యాయస్థానానికి పిలిపించగా అతడు వినయంగా హాజరైనాడు. తీర్పు ఇచ్చిన తర్వాత అజామ్‌ఖాజీతో అతడు తన విధిని సక్రమంగా నిర్వహించక పోయినట్లయతే అతనిని సంహరించి ఉండేవాడినని అన్నాడు.

ఇతనికి పర్షియన్ సాహిత్యం పట్ల ఎక్కువ మక్కువ ఉండేది. ఇతడు సమకాలీన పండితులతో హృదయ పూర్వక సంబంధాలను ఏర్పరచుకున్నాడు. ఇతనికి ప్రఖ్యాత పర్షియన్ కవి హఫీజ్ షహరాజ్‌తో పరిచయముండేదని అంటారు. ఇతడు చైనా రాజుతో స్నేహ సంబంధాలను నెలకొల్పాడు. వీరిరువురూ పరస్పరం రాయబారులను మార్చుకొన్నారు. చైనా రాజు కోరిక మేర ఇతడు బెంగాల్ నుండి బౌద్ధ సన్యాసులను చైనాకు పంపించాడు. వీరివురి మధ్య హృదయ పూర్వ సంబంధాలు సమృద్ధమైన విదేశీ వాణిజ్యాభివృద్ధికి దారితీశాయి. చిట్టగాంగ్(Chittagang) నౌకా వ్యాపార కేంద్రంగా భాసిల్లింది. ఇక్కడ నుండి చైనా వారి వస్తువులు విదేశాలకు పంపబడేవి.

అజామ్ అతని కుమారుడైన సైపుద్దీన్ హమ్‌జాషా ((Saif-uddin-Hamza shah) వారసుడయ్యాడు. కాని ఇతడు బలహీనుడైన పరిపాలకుడుగా రుజువైంది. ఇతని పరిపాలనా కాలంలో భటూరియా మరియు దినాజ్‌పూర్‌ల బ్రాహ్మణ జమీందారైన రాజా గణేష్ అనునతడు ఆస్థానంలో అవకాశాన్ని సంపాదించి క్రమంగా బెంగాల్ పరిపాలకుడైనాడు. కొంతకాలం తర్వాత ఇతడు తన కుమారుడైన జాదూ కోసం సింహాసనాన్ని పరిత్యజించాడు. ఈ జాదూ, తర్వాత ముస్లింగా మారి జలాలుద్దీన్ మహమ్మద్‌షా (Jalal -ud-din-Mahammad Shah) ను గ్రహించాడు. ఇతనికి అనేకమంది పరిపాలకులు వారసులయ్యారు.

తర్వాత హాజీ ఇలియాస్ వంశం మళ్ళీ బెంగాల్‌లో తన పరిపాలనను స్థాపించింది. ఈ కాలంలో హాజీ ఇలియాస్ మనుమడైన నసీరుద్దీన్ బెంగాల్ పాలకుడిగా నుండెను. ఇతడు 17 సంవత్సరాలు ప్రశాంతంగా పరిపాలించాడు. ఇతడు గౌర్‌సత్గాన్‌లలో మసీదులను నిర్మించాడు.

అల్లాఉద్దీన్ హుస్సేన్‌షా పరిపాలనా కాలంలో బెంగాల్ సంపదలలో సుసంపన్నమైంది. ఇతడు రాజ్యంలో శాంతిభద్రతలను పునరుద్ధరించాడు. ఇతడు ఉదారమైన పాలకుడు. ఇతడు హిందువులకు కూడా ఉన్నతోద్యోగాలిచ్చాడు. ఇతడు వైష్ణవుడైన చైతన్య మహా ప్రభువును గౌరవంగా సత్కరించేవాడని అంటారు.

అల్లాఉద్దీన్ హుస్సేన్‌షాకి ఢిల్లీ పాలకుడైన సికిందర్ లోడీతో పోరాటం చేసి చివకు సంధి చేసుకోవలసి వచ్చింది. ఇతడు మగధ కూచ్, బీహార్‌లను జయించాడు. క్రీ.శ 1518లో ఇతని మరణానంతరం, కుమారుడైన నసీబ్‌ఖాన్(Nasibkhan)సింహాసనాన్ని అధిష్టించాడు. ఇతడు నసీరుద్దీన్ నస్వత్‌షా(Nasiruddin Nasvat shah) బిరుదుతో పాలించాడు. ఇతడు సాహిత్య పోషకుడు. ఇతని పోషణలో మహాభారత గ్రంథం బెంగాలీలోకి అనువదించబడింది. ఇతడు గౌర్ వద్ద బారాసోనా మసీద్(Bara sona masjid)మరియు ఊదమ్ రసూల్(Uodam Rasul) లను నిర్మించాడు.

క్రీ.శ 1538లో షేర్‌షా సూరి ఘియాజుద్దీన్ మహమ్మద్‌ను జయించి బెంగాల్‌ను తన సామ్రాజ్యంలో అంతర్భాగంగా చేశాడు.

## 30.ఎఫ్ పాఠ్య ప్రశ్నలు

1. ఢిల్లీ సుల్తాన్‌లు బెంగాల్ మీద తమ నియంత్రణను ఎందుకు కొనసాగించలేక పోయారు?
2. మహమ్మద్ తుగ్లక్ పరిపాలనా కాలంలో ఢిల్లీ సామ్రాజ్యం నుండి బెంగాల్‌లో స్వాతంత్ర్యాన్ని ప్రకటించినది ఎవరు?
3. బెంగాల్‌ను మూడు పరిపాలనా విభాగాలుగా విభజించిందెవరు?
4. ఢిల్లీ, బెంగాల్ మధ్య శాంతి ఒప్పందం గురించి బెంగాల్ పొందిన ప్రయోజనాలేవి?
5. చైతన్య మహాప్రభువును సత్కరించిన బెంగాల్ పరిపాలకుడెవరు?

## 30.13 కాశ్మీర్

కాశ్మీర్ భారతదేశ ఉత్తర భాగంలో ఉంది. ఇది శైవమత కేంద్రం. దీని పరిపాలకులు హిందువులు. కాశ్మీర్ ఒక సంవృత(Closed)రాజ్యము అయినందువల్ల ఇతరులెవరూ ఈ లోయలోకి సులభంగా ప్రవేశించలేదు. క్రీ.శ 1339లో షంషుద్దీన్‌షా (Shamshuddin) ఇక్కడి హిందూరాజులను సింహాసనం నుండి తొలగించి కాశ్మీర్‌లో ప్రప్రథమ ముస్లిం పరిపాలకుడైనాడు. క్రీ.శ 1389లో సికందర్ సింహాసనమెక్కాడు. సికందర్ శక్తివంతుడైన, మతమౌఢ్యం గల పరిపాలకుడు. ఇతడు అధిక సంఖ్యాకుల హిందూ మతాన్ని వ్యతిరేకించాడు. ఇతడు బ్రహ్మణులు, హిందూ పండితులందరూ ఇస్లాంను అంగీకరించాలి లేదా కాశ్మీర్‌ను విడిచి వెళ్ళాలని ఆదేశించాడు. ఫలితంగా కొంతమంది ఇస్లాంను అవలంబించగా మరికొంతమంది వదిలి వేరే ప్రాంతాలలో స్థిరపడ్డారు.

క్రీ.శ 1416లో సికిందర్ మరణించగా, ఇతని కుమారుడైన ఆలీషా సింహాసనమెక్కాడు. కొన్ని సంవత్సరాల తర్వాత ఇతని సోదరుడైన షాఖాన్(Shah khan)ఇతనిని సింహాసనం నుండి త్రోసివేసి జైనూల్ అబీదిన్(Jainul Abidin)బిరుదుతో సింహాసనాన్ని అధిష్టించాడు. జైనూల్ అబీదిన్ ఒక వివేకవంతుడే గాక ఉదార స్వభావం గల

పరిపాలకుడు. హిందూ పరిపాలితుల సహాయ సహకారాలను పొందేందుకు, ఇతడు సికిందర్‌చే తరిమి వేయబడిన హిందువులందరినీ వెనుకకు పిలిపించాడు. జిజియా పన్నును మరియు గోవధను నిషేధించడం ద్వారా ఇతని పరమత సహనాన్ని మనం అర్థం చేసుకోగలం. ఇతడు హిందువులను తన ఆస్థానంలోని ఉన్నతోద్యోగాలలో నియమించాడు.

జైనూల్ అబీదిన్ కాశ్మీర్ ఆర్థికాభివృద్ధిపై ఎక్కువ శ్రద్ధ చూపాడు. వ్యవసాయాభివృద్ధి కొరకు నదులపై ఆనకట్టలను నిర్మించి, కాలువలు త్రవ్వించాడు. జైనూల్ అబీదిన్ స్వయంగా పర్షియన్, సంస్కృతం, టిబెట్ మరియు కాశ్మీరీ భాషలలో గొప్ప విద్వాంసుడు. ఇతడు పర్షియన్, సంస్కృత పండితులను పోషించాడు. ఇతని ఆదేశానుసారం మహాభారత గ్రంథం, కాశ్మీర రాజు చరిత్ర అయిన కల్హణుని రాజతరంగిణి పర్షియా భాషలోకి అనువదించబడినాయి అదేవిధంగా ఎన్నో అరబిక్, పర్షియన్ గ్రంథాలు హిందీలోకి కూడా అనువదించబడినాయి. ఇతని ఇతర ఘనకార్యాలను గురించి తర్వాత పాఠంలో చదవగలరు.

జైనూర్ అబీదిన్ వారసుడు బలహీన పాలకుడిగా ఋజువైంది. ఇతని కాలంలో రాజ్యమంతా అయోమయ స్థితి నెలకొన్నది. దీనిని అవకాశంగా తీసుకొని బాబర్ బంధువైన మీర్జా హైదర్, కాశ్మీర్‌ను ఆక్రమించాడు. ఇతడు స్వతంత్రునిగా పాలించాడు. క్రీ.శ 1586లో అక్బర్ కాశ్మీర్‌ను జయించి దీనిని మొఘల్ సామ్రాజ్యంలో అంతర్భాగం చేశాడు.

## 30.జి పాఠ్య ప్రశ్నలు

1. కాశ్మీర్‌లో మొదటి ముస్లిం పాలకుడెవరు?
2. సికందర్ పరిపాలనా కాలంలో ఏ కారణాల వలన హిందువులు కాశ్మీర్‌ను వదిలి వెళ్ళారు?
3. కాశ్మీర్ ఆర్థిక అభివృద్ధి కొరకు జైనూల్ అబీదిన్ చేపట్టిన కార్యక్రమాలేవి?
4. హిందూ పాలితుల సహాయ సహకారాన్ని పొందేందుకు జైనూల్ అబీదిన్ తీసుకొన్న చర్యలేవి?

## సారాంశం :

మహమ్మద్ బిన్ తుగ్లక్ మరణానంతరం సర్దార్లు అమీర్‌లు, ఉలేమాలు, ఫిరోజ్ తుగ్లక్‌ను సింహాసనంపై కూర్చుండబెట్టారు. ఫిరోజ్ ఎన్నోసంస్కరణలు చేపట్టిన ఒక సాదుస్వభావియైన పాలకుడు. ఇతడు అమీర్లు, ఉలేమాల పట్ల స్నేహ భావాన్ని అవలంభించాడు. ఇతని పరిపాలనా కాలంలో విచ్ఛిన్నకర శక్తులు గుర్తించేంతగా ప్రజ్వరిల్లాయి. బలహీనులైన ఫిరోజ్ వారసలు సర్దారుల చేతిలో కీలు బొమ్మలైనారు.

క్రీ.శ 1398లో తైమూర్ దోచుకోవడం(కొల్లగొట్టడం) కోసం ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యాన్ని ఆక్రమించాడు. ఇతడు ఢిల్లీ ప్రవేశించి కేంద్ర అధికార బలహీనతను ఎత్తి చూపేవిధంగా పౌరులను ఊచకోత కోశాడు. తైమూర్ ఖాజ్‌ఖాన్‌ని ముల్తాన్ గవర్నరుగా నియమించగా ఇతడు సయ్యద్ వంశ పాలనకు పునాది వేశాడు. ఈ వంశం ఆఫ్ఘన్ పరిపాలకులైన లోడీ వంశస్థులచే అంతం చేయబడింది. బహలాల్‌లోడీ తన సర్దార్ల పూర్తి సహాయాన్ని పొందగలిగిన సమర్ధుడైన పాలకుడు. సర్దార్లపై సుల్తాన్ ఆధిపత్యాన్ని పెంచేందుకు తీవ్రంగా కృషిచేసిన సికందర్ లోడీ ఇతనిని అనుసరించాడు. లోడీ వంశస్థులలో చివరివాడైన ఇబ్రహీంలోడీ మొదటి పానిపట్ యుద్ధంలో బాబర్ చేతిలో ఓడిపోయాడు. ఈవిధంగా సుల్తాన్ సామ్రాజ్యం విచ్ఛిన్నం మొఘల్ సామ్రాజ్య స్థాపనకు దారిచూపింది.

తైమూర్ దండయాత్ర ప్రాంతీయ రాజ్యాలు ఢిల్లీ సామ్రాజ్యం నుండి స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకోవటానికి అవకాశాన్నిచ్చింది. జోన్‌పూర్‌కు మాలిక్ సర్వార్(అనధికార) వాస్తవ పరిపాలకుడయ్యాడు. జోన్‌పూర్ నేలిన షర్కీ పాలకులలో గొప్పవాడైన ఇబ్రహీంచే ప్రోత్సహించబడిన ప్రత్యేక వాస్తుశైలిని అభివృద్ధి చేశారు. మరియొక ప్రాంతమైన మాళ్వా కూడా ఢిల్లీ సుల్తాన్‌కు అవిధేయతను ప్రకటించింది. మాళ్వాని హోషంగ్‌షా మరియు మహ్మద్ ఖిల్జీ వంటి సమర్థులైన నాయకులు పరిపాలించారు. వీరిలో మొదటివాడు 'మండూ'ని తన రాజధానిగా చేసుకొని అక్కడ ఎన్నో సుందర రాజభవనాలను నిర్మించాడు. మహమ్మద్ ఖిల్జీ మాళ్వా సరిహద్దులను విస్తరించాడు. పశ్చిమ తీరంలో సంపన్న ప్రాంతమైన గుజరాత్ కూడా దాని గవర్నరయిన జాఫర్ ఖాన్ స్వతంత్రంగా పాలించడం ప్రారంభించనప్పటి నుండి ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యం నుండి వేరుపడింది. అహమ్మదాబాద్ నగరాన్ని నిర్మించిన అహ్మద్‌షా గుజరాత్ పరిపాలకులలో ప్రముఖుడు. అక్బర్ జయించేంత వరకు గుజరాత్ స్వతంత్ర రాజ్యంగా నిలిచింది. డయ్యూ వద్ద పోర్చుగీసు వారు ఒక కర్మాగారాన్ని స్థాపించారు.

ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యంలో సుదూర తూర్పు ప్రాంతంలో ఉన్న బెంగాల్ ఢిల్లీ సామ్రాజ్యంలో పెక్కుసార్లు చేర్చబడింది. కాని అచిర కాలంలోనే స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొనేది. ఢిల్లీ సుల్తాన్‌లు మూడు పరిపాలనా విభాగాలుగా విభజించిన బెంగాల్‌ను హాజీ ఇలియాస్ సమైక్యం చేశాడు. ఇతర ప్రముఖ బెంగాల్ పరిపాలకులలో నిష్పక్షికంగా న్యాయాన్నందించటంలో ప్రఖ్యాతి చెందిన ఘియాజుద్దీన్ అజామ్ కూడా చేర్చబడ్డాడు. కాశ్మీర్ పరిపాలకుడైన జైనూల్ అబిదీన్ ప్రాంతీయ పరిపాలకులలో ప్రత్యేకంగా పేర్కొనదగినవాడు. ఇతను వివేకవంతుడు, పాలితులైన హిందూముస్లింలను ఒకేవిధంగా ఆదరించిన ఉదార స్వభావి. ఇతని పాలనలో కాశ్మీర్ ఒక బలమైన, సుసంపన్న రాజ్యంగా తయారైంది.

## అభ్యాసం :

1. ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యం విచ్ఛిన్నమగుటకు గల కారణములను పేర్కొనుము?
2. ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యంపై తైమూర్ దండయాత్ర రాజకీయ ప్రభావమెట్టిది?
3. ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్య పతనానికి ఫిరోజ్ తుగ్లక్‌కు ఎంతమేరకు బాధ్యత వహించాడు?
4. జోన్‌పూర్ రాజ్యం ఆవిర్భావం, విస్తరణ గూర్చి క్లుప్తంగా వివరించండి?
5. వాస్తు కళా రంగానికి జోన్‌పూర్ చేసిన సేవ ఎట్టిది?
6. బెంగాల్ ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యానికి ఒక సమస్యగా మెగలడానికి కారణాలేవి?
7. గుజరాత్ పాలకులలో ఎవరిని మీరు గొప్పవానిగా గుర్తిస్తారు? మీ సమాదానానికి కారణమును వ్రాయండి.
8. జైనూల్ అబిదీన్ ఒక వివేకి, మత సహనం గల ప్రాజ్ఞ(ఉదా) పాలకుడుగా ఎందుకు పరిగణించబడ్డాడు?

## కృత్యములు

వివిధ ప్రాంతీయ రాజ్యములకు సంబంధించిన వాస్తు నిర్మాణాల బొమ్మలను/చిత్తరువులను సేకరించి వాటిని నిర్మాణశైలిని పోల్చండి.

## పాఠ్య ప్రశ్నలకు సమాధానంలు

### 30.ఎ

1. విజయనగర, బహమనీ రాజ్యాలు
2. వంశపారంపర్య విధానం
3. సుల్తాన్ మరియు సర్దారుల మధ్య పోరాటం
4. 1) ఎ 2) బి

### 30.బి

1) అంతర్గత తిరుగుబాట్ల వలన

2) దోఆబ్(అంతర్వేది)పై పునఃనియంత్రణ సాధించటం

3) తనకు తాను ఆఫ్ఘన్ పీర్‌లలో ఒకడుగా ప్రకటించుకొనుట, ఆఫ్ఘన్ సర్దారుల పట్ల తృప్తిపరచే విధానమవలంభించుట

4. 1) అమీర్‌లు, సర్దారులు చక్రవర్తికి విధేయులుగా ఉండాలని ఒత్తిడి చేయటం

2) ఆఫ్ఘన్ సర్దారుల స్వతంత్ర ధోరణిని కట్టడి చేయుట

5. 1) బలహీనమైన వారసులు

2) తైమూర్ దండయాత్ర

3) అంతర్గత కుమ్ములాటలు

### 30.సి

1) మాలిక్ సర్వార్

2) మాలిక్ సర్వార్

3) మాలిక్ సర్వార్

4) ఇబ్రహీం సాయంకోసం

5) సాధారణంగా ఉండే మినారెట్లు లేకపోవడం

### 30.డి

1) అల్లాఉద్దీన్ ఖిల్జీ

2) రంగురంగుల మరియు మెరిసే పెంకులు (బిళ్ళలు) వాడటం

3) మేవార్ రాణా కుంభ

4) మేదీనీరాయ్‌కు వ్యతిరేకంగా గుజరాత్ సుల్తాన్ సాయం కోరడం

## 30. ఇ

1) భౌగోళిక ఉనికి సుసంపన్నత, సారవంతమైన ప్రాంతం అవటం వల్ల

2) సుల్తాన్ ముజఫర్‌షా

3) అహ్మద్‌షా అహ్మదాబాద్ నగరంను స్థాపించాడు. అది నేడు వస్త్ర పరిశ్రమకు ప్రసిద్ధి చెందింది.

4) చాంపనేర్, గిర్నార్

5) పోర్చుగీసువారి గుత్తాధిపత్యంను నియంత్రిచుటకు

## 30. ఎఫ్

1) అతిదూరంగా ఉండటం,  సరైన సమాచార వ్యవస్థ లేకపోవటం

2) హాజీ ఇలియాస్

3) ఘియాజుద్దీన్ తుగ్లక్

4) బెంగాల్ కామరూపను ఆక్రమించింది.

5) అల్లాఉద్దీన్ హుస్సేన్‌షా

## 30. జి

1) షంషుద్దీన్ షా

2) సికిందర్ అదేశానుసారం

3) ఆనకట్టలు నిర్మించుట, చెరువులు, కాలువలు త్రవ్వించుట

4) సికిందర్‌చే బయటకు పంపబడిన హిందువులందరిని వెనుకకు పిలిపించుట

# 31

# ఢిల్లీ సామ్రాజ్య విచ్ఛిన్నం ప్రాంతీయ రాజ్యాల ఆవిర్భావం

## 31.1 పరిచయం :

ఇంతకుముందు పాఠంలో మీరు ఫిరోజ్ షాతుగ్లక్ గురించి తైమూర్ దండయాత్ర గురించి తెలుసుకున్నారు. ఫిరోజ్‌షా తుగ్లక్ అనేక సంక్షేమ కార్యక్రమాలు, పరిపాలనా సంస్కరణలు చేపట్టినట్లు మీకు గుర్తుండే ఉంటుంది. అంతేగాక అతడు ఉలేమాల, కులీనుల సైన్యాధికారులను శాంతపరచుటకు ప్రయత్నించారు. అయితే, బలహీనమైన అతని వారసులు సామ్రాజ్యమును అవిచ్ఛిన్నంగా నిలబెట్టలేకపోయారు. క్షీణదశలో ఉన్న ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యానికి తైమూర్ దండయాత్ర ఒక ఆఖరి దెబ్బవంటిది. ఈ పాఠంలో మీరు ఫిరోజ్‌షా తుగ్లక్ సంస్కరణల మరియు తైమూర్ దండయాత్ర ఫలితాలను గురించి చదువుతారు.

క్రీ.శ. 1451-1526 వరకు లోడీ వంశం ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యమును పాలించినట్లు మీరు ఇంతకుముందే చదివారు. క్రీ.శ. 1489-1517ల మధ్య పాలించిన సికిందర్‌లోడీ ఈ వంశంలో గొప్పవాడు. అతని ఘన కార్యములను గురించి కూడా మీరు ఈ పాఠంలో చదువుతారు.

ఈ పాఠంలో ఇంకా మీరు కాశ్మీర్ పాలకుడైన జైనుల్ అబిదున్ విధానాల ప్రయోజనాలు, ఫలితాల గురించి కూడా తెలుసుకుంటారు. అతడు మత సహన విధానాన్ని అవలంభించాడు. ఆ విధానం వల్ల అతడు మహ్మదీయుల, మహ్మదీయేతరుల అభిమానమును పొందగలిగి కాశ్మీర్ అభివృద్ధికి అనేక అతి ముఖ్య చర్యలు చేపట్టగలిగాడు.

## 31.2 లక్ష్యాలు :

మీరు ఈ పాఠం చదివిన తరువాత మీరు కింది విషయాలు తెలుసుకుంటారు.

1. ఫిరోజ్ షా తుగ్లక్ సంస్కరణలు.
2. ఫిరోజ్ షా తుగ్లక్ సంస్కరణల ప్రభావాలు.
3. ఫిరోజ్ షా తుగ్లక్ ప్రభుత్వ వర్గంతోను, ఉలేమాలతోను పెట్టుకొన్న సంబంధాల ప్రభావాలు.
4. తైమూరు దండయాత్ర ఆర్థిక, సాంస్కృతిక ప్రభావాలు.
5. సికిందర్ లోడీ ఘన కార్యాలు.
6. జైనుల్ అబిదిన్ సంస్కరణలు, కాశ్మీర్ అభివృద్ధి మధ్య సంబంధం:

## 31.3 ఫిరోజ్‌షా తుగ్లక్ సంస్కరణల ప్రభావం:

ఇంతకుముందు పాఠంలోనే ఫిరోజ్‌షా తుగ్లక్ పాలన గురించి తెలుసుకున్నారు. ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్య సుస్థిరతకు అతడు చేపట్టిన అనేక చర్యలను గురించి కూడా తెలుసుకున్నారు. అతని పాలనా సంస్కరణలు ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యంపై ఎటువంటి ప్రభావంను చూపినవో విపులంగా తెలుసుకుందాం. ప్రభువర్గం అండతో సింహాసన మదిష్టించిన ఫిరోజ్‌షా వారితో 'బుజ్జగింపు విధానం' (appeasement policy) నవలంభించి వారి సహకారంను పొందదలిచాడు. అఫిఫ్ రాతల ప్రకారం, ఫిరోజ్‌షా ప్రభువర్గానికి ఉదారంగా భూ ఇనాంలిచ్చాడు. అంతేగాక ఎవరైనా ప్రభువర్గంలోని వారు మరణిస్తే ఆ భూమి అతని కుమారునికి గాని, కుమారులు లేనట్లఇయతే అతని అల్లుడికిగాని చెందుతుందని ఆజ్ఞాపించాడు. అల్లుడులేనట్లయితే అతని బానిసకు చెందుతుందని చెప్పబడింది. అల్లాఉద్దీన్ ఖిల్జీ విధానానికి, ఈ విధానానికి చాలా తేడా ఉందని మీరు గమనించవచ్చు. అల్లా ఉద్దీన్ జీతాలకు బదులుగా ఎటువంటి భూ కేటాయింపులు చేయలేదు. అటువంటి కేటాయింపులు తిరుగుబాటు కేంద్రాలవుతాయని అతడు గుర్తించాడు.

అల్లావుద్దీన్ ఖిల్జీ మరియు మహ్మద్ బీన్ తుగ్లక్ ప్రవేశపెట్టిన అనేక పద్ధతులను ఫిరోజిషా తుగ్లక్ రద్దుచేశాడు. వాటిలో అతి ముఖ్యమైనది సిద్ధ సైన్యం (Standing Army) నిలిపే విధానంను అతడు ఎత్తివేశాడు. దాని బదులుగా అతడు వంశపారంపర్య సైన్యంను ఏర్పాటుచేశాడు. సైనికులకు గ్రామీణ ప్రాంతాలలో భూకేటాయింపులు (ఇనాంలు) జరుపబడేవి. ఈ ఇనాంలు ప్రభువర్గం విషయంలో మాదిరిగానే వంశపారంపర్య హక్కుతో ఇవ్వబడేవి. ప్రతి అమీర్‌కు, ఖాన్‌కు, మాలిక్‌కు తన పర్యటనలో సాయపడే అనేకమంది సిబ్బంది, సేవకులుండేవారు. అఫిఫ్ ప్రకారం, సైనికులు వారి కిష్టమైన జీవితంను గడిపారు. వారి జాగీర్ల నుండి వారిని ఎప్పుడూ తొలగించకపోవడం వల్ల సుల్తాన్ గురించి వారికి ఎటువంటి భయంలేదు. సైనికులు వారికి వారసత్వ హక్కుగా ఇవ్వబడిన జాగీర్ల నుండి శాశ్వత ఆదాయం లభిస్తుందని తెలుసుకున్నారు. దాంతో వారు వారి అత్యధిక సమయం వారికి కేటాయించిన జాగీర్ గ్రామాలలో శిస్తు వసూలుపైనే వెచ్చించారు. ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యంనకు వెన్నెముకగానున్న సైన్యం తన సామర్థ్యంను కోల్పోయి క్రమశిక్షణారాహిత్యానికి లోనయింది. సైనికపాలన చాలా సరళమై ప్రతి స్థాయిలో అవినీతి చోటు చేసుకొంది. (అదనపు సమాచారం కూడా చూడండి).

ఫిరోజ్ షా తుగ్లక్‌కు బానిసలను నియమించడానికి ఇష్టపడేవాడని మీరు ఇంతకుముందు చదివారు. ఫిరోజ్ వారిని తన అధికారానికి మౌలిక మద్దతుగా చేసుకున్నాడు. అతడు బానిసల శిక్షణ కోసం ఒక ప్రత్యేక శాఖను ఏర్పరచాడు. ఫిరోజ్ అధికాలలో ఉండగా వారు విలాస జీవితాన్ని గడిపి, సంపదను కూడబెట్టారు. అంతేగాక సుల్తాన్ నుండి వారు అనేక ప్రత్యేక రాయితీలు పొందారు. ఫిరోజ్ మరణానంతరం వీరు రాజ్యానికి అవిధేయులుగా మారారు. వారి గురించి సమకాలీన పద్యం ఒకటి ఈ విధంగా చక్కగా వర్ణించింది. "రాజు యొక్క ప్రతిబానిస ఒక రాజే. ప్రతి బానిసకు ఏనుగులు, సైన్యాలుంటాయి. అంతేగాక అతడు ఒక ఛత్రధారి".

మహ్మద్ సుల్తాన్ నిర్లక్ష్యం చేసిన ఉలేమాలకు కూడా ఫిరోజ్ అనేక రాయితీలిచ్చాడు. ఉలేమాలు విధాన నిర్ణేతలు కానప్పటికీ వారికి జాగీర్లు ఇవ్వబడినవి. అంతేగాక దర్బారులో వారు ఉన్నత స్థానాలు పొందారు. వారిని సుల్తాన్ తన సలహా మండలిలోకి తీసుకోవడం వల్ల వారి అధికారం, హోదా పెరిగాయి. ఉలేమాల అనుమతితో సుల్తాన్ బ్రాహ్మణులు పై 'జిజియా' పన్ను విధించినట్లు మీకు గుర్తుండే ఉంటుంది. చివరికి, ఉలేమాలు మహ్మదీయులకు మత బోధ చేసే ఒక బ్రాహ్మణుని బహిరంగంగా దహనం చేయమని చెప్పినా వ్యతిరేకించలేదు. కొందరు పండితుల అభిప్రాయం

ప్రకారం ఫిరోజ్‌షా ఉదార స్వభావం మహ్మదీయులకే పరిమితం అయింది. నిజానికి షాహిలు, మహ్మదీయ అసమ్మతి వాదులు కూడా అతని అభిమానమునకు దూరమయ్యారు.

ఫిరోజ్ షా సుల్తాన్ షరియత్ (Shariat) న్యాయ సూత్రాలనుసారం పాలించాడు. 'షరియత్' అనుమతించిన ధనమే కోశాగారమునకు చేరాలి. కాబట్టి అతడో ఖరోజ్ (Kharoj) ఖామ్స్ (Khams) జకత్ (Zakat), జిజియా (Jaziya) వంటి పన్నులను అనుమతించాడు. షరియత్ ప్రకారం ఖామ్స్ (యుద్ధంలో కొల్లగొట్టినది)లో 1/5 వంతు సుల్తాన్‌కు చెందవలసి ఉండగా 4/5వ వంతు సైన్యంలోని సభ్యులకు పంచబడుతుంది. అల్లాఉద్దీన్ ఖిల్జి దీనికి పూర్తి భిన్నంగా అమలుచేశాడు. సుల్తాన్‌కు 4/5వ వంతు చెందాల్సి ఉండగా 1/5వ వంతు మాత్రమే సైన్యానికి చెందేది. షరియత్ సూత్రాల ప్రకారం ఫిరోజ్‌షా తుగ్లక్ దానిని సరిదిద్దాడు.

'షరియత్' న్యాయ సూత్రాల ప్రకారం ఫిరోజ్‌షా తుగ్లక్ న్యాయపాలన చేయ ప్రయత్నించాడు. అతడు 'ఖాజీ' మరియు ఉలేమాల సలహాలను గౌరవించాడు. ఫతుహత్-ఫిరోజ్-షాహి (Fatuhat-i-Firuz shahi) ప్రకారం అమానవీయ శిక్షలన్నీ 'షరియత్'కు వ్యతిరేకమని ప్రకటించాడు. మహ్మదీయులకు మరణశిక్షలను రద్దుచేశాడు. బరానీరాతల ప్రకారం మరణశిక్షలు కేవలం తిరుగుబాటుదారులకు మాత్రమే విధించబడేవి.

ఫిరోజ్‌షా తుగ్లక్‌యుద్ధాలు, దండయాత్రలకన్నా తన ప్రజల యదార్ధ (భౌతిక) అభివృద్ధిని కాంక్షించాడు. అఫిఫ్ అనే చరిత్రకారుని ప్రకారం, వ్యవసాయాభివృద్ధి కొరకు సుల్తాన్ రెండు కాలువలు త్రవ్వించాడు. మరొక చరిత్రకారుడు యాహ్యాబీన్ అహ్మద్ సర్ హింది (Yahya bin Ahmaud Sirhindi) ఢిల్లీలో నేటికీ నాలుగు కాలువలున్నాయని అభిప్రాయపడినాడు. అతడు, వ్యవసాయాభివృద్ధికి ఆనకట్టలు, చెరువులు, బావులు కూడా నిర్మింపచేశాడు. ఈ చర్యలవల్ల ఉత్పత్తి పెరిగి కరువు కాటకాలను ఎదుర్కొనే పరిస్థితి వచ్చింది. దీనివల్ల కాలువల వెంట జనావాసాలు (setlements) పెరగసాగాయి. భూమి శిస్తు కూడా నిర్ణయించబడింది. దీనివల్ల రైతులు తాము పన్ను రూపంలో ఎంత జమచేయాలో ముందే తెలిసింది. పన్ను వసూలు విషయంలో అతడు ఉదారంగా ఉండేవాడు. ఉలేమాల అనుమతితో పంటలో 1/10వ వంతు నీటి పారుదల పన్నుగా విధించడం జరిగింది. ఉత్పత్తుల అమ్మకానికిగాను ప్రభుత్వ నియంత్రణలో మార్కెట్లు కూడా ఏర్పాటుచేయబడినవి. ఆఫిఫ్ చెప్పినట్లు ప్రజల గృహాలు ధాన్యంతో, గుర్రాలతో, విలాస వస్తువులతో నిండి ఉన్నవి. బంగారం, వెండి లోహాలకు కొదవలేదు. ఆఫిఫ్ రాతల కొంత అతిశయోక్తితో కూడినవే అయినప్పటికీ, రైతులు సిరిసంపదలతో ఉన్నారనేది స్పష్టం. దీనిని బట్టి వినియోగ వస్తువులకు కొందవలేదని, అవి చాలా చౌకగా ఉన్నాయనేది మాత్రం తెలుస్తుంది. ఫిరోజ్ తుగ్లక్ కొన్ని ద్రవ్య (Currency) సంస్కరణలను కూడా ప్రవేశపెట్టాడు. అతడు తక్కువ విలువగలిగిన నాణెములను ప్రవేశపెట్టాడు. దానివల్ల వ్యాపార వాణిజ్యంలకు ప్రోత్సాహం లభించింది.

మహ్మద్ బీన్ తుగ్లక్ విధానాలవల్ల నష్టపోయిన ఇబ్బందులు పడిన వారికి సుల్తాన్, ప్రభుత్వ ఖజానా నుండి ఆర్థిక సాయమందించాడు. రాజ్యానికి వారు చెల్లించవలసిన ఋణాలను రద్దుచేశాడు. ఫిరోజ్‌షా తుగ్లక్ నిరుద్యోగులకు ఉపాధి కల్పించేందుకు దివాన్-ఇ-భారత్ అనే ఒక ఉపాధి కల్పనా కేంద్రం (employment bureau) (Diwan-i-Kharat) ఏర్పాటుచేశాడు. ఈ శాఖ మహ్మదీయ వింతంతువులు, అనాధలకు ఆర్థిక సాయం చేసేది. అంతేగాక పేద మహ్మదీయ బాలికల వివాహానికి సాయమందించేది. ఆఫిప్ ప్రకారం, ఈ శృాఖ ప్రతి యేటా 4,200 మందికి సాయం చేసినట్లు తెలుస్తుంది. దార్-ఉల్-షఫా (Dar-Ul-Shafa) అనే ధార్మిక ఆసుపత్రిని కూడా సుల్తాన్ ప్రారంభించాడు. దీనిలో రోగులకు ఉచిత మందులు, ఆహారం సరఫరా చేసేవారు.

అనేక సంస్కరణలవల్ల సుల్తాన్ మంచి పేరు ప్రఖ్యాతులు సంపాదించుకొన్నాడుగాని, అతని ఉదార స్వభావం, అతిమంచితనం, పరిపాలనా సామర్థ్య లేమి వల్ల రాజ్యం బలహీనమైంది. ఈ సంస్కరణలు శాశ్వతంగా నిలబడలేదు. సరికదా పరిపాలనా విధానంను కూడా సుస్థిరపరచలేదు. ఈ సంస్కరణల పట్ల వ్యతిరేకత పెరిగి తుగ్లక్ వంశానికి ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యంనకు ముప్పు తెచ్చింది. పర్యవసానంగా ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్య విచ్ఛిన్న ప్రక్రియ ప్రారంభమై కాలక్రమేణా శక్తివంతమైన నూతన ప్రాంతీయ రాజ్యములు తెరపైకి వచ్చాయి. అటువంటి ప్రాంతీయ రాజ్యాలలో బెంగాల్, జోన్‌పూర్, గుజరాత్, మాళ్వా వంటివి ముఖ్యమైనవి.

ఫిరోజ్ షా తుగ్లక్ ప్రాజ్ఞ పాలకుడు. ఐతే అతని ఉదాసీన వైఖరి విచ్ఛిన్నకర శక్తులను అడ్డుకొనలేకపోయాయి. అధికారం అవినీతికర కులీనుల మరియు కఠిన ఉలేమల చేతిలోకి పోయింది. అతని మరణానంతరం ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యంలో అంతర్యుద్ధాలు అనేక అలజడులు చెలరేగాయి.

## 31.ఎ. పాఠ్య ప్రశ్నలు

1. ఏ న్యాయ శాస్త్ర గ్రంథం ప్రకారం ఫిరోజ్ తుగ్లక్ పన్నులు విధించాడు?
2. అల్లాఉద్దీన్ ఖిల్జీ సైనిక విధానం కన్నా ఫిరోజ్ తుగ్లక్ సైనిక విధానం ఏ విధంగా భిన్నమైంది?
3. 'ఫిరోజి బానిసలు' మొగలు సామ్రాజ్య పతనానికి ఏ విధంగా కారకులయ్యారు?

### తైమూరు దండయాత్ర ప్రభావాలు :

సుల్తాన్ నసీరుద్దీన్ మహ్మద్ పాలనా కాలంలో తైమూర్ ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యంపై దండెత్తినట్లు మీరు ఇంతకుముందు చదివారు. బలహీనమైన సుల్తాన్‌కు తైమూర్‌కు పొంతనేలేదు. తైమూర్ సైన్యాలు అతి త్వరలో ఢిల్లీని ఆక్రమించాయి. తైమూర్‌కు భారత్‌లో శాశ్వతంగా ఉండిపోవాలనే ఉద్దేశ్యం లేనే లేదని మీకు గుర్తుండే ఉంటుంది. అతడు ఢిల్లీ సుల్తానుల అమూల్య సిరిసంపదలను కొల్లగొట్టడమే ధ్యేయంగా పెట్టుకొన్నాడు. అతడు భారతదేశంలో కేవలం 15 రోజులే మకాం వేశాడు. ఐతే అని దండయాత్ర ప్రభావాలు మాత్రం చాలా ప్రాధాన్యమైనవి.

తైమూర్ దండయాత్ర తుగ్లక్ వంశంను, ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యమును చావు దెబ్బతీసింది. ఢిల్లీ సుత్తాన్ సామ్రాజ్యం, ఫిరోజ్‌షా బలహీన వారసుల ఏలుబడిలో పతనం కాసాగింది. తైమూర్ దండయాత్ర దాని ఆఖరి దెబ్బతీసింది. ఢిల్లీ సుల్తానులు పంజాబ్‌పై పట్టుకోల్పోగా తైమూర్ ప్రతినిధి, ముల్తాన్ పాలకుడు పంజాబ్‌ను ఆక్రమించాడు. తుగ్లక్ వంశ పతనానంతరం, అతడు ఢిల్లీని ఆక్రమించి, ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్య పాలకుడయ్యాడు. అతడు సయ్యద్ వంశ పాలనకు శ్రీకారం చుట్టాడు. మీరు ఇంతకుముందే ఈ వంశం గురించి చదివి ఉన్నారు.

తైమూర్ దండయాత్ర ఢిల్లీ సుల్తానుల సామ్రాజ్యంలో గందరగోళం సృష్టించింది. సుల్తాన్ గుజరాత్‌కు పారిపోయాడు. ప్రభువులు స్వీయ రక్షణ కోసం వివిధ ప్రాంతాలకు పారిపోవడంతో పరిపాలన మొత్తం స్థంభించింది. ఢిల్లీ ప్రజలు తైమూర్ ఆగ్రహాన్ని కళ్ళారా చూడవలసి వచ్చింది. తైమూర్ భారతదేశంలో ఉన్నన్నినాళ్ళు దోపిడీ, ఊచకోతలు కొనసాగాయి. అతడు ఎక్కడికెళితే అక్కడ ఊచకోతకు ఆజ్ఞాపించేవాడు. మరణించిన వారిలో హిందువులు, మహ్మదీయులు, పిల్లలు, మహిళలు ఉన్నారు. అనేకమంది ప్రజలను బానిసలుగా పట్టుకొన్నారు. ఈ పరిస్థితులలో తమను క్రూరమైన విదేశీ దండయాత్రీకుల నుండి కాపాడలేకపోయిన ఢిల్లీ సుల్తానులపై ప్రజలు నమ్మకాన్ని కోల్పోవటం సహజమైన

విషయం. కేంద్ర అధికారం వైఫల్యం కావడంతో ప్రాంతీయ పాలకులు కూడా తమకు తాము స్వాతంత్ర్యం ప్రకటించుకున్నారు. గుజరాత్‌లో జాఫర్‌ఖాన్ (ముజఫర్ షా) జోన్‌పూర్‌లో మాలిక్ సర్వార్, మాళ్వాలో దిల్వార్‌ఖాన్ ఢిల్లీకి తమ మద్దతును ఉపసంహరించారు. వారు వారి వారి స్వతంత్ర రాజవంశీలను స్థాపించిన విషయాన్ని మీరు ఇంతకుముందే చదివారు.

ఈ దండయాత్రలో ఢిల్లీ ఆర్థిక వ్యవస్థ కూడా దివాళా తీసింది. తైమూర్ అపార ధన రాశులను కొల్లగొట్టుకుపోయాడు. అతడు తరలించలేని వాటిని నాశనం చేశాడు. ఢిల్లీ వైభవం అడుగంటింది. కోశాగారము మొత్తం కొల్లగొట్టబడింది. స్థానిక రాజులు కప్పం చెల్లించడం నిలపివేశారు. సుల్తాన్ పాలన క్షామానికి గురైంది.

తైమూర్‌కు సంబంధించినంతవరకు చూస్తే, ఈ దాడి ద్వారా అతడు అమితంగా లాభపడ్డాడు. సమకాలీన పాలకులలో అతని హోదా, పలుకుబడి, గౌరవం ఇనుమడించాయి. భారత్ నుండి కొల్లగొట్టిన ధనంతో సమర్‌ఖండ్ సుసంపన్నమయింది. తైమూర్ దండయాత్ర భారత్ మరియు మధ్య ఆసియా వాస్తు కళారీతులను సమ్మిళితం చేసింది. తైమూర్ అనేక ప్రాచీన భారతీయ కట్టడాలను దేవాలయాలను కూల్చినప్పటికీ భారతీయ శిల్ప కళ మరియు చిత్రకళలకు అతడు ముగ్ధుడయ్యాడు. భారతదేశం నుండి ఎందుకు కళాకారులను సమర్‌ఖండ్‌కు తరలించాడు. వీరు అక్కడ సమర్‌ఖండ్ నగరాన్ని ముస్తాబు చేయడానికి అనేక భవనాలు నిర్మించారు. భారత శిల్ప, చిత్ర కళలు మధ్య ఆసియా కళలను ప్రభావితం చేశాయి. భారత్– మధ్య ఆసియా మధ్య సాంస్కృతిక సంబంధాలు ఏర్పడినవి.

బాబర్ స్వీయ చరిత్ర 'తుజుకీ–బాబరీ' ఆధారంగా కొందరు పండితులు "1526లో బాబర్ భారతదేశంపై దండెత్తడానికి కారణం తైమూరు పూర్వం ఆక్రమించిన ప్రాంతాలు తన వారసత్వ ఆస్థిగా భావించడమే" అని అంటారు.

ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్య పతనాన్ని తైమూర్ దండయాత్ర త్వరితం చేసింది. ప్రజలు ఢిల్లీ సుల్తాన్‌పై నమ్మకం కోల్పోగా స్థానిక పాలకులు సామ్రాజ్యంనకు తమ అండను, సహకారంను ఉపసంహరించారు. ఢిల్లీ యొక్క అపార సిరిసంపదలను తైమూర్ సమర్ఖండ్‌కు తరలించాడు.

## 31 బి. పాఠ్య ప్రశ్నలు

1. తైమూర్ దండయాత్ర ముఖ్యోద్దేశం ఏమి?
2. ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యంపై తైమూర్ దండయాత్ర రాజకీయ ప్రభావం ఎట్టిది?
3. భారత్‌లో తైమూర్‌ను మెప్పించినవి ఏవి?

## 31.5 సికిందర్ లోడీ ఘన కార్యాలు:

లోడీ వంశం గురించి మీరు ఇంతకుముందు పాఠంలో చదివారు. లోడీ వంశ పాలకులలో సికిందర్ లోడీ అగ్రగణ్యుడు. అతడు క్రీశ. 1489 నుండి 1517 వరకు పాలించాడు. అతడు తన సౌశీల్యం మరియు కృషితో సుల్తాన్ హోదాను, గౌరవాన్ని పెంచగలిగాడు. పరిపాలనలో క్రమశిక్షణను పునఃప్రతిష్ఠించాడు. అతడు ప్రవేశపెట్టిన అనేక సంస్కరణల మూలంగా ప్రభువర్గంలోను, ప్రజలలోను క్రమశిక్షణ అలవడింది.

ఢిల్లీ సింహాసనమధిష్టించక ముందు అతడు 'సర్‌హింద్' (Sirhind) గవర్నర్‌గా నుండెను. సుల్తాన్ బహ్లోల్ లోడీ రాజధానిలో లేని సమయంలో అతడు కేంద్ర ప్రభుత్వ పాలనను పర్యవేక్షించేవాడు. ఆ విధంగా సికందర్‌లోడీ సైనిక, పరిపాలనా విషయాలలో అనుభవం గడించాడు. సమర్థవంతంగా పాలన సాగించాలంటే కేంద్రీకృత పరిపాలన

అవసరమని సికిందర్ లోడీ తెలుసుకున్నాడు. అతడు గొప్ప అధికారంలను పొంది నిరంకుశంగా పాలించాడు. బహ్లోల్‌లోడి అనుసరించిన రాజరిక సిద్ధాంతానికి అతడు తిలోదకాలిచ్చాడు. ఆఫ్ఘన్ సర్దారులకు తానే నాయకుడుగా సికిందర్ లోడీ భావించాడు. సుల్తాన్ అధికారాన్ని, హోదాను అంగీకరించమని అతడు ఆఫ్ఘన్ సర్దారులపై ఒత్తిడి పెంచాడు. వారు సుల్తాన్ కంటె అల్పహోదాగలవారేనని వారు వారి హోదాను అధికారాన్ని సుల్తాన్ దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి అనుభవిస్తున్నారే విషయాన్ని తెలిసేలా చేశాడు. సుల్తాన్ వారికంటే ఎంతో ఉన్నతమైన వాడని గరవ్నర్లకు అర్థమయ్యేలా చేశాడు. కులీనులు దర్బారులోపల, బయటా సుల్తాన్‌ను గౌరవించాలని ఆజ్ఞాపించాడు. ఆ విధంగా అతడు కులీనులలో క్రమశిక్షణను అమలుచేసి వారి ప్రాబల్యం, పెరుగుదలపై నియంత్రణ విధించాడు.

సికిందర్ ఫార్మనాలిచ్చే పద్ధతి చేపట్టాడు. ప్రజలు సల్తాన్ ఆజ్ఞలను తెలుసుకొనే విధంగా ఫర్మానాలను ముఖ్య బహిరంగ ప్రదేశాలలో చదివేవారు. కులీనులు ఫర్మానాల జారీ గురించి తెలిసినపుడు ఆ ఫర్మానాలను అందుకోవడానికి వారు వారి పట్టణాలకు 4, 5 మైళ్ళ దూరం వెళ్ళవలసి ఉంటుంది. ఆ ఫార్మనాలను ప్రజా సమావేశాలలో రాజు యొక్క వార్తాహరుడు లేదా స్థానిక అధికారి సమక్షంలో చదవటం జరిగేది. కులీనులు ఫర్మానాలను అనుసరించాలని కఠినంగా ఆజ్ఞాపించడం జరిగింది. దీనివల్ల సుల్తాన్ హోదా, గౌరవం పెరగటమేగాక సుల్తాన్ ఎంతో శక్తివంతుడని ప్రజలకు అర్థమయింది.

సికిందర్ లోడీ అజ్ఞానుసారం సర్దారుల మరియు అధికార్ల పద్దులను తనిఖీ చేయడం జరిగింది. ప్రభుత్వ నిధుల దుర్వినియోగం, దారిమళ్ళింపు, లంచగొండితనం, అవినీతి వంటి విషయాలపై సుల్తాన్ కఠిన వైఖరి అవలంభించాడు. సుల్తాన్ గూఢచారి దళాన్ని బాగా పెంచాడు. దీనివల్ల అతనికి సామ్రాజ్యం నలుమూలల నుండి వార్తలు అందుకొనే అవకాశం కలిగింది. మారువేషంలో వెళ్లి అతడు ఉలేమాల, కులీనుల, వివిధ ప్రభుత్వ అధికారుల కార్యకలాపాలను పరిశీలించాడు.

తన పరిపాలనను మరింత సమర్థవంతం చేయడానికి అతడు ఒక ద్వంద్వ (dual) విధానమును ప్రవేశపెట్టాడు. అతని సోదరులను నియంత్రించడానికి విధేయులైన కొందరు అధికార్లను వారి వారి ప్రాంతాలలో నియమించాడు. జమిందారులను నియంత్రణలో ఉంచటానికి అక్కడక్కడ సైనిక శిబిరాలను ఏర్పాటుచేశాడు. తనపై కుట్రలు చేయ ప్రయత్నించిన కులీనులను కఠినంగా శిక్షించే పద్ధతిని అతడు ప్రవేశపెట్టాడు. అతడు ఎంత బలశాలి అయినప్పటికీ ఏ సర్దారును తమ ఇక్తాల నుండి తొలగించలేదు సరికదా అనవసరంగా ఎవరినీ శిక్షించలేదు.

న్యాయ పాలనా విషయంలో సికిందర్ లోడీ అత్యంత శ్రద్ధ వహించాడు. అతడు ఉలేమాల సలహాలను స్వీకరించేవాడు. 'షరియత్' సూత్రాలకనుగుణంగా న్యాయపాలన చేశాడు. ఏదైనా నేరం జరిగినపుడు నేరస్థుని త్వరితంగా గుర్తించడానికి ఏర్పాట్లుచేశాడు. అతడు తక్షణ మరియు నిష్పక్షపాత న్యాయాన్ని అందించే ఏర్పాటు చేశాడు. శిక్షలు కఠినంగా ఉన్నప్పటికీ ఒక్కొక్కసారి నేరస్తుడు అమాయకుడని అనిపిస్తే మందలించి వదిలివేయడం జరిగేది. ధనం దుర్వినియోగం విషయంలో మాత్రం అతడు అతి కఠిన శిక్షలు విధించేవాడు. అధికారుల క్రూరత్వానికి రైతులు, సామాన్య ప్రజానీకం బలి కాకుండా రక్షించే విధానాన్ని సుల్తాన్ అభివృద్ధి చేశాడు. అతని పర్యటనలో ఏదైనా ఫిర్యాదులు, అర్జీలు వచ్చినప్పుడు వాటిని అప్పటికపుడు పరిష్కరించేవాడు.

సికిందర్ లోడీ మార్కెట్ ధరలను ఎప్పటికప్పుడు నియంత్రించేవాడు. నిత్యావసర వస్తువుల ధరల విషయంలో అత్యంత శ్రద్ధ వహించేవాడు. నిత్యావసర వస్తువులు చాలా చౌకగా ఉండేవి. ఈ విషయం తారిఖ్–ఇ–దౌది (Tarikh-

I-Daudi)లో వివరించబడింది.

వ్యవసాయాభివృద్ధి విషయంలో సికిందర్‌లోడీ అత్యంత శ్రద్ధ కనబరిచాడు. భూమిని సర్వే చేయించి, కొలిపించేవాడు. ఆ తర్వాత చాలా కాలం వరకు కొనసాగిన ఒక ప్రామాణిక కొలత సాధానాన్ని (Standard measure) అతడు భూమి కొలతకు ప్రవేశపెట్టాడు. ఆ కొలత సాధనాన్ని గజ్–ఇ–సికిందరి (Gazz-i-Sikandari) అనేవారు. భూమిశిస్తును కూడా సుల్తాన్ నిర్ణయించేవాడు. దీనివల్ల రైతుల స్థితిగతులు మెరుగయ్యాయి. క్రీ.శ. 1495లో కరువు సంభవించినపుడు సుల్తాన్ వార్షిక పన్నును రద్దుచేశాడు. దానివల్ల సామ్రాజ్యంలో ధాన్య సరఫరా సులభతరం చేయబడింది. క్రీ.శ. 1505లో భూ కంపం సంభవించినపుడు ప్రజలకు తగు సహాయమందించాడు.

అతడు సంస్కృత గ్రంథాలైన మహాభారతం, రాజ తరంగిణి వంటి వాటిని పర్షియన్ భాషలోకి అనువదింపజేశాడు. అదేవిధంగా అనేక అరబిక్ మరియు పర్షియన్ గ్రంథాలను సంస్కృత భాషలోకి అనువదింపజేశాడు. అతడు స్వయంగా కవి. ఖుతుబ్ (Qutb) అనే కలం పేరుతో అతడు కవిత్వాలు రాశాడు. అతడు సంగీతం, నృత్యం మరియు ఇతర లలిత కళలపట్ల అత్యంత ఆసక్తి కనబరిచేవాడు. అతని సంగీతాసక్తిని తెలుసుకున్న గ్వాలియర్ రాజు రెండు అరుదైన సంగీత గ్రంథాలను ఆయనకు బహుమానంగా అందించాడు.

సుల్తాన్ జైనుల్ అబిదిన్ (Zainul Abidin) సామాన్య ప్రజల సంక్షేమంపట్ల అత్యంత శ్రద్ధ వహించాడు. అందువల్ల అతడు రాజ్యం ఆర్థికాభివృద్ధిపట్ల అత్యంత ఆసక్తి చూపాడు. వ్యవసాయాభివృద్ధి కొరకు అతడు ఆనకట్టలను నిర్మించి, కాలువలు తవ్వించాడు. వ్యవసాయ భూమిని సర్వేచేయించి దానిని ఒక రికార్డు రూపంలో భద్రపరిచాడు. రైతుల పట్ల ఉదారంగా, నీతిబద్ధంగా ఉండమని అధికారులకు సూచించాడు. కరువు కాటకాల మరియు ఇతర ప్రకృతి వైపరీత్యాల సమయంలో రైతులను ఆదుకునేందుకు ధాన్యం మరియు పశువుల మేతను సమకూర్చేవాడు.

అబిదున్ సుల్తాన్ అనేక ద్రవ్య సంస్కరణలన ప్రవేశపెట్టాడు. రాగి, వెండి నాణెములను జారీ చేశాడు. సుల్తాన్ విపణి నియంత్రణ విధానం (market control system)ను ప్రవేశపెట్టి వినియోగవస్తువుల ధరలను నిర్ణయించాడు. వర్తక, వ్యాపారులు వస్తువులను నిర్ణయించిన ధరకే అమ్మాలని చెప్పాడు. రాజ్యంలో కొరతగా నున్న వస్తువుల దిగుమతిపై కొన్ని రాయితీలను ప్రకటించాడు. ఉప్పు కొరతను తట్టుకొనేందుకు దానిని లడక్ నుండి దిగుమతి చేసుకొని వ్యాపారుల వీలైనంతమేర ఆదుకున్నాడు.

రాజ్యంలో చేతివృత్తుల అభివృద్ధికి సుల్తాన్ శ్రద్ధ వహించాడు. కాగితపు తయారీ మరియు వస్తువుల బైండింగ్‌లో శిక్షణకు కొందరు వ్యక్తులను సమర్ ఖండ్‌కు పంపాడు. రాతిని తొలగించడం, నగిషీలు చెక్కడం, ఇంకా ఎన్నో ఇతర వృత్తులను సుల్తాన్ ప్రోత్సహించాడు. తివాచీలు, శాలువాల తయారీని ప్రవేశపెట్టాడు. నేటికీ కాశ్మీరీ శాలువాలు బహుళ ప్రసిద్ధి చెందినవి. ప్రజలు మంచి ఉపాధిని పొంది వారి ఆర్థిక పరిస్థితిని మెరుగుపరచుకొన్నారు. తత్ఫలితంగా రాజ్యం అభివృద్ధి చెందింది. సుల్తాన్ జైంగీర్ (Zaingir), జైన్‌కెట్ (Zainket) జైన్‌పూర్ (Zainpur) వంటి పట్టణాలను స్థాపించాడు. డాల్ సరస్సులో నేటికీ కనిపించుచ్చు దీవులను నెలకొల్పాడు. అతని రాజ భవనం, మసీదు నిర్మించబడిన ఊలూరు (Wulur) సరస్సులో నిర్మించిన కృత్రిమ దీవి జైన లంక (Zaina Lanka) అతని సాంకేతిక ఘన విజయానికి తార్కాణం.

జంతు హింసను వ్యతిరేకించే జైనుల్ అబిదిన్ సుల్తాన్ జంతువుల వేటను నిషేధించాడు. రంజాన్ మాసంలో అతడు మాంసాహారమును ఆపివేశాడు. అతడు ఒక సద్గుణ సంపన్నుడు.

బహ్లోల్ లోడీ, మహ్మద్ బెగారా (గ్వాలియర్ రాజు) వంటి పాలకులతోను ఇంకా మక్కా షరీఫ్‌లో సుల్తాన్ జైనుల్ అబిదిన్‌కు స్నేహ సంబంధాలుండేవి. కొందరు పండితుల అభిప్రాయం ప్రకారం అతని లక్ష్యాలు రాజకీయమైనవి కాక సాంస్కృతిక మరియు వ్యాపార సంబంధమైనవి.

దీనిని బట్టి, సుల్తాన్ జైనుల్ అబిదిన్ రాజ్య సర్వతో ముఖాభివృద్ధికి అవసరమైన చర్యలన్నీ తీసుకొన్నట్లు మనం చెప్పవచ్చు. తన సామ్రాజ్యంలో శాంతిభద్రతల నెలకొల్పడం వెనుక తన ప్రజల, మద్దతు సహకారాలు ఎంతగానో ఉపకరించినవి. అతని పాలనలో కాశ్మీర్ ఎంతో అభివృద్ధిని సాధించింది. నేటికీ కాశ్మీరీ పాలకుడు అతడు బాద్‌షా (Bad Shah) (మహారాజు)గా గుర్తిండిపోయాడు.

## 31 సి. పాఠ్య ప్రశ్నలు

1. సికిందర్‌లోడీ ____________________గా పాలించాడు.

1. నిరంకుశంగా 2. ప్రజానురంజకంగా

2. సికిందర్‌లోడీ ఎన్నో ____________________ గ్రంథాలను పర్షియన్ భాషలోకి అనువదించాడు (సంస్కృత, హిందీ)

2. సికిందర్‌లోడీ ప్రభుత్వంలో ద్వంద్వ పరిపాలనను ఎందుకు ప్రవేశపెట్టారు?

3. వ్యాపార వాణిజ్యాభివృద్ధికి సికిందర్ లోడీ ఎటువంటి చర్యలు ప్రవేశపెట్టాడు?

4. సికిందర్‌లోడీ ప్రవేశపెట్టిన భూమి కొలతకు ఉపయోగించే ప్రామాణిక సాధనం పేరు ఏమిటి?

## 32.6 జైనుల్ అబిదిన్ ఘన కార్యాలు :

కాశ్మీర్ భారతదేశపు ఉత్తర రాజ్యమని మీరు చదివారు. కాశ్మీర్ సహజ సౌందర్యాలకు పెట్టింది పేరు. క్రీ.శ. 14వ శతాబ్దం మధ్య వరకు ఈ ప్రాంతం హిందూ పాలకుల ఏలుబడిలో ఉంది. అంతర్గత సమస్యలవల్ల రాజ్యం బలహీనంగా నున్నప్పటికీ దాని భౌగోళిక ఉనికి మరియు కష్టతరమైన రవాణా దానిని విదేశీ దాడుల నుండి కాపాడినవి. అందువల్లనే ఢిల్లీ సుల్తానులు చాలాకాలం దానిని వశపరచుకోలేకపోయారు.

క్రీ.శ. 1346 ప్రాంతంలో షామీర్జా (Shah Mirza) అనే పర్షియన్ నాయకుడు హిందూ పాలకుని తొలగించి కాశ్మీర్ మహ్మదీయ పాలనకు అంకురార్పణ చేశాడు. షామీర్జా ఇంకా అతని వారసుల పాలనలో ఈ ప్రాంతంలో ఇస్లాం ప్రముఖ మతమయింది. షామీర్జా వారసులలో సికిందర్ షా (క్రీ.శ. 1410), జైనుల్ అబిదిన్‌లు ముఖ్యమైనవారు. జైనుల్ అబిదిన్ సుమారు 50 సంవత్సరాలు పాలించాడు. అతడు కాశ్మీర్ అభివృద్ధికి సామాన్య ప్రజానీకం సంక్షేమానికి కృషి చేశాడు.

సికిందర్ షా సనాతన మహ్మదీయుడని మీకు గుర్తుండే ఉంటుంది. అతని విధానాలవల్ల మహ్మదీయేతర ప్రజానీకం నరకం అనుభవించారు. అతనిని తొలగించి రాజ్యానికి వచ్చిన జైనుల్ అబిదిన్ దూరదృష్టిగల పాలకుడు. మహ్మదీయేతరుల సహకారం, మద్దతు లేకపోతే రాజ్యాభివృద్ధి సాధ్యం కాదని అతడు గుర్తించాడు. అతడు పరమత సహన విధానమును అవలంభించాడు. దాన్ననుసరించి సికిందర్‌షా కాలంలో కాశ్మీర్‌ను వదలివెళ్ళిన వారినందరినీ తిరిగి రమ్మని ఆహ్వానించాడు. బ్రాహ్మణుల ఇస్లాం మతాంతరీకరణను రద్దు చేశాడు. దేవాలయ నిర్మాణంపై ఆంక్షలన్నింటిని

తొలగించటమేగాక అంతకుముందు విధ్వంసం చేయబడిన అనేక దేవాలయాలను పునర్నిర్మించాడు. గోవధ నిషేధించటమేగాక జిజియా పన్నును రద్దుచేశాడు. ఆ విధంగా అతడు హిందువులకు పూర్తి స్వేచ్ఛనిచ్చాడు. హిందువులను అత్యున్నత పదవులలో నియమించటమేగాక వారితో వివాహ సంబంధాలు ఏర్పరచుకున్నాడు. తర్వాత కాలంలో ఇదే విధానాన్ని మొగల్ చక్రవర్తి అనుసరించాడు. కొందరు చరిత్రకారులు జైనుల్ అబిదిన్‌ను 'కాశ్మీర్ అక్బర్' లేదా అక్బర్‌కు 'మార్గదర్శకుడు' అని పిలుస్తారు.

సుల్తాన్ జైనుల్ అబిదిన్ ఒక గొప్ప సాహిత్య (సారస్వత) పోషకుడు. అతడు పర్షియన్, సంస్కృత పండితులకు ఇనాంలిచ్చాడు. అతడు స్వయంగా పర్షియన్, టిబెట్ భాషలలో పండితుడు.

## అభ్యాసం

1. సుల్తాన్ ఫిరోజ్‌షా తుగ్లక్ ప్రవేశపెట్టిన ఆర్థిక సంస్కరణలను అంచనావేయుము.
2. 'ఫిరోజ్ షా తుగ్లక్ బుజ్జగింపు విధానం ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యంను సుస్థిరపరచింది' అతడు తన ఆశయాలను నెరవేర్చుకొనగలిగాడా? మీ సమాధానంనకు కారణాలు వివరించండి.
3. ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యంపై తైమూర్ దండయాత్ర చావు దెబ్బతీసిందని నీవెట్లు చెప్పగలవు?
4. రాజ్య ఆర్థిక, సామాజికాభివృద్ధికి జైనుల్ అబిదిన్ ఎటువంటి చర్యలు చేపట్టారు?
5. ఆధునిక భారత మత సహన విధానంను జైనుల్ అబిదిన్ విధానంతో పోల్చుము, తేడాలు వివరించుము.
6. సుల్తాన్ హోదాను పునఃప్రతిష్టించటం కోసం సికిందర్‌లోడీ తీసుకున్న చర్యలు ఏవి?
7. ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్య పతనానికి సికిందర్‌లోడీ బాధ్యుడవుతాడా? కారణాలు రాయుము?

| ఫిరోజ్‌షా తుగ్లక్ బుజ్జగింపు విధానము నేటి భారతదేశానికి ఉపయోగకరమైనదేనా? |
|---|

## అదనపు సమాచారం

షమా సిరాజ్ ఆఫిఫ్ గ్రంథమగు 'తారిఖ్-ఇ-ఫిరోజ్ మనకు ఫిరోజిషా తుగ్లక్ గుర్తించిన ఎన్నో ఆసక్తికర పిట్టకథలు (anectodes) అందించుచున్నది. బరానీ రచించిన 'తరీఖ్-ఇ-ఫిరోజ్' పేరుతో ఉన్నప్పటికీ ఈ గ్రంథానికి ఎంతో తేడా ఉంది. ఈ గ్రంథం సరళమైన, వివరణాత్మక శైలిలో ఉంది. అది మోనోగ్రాఫ్ రూపంలో ఉండి ఫిరోజ్‌షా తుగ్లక్ పాలన గురించిన పూర్తి వివరాలను మనకందించుచున్నది.

ఆఫిఫ్, సైన్యం గురించి రాస్తూ, ఫిరోజ్‌షా తుగ్లక్ పాలనలో బానిసలు కాకుండా ఎనిమిది వేల అశ్వికదళం (గుర్రాలు) ఉన్నట్లు వ్రాశాడు. దివాన్-ఇ-అర్జ్ (Diwan-i-arz) కార్యాలయం ముందు హాజరుపరచిన గుర్రాలలో చాలా వరకు అంత నాణ్యమైనవి కాకపోయినప్పటికీ అవి సేవా యోగ్యమైనవిగా ఆమోదించడం జరిగింది. దీనికి సంబంధించిన సమాచారం సుల్తాన్‌కు చేరినా అతడు దానిని లక్ష్య పెట్టలేదు. సంవత్సరాంతం నాటికి చాలా మంది సైనికులు వారి వారి గుర్రాలను హాజరు పరచకపోవడంతో గుమాస్తాలు ఈ విషయాన్ని చక్రవర్తికి తెలియజేశారు. దానికి చక్రవర్తి వారికి రెండు మాసాల అదనపు సమయంను మంజూరు చేశాడు.

ఆఫిఫ్ దివాన్-ఇ-అర్జ్ వద్ద గుర్రాన్ని హాజరు పరచలేకపోయిన ఒక సైనికుని గురించి ఒక వృత్తాంతం

చెప్పాడు. సుల్తాన్ ఆ సైనికుణ్ణి ఎందుకు ఆ విధంగా చేయలేకపోయావని ప్రశ్నించాడు. దానికి సైనికుడు గుమాస్తాకు ఇవ్వవలసిన డబ్బు (లంచం) తన దగ్గర లేదని, గుర్రానికి ధృవ పత్రం పొందాలంటే తనకు ఒక బంగారు టంకా నాణెం అవసరమని బదులిచ్చాడు. వెనువెంటనే సుల్తాన్ తన నగదు అధికారిని గుమాస్తాకు లంచం ఇచ్చేందుకు సైనికునికి ఒక  బంగారు టంకా ఇవ్వమని ఆజ్ఞాపించాడు.

ఆఫిఫ్ కథనంను బట్టి మనకు సైన్య వ్యవస్థ అస్తవ్యస్తంగా ఉందని, అది కుళ్ళిన దానితో సమానమని అర్థమౌతుంది. సుల్తాన్ యొక్క అర్థం లేని దయా గుణం, ఉదాసీనత సైన్యాన్ని ఎంతగానో నిర్వీర్యం చేసిందని తెలుస్తుంది.

జైనుల్ అబిదిన్ ఒక ప్రాజ్ఞ (ఉదార) పాలకుడు. అతని విధానాలు కాశ్మీర్‌ను గొప్ప అభివృద్ధి పథంలో నడిపాయి. అతని పాలనలో పరమ సహనం అత్యున్నత స్థాయి నందుకొంది. జైనుల్ అబిదిన్ సారస్వత మరియు చేతివృత్తుల పోషకుడు. కాశ్మీర్ ఆర్థిక వ్యవస్థ కూడా అభివృద్ధి చెందింది.

## 31 డి.పాఠ్య ప్రశ్నలు

1. జైనుల్ అబిదిన్ సుల్తాన్ మత సహన విధానంను ఎందుకు అవలంభించాడు?
2. మత సహన విధానానికి జైనుల్ తీసుకొన్న చర్యలకు రెండు ఉదాహరణలిమ్ము.
3. జైనుల్ అబిదిన్ సుల్తాన్‌కు సారస్వతాభిలాష ఉన్నదని ఋజువు చేసే రెండు ఉదాహరణలిమ్ము?
4. జైనుల్ అబిదిన్ సుల్తాన్ కాలంలో ప్రవేశపెట్టిన రెండు చేతివృత్తులను వ్రాయుము?

## సారాంశం

సింహాసన మధిష్టించిన వెంటనే ఫిరోజ్ షా తుగ్లక్ సంక్షేమ కార్యక్రమాలకు, ఉలేమాల మరియు కులీనులు (ప్రభువర్గం)ను బుజ్జగించే కార్యక్రమానికి ప్రాధాన్యమిచ్చాడు. అతడు చేపట్టిన ఆర్థిక సంస్కరణలు ప్రజానీకంనకు ఎంతో మేలు చేశాయి గాని అవిశాశ్వతంగా నిలవలేదు. అతని ఉదార విధానం మరియు మత సంకుచిత విధానం (intolerance) తుగ్లక్ వంశ మరియు ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యపతనానికి కారణమయ్యాయి.

తైమూర్ దండయాత్ర ఉత్తర భారత రాజకీయ, సామాజిక మరియు ఆర్థిక జీవనం ప్రభావితమైంది. ఐతే అది తాత్కాలిక స్వభావం గలవి. తైమూర్ భారతదేశ సిరిసంపదలను, ధనరాసులను కొల్లగొట్టడంలో కృతార్థుడైనాడు. అతని దండయాత్ర భారతదేశంలో గందరగోళం సృష్టించింది. దానిని అనుకూలంగా తీసుకొన్న స్థానిక రాజ్యాలు స్వాంత్ర్యం ప్రకటించుకొన్నాయి. అతడు ప్రాజ్ఞ (ఉదార) పాలనను నెలకొల్ప పరిపాలనను కేంద్రీకరించాడు. అతడు గూఢచారి వ్యవస్థను పటిష్టం చేశాడు. న్యాయ పాలనటపట్ల అత్యంత శ్రద్ధ వహించాడు. అతడు కళలను సాహిత్యాన్ని పోషించాడు. కాని అతని మత సంకుచితత్వం (అసహన విధానము) సుల్తాన్ సామ్రాజ్య పతనంనకు చావుదెబ్బ అయింది.

జైనుల్ అబిదిన్ సుల్తాన్ పర మత సహన విధానంనవలంభించాడు. దానివల్ల కాశ్మీర్‌లో శాంతి భద్రతలు నెలకొల్పబడ్డాయి. అతడు సాహిత్యాన్ని, చేతివృత్తులను ప్రోత్సహించాడు. రాజ్య ఆర్థికాభివృద్ధికి అతడు వ్యవసాయం మరియు వాణిజ్యంలో అనేక సంస్కరణలు ప్రవేశపెట్టాడు.

**పాఠ్య ప్రశ్నలకు జవాబులు :**

**31 ఎ**

1. షరియత్ ప్రకారం.
2) అల్లావుద్దీన్ జీతాలిచ్చే పద్ధతి ద్వారా ఒక స్థిర సైన్యాన్ని నిర్వహించాడు. కాని ఫిరోజ్‌షా సైన్యం వారసత్వ ఆధారితం. ఈ పద్ధతిలో ఫిరోజ్‌షా వారికి ఇనాం లిచ్చేవాడు.
2. ఆ స్థాన రాజకీయాలలో కల్పించుకొని రాజు చర్యలను నిర్దేశించడం ద్వారా.

**31 బి**

1. కొల్లగొట్టడం ద్వారా సంపదను కూడగట్టుకోవడం.
2. ఢిల్లీ సుత్తాన్ సామ్రాజ్యం నుండి ప్రాంతీయ పాలకులు స్వతంత్రం ప్రకటించుకొన్నారు. ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్యం నుండి ప్రాంతీయ పాలకులు స్వతంత్రం ప్రకటించుకొన్నారు. ఢిల్లీ సుల్తాన్ సామ్రాజ్య పతనం త్వరితమైంది.
3. భారతీయ శిల్ప, చిత్రకళ.

**31.సి.**

1. నిరంకుశ
2. సంస్కృత
2. ప్రాంతీయ పాలకులు (గవర్నర్లు)పై నియంత్రణ విధించడానికి.
3. రహదారుల మరమ్మత్తులు, దోపిడీ దొంగల నుండి రక్షణ.
4. గజ్–ఇ–సికిందర్.

**31. డి.**

1) హిందువులను, మహ్మదీయేతరులను తృప్తిపరచుటకు.
2) కాశ్మీర్‌ను వదలివెళ్ళిన హిందువులను తిరిగి వెనుకకు పిలవటం, దేవాలయాలను పునర్నిర్మించటం, గోవధను నిషేధించడం, హిందువులకు ఉన్నతోద్యోగాలివ్వడం..
3. మహాభారతం, రాజతరంగిణిలను పర్షియన్ భాషలోకి అనువదించడం.
4. పుస్తకాలను బైండింగ్ చేయడం, రాతిని తొలగించడం, శాలువాలు తయారీ, తివాచీలు నేయటం (ఏవైనా రెండు.)

# 32

# విజయనగర, బహమనీ రాజ్యాలు(1)

## 32.1. పరిచయం

మనం తుగ్లక్ సామ్రాజ్యం పతనమైందని, ఈ ప్రక్రియ దక్షిణ భారతదేశంలోని చాలా ప్రాంతాలు స్వతంత్రమైనవని చదివాం. ఇట్లు దక్షిణ భారత్‌లో బహమనీ, విజయనగర అనే రెండు రాజ్యాలు వెలిశాయి. వీనిని గూర్చి ఈ పాఠంలో చదువుతాం.

## 32.2 లక్ష్యాలు :

ఈ పాఠం చదివిన తరువాత ఈ విషయాలు తెలుసుకుంటాం.

1. ఢిల్లీ సుల్తానత్ విచ్ఛిన్నం, దక్కన్‌లు స్వతంత్ర రాజ్యాల ఆవిర్భావం.
2. బహమనీ రాజ్యస్థాపన.
3. దక్కన్‌లో విజయనగర రాజ్యం శక్తివంతమైనదిగా ఎదగడం.
4. రాయచూరు అంతర్వేది కొరకై రెండు రాజ్యాల మధ్య ఘర్షణ.
5. పోర్చుగీసు వారి రాక, వారి లక్ష్యాలు.
6. బహమనీ రాజ్య విచ్ఛిన్నం.
7. బహమనీ రాజ్య శిథిలాలపై వెలసిన ఐదు రాజ్యాలు.
8. ఆజ్మీర్ కోట యుద్ధ కారణాలు.

## 32.3 విజయనగర సామ్రాజ్య స్థాపన :

విజయనగర సామ్రాజ్యంను స్థాపించిన ఘనత – తెలుగువారైన, సంగముని కుమారులైన హరిహర, బుక్క రాయ సోదరులది. మహమ్మద్ బిన్ తుగ్లక్ కాలంలో దక్కన్‌లో చెలరేగిన తిరుగుబాట్ల వలన ఏర్పడిన అరాచక పరిస్థితులను ఆసరాగా గైకొని ఈ సోదరులు 1336లో సంగం వంశాన్ని స్థాపించారు. విజయనగర స్థాపన గూర్చి చరిత్రకారులలో భేదాభిప్రాయాలున్నాయి. హరిహర బుక్కరాయ సోదరులు తొలుత కాకతీయుల కొలువులో నుండి, అచట నుండి కంపిలి వరకువెళ్ళి, విద్యారణ్య స్వామి ప్రేరణ వలన ప్రభావితులై స్వతంత్రులై తుంగభద్రానది దక్షిణ తన సామ్రాజ్యాన్ని

స్థాపించారు. ఈ సామ్రాజ్యానికి విద్యారణ్య పేరిట విద్యానగర్‌గా, రాజ్యస్థాపన విజయంనకు చిహ్నంగా విజయనగరమని పిలువబడింది. అయితే కొందరు చరిత్రకారులు ఈ సోదరులు హోయసాల సామంతులని, కన్నడ దేశీయులని పేర్కొన్నారు.

1336-1365 సంవత్సరాల మధ్య మూడు రాజవంశాలు విజయనగర సామ్రాజ్యాన్ని పాలించాయి. అవియే సంగమ, సాళువ, తుళువ, ఆరవీడు.

## 32.4 బహుమనీ రాజ్య స్థాపన :

మహమ్మద్ బీన్ తుగ్లక్ దక్కన్‌ను జయించిన పిమ్మట అచట తన అధికారాన్ని సుస్థిరపరచటానికి అమీరన్-ఇ-సద్ (Amiran-I-Sad) లేక సద్ అమీర్ అను ఉద్యోగులను ప్రతి వంద గ్రామాలకు అధిపతులుగా నియమించాడు. తుగ్లక్ రాజ్యపతనావస్థలో యుండగా జఫర్‌ఖాన్ అనే సదీ అమీర్ తిరుగుబాటు చేసి బహుమనీ రాజ్య స్థాపన చేశాడు. ఇతడు అల్లాఉద్దీన్ బహుమన్‌షా అను బిరుదుతో 1347లో స్వతంత్రుడైనాడు. ఇతడు ఇరాన్ పురాణ పురుషుడైన బహుమనీ వారసుడనని చెప్పుకొనుటవలన ఈ రాజ్యం బహుమనీ రాజ్యంగా గణనకెక్కింది. కాని ఫెరిస్తా ఇతడు ఒక బ్రాహ్మణుని ఇంట్లో పెరిగి పెద్ద వాడగుట వలన ఆ రాజ్యానికి బహమనీ రాజ్యం అనే పేరు వచ్చిందని ఫెరిస్తా వ్రాత.

ఫిరోజ్ షా తుగ్లక్ బహుమనీ రాజ్యాన్ని వశపరచుకొనటానికి యత్నింపలేదు. దీనినవకాశంగా గైకొని హసన్ బహుమన్‌షా తుగ్లక్ సామ్రాజ్యంపై దాడిచేసి కోటగిరి, కల్యాణి, బీదర్‌లను జయించెను. ఇతడు ఓరుగల్లు (వరంగల్) పాలకులతో స్నేహ సంబంధాలను కల్గియున్నాడు. ఇతని అధికారం పశ్చిమ తీరంలో ధాభోల్ రేవు పట్టణం వరకు విస్తరించింది.

బహుమన్‌షా అతని కుమారుడైన మొహ్మద్‌షా బలీయమైన చక్రవర్తులు. వీరు పాలనా సంస్కరణల ద్వారా రాజ్యాన్ని సుస్థిరపరచాలని భావించారు. అందుకు అనుగుణంగా రాజ్యాన్ని నాల్గు ఆరఫ్‌లు (రాష్ట్రాలు)గా విభజించారు. అలిమి-దౌలతాబాద్, బీరార్, బీదర్, గుల్బర్గా. మొదటి మహ్మద్ షా విజయనగర ప్రభువుల నోడించి గొల్కొండను ఆక్రమించాడు.

| మహమ్మద్‌బీన్ తుగ్లక్ పాలనా కాలంలో అల్లాఉద్దీన్ హసన్ బహమన్‌షా 1347లో బహమనీ రాజ్య స్థాపన చేశాడు. |
|---|

## 32.ఎ పాఠ్య ప్రశ్నలు :

I. **ఖాళీలను పూరింపుము :**

1. విజయనగర సామ్రాజ్య స్థాపకులెవరు?
2. సంగం వంశం ____________________ సంవత్సరంలో స్థాపించబడింది?
3. విజయ నగర సామ్రాజ్య స్థాపనలో కీలకపాత్ర వహించిన మహర్షి.
4. బహమనీ రాజ్య స్థాపకుడెవరు?

II. **ఒక పంక్తులో సమాధానములు వ్రాయుము?**

1. అమరన్-ఇ-సద్ అనగా ఎవరు?

2. జఫర్‌ఖాన్ వహించిన బిరుదు?

3. బహమనీ రాజ్యంలో రాష్ట్రానికి గల పేరేమి?

## 32.5 రాయచూరు అంతర్వేది కొరకు బహమనీ విజయనగర సంఘర్షణ:

బహమనీ, విజయనగర రాజ్యాలు ఏర్పడినప్పటి నుండి పరస్పరం, నిరంతరం – కృష్ణా–తుంగభద్రా నదుల మధ్యనున్న రాయచూరు అంతర్వేది కొరకు సంఘర్షణ పడుతూనే యున్నాయి. ఈ సంఘర్షణకు భౌగోళిక, రాజకీయ ఆర్థిక కారణాలు కలవు.

భౌగోళికంగా బహమనీ రాజ్యం శక్తివంతమైన మాల్వా, గుజరాత్, ఒరిస్సా రాజ్యాల పరివేష్టితమై ఉంది. అందువలన అది విస్తరించాలంటే కృష్ణానదిని దాటి దక్కన్‌లో ప్రవేశించాలి. అలాగే విజయనగర రాజ్యాలను మూడు వైపుల సముద్రంతో పరివేష్టితమైంది. కనుక అది విస్తరంచాలంటే తుంగభద్రా నది దాటి ఉత్తరంగా పయనించాలి. ఇటు రాయచూరు అంతర్వేది ఉభయులకు ఆధిపత్య పోరాటానికి కేంద్ర బిరుదులైంది.

ఆర్థికంగా రాయచూరు అంతర్వేది సారవంతమైంది. ఇచట అనేక బంగారు గనులు ఉన్నాయి. సహజ సిద్ధంగా దీనిని కైవసం చేసుకోవడానికి ఉభయులు తారసపడ్డారు.

వీనికితోడు కృష్ణా–గోదావరి నదుల మధ్యనున్న మైదాన ప్రాంతం మరియు మరాఠా ప్రాంతం సైతం ఉభయులకు కీలకమైంది. ఈ ప్రాంతం సస్యశ్యామలమైనదేగాక, అనేక రేవు పట్టణాలున్నాయి. మరాఠా ప్రాంతంలో కొంకణ తీరం, ముఖ్యంగా గోవా రేవు పట్టణం ఉంది. ఈ రేవు పట్టణం ద్వారా లాభసాటి విదేశీ వాణిజ్యం కొనసాగించి తమకు కావలసిన గుర్రాలను, యుద్ధ సామాగ్రిని దిగుమతి చేసుకొనవచ్చును.

ఈ సంఘర్షణలు ఎప్పుడూ పూర్తి విజయాన్ని సాధించలేదు. విజయం పక్షాలు మారుతున్నాయి. అందువలన యుద్ధాస్థితి నెలకొంది. ఈ సంఘర్షణలో తోలు ఆ పౌరులను హింసించుట జరిగింది. తదుపరి ఉభయులు దీనికి స్వస్తి పలికారు. ఈ సంఘర్షణలు నిమగ్నమై దక్షిణ కోస్తా తీరంలో దినదినాభివృద్ధి చెందే పోర్చుగీసు బలాన్ని గుర్తించలేదు. చివరిగా ఉభయులు పతనమయ్యారు.

## 32.6 పోర్చుగీసువారి రాక:

అనాదిగా భారతదేశానికి ఐరోపా దేశాలకు వర్తక, వాణిజ్య సంబంధాలున్నాయి,. ఈ విషయంలో అరబ్ వర్తకులు భారత్, ఐరోపా దేశాలకు వారధులుగా పనిచేశారు. క్రీ.వ. 1453లో తురుష్కుల కాన్‌స్టాంట్‌నోపుల్ ఆక్రమణతో ఐరోపా, తూర్పు దేశాలకు (భారత్) మధ్యగల చిరకాల భూ, జల మార్గాలు మూతపడ్డాయి. తూర్పు దేశాలలో లభ్యమయ్యే సుగంధ ద్రవ్యాలు, సన్నని వస్త్రాలు (Muslins)కు ఐరోపా మార్కెట్‌లో గిరాకీ యుండుటవలన ఐరోపా వాసులు నూతన మార్గాలను అన్వేషించక తప్పలేదు. సాంస్కృతిక పునరుజ్జీవనంవలన ప్రేరణ పొందిన ఐరోపా రాజ్యాలు నూతన భూగోళాన్వేషణలకు శ్రీకారం చుట్టాయి. ఇట్టి ఐరోపా వాసులలో ముందంజవేసిన వారు పోర్చుగీసువారు. హెన్రీ ది నావిగేటర్ (Don Henri navigator) బిరుదాంకితుడైన పోర్చుగల్ రాజు ఆదరణలో వాస్కోడిగామాను తన జల మార్గాన్ని కనుగొనుట ద్వారా క్రీ.శ. 1498లో జామరిన్ రాజు పాలించు పశ్చిమ తీరమున నున్న కాలికట్ చేరుకొన్నాడు.

పోర్చుగీసువారి రాకలోని లక్ష్యాలు రెండు 1. అరబ్బులను, మిగిలిన ఐరోపా వాసులను, పోర్చుగీసు ప్రయివేటు వర్తకులను విదేశీ వాణిజ్యం నుండి తొలగించి తూర్పు దేశ వాణిజ్య గుత్తాధిపత్యాన్ని సాధించుట, 2. దినదినాభివృద్ధి చెందు తురుష్కుల అధికారంనకు అడ్డుకట్టవేసి ఆఫ్రికా, ఆసియా దేశాలలో క్రైస్తవ మతంను వ్యాప్తి చేయుట, ప్రోత్సహించుట.

సుమారు ఒక శతాబ్ది పోర్చుగీసువారు తూర్పు దేశ వాణిజ్య గుత్తాధికారాన్ని హస్తగతం చేసుకున్నారు. ఈ ప్రక్రియలో తొలుత వారు అరబ్బుల నౌకలను ధ్వంసంచేశారు. క్రీ.శ. 1509లో ఈజిప్టు సుల్తాన్, గుజరాత్ పాలకునకు చెందిన సంయుక్త నౌకాదళాన్ని ధ్వంసం చేశారు. ఈ విజయానంతరం వీరు పారశీక సింధుశాఖ, ఎర్ర సముద్రం ద్వారా ఆరు కార్యకలాపాలను విస్తృతం చేశారు. వీరు ఆసియా, ఆఫ్రికా దేశాలలో కీలక ప్రాంతాలలో కోటలను నిర్మించి, సైన్యాన్ని సమకూర్చుకొని, నిర్విఘ్నంగా వాణిజ్యంతోబాటు రాజ్య విస్తరణ కూడా కొనసాగించారు.

పోర్చుగీసు గవర్నరైన ఆల్బూకర్క్ బీజపూరు సుల్తాన్ నుండి గోవాను పొంది, భారత్‌లోని పోర్చుగీసు స్థావరాలకు కేంద్రంగా మలచాడు. తదుపరి గుజరాత్, విజయనగర పాలకులతో స్నేహ సంబంధాలను నెలకొల్పుకొని మలబారు తీరాన్ని తమ ఆధీనంలోనికి తెచ్చుకున్నారు. అనంతరం వారు గోవాను కేంద్రంగా మార్చి, కొలబ్, సమత్రా, మలక్కా (మలయా)లలో తమ స్థావరాలను ఏర్పాటుచేసుకున్నారు.

**పోర్చుగీసు వారు ఇతర దేశాల వర్తకులపై కఠినమైన ఆంక్షలు విధించారు. అవి ఏమనగా :**

1. పోర్చుగీసువారి అనుమతిలేనిదే భారత లేక అరబ్బులకు చెందిన నౌకలు పారశీక సింధు శాఖలో పయనించరాదు.
2. భారతీయులు, అరబ్బులు ఎట్టి ఆయుధాలు గాని, సుగంధ ద్రవ్యాలను గాని తమ వెంట తీసుకొని రాకూడదు.
3. భారత, అరబ్బులకు చెందిన నౌకలను తనిఖీ చేసి, పైన పేర్కొన్న వస్తువులను రవాణా చేసినట్లు రూఢియైతే ఆ నౌకలను ముంచివేస్తాయి.

పోర్చుగీసు వారు గుర్రాల వ్యాపారంలో గుత్తాధిపత్యం వహించి, నిరంతరం, పరస్పర సంఘ్షణలో మగ్గే దక్కన్ రాజ్యాల నుండి (బహుమనీ, విజయనగర రాజ్యాలు) అపార లాభాలు గడించారు.

ఈ స్ఫూర్తితో వారు పశ్చిమ తీరంలో దయ్యూ, డామన్, సాల్‌శెట్టి, బస్సేన్, చ్రౌల్, బాంబే, తూర్పు తీరమున బెంగాల్‌నందలి హుగ్లీ, మద్రాసు నందలి శాంథోమ్‌లందు తమ వర్తక కేంద్రాలను స్థాపించారు. కాని పోర్చుగీసు ప్రాబల్యం ఎక్కువ కాలం నిలవలేదు. దీనికి ముఖ్యకారణం – తమకంటే శక్తివంతమైన నౌకాదళంగల డచ్చి, ఇంగ్లీషువారి ధాటికి నిలువలేపోవడం.

## 32.7 బహమనీ రాజ్య విచ్ఛిన్నం :

క్రీ.శ. 15వ శతాబ్ది నుండి బహుమనీ రాజ్యములోని ప్రభువర్గం రెండు అత్యర్థివర్గాలుగా చీలిపోయింది. అది దక్కనీ (స్వదేశీయులు), పరదేశీయులు) ఏనాడో విదేశాల నుండి దక్కన్ వచ్చి స్థిరపడిన ముస్లింలు స్థానికంగా, దక్కనీలుగా ఏర్పడ్డారు. ఆ తదుపరి విదేశాల నుండి కొత్తగా వలస వచ్చిన ముస్లింలు తమ అదృష్టంను పరీక్షించుకొనుటకు వచ్చిన ముస్లింలు విదేశీయులు (Afgan) వర్గంగా ఏర్పడ్డారు. ఈ విదేశీయులే క్రమంగా బహమనీ రాజ్య కొలువులో

ఉన్నత పదవులను పొందారు. విదేశీ ప్రాబల్యమును సహించని స్వదేశీయులు వారిని ద్వేషింపసాగారు. ఇట్లు రెండు వర్గాల మధ్య శత్రుత్వం హెచ్చుపెరిగి తుదకు మహ్మద్ గవాన్ హత్యకు దారితీసింది.

గవాన్ ఉరితీతతో ఈ రెండు వర్గాల మధ్య ఏర్పడిన శత్రుత్వం వలన బహమనీ రాజ్య పాలన కుంటుపడింది. విదేశీయుడైన ఖాసింబరీద్ బహుమనీ సుల్తాన్ ఉన్నత పదవి కట్టబెట్టడంలో అది గిట్టని రాష్ట్ర గవర్నర్లు అతని అధికారంను దిక్కరించి స్వాతంత్ర్యం ప్రకటించారు. తత్ఫలితంగా బహమనీ రాజ్యం విచ్చిన్నమై ఐదు స్వతంత్ర రాజ్యాలుగా విభక్తమయ్యాయి. అవియే అహ్మద్ నగర్, బీదర్, బీరార్, బీజపూర్. అహ్మద్‌నగర్ బహమనీ రాజ్యం విచ్ఛిన్నమైనా ఈ ఐదు రాజ్యాలు విజయనగరంతో శతృత్వాన్ని కొనసాగించాయి.

ఈ రాజ్యాలు పరస్పరం సంఘర్షణ పడినా, తరచు వివాహ సంబంధముల ద్వారా తమ అధికారాలను పదిలపరచుకున్నాయి. గోల్కొండ, బీజపురు వివాహ సంబంధముల వలన ఏర్పడిన మైత్రి వారు తళ్ళికోట యుద్ధంలో విజయనగరానికి వ్యతిరేకంగా పోరాడటానికి దోహదం చేసింది.

## 32.8 తళ్ళికోట యుద్ధంలో విజయనగర రాజ్య విచ్ఛిన్నం :

తళ్ళికోట యుద్దానికి దారితీసిన పరిస్థితులపై వివాదాలు నెలకొన్నాయి. అయితే దీని ముఖ్య కారణం విజయనగర ప్రభువులు ప్రాబల్యతుల్యతను (Balance of power) సాధించుటకు యత్నించుటే శ్రీ కృష్ణదేవరాయలు అల్లుడైన రామరాయలు బహమనీ రాజ్యాల అంతఃకలహాలలో జోక్యం చేసుకొని, వానిని దెబ్బతీయాలని యత్నించాడు. తొలుత బీజపూర్ నోడించి, దానితో మైత్రిని నెలకొల్పి, వారి సాయంతో గొల్కొండ, అహ్మద్‌నగర్‌లను ఓడించాడు.

రామరాయలు దౌత్యనీతి కపటమని భావించి బహమనీ రాజ్యములన్నీ సమైక్యమై విజయనగరపై దండెత్తాయి.

క్రీ.శ. 1565లో తళ్ళికోట సమీపాన బనిహటి (Banihati) వద్ద బహమనీ, విజయనగర సైన్యాలు తారసపడ్డాయి. ఈ తళ్ళికోట యుద్ధంలో రామరాయలు వధింపబడగా, ముస్లింలు విజేతలైరి. విజేతలైన ముస్లిం సేనలు విజయనగరాన్ని దోచుకొని, ధ్వంసం చేసి తగులబెట్టారు. ఇంతటి దారుణ మరణాహోమం ప్రపంచ చరిత్రలో ఎపుడూ, ఎన్నడూ జరగలేదని రాబర్ట్ సూయల్ వ్యాఖ్యానించాడు. ముస్లిం సేనలు తమకు లభించిన ధనకనక వస్తువులను దోచుకొనిరి. విజయనగరం తన ఔన్నత్యాన్ని, ప్రాభవాన్ని కోల్పోయింది.

ఇట్లు విజయనగరం రెండు శతాబ్దాలు భారతీయ సంస్కృతికి కేంద్ర బిందువుగా నిలిచింది. బహుమనీ – విజయనగర సంఘర్షణకు ఉభయులకు అశనిపాతం. ఈ రాజ్యాలు ఫ్యూడల్ స్వభావం కల్గినవగుటవలన ఆ రాజ్యాలు బలహీనం చెందగానే వారి సామంతులు స్వతంత్రులైనారు. ఇట్లు బహుమనీ రాజ్యం ఐదు స్వంతంత్ర రాజ్యాలుగా విభక్తమైంది. తళ్ళికోట యుద్ధానంతరం సైతం ఈ రాజ్యాలు విజయనగర పాలకులైన ఆరవీడులతో సంఘర్షణను కొనసాగించి, బలహీనులై తుదకు మొఘలుల పాదాక్రాంతమైంది.

## 32.బి పాఠ్య ప్రశ్నలు:

1. ఖాళీలను పూరింపుము.

ఎ) కృష్ణా–తుంగభద్ర నదుల మధ్య నున్న ప్రాంతంను ____________________ అని అంటారు.

బి) విజయగనరం____________________ పక్కల సముద్రంతో పరివేష్టితమైంది.

సి.) ____________________. వర్తకులు భారత్, ఐరోపా దేశాల మధ్య వర్తక, వాణిజ్య సంబంధాలను అనుసంధానం చేశారు.

డి) కాన్‌స్టాంట్ నోపుల్ పతనం____________________ సంవత్సరంలో జరిగెను.

ఇ) భారతదేశానికి ____________________ సంవత్సరంలో ____________________. వచ్చారు.

ఎఫ్) పోర్చుగీసు వారు దక్కన్‌లో ____________________ రాజ్యంతో స్నేహ సంబంధాలను కల్గియున్నారు.

జి) బహుమనీ రాజ్యంలోని ప్రభువర్గం, రెండుగా చీలింది. అవి ఏమనగా ____________________.

హెచ్) బహమనీ రాజ్యం ____________________ స్వతంత్ర రాజ్యాలుగా విభక్తమైంది.

ఐ) ____________________. యుద్ధం విజయనగర సామ్రాజ్యానికి ఆశనిపాతం.

2. ఈ క్రింది వానికి ఒక వాక్య సమాధానం వ్రాయుము?

ఎ) ఇండియాకు, ఐరోపాకు మధ్య వేరొక వర్తక మార్గాన్ని కనిపెట్టుటకు ప్రముఖ కారణమేమి?

బి) పోర్చుగీసువారు గోవాను ఎవరి వద్ద నుండి పొందారు?

సి) తళ్ళికోట యుద్ధం ఎపుడు, ఎక్కడ జరిగింది?

డి) బహుమనీ రాజ్య శిథిలాలపై వెలసిన రాజ్యములేవి?

ఇ) భారత్‌కు వచ్చిన తొలి ఐరోపా వాసులెవరు?

## సారాంశం :

క్రీశ. 1336లో హరిహర, బుక్కరాయ సోదరులు విజయనగర రాజ్యాన్ని స్థాపించారు. క్రీ.శ. 1347లో జఫీర్‌ఖాన్ అల్లాఉద్దీన్ హసన్ బహమనీ బిరుదుతో బహమనీ రాజ్యాన్ని స్థాపించాడు. ఈ రెండు రాజ్యాలు రాయచూరు అంతర్వేదిలోని సారవంతమైన భూములను, రేవు పట్టణాలను హస్తగతం చేసుకోవడానికి నిరంతరం సంఘర్షణ పడ్డాయి. ఈ సంఘర్షణవలన రెండు రాజ్యాలు నష్టపోయాయి. బహమనీ రాజ్య కొలువులో ప్రభువర్గం రెండుగా అనగా స్వదేశీయులు, విదేశీయులుగా విభక్త పరస్పరం తగవులాడుకున్నారు. తత్ఫలితంగా బహమనీ రాజ్యం ఐదు స్వతంత్ర రాజ్యాలుగా విభక్తమైంది. అవియే – బీజపూర్, బీదర్, బీరార్, గోల్కొండ, అహమ్మద్ నగర్.

1565లో జరిగిన తళ్ళికోట యుద్ధంలో బహమనీ రాజ్యాల చేతిలో విజయనగరం నాశనమైంది. దానితో విజయనగర ప్రాభవం అంతరించింది.

ఈ యుగంలో జరిగిన ముఖ్య సంఘటన – పోర్చుగీసు వారి రాక. వీరు వర్తకం కోసం వచ్చి రాజ్యాధినేతలుగా మారారు. వీరు గోవాను ఆక్రమించి దక్కన్ రాజ్యాలు తమ అధికారాన్ని గుర్తించేటట్లు చేసుకున్నారు.

## అభ్యాసం

1. బహమనీ రాజ్య స్థాపకుడెవరు? బహమనీ రాజ్య విజృంభణకు, విస్తరణకు గల కారణములేవి?
2. బహమనీ – విజయనగర రాజ్యాల మధ్య రాయచూరు అంతర్వేది ఎందుకు ఘర్షణ కేంద్రంగా మారింది?
3. పోర్చుగీసు వారు భారత్ రాకకు గల ముఖ్య కారణాలు ఏవి?

4. బహమనీ రాజ్య విచ్ఛిన్నమునకు గల కారణము లేమి?
5. తళ్ళికోట యుద్ధాన్ని గూర్చి వ్రాయుము.

**విజ్ఞానం పెంపుదల కోసం :**

ఇండియా రేఖాపటంలో బహమనీ, విజయనగర రాజ్య సరిహద్దులను గుర్తింపుము.

**పాఠ్య ప్రశ్నలకు జవాబులు :**

**32.ఎ**

ఎ) హరిహర, బుక్క బి) 1336

సి) విద్యారణ్య డి) అల్లాఉద్దీన్ హసన్ బహమన్ షా

2. ఎ) మహమ్మద్ బిన్ తుగ్లక్ నియమించిన పాలనాధికారాలు

బి) అల్లాఉద్దీన్ హసన్ బహమన్‌షా సి) తరఫ్‌లు.

**32.బి**

1. ఎ) రాయచూరు అంతర్వేది

బి) రెండు పక్కలు

సి) అరబ్

డి) 1453

ఇ) వాస్కోడిగామా, 1498

ఎఫ్) కృష్ణదేవరాయలు

జి) దక్కన్‌లు, అఫ్‌కిస్

హెచ్) ఐదు రాజ్యాలు

ఐ) తళ్ళికోట .

2. ఎ) కాన్‌స్టాంట్ నోపుల్ మార్గం ఐరోపావాసులకు అందుబాటులో లేకపోవుట.

2. ఐరోపాలో జన్మించిన సాంస్కృతిక పునరుజ్జీవన ప్రభావం.

బి) పోర్చుగీసువారు

సి) బనిహట్టి, 1565.

డి) అహ్మద్‌నగర్, బీదర్, బీరార్, బీజపూర్, గోల్కొండ.

ఇ) పోర్చుగీసు.

# 33

# విజయనగర మరియు బహమనీ రాజ్యాలు

## 33.1 పరిచయం :

క్రితం పాఠంలో మనం విజయనగర, బహమనీ రాజ్యాల స్థాపన గురించి చదివాం. విజయనగర రాజ్యాన్ని సంగమ, సాళువ, తుళువ, ఆరవీటి వంశాలు పరిపాలించాయి. విజయనగర ప్రభువులు బహమనీ రాజ్యంతో నిరంతరం సంఘర్షణ పడ్డారు. సంగమ వంశీయులలో 'మహారాజాధిరాజ' బిరుదాంకితుడైన రెండవ హరిహరరాయలు, రెండవ దేవరాయలు సుప్రసిద్ధులు. రెండవ దేవరాయల కాలంలో క్విలోన్, శ్రీలంక పాలకులు ఆయనకు కానుకలు సమర్పించి ఆయన సార్వభౌమత్వాన్ని గుర్తించారు. ఇతని కాలంలో విజయనగర రాజ్యాన్ని సందర్శించిన నికోలోకాంటి, అబ్దుల్ రజాక్ విజయనగర వైభవాన్ని గురించి వర్ణించారు. విజయనగర చక్రవర్తులలో గొప్పవాడు తుళువ వంశీయుడైన శ్రీ కృష్ణదేవరాయలు. ఇతని కాలంలో విజయనగర సామ్రాజ్యం మహోన్నత స్థాయికి చేరుకున్నది. ఆయన మరణంతో విజయనగర వైభవం క్షీణించి తళ్ళికోట యుద్ధంతో అంతమైంది.

బహమనీ రాజ్య పాలకులలో ఫిరోజ్‌షా, మహమ్మద్ గవాన్ ముఖ్యులు. ఫిరోజ్‌షా మొదటి దేవరాయలుతో అనేక యుద్ధాలు చేశాడు. ఇతడు దక్కన్‌ను సాంస్కృతిక కేంద్రంగా తీర్చిదిద్దాడు. మహమ్మద్ గవాన్ అనేక పాలనా సంస్కరణలు ప్రవేశపెట్టుటయేగాక బహమనీ కొలువులో నెలకొన్న ప్రభువర్గ విభేదాలను పరిష్కరించాడు. గవాన్ మరణంతో రాష్ట్ర గరవ్నర్‌లు స్వాతంత్ర్యం ప్రకటించుటతో బహమనీ రాజ్యం విచ్ఛిన్నమైంది.

ఈ పాఠంలో మనం ఈ రెండు రాజ్యాలు సాధించిన ఘన విజయాలను, విచ్ఛిన్నాన్ని చదువుతాము.

## 32.2 లక్ష్యాలు :

ఈ పాఠం చదివిన తరువాత మీరు ఈక్రింది విషయాలు తెలుసుకుంటారు.

1. రెండవ దేవరాయలు సాధించిన విజయాలు.
2. శ్రీకృష్ణదేవరాయలు సాధించిన రాజకీయ, సాంస్కృతిక విజయాలు.
3. ఆళ్ళికోట పాలనా వ్యవస్థలోని ముఖ్యాంశాలు.
4. మహమ్మద్ గవాన్ విద్య, సాంస్కృతిక రంగాలకు చేసిన సేవ.
5. మహమ్మద్ గవాన్ ప్రవేశపెట్టిన సైనిక, పాలనా సంస్కరణలు.

6. బహమనీ రాజ్య విచ్ఛిన్నానికి కారణాలు.

7. విజయనగర రాజ్య పతనానికి కారణాలు.

## 33.3 రెండవ దేవరాయలు (1422-1446):

సంగమ వంశీయులలో సుప్రసిద్ధుడు రెండవ దేవరాయులు. ఇతడు విజయనగర రాజ్య సమగ్రతను కాపాడుటయేగాక దానిని విస్తరించాడు. ఆయన సారస్వత కళా రంగాలను పోషించాడు. ఇతడి కాలంలో అనేకమంది విదేశీయులు విజయనగర రాజ్యాన్ని సందర్శించారు.

బహుమనీ సుల్తాన్‌ల చేతిలో తొలి పరాజయాలను చవిచూసిన రెండవ దేవరాయలు బహమనీ విజయానికి మంచి అశ్వాలు, విలుకాండ్రు కారణమని గుర్తించాడు. ఇందుకు అనుగుణంగా ముస్లింలను తన సైన్యంలో చేర్చుకొనుటయేగాక, జాగీర్లు ఇచ్చి విజయనగర పట్టణంలో వారికి మసీదులు కూడా నిర్మించాడు. ఫెరిస్టా రచనల ప్రకారం రెండవ దేవరాయల సైన్యంలో రెండు వేల మంది ముస్లింలు, విలు విద్యలో నేర్పరులైన హిందువులు, ఎనభైవేల అశ్వాలు, రెండు లక్షల పదాతి దళం కలవు. దేవరాయలు తుంగభద్రా నదిని దాటి ముద్గల్, బంకపూర్, రాయచూర్ మున్నగు వానిని హస్తగతం చేసుకొనుటకు బహమనీ సుల్తాన్‌తో సంఘర్షణపడ్డాడు. ఈ సంఘర్షణలో ఎవరూ పూర్తి విజయాన్ని సాధించలేదు. తుదకు యథాస్థితి నెలకొంది. పోర్చుగీసు యాత్రీకుడైన న్యూనిజ్ రచనల ప్రకారం శ్రీలంక, పెగూ, పులికాట్, క్విలోన్ మున్నగు పాలకులు ఆయనకు కానుకలు సమర్పించినట్లు తెలుస్తుంది.

రెండవ దేవరాయలు గొప్ప పాలనాదక్షుడేగాక, నిష్పక్షపాతి. ఆయన కాలంలో విజయనగరం అష్టైశ్వర్యములతో తులతూగుచున్నదని అబ్దుర్ రజాక్ (పారశీక యాత్రికుడు), నికోలో కాంటి (ఇటలీ యాత్రికుడు) అభివర్ణించారు.

విజయనగర రాజ్య ఖజానా బంగారు ముద్దలతో నిండియున్నదని, ఆయన రాజ్యంలో 300 రేవు పట్టణాలు కలవని, ప్రతి రేవు పట్టణం కాలికట్‌కు ధీటుగా ఉన్నదని అబ్దుర్ రజాక్ వర్ణించాడు. ఇంకనూ ఈ రాజ్యాన్ని చుట్టి రావడానికి మూడు నెలలు పడుతుందని పేర్కొన్నాడు.

నికోలో కాంటి నాటి భారతీయ చక్రవర్తులలో కెల్లా రెండవ దేవరాయలు శక్తివంతుడని, విజయనగర పట్టణంలో తొంభైవేల మంది ఆయుధాలు చేపట్టడానికి శిక్షణ పొందియున్నారని వ్రాశాడు.

విజయనగర రాజ్యానికి ఎంత సంపద ఉన్నా, ఎంత శక్తివంతమైనా బహమనీ సుల్తాన్‌లు ధైర్య సాహసాలతో తమ రాజ్యాన్ని కాపాడుకోగలరని ఫెరిస్టా పేర్కొన్నాడు.

రెండవ దేవరాయలు వీరశైవ మతస్థుడైనా పరమత సహనాన్ని పాటించాడు. ఆయన మంత్రిమండలిలో జైనులు, వైష్ణవులు చివరకు ఒక క్రైస్తవుడు కూడా ఉండుట విశేషం. ఆయన ముస్లింలకు మసీదులు నిర్మించినట్లు మనం చదివాం.

సంగమ వంశీయులలో రెండవ దేవరాయలు సుప్రసిద్ధుడు. విదేశీ యాత్రికులు అతడి పాలనా విశిష్టతను, విజయనగర వైభవాన్ని వర్ణించారు.

## 33.4 శ్రీ కృష్ణదేవరాయలు (క్రీ.శ. 1509-30)

విజయనగర చక్రవర్తులలో గొప్పవాడు తుళువ వంశస్థుడైన శ్రీ కృష్ణదేవరాయలు. ఇతడు గొప్ప యోధాగ్రేశ్వరుడు, పాలనాదక్షుడు, పండితుడు, సాహిత్యాభిమాని. తాను సింహాసనం అధిష్టించునాటికి అనేక సమస్యలు ఎదుర్కొనవలసి వచ్చెను. ఒక వంక సామంతులు తిరుగుబాటు చేయగా, మరొకవంక బహమనీ సుల్తాన్‌లు విజయనగర రాజ్యాన్ని కబళింప ప్రయత్నిస్తున్నారు. వీరికితోడు పోర్చుగీసువారు దక్కన్‌లో విస్తరింపసాగారు.

విజయనగర రాజ్య విస్తరణకు శ్రీకృష్ణదేవరాయలు అనేక యుద్ధాలు చేశాడు. తూర్పు దిగ్విజయ యాత్రలో కొండవీడు, కొండపల్లి, సింహాచలం మున్నగువానిని ఆక్రమిస్తూ కళింగ గజపతిని ఓడించి కటక్ వరకు రాజ్యాన్ని విస్తరించాడు. బీజపూర్ సుల్తాన్ యగు యూసఫ్ ఆదిల్‌షాను, కోవిలకొండ, యుద్ధములందు ఓడించి రాయచూర్, ముద్గల్ దుర్గములను ఆక్రమించాడు. తదుపరి విజయనగర సైన్యం బెల్గాం చేరుకొని బీజపూర్‌ను సర్వనాశనం చేసింది. బీజపూర్ నుండి తిరుగు ప్రయాణంలో గుల్బర్గాపై దాడి చేసి అచ్చట బందీగా ఉన్న బహమనీ రాకుమారుడైన మహమూద్‌షాను బంధ విముక్తిడిని చేసి అతని రాజ్యాన్ని తిరిగి అతనికి కట్టబెట్టాడు. ఇందుకు శ్రీకృష్ణదేవరాయలు "యవన రాజ్య స్థాపనాచార్య" అను బిరుదును పొందాడు.

శ్రీకృష్ణదేవరాయలు గొప్ప యోధుడు. ఇతడు సైన్యాన్ని పటిష్టవంతం చేసి అత్యంత శక్తివంతమైన సైన్యంగా తీర్చిదిద్దాడు. సైనిక వ్యవహారాలను స్వయంగా పర్యవేక్షిస్తూ, సైనికులకు రక్షణ కల్పించుటయేగాక యద్ధంలో ప్రతిభ చూపిన వారికి బహుమానములు ఇచ్చి సత్కరించెడివాడు.

శ్రీకృష్ణదేవరాయలు గొప్ప పండితుడు. ఇంతడు జ్ఞాన చింతామణి, రసమంజరి, మరియు ఆముక్త మాల్యద అను కావ్యమును వ్రాశాడు. ఇందు రాజధర్మ స్వభావం, రాజు విధులు మున్నగువానిని గురించి సవివరంగా వ్రాశాడు. ఇటలీ యాత్రీకుడైన పేజ్ (Paies) ఆయన వ్యక్తిత్వం గురించి వ్రాస్తూ "ఆయన గొప్ప పాలకుడని, న్యాయ దక్షత కలవాడని, రమ్యమైన మూర్తిమర్త్వం కలవాడని అభివర్ణించాడు. ఇతడు గొప్ప భవన నిర్మాత. విజయనగర పట్టణంలో అనేక నిర్మాణాలు చేశాడు. వానిలో ముఖ్యమైనవి – కృష్ణస్వామి ఆలయం, హజరా రామాలయం, ఆయన చెక్కించిన ఏకశిలా విగ్రహములైన ఉగ్ర నరసింహుడు, గణేశుడు నాటి శిల్పకళా నైపుణ్యమునకు నిదర్శనం.

తెలుగు సారస్వత చరిత్రలో శ్రీకృష్ణదేవరాయల కాలం స్వర్ణయుగం. ఆయన ఆస్థానంలో అష్టదిగ్గజములైన పండితులున్నారని ప్రతీతి. వీరిలో అల్లసాని పెద్దన, నంది తిమ్మన, ధూర్జటి మున్నగువారు కలరు. తెలుగు, కన్నడ, తమిళ కవులు కలరు. విదేశీ యాత్రీకులైన బొర్బోసా, ఫేజ్, న్యూనిజ్ ఆయన పాలనాదక్షతను, నాటి విజయనగర వైభవాన్ని ప్రశంసించారు. ఆయన పరమత సహనాన్ని పాటించిన ఉదార స్వభావుడు. "మత విషయాలలో పూర్తి స్వేచ్ఛ కలదని ఎవరు ఎచట పర్యటించినా నీవెరు? క్రైస్తవడివా? యూదుడివా? ముస్లింవా? అని ఎవరూ ప్రశ్నించెడివారు కాదు" అని పోర్చుగీసు యాత్రికుడైన బొర్బొసా ప్రశంసించాడు.

దక్షిణ భారతదేశ చరిత్రలో శ్రీకృష్ణదేవరాయల కాలం మహోన్నతమైనదని చరిత్రకారులు ఉద్ఘాటించారు.

## 33.5 విజయనగర పాలనా వ్యవస్థ :

రాజరికం వంశపారంపర్యం. రాజు సర్వాధికారి. కాని అతడు నిరంకుశుడు కాదు. ధర్మబద్ధుడు. రాజు ధర్మాన్ని,

న్యాయాన్ని పాటించాలని శ్రీకృష్ణదేవరాయలు చెప్పాడు.

రాజ్యపాలనలో రాజుకు సలహాలిచ్చి, సాయపడుటకు మంత్రిమండలి కలదు. కాని ఈ సలహాలను రాజు పాటించాలని నియమం లేదు.

పాలనా సౌలభ్యం కొరకు సామ్రాజ్యం రాజ్యములుగా (రాష్ట్రాలు) లేక మండలములుగా లేక చావడిగా విభజించారు. ప్రతి రాష్ట్రం (రాజ్యము) సీమలుగా (నాడులు), స్థలములుగా (సమితి) గ్రామములుగా విభజింపబడినాయి. పాలనా వ్యవస్థలో చివరి అంశం గ్రామం.

విజయనగర పాలనా వ్యవస్థలో వినూత్నమైన వ్యవస్థ నాయంకర విధానం. ఇది ఢిల్లీ సుల్తానత్ యుగంలో "ఇక్తాదారు" వ్యవస్థను పోలియున్నది. అమరం అనగా రెవిన్యూ, నాయక్ అనగా సైన్యాధికారి. రాజు కొంత భూమిని నాయకులకు అప్పగించి తద్వారా వచ్చే ఆదాయంతో నిర్ణీత సైన్యాన్ని పోషించాలి. అత్యవసర సమయాలో వీరు రాజుకు సైనిక సహాయం చేయాలి. అమర నాయకులు సైన్యాధిపతులేగాని పాలనాధిపతులుకాదు. రాష్ట్రాధిపతి రాష్ట్రంలో శాంతి భద్రతలను నిర్వహిస్తారు.

చోళుల గ్రామ సభలు ఈ యుగంలో కొనసాగినా, ఆనాటి స్వేచ్ఛ, ప్రజాస్వామ్య పద్ధతులు విజయనగర యుగంలో మరుగునపడ్డాయి. నాయాంకర విధానం వలన స్థానిక స్వపరిపాలనా వ్యవస్థ గ్రామాలలోని గణతంత్ర వ్యవస్థ చిన్నాభిన్నమైంది.

విజయనగర రాజ్యానికి ముఖ్యమైన ఆదాయం భూమిశిస్తు. భూములు నీటి పారుదల సౌకర్యంగల, నీటిపారుదల సౌకర్యంకాని భూములుగా విభజింపబడ్డాయి. భూమిశిస్తు వసూలులో రెండింటి మధ్య వ్యత్యాసం కలదు. శ్రీకృష్ణదేవరాయలు అనేక తటాకములు, చెరువులు, కాలువలు త్రవ్వించి నీటిపారుదల సౌకర్యములను మెరుగుపరచినాడు. నిస్సారమైన భూములను సాగులోనికి తెచ్చాడు. భూమిశిస్తుగాక, ఆస్తిపన్ను, వృత్తిపన్ను, గనులపై సుంకాలు, పరిశ్రమలపై పన్ను, దేశీయ, విదేశీ వాణిజ్యముపై పన్నులు మున్నగునవి ఇతర ఆదాయ మార్గాలు. శ్రీకృష్ణదేవరాయలు పూర్వం ఉన్న వివాహ పన్నును రద్దుచేశాడు. అత్యవసర, ప్రకృతి వైపరీత్య సమయాలలో పన్ను మినహాయింపు ఉండేది.

విజయనగర సామ్రాజ్యం రాజ్యాలుగా, నాడులుగా, స్థలములుగా, గ్రామాలుగా విభజింపబడినది. నాయంకర వ్యవస్థ కలదు. అనేక రకముల పన్నులు విధింపబడ్డాయి.

## 33.ఎ పాఠ్య ప్రశ్నలు:

1. రెండవ దేవరాయలు కాలానికి చెందిన సారస్వత ఆధారమేమి?
2. శ్రీకృష్ణదేవరాయల కాలంనాటి రెండు సారస్వత గ్రంథములను పేర్కొనుము.
3. నాయకులనగా ఎవరు?

## 33.6 మహమ్మద్ గవాన్ :

బహమనీ రాజ్య చరిత్రలో మహోన్నతమైన వ్యక్తి మహమ్మద్ గవాన్. ఇతను సుల్తాన్ కాదు. స్వశక్తితో వజీరు (ప్రధానమంత్రి) అయ్యాడు. మహమ్మద్ గవాన్ తొలి జీవితం గురించి అంతగా తెలియదు. జన్మతః ఇరాన్ దేశీయుడు.

వ్యాపారిగా బహమనీ రాజ్యనికి వచ్చాడు. రెండవ అల్లాఉద్దీన్ కాలంలో ఇతడు నల్గొండలోని తిరుగుబాటును అణచుటకు పంపబడ్డాడు. రెండవ అల్లా ఉద్దీన్ మరణానంతరం అతని కుమారుడు హుమాయూన్‌కు సన్నిహితుడై, వర్తకుల అధిపతి (Malik-Ut-Tujjar - Chief of the Merchants) బిరుదును పొందాడు.

హుమాయున్ మరణానంతరం అతని కుమారుడు మూడవ మహమ్మద్ షా కాలంలో ప్రధాని "ఖాజా–ఇ–జహాన్" అను బిరుదును పొందాడు. వజీరుగా సర్వాధికారములు వహించి ఉదార స్వభావుడై ఆ స్థానమందున్న ప్రభువర్గంలోని స్వదేశీ, విదేశీ వర్గాలను సమన్వయ పరచాడు.

బహమనీ రాజ్య విస్తరణకై విజయనగర సామ్రాజ్యంపై దండెత్తి కంచి వరకు ఆక్రమించాడు. పశ్చిమ తీరంలో గోవా, థబోల్‌లను ఆక్రమించి ఇరాన్, ఇరాక్ దేశాలతో వర్తక, వ్యాపార సంబంధాలు నెలకొల్పి బహమనీ రాజ్య అభ్యున్నతికి కృషి చేశాడు. గోవా, ధబోల్ రేవు పట్టణాలను కోల్పోవుట విజయనగరానికి గొప్ప నష్టం.

మాళ్వా పాలకులైన ఖల్జీలు గొండ్వానా, బీరార్, కొంకణ్ ప్రాంతాలను హస్తగతం చేసుకోవాలని ప్రయత్నించినపుడు గవాన్ వారితో దర్ఘకాలిక పోరాటం చేశాడు. చివరకు గొండ్వానా మాళ్వాకు, బీరార్ బహమనీ రాజ్యానికి చెందేటట్లు ఒప్పందం కుదిరింది. కాని మాళ్వా పాలకులు ఈ ఒప్పందాన్ని ఉల్లంఘించి బీరార్‌పై దండెత్తారు. అంతట గవాన్ గుజరాత్ పాలకుని సహాయంతో బీరార్‌ను బహమనీ రాజ్యానికి పునరుద్ధరించాడు.

ఢిల్లీ సుల్తానత్ విచ్ఛిన్నమైన పిమ్మట స్వతంత్రమైన మాళ్వా, గుజరాత్, ఒరిస్సా, బెంగాల్ మున్నగు రాజ్యాలు పరస్పరం కలహించుకొని దక్కన్‌లో రాజ్య విస్తరణకు ప్రయత్నించాయి. దీనిని బట్టి దక్కన్‌లో వివిధ రాజ్యాల మధ్య సంఘర్షణ మతపరమైనది కాదని, రాజకీయ, ఆర్థిక కారణములని తెలుస్తుంది. ఇట్టి స్థితిలో మహమ్మద్ గవాన్ తన శక్తియుక్తులతో బహమనీ రాజ్య విస్తరణను, సుస్థిరతను నెలకొల్పాడు.

దక్కన్‌లో వివిధ రాజ్యాల మధ్య సంఘర్షణ కేవలం రాజకీయ, ఆర్థికపరమైనది.

గవాన్ గొప్ప విద్యావేత్త. బీదర్‌లో ఒక గొప్ప మదర్సాను స్థాపించాడు. ఇందులో ఉపాధ్యాయులు, విద్యార్థులు మొత్తం వెయ్యి మంది కలరు. వీరికి ఉచిత భోజనం, వసతి సౌకర్యమును కల్పించెను. ఇరాన్, ఇరాక్ నుండి అనేక మంది పండితులు ఇచ్చటకు వచ్చేవారు. ఈ మదర్సా ఎనామిల్‌తో అలంకరింపబడింది. రష్యన్ యాత్రికుడైన నికిటిన్ బీదర్ వంటి పట్టణాన్ని తాను చూడలేదని ప్రశంసించాడు.

స్థానిక రచనలు మహమ్మద్ గవాన్‌కు బీదర్ శిల్పకళతో సంబంధం ఉన్నట్లు తెలుపుతున్నాయి. ఈ శిల్పకళలో వివిధ లోహాలను మిళితం చేసి ఆక్సీకరణం చేసి నల్లరంగు గల లోహంగా మార్చి దానిపై వెండి తీగలతో వివిధ అలంకరణలను తీర్చిదిద్దుతారు.

ఇదియే బిద్రి శిల్పకళగా నేటికిని ప్రాచుర్యంలో ఉంది.

## 33.7 మహమ్మద్ గవాన్ నేతృత్వంలో బహమనీ రాజ్య పాలనా విధానం :

బహమనీ రాజ్య సుస్థిరతకై మహమ్మద్ గవాన్ అనేక పాలనా సంస్కరణలు ప్రవేశపెట్టాడు. రాజ్యాన్ని ఎనిమిది తరఫ్‌లు (రాష్ట్రాలు)గా విభజించాడు. తరఫ్‌దార్ రాష్ట్రాధిపతి. ఇతనిని సుబేదార్ అని కూడా పిలిచేవారు. తరఫ్‌దార్ ఆధీనం నుండి కొంత భూమిని 'ఖలీసా' అనే పేరుతో కేటాయించి అందునుండి వచ్చే ఆదాయాన్ని రాజుకు, రాజ

ప్రసాదానికి ఖర్చుల క్రింద వినియోగించేవారు. తరఫ్‌దార్ తనకు కేటాయించిన సైన్యాన్ని పోషించాలి. తరఫ్‌దార్‌లు శక్తివంతులు కాకుండా యుండుటకు రాష్ట్రములో ఒక కోట మాత్రమే వారి ఆధీనంలో ఉండేటట్లు, మిగలిన కోటలు కేంద్ర ప్రభుత్వ ఆధీనంలో "ఖిలాదార్" అజమాయిషీలో ఉండుటట్లే నిర్దేశింపబడింది. తరఫ్‌దార్‌ల జీతాలు నగదు రూపంలోగాని, వస్తురూపంలో గాని చెల్లించబడేవి. రాష్ట్ర గవర్నర్‌ల నియామకంలో గవాన్ స్వదేశీ, విదేశీ ప్రభు వర్గాల మధ్య సమతౌల్యతను పాటించాడు.

గ్రామాన్ని ప్రాతిపదికగా చేసుకొని భూమిని సర్వే చేయించి పంటను బట్టి శిస్తును నిర్ణయించేవారు.

బహమనీ రాజ్య చరిత్రలో గవాన్ పాలనా కాలం నిరుపమానమైనది. ఇతడు బహమనీ రాజ్యాన్ని ఉత్తరమున ఒరిస్సా నుండి దక్షిణమున కంచివరకు విస్తరింపజేశాడు. దక్కనీ, విదేశీ ప్రభువర్గాల మధ్య సమన్వయం సాధించి చక్కని పరిపాలనా వ్యవస్థను ఏర్పాటుచేశాడు. కాని స్వదేశీ ప్రభువర్గం అతడిపై ద్వేషంతో సుల్తాన్‌ను పదవీ భ్రష్టుని చేయుటకు విజయనగర ప్రభువుతో కుట్ర పన్నుచున్నాడని ఒక ఉత్తరంను సృష్టించిరి. వాస్తవం గ్రహింపని తప్పు తాగిన సుల్తాన్ గవాన్‌ను క్రీ.శ. 1481లో ఉరితీయించాడు. గవాన్ మరణంతో బహమనీ రాజ్యంలో అరాచకం ప్రబలెను. రాష్ట్ర పాలకులైన విదేశీ ప్రభువర్గం సుల్తాన్ అధికారంను ధిక్కరించి స్వతంత్రులైరి. తత్ఫలితంగా బహమనీ రాజ్య శిథిలాలపై ఐదు స్వతంత్ర రాజ్యాలు వెలిశాయి. అవియే బీదర్, బీజపూర్, బీరార్, అహమ్మద్‌నగర్, గోల్కొండ.

## 33.బి పాఠ్య ప్రశ్నలు :

1. మహమ్మద్ గవాన్ సారస్వత అభిమాని అని ఎట్లు చెప్పగలవు?
2. ఏ విదేశీ యాత్రికుడు మహమ్మద్ గవాన్ గురించి వివరించాడు?
3. దక్కన్ రాజ్యాల మధ్య సంఘర్షణకు మూల కారణమేమి?

## 33.8 బహమనీ రాజ్య విచ్ఛిన్నం :

బహమనీ రాజ్యం రెండు శతాబ్దాలు కొనసాగింది. తొలి సుల్తానులు బలవంతులు కనుక రాజ్యమనుగడ సాగింది. కడపటి సుల్తానులు బలహీనులగుటవలన వారు రాజ్యాన్ని కాపాడుకోలేకపోయారు.

దీనికితోడు బహమనీ కొలువులోని ప్రభువర్గం దక్కనీ, అఫ్‌కిస్ (Afaquis) విదేశీయులు – రెండు వర్గాలుగా చీలి పరస్పరం సంఘర్షణపడుతున్నాయి. అఫ్‌కస్‌యైన మహమ్మద్ గవాన్‌ను వజీరుగా నియమించుటతో ఈ సంఘర్షణ తారా స్థాయికి చేరింది. ఇరువార్గలను సమన్వయ పరచటానికి గవాన్ కృషి చేశాడు. కాని గవాన్ ప్రవేశపెట్టిన పాలనా సంస్కరణలు అనగా తరఫ్‌లను పెంచడం, తరఫ్‌దార్ల అధికారాలను తగ్గించడం మున్నగు చర్యలను దక్కన్ ప్రభు వర్గం తీవ్రంగా వ్యతిరేకించి, దొంగ ఉత్తరాన్ని సృష్టించి, సుల్తాన్ చేత గవాన్‌ను ఉరితీయించింది.

గవాన్ మరణంతో బహమనీ రాజ్యం అల్లకల్లోలమైంది. విదేశీ ప్రభువర్గం సుల్తాన్‌ను ధిక్కరించారు. గవాన్ నిర్దోషియని, తెలుసుకొని బాధతో సుల్తాన్ మహ్మద్‌షా (25 సంవత్సరాల వయస్సు) మరణించాడు. తదుపరి రాజ్యానికి వచ్చిన షిహబుద్దీన్ మహమ్మద్ 12 సంవత్సరాల బాలుడగుటవలన రాష్ట్ర గవర్నర్లను అదుపులో పెట్టలేక పోయాడు. రాజ్యంలో శాంతి భద్రతలను నెలకొల్పలేకపోయాడు.

ఇట్టి స్థితిలో పొరుగు రాజ్యాలు బహమనీ రాజ్యంపై దండెత్తాయి. విజయనగర సైన్యం గజపతుల రాజ్యం

వరకూ ఆక్రమింపగా, ఒరిస్సా పాలకులు బహమనీ సేనలను రాయచూరు అంతర్వేది నుండి తరిమివేశారు. క్రీ.శ. 1504లో బహమనీ సుల్తానులు రాయచూరు అంతర్వేదిని తిరిగి ఆక్రమించుకొన్నాక, అది ఎక్కువ కాలం వారి ఆధీనంలో లేదు. శ్రీకృష్ణదేవరాయల కాలంలో బహమనీ సుల్తానులు రాయచూరు, ముద్గల్, నల్గొల్ ప్రాంతాలను విజయనగరానికి అప్పజెప్పారు.

విజయనగర రాజ్యంతో దీర్ఘకాలిక సంఘర్షణ వలన బహమనీ రాజ్య ఆర్థిక వ్యవస్థ దెబ్బతింది. యుద్ధంలో అనేకమంది ప్రాణాలు కోల్పోగా, ప్రజలు నానా బాధలకు గురయ్యారు. పంటలు నాశనమైనాయి. కేంద్ర ప్రభుత్వం బలహీనమైంది.

క్రీ.శ. 1518లో షిహబుద్దీన్ మహమ్మద్ (Shihabuddin Mahammed) మరణించాడు. అతని అనంతరం రాజ్యానికి వచ్చిన నల్గురు కుమారులు వజీరు చేతిలో కీలు బొమ్మలు. ఇట్టి స్థితిలో రాష్ట్ర పాలకులు స్వాతంత్ర్యం ప్రకటించుటతో బహమనీ రాజ్యం ఐదు స్వతంత్ర రాజ్యాలుగా విభక్తమైంది. అవి ఏమనగా : 1) అహ్మద్ నగర్ – నిజాం షాహి వంశం. 2. బీజపూర్ – ఆదిల్‌షాహి వంశం. 3. గోల్కొండ – కుతుబ్‌షాహి వంశం. 4. బీరార్ – ఇమత్ షాహివంశం. 5. బీదర్ – బదార్ షాహి వంశం.

ప్రభువర్గంలోని దక్కన్‌లు, అఫ్‌కిస్‌లకు మధ్య సంఘర్షణ, విజయగనంతో నింతర యుద్ధాలు, కేంద్రంలో బలీయమైన ప్రభుత్వం లేకపోవుట, బహమనీ రాజ్య విచ్ఛిన్నానికి బలమైన కారణాలు.

## 33.9 విజయనగర రాజ్య పతనం :

కృష్ణదేవరాయలు మరణానంతరం (1530) అతని తమ్ముడైన అచ్యుతరాయలు సింహాసన మధిష్టించెను. అచ్యుతరాయలు, శ్రీ కృష్ణదేవరాయలు అల్లుడైన రామరాయల అండదండలతో రాజ్యపాలన సాగించాడు. కాని అచ్యుతరాయల మరణంతో విజయనగర సింహాసనానికి వారసత్వ యుద్ధం ప్రారంభమైంది. అచ్యుతరాయలు కుమారుడైన వెంకటపతి పిన్న వయస్కుడగుటవలన, అతని మేనమామయగు తిరుమలయ్య అతనిని వధించి సింహాసనమును హస్తగతం చేసుకున్నాడు. ఈ దురాగతం సహించని రామరాయలు తిరుమలయ్యను వధించి రంగరాయలు (కృష్ణదేవరాయలు తమ్ముడు) కుమారుడైన సదాశివరాయులును విజయనగర ప్రభువుగా చేసి సర్వాధికారాలను హస్తగతం చేసుకొన్నాడు.

రామరాయలు విజయనగర సామ్రాజ్యంలో బలీయమైన శక్తిగా ఎదిగే సమయానికి బహమనీ రాజ్యం ఐదు స్వతంత్ర రాజ్యాలుగా విభక్తమై పరస్పర కలహాలతో నిమగ్నమై యున్నాయి. ఈ కలహాలను ఆసరాగా గైకొని విభజించి పాలించు విధానం ద్వారా బహమనీ రాజ్య వ్యవహారాలలో జోక్యం చేసుకొని వానినంతం చేయ సంకల్పించాడు. తొలుత అహ్మద్‌నగర్, గోల్కొండ సుల్తానుల సాయంతో బీజపూర్ ను ఓడించాడు. తదుపరి బీజపూర్‌లో చేతులు కలిపి అహ్మద్‌నగర్, గోల్కొండలపై దాడి చేశాడు. రామరాయలు కపట దౌత్యాన్ని పసిగట్టి బహమనీ రాజ్యాలు తమలోని వైషమ్యాలు మరచి, సమక్యమై విజయనగరాన్ని నాశనం చేయాలని భావించాయి. బహమనీ రాజ్యాల సైన్యం 50 వేల అశ్వాలు, మూడు వేల మంది పదాతి దళం. ఫెరస్టారచన ప్రకారం రామరాయలు సైన్యంలో 70 వేల అశ్వాలు, 90 వేల పదాతిదళాలు ఉన్నాయి.

బహమనీ రాజ్యాల కూటమి విజయనగర సైన్యాన్ని 1565లో తళ్ళికోట వద్ద ఎదుర్కొంది. ఈ యుద్ధంలో రామరాయలు వధింపబడగా, లక్షమంది ప్రాణాలు కోల్పోయారు. ఈ వార్తవిన్నంతనే సదాశివరాయలు పెనుగొండకు

పారిపోయాడు. రక్షణ లేని విజయనగరాన్ని ముస్లిం సేనలు దోచుకొని, దగ్ధం చేశాయి. ఈ యుద్ధంలో దోచుకొనిన ధనంతో ప్రతి సైనికుడు ధనవంతుడయ్యాడని ఫెరిస్టా వ్రాశాడు. రాబర్ట్ సూయల్ చరిత్రకారుడు చెప్పినట్లు "విజయనగరం వర్ణనాతీతమగు ముస్లింల అమానుష, భీకర దృశ్యముల మధ్య శిథిలమైంది".

తళ్ళికోట యుద్ధానంతరం విజయనగర ప్రభువులు పెనుగొండను రాజధానిగా చేసుకొని సుమారు ఒక శతాబ్ది పాలించారు. కాని విజయనగర రాజకీయ, సైనిక, ఆర్థిక, ప్రాభవం సన్నగిల్లింది. రామరాయలు దౌత్యనీతితో విజయనగరానికి ఎట్టి మేలు చేకూరలేదు.

విజయనగర రాజ్య పతనానికి ముఖ్యకారణం రాయచూరు అంతర్వేది కొరకు బహమనీ సుల్తానులతో సంఘర్షణ పడుట. ఈ సంఘర్షణ విజయనగర ఆర్థిక వ్యవస్థపై కడు ప్రభావం కల్గించింది. కేవలం కొద్దిపాటి భూమి కొరకు ఇంతటి దీర్ఘకాలిక సంఘర్షణ అవసరమా? అనే విజ్ఞత వారికి లేకపోవుట శోచనీయం.

వీటికితోడు విజయనగర రాజ్యపతానికి మరొక కారణం నాయంకర విధానం. ఈ విధానంలో నాయంకారులు సొంత సైన్యాన్ని కల్గియుండుటవలన, బలహీనమైన చక్రవర్తులు వారిని నియంత్రించడంలో విఫలులగుటవలన, వారు స్వతంత్రులగుటకు వీలు కల్గెను.

ఇట్లు అనేక కారణాలు విజయనగర రాజ్య పతనానికి దారితీశాయి.

రామరాయలు అనుసరించిన విధానములు విజయనగర పతనానికి ముఖ్య కారణం. బహమనీ రాజ్యాలను కూటమిగా ఏర్పడి తళ్ళకోట యుద్ధంలో విజయనగరాన్ని ధ్వంసము చేశారు.

## 33.సి పాఠ్యప్రశ్నలు :

1. బహమనీ కొలువులోని ప్రభువర్గం ఏ వర్గాలుగా చీలిపోయాయి?
2. గవాన్ ఉరితీత బహమనీ రాజ్య విచ్ఛిన్నానికి ఎలాదోహదం చేసింది?
3. విజయనగర, బహమనీ రాజ్యాల విచ్ఛిన్నతకు దోహదం చేసిన ఉమ్మడి కారణమేమి?
4. రామరాయలు సిద్ధాంతాలు విజయనగర రాజ్యంపై కల్గించిన ఫలితాల ప్రభావం ఏమి?

## సారాంశం :

సంగమవంశీయులలో రెండవ దేవరాయలు గొప్పవాడు. ఇతడు బలమైన చక్రవర్తి. శ్రీలంక,పెరు, పాలకులు ఆయనకు కానుకలు సమర్పించి, ఆయన సార్వభౌమత్వాన్ని గుర్తించారు. సుశిక్షుతులైన ముస్లిం విలుకాండ్రను తన సైన్యంలో చేర్చుకొని తన సైన్యాన్ని పటిష్టవంతం చేశాడు. ఇతడు విజయనగరాన్ని వైభవోపేతమైన నగరంగా తీర్చిదిద్దాడు. విజయనగర వైభవాన్ని గూర్చి ఇతని కాలంలో విజయనగరాన్ని సందర్శించిన విదేశీయులైన అబ్దుల్ రజాక్, నికోలో కాంటి అభివర్ణించారు.

విజయనగర ప్రభువులలో గొప్పవాడు తుళువ వంశీయుడైన – శ్రీ కృష్ణదేవరాయలు. ఇతడు బహమనీ సుల్తానులకు, కళింగ గజపతిని ఓడించి రాజ్య విస్తరణగావించాడు. ఉదార స్వభావుడగుట వలన ప్రజాహిత సంస్కరణలు ప్రవేశపెట్టాడు. ఇతడు గొప్ప పండితుడు. తెలుగులో ఆముక్త మాల్యద యను గ్రంథాన్ని రాశాడు. ఇతని పాలనా కాలం

తెలుగు  భాషా చరిత్రలో స్వర్ణయుగం. భిన్నమత ఆస్తులు సుఖశాంతులతో మెలిగేవారు.

పాలనా సౌలభ్యం కొరకు విజయనగర  రాజ్యం రాష్ట్రాలుగా, జిల్లాలుగా, గ్రామాలుగా విభజింపబడెను. సైన్య పోషణార్థం కొన్ని భూములు నాయక్‌లకు ఈయబడెను.

భూమి రెండు రకాలుగా అనగా నీటిపారుదల సౌకర్యంగల, నీటిపారుదల సౌకర్యంలేని భూమిగా విభజింపబడి, ఆప్రాతిపదికనే భూమి శిస్తు నిర్ణయింపబడింది. ఇంకా అనేక ఇతర పన్నులు కూడా విధింపబడెను.

బహమనీ రాజ్యం మహమ్మద్ గవాన్ సేవలవలన సుప్రసిద్ధమైంది. ఇతడు ప్రభువర్గంలోని స్వదేశీ, విదేశీ వర్గాలను  సమన్వయపరచాడు.

బహమనీ రాజ్యాన్ని మాల్వాదాడుల నుండి కాపాడాడు. తన పాలనా సంస్కరణల ద్వారా బహమనీ రాజ్యాన్ని సుస్థిరపరచాడు. రాజ్యాన్ని ఎనిమిది తరఫ్‌లుగా విభజించి, తరఫ్‌దారుల ఆధీనంలో ఉంచాడు. తరఫ్‌దారుల అధికారాలను తగ్గించాడు. విద్యాభివృద్ధికై బీదర్‌లో మదరసాను స్థాపించాడు. ఈ మదరసాకు ఇరాన్, ఇరాక్‌ల నుండి పండితులు వచ్చేవారు. భూమిని సర్వేచేయించి, భూసారాన్ని బట్టి పన్ను విధించాడు.

బహమని, విజయనగర రాజ్యాల పతనానికి కారణాలు ఒకే విధం. ఈ రెండు రాజ్యాలు నిరంతరం రాయచూరు అంతర్వేది కొరకు సంఘర్షణపడి ఆర్థికంగా నష్టపోయారు. బహమనీ రాజ్యంలో ప్రభువర్గంలో స్వదేశీ విదేశీ వర్గాల మధ్య నెలకొన్న వైరంవలన – గవాన్ బలీయుడగుటంతో బహమనీ రాజ్యం దెబ్బతింది. తరఫ్‌దారులు స్వాతంత్ర్యం ప్రకటించుకోవడంతో బహమనీ రాజ్యం పతనమైంది. అలాగే తళ్ళికోట యుద్ధానంతరం విజయనగరం సైతం తమ సామంతులైన నాయక్‌లు స్వాతంత్ర్యం ప్రకటించుటతో పతనమయ్యారు.

## అభ్యాసం

1. 50 మాటలలో సమాధానము వ్రాయుము?

   ఎ. విదేశీ రచనల ఆధారంగా రెండవ దేవరాయలు పాలనా కాలంను వర్ణింపుము.

   బి. విజయనగర చరిత్రలో తళ్ళకోట యుద్ధం ఎలా మలుపురాయి?

2. విజయనగర ప్రభువులలో శ్రీ కృష్ణదేవరాయలు ఎలా గొప్పవాడు?
3. విజయనగర పాలనా విధానంను వర్ణింపుము?
4. బహమనీ రాజ్యాన్ని మహమ్మద్ గవాన్ ఏల సుస్థిరపరచాడు?
5. మహమ్మద్ గవాన్ ప్రవేశపెట్టిన పాలనా సంస్కరణలేమి?
6. బహమనీ విజయనగర రాజ్యాల పతనానికి గల కారణము లేవి?

**పాఠ్య ప్రశ్నలకు జవాబులు :**

**33.ఎ**

1. విదేశీయులైన న్యూనిజ్, అబ్దుల్ రజాక్, నికోలో కాంటి రచనలు.
2. ఆముక్త మాల్యద, జ్ఞాన చింతామణి, రసమంజరి (ఏ రెండైనా).
3. విజయనగర రాజ్యంలో సైన్యాన్ని పోషించే ఫ్యూడల్ వర్గం.

**33.బి**

1. బీదర్‌లో మదరసాను స్థాపించాడు.
2. రష్యా యాత్రికుడైన నికొటిన్
3. ఆర్థిక రాజ్య కాంక్షలు.

**33.సి**

1. అఫ్‌కాస్, దక్కన్.
2. రాష్ట్ర గరవ్నర్లను అదుపులో నుంచగల బలీయమైన కేంద్ర ప్రభుత్వం లేకపోవడం.
3. ఇరు రాజ్యాలు నిరంతరం అధిక వ్యయ ప్రయాసలతో యుద్ధాలలో నిమగ్నమగుట.
4. బహమనీ రాజ్యాలు ఒక కూటమిగా ఏర్పడి, విజయనగరాన్ని నాశనం చేయటానికి దోహదం చేసింది.

# 34

# మొగల్ సామ్రాజ్య స్థాపన -I

## 34.1 పరిచయం :

ఇంతకుముందు మాడ్యూల్‌లో మీరు ఢిల్లీ సుల్తానుల చరిత్ర గురించి చదువుకున్నారు. ఈ పాఠంలో మీరు క్రీ.శ. 16వ శతాబ్దం ప్రథమార్థంలో భారతదేశానికి వచ్చి కొన్ని శతాబ్దాలపాటు పాలించిన మొగల్ చక్రవర్తులను గురించి తెలుసుకుంటారు. భారత రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక చరిత్రలో మొగల్ పాలన ఒక ప్రత్యేక స్థానాన్ని పొందింది. మొగలులు దేశంలోని అనేక పెద్ద పెద్ద (విశాల) ప్రాంతాలలో శాంతి భద్రతలను నెలకొల్పి ఏకీకరణ సాధించడంలో సఫలీకృతులైనారు. సాంస్కృతికంగా మొగలుల కాలం వాస్తు, శిల్ప, సంగీత మరియు సారస్వత కళల్లో అంతకుముందెన్నడూ లేని విజయాలను సాధించింది. ఈ పాఠంలో మొగల్ సామ్రాజ్య స్థాపనకు భారతదేశంలో అనుకూలించిన పరిస్థితులను సంఘటనలను గురించి తెలుసుకుందాం.

భారతదేశంపై తొలి మొగల్ దండయాత్ర చరిత్రను మూడు దశలుగా విభజించవచ్చు. 1. మొదటి దశ (క్రీ.శ. 1526–1530 బాబర్) ఆఫ్ఘన్‌లు మరియు రాణా సంగ్రామ సింహ నాయకత్వంలోని రాజపుత్రులను లొంగదీసుకొనడాన్ని తెలియజేస్తుంది. ఇది భారతదేశంలో మొగల్ సామ్రాజ్య స్థాపనకు దారితీసింది. 2. రెండవదశ (1530–40)లో బాబర్ కుమారుడు హుమాయూన్ పాలన ఆరంభమైంది. హుమాయూన్ మాళ్వా, గుజరాత్, తూర్పు భారతదేశ ప్రాంతాలను జయించుటకు విఫలయత్నం చేశాడు. ఆఫ్ఘన్ సర్దార్ షేర్‌షాసూర్ హుమాయూన్‌ను భారతదేశం నుండి బహిష్కరించగలిగాడు. 3. మూడవదశ (1545–1556)లో సూర్ వంశ అంతం మరియు మొగల్ సామ్రాజ్యమును హుమాయూన్ అతని కుమారుడు అక్బర్ పునఃస్థాపన చేయటాన్ని తెలుపుతుంది.

## 34.2 లక్ష్యాలు :

ఈ పాఠం చదివిన తరువాత మీరు క్రింది విషయాలు తెలుసుకొంటారు.

1. బాబర్ ఉత్తర భారతదేశ దండయాత్రకు దారితీసిన 15వ శతాబ్దం నాటి మధ్య మరియు పశ్చిమాసియాలో వచ్చిన మార్పులను గుర్తించటం.
2. భారతదేశంలో సామ్రాజ్య స్థాపనలో బాబర్ ఉద్దేశాలను గుర్తించటం.
3. 16వ శతాబ్ది ఆరంభం నాటి భారతదేశ రాజకీయ పరిస్థితులను చర్చించటం.

4. బాబర్ ఇబ్రహీంలోడీల మధ్య క్రీ.శ. 1526లో జరిగిన పానిపట్టు యుద్ధం ప్రభావాలు, ప్రాధాన్యత.

5. బాబర్ రాణా సంగ్రామసింగ్‌ల మధ్య క్రీ.శ. 1527లో జరిగిన కాణ్వాయుద్ధ ప్రభావాల ప్రాధాన్యత.

6. బాబర్ – ఆఫ్ఘన్‌ల మధ్య 1529లో జరిగిన గోగ్రా యుద్ధ ప్రభావాలు.

7. హుమాయూన్ సింహాసనం ఎక్కే సమయంలో ఎదుర్కొన్న సమస్యలు.

8. హుమాయూన్ భారతదేశంలోపల ఎదుర్కొన్న రెండు ప్రముఖశక్తులైన గుజరాత్ నేలు బహదూర్ షా మరియు తూర్పు భారత్‌లో షేర్షా ఆధ్వర్యంలోని ఆఫ్ఘన్‌లను గుర్తించటం.

9. హుమాయూన్ భారత సింహాసనమును తిరిగి చేజిక్కించుకొని మొగల్ సామ్రాజ్య పునఃస్థాపన చేసిన విధం.

## 34.3 బాబర్ – మొగల్ సామ్రాజ్య స్థాపన:

బాబర్ భారతదేశంలో మొగల్ సామ్రాజ్య స్థాపన చేశాడు. అతడు మధ్య ఆసియాలోని చెంఘిజ్‌ఖాన్ మరియు తైమూర్ అనే ఇద్దరు ప్రముఖ యుద్ధ వీరుల వారసత్వమును పొందాడు. క్రీ.శ. 1494లో, 14 సంవత్సరాల మయస్సులో బాబర్ తన తండ్రి నుండి ట్రాన్స్ ఆక్సియానా (Trans oxiana) (తైమూర్ సామ్రాజ్యంలోని చిన్న భాగం)లోని పర్ఘానా (Farghana) అనే చిన్న రాజ్యమును వారసత్వంగా పొదాడు. మొదట బాబర్ కోరికలు కేవలం మధ్య ఆసియాకే పరిమితమైనవని మనం గ్రహించాలి. తైమూర్ విశాల సామ్రాజ్యమునకు రాజధాని నగరమైన 'సమర్‌ఖండ్' (Samarkhand) జయించాలనేది అతని చిరకాల వాంఛ. పశ్చిమాసియాలో ప్రముఖ సాంస్కృతిక కేంద్రమైన సమర్‌ఖండ్ పాలకుడు యావత్ ఇస్లాం ప్రపంచంలో అంతులేని గౌరవ ప్రతిష్టలను పొందాడు. ఐతే అంతుకుముందే ట్రాన్స్ ఆక్సియానా (Trans Oxiana)లోకి చొచ్చుకొని పోయిన సున్నీలైన ఉజ్బెక్‌లు, ఇరాన్‌లు తమ ప్రాబల్యమును పెంచుకోవడం ప్రారంభించిన సఫ్లావిడ్లు అయిన షియాలు అనే రెండు బలమైన శక్తులు, మధ్య మరియు పశ్చిమాసియాలో రాజకీయ, మత ఘర్షణలలో (Sectanian conflicts) నిమగ్నమై ఉన్నందువల్ల బాబర్‌కు మధ్య ఆసియా గురించిన ఆకాంక్షలు నెరవేరకుండా చేశాయి. ఈ రాజకీయ నేపథ్యంను లెక్కచేయని బాబర్ సమర్‌ఖండ్‌ను ఆక్రమించుటకు అనేకసార్లు ప్రయత్నించినా దానిని శాశ్వతంగా పొందడంలో విఫలమయ్యాడు. నిజానికి బాబర్ తన మాతృభూమిలో పూర్వీకుల నుండి పొందిన పర్ఘానాలను కూడా కోల్పోయాడు. ఏదో విధంగా ఈ మధ్యకాలంలో బాబర్ కాబూల్, బడక్షాన్ (Badakshan) మరియు కాందహార్‌లను జయించాడు. ఉజ్బిక్‌లు ట్రాన్స్ ఆక్సియానాకు తిరుగులేని పాలకులవ్వటంతో బాబర్‌కు మధ్య ఆసియాకు సంబంధించిన కలలు పూర్తిగా కల్లలైనట్లు తేలిపోయింది. ఈ పరిస్థితులలో బాబర్‌కు భారత్‌పై దండయాత్ర చేయడం తప్ప వేరే గత్యంతరం లేకపోయింది.

### బాబర్ దండయాత్రకు కారణాలు :

బాబర్ భారత్‌ను జయించాలనే కోరిక కలగడానికి, సమర్‌ఖండ్‌ను పొందడానికి చేసిన విఫలయత్నాలతోపాటు అనేక ఇతర కారణాలున్నవి. అందుమొదటిది, మధ్య ఆసియా నుండి వచ్చిన ఇతర దండయాత్రీకుల మాదిరిగానే బాబర్ కూడా భారత్ యొక్క అపారమైన సిరిసంపదలకు ఆకర్షితుడైనాడు. బాబర్ తన స్వీయ చరిత్ర అయిన తుజికి బాబరీ (Tuzuk -I-Babari)లో "హిందూస్థాన్ యొక్క అత్యున్నత ప్రయోజనములు ఏమంటే విశాల భూభాగాలతోపాటు

నాణెములుగా నున్నవని, నాణెములు ముద్రించని బంగారు రాశులు" ఇక్కడ అపారంగా లభించుట అని రాశాడు. బాబర్ పూర్వీకుడైన తైమూర్ భారతదేశ అమూల్యమైన సిరిసంపదలను కొల్లగొట్టుకొని వెళ్ళి ఆసియాలో తన సామ్రాజ్య సుస్థిరతకు దానిని వినియోగించాడు. అంతేగాక కాబూల్‌పై వచ్చే ఆదాయం చాలా స్వల్పంగా ఉండి అక్కడ పరిపాలన మరియు సైన్య ఖర్చులకే సరిపోయేది కాదు. అటువంటి అతి తక్కువ ఆదాయంతో తన సర్దారులను (బ్రేగ్‌లు), కుటుంబీకులను (Kinsmen) కూడా తృప్తి పరచలేకపోయాడు. తన పూర్వీకుడు తైమూర్‌చే విలీనం చేయబడి చాలా సంవత్సరాలపాటు అతని పాలనలో నున్న పంజాబ్‌లోని కొన్ని ప్రాంతాలను తన రాజ్యంలో కలుపుకొనటం, బాబర్‌కు సమంజసమైన చర్యగా తోచింది. మూడవది, బాబర్ కాబూల్‌పై ఉజ్బెక్ దాడిని శంకించి తనకు భారతదేశమే సురక్షితమైన ప్రదేశంగా భావించడమేగాక ఉజ్బెక్‌పై దాడులు చేయడానికి ఇదే సరైన స్థావరంగా తలచాడు. 16వ శతాబ్ది ప్రారంభంలో భారత రాజకీయ పరిస్థితులు కూడా బాబర్‌కు అనుకూలించాయి. పటిష్టమైన కేంద్రం ఏర్పాటుకై ఇబ్రహీంలోడి ప్రయత్నం అపుటను సర్దారులకు కంటగింపైంది. పంజాబ్ గవర్నరైన దౌలత్‌ఖాన్ ఇబ్రహీంలోడిపై తిరుగుబాటు చేసాడు. మరోవైపు మేవార్ రాజైన రాణాసంగా మాళ్వా, రణతంబోర్, భిల్సా, చందేరిలను జయించి విజయోత్సాహంతో ఖిల్జీపై కన్నువేశాడు. ఆఫ్ఘన్ సర్దారుల అసంతృప్తి వలన దౌలత్‌ఖాన్ మరియు ఆలమ్‌ఖాన్‌లు బాబర్‌ను భారత్‌పై దండెత్తి ఇబ్రహీంలోడీని తొలగించమని ఆహ్వానించారు. అదేకాలంలో రాణా సంగ్రామ సింహునికి బాబర్‌కు మధ్య కొంత ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగేఉండవచ్చు. ఐతే ఆఫ్ఘన్ సర్దారులుగాని, రాణా సంగ్రామ సింహుడుగాని బాబర్‌ను కేవలం ఒక దండయాత్రీకుడుగానే భావించి ఢిల్లీ పీఠాన్ని బాబర్ సహాయంతో దక్కించుకోవచ్చని అత్యాశకుపోయారు. ఈ ఆహ్వానములతో బాబర్ తన భారతదండయాత్రకు తగిన సమయం ఆసన్నమైందని సమర్థించుకున్నాడు.

**పానిపట్టు యుద్ధం (1526) :**

భారత్‌పై బాబర్ తన తొలి దెబ్బను క్రీ.శ. 1525లో కాబూల్ నుండి బయలుదేరి పంజాబ్‌ను ఆక్రమించి దౌలిత్‌ఖాన్‌లోడిని లొంగదీసుకోవడంతో ప్రారంభిచంచాడు. పంజాబ్‌ను ఆక్రమించిన బాబర్ ఢిల్లీ సింహాసనమును ఆక్రమించుకోవడమనే అతి కష్టమైన నూతన లక్ష్యమును చేపట్టాడు. తన సైన్యాలతో ఇబ్రహీంలోడీ రాజ్యమైన ఢిల్లీ వైపు పయనించాడు. ఇబ్రహీంలోడీని క్రీ.శ. 1526లో చారిత్రాత్మక పానిపట్టు వద్ద ఎదుర్కొన్నాడు. బాబర్‌కు అతి పెద్ద దళం శతఘ్ని (Artillery) 12000 మందితో చిన్నదైనా, బహు శక్తి సామర్థ్యం కలిగిన పదాతి దళము ఉండేది. మరొకవైపు ఇబ్రహీంలోడి సైన్యం లక్షలమందితో అతి పెద్దదిగా ఉందని బాబర్ అంచనా. అయితే బాబర్‌కు ప్రముఖ సేనా నాయకునిగా, యుద్ధ చరిత్రలు తెలిసిన నాయకుడుగా, 12 సంవత్సరాల వయస్సు నుండే మధ్య ఆసియాలో భయంకరమైన యుద్ధ రంగములో పాల్గొన్న అనుభవముంది. తుజుకీ బాబర్ (Tuzk-I-Baburi)లో బాబర్ చెప్పిట్లు ఇబ్రహీంలోడీ అనుభవం లేనివాడు. తన కదలికలపట్ల జాగరూకత లేనివాడు. నిస్సహాయకుడు, ముందు చూపు లేనివాడు, యుద్ధమును విరమించడానికిగాని తాత్కాలికంగా ఆపడానికి గాని ఒక విధానంలేనివాడు 'బాబర్ తూల్ఘామా' (Tulghama)లోని సాంప్రదాయ విత్తులు, శతఘ్నిదళాల కృషి, ఫిరంగి ప్రయోగం వంటి వాటిని సమర్థవంతంగా వినియోగించుకొని తన స్థానమును సుస్థిరం చేసుకున్నాడు. బాబర్ యుద్ధ తంత్రం గురించిన విషయాలను మీరు తర్వాత పాఠంలో చదువుకుంటారు. ఆ విధంగా తన యుద్ధ నైపుణ్యంతో ఇబ్రహీంలోడీని పానిపట్టు యుద్ధంలో సంహరించి విజేతగా నిలిచాడు.

### పానిపట్టు యుద్ధ ప్రభావాలు, ప్రాముఖ్యత

పానిపట్టు యుద్ధం అత్యంత ప్రాధాన్యమైన యుద్ధం. ఈ యుద్ధం భారతదేశంలో మొగల్ సామ్రాజ్యస్థాపనకు దారితీసింది. ఈ యుద్ధం ఇబ్రహీంలోడీ అధికారంను తుదముట్టించి, ఢిల్లీ, ఆగ్రాల వరకు గల మొత్తం భూభాగమును బాబర్ నియంత్రణలోకి తెచ్చింది. ఇబ్రహీంలోడీ సిరి సంపదలతో బాబర్‌కున్న ఆర్థిక సమస్యలు తీరిపోయినవి. బాబర్ కన్ను తూర్పు భారతదేశంలోని సుసంపన్న ప్రాంతాలపై పడింది.

ఐతే బాబర్‌కు పానిపట్టు యుద్ధం నిర్ణయాత్మకమైన దేమీ కాదు. దానివల్ల భారతదేశంపై బాబర్‌కు నిజమైన సార్వభౌమాధికారం లభించలేదు. అతడు ఇంకా తూర్పు ఆఫ్ఘన్ (కులీనులు) సర్దారులు, రాణా సంగ్రామసింహుని నాయకత్వంలోని రాజపుత్రుల వంటి ఇతర బలమైన శక్తులను ఎదుర్కొనవలసి ఉంది. వారు రాజకీయ అధిపత్యమును కాంక్షించి బాబర్‌ను ఎదుర్కొనుటకు సిద్ధంగా ఉన్నారు. బాబర్ యొక్క లక్ష్య ప్రాధాన్యతను అర్థం చేసుకోవాలంటే అది పానిపట్టు యుద్ధంతో ప్రారంభమైందని చెప్పవలసి ఉంటుంది. సామ్రాజ్య స్థాపన అనే అతని లక్ష్య సాధనా మార్గంలో పానిపట్టు యుద్ధం మొదటి అడుగు. ఉత్తర భారతదేశాన్ని ఆధీనం చేసుకొనే పోరాటానికి ఈ యుద్ధం ఒక నూతన దశకు అంకురార్పణ చేసింది.

పానిపట్టు యుద్ధ విజయం తర్వాత బాబర్ ఎన్నో కష్టాలనెదుర్కోవలసి వచ్చింది. అతడు తన కులీనులను సైన్యమును సరితుష్టులను చేయాల్సి వచ్చింది. భరించలేని వేడి మరియు నిధుల లేమి వల్ల వారు భారతదేశంలో సుదీర్ఘ దండయాత్రలకు సుముఖత చూపలేదు. పైగా వారుస్వదేశమునకు తిరిగి వెళ్ళాలని కోరుకున్నారు. అయితే బాబర్ తాను భారతదేశంలోనే ఉండదలిచానని కాబూల్‌కు తిరిగి వెళ్ళదలచిన కులీనులకు సెలవు ఇవ్వబడుతుందని తన స్థిర నిర్ణయాన్ని ప్రకటించాడు. అతడు తన డైరీలో "కాబూల్ పేదరికం మనకు మరల వద్దు" అని రాసుకున్నాడు. ఈ విధమైన బాబర్ ధైర్యం, స్థిర నిర్ణయంతో మిక్కిలి అసంతృప్తి చెందిన కులీనులలో సైతం ధైర్యంను, నమ్మకంను నింపుటలో కృతకృత్యుడైనాడు.

### ఖాన్వా యుద్ధం (1527) (Battle of Khanwa)

తరువాత బాబర్ రాణా సంగ్రాంతో తప్పనిసరి పరిస్థితులలో యుద్ధానికి సిద్ధం కావలసి వచ్చింది. బాబర్ గంగా – సింధు మైదానంలో సామ్రాజ్య స్థాపన చేయటం, భారతదేశంలోనే స్థిర పడాలని నిర్ణయం తీసుకోవడం రాణా సంగ్రాంకు ఒక అవరోధంగా మారింది. బాబర్‌ను భారత్ నుండి వెళ్ళగొట్టడం లేదా కనీసం పంజాబ్‌కు పరిమితం చేయాలని ఆయన భావించాడు. ఇబ్రహీంలోడి తమ్ముడు మహ్మద్‌లోడీతో కలసి అనేక ఆఫ్ఘన్లు రాణా సంగ్రాం గెలిచినట్లఇయతే ఢిల్లీ సింహాసనాన్ని తిరిగి పొందవచ్చనే ఆశతో రాణా సంగ్రాంతో చేతులు కలిపారు. దీంతో బాబర్ కార్యం ఇంకా కష్టతరమైంది. మేవాట్ (Mewat) పాలకుడగు హసన్ ఖాన్ మేవాటి (Hasan Khan Mewati) కూడా రాణా సంగ్రాం పక్షం వహించాడు. దాదాపు ప్రముఖ రాజపుత్ర రాజులందరు (మార్వార్, అంబర్, గ్వాలియర్, అజ్మీర్, చందేరి) రాణా సంగ్రాంకు అండగా సైనిక దళాలను పంపారు.

ఈ సమయంలో బాబర్‌కు రెండు అంశాలు సహాయపడినాయి. మొదటిది – కొందరు ప్రముఖ ఆఫ్ఘన్ సర్దారులు బాబర్‌ను కేవలం దోపిడీదారుడు, విధ్వంసకారుడుగా కాక విజేతగా గుర్తించి తమకు తాము బాబర్‌కు విధేయతను ప్రకటించారు. వారికి బాబర్ అమూల్యమైన భూదానాలను ఇచ్చాడు. రెండవది – బాబర్ ఎన్నో భూభాగాలను పాదాక్రాంతం

చేసుకున్నాడు. అతడు తాను ఇంకా జయించాల్సిన పట్టణాలను, దుర్గాలను కులీనులకు రాసిచ్చి, వాటిని తమ ఆధీనంలోకి తెచ్చుకోవడానికి కావలసిన కొంత సైనిక బలగాన్ని కూడా ఇచ్చాడు. దీంతో వెంటనే కులీనులు తృప్తిచెంది, బలమైన రాజ్యాలను జయించడానికి కావలసిన నూతన వనరులను అతనికి అందుబాటులోకి తెచ్చారు.

బాబర్ మరియు రాణా సంగ్రాల మధ్య యుద్ధం 1527లో ఖాణ్వా (ఆగ్రాకు పశ్చిమాన ఒక గ్రామం) వద్ద జరిగింది. బాబర్ రాతల ప్రకారం, రాణా సంగ్రాం సైన్యంలో రెండు లక్షల మందిపైగా ఉన్నారు. అందులో ఆఫ్ఘన్‌లు మరియు మేవటిలచే పంపబడిన అనేక మంది కలిసి ఉన్నారు. ఐతే బాబర్, తక్కువ సంఖ్యలోనున్న తన బలగాన్ని పరిగణలోకి తీసుకోకుండా పానిపట్టు యుద్ధంలో వాడిన వ్యూహాన్ని అంటే తుల్ఘామా యుద్ధ తంత్రం, శతఘ్ని దళాన్ని ఫిరంగులను, ఉపయోగించి రాణా సంగ్రాంపై విజయం సాధించగలిగాడు.

### ఖాణ్వా యుద్ధ ప్రాధాన్యత, పరిణామాలు

భారతదేశపు చరిత్రగతిని మార్చివేసిన ప్రముఖ యుద్ధాలలో ఖాన్వాయుద్ధం తప్పకుండా ఒకటి అనుటలో సందేహంలేదు. దీని పర్యవసానంగా బలమైన రాజపుత్ర కూటమి ఓడిపోయింది. ఢిల్లీ సుల్తానుల పతనానంతరం రాజపుత్రుల ప్రణాళిక ఐక రాజపుత్ర రాజకీయ ఆధిపత్య అవకాశంను ఈ యుద్ధం విచ్ఛిన్నం చేసింది. వాస్తవానికి సమైక్య రాజపుటానాను ఆగ్రా వరకు విస్తరింపజేయాలనే కల రాణా సంగ్రాం మరణంతో నెరవేరకుండా పోయింది. ఈ యుద్ధం బాబర్ జీవన ప్రగతిలో ఒక నూతన ఘట్టానికి గుర్తుగా నిలిచింది. ఇక్కడి నుంచి బాబర్ తన అధికార విస్తరణకు పోరాడటం, తిరుగుబాటుదార్లను ఏరివేయడం, తన రాజ్యంలో శాంతిని నెలకొల్పడం కోసం ప్రయత్నించాడేకాని సింహాసనం కోసం ఏనాడూ యుద్ధం చేయలేదు. బాబర్ అధికార కేంద్రీకరణ కాబూల్ నుండి హిందూస్థానానికి మారటంతో ఈ యుద్ధం ప్రనాధాన్యతను సంతరించుకొంది.

ఖాణ్వా యుద్ధం అప్పటికీ ఢిల్లీ – ఆగ్రా ప్రాంతంలో బాబర్ స్థానం సురక్షితం చేసినప్పటికీ, అతడు ఆగ్రాకు తూర్పుగా నున్న గ్వాలియర్ దోత్‌పూర్ కోటల సముదాయమును జయించి తన స్థానాన్ని మరింత పటిష్టపరచుకున్నాడు. అతడు హసన్‌ఖాన్ మేవటి (Hasan Khan Mewati) నుండి ఆల్వార్‌లోని అతి పెద్ద భూభాగాన్ని తన రాజ్యంలో విలీనం చేసుకున్నాడు. ఆ తర్వాత మాళ్వాలో చందేరి నేలు మేదినీరాయ్ (Medini Rai) పై దండెత్తి దానిని వశపరచుకొన్నాడు.

### గోగ్రా యుద్ధం (Battle of Ghogra 1529)

తర్వాత బాబర్ తన దృష్టిని తూర్పు భారత్‌లోని ఆఫ్ఘన్ సర్దారులను లొంగదీసుకొనటంపై పడింది. ఆఫ్ఘన్‌లు అంతకుముందే ఓడినప్పటికీ వారు మొగల్ పాలన క్రిందకు పూర్తిగా రాలేదు. వాస్తవానికి వారు మహమ్మద్ లోడీని తమ పాలకునిగా ప్రకటించి అతని నాయకత్వంలో ఏకమయ్యారు. ఆఫ్ఘన్ సర్దారులకు బెంగాల్ పాలకుడగు నస్రత్ షా అండగా నిలిచాడు. బాబర్ ఈ ప్రతిఘటనను నిర్లక్ష్యం చేయలేకపోయాడు క్రీ.శ. 1529లో బాబర్ గోగ్రా నది ఒడ్డునుండి ఆఫ్ఘన్ సర్దారుల మరియు బెంగాల్ నేలు నస్రత్ షాల ఉమ్మడి సైన్యాలను తరిమి కొట్టారు. కాని బాబర్ ఈ దాడిలో ఎటువంటి గొప్ప విజయాలను పొందలేకపోయాడు. బీహార్‌లో చాలా భాగం ఆఫ్ఘన్ సర్దారుల చేతిలోనే ఉండిపోయింది.

గోగ్రా యుద్ధం ద్వారా ఆఫ్ఘన్ సర్దారులు శాశ్వతంగా మొగలు ఆధీనంలోకి రాలేదు. నిజానికి అనతి కాలంలోనే

షేర్షా నాయకత్వంలో ఆఫ్ఘన్‌లు ఒక మహత్తర శక్తిగా ఎదిగి నూతనంగా ఆవిర్భవించిన మొగల్ సామ్రాజ్యంనకు ఒక బలమైన సవాలును విసిరారు. ఎట్టకేలకు బాబర్ ఉత్తర భారతంలోని అత్యధిక ప్రాంతంపై సార్వభౌమత్వాన్ని ప్రతిష్టించాడు. 1529లో బాబర్ తన డైరీలో రాసుకొన్నట్లు “హిందూస్థాన్ విషయాలు అతి కష్టం మీద కొంతవరకు ఒక క్రమంలోకి తేబడినవి”. ఐతే నిరంతర యుద్ధాల వల్ల బాబర్ తన సామ్రాజ్యంను సుస్థిర పరిపాలన ద్వారా దృఢ పరచుకోలేకపోయాడు. బాబర్ భారతదేశంలో మొగలు సామ్రాజ్య స్థాపనకు పునాదిరాయి వేసిన నిర్మాత. అతడు వేసిన పునాదిరాయి మీద తర్వాత వచ్చిన మహా చక్రవర్తి అక్బర్. ఒక గొప్ప సామ్రాజ్యమనే మహా భవనంను నిర్మించాడు.

బాబర్, భారతదేశంలో లోడీలు, రాజపుత్రుల నణచి మొగలు సామ్రాజ్య స్థాపన చేసిన బెంగాల్ చక్రవర్తి. అతడు తుల్ఘామా (Tulghama)లో నియుద్ధ తంత్రములైన శతఘ్నిదళం, ఫిరంగి ప్రయోగాలను హిందూస్థాన్‌పై లోడిలతో చేసిన పానిపట్టు యుద్ధంలోను, రాజపుత్రులపై చేసిన కాణ్వాయుద్ధంలోను తూర్పు ఆఫ్ఘనిస్తాన్ మరియు బెంగాల్ నేలు నస్రత్‌షాపై చేసిన గోగ్రా యుద్ధంలోను ఉపయోగించాడు.

### పాఠ్యంశ ప్రశ్నలు 34 ఎ

1. బాబర్ తన ఆశయములను మధ్య ఆసియా నుండి భారతదేశానికి మార్చుకొనుటలోగల కారణమేమిటి?
2. బాబర్ దండయాత్ర సమయంలో ఉత్తర భారతదేశంలో ప్రాబల్య సమతౌల్యాన్ని నియంత్రించిన మూడు ముఖ్య వాఖ్యాలు ఏవి?
3. బాబర్ సైన్యం ఇబ్రహీంలోడీ సైన్యం కన్నా సంఖ్యాపరంగా చిన్నదైనప్పటికీ పానిపట్టు యుద్ధంలో గొప్పదిగా నిరూపించుకొనబడటానికి కారణమేమి?
4. పానిపట్టు యుద్ధం తర్వాత బాబర్ భారతదేశంలో ఎదుర్కొన్న సమస్యలు ఏవి?

## బహదూర్ షా, షేర్‌షాతో హుమాయూన్ పోరాటాలు

క్రీ.శ. 1530 బాబర్ మరణానంతరం హుమాయూన్ అతని వారసుడుగుగా సింహాసనమదిష్టించాడు. అతడు సింహాసనమధిష్టించే సమయంలో పరిస్థితులు చాలా దారుణంగా ఉన్నవి. అంతకుముందే చెప్పినట్లు బాబర్ హుమాయూన్‌కు ఒక సుస్థిరమైన లేదా ఒక క్రమ పద్ధతిలోగల సామ్రాజ్యంను ఇవ్వలేదు. సామ్రాజ్యం కేవలం సైనిక శక్తి మీద ఒకటిగా ఉన్నది. అది దాదాపు సర్వస్వతంత్రులుగా వ్యవహరించుకున్న మొగలు సర్దారుల క్రింద (beg or Amir) లెక్కలేనన్ని సైనిక శిబిరాలుగా విడిపోయి ఉన్నది. నూతన సామ్రాజ్యంనకు ఒకే ఒక్క ఆధారమైన సైన్యం వివిధ జాతుల మరియు తెగల మిశ్రమం. వారు పరస్పర విరుద్ధమైన ఆసక్తులు గలిగివారి వారి నాయకులపట్ల విశ్వాసం కలిగి ఉండేవారు. అతని సర్దారులు అతనికి వ్యతిరేకంగా ప్రణాళికలు వేయసాగారు. వాయువ్య భారతదేశంలో హుమాయూన్ సోదరుడు కాబూల్ కాంధహార్‌తోపాటు కామ్రాన్ (Kamram), లాహోర్, ముల్తాన్‌లను ఆక్రమించాడు. వీరిలో హుమాయూన్ సైనిక నియామకానికి అత్యంత అనుకూలమైన ఒక ముఖ్య ప్రాంతాన్ని పోగొట్టుకున్నాడు. ఈ పరిస్థితులలో నూతన మొగల్ సామ్రాజ్యమునకు ప్రమాదమును కొని తెచ్చే అంతర్యుద్ధంను నివారించుటకు హుమాయూన్ ఆయా ప్రాంతంలను తన సోదరునికి దారాదత్తం చేయకతప్పలేదు.

హుమాయూన్‌కు ఇంకా అనేక శత్రువర్గాలతో పోరాడవలసిన అవసరం వచ్చింది. గుజరాత్ పాలకుడైన బహదూర్

షా దిగ్విజయాలు హుమాయూన్‌కు ఒక తీవ్ర సవాలుగా పరిణమించాయి. బాబర్ ఆఫ్ఘన్‌లను పూర్తిగా శాశ్వతంగా అణచివేయకపోవడం వల్ల వారు తిరిగి విజృంభించి మొగలులను భారతదేశం నుండి తరిమివేయాలనే కాంక్షించారు. చెల్లాచెదరైన అనేక మంది ఆఫ్ఘన్ సర్దారులు ఎప్పుడూ తిరుగుబాటుకు సిద్ధంగా ఉండేవారు. అయితే వారందరినీ ఒకే త్రాటిపైకి తెచ్చి మొగలులకు సవాలును విసరగలిగిన ఒక శక్తివంతమైన నాయకుడే కావాలి. ఆఫ్ఘన్‌లకు అటువంటి శక్తి మరియు లక్షణాలు గిలిగిన నాయకుడు షేర్‌ఖాన్ (తర్వాత షేర్షా) రూపంలో లభించాడు.

మొట్టమొదటగా హుమాయూన్ తూర్పున ఆఫ్ఘన్ సమస్యను పరిష్కరించే పనిలో పడ్డాడు. 1532లో దౌరా (Daurah)లో ఆఫ్ఘన్ దళాలపై విజయం సాధించిన హుమాయూన్ మహ్మద్‌లోడీని జోనార్ (Jaunar) నుండి పారద్రోలాడు. తరువాత ఆఫ్ఘన్ సర్దార్ షేర్‌ఖాన్ నుండి చునార్‌ను ముట్టడించాడు. ఆగ్రా మరియు తూర్పు దేశాల మధ్య రహదారి మరియు జలమార్గములను నియంత్రిస్తున్న బలమైన ఈ కోట చాలా కీలక స్థానంలో ఉండి 'తూర్పు భారత ముఖ ద్వారం' (Gate way of East India)గా పేరు గాంచింది. నాలుగు నెలలు సాగిన చునార్ ముట్టడి తర్వాత షేర్‌ఖాన్ – హుమాయూన్‌లు ఒక అంగీకారానికి వచ్చారు. హుమాయూన్ చునార్ కోటను షేర్‌ఖాన్‌కే అప్పగించాడు. బదులుగా షేర్‌ఖాన్ మొగలులకు విధేయుడుగా ఉంటానని వాగ్దానం చేశాడు.

హుమాయూనే ఆ విధంగా షేర్‌ఖాన్‌కు తన వనరులను, శక్తిని పెంచుకొనే అవకాశంను కల్పించాడు అని మీరు గ్రహించాలి. ఈ దశలో విజృంభించుచున్న ఆఫ్ఘన్‌లను పూర్తిగా అణచివేసి తూర్పు భారతదేశంలో మొగల్ సామ్రాజ్యాన్ని సుస్థిర పరచటంలో హుమాయూన్ వైఫల్యం చెందడం అతనికి దురదృష్టకర పరిణామమని ఋజువైంది. హుమాయూన్ ఆఫ్ఘన్‌ల శక్తియుక్తులను అంచనావేయటంలో విఫలమయ్యాడు. ఉత్తర భారతదేశం మొత్తం చెల్లాచెదరైన ఆఫ్ఘన్ తెగలవారు, ఒక మహాశక్తివంతమైన నాయకుని ఆధ్వర్యంలో పునరైక్యమై మొగల్ సామ్రాజ్యంనకు ఒక సవాలును విసిరారు. స్థానిక పాలకులు, జమీందార్లను వశపరచుకొని తమ పాలనను సుస్థిర పరచుకోలేని మొగలులు సంఖ్యాపరంగా వెనుకబడే ఉన్నారు. తర్వాత ఈ విషయాన్ని హుమాయూన్ కుమారుడు అక్బర్ సరిగా అర్థం చేసుకున్నాడు.

ఐతే ఆగ్రా పరిసర ప్రాంతాలలో గుజరాత్‌నేలు బహదూర్ షా మరియు అతని కార్యకలాపాలు శీఘ్రంగా బలం పుంజుకోవడంతో హుమాయూన్ అప్రమత్తమైనాడు. ఈ పరిస్థితులలో ఆఫ్ఘన్‌లపై సాధించిన విజయాలను కూడా పూర్తిగా తనకు అనుకూలంగా మలుచుకోలేని హుమాయూన్ ఆగ్రా తిరిగి వెళ్ళడానికి ఉత్సాహం చూపాడు. సర్దారుల ఆధ్వర్యంలో చునార్ ముట్టడిని కొనసాగించినట్లయితే, తన సైన్యంను విభజించినట్లవుతుందనే ఉద్దేశ్యంతో హుమాయూన్ దానికి సిద్ధపడలేదు.

బహదూర్‌షా ఎందరో ఆఫ్ఘన్ శరణార్థులకు మరియు హుమాయూన్ శతృవులకు ఆశ్రయమిచ్చాడు. పోర్చుగీసువారి సహాయంతో అతడు ఒక శక్తివంతమైన ఫిరంగి దళంను సంపాదించాడు. అతడు మాళ్వాను జయించి చిత్తోర్ (Chittor) కోటను వశపరచుకున్నాడు. (తర్వాత కాలంలో వెలువడిన కొన్ని కథనాలను బట్టి బహుదూర్‌షాకు వ్యతిరేకంగా మేవాడ్‌నేలు రాణికర్ణావతి (రాణా సంగ్రాముని భార్య) హుమాయూన్ సహాయం కోరగా, హుమాయూన్ దానికి సమ్మతించి సహాయమందించాడు. ఈ విషయం పూర్తిగా సమర్థనీయం కాకపోయినప్పటికీ, పరిస్థితిని సమీక్షించడానికి అతడు ఆగ్రా నుంచి వచ్చి గ్వాలియర్‌లో విడిది చేశాడు. మొగలులు ఈ విషయంలో కలుగజేసుకుంటారనే భయంతో బహదూర్‌షా చిత్తోర్ నుండి వెనుదిరిగాడు.

హుమాయూన్ చిత్తోర్ రాణికి సహాయం చేయ నిరాకరించటాన్ని పలువురు విమర్శించారు. దీని ద్వారా

రాజపుత్రుల సానుభూతిని సహకారాన్ని అవకాశాన్ని హుమాయూన్ కోల్పోయాడు. రాజపుత్రులతో మైత్రీ ప్రాధాన్యతను తర్వాత అతని కుమారుడుగా అక్బర్ గ్రహించాడు. పైగా హుమాయూన్ గ్వాలియర్‌లో విడిది చేయడం వెనుక అతడు బహదూర్‌షాతో యుద్ధానికి అయిష్టత దాగి ఉందని స్పష్టమగుచున్నది. హుమాయూన్ సంక్షోభం పెద్దదైనపుడే దాని గురించి ఆలోచించడానికి మొగ్గుచూపేవాడు. అందువల్లనే బహదూర్‌షాను వెంటనే అణచివేయలేదు. దీనివల్ల బహదూర్‌షా తూర్పు రాజస్థాన్‌కు తన రాజ్య విస్తరణను కొనసాగించే అవకాశం లభించింది. 1534లో అతడు రెండవసారి చిత్తోర్ దుర్గమును ముట్టడించాడు. అదే సమయంలో ఆగ్రాపై దాడి చేయమని ఇబ్రహీంలోడీ బంధువగు తాతర్‌ఖాన్ (Tatar Khan)కు ఆయుధాలు మరియు సైన్యంను సమకూర్చాడు.

అపుడు హుమాయూన్ శాశ్వతంగా బహదూర్ షాతో గల తలనొప్పిని వదిలించుకోవాలని నిశ్చయించుకున్నాడు. మొదటగా అతడు తాతర్‌ఖాన్ సైన్యాన్ని జయించిన తర్వాత అతడు మాళ్వాపై దండెత్తాడు. అతడు చిత్తోర్ మరియు మాళ్వాల మధ్య ఒక స్థానాన్ని ఆక్రమించాడు. ఆ విధంగా బహుదూర్‌షాను మాళ్వా నుండి వేరుచేశాడు.అయినా అతడు చిత్తోర్‌కు సాయమందించటానికి తిరస్కరించాడు. మేవార్‌లో అంతర్గత సంక్షోభం నడుస్తున్నందువల్ల దాంతో స్నేహ బంధం యొక్క సైనిక విలువ హుమాయూన్ దృష్టిలో స్వల్పమైనది.

1535 హుమాయూన్ బహదూర్‌షా సైన్యాలను మాందసోర్ వద్ద ఓడించి అతడు మాండు (Mandu) నుండి చంపనేర్ (champaner) ల మీదుగా దయ్యూ ద్వీపంలో శరణార్థిగా వెళ్ళేంత వరకు వెంట బడి తరిమాడు. సంపన్న ప్రాంతాలైన మాళ్వా గుజరాత్‌లతోపాటు గుజరాత్ పాలకులు మాండు మరియు చంపనేర్‌లలో నిల్వచేసిన ధనరాశులను, సంపదను హుమాయూన్ చేజిక్కించుకొన్నాడు. హుమాయూన్ బహదూర్‌షాపై దండయాత్రను ముగించటానికి దయ్యూ వరకు తరలివెళ్ళాడు. మాళ్వాలో సమస్యలు తలెత్తాయనే వార్తలతో హుమాయూన్ వెనుదిరగక తప్పలేదు. బహుదూర్‌షా విషయంను మధ్యలో వదలివేయడం హుమాయూన్ చేసిన రాజకీయ తప్పిదం.

హుమాయూన్ బహుదూర్‌షాపై పొందిన విజయం కేవలం తాత్కాలికమైనది. మాళ్వా, గుజరాత్‌లు జయించినంత త్వరగా అతని చేజారిపోయాయి. హుమాయూన్ మధ్య ప్రాంతంలో నున్న మాండుకు చేరుకుని గుజరాత్‌ను తన సోదరుడైన అస్కారి (Askari)కి అప్పగించాడు. మొఘలు సర్దారులు విడిపోయారు. గుజరాతీ పాలనకు పూర్తిగా జీర్ణించుకొన్న స్థానిక ప్రజలతో ఎటువంటి సంబంధాలు లేకపోవడం వల్ల గుజరాత్ మరియు మేవాడ్‌లలో మొగలులు తమ అధికారాన్ని సుస్థిరం చేసుకోవడంలో విఫలమయ్యారు. వారు మొఘలులను 'నమ్మజాలని విదేశీయులు' (Detestable foreigners)గా చూడసాగారు. బహదూర్‌షా సర్దారుల వరుస ప్రజా పోరాటాలు, తిరుగుబాట్లు అస్కారీని అశాంతికి గురిచేసి అతడు గుజరాత్ నుండి ఆగ్రాకు వెంటనే తిరిగి వెళ్ళేలా చేశాయి. ఈ పరిస్థితులలో ఆస్కారీ ఆగ్రాను ఆక్రమిస్తాడనే భయంతో హుమాయూన్ మాళ్వాను వదిలి ఆగ్రా చేరుకున్నాడు. ఈ విధంగా మాళ్వా మరియు గుజరాత్‌లను మొగలులు చేజార్చుకున్నారు. హుమాయూన్ ప్రతిష్టకు మరియు మొఘల్ సామ్రాజ్య గౌరవానికి ఈ నష్టం ఒక నిరోధకం వంటిది. మొగలు సర్దారులలో కొన్ని వర్గాల వారు హుమాయూన్‌కు గల పరిపాలనా దక్షతపై సందేహాలు వెలిబుచ్చడం ప్రారంభించారు.

హుమాయూన్ గుజరాత్, మాళ్వాలలో గడిపిన కాలాన్ని షేర్‌ఖాన్ తన బలాన్ని పెంచుకోవడానికి వినియోగించుకున్నాడు. తనకు తాను బీహార్‌కు తిరుగులేని పాలకునిగా చేసుకున్నాడు. ఆఫ్ఘన్‌పై సైన్యాలన్నీ అతని వెంట నడిచాయి. అతడు నిర్మించుకున్న తిరుగులేని వనరులతో షేర్‌ఖాన్ ఒక మహాబలమైన సైన్యం నిర్మించి నిర్వహించాడు.

అతనికి బహదూర్‌షా కూడా సాయమందించాడు. హుమాయూన్ ఆగ్రాకు మరలినంతనే షేర్‌ఖాన్ బలహీనమైన బెంగాల్ రాజును మహ్మద్‌షాను ఓడించి, అతడు యుద్ధ నష్టపరిహారంగా 1,30,000 దీనార్‌లు (బంగారు నాణెములు) చెల్లించేందుకు ఒత్తిడి చేశాడు. ఆ విధంగా బలంపుంజుకొన్న షేర్‌ఖాన్ బెంగాల్‌ను శాశ్వతంగా జయించాలనే ఉద్దేశ్యంతో రెండవ సారి దానిపై దండెత్తాడు. షేర్‌ఖాన్ దాని రాజధాని గౌర్ (Gour)ను ఆక్రమించాడు.

హుమాయూన్ తూర్పు భారతంలో ఆఫ్ఘన్ ప్రమాదం తీవ్రతను చాలా ఆలస్యంగా గ్రహించాడు. అతడు షేర్‌ఖాన్‌ను ఎదుర్కొనటానికి బయలుదేరాడు. ఐతే హుమాయూన్ వ్యూహాత్మక తప్పిదం చేశాడు. అతడు నేరుగా బెంగాల్ రాజధాని గౌర చేరుకుంటే షేర్‌ఖాన్ ప్రణాళికలను భగ్నం చేయగలిగి ఉండేవాడు. కాని దానికి బదులుగా బలిష్టమైన చునార్ కోటను ముట్టడించాడు. ఆఫ్ఘన్‌లు ఈ కోటకు పటిష్టమైన రక్షణగా నుండటంవల్ల దానిని వశం చేసుకోవడానికి హుమాయూన్‌కి ఆరు నెలల సమయం పట్టింది (1538). ఈ కోటను వశం చేసుకోవడానికి హుమాయూన్‌కు చేపట్టిన సుదీర్ఘ సమయంను షేర్ ఖాన్ గౌర్‌ను, రోహటాస్ (Rohtas) అనే బలిష్టమైన దుర్గంను వశం చేసుకోవడానికి ఉపయోగించుకున్నాడు. ఆ విధంగా షేర్ ఖాన్ సైనిక వ్యూహం హుమాయూన్ సైనిక వ్యూహం కన్నా తెలివైనది. ఫలప్రదమైనదని ఋజువైంది.

హుమాయూన్ బీహార్‌లో కొద్దిపాటి విజయాన్ని పొందగలిగాడు. ఆ తరువాత అతడు బెంగాల్‌పై దండయాత్రకు పూనుకున్నాడు. బంగారానికి, సంపన్న ఉత్పత్తిదారులకు, విదేశీ వాణిజ్యమునకు నిలయమైన బెంగాల్‌ను అతడు షేర్‌ఖాన్‌కు ఇవ్వడానికి సుముఖంగా లేడు. ఏది ఏమైనా హుమాయూన్ బెంగాల్ నుంచి ఆగ్రాకు పారిపోయి లాహోర్ వరకు వెంబడించబడ్డాడు. చివరకు భారతదేశాన్ని వదలిపారిపోయాడు. అతడు 15 సంవత్సరాలు దేశ దిమ్మరి (Wanderer)గా జీవితం గడిపాడు. 1540లో షేర్‌షా ఆగ్రాలో ప్రవేశించిన తర్వాత రెండవ ఆఫ్ఘన్ పాలనను ప్రారంభించాడు. ఆ విధంగా భారతదేశంలో బాబర్ కార్యం నెరవేరకుండా పోయింది.

హుమాయూన్ పశ్చిమాన బహదూర్‌తోను, తూర్పున షేర్‌షాతోను వ్యవహరించిన తీరును సమీక్షించనట్లయితే కొన్ని రాజకీయ మరియు వ్యూహాత్మక తప్పిదాలు గోచరిస్తాయి. ఒక వైపు హుమాయూన్, షేర్షా మరియు బహదూర్‌షాలు ఒకే విధమైన రాజీకయ నిరోధకాలని, వాటిని అడ్డుకొనకపోతే అవి మొగల్ పాలనను విచ్ఛిన్నం చేయగలవని సరిగానే అర్థం చేసుకున్నాడు. మరొకవైపు రాబోయే పెను ప్రమాదంను ఊహించలేకపోవడం, తగిన సమయంలో తగు నిర్ణయాలు తీసుకొనలేకపోవడం హుమాయూన్ తప్పిదాలు.

మొదటిది హుమాయూన్ తన శత్రువులను ఒక్కొక్కరిగా తుదముట్టించలేదు. దానికి బదులుగా అతడు తన విజయాలను సుస్థిరపరచుకోకుండా క్రొత్తవాటి కోసం వెంపర్లాడాడు. అతడు ఎన్నో సంక్షోభాలను ఎదుర్కొని ఒకచోటి నుండి మరొక చోటకు పరుగులు తీయవలసి వచ్చింది. ఆ విధంగా హుమాయూన్ తన వనరులను, సమయాన్ని వృథా చేసుకోవడమేగాక, శత్రువులను ప్రోత్సహించాడు. ఆ విధంగా షేర్‌ఖాన్‌పై చునార్ వద్ద అతడు పొందిన తొలి విజయంను సుస్థిరపరచుకోకుండా, గుజరాత్‌ను జయించడానికి మొగ్గు చూపాడు. దీనివల్ల షేర్‌ఖాన్‌కు తన వనరులను బలాన్ని పెంచుకొని తూర్పు భారతదేశంలో ఒక బలమైన శక్తిగా ఎదిగే అవకాశం లభించింది. హుమాయూన్‌కు ఇది దురదృష్టంగా పరిణమించింది. హుమాయూన్ గుజరాత్‌లో నున్నపుడు కూడా బహదూర్‌షాను తక్షణమే అణచివేయకుండా అతడు రాజ్య విస్తరణ కార్యకలాపాలను కొనసాగించే అవకాశం ఇచ్చాడు.

రెండవది, మొగల్ సామ్రాజ్య సుస్థిరతకు స్థానిక పాలకుల, జమిందారుల అభిమానంను పొందుట అవసరమని

తెలుసుకోవడంలో హుమాయూన్ విఫలమైనాడు. చెల్లాచెదరైన ఆఫ్ఘన్ తెగల బలాన్ని తనవైపు త్రిప్పుకోవడానికి బదులుగా హుమాయూన్, వారు షేర్‌ఖాన్ నాయకత్వంలో పునరేకీకరణ పొందడానికి అవకాశం కల్పించాడు. గుజరాత్‌లో సైతం అతడు గుజరాత్ పాలకులకు ఎంతగానో అభిమానులైన స్థానిక ప్రజలను గెలవడంలో వైఫల్యం చెందాడు. వారు మొఘలులను విదేశీయులుగానే చూశారు. ఆఫ్ఘన్‌లను ఎదుర్కొనడానికి రాజపుత్రులతో సంబంధం విలువను హుమాయూన్ గుర్తించలేకపోయాడు. చిత్తోర్ రాణికి సహాయ నిరాకరణ దీనికి ఒక ఉదామరణగా చెప్పవచ్చు.

మూడవది, హుమాయూన్ ఒక 'అసమర్థ వ్యూహకర్త' అని ఋజువు చేసుకున్నాడు. షేర్షాపై అతని ప్రణాళికలేని బెంగాల్ దండయాత్రను గురించి మీరు ఇంతకుముందే చదివారు. చౌసా, కనోజ్ యుద్ధాలలో షేర్షా ఒక సమున్నత సైన్యాధ్యక్షుడని ఋజువు చేసుకున్నాడు.

హుమాయూన్ భారతదేశంలో రెండు శక్తులను ఎదుర్కొనవలసి వచ్చింది. 1. గుజరాత్‌లో బహదూర్‌షా 2. షేర్షా నాయకత్వం తూర్పు భారత్‌లో పునరేకీకరణ చెందిన ఆఫ్ఘన్‌లు. హుమాయూన్ తన శత్రువులను ఒక్కొక్కరిగా అణచివేయడంలో విఫలమయ్యాడు. అతడు ఒక ప్రాంతంలో సాధించిన విజయమును సుస్థిరపరచుకోలేకపోయాడు. అంతేగాక స్థానిక పాలకులను, జమిందార్లనూ తన వైపు తిప్పుకొనలేకపోయాడు. బదులుగా అతడు కొత్త సంక్షోభాలను పరిష్కరించ ప్రయత్నించాడు. చివరకు భారతదేశంలో తన రాజ్యమును పోగొట్టుకున్నాడు.

## 34 బి పాఠ్య ప్రశ్నలు

1. క్రీ.శ. 1530లో హుమాయూన్ సింహాసన మదిష్టించిన తర్వాత ఎదుర్కొన్న రెండు సమస్యలు ఏవి?
2. హుమాయూన్ చిత్తోడ్‌కు సహాయాన్ని నిరాకరించే విమర్శకు గురయ్యాడు. ఎందువల్ల?
3. చునార్‌లో విజయం తర్వాత వెంటనే ఆఫ్ఘన్ నాయకుడు షేర్‌ఖాన్‌ను అణచలేకపోవడంలో హుమాయూన్ తన హ్రస్వ దృష్టిని ఏ విధంగా బహిర్గతం చేసుకున్నాడు?
4. భారతదేశంలో సూర్ వంశం త్వరితగతిన పతనం చెందడానికి ఏ రెండు కారణములు దారితీశాయి?

## 34.5 సూర్‌వంశ పతనం, మొఘల్ అధికార పునఃస్థాపన

షేర్షా నిర్మించిన ఆఫ్ఘన్ సామ్రాజ్యం, అతని మరణానంతరం ఎక్కువ కాలం నిలబడలేదు. అతని విశిష్ట వ్యక్తిత్వం లేకపోవడం, అతని వారసులలో చాలా మంది బలహీనులు కావడం, అంతర్యుద్ధాలు ఆఫ్ఘన్ నాయకుల మధ్య జాతి వైషమ్యాలకు దారి తీశాయి. ఇవి మొత్తం రాజ్యాన్ని అరాచకంలోకి లాగాయి.

అస్థవ్యస్థమైన పరిస్థితులు 15 సంవత్సరాల విరామానంతరం హుమాయూన్‌కు మొగల్ సామ్రాజ్య పునః ప్రతిష్టావకాశంను కలిగించాయి. తన ఓటమి తర్వాత హుమాయూన్, సింధ్, పరిసర రాజ్యాలలో తిరుగుతూ తన రాజ్యాన్ని తిరిగి రాబట్టుకోవడానికి ప్రణాళికలు రచిస్తూ ఉన్నాడు. చిట్టచివరకు అతడు పర్షియా రాజు ఆస్థానంలో ఆశ్రయం పొంది అతని సహకారంతో కాబూల్, కాంధహార్‌లను 1545లో పునరాక్రమించాడు. ఐతే హుమాయూన్ తాను చేసిన వాగ్దానంను కాదని కాంధహార్‌ను పర్షియా రాజుకు ఇవ్వడానికి నిరాకరించాడు. ఆనాటి నుండి కాంధహార్ పర్షియా, భారత్‌ల మధ్య ముఖ్య వివాదాస్పద అంశంగా మారింది.

1554లో హుమాయూన్ లాహోర్‌ను ఆక్రయించాడు. సికందర్ అనే పంజాబు తిరుగుబాటు దారైన రాజ ప్రతినిధి (ఆఫ్ఘన్‌లచే చక్రవర్తిగా ప్రకటించబడినవాడు)ని సర్ హింద్ వద్ద యుద్ధంలో ఓడించి, హుమాయూన్ ఢిల్లీ, ఆగ్రాలను ఆక్రమించుకున్నాడు. ఐతే హుమాయూన్ తాను సాధించిన విజయ ఫలాలను అనుభవించడానికి ఎక్కువ కాలం జీవించలేదు. అతడు 1556లో మరణించాడు.

హుమాయూన్ కుమారుడు అక్బర్ ఆ సమయంలో పంజాబ్‌లో తన సంరక్షకుడైన బైరాంఖాన్ వద్ద ఉన్నాడు. బైరాంఖాన్ అక్బర్‌ను సంప్రదాయనుసారం హుమాయూన్ వారసుడుగా క్రీ.శ. 1556లో ప్రకటించాడు. కాని హిందూస్థాన్‌పై మొఘల్ ఆధిపత్యం, సుస్థిరత బహుదూరంలో ఉంది. సూర్ సుల్తాన్ ఆదిల్‌షా సూర్ సమర్థ సేనాని ఐన హేము మొఘలుల నెదిరించాడు. అతడు మొదట ఢిల్లీలోని మొఘల్ గవర్నర్‌ను ఓడించి ఢిల్లీ, ఆగ్రాలను వశపరచుకొన్నాడు. హేము చారిత్రాత్మక పానిపట్టు యుద్ధరంగంను అక్బర్ మరియు బైరాంఖాన్‌లను ఢీకొన్నాడు. రెండవ పానిపట్టు యుద్ధం (1556) మొగల్ – ఆఫ్ఘన్ ఆధిపత్య పోరాటానికి పరాకాస్టగా పరిణమించి చివరకు ఆఫ్ఘన్‌ల ఓటమికి దారితీసింది. మొఘలులు వెనువెంటనే ఢిల్లీ, ఆగ్రాలను జయించారు. ఆ తర్వాత అక్బర్ వాస్తవమైన పునః విజయాలను సాధించి మొఘల్ సామ్రాజ్యంను సుస్థిరపరచే లక్ష్యంతో ముందుకు నడిచాడు. దీని గురించి మీరు తర్వాత పాఠంలో చదువుకుంటారు.

## సారాంశం :

బాబర్ భారతదేశంలో మొఘల్ సామ్రాజ్య స్థాపన చేశాడు. బాబర్ ట్రాన్స్ ఆక్సియానాలోని 'ఫెర్ఘానా' అనే చిన్న సంస్థానానికి పాలకుడు. అతడు మధ్య ఆసియాలో రాజ్యస్థాపన చేయాలని కోరుకున్నాడు. కాని ఉజ్బెక్‌ల, సఫావిద్ల శక్తికి సరితూగలేదు. బాబర్ కాబూల్, బదక్షాన్, కాంధహార్‌లను జయించాడు. అతడు భారత్‌వైపు పురోగమించవలసి వచ్చింది. భారతదేశపు ఆపారమైన సిరిసంపదలపట్ల ఆకర్షితుడైనాడు.

భారతదేశంలో ఇబ్రహీం లోడీ తన సర్దారీలలోని అసంతృప్తిని నిరోధించలేకపోయాడు. ఈలోగా తూర్పు భారతంలో ఆఫ్ఘన్లు, పశ్చిమ భారతంలో రాజపుత్రులు బలపడటం ప్రారంభమైంది. ఈ పరిస్థితులలో అసంతృప్తులైన ఢిల్లీ సర్దారులు బాబర్‌ను ఆహ్వానించి, ఇబ్రహీంలోడీని తొలగించమని వేడుకున్నారు. వారు బాబర్‌ను తన పూర్వీకుడైన తైమూర్‌వలె కేవలం ఒక దోపిడీదారుగానే పొరపాటు పడ్డారు.

బాబర్ ఒక చిన్న సైన్యంతో భారతదేశానికి బయలుదేరాడు. ఆ తార్వత అతడు మంచి శతఘ్ని దళాన్ని పొంది అనేక నూతన యుద్ధ తంత్రములను ఉపయోగించాడు. బాబర్ బలగాలు క్రీ.శ. 1526లో పానిపట్టు యుద్ధ రంగం వద్ద ఇబ్రహీం లోడీ మహా సైన్యాన్ని ఎదుర్కొన్నాయి. బాబర్ సైన్యాలు తేలికగా ఇబ్రహీంలోడీని జయించగలిగాయి. అతడు ఢిల్లీ, ఆగ్రాల వరకు ప్రాంతాలన్నింటిని తన పాదాక్రాంతం చేసుకోవటమేగాక అపారమైన సంపదను కూడా పొందాడు. ఐతే ఇంకా రాణా సంగ్రామ సింహని అధికారం క్రింద ఉన్న రాజపుత్రులను బాబర్ అణచవలసి ఉంది.

1527లో బాబర్, రాణా సంగ్రామ సింహుల మధ్య ఒక నిర్ణయాత్మక యుద్ధం జరిగింది. బాబర్ అవలంభించిన యుద్ధ వ్యూహం అతనిని గెలిపించాయి. రాణా ఓడిపోయాడు. రాజపుత్ర సమాఖ్య ఈ యుద్ధంలో విభిన్నమైన, బాబర్ హిందూస్థానంపై స్థిరమైన స్థానం పొందటం వలన ఈ యుద్ధం ప్రాధాన్యతను పొందింది. గోగ్రా యుద్ధంలో బాబర్ ఆఫ్ఘన్ బలగాలపై విశిష్ట విజయాన్ని నమోదు చేయలేకపోయినప్పటికీ వారిని నిరోధించగలిగాడు.

బాబర్ తార్వత హుమాయూన్ అతని వారసుడయ్యాడు. హుమాయూన్ రెండువైపుల నుండి సమస్యలనెదుర్కొనవలసి వచ్చింది.

1. షేర్షా క్రింద బలాన్ని పుంజుకొని శక్తివంతమైన ఆఫ్ఘన్‌లు 2. రాజ్య విస్తరణలో నున్న గుజరాత్‌లు బహదూర్‌షా, హుమాయూన్ చునార్ దుర్గమును ముట్టడించి వశం చేసుకున్నా ఆఫ్ఘన్‌లను తుడిచిపెట్టలేదు. ఎందుకంటే వారు అతనికి విధేయతను ప్రకటించారు. 1525లో హుమాయూన్ బహదూర్‌షాను జయించాడు కాని అతని విజయయాత్రను మధ్యలోనే ఆపివేశాడు. దాంతో మొగలులు జయించిన ఇతర ప్రాంతాలను కూడా త్వరలో వారి చేజారాయి. ఈలోగా ఆఫ్ఘన్‌ల ప్రాబల్యం మరల పుంజుకొంది. హుమాయూన్ చునార్ కోటముట్టడిలో నుండగా, షేర్షా గౌర్ మరియు రొవాటాస్‌ను పట్టుకున్నాడు. హుమాయూన్ బెంగాల్‌లోపల చొచ్చుకొని వెళ్ళి అక్కడ షేర్షా ఉచ్చులో చిక్కాడు. హుమాయూన్ తిరుగు ప్రయాణంలో మొగలు సైన్యాలు ఆఫ్ఘన్ల చేతిలో చెల్లాచెదరు చేయబడ్డాయి. హుమాయూన్ చావు తప్పి కన్నులొట్టబోయినట్లు అతి కష్టం మీద తప్పించుకున్నాడు. కనోజ్ యుద్ధంలో హుమాయూన్ షేర్షాను తరిమివేయ ప్రయత్నించాడు కాని చివరకు అతడే ఓడిపోయాడు. అతడు భారతదేశం నుండి పారిపోయి ఎటువంటి సింహాసనం, రాజ్యం లేకుండా 15 సంవత్సరాలు గడపవలసి వచ్చింది.

షేర్షా మరణానంతరం సూర్ సామ్రాజ్యం ఎక్కువ కాలం నిలబడలేదు. హుమాయూన్ తిరిగి వచ్చి సింహాసనం ఆక్రమించాడు. 1556లో హుమాయూన్ మరణించి అతని వారసుడుగా సమర్థుడుగా అక్బర్ సింహాసనమధిష్టించాడు.

## పాఠ్య ప్రశ్నలు

1. 100 పదాలలో జవాబులిమ్ము.
   1. బాబర్ దండయాత్రకు అనుకూలించిన భారతదేశ రాజకీయ పరిస్థితులు ఎట్టివి?
   2. కాణ్వాయుద్ధ ప్రాముఖ్యత ఎట్టిది?
   3. గుజరాత్ నేలు బహదూర్‌షా హుమాయూన్‌కు ఒక ప్రధాన సవాలుగా ఎట్లు మారాడు?
2. బాబర్‌ను హిందూస్థాన్‌పై దండయాత్ర చేయుటకు (ఒత్తిడి చేసిన) పురికొల్పిన కారణంలు ఏవి?
3. భారతదేశ చరిత్రలో మొదటి పానిపట్టు యుద్ధం ఎందుకు ప్రాధాన్యం పొందింది?
   దండయాత్రలలో బాబర్ విజయాలను వర్ణింపుము?
4. 1530లో హుమాయూన్ సింహాసనమెక్కే సమయంలో ఎదుర్కొన్న సమస్యలు ఏవి? అతని పతనంనకు ఈ సమస్యలు ఎంతవరకు కారణమయ్యాయి?
5. షేర్షా హుమాయూన్‌ల మధ్య పోరాటమును వర్ణించి, హుమాయూన్ ఓటమికిగల కారణాలను తెలుపుము.

## పాఠ్య ప్రశ్నలకు జవాబులు

### 34.ఎ

1) ఉజ్బెక్‌లు ట్రాన్స్ ఆక్సియాకు తిరుగులేని నాయకులైనారు. బాబర్ సమర్‌ఖండ్‌ను పొందలేకపోయాడు.

బాబర్ ఉజ్బెక్‌లతోగాని లేదా సఫావిడ్లతోగాని పోరాటం చేయలేకపోయాడు.

2. 1. ఢిల్లీ ఆగ్రాలోని లోడీలు

   2. తూర్పు ఆఫ్ఘనిస్తాన్

   3. రాజపుటానా, పశ్చిమ భారత్‌లో రాణా సంగ్రామసింహుడు.

3. బాబర్ తుపాకి మందును, తుల్ఘామా యుద్ధ తంత్రములను ఉపయోగించగా లోడీ సైన్యం భారత సాంప్రదాయ యుద్ధ పద్ధతులపై ఆధారపడ్డారు.

4. బాబర్ తన సర్దారులను, సైన్యాన్ని ప్రసన్నం చేసుకోవలసి వచ్చింది. భరించలేని ఎండవేడి, ఆహార పదార్థాల కొరత వల్ల వారు భారతదేశంలో సుదర్ఘీ దండయాత్రకు సిద్ధంగా లేరు. వారు కొత్త ప్రాంతం మరియు శత్రురాజ్యం నుండి వెనుదిరిగి వెళ్ళాలని తలచారు.

3 బి) 1

1. బాబర్ వదలివెళ్ళిన సామ్రాజ్య బలహీన పునాది

2. హుమాయూన్, అతని సోదరుని మధ్య సామ్రాజ్య విభజన.

2. హుమాయూన్ తన సొంత కారణాల వల్ల రాజపుత్రుల సహకారంను, సానుభూతిని పొందే అవకాశం పోగొట్టుకున్నాడు.

3. హుమాయూన్, షేర్‌ఖాన్‌కు తన వనరులను, శక్తిని పెంచుకునే అవకాశమిచ్చాడు. అతడే చివరికి హుమాయూన్‌కు ఒక సవాలుగా మారాడు.

4. 1. బలహీనమైన వారసులు

   2. అంతర్గత పోరటాలు, అంతర్యుద్ధం.

# 35

# మొగల్ సామ్రాజ్య స్థాపన -II

## 35.1 పరిచయం :

ఇంతకుముందు పాఠంలో ఆఫ్ఘన్‌లను, రాజపుత్రులను లొంగదీసుకొన్న బాబర్, భారతదేశంలో మొగల్ సామ్రాజ్య స్థాపన చేసినట్లు మీరు నేర్చుకున్నారు. ఐతే అత్యంత శక్తివంతమైన మొగల్ వంశ స్థాపకుడుగా మాత్రమే బాబర్‌ను పేర్కొనలేం. అతడు తన వారసులకు ఉదాహరణగా నిలిచి మార్గ దర్శనం చేశాడు. అతడు చక్రవర్తి గౌరవ ప్రతిష్టలు, శక్తి సామర్ధ్యంపై ఆధారపడిన మతపర, సిద్ధాంతపరమౌఢ్యం లేని, కళ, సంస్కృతులకు ప్రోత్సాహమిచ్చే రాజ్యానికి ఒక కొత్త నిర్వచనమిచ్చాడు. బాబర్ భారత ఆగమనంతో కాబూల్, కాంధహార్‌లు మొగలుల వశమైనాయి. ఇది భారతదేశానికి 200 సంవత్సరాలపాటు విదేశీ దాడుల నుండి రక్షణ నిచ్చుటేగాక బాహ్య ఆసియా వాణిజ్యంలో ప్రధాన వాటాను పొందేటట్లు చేసింది. ఆ విధంగా బాబర్ అనేక విధాలుగా నూతన చరిత్ర సృష్టికర్త (Path breaker) అయ్యాడు. ఈ సందర్భంగా భారతదేశంలో బాబర్ ఆగమన ప్రాధాన్యతను ఈ పాఠంలో విశ్లేషిద్దాం.

ఇంతకుముందు పాఠంలో మీరు బాబర్‌కు కుమారుడైన హుమాయూన్‌ను భారతదేశం నుండి వెళ్ళగొట్టి షేర్షాసూర్ ద్వితీయ ఆఫ్ఘన్ సామ్రాజ్యంను స్థాపించినట్లు తెలుసుకున్నారు. షేర్షాకు ఉత్తర భారతదేశంలో ఒక శక్తివంతమైన సామ్రాజ్యంను స్థాపించుటేగాక కేవలం 5 సంవత్సరాల అల్పవ్యవధిలో సుపరిపాలనా వ్యవస్థను ప్రవేశపెట్టగలిగిన ఘనత దక్కింది. వాస్తవానికి అక్బర్‌కు షేర్షా మార్గదర్శి అని, పరిపాలనా పరమైన అనేక విషయాలను అక్బర్ షేర్షా నుండే నేర్చుకున్నాడనే విషయం గురించి కొంత వివాదం ఉంది. ఈ పాఠంలో షేర్షా పరిపాలనా విధానంను రెండు దృక్కోణంలలో అధ్యయనం చేయడం జరిగింది. 1. ఢిల్లీ సుల్తానుల కాలం నుండి కొనసాగుతున్న పరిపాలనా విధానంను షేర్షా ఏ మేరకు మార్చాడు? 2. ఏ మేరకు షేర్షా అక్బర్‌కు మార్గదర్శనం చేశాడు?

## 35.2 లక్ష్యాలు :

ఈ పాఠం చదివిన తర్వాత మీరు క్రింది విషయాలు తెలుసుకోగలుగుతారు.

1. అఖిల భారత సామ్రాజ్య స్థాపనకు బాబర్ పునాది వేశాడన్న విషయం.
2. బాబర్ చక్రవర్తి గౌరవ ప్రతిష్టలను పునఃప్రతిష్టించాడని, దానిని ఖలీఫాత్ (Caliphate) నుండి స్వతంత్రంగా మార్చాడన్న వివరాలు.

3. బాబర్ కళలకు, సంస్కృతికి అందించిన ప్రోత్సాహం.

4. బాబర్ కాబూల్, కాంథహార్‌లను జయించడం వల్ల కలిగిన సత్ఫలితాలు (ప్రయోజనాలు).

5. షేర్షా పరిపాలనా విధానం.

6. షేర్షా ప్రవేశపెట్టిన భూమి శిస్తు విధానం.

7. అల్లా ఉద్దీన్ ఖిల్జీ పద్ధతులను షేర్షా అనుసరించిన సైనిక సంస్కరణలను గుర్తింపు.

8. వ్యాపార , వాణిజ్యాభివృద్ధికి తోడ్పడిన షేర్షా సుంక విధానం, కరెన్సీ పద్ధతులు మరియు ప్రజా సంక్షేమ కార్యాలు గురించి గుర్తింపు.

## 35.3 బాబర్ భారతదేశ ఆగమన ప్రాధాన్యత :

బాబర్ భారతదేశంలోకి అడుగిడటం ఎన్నో విధాలుగా ప్రాధాన్యతను పొందింది. అఖిల భారత సామ్రాజ్య స్థాపనకు అతడు మార్గం సుగమం చేశాడు. ఇంతకుముందు పాఠంలో మీరు బాబర్, లోడీలను, రాజపుత్ర కూటముల బలాన్ని విచ్ఛిన్నం చేశాడని తెలుసుకున్నారు. దీంతో బాబర్ కాలం వరకు ఉత్తర భారతదేశంలోనున్న ప్రాబల్య సమతుల్యత (Balance of power)ను తుడిచి పెట్టాడు. అఖిల భారత సామ్రాజ్యం స్థాపించబడాలంటే నిజానికి ఇంకా అనేక ఇతర అవసరాలను పూర్తి చేయవలసి ఉంటుంది. ఆ అవసరాలను అక్బర్ పూర్తి చేయగలిగాడు. కాని దానికి కావలసిన మొదటి అడుగును బాబర్ వేశాడు.

బాబర్ భారతదేశంలో ఒక నూతన యుద్ధతంత్రాన్ని ప్రవేశపెట్టాడు. ఇంతకుముందు పాఠంలో బాబర్ విజయానికి మూలం అతడు ఉపయోగించిన తుల్ఘామా యుద్ధ తంత్రం, శతఘ్నిదళ, కృషి ఫిరంగుల వాడకం అనే మూడింటి మేలు కలయిక అని మీరు తెలుసుకున్నారు. బాబర్ అనేక (700) బండ్లను ఒకదానికొకటి జత చేసి దానిని రక్షణ గోడ (బురుజు)గానిలిపాడు. అదనపు భద్రతకు దాని ముందు ఒక కందకం (trench / ditch) తవ్వించాడు. ప్రతి రెండు బండ్లకు మధ్య సైనికులు వారి తుపాకులను నిలిపి కాల్చే విధంగా దిమ్మలు నిర్మించాడు. ఆ విధంగా బండ్లు పటిష్టమైన కూటలుగా పనిచేశాయి. ఇబ్రహీంలోడీ రాణా సంగ్రాం సైన్యాలను బాబర్ సైన్యంలోని రెండు విభాగాలు వెనుక నుండి పక్క నుండి చుట్టుముట్టి దాడి చేశాయి. బాబర్ సైనికులు ముందు నుండి సమర్థవంతంగా తుపాకులను ఉపయోగించారు. తుపాకి మందు అంతకుముందే భారతదేశానికి తెలిసినప్పటికీ, బాబర్ విజయపరంపర దాని మరింత ప్రాచుర్యంలోకి తెచ్చాయి. ఆ విధంగా శతఘ్ని దళం మరియు అశ్విక దళం ఒక ప్రణాళికాబద్ధమైన మిశ్రమం ఏ విధంగా విజయాలు సాధించగలవో బాబర్ నిరూపించాడు. ఆ విధంగా అతడు కూటాల ప్రాధన్యాతను తగ్గించాడు.

ఫిరోజ్ షా తుగ్లక్ మరణం నుండి ప్రాధాన్యత కోల్పోయిన చక్రవర్తి హోదాను గౌరవ ప్రతిష్టలను బాబర్ పునః ప్రతిష్టించాడు.

మీరు ఇంతకుముందు విభాగాలలో సికిందర్‌లోడీ, మరియు ఇబ్రహీంలోడీలు రాజరికాన్ని ఒక గౌరవ స్థానానికి చేర్చాలని ప్రయత్నించినట్లు చదివారు. ఐతే గిరిజన గణాల స్వాతంత్ర్యం, సమానత్వం అనే భావాలను ప్రాచుర్యంలోకి తెచ్చిన ఆఫ్ఘన్ అమీరులు దానిని బలంగా వ్యతిరేకించారు. మరొకవైపు బాబర్ మధ్య ఆసియాలోని ఇద్దరు ప్రముఖ యుద్ధ వీరులైన ఛెంగిజ్ ఖాన్ మరియు తైమూర్‌ల వారసుడు.

రాజరికం వంశపార్యంగా ఉండాలనే చెంగిజ్ ఖాన్ విధానాన్నే బాబర్ కూడా నమ్మాడు. అదేవిధంగా రాజు అధికారులను ఎవరితోను పంచుకోకూడదని తైమూర్ విశ్వాసంను కూడా బాబర్ ఆచరణలో పెట్టాడు.

అందుకే అమీరులలో ఏ ఒక్కరూ బాబర్‌తో సమానత్వంను కోరలేదు. సింహాసనంనకై ఆశపడలేదు. తన స్థానానికి ఏమైనా సవాలు అంటూ ఉంటే అది తైమూర్ రాజ కుమారునినుండే ఉండేది. ఆ విధంగా ఆఫ్ఘన్‌ల పరిపాలనా విధానాలను ఎట్టి మార్పులు చేయని బాబర్ రాజుకు, అమీర్‌ల మధ్యగల పరస్పర సంబంధాలను సంస్కరించాడు. లోడీల మాదిరిగా రాజు అందరిలో (మీర్‌లు) ఒకడు అనే విధానంగాక, అమీర్ల భావిష్యత్తును నియంత్రించ గలవాడుగా అతడు భావించాడు. ఢిల్లీ సుల్తానుల నాటి రాజరిక సిద్ధాంతంలో బాబర్ మార్పు చేశాడు. ఖలీఫా ఆంక్షలకు వర్తించని ఒక సామ్రాజ్యాన్ని బాబర్ స్థాపించాడు. మీరు ఇంతకుముందు విభాగాలలో చదవుకున్నట్లు కొందరు ఢిల్లీ సుల్తానులు ఖలీఫా అనుమతి కోసం లేఖలు రాసి దానిని పొంది కిరీటాన్ని ధరించే వారు. 'ఖలీఫా సేనాపతులు' (Lieutenants of the Khalifa) గా తమకు తాము పిలుచుకున్నారు. సామాన్య మహ్మదీయుల దృష్టిలో వారి స్థానాన్ని పదిల పరచుకొనుటకు, ఇతర మహ్మదీయ రాజ్యాలతో సమాన స్థాయికి చేరుకోవడానికి వారికి ఇది ఒక వ్యూహం.

ఐతే మంగోలుల నుండి, టర్కుల నుండి ఘనమైన వారసత్వంను పొందినట్లు బాబర్, ఖలీఫత్ (Caliphate)ను సంప్రదాల్సిన అవసరమే లేదనుకున్నాడు. కాబట్టి భారతదేశానికి ఆవల ఉన్న మరి ఎవ్వరినీ అధికార హోదాలోగాని తనకు పై వారిగా గుర్తించడానికి తిరస్కరించాడు. తాను ఇరాన్, టర్కీ, ఈజిప్టు సుల్తానులకు సమాన స్థాయిగలవాడిగా చెప్పుకున్నాడు. ఆ విధంగా, షైబానీఖాన్ (Shaibanikhan) అనే ఉజ్బెక్ నాయకుని ఎదుర్కొనడానికి 'షా' అనే బిరుదు ధరించిన ఫావిడ్ పాలకుడి సరితూగడానికి బాబర్ కూడా 1507లో కాబూల్‌లో 'బాద్షా' (Badshah) బిరుదును ధరించాడు. తన వారసులకు 'బాదాషా' అనే బిరుదును ఒక సంప్రదాయంగా అందించాడు. కాబట్టి మొగలు చక్రవర్తులందరు 'బాద్‌షా' అనే బిరుదు పొందారు. మొగల్ సార్వభౌమత్వాన్ని అంగీకరించిన సామంతరాజులు సైతం 'సుల్తాన్' వంటి బిరుదులు ధరించారు.

బాబర్ దృక్పథంలో చెప్పుకోదగిన విషయం మత లేదా సిద్ధాంతపర మౌఢ్యం లేకపోవడం. సమకాలీన మధ్య ఆసియా పరిపాలనను ఇరాన్, తురాన్ (Iran, Turan) లోని షియా సున్నీ మత శాఖల మధ్యగ ల సిద్ధాంతపర సంఘర్షణ ప్రభావితం చేసినట్లు మీరు ఇంతకుముందు పాఠాలలో తెలుసుకున్నారు. ఐతే బాబర్ ఆ స్థానంలో అటువంటి సిద్ధాంత విభేదాలుండేవికావు. రాణాసంగాపై తానుచేసిన యుద్ధాన్ని 'జిహాద్'గా ప్రకటించిన బాబర్ తాను అసలు సిసలైన ముస్లింనని నమ్మించటానికి మధుపానీయ పాత్రలన్నీ ధ్వంసం చేయించాడు. తన విజయం తర్వాత 'ఘాజి' అనే బిరుదు పొందాడు. ఐతే దీని వెనుక రాజకీయ ప్రయోజనాలున్నవని కొందరు అభిప్రాయం. అంటే నిరుత్సాహంలో ఉన్న తన సైనికులను తదుపరి యుద్ధాలకు సిద్ధం చేయడం కోసమే. అంతేగాక అది యుద్ధకాలం కాబట్టి దేవాలయాల ధ్వంసం తాలూకు ఉదాహరణలు కొలదిగానే కన్పిస్తాయి.

బాబర్ సంస్కృతిని, లలిత కళలను జాగ్రత్తగా ప్రోత్సహించాడు. అతడు స్వయంగా పర్షియన్, అరబిక్ మరియు తుర్కి భాషలను నేర్చుకున్నాడు. ప్రపంచ శాస్త్రీయ కావ్యాలలో, బాబర్ జ్ఞాపకాలను నిక్షిప్తం చేసిన 'తుజ్-కి-బాబరీ' ఒకటిగా పరిగణించబడుతున్నది. ఆయన ఇతర రచనలలో ప్రసిద్ధ సూఫీ గ్రంథమైన 'మాస్నవి' (Masnavi) అనే తుర్కీ అనువాదం కూడా ఉన్నది. అతనికి సమకాలీన ప్రముఖ కవులతోను, కళాకారులతోను సంబంధాలుండేవి. తన గ్రంథంలో వాటిని గురించి వర్ణించాడు. అతడు ఒక గొప్ప ప్రకృతి ప్రేమికుడు. భారతదేశంలో అనేక మొక్కలను, పుష్పములను

మొదటిగా పరిచయం చేసిన ఘనత బాబర్‌దే.

ఆర్థిక మరియు వ్యూహాత్మక దృష్టితో చూస్తే, బాబర్ భారతదేశ ఆగమనం ఒక ప్రాధాన్య ఘట్టం. కాబూల్, కాంధహార్‌లు ఉత్తర భారతదేశ సామ్రాజ్యంలో అంతర్భాగాలైనవి. ఈ ప్రాంతం నుండి భారతదేశానికి ఎప్పుడూ ప్రతిఘటనలు ఎదురౌతూనే ఉండేవి. ఆ పరిస్థితులను అధిగమించిన బాబర్, అతని వారసులు దాదాపు 200 సంవత్సరాల పాటు విదేశీ దాడుల నుండి రక్షణ కల్పించారు. కాబూల్, కాంధహార్‌లపై నియంత్రణ సాధించుటవల్ల ఆర్థికంగా భారత, విదేశీ వాణిజ్యం స్థిరత్వం పొందింది. చైనా మరియు మధ్యధరా తీరానికి వెళ్ళే వర్తక సమూహాలు (Caravans) వారి ప్రయాణాన్ని ఇక్కడ నుండే ప్రారంభించేవారు. ఆ విధంగా భారతదేశం బాహ్య ఆసియా (Trans Asia) వాణిజ్యంలో ముఖ్యమైన వాటా దక్కించుకొంది.

బాబర్ నాలుగు ముఖ్య సూత్రాలపై ఆధారపడి రాజ్య (ప్రభుత్వ) స్థాపన చేశాడు.

1. రాజుకు అత్యున్నత గౌరవం, బలాన్నివ్వడం.
2. మత మరియు సిద్ధాంత మౌఢ్యం లేకపోవడం.
3. కళలకు, సంస్కృతికి తగిన ప్రోత్సాహమివ్వడం.
4. సామ్రాజ్యానికి బాహ్యమైన రక్షణ నివ్వడం.

ఈ సూత్రాలనే అతని వారసులు కూడా తు.చ. తప్పకుండా అనుసరించారు.

## పాఠ్య ప్రశ్నలు

1. అఖిల భారత సామ్రాజ్య నిర్మాణ దిశగా బాబర్ వేసిన తొలి అడుగు ఏమి?
2. ‘ రాజరిక సిద్ధాంతం’లో బాబర్ ఏ మార్పులు చేశాడు?
3. బాబర్ మత దృక్పథం ఎట్టిది?
4. కాబూల్, కాంధహార్‌పై మొగలులు నియంత్రణ సాధించడం పట్ల భారత్ పొందిన ప్రయోజనాలు ఏవి?
5. బాబర్ ప్రారంభించిన రాజ్య (ప్రభుత్వ) ముఖ్య లక్షణాలేవి?
6. ఎ) సారస్వత బి) యుద్ధతంత్ర రంగములందు బాబర్ కృషి ఎటువంటిది?

## షేర్షా పరిపాలనా విధానం

సూర్ సామ్రాజ్యం ఢిల్లీ సుల్తానుల పాలనకు కొనసాగింపు మరియు ముగింపుగా చెప్పవచ్చు. కాగా బాబర్, హుమాయూన్‌ల కాలం అందులో కేవలం విరామ కాలాలు. షేర్షా అనేక సంవత్సరాలపాటు తన తండ్రి జాగీర్ పాలనా వ్యవహారములు పర్యవేక్షించుతూ, బీహార్‌కు అనధికార వాసపాలకుడు (Factoruler) గా మంచి పరిపాలనానుభవం సంపాదించాడు. ఆ విధంగా అతడు పరిపాలన పనితీరు ప్రతి దశను గూర్చి తెలుసుకున్నాడు. కావున కేవలం ఐదు సంవత్సరాల పాలనా కాలంలోనే అతడు ఒక చక్కని పటిష్టమైన పరిపాలనా విధానంను స్థాపించగలిగాడు.

సుల్తాన్‌ల కాలంలో ప్రాచుర్యంలోకి వచ్చిన కేంద్ర పరిపాలనా వ్యవస్థనే షేర్షా కొనసాగించాడు. ఐతే దీని గురించిన సమాచారం మనకు లభ్యంకాదు. ఏ చరిత్రకారుడూ అతని మంత్రుల గురించి పేర్కొనలేదు. షేర్షాకు మంత్రి

మండలి అనేది ఉన్నట్లు లేదు. దానికి బదులుగా అతని ఆజ్ఞలను అమలుచేయుటకు అనేక ప్రభుత్వ శాఖలలో అతడికి అనేక కార్యదర్శులుండేవారు. అతని సచివాలయం (Secretariat) లో ఉన్న శాఖలు ఈ విధంగా ఉన్నాయి. 1. దివాన్-ఇ-వజిరత్ (Diwan-i-Wazirat) దీనికి ఆర్థిక కార్యదర్శిగా వ్యవహరించే వజీర్ (Wazir) అధిపతిగా వ్యవహరించేవాడు. అతడు రెవెన్యూ వ్యవహారాలు, లెక్కలు, పరిశీలన (Audit) మొదలైన వ్యవహారాలు చూచేవాడు. 2. దివాని-ఇ-అర్జ్ (Diwan-i-Arz) దీనికి అరిజ్-ఇ-ముమాలిక్ (Ariz-i-Mumalik) అధిపతి. సైనిక కార్యదర్శిగా అతడు షేర్షా సైనిక విధాన నిబంధనలు అమలు చేయుట, సైనిక నియామక నిబంధనలు, సైన్యానికి కావలసిన ఏర్పాట్లు, వారి జీతాలు మొదలైన వ్యవహారాలు చూసేవాడు. 3. దివాన్-ఇ-ఇన్‌షా (Diwan-i-Insha) ప్రభుత్వ పత్రాలు, రాజ శాసనాలు (Imperial orders) సరియైన ముద్రణ, ప్రభుత్వ ఉత్తర ప్రత్యుత్తరాలు మొదలైన వాటిని చూచేవారు. 4. దివాన్-ఇ-రిసాలత్ (Diwan-i-Risalat) మతవ్యవహారాలు, అర్హులైన మహాపండితులకు, సన్యాసులకు మొదలైనవారికి ఉపకార వేతనాల ఏర్పాటు వంటి విషయాలను చూసుకునేవాడు. 5. గూఢచారి విభాగం కార్యదర్శిని బరీద్-ఇ-ముమాలిక్ (Barid-i-Mumalik). ఇతడు రాజ్యంలోని ప్రతి ముఖ్య విషయాన్ని షేర్షాకు నివేదించేవాడు. అతని క్రింద అనేక మంది పట్టణాలలో సంతలలో, సత్రముల వద్ద నియమించబడిన అనేక గూఢ చారులుండేవారు.

షేర్షా తన అధికారులకు మితిమీరిన అధికారాలను అప్పగించుటకుగాని వారు చొరవ తీసుకొనుటకుగాని సుముఖత చూపలేదు. అన్నిరకాల అధికారాలు రాజు ద్వారా నిర్వహించబడే ఒక నూతన భారతీయ నిరంకుశ విధానమును స్థాపించాలని షేర్షా తలచాడు. సమకాలీన చరిత్ర కారుడు (Chronicler) ముస్తాఖీ (Mustaqi) రాతలను బట్టి చూస్తే షేర్షా రాత్రింబవళ్ళు రాజ్యం గురించిన విషయాలతో తీరికలేకుండా ఉండేవాడు. ఎప్పుడూ ఖాళీగా ఉండేవాడు కాదు. అతడు ప్రతి శాఖను నిశితంగా పరిశీలించేవాడు. ప్రజల గురించి తెలుసుకోవడానికి దేశమంతా తిరిగేవాడు. ఐతే చక్రవర్తి దగ్గరే సర్వాధికారాల అంతులేని కేంద్రీకరణ తర్వాత కాలంలో బలహీనతకు మూలమైంది. దాని యొక్క దుష్పరిణామాలు, షేర్షా వారసుల పరిపాలనను నియంత్రించలేక పరిపాలనా యంత్రాంగం కుప్పకూలినపుడు బయటపడ్డాయి.

గిరిజన తెగల నాయకులతో నిర్మించబడి రాజ్యం గిరిజన నాయకులు, సర్దారుల మధ్య విభజించబడి ఉంటే ఆఫ్ఘన్ ప్రభుత్వ విధానంను షేర్షా వారసత్వంగా పొందాడు. అటువంటి ప్రభుత్వ విధానంలో రాష్ట్ర పాలన యొక్క సర్వ స్వతంత్ర విధానము విపరీతంగా పెరిగి కేంద్ర ప్రభుత్వ ఉనికికి ప్రమాదం తెచ్చింది. కేంద్ర మరియు స్థానిక ప్రభుత్వాలకు మధ్య వారధిగా పనిచేసే చక్కని వ్యవస్థీకృత రాష్ట్రపాలన ప్రాధాన్యతను షేర్షా నిర్లక్ష్యం చేయలేకపోయాడు. అందువల్ల అతడు రాష్ట్ర, స్థానిక పరిపాలనా వ్యవస్థలోని అధికారాలను, విధులను నియంత్రించవలసి వచ్చింది.

ఢిల్లీ సుల్తానుల కాలం నుండి వస్తున్న పరిపాలనా విభాగాలలో షేర్షా ఎటువంటి మార్పులు చేయలేదు. రాష్ట్రాలు సర్కారులు (Sarkar) లేదా షిక్ (Shiq) లుగాను, అవి మరల పరగణాలు (Paraganas)గాను విభజింపబడినవి. ఒక పరగణాలో అనేక గ్రామాలుండేవి. రాష్ట్రాలు 12 ఉండేవి. అవి లాహోర్ సింధ్, మాళ్వా, గుజరాత్, బీహార్, ముల్తాన్ అవధ్, రోహిల్‌ఖండ్, ఆగ్రా, ఢిల్లీ, జోథ్‌పూర్ మరియు చిత్తోర్‌లు. బెంగాల్ రాష్ట్రం సుదూర ప్రాంతంలోనుండటం, అక్కడ తరచు తిరుగుబాట్లు జరుగుతుండడంవల్ల దానిపై ప్రత్యేక దృష్టి కనపరచినట్లు తెలుస్తుంది. అది అనేకమంది గిరిజన నాయకుల క్రింద చిన్న చిన్న భాగాలుగా విభజించబడి ఉండేది కాని అమీన్ (Amin) వాటి మొత్తం మీద పర్యవేక్షణ మరియు అజమాయిషీ చేసేవాడు. షేక్ లేదా సర్కార్ ఇద్దరు ముఖ్య అధికారుల నిర్వహణలో ఉండేవి. 1.

షిక్దార్-ఇ-షిక్ద్రన్ (Shiqdar-i-Shiqdran) సాధారణ పాలన మరియు శాంతి భద్రతలను పర్యవేక్షించేవాడు. 2. మున్సిఫి మున్సిఫాన్ (Munsifi Munsifan) భూమి శిస్తు విధింపు, వసూలు చూచుకొనేవాడు. పరగణా సాధారణ విషయాలను షిక్దార్ పర్యవేక్షించగా, మున్సిఫ్ (Munsif) లేదా అమిల్ (Amil) భూమి శిస్తు విధింపు, వసూలు కార్యక్రమాలను చూచేవారు. కార్కున్‌లు (Karkuns) పర్షియా మరియు స్థానిక భాష అయిన హిందవిలో అధికారిక లెక్కలు నిర్వహించేవాడు. ఖాజానా నిర్వహణ ఖజానాదార్ (Khazandar) లేదా పోతేదార్ (Fotadar) చేతిలో ఉండేది. ఆ విధంగా షేర్షా ఇద్దరు బాధ్యతాయుత అధికారులను నియమించాడు. వారు ఒకరిపై మరొకరు నిఘా ఉంచేవారు. అధికారులలో 'నిరోధ సమతౌల్య విధానం' (Principle of Checks and Balances) అక్బర్ కూడా అవలంభించాడు. గ్రామాలు పరిపాలనా యూనిట్‌గా కొనసాగాయి. గ్రామాలలో గ్రామ సభలు (పంచాయత్) ఉండేవి. దానికి ముఖ్య లేక ముఖద్దమ్ (Muqaddam) అనే గ్రామ పెద్ద ఉండేవాడు. అతడు ప్రభుత్వానికి గ్రామానికి మధ్య వారధిగా పనిచేసేవాడు. అతనికి గ్రామ వివరాలకు సంబంధించిన పత్రాలను భద్రపరచే పట్వారీ (Patwari) అనే ఉద్యోగి సాయపడేవాడు.

షేర్షా భూమి శిస్తు విధానాన్ని రూపొందించి అమలు చేయుటలో గొప్ప కృషిచేశాడు. భూమిశిస్తు మదింపులో సంస్కరణలు ప్రవేశపెట్టాడు. వాస్తవ సాగుభూమిని కొలిచి దాని ఆధారంగా శిస్తును నిర్ణయించాడు. భూములను పేనిన నారతాడు (మోకు)తో కొలిచేవారు. భూమి ఫలసాయంను బట్టి మూడు తరగతులుగా విభజించబడేది. అవి ఉత్తమ, మధ్యమ, నాసిరకం భూములు. దిగుబడి సరాసరిని మదింప చేయటానికి మూడింట దిగుబడిని తీసుకొని దానిని మూడుచే భాగించేవారు. ఆ విధంగా వచ్చిన సగటు దిగుబడిలో 1/3వ వంతు పన్నుగా (ప్రభుత్వ వాటా)గా నిర్ణయించేవారు. రైతులు శిస్తును ధన రూపంలోగాని ధాన్య రూపంలోగాని చెల్లించే అవకాశముంది కాని ప్రభుత్వం ధన రూపంలో వసూలు చేయటానికే మొగ్గు చూపేది. షేర్షా ప్రవేశపెట్టిన ఒక ముఖ్యమైన విధానం భూమిశిస్తుకు ఒక ధరల పట్టికను తయారుచేయటం. దీనినే రై (ray) అనేవారు. దీనిలో ప్రభుత్వానికి ఒక్కొక్క పంటకు చెల్లించవలసిన శిస్తు మొత్తం వ్రాయబడి ఉంటుంది. దానిని మార్కెట్ ధరలను బట్టి నగదులోకి మదింపు చేసేవారు. అది ప్రాంతాలను బట్టి మారుతుండేది. కరువులు ప్రకృతి వైపరీత్యాలు సంభవించినపుడు ఆదుకోవడానికి వీలుగా భిగా (Bigha)కు 21/2 శేర్లు (Seers) ఆపద్ధర్మ నిధి (Reserve fund) ని వసూలు చేసేవారు. అల్లావుద్దీన్ ఖిల్జీ కూడా ధాన్యాగారములను నిర్వహించినట్లు మీరు ఇంతకుముందు పాఠాలలో తెలుసుకున్నారు. కాని అతడు ఆ ధాన్యాగారములను సాధారణ శిస్తును ధాన్య రూపంలో వసూలు చేసి నింపేవాడు గాని షేర్షా వలె ఎటువంటి అదనపు సుంకపు ధాన్యం కాదు.

అంతకుముందున్న రెవెన్యూ విధానంకన్నా షేర్షా ప్రవేశపెట్టిన రెవెన్యూ విధానముకన్నా ఎంతో మెరుగైనదనేది స్పష్టం. మొదటిగా భూమి శిస్తును సుమారుగా మదింపు చేయటాన్ని (కంకుట్ Kankut) లేదా కళ్ళంలోనే విభజించటం (Ghallabhakshi or batai) వంటి వాటిని షేర్షా కొనసాగించలేదు. ఐతే కొలత ప్రకారం శిస్తును మదింపు చేయటానికి అనుకూలించని కొన్ని ప్రాంతాలలో ఇది అమలులో ఉండేది. రెండవది, రైతుకు తాను పండించే పంటలో ఎంత పన్నుగా చెల్లించాలనేది ఒక అంచనా ఉండేది. పంట భూమి, పండించే పంట వివరాలు, చెల్లించవలసిన శిస్తు మొదలగు వివరాలతో కూడిన ఒక పట్టా (Patta) అనే పత్రం రైతులకు ఇవ్వబడేది. దానిని రైతుకు వివరించి, రైతు దానిని అంగీకరించినట్లు సకాలంలో పన్ను చెల్లించునట్లు కబూలియత్ (Qubuliet) అనే పత్రంపై సంతకం లేదా వేలి ముద్ర తీసుకొనేవారు. మూడవది షేర్షా తాము ఎటువంటి అదనపు వసూళ్ళు చేయమని హామీ ఇచ్చేవాడు. అవినీతిని

అరికట్టుటకుగాను కొలతదార్ల మరియు శిస్తువసూలు అధికారుల (Collectors) వేతనాలు కూడా నిర్ణయించబడినవి.

దేశ ప్రయోజనాల రీత్యా షేర్షా రైతుల సంక్షేమం అత్యావశ్యక విషయంగా పరిగణంచాడు. రైతులపై ఒత్తిడిచేస్తే అది వారి వలసలకు దారి తీస్తుందని షేర్షా తలచాడు. "దేశం ఒకసారి శిధిలమై, నిర్మానుష్యమైతే, అది మరల సస్యశ్యామలం కావాలంటే చాలా కాలం పడుతుంది'. ఆ విధంగా కరువు, అనావృష్టి వంటి సమయాలలో రైతులకు ప్రభుత్వమే ధన సహాయం, వస్తు సామాగ్రి అందజేసేది. పైగా షేర్షాతో సైన్యాన్ని రైతుల పంటలను ధ్వంసం చేయవద్దని, ఒకవేళ ఆ విధంగా జరిగినట్లయితే వారికి వెంటనే పరిహారమివ్వాలని' సిద్ధ ఆజ్ఞలను జారీ చేశాడు.

ఐతే షేర్షా రెవెన్యూ విధానం తప్పనిసరిగా అంతకుముందు విధానం కన్నా మెరుగైనదే అయినప్పటికీ అందులో కొన్ని లోపాలు లేకపోలేదు. మధ్యరకం మరియు నాసిరకం భూములు సాగుచేసే రైతులు వారికి పండిన పంటలో అధిక భాగం శిస్తుగా చెల్లించవలసి రాగా ఉత్తమ రకం భూములు సాగు చేసే రైతులు తక్కువ వాటా చెల్లించేవారు. అంతేగాక రైతులు చెల్లించవలసిన శిస్తు తేదీలు పట్టిక (Ray) అనేకసార్లు చాలా ఆలస్యంగా విడుదలయ్యేది. దీంతో పన్ను వసూలు చేయటం ఉద్యోగులకు కష్టమవ్వడమేగాక రైతులు చాలా ఇబ్బందులు పడవలసి వచ్చేది.

షేర్షా రెవెన్యూ విధానం అక్బర్ రెవెన్యూ విధానానికి మూలమని అంటారు. ఐతే అక్బర్ రెవెన్యూ విధానం షేర్షా రెవెన్యూ విధనాం కన్నా అన్ని విధాల అంటే కొలతలు, వర్గీకరణ, ప్రభుత్వ వాటా, మొదలైన అంశాలలో ఎంతో శాస్త్రీయం (Scientific)గా హేతుబద్ధం(ration)గా ఉంది. ఎంతో మెరుగైనది. వాటిలో కొన్ని ఈ క్రింద ఉదహరించబడినవి. 1. షేర్షా కాలంలో భూమిని కొలవడానికి పేనిన నారతాడును ఉపయోగించేవారు. అది వాతావరణ పరిస్థితులను బట్టి మారుతూ ఉండేది. అక్బర్ కాలంలో దానికి బదులుగా వెదురు బొంగులకు ఇనుపరింగులు తగిలించిన తనాబ్–జరీబ్ (tanab-jarib) అనే సాధనంగా వాడేవారు. 2. షేర్షా భూముల వర్గీకరణ కేవలం నేలల స్వభావంను బట్టి ఉత్తమ, మధ్యమ, నాసి అనే విధాలుగా జరిగేది. ఐతే అక్బర్ కాలంలో వర్గీకరణ భూమి సాగు చేసిన కాలంను కూడా పరిగణనలోకి తీసుకుని పోలజ్ (Polaj) పరేటీ (Parati) చచార్ (Chachar) బంజర్ (Banjar) అనే విధాలుగా జరిగేది. దీంతో అన్ని రకాల భూములకు, ప్రభుత్వానికి చెల్లించాల్సిన వాటా అన్నిరకాల భూములకు సమానంగా ఉండేది.

తన విశాల సామ్రాజ్యంను సుస్థిర పరచి, సరైన పాలననందించుటకు షేర్షా సిద్ధ సైన్యంను ఏర్పాటు చేశాడు. భూస్వాముల సైన్యాల బలహీనతలను అర్థం చేసుకొనిన షేర్షా అల్లా ఉద్దీన్ మాదిరిగానే నేరుగా సైనిక నియామకాలు చేపట్టెను. తన ప్రత్యక్ష అధీనంలో షేర్షా సాధారణ సైన్యాన్ని పోషించాడు. ప్రతి సైనికుడిని గుణగుణాలను పరిశీలించిన తర్వాతే నియమించేవాడు. పరోక్ష (దొంగ) సైనికులను నిరోధించేందుకు ప్రతి సైనికుడికి తన వివరాలతో కూడిన అధికార పత్రం (చేహ్రా Chehra) ఉండేది. నాసిరకం గుర్రాలను మంచి గుర్రాలతో మార్పిడి చేయకుండా నిరోధించేందుకు ప్రతి గుర్రానికి థాగ్ (dagh) అనే సామ్రాజ్య చిహ్నం వేసేవారు. ఇదే పద్ధతిని అల్లాఉద్దీన్ ఖిల్జీ అనుసరించినట్లు మీకు గుర్తిండే ఉంటుంది. ఒక క్రమమైన వ్యవధిలో సైన్యం హాజరును తీసుకొనటమేగాక ఒక నిర్దిష్టమైన తనిఖీ కూడా నిర్వహించబడేది. సైనికుల జీతాలు ధన రూపంలో చెల్లించబడుటేగాక వాటిని షేర్షాయే స్వయంగా నిర్ణయించేవాడు. అయితే సైనికులకు జాగీర్‌లుగా ఇనాంగా ఇవ్వడం కూడా అనవాయితీగా ఉండేది. జాగీర్దారీ విధానంలోని కొన్ని లోపభూయిష్టమైన విధానాలను మార్చివేశాడు. ఐతే దీనికి సరైన ఆధారం లేదు. షేర్షా సైనిక సంస్కరణలను మరింత సంస్కరించి, అభివృద్ధి చేసి అక్బర్ కొనసాగించాడు. షేర్షా వ్యక్తిగత సైన్యంలో లక్షా 50 వేల మంది అశ్విక దళం

(cavatry), 25 వేల మంది పదాతి దళం (infartry), 5 వేల గజ బలం, ఒక పార్క్ (park) శతఘ్ని దళం (Artillery) ఉండేవి. సైన్యంలో అశ్వికదళానికి అత్యధిక ప్రాధాన్యత ఉండేది. రాజధానిలో సాధారణ సైన్యంతోబాటుగా షేర్షా వివిధ కీలక ప్రాంతాలలో సైనిక స్థావరాలను ఏర్పాటుచేశాడు. దీంతోపాటు ఫౌజ్ దార్ ఆధ్వర్యంలో బలమైన రక్షక దళాలు కూడా ఉండేవి.

సామ్రాజ్యంలో శాంతి భద్రతల పర్యవేక్షణకుగాను షేర్షా ఒక సమర్థవంతమైన పోలీసు వ్యవస్థను ఏర్పాటుచేశాడు. దొంగుల, దోపిడిదార్లు, పన్నులు ఎగవేసిన, ప్రభుత్వ ఉత్తర్వులను ఉల్లంఘించిన జమిందార్ల పట్ల షేర్షా కఠినంగా వ్యవహరించేవాడు. నేరాలకు స్థానిక అధికారులకు బాధ్యులు చేసే విధానం అమలులో ఉంది. అంటే నేరస్థులను పట్టుకోడానికి, దొంగిలించబడిన సొత్తును తిరిగి సంపాదించటానికి గ్రామాధికారి (Muqaddam) మరియు జమిందార్లను బాధ్యులు చేసేవారు. వారు ఆ విధంగా నేరస్తులను పట్టుకొనలేకపోతే దొంగలకు విధించే శిక్ష వారికి విధించేవారు. షేర్షా కాలం నాటి ఒక చరిత్రకారుడు ఇలా అన్నాడు. “బలహీనమైన ఒక ముసలి స్త్రీ సైతం తన నెత్తిన బుట్టనిండా బంగారు ఆభరణాలతో ఎటువంటి దొంల భయం లేకుండా ప్రయాణం చేయగల పరిస్థితి ఉంది. ఎందుకంటే, షేర్షా విధించే కఠిన శిక్షలకు దడిచి ఏ దొంగ కూడా ఆమె దగ్గరకు రాగలిగే వాడు కాదు”.

షేర్షా ఖచ్చితమైన, నిస్పక్షపాతమైన న్యాయ పాలననందించాడు. నేరస్థులెవరైనా, ధనవంతులైనా ప్రభుత్వవర్గం వారైనా, తన బంధువులైనా, తన తెగవారైనా వారిని లెక్కచేయక కఠినంగా శిక్షించాడనడానికి అనేక ఆధారాలున్నాయి. రాజధానిలో ముఖ్య ఖాజీ లేదా సాదర్‌తోపాటు వివిధ ప్రాంతాలలో న్యాయపాలన కోసం అనేకమంది ఖాజీ (Qazi) లను నియమించాడు. స్థానికమైన సివిల్, క్రిమినల్ కేసులను గ్రామ పంచాయితీలు పరిష్కరించేవి.

షేర్షా వ్యాపార, వాణిజ్యంలను ప్రోత్సహించే ద్రవ్య (Currency), సుంక (tarif) సంస్కరణలను ప్రవేశపెట్టాడు. షేర్షా అధికారం చేపట్టినపుడు కరెన్సీ విలువపడిపోయి ఉంది. నాడు వివిధ లోహ నాణెంల మధ్య స్థిరమైన నిష్పత్తి లేదు. అంతకుముందు పాలకులు వేసిన నాణెంలు కూడా చెలామణిలో ఉన్నవి. విలువ పడిపోయిన కరెన్సీ స్థానంలో అతడు ఏకీకృత విలువ గలిగిన బంగారు, వెండి, రాగి నాణెములను పెద్ద సంఖ్యలో విడుదల చేశాడు. షేర్షా తర్వాత శతాబ్దాలపాటు మొగలుల కాలంలోను, తర్వాత 1835 సంవత్సరం వరకు ఈస్టిండియా కంపెనీ కాలంలో చెలామణిలో నున్న షేర్షా ప్రవేశపెట్టిన వెండి రూపాయి నాణెం (రూపయా) చూస్తే మనకు అతని ఘనత అర్థమవుతుంది. సామ్రాజ్యమొత్తంలో ఒక క్రమమైన ఏకీకృత తూకాలు, కొలతల విధానంను ప్రవేశపెట్టాలని ప్రయత్నించాడు. తన యావత్ సామ్రాజ్యంలో సరుకులకు కేవలం రెండు ప్రదేశాలు 1. తూర్పున సిక్రిగాలి (Sikrigali) 2. పడమర సింధునది వద్ద మాత్రమే సుంకం వసూలు చేయబడేది. రహదారుల వెంట, గాలి, బల్ల కట్టుల వద్దగాని, పట్టణాలలోగాని మర్కెడైనా గాని సుంకాలు వసూలు చేయుట అనుమతించబడలేదు.

తన రాజ్యంలో సమాచార వ్యవస్థ అభివృద్ధికి షేర్షా ఎంతో శ్రద్ధ కనబరచాడు. అటు వ్యాపార వాణిజ్యంలను ప్రోత్సహించుటకు ఇటు సైనిక రక్షణ రంగానికి ఇది ఉపయోగపడింది. దేశంలోని అనేక ముఖ్య ప్రాంతాలన్నింటినీ బ్రహ్మాండమైన రహదారి వ్యవస్థతో కలిపాడు. అతడు వేసిన నాలుగు ముఖ్య రహదారులలో మొదటిది ఇప్పటికి నిలచి ఉన్న ‘గ్రాండ్ ట్రంక్ రోడ్’ (Grand Trunk Road)గా పిలువబడే బెంగాల్‌లోని సోనార్‌గావ్ (Sonargoan) నుండి ఆగ్రా, ఢిల్లీ, లాహోర్ మీదుగా సింధునది వరకు వేయబడిన రహదారి. రెండవది ఆగ్రా నుండి జోథ్‌పూర్, చిత్తోర్‌లను గుజరాత్‌లోని ఓడరేవులను నేరుగా కలిపే రహదారి. మూడవది పశ్చిమ దేశాలకు మధ్య ఆసియాకు వెళ్ళే వ్యాపార

సమూహాలు (Caravans) ముల్తాన్ నుండి బయలు దేరతాయి కాబట్టి లాహోర్ నుండి సుల్తాన్‌కు వేయబడిన రహదారి. నాల్గవది ఆగ్రా నుండి మాండు (Mandu) వరకు వేయబడిన రహదారి.

ప్రజా సంక్షేమానికి షేర్షా చేపట్టిన కార్యక్రమాలలో ముఖ్యాంశం యాత్రికులు బసచేయటానికి ఉపయోగపడే సత్రాల (సరాయ్) నిర్మాణం. అంతకుముందు వీటి గురించిన ఎక్కువ శ్రద్ధ, ప్రణాళిక వ్యాప్తి లేదు. షేర్షా సామ్రాజ్యం మొత్తంలో సుమారు 1,700 సరాయ్‌లు కట్టించాడు. ఈ సరాయ్‌ల చుట్టు గ్రామాలను నిర్మించి, ఈ సరాయ్‌ల నిర్వహణ ఖర్చులకు కొంత భూమిని కూడా కేటాయించాడు. ప్రతి సరాయ్‌కి నిర్వహణాధికారి షహ్నా (Shahna)తో పాటు అనేక మంది కాపలాదార్లు ఉండేవారు. సమాచారంలను ఒక చోటి నుండి మరొక చోటికి చేరవేయటంలో ఈ సరాయ్‌ల ముఖ్య పాత్రనే పోషించాయి. అవి డాక్‌చౌక్‌లు (Dak chowkis) (తపాలా కూడళ్ళు)గాను వార్తా కేంద్రంలుగాను ఉపయోగపడినవి. రాజ్య సంబంధ తపాలా ఇక్కడే ఉంచబడేది. తర్వాత కాలంలో ఈ సరాయ్‌ల చుట్టూ ఖస్బాలు (Qashabas) అనబడే వర్తక పట్టణాలు వెలిశాయి. వర్తక వాణిజ్యాలు పెద్ద ఎత్తున జరిగేందుకు ఇవి తోడ్పడినాయి. షేర్షాను తరచుగా అక్బర్‌కు మార్గదర్శకుడుగా పేర్కొనటం జరుగుతుంది. అతడు ప్రవేశపెట్టిన భూ సంస్కరణలు, ఆర్థిక సంస్కరణలు, సైనిక సంస్కరణలు అక్బర్‌కు మూలాలుగా నిలిచాయి. అయితే అక్బర్ హిందూ – ముస్లిం సమైక్యతా దిశగా ఒక నూతన శకానికి నాంది పలికాడు. షేర్షా మత దృక్పథం పరిమితమైనది మాత్రమే. అతడు ఎటువంటి నూతన ఉదార విధానాలను ప్రారంభించలేదు. హిందువుల నుండి జిజియా పన్ను వసూలు చేయటం కొనసాగించాడు. ఏదిఏమైనా షేర్షా సాధించిన ఘనత తక్కువేమికాదు. కేవలం ఐదు సంవత్సరాల స్వల్ప వ్యవధిలో గొప్ప గొప్ప సంస్కరణలను అమలుజరిపి సామ్రాజ్యంనకు పటిష్టమైన ఒక చక్కని పరిపాలనా వ్యవస్థను అందించాడు.

## సారాంశం

బాబర్ భారతదేశ ఆగమనం ఎన్నో విధాలుగా ప్రాముఖ్యతను పొందింది. అంతేగాక అతడు మొట్టమొదటి మొగల్ వంశ పాలకుడే గాక అఖిల భారత సామ్రాజ్యమునకు నాంది పలికాడు. బాబర్ భారతదేశములో ఒక నూతన యుద్ధ తంత్రమును పరిచయం చేశాడు. తుల్ఘామా యుద్ధ వ్యూహాలను ఉపయోగించి బాబర్ లోడీలు, రాజపుత్రులపై చేసిన యుద్ధంలో విజయాలను పొందాడు. అప్పటి నుండే భారతదేశంలో శతఘ్నదళం, తుపాకిమందు, అశ్వికదళం భారతదేశంలో ప్రాచుర్యంలోనికి వచ్చాయి. బాబర్ ఆగమనం భారత దేశానికి ఒక నూతన రాజకీయ సుస్థిరతను ఇచ్చింది. బాబర్ భారతదేశంలోనేగాక, భారతదేశం వెలుపల గూడా రాజు స్థానాన్ని తిరస్కరించాడు. అతడు ఖలీఫత్ (Caliphate) గుర్తింపు కోసం ప్రయత్నించాడు. తనకు తాను 'బాద్షా'గా ప్రకటించుకున్నాడు. బాబర్ దృక్పథంలో ముఖ్యంగా చెప్పుకోదగినది అతనికి మత, సిద్ధాంతపర మౌఢ్యం లేకపోవడం. బాబర్ విద్యావంతుడేగాక స్వయంగా మంచి రచయిత. అతని ప్రముఖ గ్రంథమైన 'తుజుకి–ఇ–బాబరీ'లో హిందుస్థాన్‌పై అతనికిగల అభిప్రాయంను వివరిస్తుంది. మొగలుల రాక ఒక నూతన మరియు సుసంపన్నమైన సాంస్కృతిక శకానికి నాంది పలికినది. బాబర్ అందించిన రాజకీయ, ఆర్థిక భద్రత ఒక శక్తివంతమైన మొగల్ రాజ్యం ఏర్పడటానికి ఉపకరించింది. సూర్ వంశ స్థాపకుడైన షేర్షా సుపరిపాలనా విధానంనకు ఎంతో కృషి చేశాడు. అతడు సామ్రాజ్యంను శక్తివంతం చేసే ఎన్నో అసాధారణ, నూతన పద్ధతులను ప్రవేశపెట్టాడు. షేర్షా అధికారాలన్నీ చక్రవర్తి చేతిలో కేంద్రీకృతమయ్యే విధంగా ఒక కేంద్రీకృత పరిపాలనా వ్యవస్థను ప్రవేశపెట్టాడు. అతని అజమాయిషీలో అనేక కార్యదర్శులు వివిధ శాఖలను పర్యవేక్షించుచూ అతని ఆజ్ఞలను అమలులో పెడుతూ పనిచేసే వారని తెలుస్తుంది. రాజ్యాన్ని షేర్షా 'సుజాతి' లేదా

'సర్కార్' (షేక్)లుగా పరగణాలుగా విభజించాడు. పరిగణాలలో పరిపాలనా నిర్వహణకు, పన్నులు వసూలు చేయుటకు ఇద్దరు ఉద్యోగులుండేవారు. ఈ ఉద్యోగులు ఒకరి అధికారాలపై మరొకరు నిఘా వేసేవారు.

షేర్షా ప్రవేశపెట్టిన భూమిశిస్తు విధానం చాలా ప్రసిద్ధి చెందింది. అప్పటికి అమలులోనున్న సుమారుగా భూమి విస్తీర్ణం నిర్ణయించి శిస్తు వసూలు చేసే పద్ధతికి స్వస్తి చెప్పి షేర్షా నారతాడుతో భూమిని కొలిచే విధానాన్ని ప్రవేశపెట్టాడు. భూమిని మూడు తరగతులుగా విభజించి మూడింటి సగటు ఉత్పత్తిలో మూడవ వంతును (ప్రభుత్వ వాటా) భూమి శిస్తుగా నిర్ణయించాడు. దీనికి ఒక పట్టిక (ray) గూడా తయారుచేయబడింది. పట్టా మరియు కబూలియత్ వల్ల రైతులకు తాము చెల్లించవలసిన పన్నుల గురించి అవగాహన ఏర్పడింది. వీటిలో అనేక పద్ధతులను తర్వాత అక్బర్ కొన్ని మార్పులతో అమలుచేశాడు.

షేర్షా వాడుకలోలేని ధాగ్ (dagh) మరియు చేహ్రా (Chehra) పద్ధతులను పునరుద్ధరించాడు. సైనిక నియమాకం కూడా కేంద్రీకృతమైంది. కీలక స్థానాలలో సైనిక స్థావరాలు ఏర్పాటుచేయబడినవి. షేర్షా సమర్ధవంతమైన పోలీసు వ్యవస్థను కూడా నెలకొల్పాడు. అతడు దోపిడీ దొంగలు మరియు తిరుగుబాటుదార్లతో చాలా కఠినంగా వ్యవహరించాడు. తన రాజ్యాన్ని అతడు సంరక్షితంగా చేశాడు.

షేర్షా ద్రవ్య (Currency) మరియు సుంక (tariff) సంస్కరణలు చేపట్టాడు. దీనివల్ల వ్యాపారం ప్రోత్సాహం పొందింది. విలువ పడిపోయిన కరెన్సీని పునఃసమీక్షించి, బంగారం, వెండి, రాగి నాణెములను ముద్రించాడు. తూకాలు, కొలతలను కూడా ప్రామాణికం చేయటానికి ప్రయత్నించాడు. పన్నులు, సుంకాలు విధించే విధానం కూడా స్థిరీకరించబడింది.

ప్రజా పనులపై షేర్షా అత్యంత శ్రద్ధ కనబరిచాడు. అతడు ఎన్నో సత్రాలు కట్టించాడు. సామ్రాజ్య రాజధానితో అన్ని రహదారులను కలిపి షేర్షా సమాచార వ్యవస్థను అభివృద్ధి పరచాడు. ఆ రహదారులు నేటికినీ వాడుకలో నున్నవి.

## అభ్యాసం

100 మాటలలో జవాబులు వ్రాయుము:

1. బబర్ యుద్ధ పద్ధతులలో బాబర్ ప్రవేశపెట్టిన నూతన పద్ధతులు ఏవి?
2. మతంపై బాబర్ అభిప్రాయంలు ఏవి? రాణా సంగుని పై అతడు చేసిన యుద్ధమును 'జీహాద్'గా ఎందుకు పేర్కొన్నాడు?
3. వర్తక వాణిజ్యంలను ప్రోత్సహించుటకు షేర్షా చేపట్టిన చర్యలు ఏవి?
4. షేర్షా చేసిన సైనిక సంస్కరణలు ఏవి?
2. బాబర్ భారతదేశ ఆగమన రాజకీయ ప్రభావం ఎట్టిది?
3. బాబర్ భారతదేశ దండయాత్ర భారతదేశ చరిత్రలో నూతన దశకు శ్రీకారం చుట్టిందనే విషయాన్ని ఉదాహరణలతో వివరించుము.
4. షేర్షా భూమి శిస్తు విధాన పాలనను, ఈ విధానంలో షేర్షా అక్బర్‌కు ఎంతవరకు మార్గదర్శకుడయ్యాడు.
5. రాజు అధికారాలను ప్రత్యేకంగా వివరిస్తూ షేర్షా పరిపాలనలోని కేంద్రయంత్రాంగంను వర్ణించుము.

ఈ విధానం షేర్షా వారసుల కాలంలో ఎందుకు విఫలమైంది?

## అదనపు సమాచారం

'తాజుకి బాబరీ' గొప్ప చారిత్రక విలువగల గ్రంథం. జీవిత చరిత్ర రూపంలో వ్రాయబడిన ఈ గ్రంథం, బాబర్ వ్యక్తిత్వంను హిందూస్థాన్‌పై అతనికిగల అభిప్రాయంను వివరిస్తుంది. ఈ గ్రంథం మొదట తుర్కి భాషలో వ్రాయబడి తర్వాత పర్షియన్ భాషలోకి అనువదించబడినది. బాబర్ తన పరిశీలనను వ్రాయటానికి సరళమైన, సూటియైన శైలిని వాడాడు.

అతడు హిందుస్థాన్‌లోని జంతువుల, పక్షుల చెట్ల, ఫలాల పట్టికలను కూడా బాబర్ ఇచ్చాడు. ఐతే హిందూస్థాన్ ప్రజల గురించి అతడు ఎంతో నిరుత్సాహంనకు గురయ్యాడు. అతని అభిప్రాయం ప్రకారం వారిలో సద్గుణాలు కల్పించవు. అంతేగాక వేడి, దుమ్ము దారుణంగా ఉంది. బాబర్ దృష్టిలో అన్నింటికన్నా భారతదేశపు ప్రత్యేక ఆకర్షణ దాని సిరిసంపదలే. ఆయన ఇలా వ్రాశాడు.

"హిందూస్థాన్ ముఖ్యమైన ఘనత ఏమనగా అది చాలా విశాలమైన దేశమేగాక బంగారు, వెండితో నిండి ఉంది".

బాబర్ తన స్వదేశంలో లభ్యమయ్యే పండ్లు, కర్బూజా, ద్రాక్ష మరియు అనేక పుష్పాలను గురించి తలచుకొంటూ దిగులుతో వ్రాశాడు. కాబట్ట బాబర్ 1530లో మరణించినపుడు అతని మృతదేహాన్ని కాబూల్ తీసుకొని వెళ్ళి తాను ప్రేమించే పుష్పాలు మరియు చెట్ల మధ్య ఖననం చేశారు.

# 36

# మొగల్ సామ్రాజ్య సుస్థిరత

## 36.1.పరిచయం :

ఇంతకు ముందు పాఠంలో క్రీ.శ 1526లో బాబరు భారతదేశంలో మొగలు సామ్రాజ్య స్థాపన చేశాడు అని మీరు చదువుకున్నారు. కాని ఇతడు సామ్రాజ్యాన్ని సుస్థిరం చేయక ముందే మరణించాడు. ఇతని వారసుడైన హుమాయూన్ తన సామ్రాజ్యాన్ని బలవంతుడైన శత్రువు షేర్షాసూర్ చేతిలో పోగొట్టుకున్నాడు. సూర్ సామ్రాజ్యం విచ్ఛిన్నమైన తర్వాత హుమాయూన్ ఢిల్లీని తిరిగి స్వాధీనం చేసుకోగలిగాడు. ఇతడు సామ్రాజ్యాన్ని సుస్థిరం చేయకముందే మృత్యువు ఇతనిని కబళించింది. పిన్నవయస్కుడైన అతని కుమారుడు అక్బరు హుమాయూన్ వారసుడైనాడు. ఈ విధంగా అక్బరు ఒక నిర్దిష్టమైన ప్రాంతాలు లేని సామ్రాజ్యానికి వారసుడైనాడు. ఈ పాఠం మొదటి విభాగంలో అక్బరు తన శత్రువులతో ఎంత తెలివితేటలతో వ్యవహరించి మొగలు సామ్రాజ్యాన్ని విస్తరింపజేశాడో చదువుతారు. రెండో విభాగంలో మొగలు సామ్రాజ్య విస్తరణలో జహంగీరు, షాజహాన్‌ల పాత్రను గురించి చదువుతారు. చివరి విభాగంలో అక్బరు, జహంగీర్, షాజహాన్‌ల వాయువ్య సరిహద్దుల విధానం మధ్య ఆసియా విధానాలను గురించి చదువుతారు.

## 36.2 లక్ష్యాలు :

**ఈ పాఠం చదివిన తర్వాత మీరు క్రింది విషయాలు తెలుసుకుంటారు.**

1. అక్బరు ఏ పరిస్థితులలో చక్రవర్తిగా ప్రకటించబడినాడో గ్రహించుట
2. సర్దారులకు సంబంధించి అక్బరు తొలిదశలో ఎదుర్కొనిన సమస్యలను గుర్తించగలుగుట
3. అక్బరు పాలనలో మొగలు సామ్రాజ్య తొలి విస్తరణను గ్రహించగలుగుట
4. మొగలు సామ్రాజ్య విస్తరణలో జహంగీర్, షాజహాన్‌ల పాత్రలను గుర్తించగలుగుట
5. మొగల్ సామ్రాజ్య భద్రతకు సంబంధించి వాయువ్య విధానం ప్రాముఖ్యతను తెలుసుకొనుట
6. అక్బర్, జహంగీర్, షాజహాన్‌ల వాయువ్య సరిహద్దుల విధానం మరియు మధ్య ఆసియా విధానాలను వివరించగలుగుట

## 36.3 అక్బరు బాల్యం మరియు పట్టాభిషేకం :

హుమాయూన్ షేర్‌షాసూర్‌చే తరమబడినపుడు అమర్‌కోట పాలకుడైన రాణా విర్సాల్(virsal) వద్ద ఆశ్రయం

పొందినట్లు గుర్తుండే ఉంటుంది. క్రీ.శ 1542 అక్టోబరులో అక్బరు ఇక్కడే జన్మించాడు. తనకు పుత్రోదయమైందనే వార్త చేరినపుడు హుమాయూన్ దిక్కులేని స్థితిలో ఉన్నాడు, ఈ శుభ కార్యాన్ని ఆనందంగా గడపడానికి తనవద్ద ఏమీలేని హుమాయూన్ తన కుమారుని కీర్తి ప్రతిష్టలు, ఖ్యాతి ప్రపంచమంతా కస్తూరి పరిమళంలా వ్యాపించాలని ప్రార్ధిస్తూ ఒక చిన్న కస్తూరి ఉండను పగలకొట్టి తన అనుచరులకు పంచాడు.

బాల్యంలో అక్బరు చదవడం, వ్రాయడం ఎక్కువ శ్రద్ధ చూపేవాడు కాదు. కాని గుఱ్ఱపుస్వారీ, ఖడ్గ చాలనంలో ఆసక్తిని చూపేవాడు. త్వరలోనే అతడు నిపుణుడైన యోధుడుగా తయారయ్యాడు. అక్బరు, సైనిక శిబిరంలో హుమాయూన్‌కు సహాయకుడిగా ఉండేవాడు. అక్బరు తాను బైరాంఖాన్‌తో సహా సికందర్ సూర్‌ని వెంటాడుతూ ఉన్నప్పుడు కలనూర్(పంజాబ్) వద్ద తన తండ్రియైన హుమాయూన్ మరణవార్తను విన్నాడు. బైరాంఖాన్ తక్షణ చర్యను తీసుకొని 13 సంవత్సరాల అక్బరును చక్రవర్తిగా ప్రకటించాడు. తనకు తానే అతనికి సంరక్షుడయ్యాడు. నిర్ధిష్ట పరిపాలక ప్రాంతంలేని సామ్రాజ్యానికి వారసుడైనందువల్ల సింహాసనారోహణ సమయంలో అక్బరు స్థితి అనిశ్చితంగా ఉంది.

సింహాసనాన్నధిరోహించిన అక్బరు ఎన్నో సమస్యలను, కష్టాలను ఎదుర్కొనవలసి వచ్చింది. మొదటిది షేర్‌షాసూర్ వారసులు భారతదేశం నుండి మొగలులను తరిమి వేయడానికి తీవ్రంగా కృషి చేస్తూ ఉండేవారు. సికిందర్ సూర్ పంజాబ్‌లో సైన్యాన్ని సమకూర్చుకొని అక్బరును ఎదుర్కొనడానికి సిద్ధంగా ఉన్నాడు. రెండవది ఆదిల్షా (చూనూర్ నుండి బెంగాల్ సరిహద్దు వరకు గల ప్రాంతాన్ని ఆధీనం చేసుకొన్న షేర్‌షాసూర్ మేనల్లుడు) మంత్రి అయిన హేము ఢిల్లీ మరియు ఆగ్రాలను స్వాధీనం చేసుకొని ఉన్నాడు. మూడవది పంజాబ్, ఢిల్లీలను ఆక్రమించాలని ఉబలాట పడుతూ ఉన్న అతని దాయాది అయిన మీర్జా హకీమ్ ఆధీనంలో కాబూల్ ప్రాంతం ఉంది. నాల్గవది, పునఃస్వాతంత్ర్యం పొందిన రాజపుత్రులు దానిని వదులుకోవడానికి సిద్ధంగా లేరు. ఐదవది గుజరాత్ మాల్వాలు ఈ పరిస్థితిని ఆసరాగా తీసుకొని తమ స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నాయి. వారు ఇంతకుముందు హుమాయూన్ చేతిలో ఓడిపోయిన వాళ్ళే. ఆరవది సుదూర దక్షిణ భారత పరిపాలకులు మొగలు చక్రవర్తికి ఎట్టి ప్రాధాన్యతను ఇవ్వటం లేదు. వీటికి తోడు వివిధ జాతుల మిశ్రమం అయిన సర్దార్ల విశ్వాసాన్ని పొందటం అక్బరు అంతర్గతంగా ఎదుర్కొంటున్న అతిక్లిష్ట సమస్య.

13 సంవత్సరాల బాలుడికి ఇటువంటి క్లిష్ట పరిస్థితిని ఎదుర్కోవడం కఠిన కార్యం. ఏదేమైనా అక్బరు తన ధైర్యం, సమర్ధతలతో ఈ స్థితిని ఎదుర్కోవడానికి నిర్ణయించుకున్నాడు. అతనికి తన విశ్వాస పాత్రుడైన సంరక్షుడైన బైరామ్‌ఖాన్ సంపూర్ణ మద్ధతు లభించింది.

### రెండవ పానిపట్టు యుద్ధం (క్రీ.శ 1556) :

అక్బరు సింహాసనాన్ని ఎక్కే సమయంలో పంజాబ్‌లో సికందర్‌సూర్‌ని వెంటాడుతున్న విషయం మీకు గుర్తుండే ఉంటుంది. అక్బరు జలందర్‌లో సైనిక శిబిరంలో ఉన్నపుడు హేము ఢిల్లీ, ఆగ్రాలను జయించిన వార్త అతనికి చేరింది. హేము సైన్యం మొగలు సైన్యం కంటే చాలా పెద్దదైనప్పటికీ భైరాంఖాన్ ఢిల్లీ ఆగ్రాలను స్వాధీనం చేసుకోవడానికే నిర్ణయించుకున్నాడు.

క్రీ.శ 1558 నవంబరులో అక్బరు హేముల సైన్యం చారిత్రాత్మక యుద్ధ క్షేత్రమైన పానిపట్ వద్ద ఢీకొన్నాయి. హేము జయించే పరిస్థితి ఉన్నపుడు ఎక్కడనుంచో గురి తప్పి వచ్చిన బాణం యుద్ధ గతిని మార్చివేసింది. ఆ బాణం హేము కంటిలో గ్రుచ్చుకొని అతనికి స్పృహలేకుండా చేసింది. అతని సైన్యం తన నాయకుడు మరణించాడనుకొని భయభ్రాంతులై, చెల్లాచెదురై అన్ని దిక్కులకు పారిపోయారు. మొగలు సైనికులు పారిపోతున్న హేము సైనికులను

వెంటాడారు. చివరకు హేము  మొగలులచే సంహరించబడ్డాడు. ఈవిధంగా రెండవ(పానిపట్టు) యుద్ధం మొగలులకు విజయాన్నిచ్చింది. విజేతలైన మొగలులు ఢిల్లీ ఆగ్రాలను ఆక్రమించారు. ఈ యుద్ధం మొగలుల పరువు ప్రతిష్టలను, శక్తిని ఇనుమడింపచేసింది. ప్రబల పోటీదారైన హేము అడ్డు తొలగిన తర్వాత మేవట్ వద్ద తిరుగుబాటు చేసేందుకు పథకాలు వేస్తున్న హేము అనుయాయులందరినీ అక్బరు అణిచివేశాడు. ఇక్కడనుండి ఇతడు అపార సంపదను కొల్లగొట్టి, దానిని ఢిల్లీ ఆగ్రాలకు కొనిపోయారు. ఇది అతని ఆర్థికస్థితిని మెరుగుపరిచింది.

## 36.ఎ పాఠ్యప్రశ్నలు

1. అక్బరు జన్మించినపుడు హుమాయూన్ ఉన్న పరిస్థితులేవి?
2. అక్బరు ఎప్పుడు, ఎక్కడ చక్రవర్తిగా సింహాసనమెక్కాడు?
3. అక్బరుకు ఉన్న సమస్యలేంటి? ఏవైనా రెండు సమస్యలను పేర్కొనండి.
4. రెండవ పానిపట్ యుద్ధ ఫలితమేమి?

## 36.4 సర్ధారులతో పోరాటం, బైరాంఖాన్ పతనమగుట :

క్రీ.శ 1556 – 1560 వరకు నాలుగు సంవత్సరాలు అక్బరు సంరక్షుడైన బైరాంఖాన్ సామ్రాజ్య వ్యవహారాలలో ఆధిపత్యం వహించాడు. రెండవ పానిపట్ యుద్ధంలో అతడు ప్రధాన పాత్రను పోషించాడు. అతడు సామ్రాజ్యాన్ని పునః స్థాపించడమే కాకుండా, హేమూ బంధువుల తిరుగుబాట్లను కూడా అణచివేసి సికందర్‌సూర్ అక్బరు సార్వభౌమత్వాన్ని అంగీకరించేటట్లు చేశాడు. స్వాధీనం చేసుకొనిన ప్రాంతాలలో, శాంతి భద్రతలను నెలకొల్పాడు. అక్బరు  కోసం జోన్‌పూర్ గ్వాలియర్, అజ్మీర్‌లను జయించాడు. వరుస విజయాలు బైరాంఖాన్‌ని దురహంకారిగా మార్చాయి. దీనితోపాటు బైరాంఖాన్ 'షియా' శాఖకు చెందినవాడు కావటంతో 'సున్నీ' శాఖకు చెందిన ఆస్థాన కులీనులు(సర్ధార్లు) అతడు తన వర్గం వారిని అభివృద్ధిలోకి తెచ్చుచున్నట్లు భావించారు. వారు ఇతనికి విరుద్ధంగా కుట్రలు పన్నడం ప్రారంభించారు.

అక్బరు తన రాజ్య వ్యవహారాలను స్వయంగా చక్కబెట్టుకోగల వయస్కుడైనాడు. పరిపాలనను పూర్తిగా తన చేతిలోకి తీసుకోవాలని అభిలషించాడు. అతడు ఆగ్రే నుండి ఢిల్లీకి చేరి కార్యాలయాన్ని తనకు స్వాధీనం చేసి మక్కా యాత్రకు వెళ్ళమని కోరుతూ ఢిల్లీ నుండి బైరాంఖాన్‌కు లేఖ వ్రాశాడు. మక్కాకు వెళ్ళేందుకు ప్రయత్నాలు చేసుకొనేందుకు బైరాంఖాన్ సర్‌హింద్‌కు బయలుదేరాడు. కాని ఇతర సర్ధార్ల నుండి నిరంతరమైన ఒత్తిడి, అవమానం ఇతనిని అక్బరుపై తిరుగుబాటు చేసేందుకు ప్రేరేపించాయి. కాని ఆరునెలల తర్వాత అతడు బంధించబడి అక్బరు ఎదుట హాజరు పరచబడ్డాడు. బైరాంఖాన్ సేవలను దృష్టిలో ఉంచుకొని అక్బరు అతనిని క్షమించటమే కాకుండా ఆస్థానంలో ఉద్యోగం చేయడమో, మక్కాకు వెళ్ళడమో దేనిని ఇష్టపడతాడో చెప్పమని ప్రశ్నించాడు. బైరాంఖాన్ రాజపుత్ర రాజ్యం, గుజరాత్‌ల గుండా మక్కాకు వెళ్ళడాన్ని ఎంచుకున్నాడు. ఐతే అతడు ముబారక్ అనే ఒక ఆఫ్ఘన్ పఠాన్ చేతిలో చంపబడ్డాడు. అక్బరు ఇతని మరణాన్ని గురించి ఎంతో దుఃఖించాడు. అతడు నిరుపేద స్థితిలో ఉన్న బైరాంఖాన్ కుటుంబాన్ని వెనుకకు పిలిపించాడు. ఆ కుటుంబానికి అక్బరు సాధ్యమైనన్ని విధాలుగా సహాయం చేశాడు. ఇతడు బైరాంఖాన్ కుమారుడైన అబ్దుల్ రహీంకు ఖాన్–ఇ–ఖానన్ (khan-i-khanan) బిరుదును బహూకరించాడు.

**మహాం అంగా (Maham Anga) మరియు ఆమె బంధువుల నుండి స్వేచ్ఛ :**

బైరాంఖాన్ పతనం తర్వాత మహాం ఆగా (అక్బరు పెంపుడుతల్లి) మరియు ఆమె బంధువులు శక్తివంతులుగా ఎదిగారు. ఆమె కుమారుడైన ఆదంఖాన్ అత్యాశాపరుడై అత్యున్నత స్థానానికి ఎగబ్రాకుదామనీ ఆశపడ్డాడు. ఆదంఖాన్ నీచత్వం ప్రధానమంత్రిని వధించే స్థాయికి చేరింది. అక్బరు ఆదేశాన్ననుసరించి ఆదంఖాన్‌ని రాజభవనం పైకప్పునుండి పడద్రోశారు. అతడు తక్షణమే మరణించాడు. ఈ హఠాత్పరిణామానికి విస్తుపోయిన మహాం ఆగా కొద్దిరోజుల తర్వాత మరణించింది. ఆ విధంగా అక్బరు వివిధ వర్గాల కుట్రలు, కుతంత్రాల నుండి బయటపడ్డాడు. ఐతే ఇంకా కొన్ని ప్రభావశీలమైన వర్గాలు మిగిలే ఉన్నాయి.

**ఉజ్బెక్‌లు, మీర్జాల అణచివేత :**

ఆఫ్ఘన్‌లను అణగద్రొక్కడంలో ఉజ్బెక్‌లు ప్రధానపాత్ర పోషించారు. వారు తూర్పు ఉత్తరప్రదేశ్, బీహార్, మాళ్వాలలో ఉన్నత స్థానాలలో ఉండేవారు. బైరాంఖాన్ తిరుగుబాటు సమయంలో వారు ఒక బలమైన వర్గంగా రూపుదిద్దుకున్నారు.

క్రీ.శ 1561 – 1567ల మధ్య వీరు పెక్కుసార్లు తిరుగుబాటు చేశారు. కాని అక్బరు వాటిని అణచివేశాడు. వారు 1565లో మరల తిరుగుబాటు చేశారు. ఈలోగా ప్రస్తుత ఉత్తరప్రదేశ్ ప్రాంతంలో మీర్జాలు కూడా తిరుగుబాటు చేశారు. ఉజ్బెక్‌లు అక్బరు పినతండ్రి కుమారుడు (తమ్ముడు) కాబూల్ గవర్నయిన మీర్జా హకీమ్‌ని తమ పరిపాలకుడుగా ప్రకటించారు. ఉజ్బెక్‌లను అణగద్రొక్కవలెననే దృఢ నిశ్చయంతో అక్బరు జోన్‌పూర్‌కు చేరుకున్నాడు. కాని మీర్జా హకీమ్ పంజాబ్ వరకు పురోగమించాడని విన్న అక్బరు వెనుదిరిగాడు. మాళ్వాకు, తర్వాత గుజరాత్‌కు పారిపోయిన మీర్జా హకీమ్‌ను ఇతడు ఓడించాడు. మీర్జా హకీమ్‌తో వ్యవహారం పూర్తి అయిన తరువాత వెనుతిరిగి జోన్‌పూర్ చేరుకున్నాడు. క్రీ.శ 1567లో ఉజ్బెక్‌లను పూర్తిగా అణచివేశాడు. ఈ యుద్ధంలో అధిక సంఖ్యలో ఉజ్బెక్‌లు సంహరించబడ్డారు. ఈ విధంగా అక్బరు శక్తి దినదినాభివృద్ధి చెందింది.

## 36.బి. పాఠ్య ప్రశ్నలు

1. బైరాంఖాన్‌ని వదిలించుకోవాలని అక్బరు ఎందుకు అనుకున్నాడు?
2. ఆస్థానోద్యోగులు బైరాంఖాన్‌కు ఎందుకు వ్యతిరేకంగా ఉండేవారు?
3. బైరాంఖాన్ ఎందుకు తిరుగుబాటు చేశాడు?
4. ఆదాంఖాన్ ప్రధానమంత్రిని ఎందుకు వధించాడు?
5. ఉజ్బెక్‌లు ఎవరిని తమ పాలకునిగా గుర్తించారు?

## 36.5 మొగలు సామ్రాజ్య విస్తరణ :

బైరాంఖాన్ సంరక్షుడుగా ఉన్న సమయంలో ఢిల్లీ, ఆగ్రాలతో పాటు జోన్‌పూర్, గ్వాలియర్ మరియు అజ్మీర్‌లు కూడా జయించబడినాయి. సామ్రాజ్య కాంక్షాపరుడైన అక్బర్ ఒక పథకం ప్రకారం సామ్రాజ్యాన్ని విస్తరించే బృహత్ కార్యాన్ని చేపట్టాడు. ప్రప్రథమంగా ఇతడు ఉత్తర భారతదేశాన్ని తన స్వాధీనంలోకి తెచ్చుకున్నాడు.

### మాళ్వా (క్రీ.శ 1560 - 1562) :

మాళ్వా పరిపాలకుడైన బాజ్ బహదూర్ ఒక ఆఫ్ఘన్ జాతివాడు. ఇతడు సంగీత, సాహిత్య ప్రియుడు. బాజ్‌బహదూర్, రాణి రూపమతిల ప్రేమకథలు బహుళ ప్రాచుర్యం పొందాయి. రాణి రూపమతి తన సౌందర్యానికి మాత్రమే కాక తన సంగీత సాహిత్య నైపుణ్యానికి కూడా ప్రఖ్యాతి చెందినది. ఆ కాలంలో (మాళ్వా రాజధానియైన) మండూ ఒకగొప్ప సంగీత కళాకేంద్రం బాజ్ బహదూర్, పరిపాలన పట్ల శ్రద్ధ చూపకపోవడం వల్ల రాజ్యం బలహీనమైంది. ఈ పరిస్థితిని అవకాశంగా తీసుకొని అక్బరు మాళ్వాను స్వాధీనం చేసుకోవడానికి ఆదాంఖాన్ మరియు పీర్ మహమ్మద్‌ల నాయకత్వంలో సైన్యాన్ని పంపాడు. మాల్వా జయించబడి, పరిపాలన పీర్ మహమ్మద్ ఆధీనంలోకి వచ్చింది. కాని కొంతకాలం తర్వాత బాజ్ బహదూర్ మాళ్వాను తిరిగి ఆక్రమించాడు. క్రీ.శ 1562లో మాళ్వాను పునః స్వాధీనం చేసుకోవడానికి అక్బరు మరియొక సైన్యాన్ని పంపాడు. అనతికాలంలోనే బాజ్ బహదూర్ అక్బరుకు లొంగిపోయాడు. అక్బరు మాళ్వాను మొగలు సామ్రాజ్యంలో కలిపివేసి, ఔదార్యంతో బాజ్ బహదూర్‌కు ఒక మున్సబ్ పదవిని ఇచ్చాడు.

### గోండ్వానా దిగ్విజయ యాత్ర (క్రీ.శ 1564) :

రాణి దుర్గావతి గోండ్వానా పరిపాలకురాలు. ఆమె తన పిన్నవయస్కుడైన వీరనారాయణకు సంరక్షురాలు. ఆసఫ్‌ఖాన్ నాయకత్వంలో మొగలు సైన్యం గోండ్వానాపై దాడిచేసింది. రాణి ధైర్యంగా మొగల్ సైన్యాన్ని ఎదుర్కొంది. రాణి ఓటమి దాదాపు నిర్ణయమైపోయినపుడు అవమానాన్ని పట్టుబడటాన్ని తప్పించుకునేందుకు తనను తాను కత్తితో పొడుచుకొని మరణించింది. ఈ విధంగా మొగలుల గోండ్వానాను ఆక్రమించి అపార ధనరాశులను కూడా వశపరచుకున్నాడు.

### రాజపుత్ర రాజ్యాలు :

అక్బరు సామ్రాజ్యవాది, దూరదృష్టి గల పాలకుడు. అతడు రాజపుత్రుల సహాయ సహకారాలు లేనిదే భారతదేశంలో మొగలు సామ్రాజ్యాన్ని సుస్థిరం చేయడం కష్టసాధ్యమని గ్రహించాడు. కావున ఇతడు రాజపుత్రులతో స్నేహసంబంధాలను ఏర్పరచుకొనే విధానాన్ని అవలంభించాడు. మీరు వేరొక పాఠంలో అక్బరు రాజపుత్ర విధానాన్ని గూర్చి వివరంగా చదువుతారు. ఇక్కడ రాజపుత్ర రాజ్యాల గురించి సంక్షిప్తంగా తెలుసుకుందాం.

### క్రీ.శ 1562లో అంబర్‌తో స్నేహం :

అంబర్ రాజైన రాజా భారామల్ (Rajabharamal) తన శత్రువులతో యుద్ధం చేసి చేసి అలసిపోయాడు. ఇతడు అక్బర్ అజ్మీర్‌లోని షేక్ ముయినిద్దీన్ చిష్టీ ధర్గాకు తీర్థయాత్రకు వచ్చినపుడు అతనిని కలిశాడు. క్రీ.శ 1562 జనవరిలో ఇతడు అక్బరు సార్వభౌమత్వాన్ని అంగీకరించి తన కుమార్తెను అక్బరుకిచ్చి వివాహం జరిపించాడు. అక్బరు బారామల్‌కు, అతని కుమారుడు భగవాన్‌దాస్‌కు, ఇంకా అతని మనుమడైన రాజామాన్‌సింగ్‌కు తన ఆస్థానంలో ఉద్యోగాలిచ్చాడు.

### చిత్తోర్‌ను స్వాధీన పరచుకొనుట (క్రీ.శ 1567-68 మరియు 1576)

అనేక కారణాల వల్ల అక్బరు చిత్తోర్‌ను జయించాలని దృఢంగా నిశ్చయించుకున్నాడు. తనను చక్రవర్తిగా అంగీకరించని రాణాఉదయ్‌సింగ్‌పై అక్బర్ (సైనిక) దండయాత్ర చేయించాడు. రాణా ఉదయ్‌సింగ్ తన విశ్వాసపాత్రులైన

సేనాపతులు జైమల్ (Jaimal) మరియు పట్టా (patta) లను అక్బర్ సైన్యాన్ని ఎదుర్కొనడానికి వినియోగించాడు. రాజపుత్రులు తమ నాయకుల ఆధ్వర్యంలో బలంగా మొగల్ సైన్యాలను ఎదుర్కొన్నప్పటికీ చిత్తోర్‌ను కోల్పోయారు.

రాణా ఉదయ్‌సింగ్ వారసుడే రాణా ప్రతాపసింహుడు. ఇతడు మొగలులతో పోరాటాన్ని కొనసాగించాడు. క్రీ.శ 1576లో మొగల్ సైన్యం ప్రఖ్యాత హాల్దీఘటి (Haldighati)యుద్ధంలో రాణాప్రతాప్‌ని ఓడించినవి. కానీ రాణా కొద్ది మంది అనుచరులతో తప్పించుకున్నాడు. క్రీ.శ 1590లో అతడు మరణించే సమయానికి చిత్తోర్, మండాల్‌ఘర్ మరియు అజ్మీర్‌లు తప్ప మిగిలిన రాజ్యమంతా తిరిగి స్వాధీనం చేసుకున్నాడు. ఇతని కుమారుడైన అమీర్‌సింగ్ చే ఈ పోరాటం కొనసాగించబడింది.

### రణథంభోర్ విజయయాత్ర (క్రీ.శ 1568)

చిత్తోర్‌ను జయించిన అనంతరం రణథంభోర్‌ను శక్తి విహీనం చేయుటకు అక్బర్ ఒక దండయాత్ర చేశాడు. రణథంభోర్ పాలకుడైన రాజాసుర్జన్‌రాయ్ (Raja Surjan Rai) పూర్తి పోరాటం చేయకుండానే లొంగిపోయాడు. ఆ విధంగా మొగలులు రణథంభోర్‌ను ఆక్రమించారు.

### కలింజర్ స్వాధీనం (క్రీ.శ 1569)

చిత్తోర్ మరియు రణథంభోర్‌పై విజయం వల్ల అక్బర్ ప్రతిష్ట ఇనుమడించింది. ఇతడు కాలింజర్‌ని జయించటానికి సైన్యాన్ని పంపాడు. ఆ సమయంలో కలింజర్, రాజరామచందర్ ఆధీనంలో వున్నది. రామచందర్‌కు చిత్తోర్, రణథంభోర్‌ల భవిష్యత్ గురించి అవగాహన ఉన్నవాడైనందున నామమాత్రపు ప్రతిఘటననిచ్చి క్రీ.శ 1569లో కలింజర్‌ను స్వాధీనం చేశాడు. కలింజర్ మొగల్‌సామ్రాజ్యంలో చేర్చబడగా రాజాకి అలహాబాద్ దగ్గర ఒక జాగీర్‌ను ఇచ్చారు.

### మార్వార్ అప్పగింత (క్రీ.శ 1579)

జోధ్‌పూర్ పాలకుడైన రాజా మాల్దేవ్(Maldeo) మరణానంతరం చంద్రసేన్ పరిపాలకుడైనాడు. ఇతడు మొగల్ ఆధిపత్యం పై తిరుగుబాటు చేయగా జోధ్‌పూర్ రాజ్యం అక్బర్‌తో వివాహ సంబంధం నెలకొల్పుకున్న ఇతడి సోదరుడు ఉదయ్‌సింగ్‌కు అప్పగించబడింది. బికనీర్, జైసల్మీర్ రాజ్యాల పాలకులు గూడా అక్బర్‌తో స్నేహ సంబంధాలు ఏర్పరచుకున్నారు. ఈ విధంగా క్రీ.శ 1570 చివరినాటికి మేవాడ్ తప్ప మిగిలిన రాజపుత్ర రాజ్యమంతా అక్బర్ సార్వభౌమత్వాన్ని అంగీకరించవలసి వచ్చింది.

### గుజరాత్‌ని జయించుట (క్రీ.శ 1572 – 1573)

మార్వార్‌ను స్వాధీనం చేసుకొనిన తరువాత అక్బరు సస్యశ్యామలము, సారవంతము మరియు వ్యాపారపరంగా చాలా ముఖ్యమైన గుజరాత్ వైపు దృష్టి మరల్చాడు. క్రీ.శ 1572లో గుజరాత్ పై దిగ్విజయ యాత్రకు తన సైన్యాన్ని నడిపించాడు. గుజరాత్ పాలకుడైన ముజఫర్‌షా తక్షణమే అక్బరు సార్వభౌమత్వాన్ని అంగీకరించాడు. అక్బరు వెనుదిరిగి వెళ్ళిన తరువాత ముజఫర్‌షా స్వాతంత్ర్యాన్ని ప్రకటించాడు.

మరుసటి సంవత్సరం అక్బరు ముజఫర్‌షాను జయించి గుజరాత్‌ను మొగలు సామ్రాజ్యంలో కలుపుకున్నాడు. ఈ విజయానికి స్మృతి చిహ్నంగా అక్బరు సిక్రీకి 'ఫతేపూర్ సిక్రీ'గా నామకరణం చేశాడు. అతడు అక్కడ ముఖ ద్వారాన్ని కూడా నిర్మించాడు. ఇది బులంద్ దర్వాజాగా ప్రఖ్యాతి గాంచింది.

### బెంగాల్, బీహార్‌లను జయించుట (క్రీ.శ 1574-76)

బెంగాల్ మరియు బీహార్ పరిపాలకుడు క్రీ.శ 1572లో అక్బరును సార్వభౌముడుగా అంగీకరించాడు. అతని మరణం తర్వాత అతని కుమారుడైన దావూద్ స్వతంత్రం ప్రకటించుకున్నాడు. అక్బరు మరొకసారి దానిని ఆక్రమించి తన సమర్థ సైన్యాధిపతి మునాయిమ్‌ఖాన్ (Munaim khan) ఆధీనంలో ఉంచాడు. మునాయిమ్‌ఖాన్ మరణానంతరం దావూద్ తిరుగుబాటు చేశాడు. ఈసారి అక్బరు అతనిని ఓడించి బెంగాల్ బీహార్‌లను మొగలు సామ్రాజ్యంలో కలిపివేశాడు. దావూద్ సంహరించబడ్డాడు. ఈవిధంగా అక్బరు చిట్టచివరి ఆఫ్ఘన్ రాజ్యాన్ని విజయవంతంగా రూపుమాపాడు.

## 36.సి. పాఠ్య ప్రశ్నలు

1. అక్బరు జయించిన రెండు ఉత్తర రాష్ట్రాలు ఏవి?
2. మాళ్వాలో బలహీన పరిపాలనకు కారణమేది?
3. మేవాడ్‌ను జయించడానికి కారణాలుగా నీవు వేటిని చూపుతావు?
4. అక్బరుతో వైవాహిక సంబంధాలను నెలకొల్పుకున్న రాజపుత్ర రాజ్యాల పరిపాలకులిద్దరిని పేర్కొనుము.

## 36.6 జహంగీర్ మరియు షాజహాన్‌ల పాలనాకాలంలో సామ్రాజ్య విస్తరణ :

### జహంగీర్ బాల్యం మరియు సింహాసనమధిష్టించటం :

అక్బరుకు సలీం, మురాద్, దానియల్ అనే ముగ్గురు కుమారులు ఉండగా, వారిలో మురాద్, దానియల్‌లు అక్బరు జీవిత కాలంలోనే కన్నుమూశారు. కాబట్టి (1605) అక్బరు మరణానంతరం అతని కుమారుడైన మహమ్మద్ సలీం 'నూరుద్దీన్ జహంగీర్' బిరుదుతో సింహాసనాన్ని అధిష్టించాడు.

మహమ్మద్ సలీం క్రీ.శ 1569లో జన్మించాడు. అబ్దుల్ రహీమ్ వంటి సమర్థులైన గురువులు ఇతనికి టర్కీ, పర్షియన్, అరబిక్, హిందీ, గణితం, చరిత్ర మొదలగు వాటిని బోధించారు. సలీం కళలలో ప్రత్యేకించి చిత్రకళలో ప్రావీణ్యాన్ని సంపాదించాడు. 12 సంవత్సరముల వయస్సులోనే ఇతడు యుద్ధాలలో పాల్గొన్నాడు. సలీం ఎన్నోసార్లు తిరుగుబాట్లు చేసినా చివరకు ఇతడే చక్రవర్తి అయ్యాడు.

**తిరుగుబాట్లు అణచివేత, సామ్రాజ్య విస్తరణ :**

అక్బరు మేవాడ్ (Mewar) పైన తన సంపూర్ణ ఆధిపత్యాన్ని నెలకొల్పలేకపోయిన విషయాన్ని గుర్తుకు తెచ్చుకోండి. రాణాప్రతాప్‌కి అతని కుమారుడైన అమర్‌సింగ్ వారసుడైనాడు. ఇతడు మొగలులతో తన పోరాటాన్ని కొనసాగించాడు. జహంగీర్ మేవాడ్‌పై ఎన్నో దండయాత్రలు చేశాడు. కాని విజయాన్ని సాధించలేక పోయినాడు. 1615లో జహంగీర్ అమర్‌సింగ్‌కు ఉన్న అన్ని వనరులను ధ్వంసం చేసి అతడు సంధికి వచ్చేటట్లు ఒత్తిడి చేశాడు. మొగలుల రాజపుత్ర విధానాన్ని అనుసరించి జహంగీర్ అమర్‌సింగ్‌తో గౌరవప్రదమైన మార్గంలో వ్యవహరించాడు.

పంజాబ్‌లోని కాంగ్రా అభేద్యమైన దుర్గంగా పరిగణించబడేది. అప్పటి వరకు ఢిల్లీ సుల్తాన్‌లు కానీ, మొగలులు కాని దానిని జయంచలేక పోయినారు. జహంగీర్ కాంగ్రా దుర్గాన్ని జయించడానికి తను కుమారుడైన ఖుర్రమ్‌ని నియమించాడు. అతడు ఎన్నో నెలల ముట్టడి తర్వాత కాంగ్రా దుర్గాన్ని స్వాధీనం చేసుకొన్నాడు.

## మొగల్ రాజకీయాలపై నూర్జహాన్ ప్రభావం :

క్రీ.శ 1611లో జహంగీర్ మెహరున్నీసా అనే (సౌందర్య రాశియైన) వితంతువును వివాహం చేసుకున్నాడు. ఆమెకు 'నూర్‌మహల్" అనే బిరుదును ఇచ్చాడు. కాలక్రమంలో ఇది "నూర్‌జహాన్"గా మారింది. ఈమె సౌందర్యంతో పాటు మంచి బుద్ధి కుశలత, శీఘ్ర గ్రహణశక్తి గలది. కొంతమంది పండితుల అభిప్రాయం ప్రకారం నూర్జహాన్ పరిపాలనా వ్యవహారాలలో క్రియాశీలకంగా పాల్గొనేది. తన ప్రభావాన్ని పెంపొందించుకునేందుకు ఈమె తన తండ్రియైన ఐత్మాదుద్దౌలా (Itmaduddaula) మరియు సోదరులైన ఇత్మద్‌ఖాన్(Itmadkhan)ఆసఫ్‌ఖాన్(Asafkhan)లకు ఉన్నతోద్యోగాలిచ్చింది. ఈమె తన కుమార్తె అయిన లాడ్లీ బేగమ్‌ను (Ladli Begum)జహంగీర్ కుమారులందరిలో చిన్న రాకుమారుడైన షరియార్ (Shariyar)తో వివాహం చేసింది. ఈమె జహంగీర్‌ని నియంత్రించి సామ్రాజ్యంలోని అన్ని రాజకీయ సంఘటనలను నేర్పుతో నిర్వహించగలిగిన "నూర్జహాన్ జుంతా" అనే సమూహాన్ని ఏర్పాటు చేసింది. దీని ఫలితంగా ఆస్థానంలో నూర్జహాన్ సమర్థులు, ఆమె ప్రత్యర్థులు అనే రెండు ముఠాలు అవతరించాయి. ప్రారంభదశలో రాకుమారుడు ఖుర్రమ్ (తర్వాత షాజహాన్) కూడ ఈమె వర్గంలోనే ఉండేవాడు. కాని మరియొక పండితుల వర్గం 'నూర్జహాన్ సంప్రదాయాలు, కళలలో నూతన రీతులను ప్రవేశపెట్టే పనిలో నిమగ్నమై ఉండగా జహంగీర్ సామ్రాజ్యానికి క్రియాశీల అధినేత అయి ఉండవచ్చున'ని భావిస్తారు. నూర్జహాన్ జహంగీర్‌కి సహచరి అయినప్పటికీ అతడు ఆమెపై ఆధారపడేవాడు కాదు. అనంతర సంవత్సరాలలో రాకుమారుడు ఖుర్రమ్ చేసిన తిరుగుబాట్లు అతని వ్యక్తిగత అత్యాశల ఫలితం. జహంగీర్‌కి వీటిని గురించి పూర్తి పరిజ్ఞానం ఉండేది. ఖుర్రమ్ తమ్ముడైన షరియాల్ అతని అత్యాశలను అదుపు చేయాలని తలచేవాడు.

క్రీ.శ 1622లో పర్షియా పాలకుడైన షా అబ్బాస్ కాందహార్‌ను ఆక్రమించాడు. దండయాత్రకు నాయకత్వాన్ని వహించి కాందహార్‌ను పునరాక్రమించ వలసినదిగా ఖుర్రమ్‌ని ఆదేశించారు. కాని అధికార పీఠానికి సుదూరంగా వెళ్ళడం ఇష్టంలేని ఖుర్రమ్ తన దురాశా పూరిత కోరికలు తీరనిదే తాను కాందహార్‌కు వెళ్ళనని నిరాకరించాడు. ఈ కోరికలలో సైన్యముపై సర్వాధిపత్యము, పంజాబ్‌పై నియంత్రణ మొదలైనవి ఉన్నవి.

## ఖుర్రమ్ తిరుగుబాటు :

క్రోధావేశుడైన జహంగీర్ (తన కుమారుడైన) ఖుర్రమ్‌ని తన సైన్యంతో తన ముందు హాజరు కావలసిందిగా ఆజ్ఞాపించాడు. ఈ పరిస్థితుల సున్నితత్వాన్ని అర్థం చేసుకొనిన ఖుర్రమ్ తిరుగుబాటు చేశాడు. అతడు రాజ కోశాగారాన్ని స్వాధీన పరచుకొని ఆగ్రావైపు పురోగమించాడు. రాకుమారుడు పర్వేజ్ మరియు సైన్యాధిపతి మహబ్బత్ ఖాన్ అతనిని ఢిల్లీ సమీపంలో నిలువరించి, దక్షిణానికి వెళ్ళేటట్లు బలవంతం చేశారు. దక్షిణానికి చేరుకొనిన వెంటనే ఖుర్రమ్ మళ్ళీ తిరుగుబాటు చేశాడు. ఈసారి అతడు తూర్పుగా ముందుకు నడచి బెంగాల్, బీహార్‌లను ఆక్రమించాడు. కాని మహబత్‌ఖాన్ ఇతనిని జయించాడు. ఈ తిరుగుబాటు సుమారుగా నాలుగు సంవత్సరాలు సాగింది. దీని ఫలితంగా మొగలులు కాందహార్‌ని కోల్పోయారు. మరియు ఎన్నో దక్షిణాది రాజ్యాలు తమ స్వాతంత్ర్యాన్ని ప్రకటించాయి. క్రీ.శ 1625లో ఖుర్రమ్ లొంగిపోయి తన కుమారులైన దారా మరియు ఔరంగజేబులను జహంగీరుకు బందీలుగా అప్పగించాడు.

## మహబత్‌ఖాన్ తిరుగుబాటు :

మహబత్‌ఖాన్ ఒక సమర్థుడైన సేనాపతి అని మీకు గుర్తుండే ఉంటుంది. ఖుర్రమ్ రాకుమారుడు తిరుగుబాటు చేసినపుడు ఇతడు ప్రధాన పాత్ర పోషించాడు. అతడు తన ప్రాబల్యాన్ని పెంచుకుంటూ ఉన్నందు వలన కొన్ని వర్గాల

వారు ఇతనికి వ్యతిరేకంగా కుట్రలు చేయడం మొదలు పెట్టారు. ఆస్థానంలో తన సముఖంనకు రమ్మని మహబత్‌ఖాన్‌ని జహంగీర్ ఆదేశించాడు. రాబోయే సమస్యలను దృష్టిలో ఉంచుకొనిన మహబత్‌ఖాన్ క్రీ.శ 1626లో తిరుగుబాటు చేశాడు. మహబత్‌ఖాన్, కాబూల్ వెళుతున్న జహంగీర్, నూర్జహాన్‌లను జీలంనది దగ్గర బంధించాడు. కాని ఆరునెలల లోపే నూర్జహాన్ తన యంత్రాంగంతో మహబత్‌ఖాన్ బంధాల నుండి బయటకు వచ్చింది. ఆమె అతని మద్దతుదార్లను పెక్కుమందిని తన ఆధీనంలోకి తెచ్చుకున్నది. ఫలితంగా మహబత్‌ఖాన్ గత్యంతరం లేక లాహోర్‌కి పారిపోవలసి వచ్చింది. తుదకు ఇతడు లొంగిపోయి క్షమాభిక్షను అర్థించాడు. జహంగీర్ అతనిని క్షమించాడు. తదనంతరం ఇతడు సింధ్‌కు వెళ్ళి, ఖుర్రమ్ మిత్రత్వాన్ని సంపాదించాడు. ఇది జహంగీర్‌కు ఒక నూతన సమస్యను తెచ్చిపెట్టింది.

## 36. డి పాఠ్య ప్రశ్నలు

1. జహంగీర్ అక్బరు రాజపుత్ర విధానాన్ని కొనసాగించాడని చూపేందుకు ఒక ఉదాహరణను ఇవ్వండి.
2. మొగలు ఆస్థానంలో నూర్జహాన్ పాత్రను గురించి పండితులు ఏమని భావిస్తారు?
3. కాందహార్‌ను పోగొట్టుకొనడానికి కారణమేమి?
4. రాజకీయ రంగంలో నూర్జహాన్ ప్రాబల్య ఫలితాలేవి?
5. ఖుర్రమ్ రాకుమారుని తిరుగుబాటుకు కారణమేది?

## 36.7 షాజహాన్ బాల్యం మరియు సింహాసనారోహణం :

ఖుర్రమ్ జహంగీర్ మూడవ కుమారుడు. ఇతడు 1592లో లాహోర్‌లో జన్మించాడు. ఇతడు సమర్థుడు, మరియు మేధావి. ఇతడు ఉన్నత విద్యావంతుడే కాక గొప్ప యోధుడు. క్రీ.శ 1606లో జహంగీరు ఖుస్రూ రాకుమారుని తిరుగుబాటును అణచేందుకు వెళ్ళే సమయంలో సామ్రాజ్య వ్యవహారాలను చూసేందుకు ఒక మండలి(Council)ఏర్పాటు చేశాడు. ఖుర్రమ్ రాకుమారుడు దీనికి అధిపతి. ఇతడు పరిపాలనా విధులను విజయవంతంగా నిర్వర్తించాడు. ఖుర్రమ్(నూర్జహాన్ సోదరుడు ఆసఫ్‌ఖాన్ కుమార్తె అయిన) అర్జుమన్ బానో(ముంతాజ్ మహల్)ని వివాహం చేసుకున్నాడు. ఇతని తిరుగుబాటును గురించి మీరు ఇదివరకే చదివారు.

### సింహాసనం కోసం ఖుర్రం పోరాటం :

క్రీ.శ 1627లో జహంగీర్ మరణించాడు. ఆ సమయంలో ఖుర్రమ్ దక్షిణాపథంలో ఉన్నాడు. రాకుమారుడైన ఖుస్రూ, పర్వేజ్‌లు అంతకు క్రితమే మరణించారు. ఖుర్రమ్ రాజధానిలో లేని సమయాన్ని అవకాశంగా తీసుకొనిన నూర్జహాన్ జహంగీర్ చివరి కుమారుడైన (తన అల్లుడైన) షారియార్‌ను చక్రవర్తిగా ప్రకటించింది. మరోవైపున ఆసఫ్‌ఖాన్ (తన అల్లుడైన) దక్షిణాపథంలో ఉన్న ఖుర్రమ్‌ని పిలిపించాడు. ఆసఫ్‌ఖాన్ లాహోర్ వద్ద షరియార్‌ని ఓడించి అతనిని అంధుణ్ణి చేశాడు. క్రీ.శ 1628 జనవరిలో ఖుర్రమ్ దక్షిణాపథం నుండి వచ్చాడు. ఇతడు షాబుద్దీన్(Shah-bud-din), మహమ్మద్ షాజహాన్(Mahammad Shah Jahan) బిరుదుతో సింహాసనాన్ని అధిష్ఠించాడు. ఆసఫ్‌ఖాన్ తనకు చేసిన సేవలు దృష్టిలో ఉంచుకొని షాజహాన్ అతనిని తన వజీర్ (ముఖ్యమంత్రి)గా నియమించాడు.

## 36.8 మొగలుల వాయువ్య, మధ్య ఆసియా విధానం :

భారతదేశ చరిత్రలో వాయువ్య సరిహద్దు ప్రాంతం ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తుంది. ఈ ప్రాంతంలో ఎన్నో

కనుమలు ఉన్నాయి. ఈ కనుమలు భారతదేశం మధ్య ఆసియాల మధ్య వారధిగా పనిచేయుచున్నవి. ప్రాచీనకాలం నుండి వర్తకులు, ఆక్రమణదారులు ఈ కనుమలు ఉపయోగిస్తూనే ఉండేవాళ్ళు. మొగలులు కూడా భారతదేశంలో తమ పరిపాలనను స్థాపించడానికి ఈ మార్గం ద్వారానే వచ్చారు. సుసంపన్నమైన, సారవంతమైన కాందహార్ ఆర్థికంగా ప్రాముఖ్యమైనది. ఇది భారతదేశం, మధ్య ఆసియాల మధ్య మనుషులు, సరుకులు ప్రయాణించే మార్గమధ్యంలో ఉన్నది. పోర్చుగీసువారు హిందూ మహాసముద్రంపై ఆధిపత్యం వహిస్తూ ఉండటం వలన పర్షియాలో అంతర్గత సంక్షోభం నెలకొంది. వర్తకులు సమావేశమగుటకు (మార్కెట్) కాందహార్ మిక్కిలి సురక్షితమైన స్థానం. మక్కాకు వెళ్ళే యాత్రికులకు మార్గాంతరం అవటం వల్ల కూడా కాందహార్ ప్రముఖ కేంద్రమయింది. దీనితోపాటు ఇక్కడ కొన్ని అస్తవ్యస్తంగా ఉన్న గిరిజన తండాలు ఉండేవి. వీరు తమ స్వాతంత్ర్యం పట్ల దురభిమానంతో తీవ్ర భావావేశ పూరితమై ఉన్నందువల్ల ఆ ప్రాంతాలలో ఎంతో ప్రమాదకారులుగా ఉండేవారు. వాయువ్య సరిహద్దు ప్రాంతాలను ఫలప్రదంగా అదుపాజ్ఞలలోకి తెచ్చుకొనుటకు ఈ అనాగరిక తెగలను అదుపు చేయడం ఆవశ్యకమైంది.

మొగలుల వాయువ్య సరిహద్దుల విదేశాంగ విధానం ట్రాన్స్ ఆసియానా(మధ్య ఆసియా)లోని సున్నీ ఉజ్బెక్ అధికారం, పర్షియన్ షియాలు, సున్నీ ఆట్‌మన్ తురుష్కులు అనే మూడు ప్రబల రాజ్యాల మధ్య ప్రాబల్య సమతౌల్యం బట్టి నిర్ణయించబడేది. ఉజ్బెక్‌లు మధ్య ఆసియానుండి బాబరును బహిష్కరించడం వల్ల మొగలుల సహజ శత్రువులయ్యారు. ఉజ్బెక్‌లు, సఫావీద్‌లు ఇరువురూ ఖురాసాన్(khurasan)ని కోరుతున్నందు వలనఉజ్బెక్‌లకు వారితో విభేదాలు ఉండేవి. సరిహద్దు తగాదాలు (కాందహార్ తప్ప) లేని సఫావీద్‌లు మరియు మొగలులు పరస్పరం మైత్రి చేసుకున్నారు. ఇది పశ్చిమాన అట్‌మన్ తరుష్కుల నుండి పర్షియన్‌లను రక్షించగా, మొగలులను తామొక్కరే ఉజ్బెక్‌లను ఎదుర్కొన వలసిన స్థితి నుండి బయట పడలేక పోయారు. మొగలులు కూడా పర్షియన్‌లకు విరుద్ధంగా అట్‌మన్, ఉజ్బెక్, మొగలుల త్రైపాక్షిక మైత్రి కంటే కూడ అధికారం సమతౌల్యానికే ప్రాధాన్యాతనిచ్చారు.

బాబర్ కాబూల్‌ని క్రీ.శ 1506లో, కాందహార్‌ని క్రీ.శ 1522లో ఆక్రమించిన విషయం మీరు చదివారు. ఐతే ఈ మధ్య కాలంలో పర్షియన్ షా ఇచ్చిన సహకారం మొగలులు సఫావీద్‌ల మధ్య స్నేహ సంప్రదాయాన్ని నెలకొల్పింది.

హుమాయూన్ కూడ పర్షియన్‌షా నుండి సైనిక సహాయాన్ని పొందాడు. ఐతే తర్వాత షా, హుమాయూన్‌ని కాందహార్ కోటను స్వాధీనం చేయమని కోరాడు. హుమాయూన్ కాబూల్, కాందహార్, భారతదేశంలోని మరికొన్ని భాగాలను జయించినపుడు కాందహార్‌ని పర్షియన్‌షాకు స్వాధీనం చేయనందుకు క్షమించమని అర్జించాడు. కాబట్టి షాటెహ్‌మాస్ప్(Shah tahmasp) సైన్యాన్ని సిద్ధంచేసి క్రీ.శ1558లో కాందహార్‌ని ఆక్రమించాడు. అయినాసరే వారిమధ్య హృదయ పూర్వక సంబంధాలు కొనసాగాయి.

అక్బరు ఉజ్బెక్‌ల దండయాత్ర నుండి మొగలు సామ్రాజ్యాన్ని రక్షించేందుకు, వాయువ్య సరిహద్దు రాష్ట్రాలను అదుపులో ఉంచేందుకు శాస్త్రీయ విధానాన్ని అవలంబించిన మొట్టమొదటి మొగలు చక్రవర్తి. అక్బరు పరిపాలనా కాలంలో ఉజ్బెక్ రాజైన అబ్దుల్లాఖాన్‌తో తరచుగా సమాచారాన్ని ఇచ్చిపుచ్చుకోవడాలు ఉండేది. క్రీ.శ 1572-73 లో అబ్దుల్లాఖాన్ మొగలులు, ఉజ్బెక్‌ల మధ్య తరచుగా అప్పటివరకు ఉమ్మడి ప్రభావ రహిత సురక్షిత ప్రదేశం(buffer state)గా ఉన్న బాల్ఖ్(Balkh)ని,ఆక్రమించాడు. దీనిని పరిగణనలోకి తీసుకొని అబ్దుల్లాఖాన్ మొగలులతో మైత్రిని ఆసక్తి చూపాడు. క్రీ.శ 1677లో అతడు పర్షియాపై దండయాత్రకు నాయకత్వం వహించి దానిని షియాల నుండి విడిపించమని అక్బరుకు రాయబారం పంపాడు. విశాల దృక్పథం గల అక్బరు ఇటువంటి సముచిత మత విశ్వాసాలచే

ప్రభావితుడయ్యే వ్యక్తి కాదు. అని మీరు తెలుసు. అంతేగాకుండా రాజకీయంగా ఉజ్బెక్‌లను నిలువరించేందుకు శక్తివంతమైన పర్షియన్‌ను నెలకొల్పటానికి అక్బరు అసక్తి చూపాడు .కాబట్టి అక్బరు పర్షియన్ షియాలకు విరుద్ధంగా త్రైపాక్షిక సున్నీల మైత్రికి ఉజ్బెక్‌ల పిలుపును నిరాకరించాడు. క్రీ.శ 1585లో అబ్దుల్లాఖాన్ హఠాత్తుగా బడక్షాన్(BadakShan)ని జయించాడు. యుద్ధంలో ఓడిన బడక్షాన్ రాకుమాకులకు అక్బరు ఆశ్రయమిచ్చాడు. ఈవిధంగా అక్బరు మధ్య ఆసియా వ్యవహారాలలో తన ఆసక్తిని ప్రదర్శించాడు.

ఈలోగా అట్‌మన్ తురుష్కులు తాహ్‌మస్ప్‌షా(Tahmasp Shah)మరణానంతరం అంతః కలహాలతో పతన మవుతున్న పర్షియాలో ప్రవేశించారు. అదే సమయంలో అబ్దుల్లాఖాన్ ఖురసాన్(Khurasan)ని ఆక్రమించాడు. అక్బరు ఈ రెండు చర్యలను తీవ్రంగా ఖండిస్తూ అబ్దుల్లాఖాన్‌కు లేఖ వ్రాశాడు. కొన్ని షరతులను చర్చించేందుకు అతడు తన ప్రతినిధిని పంపాడు. ఈ ఇరువర్గాల వారు హిందూకుష్(పర్వతాలను) తమ ఇరువురి మధ్య సరిహద్దుగా చేసుకొనేటట్లు ఒక ఒడంబడికకు వచ్చారు. తత్ఫలితంగా మొగలులు బాల్ఖ్, బదక్షణ్‌ల మీద ఆసక్తిని వదలుకొనవలసి రాగా, ఉజ్జెక్‌లు కాబూల్ కాందహార్‌ల నుండి దూరంగా ఉండాల్సి వచ్చింది. ఈ ఒడంబడిక మొగలులకు హిందూకుష్ పర్వతాలపై రక్షణ యోగ్యమైన సరిహద్దును ఇచ్చింది. ఇపుడు అక్బరు కాందహార్‌ని ఆర్జించడం ద్వారా ఒక శాస్త్రీయ రక్షణ యోగ్యమైన సరిహద్దును సాధించాడు.

**కాందహార్ ఆక్రమణ (క్రీ.శ 1595) :**

పర్షియన్‌షా కాందహార్‌ని క్రీ.శ 1558లో ఆక్రమించిన సంగతి మీకు గుర్తుండే ఉంటుంది. వ్యూహాత్మకంగానూ, వాణిజ్య పరంగాను ప్రాధాన్యత గల కాందహార్‌ని ఆక్రమించకుండా కాబూల్‌ని జయించినందువల్ల ప్రయోజనముండదని గ్రహించిన అక్బర్ కాందహార్‌ను ఆక్రమించడానికి ఆత్రుత పడ్డాడు. క్రీ.శ 1590లో పర్షియన్‌షా పర్షియాను ఉజ్బెక్‌ల నుండి రక్షించుకోవడంలో నిమగ్నుడై ఉన్నట్లు అక్బరు కనుగొన్నాడు. ఈ పరిస్థితిని అవకాశంగా తీసుకొని అక్బరు కాందహార్‌ని ఆక్రమించేందుకు ప్రయత్నించాడు కాని విఫలుడైనాడు. కాలక్రమేణా పర్షియా పాలకుడైన షా కాందహార్ గవర్నరయిన మజాఫర్ హుస్సేన్ మీర్జాతో సత్సంబంధాన్ని కొనసాగించలేక పోయాడు. క్రీ.శ 1595లో ముజఫర్ హుస్సేన్ మీర్జా తనకు తాను కాందహార్‌ని మొగలుల వశంచేసి, మొగలుల కొలువులో చేరాడు. అక్బరు ఇతనిని 5000 మున్సబ్‌గా గౌరవించి సంభల్‌ని జాగీరుగా ఇచ్చాడు. తాను ఇతర సమస్యలలో మునిగి ఉన్నందువలన పర్షియన్‌షా కాందహార్‌ను పునరాక్రమించేందుకు ఎట్టి ప్రయత్నం చేయలేదు. కాని మొగలులు, పర్షియన్‌ల మధ్య సంబంధాలు హృదయ పూర్వకంగానే కొనసాగాయి.

> అక్బరు వాయువ్య విధానం మొగలు సామ్రాజ్యానికి ప్రాదేశిక ప్రయోజనాలు కొని తెచ్చింది, సరిహద్దు ప్రాంతంలో దాని స్థానాన్ని మరింత సురక్షితం చేసింది. అంతేగాక మొగలుల ప్రతిష్టను పెంచింది.

**కాందహార్‌ని పోగొట్టుకొనుట :**

క్రీ.శ 1605లో అక్బరు మరణానంతరం, పర్షియన్‌లు క్రీ.శ 1606లో కాందహార్‌పై ఒక విఫలయత్నం చేశారు. కాని షా ఈ మట్టడిని గురించి తెలియనట్టు నటిస్తూ, జహంగీరుతో స్నేహ సంబంధాన్ని కొనసాగించాడు. ఆయన 1611, 1613, 1617 మరియు 1620లో అమూల్యమైన కానుకలతో నాలుగుసార్లు రాయబారులను పంపాడు. జహంగీరు పర్షియన్‌ల స్నేహపూర్వక ఆహ్వానాన్ని (ప్రత్యేకించి నూర్జహాన్ తండ్రి పర్షియాకు చెందినవాడు. కనుక తాను

పర్షియాకు సన్నిహితుడని భావించినందువల్ల) అంగీకరించాడు. షా కాందహార్‌ను తిరిగి స్వాధీనం చేసుకోవడానికై ప్రయత్నాలు చేయుచున్న విషయాన్ని జహంగీర్ గ్రహించలేక పోయాడు. క్రీ.శ 1622లో షా కాందహార్‌ని దాడిచేసి జయించాడు. తన రక్షణ గురించి శ్రద్ధ పెట్టని జహంగీర్ ఇతర దౌత్య సంబంధాలన్నింటిని నిర్లక్ష్యం చేసి ఈ దాడి ఎదుర్కొనడానికి సిద్ధం కాలేకపోయాడు. ఐతే ఖుర్రమ్ రాకుమారుని తిరుగుబాటు సంఘటన, జహంగీర్ అనారోగ్యం లేకుండా ఉంటే ఈ పరిస్తితి చక్కదిద్దబడేది. ఈ విధంగా కాందహార్ పర్షియన్‌ల ఆధినమై పోయింది. షా యొక్క ఈ చర్య మొగలుల పర్షియన్‌ల మధ్యఉన్న స్నేహ పూర్వక సంబంధాలు దెబ్బతిన్నాయి.

## షాజహాన్ కాలంలో కాందహార్ ఆక్రమణ :

మొగలు సామ్రాజ్య భద్రతకు మరియు వాయువ్య సరిహద్దు ప్రాంతాన్ని సమర్ధంగా అదుపులో ఉంచడంలోను కాందహార్‌కు ఉన్న ప్రాముఖ్యాన్ని షాజహాన్ గుర్తించాడు. కావున ఇతడు కాందహార్‌ని పునరాక్రమించడానికి నిశ్చయించుకున్నాడు. ఇతడు కాందహార్‌ని తిరిగి స్వాధీనం చేసుకొనేందుకు దౌత్యాన్ని ఉపయోగించాడు. కాందహార్‌ను పాలిస్తున్న పర్షియన్ గవర్నరు ఆలీమర్దాన్‌ని(Ali Mardhan) కాందహార్‌ని మొగలులకు స్వాధీనం చేయమని అడిగాడు. ఆలీమర్దాన్ కాందహార్‌ని మొగలుల వశం చేయటానికి నిరాకరించాడు. షాజహాన్ సైనిక పరమైన ప్రయత్నాలు ప్రారంభించాడు. దీనిని చూసిన ఆలీమర్దాన్ పర్షియన్ షాని సైనిక సహాయం పంపమని అర్ధించాడు. షా దీనిని ఏదో దురాలోచనగా తీసుకొని ఆలీమర్దాన్‌ని బంధించేందుకు ఒక సైనికాధికారిని పంపించాడు. దీనివలన ఆలీమర్దాన్ కాందహార్‌ని మొగలులకు స్వాధీనం చేయటానికి నిర్ణయించుకున్నాడు. క్రీ.శ 1638లో మొగలుల కాందహార్‌పై దాడి చేశారు. ఆలీమర్దాన్ ఎటువంటి ప్రతిఘటన లేకుండా కాందహార్‌ని స్వాధీనం చేశాడు. షాజహాన్ ఆలీమర్దాన్‌ని అమూల్య ధన సంపదలు బహుమానాలతో ఉన్నత గౌరవంతో సత్కరించుటమే గాక అతనిని పంజాబ్ గవర్నర్‌గా నియమించాడు.

## షాజహాన్ బాల్ఖ్ ముట్టడి :

షాజహాన్ సింహాసనాన్ని అధిష్టించినప్పుడు ఇతడు ఉజ్బెక్‌ల నుండి స్థానిక ఆఫ్ఘనుల నుండి, బాల్ఖ్ తెగల నుండి సామ్రాజ్యాన్ని రక్షించేందుకు కృతనిశ్చయుడయ్యాడు. షాజహాన్ కాందహార్‌ని ఇంతక్రితమే జయించి ఉన్న విషయం మీకు తెలుసు. ప్రస్తుతం అతడు బాల్ఖ్‌లో ఉన్న శత్రుసేనలను అణగద్రొక్కవలసి ఉన్నది. స్థానిక పాలకుడైన నాజర్ మహమ్మద్ తన కుమారుడైన అబ్దుల్ అజీజ్ తిరుగుబాటును అణగద్రొక్కడానికి షాజహాన్ సహాయాన్ని అభ్యర్ధించినపుడు అతనికి ఈ అవకాశం వచ్చింది. షాజహాన్ మురాద్ రాకుమారుని ఆధ్వర్యంలో గొప్ప సైన్యాన్ని వినియోగించాడు. నాజర్ మహమ్మద్‌పై జాలి చూపమనీ, అతినిని తన ఉపసేనాపతిగా సేవచేయమని కోరమనీ షాజహాని మురాద్‌ని ఆదేశించినప్పటికీ, మురాద్ నాజర్‌పై పెత్తనం చెలాయించడంతో విసుగెత్తిన నాజర్ పారిపోయాడు. ఈవిధంగా మొగలులు, పరిమితమైన సౌకర్యాలు, స్థానికులతో ఏమాత్రం గుర్తింపులేని 'బాల్ఖ్'లో ఉండి పోవలసి వచ్చింది. విలాస జీవితానికి అలవాటు పడ్డ 'మురాద్' రాకుమారుడు తిరిగి రాగా రాకుమారుడైన ఔరంగజేబు అతని స్థానంలోకి వెళ్ళాడు. ఈ మధ్యకాలంలో అబ్దుల్ అజీజ్ నాయకత్వంలో ఉజ్బెక్ సైన్యాలు బాల్ఖ్‌ని ముట్టడించాయి. ఏదేమైనా ఔరంగజేబు సైన్యాధిపత్యం శ్రేష్టమైనదని ఋజువై వారు ఘోరంగా ఓడిపోయారు. 1647 శీతాకాలంలో అప్పటికీ నాజర్ మహమ్మద్ స్థానంలో ఏ ఇతరులను నిలపలేని మొగలులు నిత్యావసర వస్తువులు కూడా లభించక వెనుదిరగ వలసి వచ్చింది. ఉజ్బెక్ తండాలు వారి మీద పడి వారికి భారీ నష్టాన్ని కలిగించారు.

బాల్ఖ్ ముట్టడి వివాదాన్ని సృష్టించింది. ఖచ్చితమైన సైనిక పరంగా చూస్తే మొగలులు బాల్ఖ్‌ని జయించారు. కావున అది విజయవంతమైంది. మొగలులు అక్కడ తమ ఆధిపత్యాన్ని నిలుపుకోలేక పోయారు. కాబట్టి అది విఫలమైంది. వెనుదిరగడం వారికి ఒక పరాజయంగా మిగిలింది. రాజకీయ ప్రయోజనాన్ని చేకూర్చలేదు. ఇది ఈ ప్రాంతంలో భారతీయులు ప్రప్రథమ విజయం అవటం వల్ల మొగలుల హోదాను పెంచినప్పటికీ యుద్ధంలో జరిగిన సైనిక, ఆయుధ, ధననష్టం భర్తీ చేయలేనిది.

## కాందహార్‌ని పోగొట్టుకొనుట :

ఈలోగా పర్షియన్‌షా కాందహార్‌ని తిరిగి స్వాధీనం చేసుకోవడానికి యుద్ధ సన్నాహాలు చేశాడు. 1648 శీతాకాలంలో షా కాందహార్‌ని ముట్టడించాడు. మొగలులు ఈ పరిస్థితిని ధైర్యంగా ఎదుర్కొన్నారు కాని సమయోచిత సహాయం లభించని కారణంగా వారు కాందహార్‌ని షాకు అప్పగించవలసి వచ్చింది. ఈ విధంగా క్రీ.శ 1649లో పర్షియా పాలకుడైన షా కాందహార్‌ని ఆక్రమించాడు.

## షాజహాన్ కాందహార్ దండయాత్ర :

కాందహార్‌ను పర్షియనులు జయించడం మొగలుల శిబిరంలో ఘోర అవమానకర సంఘటనగా తోచింది. కాందహార్‌ని తిరిగి స్వాధీనం చేసుకోవడానికి షాజహాన్ మూడు ముట్టడులను చేశాడు. క్రీ.శ 1649 మేలో ఔరంగజేబు కాందహార్ కోటను సైన్యంతో ముట్టడించాడు. కాని పర్షియాన్‌లచే కోట పటిష్టంగా సురక్షితంగా ఉంది. 3 నెలల పర్యంతం సాగిన ఈ ముట్టడి వల్ల అపార సైన్య, ధన నష్టం జరిగినది. క్రీ.శ 1652 మేలో ఔరంగజేబు నాయకత్వంలోనే రెండవ దండయాత్ర సాగింది. కాని శ్రేష్టమైన పర్షియన్ ఫిరంగి దళంతో పాటు కాందహార్ కోట దృఢత్వం వల్ల మొగలులు ముట్టడి నిష్ప్రయోజనమైంది. క్రీ.శ 1652 ఆగస్టులో దండయాత్ర బాధ్యత దారాకి అప్పగించబడింది. ఇతరులు చేయలేని పనిని తాను చేస్తానని దారా, షాజహాన్‌కి వాగ్దానం చేశాడు. షాజహాన్ ఇతనిని సత్కారాలతోను ధనరాశులతోను ముంచెత్తాడు. క్రీ.శ 1653లో దారా కాందహార్‌ని ముట్టడించి చుట్టుప్రక్కల ఉన్న విశాల భూభాగాన్ని పొందదలచాడు. కాని అతడు ఏమీ సాధించలేక పోయాడు. కాందహార్ దండయాత్ర ఆ విధంగా నిష్ఫలమైంది.

ఆ మూడు ముట్టడులు వలన ధనం, శ్రమ పూర్తిగా వృధా అయినది. సామ్రాజ్య కోశాగారం ఖాళీ అయింది. వీటికి మించి మొగలు సామ్రాజ్య ప్రతిష్ట మసకబారింది. వీటి ద్వారా మొగలులు అజేయులు కారు అని తేలింది. ఇది మొగలులపై పర్షియన్ల పై చేయిని రుజువు చేసింది.

ఔరంగజేబు పరిపాలనాకాలంలో కాందహార్ విషయం వదిలివేయబడింది. ఔరంగజేబు పర్షియన్‌లతో దౌత్య సంబంధాలను పునః ప్రారంభించాడు. మొగలులు పర్షియన్‌ల సంబంధాలలో మరొక ప్రధానమైన సంఘటన 1738–39 లలో నాదిద్షా హిందూస్తాన్‌ని దండయాత్ర చేసినపుడు సంభవించింది.

## మొగలుల వాయువ్య విదేశీ (సరిహద్దు) విధానములోని ప్రధాన లక్షణాలు :

1. ప్రాబల్య సమతౌల్యాన్ని పాటించేందుకు మొగలులు, పర్షియన్ల మధ్య స్నేహ సంబంధాలు నెలకొల్పడం జరిగింది.
2. ఉజ్బెక్‌ల నుండి భారతదేశాన్ని రక్షించుటకు వాయువ్య దశలో సరియైన సశాస్త్రీయమైన సరిహద్దును ఏర్పరచుట కాబూల్ – ఘజ్నీ – కాందహార్‌లు మొగలుల రక్షణ వ్యవస్థలోని మొదటిశ్రేణిలోకి వచ్చాయి.

3. మొగలుల వాణిజ్య ప్రయోజనాల వృద్ధి. కాబూల్, కాందహార్‌లు భారతదేశానికి మధ్య ఆసియాతో వ్యాపారానికి జంటముఖ ద్వారాలుగా పిలువబడ్డాయి.

4. మొగలుల మధ్య ఆసియాలోని తమ అసలైన స్వస్థలాల మీద హక్కులను తిరిగి పొందాలనే కోరికను పదే పదే వెలిబుచ్చారు. కాని వారు దాని నిరర్ధకత్వాన్ని గుర్తించి దానిని ఒక దౌత్యపర ఎత్తుగడగా మాత్రమే ఉపయోగించారు.

## 36.ఇ. పాఠ్య ప్రశ్నలు

1. అక్బరు కాబూల్, కాందాహార్‌లను జయించడానికి ఏ కారణాలు పురికొల్పాయి?
2. ఉజ్బెక్‌లు మొగలులకు ఎందువలన సహజ శత్రువులైనారు?
3. జహంగీరు పాలనాకాలంలో మొగలులు కాందహార్‌ని ఎందుకు కోల్పోయారు?
4. పర్షియన్ పాలకుడైన ఆలీమర్దాన్ కాందహార్‌ను మొగలులకు ఎందుకు స్వాధీనం చేశాడు?
5. మొగలులు ఆఖరిసారిగా కాందహార్‌ను ఎప్పుడు కోల్పోయారు?

## సారాంశం :

అక్బరు క్రీ.శ 1556లో తన 13వ యేట బైరాంఖాన్ సంరక్షణలో సింహాసనాన్ని అధిష్టించాడు. అక్బరు బాహ్య, అంతర్గత శత్రువులను ఎదుర్కోవలసి వచ్చింది. అతిపెద్ద ప్రతిఘటన ఢిల్లీ, ఆగ్రాలను స్వాధీనము చేసుకొనిన హేము నుండి వచ్చింది. ఎట్టకేలకు అక్బరు క్రీ.శ 1556లో రెండవ పానిపట్టు యుద్ధంలో హేముని జయించాడు. తర్వాత సంవత్సరాలో అక్బరు అంతర్లీనంగా తన స్థితిని సుస్థిరం చేసుకొన్నాడు. అతడు బైరాంఖాన్‌ని పదవీ బాధ్యతల నుండి తొలగించి, తన పెంపుడు తల్లియైన మహంఆగా పట్టు నుండి బయటపడ్డాడు. తన సవతి సోదరుడైన (half brother) మీర్జాహకీమ్‌ని తనపై ఎగద్రోసిన ఉజ్బెక్‌లు మీర్జాలను కూడా విజయవంతంగా అణగద్రొక్కాడు.

అక్బరు తన సామ్రాజ్యాన్ని విస్తరించేందుకు మిగుల ఆత్రుత చూపాడు. ఇతడు మాళ్వా, గోండ్వానాలను జయించడం ద్వారా తన విజయయాత్రను ప్రారంభించాడు. చిత్తోర్, రణధంబోర్ వంటి రాజపుత్ర రాజ్యాలపై యుద్ధాలను చేశాడు. కొంతమంది రాజపుత్రులు అక్బరుతో వివాహ సంబంధాలను ఏర్పరచుకొనగా, మరి కొంతమంది నిరోధించకుండనే లొంగిపోయారు. 1572 మరియు 1576ల మధ్య అక్బరు గుజరాత్, బెంగాల్, బీహార్‌లను కూడా జయించాడు. జహంగీర్ అక్బరుకు వారసుడైనాడు. ఈ కాలంలో మేవాడ్ మరియు కాంగ్రాలు మొగలు సామ్రాజ్యంలో అంతర్భాగాలుగా చేయబడ్డాయి. జహంగీర్ నూర్జహాన్‌ని వివాహమాడాడు. కొంతమంది పండితుల ప్రకారం అనుసరించి, వాస్తవంగా ప్రభుత్వ పరిపాలనా పగ్గాలు ఆమె చేతిలో ఉండేవి. ఈమె ఒక ఝుంటా(ముఠా) ఏర్పరచుకొంది. అంతేగాక ఖుర్రమ్ (షాజహాన్) తిరుగుబాట్లు నూర్జహాన్‌తో పోటీ ఫలితమే. ఐతే ఇది వాస్తవం అనిపించదు. జహంగీర్ సామ్రాజ్య వ్యవహారాలను తానే అదుపు చేసేవాడు. ఇక ఖుర్రమ్ తిరుగుబాటు సుదూరం, అసాధ్యం అయిన కాందహార్ ముట్టడిని ఇష్టపడక పోవడం వల్లనే కాక ఇది అతనిని సింహాసనం నుండి ఎంతోదూరం ఉంచుతుందనే భావన కూడా కారణం.

క్రీ.శ 1628లో షాజహాన్ సింహాసనాన్ని అధిరోహించాడు. ఇతని పరిపాలనా కాలంలో మొగలుల విదేశీ విధానం అత్యున్నద దశకు చేరుకుంది. హిందూస్తాన్ వాయువ్య సరిహద్దులను రక్షించవసిన ఆవశ్యకత ఫలితమే

మొగలుల విదేశాంగ విధానం. మొగలుల అట్‌మన్‌లు, సఫావీడ్‌లు, ఉజ్బెక్‌ల మధ్య ప్రాబల్య సమతౌల్యాన్ని కాపాడేందుకు కూడా ప్రయత్నించారు. అక్బరు కాబూల్, ఘజనీ, కాందహార్‌ల వరుస, కీలక హేతుబద్ధ సరిహద్దు అని భావించాడు. అతడు 1585లో కాబూల్ వశం చేసుకొన్నాడు. కాని పర్షియా షియాలకు వ్యతిరేకంగా సున్నీల త్రైపాక్షిక కూటమిలో చేరనున్న అబ్దుల్లా ఉజ్బెక్ కోరికను ప్రోత్సహించేందుకు నిరాకరించాడు. కాందహార్ యొక్క కీలక, ఆర్థిక పరమైన ప్రాముఖ్యాన్ని గుర్తించిన అక్బరు దానిని క్రీ.శ 1595లో వశపరచుకొన్నాడు.

జహంగీరు పరిపాలనా కాలంలో మొగలుల, పర్షియన్‌ల మధ్య సంబంధాలు స్నేహ పూర్వకంగా ఉండేవి. కాని 1620లో పర్షియా పాలకుడైన షా అబ్బాస్ ఆకస్మికంగా కాందహార్‌ని స్వాధీనం చేసుకున్నాడు. ఇది మొగలుల పర్షియన్ల మధ్య చెప్పలేనంత రగడగా మారిపోయింది. షాజహాన్ పరిపాలనాకాలంలో (కాందహార్‌ని పాలిస్తున్న) పర్షియన్ గవర్నరు మొగలులకు లొంగిపోయినప్పుడు కాందహార్ మళ్ళీ మొగలుల చేతిలోకి వచ్చింది. దీని తర్వాత ఒక స్నేహపూరిత పరిపాలకుని బాల్ఖ్(Balkh)లో ప్రతిష్ఠించడం ద్వారా ఉజ్బెక్ తండాలను ఆధీనంలోకి తెచ్చుకోవాలని షాజహాన్ తలచాడు. మురాద్ రాకుమారుని నాయకత్వంలో మొగలు సైన్యం బాల్ఖ్‌లో ప్రవేశించి దాని పాలకుడైన నాజర్ మహమ్మద్‌ని తన ఎదుటికి రమ్మని కోరాడు. నాజర్ మొగలుల పథకాన్ని విధ్వంసం చేస్తూ పారిపోయాడు. మురాద్ తిరిగి రాగా ఔరంగజేబు ఆస్థానాన్ని భర్తీ చేయవలసి వచ్చింది. మొగలులు బాల్ఖ్‌ని ఆక్రమించినప్పటికీ శీతాకాలం రాగానే నిత్యావసర వస్తువుల కొరత వల్ల దుర్గాన్ని వదులుకోక తప్పలేదు. ఈ సైన్యం తిరిగి వచ్చేటప్పుడు, అది శత్రువులైన ఉజ్బెక్‌లపై తారసిల్లింది. ఈవిధంగా బాల్ఖ్ ముట్టడి మొగలులకు సైనిక, ధన పరంగా గొప్ప నష్టాన్ని కలిగించింది. ఈలోగా 1649లో, పర్షియన్‌లు కాందహార్‌ని తిరిగి స్వాధీనం చేసుకున్నారు. షాజహాన్ 1649, 1652, 1653లలో కాందహార్‌ని వశపరచుకొనేందుకు మూడు దండయాత్రలకు ఆదేశించాడు, కాని అవన్నీ నిష్ప్రయోజనమైనవి. షాజహాన్ వారసుడైన ఔరంగజేబు వాయువ్యంలో దౌర్జన్యపూరిత విధానాన్ని కొనసాగించలేదు. ఇతడు ఇరాన్(పర్షియా)తో సత్సంబంధాలను కొనసాగించాడు.

## అభ్యాసం

1. సింహాసనాన్ని అధిష్ఠించగానే అక్బరు తక్షణం ఎదుర్కోవలసిన అంతర్లీన సమస్యలేవి?
2. రెండవ పానిపట్ యుద్ధానికి కారణాలు, ఫలితాలు ఏవి?
3. అక్బరు కాలంలో మొగలు సామ్రాజ్య తొలి విస్తరణను గురించి వ్రాయుము.
4. మొగలుల రాజకీయ జీవితంలో నూర్జహాన్ పాత్ర ఏమిటి?
5. మొగలుల వాయువ్య, మధ్య ఆసియా విధాన ముఖ్య లక్షణాలు ఏవి?
6. వాయువ్య సరిహద్దుల పట్ల అక్బరు శాస్త్రీయ విధానాన్ని ఎందుకు అవలంభించాడు?
7. కాందహార్ విషయం ప్రత్యేకంగా పేర్కొంటూ మొగలు-పర్షియన్‌ల సంబంధాలను గుర్తించుము.
8. బాల్ఖ్ ముట్టడి మొగలు సామ్రాజ్యాన్ని ఎట్లు ప్రభావిం చేసింది?

## పాఠ్య ప్రశ్నలకు సమాధానంలు

### 36.ఎ. పాఠ్యంలోని ప్రశ్నలకు సమాధానాలు.

1. అక్బర్ జన్మించే సమయానికి షేర్షాసూర్ చేతిలో రాజ్యాన్ని కోల్పోయి హుమాయూన్ బికారిగా తిరుగుతూ వుండేవాడు.
2. క్రీ.శ. 1555, కలనౌర్
3. షేర్షా వారసులు. అదిల్‌షా మంత్రి అయిన హేము
4. క్రీ.శ. 1556లో పానిపట్టు యుద్ధం తర్వాత మొఘల్ రాజ్యస్థాపన

### 36.బి.

1. అధికారాలను స్వాధీనం చేసుకుని స్వతంత్ర్య పాలకుడు కావాలనుకున్నాడు అక్బర్.
2. భైరాంఖాన్ వివాదాస్పదుడుగా మారి షాహీలకు ఉన్నత పదవులు యిచ్చాడు.
3. ఇతర అధికారులు తనపై పెత్తనం చెలాయించడాన్ని సహించలేక భైరాంఖాన్ తిరుగుబాటు చేశాడు.
4. ఆదాంఖాన్ వజీర్ ప్రధానమంత్రి కావాలనుకున్నాడు.
5. గుజరాత్ గవర్నర్ మీర్జాహకీం

### 36.సి.

1. గుజరాత్ మరియు మాళ్వా
2. సమర్థులైన పాలకులు లేకపోవడం, బాజ్‌బహదూర్ ఎక్కువ సమయం సాహిత్య కార్యకలాపాలకు కేటాయించడం
3. సామ్రాజ్యవాద విధానం
4. అంబర్‌కు చెందిన బారామత్, మేహార్‌కు చెందిన ఉదయ్‌సింగ్

### 36.డి.

1. రాణా అమర్‌సింగ్‌తో జహంగీర్ యుద్ధం చేశాడు. ఓడిపోయిన తర్వాత గౌరవంగా చూశాడు.
2. (a) నూర్జహాన్ ఒక ముఠాను ఏర్పాటు చేసుకుంది. జహంగీర్ ఆమె ప్రభావంలో వుండేవాడు.

   (b) జహంగీర్ నూర్జహాన్‌కు లోబడివున్నా పరిపాలనా విషయాలలో స్వతంత్ర నిర్ణయాలు తీసుకునేవారు.
3. సరైన సమయానికి సహాయం అందకపోవడం వల్ల ఖుర్రం కాందహార్ చేరలేక పోయాడు.

# 37

# అక్బర్, జహంగీర్, షాజహాన్‌లు సాధించిన విజయాలు

## 37.1 పరిచయం :

వంశపారంపర్యంగా అక్బర్‌కు లభించిన రాజ్యం అనైక్యతను గురించి మీరు గత అధ్యాయంలో చదివారు. దండయాత్రలు చేయడంతో పాటు వివిధ విధానాలను అనుసరించడం ద్వారా విశాలమైన రాజ్యాన్ని స్థాపించడంతో పాటు రాజ్య స్థిరీకరణ సాధించాడు. ప్రస్తుత అధ్యాయంలో అక్బర్ చక్రవర్తి రాజ్య స్థిరీకరణ కోసం అనుసరించిన విధానాలు, లౌకిక విధానం, వివిధ మతాలు మధ్య సామరస్యం సాధించేందుకు చేసిన ప్రయత్నాలతోపాటు జహంగీర్, షాజహాన్‌లు సాధించిన ఘనకార్యాలు, విజయాలను చదువుతారు.

## 37.2 లక్ష్యాలు :

ఈ అధ్యాయాన్ని చదివిన తర్వాత మీరు ఈ విషయాలను అర్థం చేసుకోగలరు.

1. రాజ్య స్థిరీకరణ సాధించేందుకు అక్బర్ అనుసరించిన విధానాలు
2. రాజ్యంలోని వివిధ మతాలు, వర్గాల మధ్య సమానత్వం సాధించేందుకు అక్బర్ తీసుకున్న చర్యలు
3. అక్బర్ మత సహన విధానంను అనుసరించడానికి గల కారణాలు
4. మత సామరస్య ప్రభావం సాహిత్యం, శిల్పకళ, చిత్రలేఖనంలపై ఏవిధంగా వుంది అన్న విషయం
5. జహంగీర్, షాజహాన్‌లు సాధించిన ఘనకార్యాలు

## 37.3 సామ్రాజ్య పటిష్టతకు చేపట్టిన చర్యలు :

ఢిల్లీ సుల్తానుల పాలనకాలంలో సుల్తానులు రాజ్యవిస్తరణ కోసం సైన్యంపైన ఆధారపడిన విషయం మీకు గుర్తుంది కదా! అయితే రాజ్యస్థిరీకరణ, సామరస్యం సాధించేందుకు కేవలం రాజకీయ ఐక్యత మాత్రమే చాలదనీ మత, సాంఘిక సమైక్యత సాధించడం అవసరమనే విషయాన్ని అక్బర్ చక్రవర్తి గుర్తించాడు.

రాజ్యం, పాలనల్లో ఐక్యతను సాధించేందుకు అక్బర్ భారతదేశంలో విశాలమైన ప్రాంతాలను చేసుకోవడంతో పాటు సమర్ధవంతమైన పరిపాలనను ప్రవేశపెట్టాడు. శాంతిభద్రతలను రక్షించేందుకు యంత్రాంగాన్ని పునరుద్ధరించాడు. భూసారాన్ని, పండేపంటలను ఆధారంగా చేసుకుని భూమిశిస్తును నిర్ణయించాడు. మధ్య ఆసియా దేశాలతో వ్యాపార

సంబంధాలను మెరుగుపర్చుకునేందుకు, వాయువ్య ప్రాంతాల రక్షణకోసం కాబూల్, కాంధహార్‌లను ఆక్రమించుకున్న విషయం గుర్తుంది కదా! సరిహద్దు రాజ్యాలకు బలపరాక్రమాలు కలిగిన రాజామాన్‌సింగ్, బీర్బల్ వంటి ఉద్యోగులను పంపాడు. మత స్వేచ్ఛా విధానాన్ని అనుసరించి ముస్లిమేతరులపై విధిస్తూవున్న జిజియాపన్ను, యాత్రాపన్నులను రద్దుచేశాడు. దీనివల్ల తనకు ముస్లింలు, ముస్లిమేతరులు ఒక్కటే అని చాటి చెప్పాడు. ముస్లిమేతరులు వారి మతాన్ని వివక్ష, అవమానం కలిగించే జిజియాపన్ను రద్దు చేయడం ద్వారా వారి అభిమానాన్ని చూరగొన్నాడు. యుద్ధ ఖైదీలను ముస్లిం మతంలోనికి మార్చే విధానానికి కూడా అక్బర్ స్వస్తి పలికాడు.

| జిజియాపన్ను ముస్లిమేతరులపై విధించే పన్ను. ఇది మతపన్ను కాదు. సైనికావసరాలను దృష్టిలో వుంచుకుని సైన్యానికి పనికిరాని వారినుంచి ఈ పన్నును వసూలు చేసేవారు. అందువల్ల స్త్రీలు, వృద్ధులు, వికలాంగుల నుంచి ఈ పన్నును వసూలు చేసేవారు కాదు. |
|---|

మతస్వేచ్ఛా విధానాన్ని అనుసరించిన అక్బర్ హిందువులకు, ఇతర మతస్థులకు నూతన ఆలయాలను నిర్మించుకునేందుకు, పాతవాటిని మరమ్మత్తులు చేసుకునేందుకు అనుమతులనిచ్చాడు. అక్బర్ స్వయంగా కాంగ్రాలోని జ్వాలాదేవి ఆలయానికి బంగారు గొడుగును సమర్పించాడు. శిక్కుల గురువైన గురురామ్‌దాసుకు ఐదువందల భిగ (bigha) భూమిని తక్కువ రేటుకు యిచ్చాడు. ఈ స్థలంలోనే గురురామదాసు అమృతసర్ నిర్మాణానికి శంఖుస్థాపన చేశాడు. గురురామదాసు సలహామేరకు అక్బర్ పంజాబ్ ప్రాంత రైతులకు పన్నునుంచి ఒక సంవత్సరం మినహాయింపును యిచ్చాడు. ఇతర మతస్థులు పండుగలు, ఉత్సవాలను జరుపుకునేందుకు పూర్తి స్వేచ్ఛ నివ్వడంతో పాటూ, రాజమందిరంలో దసరా, దీపావళి, హోళి, రక్షాబంధనం వంటి వేడుకలను జరిపించాడు.

అక్బర్ తక్కువ సంఖ్యలో వున్న తురుష్కులు, మిర్జాలు, ఉజ్‌బెక్ ఉద్యోగుల నుంచి వున్న ప్రమాదాన్ని గుర్తించి ముస్లిమేతరుల సహాయాన్ని పొందాలని నిర్ణయించుకున్నాడు. రాజపుత్రులతో పాటు హిందు సైనికులతో స్నేహ సంబంధాలను ఏర్పరచుకున్నాడు. అక్బర్ రాజపుత్ర విధానాన్ని గురించి రాబోయే పాఠాలలో మీరు చదువుతారు. రాజపుత్రుల స్నేహాన్ని పెంపొందించుకునేందుకు వారితో సహనవిధానాన్ని అనుసరించడంతో పాటు, తన సార్వభౌమాధికారాన్ని గుర్తించిన రాజపుత్రులకు ఆస్థానంలో ఉన్నత పదవులనిచ్చి సత్కరించాడు.

### దీన్-ఇ-ఇలాహి (తహిద్-ఇ-ఇలాహి) :

అక్బర్ దీన్-ఇ-ఇలాహి (తహిద్-ఇ-ఇలాహి) అనే నూతన మతాన్ని స్థాపించాడు. అన్ని మతాలలో వున్న మంచిని ఇందులో గ్రహించాడు. వివిధ మతాల మధ్యవున్న ద్వేషభావాన్ని తొలగించి, సాంఘిక సమానత్వం, సోదర భావం పెంపొందించడం ద్వారా మానవాభివృద్ధి సాధించడమే ఈ మత లక్ష్యం. ఈ మత సిద్ధాంతాలను అబుల్‌ఫజల్ వివరించాడు. దీని ప్రకారం దేవుడు ఒక్కడే! (ఏకేశ్వరాధాన). అక్బర్ అతని ప్రతినిధి అనేది ప్రధానమైన సిద్ధాంతం. మత సిద్ధాంతాలను ప్రత్యేక పాఠంలో మీరు చదువుతారు. ఈ మతం దేశంలోని వివిధ మతాలు, తెగల మధ్య సహనభావాన్ని అభివృద్ధి చేసింది. సామాజిక నడవడికలో మార్పులు తెచ్చేందుకు కృషి చేసింది.

సమకాలీన చరిత్రకారుడైన 'బదౌని' నూతన మతస్థాపన చేసిన అక్బర్‌ను విమర్శించడంతోపాటు 'కఫీర్'గా పేర్కొన్నాడు. బదౌని విమర్శకు అతను అక్బర్ మతాన్ని సరిగ్గా అర్థం చేసుకోలేకపోవడమే కారణం. అక్బర్ మతాధికారి కాదు. గొప్ప సామ్రాజ్య నిర్మాత, పరిపాలనా దక్షుడు. యుద్ధ విజేత. ముస్లిమేతరులు అధికంగా నివశిస్తూ వున్న

భారతదేశంలాంటి దేశంలో తాను అన్ని మతాలకు చెందినవాడుగా గుర్తింపబడితేనే రాజ్య స్థిరీకరణ సాధించడం వీలవుతుందనే విషయాన్ని అక్బర్ గ్రహించాడు. స్వమతాభిమానం వల్ల కలిగే నష్టాలను అక్బర్ గుర్తించడం వల్ల తాను స్థాపించిన మతంలో చేరమని ఎవరినీ వత్తిడి చేయలేదు. వాస్తవానికి పరిశీలిస్తే అక్బర్ దేశంలో వున్న ముస్లింలను, ముస్లిమేతరుల మధ్య దూరాన్ని తగ్గించి వారిని ఒక్కటి చేసేందుకే దీన్-ఇ-ఇలాహీని స్థాపించాడు.

## 37.4 అక్బర్ యొక్క సాంస్కృతిక విజయాలు :

అక్బర్ ప్రజలందరిలో శాంతియుత విధానం నెలకొనేందుకు కృషి చేశాడు. సుల్,కుల్ హిందూ ఆచారాలైన నుదుటిమీద తిలకధారణ, తులాభారం, ప్రత్యేక దర్శన విధానాలను అనుసరించాడు. దీనికి తోడు హిందూ వస్త్రధారణైన అచకన్, షేర్వాణి ధరించి ప్రజల్ని ఆకట్టుకున్నాడు. సాంఘిక దురాచారాలైన బాల్యవివాహాలు, సతీసహగమనంల నిషేధానికి కృషిచేసి కొంతమేరకు విజయం సాధించాడు. అక్బర్ సాంస్కృతిక సాహిత్య రంగాలలో అనేక విజయాలను సాధించాడు.

### సాహిత్యం :

అక్బర్ నిరక్షరాస్యుడే అయినా కవులు, పండితులు, చరిత్రకారులను పోషించాడు. సాహిత్యాభివృద్ధికి ప్రోత్సాహాన్ని అందించాడు. అక్బర్ కాలాన్ని మధ్యయుగంలో పునరజ్జీవన యుగంగా కొందరు పండితులు పేర్కొన్నారు. అక్బర్ కాలంలో హిందీ, పర్షియా భాషా సాహిత్యాలతో పాటు స్థానిక భాషల సాహిత్యం వృద్ధి చెందాయి. ఈయన పాలనాకాలంలో మహాభారతం, రామాయణంల వంటి సంస్కృత కావ్యాలు టర్కీ పర్షియా భాషలోనికి తర్జుమా చేయబడ్డాయి. ఈ కాలంలోని రచనల్లో అబుల్‌ఫజల్ వ్రాసిన "ఇన్షా-ఇ-అబుల్‌ఫజల్"అనే ఉత్తరాల సంకలనం ప్రధానమైనది. అబుల్‌ఫజల్‌ను విమర్శించే ఔరంగజేబు కూడా ఈ రచనా శైలిని మెచ్చుకోవడం ఈ రచన గొప్పదనానికి నిదర్శనం. పర్షియన్ సాహిత్యంలో ప్రకృతిని, సౌందర్యాన్ని వర్ణించే పద్యసాహిత్యం ప్రధాన స్థానాన్ని ఆక్రమించింది. దేశ,విదేశీ కవులు, పండితులు అక్బర్ పోషణను అందుకున్నాడు. ఐన్-ఇ-అక్బరీ 59 మంది పర్షియా కవులను గురించి పేర్కొంది. వారిలో గిజాలీ, ఫైజీ, మహ్మద్‌హుస్సేన్ మరియు సయ్యద్ జమాలుద్దీన్ ఉర్ఫీ మొదలైనవారు ప్రధానమైనారు.

### చారిత్రక రచనలు :

అక్బర్ చరిత్రపట్ల అభిమానాన్ని కనబరిచాడు. చరిత్రకారులను పోషించాడు. అక్బర్ కాలంలో అనేక చారిత్రక రచనలు వెలుగులోనికి వచ్చాయి. వాటిల్లో అబుల్‌ఫజల్ వ్రాసిన ఐన్-ఇ-అక్బరీ మరియు అక్బర్‌నామా ప్రధానమైనవి. అక్బర్ పరిపాలన, విధానాలకు ఇవి అద్దం పట్టాయి."బదౌని" రచించిన "ముంతకాబ్-ఉల్-తారీఖ్" అక్బర్ మత విధానాన్ని విమర్శించిన రచన. ఆ కాలంలో దీనిని రహస్యంగా రచించాడు. అక్బర్‌పై విమర్శనాత్మక వాదానికి ఇది ఒక మంచి ఆధారం. నిజాముద్దీన్ అహ్మద్ రచించిన 'తబకత-ఇ-అక్బరీ' అక్బర్ సాధించిన ఘనకార్యాలను, విజయాలను, వివరంగా పేర్కొంటూవున్న గ్రంథం. వెయ్యి సంవత్సరాల ముస్లిం మతచరిత్ర రచించేందుకు అక్బర్ నజీబ్‌కాన్, తట్టాకు చెందిన ముల్లామహ్మద్, ధానేశ్వర్‌కు చెందిన జాఫర్ బేగ్‌లతో ఒక కమిటీని నియమించాడు. హుమాయూన్ సోదరి అయిన గుల్బదన్‌బేగం "హుమాయూన్‌నమ"ను రచించాడు. సర్‌హింద్ రచించిన 'అక్బర్‌నామ' ప్రధాన చారిత్రక రచన.

ముస్లిం, ముస్లిమేతరుల మధ్యవున్న దూరాన్ని తగ్గించేందుకు అక్బర్ చేసిన కృషి మీకు గుర్తువుంది కదా! అందుకోసం అనేక కావ్యాలను అనువదింపచేశాడు. అందుకొరకు ప్రత్యేక అనువాదశాఖను ఏర్పాటు చేశాడు. అబ్దుల్ రహీం, ఖాన్–ఇ–ఖానన్, బదౌని, అబుల్‌ఫజల్, ఫైజి మొదలైనవారికి అనువాదశాఖను అప్పగించాడు. రామాయణం, మహాభారతం, అధర్వణవేదం, లీలావతి, రాజతరంగిణి, హరివంశం వంటి ప్రసిద్ధ సంస్కృత రచనలను పర్షియా భాసలోనికి అనువదింపచేశాడు. వీటికితోడు అబుల్‌ఫజల్ 'పంచతంత్రం"ను ఫైజి "నలదమయంతి"ని పర్షియా భాషలోనికి అనువాదం చేశారు. బాబర్ స్వీయచరిత్ర తుజుక్–ఇ–బాబరీ" తుర్కీ భాష నుండి పర్షియా భాషలోనికి అనువదింపబడింది.

హిందీ సాహిత్యంలో అక్బర్‌కాలం స్వర్ణయుగం. అనేకమంది హిందీకవులు, పండితులు అక్బర్ పోషణను అందుకున్నారు. అక్బర్ ఆస్థానంలోని మంత్రులు, ఉన్నతోద్యోగులు, అనేకమంది హిందీకవులు పండితులు కావడం విశేషం. అబ్దుల్ రహీం, ఖాన్–ఇ–ఖానా, బీర్బల్, రాజాతోడర్‌మల్, రాజామాన్‌సింగ్ మొదలైనవారు ప్రముఖులు. అబ్దుల్ రహీం, ఖాన్–ఇ–ఖానా రచించిన దోహాలు నేటికీ ప్రాచుర్యంలో వున్నాయి.

అక్బర్ కాలంలోని మరో ప్రసిద్ధ కవి – "భక్త తులసీదాస్". ఈయన ప్రసిద్ధ రచన 'రామచరితమానస్'. ఈ కావ్యం రాముడిని ఒక ఆదర్శవంతుడైన పుత్రుడుగా, సోదరుడిగా, స్నేహితుడుగా, భర్తగా, రాజుగా వర్ణించింది. అక్బర్ కాలంలో కృష్ణభక్త కవి అయిన సూరదాసు బ్రిజ్‌భాషలో "సూరసాగర్" అనే కావ్యాన్ని రచించాడు. నంద్‌దాసు, విఠలనాథుడు, పరమనందదాసు, మీరాబాయి, రస్‌ఖాన్ మొదలైనవారు ఈ కాలానికి చెందిన కృష్ణభక్త కవులు. రస్‌ఖాన్ జన్మతః మహ్మదీయుడైన కృష్ణభక్తుడు. ఆయన కృష్ణుడిని కీర్తిస్తూ "ప్రేమవాటిక"అనే కావ్యాన్ని రచించాడు. ఈ కాలంవాడే అయిన కేశవదాసు కవిప్రియ, రామచంద్రిక, రసిక ప్రియ అనే కావ్యాలను రచించాడు.

### నిర్మాణాలు – శిల్పకళ

అక్బర్ కాలంలో శిల్పకళ ఉన్నత స్థితికి చేరింది. భవన నిర్మాణం పట్ల అక్బర్ ప్రత్యేక శ్రద్ధ వహించాడు. ఢిల్లీ సుల్తానుల కాలంలో శిల్పకళపైన పర్షియన్ పద్ధతి ప్రభావాన్ని మీరు చదివారు కదా ! అయితే అక్బర్ కాలంలో పర్షియన్ మరియు హిందూ శిల్పకళా సమ్మేళనంతో నూతన శిల్పకళ అభివృద్ధి చెందింది. శిల్పంలోనూ, నిర్మాణాల్లోనూ ఒకవైపు గుమ్మటాలు, మినార్లువంటి పర్షియన్ పద్ధతులను అనుసరిస్తూనే మరోవైపు అలంకరణలో హిందూ పద్ధతులను అనుసరింపచేశాడు.

అక్బర్ ఢిల్లీలో తన పరిపాలన తొలిరోజుల్లో హుమాయూన్ సమాధిని నిర్మింపజేశాడు. ఇది పర్షియా పద్ధతిలో వుంది. స్వీయ పర్యవేక్షణలో అక్బర్ ఆగ్రా కోటను నిర్మింపజేశాడు. అనేక భవనాలు గల ఆగ్రాకోట ఎర్రని ఇసుకరాయితో నిర్మింపబడింది. కోటలోని జహంగీర్‌మహల్ పూర్తి హిందూపద్ధతిలో నిర్మింపబడింది. ఆగ్రాకోట గ్వాలియర్ కోట నమూనాతో ఉంది. అక్బర్ లాహోర్ కోటను నిర్మించాడు. ఆగ్రాకోటలాగే నిర్మించిన ఈ భవనాల్లోని అలంకరణలో హిందూ నిర్మాణ పద్ధతి కనిపిస్తుంది. ఈ నిర్మాణాలు అక్బర్ మతస్వేచ్ఛా విధానానికి సహనానికి తార్కాణాలు. అక్బర్ నిర్మాణాల్లో అత్యంత నైపుణ్యం కలది అతని నూతన రాజధానియైన ఫతేపూర్‌సిక్రి. మూడువైపులా తొమ్మిది ద్వారాలతో గోడ, మరోవైపు కోనేరులతో నిర్మాణం సాగింది. దివాన్–ఇ–ఆమ్, దివాన్–ఇ–ఖాస్, పంచమహల్, జోద్‌బాయి మహల్, బీర్‌బల్ భవనం, బులందు ధర్వాజ్, గ్రంధాలయ భవనం వంటివి ప్రధాన నిర్మానాలు. అక్బర్ నిర్మాణాల్లో పేరెన్నిక కన్నది షేక్ సలీం చిష్తి సమాధి. అక్బర్ ఆగ్రాలో తన సమాధి నిర్మాణాన్ని ప్రారంభించాడు కానీ, దాని నిర్మాణం జహంగీర్ కాలంలో పూర్తయింది. ఈ సమాధి అక్బర్ కాలంనాటి నిర్మాణాల గొప్పదనానికి నిదర్శనంగా నిలుస్తూ

వుంది. అక్బర్‌పాలనా కాలంలో నిర్మింపబడిన అంబర్, బికనీర్, జోద్‌పూర్, ఓర్కా, దతియాలోని భవనాల్లో మొఘల్ ప్రభావం కనిపిస్తుంది. అంతేకాకుండా ఈ కాలంనాటి దేవాలయాలపైన కూడా మొఘల్ శిల్పకళా ప్రభావం కనిపిస్తూ వుండడం విశేషం.

**చిత్రలేఖనం :**

అక్బర్ కాలంలో చిత్రలేఖనంలో పర్షియన్, భారతీయ పద్ధతుల మేళవింపులతో నూతన మొఘల్ విధానం రూపుదిద్దుకుంది. దస్తన్-ఇ-అమీర్‌హన్య, తారీఖ్-ఇ-ఖాందాన్-ఇ-తైమూయా మరియు అక్బర్ నామాలు చిత్రలేఖనంలోని పరిమాణాన్ని తెలుపుతున్నాయి. చిత్రలేఖనంను ప్రోత్సహించేందుకు అక్బర్ ప్రత్యేకశాఖను ఏర్పాటు చేశాడు. ఖ్వాజ్‌అబ్దుల్ సమద్ ఈ శాఖకు అధిపతి. ఇతడు కుల మతాలతో సంబంధం లేకుండా ప్రతిభను పట్టి చిత్రకారులను నియమించాడు. అక్బర్ ఆస్థానంలో దేశ, విదేశీ చిత్రకారులు వుండేవారు. ఫరూఖ్‌బేగ్, జస్వంత్, బసవాన్‌మీర్, సయ్యద్ ఆలీ మొదలైనవారు. అక్బర్ కాలంలో ప్రసిద్ధ చిత్రకారులు.

## 37.ఎ. పాఠ్య ప్రశ్నలు

1. మత సహనవిధాన అవసరాన్ని అక్బర్ ఏవిధంగా గ్రహించాడు?
2. జిజియాపన్నును ముస్లిమేతరులు ఎందుకు వ్యతిరేకించేవారు?
3. అక్బర్ మత సహన విధానానికి రెండు ఉదాహరణలు యివ్వండి.
4. ఇబాదత్ ఖానా ఎక్కడ ఏర్పాటు చేయబడింది?
5. తౌహిద్-ఇ-ఇలాహి మతంలోని ప్రధాన లక్షణాలు ఏవి?
6. అక్బర్ కాలంలోని ఇద్దరు కవుల పేర్లు తెలపండి?
7. అబుల్ ఫజల్ ప్రసిద్ధ రచనలు ఏవి?

## 37.5 జహంగీర్ సాధించిన విజయాలు :

జహంగీర్ కాలంనాటి అభివృద్ధి ప్రధానంగా కళలు, సంగీతంలో కనిపిస్తుంది. మొఘల్ చిత్రలేఖనం జహంగీర్ కాలంలో ఉన్నత దశకు చేరగా, నూర్జహాన్ నూతన పద్ధతులను, వరవడులను ప్రవేశపెట్టింది.

**సాహిత్యం :**

జహంగీర్ స్వయంగా కవి. పండితుడు. ఆయన "తుజుక్-ఇ-జహంగీర్" పేరుతో స్వీయచరిత్రను రచించాడు. ఇది నిరాడంబరత్వానికి, వాస్తవికతకు, శైలికి అద్దం పడుతుంది. సాహిత్యపరంగానే కాకుండా చారిత్రకంగా కూడా గొప్ప పేరు పొందింది.

మంచి రచనలు చేసిన రచయితలు, కవులను జహంగీర్ ప్రోత్సహించాడు. ఈ కాలంనాటి రచనల్లో ఇక్బాల్‌నామా-ఇ-జహంగీర్, మాసర్-ఇ-జహంగీర్, జుబ్దు-ఉల్-తారీఖ్ వంటివి ప్రసిద్ధి చెందినవి. మీర్జా ఘియాస్‌బేగ్, నకీబ్‌ఖాన్, అబ్దుల్ దెహ్లీ మొదలైన కవి పండితులు జహంగీర్ ఆస్థానంలో వుండి పోషణను అందుకున్నారు. ఏమైనప్పటికీ జహంగీర్ కాలంలో అనువాద శాఖ ఉపయోగం లేకుండా పోయింది.

### నిర్మాణాలు - శిల్పకళ

అక్బర్ కాలంతో పోలిస్తే జహంగీర్ కాలంలో నిర్మాణాలు, శిల్పకళ వెనుకబడిందని చెప్పవచ్చు. చిత్రలేఖనంపైన జహంగీర్ అధికంగా శ్రద్ధ కనబరచడమే అందుకు కారణం. చిత్రలేఖనం, ఉద్యానవనాల పట్ల జహంగీర్ శ్రద్ధ కనబరిచాడు. అయినప్పటికీ ఆగ్రాలోని ఇత్మద్-ఉద్-దౌలా సమాధి, అక్బర్ సమాధులు జహంగీర్ కాలంనాటి నిర్మాణాల్లో గొప్పవి. ఇత్మద్ -ఉద్-దౌలా సమాధిని నూర్జహాన్ తన తండ్రి జ్ఞాపకార్థం స్వీయ పర్యవేక్షణలో జరిగింది. ఈ భవనం మార్బుల్‌రాయిని ఉపయోగించి నిర్మింపజేయడంతో పాటు పైత్రాదురా అనే ప్రత్యేక రంగు రాళ్ళను అలంకరణకు ఉపయోగింపజేసింది. అక్బర్ స్వయంగా రూపకల్పన చేసుకున్న సమాధిని జహంగీర్ పూర్తిచేశాడు. ఇది బౌద్ధ విహారాన్ని పోలిన నిర్మాణం. లాహోర్ సమీపంలోని షాధారాలో నూర్జాహాన్ జహంగీర్ సమాధిని నిర్మింపజేసింది. తెల్లని పాలరాతితో నిర్మింపజేసి మెరిసే పలకలతో దీనిని అలంకరింపజేసింది.

### చిత్రలేఖనం :

జహంగీర్ స్వయంగా చిత్రకారుడు కనుక చిత్రలేఖనం పట్ల శిల్పకళ కంటే అత్యంత శ్రద్ధ కనబరిచాడు. జహంగీర్ హిందూ మహ్మదీయ చిత్రకారులను పోషించాడు. ఆగారేజా, అతని కుమారుడైన అబ్దుల్ హసన్, ఉస్తాద్‌మన్సూర్‌లు జహంగీర్ పోషణను అందుకున్న మహ్మదీయ చిత్రకారులు కాగా, హిందు చిత్రకారుల్లో బిషన్‌దాస్, తులసి, మనోహర్, మాధవ, గోవర్ధన్‌లు ప్రధానమైనవారు. జహంగీరుకాలంలో చిత్రకళ పర్షియన్ ప్రభావం నుంచి బయటపడి పూర్తిగా భారతీయ సాంప్రదాయంలో సాగింది. చిత్రాల్లో భవనాలు, పుష్పాలు, ఆకులు, పక్షులు, జంతువులు, ప్రకృతి దృశ్యాలు ప్రధానమైనవి.

## 37.6 షాజహాన్ సాధించిన విజయాలు

మొఘల్ పాలనలో షాజహాన్‌కాలం ఉన్నతమైనది. శిల్పకళ, నిర్మాణాలు ఈ కాలంలో ఉన్నత స్థితికి చేరుకున్నాయి. చరిత్రకారులు షాజహాన్‌ను గొప్ప నిర్మాతగా వర్ణించారు.

సాహిత్యం : షాజహాన్ శిల్పకళ, నిర్మాణాల పట్ల ప్రత్యేక శ్రద్ధ కనబరిచినా, కవులు, పండితులను ఉదారంగా పోషించాడు. షాజహాన్ కాలంలో చరిత్రకారుడైన అబ్దుల్‌హమీద్ - పాదుషానామాను, ఇనాయత్ ఖాన్ "షాజహాన్ నామా"ను, అమినియా ఖాజ్విని మరో 'పాదుషానామాను', మహ్మద్‌షాలిహ్ 'ఆమ్-ఇ-ఖాజ్‌వీని' కావ్యాలను రచించారు. ఇవన్నీ షాజహాన్ కాలానికి అద్దం పట్టే రచనలు. షాజహాన్ పెద్ద కుమారుడైన 'ధారాషికో' అరబ్బీ, పర్షియా, సంస్కృత భాషలలో గొప్ప పండితుడు. కవి. ఈయన 'మజామ్-ఉల్-బహ్రైన్', సకినాత్-ఉల్-ఆలియా' కావ్యాలను రచించాడు. ఇవి తత్వానికి చెందిన రచనలు కాగా, సంస్కృత కావ్యాలు అయిన భగవద్గీత, ఉపనిషత్తులు, యోగవశిష్టంలను దారాషికో పర్షియా భాషలోనికి అనువదించాడు.

హిందీ భాష జహంగీర్, షాజహాన్ కాలాల్లో పోషణను పొందడంతో పాటు బాగా అభివృద్ధి చెందింది. సుందర్, సేనాపతి, భూషణ్, బిహారి మొదలైనవారు ఈ కాలంనాటి ప్రసిద్ధ కవులు. వీరి రచనలు నేటికీ గొప్పవిగా పేరుపొందాయి. క్రీ.శ. 1634లో సుందర్ రచించిన 'సుందర్‌ష్రింగార్' కావ్యం గొప్పపేరును పొందడమే కాకుండా, ఆయనకు కీర్తిప్రతిష్టలను తెచ్చిపెట్టింది. సుందర్‌కు 'కవిరాయ-, 'మహాకవి' అనే బిరుదులనిచ్చి షాజహాన్ సత్కరించాడు. కృష్ణభక్త కవి అయిన సేనాపతి రచించిన 'కవితారత్నాకర్' పద్యప్రక్రియలో వెలుగును ప్రసరించింది. భూషన్ రచనల్లో వీరరసం ప్రధానమైన

అంశం. హిందువుల ఐక్యత, వీరత్వం, కవిత్వంలో కనిపిస్తుంది. 'శివరాజ్ భూషణ్' ఈయన రచనల్లో ప్రసిద్ధమైంది బీహారి రచనల్లో అందం ప్రధానమైన అంశం. ' సత్‌సై' బీహారీ రచనల్లో ప్రధానమైంది. ఇందులో ఏడువందల దోహాలు వున్నాయి.

**నిర్మాణాలు - శిల్పకళ :**

షాజహాన్ నిర్మాణాల్లో ప్రత్యేక శ్రద్ధ కనపరిచాడు. నైపుణ్యత, అందం ఈ కాలంనాటి నిర్మాణాల ప్రత్యేకత. ఈయన ఎర్ర ఇసుకరాయి స్థానంలో తెల్లని పాలరాయిని నిర్మాణాలకు ఉపయోగింపజేశాడు. గోడలను బంగారం, వెండి, వజ్రాలు, విలువైన రాళ్ళతో అలంకరింపజేయడంతో పాటు గోడలను అందమైన ప్రకృతి, వృక్షాలు, జంతువులు, పక్షుల చిత్రలేఖనలతో అలంకరింపజేసేవాడు. షాజహాన్ గొప్ప భవన నిర్మాత. ఆగ్రాలోని తాజ్‌మహల్, ఆగ్రా కోటలోని మోతీమసీద్, ఢిల్లీలోని ఎర్రకోట, అందులోని జామియా మసీద్, నెమలి సింహాసనంలు షాజహాన్ కాలంనాటి నిర్మాణాల్లో పేరెన్నికగన్నవి. వీటికి తోడు షాజహాన్‌బాద్ నగర (ఢిల్లీ) నిర్మాణానికి షాజహాన్ పునాదులు వేశాడు.

## 37.బి. పాఠ్య ప్రశ్నలు

1. ఖాళీలు పూరించండి.

ఎ) తుజుక్-ఇ-జహంగీరీ రచయిత ________________

బి) ________________ పాలనాకలంలో జుబ్ద్-ఉల్-త్వారీఖ్ రచింపబడినది.

సి) షాదుషానామా రచయిత

2. ధారాషుకే రచించిన రెండు తాత్విక రచనలను వివరించండి.

3. ఈ క్రింద కొన్ని నిర్మాణాల పేర్లు యివ్వబడినవి. వాటికి ఎదురుగా వాటిని నిర్మింపజేసిన వారి పేర్లు వ్రాయండి.

i) ఇత్‌మాద్-ఉద్-దౌలా సమాధి

ii) ఎర్రకోట

iii) జహంగీర్ సమాధి లాహోర్ సమీపంలో

iv) సికందరాలోని అక్బర్ సమాధి

v) షాజహాన్ నిర్మింపజేసిన భవనాలలోని ప్రత్యేక లక్షణాలు ఏమిటి?

**సారాంశం :**

భారతదేశ చరిత్రలో అక్బర్‌కు గొప్ప స్థానం వుంది. ఢిల్లీసుల్తానుల మాదిరి కాకుండా, దేశంలో అధిక సంఖ్యాకులైన ముస్లిమేతరుల సహాయాన్ని తీసుకున్నాడు. దేశంలో రాజకీయ, పరిపాలనా సమైక్యత కోసం దేశంలోని అనేక ప్రాంతాలను ఆక్రమించుకున్నాడు. సమర్థులను గుర్తించి విశాలమైన రాజ్యాన్ని ఏర్పాటు చేయడంతోపాటు శాంతిభద్రతలను రక్షించాడు. భూసారాన్ని పట్టి భూమిశిస్తును నిర్ణయించడంతోపాటు పటిష్టమైన పరిపాలనా యంత్రాంగాన్ని ఏర్పాటు చేశాడు. విదేశీ దండయాత్రలనుంచి దేశాన్ని కాపాడేందుకు, కాబూల్, కాందహార్‌లను ఆక్రమించి, దానిపైన అధికారిక సమర్థుడైన

రాజామాన్‌సింగ్‌ను నియమించాడు.

అధిక సంఖ్యలో వున్న ముస్లిమేతరుల సహాయాన్ని పొందేందుకు సమర్థతకు ప్రాధాన్యత నిచ్చాడు. ముస్లిమేతరులపై వసూలు చేస్తూ వుండిన జిజియాపన్ను, యాత్రా పన్నులను రద్దు చేయడంతోపాటు నూతన ఆలయాలను నిర్మించుకునేందుకు పాతవాటికి మరమ్మత్తులు చేసుకునేందుకు అనుమతిని యిచ్చాడు. సిక్కులకు ఉదారంగా నిధులను యిచ్చాడు. మతసంబంధమైన వేడుకలను స్వేచ్ఛగా జరుపుకోనిచ్చాడు. రాజపుత్రులతో స్నేహ సంబంధాలను ఏర్పాటు చేసుకోవడంతో పాటు వారిని కుల,మత భేదాలు లేకుండా సమర్థత ఆధారంగా ఉన్నత పదవులలో నియమించాడు. అక్బర్ అనుసరించిన ఉదార విధానం దేశంలో శాంతిభద్రతలు నెలకొనేందుకు దోహదపడింది.

అక్బర్ జననం, పెరిగిన వాతావరణం అతని మత సహనానికి తోడ్పడింది. హిందూ మరియు సూఫీ గురువుల బోధనలు అక్బర్‌లో ఉదారవాదం, మత సహనం వంటి భావాలు కలిగేందుకు కారణం కావడంతోపాటు ముస్లింల, ముస్లిమేతరుల మధ్యవున్న దూరాన్ని తగ్గించేందుకు దోహదం చేశాయి. ఈ పరిస్థితులు అక్బర్ జీవితం, రాజ్యం, పాలనపై ప్రభావాన్ని కనబరిచాయి.

క్రీ.శ. 1575లో అక్బర్ ఫతేపూర్ సిక్రీ నగరంలో 'ఇబాదత్ ఖానా'ను ఏర్పాటు చేశాడు. తొలిరోజుల్లో ముస్లిం మతపెద్దలు ఇందులో జరిగే చర్చల్లో పాల్గొనేవారు. చిన్న చిన్న విషయాల పట్ల వారితో ఏర్పడుతూ వున్న విభేదాలు వంటివి అక్బర్‌కు నిరాశను మిగిల్చాయి. దీనితో అన్ని మతాలవారికి ఇబాదత్ ఖానాలో ప్రవేశాన్ని కల్పించాడు. క్రమంగా అన్ని మతాలలోనూ మంచిలక్షణాలు వున్నాయని, మంచివారు వున్నారనే విషయాన్ని అక్బర్ గుర్తించాడు.

క్రీ.శ. 1579లో అక్బర్ ఒక విధాన ప్రకటన (Mahzarnama) విడుదల చేశాడు. క్రీ.శ. 1582లో తహిద్-ఇ-ఇలాహి' అనే నూతన మతమార్గంను స్థాపించాడు. అన్ని మతాలలోని గొప్ప విషయాలు ఈ మత మార్గం మతంలో వున్నాయి. కానీ పూస విధానం లేదు. ఈ మతాన్ని ప్రచారం చేయడంగానీ, బలవంతంగా ప్రజలను ఈ మతంలోనికి మార్చడంగానీ అక్బర్ చేయలేదు. అయితే సాంప్రదాయవాదుల నుంచి అక్బర్ విమర్శలను ఎదుర్కొనాల్సి వచ్చింది.

అక్బర్ కాలంలో సాంస్కృతికాభివృద్ధి జరిగింది. అక్బర్ కాలంలో ఉత్తరాలు, పద్యాలు, చారిత్రక రచనలు, అనువాదాల రూపంలో పర్షియన్ సాహిత్యం అభివృద్ధి చెందింది. అక్బర్ అనువాదాల కోసం ప్రత్యేక శాఖను ఏర్పాటు చేశాడు.

అక్బర్ కాలంలో శిల్పకళ అభివృద్ధి చెందింది. పర్షియన్ మరియు భారతీయ నిర్మాణ శైలి మేళవింపులో మొఘల్ నిర్మాణపద్ధతి అమల్లోకి వచ్చింది. అక్బర్ ఆధ్వర్యంలో చిత్రలేఖనం వికాసం చెందింది.

అక్బర్ వారసుల కాలంలో కూడా సాహిత్యం కళలు, వృద్ధి చెందాయి. గొప్ప భవన నిర్మాతగా ప్రసిద్ధి చెందిన షాజహాన్ కాలంలో గొప్ప గొప్ప నిర్మాణాలు చేయబడ్డాయి.

## అభ్యాసం

1. రాజ్యంను స్థిరపరచుకునేందుకు అక్బర్ తీసుకున్న చర్యలు ఏవి?
2. మహ్మదీయులు, మహ్మదీయేతరుల మధ్య సమానత్వం సాధించేందుకు అక్బర్ ఎలాంటి చర్యలు తీసుకున్నాడు?

3. అక్బర్‌లో ఉదారవాదం, మతసహనం కలిగేందుకు ఏ కారణాలు దోహదం చేశాయి?

4. 'దీన్–ఇ–ఇలాహి' అంటే ఏమిటి? దాని ప్రధాన లక్ష్యాలు ఏమిటి?

5. ఆధునిక కాలంలోని లౌకిక విధానాన్ని అక్బర్ కాలంలోని లౌకిక విధానంతో పోల్చి చూడండి.

6. ఎందువల్ల అక్బర్ కాలాన్ని 'సాహిత్యపునరుజ్జీవనం' అని అంటారు.?

7. చిత్రలేఖనానికి జహంగీర్ చేసిన సేవను వివరించండి.

8. షాజహాన్‌ను 'గొప్ప నిర్మాత' అని ఎందుకంటారు?

## పాఠ్య ప్రశ్నలకు సమాధానములు

**37.ఎ**

(i) రాజ్య పటిష్టతకు ముస్లిమేతరుల సహకారం అవసరమని గుర్తించడం.

(ii) చిన్నచూపు చూపబడిన మరియు న్యూనతాభావం

3. జిజియాపన్ను, యాత్రాపన్నులను రద్దు చేయడం

4. ఫతేపూర్ సిక్రి

5. (i) చర్చల ద్వారా సత్యాన్వేషణ

   (ii) అన్ని మతాలలోని గొప్ప విషయాలను గ్రహించడం

6. (i) అబ్దుర్ – తహీంఖాన్ ఖానా

   (ii) రస్‌ఖాన్

7. అక్బర్‌నామా మరియు ఐన్–ఇ–అక్బరీ

**37.బి**

1. (a) జహంగీర్

   (b) జహంగీర్

   (c) అబ్దుల్‌హమీద్

2. (i) మజన్–ఉల్–బల్వైన్

2. షకినాత్–ఉల్–ఆలుయా

3. (i) నూర్జాహాన్

2. (ii) షాజహాన్

3. (iii) షాజహాన్

4. (iv) జహంగీర్

4. అందం మరియు సున్నితత్వం

# 38

# ఔరంగజేబు పాలనలో మొఘల్ సామ్రాజ్యం

## 38.1 పరిచయం :

షాజహాన్ పాలనాకాలం వరకు మొఘల్ రాజ్యంలో జరిగిన అభివృద్ధిని గత అధ్యాయంలో తెలుసుకున్నారు. ఈ అధ్యాయంలో ఔరంగజేబు పాలనలో జరిగిన రాజకీయ సంఘటనలు, మొఘల్‌రాజ్య విస్తరణ, ప్రముఖంగా జరిగిన తిరుగుబాట్లను గురించి చదువుతారు.

మొఘల్ రాజ్యంలో చక్రవర్తికి వ్యతిరేకంగా కుటుంబీకులే తిరుగుబాట్లు చేయడం సాంప్రదాయంగా మారిన విషయం మీకు గుర్తుండి వుంటుంది. అక్బర్‌కు వ్యతిరేకంగా అతని కుమారుడైన జహంగీర్, జహంగీర్‌కు వ్యతిరేకంగా ఆయన కుమారులు ఖుస్రూ, ఖుర్రంలు చేసిన తిరుగుబాట్లు అందుకు ఉదాహరణలు. అదే విధంగా షాజహాన్‌కు కూడా ఇలాంటి పరిస్థితే ఎదురైంది. షాజహాన్ అనారోగ్య విషయం తెలియగానే, ఆయన నలుగురి కుమారులు ఎవరికి వారు సింహాసనం ఆక్రమించుకునేందుకు ప్రయత్నాలు చేశారు. చివరకు ఔరంగజేబు సింహాసనాన్ని వశం చేసుకున్నాడు.

ఔరంగజేబు పాలనలో రాజ్యం బాగా విస్తరించింది. దాదాపు ప్రస్తుత భారతదేశమంతా ఔరంగజేబు రాజ్యం విస్తరించింది. ఔరంగజేబు సైనికాధికారి అయిన మీర్ జుమ్లా కుచ్‌బీహార్, ఆహోమ్ రాజ్యాలపై విజయాలను సాధించగా మరో అధికారి షాయిస్థాఖాన్ పోర్చుగీసు, అరకనీస్ దోపిడి దొంగల స్థావరాలను స్వాధీనం చేసుకున్నాడు. ఈ విజయాలు విదేశీ వాణిజ్యాభివృద్ధికి దోహదం చేయడంతోపాటు తూర్పు బెంగాల్‌లో వ్యవసాయ విస్తరణకు దోహదం చేశాయి.

ఏమైనప్పటికీ, ఔరంగజేబు కాలంలో స్థానిక పాలనాధికారం కోసం స్వేచ్ఛకోసం తిరుగబాట్లు, ఉద్యమాలు జరిగాయి. జాట్‌లు, సతనమీలు, ఆఫ్ఘన్‌లు, శిక్కులు, మరాఠీలు ఔరంగజేబు విధానాలను, సైన్యాన్ని వ్యతిరేకించారు. ఈ తిరుగుబాట్లలో వివిధ వాటికి కారణాలు వున్నా, మొత్తం మీద మొఘల్‌రాజ్యంలో ఆశాంతికి కారణమయ్యాయి.

## 38.2 లక్ష్యాలు :

ఈ పాఠాన్ని చదివిన అనంతరం మీరు ఈ క్రింది విషయాలను అర్థం చేసుకోగలరు.

1. ధారాషుకో, షా షుజా, ఔరంగజేబు మరియు మురాద్‌లు సింహాసనం కోసం చేసిన కుట్రలు వీరి వ్యక్తిత్వ లక్షణాలు

2. వారసత్వ యుద్ధ వివరాలు

3. మీర్‌జుమ్లా, సాయిస్థఖాన్‌లు తూర్పు భారతదేశంలో సాధించిన విజయాలు

4. ఔరంగజేబు కాలంలో చెలరేగిన వివిధ తిరుగుబాట్లు

## 38.3 వారసత్వ యుద్ధం :

తన కుమారుల కోరిక బాగా తెలిసిన షాజహాన్ వారసత్వ యుద్ధం సింహాసనం కోసం జరుగుతుందని భయపడేవాడు. వారసత్వ యుద్ధం గురించి తెలుసుకునే ముందు షాజహాన్ నలుగురి కుమారులలోని విలక్షణమైన లక్షణాలను తెలుసుకోవాల్సిన అవసరం ఉంది. ఈ విషయాలు వారసత్వ యుద్ధం వెనుకవున్న విషయాలను, కారణాలు తెలుసుకునేందుకు దోహదం చేస్తాయి.

### దారాషుకో :

షాజహాన్ పెద్ద కుమారుడు. ఇతను విద్యావేత్త, సంస్కారం గలవాడు. పర్షియన్, తుర్కీ, సంస్కృతం, హిందీ భాషలలో పండితుడు. షాజహాన్ దారాను అత్యున్నతమైన అరవైవేల మనసబ్‌దారీకి అధికారిగా నియమించాడు. అన్ని ముఖ్య విషయాలలో షాజహాన్ ఇతనిని సంప్రదించేవాడు. చాలా ప్రాంతాలకు దారా గవర్నర్‌గా నియమింపబడినా ఎక్కువ సమయం రాజధానిలోనే గడిపేవాడు. మతసహనం గల దారా సూఫీ సిద్ధాంతాల పట్ల ఆసక్తి కనబరిచేవాడు.

**మసూచి**

అనే ఐరోపా యాత్రికుడు ధారా వ్యక్తిత్వాన్ని, సంస్కారాన్ని మెచ్చుకున్నాడు. ఈ మంచిలక్షణాలతో పాటు, దారాలో కొన్ని లోపాలు కూడా చోటుచేసుకున్నాయి. దారాపై షాజహాన్‌కు వున్న అభిమానం, ప్రేమలు దారాలో గర్వాన్ని పెంచాయి. దీనితో ఉన్నత వర్గంలో కొందరు దారాకు దూరమయ్యారు. దీనికి తోడు అతనిలో సైనిక లక్షణాలు, రాజకీయ చతురత, నాయకత్వ లక్షణాలు లోపించాయి. వీటన్నింటి వల్ల సమర్థుడు, చతురుడు అయిన ఔరంగజేబులను ఎదుర్కొనడంలో విఫలమయ్యాడు.

### షాషుజా :

షాషుజా ధైర్యశాలి. తెలివైనవాడు. స్వతహాగా దయార్ధ్రహృదయుడు. ఇతను ఆకర్షణీయమైన వ్యక్తిత్వం సంస్కారం గలవాడు. స్వమతాభిమానాన్ని మతద్వేషాన్ని వ్యతిరేకిస్తూ వుండడం వల్ల ఇతనిని సాంప్రదాయ సున్నీమతస్థులు వ్యతిరేకించేవారు. ఇతను సౌకర్యవంతమైన విలాసవంతమైన జీవితాన్ని గడిపేవాడు. కుట్రలు పన్నడంలోనూ, అమలు చేయడంలోనూ నేర్పరి. ఆస్థానంలోని వారిని తనవైపుకు త్రిప్పుకునేందుకు వారికి లంచాలను యిచ్చేవాడు. ఆస్థానంలో జరిగే విషయాలను షాషుజా ప్రతినిధులు ఎప్పటికప్పుడు ఆయనకు తెలిపేవారు. వారసత్వ యుద్ధంలో సమయానికి షాషుజా బెంగాల్ గవర్నర్‌గా వుండేవాడు.

### ఔరంగజేబు :

ఇతను షాజహాన్ మూడవ కుమారుడు. రాజకీయ చతురుడు. ముస్లిం అధికారులను ధారాకు వ్యతిరేకంగా తనవైపుకు త్రిప్పుకోవడంలో విజయం సాధించాడు. ఇతనిలోని మతవిశ్వాసాలు, సాంప్రదాయ ప్రియత్వం ముస్లిం

ఉలేమాలు ఇతనికి మద్ధతు పలికేలా చేశాయి. పరిస్థితులను అనుకూలంగా వుంచుకునేందుకు షాషుజా, మురాద్‌లతో సంప్రదింపులు జరుపుతూ వుండేవాడు. షాషుజాతో గల సంబంధాలను దృఢతరం చేసుకునేందుకు షాషుజా సంతానాన్ని తన సంతానానికిచ్చి వివాహాలు జరిపించాడు. దారాకు వ్యతిరేకంగా ముగ్గురు సోదరులు చేస్తున్న కుట్రను షాజహాన్ గ్రహించి చర్యలు తీసుకునే ప్రయత్నం చేశాడు. దారా వైపే మొగ్గు చూపుతున్న విషయం గ్రహించిన ఔరంగజేబు ఎప్పటికైనా సింహాసనం కోసం యుద్ధం తప్పదని తెలుసుకుని స్వంత సైన్యాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. ఇతని సోదరి రోషనా ఆస్థానంలో జరిగే విషయాలను ఎప్పటికప్పుడు తెలిపి ఇతనిని అప్రమత్తుడిని చేస్తూ వుండేది. ఔరంగజేబు సమర్ధవంతుడైన సైనికుడు. సైన్యాలను నడపడంలో నేర్పరి. అనేక యుద్ధాలకు నాయకత్వం వహించి అనుభవం సంపాదించాడు. చాలాకాలం దక్కన్‌లో గవర్నర్‌గా పనిచేయడం పరిపాలనానుభవం కలిగేలా చేసింది. యుద్ధంలో ధైర్యసాహసాలు గల ఔరంగజేబు పరిపాలనా విషయంలో సహనస్వభావాన్ని అలవరుచుకున్నాడు. ఔరంగజేబు ఎవరినీ నమ్మేవాడు కాదు. తన ఆశలు ఆశయాలను నెరవేర్చుకునే విషయంలో కఠినంగా వ్యవహరించేవాడు.

**మురాద్ :**

ఇతను షాజహాన్ నాలుగవ కుమారుడు. ఇతనిని విభిన్న గుణాలు గలవాడుగా కొందరు పండితులు పేర్కొన్నారు. ఇతనిలో ధైర్యసాహసాలు వున్నా సౌకర్యవంతమైన విలాసమైన జీవితాన్ని గడిపేందుకు యిష్టపడేవాడు. ఇతనిలో సున్నితమైన, సాహసవంతమైన లక్షణాలువున్నా సైనిక లక్షణాలు కొరవడ్డాయి. సహజంగా మొండిపట్టుగల ఇతను పరిపాలనకు సమర్థుడు కాదు. చిన్నపిల్లలవలె అందరినీ సులభంగా నమ్మే లక్షణం గలవాడు కావడం వల్లనే ఔరంగజేబు చేతిలో మోసపోయాడు. షాజహాన్ అనారోగ్యం పాలయ్యే సమయానికి మురాద్ గుజరాత్ గవర్నర్‌గా పనిచేస్తూ వుండేవాడు.

క్రీ.శ 1657 సెప్టెంబర్ నెలలో షాజహాన్ హఠాత్తుగా వ్యాధిగ్రస్తుడు అయ్యాడు. వ్యాధి తీవ్రతరమై కోలుకునే అవకాశాలు లేకుండా పోయాయి. ఇలాంటి స్థితిలో రాజ్యంలోని అధికారులు, సైనికుల సమక్షంలో షాజహాన్ తన వారసుడుగా దారాషుకోను ప్రకటించాడు. దారా తన తండ్రి జబ్బుపడిన విషయానికి ప్రాధాన్యం లేకుండా చేసేందుకు, మరుగున పడేందుకు ప్రయత్నం చేశాడు. కానీ సోదరుల ప్రతినిధులు ఆస్థానంలో వుండడం వల్ల అది సాధ్యం కాలేదు. రోషనారా ఆస్థానంలో జరిగే విషయాలను ఎప్పటికప్పుడు ఔరంగజేబుకు చేరవేస్తూ వుండేది. చక్రవర్తి మృతి చేందాడనే వదంతులు కూడా వ్యాపించాయి. ఇలాంటి వార్తలను వింటూనే షాషుజా, ఔరంగజేబు, మురాదులు వారసత్వ యుద్ధం కోసం ఏర్పాట్లు చేసుకోసాగారు. ఈ విషయంలో షాషుజా కొంతముందు వున్నాడు. పెద్ద సైన్యంతో ఢిల్లీ చేరుకున్నాడు. రాజాజస్వంత్ సింగ్, సులేమాన్‌షికో నాయకత్వంలోని మొఘల్ సేనలను బెనారస్ సమీపంలోని బహదూర్‌పూర్ వద్ద ఎదుర్కొని ఓడిపోయి షాషుజా బెంగాల్‌కు పారిపోయాడు.

ఈలోగా పరిస్థితులను ఔరంగజేబు కనిపెట్టివుండి క్రీ.శ. 1658 ఫిబ్రవరిలో పెద్ద సైన్యంతో ఔరంగజేబు నుంచి బయలుదేరాడు. మార్గమధ్యలో ధేబల్‌పూర్ వద్ద మురాద్ ఔరంగజేబుతో చేతులు కలిపాడు. ఇద్దరి సంయుక్త సైన్యాలను రాజాజస్వంత్ సింగ్ నాయకత్వంలోని మొఘల్ సైన్యాలు ధర్మాద్ వద్ద ఎదుర్కొన్నాయి. ఈ సందర్భంలో భీకరమైన యుద్ధం జరిగింది. మొఘల్ సైనికాధికారి ఖాసింఖాన్ యుద్ధంలో పాల్గొనక తటస్థంగా వుండిపోయాడు. ఔరంగజేబు సైన్యం ధాటికి భయాందోళనలకు గురైన మొఘల్ సైన్యం పారిపోయింది. చివరకు మొఘల్ సైన్యం ఓటమిపాలు కాగా, అనేకమంది సైనికులు మరణించారు. రాజాజస్వంత్ సింగ్ తీవ్రంగా గాయపడ్డాడు. ఈ విజయం

ఔరంగజేబు సైన్యంలోనూ, వర్గంలోనూ నైతిక బలాన్ని కలిగించింది.

ధర్మాత్‌లో ఓటమి తర్వాత దారా స్వయంగా ఔరంగజేబును ఎదుర్కొనేందుకు సన్నద్ధుడయ్యాడు. ఈ సమయానికి షాజహాన్ కూడా కోలుకొని యుద్ధానికి వెళ్ళేందుకు సిద్ధమయ్యాడు కానీ దారా అందుకు అంగీకరించలేదు. దారా సైన్యంతో ఔరంగజేబును ఎదుర్కొనేందుకు 'సమూఘర్'కు చేరాడు. ఔరంగజేబు, మురాద్‌ల సైన్యం సమూఘర్ చేరింది. దారా ప్రధానంగా రాజపుత్రులు, ఇతరులపైన ఆధారపడ్డాడు. ఖలీల్‌ఖాన్ వంటి సైనికాధికారులను ఔరంగజేబు తనవైపు తిప్పుకున్నాడు క్రీ.శ. 1658 మే 29న యుద్ధం ప్రారంభమైంది. భీకరమైన యుద్ధంలో దారా ఓడిపోయి యుద్ధ భూమినుంచి పారిపోయాడు.

అనంతరం ఔరంగజేబు 1658 జూన్ 1న ఆగ్రా చేరి కోటను స్వాధీనం చేసుకున్నాడు. షాజహాన్‌ను బంధించాడు. క్రీ.శ. 1658 జూన్ 10న జహనారా నలుగురి సోదరుల మధ్య రాజ్యపంపకం చేసే ప్రతిపాదన చేసింది కానీ ఔరంగజేబు దానిని తిరస్కరించాడు.

యుద్ధంలో ఓడిపోయి పారిపోయిన దారాషుకో ఆగ్రా చేరాడు. ఆక్కడ నుంచి లాహోర్‌కు చేరుకున్నాడు. అతనిని బంధించేందుకు ఔరంగజేబు బహదూర్‌ఖాన్‌ను పంపాడు. ఖలీల్‌ఖాన్‌ను పంజాబ్ గవర్నర్‌గా నియమించి బహదూర్ ఖాన్‌కు సహకరించవలసిందిగా ఆదేశించాడు. వివిధ ప్రాంతాలలో తిరుగుతూ దారా చివరకు దాదర్‌లోని తన మిత్రుడైన మాలిక్‌జీవన్ వద్దకు చేరాడు. నమ్మకద్రోహంతో అతను దారాను, అతని కుటుంబాన్ని బంధించి బహదూర్‌ఖాన్‌కు అప్పగించాడు. వారిని ఢిల్లీకి రప్పించి ఖ్వాజాపూర్‌లో బంధీలుగా వుంచారు. ఈలోగా ఔరంగజేబు మురాద్‌ను కూడా బంధించి గ్వాలియర్‌లోని జైలులో మూడు సంవత్సరాల పాటు బంధించి వుంచాడు. అనంతరం అతనిని చంపించి పూడ్చిపెట్టాడు.

సమూర్‌ఘర్ యుద్ధం ఔరంగజేబుకు అనుకూలంగా ముగిసి, సింహాసనం ఆక్రమించుకునేందుకు దోహదం చేసింది. ఇది కేవలం వారసత్వ యుద్ధం మాత్రమే కాదు. మొఘల్ రాజ్యంలో అయోమయ పరిస్థితులను కలిగించింది. ధన ప్రాణ నష్టానికి కారణమైంది. షాజహాన్ తన చివరి ఎనిమిది సంవత్సరాల జీవనాన్ని జైలులోనే గడిపాడు.

## 38.ఎ. పాఠ్యాంశ ప్రశ్నలు

1. వారసత్వ యుద్ధంలో పాల్గొన్న ప్రధానమైన హక్కుదారులెవ్వరు?
2. షాజహాన్ తన వారసుడుగా ఎవరిని నియమించాడు.?
3. వివిధ రాష్ట్రాలకు గవర్నర్‌గా నియమింపబడినా దారాషుకో రాజధానిలోనే ఎందుకు వుండేవాడు?
4. సమూరాఘర్ యుద్ధంలో దారా ఓటమికి కారణమేమిటి?
5. సమూఘర్ యుద్ధం యొక్క రాజకీయ ప్రభావం ఏమిటి?

### బెంగాల్, అస్సాలతో ఔరంగజేబు సంబంధాలు :

బెంగాల్ షాషుజా స్వాధీనంలో వున్నట్లు మీరిదివరకే చదివారు. అతను పరిపాలనపట్ల చూపించిన ఆనాసక్తి పరిపాలనను బలహీనపరిచింది. వారసత్వ యుద్ధం వల్ల అది మరింత దెబ్బ తినింది. వారసత్వ యుద్ధం వల్ల ఏర్పడిన

అయోమయ పరిస్థితులను ఆసరాగా చేసుకుని అస్సాంకు చెందిన అహోమ్‌జాతి వారు కామరూపరాజ్య రాజధాని గౌహతి, పరిసర ప్రాంతాలను స్వాధీనం చేసుకున్నారు. కూచ్ బీహార్ పాలకుడైన ప్రేమ్‌నరైన్ కొంత మొఘల్ రాజ్యాన్ని స్వాధీనం చేసుకున్నాడు. కనుక మొఘల్ పాలకులు ఈ ప్రాంతాలపైన దృష్టి సారించారు. కాగా, ఆర్థికంగా, ఉన్నతమైన ప్రాంతం కనుక మొఘలులు దృష్టి పెట్టినట్లుగా కొందరు పండితులు అభిప్రాయపడ్డారు. ఈ ప్రాంతం ఏనుగులు, జింకలు, ఔషధమొక్కలకు ప్రసిద్ధి చెందినది. ఈ ప్రాంత పాలకులు సంపదను కలిగి వుండేవారు. చైనాతో వ్యాపారం ఈ ప్రాంతం గుండానే సాగుతూ ఉండేది. వీటన్నింటికీ తోడు ఔరంగజేబు సామ్రాజ్యవాది కావడం మరో కారణం అయింది.

క్రీ.శ. 1660వ సంవత్సరంలో మీర్‌జుమ్లాను బెంగాల్ గవర్నర్‌గా నియమించాడు. జుమ్లా ముందుగా కూచ్ బీహార్‌పై దండెత్తాడు. దాని పాలకుడిని ఓడించి దానిని మొఘల్ రాజ్యంలో విలీనం చేశాడు. అనంతరం అహోమ్ రాజ్యంపై దండెత్తి రాజధాని గార్గాన్‌ను స్వాధీనం చేసుకున్నాడు. ఈ విషయాల వల్ల రాజ్యం విస్తరించడమే కాకుండా మొఘలుల బలగౌరవాలు వృద్ధి చెందాయి. మీర్‌జుమ్లా అహోం రాజధాని స్వాధీనమైతే చేసుకున్నాడు కానీ...వారు గెరిల్లా యుద్ధ పద్ధతులలతో మొఘలులకు యిబ్బందులు కలిగించేవారు. వర్షాలు, వరదల వల్ల ఢాకాతో సంబంధాలకు ఆటంకం కలిగింది. ఆహార కొరత కూడా ఏర్పడింది. ఇలాంటి స్థితిలో అహోమ్‌లు తిరిగి వారి ప్రాంతాలను ఆక్రమించుకున్నారు. ఆగస్ట్ నెలలో వ్యాపించిన అంటువ్యాధి వల్ల మధురాపూర్ ప్రాంతంలో తీవ్ర జన నష్టం జరిగింది. పరిస్థితులు మెరుగుపడ్డాక క్రీ.శ. 1663లో బలవంతంగా సంధికి అహోమ్‌లను అంగీకరింపజేశారు. దీని ప్రకారం అహోమ్‌రాజు తన కుమార్తెలు మొఘల్ అంతఃపురానికి పంపించేట్లు షరతు విధించడంతోపాటు, భారీ యుద్ధ నష్టపరిహారం విధించారు. ప్రతి సంవత్సరం కప్పం చెల్లించేందుకు ఒప్పందం కుదిర్చారు. అయితే ఈ ప్రయోజనాలను స్వల్పకాలమే పొందగలిగారు. మీర్‌జుమ్లా హఠాత్తుగా మృతి చెందడంతో ఆటంకం ఏర్పడింది. క్రీ.శ. 1667లో మీర్‌జుమ్లా మరణించడంతో అహోమ్‌లు తిరిగి వారి ప్రాంతాలను పొందడంతోపాటు గౌహతిని కూడా మొఘల్‌ల నుంచి ఆక్రమించుకున్నారు. కూచ్‌బీహార్ నుంచి కూడా మొఘల్‌లను తరిమివేశారు. ఇవి మొఘలులు, అహోమ్‌ల మధ్య చాలాకాలం యుద్ధం జరగడానికి కారణమయ్యాయి. చాలాకాలం మొఘల్ సేనలకు నాయకత్వం వహించిన అంబర్‌కు చెందిన రాజారామ్‌సింగ్ గౌహతీ ఆక్రమణకు చేసిన ప్రయత్నాలు విఫలమయ్యాయి.

ఔరంగజేబు బెంగాల్‌కు గవర్నర్‌గా షాయిస్థఖాన్‌ను నియమించాడు. ఖాన్ ముందుగా కుచ్ బీహార్ పాలకులతో ఒప్పందం కుదుర్చుకున్నాడు. అనంతరం దక్షిణ బెంగాల్‌లోని అర్కనీస్, పోర్చుగీసు వారిపై దృష్టి సారించాడు. పోర్చుగీసు వారిని ఓడించి తనవైపుకు తిప్పుకుని కొంత సొమ్మును పొందాడు. చిట్టగాంగ్ వద్దగల అర్కనీస్ వారి నౌకలను క్రీ.శ.1666లో ముట్టడించాడు. నౌకలను నాశనం చేయడం శాంతి భద్రతల రక్షణకు దోహదం చేసింది. వీటి ఫలితంగా వ్యవసాయ ఉత్పత్తులు పెరగడంతో పాటూ వ్యాపారం కోసం సముద్రం తెరవబడింది.

## 38.బి. పాఠ్య ప్రశ్నలు

1. ఔరంగజేబు కూచ్‌బీహార్ మీద దృష్టి సారించడానికి కారణం ఏమిటి?
2. అస్సాం గవర్నర్‌గా మీర్‌జుమ్లా సాధించిన విజయాలు ఏవి?
3. మొఘలులు ఎందువల్ల అస్సాం ప్రాంతంలో అధికారాన్ని సుస్థిరం చేసుకోలేకపోయారు?

4. షాయిస్థఖాన్ దక్షిణ బెంగాల్‌లో ఎదుర్కొన్న సమస్యలు ఏవి?

5. షాయిస్థఖాన్ దక్షిణ బెంగాల్‌లో తీసుకున్న చర్యల ఫలితాలు ఏమిటి?

## 38.5 జాట్, సతనామి, బుందేలుల తిరుగుబాట్లు :

సింహాసనాన్ని అధిష్టిస్తూనే ఔరంగజేబు అనేక రాజకీయ సమస్యల ఎదుర్కొనాల్సి వచ్చింది. దక్కన్‌లో మరాఠీలు, ఉత్తర భారతదేశంలో జాట్‌లు, రాజపుత్రులు, వాయువ్యంలో శిక్కుల నుంచి ఔరంగజేబు సమస్యలను ఎదుర్కొన్నాడు. వీటిలో కొన్ని కొత్త సమస్యలు కాకపోయినా నూతన రూపాన్ని సంతరించుకున్నాయి. రాజపుత్రులది వారసత్వానికి సంబంధించిన సమస్యకాగా, మరాఠీలది స్థానిక స్వాతంత్ర్యానికి సంబంధించినది. జాట్‌ల, సత్‌నామిలది రైతుల తిరుగుబాట్లు కాగా, శిక్కుల తిరుగుబాట్లలో మతం ప్రధానమైన పాత్ర పోషించినది. జాట్‌ల, శిక్కుల ఉద్యమాలు ప్రాంతీయ స్వతంత్ర్య రాజ్యాలు ఏర్పడేందుకు దోహదం చేశాయి. ఆర్థిక, సాంఘిక కారణాలతో పాటూ ప్రాంతీయ స్వాతంత్ర్యానికి సంబంధించిన నమ్మకాలు తిరుగుబాట్లకు ప్రధాన కారణాలు అయ్యాయి. మరాఠీ, శిక్కు ఉద్యమాలను గురించి మీరు ప్రత్యేక పాఠంలో చదువుతారు. ఇక్కడ జాట్‌ల,సత్‌నామీల, బుందేలుల తిరుగుబాట్లను గురించి తెలుసుకుంటారు.

**జాట్‌ల తిరుగుబాట్లు :**

మొదటిసారిగా ఔరంగజేబు కాలంలో జాట్‌లకు మొఘలులకు విభేదాలు ప్రారంభమయ్యాయి. పంజాబు, ఉత్తర రాజపుత్రస్థానం, ఉత్తరప్రదేశ్‌లోని ఉత్తర ప్రాంతంలోనూ, మధ్యప్రదేశ్‌లలో జాట్‌లకు గట్టిపట్టు వుంది. జాట్‌లు కష్టజీవులు. వ్యవసాయం వీరి ప్రధానవృత్తి. వీరు శాంతి కాముకులే కానీ ఔరంగజేబు కాలంలో పన్ను వసూలులో వారి పట్ల మొఘలులు అనుసరించిన విధానం వారు వ్యతిరేకులుగా మారేందుకు కారణం అయింది. భూమిశిస్తు విధానంలో ఔరంగజేబు చేసిన మార్పులు వారిలో అసంతృప్తిని కలిగించాయి.

క్రీ.శ. 1669వ సంవత్సరంలో తిలపాత్ జమీందార్ గోకుల్ నాయకత్వంలో మధుర ప్రాంతంలో తొలిసారిగా, జాట్‌లు తిరుగుబాటు చేశారు. మొఘల్ షాజ్‌దార్ ఈ తిరుగుబాటును అణచివేసేందుకు ప్రయత్నించి విఫలుడై చివరకు తన ప్రాణాలను కోల్పోయారు. ఈ సంఘటన జాట్‌ల విజృంభణను ప్రోత్సహించింది. దీనిని సహించని ఔరంగజేబు వీరిని అదుపు చేసేందుకు క్రీ.శ. 1670లో హసన్ ఆలీఖాన్‌ను నియమించాడు. తిల్‌పత్ సమీపంలో జరిగిన యుద్ధంలో అనేకమంది సైనికులు, కుటుంబ సభ్యులతో పాటూ గోకుల్ నిర్భంధింపబడి, తర్వాత చంపబడ్డాడు. అనంతరం మొఘలులు శాంతి భద్రతలను కాపాడారు, కానీ ఆ ప్రయత్నం సఫలం కాలేదు. కొంతకాలానికి జాట్‌లు రాజారామ్ నాయకత్వంలో ఏకమై గెరిల్లా యుద్ధ పద్ధతులను అనుసరించారు. వీటిని అణచడంలో ఆగ్రా గవర్నర్ కాఫీఖాన్ చేసిన ప్రయత్నాలు విఫలమయ్యాయి. అంతర్గత కలహాలు రాజారామ్ మృతికి కారణమయ్యాయి.

జాట్‌ల విజృంభణను అరికట్టేందుకు ఔరంగజేబు అంబర్ పాలకుడైన బిషాన్‌సింగ్‌తో సంప్రదింపులు జరిపారు. బిషాన్‌సింగ్ మధుర ఫౌజ్‌దార్‌గా నియమింపబడ్డాడు. ఈ సమయంలో రాజారామ్ బంధువైన 'చురామన్' జాట్‌ల నాయకుడు. మొఘలుల అనేక అటంకాలను ఎదుర్కొని చివరకు యుద్ధంలో మధురను ఆక్రమించుకున్నారు. యుద్ధం అపారమైన ప్రాణ నష్టాన్ని కలిగించింది. క్రీ.శ. 1691లో హఠాత్తుగా బిషాన్‌సింగ్ దాడిచేసి సాగర్‌ను స్వాధీనం

చేసుకోవడంతో చురామన్ అజ్ఞాతంలోకి వెళ్ళాడు. గోకుల్, రాజారామ్‌ల కంటే ధైర్యసాహసాలు, చతురత, ముందుచూపు గల చురామన్ ఔరంగజేబు వ్యతిరేకులందరినీ ఏకంచేసి సైన్యాన్ని తయారుచేసుకున్నాడు. రాజ్యాన్ని కొల్లగొట్టాడు. మొఘల్ మంత్రులు, ఉద్యోగులను కూడా అతను వదిలిపెట్టలేదు. చూరమన్ విజృంభణ ఔరంగజేబు వారుసుల కాలంలో అధికంగా జరిగింది. ఏమైనప్పటికీ జాట్‌ల విజృంభణను ఔరంగజేబు పూర్తిగా అణచివేయలేకపోవడం వల్ల వారు ఔరంగజేబు వారసులకు అనేక కష్టాలను కలిగించారు.

**సత్‌నామీల తిరుగుబాటు :**

క్రీ.శ. 1672వ సంవత్సరంలో నార్నాల్‌లో సత్నామీలు ఔరంగజేబుకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు. శాంతికాముకులైన సత్నామీలు సాధువుల మాదిరి దుస్తులను ధరించే మతవిశ్వాసం కలవారు. వీరిలో ఎక్కువమంది వ్యవసాయదారులు మరియు చేతివృత్తులవారు. కొందరు వ్యాపారం కూడా చేసేవారు. న్యాయబద్ధమైన జీవనం సాగించేవారు. స్థానిక మొఘల్ అధికారితో జరిగిన ఘర్షణలో ఒక సత్నామి ప్రాణాన్ని కోల్పోవడం వారిని తిరుగుబాటుదార్లగా మార్చింది. వారు స్థానిక పాలకుడిని చంపివేశారు. పరిస్థితి అదుపుతప్పింది. షిక్‌దార్ కూడా ఏమీ చేయలేకపోయాడు. సత్నామీలో నార్నాల్ షాజ్‌దార్‌ను అంతమొందించి దానిని ఆక్రమించుకున్నారు. ఢిల్లీ సమీపంలో వుండడం వల్ల తిరుగుబాటును అణచివేసేందుకు ఔరంగజేబు ప్రత్యేక దృష్టి పెట్టాడు. యుద్ధంలో సత్నామీలు ఓడిపోయారు. చాలా మంది సత్నామీలు చంపబడ్డారు. మిగిలిన వారిని అణచివేయడంతో సత్నామీల తిరుగుబాటు అంతమైంది.

**బుందేలుల తిరుగుబాటు :**

మధ్యప్రదేశ్ తూర్పు ప్రాంతంలోని అడవులు, కొండలు పర్వతాలతో  కూడుకున్న ప్రాంతంలో నివశించే ప్రజలు బుందేలులు, వారు క్రీ.శ. 1602వ సంవత్సరంలో అక్బర్‌కు వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు. దీనిని బట్టి మొఘలులకు వీరికి ఎప్పుడూ సత్సంబంధాలు లేవనే చెప్పవచ్చు. ఔరంగజేబు కాలంలో చంపత్‌రాయ్ నాయకత్వంలో బుందేలులు అతనికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు. కానీ రాయ్‌ని క్రూరంగా మొఘలులు చంపివేశారు. దీనిలో ఆయన కుమారుడు చత్రసాల్ మరియు అంగద్‌లు రాజాజైసింగ్ సైన్యంలో చేరారు. క్రీ.శ.1665లో శివాజీతో చేసిన యుద్ధంలో చత్రసాల్ విశేష ప్రతిభ కనబరిచాడు. దేవఘర్ ముట్టడిలో దిలార్‌కాన్‌తో పాటు పాల్గొన్నాడు.

చత్రసాల్  దృఢకాంక్షగల వ్యక్తి. తన ప్రతిభకు మొఘల్ సైన్యంతో గుర్తింపు లేకపోవడంతో సైన్యంనుంచి బయటకు వచ్చాడు. శివాజీలాగా స్వతంత్ర్య రాజ్యం ఏర్పాటు చేయాలనుకున్నాడు. బుందేల్ ఖండ్‌నుంచి మొఘలులను వ్యతిరేకించమని సలహాయిచ్చిన శివాజీకి సహకరించేందుకు చత్రసాల్ ప్రయత్నించాడు. హిందువుల ఆలయాలను నాశనం చేయమని ఔరంగజేబు ఆదేశించిన సమయంలో బుందేల్‌ఖండ్, మాళ్వా ప్రజలు తిరుగుబాట్లు చేసి చత్రసాల్‌ను నాయకత్వం వహించి రక్షించవలసిందిగా ఆహ్వానించారు. ఓర్చకు చెందిన సుజన్‌సింగ్ మొఘలులకు వ్యతిరేకంగా రహస్య సహకారం చేసేందుకు సిద్ధమయ్యాడు. క్రీ.శ. 1697 నాటికి చత్రసాల్ బలాన్ని ఏర్పరచుకుని అనేక ప్రాంతాలను స్వాధీనం చేసుకుని తూర్పు మాళ్వలో స్వతంత్ర్య రాజ్యానికి పునాదులు వేశాడు. ఔరంగజేబు మరణానంతరం కూడా మొఘలులకు చత్రసాల్ ఇబ్బందిగా తయారయ్యాడు. క్రీ.శ. 1771వ సంవత్సరానికి, అతని మరణం కంటే ముందు అతను బుందేల్‌ఖండ్ నుంచి మొగలులను పూర్తిగా తరిమివేశాడు.

ఔరంగజేబు మతవిధానం ఈ తిరుగుబాటుకు కారణమైనా, జాగ్రత్తగా పరిశీలిస్తే చత్రసాల్‌కు గల స్వతంత్ర్య రాజ్యస్థాపనా కోరిక కూడా అందుకు దోహదం చేసిందని అర్థమవుతుంది. పరిస్థితులు, శివాజీ స్వతంత్ర్యరాజ్యం చత్రసాల్‌ను ప్రోత్సహించి చత్రసాల్ ఆశలు విజయం సాధించేందుకు దోహదపడ్డాయి.

## 38.సి. పాఠ్య ప్రశ్నలు

1. మొఘల్ సుల్తాన్ జాట్‌ల మధ్య విభేదాలు కలగడానికి గల వాస్తవ కారణాలు ఏవి?
2. సత్నామీలు ఎవరు? వారి కార్యస్థానం ఎక్కడ వుంది?
3. ఏ బుందేలుల నాయకుడు స్వతంత్ర్య రాజ్యానికి పునాదులను వేశాడు?

**సారాంశం :**

వారసత్వ యుద్ధం షాజహాన్ నలుగురు కుమారులైన ధారా, షాషుజా, ఔరంగజేబు, మురాద్‌ల మధ్య జరిగింది. ఈ యుద్ధంలో ధారా ముగ్గురు సోదరులను ఎదుర్కొన్నాడు. దారా షాజహాన్ పెద్ద కుమారుడుప దారా సంస్కారవంతుడు. ఉదారభావాలు గలవాడు. అయితే తనపైన తండ్రికి గల ప్రేమ అతనిలో గర్వాన్ని పెంచింది. యుద్ధాలను నడపడంలోనూ, చతురతలోను శ్రద్ధ కనబరచలేదు. షాజహాన్ రెండవ కుమారుడైన షాషుజా ధైర్యశాలే గాని సోమరిపోతు. ఇతను కుట్రలు పన్నడం, అమలు చేయడంలో నేర్పరి. లంచాలనిచ్చి అధికారులను తనవైపు తిప్పుకున్నాడు. షాజహాన్ మూడవ కుమారుడైన ఔరంగజేబు నాయకత్వ లక్షణాలు గలవాడు. పరిపాలనా దక్షుడు. యోధుడు. రాజకీయ చతురుడు. ఉలేమాలు, అధికారుల మద్ధతులను పొందాడు. షాజహాన్ నాలుగవ కుమారుడైన మురాద్ ధైర్యశాలే కానీ విలాసజీవి. సులభంగా ప్రభావితుడు అయ్యే లక్షణం వున్న ఇతనికి అనేక సమస్యలు ఎదురయ్యాయి.

వారసత్వ యుద్ధం ప్రధానంగా బహదూర్‌పూర్, ధర్మాట్, సమూర్ ఘర్‌లలో జరిగింది. వీటిల్లో సమూర్‌ఘర్ యుద్ధం నిర్ణయాత్మకమైంది. దీనిలో ఔరంగజేబు విజేత. దారా యుద్ధ భూమినుంచి పారిపోయాడు. కానీ తర్వాత బంధింపబడి శిక్షకు గురయ్యాడు. షాజహాన్ ఆగ్రాకోటలో బంధింపబడ్డాడు. ఔరంగజేబు ఆగ్రా, ఢిల్లీలను స్వాధీనం చేసుకున్నాడు.

ఔరంగజేబు పాలనలో తూర్పుప్రాంతంలో మొఘల్ కార్యకలాపాలు అధికమయ్యాయి. మీర్‌జుమ్లా కూచ్ బీహార్‌ను మొఘల్ రాజ్యంలో విలీనం చేశాడు. అహోమ్ రాజధాని గర్‌గాన్‌ను కూడా ఆక్రమించాడు. అయితే దాని మొఘలులు నిలుపుకోలేకపోయారు. వర్షాలు, వరదల వల్ల మొఘల్ సైన్యం నష్టానికి గురైంది. ఏమైనప్పటికీ అహోమ్‌లతో సంధి చేసుకోవడంలో మీర్‌జుమ్లా విజయం సాధించాడు. తర్వాత కొంతకాలానికే మీర్‌జుమ్లా మృతి చెందాడు. తర్వాత గవర్నర్ అయిన షాయిస్థఖాన్ దక్షిణబెంగాల్‌లోని పోర్చుగీసు, అర్కనీస్ వారిని అణచివేశాడు.

ఔరంగజేబు పాలనలో ప్రముఖ తిరుగుబాట్లు జరిగాయి. భూమిశిస్తు విధానం వల్ల అసంతృప్తులైన జాట్‌లు ఔరంగజేబుకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు. గోకుల్ నాయకత్వంలో జరిగిన తిరుగుబాటును మొఘలులు అణచివేశారు. తిరిగి వారు రాజారామ్ నాయకత్వంలో తిరుగుబాటు చేశారు. దీనిని అణచివేసేందుకు ఔరంగజేబు బిషాన్‌సింగ్‌తో సంప్రదింపులు జరిపారు. చురామన్ నాయకత్వంలో తిరుగుబాటు విస్తృతమైంది. వారు ఔరంగజేబు

వారసులకు అనేక సమస్యలను కలిగించారు. ఔరంగజేబు సత్నామీల తిరుగుబాటును ఎదుర్కొన్నాడు. శాంతికాముకులైన సత్నామీలు స్థానిక మొఘల్ పాలకుడితో ఏర్పడిన విభేదాల వల్ల తిరుగుబాటుదార్లుగా మారారు. వారి తిరుగుబాటు అణచివేయబడింది. బుందేలులు చంపత్‌రాయ్, చత్రసాల్ నాయకత్వంలో తిరుగుబాట్లు చేసి ఔరంగజేబుకు సమస్యలను సృష్టించారు.

## అభ్యాసం :

1. షాజహాన్ కుమారుల మధ్య వారసత్వ యుద్ధం జరగడానికి దోహదం చేసిన పరిస్థితులను చర్చించండి?
2. వాయువ్య ప్రాంతంలో మొఘల్ రాజ్య విస్తణకు మీర్‌జుమ్లా చేసిన కృషి ఏమిటి?
3. ఔరంగజేబు కాలంలో జరిగిన ప్రధాన తిరుగుబాట్లు ఏవి? జాట్‌ల తిరుగుబాటును వివరించండి.

## పాఠ్య ప్రశ్నలకు సమాధానంలు

### 38.ఎ.

1. దారా, షాషుజా, ఔరంగజేబు, మురాద్. అయినా ప్రధాన పోటీదారా మరియు ఔరంగజేబుల మధ్యనే
2. దారాషుకో
3. షాజహాన్ దారాను గురించి ఎక్కువ శ్రద్ధ కనబరిచేవాడు. దారా తనతో సన్నిహితంగా వుండాలని భావించేవాడు. సలహాలను తీసుకునేవాడు.
4. 1) యుద్ధరంగంలో అనుభవం లేకపోవడం

   2) ఔరంగజేబు ధైర్యసాహసాలు, సైన్యాన్ని గురించి తక్కువగా అంచనావేయడం
5. ఔరంగజేబు యుద్ధ విజేతగా నిలిచి చక్రవర్తి అయ్యాడు.

### 38.బి.

1) కూచ్‌బీహార్ పాలకుడు మొఘల్ ప్రాంతాన్ని ఆక్రమించాడు.

2) సారవంతమైన ప్రాంతం కావడం

2. మీర్‌జుమ్లా కూచ్ బీహార్ మరియు అహోమ్ రాజ్యాలను ఆక్రమించడంతో మొఘల్ రాజ్యం విస్తరించింది. బలగౌరవాలు వృద్ధి చెందాయి.

3. 1) అధిక వర్షాలు మొఘలులకు తీవ్రనష్టం కలిగించాయి.

2) అహోంలు గెరిల్లా పద్ధతుల ద్వారా మొఘల్‌లకు సమస్యలు సృష్టించారు.

4. అర్కనీస్, పోర్చుగీసు వారు వ్యాపారులను దోచుకునేవారు.

5. దక్షిణ బెంగాల్‌లో శాంతిభద్రతలు ఏర్పరచబడి వ్యవసాయాభివృద్ధి, నౌకావాణిజ్యం అభివృద్ధి చెందాయి.

**38. సి.**

1. భూమిశిస్తు విధానంలో మార్పులు.

2. శాంతికాముకులు. ఎక్కువమంది వ్యవసాయదారులు

3. చత్రసాల్

# 39

# ఔరంగజేబు పాలనలో మొఘల్ సామ్రాజ్యం (2)

## 39.1 పరిచయం :

షాజహాన్ నలుగురు కుమారులు దారా, షాషుజా, ఔరంగజేబు, మురాద్‌లు సింహాసనం కోసం బహదూర్‌పూర్, ధర్మట్, సమర్‌ఘర్ యుద్ధాలు చేసినట్లు, ఈ వారసత్వ యుద్ధంలో ఔరంగజేబు విజయుడై సింహాసనాన్ని అధిష్టించినట్లు గత అధ్యాయంలో మీరు తెలుసుకున్నారు. అట్లే ఔరంగజేబు కాలంలో జరిగిన వివిధ తిరుగుబాట్లను గురించి చదివారు. వీటికి ఆర్థిక, సాంఘిక పరిస్థితులే కారణం.

ఈ పాఠంలో వారసత్వ యుద్ధంలో ఔరంగజేబు గెలుపొందడానికి కారణాలు, వివిధ తిరుగుబాట్ల ప్రాముఖ్యతను మీరు చదువుతారు.

## 39.2 లక్ష్యాలు :

ఈ పాఠం చదివిన తర్వాత మీరు కింది విషయాలను అర్థం చేసుకోగలరు.

1. వారసత్వ యుద్ధంలో ఔరంగజేబు ఏవిధంగా విజయం సాధించాడన్న విషయం
2. జాట్‌లు, సత్నామీలు మరియు బుందేలుల తిరుగుబాట్ల ప్రాముఖ్యతను అంచనా వేయటం

## 39.3 వారసత్వ యుద్ధంలో ఔరంగజేబు గెలుపొందడానికి కారణాలు :

షాజహాన్ నలుగురు కుమారులు సింహాసనంను ఆశించిన విషయం గుర్తు వుంది కదా! అయినా ప్రధానమైన పోటీ దారా మరియు ఔరంగజేబుల మధ్యనే సాగింది. తెలివితేటలు, దయ, జాలి వంటి మంచిగుణాలు దారాలో వున్నా యుద్ధ నైపుణ్యం, రాజకీయ చతురతలు లోపించాయి. తండ్రి తనపట్ల ప్రదర్శించే ప్రేమాభిమానాలు దారాను గర్విష్టిగా తయారుచేశాయి. దారానే స్వయంగా నిర్ణయాలు తీసుకునేవాడు. ఉన్నతాధికారులను సంప్రదించేవాడు కాదు. అందువల్ల అనుభవం గల అధికారులు దూరం కావడంతోపాటు వారి అనుభవమూ దారాకు ఉపయోగపడకుండా పోయింది. ఇదిలా వుండగా ఔరంగజేబు అనేకమంది అధికారులు, సైన్యాధికారులు మద్దతు సంపాదించాడు. ఈ కారణం వల్ల ఔరంగజేబు చేతిలో దారా ఓటమిపాలు అయ్యాడు.

ఔరంగజేబు మతవిధానం వల్లే విజయం సాధించినట్లు కొందరు పండితులు ఆరోపించారు. ఔరంగజేబు సాంప్రదాయ మహ్మదీయుడు. నిరాడంబర పవిత్ర జీవితం గడిపేవాడు. మతావేశం గల ఔరంగజేబు దారా ఉదారవాదాన్ని అంగీకరించలేదు. అంతేకాకుండా ముస్లిం, అమీరులు, ఉన్నత ఉద్యోగులు ఈ విషయంలో దారాను వ్యతిరేకించేట్లు చేశాడు. సాంప్రదాయ వాదులైన మహ్మదీయ అమీర్లు, ఉలేమాలు, ఉన్నతోద్యోగులు ప్రజలు ఔరంగజేబుకు మద్ధతు పలికారు. దారా ఓటమి తమ మతానికి అనవసరమనీ, ఔరంగజేబు వల్ల తమ మతరక్షణ జరుగుతుందని వారు భావించారు. దీనిని ఔరంగజేబు రాజకీయ ప్రయోజనకంగా మార్చుకున్నారు. అంతే తప్ప వారసత్వయుద్ధాన్ని మతఛాందసులకు, ఉదరవాదులకు జరిగిన యుద్ధంగా పేర్కొనలేము. ఇద్దరి సైన్యాలలోనూ హిందువులు, మహ్మదీయులు వున్నారనే విషయాన్ని గ్రహించాలి.

ఔరంగజేబు వివిధ ప్రాంతాలలో గవర్నర్‌గా పనిచేయడం వల్ల, వివిధ దండయాత్రలకు నాయకత్వం వహించడం వల్ల పరిపాలనా, యుద్ధ రంగాల్లో అనుభవం సంపాదించాడు. ఇతను తెలివిగల సైనికాధికారి. సైన్యాన్ని నడపడంలోను, యుద్ధ వ్యూహాన్నీ పన్నడంలోను ఔరంగజేబు నేర్పరి. యుద్ధ పద్ధతులు తెలుసు. ఇవన్నీ ఔరంగజేబు వారసత్వ యుద్ధంలో విజయం సాధించడానికి దోహదం చేశాయి. మరోవైపు దారా వివిధ రాష్ట్రాలకు గవర్నర్‌గా నియమింపబడినా, ఎక్కువ కాలం రాజధానిలోనే గడిపేవాడు. అందువల్ల పరిపాలనానుభవాన్ని పొందలేకపోయాడు. అంతేకాక, సైన్యాన్ని నడపడంలో నైపుణ్యం సంపాదించలేక పోవడంతో పాటు అతనిలో క్రమశిక్షణ కూడా లోపించింది. దారా సైన్యంలో వివిధ జాతులు, కులాలు, ప్రాంతాలు, మతాలవారు సైనికులుగా వుండడం వల్ల వారిలో ఐక్యత లోపించింది. వారు ఎప్పుడూ తమ హోదాను దృష్టిలో వుంచుకునేవారు. అందువల్ల ఇతరుల క్రింద పనిచేసేవారు కాదు. వీటికి తోడు సైన్యాన్ని నడిపే అధికారం దారా ఒక్కరికి యివ్వలేదు. అందువల్ల సైన్యంలో క్రమశిక్షణ లేకుండా పోయింది ధారాలో కూడా సైన్యాన్ని నడపడంలోనూ, యుద్ధ నైపుణ్యం లేకుండా పోయింది.

ఔరంగజేబు ధైర్యవంతుడు, స్థిరచిత్తుడు. ఏదైనా ఒకపనిని చేపడితే దృఢ నిశ్చయంతో చేసేవాడు. అటువంటి లక్షణాలు దారాలో లేవు. ఈ విషయాల్లో దారా ఔరంగజేబుకు సాటిరాడు. ఔరంగజేబు వారసత్వ యుద్ధంలో విజయం సాధించేందుకు షాజహానే కారకుడని కొందరు పండితులు అభిప్రాయపడ్డారు. అతడు సమర్ ఘర్ యుద్ధ రంగానికి రాలేదు. ఒకవేళ షాజహాన్ యుద్ధరంగానికి వచ్చినట్లయితే అనేకమంది సైనికాధికారులు చక్రవర్తితో పాటు యుద్ధంలో పాల్గొనేవారు. అప్పుడు ఔరంగజేబు, మురాద్‌ల సైన్యం ఓటమిపాలు అయ్యేది.

దారా అనుసరించిన తెలివి తక్కువ విధానాలు కూడా వారసత్వ యుద్ధంలో ఓటమికి కారణాలు అయ్యాయి. ధర్మాట్‌లో మొఘల్ సైన్యం ఓటమి పాలయ్యాక బహదూర్‌పూర్ యుద్ధంలో షాషుజాను ఓడించి వస్తూవున్న తన కుమారుడు సులేమాన్ షుకో, రాజాజైసింగ్‌ల కోసం వేచివుండక తానొక్కడే సమూర్‌ఘర్ చేరుకున్నాడు. అందువల్ల వారి అనుభవం యుద్ధంలో లభించలేదు. దారా ఔరంగజేబు కంటే చాలాముందుగా సమూర్‌ఘర్ చేరాడు కానీ ఔరంగజేబు సైన్యం వస్తూనే వెంటనే దాడి చేయలేదు. కొంతకాలం వేచి వున్నాడు. అందువల్ల ఔరంగజేబుకు సమయం లభించి యుద్ధ ఏర్పాట్లు చేసుకోగలిగాడు. యుద్ధ సమయంలో దారా ఏనుగుపై కనిపించకపోవడంతో సైనికులు దారా మృతి చెందడమో లేదా పారిపోవడమో జరిగి వుంటుందని భావించి పారిపోవడం ప్రారంభించారు. ఈ విధంగా ఏనుగుపై నుంచి దిగడం దారాతోపాటూ సైన్యానికి కష్టాలను తెచ్చి పెట్టింది.

ఔరంగజేబు దక్కన్‌లో సంపాదించిన ఫిరంగిదళం విజయం సాధించడంలో ప్రధానపాత్ర పోషించింది. అనుభవజ్ఞులైన ఇంగ్లీషు, ఫ్రెంచి అధికారులను సంపాదించాడు. వారు యుద్ధ ప్రారంభంలో ఫిరంగులను ఉపయోగించకుండా అవసరమైనప్పుడే ఉపయోగించారు. అయితే దారా సైన్యంలో ప్రారంభంలోనే ఫిరంగులను ఉపయోగించడం ప్రయోజనం లేకుండా చేసింది. ఈ విధంగా ఫిరంగిదళం ధారాను ఓడించడంలో ప్రధానపాత్రను పోషించింది.

ఔరంగజేబు గొప్ప రాజకీయ చతురుడు. సొమ్మునిచ్చి అనేకమంది సైనికాధికారులు, అమీర్లను ఔరంగజేబు తనవైపుకు త్రిప్పుకున్న సంగతి మీరిదివరకే చదివారు. దారాను ఇతర సోదరుల నుంచి దూరంచేసి ఏకాకిగా నిలిపాడు. తన సోదరులైన షాషుజా, మురాద్‌లను ఔరంగజేబు తనవైపు త్రిప్పుకోడంతో పాటు, వారి నుంచి తనను కాపాడుకునేందుకు వారితో నిత్యం సంప్రదింపులు జరిపేవాడు. ఈ ముగ్గురు సోదరుల కూటమిని అడ్డుకునేందుకు షాజహాన్ ప్రయత్నించాడు కానీ విఫలుడయ్యాడు. ఔరంగజేబు చతురతతో ఆగ్రా కోటను ఆక్రమించుకుని షాజహాన్ అధికారాన్ని తను స్వాధీనం చేసేలా వత్తిడి తెచ్చాడు.

దారా, ఔరంగజేబులలోని వ్యక్తిత్వం, లక్షణాలను పోల్చి చూస్తే ఔరంగజేబు గొప్పతనం అంగీకరించక తప్పదు. షాజహాన్ పాలనా కాలంలోనే ఔరంగజేబు తన ప్రతిభను, గొప్పదనాన్ని చాటుకున్నాడు. ఔరంగజేబు తెలివైనవాడు, గట్టివాడు. షాషుజా, మురాద్‌ల విషయాలు, నిర్ణయాలు తాను తెలుసుకున్నాడు కానీ తన విషయాలు వారికి తెలియనీయలేదు. కష్ట సమయాల్లో కూడా విసుగు చెందేవాడు కాదు. చివరగా ఔరంగజేబులోని ధైర్యసాహసాలు, ఓపిక, రాజకీయ చతురత, ధృడ విశ్వాసాలే అతినిని విజేతగా నిలిపాయని చెప్పవచ్చు.

## 39. ఎ. పాఠ్య ప్రశ్నలు

1. దారాలో రాజకీయ, పరిపాలనానుభవం లోపించడానికి ప్రధాన కారణం ఏమిటి?
2. ఉలేమాలు దారాకు ఎందుకు వ్యతిరేకులయ్యారు?
3. వారసత్వ యుద్ధంలో ఔరంగజేబు విజయం సాధించడానికి గల కారణాలు ఏమిటి?

## 39.4 ప్రధాన తిరుగుబాట్ల ప్రాముఖ్యత :

జాట్‌లు శాంతికాముకులు, ధైర్యవంతులు అనే విషయం మీరిదివరకే చదివారు. వారిలో అధికులు రైతులు. కనుక మొఘలులు భూమిశిస్తు విధానంలో చేసిన మార్పులు వారిలో అసంతృప్తిని కలిగించి దక్కన్ మరియు పశ్చిమతీర రేవులకు వెళ్ళే ప్రధానమార్గంలో జాట్‌లు వుండడం వల్ల వారి సహకారం మొఘలులకు అవసరం.

గోకుల్ నాయకత్వంలో జాట్‌లు తిరుగుబాటు చేయగా, మధుర ఫౌజ్‌దారు అణచివేసేందుకు విఫలయత్నం చేసి మృతి చెందాడు. దీనితో మొఘలుల సైన్యాన్ని పంపడం అనివార్యమైంది. అయినా వారు రాజారామ్, చురామన్ నాయకత్వంలో తిరుగుబాట్లు చేశారు. దాడికి ప్రధాన కారణం ఆర్థికపరమైనది. దారి దోపిడీలు చేసి జాట్‌లు మొఘలులను ఇబ్బందులకు గురిచేశారు. జాట్‌లను అణచివేసేందుకు మొఘలులు అనేక ప్రయత్నాలు చేశారు కానీ వారి శక్తి వృధా అయింది. అయినా వారిని పూర్తిగా అణచివేయలేక పోయారు. చివరకు మొఘల్ రాజ్య ప్రధానభాగంలో జాట్‌లు

స్వతంత్ర్య రాజ్యాన్ని స్థాపించుకున్నారు. జాట్‌ల తిరుగుబాటు ఒకవైపు మొఘలుల బలహీనతను చాటి చెప్పగా, మరోవైపు సామాన్యులలో పెరుగుతూవున్న సంతృప్తికి అద్దం పట్టింది.

సత్నామీలు మతాన్ని అనుసరించే శాంతికాముకులని మీకు గుర్తు వుంది కదా ! వీరిలో ఎక్కువమంది వ్యవసాయదారులు మరియు చేతివృత్తుల వారు. వారికి ఎటువంటి కులమత బేధాలు కానీ, తేడాలు కానీ, అంతరాలు కానీ లేవు. ఒక సత్నామీని మొఘల్ అధికారి చంపివేయడంతో మొఘలుల పట్ల వారికి వ్యతిరేకత ప్రారంభమై, అది తిరుగుబాటుకు దారి తీసింది. తిరుగుబాటు తీవ్రతరం కావడంతో ఔరంగజేబు స్వయంగా వెళ్ళి తిరుగుబాటును అణచివేశాడు. తిరుగుబాటు పూర్తిగా అణిచివేయబడింది గానీ మొఘలులకు తీవ్ర నష్టాన్ని కలిగించింది.

అక్బర్ కాలంనుంచే మొఘలులకు బుందేలులకు మధ్య శత్రుత్వం వుంది. ఔరంగజేబు పాలనాకాలంలో చంపత్‌రాయ్ నాయకత్వంలో బుందేలులు తిరుగుబాటు చేయగా, మొఘల్ సైన్యం దానిని అణిచివేసి చంపత్‌రాయ్‌ని చంపివేసింది. దీనితో అతని కుమారుడు చత్రసాల్ మొఘల్ సైన్యంలో చేరాడు. అయితే అక్కడ గుర్తింపు లేకపోవడంతో బయటకు వచ్చి స్వతంత్ర్య రాజ్యాన్ని స్థాపించాలని భావించాడు. శివాజీతో సత్సంబధాలను ఏర్పాటు చేసుకున్నాడు. క్రీ.శ. 1697నాటికి బలవంతుడయ్యాడు. ఔరంగజేబు మరియు అతని వారసులకు సమస్యగా తయారయ్యాడు. 1731 నాటికి చత్రసాల్ మరణించేందుకు ముందు బుందేల్‌ఖండ్ నుండి మొఘలులను పూర్తిగా తరిమివేసి స్వతంత్ర్య రాజ్యాన్ని ఏర్పాటు చేశాడు.

ఈ తిరుగుబాట్లను పరిశీలిస్తే వాటికి ప్రధాన కారణం ఆర్థిక పరిస్థితులే ! జాట్‌లు వ్యవసాయదారులు కనుక ఔరంగజేబు భూమిశిస్తు విధానాన్ని వ్యతిరేకించారు. తమను పీడిస్తూ వున్నట్లుభావించారు. అలాగే బుందేలుల తిరుగుబాటు కూడా స్వతంత్ర్య రాజ్య ఏర్పాటుకు దారి తీసింది. ఈ తిరుగుబాట్లు ఔరంగజేబు మత విధానం వల్ల జరిగినట్లు కొందరు భావించారు. ఈ తిరుగుబాట్లు మొఘల్ సామ్రాజ్యంలో అయోమయాన్ని కలిగించారు. వరుస తిరుగుబాట్లు, సైనికకార్యకలాపాలు ఆర్థిక స్థితిపై ప్రభావాన్ని కనబరిచాయి. ఆర్థికంగా రాజ్యం బలహీనమైంది. ఈ తిరుగుబాట్లు సైనిక కార్యకలాపాలు మొఘల్ రాజ్యాన్ని బలహీనపరచాయి. రాజ్యాన్ని రక్షించడం ఔరంగజేబు వారసులకు కష్టతరం అయింది.

## 39.బి పాఠ్య ప్రశ్నలు

1. జాట్‌ల తిరుగుబాటుకు కారణమేమిటి?
2. మొఘల్ సైన్యంలో ఛత్రసాల్ ఎందుకు సంతృప్తి చెందలేదు?
3. తిరుగబాట్ల వల్ల రాజకీయ ప్రభావం ఏమిటి?

## సారాంశం :

సమర్‌ఘర్ యుద్ధ విజయానంతరం ఔరంగజేబు ఆగ్రా కోటను ఆక్రమించుకుని షాజహాన్‌ను ఖైదు చేశాడు. వారసత్వ యుద్ధం ఔరంగజేబు సైనిక నైపుణ్యాన్ని, పరిపాలనాదక్షతను చాటి చెప్పింది. తన రాజకీయ చతురత,

ఉలేమాలు, అమీర్లు, అధికారుల సహకారం వల్ల ఔరంగజేబు వారసత్వ యుద్ధంలో విజయం సాధించాడు. ఔరంగజేబు సమర్ధవంతుడుగా నిరూపించుకున్నాడు.

ఔరంగజేబు కాలంలో జరిగిన తిరుగుబాట్లు మొఘల్ రాజ్యాన్ని బలహీన పరిచాయి. ఇవి మొఘల్ సామ్రాజ్య ఆర్థిక స్థితిని తారుమారు చేశాయి. వీటికి ఇతర కారణాలు తోడవడం మొఘల్ సామ్రాజ్యం చిన్నాభిన్నం కావడానికి కారణం అయింది.

## అభ్యాసం :

1. వారసత్వ యుద్ధంలో ఔరంగజేబు విజయం సాధించడానికి కారణాలు ఏమి?
2. దారా తీసుకున్న తెలివితక్కువ నిర్ణయాలే అతని ఓటమికి కారణమని నీవు అంగీకరిస్తావా? కొన్ని ఉదాహరణలు యివ్వండి.
3. జాట్‌ల, బుందేలుల తిరుగుబాట్ల వల్ల కలిగిన రాజకీయ ప్రభావం ఏమిటి?

## పాఠ్య ప్రశ్నలకు సమాధానంలు

### 39.ఎ.

1. దారా ఎప్పుడూ రాజధానిలో వుండేవాడు. ఇతను ఎక్కువగా యుద్ధాలలో పాల్గొనలేదు. ఏ రాష్ట్రాన్నీ దగ్గరుండి పరిపాలించలేదు.
2. దారాలోని ఉదారవాదం వల్ల
3. ఔరంగజేబు యుద్ధ నైపుణ్యం, వ్యూహం, ఫిరంగి దళంలతో పాటూ ఔరంగజేబు ధైర్యసాహసాలు, పట్టుదల, రాజకీయ చతురత

### 39.బి.

1. ఆర్థిక విపత్తు
2. సామ్రాజ్య కాంక్ష స్వతంత్ర్య రాజ్యాన్ని ఏర్పాటు చేయాలనుకోవడం
3. మొఘల్ రాజ్యాన్ని బలహీన పరచడంతో పాటు ఆర్థికంగా కృంగదీశారు.

# 40

# రాజపుత్రులు, శిక్కులతో మొఘులుల సంబంధాలు (1)

## 40.1 పరిచయం :

రాజపుత్రులను, వారికి తురుష్కులతో వున్న శత్రుత్వాన్ని గురించి ఇదివరకే మీరు చదివారు. ధైర్యసాహసాలు గల రాజపుత్రులు రాజపుత్ర స్థానంలో స్వతంత్ర్య రాజ్యాలు ఏర్పాటు చేసుకున్న విషయం మీకు గుర్తుంది కదా ! మేవార్, మార్వార్, రణతంబోర్ మొదలైనవి ప్రధాన రాజపుత్ర రాజ్యాలు. వీరితో మొఘలుల సంబంధాలు మనదేశ చరిత్రలో ప్రధాన పాత్ర పోషించాయి.

మొఘులుల పరిపాలనా కాలంలో మనదేశంలో ఆవిర్భవించిన మరొక వర్గం శిక్కులు. వీరు గురునానక్ అనుచరులు. శిక్కుల ఉద్యమం వారి గురు పరంపరలపై ఆధారపడి వుంది.

ఈ రెండు అధ్యాయాల్లో మొఘులులు – రాజపుత్రులు మరియు మొఘులులు, శిక్కుల మధ్య గల సంబంధాలలోని వివిధ కోణాలను చదువుతారు.

## 40.2 లక్ష్యాలు :

ఈ పాఠం చదివిన తర్వాత ఈ కింది విషయాలు తెలుసుకుంటారు.

1. బాబర్, హుమాయూన్‌ల కాలంలో రాజపుత్రుల సంబంధాలు
2. చితోడ్, రణతంబోర్, మేవార్, ఇతర రాజ్యాలను జయించడానికి అక్బర్ తీసుకున్న చర్యలు
3. మొఘల్ సార్వభౌమాధికారాన్ని అంగీకరించని ధీరుడు రాణాప్రతాప్ అనే విషయం
4. మేవాడ్ ఆక్రమణకు జహంగీర్ అనుసరించిన విధానాలను వివరించగలుగుట
5. ఔరంగజేబు కాలంలో మేవార్ మొఘులాయిల సంబంధాలు తెగిపోవడానికి గల కారణాలు
6. అక్బర్ పాలనాకాలంలో మొఘల్ పాలకులు శిక్కు గురువులకు మధ్యగల సత్సంబంధాలు
7. జహంగీర్ కాలంలో గురు అర్జున్‌ను శిక్షించడం శిక్కులు శత్రువులు కావడానికి దోహదం చేసిన విషయం
8. శిక్కులు, ఔరంగజేబు మధ్య విభేదాలు
9. శిక్కుల పదవ గురువు గురు గోవింద్ కాలంలో శిక్కు ఉద్యమంలో వచ్చిన మార్పులను గుర్తించడం

## 40.3 తొలి సంబంధాలు - బాబర్, హుమయున్

బాబర్ భారతదేశంపై చేసిన దండయాత్రను తొలి అధ్యాయంలో మీరు చదివారు. మొఘల్ ఆక్రమణలో మొదటి పానిపట్టు యుద్ధం ప్రధానమైనదే కానీ కాణ్వాయుద్ధం బాబర్ భారతదేశ ఆక్రమణకు దోహదంచేసి అతని విజయానికి కారణమైంది. ఈ యుద్ధంలో రాణాసంగా నాయకత్వంలోని రాజపుత్రుల కూటమి విచ్ఛిన్నమైంది. హుమయున్ కాలంలో మొఘల్ సైన్యాలు ఒకవైపు గుజరాత్‌లోని బహదూర్‌షాతోను, మరోవైపు తూర్పు షేర్షాతోనూ యుద్ధంలో మునిగిపోయాయి. ఈ సమయంలో చిత్తోడ్‌లో అంతఃకలహాలు జరుగుతూ వుండడం వల్ల వారిపై దృష్టి పెట్టాల్సిన అవసరం లేదని హుమాయున్ భావించాడు. బాబర్, హుమయూన్‌ల కాలంలో నిర్దిష్టమైన రాజపుత్ర విధానం లేదు. భారతదేశంలో అధికారాన్ని స్థిరపరచుకోవడంలో మొఘలులు మునిగిపోయారు.

## 40.4 అక్బర్, రాజపుత్రులు, చిత్తోడ్, రణతంబోర్‌ల ఆక్రమణ :

క్రీ.శ. 1556లో మొఘల్ సింహాసనాన్ని అధిష్టించిన అక్బర్ రాజ్యం సక్రమంగా కొనసాగాలంటే రాజపుత్రుల సహకారం అవసరం అని గుర్తించాడు. చిత్తోడ్, రణతంబోర్ రాజ్యాలను జయించేంతవరకూ రాజపుత్ర స్థానంపై తమ అధికారం నెలకొనదని గుర్తించాడు. మేవాడ్ రాజ్య రాజధాని చిత్తోడ్ బలమైన రాజ్యం. ఇది మధ్యరాజస్థాన్‌లో కీలకమైన ప్రాంతం. ఆర్థికంగా, వ్యూహాత్మకంగా ఆగ్రానుంచి గుజరాత్‌కు ఈ మార్గం చాలా దగ్గర. వీటన్నింటికి మించి మేవాడ్ రాజ్యం రాజపుత్రుల ధైర్యసాహసాలకు నిదర్శనంగా నిలిచి మొఘల్ అధికారాన్ని ప్రశ్నిస్తూ వుండేది. బాబర్ కాలంలో అతనికి వ్యతిరేకంగా మేవార్ పాలకుడు రాణసంగా ఏర్పాటు చేసిన కూటమిని గురించి చేసిన యుద్ధాన్ని గురించి మీరు ఇదివరకే చదివారు. వీటన్నింటి వల్ల మేవార్ ఆక్రమించుకోవడం తప్పక అవసరమనీ, అప్పుడే ఇతర రాజపుత్రులు తన సార్వభౌమాధికారాన్ని గుర్తించేలాగా వత్తిడి చేయవచ్చుననే విషయాన్ని అక్బర్ గుర్తించాడు.

క్రీ.శ. 1567లో అక్బర్ మేవార్ రాజధాని చిత్తోడ్ పై దండెత్తాడు. మేవార్ పాలకుడు రాణా ఉదయ్‌సింగ్ చిత్తోడ్ రక్షణను రాజపుత్ర సేనాధిపతులైన జైమల్, పట్టాలకు అప్పగించి ఆరావళి పర్వతాల్లో తలదాచుకున్నాడు. జైమల్ (Jaimal) , పట్టాలు (patta) ధైర్యసాహసాలతో పోరాడి ఆరునెలల పాటు కోటను మొఘల్ సైన్యం నుంచి రక్షించగలిగారు. చివరకు క్రీ.శ.1568లో చిత్తోడ్ కోట మొఘలుల వశమైంది. రాజపుత్రులు పెద్ద సంఖ్యలో మరణించగా రాజపుత్ర స్త్రీలు నిప్పులో దూకి ఆత్మహుతి (Johar) చేసుకున్నారు.

చిత్తోడ్ ఆక్రమణ అనంతరం అక్బర్ రణతంబోర్ పై దృష్టి నిలిపాడు. రణతంబోర్ బలమైన కోట. దీని పాలకుడైన రాజాసుర్జన హర క్రీ.శ.1569లో లొంగిపోయి, మొఘల్ ఆస్థానంలో చేరాడు. వీటి పతనానంతరం కలెంబర్, బికనీర్, జైసల్మీర్ పాలకులు అక్బర్ సార్వభౌమాధికారాన్ని అంగీకరించగా, అక్బర్ వారితో స్నేహసంబంధాలను ఏర్పాటు చేసుకున్నాడు. వారు మొఘల్ రాజ్యంలో మునసబ్‌దారులు అయ్యారు.

### రాణాప్రతాప్, అక్బర్‌ల మధ్య యుద్ధం :

అక్బర్ చిత్తోడ్‌ను ఆక్రమించినప్పటికీ, మేవార్ రాజ్యంలోని చాలా ప్రాంతాలు రాజపుత్రుల ఆధీనంలోనే వున్నాయి. ఉదయ్‌పూర్, దాని చుట్టు ప్రక్కల ప్రాంతాలు రాణాప్రతాప్ స్వాధీనంలో వున్నాయి. క్రీ.శ. 1572 ఉదయ్‌సింగ్ మరణానంతరం అతని కుమారుడైన రాణాప్రతాప్ సింహాసనం అధిష్టించి మొఘులులతో పోరాటం చేశాడు. సార్వభౌమాధికారాన్ని అంగీకరించమని అక్బర్ వద్దకు మాన్‌సింగ్, భగవాన్ దాస్, తోడరమల్లులను మధ్యవర్తులుగా

పంపాడు. రాణా తన కుమారుడు అమర్‌సింగ్‌ను మొఘల్ దర్బారుకు పంపాడు కానీ, ఇద్దరి మధ్య ఒప్పందం కుదరలేదు. అక్బర్ ఆశించిన గౌరవాన్ని రాణా అంగీకరించకపోవడం అందుకు ప్రధాన కారణం కాగా, చిత్తోడ్‌ను తన స్వాధీనంలోనే వుంచుకోవాలనే అక్బర్ నిర్ణయాన్ని కూడా రాణా అంగీకరించపోవడం మరో కారణం!

తనను ధిక్కరిస్తూ వున్న రాణాప్రతాప్‌ను ఓడించాలనే అక్బర్ కోరిక హల్దీఘాట్ యుద్ధంలో నెరవేరింది. హల్దీఘాట్ యుద్ధంలో రాణాప్రతాప్ ఓడిపోయి పారిపోయాడు. మేవార్ రాజ్యాన్ని మొఘలులు ఆక్రమించుకున్నా రాణాప్రతాప్ అక్బర్‌కు లొంగకుండా స్వాతంత్ర్యం కోసం పోరాటం కొనసాగించాడు. ఏమైనప్పటికీ చాలా రాజపుత్ర రాజ్యాలు మొఘలుల సార్వభౌమాధికారాన్ని అంగీకరించడం వల్ల రాణా పోరాటానికి అర్థం లేకుండా పోయింది. దీనికి తోడు అక్బర్ రాజపుత్రులతో సత్సంబంధాలను ఏర్పాటు చేసుకున్నాడు. ఏమైనప్పటికీ రాణాప్రతాప్ ధిక్కారం ఇతర రాజపుత్ర రాజ్యాలపై కొంతమేరకు ప్రభావాన్ని కనబరిచింది. అక్బర్ రాణాప్రతాప్‌ను వెంటాడుతూనే వున్నాడు. మేవార్‌ను ఏకాకిని చేసేందుకు వారి మిత్రులతో స్నేహం చేసుకున్నాడు. భిల్లుల సహకారంతో గెరిల్లా యుద్ధ పద్ధతుల్లో మొఘలులను యిబ్బందులపాలు చేయసాగాడు రాణా. అక్బర్ క్రీ.శ.1579 నుంచి క్రీ.శ.1585 వరకు బీహార్, బెంగాల్ తిరుగుబాట్లలో మునిగివుండడం వల్లనూ మీర్జాహకీం పంజాబ్‌పై దండయాత్ర చేయడం వల్ల వాయువ్య సరిహద్దులలో అక్బర్ వున్న సమయంలోనూ రాణాప్రతాప్ కుంభాల్‌ఘర్‌తో పాటూ, చిత్తోడ్ పరిసర ప్రాంతాలను అనేకం పునరాక్రమించుకున్నారు కానీ చిత్తోడ్‌ను ఆక్రమించలేకపోయాడు. రాణాప్రతాప్ 1597లో మరణించాడు.

అక్బర్‌ను మార్వార్ పాలకులు కూడా వ్యతిరేకించారు. మొఘలులు గుజరాత్‌కు వెళ్ళే మార్గంలో వున్న 'జోద్‌పూర్'ను స్వాధీనం చేసుకోవడం అవసరమని అక్బర్ గుర్తించాడు. మార్వార్ పాలకుడు రావుమాల్దేవ్ మరణం వల్ల వారసులైన చంద్రసేన్ అతని సోదరుల మధ్య ఏర్పడిన అంతఃకలహాలను ఆసరాగా చేసుకుని అక్బర్ మార్వార్‌లో జోక్యం చేసుకున్నాడు. చంద్రసేన సింహాసనం అధిష్టించినా, మొఘలుల వత్తిడి వల్ల రాజ్యాన్ని సోదరులకు పంచాల్సి వచ్చింది. దీనితో చంద్రసేన్ తిరుగుబాటు చేశాడు. దీనిని ఆసరాగా చేసుకుని మార్వార్‌ను పూర్తిగా ఆక్రమించదలచిన అక్బర్ ఉదయపూర్ వ్యవహారాలను చూసుకునేందుకు రాయ్‌సింగ్ బికనీర్‌ని నియమించాడు. చంద్రసేన్ గెరిల్లా యుద్ధ పద్ధతులను అనుసరించి మొఘలులతో పోరాడాడు. ఇతడు క్రీ.శ.1581లో మరణించాడు. దీనితో అక్బర్ జోధ్‌పూర్‌ను చంద్రసేన్ సోదరుడైన ఉయద్‌సింగ్ కుమార్తె జగత్ జోధాబాయిని అక్బర్ తన కుమారుడైన సలీంకు(జహంగీర్)కు యిచ్చి వివాహం జరిపించాడు. ఔరంగజేబు కాలం వరకూ మార్వార్ పాలకులు మొఘలులతో సత్సంబంధాలను కొనసాగించారు.

## 40.5 జహంగీర్ – మేవార్ లొంగుబాటు :

అక్బర్ రాజపుత్ర విధానాన్ని జహంగీర్ కొనసాగించాడు. క్రీ.శ.1605లో జహంగీర్ సింహాసనం అధిష్టిస్తూనే మేవార్‌ను ఆక్రమించుకోవడంపై దృష్టి పెట్టాడు. రాణాప్రతాప్ మరణం తర్వాత అతని కుమారుడు అమర్‌సింహ మొఘలులతో పోరాటాన్ని కొనసాగించాడు. జహంగీర్ మేవార్ పై వరుసగా మూడుసార్లు దాడిచేసి విఫలమైనాడు. దీనితో క్రీ.శ.1613–75 మధ్యకాలంలో మేవార్‌పై జహంగీర్ నాయకులతో దండయాత్ర చేశారు. యువరాజు ఖుర్రమ్ సేనలకు నాయకత్వం వహించి యుద్ధాన్ని నడిపాడు. కోటలో వున్న రాజకుటుంబానికి సైన్యానికి ఆహారపదార్థాలు, సరుకులు అందకుండా చేసి పంటలను నాశనం చేసి చివరకు మేవార్ రాజు సంధికి అంగీకరించేలా చేశాడు. 1615లో సంధి జరిగింది. ఈ సంధి ప్రకారం అమర్‌సింగ్ మొఘల్ సార్వభౌమాధికారాన్ని అంగీకరించాడు. తన కుమారుడు

కరన్‌సింగ్‌ను మొఘల్ దర్బారుకు పంపాడు. జహంగీర్ కూడా వారిపట్ల స్నేహాన్ని ప్రదర్శించి కరన్‌సింగ్‌ను గౌరవించి 5000 మన్సబ్‌దారుగా నియమించాడు. ఈ మన్సబ్ ఇంతకుముందు జోద్‌పూర్, బికనీర్, అజ్మీర్ రాజపుత్ర రాజుల కివ్వబడింది. మేవార్, చిత్తోడ్ రాణాకు తిరిగి ఇవ్వబడ్డాయి.

## 40.6 షాజహాన్, రాజపుత్రులు :

షాజహాన్ రాజపుత్రులతో సత్సంబంధాలను కొనసాగించాడు. రాజపుత్రులు కూడా మొఘలులకు సహకరించడంతో పాటూ, దక్కన్‌లోనూ వాయువ్య ప్రాంతాలలోను జరిగిన యుద్ధాలలో మొఘలుల తరపున పోరాడారు. అయితే ఏ రాజపుత్రరాజు కూడా ఏ రాష్ట్రానికి షాజహాన్ కాలంలో గవర్నర్‌గా నియమింపబడలేదు. వారితో వివాహ సంబంధాలు కూడా జరుగలేదు. రాజపుత్రులకు సుస్థిరస్థానం వుందని మొఘలులు భావించడమే అందుకు కారణం. అయితే జోధ్‌పూర్, అంబర్ రాజులకు అత్యున్నత మనసబ్‌దారీలను యివ్వడానికి అంగీకరించాడు.

## 40.7 మేవార్, మార్వార్, రాజ్యాలతో ఔరంగజేబు సంబంధాలు :

ఔరంగజేబు సింహాసనాన్ని అధిష్టించే కాలం నాటికి ప్రఖ్యాత రాజపుత్ర రాజులు అంబర్, జైసింగ్, మార్వార్ జస్వంత్ సింగ్, మేవార్ జైసింగ్‌లు వీరు ఔరంగజేబుకు తమ మద్దతు. క్రీ.శ. 1678లో రాజాజస్వంత్‌సింగ్ మరణించడంతో ఔరంగజేబు మార్వార్ అంతర్గత వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడంతో మొఘలులు రాజపుత్రుల మధ్య వైరం ప్రారంభమైంది. రాజాజస్వంత్‌సింగ్ వారసులు లేకుండా మరణించడంతో రెండు పరగణాలు మినహా రాజధాని జోధ్‌పూర్‌తో సహ మొగల్ రాజ్యం (khalisa) లో విలీనం చేశాడు. దాని పరిపాలనకు మొఘల్ అధికారులను పంపాడు. జస్వంత్‌సింగ్ మొఘలులకు అధికమొత్తంలో బకాయిపడడం కూడా దాని విలీనానికి కారణమైంది. జోధ్‌పూర్ సింహాసనానికి వారసుడు లేకపోవడం వల్ల ఔరంగజేబు ఆ ప్రాంతానికి తమను జాగీరుదారులుగా నియమిస్తారనే ఆశ రణతంబోర్, జైసల్మీర్ పాలకులకు కలిగింది కానీ విలీనం వారిలో నిరాశను మిగిల్చింది. ఏమైనప్పటికీ, ఔరంగజేబు నిర్ణయం రాథోడ్‌లను కించపరిచింది. తమ జన్మభూమి, తమ ప్రతిష్టకు చిహ్నమైన జోధ్‌పూర్‌ను మొఘల్ రాజ్యంలో విలీనం చేయడం తమ గౌరవాన్ని హరించడమేనని వారు భావించారు. జోధ్‌పూర్‌ను కాపాడుకొనేందుకు మార్వార్ మొత్తాన్ని వదులుకొనేందుకు వారు సిద్ధమైనారు. ఇదేకాక ఇంద్రసింగ్ మార్వార్‌లు ప్రజాదరణ పొందలేదు. జస్వంత్‌సింగ్ మరణించేనాటికి గర్భవతులుగా వున్న ఆయన రాణులు ఇద్దరూ మగశిశువులను ప్రసవించడంతో అసలు సమస్య తలెత్తింది. వారసులు లేరనే కారణం వర్తించదని మొఘలులు గ్రహించారు. వారిలో ఒకరు మృతి చెందగా, మరొకరు అజిత్‌సింగ్ తనను వారసుడిగా గుర్తించి రాజ్యాన్ని యివ్వమని ఔరంగజేబును కోరాడు. అయితే ఔరంగజేబు దీనికి అంగీకరించక జస్వంత్‌సింగ్ మనవడైన ఇంద్రసింగ్ వైపు మొగ్గు చూపాడు.

కొందరు చరిత్రకారుల ప్రకారం అజిత్‌సింగ్ ఇస్లాంమతం స్వీకరిస్తే రాజ్యం ఇస్తాడని ఔరంగజేబు షరతు విధించినట్లు తెలుస్తోంది కానీ, దీనికి సంబంధించి సమకాలీన ఆధారాలు ఏమీలేవు. ఔరగంజేబు అజిత్‌సింగ్‌కు రాజధానిలో మన్సబ్‌దారీ ఇస్తానని ప్రకటించాడని కొన్ని రాజస్థానీ గ్రంథాలు పేర్కొన్నాయి. ఈవిధమైన ఔరంగజేబు విధానాలకు వ్యతిరేకులైన రాజపుత్రులు దుర్గాదాసు నాయకత్వంలో ఏకమయ్యారు. రాణి మరియు ఆమె కుమారుడు అజిత్‌సింగ్‌లను ఆగ్రా వదిలి వెళ్ళరాదని ఔరంగజేబు ఆదేశించాడు. దుర్గాదాసు వారితోపాటు తప్పించుకున్నాడు. దీనితో మొఘలులు రాజపుత్రుల మధ్య యుద్ధం ప్రారంభమైంది. రాథోర్‌ల తిరుగుబాటును అణచివేసి జోధ్‌పూర్ స్వాధీనం చేసుకున్నారు. దుర్గాదాసు అజిత్‌సింగ్‌లు మేవార్‌కు పారిపోయారు.

ఇలాంటి స్థితిలో మేవార్ అజిత్‌సింగ్‌కు మద్ధతుగా యుద్ధంలో పాల్గొన్నారు. అజిత్‌సింగ్ తల్లి, రాణి హంది మార్వార్ రాణే కాక మెవార్ యువరాణి కూడా. మేవార్ రాజు రాజ్‌సింగ్ కూడా రాజపుత్రుల అంతర్గత విషయాలలో ఔరంగజేబు జోక్యం చేసుకోవడాన్ని సహించలేకపోయాడు. దీనితో మేవార్ ఔరంగజేబుల మధ్య శత్రుత్వం ప్రారంభమైంది. 1679లో మొఘలులు మేవార్‌పై దండెత్తారు. రాణారాజ్‌సింగ్ కొండలలోకి పారిపోయి మొఘలులపై గెరిల్లా యుద్ధాలు చేశాడు. మొఘలులు ఈ యుద్ధంపై పెద్దగా శ్రద్ధ కనబరచలేదు. చివరకు రాకుమారుడైన అక్బర్ తండ్రి ఔరంగజేబుకు వ్యతిరేకంగా రాజపుత్రులతో చేతులుకలిపాడు. అయితే వారి స్నేహాన్ని భగ్నంచేసేందుకు ఔరంగజేబు కుట్ర పన్నాడు. కానీ కుట్రను గురించి తెలుసుకున్న దుర్గాదాసు అక్బర్‌ను తప్పించి దక్కన్‌లో మంచి ప్రాంతానికి చేరేందుకు సహకరించాడు.

అక్బర్ రాజపుత్రుల పట్ల ఉదార విదానాన్ని అనుసరించాడు. స్నేహ పూర్వక ఒప్పందాలు, సైనిక విజయాల ద్వారా రాజపుత్రులను జయించాడు. జహంగీర్, షాజహాన్‌లు కూడా అక్బర్ విధానాలనే అనుసరించారు. ఔరంగజేబు రాజపుత్రులను గౌరవించినా, మార్వార్ రాజ్యవిషయాల్లో జోక్యం చేసుకోవడం మొఘల్ రాజపుత్ర సంబంధాలకు ఆటంకం కలిగించింది.

## 40.ఎ. పాఠ్య ప్రశ్నలు

1. అక్బర్, రాణాప్రతాప్‌లు శాంతియుత ఒప్పందానికి ఎందుకు రాలేకపోయారు?
2. హల్దీఘాట్ యుద్ధానంతరం మొఘలులను ఇబ్బంది పెట్టేందుకు ఎటువంటి యుద్ధ పద్ధతులను అనుసరించాడు?
3. 1615 సంధి ప్రకారం మేవార్ రాజ్యం మొత్తం తిరిగి యిచ్చి వేయబడింది. అయితే రాజధాని చిత్తోడ్‌ను మాత్రం యిచ్చేందుకు అంగీకరించలేదు. అందుకు కారణమేమి?
4. జోథ్‌పూర్‌ను మొఘల్‌రాజ్యంలో విలీనం చేయాలనే ఔరంగజేబు నిర్ణయాన్ని రాజపుత్రులకు ఎందుకు ఆగ్రహాన్ని కలిగించింది?

## 40.8 శిక్కులతో మొఘలుల సంబంధాలు :

గురునానక్ (1469-1539) బోధనల నుంచి శిక్కుమతం ఆవిర్భవించింది. సత్యం, శాంతిలను బోధించడంతోపాటూ దేవుడు ఒక్కడే అనే సిద్ధాంతాన్ని గురునానక్ ప్రచారం చేశాడు. తన మరణానికి ముందు గురునానక్ తన శిష్యుల్లో ఒకరిని గురువుగా నియమించి తన సిద్ధాంతాలు ప్రచారమయ్యేటట్లు చేశాడు. శిక్కు ఉద్యమం గురుపరంపరతో ముడిపడి వుంది. పదిమంది శిక్కు గురువులు మొఘల్ సుల్తానులకు సమకాలీనులు. గురునానక్ తర్వాత శిక్కుమత గురువైన గురుఅంగద్ కొన్ని ప్రత్యేక పద్ధతులను ఏర్పాటు చేశాడు. ముఖ్యంగా ఒకే సామూహిక భోజనశాలను ఏర్పాటు చేశాడు. ఈ విధానం శిక్కులలో సమానత్వాన్ని చాటి చెప్పడంతో పాటూ వారిలో ఐక్యత ఏర్పడేందుకు దోహదం చేసింది ఈ కాలంలో శిక్కుమతం అనుసరించే వారి సంఖ్య అధికమైంది. మూడవ శిక్కు గురువు అయిన గురు అమర్‌దాస్ తానొక్కడే వేల అనుచరులకు బోధనలు చేయడం కష్టతరంగా గుర్తించి శిక్కులను కొన్ని భాగాలుగా విభజించి, వాటిపై అధికారులను నియమించాడు. బోధనలు చేయడం, సామూహిక పూజలు నిర్వహించడం, కానుకలు వసూలు చేయడం వీరి విధి.

అక్బర్ మత విషయాలలోనూ, తత్త్వ విషయాలలోనూ వున్న ఆసక్తిని గురించి గత పాఠాలలో మీరు చదివారు.

విశాల, ఉదార భావాలతో హిందూ ముస్లింల మధ్య అక్బర్ సమైక్యత సాధించాలని భావించాడు. అక్బర్ శిక్కుగురువైన గురు–అమర్‌దాస్‌ను కలుసుకున్నాడు. సామూహిక భోజనశాలలు అక్బర్‌ను ప్రభావితం చేశాయి. దీనిలో 84 గ్రామాలను గురుఅమర్‌దాస్ కుమార్తె బీబీభానికి కానుకగా అక్బర్ యిచ్చాడు. గురు అమర్‌దాస్ తర్వాత అతని అల్లుడైన గురురామదాస్ శిక్కుల గురువు అయ్యాడు. గురురామదాసు పైన అత్యంత గౌరవం గల అక్బర్ 500 భిగాలస్థలాన్ని సరోవర నిర్మాణానికి దానంగా యిచ్చాడు. అంతేకాకుండా నూతన నగర నిర్మాణానికి గురురామదాసు పునాదులు వేశాడు. అది శిక్కులకు పవిత్రస్థలమైంది. దానికే 'రామదాసుపుర', గురుకాభక్' అనే పేర్లు వున్నాయి. ఈయన కాలం నుంచి గురుపరంపర వంశపారంపర్యమైంది. గురురామదాసు తర్వాత గురు అర్జున్ (1581–1606) శిక్కుల గురువు అయ్యాడు.

గురు అర్జున్ శిక్కు గురువైన తొలిరోజుల్లో పంజాబ్ ప్రాంతంలోని మొఘల్ అధికారులు గురురామదాసు పెద్ద కుమారుడైన పృధ్వీచంద్ గురువు కావాలనుకున్నారు. రామదాసు చిన్న కుమారుడైన అర్జున్ పట్లే ఆసక్తి కనబరిచాడు. అందుకు అర్జున్‌లోని నిరాడంబరత, నిష్పాక్షిక వ్యక్తిత్వమే కారణం. ఇలాంటి విషయాలను అక్బర్ పట్టించుకోలేదు. తన జీవితకాలమంతా అక్బర్ శిక్కులతో సత్సంబంధాలనే కొనసాగించాడు. అక్బర్ గురుఅర్జున్‌ను కలసినట్లు పర్షియన్ రచనలు వెల్లడించాయి.

అక్బర్ మరణం పరిస్థితుల్లో మార్పు తెచ్చింది. శిక్కులు మొఘులుల మధ్య విరోధం ప్రారంభమైంది. తొలి శిక్కుగురువులు మతబోధకులే గానీ రాజకీయాలలో జోక్యం చేసుకోలేదు. క్రీ.శ. 1606లో యువరాజు ఖుస్రూ తండ్రియైన జిలానిగిర్ వ్యతిరేకంగా తిరుగుబాటు చేశాడు. కానీ తిరుగుబాటులో ఓడిపోయి పంజాబ్‌కు పారిపోయాడు. అక్కడ శిక్కు గురువును కలసి ఆశీస్సులు పొందాడు. గురు అర్జున్‌కు వ్యతిరేకులైనవారు, స్థానిక మొఘల్ అధికారులు ఈ విషయాన్ని సుల్తాన్ జహంగీరుకు చేరవేశారు. దీనితో ఖుస్రూ తిరుగుబాటు వెనుక గురుఅర్జున్ పాత్ర వుందని భావించిన జహంగీర్ గురు అర్జున్‌పై రాజద్రోహ నేరానికి రెండు లక్షల రూపాయల జరిమానా కట్టమని ఆదేశించాడు. దీనికి గురు అర్జున్ వ్యతిరేకించడంతో అతనిని బంధించి వధించాడు.

దీంతో శిక్కులు మొగలుల మధ్య వైరం ప్రారంభమైంది. గురు అర్జున్ హత్య తర్వాత శిక్కులు తమను అంతమొదించడానికి మొఘులులు పూనుకొన్నారని గుర్తించి శిక్కు గురువైన అతని కుమారుడు గురుహర గోవింద్ శిక్కులను అర్జున్ తర్వాత సైనికశక్తిగా తయారు చేసేందుకు ప్రయత్నించి వారికి శిక్షణనిప్పించడంతో పాటు ఆయుధాలను కూడా సమకూర్చాడు. పెద్ద సేనావాహినిని తయారు చేయడంతో పాటు నూతన విధానాలైన 'మిరి' మరియు ఫిరి అనుసరించాడు. మిరి అనగా రాజ్యాధికారం. ఫిరి అనగా ఆధ్యాత్మికశక్తి. అమృతసర్‌లో అనంతమైన సింహాసనాన్ని (Timeless god) ను తయారు చేయటమే కాక, సైన్యానికి మొఘులులకు వ్యతిరేకంగా శిక్షణనిచ్చాడు. దీనిని సహించలేని జహంగీర్ గురుహర గోవింద్‌ను ఢిల్లీలో దర్బారుకు రప్పించి, తండ్రి తరపున జరిమానా కట్టమని గ్వాలియర్ కోటలో నిర్బంధింపజేశాడు. కొన్ని సంవత్సరాల తర్వాత జహంగీర్ మహ్మదీయ గురువు మియాన్‌మిగ్ మరియు బాబాసోయ్ చంద్ (గురునానక్ కుమారుడు) సలహా మేరకు గురుహరగోవింద్‌ను విడుదల చేశాడు. అనంతరం గురుహర గోవింద్, జహంగీర్‌ల మధ్య స్నేహసంబంధాలు నెలకొన్నట్లు పర్షియన్, శిక్కు ఆధారాలు వెల్లడిస్తూ వున్నాయి.

షాజహాన్ కాలంలో మొఘల్, శిక్కు సంబంధాలు వైరంతోనే నడిచాయి. వారి మధ్య తలెత్తిన వివాదాలు ప్రాణనష్టాన్ని కలిగించాయి. పెరుగుతూ వున్న శిక్కు బలాన్ని మొఘల్ అధికారులు సహించలేకపోయారు. 1634 నుంచి 1635 వరకు శిక్కు సేనానులకు, మొఘల్ సేనాలనులకు మధ్య పోరాటం సాగింది. ఏమైనప్పటికీ హరగోవింద్ సైనిక వ్యవహారాలు, తిరుగుబాటు ఒక క్రమపద్ధతిలో లేవు. అందుకు కారణం అవి స్థానిక కారణాలతో ముడిపడి ఉండడం కారణం.

గురుహరరాయ్ (1644-61) శిక్కుల ఏడవ గురువు. ఈయనకాలం శాంతియుతంగా గడపడంతో పాటూ మొఘులులతో సత్సంబంధాలు కొనసాగాయి. షాజహాన్ పెద్ద కుమారుడైన దారాతో సత్సంబంధాలు వుండేవి. ఉదారభావాలు గల దారాషుకో గురుహరరాయ్‌ని సందర్శించి గౌరవ మర్యాదలను ప్రదర్శించాడు. సమర్‌ఘర్ యుద్ధంలో ఓటమి తర్వాత పంజాబ్‌లో తిరుగుతూవున్న సమయంలో దారా గురురాయ్‌ని కలిశాడు. గురుహరరాయ్ దారాకు సహాయం చేసాడనడానికి ఎలాంటి ఆధారాలు లేకపోయినా ఆ భేటీకి సమాధానం యివ్వవలసిందిగా ఔరంగజేబు గురుహరరాయ్‌ని ఆదేశించాడు. ఆయన తన పెద్ద కుమారుడు రామరాయ్‌ని పంపి పరిస్థితిని వివరించడంతో ఔరంగజేబు గురుహరరాయ్‌ని మన్నించాడు.

మధ్కుల్‌లో జాట్‌లు (1669) నార్నాల్‌లో సత్నామీల తిరుగబాట్లు (1672) మొఘులులకు తలనొప్పిగా మారింది శిక్కుల నుండి కూడా ముప్పు వుందని మొఘులులు భావించారు. గురుహరరాయ్ మరణంతో శిక్కులలో వారసుడి విషయమై వివాదం ఏర్పడింది. రామ్‌రాయ్ తన సోదరుడైన హరకిషన్‌కు వ్యతిరేకంగా ఔరంగజేబు సహాయాన్ని కోరాడు. చివరకు అతని సోదరుడైన హరకిషన్ ఔరంగజేబు మద్ధతుతో గురువు అయ్యాడు. ఔరంగజేబు హరకిషన్‌పై గౌరవంతో రాజజైసింగ్‌కి రక్షణగా ఢిల్లీకి పంపాడు. ఢిల్లీలో ప్రస్తుత భాళ్వాచారూ పిలువబడే గురుద్వారాలో గురుహరకిషన్ మకాం వేశాడు. అయినా గురు హరకిషన్ ఔరంగజేబును కలుసుకోలేకపోయాడు. ఎందుకంటే ఢిల్లీలో అంటువ్యాధి వ్యాపించడం వల్ల అదిసోకి 1664లో హరకిషన్ మరిణించాడు.

గురుహరకిషన్ తర్వాత గురు తేజ్‌బహదూర్ (క్రీ.శ. 1664-76) శిక్కు గురువయ్యాడు. అంబర్ రాజు రామ్‌సింగ్ వద్ద చేరి అస్సాం చేరాడు. అనంతరం పాట్నాలో కొంతకాలం గడిపి పంజాబ్ చేరాడు. పంజాబ్ అంతా పర్యటించి రైతుల స్థితిగతులను పరిశీలించాడు. అణగారిన వారిలో ధైర్యాన్ని నింపాడు. ఇతడు తనకుతాను నిజమైన పాదుషాగా పిలుచుకొన్నాడు. స్వతంత్ర్య రాజ్య ఏర్పాటుకు వారిని ప్రోత్సహించడంతో పాటూ సైన్యాన్ని తయారుచేశాడు. దీనితో గురు తేజ్‌బహదూర్‌ను ఔరంగజేబు ఢిల్లీకి రప్పించి శిక్షించాడు. చివరకు తల నరికాడు. దీనితో శిక్కులలో తీవ్రమార్పు, రాజుపట్ల వ్యతరేకత కలిగాయి. ఇది శిక్కు ఉద్యమ గతని మార్చివేసింది. ఈ విషయం రాబోయే పాఠంలో తెలుసుకుందాము.

గురుతేజ్ బహదూర్ తర్వాత గురుగోవింద్‌రాయ్ 1676లో శిక్కుల గురువు అయ్యాడు. యుద్ధవీరుడు, సేనాని కావడం వల్ల "సన్యాసి సిపాయి" అనే పేరుపొందాడు. సాహిత్యమంటే ఆసక్తి కలిగిన ఇతను గుర్రపుస్వారీలో ఆయుధాలను ఉపయోగించడంలోనూ దిట్ట. 'ఖల్సా' విధానాన్ని ప్రవేశపెట్టాడు. పేరు వెనుక 'సింగ్' ను చేర్చుకునే సాంప్రదాయాన్ని మొదలుపెట్టాడు. దీనితో ఈయనపేరు "గురు గోవింద్‌సింగ్" అయింది. తేజ్ బహదూర్ మరణం తర్వాత ఔరంగజేబు శిక్కులపై దృష్టి పెట్టలేదు. ఔరంగజేబు 1679లో రాజస్థాన్‌కు అక్కడి నుంచి దక్కన్‌కు వెళ్ళిన సమయంలో గురు గోవింద్‌సింగ్ బలాన్ని పుంజుకున్నాడు. స్థానిక కొండజాతి రాజులతో యుద్ధాలు చేశాడు. వారికి స్థానిక మొఘల్ అధికారుల సహాయం లభించింది. శిక్కు ఆధారాల ప్రకారం మొఘల్ అధికారులు శిక్కుల పట్ల అనుసరిస్తున్న అణచివేత విధానాలను గురించి గురు గోవింద్‌సింగ్ ఔరంగజేబుకు ఉత్తరం రాశాడు. అందుకు వ్యక్తిగతంగా కలవమని ఔరంగజేబు సమాధానం యివ్వగా, గురుగోవింద్‌సింగ్ దక్కన్‌కు బయలుదేరాడు. ఈలోగా ఔరంగజేబు మరణవార్త తెలిసింది. 1798లో గురుగోవింద్‌సింగ్ దాడికి గురై మరణించాడు.

గురు గోవింద్‌సింగ్‌తో గురుపరంపర ఆగిపోయినా, వారి బలం కొనసాగింది. శిక్కుల పవిత్రగ్రంథం గురు గ్రంధసాహేబ్ శిక్కు ఉద్యమతత్త్వం తెలుపుతుంది. తర్వాతికాలంలో రాజా రంజిత్‌సింగ్ నాయకత్వంలో శిక్కుల అధికారం ఉన్నతస్థితికి చేరింది. ఈ విషయాన్ని తర్వాతి పాఠ్యాంశాలలో చదువుతారు.

## సారాంశం :

బాబర్ కాణ్వాయుద్ధంలో రాజపుత్రులను ఓడించాడు. రాజస్థాన్‌లోని అధికభాగం అక్బర్ స్వాధీనం చేసుకొని ఉత్తరభారతదేశం అంతా మొఘల్ అధికారాన్ని సుస్థిరం చేశాడు. 1567లో చిత్తోడ్‌ను అక్బర్ ముట్టడించాడు. అనంతరం రణతంబోర్‌ను ఆక్రమించాడు. మిగతా రాజపుత్రరాజులైన కలంజర్, బికనీర్, జైసల్మీర్ రాజులు అక్బర్ సార్వభౌమాధికారాన్ని గుర్తించారు. అయినా 1572లో రాజు అయిన మేవార్ రాణాప్రతాప్ నుంచి సమస్యలు ఎదురయ్యాయి. వీరత్వానికి, స్వాతంత్ర్యేచ్ఛకు రాణాప్రతాప్ చిహ్నం. చాలా రాజ్యాలు అక్బర్ వశం అవ్వడం వల్ల రాణా తిరుగుబాటు ఆ రాజపుత్ర రాజ్యాలపై కొంతమేరకు మాత్రమే ప్రభావాన్ని కనబరిచింది. జహంగీర్ అక్బర్ విధానాన్ని కొనసాగించాడు. మూడుసార్లు మేవార్‌పై దండెత్తి అమర్‌సింగ్‌ను సంధికి అంగీకరింపజేశాడు. షాజహాన్ కూడా వాయువ్య దక్కన్ దండయాత్రలో రాజపుత్రులకు నాయకత్వ బాధ్యతలు అప్పగించాడు.

ఔరంగజేబు పాలనాకాలంలో మొఘల్, రాజపుత్ర సంబంధాలు దెబ్బతిన్నాయి. మర్వార్ రాజ్య వారసత్వ విషయంలో ఔరంగజేబు జోక్యం చేసుకోవడం అందుకు కారణం మేవార్ కూడా అదేదారిలో నడిచింది. రాజపుత్రులు గెరిల్లా యుద్ధ పద్ధతులను అనుసరించి మొఘల్ సైన్యాన్ని ఇబ్బందులకు గురిచేశారు. తర్వాతి కాలంలో ఒప్పందం కుదిరినా..సంబంధాలకు ఆటంకం కలిగింది.

గురునానక్ బోధనల వల్ల శిక్కుమతం ఆవిర్భవించింది. శిక్కు గురువులు శాంతి, సత్యాలను ప్రచారం చేశారు. గురుపరంరతో శిక్కు ఉద్యమం ముడిపడివుంది. తొలి గురువులు ఉద్యమ నిర్మాణానికి ఎంతో కృషి చేశారు. లంగర్ పద్ధతి శిక్కుమత పటిష్టతకు మసందాలు కానుకలు వసూలు చేయటానికి ఏర్పాటు చేశారు. తొలిరోజుల్లో మొఘల్ చక్రవర్తులు శిక్కుగురువులతో సత్సంబంధాలను ఏర్పాటు చేసుకున్నారు. అక్బర్ భూమిని దానం యిచ్చాడు. గురు అర్జున్‌ను కలిశాడు. గురు అర్జున్‌ను జహంగీర్ శిక్షించడంతో మొఘల్ శిక్కుల సంబంధాలు దెబ్బతిన్నాయి. షాజహాన్ కాలంలో మొఘల్ అధికారులు శిక్కులతో స్థానిక విషయాల వల్ల యుద్ధాలు చేశారు.

శిక్కు ఉద్యమం ఔరంగజేబు కాలంలో బలోపేతమైంది. 1676లో ఔరంగజేబు గురుతేజ్ బహదూర్‌ను అంతమొందించడం శిక్కు మొఘలుల సంబంధాలను మలుపుతిప్పింది. శిక్కులు సైనికశక్తిగా తయారయ్యారు. గురుగోవింద్‌సింగ్ ఖల్సా పద్ధతిని ప్రవేశపెట్టాడు. స్థానిక కొండజాతి పాలకులకు శిక్కులకు మధ్య యుద్ధాలు జరిగాయి. మొఘల్ అధికారులు స్థానిక పాలకులను సమర్థించారు. జాట్‌లు, సత్నామీలతో పాటు శిక్కులు కూడా ఔరంగజేబుకు ఇబ్బందికరంగా తయారయ్యారు.

శిక్కు మతాన్ని గురునానక్ స్థాపించారు. తొలి రోజుల్లో మొఘలులు శిక్కుల మధ్య సత్సంబంధాలు కొనసాగాయి. శిక్కుల బలం ఔరంగజేబుకు ఇబ్బందులు తెచ్చింది. శిక్కులను అణచివేసేందుకు స్థానిక రాజులకు మొఘలులు సహాయం చేశారు.

## 40.బి పాఠ్య ప్రశ్నలు

1. శిక్కు మతస్థాపకుడు ఎవరు? శిక్కుల పవిత్ర గ్రంథం ఏది?
2. గురు రామదాస్ పాత్ర ఏమిటి?
3. గురుఅర్జున్ ఏకారణం వల్ల శిక్షింపబడ్డాడు?

4. మీరి, పిరి ప్రాముఖ్యత ఏమిటి?

5. స్థానిక రాజులు శిక్కులపై ఏవిధంగా వ్యతిరేకత ప్రదర్శించారు?

## అభ్యాసం :

1. 50 పదాలలో సమాధానం యివ్వండి.

ఎ) మొఘల్ రాజపుత్రుల సంబంధాలలో కాణ్వాయుద్ధ ప్రాధాన్యత ఎట్టిది?

బి) చిత్తోడ్ ఆక్రమణ మొఘలులకు ఏవిధంగా ముఖ్యమైంది?

సి) శిక్కు ఉద్యమంలో “లంగర్”విధానం ఏమిటి?

డి) జహంగీర్ కాలంలో మొఘలుల శిక్కుల సంబంధాలు ఎందుకు దెబ్బతిన్నాయి?

2. అక్బర్ రాణాప్రతాప్‌ల మధ్య పోరాటాన్ని గుర్తించండి.

3. జహంగీర్ రాజపుత్ర విధానంలో ప్రధాన విజయాలను వివరించండి?

4. మొఘలులతో మార్వార్, మేవార్ రాజ్య సంబంధాలు ఏ కారణం వల్ల దెబ్బతిన్నాయి?

5. తొలి మొఘల్, శిక్కుల సంబంధాలు వారి వారసుల కాలం కంటే తేడాగా వుండడానికి కారణాలు ఏమి?

6. తొలి గురువులు శిక్కు ఉద్యమానికి చేసిన సేవను వివరించండి?

## కార్యక్రమాలు :

రాజపుత్రుల చరిత్ర వీరోచితమైనది. రాజస్థాన్‌లోని జానపదుల పాటలలో రాజపుత్రుల ధైర్యసాహసాలు ప్రస్ఫుటమవుతూ వుంటాయి. గ్రంథాలయం నుంచి పుస్తకాలు తెచ్చుకొని పృథ్విరాజ్‌చౌహాన్, రణసంగా, రాణాప్రతాప్, రాణి కర్నావతిల జీవిత విశేషాలను చదవండి.

## పాఠ్యాంశ ప్రశ్నలకు సమాధానాలు

**40.ఎ.** 1 ఇద్దరు సామ్రాజ్యవాదులు. అక్బర్ కోరిన వ్యక్తిగత గౌరవాన్ని రాణాప్రతాప్ తిరస్కరించడం

2. గెరిల్లా యుద్ధ పద్ధతులు

3. చిత్తోడ్ బలమైన కోట. ఇది రాజపుత్రులను బలవంతులను చేస్తుంది.

4. జోధ్‌పూర్‌ను తమ కన్నతల్లిగా రాథోర్‌లు భావించడం, ఔరంగజేబు నిర్ణయం రాథోర్‌లను బాధించింది.

**40.బి** 1. గురునానక్, గురుగ్రంథ సాహేబ్

2. కానుకలు వసూలు చేయడం, శిక్కుమతాన్ని పూజించడం

3. ఖుస్రూ తిరుగుబాట్లకు సహకారం అందించాడనే నెపంతో

4. రాజ్యాధికారానికి మీరీ చిహ్నమైతే ఆధ్యాత్మిక భావానికి పిరి చిహ్నం

5. మొఘలుల నుంచి సైనిక సహాయాన్ని కోరడం ద్వారా

# 41

# రాజపుత్రులు, శిక్కులతో మొఘలుల సంబంధాలు (2)

## 41.1 పరిచయం :

మొఘలులు రాజపుత్రుల మధ్య సంబంధాలలో అభివృద్ధిని మీరు గత పాఠంలో తెలుసుకున్నారు. రాజపుత్రులతో సత్సంబంధాలను పెట్టుకున్న మొట్టమొదటి మొఘల్ చక్రవర్తి అక్బర్ అనే విషయం మీకు గుర్తు వుంది కదా! తన విధానం వల్ల మొఘలు రాజ్యానికి రాజపుత్రుల సహకారాన్ని సంపాదించాడు. వారు గొప్ప యోధులుగా, పరిపాలకులుగా నిరూపించుకున్నారు. అక్బర్ వారసులు కూడా ఈ విధానాన్నే అనుసరించారు. అయితే ఈ సత్సంబంధాలకు ఔరంగజేబు కాలంలో ఆటంకం ఏర్పడింది. ఈ పాఠంలో రాజపుత్రులతో సంబంధాలు, అందువల్ల ఫలితాలను తెలుసుకుంటారు. అట్లే శిక్కులకు మొఘలులకు మధ్య సంబంధాలను గురించి అధ్యయనం చేస్తారు. మీకు గుర్తుంది కదా తొలిరోజుల్లో శిక్కులు మొఘలాయిల మధ్య సత్సంబంధాలు వుండేవని మీకు గుర్తుండే ఉంటుంది. అయితే ఔరంగజేబు కాలానికి వచ్చేటప్పటికి శిక్కులు బలమైన వర్గంగా తయారయ్యారు. శిక్కులు సైనికంగా, బలంగా తయారై.. మొఘలులతో రాజకీయ, సైనిక పోరాటాన్ని సాగించారు.

## 41.2 లక్ష్యాలు :

ఈ పాఠం చదివిన అనంతరం మీరు ఈ విషయాలను అర్థం చేసుకోగలరు.

1. అక్బర్ రాజపుత్ర విధానాన్ని అర్థం చేసుకోవటం
2. రాజపుత్రులపైన విజయం సాధించేందుకు అక్బర్ తీసుకున్న చర్యలు
3. మొఘలులు రాజపుత్రులమధ్య సంబంధాల వల్ల ఇరువర్గాలకు లభించిన ఉపయోగాలు
4. ఔరంగజేబు రాజపుత్ర విధానం వల్ల మొఘల్‌రాజ్యంపై ప్రభావం
5. మొఘల్ సుల్తానులకు, శిక్కులకు మధ్య తొలిరోజుల్లో వున్న వ్యతిరేకత మతసంబంధమైనది కాదు వ్యక్తిగతమైనదేననే విషయం
6. ఔరంగజేబు కాలంలో శిక్కు ఉద్యమంలో వచ్చిన మార్పుకు కారణం
7. ‘ ఖాల్సా’ ఏర్పాటులో గురుగోవింద్‌సింగ్ పాత్రను అంచనా వేయటం

## 41.3 మొఘలులు – రాజపుత్రుల సంబంధాలు :

అక్బర్ రాజపుత్రుల సంబంధాలను చదివేముందు రాజపుత్రస్థానం గురించి తెలుసుకోవాల్సిన అవసరం వుంది. రాజపుత్రస్థానం ఎడారిని పోలిన ప్రాంతం. ఆర్థికంగా లాభసాటి అయినది కాదు. కానీ దౌత్యపరంగా ప్రధానమైన ప్రాంతం. మాళ్వ, గుజరాత్ వంటి వ్యాపార, పారిశ్రామిక కేంద్రాలకు దగ్గరలో వుంది. ఈ ప్రాంతాల మీద పూర్తి అధికారం చెలాయించాలంటే రాజపుత్ర స్థానాన్ని స్వాధీనంలో వుంచుకోవాల్సిన అవసరం వుందనే విషయంను చక్రవర్తులు గుర్తించారు. గంగాయమునా అంతర్వేది ప్రాంతం మరియు గుజరాత్‌ల మధ్య వ్యాపార సంబంధాల మార్గం దక్షిణ రాజస్థాన్ గుండా సాగుతూ వుండడం వల్ల ఆప్రాంతం ఎంతో ప్రాధాన్యతను కలిగి వుంది.

రాజపుత్ర స్థానం వ్యతిరేకతకు నిదర్శనం. ఢిల్లీ సుల్తానులను నిరంతరం వ్యతిరేకించిన విషయం, రాజపుత్రులకు, సుల్తానులకు మధ్య పోరాటం విషయం మీరు గత అధ్యాయంలో చదివారు కదా ! సుల్తాన్‌లు రాజపుత్రులను ఓడించినా పూర్తిగా అణచివేయలేకపోయారు. ఢిల్లీలో బలహీనమైన పాలకులు వున్నప్పుడు రాజపుత్రులు స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకునేవారు. కనుక రాజపుత్ర స్థానం ఆక్రమణ కోసం నిరంతరం యుద్ధాలు సాగుతూవుండేవి. క్రీ.శ. 16వ శతాబ్దంలో అక్బర్ సింహాసనం అధిష్టించేనాటికి స్వతంత్రపాలకుల బలం పెరిగింది. వీటన్నిటివల్లా రాజపుత్రులు స్వతంత్రులుగా వుండేంతవరకూ మొగలులు భారతదేశంలో పూర్తి అధికారాన్ని పొందడం బలమైన రాజ్యంను ఏర్పాటు చేయడం కష్టమనే విషయం స్పష్టమైంది.

రాజకీయంగా, దౌత్యపరంగా రాజపుత్ర స్థానం ప్రాధాన్యతను అక్బర్ గుర్తించాడు. కనుక రాజపుత్ర నాయకులతో మొఘలుల సంబంధానికి కొత్త నిర్వచనం చెప్పాలని భావించాడు. అక్బర్ దౌత్యపరమైన సూక్ష్మబుద్ధి, రాజకీయ పరిజ్ఞానం గల వ్యక్తి అనే విషయం మీరిదివరకే చదివారు. విదేశంలో రాజ్యం నిర్మించడంలో వున్న కష్టాలను అక్బర్ గుర్తించాడు. భారతదేశంలోని హిందువులే కాకుండా మహ్మదీయులు కూడా మొఘలులను విదేశీయులుగానే భావిస్తూన్నారనే విషయాన్ని అక్బర్ గ్రహించాడు.

**అంతేకాకుండా**

1. రాజపుత్రులను అణచివేయకుండా ఏ బలమైన ఆక్రమణ వుండదు.
2. భారతదేశంలో వివిధ జాతుల మతాల మధ్య ఐక్యత సాధిస్తే తప్ప మొఘల్ అధికారం సుస్థిరం కాదనీ, బలమైన రాజ్యం ఏర్పడదనీ, దీనిని రాజపుత్రుల సహకారం లేకుండా సాధించడం సాధ్యం కాదు.
3. కేవలం సైనిక పరమైన విజయం వల్ల రాజపుత్రులను అణచివేయడం, లొంగదీసుకోవడం, వారి సహకారాన్ని పొందడం సాధ్యం కాదు. వారిపట్ల గౌరవ ప్రదర్శన, వారిపట్ల సమానత్వ భావాన్ని ప్రదర్శించడం పాలనలో భాగస్వాములు చేయడం వల్లనే వారి సహకారాన్ని పొందవచ్చు.
4. శిష్ట వర్గం కుట్రలు, కుతంత్రాలనుంచి రక్షణ పొందేందుకు రాజపుత్రులను విలువైన స్నేహవర్గంగా ఏర్పాటు చేసుకున్నాడు.

ఈ విషయాలను గమనించిన అక్బర్ 1. స్నేహపూర్వక సంబంధాలను ఏర్పరచుకోవడం ద్వారా వారిపై

విజయం సాధించడం. 2. యుద్ధంలో అణచివేయడం అనే విధానాలను రాజపుత్రులతో అనుసరించాడు.

అక్బర్ తన అధికారాన్ని గుర్తించవసిందిగా రాజపుత్ర పాలకులను ఆదేశించాడు. ఎవరైనా దీనిని అంగీకరించని వారిపై యుద్ధం ప్రకటించాడు. ఇలాంటి స్థితిలో చిత్తోర్, రణతంబోర్‌లపై అక్బర్ చేసిన యుద్ధాలను గత అధ్యాయాల్లో చదివారు. రణతంబోర్ పాలకులు అక్బర్ అధికారాన్ని గుర్తించగా, వారు మొఘల్ ఆస్థానంలో ఉన్నత పదవులలో నియమితులయ్యారు. మేవార్ పాలకుడు రాణాప్రతాప్ మొఘల్ అధికారాన్ని అంగీకరించక పోవడంతో దాడులు చేశారు.

రాణాప్రతాప్ ధైర్యాన్ని, నిబద్ధతను మెచ్చుకున్నా అక్బర్ విధానాలకు రాణా వ్యతిరేకంగా నిలబడని విషయం ఎవరూ కాదనలేదు. రాణాప్రతాప్ పోరాటానికి ఏవిధమైన సహకారం లభించలేదు. రాణ ఒంటిరిపోరాటం రాజపుత్రుల అధికారాన్ని కాపాడటానికి సరిపడలేదు. కనుక రాణాప్రతాప్ ప్రాంతీయ స్వాతంత్ర్యం నిలబెట్టుకోవడం లక్ష్యం చేసుకున్నాడు. కాగా మరోవైపు అక్బర్ భారతదేశంలో విశాల రాజ్యాన్ని స్థాపించడమే లక్ష్యం చేసుకున్నాడు. మేవార్ ఒంటరిపోరాటం, ఇతర రాజపుత్రుల సహకారం లేకపోవడం వల్ల రాజపుత్రుల రాజకీయాధికారాన్ని బలహీనపర్చింది. తను ప్రయోజనాల రక్షణకు రాజపుత్రులు మొఘలులతో చేతులు కలిపారు. హల్దీఘాట్ యుద్ధంను గురించి మీరు ఇదివరకే చదివారు. రాజామాన్‌సింగ్ నాయకత్వంలో అనేకమంది రాజపుత్ర నాయకులు రాణాప్రతాప్‌సింగ్‌కు వ్యతిరేకంగా అక్బర్‌వైపు నిలిచి పోరాటం చేయడం ఈ యుద్ధ విశేషం. రాజపుత్ర సైన్యాలతో పాటూ, హకీంఖాన్‌సూర్ నాయకత్వంలోని ఆఫ్ఘన్ సైన్యం ఈ యుద్ధంలో అక్బర్ వ్యతిరేకంగా పోరాడడం వల్ల హల్దీఘాట్ యుద్ధాన్ని హిందూ ముస్లింల మధ్య జరిగిన యుద్ధం అనికానీ, భారతీయులకు విదేశీయులకు మధ్య జరిగిన యుద్ధం అనికానీ చెప్పే వీలు లేదు.

అక్బర్ రాజపుత్ర ప్రధాన నాయకులతో వివాహ సంబంధాలను ఏర్పాటు చేసుకున్నాడు. ముస్లిం పాలకులకు, హిందు నాయకుల కుమార్తెలకు మధ్య వివాహాలు సాధారమైన విషయం కాదు. దేవగిరిపాలకుడు యాదవరామ చంద్రుడు తన కూతురిని అల్లాఉద్దీన్‌ఖిల్జీకి యిచ్చి వివాహం చేసిన విషయం మీరిదివరకే చదివారు. అయితే అక్బర్ వివాహ సంబంధాలు అందుకు భిన్నమైనవి. రాజపుత్ర కుటుంబాలతో వ్యక్తిగత సంబంధాలు ఏర్పాటు చేసుకోవాలని భావించాడు. ఇది రాజపుత్ర నాయకులతో సంబంధాలను బలపరుస్తుందని గ్రహించాడు. తన హిందూ భార్యలకు అక్బర్ పూర్తి మత స్వేచ్ఛనివ్వడంతో పాటూ, వారి బంధువులను ఉన్నత పదవులలో నియమించి గౌరవించాడు. అంబర్ పాలకుడు రాజా బారామల్ కుమార్తెను వివాహం చేసుకున్న అక్బర్, ఆయనను గౌరవించి లాహోర్ గవర్నర్‌గా నియమించాడు. ఆయన కుమారుడు భగవాన్‌దాస్‌ను 5000 మనసబ్‌దార్‌ను, మనమడు మాన్‌సింగ్‌ను 7000మనసబ్‌దారును చేశాడు. కాబూల్ పాలకుడుగా, బీహార్, బెంగాల్‌లకు గవర్నర్‌గా నియమించాడు. ఇలాంటి అరుదైన గౌరవం తన పెంపుడు సోదరుడైన మీరా అజీజ్ ఖాన్ కోకాకు మాత్రమే ఇచ్చాడు.

అక్బర్ రాజపుత్రులందరితోనూ వివాహ సంబంధాలను తప్పనిసరి చేయలేదనే విషయాన్ని మీరు గుర్తుంచుకోవాలి రణతంబోర్ రాజపుత్రులతో అక్బర్‌కు వివాహ సంబంధాలు లేకపోయినా రాజసూర్జన్‌సింగ్ ఘర్‌కటాంగా ప్రాంతానికి అధికారిగా నియమించడంతో పాటు 2000 మనసబ్‌దార్‌ను చేశాడు. అంతేకాకుండా సిరోహి, బన్సవారా రాజపుత్రలతోనూ వివాహ సంబంధాలు లేవు. అక్బర్, రాజపుత్రుల మధ్య సంబంధాలు వ్యక్తిగతమైనవి. అక్బర్ తన బాలుడైన కుమారుడు డేనియాల్‌ను అంబర్‌కు పెంపకానికి బారామల్ భార్యలవద్దకు పంపాడు. బారామల్‌ను ఆగ్రా పరిపాలన చూడడానికి

తాను గుజరాత్ దండయాత్రకు వెళ్ళిన సందర్భంలో నియమించాడు. క్రీ.శ. 1573లో అక్బర్ స్వయంగా బికనీర్‌లోని రాజారాయ్‌సింగ్ ఇంటికి ఆయన అల్లుడు చనిపోయిన సమయంలో వెళ్ళి ఓదార్చడంతో పాటు ఆయన కూతురు సతీసహగమనాన్ని చేసుకోకుండా చూసి రక్షించాడు.

రాజపుత్ర నాయకులను అత్యున్నత మనసబ్‌దారులుగా నియమించడమే కాకుండా సైన్యపోషణకు జాగీర్లను కూడా యిచ్చాడు. వంశపారంపర్యంగా వారికి లభించిన వారి రాజ్యాలను వారి స్థానంలోనే వుంచాడు. వారి స్వంత రాజ్యాలకంటే జాగీర్లనుంచే అధిక ఆదాయం రాజపుత్రులకు లభిస్తూ వుండేది. మొఘలు ఆస్థానంలో చేరడమనేది ఆర్థిక ప్రయోజనాన్ని లభింపజేయడమే కాకుండా, సైన్యంను పెంచుకొని తమ అధికారాన్ని విస్తృతం చేసుకొనేందుకు రాజపుత్రులకు ఉపయోగపడింది. ఈ విధంగా మొగలులను విభేదించి పోరాటం చేయడం కంటే వారితో సత్సంబంధాలను ఏర్పాటు చేసుకోవడం రాజపుత్రులకు కూడా ప్రయోజనాన్ని కలిగించింది.

అక్బర్ వంశపారంపర్యంగా లభించిన రాజ్యాలను "భోగరాజ్యాలు"గా పరిగణించేవాడు. వాటినుంచి లభించే ఆదాయం నుంచి చక్రవర్తికి బహుమానాలను చెల్లించడంతో పాటు కప్పం (పేష్‌కష్) చెల్లించాల్సి వుండేది. రాణాప్రతాప్ అక్బర్‌ల మధ్య చాలాకాలం పోరాటం సాగడానికి పేష్‌కష్ చెల్లించేందుకు రాణా అంగీకరించకపోవడమే అనే విషయం మీకు గుర్తుంది కదా ! మనసబ్‌దారులుగా నియమింపకపోయినప్పటికీ రాజపుత్రులు సైనిక సహాయం చేయాల్సి వుండేది. సైనిక సహాయం చేసేందుకు నిరాకరించినట్లయితే మొఘల్ అధికారాన్ని ధిక్కరించినట్లుగా, తిరుగుబాటు చేసినట్లుగా భావించి వారిపై అక్బర్ చర్యలు తీసుకునేవాడు.

అక్బర్ రాజపుత్రులపై సార్వభౌముడిగా వుంటూ, సామంతులు, సత్ప్రవర్తనతో వున్నంత వరకూ వారిని ఆ పదవుల్లో కొనసాగనిచ్చేవాడు. వంశపారంపర్య విషయాలలో జోక్యం చేసుకునేవాడు. అక్బర్ బిరుదునిచ్చిన వారినే రాజా అని అనేవారు. ఈ విధానం రాజపుత్రులు తిరుగుబాట్లు చేయకుండా వుండేటట్లు ఎల్లవేళలా వారు అక్బర్ అధికారాన్ని అంగీకరించేట్లు చేసింది.

మతసహనం, సర్వమానవ సమానత్వం, విశ్వశాంతి సమ్మేళనమే అక్బర్ రాజపుత్ర విధానం. ఇది రాజపుత్రులను అక్బర్‌కు దగ్గరచేసింది. క్రీ.శ. 1564లో ముస్లిమేతరులను పీడిస్తూ వుండిన జిజియాపన్నును రద్దుచేశాడు. తన పరిపాలనలోనూ, రాజ్యవిస్తరణలోనూ తమతోపాటూ సమానంగా పాల్గొంటూ వున్న వారిపై ఇది అన్యాయమైన పన్ను అని అక్బర్ భావించాడు. అంతకుముందే అక్బర్ యాత్రాపన్నును రద్దు చేయడంతో పాటూ, యుద్ధఖైదీల మతమార్పిడికి స్వస్తి పలికాడు.

మొత్తం మీద అక్బర్ రాజపుత్ర విధానం మొఘల్ రాజ్యంతోపాటు రాజపుత్రులకు కూడా ప్రయోజనకరంగా వుందనేది సుస్పష్టం. మొఘల్ సైన్యంలో రాజపుత్రులు భాగస్వాములయ్యారు. మొఘల్ రాజ్య విస్తీర్ణానికి, సుస్థిరతకు రాజపుత్రులు వీరోచితంగా, నమ్మకంగా పోరాటం చేశారు. దీనికి తోడూ రాజపుత్ర స్థానంలో శాంతియుత పరిస్థితులు ఏర్పడ్డాయి. తమ రాజ్యాన్ని గురించి భయాందోళనలు లేకుండా దేశంలోని అనేక ప్రాంతాలకు రాజపుత్రులు సేవచేయగలిగారు. వీటికితోడు వారికి మొఘల్ ఆస్థానంలో ఉన్నతమైన పదవులను పొందారు. వారికి కేటాయించిన జాగీర్లవల్ల రాజకీయంగా, ఆర్థికంగా వారికి రక్షణ చేకూరింది.

## అక్బర్ రాజపుత్ర విధానంలోని ప్రత్యేక లక్షణాలు :

1. తన సార్వభౌమాధికారాన్ని గుర్తించమని ఆదేశించాడు. అందుకు అంగీకరించకపోతే యుద్ధం ప్రకటించేవాడు.
2. రాజపుత్రులతో వివాహ సంబంధాలను ఏర్పాటు చేసుకోవడంతో పాటూ వ్యక్తిగత సంబంధాలను పటిష్టపర్చుకున్నాడు. హిందూ భార్యలకు మత స్వేచ్ఛనివ్వడంతో పాటూ, ఆమె బంధువలను ఉన్నత పదవులలో నియమించాడు.
3. అధికసంఖ్యలో రాజపుత్ర నాయకులను మొఘల్ దర్బారులోఉన్నత పదవులలో నియమించడంతో పాటు వారిని మొఘల్ అధికారులతో సమానంగా గౌరవించాడు.
4. వంశపారంపర్యంగా రాజపుత్రులకు లభించిన రాజ్యాలతోపాటు వారికి జాగీర్లను కేటాయించాడు. ఫలితంగా రాజపుత్రులకు ఆదాయ వనరులుపెరిగాయి.
5. విశాలమైన మత సహన విధానాన్ని విశ్వమానవ ప్రేమ, శాంతిలను ముస్లిమేతర ప్రజలపైన చూపాడు.
6. వారసత్వంగా అధికారం యిచ్చే హక్కును ఉపయోగించుకున్నాడు.

వారసత్వ యుద్ధంలో ఔరంగజేబు రాజపుత్ర అధికారులైన రాజాజైసింగ్, మీర్జా రాజజైసింగ్ , రాజాజస్వంత్‌సింగ్ వంటి వారి సహకారాన్ని పొందడంలో విజయం సాధించాడు.

ఔరంగజేబు సింహాసనాన్ని అధిష్టించిన తొలిరోజుల్లో రాజపుత్రులతో సత్సంబంధాలను కొనసాగించాడు. షాజహాన్ కాలంతో పోలిస్తే ఔరంగజేబు కాలంలోనే కొన్ని విషయాలలో రాజపుత్రుల పరిస్థితి మెరుగ్గా వుండింది. షాజహాన్ పాలనాకాలంలో ఏ రాజపుత్రరాజునూ 7000 మనసబ్‌దారుగా నియమింపబడలేదు. అయితే ఔరంగజేబు కాలంలో రాజాజస్వంత్‌సింగ్, రాజామీర్జా జైసింగ్‌లు 7000 మనసబ్‌దారులుగా నియమితులయ్యారు. ధర్మాత్ యుద్ధంలో ఔరంగజేబుకు వ్యతిరేకంగా పోరాడినా, తర్వాత ఔరంగజేబుకు సహకరించే షాషుజాకు వ్యతిరేకంగా యుద్ధం చేశాడు. గుజరాత్ గవర్నర్‌గా రెండుసార్లు నియమింపబడ్డాడు. కేవలం యువరాజులకు మాత్రమే లభిస్తూవున్న దక్కన్ సుబేదారు పదవిలో ఔరంగజేబు జైసింగ్‌ను నియమించాడు. అంతేకాకుండా రాజపుత్ర సైనికులకు కూడా ఉన్నత పదవులు ఔరంగజేబు కాలంలో లభించాయి.

సమకాలీన ఫ్రెంచి యాత్రికుడైన బెర్నీయర్ ఔరంగజేబు ఉదారవాదాన్ని గుర్తించాడు. ఔరంగజేబు రాజపుత్ర నాయకులను అనేకమందిని తన ఆస్థానంలో ఉన్నతస్థానాల్లో నియమించడంతో పాటూ మహ్మదీయ అధికారులతో సమానంగా చూసినట్లు బెర్నియర్ పేర్కొన్నారు. 1679వ సంవత్సరంలో ఔరంగజేబు జిజియాపన్నును పునరుద్ధరించాడు. మేవార్, మార్వార్ వల్ల ఔరంగజేబు విధానంలో మార్పు వచ్చినట్లుగా కొందరు పండితులు పేర్కొన్నారు. అయితే ఔరంగజేబు లక్ష్యం మార్వార్ రాజ్యాన్ని రెండు భాగాలుగా విభజించి బలహీన పరచడమేగానీ మతం వల్ల కాదని చెప్పవచ్చు. ఈ రాజ్యాలను ఇతరులకు అప్పగించారు. తర్వాతి కాలంలో వారసత్వ విషయాల్లో జోక్యం అధికమైంది. 1679 తర్వాతనే అనేకమంది మహారాష్ట్రులు మొఘల్ అధికారులుగా చేరారనే విషయం గమనించవలెను. అందువల్ల 24శాతం మేర షాజహాన్ కాలంలో వున్న హిందూ అధికారుల సంఖ్య ఔరంగజేబు కాలలో 33శాతంకు పెరిగింది.

మర్వార్, మేవార్‌లతో మొఘల్ సంబంధాలు దెబ్బతినడం వల్ల రాజపుత్రులందరితో సంబంధాలు తెగిపోలేదు. ఎక్కువమంది రాజపుత్రులు ఈ విషయంలో జోక్యం చేసుకోలేదు. హదాలు, కచ్వాన్, భతియాలు, బకనీర్ రాథోడ్‌లు మొఘలులతో సత్సంబంధాలు కలిగి వారి సేవలోనే కలిగారు. రాథోర్‌లతో జరిగిన యుద్ధాలలో మొఘల్ సైన్యంలో కొంతరాజపుత్ర సైన్యం కూడా పాల్గొనడం గమనించదగ్గది. అంతేకాకుండా రాజపుత్ర అధికారులు మొఘలులతో సత్సంబంధాలను కొనసాగించాడు.

ఔరంగజేబు మార్వార్, మేవార్ రాజ్యాల పట్ల అనుసరించిన విధానంలో రాజకీయ విజ్ఞత లోపించింది. వీటివల్ల మొఘలులకు ఏమీ ప్రయోజనం లేకపోగా, మరోవైపు ఈ రాజ్యాల విషయంలో మొఘలుల ఓటమి మొఘల్ రాజ్య ప్రతిష్ఠను దెబ్బతీసింది. అక్బర్‌కాలంలో రాజపుత్రులకు మొఘలులకు నమ్మకంగా వుండేవారు కానీ, ఔరంగజేబు ప్రవర్తన, రాజపుత్ర రాజుల పట్ల అగౌరవ భావం వారిలో అపనమ్మకానికి కారణం అయింది. దీనికి తోడు మార్వార్, మేవార్ రాజ్యాలతో సంబంధాలకు ఆటంకం కలగడం మొఘలు రాజపుత్రుల సంబంధాలను బలహీనపరిచాయి. ఇవి జాట్లు, శిక్కులు మొదలైన వారి పోరాటానికి స్ఫూర్తినిచ్చాయి. అంతేకాకుండా హిందూ, ముస్లిం అధికారులతో కూడిన బలమైన పాలకవర్గం ఏర్పడేందుకు కూడా ఇది అవరోధాలను కల్పించింది. మొఘలులకు రాజపుత్రుల సహకారం లోపించడం వల్ల మహారాష్ట్రులతో చర్చలు జరపడం కష్టతరమైంది.

## 41.ఎ పాఠ్య ప్రశ్నలు

1. హల్దీఘాట్ యుద్ధం రెండు మతాల మధ్య జరిగిన యుద్ధం కాదు అనేదానికి ఒక కారణం తెల్పండి?
2. అక్బర్ ఏర్పరచుకున్న వివాహ సంబంధాల గతంలో జరిగిన వివాహ సంబంధాల కంటే ఏవిధంగా భిన్నమైనవి?
3. ఔరంగజేబు కాలంలో మార్వార్, మేవార్‌లతో మొఘల్ సంబంధాలకు ఆటంకం కలిగేందుకు ప్రధానమైన కారణం ఏమిటి?

## 40.4 మొఘల్ – శిక్కు సంబంధాలు :

ఔరంగజేబు కంటేముందే మొఘలులు శిక్కులకు మధ్య ఎటువంటి వ్యతిరేక పరిస్థితి లేదు. శిక్కు గురువుల ప్రభావానికి లోనై అక్బర్ వారితో సత్సంబంధాలను ఏర్పాటు చేసుకున్నాడు. ఖుస్రూ తిరుగుబాటుకు సహకరించాడనే ఉద్దేశ్యంతో గురుఅర్జున్‌ను జహంగీర్ శిక్షించడంతో మొదటిసారిగా వ్యతిరేకత ఏర్పడింది. తర్వాతికాలంలో జహంగీర్‌తో ఆయన సత్సంబంధాలను ఏర్పాటు చేసుకొన్నాడు. జహంగీర్ కాశ్మీర్ వెళ్ళే సమయంలో వెంటవెళ్ళాడు. అయితే షాజహాన్‌తో విభేదాలు ఏర్పడ్డాయి. ఈ సమయానికి శిక్కు గురువుకు బలం ఏర్పడింది. షాజహాన్‌తో విభేదాల కారణంగా శిక్కుగురువు పంజాబ్‌లోని పర్వతప్రాంతాలకు వెళ్ళి విశ్రాంత జీవనం గడపసాగాడు.

ఇలా ఈ సమయంలో హిందువుల నాయకులుగా నిలబడే అవకాశం లేక పోయింది. శిక్కులకు మొఘలుల మధ్య ఏర్పడిన సమయానుకూలమైన వ్యతిరేకత రాజకీయపరమైన మరియు వ్యక్తిగతమైనదే కానీ, మతపరమైనది కాదు. శిక్కు మొఘలు సంబంధాలు పూర్తిగా తెగిపోయేందుకు ఇవి కారణం కాలేదు. శిక్కుగురువు 'సచ్చాపాదుషా'(నిజమైన స్వాభౌముదు) గా పిలవబడ్డాడు. వారికి తగినంతమంది అనుచరులు వున్నారు. నిర్ణీత దుస్తులను ధరించడంతో పాటు

మధ్య ఆసియా ప్రాంతం నుంచి సంపాదించారు. 'దశావంథ్' పేరుతో ఆదాయంలో పదవవంతును తమ అనుచరులనుంచి వసూలు చేసేవారు. రాజకీయ, వ్యక్తిగత విభేదాలు విరోధంగా తర్వాతి మొఘల్ పాలకుల కాలంలో మారాయి. వారు అక్బర్ మాదిరి ఉదారవాదులు కాకపోవడం గమనించవలెను.

క్రీ.శ. 1675లో గురుతేజ్ బహదూర్‌ను ఉరితీయడంతో ఔరంగజేబు శిక్కుల మధ్యన పోరాటం ప్రారంభమైంది. తొలిరోజుల్లో ఔరంగజేబుకు శిక్కులతో సత్సంబంధాలు వుండేవి. శిక్కు గురువు కుటుంబంలోని వారసత్వ తగాదాలు ఔరంగజేబు శిక్కులకు మధ్య వైరానికి కొంతవరకు కారణమయ్యాయి. అయితే ఖచ్చితమైన కారణం విషయమై స్పష్టత లేదు. శిక్కు సాంప్రదాయం ప్రకారం శిక్కు గురుస్థానం కోసం రామ్‌రాయ్ చేసిన కుట్ర వైరానికి కారణం కావచ్చు. దీనికి తోడు నిజమైన సార్వభౌముడిగా పిలవబడ్డ శిక్కుగురువు సైన్యంతో రాజువలె జీవనం సాగించడం, కాశ్మీర్‌లో హిందువులను బలవంతంగా ముస్లింలుగా మార్చడాన్ని వ్యతిరేకించడం కూడా కారణాలు. కొందరు ముస్లింలు శిక్కు గురువు అనుచరులుగా మారడం ఔరంగజేబుకు కోపకారణమైందని కొందరు పేర్కొన్నారు. గురువు అనుచరులు భారీ మొత్తంలో పన్నులు వసూలు చేయడం ఔరంగజేబుకు కోపాన్ని తెప్పించిందని మరికొందరు అభిప్రాయం. కులరహిత సమాజం కోసం ఉద్యమిస్తున్న శిక్కు గురువులతో అణగారిన వర్గాలవారు, భూమిలేనివారు కలిసి, భూస్వాముల, అధికారుల క్రూరత్వాన్ని వివరించేవారు. ఇది కూడా ఔరంగజేబుకు కోపం తెప్పించింది. వీటన్నింటివల్ల శిక్కులు-మొఘలుల మధ్య వైరం తీవ్రతరమైంది.

గురుగోవింద్ సింగ్ నాయకత్వంలో శిక్కు ఉద్యమంలో మార్పు వచ్చింది. గురుతేజ్ బహదూర్‌ను శిక్షించడం శిక్కులను మొఘలాయిలకు వ్యతిరేకులుగా మార్చింది. గుర్రాలను, ఆయుధాలను బహుమతులుగా తీసుకోవడం గురుగోవింద్ సింగ్ ప్రారంభించాడు. బలమైన సైన్యాన్ని ఏర్పాటు చేశాడు. అందులో అనేకమంది జాట్లు చేరారు. క్రీ.శ. 1699లో ఖాల్సాను ప్రవేశపెట్టాడు. ఇది గురునానక్ ప్రారంభించిన విధానంలో మార్పుకు చిహ్నం. మొదటి ఐదుమంది గురువులు దేవుడు ఒక్కడే, విగ్రహారాధన, పూజావిధానం అవసరం లేదని బోధనలు చేశారు. మొదటిసారిగా ఆరవ గురువైన హరగోవింద్ మొదటిసారిగా సైనికులను ఏర్పాటు చేయడమనేది క్రమంగా ఖాల్సాకు దారితీసింది. ఖాల్సా అణచివేత విధానాలను వ్యతిరేకించేందుకు సాధనమైంది. అయినప్పటికీ శిక్కుల ఉద్యమం శిక్కులకు ముస్లింలకు మధ్య కాదనేది గుర్తుంచుకోవాలి. గురుగోవింద్ రచనల్లోగాని, శిక్కు రచనల్లో గానీ ఎక్కడా ప్రతీకారంను గురించి కనిపించదు. గురుగోవింద్‌సింగ్‌కు ముస్లింల పట్లకాని, మతం పట్లగానీ వ్యతిరేకత లేదు. తన సైన్యంలో ఐదువందలమంది పఠాన్ ముస్లిం జాతీయులు వుండడం అనే నిజాన్ని మరచిపోరాదు.

కొండప్రాంతాలలోని స్థానిక హిందూ రాజులకు శిక్కు గురువులకు మధ్య విభేదాలు ఏర్పడ్డాయి. శిక్కు గురువులు బలవంతులవుతారని తమకు పోటీ అవుతారని వారు భావించారు. తాము ఒక్కరే శిక్కులతో పోరాటం చేయలేక ఔరంగజేబు సహకారాన్ని కోరారు. పెరుగుతూ వున్న శిక్కు బలంతో కలత చెందిన ఔరంగజేబు కూడా వారికి సహకరించేందుకు అంగీకరించి స్థానిక రాజులకు సహాయం చేయమని మొఘల్ గవర్నర్‌ను ఆదేశించాడు. యుద్ధరంగంలో గురువు తన ఇద్దరు పెద్ద కుమారులను కోల్పోయాడు. మరో ఇద్దరు చిన్న కుమారులను మొఘల్ అధికారి వజీర్‌ఖాన్ బంధించి శిక్షించాడు.

ఈ సమయంలో కూడా గురుగోవింద్‌సింగ్ ఔరంగజేబును కలిసేందుకు ప్రయత్నించాడు. మొఘల్ అధికారుల

దశ్చర్యలను ఔరంగజేబుకు వివరించాలని భావించాడు. క్రీ.శ. 1706లో ఔరంగజేబు ఆహ్వానం మేరకు దక్కన్‌లోవున్న ఔరంగజేబును కలిసేందుకు పయనమయ్యాడు. ఈ లోగానే ఔరంగజేబు మరణించాడు. మరుసటి సంవత్సరమే గురుగోవింద్‌సింగ్ కూడా మరణించాడు. స్వతహాగా మొఘల్ రాజ్యాన్ని ధిక్కరించగలిగినంత బలమైన తిరుగుబాటు కాదు శిక్కుల తిరుగుబాటు. జాట్‌ల తిరుగుబాటులాగా పెరుగుతూవున్న వ్యతిరేకతకు నిదర్శనం. ఇది మొఘల్ గౌరవానికి కొంతమేరకు భంగం కలిగించాయి. హిందూ వ్యతిరేక విధానాలు, ఔరంగజేబు ప్రవర్తనల వల్లే ఈ తిరుగుబాట్లు జరిగినట్లుగా కొందరు అభిప్రాయపడ్డారు. అయితేవారు, రాజపుత్రులు, పంజాబ్‌లో కొండప్రాంత పాలకులు, గంగామైదానంలోని హిందూ రైతులు ఈ ఉద్యమానికి దూరంగా వున్నారనే విషయాన్ని గుర్తించలేకపోయారు.

తొలినాటి శిక్కు ఉద్యమం శాంతియుతమైంది. ఏమైనప్పటికీ రైతులు, చేతివృత్తుల వారిలో పెరుగుతూవున్న అసంతృప్తి బలాన్ని చేకూర్చింది. గురుతేజ్ బహదూర్‌ను వధించటం ఔరంగజేబుకు శిక్కులను వ్యతిరేకులను చేసింది. దీనితో ఉద్యమం సైనికరూపంగా మారింది.

## 41. బి. పాఠ్య ప్రశ్నలు

1. జహంగీర్ ఏ చర్య శిక్కులకు కోపకారణమైంది?
2. ఖాల్సాను ఏర్పాటుచేసిన శిక్కు గురువు ఎవరు?
3. మొఘల్–శిక్కుల మధ్య పోరాటం మతపరమైనది కాదు ఆర్థిక పరమైనదనడానికి సాక్ష్యాలు ఏమిటి?

### సారాంశం :

రాజపుత్రుల సహకారం లేకుండా మొఘల్ రాజ్య విస్తరణ, స్థిరీకరణ సాధ్యం కాదని గుర్తించిన మొదటి మొఘల్ సుల్తాన్ అక్బర్. అందువల్ల తన రాజ్యంలో చేరేందుకు వారిని ప్రోత్సహించాడు. వారికి రాజ్యంలో పాలన ఉన్నత పదవులను యిచ్చాడు వారితో వివాహ సంబంధాలను ఏర్పాటు చేసుకున్నారు. తన హిందూ భార్యలకు మత స్వేచ్ఛను యిచ్చాడు. అంతేగాకుండా రాజపుత్రులతో అక్బర్ వ్యక్తిగత సత్సంబంధాలను ఏర్పాటు చేసుకున్నాడు. రాజపుత్రులు కూడా అక్బర్‌తో కలవడం వల్ల తమకు ఉపయోగం అని గుర్తించారు. అయితే రాణాప్రతాప్ లాంటివారు మొఘలులను ధిక్కరించారు. వారిని అణచివేసేందుకు అక్బర్ సైనిక చర్యలు తీసుకున్నాడు. రాజపుత్రులతో సత్సంబంధాలు మొఘల్ రాజ్యానికి ఎంతో ఉపయోగపడ్డాయి. అయితే ఔరంగజేబు కాలంలో ఈ సంబంధాలు దెబ్బతిన్నాయి. మార్వార్ వారసత్వ విషయంలో ఔరంగజేబు జోక్యం చేసుకోవడం వారు వ్యతిరేకులు కావడానికి కారణం కాగా, మార్వార్‌తో పాటు మేవార్ కూడా ఔరంగజేబుకు వ్యతిరేకంగా మారింది. ఔరంగజేబు విధానం అనేకమంది రాజపుత్రులకు వ్యతిరేకులను చేసింది. ఇది ఇద్దరిమధ్యా దురాన్ని పెంచి మొఘల్ రాజ్యానికి కష్టాలను కలిగించింది.

ఔరంగజేబు పరిపాలన ప్రారంభించేంత వరకు మొఘల్ శిక్కుల మధ్య సత్సంబంధాలు వుండేవి. గురుఅర్జున్‌ను శిక్షించడం శిక్కులలో వ్యతిరేకతకు కారణమైనా వారి మధ్య సంబంధాలు పూర్తిగా తెగిపోలేదు. అయితే గురుతేజ్ బహదూర్‌ను ఔరంగజేబు శిక్షించడం శిక్కు ఉద్యమంలో మార్పుకు కారణమైంది. గురుగోవింద్ సింగ్ నాయకత్వంలో శిక్కులు సైనికశక్తిగా తయారయ్యారు. ఖాల్సా ఏర్పాటు చేయబడింది. దీనితో గురువుల బలం పెరిగింది. అణగారిన వర్గాలకు నాయకత్వం వహించి పంజాబ్‌లోని కొండప్రాంతాల పాలకులకు వ్యతిరేకంగా పోరాటం ప్రారంభించగా,

ఔరంగజేబు వారిని అణిచివేసేందుకు స్థానిక పాలకులకు సహాయం చేశాడు. స్వతహాగా శిక్కు ఉద్యమం మొఘల్ రాజ్యాన్ని ధిక్కరించగల బలమైనది కాకపోయినా జాట్, ఆఫ్ఘన్‌ల ఉద్యమం లాగానే సమాజంలో అసంతృప్తికి నిదర్శనంగా చెప్పవచ్చు.

**అభ్యాసం :**

1. అక్బర్ అనుసరించిన రాజపుత్ర విధానానికి ప్రధాన కారణాలు ఏవి?
2. రాణాప్రతాప్ ధైర్యశాలి అయిన గొప్పపాలకుడే అయినా స్థానిక కారణాలనే నిలబడుటకు కారణం ఏమి?
3. అక్బర్ రాజపుత్ర విధానంలోని ప్రధాన లక్షణాలు ఏవి? అవి ఎంతవరకు విజయం సాధించాయి.
4. ఔరంగజేబు రాజపుత్ర విధానం అక్బర్ విధానం కంటే ఎందుకు విరుద్ధమైంది? అది మొఘల్ రాజ్యానికి ఏవిధంగా హాని కలిగించిందో వివరించండి.
5. ఔరంగజేబు కంటే ముందు శిక్కు ఉద్యమ లక్షణాలను మార్పులను వివరించండి?

## పాఠ్య ప్రశ్నలకు సమాధానాలు :

### 41. ఎ.

1. అక్బర్ సైన్యాలకు రాజపుత్రుడైన రాజామాన్‌సింగ్ నాయకత్వం వహించగా, రాణాప్రతాప్ సైన్యాలకు ఆఫ్ఘన్ అయిన హకీంఖాన్ సూర్ నాయకుడు కావడం
2. a అక్బర్ తన భార్యలకు మత స్వేచ్ఛనిచ్చాడు.

   b తన భార్యల బంధువులకు ఉన్నత స్థానాలను యిచ్చాడు.

   c వారితో వ్యక్తిగత సత్సంబంధాలను ఏర్పాటు చేసుకున్నాడు.
3. రాజా జస్వంత్‌సింగ్ మరణానంతరం మార్వార్ వారసత్వం విషయంలో జోక్యం చేసుకోవడం

### 41. బి.

1. గురుఅర్జున్‌ను శిక్షించడం
2. గురుగోవింద్ సింగ్
3. గురుగోవింద్ సైన్యంలో ఆఫ్ఘన్‌లు వుండడం

# 42

# మొఘులుల దక్కన్ విధానం

## 42.1 పరిచయం :

భారతదేశంలోని దక్కన్ ప్రాంతం ఉత్తర దేశపాలకులను ఎప్పుడూ ఆకర్షిస్తూ వుండేది. ఢిల్లీ సుల్తానుల కాలంలో అల్లావుద్దీన్ ఖిల్జీ దక్కన్ సంపదను పొందడంతో పాటూ నామమాత్రపు సార్వభౌమాధికారాన్ని సంపాదించాడు. మహ్మదీన్ తుగ్లక్ పాలనకాలంలో దక్కన్‌లో చాలా ప్రాంతాలు ఢిల్లీ సుల్తానుల రాజ్యంలో విలీనం అయ్యాయి.

క్రీ.శ. 16వ శతాబ్దం ప్రారంభంలో ఖాందేష్, బీరార్, అహ్మద్‌నగర్, బీజాపూర్, గోల్కొండ, బీదర్, విజయనగరం అనే ఏడు రాజ్యాలు వుండేవి. 1664లో విజయనగర రాజ్యం పతనమైంది. బీరార్‌ను బీజాపూర్, బీదర్‌ను అహ్మద్‌నగర్ సుల్తాను స్వాధీనం చేసుకోవడంతో బీరార్, బీరద్ రాజ్యాలు కూడా అంతమయ్యాయి. అక్బర్ పరిపాలన చేపట్టేనాటికి దక్కన్‌లో నిజాంషాహీల స్వాధీనంలో అహ్మద్‌నగర్, అదిల్‌షాహీ స్వాధీనంలోని బీజాపూర్, కుతుబ్‌షాహీల స్వాధీనంలోని గోల్కొండ రాజ్యాలు వుండేవి. ఈ మూడు రాజ్యాలు కూడా దక్కన్‌లో ఆధిపత్యం సంపాదించడానికి తమలో తాము కలహించుకుంటూ వుండేవారు. ఈ ముగ్గురికి తోడు మహారాష్ట్రులు కూడా దక్కన్‌లో అవతరించారు. దక్కన్ రాజ్యంలో ఇది విభిన్నమైనది, మొఘులులకు వ్యతిరేకమైనది. కాబట్టి మొఘల్ రాజ్యాలు వీరితో పొత్తు కోసం ప్రయత్నించేవారు.

దక్కన్‌లోని సంఘటనలకు కారణాలను ఈ పాఠ్యాంశంలో అధ్యయనం చేస్తారు. దక్కన్ పాలకులు మొఘల్ సార్వభౌమాధికారాన్ని అంగీకరించడం వల్ల అక్బర్, జహంగీర్‌లు సంతృప్తి చెందడం మీరు తెలుసుకుంటారు. అయితే షాజహాన్, ఔరంగజేబులు మరింత తీవ్రమైన దక్కన్ విధానాన్ని అనుసరించారు.

## 42.2 లక్ష్యాలు :

ఈ పాఠ్యాంశం చదివిన తర్వాత మీరు ఈ విషయాలను అర్థం చేసుకోగలరు.

1. అహ్మద్‌నగర్ విషయంలో జోక్యం చేసుకోవడంలో అక్బర్ లక్ష్యాలు
2. ఖాందేష్, బీరార్, బాటాఘాట్‌లను ఆక్రమించుకోవడంలోను, ఆహ్మద్‌నగర్‌పై ఆధిపత్యం సంపాదించేందుకు ఆక్బర్ తీసుకున్న చర్యలు మీరు అర్థం చేసుకోగలరు.
3. దక్కన్ రాజకీయాలలో అహ్మద్‌నగర్ పాలకుడు మాలిక్ అంబర్ పాత్ర

4. అక్బర్ దక్కన్ ఆక్రమణ విధానాన్ని జహంగీర్ కొనసాగించకపోవడానికి కారణాలు

5. షాజహాన్ దక్కన్ విధానం అహ్మద్‌నగర్ విలీనానికి ఏవిధంగా దారితీసిన వైనం

6. బీజాపూర్, గోల్కొండలను మొఘల్‌రాజ్యంలో విలీనం చేయడంలో ఔరంగజేబు అనుసరించిన విధానాలు.

## 42.3 ఖాందేష్, బీరార్, బాలాఘాట్ మరియు అహ్మద్‌నగర్ పట్ల అక్బర్ విధానం :

క్రీ.శ. 16వ శతాబ్ధం అక్బర్ ఉత్తర భారతదేశాన్ని పూర్తిగా స్వాధీనం చేసుకోవడంతో పాటూ రాజ్యస్థిరీకరణ సాధించాడు. కాబట్టి అక్బర్‌దృష్టి దక్కన్ పై పడింది. అంతేకాకుండా విశాల భారతదేశరాజ్యం ఆలోచనకు ఇది దోహదపడింది. తన సార్వభౌమాధికారాన్ని అంగీకరించవలసిందిగా రాయబారులను దక్కన్ రాజ్యాలకు పంపాడు కానీ ఉపయోగం లేదు. దక్కన్ రాజ్యాలు మొఘల్ సార్వభౌమాధికారాన్ని గుర్తించాలటే సైనికచర్య తప్పదని గ్రహించాడు.

క్రీ.శ 1576లో మాళ్వా, గుజరాత్ ఆక్రమణల తర్వాత మొఘల్ సైన్యం ఖాందేష్‌పై దండయాత్ర చేసింది. ఖాందేష్ చిన్న రాజ్యమే అయినా దౌత్యపరంగా ముఖ్యమైంది. సారవంతమైన ప్రాంతం కాకపోయినా, మళ్వా, గుజరాతీలకు వెళ్ళే మార్గంలో వున్న కీలకమైన ప్రాంతం. అంతేకాకుండా దక్కన్ దండయాత్రలకు, కార్యకలాపాలకు మొఘులులకు ఇది కీలకమైన ప్రాంతం. మొఘల్ అధికారాన్ని అంగీకరించవలసిందిగా ఖాందేష్ పాలకులపై ఒత్తిడి తెచ్చాడు. ఏమైనప్పటికీ 1586 నుండి 1598 వరకూ దక్కన్‌లో అక్బర్ ఎటువంటి ప్రగతి సాధించలేకపోయాడు. దానికి అక్బర్ వాయువ్యప్రాంతం విషయంలో తీరిక లేకపోవడమే కారణం.

క్రీ.శ 1591లో అక్బర్ మరోసారి తన సార్వభౌమాధికారాన్ని గుర్తించమని దక్కన్ రాజ్యాలకు రాయభారం పంపాడు. అయితే ఎవ్వరూ అంగీకరించలేదు. ఖాందేష్ మాత్రమే సైన్యాన్ని పంపండంతో మొఘల్ సార్వభౌమాధికారాన్ని గుర్తించాడు. బీరార్‌ను పొందాలను కోవడం అహ్మద్‌నగర్ రాజ్యంలో అక్బర్ జోక్యానికి ప్రధానమైన కారణం. బీరార్‌ను ఇటీవలే అహ్మద్‌నగర్ ఆక్రమించకున్న విషయం గుర్తుంది కదా! మరియు బాలాఘాట్‌ను కూడా స్వాధీనం చేసుకోవాలనుకున్నాడు. అహ్మద్‌నగర్, గుజరాత్‌ల మధ్య ఇది కీలకమైన ప్రాంతం కావడం అందుకు కారణం. అహ్మద్‌నగర్ పాలకుడైన బలహాన్ నిఖాంషాహీ 1595లో మృతి చెందడంతో సింహాసనం కోసం జరిగిన పోటీని ఆధారంగా చేసుకుని అక్బర్ అహ్మద్‌నగర్‌లో జోక్యం చేసుకన్నాడు. బురహాన్ మృతి చెందడంతో దర్బారులోని అధికారులు వర్గాలుగా విడిపోయి, ఒకవర్గం ఒక్కొక్కరిని సింహాసనం కోసం ప్రతిపాదించసాగింది. కొందరు బురహాన్ సోదరి అయిన చాంద్‌బీబి మరియు బీజాపూర్ పాలకుడు ఇబ్రహీం ఆదిల్‌షాలు బురహాన్ కుమారుడు బహదూర్‌ను సింహాసనం అధిష్టింపజేసేందుకు ప్రయత్నించారు. బీజాపూర్ జోక్యంతో భయందోళనలకు గురైన కొందరు అహ్మద్‌నగర్ అధికారులు మొఘులుల సహాయాన్ని కోరారు.

గుజరాత్ గవర్నర్‌గా వున్న యువరాజు మురాద్ మరియు అబ్దుల్ రాహీంఖాన్–ఇ–ఖానమ్‌ల నాయకత్వంలో మొఘల్ సైన్యం ఖాందేష్ వారి సహకారంతో అహ్మద్‌నగర్‌పై దండయాత్ర చేసింది. ఈ దండయాత్రను చాంద్‌బీబీ నాయకత్వంలోని అహ్మద్‌నగర్ సైన్యం ఎదుర్కొంది. అహ్మద్‌నగర్ కోట ముట్టడి నాలుగు నెలలపాటు సాగింది. చివరకు 1596లో ఇరువర్గాలు సంధికి అంగీకరించాయి. దీనిప్రకారం బీరార్‌ను మొఘులులకు యిచ్చివేయడంతో పాటు అహ్మద్‌నగర్ పాలకులు మొఘల్ సార్వభౌమాధికారాన్ని గుర్తించారు. ప్రతిఫలంగా బహదూర్‌ను అహ్మద్‌నగర్ పాలకుడు

మొఘలులు గుర్తించారు. అయినా అహ్మద్‌నగర్ సమస్య పరిష్కరింపబడలేదు. బీరార్‌ను మొఘలులకు యివ్వాలనే చాంద్‌బీబీ అభిప్రాయాన్ని దర్బారులోని బలమైన వర్గం వ్యతిరేకించడమే కాకుండా, బీరార్‌లో మొఘల్ అధికారానికి ముగింపు పలకాలని భావించారు. దీనికి బీజాపూర్, గోల్కొండ పాలకులు కూడా సహకరించేందుకు సిద్ధమయ్యారు. బీరార్ మొఘలుల స్వాధీనంలో వుండడం దక్కన్‌లో ప్రాబల్యాన్ని పెంచుతుందని, అందువల్ల భవిష్యత్తులో తమ రాజ్యాలపైన మొఘలులు దాడి చేసేందుకు అవకాశం కలుగుతుందని వారు భావించడం అందుకు కారణం. 1597లో మొఘల్ సైన్యం అహ్మద్‌నగర్, బీజాపూర్, గోల్కొండల సంయుక్త సైన్యంను ఓడించింది. ఈస్థితిలో బీజాపూర్, గోల్కొండలు సహకారాన్ని ఉపసంహరించడంతో అహ్మద్‌నగర్ ఒంటరిగా నిలిచింది. గతంలో జరిగిన సంధికి భంగం కలిగింది. దీనితో 1599లో అబుల్‌ఫజల్ నాయకత్వంలో మొఘల్ సైన్యం రెండవసారి అహ్మద్‌నగర్‌పై దండయాత్ర చేసింది. క్రీ.శ. 1600 సంవత్సరంలో చాంద్‌బీబీని అధికారి ఒకరు హత్యచేశారు. మొఘలులు అహ్మద్‌నగర్‌ను ముట్టడించారు గానీ మొఘల్ సామ్రాజ్యంలో దాని విలీనం షాజహాన్ కాలంలో కానీ జరగలేదు. బహదూర్ గ్వాలియర్ కోటకు పంపబడ్డాడు. బాలాఘాట్ ప్రాంతం మొఘల్ రాజ్యంలో భాగమైంది.

తర్వాత అక్బర్ మాళ్వా, ఖాందేష్‌లపై దండయాత్ర చేశాడు. ఖాందేష్ పాలకుడు అక్బర్‌కు లొంగేందుకు సిద్ధంగా లేడు. అక్బర్ ఖాందేష్‌లోని బలమైన కోట అయిన అసీఘర్ కోటను స్వాధీనం చేసుకోవాలనుకున్నాడు. మొఘలులు మొదట ఖాందేష్ రాజధాని బుబహాన్‌పూర్‌ను స్వాధీనం చేసుకున్నాడు. అసీఘర్ ముట్టడి సంవత్సరం పాటు సాగింది. చివరకు 1601లో అసీఘర్ కోట మొఘలుల స్వాధీనమైంది. దీనితో ఖాందేష్ మొఘల్ రాజ్యంలో విలీనమైంది. దక్కన్ దండయాత్రకు ఇది ప్రధాన కేంద్రమైంది.

ఖాందేష్, బీరార్, బాలఘాట్‌ల స్వాధీనం, అహ్మద్‌నగర్‌పై ఆధిపత్యం దక్కన్‌లో అక్బర్ సాధించిన విజయాలు. అయినా అక్బర్ దక్కన్‌పైన అధికారాన్ని, సుస్థిరతను సాధించలేకపోయాడు. ఖాందేష్‌పైన విజయం తర్వాత యువరాజు సలీం తిరుగుబాటు వల్ల ఉత్తర భారతదేశానికి వెళ్ళాడు. క్రీ.శ. 1605లో అక్బర్ మృతి చెందాడు. ఈ మధ్యకాలంలో దక్కన్‌పైన దృష్టి సారించే వీలులేక పోయింది. అయితే దక్కన్‌లో మరిన్ని విజయాలు సాధించేందుకు అక్బర్ తన వారసులకు దారిని సుగమం చేశాడు.

> దక్కన్‌లో మొఘల్ అధికారాన్ని పొందాలని అక్బర్ భావించాడు. అందుకోసం దౌత్య, సైనికపరమైన చర్యలు తీసుకున్నాడు. అహ్మద్‌నగర్‌లో ఏర్పడిన అనిశ్చిత పరిస్థితి అక్బర్‌కు అవకాశాన్ని యిచ్చింది. ఖాందేష్, బీరార్, బాలాఘాట్ ప్రాంతాలను వశం చేసుకోవడంతో పాటు అహ్మద్‌నగర్‌పై ఆధిపత్యం సంపాదించాడు.

## 42.4 జహంగీర్ – మాలిక్–అంబర్ విజృంభణ :

అక్బర్ మరణం మొఘల్ అధికారుల్లో అనిశ్చిత పరిస్థితికి కారణమైంది. దక్కన్‌లో మొఘలు స్థితి మొఘల్ అధికారుల మధ్య విభేదాల వల్ల బలహీనపడింది. దక్కన్‌లో స్థిరీకరణ సాధించేందుకు మొఘలులు చేసిన ప్రయత్నాలకు అహ్మద్‌నగర్‌లో మాలిక్ అంబర్ విజృంభణ ఆటంకం కలిగించింది. మాలిక్ అంబర్ మారాఠాకు చెందిన బర్గీస్ సైన్యం సహకారాన్ని పొందగలిగాడు. వీరు గెరిల్లా యుద్ధ పద్ధతుల్లో నిష్ణాతులు. గెరిల్లా యుద్ధ పద్ధతి మొఘలుకు తెలియదు.

మాలిక్ అంబర్‌కు బీజాపూర్ పాలకుడు ఇబ్రహీం అదిల్‌షా సహకారం లభించింది. బీజాపూర్ మొఘలులకు మధ్య అహ్మద్‌నగర్ ఒక బలమైన అడ్డుగోడగా భావించాడు. అదిల్‌షా తెలంగాణాలోని కాందర్ కోటను మాలిక్ అంబర్‌కు యివ్వడంతోపాటు పదివేల అశ్వికదళాన్ని మాలిక్ అంబర్‌కు యిచ్చాడు. వివాహ సంబంధంతో ఈ సంధి మరింత గట్టిపడింది. ఈ విధంగా దక్కన్‌లో మొఘలులకు వ్యతిరేకంగా కూటమి మరోసారి ఏర్పడింది.

తొలిదశలో మొఘులులపై మాలిక్ అంబర్ విజయాలను సాధించాడు. ఖాన్–ఇ–ఖానన్ బలవంతంగా బలహాన్‌పూర్ నుంచి పంపివేయబడ్డాడు. పర్వేజ్ రాకుమారిడి నాయకత్వంలోని సైన్యాన్ని మాలిక్ అంబర్ ఓడించాడు. మొఘులులు అహ్మద్‌నగర్‌ను కోల్పోవడంతో పాటూ పర్వేజ్ ఇష్టంలేని సంధికి అంగీకరించాడు. ఈవిధంగా 1610 నాటికి అక్బర్ సాధించినవన్నీ దక్కన్‌లో మొఘులులు కోల్పోయారు.

మాలిక్ అంబర్‌పైన పైచేయి సాధించే అవకాశం మొఘులులకు మాలిక్ అంబర్ బీజాపూర్, మరాఠాలలో చేసుకున్న ఒప్పందాలు బలహీన పర్చడంతో లభించింది. ఈ పరిస్థితికి మాలిక్ అంబర్ అనుసరించిన విధానమే కారణం. గోదావరిలోయ, కొంకణ్ విషయమై అహ్మద్‌నగర్, బీజాపూర్‌ల మధ్య వున్న పాతపగ కొనసాగింది. దీనిని ఆసరాగా చేసుకుని ఖాన్–ఇ–ఖానన్ మొఘులుల వైశ్రాయ్‌గా తిరిగి దక్కన్‌కు పంపబడ్డాడు. అబిసీనియా, మారాఠా అధికారులపై విజయం సాధించాడు. వారి సహాయంతో అహ్మద్‌నగర్, బీజాపూర్, గోల్కొండల సంయుక్త సైన్యాలను ఓడించాడు. ఇతర తిరుగుబాట్లను అణచే ఉద్దేశ్యంతో జహంగీర్ ఖుర్రం నాయకత్వంలో పెద్ద సైన్యాన్ని దక్కన్‌కు పంపాడు. పరిస్థితులను అర్థం చేసుకున్న అంబర్ 1618లో మొఘులులతో సంధి చేసుకున్నాడు. ఇటీవల అహ్మద్‌నగర్ ఆక్రమించుకున్న బాలాఘాట్ ప్రాంతం మొగలులకు యిచ్చివేయబడింది. అహ్మద్‌నగర్‌లోని కోటలతో పాటు, కీలకమైన ప్రాంతాలు మొఘుల్ పర్యవేక్షణ క్రిందికి వచ్చాయి.

అనంతరం రెండు సంవత్సరాల పాటు మాలిక్ అంబర్ శాంతిగా వుండిపోయాడు. తిరిగి 1620 నుంచి మొఘులులను ఇబ్బంది పెట్టసాగాడు. దీనితో మొఘుల్ సుల్తాన్ అతనిని అణచివేసేందుకు షాజహాన్‌ను పంపాడు. షాజహాన్ నిజాంషాహీల నూతన రాజధాని కిర్కిని ధ్వంసం చేశాడు. అహ్మద్‌నగర్‌ను పట్టుకోవడంతో అంబర్ సంధికోసం ప్రార్థించాడు. దక్షిణాది రాజ్యాలు యుద్ధ పరిహారాన్ని పెద్ద మొత్తంలో చెల్లించాయి. దక్కన్ కూటమి ఎక్కువకాలం నిలువలేదు. బీజాపూర్ విరమించుకోవడంతో మాలిక్ అంబర్ బీజాపూర్‌పై దాడులు చేశాడు. ఇబ్రహీం ఆదిల్‌షా రాజధాని నౌరస్‌పూర్‌ను దగ్ధం చేశాడు. 1622 తర్వాత మాలిక్ అంబర్ మొగలుల స్వాధీనమైన ప్రాంతాలను తిరిగి పొందగలిగాడు.

| అక్బర్ విధానాన్ని జహంగీర్ కొనసాగించాడు. మొఘుల్ ప్రతినిధులు 1618 మరియు 1620లలో దక్కన్ కూటమిపై విజయం సాధించినా, వారి స్థితిని స్థిరీకరించుకోలేక పోయారు. అహ్మద్‌నగర్‌కు చెందిన మాలిక్ అంబర్ లాంటి సమర్థులతో జహంగీర్ సైన్యం సంతృప్తి చెందింది. |
|---|

## 42.ఎ పాఠ్యాంశ ప్రశ్నలు

1. సరైన సమాధానాన్ని గుర్తించండి.

1. అక్బర్ దక్కన్ విధానం

ఎ) కలహంతో కూడినది

బి) ఆక్రమించడం

సి) రాజ్య విస్తీర్ణం చేయడం

డి) సామ్రాజ్యకాంక్ష

2. దక్కన్‌లో మొఘల్ స్థిరీకరణ విఫలం కావడం

ఎ) మారాఠాల శక్తివల్ల

బి) బీజాపూర్ రాజకీయాల వల్ల

సి) మాలిక్ అంబర్ విజృంభణ వల్ల

డి) మొఘల్ సైనికాధికారులలోని విభేదాల వల్ల

2. అహ్మద్‌నగర్ రాజ్య విషయాలలో అక్బర్ జోక్యం లక్ష్యాలు ఏవి?

3. మొఘలాయిలకు ఖాందేష్ ఏవిధంగా ముఖ్యమైంది?

4. 1618 సంధి షరతులు ఏవి?

## 42.5 షాజహాన్ - అహ్మద్‌నగర్ ఆక్రమణ :

క్రీ.శ 1627లో షాజహాన్ మొఘల్ సింహాసనం అధిష్టించే నాటికి, వారికి బీరార్, బాలాఘాట్‌లపై వున్న అధికారాన్ని నిజాంషాహీలు ధిక్కరించడంతో పాటు 1600 సంవత్సరం జరిగిన సంధిని ధిక్కరిస్తూ వున్నారు. యువరాజుగా వున్న సమయంలో షాజహాన్ దక్కన్‌లో పనిచేసిన విషయం మీకు గుర్తుంది కదా! దక్కన్‌పై షాజహాన్‌కు పూర్తి అవగాహన వుండడం దక్కన్‌పై దృష్టి సారించేందుకు అవకాశాన్ని కలిగించింది.

మొదట, షాజహాన్ ఖాన్-ఇ-జహాన్‌లోడి అనే మొఘల్ అధికారిని నిజాంషాహీల నుంచి ప్రాంతాలను తిరిగి పొందేందుకు పంపాడు. కానీ విఫలుడయ్యాడు. అతనిని వెనుకకు పిల్చడంతో షాజహాన్‌కు వ్యతిరేకంగా తిరుగుబాటు చేసి నిజాంషాహీలతో చేతులు కలిపాడు. ఈ తిరుగుబాటు మొగల్ అధికారానికి ధిక్కారం. దీనికితోడు బీరార్, బాలాఘాట్‌లపై మొఘల్ అధికారాన్ని నిజాంషాహీలు గుర్తించడం లేదు. దీనితో అహ్మద్‌నగర్‌ను పూర్తిగా ఆక్రమించుకుంటే తప్ప మొగలులు దక్కన్‌లో విజయం సాధించలేరనే విషయాన్ని షాజహాన్ గ్రహించాడు.

అహ్మద్‌నగర్‌ను దౌత్యపరంగా, సైనికపరంగా ఏకాకిని చేయడం ద్వారా దాని ఆక్రమణకు షాజహాన్ ప్రయత్నాలు ప్రారంభించాడు. తనకు సహకరిస్తే అహ్మద్‌నగర్ రాజ్యంలో మూడవభాగం బీజాపూర్‌కు యిస్తాననీ వారికి చెప్పగా బీజాపూర్ అదిల్‌షా అందుకు అంగీకరించాడు. మహారాష్ట్రుల శక్తి సామర్థ్యాలను గుర్తించిన షాజహాన్ వారిని మొఘల్ దర్బారులో చేరవలసిందిగా ఆహ్వానించాడు. అందుకు అంగీకరించి మహారాష్ట్ర నాయకుడు షాజీభాన్సలే మొఘల్ కొలువులో చేరగా, 5000 మనసబ్‌దారుగా నియమించడంతో పాటు పునాజాగీర్‌ను షాజహాన్ యిచ్చాడు.

అహ్మద్‌నగర్‌లోని అధికప్రాంతాలను ఆక్రమించుకోవడంతో షాజహాన్ విజయం సాధించాడు. కానీ వారి

లక్ష్యాన్ని పూర్తి చేయలేకపోయారు. అందుకు బీజాపూర్ అహ్మద్‌నగర్ వైపు మారడం కారణం. దానికి కారణం అహ్మద్‌నగర్ ఆక్రమణ తద్వార మొఘలుల దృష్టి తమపై పడుతుందని భయపడడమే కాకుండా మొఘలులు హామీ యిచ్చినట్లుగా బీజాపూర్‌కు అహ్మద్‌నగర్ ప్రాంతాలను యివ్వకపోవడం అందుకు కారణం.

కాగా, అహ్మద్‌నగర్ అంతఃకలహాలు మొఘలులకు మంచి అవకాశాన్ని యిచ్చాయి. మాలిక్ అంబర్ కుమారుడు ఫతేఖాన్ మొఘలులతో సంధి చేసుకునేందుకు సుల్తాన్‌ను అంతమొందించాడు. చిన్నవాడు అయిన యువరాజును సింహాసనంపై కూర్చుండబెట్టి తన చెప్పుచేతుల్లో వుంచుకున్నాడు. అనంతరం మొఘల్ దర్బారులో చేరగా గతంలో షాజీభాన్స్‌లేకు యిచ్చిన జాగీర్‌ను ఫతేఖాన్‌కు షాజహాన్ ఇచ్చాడు. దీనితో షాజీభాన్స్‌లే మొఘలులను వ్యతిరేకించి బీజాపూర్‌తో చేతులు కలిపాడు. క్రీ.శ 1632లో దక్కన్ బాధ్యతను మహబత్‌ఖాన్‌కు వదిలి షాజహాన్ దక్కన్‌నుంచి వెళ్ళిపోయాడు. ఈలోగా ఫతేఖాన్ తిరుగుబాటు దారుడుగా మారాడు. ఈ సమయంలో మహబత్‌ఖాన్ దౌలతాబాద్ ముట్టడిలో వుండడం వల్ల బీజాపూర్, మహారాష్ట్రుల ధిక్కారం అతనికి మరిన్ని కష్టాలను తెచ్చింది. 1633లో లంచాలతో ఫతేఖాన్‌ను లొంగదీసుకొని విజయం సాధించి దౌలతాబాద్‌ను మొఘల్ స్వాధీనంలోకి తెచ్చాడు. నిజాంషా గ్వాలియర్‌కు పంపబడ్డాడు. దీనితో నిజాంషాహీల అధికారం అంతమై అహ్మద్‌నగర్ మొఘల్ రాజ్యంలో విలీనమైంది.

ఈలోగా షాజీభాన్స్‌లే నిజాంషాహీ యువరాజును పాలకుడుగా ప్రకటించి అతని పేరుమీద పోరాటం చేయసాగాడు. అందుకు అదిల్‌షాలు సహాయం చేయసాగారు. దీనితో 1635లో షాజహాన్ దక్కన్‌కు వచ్చాడు. షాజీ, బీజాపూర్‌ల మధ్య సంధికి భంగం కలిగించడం అవసరంగా గుర్తించాడు.

క్రీ.శ. 1636లో బీజాపూర్, మొఘలులు సంధి చేసుకున్నారు. దీని ప్రకారం మొఘల్ సార్వభౌమాధికారాన్ని అదిల్‌షా అంగీకరించడంతో పాటు 20లక్షల రూపాయల కప్పం చెల్లించేందుకు అంగీకరించాడు. భవిష్యత్తులో గోల్కొండతో ఏర్పడే విభేదాలను పరిష్కరించే అధికారాన్ని మొఘలులకు అప్పగించాడు. షాజీభాన్స్‌లేకు సహకరించకుండా వుండేందుకు అంగీకరించడంతో పాటు, ఒకవేళ షాజీ బీజాపూర్ కొలువులో చేరితే మొఘల్ సరిహద్దులకు దూరంగా అతనిని అధికారిగా నియమించేందుకు అంగీకరించాడు. దీనికి ప్రతిఫలంగా 80లక్షల రూపాయల విలువచేసే అహ్మద్‌నగర్ ప్రాంతాన్ని మొఘల్ సుల్తాన్ బీజాపూర్ అదిల్‌షా స్వాధీనం చేశాడు. అహ్మద్‌నగర్‌లోని మిగతా ప్రాంతాలను మొఘలులు ఆక్రమించుకోగా, దానిని బీజాపూర్ గుర్తించింది.

షాజహాన్ గోల్కొండతో సంధి చేసుకున్నాడు. మొఘల్ అధికారాన్ని అంగీకరించడంతో పాటు 8 లక్షల రూపాయల కప్పం చెల్లించేందుకు గోల్కొండ కుతుబ్‌షాహీలు అంగీకరించడంతో పాటు కుబ్బాలో పర్షియా షా పేరుకు బదులు మొఘల్ సుల్తాన్ పేరును చేర్చేందుకు అంగీకరించారు. ప్రతిఫలంగా బీజాపూర్ దాడులనుంచి గోల్కొండను రక్షించేందుకు షాజహాన్ అంగీకరించాడు.

క్రీ.శ 1636 సంధిని ఉల్లంఘించకూడదని పేర్కొన్నప్పటికీ దక్కన్‌లోని పరిస్థితులు మొఘలులను ఇబ్బందులకు గురిచేశాయి. బీజాపూర్, గోల్కొండల పాలకులు దక్షిణ హిందూ ప్రాంతాలపై దాడులుచేసి పెద్దమొత్తంలో సొమ్మును స్వాధీనం చేసుకోవడంతో పాటు కొన్ని ప్రాంతాను కూడా ఆక్రమించుకున్నారు. అయితే రాజ్యకాంక్షాపరులైన షాజీ, మీర్‌జుమ్లా వంటి అధికారుల వల్ల ఈ రాజ్యాలు బలహీనంగానే వున్నాయి. మొఘలులు దండయాత్ర చేసిన సమయంలో తాము తటస్థంగా వున్నందులకు షాజీ, మీర్‌జుమ్లాలు కొంత సొమ్మును మొఘలుల నుంచి ఆశించారు.

క్రీ.శ. 1653లో ఔరంగజేబు దక్కన్ సుబేదారు అయ్యాడు. మీర్‌జుమ్లా సహాయాన్ని సంపాదించాడు. బకాయిలు వున్నారనే కారణంతో గోల్కొండపై దండయాత్ర చేశాడు. పెద్ద మొత్తంలో సొమ్మును స్వాధీనం చేసుకున్నాడు. 1657లో బీజాపూర్‌పై దండయాత్ర చేయగా, బీజాపూర్ నూతనంగా సంధి చేసుకుని 1636 సంధితో పొందిన అహ్మద్‌నగర్ భూభాగాలన్నింటినీ మొఘలులకు యిచ్చివేశాడు. అయితే వీటిని ఔరంగజేబు అమలు చేయలేకపోయాడు. అందుకు ఉత్తర భారతదేశంలోని జరిగిన సంఘటనలే కారణం. షాజహాన్ అనారోగ్యవంతుడు కావడంతో సింహాసనం కోసం యుద్ధానికి ఔరంగజేబు వెళ్ళాడు.

> షాజహాన్ సమర్ధవంతమైన దక్కన్ విధానాన్ని అనుసరించాడు. మొఘల్ రాజ్యంలో అహ్మద్‌నగర్ విలీనమైతే మొఘల్ అధికారం దక్కన్ పటిష్ట పడగలదని భావించాడు. 1633లో అహ్మద్‌నగర్‌ను విలీనం చేశాడు. బీజాపూర్, గోల్కొండలతో సంధి చేసుకున్నారు.

## 42.6 ఔరంగజేబు – బీజాపూర్, గోల్కొండల ఆక్రమణ :

ఔరంగజేబు మొఘల్ సింహాసనాన్ని అధిష్టిస్తూనే దక్కన్‌వైపు దృష్టి సారించాడు. 1657 సంధి షరతులను బీజాపూర్ అమలుపరచాక నిజాంషాహీ రాజ్యభాగాలపై ఆధిపత్యానికి ప్రయత్నాలు చేస్తోంది. మొఘులులపై దక్కన్‌లో అయిష్టత కొనసాగుతుంది. అంతేకాకుండా శివాజీ నాయకత్వంలో మహారాష్ట్రులు మొఘల్ సరిహద్దులలో విజృంభిస్తూ మొఘులులపై దాడికి ప్రయత్నాలు చేస్తూ వున్నాడు. ఇలాంటి స్థితిలో ఔరంగజేబు దక్కన్‌పై దృష్టి సారించాడు. దక్కన్ సుబేదారుగా పనిచేయడం వల్ల ఆయనకు అవగాహన ఉంది. సుల్తాన్ అయిన తర్వాత చాలా జాగ్రత్తతో కూడిన దక్కన్ విధానాన్ని అనుసరించాడు. 1) 1657 సంధిని అదిల్‌షా చేత అమలు పరిచేలా చేయడం 2) అదిల్‌షా లొంగుబాటు శివాజీని అణచివేసేందుకు, మొఘల్ ప్రాంతాల నుంచి పూర్వపు నిజాంషాహీ రాజ్యాల నుంచి తరిమివేయడానికి ఉపయోగపడుతుందని భావించడం ఔరంగజేబు దక్కన్ విధానానికి ప్రధాన కారణం. ప్రతిఫలం లేకుండా మొఘల్ సంధిని అదిల్‌షా అంగీకరించేందుకు సిద్ధపడలేదు. ఇది ఔరంగజేబు కోపానికి కారణం కాగా, బీజాపూర్, మహారాష్ట్రుల మీద చర్యకు ఔరంగజేబు రాజా జైసింగ్‌ను పంపాడు.

దక్కన్ సుబేదార్ అయిన జై సింగ్ దక్కన్ కఠిన విధానాన్ని అనుసరించాలనుకున్నాడు. దక్కన్ వారి కోరికలకు తలవంచక, దక్కన్ రాజ్యాల మధ్య విభేదాలు సృష్టించి, వారి సహకారంతోనే మహారాష్ట్రులతో పోరాడాలని భావించాడు. బీజాపూర్ ఆక్రమణ, కర్ణాటక దక్కన్‌లపై ఆధిపత్యానికి పునాది అని ఔరంగజేబుకు జైసింగ్ లేఖ రాశాడు. అయిష్టంగానే ఔరంగజేబు బీజాపూర్‌పై దండయాత్రకు అంగీకరించాడు.

1665లో బీజాపూర్‌పై జై సింగ్ చేసిన దండయాత్ర విఫలమైంది. అందుకుతన స్వాధీనంలో తగినంత సైన్యం లేకపోవడంతో దక్కన్‌వారు అనుసరించిన గెరిల్లా యుద్ధాలు కారణం. ఎటువంటి ప్రయోజనాలు లేకుండా జైసింగ్ సంధి చేసుకున్నాడు. 1658–68 మధ్యకాలంలో కేవలం చిన్న చిన్న విజయాలను మొఘులులు సాధించారు. అందులో ప్రధానంగా షోలాపూర్ స్వాధీనం చెప్పుకోదగింది.

బీజాపూర్ రాజకీయాలు మరో అవకాశాన్ని కలిగించాయి. అదిల్‌షా మరణానంతరం సికిందర్ పాలకుడయ్యాడు. గోల్కొండలో కూడా అధికారాన్ని అక్కన్న మాదన్నలు చెలాయిస్తూ వున్నారు. వీరు మొఘులులకు వ్యతిరేకంగా బీజాపూర్,

మహారాష్ట్రులను కలుపుకుని కూటమిని ఏర్పరచేందుకు ప్రయత్నాలు చేయసాగారు. దీనిని అడ్డుకునేందుకు ఔరంగజేబు బీజాపూర్ విభేదాలలో జోక్యం చేసుకుని ఒక వర్గానికి సహాయం చేయసాగాడు. అందువల్ల వారు మహారాష్ట్రులకు వ్యతిరేకంగా తనకు సహకరించగలరని గోల్కొండకు సహాయం చేయరని భావించాడు.

తన విధానాన్ని అమలు పరిచేందుకు క్రీ.శ 1673లో బహదూర్‌ఖాన్‌ను దక్కన్ సుబేదారుగా ఔరంగజేబు నియమించాడు బీజాపూర్‌లోని అంతఃకలహాలను తనకు అనుకూలంగా మలుచుకునేందుకు ప్రయత్నించి విఫలుడయ్యాడు. దీనితో 1676లో బీజాపూర్‌పై దండెత్తి గుల్బర్గా, నలదుర్గా ప్రాంతాలను ఆక్రమించుకున్నాడు. ఈ ఆక్రమణలు బీజాపూర్, గోల్కొండలపై దండయాత్రకు మార్గాన్ని సుగమం చేశాయి.

అయితే ఈ విజయాలతో తృప్తి పడని ఔరంగజేబు బహదూర్‌ఖాన్ స్థానంలో ఆఫ్ఘన్ జాతీయుడైన దిలేర్‌ఖాన్‌ను దక్కన్ సుబేదారుగా పంపాడు. బీజాపూర్‌ను ఆక్రమించేందుకు దిలేర్‌ఖాన్ ప్రయత్నించాడు. కానీ మహారాష్ట్రులు గోల్కొండల సహకారం బీజాపూర్‌కు లభించడంతో అది సాధ్యం కాలేదు. ఫలితంగా ఔరంగజేబు దిలేర్‌ఖాన్‌ను వెనుకకు రప్పించాడు.

క్రీ.శ 1666లో దక్కన్‌నుంచి జై సింగ్‌ను వెనుకకు రప్పించినప్పటి నుంచి 1681లో తిరుగుబాటు చేసిన అక్బర్ రాకుమారుడిని వెంటాడుతూ ఔరంగజేబు దక్కన్‌కు చేరేంతవరకూ మొఘలులు దక్కన్‌లో పెద్ద విజయాలు సాధించలేదనే చెప్పవచ్చు.

ఔరంగజేబు దక్కన్ వచ్చినా దక్కన్ విధానంలో మార్పులేదు. మహారాష్ట్రులపై దాడికి దక్కన్ రాజ్యాల సహాయాన్ని పొందాలని ఔరంగజేబు ప్రయత్నించాడు కానీ ఉపయోగం లేకుండా పోయింది. అందుకు మహారాష్ట్రులే తమకు రక్షణకవచమని వారు భావించడం కారణం.

మహారాష్ట్రులను అణచివేయాలంటే బీజాపూర్, గోల్కొండలను ఆక్రమించాల్సిందే అని భావించాడు. బీజాపూర్ సుల్తాన్ అదిల్‌షాను సామంతుడిగా భావించిన ఔరంగజేబు తన సైన్యానికి ఆహారపదార్థాలను సరఫరా చేయమని, సైన్యానికి బీజాపూర్ నుంచి దారి యివ్వమని, మొఘల్ వ్యతిరేకులను కొలువునుంచి తొలగించమని, మహారాష్ట్రులతో పోరాటానికి ఐదువేల నుంచి ఆరువేల మంది సైనికులను సరఫరా చేయమని అడిగాడు. అందుకు అదిల్‌షా అంగీకరించలేదు. అప్పటికే అదిల్‌షా గోల్కొండ మరియు శంభాజీలతో రక్షణ సంధిని ఏర్పరచుకున్నాడు. దీనితో ఔరంగజేబు దాడికి సిద్ధమయ్యాడు. గతంలో సంయుక్తంగా వీరు మొఘలులను విజయవంతంగా ఎదుర్కొన్నప్పటికీ ప్రస్తుతం బలమైన మొఘల్ సైన్యం ధాటికి నిలబడలేక పోయింది. బీజాపూర్ దండయాత్ర చివరిదశలో ఔరంగజేబు స్వయంగా పాల్గొన్నాడు. 18నెలలు ముట్టడి తర్వాత బీజాపూర్ మొఘల్‌ల స్వాధీనమైంది. బీజాపూర్ అనంతరం మొఘలులు గోల్కొండ మీద 1687లో దాడిచేశారు. 6నెలల ముట్టడి అనంతరం ఉద్యోగుల కుట్ర వల్ల గోల్కొండ ఔరంగజేబు స్వాధీనం అయింది. ఈ విజయాలను సైనికపరంగా పొందినా రాజకీయంగా విఫలురయ్యారు. సైనికశక్తి, సొమ్ముతో పాటు ఎక్కువకాలం దక్కన్ ఆక్రమణలకు కేటాయించడం మొఘలుల పతనానికి నాంది పలికాయి. ఇంకా వివరంగా వచ్చే అధ్యాయంలో పఠిస్తారు.

| తొలిదశలో జాగ్రత్తతో కూడిన దక్కన్ విధానాన్ని ఔరంగజేబు అనుసరించాడు. మహారాష్ట్రుల విజృంభణ ఔరంగజేబు కఠినవైఖరి అనుసరించేట్లు చేసింది. |
| --- |

## 42. బి పాఠ్య ప్రశ్నలు

1. షాజహాన్ దక్కన్ విధానం అక్బర్, జహంగీర్‌ల విధానానికంటే విభిన్నమైనది?

2. 1636 సంధి ఉల్లంఘనకు దారితీసిన పరిస్థితులు ఏమిటి?

3. దక్కన్ విషయంలో జై సింగ్ దృష్టి ఔరంగజేబు కంటే ఏవిధంగా భిన్నమైంది?

4. మహారాష్ట్రులకు వ్యతిరేకంగా ఔరంగజేబుకు సహకరించేందుకు దక్కన్ రాజ్యాలు ఎందుకు యిష్టపడలేదు?

## సారాంశం :

ఉత్తరదేశంలో అధికారాన్ని పటిష్ట పరచుకుంటూనే అక్బర్ దృష్టి దక్షిణదేశంపై పడింది. తన అధికారాన్ని అంగీకరించమని రాయబారాలను దక్కన్ రాజ్యాలకు పంపాడు. అవి విఫలం చెందాయి. అహ్మద్‌నగర్ సింహాసనం విషయంలో అంతఃకలహాలు ఏర్పడిన స్థితిని ఆసరాగా చేసుకుని మొఘల్ సైన్యం అహ్మద్‌నగర్‌పై దండయాత్ర చేసింది. చాంద్‌బీబీ దండయాత్రను ఎదుర్కొన్న చివరకు అహ్మద్‌నగర్ లొంగి బీరార్‌ను మొఘలులకు ఇచ్చివేసింది. దీనితో భయానికి గురైన దక్కన్ రాజ్యాలు అహ్మద్‌నగర్‌కు సహాయం చేశాయి. దీనితో మరోసారి అహ్మద్‌నగర్‌పై 1600 సంవత్సరంలో దండయాత్ర చేశారు. 1601లో ఖాందేష్ మొఘలుల స్వాధీనమైంది అయితే పటిష్టపరుచుకోలేక పోయారు.

జహంగీర్ అహ్మద్‌నగర్ మాలిక్ అంబర్ నుంచి తీవ్ర వ్యతిరేకతను ఎదుర్కొన్నాడు. మాలిక్‌అంబర్ మొదట్లో అహ్మద్‌నగర్ ప్రాంతాల నుంచి తరిమివేశాడు. 1661లో మొఘలులు అహ్మద్‌నగర్, బీజాపూర్, గోల్కొండల సంయుక్త సైన్యాలను ఓడించగలిగారు. తర్వాతి కాలంలో గెరిల్లా యుద్ధాల వల్ల, మొఘలుల అంతఃకలహాల వల్ల మొఘలులు అనేక ప్రాంతాలను పోగొట్టుకున్నారు.

అహ్మద్‌నగర్‌ను విలీనం చేసుకుంటే తప్ప దక్కన్‌పై అధికారాన్ని సంపాదించడం సాధ్యం కాదని షాజహాన్ గుర్తించాడు. షాజహాన్ బీజాపూర్ సహాయాన్ని పొంది అహ్మద్‌నగర్‌పై దండయాత్ర చేశాడు కానీ బీజాపూర్ అహ్మద్‌నగర్ వైపు వెళ్ళడంతో అహ్మద్‌ను ఆక్రమించడం సాధ్యం కాలేదు. ఫతేఖాన్ విశ్వాసఘాతుకం వల్ల 1632లో అహ్మద్‌నగర్ మొఘల్ స్వాధీనమైంది. ఈలోగా శివాజీ నాయకత్వంలో మహారాష్ట్రులు బలపడ్డారు. 1636లో షాజహాన్ బీజాపూర్, గోల్కొండలతో విడివిడిగా సంధులను చేసుకుని శాంతియుత పరిస్థితులను నెలకొల్పాడు.

ఔరంగజేబు సింహాసనం అధిష్టిస్తూనే బీజాపూర్, మహారాష్ట్రులను ఎదుర్కోవాల్సి వచ్చింది. అయితే ఆ సమయంలో ఔరంగజేబు కఠినమైన విధానాన్ని అనుసరించేందుకు సిద్ధంగా లేదు. అందువల్ల జై సింగ్ బీజాపూర్‌పై దండయాత్ర చేశాడు కానీ పరిమితమైన వనరుల వల్ల విఫలమైంది. ఈలోగా గోల్కొండ బలం పెరిగి, బీజాపూర్ రాజకీయాలలో జోక్యం చేసుకోవడం ప్రారంభించింది.

క్రీ.శ. 1677లో మొఘలులు గుల్బర్గా, నల్దుర్గాలను బీజాపూర్ నుంచి స్వాధీనం చేసుకున్నారు. ఈవిజయం పరిమితమైనదే ! ఈలోగా మహారాష్ట్రుల బలం బాగా పెరిగింది. 1689 నాటికి బీజాపూర్, గోల్కొండలను ఆక్రమించుకోకుండా దక్కన్‌లో తన లక్ష్యాలను సాధించడం కష్టతరం అని ఔరంగజేబు గుర్తించాడు. 1686లో బీజాపూర్‌ను, 1687లో గోల్కొండను మొఘలులు స్వాధీనం చేసుకున్నారు.

## అభ్యాసం :

1. 1601 నాటికి ఖాందేష్, అహ్మద్‌నగర్, బీరార్‌లను ఆక్రమించాడు. అందుకు దారితీసిన పరిస్థితులను వివరించండి?
2. దక్కన్‌లో జహంగీర్ విఫలం కావడానికి కారణాలు ఏవి?
3. దక్కన్ రాజకీయాలలో మాలిక్ అంబర్ పాత్రను వివరించండి.
4. దక్కన్ విషయంలో షాజహాన్ లక్ష్యాలు ఏవి? ఏ విధంగా విజయం సాధించాడు?
5. ఔరంగజేబు కల 30 సంవత్సరాల తర్వాత నెరవేరింది. ఆ కల ఏమిటి? అది నెరవేరడంలో దోహదం చేసిన పరిస్థితులు వివరించండి?
6. అక్బర్, జహంగీర్, షాజహాన్, ఔరంగజేబులలో ఎవరు దక్కన్‌లో సమర్థులైన విజేతగా నిలిచారో వివరించండి?

## పాఠ్య ప్రశ్నలకు సమాధానాలు

**42. ఎ.**

1. (i) సామ్రాజ్యవాదం (ii) మాలిక్ అంబర్ విజృంభణ
2) బీరార్, బలాఘాట్‌లను అక్బర్ పొందాలనుకోవడం
3. ఖాందేష్

   ఎ) సారవంతమైన ప్రాంతం

   బి ) మళ్వా మరియు గుజరాత్‌లకు మార్గం

   సి) దక్కన్‌లో మొఘల్ కార్యక్రమాలకు ప్రధాన కేంద్రం
4. బాలాఘాట్ మొఘలుల స్వాధీనమైంది. దీనికి తోడు అహ్మద్‌నగర్ మరియు బలమైన కోటలు మొఘల్ పర్యవేక్షణలో క్రిందికి వచ్చాయి.

**42. బి.**

1. షాజహాన్ బలమైన విధానాన్ని అనుసరించాడు. తమ సార్వభౌమాధికారం అంగీకరించినంత వరకూ దక్కన్ రాజ్యాలను అక్బర్ జహంగీర్‌లను వదిలివేశారు. అహ్మద్‌నగర్‌ను ఆక్రమించడం తప్పనిసరి అని అప్పుడే దక్కన్‌పై ఆధిపత్యం వస్తుందని షాజహాన్ భావించాడు.
2. బీజాపూర్, గోల్కొండలు దక్కన్ ప్రాంతాలపై దాడిచేసి స్వాధీనం చేసుకున్న సొమ్ము, ఆక్రమించిన ప్రాంతాలలో భాగాన్ని మొఘలాయిలు కోరారు.
3. దక్కన్ రాజ్యాలను ఓడించి ఆక్రమించి తద్వారా మహారాష్ట్రులను అణచివేయాలని జైసింగ్ భావించాడు.
4. మొఘలుల భారినుంచి దక్కన్‌ను కాపాడే రక్షణ కవచం మహారాష్ట్రులని దక్కన్ రాజ్యాలు భావించాయి.

# 43

# మొఘలుల దక్కన్ విధానం పై అంచనా

## 43.1 పరిచయం :

మొఘల్ దక్కన్ విధానమును గురించి మీరిదివరకే చదివారు. ఖాందేష్, బీరార్, బాలాఘాట్‌లను ఆక్రమించడంలో అక్బర్ విజయం సాధించడంతో పాటు, అహ్మద్‌నగర్‌పై ఆధిపత్యం సంపాదించాడు. జహంగీర్ దక్కన్ ఆక్రమణ విధానాన్ని కొనసాగించలేదు. మొఘల్ దక్కన్ విధానం షాజహాన్ కాలంలో తీవ్రరూపం దాల్చగా అది అహ్మద్‌నగర్ స్వతంత్రరాజ్యంగా ఆవిర్భవించేందుకు కారణమైంది. 1636 సంధి ద్వారా గోల్కొండ, బీజాపూర్ రాజ్యాలపై షాజహాన్ సార్వభౌమాధికారాన్ని పొందాడు. మహారాష్ట్రుల అధికారానికి ముగింపు పలికే ఉద్దేశ్యంతో ఔరంగజేబు బీజాపూర్, గోల్కొండలను మొఘల రాజ్యంలో విలీనం చేశాడు.

ఒక్క మొఘల్ సుల్తాన్ దక్కన్‌లో సాధించిన విజయాలను మీరు గత అధ్యాయంలో చదివారు. ఈ పాఠంలో మొఘలుల దక్కన్ విధానాన్ని అంచనా వేయడంతో పాటు దక్కన్ దండయాత్రల ఫలితాలను తెలుసుకుంటారు.

## 43.2 లక్ష్యాలు :

ఈ పాఠ్యాంశం చదివిన తర్వాత మీరు ఈ విషయాలను అర్ధం చేసుకోగలరు.

1. దక్కన్ విషయాలలో అక్బర్ జోక్యానికి దారితీసిన పరిస్థితులు
2. దక్కన్‌లో అక్బర్ సాధించిన విజయాలు
3. జహంగీర్ దక్కన్ ఆక్రమణలను కొనసాగించకపోవడానికి కారణాలు
4. షాజహాన్ దక్కన్ విధానానికి కారణాలు, ఫలితాలు
5. బీజాపూర్, గోల్కొండలను మొఘల్ రాజ్యంలో ఔరంగజేబు విలీనం చేసేందుకు దారితీసిన పరిస్థితులు
6. దక్కన్ ఆక్రమణకు 1684 వరకు నిర్ణయం తీసుకోవడంతో ఔరంగజేబు జాప్యం చేసేందుకున్న స్థితి

## 43.3 అక్బర్ :

అక్బర్ దక్కన్ విషయాలలో జోక్యం చేసుకునేందుకు దారితీసిన పరిస్థితులను ముందుగా విశ్లేషించాల్సిన

అవసరం వుంది. ఉత్తరదేశ ఆక్రమణ, మొఘల్ రాజ్యస్థిరీకరణ సాధించాక అక్బర్ దృష్టి దక్కన్‌పై పడి, దక్కన్‌పై అధికారాన్ని పొందాలనుకున్నాడు. అందుకోసం దౌత్య పద్ధతులనైనా, యుద్ధ పద్ధతులనైనా ఉపయోగించుకోవాలనుకున్నాడు. రెండవది గుజరాత్ నౌకా కేంద్రాలకు వెళ్ళే మార్గాన్ని రక్షించడంతో పాటు గుజరాత్, మళ్వా, ఖాందేష్‌లతో కూడిన సూరత్ అంతర్గత భూభాగంపై ఆధిపత్యం సాధించాలనుకున్నాడు. మూడవది భూమిపై, నీటిపై పెరుగుతూవున్న పోర్చుగీసు కార్యకలాపాల వల్ల కలత చెందాడు. హజ్‌యాత్రికులను పోర్చుగీసు వారు ఇబ్బందుల పాలు చేసేవారు. ఎర్రసముద్రంపై అక్రమ రవాణా చేసేవారు. వారి అనుమతి లేని నౌకలను స్వాధీనం చేసుకోవడం లేదా కొల్లగొట్టడం కానీ చేసేవారు. ఇలాంటి విధానాలు అక్బర్‌కు నచ్చలేదు. దీనికి తోడు వారు ప్రధాన భూభాగంపైన, ముఖ్యంగా సూరత్‌పైన ఆధిపత్యం సాధించేందుకు ప్రయత్నిస్తూ వున్నారు. దీనితో దక్కన్‌పై ఆధిపత్యం సంపాదించడం, ఆర్థిక లాభాన్నిపొందడం ద్వారా పోర్చుగీసు వారిని కట్టడి చేయవచ్చని భావించాడు. నాలుగవది దక్కన్ రాజ్యాలలో అంతఃకలహాలు, మతఃకలహాలు చోటు చేసుకుంటూ వుండేవి. రాజ్యాలను విస్తరించుకునేందుకు వారి మధ్య యుద్ధాలు జరుగుతూ వుండేవి. దక్కన్ వారికి నూతనంగా వచ్చినవారికి మధ్య కలహాలు జరుగుతూ వుండేవి. దక్కన్‌లోనే అబిసీనియా వారు, ఆఫ్ఘన్‌లు విడివిడి వర్గాలుగా ఏర్పడ్డారు. ఈ వర్గాల విభేదాలు రాజకీయ కలహాలకు దారి తీస్తూ వుండేవి. గోల్కొండ షియామతాన్ని అనుసరించేది. బీజాపూర్, అహ్మద్‌నగర్ రాజ్యాలో అప్పుడప్పుడూ షియాల అధికారం కోసం 'మాధావి' సిద్ధాంతం కూడా దక్కన్‌లో ప్రచారంలో వుండేది. సాంప్రదాయవాదులు 'మధావిని' తీవ్రంగా వ్యతిరేకించేవారు. అక్బర్ దేశవ్యాప్తంగా (Sulh-ikul Universal Peace)శాంతిస్థాపన, సామరస్యం సాధించాలనుకున్నాడు. దక్కన్‌లోని మత భేదాలు క్రమంగా ఉత్తర ప్రాంతానికి ప్రాకి మొఘల్ రాజ్యం శాంతికి భంగం వాటిల్లుతుందని అక్బర్ భయపడ్తూ వుండేవాడు. ఇలాంటి పరిస్థితుల్లో అక్బర్ దక్కన్‌తో జోక్యం చేసుకోవాలనుకున్నాడు.

మొదట అక్బర్ తన సార్వభౌమాధికారాన్ని అంగీకరించవలసిందిగా దక్కన్‌కు రాయాబారాలు పంపిన విషయం మీరు గుర్తు తెచ్చుకోండి. ఖాందేష్‌లో తప్ప రాయాభారాలు విఫలమయ్యాయి. దీనిలో సైనికచర్య తీసుకునేందుకు అవకావశం కోసం అక్బర్ ఎదురు చూడసాగాడు. అహ్మద్‌నగర్ సింహాసనం విషయమై నిజాంషాలలో ఏర్పడిన విభేదాలు అక్బర్‌కు ఆ అవకాశాన్ని కల్పించాయి.అహ్మద్‌నగర్, బీజాపూర్‌లను కలుపుకోవడం దక్కన్‌పై విజయం సాధించడానికి అవసరమని గుర్తించాడు. అందుకోసం యువరాజులతో పాటు అనుభవజ్ఞులైన మొఘల్ అధికారులను దక్కన్‌కు పంపడంతో పాటు పరిస్థితులను స్వయంగా పరిశీలించాలని అక్బర్ కూడా దక్కన్‌కు వెళ్ళాడు. మొఘల్ సైన్యం ఖాందేష్, బాలాఘాట్, బీరార్‌లను ఆక్రమించుకోవడంలో విజయం సాధించింది. అహ్మద్‌నగర్‌పై ఆధిపత్యం సంపాదించింది. 1600 సంవత్సరం సంధి ప్రకారం బలమైన కోటలు మొఘల్ స్వాధీనమయ్యాయి.

దక్కన్ రాజకీయాలలో బీజాపూర్ ప్రధానపాత్ర పోషిస్తుంది. అది ప్రధానమైనదనీ, బీజాపూర్‌తో ఒప్పందానికి వస్తే తప్ప దక్కన్‌లో మొఘలులు ఆధిపత్యం సంపాదించలేరనే విషయాన్నీ అక్బర్ గుర్తించాడు. మొఘలులకు వ్యతిరేకంగా చాంద్‌బీబీ చేసిన పోరాటానికి బీజాపూర్ సహాయం చేయడాన్ని మీరు గుర్తు తెచ్చుకోండి. మొఘలులకు వ్యతిరేంగా బీజాపూర్ ఆమెకు సైన్యాన్ని కూడా పంపింది. కనుక, అహ్మద్‌నగర్ సింహాసనం కోసం జరిగిన పోరాటం అహ్మద్‌నగర్‌పై ఆధిపత్యానికి బీజాపూర్, మొఘలుల పోరాటంగా చెప్పవచ్చు. అక్బర్ బీజాపూర్‌తో వివాహ సంబంధాలను ఏర్పాటు చేసుకోవడం ద్వారా దాని సహకారాన్ని పొందవచ్చునని భావించి 1602లో యువరాజు దనియాల్‌కు రెండవ ఇబ్రహీం అదిల్‌షా కుమార్తెతో వివాహం జరిపించాడు. అయితే 1604వ సంవత్సరంలో దనియాల్ మృతి చెందడం వల్ల దీని

ఫలితం పెద్దగా లేదు.

అక్బర్ పాలనాకాలంలో దక్కన్‌లో అనిశ్చితి అయోమయ పరిస్థితులు కొనసాగాయి. కొంతమేరకు అక్బర్‌కు ఖచ్చితమైన విధానం లేకపోవడం కారణం. అక్బర్ పూర్తి సమయాన్ని దక్కన్‌పై కేటాయించలేక పోయాడు. తన లక్ష్యాన్ని దక్కన్‌లో పూర్తిగా సాధించలేకపోవడానికి వాయువ్య ప్రాంతాలపై దృష్టి నిలపాల్సి రావడం ప్రధాన కారణం. 12సంవత్సరాలు దక్కన్‌కు దూరంగా వాయువ్యంలోనే వుండిపోయాడు. తన స్వంత కుమారుడు సలీం ధిక్కారం, తిరుగుబాటు కూడా దక్కన్‌పై ఆధిపత్యం సాధించేందుకు ఆటంకం కలిగించింది.

అక్బర్ దక్కన్ దండయాత్రలు మొఘల్ అధికారుల మధ్య విభేదాలకు కారణం అయ్యాయి. అహ్మద్‌నగర్ దండయాత్ర యువరాజు మరాద్, అబ్దుల్ రహీంఖాన్ –ఇ–ఖానమ్‌ల మధ్య విభేదాలకు దారితీసింది. ఇలాంటి తలనొప్పితోనే అక్బర్ వారిద్దరిని వెనక్కు రప్పించి అబుల్ ఫజల్‌ను అక్బర్ దక్కన్‌కు పంపించాడు.

వీటికితోడూ అహ్మద్‌నగర్ రాజకీయ పరిస్థితిని తమకు అనుకూలంగా మార్చుకోలేకపోయారు. అహ్మద్‌నగర్‌ను దాటి దక్కన్‌లో ముందడుగు వేయడం అక్బర్‌కు ఇష్టం లేదు. బురహాన్ నిజాంషాకు సరైన వారసుడిని మొఘలులు గుర్తించలేక పోయారు. అహ్మద్‌నగర్‌ను ఆధీనంలో వుంచుకోవడంతో పాటు మొఘులులతో సత్సంబంధాలు కొనసాగించగల పాలకుడు అవసరం. దీనితో, దక్కన్ సమస్య పరిష్కార భాధ్యత జహంగీర్‌కు వదిలివేయబడింది.

**దక్కన్‌లో అక్బర్ జోక్యానికి దారితీసిన పరిస్థితులు :**

1. దక్కన్‌పై ఆధిపత్యం ఏర్పరచాల్సిన అవసరం
2. గుజరాత్ తీరానికి వున్న వ్యాపార దారిని రక్షించాల్సిన అవసరం
3. భూమి, నీరుపై పోర్చుగీసుల ప్రమాదాన్ని అరికట్టాల్సిన అవసరం
4. దక్షిణాది వర్గపోరాటాలనుంచి ఉత్తర దేశాన్ని కాపాడడంతో పాటు దక్కన్‌లో పరిస్థితిని మెరుగు పర్చడం కోసం
5. విశ్వమానవశాంతిని దక్షిణాదిలో ఏర్పరచాలనే కోరిక

## 43.4 జహంగీర్ :

తొలిరోజుల్లో జహంగీర్ దక్కన్‌లో అనేక సమస్యలను ఎదుర్కొన్నాడు. ప్రధానమైంది మాలిక్ అంబర్ విజృంభణ. మాలిక్ అంబర్ యుద్ధవీరుడు. పోరాటపటిమ గలవాడు. బుద్ధి కౌశల్యం వున్నవాడు. మహారాష్ట్ర జాతి వారు ఆయన సైన్యంలో వున్నారు. మాలిక్ అంబర్ అనుసరించిన గెరిల్లా యుద్ధ విధానాల ద్వారా మొఘలులు యిబ్బందికి గురయ్యారు. బీరార్, బాలాఘాట్, అహ్మద్‌నగర్‌లపై ఆధిపత్యాన్ని నిలబెట్టుకోవడం మొఘులులకు కష్టంగా మారింది.

మాలిక్ అంబర్‌కు ఇబ్రహీం అదిత్‌షా పూర్తి సహకారం కూడా లభించింది. గతంలో మొఘలులతో చేసుకున్న ఒప్పందం రద్దు చేసుకుని బీజాపూర్, అహ్మద్‌నగర్‌కు మాలిక్ అంబర్‌కు పూర్తిగా సహకరించాడు. కాందార్ కోటను యివ్వడంతో పాటు పదివేల అశ్వికదళాన్ని మాలిక్ అంబర్‌కు యివ్వడం, మాలిక్ అంబర్‌తో వివాహ సంబంధం ఏర్పాటు చేసుకోవడం వంటి అంశాలను ఒకసారి గుర్తుకు తెచ్చుకోండి. ఇవన్నీ మాలిక్ అంబర్‌కు ఇబ్రహీం అదిత్‌షా ఆశీస్సుల వల్లే జరిగాయి.

మహారాష్ట్రుల, బీజాపూర్‌ల సహకారం మొఘల్ అధికారి ఖాన్–ఇ–ఖానమ్‌ను బురహాన్‌పూర్ నుంచి పంపించి వేసేందుకు మాలిక్ అంబర్‌కు దోహదం చేసింది. ఏమైనప్పటికీ పెరుగుతూవున్న మాలిక్ అంబర్ ప్రాబల్యం, దక్కన్‌లో అహ్మద్‌నగర్‌ను బలమైన రాజ్యంగా చేయాలన్న అతని కోరిక, గోదావరిలో, కొంకణ్ ప్రాంతాల ఆధిపత్యం గురించి బీజాపూర్, అహ్మద్‌నగర్‌ల మధ్యవున్న విభేదాలు వంటివి బీజాపూర్‌లో అసహనాన్ని కలిగించాయి. 1618 మరియ 1620లలో దక్కన్ సంయుక్త సైన్యాలపై మొఘులులు విజయాలు, 1600 సంవత్సరం జరిగిన సంధిలో గుర్తించిన సరిహద్దులను దాటి దక్కన్‌లో విస్తరించకూడదనే జహంగీర్ అభిప్రాయం మొఘల్ వ్యతిరేక దక్కన్ కూటమినుంచి బీజాపూర్‌ను విరమించేలా చేసింది.

క్రీ.శ. 1623లో బీజాపూర్ మొఘులులతో సంధి చేసుకుంది. వీరిద్దరూ సంయుక్త మాలిక్ అంబర్‌పై దాడిని ప్రారంభించారు. అహ్మద్‌నగర్ నుంచి కొన్ని ప్రాంతాలను పొందవచ్చునని బీజాపూర్ ఆశించింది. ఏమైనప్పటికీ అంబర్ యుద్ధ నైపుణ్యం, జహంగీర్ అనారోగ్యం, యువరాజు షాజహాన్ తిరుగుబాట్లు అయోమయ పరిస్థితులను ఏర్పరచగా,1600 సంవత్సరం సంధి ద్వారా పొందిన దక్కన్ ప్రాంతాలను మొఘులులు కోల్పోయారు.

క్రీ.శ. 1600 సంవత్సరం సంధిలో పొందిన ప్రాంతాలను దాటి మొఘల్ రాజ్యాన్ని విస్తరించేందుకు జహంగీర్ విముఖత చూపడం బలహీనతవల్లనో, సైనిక అసమర్థత వల్లనో కాదనే విషయాన్ని గుర్తుంచుకోవాలి. ఇది అక్బర్ విధానాన్ని కొనసాగించేందుకు అనుసరించినది. దక్కన్‌లో మొఘల్ విస్తరణకు కోరుకోకపోవడానికి, అది నిరంతరం బీజాపూర్, గోల్కొండలతో నిత్యం యుద్ధాలకు దారితీస్తుందని గ్రహించడమే! తన విధానం దక్కన్ రాజ్యాలు మొఘులులతో శాంతి విధానాలను అనుసరించేలా చేస్తుందని భావించాడు. తన ఈ విధానం ద్వారా అదిత్‌షాను గౌరవించి, బీజాపూర్ అభిమానాన్ని పొందాడు. దక్కన్‌లో మహారాష్ట్రుల ప్రాధాన్యతను గుర్తించడం, వారిపై విజయం సాధించడం జహంగీర్ విధానంలోని మరో ప్రధానాంశం. ఈవిధంగా దక్కన్‌లో ఆధిపత్యం కొనసాగించాలనుకున్నాడు. అంతేకాకుండా, అహ్మద్‌నగర్‌లోని కోటలు, తెలంగాణాలోని కీలకప్రాంతాలపై పెత్తనం పొందాలనుకున్నాడు. అందువల్ల ఉత్తరదేశంపై ఆర్థికత కోసం ఆధారపడాల్సిన అవసరం వుండదని భావించాడు.

## 43.ఎ పాఠ్య ప్రశ్నలు

1. దక్కన్ విషయాల్లో జోక్యం చేసుకోవడంలోని అక్బర్ ఉద్దేశ్యం ఏమిటి?
2. అక్బర్ తీసుకున్న ఏ చర్యద్వారా దక్కన్ విషయాలలో బీజాపూర్ ప్రధానమైనదనే విషయం తెలుస్తోంది?
3. 1600 సంవత్సరంలో మొఘులుల అహ్మద్‌నగర్ విజయ ఫలితాలు ఏమిటి?
4. జహంగీర్ కాలంలో దక్కన్‌లో మొఘులుల ప్రధాన శత్రువులు ఎవరు?

## 43.5 షాజహాన్ :

షాజహాన్ కాలంలో మొఘల్ దక్కన్ విధానంలో తీవ్రమార్పు వచ్చింది. ఖాన్–ఇ–జహాన్‌లోడి తిరుగుబాటును, బీరార్, బాలఘాట్‌లలో మొఘల్ అధికారాన్ని నిజాంషా గుర్తించేందుకు వ్యతిరేకించడంలను మీరిదివరకే చదివారు. అంతేకాకుండా మొఘులులకు వ్యతిరేకంగా పోరాడేందుకు ఈ ప్రాంతాలకు నిజాంషా ఖాన్–ఇ–జహాన్‌లోడిని పంపించాడు.

అహ్మద్‌నగర్‌పై కఠిన వైఖరిని అవలంభిస్తేనే దక్కన్‌లో మొఘల్ ప్రాబల్యం నిలుస్తుందని షాజహాన్ గుర్తించాడు. అక్బర్ కాలంలో 1600 సంవత్సరంలో చేసుకున్న సంధిని ధిక్కరించడమే అహ్మద్‌నగర్‌ను ఆక్రమించుకునేందుకు షాజహాన్‌ను పురికొల్పింది. అహ్మద్‌నగర్‌ను ఆక్రమించడం తప్ప మిగతా దక్కన్ ప్రాంతాలకు మొఘల్ అధికారాన్ని విస్తరించే విషయంలో శ్రద్ధకనబరచలేదు.

అహ్మద్‌నగర్ దండయాత్ర కంటే ముందు షాజహాన్ బీజాపూర్, మహారాష్ట్రుల సహాయాన్ని పొందగలిగాడనే విషయాన్ని గుర్తు చేసుకోండి. మొఘలులు అహ్మద్‌నగర్‌ను ముట్టడించిన తొలిదశలో బీజాపూర్ తటస్థంగా వుండింది. 1629లో మొఘలులు అహ్మద్‌నగర్‌ను పూర్తిగా ఆక్రమించుకుంటూనే బీజాపూర్‌లోని అధికారులు మొఘలుల తర్వాతి దండయాత్ర తమపైననే భావించారు. దీనితో బీజాపూర్ అహ్మద్‌నగర్‌కు సహకరించేందుకు నిర్ణయించుకుంది. తర్వాత షోలాపూర్ బీజాపూర్ వశం చేయబడింది. ఈవిధంగా అహ్మద్‌నగర్‌ను పొందేందుకు ఒకవైపు మొఘలులు మరోవైపు బీజాపూర్ పోటీ పడ్డాయి.

బీజాపూర్ మహారాష్ట్రుల నుంచి కూడా సహాయాన్ని పొందింది. షాజహాన్ తొలిరోజుల్లో షాజీఖాన్స్‌లేకు జాగీర్‌ను యిచ్చాడు. అయితే దానిని తర్వాత ఫతేఖాన్‌కు యిచ్చివేశాడు. ఈ చర్య షాజీ మొఘలాయిలకు దూరం కావడానికి దోహదం చేసింది. మొఘలులను ఎదుర్కొనేందుకు షాజీకి, అదిల్‌షా సహకరిచాడు. నిజాంషాహీ అధికారులు కూడా షాజీలో చేతులు కలిపారు. బీజాపూర్, మహారాష్ట్రుల కూటమిని విడదీయాల్సిన అవసరాన్ని షాజహాన్ గుర్తించారు.

క్రీ.శ. 1636లో గోల్కొండ మరియు బీజాపూర్‌లతో మొఘులులు సంధి చేసుకోవడం మొఘులుల దక్కన్ విధానంలో నూతనాధ్యయానికి నాంది పలికింది. ఇది షాజహాన్ విజ్ఞతకు నిదర్శనం. దీనితో అక్బర్ కోరిక అయిన దక్కన్‌పై మొఘల్ సార్వభౌమాధికారం అనేది నెరవేరింది. దక్కన్‌లో మొఘల్ సరిహద్దులు రక్షింపబడడంతోపాటూ దక్కన్‌లో శాంతి నెలకొంది. ఈ సంధుల ద్వారా ఈ రెండు రాజ్యాలపైన మొఘలుల దండయాత్ర చేయరు అనే హామీ యిచ్చారు. షాజహాన్ అదే సమయంలో తన వేలి ముద్రలతో కూడిన ఒక రాజాజ్ఞను జారిచేసి సంధిని ఉల్లంఘించనని హామీ యిచ్చాడు. ఈ సంధులు మొఘల్ సార్వభౌమాధికార బలగౌరవాలను పెంపొందింపచేసింది.

క్రీ.శ.1636 లోని సంధులు మొఘలాయిలకు, దక్కన్ సుల్తానులకు కొంత విశ్రాంతిని యిచ్చాయి. దక్కన్ రాజ్యాలు మొఘలులపై కాకుండా ఇతర దక్షిణ ప్రాంతాలను పొందే విషయంపై దృష్టి పెట్టాయి. మొఘలులు తమ ప్రతినిధులను దక్కన్‌కు పంపడం ద్వారా తమ అధికారాన్ని సుస్థిరం చేసుకున్నారు. గోల్కొండ రక్షిత ప్రాంతం అయింది. అన్ని విషయాలు మొఘల్ సుల్తాన్‌కు తెలుపుతూ వుండేది. ఈ విధంగా మొఘలులు బీజాపూర్ బలపడి తమను వ్యతిరేకించకుండా చేయగలిగారు.

క్రీ.శ. 1636 సంధులు 1657 నాటికి ఉల్లంఘనకు గురైనట్లు మీదివరకే చదివారు. అందుకు అనేక కారణాలు వున్నాయి. బీజాపూర్ మరియు గోల్కొండ రాజ్యాలు దక్కన్‌వైపు విస్తరింప బడడంతో పాటు ఆర్థికంగా లాభపడ్డాయి. వారి అధికారం అత్యున్నత స్థితికి చేరింది. ఇందులో మొఘలులు భాగాన్ని కోరుకున్నారు. కనుక తమ తటస్థతకు మొఘలులు సొమ్మును ఆశించినట్లు కొందరు పండితులు పేర్కొన్నారు. దక్కన్‌లోని మొఘలుల పరిపాలనా లోపం వారికి ఆర్థిక నష్టాన్ని కలిగించినట్లు మరికొందరు అభిప్రాయపడ్డారు. అంతేకాకుండా దక్కన్ మొఘల్ సైన్యంకి అయ్యే ఖర్చు అధికమైంది. దక్కన్ రాజ్యాల నుంచి లభించే సొమ్ము అందుకు సరిపోయేది కాదు. విదేశీ వాణిజ్యానికి పట్టుకొమ్మ

అయిన కోరమాండల్ ప్రాంతాన్ని వారు ఆక్రమించాలనుకోవడం కూడా కారణం. మధ్య ఆసియాలో షాజహాన్ విఫలత కూడా 1636 సంధులు రద్దయిందనేందుకు దోహదం చేసింది.

ఈ విధంగా షాజహాన్ కాలంలో దక్కన్ విధానంలో మారిన వైఖరిని గమనించవచ్చు. 1657లోని సంఘటనల వల్ల మొఘలుల పట్ల వారి ఒప్పందాలు పట్ల దక్కన్ రాజ్యాలకు నమ్మకాన్ని పోగొట్టాయి. భవిష్యత్తులో మొఘలులు, దక్కన్ పాలకుల మధ్య సత్సంబంధాలు ఏర్పడే అవకాశాలు మృగ్యమయ్యాయి.

## 43.6 ఔరంగజేబు :

దక్కన్‌లో ఔరంగజేబు కార్యకలాపాలను మీరిదివరకే చదివారు. 1636 సంధిలో బీజాపూర్‌కు యిచ్చిన అహ్మద్‌నగర్ ప్రాంతాలను తిరిగి పొందాలనుకోవడమే 1662 కంటే ముందు మొఘలుల లక్ష్యం, అనే విషయం మీరు ఇదివరకే గమనించారు. తర్వాత 1668–84 మధ్యకాలంలో మహారాష్ట్రులను అణచివేయడం, బీజాపూర్, గోల్కొండల సహాయం మహారాష్ట్రులకు లభించకుండా చేయడానికి మొఘలులు కృషిచేశారు. 1684–87 మధ్యకాలంలో బీజాపూర్, గోల్కొండ ఆక్రమణపై దృష్టి పెట్టారు. మహారాష్ట్రులను అణచివేయాలంటే ముందుగా ఈ రెండింటిని ఆక్రమించుకోవాలను కోవడం అందుకు కారణం.

ఔరంగజేబు సింహాసనం అధిష్టించేనాటికి నిజాంషాహీ రాజ్యం చివరిదశకు చేరుకుంది కానీ అదిల్‌షా అహ్మద్‌నగర్ భూభాగాలను వదులుకోవడానికి నిరాకరించాడు. ఈ స్థితిలో దక్కన్‌పై చర్య తీసుకునేందుకు ఔరంగజేబు విముఖత చూపాడు. దీనికి ఎక్కువ సమయం అవసరమవుతుందనీ, అధిక మొత్తంలో సైన్యం సొమ్ము అవసరమని భావించాడు. అంతేకాకుండా దండయాత్రకు బలమైన నాయకుడు లేదా యువరాజు అవసరం అని గుర్తించాడు. బలమైనవాడు అయితే మొఘల్ అధికారుల మధ్య విభేదాలను తొలగించి, సమర్థవంతంగా సైన్యాధికారిగా వ్యవహరించగలడని భావించాడు. అయితే ఔరంగజేబు పెద్దగా దీనిపై శ్రద్ధ పెట్టలేదు లేక తానే స్వయంగా వెళ్ళాలని కూడా అనుకోలేదు.

ఔరంగజేబు తెలివైన దక్కన్ విధానాన్నే అనుసరించినా అది విజయవంతం కాలేదు. ఈలోగా మహారాష్ట్రులు పెరుగుతూ వున్న ప్రాబల్యాన్ని గుర్తించడంతో పాటు వారిని అణిచివేసేందుకు దక్కన్‌రాజ్యం సహకారం అవసరం అని భావించాడు. అయితే దక్కన్ రాజ్యాలు సహకరించేందుకు వ్యతిరేకించాయి. క్రీ.శ. 1636 సంధి రద్దు తర్వాత మొఘలులు, దక్కన్ రాజ్యాలు వారు ఏకం కావడం అనేది మానసికంగా కుదరదు. గోల్కొండ మంత్రులైన అక్కన్న,మాదన్నలు శివాజీకి సహకరించడం ఔరంగజేబుకు కోపకారణమైంది. శివాజీ ప్రాబల్యం లోనికి బీజాపూర్ వెళ్తుందనీ, గోల్కొండపైన మహారాష్ట్రుల పెత్తనం నెలకొంటుందనీ ఔరంగజేబు భయపడ్డాడు. అక్బర్ రాకుమారుడు ఔరంగజేబుకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేసినప్పుడు శంభాజీ అతనికి ఆశ్రయం కల్పించాడు. దీనితో బీజాపూర్, గోల్కొండలను ఆక్రమించుకోకుండా మహారాష్ట్రులను అణచివేడం సాధ్యం కాదని ఔరంగజేబు గ్రహించాడు.

అయితే జైసింగ్ చెప్పినట్లు రెండు దశాబ్దాల క్రితం చేయ్యాల్సిన దక్కన్ ఆక్రమణలను 1684లో ప్రారంభించడం వల్ల అనేక దుష్ఫలితాలు మొఘలులకు కలిగాయి. ఈ రెండు దశాబ్దాల కాలంలో మహారాష్ట్రులు అనూహ్యంగా బలపడ్డారు. గెరిల్లా యుద్ధ పద్ధతుల్లో ఆరితేరారు. కర్నాటకలో ద్వితీయశ్రేణి నాయకత్వం బలోపేతమైంది. ఆత్మవిశ్వాసం పెరిగింది. శివాజీ పట్టాభిషేకం చేసుకోవడం వల్ల తిరుగుబాటుదారుడు అనికాకుండా చక్రవర్తిగా గుర్తింపు పొందాడు. ఫలితంగా దక్కన్ రాజ్యాలు శివాజీ సహకారం కోసం, స్నేహం కోసం ఉవ్విళ్ళూరాయి. ప్రజాభిమానాన్ని చూరగొన్న మహారాష్ట్ర

విజృంభణలను ఔరంగజేబు అంచనా వేయలేక పోయాయి. ఫలితంగా ఔరంగజేబు అనేక తప్పులు చేశాడు. శివాజీతో స్నేహంగా వుండడం మాని, కుమారుడిని సహితం వెంటాడడు. దీనితో మరింత ధృడసంకల్పంతో మొఘలులతో పోరాడాడు. అంతేకాకుండా, ఈ సమయంలో బలమైన రాజుపుత్రులను దూరం చేసుకున్నాడు. హాడా, బుందేలా, రాథోడ్ మరియు కచ్చవా బలగాలు మొఘలులతో దక్కన్ చేరినా వారికి సరైన నాయకుడు లేడు. పైగా, దక్కన్ ఆక్రమణనాటికి డెబ్బైఏళ్ళకు పై బడింది. బీజాపూర్, గోల్కొండలను ఆక్రమించినా సమస్యలు పరిష్కారం జరగకపోగా నూతన సమస్యలు ఉత్పన్నమయ్యాయి. జాగీర్దారీల సంక్షోభం, అస్తవ్యస్తమైన మొఘల్‌పాలన మొఘల్ సామ్రాజ్య సుస్థిరతకు గొడ్డలిపెట్టుగా పరిణమించి మొఘల్ రాజ్య పతనాన్ని వేగవంతం చేసింది. మొఘల్ రాజ్యపతనాన్ని గురించి ఇంకో అధ్యాయంలో చదువుతారు.

బీజాపూర్, గోల్కొండలను విలీనం చేయాలని ఔరంగజేబు నిర్ణయించడానికి దారి తీసిన పరిస్థితులు.

1. మహారాష్ట్రులు బలం పెరగడం
2. శివాజీకి గోల్కొండ వారి సహాయం
3. బీజాపూర్ శివాజీ ప్రాబల్యం క్రిందికి వెళ్తుందనీ, గోల్కొండపై మహారాష్ట్రుల పెత్తనం నెలకొంటుందని భయపడడం
4. ఔరంగజేబుకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేసిన అక్బర్ రాకుమారుడికి శంభాజీ ఆశ్రయం యివ్వడం

## 43.బి పాఠ్య ప్రశ్నలు

1. అహ్మద్‌నగర్‌ను విలీనం చేయాలని షాజహాన్ నిర్ణయించడానికి కారణాలు ఏమిటి?
2. ఔరంగజేబు పాలనలో మొఘలులు దక్కన్ రాజ్యాల మధ్య సుహృద్భావ సంబంధాలు ఏర్పడే పరిస్థితి లేకపోవడానికి కారణం ఏమిటి?
3. బలమైన యువరాజును దక్కన్‌ను పంపేందుకు ఔరంగజేబు ఎందుకు శ్రద్ధ వహించలేదు?
4. ఔరంగజేబు దక్కన్ విధానం మొఘల్ పరిపాలనమీద చూపిన రెండు ప్రభావాలను వివరించండి.

## సారాంశం :

అక్బర్ దక్కన్ విధానాన్ని రూపొందించాడు. మొఘల్ సార్వభౌమాధికారాన్ని దక్కన్‌పై సాధించాలనుకున్నాడు. గుజరాత్ మార్గం రక్షణకు, పోర్చుగీసుల ప్రమాదం నుంచి కాపాడుకోవడానికి దక్కన్‌పై ప్రాబల్యం సంపాదించడం అవసరమని అక్బర్ భావించాడు. సర్వమానవ శాంతిని దక్కన్‌లో కూడా సాధించాలని అక్బర్ అనుకున్నాడు. ఖాందేష్, బీరార్, బాలఘాట్‌లను ఆక్రమించడంలో అక్బర్ విజయం సాధించాడు. క్రీ.శ.1600 సంధి మొఘలులకు దక్కన్‌పై ప్రాబల్యాన్ని కల్గించింది. ఈ ప్రాంతాల విషయమై దక్కన్ రాజ్యాలు అక్బర్ వారసుల కాలంలో పోరాటం చేశారు. బీజాపూర్‌తో వివాహ సంబంధం ఏర్పాటు చేసుకోవడం ద్వారా వారి సహాయాన్ని పొందాలనుకున్న అక్బర్ వ్యూహం ఫలించలేదు.

జహంగీర్ అక్బర్ విధానాన్నే కొనసాగించాడు కానీ మరింత ముందుకు వెళ్ళే ప్రయత్నం చేయలేదు. జహంగీర్ అహ్మద్‌నగర్ మాలిక్‌అంబర్ నుంచి వ్యతిరేకులను ఎదుర్కొన్నాడు. అంబర్ తన స్థానాన్ని సుస్థిరం చేసుకునేందుకు

మొఘలులతో నిరంతరం పోరాటం సలిపాడు. జహంగీర్ కాలంలో దక్కన్ విషయాలలో మహారాష్ట్రులకు ప్రాధాన్యత లభించడం ప్రారంభమైంది.

షాజహాన్ కాలంలో దక్కన్ విధానంలో పూర్తిమార్పులు చోటుచేసుకున్నాయి. క్రీ.శ.1600 సంవత్సర సంధిని అహ్మద్‌నగర్ ఉల్లంఘించడంతో దానిని ఆక్రమించాలని షాజహాన్ నిర్ణయించుకున్నాడు. క్రీ.శ.1636లో షాజహాన్ బీజాపూర్ గోల్కొండలలో విడివిడిగా సంధులు చేసుకున్నాడు. కానీ అవి ఎక్కువ కాలం నిలువలేదు.

ఔరంగజేబు పాలనకాలంలో దక్కన్ రాజకీయాలు మరింత సమస్యగా తయారయ్యాయి. మొదట్లో, 1636 సంధిలో బీజాపూర్‌కు యిచ్చిన ప్రాంతాలను తిరిగి పొందాలని ఔరంగజేబు ప్రయత్నించాడు. మహారాష్ట్రులకు వ్యతిరేకంగా బీజాపూర్ గోల్కొండల నుంచి సహాయం పొందాలనుకున్న ఔరంగజేబు ప్రయత్నాలు విఫలమయ్యాయి. మహారాష్ట్రుల విజృంభణ, మొఘలులకు సహకరించేందుకు బీజాపూర్, గోల్కొండల నిరాకరణ ఔరంగజేబు దక్కన్ విధానాన్ని మార్చివేసింది. మహారాష్ట్రులపై చర్యల కంటే ముందు బీజాపూర్, గోల్కొండలను విలీనం చేసుకోవాలనుకున్నాడు. తన పరిపాలన చివరి దశలో ఔరంగజేబు అనేక తప్పులు చేశాడు. ఔరంగజేబు దక్కన్ దండయాత్రలు మొఘలు రాజ్యానికి నష్టాలను కలిగించాయి.

**అభ్యాసాలు :**

1. దక్కన్ విషయాలలో అక్బర్ జోక్యం చేసుకునేందుకు దారి తీసిన కారణాలు ఏవి?
2. జహంగీర్ దక్కన్ విధానం అక్బర్ దక్కన్ విధానంతో ఏవిధంగా పోలివుంది?
3. 1636 సంధుల ప్రాముఖ్యతను వివరించండి. మొఘలులు ఎందుకు వీటిని రద్దు చేశారు?
4. బీజాపూర్, గోల్కొండ రాజ్యాలను ఆక్రమించాలని ఔరంగజేబు నిర్ణయించేందుకు దారితీసిన పరిస్థితులు ఏవి?
5. 1684లో బీజాపూర్, గోల్కొండలను ఆక్రమించడానికి ఔరంగజేబు నిర్ణయించిన సమయంలో ఎదురైన సమస్యలు ఏవి?
6. అక్బర్ మరియు ఔరంగజేబుల దక్కన్ విధానాలను పోల్చండి.

## పాఠ్యాంశ ప్రశ్నలకు సమాధానాలు

### 43.ఎ.

1. అక్బర్ భారతదేశం మొత్తంలో రాజ్యాన్ని ఏర్పాటు చేయాలనుకున్నాడు. దక్కన్ రాజ్యాలు మొఘల్ సార్వభౌమాధికారాన్ని గుర్తించాలనుకున్నాడు.
2. అక్బర్ తన కుమారుడు డేనియల్‌కు ఇబ్రహీం అదిల్‌షా కుమార్తె నిచ్చి వివాహం జరిపించాడు.
3. బీరార్ మరియు బాలాఘాట్‌లను మొఘలులు విలీనం చేసుకున్నారు.
4. అహ్మద్‌నగర్ మాలిక్ అంబర్

**43.బి.**

1. (i) మొఘల్ సైనికుడు ఖాన్–ఇ–జహన్‌లోడి తిరుగుబాటు చేయగా అహ్మద్‌నగర్ సుల్తాన్ ఆశ్రయమిచ్చాడు.

(ii) బీరార్ మరియు బాలాఘాట్‌లపై మొఘల్ అధికారాన్ని గుర్తించడానికి అహ్మద్‌నగర్ సుల్తాన్ అంగీకరించలేదు.

2. 1636 సంధిని ఉల్లంఘించమని మొఘల్ సుల్తాన్‌లు దక్కన్ సుల్తాన్‌లను హమీని యిచ్చారు కానీ ఉల్లంఘించడంతో మొఘల్‌లపై నమ్మకాన్ని కోల్పోయారు.

3. దక్కన్‌లోని బలమైన మొఘల్ సైన్యం నాయకుడిగా ఏ రాకుమారుడిని అంగీకరించలేదు. అందుకు తనకు ప్రమాదమని భావించడమే కారణం. గతంలో షాజహాన్, ఔరంగజేబులు దక్కన్ సుబేదారులుగా పనిచేసి అనుభవాన్ని సంపాదించారు. మొఘల్ సింహాసనం అధిష్టించేందుకు అది వారి కెంతో దోహదపడింది.

4. (i) జాగీర్దారీ వ్యవస్థ సంక్షోభం ఏర్పడింది.

2. (ii) ఆర్థిక దుస్థితి వల్ల మొఘల్ పాలన అవసానదశకు చేరుకుంది.

# 44

# మహారాష్ట్రుల విజృంభణ - మొఘల్, మహారాష్ట్రుల సంబంధాలు

## 44.1 పరిచయం :

క్రీ.శ 17 మరియు 18వ శతాబ్ధంలోని రాజకీయాలలో మహారాష్ట్రుల ప్రాబల్యం పెరగడం ఒక ప్రధానమైన అంశం. మహారాష్ట్ర ఐక్యతలో శివాజీ ప్రధానమైన పాత్రధారి. రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక పరిస్థితులు శివాజీ విజయానికి కావల్సిన పరిస్థితులను కల్పించాయి. ఈ పరిస్థితులను స్వతంత్ర్య మహారాష్ట్ర నిర్మాణానికి అనుగుణంగా శివాజీ మలుచుకున్నాడు. మీరు ఈ అధ్యయంలో మహారాష్ట్రుల విజృంభణను ధైర్యశాలి అయిన సైనికుడుగా నైపుణ్యం కలిగిన దౌత్యవేత్తగా, రాజకీయ చతురుడు అయిన శివాజీని గురించి మీరు చదువుతారు.

దక్కన్‌లో మహారాష్ట్రుల విజృంభణ మొఘలులకు కష్టాలను తెచ్చిపెట్టింది. అందువల్లనే శివాజీ, శంభాజీ, రాజారామ్‌లను ఔరంగజేబు అణచివేయాలని భావించాడు. అయితే మహారాష్ట్రులు ధైర్యసాహసాలతో ఔరంగజేబును ధిక్కరించి ఆయన ప్రయత్నాలను వమ్ము చేశారు. ఈ పాఠంలో మొఘలులు, మహారాష్ట్రుల మధ్య సంబంధాలను చదువుతారు.

## 44.2 లక్ష్యాలు :

ఈ పాఠ్యాంశం చదివిన తర్వాత మీరు ఈ విషయాలను అర్థం చేసుకోగలరు.

1. మహారాష్ట్రుల విజృంభణకు దోహదం చేసిన పరిస్థితులను
2. శివాజీ తొలిజీవితం, బీజాపూర్‌లో శివాజీ సంబంధాలు
3. ఔరంగజేబుకు శివాజీతో గల సంబంధాలు
4. శివాజీ యొక్క రాజకీయ, సాంఘిక ప్రాముఖ్యత
5. శివాజీ తర్వాత శంభాజీ, రాజారాం, తారాబాయి వంటి మహారాష్ట్రులతో ఔరంగజేబు చేసిన యుద్ధాలు

## 44.3 మహారాష్ట్రుల ఆవిర్భావం :

క్రీ.శ 17వ శతాబ్ధంలో మహారాష్ట్రుల బలమైన విజృంభణ ప్రారంభమై, 18వ శతాబ్ధం చివరినాటికి దేశంలో బలమైన రాజకీయ శక్తిగా ఆవిర్భవించింది. సాంఘిక మరియు రాజకీయ విషయాలలో ప్రధానమైన అంశం చిన్నాభిన్నంగా

వున్న మహారాష్ట్రుల శక్తులను ఏకం చేసిన ఘనత శివాజీకి దక్కుతుంది. అందుకు అవసరమైన పరిస్థితులను కొన్ని రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక కారణాలను కల్పించాయి.

శివాజీ కంటే ముందే బీజాపూర్, అహ్మద్‌నగర్ రాజ్యాలలో పరిపాలనా, సైనిక వ్యవహారాలతో పనిచేయడం ద్వారా మహారాష్ట్రులు పరిపాలనా సైనిక అనుభవాన్ని సంపాదించారు. ఈ అనుభవం తర్వాతి కాలంలో స్వతంత్రంగా వ్యవహరించేందుకు అవసరమైన నమ్మకాన్ని కలిగించింది. మొఘలులు దక్కన్‌లో పురోగమించడంతో మహారాష్ట్రుల బలం, ప్రాబల్యం పెరిగాయి. దక్కన్ సుల్తానులు, మొఘలులు కూడా మహారాష్ట్రుల సహాయాన్ని ఆశించారు. మహారాష్ట్రుల విలువను గుర్తించిన జహంగీర్ మహారాష్ట్రులు బలవంతులు, దేశంలో ప్రతిఘటనకు ప్రధానులని తన జ్ఞాపకాలలో వ్రాసుకున్నాడు. మహారాష్ట్రులలోని బర్గీలను అంబర్ తనసైన్యంలో అధిక సంఖ్యలో చేర్చుకున్నాడు. కొందరు మహారాష్ట్ర నాయకులు సమర్థులుగా గుర్తింపబడడమే కాకుండా షాజీ ఖాన్స్‌లే లాంటి వారు జాగీర్‌లను కూడా పొందారు. దక్కన్‌లో మొఘల్ విస్తరణను అడ్డుకోవడంలో నిజాంషాహీలకు షాజీ ప్రధాన ఆస్తి అయి నిలిచాడు. నిజాంషాహీ చివరి దశలో అహ్మద్‌నగర్‌లో అధికార చక్రం తిప్పాడు. అహ్మద్‌నగర్‌ను షాజహాన్ విలీనం చేసుకున్న అనంతరం షాజీ భాన్స్‌లే 1636లో బీజాపూర్ కొలువులో చేరి కర్నాటకలో జాగీర్‌ను పొందాడు. అనిశ్చిత పరిస్థితులను ఆధారంగా చేసుకుని ప్రత్యేక రాజ్యాన్ని ఏర్పాటు చేసుకునేందుకు ప్రయత్నం చేశాడు.

మహారాష్ట్రుల విజృంభణకు భక్తి ఉద్యమం కొంతమేరకు దోహదం చేసింది. ఈ ఉద్యమం జ్ఞానదేవ్(11296) కాలంలో ప్రారంభమై తుకారం (1608)తో ఉన్నతస్థితికి చేరింది. ఈ ఉద్యమం కేవలం కొన్ని వర్గాలకు మాత్రమే పరిమితం కాకుండా సామాన్యులకు సహితం ప్రాకింది. ఆడంబరమైన పూజావిధానాలను, కులవ్యవస్థను, జన్మతః ఏర్పడిన తేడాలను భక్తి ఉద్యమకారులు వ్యతిరేకించారు. ఈ ఉద్యమం మహారాష్ట్రులను చైతన్యపరచడమే కాకుండా మహారాష్ట్ర సమాజానికి శక్తినిచ్చింది. మరాఠీ భాషలో భక్తి ఉద్యమకారులు వ్రాసిన భక్తిపాటలు, సాహిత్యం అందరికీ అర్థమయ్యే సామాన్య భాషలో వుండి ప్రజలందరినీ ప్రభావితం చేశాయి.

ఇలాంటి స్థితిలో శివాజీ మహారాష్ట్రులలోని వివిధ శాఖలు, వర్గాలను ఒకచోట చేర్చి ఐక్యత సాధించడంతో పాటు, అణగారిన వారైన కుంబీలు, కోలీస్ మరియు మాచీలీ ప్రాంతంలోని వివిధ కొండజాతి వారితో కలిపి కూటమి ఏర్పాటు చేయగలిగాడు. ఈ కూటమి ఉద్యమానికి విశాలత్వాన్ని కలిగించడంతో పాటు బలమైనదిగా తయారైంది. ఈ విధమైన సామాజిక సమాహారంతో కూడిన మహారాష్ట్ర సైన్యాన్ని 18వ శతాబ్దం చివరి దశలో చూడవచ్చు. వివిధ చేతి వృత్తులవారు, వ్యాపారులు, రైతులు వంటివారు ఆ సైన్యం భాగస్వాములయ్యారు. ఈ విధంగా సామాన్యులైన వారికి ఉన్నత స్థానాలు లభించడంతో ఉద్యమం మరింత తీవ్రతరమైంది.

మహారాష్ట్ర ఉద్యమానికి భూమికోసం చేసిన పోరాటం బలాన్నిచ్చింది. శివాజీ పక్షంలో చేరిన మొట్టమొదటివారు మావల్ ప్రాంతానికి చెందిన చిన్నకారు రైతులు. వీరు ఎల్లప్పుడూ "దేశ్‌ముఖ్"లనే భూస్వాముల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి జీవించేవారు. ఈ 'దేశ్‌ముఖ్"లు బీజాపూర్ పాలకులకు సన్నిహితంగా వుండేవారు. శివాజీ దేశ్‌ముఖ్‌లను విశ్వసించక వారి కోటలు, భూములను స్వాధీనం చేసుకునేవాడు.

మహారాష్ట్ర భౌగోళిక పరిస్థితులు మహారాష్ట్రుల వ్యక్తిత్వం, చరిత్ర తయారీలపై తీవ్ర ప్రభావాన్ని కనబరిచాయి. మహారాష్ట్రలోని అధికభాగం కొండలున్న పీఠభూములతో కూడుకొని వుంది. ఈ స్థితి గెరిల్లా యుద్ధాలను అనుసరించేందుకు

సహాయపడింది. గెరిల్లా యుద్ధ విధానాలలో మహారాష్ట్రులు సిద్ధహస్తులు. సారవంతం కానీ, పంటలు సరిగా పండని నేలలు, తక్కువ వర్షపాతం, వ్యవసాయ ఉత్పత్తులు తక్కువ కావడం మహారాష్ట్రులను బలమైనవారుగా, గట్టివారుగా తయారుచేశాయి. వీరిని ఉద్యమానికి ఉపయోగించుకున్నారు.

మహారాష్ట్ర ఉద్యమానికి ఔరంగజేబు అనుసరించిన మతవిధానమే కారణమని కొందరుచరిత్రకారులు పేర్కొన్నారు. దీనికి చారిత్రక ఆధారాలు లేవు. షాజీభాన్స్లే, శివాజీ ఆధ్వర్యంలో జరిగిన మహారాష్ట్రుల తొలి విస్తరణలు షాజహాన్ మత సహన సమయంలోనే జరిగాయి. మొదట్లో మహారాష్ట్రుల విభేదాలు దక్కన్ ముస్లిం రాజ్యాలైన బీజాపూర్‌తోనే కానీ మొఘలులకు వ్యతిరేకంగా కాదనే విషయం గుర్తుంచుకోవాలి. ఇదివరకే మహారాష్ట్రుల కుటుంబాలు నిధులు, భూములను దక్కన్ పాలకుల నుంచి పొందారనే విషయం గమనించదగింది. శివాజీ ఉన్నత స్థితికి చేరేందుకు అహ్మద్‌నగర్ మాలిక్‌అంబర్ చూపిన అధిమానం కూడా కారణం. పట్టాభిషేక సమయంలో తనను హిందూ ధర్మ రక్షకుడుగా శివాజీ చెప్పుకున్నా హిందూ, ముస్లింలిద్దరినీ దోచుకున్నాడనే విషయం మరువరాదు.

**మహారాష్ట్రుల విజృంభణ కారణాలు :**

1. మహారాష్ట్రులు దక్కన్ రాజ్యాలలో కొలువులోనూ, సైన్యంలోనూ ఉద్యోగాలు చేసి పాలనలోను, సైనిక వ్యవహారాల్లోనూ అనుభవాన్ని సంపాదించారు.
2. భక్తి ఉద్యమం కులవ్యవస్థను, వర్గ భేదాలను వ్యతిరేకించడంతో పాటు 'స్వరాజ్య' అవసరాన్ని చాటింది. సాహిత్య సృష్టికి ఉద్యమం కారణమై ప్రజల్లో చైతన్యాన్ని కలిగించింది.
3 అణగారిన వర్గాలలో శివాజి ఒక కూటమిని తయారుచేశాడు. ఇది మహారాష్ట్ర ఉద్యమ పునాదులను విస్తృతం చేసింది.
4. భూమిపై హక్కుకోసం తక్కువ భూములున్న దేశ్‌ముఖ్‌లు శివాజీతో కలిసి అధిక భూహక్కులున్న దేశ్‌ముఖ్‌లతో పోరాడారు.
5. భౌగోళిక పరిస్థితులు మహారాష్ట్రులు గెరిల్లా యుద్ధ పద్ధతులను అభివృద్ధి పరుచుకునేందుకు దోహదం చేయడంతో పాటు వారిని బలం గలవారిగా ధైర్యశాలులురుగా తయారుచేశాయి.

## 44.4 శివాజీ విజృంభణ :

దక్కన్ రాజ్యాలు బలహీనం అవ్వడం విశాల రాజ్యాన్ని ఏర్పాటు చేసే అవకాశాన్ని శివాజీకి కలిగించింది. అహ్మద్‌నగర్ కనుమరుగవ్వడం, షాజహాన్ విధానాల వల్ల బీజాపూర్, గోల్కొండలు మొఘల్ రాజ్యంతో కలవడం, మహ్మద్ అదిల్‌షా మరణానంతరం బీజాపూర్‌లోని అంతఃకలహాలు శివాజీకి అవకాశాన్ని యిచ్చాయి. బీజాపూర్ బలహీనతను ఆధారంగా చేసుకుని చకన్, పురందర్, తోర్నా, సుప, సింగార్, కొండనా కోటలను శివాజీ 1645-47 మధ్యకాలలో స్వాధీనం చేసుకున్నాడు.

శివాజీ క్రీ.శ 1656లో మరాఠా నాయకుడైన చందన్‌రావు మోరేనుంచి క్రూరంగా జావాలీ ప్రాంతాన్ని ఆక్రమించాడు. అందుకు శివాజీ నాయకత్వాన్ని వ్యతిరేకిస్తూ వుండడమే కారణం. దీనితో మార్వాల్ ప్రాంతానికి శివాజీ

తిరుగులేని నాయకుడు  అవ్వడంతో పాటు సతారా, మరియు కొంకణ్ ప్రాంతాల స్వాధీనానికి మార్గాన్ని సుగమం చేసింది. మోరే కూడబెట్టిన ఖాజానాలోని ధనం శివాజీ ఆర్థిక స్థితిని ఉన్నతం చేసింది. మావలీ పదాతి దళం శివాజీ సైన్యంలో ప్రధాన పాత్రధారి అయింది. శివాజీ ఈ చర్యలను మొఘల్ దండయాత్రను ఎదుర్కొనడంలో మునిగివున్న బీజాపూర్ అడ్డుకోలేకపోయింది.

ఔరంగజేబు ఉత్తర భారతానికి తిరిగివెళ్ళడం, బీజాపూర్ అధికారుల మధ్య విభేదాలు శివాజీ బీజాపూర్ ప్రాంతంలో మరింత బలపడేందుకు వీలును కల్పించాయి. ఆర్థికంగా వున్నతమైన కళ్యాణ్, భీవాండిలతో పాటు మహులీ కోట వున్న ఉత్తర కొంకణ్ ప్రాంతంను శివాజీ స్వాధీనం చేసుకున్నాడు.

మొఘల్ దండయాత్రనుంచి తాత్కాలికంగా బయటపడిన, అంతఃకలహాల నుంచి కోలుకున్న బీజాపూర్ శివాజీపై గట్టి చర్యలు తీసుకొనేందుకు నిర్ణయించుకుంది. ప్రసిద్ధ బీజాపూర్ సేనానాయకుడైన అఫ్జల్‌ఖాన్ నాయకత్వంలో బీజాపూర్ పెద్ద సైన్యాన్ని శివాజీ పైకి పంపింది. శివాజీ ఎత్తుకు పై ఎత్తు వేసి సాహసంతో అఫ్జల్‌ఖాన్‌ను అంతమొందించాడు. అఫ్జల్‌ఖాన్ ఓటమి శివాజీ ప్రతిష్టను పెంచింది. నాయకులు లేని బీజాపూర్ సైన్యంపై విరుచుకుపడి వారి ఆయుధాలను, సామాగ్రిని స్వాధీనం చేసుకున్నాడు. మహారాష్ట్ర సైన్యం పన్వాలా కోటలను పట్టుకుని, దక్షిణ కొంకణ్, కొల్లాపూర్ జిల్లాలవైపు పురోగమించి ఆక్రమణలు చేసింది. దీనితో శివాజీ గొప్పవీరుడుగా పేరు పొందాడు. అనేకమంది ప్రజలు శివాజీ సైన్యంలో చేరేందుకు రావడం మొదలైంది. గతంలో బీజూపూర్‌లో పనిచేసిన ఆఫ్ఘన్ జాతీయులు సైతం శివాజీ సైన్యంలో చేరారు.

| మహారాష్ట్ర అధికారం, ప్రాబల్యం పెరగడంలో శివాజీ ప్రధాన పాత్రధారుడు. బలమైన సైన్యాన్ని సమకూర్చుకుని అనేక కోటలను స్వాధీనం చేసుకున్నాడు. శివాజీ బీజాపూర్, మొఘులులకు బలమైన శత్రువుగా దక్కన్‌లో పేరు పొందాడు. |
|---|

## పాఠ్య ప్రశ్నలు

సరైన సమాధానములను గుర్తించండి.

1. దక్కన్‌లో మహారాష్ట్రుల విజృంభణకు క్రింది వాటిలో ఏది ఎక్కువగా సహాయపడింది?
   ఎ) దక్కన్‌లోని ముస్లిం రాజ్యాలను ఆక్రమించడం
   బి) వారిని ఉన్నత న్యాయధీశులుగా నియమించడం
   సి) పరిపాలనా మరియు యుద్ధ రంగాలలో వారి శిక్షణ
   డి) సమాజంలో సమానత్వాన్ని పాటించడంలో శ్రద్ధ కనపరచడం
2. శివాజీ మొఘల్ పాలకులకు వ్యతిరేకంగా పోరాడాడు. అందుకు ప్రధానంగా
   ఎ) అధిక మొత్తంలో ఆదాయం పొందాలనుకోవడం
   బి) స్వతంత్ర ముస్లిం రాజ్యస్థాపన ఏర్పాటు చేయాలనే ఆలోచన
   సి) మొఘల్ ఆధిపత్యం నుంచి హిందువులను తప్పించటం
   డి) మొఘులులను విదేశీయులుగా భావించడం

3. జవాలీ ఆక్రమణ శివాజీ సైనిక కార్యక్రమాలకు ప్రారంభం అనేందుకు రెండు కారణాలను తెల్పండి?

4. శివాజీ సైనిక విధానంలో భౌగోళిక పరిస్థితులు ప్రధానపాత్ర పోషించాయనేందుకు రెండు కారణాలను పేర్కొనండి.

## 44.5 శివాజీతో ఔరంగజేబు సంబంధాలు :

క్రీ.శ 1661 తర్వాత శివాజీ దక్కన్‌లో మొఘలులను ఎదుర్కొనాల్సి వచ్చింది. మహారాష్ట్రుల విజృంభణను, మొఘల్ సరిహద్దుల వరకు వారి అధికారం విస్తరించడను ఔరంగజేబు ఆతృతతో గమనిస్తూ వున్నాడు. బీజాపూర్‌తో ఏర్పరచుకున్న సంబంధాల వల్ల శివాజీకి వ్యతిరేకంగా చర్యలు తీసుకోలేకపోయాడు. ఇది శివాజీ విజృంభణను మరింత ప్రోత్సహించింది. శివాజీ అధికారం విస్తృతం కావడం అతని పై చర్యలకు ఔరంగజేబును ఉద్యుక్తుడిని చేసింది. దీనితో 1660లో తన మామ అయిన షాయిస్థాఖాన్‌ను దక్కన్ సుబేదార్‌గా శివాజీ విజృంభణను అరికట్టేందుకు నియమించాడు. షాయిస్థఖాన్‌కు మరింత బలం చేకూర్చడానికి జస్వంత్‌సింగ్‌ను అతనికి సహాయంగా పంపాడు. మొఘలులు బీజాపూర్ సహాయాన్ని పొందగలిగారు. తొలిదశలో షాయిస్థాఖాన్ పూనా, చకాన్ కోటలను ఆక్రమించుకుని కళ్యాణ్‌తో సహ ఉత్తర కొంకణ్‌పై ఆధిపత్యం సంపాదించాడు. మొఘలుల నుంచి వస్తూవున్న వ్యతిరేకులను గుర్తించి శివాజీ బీజాపూర్‌తో రహస్య ఒప్పందం చేసుకున్నాడు. దీనితో శివాజీ దృష్టి మొత్తం మొఘలులపైకే మళ్ళింది.

మొఘలులను యుద్ధంలో ఎదుర్కొనలేని శివాజీ 1663లో పూనాలోని షాయిస్థాఖాన్ నివాసంపై దాడిచేసి అతని కుమారుడితో సహా అనేకమంది అనుచరులను అంతమొదించాడు. షాయిస్థాఖాన్ ప్రాణాలతో బయటపడ్డాడు. దీనితో కోపోద్రిక్తుడైన ఔరంగజేబును బెంగాల్‌కు బదిలీచేసి యువరాజు 'మౌజమ్'ను దక్కన్‌లో ప్రతినిధిగా నియమించాడు. శివాజీ ధైర్యమైన చర్యవల్ల మొఘలులకు తీవ్రమైన అవమానం జరుగగా, శివాజీ బలగౌరవాలు పెరిగాయి. శివాజీ మరో ధైర్యమైన చర్య చేపట్టాడు. 1664లో సూరత్‌పై దాడిచేసి కొల్లగొట్టాడు. పశ్చిమతీరంలో లాభదాయకమైన నౌకాకేంద్రమైన సూరత్‌నుంచి పెద్ద మొత్తంను స్వాధీనం చేసుకున్నాడు.

షాయిస్థఖాన్ విఫలం తర్వాత బలవంతమైన అంబర్ రాజు రాజాజైసింగ్‌ను శివాజీని ఎదుర్కొనేందుకు దక్కన్‌కు పంపాడు. జైసింగ్ మరాఠాలకు వ్యతిరేకంగా సైనిక, దౌత్య విధానాలను ప్రయోగించాడు తన ముందువారిలా కాకుండా ముందుగా శివాజీని ఏకాకిని చేసే ప్రయత్నం చేశాడు. అనేకమంది మరాఠా నాయకులను, బీజాపూర్ సుల్తాన్‌ను తనవైపుకు తిప్పుకున్నాడు. దీనితో శివాజీ బలానికి దెబ్బతగిలింది. శివాజీ ముఖ్యస్థావరమైన పురంధర్ కోటపైన రాజాజైసింగ్ దాడిచేయదలచి, కోటను ముట్టడించి,మహారాష్ట్రుల ప్రతిఘటనను ఎదుర్కొని చివరకు కోటను పట్టుకున్నాడు. పురంధర్ పతనంతో శాంతికోసం సంప్రదింపులు జరిపి బలవంతంగా శివాజీ పురంధర్ సంధికి అంగీకరించాడు.

### 1665లో చేసుకున్న పురంధర్ సంధి ప్రకారం :

1. శివాజీ 23 కోటలను, సంవత్సరానికి నాలుగు లక్షల ఆదాయాన్నిచ్చే ప్రాంతాలను మొఘలుల స్వాధీనం చేశాడు. శివాజీకి కేవలం ఒక్క లక్షహన్నుల (huns) ఆదాయం వచ్చే పన్నెండు కోటలు మాత్రమే మిగిల్చబడ్డాయి.
2. బీజాపూర్‌లోని కొంకణ్, బాలాఘాట్ ప్రాంతాలను మొఘలులు శివాజీకి యిచ్చి, దీనికి ప్రతిఫలంగా 40లక్షల హన్నులను శివాజీనుంచి పొందారు.
3. శివాజీ కుమారుడు శంభాజీకి 5000మనసబ్‌దారీ యివ్వబడింది. వీటికి తోడు దక్కన్‌లో జరిగే దండయాత్రలలో

తాను స్వయంగా మొఘలుల వైపు పాల్గొంటానని హామీ యిచ్చాడు.

పురంధర్ సంధి జైసింగ్ రాజకీయ చతురతకు నిదర్శనం. బీజాపూర్ ప్రాంతాలను శివాజీకి యివ్వడం ద్వారా శివాజీ బీజాపూర్‌ల మధ్య విరోధాన్ని సృష్టించకలిగాడు. బీజాపూర్‌తో జరిగే యుద్ధాలలో బలమైన శత్రువైన శివాజీ సహకారాన్ని పొందగలిగాడు. శివాజీతో సంధి మొఘల్ బీజాపూర్ ఆక్రమణతో తొలి అడుగులనీ మరియు దక్కన్ మొత్తం వశమవుతుందని భావించాడు. ఒక్కసారి ఇది జరిగితే..శివాజీని ఎప్పటికీ మొఘలులకు అనుకూలంగా వుంచవచ్చుని భావించాడు.

ఏమైనప్పటికీ మొఘల్, మరాఠా బీజాపూర్ దాడి విఫలమైంది. జైసింగ్ శివాజీని మొఘల్ దర్బారును సందర్శించేందుకు అంగీకరింపజేశారు. అందువల్ల శివాజీ–ఔరంగజేబులిద్దరూ శాంతించగలరని, బీజాపూర్ పై మరోసారి దండయాత్ర చేసేందుకు ఎక్కువ సైనిక బలాలను యిస్తారని జైసింగ్ ఆశించాడు. ఏమైనప్పసటికీ శివాజీ ఆగ్రాకోట సందర్శన విఫలమైంది. శివాజీని సాధారణంగా ఆహ్వానించి 5000 మనసబ్‌దార్‌గా నియమించాడు. ఇది శివాజీకి అవమానించినట్టయింది. కోపోద్రిక్తుడైన శివాజీ దర్బారును బహిష్కరించి, కొలువును తిరస్కరించాడు. దీనితో శివాజీ ఖైదు చేయబడ్డాడు. అయితే శివాజీ ఖైదునుంచి తెలివిగా తప్పించుకుని దక్కన్‌కు చేరాడు.

శివాజీ ఆగ్రా పర్యటన విఫలం కావడం ప్రధానఘటన. మొఘల్, మరాఠాల సంబంధాలలో ఇది ప్రధానమైంది. శివాజీ చులకనగా భావించడం ఔరంగజేబు చేసిన రాజకీయ తప్పిదం. 1668లో ఔరంగజేబు శివాజీకి 'రాజా' అనే బిరుదును యివ్వడంతోపాటు, శివాజీ కుమారుడు శంభాజీకి బీరార్ జాగీర్‌ను యిచ్చాడు. దీన్ని శివాజీ తిరస్కరించాడు. అంతేకాకుండా క్రీ.శ.1670 నుంచి తిరిగి ఆక్రమణలను ప్రారంభించాడు. రెండవసారి సూరత్‌పై దాడిచేసి కొల్లగొట్టి పెద్ద మొత్తాలను స్వాధీనం చేసుకున్నాడు. పురంధర్‌తో సహ అనేక కోటలను నాలుగు సంవత్సరాల కాలంలో ఆక్రమించుకోవడంతో పాటు మొఘల్ ప్రాంతాలపై దాడులను ప్రారంభించాడు. క్రీ.శ.1672లో సూరత్ నుండి చౌత్‌ను వసూలు చేసేందుకు ప్రయత్నించాడు. వాయువ్య ప్రాంతాలలో ఆఫ్ఘన్‌ల విజృంభణ, మొఘల్ అధికారుల మధ్య విభేదాలు మొఘలులను బలహీనపరిచింది. బీజాపూర్‌తో పోరాటాన్ని ప్రారంభించి, పన్వాలా మరియు సతారాలను ఆక్రమించి కనిరా మీద దాడులు చేశాడు.

మహారాష్ట్రులలో శివాజీ గొప్పవాడు. రాజ్యవిస్తరణ బలమైన సైన్యములతో దక్కన్ సుల్తాన్‌లతో సమానస్థాయిని పొందాడు. తన రాజకీయ ప్రాబల్యాన్ని వెల్లడించేందుకు రాయఘడ్‌లో క్రీ.శ.1674లో స్వతంత్ర సార్వభౌముడుగా పట్టాభిషేకం చేసుకున్నాడు. "ఛత్రపతి" అనే బిరుదాన్ని స్వీకరించాడు. 'పట్టాభిషేకం' అనేక విధాలుగా ప్రధానమైనది. స్వతంత్ర పాలకుడని ఇది చాటిచెప్పింది. కనుక బీజాపూర్, గోల్కొండల వారితో సమానంగా వ్యవహారాలు నడపవచ్చును. తిరుగుబాటుదారుగానో, మరో దేశ్‌ముఖ్‌గానో చెలామణి కావల్సిన అవసరం లేదు. అంతేకాకుండా శివాజీకి ఇది ఉన్నతస్థానాన్ని ఇచ్చింది. గంగాభట్ అనే బ్రహ్మణ పండితుడు పట్టాభిషేకానికి పౌరోహిత్యం వహించి శివాజీని క్షత్రియుడని ప్రకటించాడు. ఈ పట్టాభిషేకం మహారాష్ట్రులలో మరింత జాతీయతను పెంపొందించింది. ఇటువంటి పరిస్థితులు కల్పించిన బలాన్ని ఆసరాగా చేసుకుని సర్దేశ్‌ముఖ్‌ని దక్కన్‌లో వసూలు చేశాడు. ఇది మొఘల్ సామ్రాజాన్యినికి సవాలు విసిరినట్టయింది.

క్రీ.శ.1676లో శివాజీ గోల్కొండ కుతుబ్‌షాహీల సహకరంతో బీజాపూర్ స్వాధీనంలోని కర్నాటకపై దండయాత్ర

చేసి వేలూరు, జింజిలను బీజాపూర్ అధికారుల నుంచి స్వాధీనం చేసుకున్నాడు. కర్నాటక దండయాత్రలనుంచి తిరిగి వచ్చిన కొంత కాలానికే క్రీ.శ.1680లో శివాజీ మరణించాడు.

దక్కన్ ఆక్రమణ స్థిరీకరణలలో శివాజీ సహకారం అవసరమని ఔరంగజేబు గుర్తించలేదు. పైగా శివాజీని కేవలం ఒక చిన్నకారు రైతుగా భావించి ఔరంగజేబు అణచివేసేందుకు చూశాడు. అందువల్ల శివాజీతో స్నేహం చేయమన్న జైసింగ్ సలహాను పాటించలేదు. ఇలా చేయడం ఔరంగజేబు రాజకీయ తప్పిదం.

## పాఠ్య ప్రశ్నలు

1. ఔరంగజేబు ఆలోచనలు మొఘల్ కూటమి విషయంలో రాజాజైసింగ్ ఆలోచనల కంటే భిన్నమైంది. అందుకు రెండు ప్రధానమైన విషయాలను వివరించండి.
2. షాయిస్థాఖాన్‌పై శివాజీ చేసిన హఠాత్తుదాడి శివాజీ గౌరవాన్ని ఏవిధంగా పెంచింది? అందువల్ల లభించిన రెండు ప్రయోజనాలను వివరించండి?

## 44.6 శంభాజీ, రాజారామ్, తారాబాయిలతో ఔరంగజేబు సంబంధాలు :

శివాజీ మరణానంతరం పరిపాలనా బాధ్యతను అతని కుమారుడైన శంభాజీ స్వీకరించాడు. తొలిదశలో మొఘల్ ప్రాంతాలపై దాడులు చేయడం ద్వారా ఔరంగజేబుకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేసిన అతని కుమారుడు అక్బర్‌కు ఆశ్రయం యివ్వడం ద్వారా మొఘులులను ఎదురించాడు. అయితే తండ్రి మాదిరి సమర్థుడు కాదు. శంభాజీలో యుద్ధ నైపుణ్యం లేదు. గోల్కొండ, బీజాపూర్‌లపై ఔరంగజేబు దండయాత్రతో ఏమీ సాధించలేకపోయాడు మరియు అక్బర్ రాకుమారుడికి పూర్తిగా సహకరించలేకపోయాడు. ఫలితంగా అక్బర్ రాకుమారుడి తిరుగుబాటు విఫలమై అతను ఇరాన్‌కు పారిపోయాడు. దీనికి తోడు బీజాపూర్, గోల్కొండ ఆక్రమణలు మహారాష్ట్రులపై దృష్టి సారించేందుకు అడ్డుగా నిలిచాయి. క్రీ.శ.1689లో హఠాత్తుగా మొఘులులు దాడిచేసి శంబాజీని, సంఘమేశ్వర్ వద్ద బంధించి తిరుగుబాటుదారుడు దేశద్రోహి అని చంపివేశారు.

శంభాజీని చంపించడం ఔరంగజేబు చేసిన పెద్ద రాజకీయ తప్పిదం శంభాజీని చంపించడం మహారాష్ట్రులలో భయాన్ని పుట్టిస్తుస్తుందని భావించాడు. అయితే అది మహారాష్ట్రులలో మరింత తిరుగుబాటు ధోరణిని పెంచింది.

అనంతరం రాజారామ్ మహారాష్ట్ర పాలకుడు అయ్యాడు. అప్పటికీ మహారాష్ట్రులతో చర్యలు జరిపేందుకు ఔరంగజేబు సిద్ధపడలేదు. మహారాష్ట్రుల రాజధాని రాయగడను మొఘల్ సైన్యం ముట్టడించగా, రాజారామ్ తప్పించుకుని జింజికి పారిపోయి అక్కడినుంచి మొఘులులతో పోరాటాన్ని కొనసాగించాడు. అయితే శంభాజీ కుమారుడు సాహును మొఘులులు బంధించారు. జింజీని ముట్టడించాడు. ఇది ఎనిమిది సంవత్సరాల పాటు సాగింది. రాజారాం జింజి నుంచి తప్పించుకుని సతారాకు చేరాడు. రాజారామ్ మొఘల్ రాజ్యాన్ని మొఘల్ అధికారులు, సర్దారులకు పంచియిచ్చాడు. వారు మొఘులులపై దాడిచేస్తూ వుండేవారు. మహారాష్ట్రులు వివిధ ప్రాంతాలలో సంచరిస్తూ సైన్యంను పెంచుకుని దూరప్రాంతాలపై కూడా దాడులు చేసేవారు. రాజారామ్ వారు స్వతంత్రంగా దాడులు చేసేందుకు అంగీకరించాడు. రాజారామ్ అనేక కోటలను తిరిగి పొందడంతో పాటు ఖాందేష్, బీరార్, బంగళానా ప్రాంతాలపైన చౌత్, సర్దేశ్‌ముఖ్‌లను

విధించాడు. దీనితో ఔరంగజేబు స్వయంగా దాడులు చేసి 1700–1705 మధ్యకాలంలో అనేక కోటలు స్వాధీనం చేసుకున్నాడు. భారీ ఆయుధ సామాగ్రి, స్థానికుల సహాయం లోపించడం పరిసరాల అవగాహన లోపం వంటివి మొఘలులను పీడించాయి. దీనికి తోడు మొఘల్ అధికారుల్లో విభేదాలు, అసంతృప్తి పెరిగాయి. చాలామంది జాగీర్దార్లు రహస్యంగా మహారాష్ట్రులతో ఒప్పందం చేసుకుని చౌత్ కట్టేందుకు అంగీకరించారు. జైసింగ్ శివాజీపై సాధించిన విజయం పునరావృతం కాలేదు. కనుక కేవలం చర్చలు జరపడమే ఔరంగజేబుకు వున్న ఏకైకమార్గం.

క్రీ.వ. 1700లో రాజారామ్ మృతి చెందడంతో అతని భార్య చిన్న పిల్లవాడైన తన కుమారుడు రెండవ శివాజీని సింహాసనంపై కూర్చుండబెట్టి పరిపాలనా బాధ్యతలను చేపట్టింది. ఔరంగజేబుతో సంధికి సిద్ధపడింది. మొఘల్ సైన్యం 5వేల మందిని పోషించేందుకు, 7కోటలను ఔరంగజేబుకు యిచ్చేందుకు అంగీకరించి తన కుమారుడిని మహారాష్ట్ర పాలకుడుగా గుర్తించమని, 7వేల మనసబ్‌గా నియమించమని ప్రతిపాదన చేసింది. తమ స్వాతంత్ర్యాన్ని, చౌత్ వసూలు నిలిపివేతకు కూడా తారాబాయి సిద్ధపడింది కానీ ఔరంగజేబు సంధికి అంగీకరించలేదు. తారాబాయి ప్రతిపాదనను ఆమె బలహీనతగా భావించడంతో పాటు, కొద్దికాలం గట్టిగా వుంటే మహారాష్ట్రులు తన ఆధీనంలోకి వస్తారని భావించాడు.

క్రీ.శ.1703లో మహారాష్ట్రులతో ఔరంగజేబు చర్చలు జరపడంతో పాటు ఒక ఒప్పందానికి కూడా వచ్చాడు. సాహూను విడుదల చేసేందుకు 7వేల మనసబ్‌దారుగా నియమించేందుకు, సాహును శివాజీ స్వరాజ్యను యివ్వడానికి దక్కన్ పైన సర్దేశ్‌ముఖ్ హక్కును యిచ్చేందుకు సిద్ధమయ్యాడు. అయితే చివరి సమయంలో చర్చలను ముగించాడు. అందుకు మహారాష్ట్రులపైన అనుమానం మరియు వారు దాడిచేస్తారనే అపనమ్మకమే కారణం.

మొఘలులు, మరాఠాలు శాంతికోసం చేసిన ప్రయత్నాలు సఫలం కాకపోవడంతో తారాబాయి నాయకత్వంలోని మహారాష్ట్రులు విపరీతమైన బలాన్ని సమకూర్చుకుని, దక్కన్ పాలనలో కీలకులయ్యారు. మళ్వా, బీరార్, గుజరాత్‌లపై దండయాత్రలు చేయడంతోపాటు, క్రీ.శ.1706లో అహ్మద్‌నగర్‌లోని సుల్తాన్ శిబిరంపై దాడిచేశారు. ఈవిధంగా మహారాష్ట్రులను అణచివేసేందుకు ఔరంగజేబు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. స్థానిక స్వాతంత్ర్యాన్ని కోరుకున్న వారు మొఘల్ అధికారాన్ని ఎదురించడంలో విజయులయ్యారు.

> మహారాష్ట్రులను అణచివేయాలనే ఔరంగజేబు ప్రయత్నం విఫలమైంది. స్థానిక స్వాతంత్ర్యాన్ని కోరుకున్న మహారాష్ట్రులు మొఘలులను ఎదురించడంలో విజయం సాధించారు. ఔరంగజేబు సైన్యంపైనే ఆధారపడ్డాడు కానీ, మహారాష్ట్ర ఉద్యమం ప్రజలనుంచి జనించిందనే విషయాన్ని మరిచాడు.

## 44.సి పాఠ్య ప్రశ్నలు

1. శంభాజీని అణచివేసేందుకు ఔరంగజేబును ప్రోత్సహించిన సంఘటన ఏది?
2. శంభాజీని అంతమొందించడం వల్ల ఔరంగజేబుపట్ల మహారాష్ట్రులలో వచ్చిన వ్యతిరేకత ఎట్టిది?

## సారాంశం :

మహారాష్ట్రుల విజృంభణ రాజకీయ, సాంఘిక, ఆర్దిక పరిస్థితులు దోహదం చేశాయి. దక్కన్ రాజ్యాలలో ఉన్నత పదవులను నిర్వహించారు. అనుభవం సంపాదించడమే కాక అధికార ప్రభావాలను మహారాష్ట్రులు పెంచుకున్నాడు.

భక్తి ఉద్యమం మహారాష్ట్ర సమాజాన్ని బలపరచగా, భక్తి ఉద్యమకారులు మహారాష్ట్ర రాజ్య ప్రాముఖ్యాన్ని చాటడంతోపాటు వారిలో చైతన్యాన్ని కలిగించారు. దేశ్‌ముఖ్‌ల పీడన సామాన్య రైతులు ఉద్యమంలో చేరేందుకు కారణమైంది. భౌగోళిక పరిస్థితులు మహారాష్ట్రులను బలవంతులను చేశాయి.

శివాజీ నాయకత్వంలో మహారాష్ట్రులు గొప్పశక్తిగా అవతరించారు. మొదట్లో బీజాపూర్‌తో పోరాటాలు జరిపారు. శివాజీ అనేక కోటలను స్వాధీనం చేసుకున్నాడు. ఆయన ధైర్యమైన ఆక్రమణలు ఆయనను గొప్పవాడుగా కీర్తింపజేశాయి.

శివాజీ మొఘల్ సైన్యాలను దక్కన్‌లో ఎదుర్కొన్నాడు. షాయిస్థాఖాన్ నాయకత్వంలో అణచివేసేందుకు సైన్యాన్ని పంపాడు కాని అది సఫలం కాలేదు. అనంతరం ఔరంగజేబు జైసింగ్ నాయకత్వంలో సైన్యాన్ని పంపాడు. మహారాష్ట్రులతో పోరాటాన్ని సున్నితంగా చూడలేదు. శివాజీ వ్యతిరేకులను ఏకం చేసేందుకు ప్రయత్నించాడు. అనంతరం పురంధర్‌పై దండయాత్ర చేశాడు. క్రీ.శ 1665లో శివాజీని బలవంతంగా సంధికి అగీకరింపజేశారు. ఈ కోటతో పాటు అనేక కోటలు మరియు సొమ్ము మొఘలులకు యిచ్చి వేయాల్సి వచ్చింది. మొఘల్ మహారాష్ట్ర కూటమి దక్కన్ విజయానికి కారణమవుతుందని జైసింగ్ ఆశించాడు. శివాజీ మొఘల్ దర్బారును సందర్శించేందుకు జైసింగ్ అంగీకరింపజేశాడు. అయితే ఈ పర్యటన విఫలమైంది. అందుకు ఔరంగజేబు శివాజీని 5000మనసబ్‌దార్‌గా నియమించాడు.

దీనితో మొఘల్ – మహారాష్ట్రుల సంబంధాలు దెబ్బ తిన్నాయి మరియు శివాజీ పురంధర్‌తో సహా అనేక కోటలను తిరిగి పొందాడు. 1674నాటికి బాగా బలవంతుడయ్యాడు. పట్టాభిషేకం చేసుకుని ఛత్రపతి అనే బిరుదాన్ని స్వీకరించాడు. ఇది దక్కన్‌లో శివాజీని తిరుగులేని నాయకుడుగా నిలబెట్టింది. దక్కన్‌పైన సర్దేశ్‌ముఖ్ హక్కును ఔరంగజేబు పొందాడు. తర్వాత ఎక్కువకాలం శివాజీ జీవించలేదు. కర్నాటక దండయాత్ర నుంచి తిరిగి వచ్చిన తర్వాత క్రీ.శ.1680లో శివాజీ మరణించాడు.

శివాజీ తర్వాత శంభాజీ మహారాష్ట్ర పాలకుడు అయ్యాడు. ధైర్యవంతుడే అయినా తండ్రిలోని రాజకీయ పాలనా నైపుణ్యం శంభాజీకి లేదు. ఇతను చిన్న విషయాలపై తన శక్తిని కేంద్రీకరించడం మొఘలులకు మంచి అవకాశాన్ని కల్గించింది. క్రీ.శ.1689లో మొఘలులు హఠాత్తుగా దాడిచేసి శంభాజీని బంధించి అంతమొందించాయి. ఈ సంఘటన మొఘలులకు వ్యతిరేకంగా పోరాడాలని మహారాష్ట్రులు మరింత గట్టి నిర్ణయం తీసుకున్నారు.

అనంతరం రాజారాం సింహాసనాన్ని అధిష్టించాడు. రాయఘడ్ కోటను మొఘలులు ముట్టడించడంతో రాజారాం జింజికి పోయి అక్కడినుంచి పోరాటం సల్పాడు. మహారాష్ట్ర ఆర్థిక దుస్థితిని తెలుసుకుని రాజారాం మహారాష్ట్ర ప్రాంతాన్ని సైనికాధికారులకు అమీర్లకు మధ్య పంచాడు. వారు మొఘలులను దోచుకుంటారని ఇబ్బందులపాలు చేస్తారని భావించాడు. ఈ విధంగా మొఘల్ ఉద్యమం విస్తృతం కాగా, ఔరంగజేబు మహారాష్ట్రుల బలాన్ని గుర్తించి మహారాష్ట్రులను అణిచి వేయడం అంత సులభతరం కాదని నిర్ణయించుకున్నాడు.

క్రీ.శ 1700 సం॥ రాజారామ్ మరణించినా మహారాష్ట్ర ఉద్యమం కొనసాగింది. శివాజీ II ను సింహాసనంపై కూర్చునపెట్టి తారాబాయి పాలనా బాధ్యతలను స్వీకరించింది. మహారాష్ట్రుల బలం పెరగసాగింది మరియు మహారాష్ట్రులను అణచివేయాలనే ఔరంగజేబు కోరిక తీరలేదు.

## అభ్యాసం:

1. మహారాష్ట్ర బలం పెరగడానికి గల కారణాలను తెలపండి?
2. మహారాష్ట్ర మొఘల్ సంబంధాలను పరిశీలించండి. మహారాష్ట్రులను నియంత్రించడంలో ఔరంగజేబు ఎంతవరకు విజయం సాధించాడు?
3. 1665 పురంధర్ సంధికి దారితీసిన పరిస్థితులు ఏవి? సంధి షరతులను వివరించండి?
4. శివాజీ పట్టాభిషేకం యొక్క సాంఘిక రాజకీయ ప్రాధాన్యతను వివరించండి?

## అదనపు సమాచారం :

### బీజాపూర్ సేనాని అఫ్జల్‌ఖాన్ హత్య :

దక్కన్‌లో విస్తరిస్తున్న శివాజీ ప్రాబల్యాన్ని గుర్తించి అతన్ని అంతమొదించడానికి బీజాపూర్ రాజ్యం పూనుకొంది. ఈ పనికై క్రీ.శ.1659వ సంవత్సరములో సమర్ధసేనాని అఫ్జల్‌ఖాన్‌కు అప్పగించారు. శివాజీని బంధించడానికి చేసే కుట్రలో భాగంగా కృష్ణాజీ భాస్కర్ అనే మరాఠా బ్రాహ్మణుని ద్వారా ప్రయత్నించాడు. శివాజీ ఆ కుట్రను పసిగట్టాడు. ఇద్దరిమధ్య ఒక సమావేశం అఫ్జల్‌ఖాన్ గుడారానికి, శివాజీ కోటమధ్య ఏర్పాటు చేసారు. ఇరువురూ ఇద్దరు అంగరక్షకులతో రావాలనీ శివాజీ ఆయుధాలు లేకుండా రావాలనీ షరతు విధించడమైంది. కానీ శివాజీ తన వస్త్రాలకింద రక్షణ కవచాన్ని, తలపాగా క్రింద ఉక్కు శిరోస్త్రాణాన్ని ధరించాడు. ఎడమచేతి గోళ్ళకు ఉక్కుగోళ్ళు, కుడిచేతిలో చిన్నకత్తిని పూని వెళ్ళాడు. అఫ్జల్‌ఖాన్ శివాజీని ఆలింగనం చేసుకుని ఊపిరిసలపకుండా చేసి తర్వాత కత్తితో పొడవాలని ప్రయత్నించాడు. కానీ శివాజీ తన రక్షణ కవచంతో తప్పించుకుని చేతి ఇనుపగోళ్ళనుపయోగించి అఫ్జల్‌ఖాన్ ను గాయపర్చి చంపివేశాడు. శివాజీ దాక్కొని ఉన్నతన సైన్యం సహాయంతో నాయకుడు లేని బీజాపూర్ సైన్యాన్ని ఓడించి సైనిక గుడారాన్ని ధ్వంసం చేశాడు.

### మొఘల్ రాజదర్బార్ నుండి శివాజీ తప్పించుకొనుట :

క్రీ.శ 1665 పురంధర్ సంధికుదుర్చుకున్న తర్వాత అంబర్ రాజైన జైసింగ్ ఆగ్రా రాజదర్బార్‌ను సందర్శించవలసిందిగా ఒప్పించాడు. బహుశా శివాజీ స్వయంగా మొఘల్ చక్రవర్తిని కలిస్తే తాను పోగొట్టుకున్న కోటను తిరిగి శివాజీకి ఇచ్చివేస్తాడనేది జైసింగ్ ఉద్దేశం కావచ్చు. శివాజీ రక్షణగా తన కుమారుడైన రామ్‌సింగ్‌ను పంపిస్తానని జైసింగ్ చెప్పడంతో శివాజీ తన కుమారుడైన శంభాజీతో కలిసి ఆగ్రా వెళ్ళాడు. రాంసింగ్ శివాజీని చక్రవర్తి ముందు ప్రవేశపెట్టగా చక్రవర్తి పెద్ద పట్టించుకోలేదు. పైగా శివాజీని అధికారుల మధ్య కూర్చోమని ఆదేశించాడు. శివాజీ అవమానంగా భావించి దర్బార్‌ను వదిలివెళ్ళాడు. చక్రవర్తి రాంసింగ్, ఇతర అదికారులను పంపి, అతడిని బుజ్జగించే ప్రయత్నంగా గౌరవ సూచికంగా ఉత్తరీయాన్ని పంపగా శివాజీ తనకు ప్రత్యేక దర్శనం కానీ, మనసబు కానీ వద్దనీ, ఇంటికి తిరిగివెళ్ళాలని చెప్పాడు. ఔరంగజేబు దీన్ని అంగీకరించి భటులను ఇతని నివాసంచుట్టూ నియమించాడు. అతనిపై సైన్యాన్ని వెనక్కిపంపి శంభూజీని, శివాజీని గృహ నిర్బంధం చేశాడు. శివాజీ తన జీవితం ప్రమాదంలో ఉందని గ్రహించాడు. ఔరంగజేబు ఆస్థానంలో చాలామంది అధికారులు శివాజీ శిరచ్ఛేదనం చేయాలని సూచించినా

అతడు తొందరపాటు నిర్ణయం తీసుకోలేదు. శివాజీ తప్పించుకోవడానికి పథకం వేశాడు. తనకు అనారోగ్యమని కారణం చూపి బ్రాహ్మణులకు గంపలకొద్దీ మిఠాయిలు దానం చేయాలని చెప్పాడు. కొంతకాలం భటులు గంపలను తనిఖీ చేసారు కానీ, కొంతకాలం తర్వాత తనిఖీల తీవ్రత తగ్గించేయగా రెండు గంపలలో దాక్కొని తప్పించుకున్నారు. తర్వాత అతడు శంభూజీని మధురలో వదిలి సన్యాసి వేషంలో మహారాష్ట్ర చేరాడు. ఆగ్రా యాత్రవల్ల శివాజీకి ప్రతిఫలం లేకపోయినా శివాజీ సాహసానికి ప్రతీకగా నిలిచింది.

## పాఠ్య ప్రశ్నలకు సమాధానాలు

### 44.1

1. సి
2. బి
3. (ఎ) జావాలీ ఆక్రమణతో మార్వాల్ ప్రాంతం శివాజీ వశం అయింది. తారా, కొంకణ్ ప్రాంతాల విస్తరణకు అది దారి చూపింది.
   (బి) మోర్‌ల కూడబెట్టిన ధనం స్వాధీనమైంది. అది భవిష్యత్తు యుద్ధాలకు ఉపయోగపడింది.
4. (ఎ) శివాజీ గెరిల్లా యుద్దాలు చేసేందుకు భౌగోళిక పరిస్థితులు సహాయం చేశాయి.
   (బి) రాజ్య రక్షణకు ఉపయోగపడ్డాయి

### 44.2

(ఎ) ఔరంగజేబు శివాజీని చిన్నరైతు అనుకోవడం వల్ల స్నేహానికి యిష్టపడలేదు.

(బి) శివాజీతో సందికి దక్కన్ ఆక్రమణలో నాందిగా జైసింగ్ భావించడంతో పాటు శివాజీని అదుపులో వుంచేందుకు సాధనం అని అనుకున్నాడు.

2. (ఎ) షాయిస్థాఖాన్ ఓటమి అతనిని దక్కన్ నుంచి పంపించి వేయడానికే కాకుండా, మొఘులుల బలహీనతకు నిదర్శనమైంది. మరోవైపు శివాజీ బలం ఇనుమడించింది.
   (బి) షాయిస్థాఖాన్‌పై సాధించినవిజయం సూరత్‌పై దాడిచేసి దోచుకోవడం ద్వారా ఆర్థికవృద్ధి సాధించేందుకే కాకుండా, బలగౌరవాలు పెరిగేందుకు శివాజీకి దోహదం చేసింది.

### 44.3

1. తిరుగుబాటు చేసిన అక్బర్ రాకుమారుడు శంభాజీ ఆశ్రయాన్ని పొందాడు
2. (ఎ) మహారాష్ట్రుల వ్యతిరేకత అన్ని ప్రాంతాలకు ప్రాకింది.
   (బి) మహారాష్ట్రుల వ్యతిరేకత కొనసాగించేందుకు కారణమైంది.

# 45

# శివాజీ పరిపాలన ; మొఘల్ సామ్రాజ్య పతనం

## 45.1 పరిచయం :

శివాజీ గొప్ప యుద్ధవీరుడు. నైపుణ్యం గలవాడు. రాజకీయ చతురుడు అనే విషయాలు మీరు గత అధ్యాయంలో చదివారు. శివాజీ గొప్ప పరిపాలకుడు కూడా! ఈ పాఠ్యాంశంలో శివాజీ పౌర, సైనిక పాలనా విధానంలోని వివిధ కోణాలను మీరు అధ్యయనం చేస్తారు. వ్యక్తిగా, రాజుగా, పరిపాలకుడుగా, సైనికుడుగా శివాజీని అంచనా వేయడం జరుగుతుంది.

ఔరంగజేబు రాజపుత్ర, దక్కన్ రాజ్యాలు, మహారాష్ట్రులు, ముస్లిమేతరులతో అనుసరించిన విధానాలను మీరు గత అధ్యాయాలలో చదివారు. ఔరంగజేబు చేసిన తప్పులు, తను అనుసరించిన విధానాలతో రాజనీతజ్ఞత లోపించడం, వంటి వాటితో పాటు వాటివల్ల రాజ్యసుస్థిరత, ఐక్యతలు దెబ్బతినడంలను మీరు అంచనా వేస్తారు. అయితే కేవలం ఒక్కరినే మొఘల్ సామ్రాజ్య పతనానికి బాధ్యుడిని చేయడం చారిత్రక అవాస్తవం. మొఘల్ రాజ్య పతానానికి సాంఘిక, ఆర్థిక, పరిపాలనా, వ్యవస్థాపనమైన కారణాలు అనేకం వున్నాయి.

## 45.2 లక్ష్యాలు :

ఈ పాఠ్యాంశం చదివిన తర్వాత మీరు ఈ విషయాలను అర్థం చేసుకోగలరు.

1. శివాజీ పరిపాలనా విధానం
2. మహారాష్ట్ర అధికారాన్ని బలోపేతంచేసిన గొప్పవీరుడుగా శివాజీని గుర్తించటం
3. మొఘల్ రాజ్య పతనానికి ఔరంగజేబు బాధ్యత
4. మొఘల్ రాజ్య పతనానికి దారితీసిన ఆర్థిక, సామాజిక, పరిపాలనా కారణాలు

## 45.3 శివాజీ పరిపాలనా విధానం :

శివాజీ కేవలం గొప్ప యుద్ధ విజేత, నైపుణ్యంగలవాడు, రాజకీయ చతురుడు మాత్రమే కాదు, గొప్ప పరిపాలకుడు కూడా! దక్కన్ రాజ్యాల పరిపాలనా కోవలోనే శివాజీ పరిపాలన నడిచినా, మొఘల్ విధానాలను అవసరమైన మేరకూ

చొప్పించాడు. శివాజీ కాలంలో ప్రధాన అధికారులతో కూడిన మంత్రిమండలి లేదా అష్టప్రధానులు అంటే పీష్వా, మజుందార్, దబీర్ మొదలైనటువంటివి శివాజీ కంటే ముందునుంచే దక్కన్‌లో అమలులో వున్నవే! శివాజీ ఏర్పాటుచేసిన పరిపాలనా విభాగాలు అయిన సుభా, ప్రాంత, టర్ఫ్, మౌజల వంటివి కూడా అమల్లో వున్నటువంటివే! శివాజీ ఏర్పాటు చేసిన పరిపాలన వ్యవస్థకు రాజు ఇరుసు వంటివాడు. రాజుకు కార్యనిర్వాహక, శాసన నిర్మాణ శాఖలపైపూర్తి అధికారాలు వున్నాయి. ఆయన సర్వసైన్యాధ్యక్షుడు మరియు ఉన్నత న్యాయాధీశుడు. శివాజీ ఏర్పాటు చేసిన పాలనావిధానం సమర్ధుడైన పాలకుడి వల్ల పటిష్టంగా అమలు జరుగుతుంది. శివాజీ మరియు అతని వారసులు సమర్ధులుగా వున్నంతవరకూ బాగా పనిచేసింది. సాహూ తర్వాత బలమైన వారసుడు లేకపోవడం వల్ల ఏర్పడిన శూన్యతను పీష్వాలు సమర్ధవంతంగా భర్తీచేశారు.

పరిపాలనలో శివాజీకి సహకరించేందుకు మంత్రిమండలి వుండేది. ఎనిమిది మంది మంత్రులు వుండేవారు. వీరికి అష్టప్రధానులు అనిపేరు. వీరి ప్రధాన బాధ్యత సలహాలనివ్వడం. వారికి స్వతంత్రంగా నిర్ణయాలు తీసుకునే, అమలు చేసే అధికారం లేదు. వారికి ఒక్కో శాఖ కేటాయించబడింది. వారు రాజుతో ప్రత్యక్ష సంబంధం కలిగి పనిచేసేవారు.

## అష్టప్రధానులు – వివరాలు :

### 1. పీష్వా లేదా ప్రధానమంత్రి :

సాధారణ పరిపాలన మరియు ప్రజాసంక్షేమాలను చూసేవాడు. అందరికంటే ఇతనికి కొంత ఎక్కువ అధికారాలు వుండేవి కానీ, వారికి అధికారి మాత్రం కాదు. రాజు లేని సమయంలో ప్రభుత్వాన్ని నడిపేవాడు.

### 2. అమాత్య లేదా ఆర్ధికమంత్రి :

రాజ్య ఆదాయవ్యయాలను తయారుచేయడం, జమాఖర్చు లెక్కలు తయారుచేయడం ఇతని ప్రధాన నిధి.

### 3. మంత్రి (వాక్యా నోపీస్) :

రాజు కార్యక్రమాలు, కొలువులో జరిగే వ్యవహారాలు, విధి విధానాలు లిఖితపూర్వకంగా భద్రపరచడం ఇతని బాధ్యత.

### 4. సచివుడు :

చక్రవర్తి పక్షాన ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడం, మహత్, పరగణాల జమా ఖర్చులను తనిఖీ చేయడం ఇతని ప్రధాన విధులు.

### 5. సుమంత్ :

ఇతడు విదేశీ వ్యవహారాల మంత్రి. విదేశీ వ్యవహారాలు పరిశీలించడం సంప్రదింపులు, రాయభారాలు సాగించి సంబంధాలు నెలకొల్పడం ఇతని ప్రధాన విధి.

## 6. సేనాపతి :

ఇతడు సర్వసైన్యాధ్యక్షుడు కాదు. సైనిక వ్యవహారాల మంత్రి. సైనికుల నియామకం, శిక్షణ, నిర్వహణ వంటివి చేయడంతో పాటు సైన్యం సరఫరా చేయడం ఇతని ప్రధాన విధి.

## 7.పండితరావు లేదా ధాన్యాధ్యక్షుడు :

ధానధర్మాలను పర్యవేక్షించడంతో పాటూ, మత సంస్థలకు నిధులు యివ్వడం వంటివి ఇతని విధులు.

## 8. న్యాయాధీశుడు :

న్యాయశాఖ అధిపతి.

పండితారావు మరియు న్యాయాధీశుడు మినహా మిగతా మంత్రులందరూ పాలనా వ్యవహారాలతో పాటూ సైనిక విధుల్లో పాల్గొనేవారు. కనీసం ముగ్గురు పరిపాలనా విభాగాలకు అధిపతులుగా నియమింపబడేవారు.

శివాజీ సైనిక మరియు రెవిన్యూ పాలన ప్రధానమైంది. శివాజీ కంటే ముందు సైన్యంలో అశ్వికదళం ప్రధానంగా వుండేది. సిద్ధసైన్యం వుండేది కాదు. వారు ఆరు నెలలపాటు వ్యవసాయ కార్యక్రమాలు చేసుకుని మిగతా ఆరునెలలు సైన్యంలో పనిచేసేవారు. శివాజీ సిద్ధసైన్యంను ఏర్పాటు చేశాడు. శివాజీ సైన్యంలో ముప్పైవేలనుంచి నలభైవేల వరకూ అశ్వికదళం, పదివేల కాల్బలం వుండేది. వీరికితోడు శిలహ్‌దారులు అనే సహాయసైన్యం కూడా వుండేది. అశ్వికదళం కొన్ని భాగాలు, ఉపవిభాగాలుగా విభజింపబడింది. అన్నింటికంటే చిన్న విభాగం 25మంది అశ్వికదళంతో కూడుకుని వుండేది. దీని అధికారి హవత్‌దార్. ఐదు హవత్‌దార్‌లపైన ఒక జుమ్లాదార్, 10మంది జుమ్లాదారులపై ఒక హజారీ, ఐదుగురు హజారీలపైన ఒక పాంచ్ హజారీ, వుండేవారు. పాంచ్‌హజారీకి వేతనం సుమారు 2వేల హన్నులు వుండేది. శివాజీ నౌకాదళాన్ని కూడా ఏర్పాటు చేశాడు.

సైనికులకు డబ్బురూపంలో వేతనాలు చెల్లించేవారు. అయినా కొన్ని సమయాల్లో అధికారులు భూములను పొందేవారు. క్రమశిక్షణ పాటింపబడేది మహిళ లేదా నాట్యకత్తెలను సైన్యంతోపాటు అనుమతించేవారు కాదు. యుద్ధ సమయంలో ప్రతి సైనికుడు స్వాధీనం చేసుకున్న మొత్తాన్ని ఖచ్చితంగా ప్రభుత్వ ఖజానాలో జమచేసేవారు. శత్రువుల చేతిలో బంధింపబడిన సైనికుల కుటుంబాలను రక్షించేవారు. అందువల్లనే శివాజీ బలమైన, క్రమశిక్షణగల సైన్యాన్ని ఏర్పాటు చేసుకోవడంలో విజయం సాధించాడు.

కోటలను పర్యవేక్షించడం శివాజీ సైనిక పాలనలో ప్రధానఅంశం. మవాల్ పదాతి దళం, ఫిరంగి దళంలు అందుకు వినియోగింపబడేవారు. కోటలోని సైనిక దళంలో వివిధ కులాలకు చెందినవారిని వుంచడంతో పాటు, కోటపాలనా బాధ్యతను సమానులైన ముగ్గురు అధికారులకు అప్పగించేవాడు. వారిలో సైనిక విధులను నిర్వహించే హవల్‌దార్, పౌర, రెవెన్యూ పరిపాలన నిర్వహించే సుబేదార్ ధన, ధాన్యాగారాలకు అధికారి వుండేవారు.

పరిపాలనా సౌలభ్యం కోసం, భూమిశిస్తు వసూలు కోసం పరిపాలనా విభాగాలు ఏర్పరచబడ్డాయి. రాజ్యం ప్రాంతాలు గానూ, ప్రాంతం పరిగణా మరియు టర్ఫ్‌లుగా విభజింపబడ్డాయి. గ్రామం పరిపాలనా వ్యవస్థలో అత్యంత చిన్నది. అమలులో వున్న పన్నుల విధానాన్ని రద్దుచేసి, రైతులనుంచి ప్రభుత్వాధికారులే నేరుగా రైతుల నుంచి పన్నువసూలు

చేసే విధానాన్ని అమలు చేశాడు. వారికి రైతులపైన అధికారం గానీ, వారిని శిక్షించే అధికారం గానీ లేదు.

శివాజీ భూమిని సర్వే చేయించి, భూమిశిస్తును పంటలో 30%గా నిర్ణయించాడు. తర్వాత కొంతకాలానికి ఇతర పన్నులను రద్దుచేపసి భూమిశిస్తును 40శాతానికి పెంచాడు. భూమిని కొలిచేందుకు ఖచ్చితమైన కొలబద్దను ఉపయోగించాడు. గతంలో వున్న తాడును రద్దుచేపసి "కధి" అనే కడ్డీ కొలబద్దను తయారుచేశాడు. దీనితో తాము ఎంతపన్ను కట్టాల్సింది రైతులకు తెలిసింది కనుక వారు వెనుకంజవేయక చెల్లించేవారు. ధనరూపంలో గానీ, ధాన్యరూపంలోగానీ పన్ను చెల్లించవచ్చు. విత్తనాల కొనుగోలు, జంతువుల కొనుగోలులకు రైతులకు లోన్లను యిచ్చి వ్యవసాయభివృద్ధికి శివాజీ కృషి చేశాడు.

పెద్ద సంఖ్యలో సిద్ద సైన్యాన్ని (Standing Army) పోషించేందుకు పెద్ద మొత్తంలో సొమ్ము అవసరమయ్యేది. అందుకు రాజ్య ఆదాయం సరిపోయేది కాదు.  దీనితో సరిహద్దు ప్రాంతాలనుంచి 'చౌత్', 'సర్దేశ్ముఖి'ల పేరుతో సొమ్మును వసూలు చేసేవాడు. 'చౌత్'ను వసూలు చేయడం ఇంతకుముందు నుంచే దేశంలో అమల్లో వుంది. 'చౌత్' ఉద్దేశ్యాన్ని గురించి చరిత్రకారుల్లో విభిన్న అభిప్రాయాలున్నాయి. ఏమైనప్పటికీ సైనిక కార్యకలాపాల కోసం యివ్వబడే సొమ్ము నాలుగవ వంతుగా వుండేది. ప్రాంతీయ నాయకుడైన సర్దేశ్ముఖ్ల నుంచి పదిశాతం అదనంగా వసూలు చేసినపన్నే 'సర్దేశ్ముఖి'. వంశపారంపర్యంగా సర్దేశ్ముఖి పదవి లభించేది అందువల్ల దీనిని వసూలు చేసేవారు. ఈ పన్నుల వసూలు వల్ల ఇతర రాజ్యాల సరిహద్దు ప్రాంతాలలో మాహారాష్ట్రుల ప్రభావం ఏర్పడడంతో పాటు సులభంగా ఆక్రమించుకునే అవకాశం కలిగేది. ఈ పన్నులే శివాజీ ప్రధాన ఆదాయ మార్గాలు అనడంలో ఎటువంటి అనుమానం లేదు.

శివాజీ నిర్మాణాత్మకమైన మేధావి, యుద్ధ, సైనిక వ్యూహకర్త మరియు లౌకికభావాలు గలవాడు అని శివాజీ పరిపాలనా విధానం వెల్లడిస్తూవుంది.

1. నిర్మాణాత్మకమైన మేధావి : శివాజీ క్రమపద్ధతి కలిగిన పరిపాలనా విధానాన్ని ఏర్పాటు చేశాడు. అష్టప్రధానులు, రాజ్యాన్ని ప్రాంతాలు టర్ఫ్లుగా విభజించాడు. దీనివల్ల శివాజీ కేవలం దోపిడి దారుడు మాత్రమే కాదని రుజువు చేసుకున్నాడు.
2. సైనిక యుద్ధ చతురుడు : సైన్యం సమర్ధవంతంగా పనిచేయడానికి అవసరమైన ఎన్నో సంస్కరణలు ప్రవేశపెట్టాడు. దాని ద్వారా తన రాజకీయ లక్ష్యాన్ని నెరవేర్చుకోగలిగాడు.
3. లౌకిక భావాలు గలవాడు : ఉద్యోగాలు యివ్వడంలో హిందూ, ముస్లింలు అనే తేడాను కనబరచలేదు.

## 45.ఎ) పాఠ్య ప్రశ్నలు

1. తన సైన్యంలో శివాజీ ఎక్కువగా ప్రాధాన్యత నిచ్చినది.

ఎ) ఫిరంగిదళం

బి) పదాతిదళం

సి) నౌకాదళం

డి) కోటలు

2. చౌత్, సర్దేశ్‌ముఖిలను నిర్వచించండి.

3. ఈ క్రింద కొందరు పరిపాలకులు, వారి పాలనను గురించి కొన్ని వ్యాఖ్యానాలు యివ్వబడ్డాయి. వాటిని జతపర్చండి.

ఎ) ఒక చిన్న జాగిర్దారు కుమారుడి స్థాయినుంచి చక్రవర్తి స్థాయికి ఎదిగినవాడు

బి) మంత్రి మండలి సభ్యులు సైనిక విధులను కూడా నిర్వర్తించగలగాలి.

సి) సైనిక పునాదుల మీద ఏర్పడిన రాజ్యం సైనికశక్తి వల్లనే నాశనమైంది.

1. అల్లాఉద్దీన్

2. షేర్ షా

3. శివాజీ

## 45.4 శివాజీ ఘనత :

వ్యక్తిగా, పరిపాలకుడుగా శివాజీ క్రీ.శ 17వ శతాబ్ధపు చరిత్రలో శాశ్వత స్థానాన్ని సంపాదించాడు. చిన్న జాగిర్దారుడి కుమారుడి స్థాయినుంచి ఛత్రపతి స్థాయికి తన ధైర్యసాహసాలు తెలివితేటల వల్లనే ఎదగడంతో పాటు మొఘలులకు ప్రధాన శత్రువు అయ్యాడు. చిన్నాభిన్నమైన మహారాష్ట్ర అధికారాన్ని ఒకే గొడుగు క్రిందికి తేవడం శివాజీ సాధించిన గొప్ప ఘనకార్యం. శివాజీ రాజ్యం 'సైనికరాజ్యం'గా విమర్శను ఎదుర్కొంది. పరిపాలనలో సైన్యం ప్రధానపాత్ర పోషించడం వల్లనే అలా జరిదింది. సరిహద్దు ప్రాంతాలను నిధులకోసం దోచుకున్నాడు. అయితే ఇది సరైన దృక్పధం కాదు. శివాజీ ఏర్పాటు చేసిన రాజ్యం స్థానికమైనదైనా, ప్రజాభిమానాన్ని చూరగొంది. మొఘలుల ఆక్రమణలను వ్యతిరేకించే సాధారణ ప్రజల ఆశయాలకనుగుణంగా వుండి గొప్ప పేరు తెచ్చుకున్నాడు. శివాజీ మతావేశపరుడు కాదు. అన్ని మతాలలో మంచిని గ్రహించాడు. బ్రాహ్మణ పండితులు, ముస్లిం సన్యాసుల పట్ల సమాన గౌరవం ప్రదర్శించేవాడు. సమకాలీన చరిత్రకారుడైన కాఫీఖాన్ శివాజీని 'మోసానికి పుట్టినిల్లు' అని విమర్శించినా, ఇతర రాజ్యాలపై దాడిచేసిన సమయంలో మసీదులు, ఖురాన్, మహిళలపై దాడి చేయవద్దని శివాజీ అనుచరులను శాసించేవాడని ప్రశంసించాడు. ఎప్పుడైనా ఖురాన్ పుస్తకం తన చేతులలోకి వస్తే దానిపట్ల గౌరవాన్ని ప్రకటించడమే కాగా, జాగ్రత్తగా ముస్లిం అనచరులకు దానిని అప్పగించేవాడు.

తన గెరిల్లా యుద్ధ పద్ధతుల ద్వారా మొఘల్ సైన్యాన్ని దెబ్బతీశాడు. అది మొఘల్ రాజ్యం బలహీనమవ్వడానికి కారణమైంది.

## 45.5 మొఘల్ రాజ్య పతనానికి ఔరంగజేబు బాధ్యత - అంచనా

క్రీ.వ 18వ శతాబ్ధంలో భారతదేశ చరిత్రలో మొఘల్ రాజ్యం పతనం చెందడం ప్రారంభమైంది. దీనికి ప్రారంభం ఔరంగజేబు పాలనా కాలంలో జరిగింది. ఔరంగజేబు లోపభూయిష్ట విధానాలు, నిర్ణయాలతో పాటూ మహారాష్ట్రులు, రాజపుత్రులు, ముస్లిమేతరులు, దక్కన్ రాజ్యాలు మొఘల్ ఐక్యతకు, సుస్థిరతకు ఆటంకాలు కలిగించాయి.

మొఘల్ పతానానికి సాంఘిక, ఆర్థిక, రాజీకయ, వ్యవస్థాపరమైన కారణాలు అనేకం దోహదం చేశాయి. మనసబ్‌దారీ, జాగీర్దారీ విధానాలోని లోపాలు, పెరుగుతూవున్న ఆర్థిక, జాగిర్దారీ విభేదాలు పరిపాలనను బలహీనపరిచాయి. రైతుల తిరుగుబాటు వల్ల ఏర్పడిన సామాజిక అభద్రత, విశిష్టాధికారుల మధ్య విభేదాలు, వ్యవసాయం, వ్యాపారం, పరిశ్రమలు, సాంకేతిక రంగాలలో ఆగిపోయిన అభివృద్ధి వంటివి కూడా కారణాలు. పటిష్టమైన మొఘల్ ఆర్థిక, రాజకీయ రంగాలు ఈ సమయానికి వచ్చేటప్పటికి అవసరాలు తీర్చలేకపోయాయి. కేవలం ఔరంగజేబు పతనానికి కారణం అనే దృష్టిలో కాకుండా పతనాన్ని ఆర్థిక, రాజకీయ, పాలనా పరంగా అంచనా వేయాలి.

ఔరంగజేబు మహారాష్ట్రులు, దక్కన్ రాజ్యాలతో తెలివిగా ప్రవర్తించలేకపోయాడు. మహారాష్ట్రుల స్థానిక స్వాతంత్రాన్ని ఔరంగజేబు పూర్తిగా అంగీకరించలేదు. వారిని అణచివేయాలనుకున్నాడు. దక్కన్‌ను ఆక్రమించేందుకు, అక్కడ అధికార పటిష్టతకు మహారాష్ట్రుల స్నేహం అవసరమని గుర్తించలేకపోయాడు. బీజాపూర్, గోల్కొండల ఆక్రమణల తర్వాత మరాఠా స్వాధీనమవుతుందని తప్పుగా ఆలోచించాడు. మహారాష్ట్రులలో వ్యతిరేకత మొఘల్ బలగౌరవాలకు నష్టం వాటిల్లింపజేయడమే గాక ఆర్థికంగా కూడా పూర్తిగా దెబ్బతీసింది. దక్కన్ రాజ్యాల ఆక్రమణ మహారాష్ట్రులకు స్థానిక శత్రువులు లేకుండా చేసి, వారు పూర్తిగా మొఘలులపైనే విజృంభించేందుకు కారణమైంది. ఔరంగజేబు దక్కన్ దండయాత్ర 25 సంవత్సరాల పాటు సాగి ధన ప్రాణ నష్టాలకు కారణమైంది. నిరంతర యుద్ధాలు, సైనిక కార్యకలాపల వల్ల వ్యవసాయ, వ్యాపార, పారిశ్రామికాభివృద్ధులు ఆగిపోయాయి. బీజాపూర్, గోల్కొండల విలీనం వల్ల మొఘల్ రాజ్యం విస్తరింపబడింది. దీనితో అప్పటి వరకూ వున్న రాజకీయ, ఆర్థిక పరిస్థితులు సరిపడక ఇబ్బందికరమైన పరిస్థితులు ఏర్పడడంతో పాటూ నియంత్రణ లోపించింది.

మార్వార్, మేవార్ రాజ్యాల పట్ల ఔరంగజేబు విధానం ప్రమాదాలను తెచ్చిపెట్టింది. రాజపుత్రరాజుల బలాన్ని, అధికారాన్ని తగ్గించేందుకు ఔరంగజేబు చేసిన ప్రయత్నం వారిలో అసంతృప్తిని కలిగించింది. మీరు ఇదివరకే మార్వార్ సింహాసనం విషయంలో ఔరంగజేబు జోక్యాన్ని గురించి చదివారు. ఈ జోక్యం మార్వార్ రాథోర్, మేవార్, శిశోదియా వంశం వారు తిరుగుబాటు చేసేందుకు కారణం అయింది. ఇది మొఘల్ రాజపుత్రుల సంబంధాలు పూర్తిగా దెబ్బతీసేందుకు కారణం కాకపోయినా మేవార్ మార్వార్ యుద్ధాలు మొఘల్ బలగాలను ప్రక్కదారులకు మళ్ళించాయి. మొఘలుల నైతికత దెబ్బ తిన్నది. మొఘలులకు రాజపుత్రులను దూరం చేసింది. రాజపుత్రులు ఔరంగజేబు పట్ల అనుమానంను కలిగివుండడం ప్రారంభమైంది.

ఔరంగజేబు మత సాంప్రదాయ ప్రియత్వం మొఘల్‌రాజ్య సుస్థిరతను దెబ్బతీసింది. జిజియాపన్ను విధింపు, హిందూదేవాలయాలను నాశనం చేయడం, హిందువులపై నియంత్రణ వంటివి ముస్లింలకు ముస్లిమేతరులకు మధ్య దూరాన్ని పెంచాయి.

ఔరంగజేబు విధానాలు ప్రధానంగా సామ్రాజ్యపతనానికి దోహదం చేశాయి. కానీ వాటివల్లనే అని మాత్రం అనడానికి వీలులేదు. ఔరంగజేబు విధానాలను అతని మరణం తర్వాత రద్దుచేసినా, మొఘల్ రాజ్య పతనం ఆగలేదు. కనుక అతనే పూర్తిగా కారణం అని పేర్కొనడం భావ్యంకాదు.

నిశిత పరిశీలన చేస్తే మొఘల్ సామ్రాజ్య పతనానికి సాంఘిక, ఆర్థిక లోపాలే కారణం అని తెలుస్తుంది. మొదటి వ్యవస్థాపరమైన లోపం మనసబ్, జాగీర్దారీ విధానాలు పరిపాలన, ఆర్థిక, సైనిక, రాజకీయ స్థిరీకరణ మనసబ్‌దారీ

మరియు జాగీర్దారీ వ్యవస్థల పనితీరుపై ఆధారపడి వున్నాయి. అయితే అదే సమయంలో ఈ రెండు విధానాలు ఆర్థిక, రాజకీయ సమస్యలకు కారణమయ్యాయి.

సైన్యపోషణ కోసం మనసబ్‌దారులకు జాగీర్లు యివ్వబడ్డాయి. జాగీర్ల నుంచి వచ్చే ఆదాయాన్ని సైనిక పోషణకు ఉపయోగించాలి. అయితే జాగీరుదారుడు రానురానూ రైతుల నుంచి అధికమొత్తాలలో పన్నులను వసూలు చేయడం ప్రారంభించారు. ఆ మొత్తాన్ని సైనికావసరాలకు ఉపయోగించకుండా వ్యక్తిగత విలాసాలకు ఉపయోగించేవారు. అందువల్ల రైతులపై భారం పడింది. సైనికబలం పెరగలేదు. జాగీర్దార్ల అకృత్యాల వల్ల రైతులలో అసంతృప్తి అధికమై చివరకు మొఘల్ రాజ్య పతనానికి కారణమైంది.

మొఘల్ ప్రభుత్వం కూడా రానురానూ అధిక మొత్తంలో శిస్తువసూలు చేయడంతో రైతులు జమీందారులకు, జాగీర్ధారులకు ఏమీ చెల్లించలేనటువంటి పరిస్థితి ఏర్పడింది. దీనికి ప్రభుత్వ పన్నుల విధానమే కారణమని వారు ప్రభుత్వం పట్ల అసంతృప్తులైనారు. ఈ విధంగా ప్రభుత్వం, జమీందారులు పీడించడంతో రైతులలో తిరుగుబాటు ధోరణి ప్రబలింది. అందుకు జాట్‌లు, సత్‌నామీలు, శిక్కులు, మహారాష్ట్రులు చేసిన తిరుగుబాట్లు ఉదాహరణలుగా చెప్పవచ్చు. ఈ తిరుగుబాట్లు స్వతంత్ర రాజ్యాల ఆవిర్భావానికి దారితీశాయి. స్వతంత్ర్య రాజ్యాల ఆవిర్భావంతో ప్రభుత్వ ఆదాయం మరింత పడిపోయింది. చివరకు మొఘల్ సామ్రాజ్య పతనానికి దారితీసింది.

జాగీర్దారీ వ్యవస్థలో ఏర్పడిన సంక్షోభం ప్రభుత్వంపై తీవ్ర ప్రభావాన్ని కనబరిచింది. బీజాపూర్, గోల్కొండల ఆక్రమణ తర్వాత అక్కడి శిష్టవర్గాన్ని సంతృప్తిపరిచేందుకు, వారు శత్రు శిబిరంలోకి వెళ్ళకుండా వుండేందుకు ఔరంగజేబు వారికి జాగీర్లను యివ్వడం ప్రారంభించాడు. అనేక సంవత్సరాల యుద్ధాల వల్ల వ్యవసాయానికి తీవ్ర ఆటంకం ఏర్పడడంతో వారు ఉత్తర భారతదేశంలోని జాగీర్లను ఆశించారు. వాటిని సంపాదించేందుకు ఉన్నతాధికారులకు లంచాలిచ్చేందుకు కూడా సిద్ధమయ్యారు. దీనితో అప్పటికే ఉత్తరదేశంలో వున్న జమీందారులు, మనసబ్‌దారులు తమ జాగీర్లను కోల్పోయి అసంతృప్తులయ్యారు. జాగీర్ల సంఖ్య తగ్గిపోవడంతో పాటూ, వాటినుంచి ప్రభుత్వానికి వచ్చే ఆదాయం తగ్గడం, శిష్టవర్గం ఖర్చులూ అధికమయ్యాయి. ఇలాంటి స్థితిలో జాగిర్‌దారుల మధ్య ఏర్పడిన పోటీ వర్గాలు ఏర్పడేందుకు దారితీసింది. శిష్టవర్గంవారు జాగీరుదార్లను వంశపారంపర్యం చేసే ప్రయత్నం చేశారు. తమ ఖర్చుకు అనుగుణంగా ప్రభుత్వ భూములను (కలిశా) ఆక్రమించుకునేందుకు కూడా ఉన్నత వర్గాల వారు వెనుకాడలేదు. ఇది ప్రభుత్వ ఆర్థిక సంక్షోభాన్ని మరింత తీవ్రతరం చేసింది. దీనికి తోడు సైనిక సంఖ్యను కూడా వారు తగ్గించడంతో సైనికంగా రాజ్యం బలహీనపడింది. మహారాష్ట్రులను అంతమొందించాల్సిన దక్కన్‌లోని మొఘల్ జాగీర్దారులు వారితో చేతులు కలిపారు. కొందరు జాగీర్దార్లు తమకు ఎక్కువ మొత్తంలో సొమ్మును చెల్లించిన వారికి జాగీర్లను యిచ్చేవారు. జాగీర్లను పొందిన మధ్యవర్తులు రైతులను పీడించి పన్నులు వసూలు చేసేవారు. ఔరంగజేబు మరణానంతరం జాగీర్లు ఇతరులకు యివ్వడం అధికమైంది.

వాస్తవానికి జాగీర్దారీ సంక్షోభం ఒక సామాజిక సమస్య. శాస్త్రీయబద్ధంగా వర్తకవ్యాపారాలు అభివృద్ధి చెందినట్లయితే నూతన సాంఘిక ఆర్థిక వ్యవస్థలు ఏర్పడి ఈ సమస్యకు పరిష్కారం లభించేది. స్వయం సమృద్ధ గ్రామీణ ఆర్థిక వ్యవస్థవల్ల వర్తక వ్యాపారాలు అభివృద్ధి సాధ్యం కాలేదు. 17వ శతాబ్ధం రెండవ భాగంలో వర్తక వాణిజ్యాలు వున్న భూస్వాములతో పోటీ పడగలిగే వర్గం ఏర్పడలేదు.

మొఘల్ సామ్రాజ్యానికి వెన్నెముకలాగా పనిచేసిన శిష్టవర్గంలో ఏర్పడిన విభేదాలు మొఘల్ సామ్రాజ్య పతనానికి ప్రధానకారణమైనాయి. విశిష్ఠవర్గంలో విభేదాలు ఏర్పడడానికి ప్రధానకారణం ఔరంగజేబు మరణానంతరం సమర్ధుడైన మొఘల్ చక్రవర్తి లేకపోవడమే! అధికారులు తమలో తాము కలహించుకోవడమే కాక చివరకు సుల్తానుపై పెత్తనం చేసేంత వరకు ఎదిగారు. వీటిని ఆసరాగా తీసుకుని స్థానిక పాలకులు స్వతంత్రంగా వ్యవహరించసాగారు. కొందరు తిరుగుబాట్లు చేసి స్వాతంత్ర్యం ప్రకటించుకున్నారు. అందులో బెంగాల్, హైదరాబాద్, అయోధ్య మొదలైన ప్రాంతాల పాలకులు ప్రధానమైనవారు. క్రమక్రమంగా మొఘల్ సుల్తాన్ అధికారం ఢిల్లీ పరిసర ప్రాంతాలకు మాత్రమే పరిమితమైంది. మార్వార్, గుజరాత్, బుందేల్‌ఖండ్ తదితర ప్రాంతాలు మహారాష్ట్రుల స్వాధీనమయ్యాయి. నాదిర్షా, అహ్మద్‌షా అబ్దాలీల దండయాత్రలు మొఘల్ రాజ్యాన్ని కోలుకోలేని దెబ్బతీశాయి. చివరకు బ్రిటీష్ వారి రాకతో మొఘల్ సామ్రాజ్యం తన ప్రాభవాన్ని పూర్తిగా కోల్పోయింది.

వాస్తవానికి బ్రిటిష్ వారి వల్ల మొఘల్ రాజ్య పతనం జరగలేదు. మొఘల్ రాజ్య పతనం వల్ల ఏర్పడిన శూన్యతను శాస్త్రీయ,సాంకేతిక, ఆర్థికాభివృద్ధులు సాధించిన ఆంగ్లేయులు పూడ్చారు. వారి విధానాల వల్ల భారతీయ సమాజంలో సమూలమైన మార్పులు చోటుచేసుకున్నాయి. ఈ మార్పుల వల్ల భారతీయ సమాజం అవమానానికి ఆర్థిక ఒడిదుడుకులకు లోనైంది. ఏమైనప్పటికీ ఈ మార్పుల నేపథ్యంలో ఆవిర్భవించిన నూతన వర్గాలే ఆధునిక భారతీయ సమాజానికి పునాదులు వేశారు.

(ఎ) ఔరంగజేబు లోపభూయిష్ట విధానాలు, రాజకీయవిజ్ఞత లోపించడం, రాజపుత్రులు, మహారాష్ట్రులు, దక్కన్ రాజ్యాలు, ముస్లిమేతరుల పట్ల అనుసరించిన విధానం వల్ల వారు రాజ్య సుస్థిరతకు భంగం కలిగించారు. రాజ్య పతనానికి సాంఘిక, ఆర్థిక, రాజకీయ, వ్యవస్థాపరమైన కారణాలు దోహదం చేశాయి.

(బి) 1. జాగిర్దారీ, మనసబ్‌దారీ విధనాల్లోని లోపాలు

2. పెరుగుతూ వున్న ఆర్థిక అవసరాలు, జాగిర్దారి విభేదాలు పరిపాలనను దెబ్బతీశాయి.

3. సామాజిక అసంతృప్తి రైతుల ఉద్యమరూపాన్ని దాల్చింది.

4. విశిష్ట వర్గంలోని వర్గపోరాటం రాజ్యవిభజనకు దారితీసింది.

5. వ్యవసాయ, వ్యాపార, పారిశ్రామిక, శాస్త్రీయాభివృద్ధి ఆగిపోవడం.

## 45.బి. పాఠ్య ప్రశ్నలు

1. మొఘల్ సామ్రాజ్య సుస్థిరత ఏ రెండు విధానాలపై ఆధారపడి వుంది?
2. రైతుల పీడనను జాగీరుదారులు ఎందువల్ల అనుసరించారు?
3. జమీందారులు ప్రభుత్వానికి మధ్య విభేదాలు ఏర్పడటానికి కారణాలు ఏవి?
4. ఔరంగజేబు దక్కన్ దండయాత్ర ప్రభావం దక్కన్‌పై ఎలా వుంది?
5. మొఘల్ సామ్రాజ్యంపై శిష్టవర్గం విభేదాల ప్రభావాన్ని వివరించండి.
6. మొఘల్, బ్రిటిష్ సమాజాల మధ్యవున్న ప్రధాన తేడాలు ఏమిటి?

## సారాంశం :

శివాజీ పటిష్టమైన పరిపాలనా యంత్రాంగానికి పునాదులను వేశాడు. పరిపాలనా వ్యవస్థలో అన్ని అధికారాలను కలిగిన రాజు ప్రధానమైనవాడు. రాజుకు సహకరించడానికి మంత్రిమండలి లేదా అష్టప్రధానులు వుండేవారు. పీష్వా, అమాత్య, మంత్రి, సచివుడు సుమంత్, సేనాపతి, పండితారావు, న్యాయాధీశుడు మంత్రిమండలిలో సభ్యులు. రాజుకు సలహాల నివ్వడం వారి ప్రధానవిధి.

శివాజీ సైన్య పోషణ చేశాడు. అశ్వీకదళంతోపాటూ సిద్ధసైన్యాన్నీ ఏర్పాటు చేశాడు. సహాయసైన్యం కూడా వుండేది. అశ్వికదళం, పదాతిదళం కొన్ని విభాగాలు, ఉపవిభాగాలుగా విభజింపబడింది. సైన్యంలో క్రమశిక్షణ పాటింపబడింది. సైనికులకు వేతనాలను చెల్లించేవారు. సైనికాధికారులకు భూములను యిచ్చిన పరిస్థితి కూడా వుంది. కోటల రక్షణ పట్ల శివాజీ ప్రత్యేక శ్రద్ధ కనబరిచాడు. కోటల రక్షణకు సమర్ధవంతమైన అధికారులను నియమించి ఆయుధాలు, ఆహార సామాగ్రులను అందుబాటులో వుంచాడు.

పరిపాలనా సౌలభ్యం కోసం శివాజీ రాజ్యాన్ని ప్రాంతాలు, పరిగణాలు, టర్ఫ్లు, గ్రామాలుగా విభజించాడు. రైతులనుంచి నేరుగా పన్ను వసూలుచేసేవాడు. భూమిశిస్తును క్రమపద్ధతిలో పెంచడం వల్ల రైతులపై భారం పడేది కాదు. సరిహద్దు ప్రాంతాల నుంచి వసూలు చేసే చౌత్, సర్దేశ్‌ముఖ్‌ల ద్వారా కూడా ప్రభుత్వానికి ఆదాయం లభించేది. ఈ విధంగా ఆర్థికంగా సైనికంగా రాజ్యాన్ని పటిష్టపరిచాడు.

ఔరంగజేబు మరణానంతరం మొఘల్ సామ్రాజ్యం త్వరగా పతనమైంది. రాజపుత్రుల పట్ల, మహారాష్ట్రుల పట్ల ఔరంగజేబు అనుసరంచిన విధానం మొఘల్‌రాజ్య ప్రతిష్టను, ఆర్థిక స్థితిని దెబ్బతీసింది. ఔరంగజేబు మతావేశం ఆంతరంగికంగా రాజ్యాన్ని దెబ్బతీసింది. దీనికితోడు ఆర్థిక, సాంఘిక పరిస్థితులు కూడా సామ్రాజ్యపతనానికి కారణమయ్యాయి. మనసబ్‌దారి మరియు జాగీర్థారీ వ్యవస్థలు తమ లక్ష్యాన్ని సాధించలేకపోయాయి. పెరుగుతూవున్న ఆర్థిక అవసరాలు అసంతృప్తికి కారణమయ్యాయి. జాట్‌ల, సత్నామీల, శిక్కుల తిరుగుబాట్లు అందుకు ఉదాహరణలు. జాగీర్థారీలు స్వలాభాల కోసం ప్రాకులాడసాగారు. జాగీర్థార్లు తమ జాగీర్లను పెద్దమొత్తం చెల్లించిన వారిపరం చేసేవారు. జాగీర్దార్ల మధ్య పోటీ ప్రారంభమైంది.

ఔరంగజేబు మరణానంతరం అధికారుల మధ్య ఏర్పడిన విభేదాలు రాజ్యం విడిపోవడానికి దోహదం చేసింది. ఆశావాదులైన అధికారులు స్వాతంత్ర్యం ప్రకటించుకున్నారు. బలమైన అధికారి లేకపోవడం భారతదేశంలో బ్రిటీష్ వారి అధికారం నెలకొనడానికి కారణమైంది.

## అభ్యాసం :

1. శివాజీ పరిపాలనా విధానాన్ని వివరించండి. బలమైన మహారాష్ట్ర రాజ్య నిర్మాణంలో దానిపాత్రను చర్చించండి.
2. రాజుగా, పాలకుడుగా, సైనికుడుగా శివాజీని అంచనా వేయండి.
3. చౌత్, సర్దేశ్‌ముఖలను గురించి సంక్షిప్తంగా వ్రాయండి.

4. ఔరంగజేబు అనుసరించిన మహారాష్ట్ర విధానం మొఘల్ సామ్రాజ్య పతానానికి కారణం అనడం ఎంతవరకు సమంజసం.

5. మొఘల్ సామ్రాజ్యం అనైక్యం కావాడానికి జాగీర్దారీ, మనసబ్‌దారీ విధానాలు ఎంతవరకు దోహదం చేశాయి?

**కార్యక్రమాలు :**

శివాజీ పరిపాలనా విధానాన్ని వివరిస్తూ చార్టును తయారుచేయండి.

## అదనపు సమాచారం :

**అశ్వీకదళం :**

25మంది సైనికులతో ఏర్పడిన విభాగం – అధికారి హవల్దార్

1వ విభాగం 2వ విభాగం 3వ విభాగం 4వ విభాగం 5వ విభాగం

ఈ ఐదు విభాగాలకు అధికారి – జుమ్లా

10 జుమ్లాలకు కలిపి అధికారి – హజారీ

5 హజారీలకు కలిపి అధికారి – పౌంట్ హజారీ

అశ్వీకదళానికంతటికీ ప్రధాన అధికారి – "సర్–ఇ–నౌబత్"

**పదాతిదళం :**

పదాతిదళంలో చిన్నభాగం –దీనికి అధికారి 'నాయక్'

5 మంది నాయకులకు అధికారి – హవల్‌దార్

5 మంది హవత్‌దార్లకు అధికారి – జుమ్లాదార్

10 మంది జుమ్లాదార్లకు అధికారి – హజారి

7 మంది హజారీలకు అధికారి – సర్–ఇ–నౌబత్

## పాఠ్యాంశ ప్రశ్నలకు సమాధానాలు

## 45.ఎ.

1. కోటలు

2. సైనిక కార్యకలాపాలకోసం ప్రభుత్వాదాయం నుంచి కేటాయింపబడిన 1/4వంతు సొమ్ము "చౌత్". వంశపారంపర్య అధికారం కలిగిన సర్దేశ్‌ముఖ్‌ల నుంచి వసూలు చేసే 10శాతం అదనపు పన్ను సర్దేశ్‌ముఖి

3. 1. అల్లాఉద్దీన్ సి

2. షేర్షా ఎ

3. శివాజీ బి

**45. బి.**

1. మనసబ్‌దారీ మరియు జాగీర్దారీ విధానాలు
2. జాగీర్దారుల బదిలీ విధానం వల్ల జాగీరుల కొరత ఏర్పడడంతో పాటు శక్తిమేరకు రైతులను దోచుకున్నారు.
3. భూమిశిస్తు విషయమై జమీందారులు, ప్రభుత్వం మధ్య విభేదాలు ఏర్పడ్డాయి. ప్రభుత్వం ఎక్కువ మొత్తంలో రైతుల నుంచి వసూలు చేయడం వల్ల జమీందారులు వసూలు చేసుకునేందుకు రైతుల దగ్గర ఏమీ మిగలలేదు.
4. ఔరంగజేబు యుద్ధాలు దక్కన్‌లో జననష్టాన్ని కలిగించాయి. దానికి తోడు వ్యవసాయ, వర్తకవాణిజ్యాలు దెబ్బతిన్నాయి.
5. మొఘల్ చక్రవర్తి అసమర్థులు కావడం వల్ల శిష్టవర్గం పెత్తనం చెలాయించేది. స్వతంత్రరాజ్యాలను ఏర్పరచుకోసాగారు.
6. బ్రిటీష్ సమాజం శాస్త్రీయ, సాంకేతిక. ఆర్థిక రంగాలలో అభివృద్ధి చెందింది. మొఘల్ సమాజం ప్రాచీన భూస్వామ్య దశలోనే వుంది.

# 46

# ఢిల్లీ సుల్తానులు, మొఘలాయిల యుగంలో పరిపాలన, సైనిక విధానం, సైనిక ఏర్పాట్లు

## ఉపోద్ఘాతము :

12వ శతాబ్దం చివరి నాటికి తురుష్కుల రాకతో ఉత్తరభారతదేశం ఒక శక్తివంతమైన, కేంద్రీకృతమైన రాజ్యంగా అభివృద్ధి చెందినది. 1526లో మొఘలాయిలు ఓడించేవరకు ఢిల్లీ సుల్తానుల యుగం కొనసాగింది. ఢిల్లీ సుల్తానుల యుగం కొత్త పరిపాలనా విధానాన్ని, సరొౖకొత్త ప్రజల జీవన విధానాన్ని ప్రవేశపెట్టింది. తుగ్లక్‌ల పరిపాలన తరువాత ఢిల్లీ సుల్తానుల విచ్ఛిన్నం ప్రారంభమైనప్పటికీ వారి పరిపాలనా విధానం మాత్రం తరువాత పాలకుల వరకూ కొనసాగింది. మొఘలాయిలు ఢిల్లీ సుల్తానుల పరిపాలనా విధానం అనుసరించారు.

తదుపరి పాఠాలలో ఢిల్లీ సుల్తానులకు ఖలీఫాలకు మధ్యగల సంబంధాలు, ఢిల్లీ సుల్తానుల పరిపాలన అమరికలను అనగా కేంద్ర ప్రభుత్వం, ప్రాంతీయ ప్రభుత్వాలు, సైనిక ఏర్పాట్లును గూర్చి అధ్యయనం చేస్తారు. తరువాత మొఘలుల కాలంలోని వివిధ ఒకాల పరిపాలనాంశాలు, వాటిలో మున్సబ్‌దారీ విధానంను కూడా అధ్యయనం చేస్తారు. ఈ విధంగా ఢిల్లీ సుల్తానుల, మొఘలాయిల సామ్రాజ్యముల మధ్య తారతమ్యం సులభంగా తెలుసుకోవచ్చును.

## 46.2 లక్ష్యాలు :

ఈ పాఠ్యాంశంను అధ్యయనం చేసిన తరువాత నీవు క్రింది విషయాలు తెలుసుకుంటారు.

1. ఢిల్లీ సుల్తానుల ఖలీఫాల మధ్య సంబంధం వివరణ.
2. ఢిల్లీ సుల్తానుల కేంద్ర ప్రభుత్వం వివరణ.
3. ఢిల్లీ సుల్తానుల సైనిక ఏర్పాట్లను జ్ఞప్తికి తెచ్చుకొనగలవు.
4. మొఘలుల కాలంలోని పరిపాలనా విభజనను గుర్తించటం.
5. మొగలుల కేంద్ర, రాష్ట్ర పాలనను వర్ణించటం.
6. మున్సబ్‌దారీ విధానంను స్వభావంను తెలుసుకొనుటం.

## 46.3 ఢిల్లీ సుల్తానులు, ఖలీఫాలు

ఢిల్లీ సుల్తానులు తమ రాజ్యం ఖలీఫా నాయకత్వంలో ఇస్లాం సామ్రాజ్యంలో భాగమని సూత్రప్రాయంగా చెప్పుకున్నారు. అందువలన వీరు ఖలీఫా సార్వభౌమాధికారంను గుర్తించారు. దీనిని ప్రతిబింబించుటకు (చిహ్నముగా, గుర్తుగా) ఖలీఫా నుండి దుస్తులను గ్రహించుట, ఖలీఫా పేరుపై నాణెముల ముద్రణ. ఖలీఫా పేరుపై 'కుత్బా' చదివించుట మొదలైనవి. 1229లో ఇల్‌టుట్‌మిష్ అబ్బాసిడ్ ఖలీఫానుండి 'లెఫ్టినెంట్ ఆఫ్ ది ఫెయిత్‌ఫుల్" అను పత్రమును పొందెను. ఇది ఇల్‌టుట్‌మిష్ చివరి వరకూ రక్షణగా వున్న అతని గౌరవంను ద్విగుణీకృతం చేయుటయే గాక శతృవుల కన్న మంచి స్థితిలో ఉంచినది. అల్లాఉద్దీన్ లాంటి శక్తివంతుడు కూడా 'ఖలీఫాకు కుడి భుజం' అని ప్రకటించుకొనెను. ప్రారంభంలో మహమ్మద్‌బీన్ తుగ్లక్ నాణేలపై ఖలీఫా పేరును తొలగించినప్పటికీ తిరుగుబాట్లు చెలరేగుటతో తిరిగి నాణేలపై ఖలీఫా పేరును తిరిగి ముద్రింపచేసేను. ఇది ముస్లింలలో ఒక వర్గం మెప్పు పొందుటకు మహమ్మద్ బీన్ తుగ్లక్ ఫిరోజ్‌షా తుగ్లక్‌లు ఈజిప్టు ఖలీఫానుండి పత్రమును పొందెను.

ఢిల్లీ సుల్తానులు తమ అధికారమును ఖలీపా ద్వారా గుర్తింపుపొందిరి. ఇది సాధారణ ముస్లింల దృష్టిలో బలపడగలమని భావించిరి. ఇతర ముస్లిం రాజ్యాలలో దౌత్యపరంగా సమానత్వంను పొందుటకు, వారి బిరుదులు సింహాసనం బలపడుటకు ఉపయోగపడినది. సనాతన ముస్లింలు ఉలేమాల సహకారంను కూడా పొందగలిగిరి.

ఢిల్లీ సుల్తానులు సూత్రపాయంగా ఖలీఫాకు లొంగి ఉన్నప్పటికీ, వాస్తవంగా స్వతంత్రులు. ఢిల్లీ సుల్తానులు సైనిక నియంతలు. ఇల్‌తత్‌మిష్ ఖలీఫా నుండి గౌరవింపబడిన బెంగాల్ పాలకుడు ఘియాజుద్దీన్ ఓడించుటకు తటపటాయించలేదు. బాగ్దాద్‌ను ధ్వంసం చేసి ఖలీఫాను చంపిన హలగు అనుచరులను ఢిల్లీ సుల్తానులు స్వాగతం పలికిరి. దీనిని బట్టి ఢిల్లీ సుల్తానులకు రాజకీయ అవసరాలకన్న మత, సైనిక అవసరాలు ఎక్కువ కాదని తెలుస్తున్నది. అల్లాఉద్దీన్ ఖిల్జీ హలగు వారసులైన ఇల్లఖాన్స్‌తో సంబంధం కలిగి ఉండెను. ఇది ఖలీఫాకు నచ్చలేదు. బాల్బన్ అల్లాఉద్దీన్ ఖిల్జీలు ఖలీఫా వ్యవస్థ వలన మంచి గౌరవాన్ని పొందిరి. అసమర్ధులైన ములుబారక్ షా ఖిల్జీ మాత్రం సుల్తాను అను పేరును తీసివేసి ఖలీఫాగా ప్రకటించుకొనెను. భారతదేశంలో అక్బరు కాలంలో రాజరికం పూర్తిగా స్వతంత్రమైనది. ఈ పద్ధతిని అక్బర్ వారసులు అనుసరించిరి. అక్బర్ కాలం నుండి మొఘల్ చక్రవర్తులు ఖలీఫా అధికారమును పొందిరి. అందువలనే తమ రాజధాని దార్-ఉల్-ఖిలాఫత్ అని ప్రకటించిరి.

వాస్తవానికి ఢిల్లీ సుల్తానులపై ఖలీఫా ప్రభావం లేదు. కాని ఢిల్లీ సుల్తానులు ఖలీఫా పేరును వారి అధికారమును ప్రబలం చేసుకొనుటకు సాంప్రదాయబద్ధులైన సున్నీల మనసులను గెలుచుకొనుటకు వినియోగించిరి.

## 46.4 ఢిల్లీ సుల్తానుల కేంద్ర ప్రభుత్వం

ఢిల్లీ సుల్తాన్ కొంతమంది మంత్రుల సహాయంతో పరిపాలించెడివాడు. మంత్రులను సుల్తాన్ ఎంపిక చేసుకొనెడి వాడు. సుల్తాన్ తర్వాత వజీర్ ప్రముఖుడు. ఇతడు ఆర్థిక వ్యవహారాలు (దివాన్-ఇ-వజీరత్)చూసెడివాడు. ఈశాఖ ఆదాయం, వ్యయాలను, రెవెన్యూ వ్యవహారాలు చూసేది.

మహమ్మద్‌బిన్ తుగ్లక్ రెవిన్యూశాఖకు చాలా ప్రాధాన్యతనిచ్చాడు. ప్రారంభంలో ఢిల్లీ సుల్తానుల యుగంలో వజీర్‌కు పెద్దగా ప్రాధాన్యత లేదు. బాల్బన్, అల్లాఉద్దీన్‌లు స్వయంగానే ఈ విధులను నిర్వహించెడివారు. అసమర్థులు, అనుభవంలేని పాలకుల కాలంలో వజీర్ అంతులేని అధికారంను సంపాదించెను. ఫిరోజ్‌షా తుగ్లక్ కాలంలో 18 సంవత్సరముల సుదీర్ఘ కాలం పనిచేసిన ఖాన్–ఇ–జహాన్ ముక్బల్ వజీర్ల ఆధిపత్యమునకు మంచి ఉదాహరణ. వజీర్‌కు శక్తివంతులైన అనుచరులు ఉండెడివారు. పద్దులను తనకీ చేయుట కొరకు ముషరఫ్–ఇ–మామూలిక్ (Accountant general) వ్యయాలను పరిశీలించుటకు, ముస్తాఫా–ఇ–మాములుక్ (Auditor general) మజుందార్ ప్రజలకు సంబంధించిన రుణములు, బకాయిలకు ముందస్తు చెల్లింపులకి సంబంధించిన రికార్డులు భద్రపరచుటకు, ఖాజీ–కోశాధికారి (treasurer) అమీర్–ఇ–కోహి, బంజరు భూములను ప్రభుత్వ ప్రోత్సాహంతో వ్యవసాయ యోగ్యం చేయుంచుటకు పనిచేయును.

సైనిక భాగంను దివానీ–ఇ–అరిజ్ అని పిలిచెడివారు. దీనికి అరిజ్–ఇ–ముమాలిక్ అధికారి. ఢిల్లీ సుల్తానులది సైనిక రాజ్యం. కావున దివాన్–ఇ–అరిజ్ ప్రధాన విభాగం. సైనికుల నియామకం, రక్షణ ఆయుధాల సమకూర్చుట, సైనికులకు జీతాలు చెల్లించుట దీని ముఖ్య విధులు. బాల్బన్ మొట్టమొదటిసారిగా ప్రత్యేక అరిజ్ శాఖను ప్రారంభించెను. తరువాత అల్లాఉద్దీన్ ఖిల్జీ దీనిపై ప్రత్యేక శ్రద్ధ వహించెను. బాల్బన్ సుదీర్ఘమైన కవాతు ద్వారా సైన్యంనకు ప్రత్యేకమైన రూపమును ఇచ్చెను. దో ఆబ్ ప్రాంతంలోని గ్రామాలను సైనికుల జీతాల చెల్లింపు నిమిత్తం కేటాయించుటకు బాల్బన్ ప్రారంభించెను. వీటిని సైనికులు వారసత్వ హక్కులుగా భావించిరి. అంతేకాకుండా బాగా వృద్ధులైనప్పటికీ వారి ఉద్యోగములను వదులుకొనుటకు ఇష్టపడలేదు. అల్లాఉద్దీన్ ఖిల్జీ పాలనలో అరిజ్ శాఖ పనితీరు మెరుగుపర్చబడింది. అల్లాఉద్దీన్ ఖిల్జీ భారీ సంఖ్యలో సిద్ధ సైన్యంను నిర్వహించెను. ప్రతిరోజు సైన్యానికి మస్తర్ వేసే విధానం, గుర్రాలకు దాగ్ అంటే వర్గీకరణ (ఎంపిక) విధానం(for landing of horses)ను అనుసరించెను. నాసి రకం గుర్రాలను మస్తరుకు రాకుండా నివారించినది. సైనికులకు జీతాలిచ్చిన మొదటి సుల్తాను అల్లాఉద్దీన్ ఖిల్జీ. జీతాలు చెల్లింపుల కొరకు భూములను ఇనాంగా ఇవ్వటాన్ని నిలిపివేసెను. ఇది మహమ్మద్ బీన్ తుగ్లక్ పాలన వరకు కొనసాగింది. సైనిక నిర్వహణకు డిసిమల్ పద్ధతిని అనుసరించెను. ఉదాహరణకు 100మంది సైనికులకు సైన్యాధికారి సాదీస్, వెయ్యిమంది సైనికులకు హజారస్. ఈ విధానంను మంగోలుల నుండి గ్రహించుట జరిగినది. ఫిరోజ్ షా తుగ్లక్ కాలంలో సైనికులకు జీతాలిచ్చు పద్ధతిని తీసివేసి జాగీరులను మంజూరు చేసే పద్ధతిని పునరుద్ధరించెను. ఫిరోజ్ షా తుగ్లక్ దివాన్–ఇ–అరిజ్ శాఖను సంపూర్ణంగా నిర్వీర్యం చేసెను. ఈ విషయములను ముందుగా అధ్యయనం చేసియున్నారు.

ఢిల్లీ సుల్తానుల పాలనలో ఇంకొక ముఖ్యమైన శాఖ దివాన్–ఇ–రిసాలత్. దీనికి అధిపతి సాదర్–ఉస్–సుదూర్ ఇది మత అంశాలను, దానాలు, భత్యాలు పర్యవేక్షించెడిది. దీనికి ప్రత్యేకమైన ఖజానా ఉండెడిది. ఇది జకాత్ పన్నునుండి పూర్తిగా వసూలు అయ్యేది ముఖ్య సాదర్ న్యాయాధిపతిగా(Quasi Mumalik) కూడా వ్యవహరించేవాడు.

రాజ్య ఉత్తర ప్రత్యుత్తరములను నిర్వహించుటకు దివాన్–ఇ–ఇన్షా ఉండెడివాడు. సుల్తాన్ కొరకు ఇతర రాజ్యాల రాజులకు మధ్య మరియు సుల్తాన్‌కు దిగువ అధికారులకు మధ్య రహస్య ఉత్తర ప్రత్యుత్తరములను ఈశాఖ నిర్వహించెడివాడు. పై నలుగురు మంత్రులతో పాటుగా అదనపు శాఖలు ఉండెడివి. వాటిలో వాస్తవ రాజ్య సమాచారమును

తెలియజేసే గూఢాచార విభాగం బారిద్–ఇ–ముమాలిక్ నాయకత్వంలో ఉండెడిది. స్థానిక సమాచారంను చేరవేయుటకు బారిద్ అను ఉద్యోగులు ఉండెడివారు. రాజు దర్బారుకు సంబంధించిన ఏర్పాట్లు వకీల్‌దారు (Vakil dar) చూసుకొనెడివాడు. ఇది సుల్తాన్ వ్యక్తిగత సౌకర్యాలను, దర్బార్ మర్యాదలు నిర్వహించుటకు చూసెడిది. ఇది సుల్తాన్‌కు అవసరమయ్యే వస్తువులు, సౌకర్యాలను తయారుచేసే కార్ఖానాలను పర్యవేక్షించెడిది. ఫిరోజ్ షా తుగ్లక్ పాలనలో బానిసలకు ప్రత్యేక శాఖను ఏర్పాటుచేసెను. బానిసలు పైన చెప్పబడిన కార్ఖానాలలో పనిచేసెడివారు. ఫిరోజ్ షా తుగ్లక్ కాలువలు, రోడ్లు, భవన నిర్మాణముల కొరకు ప్రత్యేకమైన శాఖను నెలకొల్పెను.

ఢిల్లీ సుల్తానులు అనేకమంది అధికారుల సాయంతో పాలించిరి. వారిలో వజీర్, అరిజ్–ఇ–ముమాలిక్, సాదర్–ఉస్–సాదర్, దివాన్–ఇ–ఇన్సా, బారిద్–ఇ–మామలిక్

## 46.5 ఢిల్లీ సుల్తానులపై సైనిక నిర్వహణ :

ముస్లింలు మొదట వ్యాపారం కొరకు భారతదేశం వచ్చిరి. కాలక్రమేణగా స్వతంత్రులై శక్తివంతమైన రాజ్యం స్థాపించిరి. ఢిల్లీ సుల్తానులు అంతరంగిక, విదేశీ సమస్యల దృష్ట్యా సిద్ధ సైన్య ఆవశ్యకతను గుర్తించిరి. విదేశీ దాడులలో మంగోలుదాడులు పెద్దవి. నిరంతరంగా మంగోలులు దాడులుచేసి ఢిల్లీ సుల్తాన్‌కు అపార నష్టమును కలిగించెడివారు. మంగోలులు భారతదేశంలో స్థిరపడనప్పటికీ వారి దాడులు బాల్బన్, అల్లాఉద్దీన్ ఖిల్జీల కాలంలో మంగోలు దాడుల నివారణకు చర్యలు చేపట్టడం జరిగినది. అంతరంగికంగా హిందూ స్థానిక ప్రభువులు తురుష్కుల రాక హర్షించని రాజపుత్రులు తరచూ తిరుగుబాటు చేసిరి. ఇదీకాక ఢిల్లీ సుల్తానులు వారి వర్గం నుండి వారసత్వ సమస్యలను ఎదుర్కొనిరి. వంశపారంపర్య విధానం లేనందున ప్రతీ తురుష్కుడు వారు సింహాసనమునకు అర్హుడను అని భావించిరి. అందువలన శక్తివంతమైన సర్ధారులను నియంత్రించుటకు ప్రయత్నించిరి. ఈ అంశంలన్నీ ఢిల్లీ సుల్తానులు సైన్యాధిపతులను, యుద్ధ ఆయుధములకు శక్తివంతమైన సిద్ధ సైన్యాలను,(standing army) సమకూర్చకొనవలసి వచ్చినది. పై సమస్యల వలన అల్లాఉద్దీన్ ఖిల్జీ పరిపాలనలో సంస్కరణలను ప్రవేశపెట్టెను. ఇదే అంశమును ఇంతకుముందు పాఠంలో అధ్యయనం చేసియున్నాము. ఇందులో కూడా అధ్యయనం చేస్తాము.

ముందు పాఠంలో సైనిక విభాగం అరిజ్–ఇ–ముమాలిక్ నేతృత్వంలో ఉండెడిది. అవి చదివి యున్నాము. సర్వ సైన్యాధ్యక్షుడు సుల్తాన్ అని గుర్తు చేసుకోవలసి యున్నది. సుల్తాన్ ఆర్మీలో ఉన్నత పదవులలో ఉన్నవారు వలీలు, ఇక్తాదారులు. కొన్ని శాఖలు రాష్ట్రంలోను, సరిహద్దులలోను, మిగతా వారిని సుల్తాన్‌ల వద్ద నియమించబడేవి. సుల్తాన్ దండయాత్రలు చేయునపుడు ఉన్నత పదవులలో ఉన్న సర్ధారులు తమతమ సైన్యంతో సుల్తాన్‌ను కలిసెడి వారు. సుల్తాన్ సైన్యం అశ్వికదళం, కాల్బలం, గజబలం ఉండాలి. అశ్వికదళంనకు ప్రత్యేక స్థానం ఉండెడిది. సుల్తాన్ కుమారులు, రక్త సంబంధీకులు సర్ధారులుగా ఉండెడివారు. కోటలు కూడా ప్రముఖ పాత్ర వహించెడివి. కొత్త కోటల నిర్మాణం పాత కోటల మరమ్మత్తులు, నిర్వహించెడివారు. కోటలలో సమర్ధవంతమైన సైన్యమును ఉంచెడివారు. మంగోలుల దాడులను త్రిప్పికొట్టుటలో ప్రతికోటకు కొత్వాల్ అను అధిపతి నియమించబడెడివాడు. కొన్ని సందర్భాలలో కొత్వాలుతో పాటు సర్దార్‌ను కూడా నియమించెడివారు. కొత్వాల్‌కు విశేషమైన అధికారాలు ఉండెడివి. ఆయుధాల మరమ్మత్తుకు మఖ్‌రిద్

అను ఉద్యోగి ఉండెడివాడు. ఒక ఖాజీ, మిర్దార్‌లను కూడా నియమించెడివారు. వ్యవసాయ భూములు కోటలకు అనుసంధానం చేయబడి వాటి నిర్వహణ కోటచే నిర్వహించబడెడివి.

బాల్బన్ సమర్థవంతమైన సైన్య అవసరాన్ని గుర్తించెను. మంగోల్‌దాడులు, అంతరంగిక తిరుగుబాట్లు ప్రమాదమని భావించెను. అందువలన సైనిక విభాగం (దీవాన్–ఇ–అరిజ్) ను పునర్యవస్థీకరించెను. ఇది సుల్తాన్ గౌరవమును, శక్తిని పెంచినవి. ప్రతి దండయాత్రలో ముందు తరువాత మస్తరు తీసుకోబడింది. క్రమశిక్షణ ఉల్లంఘనకు కఠినమైన శిక్షలు విధించబడింది. సైనికులుగాని, సైన్యాధిపతులు గాని విధి నిర్వహణకు పనికిరాకపోతే పదవీ విరమణ చేయించెడివాడు. సర్దారుల, ఇక్తాదారుల చర్యలను ఎప్పుడుకప్పుడు తెలియజేయుటకు సమర్ధవంతమైన గూఢాచార విభాగంను ఏర్పాటు చేసెను.

అల్లాఉద్దీన్ కాలంలో సైనిక సంస్కరణలను చేపెట్టెను. మంగోలులు అల్లాఉద్దీన్‌ను కూడా చీకాకు పెట్టెను. దీని కారణంగా సిద్ధ సైన్యంను ఏర్పాటు చేసుకొని, దాగ్, హులియాలను ఖచ్చితంగా పాటించెను. సైనికులకు జీతాలిచ్చిన మొదటి సుల్తాన్ అల్లాఉద్దీన్ ఖిల్జీ. ప్రతి సైనికునికి పనితీరును క్రమబద్ధీకరించి, సైనికుల కొనుగోలు శక్తిని పెంచెను.

షియాజుద్దీన్ తుగ్లక్ కాలంలో దాగ్ హులియాలను ఖచ్చితంగా అమలు పరచెను. సైనికులు సమర్ధవంతంగాను, నిజాయితీగాను జీవించుటకు ఆర్థికంగా సైనికులకు సంతృప్తి చెందేటట్లు చర్యలు తీసుకొనెను. అల్లాఉద్దీన్ చేపట్టిన పద్ధతులను ఫిరోజ్ షా తుగ్లక్ అనుసరించెను. సైనికులకు జాగీరులను ఇచ్చెను. వారి ఉద్యోగాలు వంశపారంపర్యం చేసెను. ఉన్నత వర్గం వారికి (Khan, Malik and Amir) కేంద్ర ఖజానా నుండి కాక ప్రభుత్వ ఆదాయంలో వాటా ఇవ్వబడింది. . ఫిరోజ్ షా తుగ్లక్ యుద్ధ దోపిడీలో 1/5 వంతు రాజ్యాన్ని వాటాగా నిర్ధారించెను. ఇది అల్లాఉద్దీన్ ఖిల్జీ కాలంలో 4/5గా ఉండేది.

ఇక్తాను గూర్చి చదివియున్నారు. ఇది అరబిక్ పదం. దీనిని తురుష్కులు భారతదేశం తీసుకువచ్చిరి. జాగీరులను ఇక్తాలు అంటారు. వీటిని కలిగిఉన్నవారిని ఇక్తాదారులు అంటారు. ఇక్తాదారులు స్వంతసైన్యం కలిగి ఉండేది.ఇవి బదిలీ చేయబడును. ఇక్తాదారులకు తమ ఆదాయ వ్యయాలపై ఆధిపత్యం ఉండేది. ఇక్తాదారుల సౌలభ్యంకోసం అధికారులను నియమించెను. ఇది బాల్బన్ కాలంలో ప్రాంభించినప్పటికి మహమ్మద్ బిన్ తుగ్లక్ కాలంలో ఉన్నతస్థాయికి చేరుకొనినది. మహమ్మద్‌బిన్ తుగ్లక్, అల్లాఉద్దీన్‌లు ఇక్తా విధానంను రద్దు చేసినప్పటికీ, 1351లో ఫిరోజ్ తుగ్లక్ దీనిని పునరుద్ధరించెను. జాగీరులపై శాశ్వత పద్ధతిపై భూమిశిస్తును నిర్ణయించిరి. దీనిలో జాగీర్ధారులకు లాభం చేకూరినది. ఇక్తాలను బదిలీ చేయుటకు కష్టమైనది. ఇక్తాదారులు వారసత్వ పద్ధతిలోకి వచ్చిరి. సైనికులకు ఆదాయం కేటాయించుట కూడా ఫిరోజ్‌ఖాన్ షా తుగ్లక్ ప్రారంభించెను.

బాల్బన్ అల్లాఉద్దీన్‌లు సైన్యానికి ప్రాధాన్యతను ఇచ్చిరి. క్రమశిక్షణను ఖచ్చితంగా అమలులో పరిచిరి. మస్తర్, హులియా, చెహరా విధానాలను అమలుచేసిరి.

## పాఠ్య ప్రశ్నలు 46.5 ఎ.

1. ఢిల్లీ సుల్తానుల కాలంలో రాజ్యంలో అత్యున్నత న్యాయాధిపతి ఎవరు?

2. ఢిల్లీ సుల్తానుల కాలంలో పరిపాలనలో సుల్తాన్‌కు సహకరించిన ప్రముఖ మంత్రులు ఎవరు?

3. ఏ ఢిల్లీ సుల్తాను కాలంలో జీతాలు జాగీరుల రూపంలో చెల్లించుటకు ఆపివేసెను. ?

## 46.6 మొఘలుల కేంద్రప్రభుత్వం :

ఇప్పటివరకు ఢిల్లీ సుల్తానుల కాలంలో ప్రభుత్వ విధానం సైనిక నిర్వహణను చదివి యున్నారు. ఇప్పుడు మొఘలుల కాలంలోని పై శాఖల పనితీరు పరిశీలిస్తాము.

కేంద్ర ప్రభుత్వ నిర్వహణలో అక్బరు ప్రత్యేక శ్రద్ధను వహించెను. ఇతడు కొద్దో గొప్పో ఢిల్లీ సుల్తానుల విధానంను అనుసరించెను. ఢిల్లీ సుల్తానుల కాలంలోబలహీనపడిన ప్రభుత్వమును తిరిగి మెరుగుపరచెను. అక్బరు జాగ్రత్తగా వివిధశాఖల పనితీరును మెరుగు పరచేందుకు కఠినమైన విధి విధానాలను రూపొందించెను.

అక్బర్ రెండంచెల విధానాన్ని అనుసరించి కేంద్ర ప్రభుత్వ యంత్రాంగంను శక్తివంతంగా చేసెను. వివిధ శాఖల మధ్య అధికారంను విభజించి, ఎప్పటికప్పుడు నియంత్రణ చేయించెడివాడు. అక్బర్ కాలంలో వకీలు అధికారం తగ్గించబడింది. అతను రాజ్య గౌరవాధికారిగా చూడబడ్డాడు. ఎందుకంటే భైరాంఖాన్ వకీలుగా పనిచేసి విశేషమైన అపరిమిత అధికారాలను చలాయించెను. వజీర్ కన్నా శక్తివంతుడుగా చలామణి అయ్యెను. ఈ ఉద్యోగిని ఈ పదవికూ అనేక అధికారులను నియమించినా పాలనలో వారు అంతగా పాలు పంచుకోలేదు. అక్బర్ కాలంలో రద్దు చేయక కేవలం నామమాత్రంగా కొనసాగింపబడింది. వారికి హోదా, గౌరవం, గొప్పతనం ఉండెడిది కానీ అధికారం ఉండేదికాదు. చక్రవర్తికి భాద్యత వహించెడివాడు.

ఢిల్లీ సుల్తానుల యుగంలో మాదిరిగా వకీలుతో పాటు రాజ్య బాధ్యతలను నలుగురు మంత్రులు నిర్వహించేవారు. ఆ నలుగురు మంత్రులు రాజ్యానికి నాలుగు స్థంభాల లాంటివారు. వారు;

1. దివాన్ లేదా దివాన్–ఇ–కుల్ ఇతనిని వజీర్ అని కూడా పిలిచెడివారు. ఇతను భూమిశిస్తు, ఆర్థిక వ్యవహారాలు చూసెడివాడు.

2. మీర్ బక్షి సైనిక పరిపాలన నిర్వహించెడివాడు. (రక్షణమంత్రి)

3. సాదర్ న్యాయ శాఖామంత్రి.

4. మీర్ సమన్ ప్రభుత్వముచే నిర్వహించబడే కర్మాగారములు, (పరిశ్రమలు) వ్యాపారముల మంత్రి. మంత్రుల పాత్రను ఈ దిగువ పరిశీలించెదరు.

**దివాన్ :-**

రాజ్య, ఆదాయ వ్యయాలను చూసెడివాడు. ఇతను . ఖలీసా, జాగీర్ ప్రభుత్వ భూముల అజమాయిషీ చేసేవాడు. దీవాన్ ఉన్నతమైన హోదా కలిగి ఉండేవాడు.కానీ ఇతర శాఖలపై సాదరముగా పర్యవేక్షణ అధికారం ఇతనికి లేదు.

**మీర్‌బక్షి:-**

సైనిక నిర్వహణ, పరిపాలన, రక్షణమంత్రి. మున్సబ్‌దారీ విధానంను ప్రవేశపెట్టుటలో మీర్‌బక్షి బాధ్యతలు పెరిగినవి. రాజ్యంలోని అధికారులందరూ వారి పని స్వభావంతో సంబంధం లేకుండా, మున్సబ్‌దారులుగా ప్రకటించబడెడివారు. మున్సబ్‌దారుల నియామకం కొరకు గాని వారి పదోన్నతుల కొరకు గాని తగు సిఫారుసులు మీర్‌బక్షి ద్వారా మాత్రమే చక్రవర్తికి పంపించాలి. ఒక్కసారి ఈ సిఫారసులు చక్రవర్తి అంగీకరిస్తే ఇది వజీర్‌కు పంపబడి నిర్ధారణ చేయబడి వారికి జాగీరు కేటాయించబడుతుంది. మీర్‌బక్షి గాని, దివాన్ ఇద్దరిలో ఎవరో ఒకరు మున్సబ్‌దారులను ఎంపిక చేయబడును. ఉన్నతస్థాయిలో ఉద్యోగిని మాత్రమే మున్సబ్‌దారుగా నియమిస్తారు. మీర్‌బక్షీ ఇతర విధులను నిర్వహించును. గూఢాచారులను (Barid) మరియు పత్రికా విలేఖరుల(wazir, Nazir)ను సామ్రాజ్యమంతటా నియమించి, వారు సేకరించిన సమాచారంను మీర్‌బక్షీ ద్వారా చక్రవర్తికి దర్బారులో సమర్పించెదరు.

**ముఖ్య ఖాజీ :-**

అక్బర్ కాలంలో మరియొక ప్రత్యేకశాఖ న్యాయశాఖ. ఖాజీ, ముఫ్తీ మరియు ఇతర న్యాయశాఖాధి కారులను నియామకంను పర్యవేక్షించును. కొన్ని సందర్భాలలో ఖాజీ పదవి ముఖ్యసాదర్ లేదా సాదర్-ఉ ల్-సాదర్ పదవిలో కలసిపోయేడిది. ఇతను సాధారణ మరియు మత, ధానదర్మాలను ధనరూపేణా, ఇనాముల రూపేణా చేయుట, మరియు విద్యాశాఖను పర్యవేక్షణ చేసెడివాడు. అందువలన ముఖ్య ఖాజీ ప్రధానపాత్ర వహించెను. అక్బర్ కాలంలో ఈ విభాగం లంచాలతో చెడ్డ పేరు తెచ్చుకొనెను. తన బంధువులకు, మిత్రులకు సాదర్ వేతనములను, సహాయాలను ప్రకటించుటతో తన అధికారాలను దుర్వినియోగం చేసెను. సాదర్ ఉలేమాలు అక్బర్ లౌకిక విధానంను దెబ్బతీసిరి. అందువల సాదర్ అధికారాలను నియంత్రించుటలో కొన్ని నిర్ణయాలు తీసుకొనెను. వాటిలో మొదటిది మహజర్‌నామా ప్రకారం ఉలేమాల వద్ద ఉన్న చట్టానికి వివరణ ఇచ్చి అవకాశములను తప్పించి తానే రాజ్య ముజతాహిద్‌గా ప్రకటించుకొనెను. రెండవది సాదర్‌కు మున్సబ్ మంజూరుచేసి ప్రభుత్వ ఉద్యోగి హోదాను తగ్గించెను. పాలనాపరమైన క్రమశిక్షణ పరిధిలోనికి తీసుకువచ్చెను.మూడవది అక్బర్ పరిపాలన 26వ సంవత్సరంలో సామ్రాజ్యంను ఆరు సదంతులుగా విభజించెను. ఈ విధంగా న్యాయశాఖలోని లంచగొండినతనం మోసంను అంతం చేసెను. ఆ విధంగా సాదర్ భూములను తన ఇష్ట ప్రకారం మంజూరు చేయుటను నివారించెను. అన్ని మంజూరులను చక్రవర్తి వలన పొంది మంత్రి ద్వారా వాటిని పంపిణి చేయాలి. తన అధీనంలోని నిధిని ఖర్చు చేయుటపై ఆడిట్‌కు బాధ్యతని చేసెను.

మొఘలుల కాలంలోని మరియొక ప్రముఖ అధికారి మీర్‌సమన్. ఇతను రాజ్య అవసరాలకు, రాజగృహ అవసరాలకు సంబంధించిన పౌర సరఫరాల వ్యవస్థ అధికారి. ఇతను ఖార్ఖానాల పనితీరును పర్యవేక్షించెడివాడు. ఈ కార్ఖానాలు అంతఃపుర వాసులు వినియోగించే వస్తువులు తయారుచేయుదురు. దర్బారులో హుందాతనాన్ని ప్రదర్శించుటలో ప్రముఖ పాత్ర వహించుట, చక్రవర్తి అంగరక్షకులను నిర్వహించుట వీని విధి. ఇది అక్బర్ మంత్రుల అధికారములను

పరిమితం చేయుటకు తనఖీ చేసి సరిచేయుటకు ప్రయత్నించెనని తెలుస్తున్నది.

మంత్రుల అధికారంను కుదించుటకు అధికారాలను పరిపాలనకు అజమాయిషీ చేయుటకు నియమించెను. వీరు రాజ దర్బారుకు అనుసంధించబడ్డ వారు. కేంద్ర ప్రభుత్వంలో ఏ శాఖకు చెందిన వారు కాదు. చక్రవర్తి వ్యక్తి గత అజమాయిషీ, తనిఖీలు మంత్రులపై గొప్ప నియంత్రణను స్పష్టం చేయుచున్నది. చక్రవర్తి అధికారులతోను, ఉన్నత పదవులలో ఉన్నవారితోను సంప్రదింపులు జరుపుట వలన చాలామంది చక్రవర్తికి వ్యక్తిగతంగా పరిచయమై మంత్రుల అనవసర ప్రాధాన్యతను తగ్గించుచున్నది. జరోఖా-ఇ-దర్శన్, దివాన్-ఇ-ఆమ్ లలో చక్రవర్తి ప్రజల ఫిర్యాదులను స్వీకరించెడివాడు. చక్రవర్తి వివిధ ప్రాంతములకు సందర్శించునపుడు మంత్రుల అధికార దుర్వినియోగం చక్రవర్తి పరిశీలనలోకి వచ్చెను. ఈ కార్యక్రమాల వలన చక్రవర్తి బాధ్యతలు అధికమయ్యెను. చక్రవర్తి అప్రమత్తతలోను, సమర్ధతలోను ఉన్నంత కాలం అన్నీ సక్రమంగానే జరిగినవి. చక్రవర్తిలో అలసత్వం ప్రబలితే అధికార దుర్వినియోగం జరిగెడిది.

మొఘలుల కాలంలో కేంద్ర పరిపాలనా యంత్రాంగం రెండు ముఖ్య విధానాలుండేవి అవి. అధికార వికేంద్రీకరణ, అజమాయిషీ. పాలనా నలుగురు మంత్రుల అధీనంలో కొనసాగేది. వారు;

1. దివాన్/దివాన్-ఇ-కుల్/వజీర్ అర్థిక, భూమిశిస్తును పర్యవేక్షించేవారు. (ఆర్థికమంత్రి)
2. మీర్‌భక్షీ, రక్షణ మంత్రి
3. సాదర్ న్యాయశాఖ
4. మీర్‌సమన్ పరిశ్రమలు, గోడౌన్లు, గిడ్డంగు అధికారి

## 46.7 మొఘలుల కాలములో రాష్ట్రాల పరిపాలన :

అబుల్‌ఫజల్ ప్రకారం అక్బర్ సామ్రాజ్యాన్ని 1580లో 12 సుభాలుగా విభజించెను. అవి బెంగాల్, బీహార్, అలహాబాద్, అయోధ్య, ఆగ్రా, ఢిల్లీ, లాహోర్, ముల్తాన్, కాబూల్, అజ్మీర్, మాళ్వా, గుజరాత్-దక్కన్ విజయాల వలన బీరార్, ఖాందేష్, అహ్మద్‌నగర్‌లతో కలిపి 15 సుబాలు. జహంగీర్ 15 సుభాలు, షాజహాన్ కాలంలో కాశ్మీర్, ధట్టా, ఒరిస్సాతో 18 సుబాలు, ఔరంగజేబు కాలంలో గోల్కొండ, బీజాపూర్‌తో కలిపి 20 సుబాలు. ఈ విదమైన రాజకీయ విభజన పరిపాలనా సౌలభ్యం కొరకు మరియు వ్యూహాత్మకముగాను చేయబడెను.

మొఘలుల కాలంలో సుభాలు సర్కారులుగాను, సర్కారులు ఫరగణాలుగాను, ఫరగణాలు గ్రామాలుగాను విభజించబడెను. సుభాలలో పరిపాలనా యంత్రాంగం కేంద్ర ప్రభుత్వమునకు అద్దం పట్టెడిది. సుభాకు పాలనాధిపతి, సిఫస్తార్/నజమ్/సుభేదార్‌లు. ఇతను చక్రవర్తికి రాజు ప్రతినిధి వంటివాడు. సుభాకు సంపూర్ణంగా బాధ్యత వహించెడివాడు. శాంతి భద్రత, రక్షణ, ఆర్థిక పరిస్థితులను చూసెడివాడు.

జమీందారుల నుండి కప్పం వసూలు చేసెడివాడు. కొన్ని ప్రత్యేకమైన అంశములతో చక్రవర్తి ఆదరాభిమానములు పొందెడివాడు. రాజు తోడరమల్ గుజరాత్ సుభేదార్‌గా వున్నప్పుడు రాజపుత్రులకు లొంగుబాటును అంగీకరించే

అణకువతోని కలిసివుండేవాడు. వారితో సంధులు చేసుకొనెడివాడు. వారిని మున్సబ్‌దారులుగా నియమించేవాడు. గవర్నర్ పనిని నిర్వర్తించుటకు జాగీర్ధారులు, ఇతర అధికారులను సహకరించమని చక్రవర్తి ఆజ్ఞాపించెను. ఇతర అధికారులను శిక్షించేవాడు తోడర్‌మల్.

గవర్నర్లు గౌరవంతో పాల్గొనేటట్టు చేసి, తరువాత వారు స్వతంత్రంగా పనిచేసేటుట్లు చేసెను. రాష్ట్రంలో దివాన్ రిజస్టర్లు వ్రాసే అధికారి. గవర్నర్ వద్ద పనిచేయును. ఇతను స్వతంత్రుడు. ఇతనిని దర్బారునుంచి ముఖ్య దివాన్ నియమించును. గవర్నర్‌కు అనుచరుడు కాదు. ముఖ్యదివాన్ ఆజ్ఞలకు లోబడి పనిచేయును ప్రతి విషయంలోను ముఖ్యుడిగా బాధ్యత వహించెడివాడు. రాష్ట్రంలో దివాన్ అధికారములు వ్యవసాయ భూములను విస్తరించుట, నిజాయితీపరుడైన అమీర్‌లకు, తహసీల్ధారులను నియమించును. ఇతను రైతులు పన్నులు చెల్లించేటట్లు చేయును. రైతుల నుండి విడిచిపెట్టబడిన సెస్‌ను చెల్లించేటట్లు చేయును. తక్కావి రుణాలను తిరిగి చెల్లించేటట్లు చేసెను. రాష్ట్రానికి సంబంధించిన వివిధ శాఖల ఖర్చులను కేటాయించుట, ఖజానా లావాదేవీలను గమనించుట చెల్లింపుల విషయములో సరియైన చెల్లింపు ప్రతిలేకుండా చెల్లింపులను నియంత్రించుట మొదలైన అంశాలపై దివాన్ తిరుగులేని అధికారాలు కలిగియుండెను.

రాష్ట్ర పరిపాలనలో గవర్నరు ఏ విధమైన అధికారము కలిగి ఉండునో అర్థిక వ్యవహారాలలో దివాన్ అటువంటి అధికారాలను కలిగివుండెను. ఫలితంగా రాష్ట్రంలో సమాంతరంగా రెండు స్వతంత్ర సంస్థలు ఉండేవి. ఒకరిపై ఒకరు నిఘా ఉండి, ఒకరు ఇంకొకరు పనులను చక్రవర్తికి స్వతంత్రంగా తెలియచేసెడివారు. ఒకరితో ఒకరు సహకరించుకోకపోతే వారిని బదిలీ చేయుట గాని, కేంద్రానికి పిలిపించుట గాని చక్రవర్తి చేసెడివాడు.

రాష్ట్రంలో మరియొక ముఖ్య అధికారి సాదర్–ఉష్–సాదర్ సిఫారసులపై కేంద్ర ప్రభుత్వం సాదర్‌ను నియమించెడిది. ఇతని విధులు, జాగీరులు, ఉలేమాలను ప్రోత్సహించుటకు, జీతములు మరియు ఇతర ఆర్థిక సహాయములు చేసెడివాడు. జాగీరులలో వారసత్వ సమస్యలు తలెత్తితే వాటిని పరిష్కరించెడివాడు. సుభాలోని న్యాయశాఖ ఖాజీ నాయకత్వంతో ఉండేది. సాదర్, ఖాజీ కార్యాలయములు ఒక్కరికే అప్పగించేవారు. కేంద్ర, రాష్ట్రాలను కలుపుతూ బక్షీ ఉండేవాడు. ఇతను వివిధ రాష్ట్రాలలో మున్సబ్‌దారులను, సైన్యంను క్రమశిక్షణతో నిర్వహించెడివాడు. ఇతని ముఖ్య విధి సైనికులను ఎంపికచేయుట సైనిక నిర్వహణ చేసెడివాడు. క్రమం తప్పకుండా పరీక్షలు నిర్వహించుట సమర్థ, అసమర్ధ సైనికులను ఏరివేయుటకు తగిన చర్యలు తీసుకొనెడివాడు. మున్సబ్‌దారుల జీతాల బిల్లులు మంజూరు చేసెడివాడు. రాష్ట్రంలో జరుగుతున్న అంశాలను బక్షీ కేంద్ర ప్రభుత్వానికి తెలియచేసెడివాడు.

రాష్ట్రాలలో సమర్థవంతమైన పాలన కొరకు సుభాలను సర్కాలుగాను, సర్కారులకు కార్య నిర్వహణాధికారిగా ఫౌజ్‌దార్‌ను నియమించెను. సుభాలోని సిఫస్‌లార్ విధులను, సర్కారులో ఫౌజ్‌దారు నిర్వహించేవాడు. సర్కారులో శాంతిభద్రతలను నిర్వహించెడివాడు. రెవిన్యూ వసూళ్ళలో అమీరుగు సహాయపడెడివాడు. సర్కారు సరిహద్దులను, గ్రామీణ ప్రాంతాలను రక్షించేవాడు. ఫౌజ్‌దారుకు తాత్కాలిక సైన్యముతో సాయుధ పోలీస్ విధుల నిర్వహణ చేసేటట్లు అప్పగించెను.

సర్కారులో ఫౌజ్‌దార్ తరువాత ముఖ్య అధికారి అమీర్ / అమల్‌గుజార్. సర్కార్‌లోని రెవెన్యూశాఖను నిర్వహించును. దివాన్ అజమాయిషీలో ప్రత్యకంగా పనిచేయును. ఇతను సాధ్యమైనంత భూమిని, సాగులోనికి తెచ్చుటకు ప్రయత్నించును. నాణ్యమైన పంటలను పండించుటకు కృషిచేయును. దీనికొరకు రైతులకు రుణములను మంజూరు చేసి తిరిగి వాయిదాలలో వసూలు చేయును. అమీర్ రైతులతో నేరుగా సంబంధములు పెట్టుకొనెడివాడు. గ్రామాధిపతి, ఇతర అధికారుల ప్రమేయం లేకుండా చేసెను. దీనికొరకు చట్ట విరుద్ధమైన వారిని శిక్షించుటకు అధికారం పొందెను. ఖల్సాభూముల భూమిశిస్తు వసూల చేసి ఖజానాకు జమకట్టెడివాడు. కావున మొఘలుల పరిపాలనలో అమీర్ / అమల్‌గుజార్ అత్యంత కీలకమైన అధికారి. ఈ ఒక్క అధికారి ద్వారా కేంద్ర ప్రభుత్వము ప్రజలనాడిని కనుగొని తద్వారా గ్రామీణ ప్రాంతాలలో ఆర్థిక స్థిరత్వముకు పాటుపడెను.

కొత్వాల్ మెజిస్ట్రేట్ విధులు కలిగి ఉంటాడు. సర్కార్ పట్టణమునకు పరిసర ప్రాంతాలకు పరిమితమై ఉంటుంది. పోలీసు విధులు నిర్వర్తించును. ఇతనిని కేంద్ర ప్రభుత్వం నియమిస్తుంది. పట్టణంలోని అందరి ప్రజల వివరములు వార్డుల వారీగా సేకరించును. పట్టణంలో గూఢాచారులను కూడా ఉంచి వారి అవసరములను గూర్చి తెలుసుకొని, మార్కెట్లను క్రమబద్ధీకరించి తూకాలు, కొలతలు కల్తీని నివారించును. ప్రజలలో నైతిక విలువలు పెంపొందేటట్లు చేయును. పరగణాలలోని షిక్దార్‌పై సీనియర్ క్రిమినల్ మెజిస్ట్రేట్‌గా వ్యవహరించును. ఖాజీ ముఖ్య విధి న్యాయపాలన నిర్వహించుట. మత సంస్థలకు సంబంధించిన విధులను నియంత్రించును. ఔరంగజేబు కాలంలో జకాత్, జిజియా పన్నులు వసూలు కొత్వాలుకు అప్పగించెను.

సర్కార్ తరువాత ఫరగణా ఉండేది. పరగణాలలో నలుగురు ముఖ్య అధికారులుండేవాడు. 1. షిక్దార్, 2. అమీల్, 3. కొనుంగో, 4. ఖాజీ పరగణా ముఖ్య అధికారి హిక్దార్. సర్కార్‌లోని పౌజ్‌దారు, కొత్వాల్ విధులను షిక్దార్ పరిగణాలో నిర్వహించెడివాడు. షిక్దార్ పరగణాలో శాంతి భద్రతలను, క్రిమినల్, న్యాయమూర్తి విధులను నిర్వహించేవాడు. అవసరమైన సందర్భాలలో అమీల్‌కు భూమిశిస్తు వసూలులో సహాయపడెడివాడు. కొన్ని పరిమిత అధికారాలతో క్రిమినల్ మేజిస్ట్రేట్‌గా వ్యవహరించెడివాడు. అమీల్, కొనుగోలు భూములను సర్వే చేయుట, భూమిశిస్తును నిర్ధారించుట, వసూలు చేసెడివాడు. అమీల్ రైతులతో ప్రత్యక్ష సంబంధాలు కలిగి ఉండేవాడు. షిక్దార్‌కు గ్రామాల శాంతిభద్రతల విషయంలో సహాయపడెడివాడు. అమీల్ గ్రామాధికారి సహకార సంబంధములు కలిగి ఉండేవాడు. నేరస్తులను శిక్షించే అధికారంను కలిగి ఉండేవాడు. పరగణాలో ఖాజీ ముఖ్య న్యాయాధిపతి.

పరగణాలో గ్రామాలుండేవి. మొఘలుల కాలంలో గ్రామం ప్రభుత్వంతో ఒక సంస్థగా గుర్తించినది. గ్రామాధికారి ముఖ్యాధికారి. ఇతనే గ్రామానికి, ప్రభుత్వానికి వారధిగా ఉండేవాడు. వివిధ ప్రదేశంలో గ్రామధికారినే కుట్, ముకద్దామ్, చౌదరీ అనే పదములు వాడబడేవి. గ్రామాధికారి తగవులను పరిష్కరించేవాడు. పోలీసు విధులు నిర్వహించేవాడు. భూమిశిస్తు వసూలు చేసెడివాడు. గ్రామాధికారి తరువాత పట్వారి. ఇతను అకౌంటెంట్ విధులతో పాటు సాగుభూమికి సంబంధించిన రికార్డులను, రైతుల కమతాలను, పంటలతీరును బహి అను రిజిస్టరులో నమోదు చేసెడివాడు. ప్రభుత్వముచే ముఖ్య రిజిస్టరుగా గుర్తించబడినది. ఖచ్చితమైన సమాచారము కొరకు నమ్మదగిన రిజిస్టరుగా అంగీకరించిరి.

గ్రామాలలో నిర్వహణ గ్రామపంచాయితీ నిర్వహించేది. పంచాయితీలు నియమ నిబంధనలు ప్రజలు పాటించేటట్లు చేయును. వీటితోపాటుగా విద్య, పారిశుధ్యం, సహాయకార్యక్రమాలు చేపట్టును. గ్రామాలలోని పండుగలు, నిర్వహించుట వివాదములు పరిష్కరించుట గ్రామ పంచాయితీ చేయును.

| పాలన విభాగము | | అధికారులు |
|---|---|---|
| 1. రాష్ట్రము / సుభా | = | 1. సిఫాస్లార్ సుబేదారు |
| | | 2. దివార్ |
| | | 3. బక్షి, వకియనావిస్ |
| | | 4. సాదర్, ఖాజీ |
| 2. సర్కార్ | = | 1. ఫౌజ్‌దార్ |
| | | 2. అమీల్ (లేదా) అమల్‌గుజార్ |
| | | 3. కొత్వాల్ |
| | | 4. ఖాజీ |
| 3. పరగణా | = | 1. షిక్దార్ |
| | | 2. అమీల్ |
| | | 3. కొనుంగో |
| | | 4. ఖాజీ |
| 4. గ్రామము | = | 1. ముకద్ధమ్, చౌదరీ |
| | | 2. పట్వారీ |

## పాఠ్య ప్రశ్నలు 46.బి :

1. అక్బర్ కాలంలో ఎందువలన వకీల్ పదవి అలంకార ప్రాయమైనది?
2. మొఘలుల కాలంలో ముఖ్యమైన రాష్ట్రపాలనా విభజనలు ఏవి?
3. సర్కార్‌లో ఏ శాఖ అమీల్ గుజార్ అజమాయిషీలో వుండేవి?

## 46.8 మొఘలుల కాలములోని మున్సబ్‌దారీ విధానము :

మున్సబ్ అను పదమునకు హోదా, స్థాయి, కొలువు అని అర్ధములు కలవు. మొఘలుల పాలనలో ఇది ఒకని స్థాయిని, సాంఘిక హోదాని అధికారుల హోదాలో గొప్పతనమును మున్సబ్‌దారీ విధానం సూచించెడిది. మున్సబ్‌దారుకు నిర్దిష్ట సంఖ్య గల సైనికులకు జీతమును నిర్ధారించబడుతుంది. గుర్రాలు, ఆయుదములు మున్సబ్‌దారీ విధానయు మూలం. ఢిల్లీ సుల్తాను యుగములోని మంగోలుల కాలంలోని దశాంశ విధానములో నిర్వహించబడే సైనిక విధానము. దీనిలో సత్యము లేక పోలేదు. అక్బరు కాలములో ప్రారంభించబడిన మున్సబ్‌దారీ విధానంలో అనేక ప్రత్యేకాంశములు కలవు. ముందు తరముల వారికన్నా.

**మొదటిది :** మున్సబ్‌దారీ విధానం చాలా విస్తృతమైనది. అనగా దీనిలో రాజవంశీయులు, ఉన్నతోద్యోగులు, ఉన్నత సైనిక వర్గములు దీనిలో అంతర్భాగమై పోవుటవలన ఇంకొక విధముగా చెప్పాలంటే సైన్యం, రాజవంశీయులు పరిపాలనాధికారులు, మున్సబ్‌దారీ విధానమని చెప్పబడినది.

**రెండవది:** మొఘలుల మున్సబ్‌దారీ విధానంలో మున్సబ్‌దారులందరూ చక్రవర్తితో నేరుగా సంబంధములు కలిగియుండిరి. మున్సబ్‌దారులందరి అనిశ్చిత ఖర్చు సమానంగా కేటాయించెడివారు. ప్రతి తరగతికి ప్రత్యేకమైన స్వంత అనిశ్చిత గ్రాంటు ఉండేది.

**మూడవది:** మొఘల్ మున్సబ్‌దారుల వద్ద గల సైనికులు, గుర్రాల విషయంలో ప్రత్యేక సంఖ్య రకం నిర్ధారించబడెడిది. అది జూట్స్, సవారీలు ఉదాహరణకు 1000 / 100 లేదా 3000 / 3000.

జూట్, సవారీల అర్ధం విషయంలో విభిన్న అభిప్రాయములు కలవు. వీటిలో అంగీకరించబడిన అభిప్రాయం ప్రకారం జూట్ అనగా మున్సబ్‌దారు స్థితిని ఉద్యోగ వారసత్వమును, స్థిరమైన జీతముల తన తనకుటుంబము నిర్వహణను సూచిస్తుంది. సవార్ అనగా మున్సబ్‌దారు నిర్వహించవలసిన గుర్రపు దళసంఖ్యను తెలియచేస్తుంది. అంటే జూట్ మున్సబ్‌దారు హోదాను, స్థితిని తెలియజేస్తే, సవార్ మున్సబ్‌దారు సైనికస్థితిని తెలియజేస్తుంది.

ఐనీ అక్బర్ ప్రకారము 66 తరగతుల మున్సబ్‌దారులు ఉండేవారని తెలియచేయుచున్నది. ఈ స్థాయిలు 10 మంది సైనికులు నుండి 10,000మంది సైనికుల వరకు ఉండేవి. 5,000లోపు జూట్ సవారీ సంఖ్య గల మున్సబ్‌దారులను 3 రకములుగా వర్గీకరించిరి.

1. జూట్, సవారీ సంఖ్య సరిసమానముగా వుంటే మొదటి వర్గం.

2. జూట్‌ల సంఖ్యలో సవారీలు సగము లేదా సగముకన్నా ఎక్కువ వుంటే రెండవ వర్గం.

3. జూట్ సంఖ్యలో సవారీల సంఖ్య సగము కన్నా తక్కువ వుంటే 3వ వర్గము. సవారీల సంఖ్య జూట్ సంఖ్యకు సగము గాని, సగముకన్నా తక్కువ గాని ఉండాలి. ఎటువంటి పరిస్థితులలోను ఎక్కువ సంఖ్యలో ఉండవు.

పై మూడు తరగతులు మున్సబ్‌దారీ లో వారి స్థాయిని బట్టి జీతములు ఉండేవి. మొదటి తరగతికి రెండవ తరగతికి వారి కన్నా రెండవ తరగతి వారికి మూడవ తరగతి వారికన్నా ఎక్కువ జీతములుండేవి.

సవారీల విషయంలో ప్రత్యేక లక్షణం ఉండేది. 10 సవారీ సంఖ్యకు 20 కానీ, 22 కానీ గుర్రాలను మున్సబ్‌దారీ నిర్వహించేవాడు. దీనికి దాభిష్టి విధానం అనేవారు. 10-20 నిష్పత్తితో సవారీలు అశ్విక సంఖ్య ఉన్నంతవరకూ మొఘల్ సైన్యం చాలా శక్తివంతంగా వుండేది.

మొఘలుల కాలంలో మిశ్రమజాతి, మతసైన్యములను నిర్వహించేవారు. నిర్ధారిత సంఖ్యలో సైన్యమును కలిగి ఉండేవారు. మొఘలుల సైన్యంలో ఇరానీ, తురానీ మొఘలులు, భారతీయ ముస్లింలు, రాజపుత్రులు వుండేవారు. ఇది జాతిపరమైన భావనకు పటాపంచలు చేసి ఐకమత్యంను సాధించిరి. కొన్ని ప్రత్యేక సంధర్భాలలో మొఘల్, రాజుపుత్ర మున్సబ్‌దారులు వారి వారి సైనికులను ఏకజాతీయముగా సమకూర్చుకొనెడివారు. తరువాత కాలంలో మిశ్రమ సైనిక విధానం సాధారణముగా మారినది. సవార్‌ను నియమించేటప్పుడు ఉన్నత ఉద్యోగులచే చాలా జాగ్రత్తలు తీసుకొనెడివారు. అనగా అనుభవమునకు ప్రాధాన్యత ఇచ్చేవారు. వారు రక్షణకు సరిపోతారని నిర్ధారించుకొనేవారు. సైనికులకు సంబంధించిన అన్ని వివరాలు నమోదుచేసేవారు. (చేరం) గుర్రాలకు ముద్రలు వేయుట ద్వారా ప్రత్యేక గుర్తింపును ఏర్పాటు చేసేవారు (దాగ్) నిర్ధారిత కాలంలో తనిఖీలు నిర్వహించేవారు.

ఐనీ అక్బర్ జీతాలు విధానంను గూర్చి వివరించుచున్నది. మున్సబ్‌దారులే జీతము, జాగీరును నిర్వహించి, గజదళంను, ఒంటెల దళంను, గాడిదలను, బళ్ళను నిర్వహించెడివాడు. వీటి ద్వారా సైనికులకు రవాణా చేసెడివాడు. మొఘలుల పాలనలో మున్సబ్‌దారులకు జీతములు ఎక్కువగానే చెల్లించెడివారు. 100 సైనికులు గల మున్సబ్‌దార్ నెలకు రూ.500/-, 1000 సైనికుల గల మున్సబ్‌దారుకు నెలకు 8,200/- 5000 సైనికుల గల మున్సబ్‌దారుకు రూ.30,000/- చెల్లించేడివారు. మున్సబ్‌దారులు, జాగీరుల రూపములోను, ధనరూపములోను చెల్లించబడెడివాడు.

జహంగీర్, షాజహాన్ కాలంలో మున్సబ్‌దారీ విధానంలో కొన్ని మార్పులు చేయబడినవి. జహంగీర్ దు-అస్పా, షి-అస్పా విధానమును ప్రవేశపెట్టెను. అనగా 2 లేదా 3 గుర్రములను ఒక సైనికుడు కలిగి వుండుట. ఈ విధానంలో ప్రత్యేకంగా ఎంపిక చేయబడిన రాజకుటుంబీకులు మాత్రమే ఈ రకమైన సైన్యంను నిర్వహించెడివారు. వీరి వద్దగల జూట్ సంఖ్యను పెంచేవారు కాదు. దు-అస్పా, షి-అస్పా సైన్యంగల మున్సబ్‌దారు రెండురెట్లు సైనికులకు చెల్లించబడెడివాడు. దీనికి వారికి కేటాయించిన సవార్ సంఖ్యను ఆధారంగా భావించెడివారు. జూట్ సంఖ్య 3000, సలార్ దు-అస్పా, షి-అస్పా 3000 కల మున్సబ్‌దారు 6000 సైన్యంను నిర్వహించవలసి ఉండేది. ఇది సవార్ సంఖ్యలో భాగమే అంతకన్నా ఎక్కువ కాకూడదు.

షాజహాన్ కాలంలో ప్రత్యేక ఆంక్షలు (ముహ్‌రత్) హోదాను జూట్, సవారీ హోదాలను సమకూర్చేవారు. ఈవిధమైన హోదాలను ప్రత్యేక అధికారులైన పౌజ్‌దార్ లేదా ఖిలాదార్‌లకు ఇచ్చేవారు. అతని విధులను సమర్ధవంతంగా నిర్వహించుటకు అతని వద్ద వున్న సైన్యానికి అదనంగా కొంత సైన్యం ఇచ్చేవారు. దీనికి అదనపు జాగీరును కేటాయించేవారు. ఆ పద్ధతిలో కొనసాగేవరకు మాత్రమే ఈ విధమైన ఏర్పాటు చేసేవారు.

షాజహాన్ కాలంలో కొన్ని సైనిక సంస్కరణలు ప్రవేశపెట్టెను. ఒకే మున్సబ్‌దారు సైన్యంలో 25% తగ్గినప్పటికీ పూర్తి సైన్యమునకు జీతం పొందేవారు. దీనిని నివారించుటకు కనీస శాతం సైన్యాన్ని నిర్ధారించెను. అబ్దుల్‌ల హోరీ అభిప్రాయంలో రాష్ట్రంలో తన జాగీరులో పనిచేయుచున్న మున్సబ్‌దారు 1/3 సవారీ అదనముగా నిర్వహించాలి.

రాష్ట్రము వెలుపల నియమిస్తే 1/4 సవారీను బల్క్, బదాక్షన్‌లలో అయితే 1/5 సవారీను నిర్వహించాలి.

షాజహాన్ కాలంలో మరియొక ప్రధాన అంశము. మున్సబ్‌దారీ విధానంను నెలకు ప్రమాణము అనగా జాగీరు యొక్క ఆదాయం అంచనాను వాస్తవంగా వసూలు అయిన మొత్తంను చూసి తేడాను బట్టి మున్సబ్‌దారు నిర్వహించవలసిన సైన్యంను, గుర్రాలను తగ్గించెను. మున్సబ్‌దారుల జీతంలు నెలవారి ప్రాతిపదికన చెల్లించేవారు. 10 నెలలకు, 8 నెలలకు అంతకు తక్కువ కాని దీని ప్రకారం వారు నిర్వహించవలసిన సవారీ సంఖ్యను కుదించిరి. దీనివలన 3000, 3000 సంఖ్యగల మున్సబ్‌దారు 1000 సవారీ నిర్వహించేవాడు కానీ 1/3 వంతు అనగా 2,200 నిర్వహించాలి. దీనిని అక్బర్ ప్రవేశపెట్టెను. 10 నెలల జీతంలో ఉంటే అతను 1800 గుర్రాలకు 6 మాసాల జీతం అయితే 1,100 గుర్రాలను నిర్వహించాలి. ఈ నెలవారి చెల్లింపులు జాగీరులకు, నగదు చెల్లింపులకు కూడా వర్తించేది. ఈ విధముగా సవారి సంఖ్య తగ్గించుట వలన షాజహాన్ కాలంలో అశ్వికదళ సామర్థ్యం సంపూర్ణంగా దెబ్బతిన్నది.

మున్సబ్‌దారీ విధానము ఉన్నతాధికార వర్గముగా మారినది. వారు తరగతులుగా విభజించబడిరి. బదిలీలు, సంక్షిప్తత లక్షణాలు కలిగినది. దీనిలో వివిధ రకాల కులాలు, భాషలవారు చేరి జాతులకు మతాలకు అతీతమై పేదవాడు కూడా ఉన్నత స్థాయికి ఎదిగేటట్లు అవకాశములు ఉండి, సంపూర్ణముగా చక్రవర్తి అజమాయిషీలో ఉండేది.

## 46.సి పాఠ్య ప్రశ్నలు

1. మొఘలుల కాలంలో మున్సబ్‌దారీ పదం ఏమిటి సూచించుచున్నది. రాజ్యము విషయంలో మున్సబ్‌దారు పాత్ర ఏమిటి?

2. ఏ సైనిక నిర్వహణ నుండి మున్సబ్‌దారీ విధానం గ్రహించబడినది?

3. ఖాళీలను పూరించుము.

ఎ) ______________ మరియు ______________ చే మొఘల్ మున్సబ్ పాత్ర నిర్వహణ చేయబడెడిది.

బి) గుర్రమెలను గుర్తించుటకు వాడిన రాజముద్ర ______________ సైనికులు వివరములు తెలియజేయు రిజిస్టరు ______________ మొఘలుల కాలంలో నిర్వహించేవారు.

సి) జహంగీరు కాలంలో ప్రవేశపెట్టిన 2 లేదా 3 గుర్రములను విధానమును ______________ అని పిలిచెడివారు.

**సారాంశం :**

భారతదేశంలో తురుష్క సుల్తానులు స్వతంత్ర రాజ్యాధిపతులు కానీ సూత్రప్రాయంగా వారికి ఖలీఫా అధిపతి. రాజ్యమంతా ఇస్లాం ప్రపంచంలో ఒక భాగం తురష్కపాలకులు ఖలీఫా గుర్తింపును కోరేవారు.కారణం సాధారణ ముస్లింల దృష్టిలో బలం పుంజుకొనుటకు ఇతర ముస్లిం రాజ్యాలలో దౌత్యసంబంధాలు సమానత్వ ప్రాతిపధికపై ఏర్పాటు చేసుకొనుటకు. వారి సింహాసనములను పదిలపరచుకొనుటకు కావలసిన సహాయం సంప్రదాయ ముస్లింల నుండి ఉలేమాల నుండి పొందుదురు.

సుల్తాన్ తనచేత నియమించబడి తన కరుణ, దయ వున్నంతవరకూ పదవిలో ఉండే మంత్రులను కలిగి ఉండేవారు. కేంద్ర, ప్రభుత్వంలో ముఖ్యమైన వ్యక్తి వజీర్. ఇతను ఆర్ధిక శాఖకు బాధ్యుడు. (దివాన్–ఇ–వజీరత్) ఇతను ఆదాయం, భూమిశిస్తులను చూచెడివాడు. ఇతని తరువాత దివాన్–ఇ–అరిజ్. రక్షణవాఖ దీనిని అరిజ్–మామలిక్ నాయకత్వం వహించెడివాడు. ఈ శాఖ ముఖ్య విధులు సైన్యం ఎంపిక చేసుకొనుట జీతములిచ్చుట, ఆయుధములు సమకూర్చుట. మరియొక శాఖ దివాన్–ఇ–రసాలత్ మత విషయములు చూసేవాడు. దీనికి ముఖ్య సాదర్ అధిపతి. ఇతనే ఖాజీగా నడిపెడివాడు. దివాన్–ఇ–ఇన్సా, అమీర్మున్సీ ఆధిపత్యములో రాజ్య ఉత్తర ప్రత్యుత్తరములను నిర్వహించేది.

సుల్తాన్ సర్వ సైన్యాధ్యక్షుడు. బాల్బన్ సైన్యానికి ప్రాధాన్యతను ఇచ్చెను. అల్లాఉద్దీన్ ఖిల్జీ జాగీరు బదులుగా సైన్యానికి జీతాలు ఇచ్చిన మొదటి సుల్తాన్. సుల్తాన్ రక్షణ శాఖలో కాల్బలం, అశ్వికదళం, గజబలం, కోటలు ప్రధానమైనది. క్రమశిక్షణ, సమర్ధవంతమైన గూఢచార వ్యవస్థ సైన్యంలో పాటించెడివారు.

మొఘల్ చక్రవర్తులలో అక్బర్ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నిర్వహణలో ప్రత్యేక శ్రద్ధ వహించెను. ఢిల్లీ సుల్తానుల కేంద్ర ప్రభుత్వ పునాదులపై మొఘులుల కేంద్ర ప్రభుత్వమును నిర్వహించెను. అక్బర్ జాగ్రత్తగా దీనిని పునర్నిర్మాణం చేసెను. దీని కొరకు శాఖల మధ్య అధికారాలను విభజించెను. వాటిపై ఆంక్షలు ప్రవేశపెట్టెను. వకీలు పదవికి అన్ని అధికారాలు ఉన్నప్పటికి అది అలంకార ప్రాయంగా మారినది.

మొఘులుల కాలంలో మంత్రులు వకీలు తరుపున బాధ్యతలు నిర్వహించేవారు. నలుగురు మంత్రులు నాలుగు స్తంభాలుగా గుర్తించబడిరి. వారు 1. దివాన్ లేదా దివాన్–ఇ–కుల్ ఇతనిని వజీర్ అని పిలిచెడివారు. ఇతను భూమిశిస్తు ఆర్ధిక శాఖలను నిర్వహించేవాడు.

2. మీర్బక్షి రక్షణ శాఖను నిర్వహించేవాడు.

3. సాదర్ మతపరమైన, న్యాయశాఖను నిర్వహించేవాడు.

4. మీర్సుమన్ పరిశ్రమలు, మార్కెట్లు నిర్వహించేవాడు.

అక్బరు సామ్రాజాన్ని 12 సుబాలుగాను, సుబాలులను సర్కారులుగాను, సర్కారులను రగణాలుగా, ఫరగణాలు గ్రామాలుగా విభజించెను. వాటికి ప్రత్యేక అధికారులను నియమించి, సమర్ధవంతముగా పాలించెను.

అక్బరు సమర్ధవంతమైన సైన్యంను నిర్మించాలని అభిప్రాయపడెను. దీని ద్వారా సామ్రాజ్యాన్ని విస్తరింపచేయాలని భావించెను. దీని కొరకు మున్సబ్దారీ విధానంను ప్రవేశపెట్టను. దీని ద్వారా ప్రతిపనికి అధికారిని నియమించెను. (మున్సబ్) హోదాను జూట్, సవారీ అని విభజించెను. జూట్ వ్యక్తి గత హోదాను గౌరవాన్ని జీతభత్యాలను నిర్ణయించెను. సవార్ సైనికుల సంఖ్యను నిర్ధేశిస్తుంది. సైనికుల వివరములలో (చేరా) అను రిజిస్టరు ద్వారా నిర్వహించబడేది. గుర్రాలు వర్గీకరణ (దాగ్) పద్ధతిలో వర్గీకరించబడేవి. దీనికి రాజముద్ర వేయబడెడిది. ప్రతి మున్సబ్దారు నిర్ణీత కాలంలో తనిఖీ నిమిత్తం సైన్యంను తీసుకురావలసి ఉండేది. కొద్దిపాటి మార్పులతో జహంగీర్, షాజహాన్లు ఈ సైనిక పాలనా విధానంను నిర్వహించిరి.

## అభ్యాసం

1. భారతదేశంలో అధికార స్థాపన ప్రారంభంలో ఢిల్లీ సుల్తానులు ఎదుర్కొనిన సమస్యలు ఏవి?
2. రక్షణ నిర్వహణకు బాల్బన్, అల్లాఉద్దీన్ ఖిల్జీ తీసుకువచ్చిన ప్రధాన మార్పులు ఏమిటి?
3. సాదర్ అధికారాలు తగ్గించుటకు అక్బర్ చేపట్టిన కార్యక్రమములు ఏవి?
4. అమీర్ గుజార్ ఎవరు? మొఘలుల రాష్ట్ర పరిపాలనలో అతని పాత్ర ఏమిటి?
5. అక్బర్‌చే ప్రారంభించబడిన మొఘలుల మున్సబ్‌దారీ విధానంలోని ముఖ్య అంశాలు ఏవి?
6. మొఘలుల కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల నిర్వహణ వివరించుము.

**జవాబులు**

### 46.ఎ

సూత్రప్రాయంగా - ఖలీఫా

వాస్తవ ప్రక్రియలో - సుల్తాన్

2) ఢిల్లీ సుల్తానుకు సహాయపడిన మంత్రులు

1. వజీర్ 2. అరిజ్-ఇ-మమాలిక్ 3. సాదర్-ఉస్-సాదర్

4. దివాన్-ఇ-ఇన్షా 5. బారిద్-ఇ-మామలిక్

3) అల్లాఉద్దీన్ ఖిల్జీ

### 46.బి

1.మైనర్ అయిన చక్రవర్తి తరుపున వకీలుగా సార్వభౌమాధికారాన్ని ప్రదర్శించి, ప్రధానశక్తిగా అవతరించెను.

2. రాష్ట్రము (సుభా)

సర్కార్

పరిగణా, గ్రామములు

3) భూమిశిస్తు వసూలు చేయు శాఖ

### 46.సి

1. మున్సబ్ అనగా హోదా లేదా స్థానంను కలిగి రాజ్యములోను సమాజంలోను హోదా కలిగిన వ్యక్తి మున్సబ్‌దారు ఖచ్చితమైన సంఖ్యలో సైన్యంను, గుర్రాలను, ఆయుధాలలోను విధిగా నిర్వహించవలసి వున్నది.

2) మున్సబ్‌దారీ విధాన మూలం ఢిల్లీ సుల్తానుల, చెంగిజ్ మంగోలుల దశాంశ పద్ధతిలోని సైనిక నిర్వహణలో ఉన్నది.

3) ఎ. జూట్, సవారీ

బి. దాగ్, చేరా

సి. దు-అస్పా-హి-అస్పా

# 47

# ఢిల్లీ సుల్తాన్, మొగలుల కాలంనాటి సామాజిక, ఆర్థిక జీవనం

## 47.1 పరిచయము :

ఢిల్లీ సుల్తాన్‌ల, మొగలుల కాలంనాటి పాలన, సైనిక వ్యవస్థలను గురించి గత పాఠంలో అధ్యయనం చేయుట జరిగినది. ప్రస్తుత పాఠంలో మధ్యయుగ భారతదేశ సామాజిక, ఆర్థిక వ్యవస్థలను గురించి తులనాత్మక అధ్యయనం చేద్దాము.

ముందుగా సామాజిక జీవనంను చూచిన ఢిల్లీ సుల్తాన్‌లు, వారి అధికార గణం అత్యంత సుఖఃవంతమైన జీవనమును గడిపిరి. ఇక మొగలుల కాలంలో పాలకవర్గ జీవనం అత్యంత విలాసవంతముగా సాగినది. సమాజంలో ఉన్నత వర్గంతో పోల్చినచో సామాన్య ప్రజల జీవనం నిరాడంబరంగా ఉండెను. ఈ రెండు వర్గాల జీవనశైలిలో వ్యత్యాసం అధికంగా ఉండెను. ఈ అధ్యాయంలో నాటి సామాజిక సాంప్రదాయాలను, ఆచార వ్యవహారాలను గురించి కూడా తెలుసుకొనవలెను.

ఈ పాఠం రెండవ భాగంలో ఢిల్లీ సుల్తాన్, మొగలుల కాలంనాటి ఆర్థిక జీవనంను తెలుసుకొనవలెను. కాని నాటి ఆర్థిక జీవనంను సమగ్రంగా తెలుసుకొనుటకు కావలసిన సమాచారం పూర్తిగా లభించకపోవుట దురదృష్టకరం. అయినను నాటి ధరలు, జీతాలు, వర్తక, వ్యాపారాలను గురించి లభించిన సమాచారంను తెలుసుకొనెదము. 17వ శతాబ్ది ప్రధమ భాగంలో వర్తకములో గణనీయమైన ప్రగతి సాధ్యపడెను. మొగులుల కాలంనాటి కొన్ని వ్యాపార వర్గాలు ప్రపంచములోనే అత్యంత సంపన్నమైనవని చెప్పవచ్చును. ఈ పాఠంలో ఢిల్లీ సుల్తాన్‌ల, మొగలుల కాలంనాటి భూమిశిస్తు విధానాలను గురించిన సమాచారమును కూడా చేర్చుట జరిగెను.

## 47.2 లక్ష్యాలు

ఈ పాఠ్యాంశమును అధ్యయనం చేయుట ద్వారా క్రింది అంశాలు తెలుసుకుంటారు.

1. ఢిల్లీ సుల్తాన్‌ల కాలమునాటి సామాజిక జీవనమును, ప్రత్యేకముగా సుల్తాన్, ఇతర ఉన్నతవర్గం, రైతాంగము, బానిసల స్థితిగతులు.
2. మొగలాయిల కాలమునాటి సామాజిక జీవనము, ప్రత్యేకముగా చక్రవర్తి, ఇతర ప్రముఖువర్గము, మధ్య తరగతి,

క్రింది వర్గంనకు చెందిన ప్రజల జీవనవిధానం

3. సామాజిక సాంప్రదాయాలను, సంస్కారాలను, విద్యావ్యవస్థను తెలుసుకొనెదరు.

4. ఈ కాలంనాటి ధరలు, వేతనాలు గురించిన అవగాహన

5. వర్తక వ్యాపారాల ప్రగతి

6. భూమిశిస్తు వసూళ్ళలో, విధానాలలో సంబంధించిన మార్పులు

7. పెద్ద మొత్తంలో ధనంను తీసుకొని వెళ్ళుటకు బదులుగా నిర్ణీత కాలానికి చెల్లుబడి అగు విధంగా జారీచేసిన పత్రాలు హుండీలు అను పేరుతో చలామణిలో ఉండుట

8. వర్తక వ్యాపారాలు ప్రగతి ఫలితంగా దేశంలో అనేక ఐరోపా వ్యాపార కంపెనీలు తమ ఫ్యాక్టరీలను భారతదేశంలో నెలకొల్పినవి కాలక్రమంగా ఈ కంపెనీలు దేశంలో కొన్ని ప్రాంతాలను తమ ఆధీనంలోనికి తీసుకొని క్రమంగా రాజకీయ శక్తులుగా బలపడినవి. తుదకు బ్రిటీష్ తూర్పుఇండియా వర్తక సంఘం దేశములో మొగలుల అధికారానికే ముగింపు పలికినది.

## 47.1 ఢిల్లీ సుల్తాన్‌ల యుగములో వ్యవసాయ భూమి నాలుగు రకాలుగా వర్గీకరింపబడియుండెను

i. ఖాల్సా భూమి లేదా సుల్తాన్ భూమి

ii. ఇక్తా భూమి

iii. భూస్వాముల అధీనములో గల భూమి

iv. వక్ఫ్ లేదా ఇనామ్ భూమి

2. ఈ కాలంలో భూమిశిస్తు వేరుగా ప్రభుత్వమే వసూలు చేయు విధానంను అల్లాఉద్దీన్ ఖిల్జీ ప్రవేశపెట్టెను. ఈ శిస్తును ధనరూపంలో కాక, ధాన్య రూపంలో వసూలు చేసెడివారు.

3. రాజ్యములో పంటల వివరాలను తెలియచేయుటకు కొనుగోలు అను అధికారులను అక్బర్ చక్రవర్తి నియమించెను. స్థానిక పరిస్థితుల పై పూర్తి అవగాహన గల 'కొనుగోలు అధికారులు' వంశపారంపర్యంగా కొనసాగెడివారు.

4. అక్బర్ కాలమునాటి సాగుభూమి నాలుగు రకాలుగా వర్గీకరించబడెను. అవి పోలజ్, పరౌటి, ఛాచర్, బంజర్

**సెక్షన్ – 1**

## 47.3 ఢిల్లీ సుల్తాన్‌ల యుగము :

**(ఎ) సుల్తాన్ మరియు ప్రభువర్గము :**

సమాజంలో సుల్తాన్ మరియు ఇతర పాలక వర్గం స్వాధికార వర్గంగా ఉండిరి. రాజ్యానికి సుల్తాన్ సర్వాధికారి ఇతనికి రాజకీయ, సైనిక వ్యవహారంపై పూర్తి అధికారం కలదు. ఇతడు సర్వ సైన్యాధికారి, సర్వోన్నత న్యాయాధికారి. సుల్తాన్

విలాసవంతమైన జీవతంను గడిపెడివాడు. సుల్తాన్‌లు ఖరీదైన దుస్తులు ధరించి, మద్యపానంను సేవించుచూ తమ కాలాన్ని గడిపెడివారు. సుల్తాన్‌ల విలాసవంతమైన జీవనమును తెలియచేయు అనేక ఆధారాలు కలవు. బాల్బన్ దర్బార్ చూపలరులను అశ్చర్యపరచుచు వారి హృదయాలను కొల్లగొట్టెడిది. మహమ్మద్ బిన్ తుగ్లక్ ప్రతి సంవత్సరం తన అధికారులను ఘనంగా సత్కరించెడివాడు. దాదాపు ప్రతి ఢిల్లీసుల్తాన్ తమ వైభవంను తగిన రీతిలో ప్రదర్శించుటకు ప్రయత్నించెడివారు. రాజఅంతఃపుర స్త్రీలు కూడా విలాస జీవనంను గడిపెడివారు. వీరికి సేవలందించుటకు అనేకమంది పరివారం ఉండెడివారు. వారికి వేరువేరుగా భవనాలు ఉండెడివి. హిందూ పాలకుల వలె ఢిల్లీసుల్తాన్‌లు కూడా ఎవరికి వారు స్వంత భవనాలను నిర్మించుకొనెడివారు. ఉన్నతాధికారులు కూడా సుల్తాన్‌ల వలెనే స్వంత భవనాలను కలిగి ఉండెడివారు. వీరందరూ సమాజములో అత్యున్నత స్థానంను, హోదాలను కలిగి ఉండిరి. వీరికి అనేకమంది సేవకులు, బానిసలు, సేవలందించెడివారు. వీరే కాక రాజ్యములోని అనేకమంది అధిపతులు, సైనిక వర్గాల నాయకులు, బ్యాంకర్లు కూడా సౌకర్యవంతమైన జీవనం సాగించిరి. వీరిలో కొద్దిమంది మాత్రం కళలను, సాహిత్యాన్ని పోషించిరి.

ఈ కాలంలో అనేకమంది రాకుమారులు, ఉన్నతాధికారులు గొప్ప సాహిత్య అభిరుచిని కలిగి ఉండిరి. వీరిలో అత్యంత ముఖ్యుడు బాల్బన్ కుమారుడైన యువరాజు మహమ్మద్‌ను చెప్పవచ్చును. ఇతడే ప్రసిద్ధికవి అమీర్‌ఖుస్రూను పోషించెను. కాని అల్లాఉద్దీన్ ఖిల్జీ కాలంలో రాజ్యంలోని ఉన్నత వర్గాలను పూర్తిగా అదుపుచేసెను. మహమ్మద్ బీన్ తుగ్లక్ కాలంలో సుల్తాన్ సామ్రాజ్యం సువిశాలంగా విస్తరించుట వలన ఉన్నత అధికారుల సంఖ్య పెరిగి వారి జీతభత్యాలు గణనీయంగా పెరిగినవి. తుగ్లక్ కాలంనాటి వజీరు ఆదాయం ఇరాక్ రాజ్యపాలకుని ఆదాయం కన్నా అధికంగా ఉండెను. ఫిరోజ్‌షా తుగ్లక్ కాలంనాటి వజీరు వార్షిక ఆదాయం 15 లక్షల టంకాలుగా ఉండెడిది. ఇతని కాలంలో నలుగురు సభ్యులు గల ఒక కుటుంబం నెలకు 5 టంకాల ఆదాయంతో జీవనంను సాగించెడిరి.

సుల్తాన్‌ల కాలంలో అధికార వర్గం కాక నగరాలలో ఉలేమాలు, షేక్‌లు, సూఫీలు, పండితులు, యోగులు మొదలగు వర్గాలు కూడా ఉండెడివి. వీరందరు సమాజంలో మేధావి వర్గంగా గుర్తింపుపొందిరి. వీరిలో ఉలేమాలు, సూఫీలు మొదలగు వారిని పాలక వర్గం తమ ప్రయోజనాలను పరిరక్షించుకొనుటకు ఎక్కువగా వినియోగించుకొనిరి. కాని అల్లాఉద్దీన్ ఖిల్జీ, మహమ్మద్ బీన్ తుగ్లక్ కాలంలో ఉలేమాల ప్రాధాన్యత పూర్తిగా అదుపు చేయబడెను.

**(బి) రైతాంగము :**

ఢిల్లీసుల్తాన్‌ల కాలంనాటి సమాజంను ప్రధానంగా రెండు వర్గాలుగా విభజించవచ్చును. అవి ఏవనగా స్వాధికార వర్గము, స్వాధికార రహిత వర్గం. వీరిలో స్వాధికార వర్గంలో సంఖ్య స్వల్పం. ఈ వర్గంలో ప్రభు కుటుంబీకులు, ఉన్నతవర్గ కుటుంబాలు, రాణాలు, ఠాకూర్‌లు మొగలగు వారు ఉండెడివారు. వీరిందరికి ఉలేమాల, పండితుల సహకారం ఉండెడిది. పాలక వం౦ విశేష అధికారాలు కలిగి ఉండెడిది. వీరికి అనేక హక్కులు ఉండెడివి. విశేష రాయితీలను కలిగి ఉండిరి. ఇక స్వాధికార రహిత వర్గాన్ని గమనించిన యెడల వీరు రేయింపగళ్ళు కష్టపడెడివారు. వీరిని స్వాధికార వర్గము అమానుషంగా చూచెడిది. దురదృష్టవశాత్తు కులవ్యవస్థ హిందు సమాజాన్ని మరింత దిగజార్చినది. ఈ రెండు వర్గాల మధ్యగల తీవ్ర వ్యత్యాసాలను విదేశీ యాత్రీకులైన ఇబన్‌బటూటా, నికిటీన్(క్రీ.శ.1470 సం॥లో బహమనీ రాజ్యానికి సందర్శించిన రష్యా వ్యాపారి) రజాక్(క్రీ.శ.1443సం॥లో విజయనగర సామ్రాజ్యాన్ని సందర్శించిన పర్షియా రాయబారి) తమ రచనలలో వివరముగా తెలియచేసిరి. నాటి సమాజంలో బిక్షాటన సర్వసామాన్యం. దేశ జనాభాలో

బిక్షగాళ్ళు సంఖ్య అధికముగా ఉండెను. రాజ్య జనాభాలో అధికశాతము రైతాంగమే. కాని వీరి జీవనస్థితిగతులు సంతృప్తికరం ఉండెడిదికాదు. తమ పంటలో వీరు భూమిశిస్తే కాక, ముకద్దం మొదలగు అధికారులకు కూడా వాటాలు ఇవ్వవలసి వచ్చెడిది. వీరు ధనంను, ధాన్యంను అధికారులకు లంచాలుగా ఇచ్చెడివారు. రైతులు భూమిశిస్తుతో పాటు ఇంటిపన్ను, నీటి వనరులపై పన్ను, అమ్మకపు పన్ను మొదలగు అనేక పన్నులు చెల్లించెడివారు. గ్రామాధికారులైన ముకద్దంలు, చిన్న తరహా భూస్వాములు సుఖఃవంతమైన జీవనం గడపగా సామాన్య రైతాంగం మాత్రం దుర్భర జీవనమును సాగించిరి. ఢిల్లీ సుల్తాన్‌లలో సమర్థుడైన అల్లాఉద్దీన్ ఖిల్జీ మాత్రమే ఈ ముకద్దంలు, భూస్వాముల అధికారాలను చాలావరకు నియంత్రించెను. రైతుల కష్టాలను వీరు దోచుకొనుటను చాలావరకు నియంత్రించెను.

**(సి) బానిసలు :**

నగరాలలో బానిసలు, గృహ సేవకుల సంఖ్య అధికముగా ఉండెడిది. హిందూ, ముస్లిం వర్గాలలో ఈ బానిస వ్యవస్థ కొనసాగెను. బానిస విధానాన్ని అరబ్బులు, తురుష్కులు సైతం స్వీకరించిరి. సాధారణముగా యుద్ధ ఖైదీలను బానిసలుగా మార్చెడివారు. పశ్చిమ ఆసియాలో, ఇండియాలోను, బానిస మార్కెట్‌లు విరివిగా ఉండెడివి. ఖిల్జీ కాలంలో ఆర్థిక వ్యవస్థను క్రమబద్ధం చేసి బానిస ధరలను కూడా స్థిరీకరించెను. సుల్తాన్‌లు, ఉన్నత అధికారులు ఎక్కువ సంఖ్యలో బానిసలను కలిగి ఉండెడివారు. ఒక్క ఫిరోజ్‌షా తుగ్లక్ వద్దనే 1,80,000 మంది బానిసలు ఉండిరి. వీరికి విద్యాసదుపాయాలతో పాటు అన్ని విధముల వృద్ధిచెందుటకు కూడా శిక్షణలను ఇచ్చెడివారు. ఈ బానిసలలో కొందరు రాజ్యములో కీలక పదవులను చేపట్టిన సందర్భములు కూడా కలవు. తొలి ఢిల్లీసుల్తాన్ కుతుబుద్దీన్ ఐబక్ తొలుత బానిసగా జీవనము సాగించెనెనెడి విషయం ఇచ్చట గమనార్హం. బానిసలలో అనేకమంది రాజ ఖార్కానాలలో పదవులను నిర్వహించుటమే కాక సుల్తాన్‌లకు అంగరక్షకులుగా పనిచేసిరి. కాని కొన్ని సందర్భాలలో బానిసలను అమానుషంగా చూచుటకూడా జరిగెను. అరుదుగా బానిసలు వివాహాలు చేసుకొని స్వంత ఆస్తులను కలిగి ఉండెడివారు.

**(డి) కులవ్యవస్థ :**

హిందూ సమాజంలో బ్రాహ్మణులు, ఉన్నత హోదాలను కలిగి ఉండిరి. వీరు వ్యవసాయ కార్య కలాపాలను సైతము నిర్వహించెడివారు. క్షత్రియులు చెడును నిరోధించి మంచిని పరిరక్షించే వర్గంగా గుర్తింపు కలిగి ఉండిరి. వైశ్యులు వర్తక, వ్యాపార, వ్యవసాయ కార్యకలాపాలు చూచెడివారు. ఇక సమాజంలోని అన్ని వర్గాలకు సేవలందించుట శూద్రుల వంతు. శూద్రులు విద్యను అభ్యసించుటకు, వేదాలను అధ్యయనం చేయుటకు అవకాశము లేదు. వర్ణ ధర్మాలను ఉల్లంఘించుటను సమాజం నిరసించెను. క్రతువుల నిర్వహణ, సాంప్రదాయాల విషయాలలో సనాతన వ్యవస్థ యధావిధముగా కొనసాగెను. సనాతన వివాహ విధానంలో ఎటువంటి మార్పులేదు. వర్ణాంతర వివాహాలను సమాజం ఆమోదించలేదు.

**(ఇ) స్త్రీ స్థానం :**

సమాజంలో బాల్యవివాహాలు కొనసాగినవి. స్త్రీ భర్త సేవకే పరిమితం. రాజ్యంలోని వివిధ ప్రాంతాలలో ఆచరణలో గల సతీసహగమన సాంప్రదాయాన్ని గురించి ఇబన్‌బటూట తన రచనలలో వివరించెను. సతీసహగమనానికి సుల్తాన్ అనుమతి అనివార్యమని ఇబన్‌బటూట తెలిపెను. ఉమ్మడి ఆస్తి కాని విషయంలో హిందు వితంతువుకు ఆస్తిపై హక్కులు ఉండెడివి. ఉన్నత కుటుంబ స్త్రీలు ఫరదాలను ధరించెడివారు. ముస్లిం, హిందూ స్త్రీలు ఇరువురు ఈ పరదా పద్ధతిని

పాటించెడివారు. ఈ సాంప్రదాయం సమాజ హోదాగా మారిపోయెను. ఈ పద్ధతి స్త్రీలను పూర్తిగా పురుషులపై ఆధారపడు వర్గముగా మార్చెను.

## పాఠ్య ప్రశ్నలు 47.ఎ

1. సుల్తాన్‌ల కాలమునందలి ఉన్నత వర్గం స్వాధికార వర్గముగా గుర్తింపు కలిగి ఉండిరి అనుటకు ఒక ఉదాహరణను ఇవ్వండి?
2. బానిసగా జీవనం ప్రారంభించి సుల్తాన్ పదవి చేపట్టినదెవరు? ఢిల్లీ సుల్తాన్ల కాలంలో బానిసవ్యవస్థపై ఈ పరిణామం ఎటువంటి ప్రభావమును చూపెను?
3. సుల్తాన్‌ల కాలంలో మహిళలు ఎటువంటి దురాచారాలకు గురైరి?
4. ఢిల్లీ సుల్తాన్‌ల కాలంనాటి స్వాధికార, స్వాధికార రహిత వర్గాల వ్యత్యాసాలను తెలియచేసిన లిఖిత ఆధారాలు ఏవి?

## 47.4 మొగలుల కాలం :

### చక్రవర్తి, ఉన్నత వర్గం, మధ్యతరగతి మరియు క్రింది తరగతులు

మొగలాయి యుగంలో సామాజిక వ్యవస్థలో చక్రవర్తి, రాజకుటుంబీకులు, ఉమ్రా అను ఉన్నత వర్గం ఉన్నతులుగా చలామణిఅయిరి. వీరి తదనంతరము మధ్యతరగతి వర్గం సమాజంలో ముఖ్యులు. ఇక అట్టడుగు వృత్తిపనివారు, గృహ పనివారు, బానిసలు మొదలగు వారు కలరు. పట్టణ జనాభాలో వీరే అధిక శాతం.

### చక్రవర్తి స్థానం :

రాజ్యంలో చక్రవర్తి స్థానం తిరుగులేనిది. రాజ్యానికి సంబంధించిన అన్ని వ్యవహారాలలో ఇతనికి సర్వాధికారాలు ఉండెడివి. ఇతని జీవనశైలి అత్యంత ఆడంబరంగా ఉండెడిది. రాజకుటుంబీకులు అందరు ఉన్నత హోదాలు కలిగి విలాసజీవితంను గడిపెడివారు. రాజకుటుంబ సభ్యులందరికి వారి హోదాలను అనుసరించి భత్యములను పొందెడివారు. రాజు, ఇతర సభ్యులు వివిధ రకాల వినోదాలు, విలాసాలతో జీవనంను కొనసాగించెడివారు.

మొగలాయిల కాలంలో చక్రవర్తి ఆమోదంతో ఏర్పడిన బలమైన ఉన్నత పాలకవర్గం ఏర్పడెను. బాబర్, హుమాయూన్ కాలంలో అక్బర్ పాలన తొలిదశలో ఈ వర్గం అనేక జాతులతో కూడి రూపుదిద్దుకొనెను. వీరిలో మధ్యఆసియాకు చెందిన తురానియనులు, పర్షియాకు చెందిన ఇరానియన్‌లు, ఆఫ్ఘన్‌లు, భారతీయ ముస్లిం మొదలగు వారు ఉండిరి. 17వ శతాబ్దినాటికి మొగలుల అధికారం దక్కన్‌కు విస్తరించిన పిమ్మట ఈ వర్గములో మరాఠాలు, హైదరాబాదీలు, బీజాపూరీలు కూడా చేరిరి. వీరందరు దాదాపు చక్రవర్తుల స్థాయి జీవనంనే సాగించెడివారు. వీరుకూడా బానిసలను పోషించెడివారు. వీరిలో అనేక విశిష్ట లక్షణాలు ఉన్నను వారిలో వారికి పరస్పరం ఈర్ష్య , అసూయలు, హోదాలపై అసంతృప్తి, జాతుల ద్వేషం మొదలగు అవలక్షణాలు బలముగా ఉండెడివి. దాని ఫలితంగా వీరిలో అనేకమంది మితిమీరిన ఖర్చులు చేసి తీవ్ర ఆర్థిక ఇబ్బందులకు గురైరి. ఉన్నత పాలకవర్గంలో గల ఇటువంటి లోపాలు పాలనా విధానములో పలు ఇబ్బందులకు కారణమయ్యెను. పాలనలో అవినీతి, అలసత్వం సర్వసామాన్యముగా ఉండెను.

పాలనా ప్రమాణాలు క్రమముగా దిగజారినవి. ఈ లోపాలే చివరకు మొగలుల అధికారము బలహీనపడి పతనము చెందుటకు చాలావరకు దోహదపడినవి.

ఉన్నత అధికార గణం తదనంతరం ఈ వర్గంలో ప్రధానపాత్ర పోషించినది. భూస్వామ్య వర్గమైన జమీందార్లను దేశ్‌ముఖ్, నాయక్‌లు అని వివిధ పేర్లతో వ్యవహరించెడివారు. వీరు నిరుపయోగంగా గల భూములను సాగులోనికి తెచ్చి వాటికి యజయానులై వంశపారంపర్య హక్కులను అనుభవించెడివారు. గ్రామాలలో భూమిశిస్తులను వసూలు చేయుటలో వీరిదే ప్రధానపాత్ర. ఈ వ్యవస్థను తాలుక, లేక జమిందారి అని పిలిచెడివారు. కొన్ని సందర్భాలలో వీరు పండిన పంటలో 25శాతంను శిస్తుగా వసూలుచేసిరి. కాని జమీందారి వ్యవస్థలో జమీందార్ భూమికి యజమాని కాదు. భూమిశిస్తును సక్రమంగా చెల్లిస్తున్న రైతులను ఇతడు తొలగించలేడు. జమిందార్ తన భూములపై పనిచేయుచున్న రైతులతో సన్నిహిత సంబంధాలను సైతం పోషించెడివారు. వీరిలో కొందరు కోటలను నిర్మించుకొనిరి. కేంద్ర అధికార వ్యవస్థ ఈ జమిందారుల యెడల సంతృప్తికర విధానాన్ని అనుసరించినది. షాజహాన్ పాలనా కాలంలో ఉన్నత అధికార బృందము తమ హోదాలను పెంచుకొనుటకు జమీందార్లను, రైతులను సైతము పీడించిన విషయం గమనించతగినది.

మధ్యయుగ భారతదేశంలో వ్యాపారులు, వృత్తిపనివారు, వైద్యులు మొదలగువారు మధ్యతరగతి వర్గంగా పేర్కొనవచ్చును. నాటి యాత్రికుల రచనల ప్రకారం మొగలుల కాలములో వ్యాపార, ఆర్థిక వ్యవస్థలు అత్యంత పరిపుష్టస్థితిలో కలవని తెలియచున్నది. వ్యాపార సరళిననుసరించి వ్యాపార వర్గాలను షరాఫ్‌లని, గోవస్త, దలాల్ అని విభజింపబడియుండి బంజారులను వర్గం వస్తువులను వివిధ ప్రాంతాలకు రవాణా చేసెడివారు. సమకాలీన రచయితల సమాచారము ప్రకారం నాటి నగరాలు వ్యాపార వర్గాలతో నిండి ఆభరణాలు మొదలగు వస్త్రాలు, వివిధ రకాల పశువుల విక్రయాలతో రద్దిగా ఉండెడివి. వ్యాపార వర్గాలతో పాటు చేతివృత్తి కళాకారులు ప్రముఖముగా ఉండిరి. హకీములు, వైద్యులు, పండితులు, ముల్లాలు, న్యాయవాదులు మొదలగువారు సైతం ప్రముఖపాత్ర పోషించిరి. ఈ వర్గాలన్నింటిలో నాటి సమాజము నందలి మధ్యతరగతి వర్గము అత్యంత ముఖ్యపాత్రను పోషించినది.

ఇక సమాజంలో అట్టడుగు వర్గానికి చెందిన వారు సమాజములో అనేక కష్టాలను ఎదుర్కొనుచు దుర్భర జీవనంను గడిపిరి. వీరిలో ఎక్కువమంది చాలా నాసిరకపు వస్త్రాలతో తమ శరీరాన్ని కప్పుకొనెడివారు. వీరికి పాదరక్షలు సైతం విలాసవస్తువులే. అత్యంత తక్కువ ఆదాయానికి తోడు అనేక కరవు కాటకాలు వీరి జీవనశైలిని మరింత దుర్భరం చేసెను. వీరు తరచు అమీర్‌లు, ఇతర అధికారులచే అణిచివేతకు గురిఅగుచుండిరి. వీరిలో బేగార్లు అనువారు వెట్టిచాకిరి చేయుచు ఉన్నత వర్గ విలాసాలకు సాధనాలుగా వినియోగించబడిరి. ఈ వర్గము రాజకీయంగా ఎటువంటి ప్రాధాన్యతను కలిగి ఉండక నిర్లక్ష్యానికి గురైరి.

నాటి గ్రామీణ జీవనమును గమనించిన సంఘటితముగా పటిష్టమైన సామాజిక వ్యవస్థలతో కూడి యుండెను. గ్రామాలలో అధికశాతము ప్రజలు రైతులే. రైతులు, వృత్తిపనివారు ఎవరైనను గ్రామీణ వ్యవస్థలో కీలకపాత్ర పోషించెడివారు. గ్రామీణ వ్యవస్థలో కమ్మరులు, కంసాలి, క్షురకులు మొదలగు వారందరూ అత్యంత ఉపయోగకరమైన సేవలను అందించెడివారు. గ్రామ భూస్వామి లేదా జమిందార్ గ్రామములో ప్రముఖ స్థానంలో ఉండి ఉన్నతస్థాయి జీవనమును గడిపెడివాడు.

నాటి సామాజిక జీవనంలో కులవ్యవస్థ అత్యంత ప్రాధాన్యతను కలిగి ముఖ్యముగా హిందూమతంలో కులవ్యవస్థ నానాటికి కఠినతరమయ్యెను. నాటికి కులాలు అనేక ఉపకులాలుగా ఏర్పడినవి. కులాలకు అన్నింటికి మూలం సాంప్రదాయాలు ఒక్కటే అయినను ప్రతి కులానికి తమదైన క్రతువులు, ఆచార వ్యవహారాలు వాడుకలోనికి వచ్చినవి.

మొగల్ యుగంనాటి సామాజిక జీవనంలో గోచరించు లక్షణాలలో విశిష్టమైనదేమనగా హిందూ, ముస్లిం వర్గాలు ఒకరికి ఒకరుగా దగ్గరవడము. అక్బర్ చక్రవర్తి అనుసరించిన మతసహన విధానం, భక్తి ఉద్యమకారుల బోధనలు, సూఫీ బోధకుల కృషి ఫలితంగా హిందూ, ముస్లిం మతాలు చాలావరకు దగ్గరైనవి. దీని ఫలితంగా ఢిల్లీ సుల్తాన్‌ల యుగంతో పోల్చిన మొగలుల కాలంనాటి సామాజిక జీవనం ఔన్నత్యానికి మరింతగా దోహదపడి పాలకవర్గాలలో నైతికత పెంపొందుటకు దారితీసెను. ఈ కాలంలో పౌరులు మరింత సుఖఃవంతమైన జీవనంను గడిపినందువలన వివిధ రంగాలలో ప్రగతి సాధ్యపడి భారతీయ సంస్కృతి మరింత సుసంపన్నమగుటకు దోహదపడెను.

### (బి) సాంఘిక సాంప్రదాయాలు – ఆచారాలు :

చక్రవర్తులు, ఉన్నత పాలక వర్గము తమ ఆదాయంలో అధిక మొత్తాన్ని దుస్తుల కొరకు వెచ్చించెడివారు. సమాజంలో వ్యక్తుల హోదాల, స్థాయిలననుసరించి దుస్తులను ధరించెడివారు. కాని బీదవారు నాణ్యమైన దుస్తులను పొందలేని స్థితిలో ఉండిరి. ఇక సాంప్రదాయాలను పరిశీలించిన పరస్పరం అభివాదము చేసుకొనుట ప్రధానంగా కనిపించును. పెద్దలను గౌరవించుట, స్నేహాన్ని గౌరవించుట, యజమానికి విధేయత, చిన్నవారిపై దయచూపుట నాటి సమాజ విలువలను తెలియచేయుచున్నవి. ఆహార పద్ధతులను పరిశీలించిన అనేక భిన్న పద్ధతులలో ఉండెడివి. హిందూ, ముస్లిం వర్గాలలోని ఉన్నతులు ఖరీదైన ఆహారం తీసుకొనెడివారు. మొగల్ చక్రవర్తుల అత్యంత సుస్థిరమైన ప్రభుత్వాన్ని అందించుట వలన సామాజిక భద్రత సాధ్యమై ప్రజా జీవనం ప్రశాంతంగా సాగినది. ఉన్నత వర్గాల కుమారులు కత్తిసాము, గుర్రపుస్వారి, మల్లవిద్యలు, వివిధ రకాల ఆయుధాల వాడుకలో శిక్షణలను తీసుకొనెడివారు. నాటి క్రీడలలో చదరంగం, జూదం ప్రధానమైనవి. గ్రామాలలో గ్రామీణులందరూ సాయంత్రపు సమావేశాలను జరుపుకొనెడివారు. కోడిపందాలు, ఎడ్ల పందాలు మొదలగునవి అత్యంత ప్రజాధరణ కలిగిన బహిరంగ క్రీడలు.

వివిధ రకాల ఉత్సవాలు, పండుగలు మొగలుల కాలం నాటి ఆర్ధిక, సామాజిక జీవనంలో ప్రధాన అంశాలుగా పేర్కొనవచ్చును. ఇవి మత ప్రయోజనాలనే కాక వినోదాత్మక కార్యక్రమాలుగా ప్రజలకు ఉపయోగపడినవి. నౌరోజ్, ఈద్ మహ్మదీయులకు హోళి, దీపావళి, దసరా, బసంత్ దుర్గాపూజ హిందువులకు ముఖ్య పండుగలు. చక్రవర్తులు, ఉన్నత అధికారులు ఈ పండుగల వేడుకలలో పాల్గొనెడివారు. ఈ పండుగలే కాక చక్రవర్తి, రాజకుమారుల జన్మదిన వేడుకలు మొదలగునవి వైభవంగా జరిగెడివి. సామాన్య ప్రజానీకమంతా ఈ వేడుకలలో పాల్గొనెడివారు. భారతీయ సామాజిక జీవనంలో ఈ కార్యక్రమాలన్నీ ప్రధాన భూమికను పోషించినవి.

### (సి) విద్య :

కుల వ్యవస్థనందలి దృఢవైఖరి ఫలితముగా ఈ కాలములో విద్య సమాజంలో అధిక సంఖ్యాకులకు అందుబాటులో లేదు. విద్య కేవలం ఉన్నత కుటుంబీకులకే అందుబాటులో ఉండెను. నాటి ఆర్థిక ఇబ్బందులు సైతము విద్యా ప్రయోజనాలను బీదలకు చేరువకాక పోవుటకు ఒక ముఖ్య కారణమని చెప్పవచ్చును. పురోహిత వర్గానికి విద్య అనివార్యమయ్యెను. మిగిలిన వర్గాల ప్రజలకు ప్రాథమిక పరిజ్ఞానమును విద్య అందించెడిది. వ్యాపారము, వర్తకులు,

దుకాణదారులు, గ్రామపెద్దలు, వడ్డీ వ్యాపారులు తమ పిల్లలను విద్యావంతులను చేయుటకు ఉత్సాహం చూపెడివారు. విద్య ప్రాధాన్యతన హిందూ, ముస్లిం వర్గాలు రెండూ గుర్తించినవి. ఈ విధంగా ఎన్ని లోపాలుఉన్నను మధ్యయుగంలో విద్యకు విశేష ప్రాధాన్యత పెంపొందినదని చెప్పవచ్చును.

మొగల్ కాలంలో ఏకీకృతమైన ప్రణాళికబద్ధమైన విద్యావ్యవస్థ లేదు. విద్యా వ్యాప్తికొరకు ప్రత్యేక ప్రభుత్వ శాఖలేదు. విద్యాసంస్థలను చాలావరకు ప్రవేట్ వ్యక్తులే నిర్వహించెడివారు. ముస్లిం విద్య కొరకు మక్తాబ్‌లు, మదర్సాలు, హిందూ విద్యకొరకు పాఠశాలలు, విద్యాపీఠాలు ఉండెడివి. బెనారస్, నాడియ(బెంగాల్), మిథిల, ప్రయాగ, అయోధ్య, శ్రీనగర్, ఆరిహాట్,తట్టాస్, ముల్తాన్, కామరూప, సర్‌హిందు మొదలగు నగరాలు నాటి ముఖ్య విద్యాకేంద్రాలు. మొగల్ చక్రవర్తులు అనేకమది పండితులను తమ ఆస్థానాలలో పోషించిరి. నాటి పండితులు తత్వము, వైద్యం, జ్యోతిష్యం, ఖగోళం మొదలగు శాస్త్రాలపై ప్రధాన కృషిచేసిరి. అక్బర్ చక్రవర్తి ప్రాంతీయ భాషలైన బెంగాలి, బరియ, హింది, పాళి మొదలగు భాషల అభివృద్ధికి విశేష కృషి చేసెను. అక్బర్ గణిత శాస్త్రానికి విశేషముగా కృషిచేసెను. పారశీక భాషను ప్రధాన మాధ్యమముగా నాటి విద్యారంగం గుర్తించెను.

మొగలుల కాలంలో అనేకమంది మహిళలు సైతం తమ ప్రజ్ఞను ప్రదర్శించిరి. హుమాయూన్ –నామాను రచించిన గుల్‌బదన్‌బేగం, రాణి కర్నావతి, రాణి జోదాబాయి, రాణి దుర్గావతి, రాణి రూపమతి, చాంద్‌బీబి, నూర్జహాన్, ముంతాజ్ బేగం, జహనార, రోషనార, జిజియాబాయి (శివాజి తల్లి), తారాబాయి(రాజారం సతీమణి) మొదలగు స్త్రీలు నాటి రాజకీయాలను సమాజంను గొప్పగా ప్రభావితమొనర్చిరి. ఉన్నత కుటుంబ స్త్రీలు విద్యనుఅభ్యసించెడివారు. కాని హిందు, ముస్లిం వర్గాలలో స్త్రీలు అనేక దురాచారాలకు బలి అయ్యెడివారు. ముఖ్యంగా ఫరదా పద్ధతి, బాల్య వివాహాలు, వితంతు వివాహాల నిరాకరణ, సతిసహగమనం, బహు భార్యత్వం మొదలగు దురాచాలు స్త్రీల దుస్థితికి తిరుగులేని నిదర్శనాలు. నాటి నగరాలలో ఈ దురాచారాలు ఎక్కువగా ఉండెడివి.

నాటి విద్యారంగంలో అనేక లోపాలు లేకపోలేదు. విద్యావ్యవస్థ అమితంగా మత ప్రభావానికి గురి అయ్యెను. రాజ్యానికి విద్యపై ఎక్కువగా దృష్టి లేకపోవుట, సామాన్యుల విద్య కొరకు ప్రత్యేక ఏర్పాట్లు లేకపోవుట. బాలికల విద్యను నిర్లక్ష్యం చేయుట, సాంకేతిక విద్యలోపించుట నాటి ముఖ్యలోపాలు. అందువలన అనేక లోపాలతో కూడిన ఈ విద్యావిధానము ప్రగతిని నిరోధించుటకు కారణమయ్యెను. తదనంతర కాలంలో దేశ వెనుకబాటుతనానికి ఇది చాలావరకు కారణమయ్యెను.

## పాఠ్య ప్రశ్నలు 47.బి

1. మొగలుల కాలంనాటి ఉన్నత అధికార బృందం వలన కొన్ని ప్రయోజనాలు లభించినను కొన్ని లోపాలను కలిగి ఉన్నది. వీటిలో మొగల్ రాజ్య పతనానికి దోహద పడిన ఏదైన ఒక లోపాన్ని గుర్తించండి?
2. జమిందార్‌లు అనగా ఎవరు? జమిందార్ అనగా అర్థంను తెలపండి?
3. ఏవర్గం ప్రజలను మధ్యతరగతిగా పరిగణించిరి?
4. హిందూముస్లింలు పరస్పరము దగ్గరకు చేరిరి అనుటకు ఏదైన ఒక ఆధారంను చూపండి?

5. విద్యా, సాంకేతిక రంగాలలో కొంతవరకు చైతన్యం వచ్చినను అనేక సాంఘిక దురాచారాలు స్త్రీ స్థానమును మధ్యయుగం నుండి నేటివరకు దిగజార్చినవి. అటువంటి దురాచాలలోకొన్నింటిని గుర్తించుము?

## సెక్షన్ - 2

## ఢిల్లీ సల్తాన్‌ల, మొగలుల కాలములోని ఆర్ధికజీవనము ధరలు మరియు వేతనాలు :

### 47.5 ఢిల్లీ సుల్తాన్‌ల కాలము :

సమకాలీన భారతీయ, విదేశీ రచనల ద్వారా ఈ కాలము నాటి ధరలు, వేతనాలను గురించిన సమాచారము తెలియచున్నది. కాని ఈ రచనలలోని వైరుధ్యము ఫలితముగా అస్పష్టత కలదు.

నాటి ఆహార ధాన్యాలు ధరల వివరాలు తొలిసారిగా అల్లాఉద్దీన్ ఖిల్జీ కాలంనుండి లభ్యమగుచున్నవి. మార్కెట్ వ్యవస్థను క్రమబద్ధం చేయుటకు తొలిసారిగా ప్రయత్నించిన సుల్తాన్ ఖిల్జీ. బరాని రచనల ప్రకారం ఢిల్లీలో ఒక మణుగు గోధుమలు 71/2 జిటాలు, బార్లీ 4 జిటాలు, వరి 5 జిటాల్‌గను ఉండెను. ఈ ధరలు హెచ్చు తగ్గులుకాక స్థిరంగా ఉండెడివని బరాని తెలిపెను. బరాని నాటి ధరల వివరాలే కాక ధరలను నియంత్రించు వ్యవస్థలను ధరల వేతనాల మధ్యగల సంబంధాలను తన రచనలలో వివరించెను. ఆహార, వస్త్రముల స్వల్ప ధరలు నాటి స్వల్ప వేతనాలకు సూచికలని భావింపవచ్చును. ఒక మట్టిపని వానికి రోజుకు 2 లేక 3 జిటాలు వేతనంగా లభించెడిది. దర్జీ వేతనం ఒక దుస్తులకు 4 జిటాలు వసూలు చేసెడివాడు. సేవకునికి దినవేతనం 2 జిటాలుగా ఉండెడిది.

అల్లాఉద్దీన్ ఖిల్జీ మరణముతో ధరల నియంత్రణ వ్యవస్థ కుప్పకూలినదని చెప్పవచ్చును. కుతుబుద్దీన్ ముబారక్ ఖిల్జీ కాలమునాటికి ధరలు నాలుగు రెట్లు పెరిగినవని బరాని తెలిపెను. మహమ్మద్ బీన్ తుగ్లక్ కాలములో ఒక మణుగు గోధుమ ధర 12 జిటాలుగా ఉండెను. ఫిరోజ్‌షా తుగ్లక్ కాలమునాటి ధరల వివరాలను తెలియచేయు ఆధారాలు అనేకములు కలవు. ఇతని తొలి పాలనాకాలములో ఆహార ధాన్యాల కొరత కారణముగా ధరల పెరుగుదల అధికంగా ఉండెను. ప్రజల జీవనం అధిక వ్యయంతో కూడి ఉండెనని బరాని తెలిపెను. కాని ఫిరోజ్ చర్యల ఫలితంగా తదనంతర కాలంలో ధరలు గణనీయముగా తగ్గినవి. పంటల దిగుబడి అధికమైనందువలన ధరలు తగ్గినవని అఫీఫ్ అను రచయిత తెలిపెను. అంతేకాక వ్యవసాయ ప్రగతికి ఫిరోజ్‌షా అనేక చర్యలను తీసుకొనెను. వేతనాలను ఫిరోజ్‌షా నియంత్రించెను. పదిమైళ్ళ దూరంగల ఢిల్లీ-ఫిరోజ్‌బాద్ మధ్య ప్రయాణానికి బండిపై వెళ్ళుటకు 4 జిటాలులు, గుర్రంపై 6 జిటాలులు, పల్లకిలో ప్రయాణం చేయుటకు 25 జిటాలులు వెచ్చించెడివారు. ఫిరోజ్‌షా కాలంలో తుదకు బానిసలు సైతం వివిధ రకాల వేతనాలను పొందెడివారు. కాని ఫిరోజ్‌షా మరణానంతరము తైమూర్ దండయాత్ర పిమ్మట ధరల పెరుగుదల అధికమయ్యెను. ఫెరిస్టా రచనల ప్రకారం సికందర్ లోడి ధరల స్థాయి నిరంతరం పర్యవేక్షించెడివాడు. ఇతని కాలంలో వ్యాపారులు తమ వ్యాపారాలను కట్టుదిట్టమైన భద్రత నడుమ నిర్వహించెడివారు.

వార్తా సదుపాయాలు, రవాణా సౌకర్యాలు సక్రమంగా లేనందువలన ఆహార ధాన్యాలు ఒక ప్రాంతం నుండి మరొక ప్రాంతానికి రవాణా చేయుటకు క్లిష్టముగా ఉండెను. ఫలితముగా ధరల హెచ్చుతగ్గులు. ఒక సంవత్సరానికి మరుసటి సంవత్సరానికి, అదే విధముగా ప్రాంతాల మధ్య వైరుధ్యముగా ఉండెడివి. సాధారణ ధాన్యాల ధరలు రాజ్యములో ఇతర ప్రాంతాలతో పోల్చిన యెడల బెంగాల్‌లో తక్కువగా ఉండెడివి.

ధరలను నియంత్రించుట కట్టుదిట్టమైన చర్యలు తీసుకొనిన తొలి ఢిల్లీ సుల్తాన్ అల్లాఉద్దీన్ ఖిల్జీ. ఇతని కాలంలో ఆహార ధాన్యాల ధరలు అతి స్వల్పంగా ఉండెడివి. ధరల ఆధారంగా వేతనాల నిర్ణయము జరిగెను.

**మొగలాయిల యుగము :**

ధరలు, వేతనాలను గురించి మొగలుల కాలంనాటి సమాచారము తెలుసుకొనుటకు సుల్తాన్‌కాలం వలెనే కొంత క్లిష్టమైన అంశం. ప్రాంతాల మధ్య ధరలలో స్పష్టమైన వైరుధ్యం ఉన్నట్లు తెలియచున్నది. అక్బర్ కాలమునాటి ధరల వివరాలు అబుల్ ఫజుల్ రచించిన **ఐనీ–అక్బర్** ద్వారా తెలియుచున్నది. షేర్షా ప్రవేశపెట్టిన వెండి రూపాయి మొగలుల కాలంలో సైతం ప్రామాణిక ద్రవ్యంగా చలామణి అయిన అంశము గుర్తుంచుకొనవలెను.

ఇటీవల జరిపిన అధ్యయనాల ఫలితముగా క్రీ.శ.1610–1630 సంవత్సరాల మధ్య ధరలు ఒకటి నుండి $1^1/_2$ శాతం పెరిగినవని తెలియచున్నది. జహంగీర్ కాలంలో వేతనాలు రెట్టింపు అయ్యెను. ఈ అంశాలపై నేడు విశేష పరిశోధన జరుగుచున్నది.

మొగలుల కాలంనాటి వేతనాలను గురించి 20వ శతాబ్ధి తొలి కాలానికి చెందిన **మోర్‌లాండ్** తెలియచేసిన సమాచారము ప్రకారం సేవకునికి నెలకు 3 రూపాయాలు నుండి 3.50 రూపాయలు, ఒక వృత్తిపనివానికి రోజుకు రెండు దామ్‌లు వేతనంగా లభించెడిది. క్రీ.శ.1637–38 సంవత్సరాల మధ్య వేతనాలు 60 నుండి 100 శాతం పెరిగినవి.

17వ శతాబ్ధిలో ధన రూపంలో వేతనాల పెరుగుదల గోచరించినను ఈ వేతనాలు ధరల పెరుగుదలతో పోల్చిన తక్కువగానే ఉన్నదని చెప్పవచ్చును. కాని ఎంత తక్కువ అను సమాచారం చెప్పుటకు మనకు మరింత స్పష్టమైన గణాంకాలు తెలియవలసి యున్నది.

## 47.6 వర్తక, వాణిజ్యాలు :

**సుల్తాన్‌ల యుగం :**

ఈ యుగంలో దేశీయ, విదేశీ వాణిజ్యం విస్తృతమైనది. దక్కన్ ప్రాంతము నుండి ఎక్కువ సముద్రాంతర వ్యాపారాలు జరిగెడివి. ఇబన్‌బటూటా రచనల ప్రకారం ఢిల్లీ నగరం వర్తక వ్యాపారాలకు మకుటాయమానాముగా ఉండెడిది.

ఢిల్లీ సుల్తాన్‌ల యుగంలో అనేక పరిశ్రమలలో గొప్ప ప్రగతి సాధించబడెను. వీటిలో వస్త్ర పరిశ్రమ, లోహ పరిశ్రమ, రాతి, చెరకు, నీటిమందు పరిశ్రమలు ముఖ్యమైనవి. భారతీయ లోహ ఉత్పత్తులకు ప్రపంచ గిరాకి ఉండెడిది. కొన్ని ఆధారాల ప్రకారం ఇండియాలో తయారైన కొన్ని ప్రత్యేక కత్తులకు(డమాస్కస్ కత్తులు) అంతర్జాతీయ మార్కెట్‌లో గొప్ప గిరాకి ఉండెడిది. వర్తక, వ్యాపార పెరుగుదల ఫలితంగా ఉన్నత వర్గ జీవనం మరింత సుఖఃవంతమై విలాసవస్తువులు వారిజీవిత శైలిలో ప్రవేశించినవి. వివిధ రాకాల వస్తువుల ఉత్పత్తి కేంద్రాలు దేశములో పలుప్రాంతాలలో వెలిసినవి. రాజ్యంలో పరిశ్రమల స్థాపనకు ప్రభుత్వం సైతం ప్రోత్సాహమిచ్చెను. సుల్తాన్ తన అవసరాల కొరకు రాజభార్కానాలను నెలకొల్పెడివాడు. మహమ్మద్ బీన్ తుగ్లక్ తన అవసరాల కొరకు నెలకొల్పిన ఖార్ఖానలో 4000మంది నిపుణులైన వృత్తిపని వారు ఉండెడివారు. ఈ కార్కానాలలో టోపీలు, ఫరదాలు, కవచాలు, పాదరక్షలు మొదలగు అనేక వస్తువుల

ఉత్పత్తి చేసెడివారు. ఈ కార్ఖానాలు రాజ్యంలో అనేక మందికి ఉపాధి కల్పించినవి.

ఈ కాలములో వృద్ధిచెందిన వ్యాపారాలు ఫలితముగా పశ్చిమఆసియా దేశాలలో భారతదేశానికి విశేష ప్రాధాన్యత లభించెను. భారతదేశం నందలి రేవులు రవాణా కేంద్రాలుగా సేవలందించి అగ్నేయ ఆసియా, పశ్చిమ ఆసియా, తూర్పు ఆసియా దేశాల రేవు, పట్టణాలలో సింధునందలి దేబాల్, గుజరాత్ నందలి బ్రోచ్, కాంబే, మహారాష్ట్ర నందలి థానే, విజయనగర రాజ్యమునందలి మంగుళూరు, బహమనీ రాజ్యము నందలి చౌల్, థాబోల్, మలబార్ తీరం నందలి కాలికట్, క్విలన్, కేప్‌కొమరిన్‌లను పేర్కొనవచ్చును.

రేవు మార్గాలే కాక వర్తక వ్యాపారాలకు కొన్ని రహదారి మార్గాలు కూడా దోహదపడినవి. ఇండియా–కొరాజాన్ రహదారి, కాబూల్, కాందహార్ మొదలగు ప్రాంతాలు భారత వ్యాపార, వాణిజ్య రంగాలకు ఎంతగానో ఉపకరించినవి.

ఈ కాలంలో ఇండియానుండి అనేక ఉత్పత్తులు వివిధ ప్రాంతాలకు ఎగుమతి చేయబడినవి. వీటిలో ఆభరణాలు, ముత్యాలు, దంతాలు, గంధము, లవంగాలు, మిరియాలు, కొబ్బరి, కర్పూరం, పత్తి, పట్టు, జనుము మొదలగునవి ముఖ్యమైనవి. ఇక దిగుమతులను గమనించిన యెడల టర్కి, అరేబియాల నుండి గుర్రాలు, బంగారం, వెండి, మక్‌మల్ వస్త్రాలు, చైనా నుండి పట్టు మొదలగునవి ప్రధానంగా చెప్పవచ్చును. మొత్తం మీద ఈ వర్తక వ్యాపారాల ఫలితంగా దేశం గొప్పగా లాభపడినది.

దేశంలో అంతర్గత వ్యాపారాలు అనేక వాణిజ్య కుటుంబాలు నిర్వహించెడివి. బరాని రచనల ప్రకారం ముల్తాన్ నగరానికి చెందిన కుటుంబాలు ఎక్కువగా దేశీయ వర్తకంను, నిర్వహించెడివి. అల్లాఉద్దీన్ ఖిల్జీ కాలములో ఈ ముల్తానీ వ్యాపారులకు ఖిల్జీ రుణ సౌకర్యాలను సైతం కల్పించెను. ఉత్తర భారత తీరప్రాంత వ్యాపారం గుజరాత్‌కు చెందిన మార్వారీలు నిర్వహించెడివారు. వీరిలో అధికులు జైనులు. ముస్లింలలో బొహ్రా కుటుంబీకులు సైతం వర్తక వ్యాపారాలు చేసెడివారు. వర్తక వ్యాపారాల లాభసాటిగా ఉన్నందువలన ఈ వ్యాపార వర్గాల కుటంబాలు చక్కటి జీవితంను గడిపెడివారు.

ఈ కాలంలో ప్రయాణాలు చాలా ప్రమాదములతో కూడి ఉండెడివి. దారి దోపిడీలు, దొంగతనాలు తరచు జరుగుచుండెడివి. కాని సుల్తాన్‌లు వీటిని అరికట్టుటకు అనేక చర్యలు తీసుకొని వ్యాపారాభివృద్ధికి కృషి చేసిరి. రహదారులలో భద్రతకొరకు సరాయిలు నిర్మించిరి. బెంగాల్‌లో తీవ్ర వరదలను సైతం నిరోధించి నిలువ గల రహదారులను ఘియాజుద్దీన్ తుగ్లక్ నిర్మించెను. గుర్రాల ద్వారా సమాచారంను త్వరితగతిన తెలియచేయు వ్యవస్థ ఈ కాలంలో అమలులోనికి వచ్చెను. అంచలవారిగా కోర్‌జాన్ ప్రాంతం నుండి తాజ ఫలములు రోజు ఢిల్లీసుల్తాన్ అంతఃపురానికి చేరెడివి.

| సుల్తాన్‌ల యుగంలో వర్తక వ్యాపారాలు గణనీయంగా పెరిగినవి. రాజ్యములో కార్ఖానాల స్థాపన ప్రోత్సహించబడిన అనేక రేవు పట్టణాలు విదేశీ వ్యాపారానికి దోహదపడినవి. |
|---|

**మొగల్ యుగము :**

మొగలాయి చక్రవర్తుల పాలనా కాలంలో వర్తక వాణిజ్యాలు మరింత విస్తరించినవి. మొగలులు అందించిన రాజకీయ సుస్థిరత ఫలితంగా వస్తువులు, ధాన్యాలు ఒక ప్రాంతం నుండి మరొక ప్రాంతానికి మరింతగా రవాణా

చేయబడి వ్యాపారాభివృద్ధికి దోహదపడినవి. అంతేగాక మొగల్ చక్రవర్తులు శాంతి భద్రతలను పరిరక్షించుటలో అధిక దృష్టి సారించిరి. ఇది కూడా వ్యాపారాభివృద్ధికి ప్రోత్సాహమిచ్చెను. ఈ కాలంలో అనేక రహదారులు, వాటి వెంబడి సరాయిల నిర్మాణము జరిగెను. జీతాలను, పనులను ఈ కాలంలో అధికంగా ద్రవ్యరూపములో చెల్లించుట వలన ద్రవ్యచలామణి అధికమయ్యెను. ఈ యుగంలో అనేక వర్తక మార్గాలు నూతనముగా నిర్మించబడినవి. వీటిలో ఆగ్రా–పాట్నా నగరాల మధ్య ఒక రహదారి, బెంగాల్–బీహార్‌లను కలుపుచూ మరొక రహదారి, మధ్య ఆసియా ఆగ్రాలను కలుపుచూ కాందహార్, ఢిల్లీ నగరాల మీదుగా రహదారులు నిర్మించబడినవి. గుజరాత్, ఉత్తర భారత దేశాల నుండి ప్రధానంగా రెండు రహదారుల ద్వారా వస్తువులు రవాణా చేయబడుచుండెను. వీటిలో మొదటిది పశ్చిమరాజస్థాన్ మీదుగా సూరత్–ఆగ్రాల మధ్యగల మార్గము. రెండవ మార్గము మాళ్వా, కాందేష్‌ల గుండా సూరత్‌కు వేయబడినది. దేశ రెండు తీర ప్రాంతాల ద్వారా సముద్రాంతర వ్యాపారాలు కొనసాగినవి. సూరత్‌నుండి తూర్పున మచిలీపట్నంకు వస్తురవాణా జరిగెడిది. ఈ మార్గలన్నింటి ద్వారా జరిగిన వ్యాపారాల ఫలితంగా ప్రాంతాల మధ్య వస్తు మార్పిడి సాధ్యమయ్యెను.

ఈ యుగంలో సుదూర ప్రాంత వర్తక వ్యాపారాలే గాక సమీప మార్కెట్‌ల ద్వారా ఆర్థిక లావాదేవీలు చురుకుగా సాగినవి. అన్ని ప్రాంతాలలో గల సంతలలో వస్తువుల అమ్మకాలు విరివిగా జరిగెడివి. వీటి ఫలితంగా స్థానిక మార్కెట్‌లు వృద్ధిచెంది క్రమంగా చిన్న చిన్న నగర శివార్లు వృద్ధి చెందినవి. వీటినే ఖస్‌బాస్‌లని పిలిచిరి. ఉన్నత ప్రమాణాలు కలిగిన వస్తువులను కొనుగోలు చేయుటకు సమాజము నందలి ధనిక వర్గము ఆసక్తి చూపించెడివారు. ఫలితంగా 17వ శతాబ్ధినాటికి నగర జీవతంపై ప్రజల మోజు అధికమయ్యెను. విదేశీ యాత్రికుడైన బెర్నియర్ అభిప్రాయంలో ఢిల్లీనగరం పారిస్ కన్నా పెద్దది. ఆగ్రా, ఢిల్లీ కన్నా పెద్ద నగరము. అక్బర్ కాలములో ఇండియాలను సందర్శించిన **రాల్ఫ్‌ఫిచ్** అభిప్రాయంలో ఆగ్రా, ఫతేపూర్ సిక్రిలు లండన్ నగరం కన్నా పెద్దవి.

మొగలాయి యుగంలో దేశంనుండి ప్రధానంగా వస్త్రాలు, కాగితం, నీలిమందు, నల్లమందు, ఔషధాలు ఎగుమతులు కాగ, వెండి, ముడిపట్టు, లోహాలు, విలువైన రాళ్ళు, సుగంధగద్రవ్యాలు, మద్యం, ఆఫ్రికా బానిసలు, చైనా నుండి గాజు మొదలగునవి ప్రధాన దిగుమతులు. చైనా వస్తువులకు దేశంలో మంచి గిరాకి ఉండెను. దేశములో వర్తక వ్యాపారాలు మంచి లాభదాయకంగా ఉండెను.

ఈ కాలంనాటి వ్యాపార వర్గాలు బలమైన సంపన్న వర్గాలుగా స్థిరపడిరి. వీరిలో సేథీలు, చౌహరాలు మొదలగువారు టోకు వ్యాపార వర్గాలుగాను బియోపాదిలు, బంకేలు మొదలగు వారు చిల్లర వ్యాపార వర్గాలుగా పేరు తెచ్చుకొనిరి. షరాబులు, షరాఫ్‌లు బ్యాంకర్లుగా చలామణి అయిరి. వీరి ద్రవ్యలావాదేవీలను చూచెడివారు. వీరు జారీ చేయు హుండీలు ద్రవ్యముగా సుదూరప్రాంతాలకు తీసుకొని వెళ్ళుటకు బదులుగా నిర్ణీత కాలానికి చెల్లుబడి అగు ఈ హుండీలను లావాదేవీలకు వినియోగించెడివారు. బంజారు వర్గాలు దేశసంచారం చేయుచూ చిన్న చిన్న వ్యాపారాలను నిర్వహించెడివారు.

వర్తక వ్యాపారాల ద్వారా అనేకమంది వ్యాపారులు బలమైన అర్థిక శక్తులుగా బలపడిరి. ఐరోపా వ్యాపారులకు ధీటుగా దేశంలోని రేవు పట్టణాలలోని వ్యాపారాలు వృద్ధిచెందినారు. సూరత్ నగరానికి చెందిన విర్జివోరా తన కాలంలో అత్యంత ధనవంతుడైన వ్యాపారీగా గుర్తించబడెను. ఇతనేగాక గోల్కొండకు చెందిన మీర్‌జుమ్లా, మల్లయ్యశెట్టి, కాశీవీరన్న మొదలగు వారు నాటి ప్రధాన వ్యాపారులుగా పేరు తెచ్చుకొనిరి. వీరిలో కొందరు కొన్ని వస్తువుల విక్రయములో ఏకస్వామ్య వ్యాపారంను నిర్వహించెడివారు.

మొగలుల కాలంలో వ్యాపారంలో ఐరోపా కంపెనీలు సైతం ముఖ్యపాత్ర పోషించినవి. పోర్చుగీసువారు ప్రారంభంలో సముద్ర వ్యాపారంలో గుత్తాధికారంను కలిగియుండిరను విషయం తెల్సినదే. కాని 16వ శతాబ్ది రెండవ భాగానికి పోర్చుగీసు ప్రాబల్యము క్షీణించెను. వీరి స్థానంలో డచ్, ఇంగ్లీషు కంపెనీల ప్రాబల్యం అధికమయ్యెను. క్రీ.శ.1606 నాటికి డచ్ వారు మచలీపట్నంలో వర్తక స్థావరాలని ఏర్పరచుకొనిరి. అంతేకాక జావ, సుమర్తలలో వీరు వ్యాపార స్థావరాలను నిర్మించుకొనిరి. వీరు భారత వస్త్ర వ్యాపారాన్ని ప్రధానముగా తమ లక్ష్యంగా చేసుకొనిరి. క్రమముగా వీరు తూర్పు తీర భారత వ్యాపారాన్ని తమ హస్తగతం చేసుకొనిరి. వీరికి పశ్చిమాన గల కాలికట్ ప్రధాన కేంద్రమయ్యెను. త్వరితకాలంలో బ్రిటీష్ వర్తక కంపెనీ భారత వ్యాపారకార్యకలాపాలలో ప్రధానభాగమయ్యెను. వీరు క్రీ.శ.1912లో సూరత్‌నందు తమ ఫ్యాక్టరీని నెలకొల్పిరి. ఆంగ్లేయులకు క్రీ.శ.1618లో మొగల్ చక్రవర్తి 'ఫర్మానా'ను జారీచేసి వ్యాపార హక్కును మంజూరు చేసెను. వీరి వ్యాపారానికి ప్రారంభంలో మనదేశ వస్త్ర పరిశ్రమ ప్రధాన లక్ష్యమయ్యెను. ఒక అంగ్లేయుని రచనల ప్రకారం తమ సతీమణులందరూ భారతీయ దుస్తులను ధరించుటకు గృహాలలో భారతీయ వస్తువులను నింపుటకు మోజు పడుచున్నారని తెలిపెను.

భారతదేశంనందలి వాణిజ్య పంటలు ఈ యుగంలో దేశ ఆర్థిక ప్రగతిని మరింత పటిష్టస్థితికి చేర్చినవి. ఈ పంటలు భారతదేశాన్ని ప్రపంచ మార్కెట్‌కు మరింత సన్నిహితంగా చేర్చినవి. ఈ సమయంలోనే దేశములోనికి వెండి, బంగారు దిగుబడి అధికమై ఆర్థిక మాంద్యం చోటుచేసుకొని అనేక ఇబ్బందులను సైతం ఎదుర్కొనవలసి వచ్చెను. ఈ పరిణామం దేశీయ, వ్యాపార వర్గాలపై తీవ్ర ఒత్తిడులను తెచ్చినవి. కాని వ్యాపార రంగం ఈ ఒత్తిడులను విజయవంతంగా ఎదుర్కొనగలిగినవి. కాని క్రమముగా దేశీయ వ్యాపంర ఆంగ్ల కంపెనీ గుత్తాధిపత్యముగా మారి, దేశ రాజకీయ అధికారాన్ని తమ హస్తగతం చేసుకొని మొగల్ రాజ్య విచ్ఛిన్నమునకు దోహదపడిరి. ఈ పరిణామం దేశ ఆర్థిక వ్యవస్థను తీవ్రంగా ప్రభావితం మొనర్చి ఎటువంటి ఫలితాలను ఇచ్చినదో గత పాఠ్యాంశాలలో అధ్యయనం చేయుట జరిగెను.

మొగలుల కాలంలో వ్యాపార వర్తకాలు గొప్పగా వృద్ధిచెందినవి. అనేక వ్యాపార వర్గాలు అవతరించినవి. అనేక పెద్ద పెద్ద నగరాలు వెలుగులోనికి వచ్చినవి. మొగల్ చక్రవర్తులు వ్యాపారాన్ని ప్రోత్సహించిరి. భారత మార్కెట్‌లోనికి ఐరోపా కంపెనీలు ప్రవేశించినవి.

## 47.7 భూమిశిస్తు విధానము :

### ఢిల్లీ సుల్తాన్ యుగం :

సుల్తాన్‌ల ఆర్థిక వ్యవస్థకు భూమిశిస్తు వెన్నెముకలాంటిది. రాజ్య ఆదాయములో భూమిశిస్తు, అత్యధిక శాతముగా ఉండెడిది. వ్యవసాయ భూమి ఈ కాలములో నాలుగు రకాలుగా వర్గీకరించబడి యుండెను.

### 1. ఖాల్సాభూమి(చక్రవర్తి భూమి) :

సుల్తాన్ రెవిన్యూ పరిపాలన అధీనములో ఉండెడిది. దీనిని కొన్ని 'షిక్'లాగా విభజించి ఆ ప్రాంతాలలో భూమిశిస్తు వసూళ్ళకు 'అమిల్' అను అధికారిని నియమించిరి. వీరికి పన్నుల వసూళ్ళలో గ్రామాలలో చౌదరీలు, ముకద్దములు, పట్వారీలు అను వంశపారంపర్య ఉద్యోగులు సహకరించెడివారు.

**2. ఇక్తా భూములు :**

సైనికాధిపతులకు ఇచ్చిన భూములను, ఇక్తాభూములనిపిలిచిరి. వీటి అధిపతులను ఇక్తాదార్‌లు, ముక్తీలు, వాలీలు అనిరి. వీరి అధీనంలో సైనిక పోషణ నిమిత్తము వీరికి భూమి కేటాయించిరి.

3. హిందూ భూస్వాముల ఆధీనములో గల భూమి, వీరు ప్రతి సంవత్సరము సుల్తాన్‌కు శిస్తు చెల్లించవలెను.

**4. వక్ఫ్‌లేదా ఇనాం భూములు :**

మహమ్మదీయ మతాధికారులకు, మసీదులకు ఇచ్చిన భూమి. ఈ భూములకు పన్నుల మినహాయింపు కలదు.

అల్లాఉద్దీన్ ఖిల్జీ కాలం వరకు శిస్తు మదింపు చేయడంలో ఒక శాస్త్రీయ విధానం లేదు. పండిన పంటలో 1/3 నుండి 1/4 వంతు వరకు పన్నుగా వసూలు చేసెడివారు. కాని ఖిల్జీ కాలంలో శిస్తు నిర్ణయానికి ఒక ప్రణాళికబద్ధమైన వ్యవస్థ ఏర్పడెను. భూమి ఉత్పాదక శక్తిని ఆధారంగా చేసుకొని శిస్తు నిర్ణయించబడెను. ఈ విధానం ద్వారా ఖిల్జీ రైతులతో నేరుగా సంబంధాలు పెట్టుకొనెను. బోయబ్ ప్రాంతంలో అమీల్ అను ప్రభుత్వ అధికారులు శిస్తులను వసూలు చేసెడివారు. అంతేకాక ఖిల్జీ భూస్వాములను సైతం అదుపు చేయుటకు అన్ని చర్యలు తీసుకొనెను. జమిందార్లు వసూలు చేయు భూమిశిస్తులను ఖిల్జీ నియంత్రించెడివాడు. మధ్యవర్తుల జోక్యాన్ని, వారి ప్రాబల్యాన్ని చాలావరకు ఖిల్జీ అదుపుచేసెను. రైతుల నుండి అధిక పన్నులు వసూళ్ళు చేయకుండా ఖిల్జీ చర్యలు తీసుకొనెను. గ్రామీణ భూస్వాములు ఖిల్జీ కాలంలో సాధారణ రైతులుగా మారిపోయిరి. ఖిల్జీ అభిప్రాయంలో రైతులు చెల్లించు శిస్తులలో అధిక మొత్తం సుల్తాన్ ఖాజానాలో చేరవలెను. శిస్తు వసూలు అధికారులైన అమీల్ ఎటువంటి అవినీతికి పాల్పడకుండా కట్టుదిట్టమైన చర్యలు తీసుకొనెను. శిస్తును ధన రూపంలో కాక, ధాన్య రూపంలోనే వసూలు చేసెను. దీని వలన నగరాల మధ్య ధాన్య సరఫరా నిరంతరం సక్రమముగా జరుగగలదని ఖిల్జీ భావించెను. ఖిల్జీ కాలంలో రైతులు తమ పంటలో 50శాతము శిస్తుగా చెల్లించవలసి వచ్చెను. శిస్తు వసూళ్ళ అధికారుల జీతాలను పెంచి వారితో అవినీతిని అదుపుచేసెను. ఖిల్జీ అనుసరించిన ఇటువంటి విధనాల ఫలితంగా తొలిసారి భారతదేశ గ్రామాలు సైతం తురుష్కపాలనా ప్రభావంనకు గురైనవి.

ఖిల్జీ తదనంతరం గియాజుద్దీన్ తుగ్లక్ వ్యవసాయ విధానంలో మరికొన్ని మార్పులు తెచ్చెను. పండిన వాస్తవ పంట ఆధారంగా శిస్తును వసూలు చేయవలసినదిగా ఇతడు అధికారులను ఆదేశించెను. ఖిల్జీ కాలమునాటి భూ సర్వే విధానాన్ని ఘియాజుద్దీన్ ప్రోత్సహించలేదు. రైతులకు గౌరవస్థానముఇచ్చి అవినీతి అధికారులను శిక్షించెను. రాజ్యమునందలి ఏ ఇక్తాలోను భూమిశిస్తు 1/4 లేదా 1/10 వంతుకు మించి ఉండరాదని శాసించెను.

ఇక మహమ్మద్ తుగ్లక్ కాలములో బరాని రచనల ప్రకారం అనుసరించిన రెవిన్యూ విధానాల ఫలితముగా వ్యవసాయం సర్వనాశనమయ్యెను. ఇతడు రాజ్యం యొక్క వార్షిక ఆదాయ వ్యయాలను అంచనా వేసెను. తన రాజ్యంలో ఒకేవిధమైన భూమిశిస్తు విధానము ఉండవలెనని తుగ్లక్ భావించెను. నూతనంగా దివాన్–ఇ–కోహి అను వ్యవసాయ శాఖను ఏర్పాటుచేసి ఆశాఖ అధీనములో వ్యవసాయ విభాగాలను ఉంచెను. అధిక భూములను సాగులోనికి తెచ్చి రైతులు అధిక దిగుబడి చేయువిధంగా చర్యలు తీసుకొనుట ఈ నూతన శాఖ ప్రధాన బాధ్యత.

ఫిరోజ్‌షా తుగ్లక్ కాలంలో నూతనంగా పంటకాలువల నిర్మాణం జరిగి వ్యవసాయాభివృద్ధికి కొంతవరకు కృషి జరిగెను. రాజ్యంలోని వ్యవసాయ భూమినంతటిని ఇతడు అంచనావేసి దానిని ఆధారంగా తన కాలంలో వసూలు కాగల శిస్తును అంచనావేసెను.

అల్లాఉద్దీన్ ఖిల్జీ తొలిసారి సుల్తాన్‌కు రైతులకు నేరుగా సంబంధాలను నెలకొల్పెను. వ్యవసాయ శాఖను పునర్‌నిర్మించి భూస్వామ్యముల అధికారాలను నియంత్రించెను. ఇతని వ్యవసాయ విధానాలే తదనంతర పాలకులకు మార్గదర్శకాలయ్యెను.

**మొగలుల కాలం :**

మధ్యయుగ భారతదేశ ఆర్థిక వ్యవస్థకు భూమిశిస్తు మూలమని ముందు అధ్యయనంలో మనం తెలుసుకొనియున్నాం. మొగల్ చక్రవర్తులలో బాబర్, హుమాయూన్‌లు ఈవిషయంపై ప్రత్యేకదృష్టిని కేంద్రీకరింపలేక పోయిరి. వీరి తదనంతరం అధికారానికి వచ్చిన షేర్షా భూమిశిస్తు విధానాలపై అమితశ్రద్ధ చూపెను. ఇంతకు ముందు పాఠాలలో షేర్షా రాజకీయ చరిత్రను చదివియున్నాం. ఇచ్చట మరల క్లుప్తంగా పునశ్చరణ చేసుకొనవెను.

ఎ) భూమిశిస్తును నిర్ణయించు వసూళ్ళ విషయంలో షేర్షా నేరుగా రైతులతో సంబంధాలను ఏర్పరచుకొనెను.

బి) భూమి ఉత్పాదకశక్తిని ఆధారంగా చేసుకొని ఉత్తమ, మధ్యమ, అధమ అని మూడు రకాలుగా విభజించెను.

సి) వ్యవసాయ భూమిని ఏకీకృత పద్ధతిలో కొలమానం చేసెను. ఆ భూమిపై సగటు పంటను ఆధారంగా చేసుకొని దానిలో 1/3 వంతున శిస్తుగా నిర్ణయించెను.

డి) శిస్తును ధనరూపంలోను, ధాన్య రూపంలోను వసూలు చేసెడివారు. దీనివలన రైతులు తాము ఎంత శిస్తు చెల్లించుచున్నది వారికి స్పష్టముగా తెలిసెడిది.

ఇ) రైతులకు, భూమిపై గల హక్కులను గుర్తించుచు ప్రభుత్వము పట్టాను ఇచ్చినది. దీనికి మారుగా రైతులు శిస్తు చెల్లింపు అంగీకార పత్రాలను ప్రభుత్వానికి ఇచ్చెడివారు. ఈ పత్రాలను 'ఖులియత్' లని పిలిచెడివారు.

ఎఫ్) యుద్ధ సమయాలలో పంటపొలాలు ధ్వంసం కాకుడా అన్ని జాగ్రత్తలు తీసుకొనెడివారు. ఒకవేళ నష్టము జరిగిన పరిహారమును చెల్లించెడివారు.

షేర్షా అనుసరించిన రెవిన్యూ విధానములో కొన్ని లోపాలు లేకపోలేదు. మధ్యమ, అధమ రకాల భూములను సాగు చేయు రైతులు ఉత్తమ భూముల రైతుల కన్నా అధిక మొత్తంలో శిస్తు చెల్లించవలసి వచ్చెను. ధరలు వివిధ ప్రాంతాలలో వివిధ రకాలుగా ఉన్నందున రైతులు ధనరూపంలో శిస్తు చెల్లించుటకు ఇబ్బందులు పడిరి. ప్రతి సంవత్సరము శిస్తును నిర్ణయించుట వలన రైతులు అనేక కష్టాలను ఎదుర్కొనిరి. రెవిన్యూ అధికారుల అక్రమాలను షేర్షా పూర్తిగా నిరోధించలేకపోయెను. షేర్షా రెవిన్యూ విధానం వలన రాజ్య ఆదాయం గణనీయంగా పెరిగెను. ఈ విధానాలను షేర్షా మరణానంతరము విఫలమయ్యెను.

రెవిన్యూ వ్యవహారాలపై దృష్టిసారించిన తొలి మొగల్‌చక్రవర్తి అక్బర్. ఇతని రెవిన్యూ విధులనే తదనంతరం మొగల్ పాలకులు 17వ శతాబ్ది చివరి వరకు కొనసాగించిరి.

ప్రారంభంలో అక్బర్ పంటల వివరాలను సేకరించుటకు కొనుంగోలు నియమించెను. ఈ కొనుంగోలు వంశపారంపర్యంగా అధికారాలు కలిగి స్థానిక పరిస్థితులపై అవగాహన కలిగియుండిరి. కాని కొనుంగోలు అవనీతిపరులుగా వ్యవహరించుట వలన వీరి పనితీరు అక్బర్‌ను అసంతృప్తిపరచెను. క్రీ.శ.1575లో అక్బర్ భూమి సర్వేకు నూతన విధానంను రూపొందించెను. భూములను కొలచుటకు వెదురు కర్రలు, ఇనుప చక్రాలు అనుసంధానం చేసిన నూతన పరికరమును వినియోగించెను. భూమిశిస్తు వసూలుకు **కరోరి** అను అధికారిని నియమించెను. ప్రతి కరోరి 1 కోటి దామ్‌ల రెవిన్యూకు అధికారిగా వ్యవహరించును. కొనుంగోలు అందించు సమాచారాన్ని ఈ కరోరీలు పునఃపరిశీలన చేసెడివారు. 1580లో రెవిన్యూ పాలనను అత్యంత సమర్థుడైన రాజాతోడర్‌మల్ నాయకత్వంలోని నిపుణుల బృందానికి అప్పగించెను. వీరు రూపొందించిన విధానమే 'దసేసాల' విధానమని పిలువబడెను. ఈ విధానంలో 10సంవత్సరాల కాలానికి పండిన పంటను సగటుగా తీసుకొని శిస్తు నిర్ణయం జరిగెను. అక్బర్ 1/3 వంతును శిస్తుగా ధనరూపంలో వసూలు చేసెను. భూమిని భిగాలను యూనిట్లుగా విభజించి ప్రతిభిగాకు మణుగులు యూనిట్లలో భూమిశిస్తును నిర్ణయించి దానిని ధనరూపంలో వసూలు చేసిరి. శిస్తు నిర్ణయంలో భూమిలో జరుగు వ్యవసాయం క్రమం తప్పకుండా జరుగుచున్నదీ లేనిదీ పరిగణలోనికి తీసుకొనెడివారు.

మొగలుల కాలంనాటి సాగుభూమిని నాలుగు రకాలుగా వర్గీకరించిరి. అవి పోలజ్, పరౌటి, ఛాఛర్, బంజర్

**పోలజ్ :** ప్రతి సంవత్సరం పంట పండు భూమి

**పరౌటి :** ఒకటి లేదా రెండు సంవత్సరాలు సాగు చేయబడని భూమి

**ఛాఛర్ :** మూడు లేదా నాలుగు సంవత్సరాలు సాగుచేయబడని భూమి

**బంజర్ :** 5 సంవత్సరాలకు మించి సాగుబడి కాని భూమి

పై భూములలో మొదటి రెండు రకాలు భూముల నుండి 1/3 వంతు శిస్తుగా ఉండెను. చివరి రెండు రకాల భూములలో సాగుబడి జరిగి పూర్తి అయిన పిమ్మట పన్నులు వసూలు జరిగెడిది.

దస్‌సాల విధానం వలన సాగులో సంభవించు ఒడుదుడుకుల నుండి రైతులు బయటపడిరి. ఈ విధానం అటు రైతులకు ఇటు ప్రభుత్వానికి లాభసాటిగా ఉండెను. ప్రకృతి వైపరీత్యాలలో పన్ను మినహాయింపు ఉండెడిది. రెవిన్యూ అధికారుల పీడన నుండి రైతులు విముక్తి పొందిరి.

మొగలాయిల కాలంలో దస్‌సాల విధానం రాజ్యంలోని కొన్ని ప్రాంతాలలో ప్రవేశపెట్టబడెను. ఇది శాశ్వత ప్రాతిపధికపై రూపొందలేక పోయెను. ఈ విధానం అమలులో లేని ప్రాంతాలలో శిస్తును 'గల్లాబక్షే'లు వసూలు చేసెడివారు. ఈ గల్లాబక్షీ విధానము సాంప్రదాయ పద్ధతిలో పండిన పంట రైతు ప్రభుత్వ మధ్య పంపకం జరిగెడిది. ఇదికాక 'నషక్' విధానము రాజ్యంలో కొన్ని ప్రాంతాలలో అమలులో ఉండి రైతు రాజ్యం మధ్య కుదిరిన ఒప్పందం ప్రకారం గడిచిన సంవత్సర పంట ఆధారంగా శిస్తు నిర్ణయించబడి వసూలు చేయబడెను. 'జప్తి' విధానంన వేరొక పద్ధతిలో పంట స్వభావంననుసరించి శిస్తును నిర్ణయించెడివారు. సాధారణంగా శిస్తు ధనరూపంలో చెల్లించెడివారు. తోడర్‌మల్ రూపొందించిన ఈ విధానమే 'బందోబస్త్' విధానంగా పిలువబడెను.

అక్బర్ కాలంనాటి భూమిశిస్తు విధానం ఘన విజయం సాధించినదని చెప్పవచ్చును. ఈ విధానం ఫలితంగా ఉత్పత్తులు పెరిగి, వర్తక, వ్యాపారాల ప్రగతికి దోహదపడెను. ఈ విధానం జహంగీర్ కాలంలో సైతం కొనసాగెను. కాని కాలక్రమంగా జాగీర్‌గారి వ్యవస్థ బలపడినది. ఫలితంగా రాజ్య ఆదాయం తగ్గెను. షాజహాన్ కాలంలో దస్‌సాల విధానం మరింత బలహీనమయ్యెను. ఇతని కాలంలో అధిక మొత్తంలో సాగుభూమి జాగీర్‌లుగా ఇవ్వబడినది. రైతులకు ప్రభుత్వంతో సంబంధాలు సన్నగిల్లెను. షాజహాన్ భూమిశిస్తును గణనీయంగా పెంచెను. పండిన పంటలో 35% నుండి 50% వరకు రైతులు శిస్తుగా చెల్లించవలసి వచ్చెను. రైతులు తమ ఆధీనంలో గల మొత్తం భూమిపై శిస్తును చెల్లించవలెను. ఈ భూమిలోసాగుబడి కాని ప్రాంతాలపై తమ శిస్తు పరిధిలోనికి వచ్చెడివి. ఫలితంగా ప్రజల ఆర్థిక స్థితి దయనీయంగా మారెను. దీనికితోడు తీవ్ర కరువుకాటకాలు పరిస్థితిని మరింత దిగజార్చెను.

ఔరంగజేబు చక్రవర్తి షాజహాన్ విధానాలనే కొనసాగించెను. జాగీర్‌దారు విధానం కొనసాగి 1/2 నుండి 2/3 వరకు శిస్తును వసూలు చేసెను. రైతుల స్థితిగతులు దుర్బరమయ్యెను. అక్బర్ కాలం నాటి రాయితీలు అదృశ్యమయ్యెను. అక్బర్ చూపిన శ్రద్ధ తదనంతర పాలకులకు లేకపోవుట వలన రెవిన్యూ పాలన అస్తవ్యస్తంగా మారి రాజ్య ఆర్థిక వ్యవస్థ దెబ్బతిని మొగల్ సామ్రాజ్య పటిష్టత బలహీనపడింది.

షేర్షా అత్యంత పటిష్టమైన రెవిన్యూ విధానాన్ని రూపొందించెను. దీనిని అక్బర్ మరింత మెరుగు పరచి అమలు చేసెను.

## పాఠ్య ప్రశ్నలు 47.డి

1. ఢిల్లీసుల్తాన్‌ల కాలం నాటి వ్యవసాయ భూమినందలి రకాలు ఏవి?
2. నగరాల మధ్య నిరంతర ధాన్య రవాణా కొరకు అల్లాఉద్దీన్ ఖిల్జీ తీసుకున్న చర్యలు ఏవి?
3. కొనుంగోలు, కరోరీలు అనగా ఎవరు?
4. అక్బర్ వ్యవసాయ భూమిని ఎన్ని రకాలుగా విభజించెను? అవి ఏవి?

### సారాంశం :

సుల్తాన్‌ల కాలంలో సుల్తాన్ అత్యున్నత స్థానమును అలంకరించియుండెను. రాజ్యానికి ఇతడే సర్వాధికారి. ఇతడు అత్యంత విలాస జీవితం గడిపెడివాడు, సుల్తాన్, ఇతర ఉన్నత అధికారుల బానిసలను కలిగి యుండిరి. ఈ బానిసలను అన్ని పనులకు వినియోగించెడివారు. సమాజంలో అధికారాలు, హోదాలు అనుభవించు వర్గానికి, కష్టపడి చేయు వర్గానికి గౌరవ మర్యాదలలోను, సంపద, ఆదాయాలలో వ్యత్యాసం అధికంగా ఉండెడిది. జనాభాలో అధికశాతం రైతులే. వీరి జీవనం సంతృప్తికరంగా లేదు. కులవ్యవస్థ కొనసాగెను. స్త్రీల స్థితిగతులు ముందుకాలంలో వలె ఎటువంటి మార్పు లేక బాల్యవివాహాలు, సతీసహగమనం, ఫరదా మొదలగు దురాచారాలతో కొనసాగెను.

మొగల్ రాజ్యంలో చక్రవర్తి, ఉన్నత వంం సమాజంలో ముఖ్యులు. వృత్తిపనివారు, బానిసలు సమాజంలో అట్టడుగు వర్గాలుగా భావించిరి. ఈ రెండు వర్గాల మధ్య మధ్యతరగతి వర్గము ఉండెడిది. అవినీతి సర్వసామాన్యం. వ్యాపారులు, వైద్యులు, వివధ వృత్తులవారు మధ్య తరగతిగా పరిగణించబడిరి. అట్టడుగు వర్గం పూర్తిగా నిరాదరణకు గురైరి. పేదరికంనకు వీరు ప్రతీకకాగ, విలాసాలకు ఉన్నత వర్గం ప్రతీకగా ఉండిరి. కులవ్యవస్థ మరింత జఠిలమై

ఉపకులాలు అనేకం కొత్తగా అవతరించినాయి.

విద్యారంగంలో కొంత ప్రగతి గోచరించినను ఇది ఉన్నత వర్గాలకే ఉపయోగపడినది. సామాన్యులకు అందుబాటులో లేదు. సుల్తాన్‌ల యుగంలో పోల్చిన హిందూ-ముస్లిం సఖ్యత మొగల్ కాలంలో మెరుగుపడుటతో శుభపరిణామంగా పేర్కొనవచ్చును.

ఆర్థిక పరిస్థితులను పరిశీలించిన అల్లాఉద్దీన్ ఖిల్జీ మార్కెట్ సంస్కరణాల ద్వారా ధరల నియంత్రణ సాధ్యమయ్యెను. వర్తక వాణిజ్యాలలో సుల్తాన్‌ల కాలంలో పురోగతి జరిగెను. అనేక కార్ఖానాలు నెలకొల్పబడినవి. రేవు పట్టణాలు ద్వారా విదేశీ వ్యాపారాలు అభివృద్ధి చెందినవి. అనేక నూతన నగరాలు వెలుగులోనికి వచ్చినవి. అనేక ఐరోపా వ్యాపార కంపెనీలు దేశంలో వర్తక వ్యాపారాలను ప్రారంభించినవి.

అల్లాఉద్దీన్ ఖిల్జీ తొలిసారిగా రైతులకు ప్రభుత్వానికి మధ్య నేరుగా సంబంధాలను నెలకొల్పెను. స్థానిక రెవిన్యూ అధికారుల జోక్యాన్ని తగ్గించి అనేక సంస్కరణలను చేపట్టెను. తదనంతరం షేర్షా అత్యంత సమర్థవంతమైన రెవిన్యూ పాలనకు రూపకల్పనచేసెను. దీనిని అక్బర్ మరింత శక్తివంతంగా తీర్చిదిద్దెను. ఫలితంగా రాజ్య ఆదాయం పెరిగెను.

**అభ్యాసం :**

1. ఢిల్ల సుల్తాన్‌ల కాలంనాటి ప్రధాన సామాజిక వర్గాలు ఏవి? సుల్తాన్‌లు, ఉన్నత వర్గం ఉన్నత ప్రమాణాలు గల జీవనంను సాగించారని ఎలా చెప్పగలము?
2. మొగల్ సమాజం నందలి ప్రధాన వర్గాలు ఏవి?
3. సుల్తాన్‌ల కాలంనాటి ఆర్థిక, సామాజిక జీవనంను అంచనా వేసి పేద-ధనిక వర్గాలకు సంబంధించి సోదాహరణలతో కూడిన వివరణలను ఇవ్వండి?
4. భూమిశిస్తు విధానాలలో అల్లాఉద్దీన్ ఖిల్జీ తీసుకువచ్చిన మార్పులు ఏవి?
5. భూమిశిస్తు విధానంలో అక్బర్ ప్రవేశపెట్టిన విధానాలు ఏవి? అవి షేర్షా విధానాలకన్నా ఏవిధంగా భిన్నమైనవి.
6. సుల్తాన్‌ల కాలం నాటి వర్తక వ్యాపార ప్రగతిని వివరించండి.
7. వర్తక, వ్యాపారాభివృద్ధికి మొగలులు తీసుకున్న చర్యలను పేర్కొనండి.
8. మొగలుల కాలంలో వాణిజ్య ప్రగతి జరిగినది అనుట ఎంతవరకు సమర్థనీయం? తగిన కారణాలతో నీ సమాధానం వ్రాయుము?
9. ఢిల్లీ సుల్తాన్‌ల కాలంనాటి భూమిశిస్తు విధానం ఎట్టిది?

**పాఠ్య ప్రశ్నలకు సమాధానాలు**

**47.ఎ**

**1.** ఉన్నత వర్గీయులు విలాస జీవితమును గడిపిరి. వీరు మద్యపానమును సేవించుచూ భోగలాలసముగా గడిపిరి. వీరు అనేక మంది బానిసలను పోషించెడివారు. వీరికి స్వంత భవనాలు ఉండెడివి.

2. కుతుబుద్దీన్ ఐబక్ బానిసలను దయతో చూచెను. శక్తి, సామర్థ్యములు గల బానిసలు ఉన్నత దశకు చేరుకొనిరి.

3. పరదా విధానం, బాల్య వివాహాలు, నిరక్షరాస్యత

4. విదేశీ రచనలు – ఇబన్‌బటూట, అబ్దుల్ రజాక్, నికిటిన్

**47.బి**

1. నిరర్ధక అలవాట్లు, వ్యసనాలు, ఆడంబరాలు మొగలుల పరిపాలనను, ఆర్ధిక వ్యవస్థను నాశనము చేసెను. అనేకమంది రుణగ్రస్తులైరి. అవినీతి అధికమయ్యెను. మొగలుల పాలనా సామర్థ్యము బలహీనపడెను.

2. జమిందార్లు భూస్వాములుగా ఏర్పడిరి. వీరు వంశ పారంపర్య హక్కులను కలిగి ఉండి భూమిశిస్తులను వసూలు చేయుచూ జమిందార్లుగా పిలువబడిరి.

3. వ్యాపారులు, వర్తకులు, వృత్తిపనివారు

4. భిన్న వర్గాల ప్రజలు ఉత్సవాలు, పండుగలను కలిసి జరుపుకొనెడివారు.

5. పరదా విధానం, విద్య లేకపోవుట వలన స్త్రీ అణచివేతకు గురిఅయ్యెను. సతీసహగమనం అరుదుగా జరిగెడిది.

**47.సి**

**1.** అ ల్లాఉద్దీన్ ఖిల్జీ

సమర్ధపాలన

షేర్‌షా

$1^1/_2$ రెట్లు

2 దామ్‌లు

2. వస్త్ర పరిశ్రమ, లోహ పరిశ్రమ, రాతి పరిశ్రమ, చెరకు, నీలిమందు, కాగితం

3. సింధూ నందలి దేబాల్, గుజరాత్ నందలి బ్రోచ్, కాంబే, మహారాష్ట్ర నందలి థానే, విజయనగర సామ్రాజ్యనందలి మంగళూరు, మలబార్ నందలి కాలికట్, క్విలన్

4. సుల్తాన్‌ల కాలం నందలి రహదారుల వెంబడి సరాయిలు నిర్మాణం జరిగి వ్యాపారులకు, రక్షణ కల్పించబడెను. అంచతపాల విధానం ప్రవేశపెట్టబడెను.

5. ఎగుమతులు – వస్త్రాలు, కాగితం, నీలిమందు, నల్లమందు, ఔషధాలు

దిగుమతులు – వెండి, ముడిపట్టు, లోహాలు, విలువైన రాళ్ళు, సుగంధ ద్రవ్యాలు, మద్యం, బానిసలు, గాజు పరికరాలు

6. నిర్ణీత కాలంలో చెల్లుబడి అగురీతిలో ద్రవ్యంను హుండీల పేరుతో చలామణి, రుణసదుపాయాలుగా, ధనమును తీసుకొనిపోవు ప్రయాసల నుండి హుండి విధానం వ్యాపారులకు ఉపయోగపడెను.

7. అనేక విదేశీ కంపెనీలు దేశములో వర్తక వ్యాపారాలను ప్రారంభించినవి. క్రమముగా ఈ కంపెనీలు దేశములో పలు ప్రాంతాలను తమ ఆధీనంలోనికి తీసుకొనినవి. బ్రిటీష్ తూర్పు ఇండియా కంపెనీ తుదకు మొగలుల అధికార పతనానికి కారణమయ్యెను.

**47. డి**

1. ఢిల్లీసుల్తాన్‌ల కాలంలో వ్యవసాయ భూమి నాలుగు రకాలుగా ఉండెను

   ఖాల్సా లేదా చక్రవర్తి భూమి

   ఇక్తా భూమి

   భూస్వాముల ఆధీనంలోని భూమి

   వక్ఫ్‌లేదా ఇనాం భూమి

2. ప్రభుత్వమే నేరుగా భూమిశిస్తును వసూలు చేయు విధానమును తొలిసారి ఖిల్జీ ప్రవేశపెట్టెను. శిస్తును ధనరూపములో వసూలు చేసెను.

3. పంటల వివరాలను సేకరించుటకు అక్బర్ కొనుంగోలను నియమించెను. వీరు వంశపారంపర్య అధికారాలు కలిగి స్థానిక అంశాలపై అవగాహన కలిగి యుండిరి. ఒక కోటి దామ్‌లు భూమిశిస్తు వసూలు చేయు రెవిన్యూ అధికారిని కరోరి అనిరి.

4. అక్బర్ కాలంలో వ్యవసాయ భూమి పోలజ్, పరౌటి, ఛాచర్, బంజర్ అని నాలుగు రకాలుగా వర్గీకరింపబడియుండెను.

# 48

# సూఫీ, భక్తి ఉద్యమాలు

## 48.1 పరిచయం :

మధ్యయుగ భారతదేశంలో రెండు పెద్ద మత ఉద్యమాలు ఉద్భవించాయి. అందులో మొదటిది సూఫీ ఉద్యమైతే, రెండవది భక్తి ఉద్యమం. హిందూ, ముస్లింలలో ఈ రెండు మత ఉద్యమాలు కొత్త భావాలను పెంపొందించాయి. ఇస్లాంలో సూఫీలు ఉదారవాదానికి తెరదీశారు. వారు సార్వజనీన ప్రేమతో కూడిన సమసమాజాన్ని కాంక్షించారు. ఇక పరోక్ష సాధనకు పవిత్రమైన భక్తిని సాధనంగా చేసుకొని హిందుమతాన్ని పరివర్తింప చేయవచ్చని భక్తి ఉద్యమకారులు భావించారు. వారి దృష్టిలో కులానికి ఎలాంటి ప్రాధాన్యత లేదు. మానవులంతా సమానమేనని వారు నమ్మారు. హిందూ, ముస్లిం ఐక్యతకు ఈ సూఫీ, భక్తి ఉద్యమ సంస్కర్తలు కృషి చేశారు. వీరు తమ బోధనలను వివరించడానికి స్థానిక భాషలను ఉపయోగించడం వల్ల వీటిని ప్రజలు తేలికగా అర్థం చేసుకోగలిగారు.

## 48.2 లక్ష్యాలు :

ఈ పాఠం చదివిన తర్వాత మీరు క్రింది విషయాలను తెలుసుకోగలగాలి.

1. సూఫీ ఉద్యమ నేపథ్యం
2. సూఫీల ప్రధాన ఆజ్ఞలను గుర్తించగలగాలి.
3. సూఫీ సిద్ధాంతానికి ఆధారమైన నియమాలు
4. గురునానక్, కబీర్ భక్తి ఉద్యమ నాయకుల తత్వం
5. వైష్ణవ భక్తి ఉద్యమకారుల పాత్ర
6. భారతీయ సంస్కృతి అభివృద్ధిలో సూఫీ, భక్తి ఉద్యమ నాయకుల సేవలు.

## 48.3 సూఫీ ఉద్యమం :

ఇస్లాం మతాన్ని మహమ్మద్ ప్రవక్త స్థాపించాడని మీకు తెలుసు. అయితే ఈ ఇస్లాం ద్వారానే అనేక మత

ఆధ్యాత్మిక ఉద్యమాలు ఉద్భవించాయి. ఇవన్నీ కూడా ఖురాన్‌ను వివిధ రకాలుగా వ్యాఖ్యానించాయి. దీనిలో ప్రధానంగా షియా, సున్నీ అనే రెండు శాఖలు ఉన్నాయి. ఈ రెండు కేవలం మతపరంగానే కాకుండా రాజకీయంగా కూడా విభజించబడ్డాయి. మధ్యయుగ భారతదేశంలో ఉత్తర భారతదేశాన్ని పాలించిన పాలకులు సున్నీమత శాఖను విశ్వసించారు. అయితే ఇందుకు భిన్నంగా దక్షిణ భారత రాజ్యాలయిన అహ్మద్‌నగర్, బీజాపూర్, గోల్కొండ పాలకులు షియా మతాన్ని ఆదరించారు. ఈ షియా మత విస్వాసులు ఇరాన్‌లోని షియాసఫాలిద్ పాలకులతో సన్నిహిత సంబంధాలు కొనసాగించారు.

సున్నీలలోని ఇస్లాం చట్టంలో ప్రధాన సిద్ధాంతాలున్నాయి. ఇంకా ఖురాన్, అధీన్ మీద ఆధారపడి ఉన్నాయి. (మహమ్మద్ ప్రవక్త బోధనలు). మొదటి వాటిని 8వ శతాబ్దానికి చెందిన హనాఫీ విభాగాన్ని భారతదేశానికి వచ్చిన తురుష్కులు అవలంబించారు.

అయితే సాంప్రదాయ సున్నీ మతతత్వానికి మొదటిసారిగా భగవంతుడు ఒక్కడే అని ప్రబోధించిన 'ముతజిలాస్'(mutazilas) నుండి సవాల్ ఎదురైంది. వారి దృష్టిలో మానవుడు చేసే దుశ్చర్యలకు దేవుడి బాధ్యత లేదు. మానవుల చర్యలకు వారే బాధ్యులు. అయితే అబ్‌హసన్ అషారి(873-935క్రీ.శ) స్థాపించిన అషారి విభాగాన్ని ముతజిలాస్ భావనలను వ్యతిరేకించింది. వీరు సాంప్రదాయ సిద్ధాంతాలను సమర్ధిస్తూ వాదించారు. వీరు దేవుడి కన్నీ తెలుసు.. అతను చూడగలడు..మాట్లాడగలడు అని బలంగా విశ్వసించారు. ఇంకా ఖురాన్ శాశ్వతమైంది ఎవరూ సృష్టించలేదని భావించారు. ఈ భావాలను హమీద్ అల్ ఘజాలి(1088-1111క్రీ.శ) వ్యాప్తి చేశాడు. ఇతను ఈ రెండు భావాల మధ్య సయోధ్యకు ప్రయత్నించాడు. ఈ గొప్ప సిద్ధాంతకర్త క్రీ.శ.1085నుండి సూఫీగా జీవితం ప్రారంభించాడు. అయినప్పటికీ సాంప్రదాయ భావనలను, సూఫీ తత్వాన్ని సమానంగా గౌరవించాడు. అల్‌ఘజాలి సాంప్రదాయ సున్నీ శాఖలు కానివాటిని తీవ్రంగా విమర్శించాడు. కారణం ద్వారా మాత్రమే సానుకూల జ్ఞానం పొందలేమని సహజ అనుభవాలతోనే అది కల్గుతుందని ఆయన చెప్పారు. అనేకమైన నిగూఢ విషయాలను 'ఖురాన్' తెల్పుతుందని ఆయన భావించారు.

ఘజాలీ భావాల ప్రభావంతోనే రాజ్యం నూతన విద్యావిధానాన్ని ప్రారంభించింది. ఈ భావాలను 'మదరసా'ల ద్వారా ప్రసంగాల ద్వారా వ్యాప్తి చేయడానికి మేధావులు ప్రయత్నించారు. ఈ సాంప్రదాయ సున్నీ మత భావాలను ప్రభుత్వ నిర్వహణకు సమన్వయపరిచారు. ఈ మేధావులనే 'ఉలేమాలు' అనేవారు. మధ్యయుగ భారతదేశ రాజకీయ చరిత్రలో ఈ 'ఉలేమాలు' కీలకపాత్ర నిర్వర్తించారు.

ఈ ఉలేమాలు సూఫీలకు వ్యతిరేకులు. సూఫీలు మార్మికవాదులు. దైవభక్తి గల ఈ సూఫీలు రాజకీయ, మతరంగాలలో వచ్చిన అవాంఛనీయమైన మార్పులకు కలతచెందారు. చక్రవర్తుల ప్రాపకం కోసం వారికి సేవచేస్తూ తద్వారా లభిస్తున్న సంపదను బహిరంగంగా ఉలేమాలు ప్రదర్శించడాన్ని సూఫీలు వ్యతిరేకించారు. రాజ్యంతో సంబంధం లేకుండా ప్రశాంతమైన ఆధ్యాత్మిక జీవితాన్ని ఈ సూఫీలు గడిపేవారు. ఉలేమాలను సూఫీతత్వం కూడా విభేదించింది. సూఫీలు ఈ స్వేచ్ఛా భావాలను ఉదారవాదాన్ని ప్రోత్సహించారు. మతంలో ఉన్న మూఢత్వాన్ని సాంప్రదాయ పూజాపునస్కారాలను సూఫీలు వ్యతిరేకించారు. మతపరమైన సంతృప్తి పొందడానికి ధ్యానాన్ని మార్గంగా వారు భావించారు. భక్తి ఉద్యమ సాధువుల మాదిరిగానే వీరు కూడా మానవసేవే మాధవసేవగా, భగవంతుడిపై స్వచ్ఛమైన ప్రేమ కలిగి ఉండటమే నిజమైన మతవిధానంగా వ్యాఖ్యానించారు. అయితే కాలక్రమంలో ఈ సూఫీతత్వంలో భిన్నశాఖలు వివిధ సిల్‌సిలాస్(ఆజ్ఞలు)గా చీలిపోయాయి. ప్రతి సిల్‌సిలాస్ ఒక పఖ్వాజా లేక షేక్ అనబడే పీర్ (గురువు)ను కలిగి ఉండేది.

ఈ పీర్ అతని శిష్యులు ఖాంక్(Khangah)(మతాచారులు ఉండే గృహాలు) లలో నివసించేవారు. వీరు తమ కార్యక్రమాలను కొనసాగించడానికి తమ శిష్యులలో ఒకరిని నియమించేవారు. మార్మిక సిద్ధాంతాలను భావపరంపరలను ప్రజలకు వివరించడానికి సమాజ్(Samas= భక్తిపాటలు) అని పిలిచే ప్రార్ధనా కార్యక్రమాలను సూఫీలు నిర్వహించేవారు. సూఫీల కార్యక్రమాలకు ప్రధానకేంద్రంగా 'బస్రా'(Basra) ఉండేది. అయితే ఈ సూఫీలు కొత్త మతాన్ని సృష్టించినప్పటికీ ఇస్లాం మత చట్రంలోనే నైతికతతో కూడిన స్వేచ్ఛా ఉద్యమాన్ని ప్రబోధించారు.

## భారతదేశంలో సూఫీ తత్వం :

పదకొండు, పన్నెండు శతాబ్ధాలలో సూఫీతత్వం భారతదేశంలో అవతరించింది. భారతదేశంలో స్థిరపడ్డ సూఫీలలో క్రీ.శ.1089లో మరణించిన అల్-హజ్వారి ఒకరు. విరివిగా దానధర్మాలు చేయడం వల్ల ఇతనికి దాతాగంజ్ భక్ష్ అని పిలిచేవారు. ప్రారంభంలో పంజాబ్ ముల్తాన్ సూఫీలకు ప్రధాన కేంద్రంగా ఉండేది. 13,14వ శతాబ్ధాల కల్లా ఇది కాశ్మీర్, బీహార్, బెంగాల్, దక్కన్‌లకు వ్యాప్తి చెందింది. అయితే ఈ సూఫీయిజం భారతదేశానికి రాకపూర్వమే భిన్న రూపాలలో ఉండేది. దీనికి నైతిక సూత్రాలు, బోధనలు, ఆజ్ఞలు, ఉపవాస పద్ధతులు ఖ్వాంక్(సూఫీలు నివసించే గృహాలు)లలో పాటించే పద్ధతులు అన్నీ కూడా అంతకుముందు నుండి ఉన్నవే. ఈ సూఫీలు తమంతతామే ఆఫ్ఘనిస్తాన్ మీదుగా ఇండియాకు వచ్చారు. సూఫీల నిబద్ధత, స్వచ్ఛమైన ప్రేమ, భక్తిభావం, మానవత, సేవలకు భారతీయ సమాజం కూడా ఆకర్షితులై ఉన్నతమైన స్థానం కల్పించింది.

అబుల్‌ఫజల్ తన 'ఐనీ అక్బరీ'లో(Ain-I-Akbari) సూఫీలలోని 14 ఆజ్ఞలు(Silsilahs) గురించి వివరించాడు. ఇప్పుడు వాటినన్నింటి గురించి తెలుసుకోనవలసం లేనప్పటికి ప్రధానమైన కొన్నింటి గురించి చర్చిద్దాం. ఈ ఆజ్ఞలు(Silsilahs) రెండింటిగా విభజించబడ్డాయి. అవి భాశరియా, బే-షరియా. భా-షరియా ఇస్లామిక్ చట్టంలోని (షరియత్) అదేశిక సూత్రాలయిన నమాజ్, రోజాలను పాటిస్తుంది. వీటిలో ప్రధానంగా చిష్టి, సూహ్రవాది, ఫిర్దౌసి, ఖాదిర్, నక్షబందీ, సిల్‌సిలాస్ ఉన్నాయి. అయితే బే-షరియా సిల్‌సిలాస్ మాత్రం 'షరియా'కు కట్టుబడి ఉండదు. 'ఖలాందర్లు'(Qalandars)దీనిలో భాగంగా ఉన్నారు.

## చిష్టీ సిల్‌సిలా :

దీనిని హెరాట్‌కు సమీపంలోని ఖ్వాజా చిస్తీ అనే గ్రామంలో గుర్తించారు. భారతదేశంలో ఇది క్రీ.శ.1142లో జన్మించిన ఖ్వాజామొయినొద్దీన్ చిస్తీ చేత ప్రారంభించబడింది. ఇతను క్రీ.శ. 1192లో భారతదేశానికి వచ్చారు. తన బోధనలకు ప్రధానకేంద్రంగా అజ్మీర్‌ను చేసుకున్నాడు. మానవులకు సేవ చేయడమే అత్యున్నమైనదని విశ్వసించిన ఖ్వాజామొయినొద్దీన్ తన జీవితమంతా బలహీనవర్గాల అభ్యున్నతి కోసమే కృషిచేశాడు. క్రీ.శ.1236లో అజ్మీర్‌లో మరణించాడు. ఇతని సమాధిని మొఘల్ చక్రవర్తులు తరచుగా సందర్శించడం వల్ల మొఘులుల కాలంలో ఆజ్మీర్ ప్రసిద్ధయాత్రా స్థలంగా పేరుగాంచింది. వాటికి అనేకమంది హిందూ, ముస్లిం భక్తులు ఈ దర్గాలను తమ కోర్కెలు తీర్చే పవిత్రస్థలంగా భావించి సందర్శిస్తారు. ఇతని శిష్యులలో ముఖ్యులు నాగ్‌పూర్‌కు చెందిన షేక్ హమీదుద్దీన్, కుతుబుద్దీన్ భక్తియార్ కాకి. వీరిలో షేక్ హమీదుద్దీన్ చక్రవర్తి ఇల్‌టుట్‌మిష్ బహుమానంగా ఇచ్చిన గ్రామాలను కూడా తిరస్కరించి పేదరైతుగానే జీవితం గడిపాడు. ఇతను శాఖాహారి. ఇక కుతుబుద్దీన్ భక్తియార్ కాకి నివసించే 'ఖాంక్'ను(Khangah)కూడా అన్ని వర్గాల ప్రజలు సందర్శించేవారు. చక్రవర్తి ఇల్‌టుట్‌మిష్ కుతుబ్‌మినార్‌ను ఈ సాధువుకు అంకితమిచ్చాడు.

ఆధునిక పంజాబ్, హర్యానాలలో చిస్టీ ఆజ్ఞలను(సిల్‌సిలాల్) అజ్‌ధర్‌కు చెందిన ఫరీదాదీ ప్రచారం చేశాడు. ప్రేమ దయలను ప్రవచిస్తూ ప్రజలకు అన్నివేళలా అందుబాటులో ఉండేవాడు. బాబాఫరీద్ అనే ఇంకొక సాధువును కూడా హిందూ, ముస్లీం ప్రజలు గౌరవించేవారు. ఇతను పంజాబ్‌లో రాసిన కొన్ని పద్యాలు 'ఆదిగ్రంధ్'లో కూడా ఉన్నాయి.

ఈ బాబాఫరీద్ ప్రియశిష్యుడే షేక్ నిజామొద్దీన్ ఔలమా(11238–1335) ఢిల్లీ చిస్తీల ప్రధానకేంద్రం కావడానికి కారకుడు. ఇతను క్రీ.శ.1259లో ఢిల్లీ వచ్చారు. తన 60 సంవత్సరాల ఢిల్లీ జీవితంలో దాదాపు ఏడుగురు చక్రవర్తుల పాలనను చవి చూశాడు. ఆ అనుభవంతోనే రాజ్యవ్యవహారాలలో కులీనుల పాత్రను నిరసిస్తాడు. పేదలకు వస్త్రాలు, భోజనం పెట్టడమే గొప్ప భక్తిపూర్వపు చర్యగా ఇతడు భావిస్తాడు. ఇతని అనుచరులలో ముఖ్యుడు ప్రఖ్యాత రచయిత చరిత్రకారుడు అమీర్‌ఖుస్రూ.

తర్వాత చివరి గొప్ప చిస్టీ సాధువు షేక్ నసీరుద్దీన్ మహమ్మద్. ఇతనే 'ఢిల్లీ దీపం'గా (Chirag-i-Delhi)గా ప్రసిద్ధి. క్రీ.శ.1356లో ఇతని మరణం తర్వాత ఛిస్టీ సాధువులు ఈశాన్య భారతదేశానికి, దక్షిణ భారతదేశానికి వలసవెళ్ళారు.

ఈ చిస్టీ సిల్‌సిలాను షేక్ సిరాజుద్దీన్ క్రీ.శ.1357లో బెంగాల్‌కు పరిచయం చేశాడు. ఈ సూఫీ బోధనలకు భక్తి ఉద్యమానికి అనేక సారుప్యాలుండేవి. బెంగాల్ పాలకులు హిందూ సాహిత్యంలోని చాలా భాగాన్ని బెంగాలీ భాషలోకి అనువదించారు. ఇక దక్షిణ భారతదేశంలోని సయ్యద్ మహమ్మద్ గౌస్ దరాజ్(క్రీ.శ.1442) ప్రసిద్ధ చిస్టీ సాధువు. ఇతని ప్రభావం వల్లనే బహుమనీ సుల్తానులు అనేక ఉదార భావాలను అవలంభించారు. 14,15వ శతాబ్దాలలో ఈ చిస్టీ సాధువులు ప్రజలు గౌరవాభిమానాలను పొందారు. 16వ శతాబ్దంలో ప్రసిద్ధ సూఫీ సాధువుగా పేరుగాంచినవారు షేక్ సలీం చిస్తీ. ఇతని పట్ల చక్రవర్తి అక్బర్‌కు ఎనలేని విశ్వాసం ఉండేది. క్రీ.శ.1566లో తనకు రాజకుమారుడు సలీం జన్మించడం ఈ సాధువు ప్రార్ధనల వల్లనే అని విశ్వసించాడు. ఈ సాధువుపై ప్రేమతోనే అక్బర్ ఫతేపూర్ సిక్రీని నిర్మించాడు.

**సుహ్రావార్ది సిల్‌సిలా :**

ఈ సిల్‌సిలాను షేక్ షియాబుద్దీన్ సుహ్రావార్ది స్థాపించారు. దీనిని భారతదేశంలో వ్యాపింపచేసినారు షేక్ బహద్దీన్ జకారియా(1182–1262). ఇతను ముల్తాన్‌లో స్థాపించిన మతకేంద్ర (Khagah) పాలకులు, దీనిని ప్రభుత్వ అధికారులు, ధనవంతులైన వర్తకులు సందర్శించేవారు. ఈ షేక్ బహద్దీన్ జకారియా చక్రవర్తి ఇల్‌టుట్‌మిష్‌కు ఖబాచాకు మధ్య జరుగుతున్న వివాదాలలో పూర్తిగా చక్రవర్తినే సమర్ధించి అతనిచే ఇస్లాం నాయకుడనే(Shaiku/Islam leader of Islam)బిరుదు పొందాడు. మిగతా సాధువుల మాదిరిగా కాకుండా ఈ సుహ్రావాదిలు రాజ్యంలో సన్నిహిత సంబంధాలు కొనసాగిస్తారు. చక్రవర్తి, రాజ్యం ఇచ్చిన బహుమతులను, జాగిర్లను, వివిధ ప్రభుత్వ శాఖాధిపతులుగా నియమించడాన్ని అంగీకరిస్తారు. ఈ సుహ్రావార్ది సిల్‌సిలా, పంజాబ్, సింద్‌లలో బలంగా స్థిరపడింది. తర్వాత షేక్ జులాలుద్దీన్ బెంగాల్‌లో నివాసస్థలం(Khagah)ను స్థాపించి వ్యాప్తి చేశాడు. ఇవికాక ఫిర్దౌసి, సిల్‌సిలాహి, షట్టారి సిల్‌సిలా, ఖాదిరి సిల్‌సిలా, నక్ష్‌బంది సిల్‌సిలాలు ప్రధానంగా వున్నాయి.

## 48.4 సూఫీ ఉద్యమ ప్రాముఖ్యత :

ఈ సూఫీ ఉద్యమం భారతీయ సమాజానికి విలువైన సేవలందించింది. భక్తి ఉద్యమం ఏవిధంగానైతే హిందూ

మతంలోని మూఢాచారాలను బద్దలుకొట్టిందో అదేవిధంగా సూఫీ తత్వం ఇస్లాంలో ఉదారవాదానికి ప్రవేశం కల్పించింది. 15వ శతాబ్దంలో వచ్చిన ఉదారవాదానికి ఈ భక్తి, సూఫీ ఉద్యమాలే భూమికను ఏర్పరిచాయి. కబీర్, గురునానక్‌లు కూడా విశ్వజనీన ప్రేమ భావననే వ్యాప్తి చేశారు. సూఫీలు ఐకమత్య భావనను(Unity of being) Wahdat-ul-wajnd)విశ్వసిస్తారు. దీన్ని ముఖ్యంగా ఐబన్–ఐ–అరబీ(Ibn-i-Arabi)(1165–1240) ప్రచారం కల్గించాడు. సర్వ మానవులు, భిన్న మతాల సారమంతా ఒక్కటేనని అభిప్రాయపడ్డాడు. ఇది భారతదేశంలో బహుళ ప్రజాదరణను పొంది హిందూ సాధువులు, సూఫీలు పరస్పరం తమ భావాలను పంచుకునేవారు. హర–మోగి, అమృతకుందా అరబిక్, పర్షియా భాషల్లోకి అనువదించారు.

సమాజంలో ఉన్న పేద అణచబడ్డ వర్గాల అభ్యున్నతి కోసం సూఫీలు ఎనలేని కృషి చేశారు. నిజానికి చక్రవర్తి, ఉలేమాలు తమ వ్యక్తిగత స్వార్థం కోసం వివాదాలలో మునిగితేలుతుండగా సూఫీ సాధువులు మాత్రం ప్రజలతో సన్నిహిత సబంధాలు కొనసాగిస్తూ వారి కష్టసుఖాలలో పాలుపంచుకునేవారు. దీనిలో కులమత భేదాల కతీతంగా నిజామొద్దీన్ ఔలియా పేదలకు దానధర్మాలు చేసేవాడు. తన నివాసం(Khagah)కి వచ్చిన ప్రతి సందర్శకున్ని కలిసేవరకు విశ్రాంతి తీసుకోనని చెప్పేవాడు. సూఫీతత్వం ప్రకారం ప్రజలకు సేవ చేయడమే దేవుడికి చేసే గొప్ప పూజ. అందుకే సంకుచిత భక్తి భావాలకు సూఫీ తత్వంలో స్థానంలేదు. హిందూ, ముస్లింలు సమానమేనని సూఫీలు విశ్వసించేవారు.

మానవులలో సోదరభావాన్ని సూఫీతత్వం ప్రోత్సహించింది. సమానత్వ భావనను కలిగిఉన్న ఇస్లాం పై సూఫీలకున్న గౌరవభావంలో ఉలేమాలు సగం కూడా కల్గిలేరు. ఉలేమాలు ఖురాన్ బోధించిన ప్రజాస్వామిక సూత్రాలనుండి దూరం జరిగారని సూఫీలు భావించారు. సూఫీ సాధువు నిజామొద్దీన్ ఔలియాపై చర్య తీసుకోమని సుల్తాన్ గియాసుద్దీన్ తుగ్లక్‌ను ఉలేమాలు ఒత్తిడి చేశారు. ఈ రెండింటి మధ్య విభేదాలు క్రీ.శ. 16, 17, 18వ శతాబ్దమంతా కొనసాగాయి.

సూఫీ సాధువులు సాంఘీక సంస్కరణలను కూడా ప్రోత్సహించారు. సమాజంలో ఉన్న అసూయ, ద్వేషాన్ని తొలగించాలని విశ్వజనీన ప్రేమను వ్యాప్తి చేయుట కోసం కృషి చేశారు. సూఫీ రచయితలు జామీఉద్దీన్ బరౌని, అమీర్‌ఖుస్రూలు సాంఘిక దురాచారాలను వివరిస్తూ అవి రూపుమాపటానికి ప్రయత్నించాలని కోరారు.

భక్తి ఉద్యమ నాయకుల మాదిరిగానే సూఫీ సాధువులు కూడా ప్రాంతీయ భాషా సాహిత్యాల అభివృద్ధి కోసం విశేషంగా కృషి చేశారు. సూఫీలలో చాలామంది కవులున్నారు. వారు తమ కవిత్వాన్ని స్థానిక భాషలలోనే రాశారు. మత పరమైన సాహిత్య సృష్టిలో పంజాబీ భాషనుపయోగించాలని బాబాఫరీద్ కోరాడు. ఇతనికంటే ముందు షేక్ హమీదుద్దీన్ 'హింది'భాషలో రాశారు. పర్షియన్ మార్మిక కవిత్వం నుండి ఈ భాషలోకి అనువదించబడిన అతని పద్యాలే దీనికి చక్కటి ఉదాహరణగా ఉన్నాయి. ఇక దక్కన్ హిందీలో సయ్యద్ గేసు దరాజ్ మొదటి రచయిత మార్మిక వాదాన్ని వివరించడానికి పర్షియన్ భాషకన్నా హిందీ భాష సరళంగా తేలికగా అర్ధమయ్యేవిధంగా ఉంటుందని ఆయన గుర్తించారు. సూఫీ సాహిత్యం బెంగాలీ భాషలో కూడా చెప్పుకోదగ్గ స్థాయిలో సృష్టించబడింది.

అయితే నిజామొద్దీన్ ఔలియా శిష్యుడయిన అమీర్‌ఖుస్రూ (క్రీ.శ.1252–1325) ప్రసిద్ధి చెందిన రచయిత. భారతీయ చరిత్ర సంస్కృతిని అమితంగా ప్రేమించిన అమీర్‌ఖుస్రూ హిందీభాషలో పద్యాలు రాశాడు. ఇతను సబక్–ఐ–హిందీ(Sabaq-i-hindi)అనే నూతన రచనాశైలిని సృష్టించాడు. 15వ శతాబ్దంనాటికి హిందీ భాష ఒక స్థిర రూపాన్ని సంతరించుకొంది. దీన్ని కబీర్‌వంటి భక్తి ఉద్యమ సాధువులు విస్తృతంగా వినియోగించారు.

మార్మికవాదులైన సూఫీలు ఇస్లాం మతానికి లోబడే ఉదారవాద భావాల వ్యాప్తిని ప్రోత్సహించారు. వారు వివిధ సిల్‌సిలాస్‌లుగా చీలిపోయారు. అందులో చిష్టీ, సుహ్రావాది, ఫిర్దౌసి భారతదేశంలో ప్రధానంగా ఉన్నాయి. మధ్యయుగ భారతదేశంలో సాంఘిక, మత ఉద్రిక్తతలను తగ్గించడంలో సూఫీల ఉదారవాదం ఎంతో తోడ్పడింది.

**పాఠ్యాంశ ప్రశ్నలు**

1. ఇస్లాంలోని రెండు పెద్ద శాఖలు ఏవి?
2. సూఫీలు, రాజ్యం,అధికార వ్యవస్థలకు దూరంగా ఎందుకు ఉన్నారు?
3. బా-షరియా, బే-షరియా సిల్‌సిలాస్‌ల మధ్య బేధాలను వర్ణించండి.
4. చిష్టీ, సుహ్రావాది సిల్‌సిలాస్‌లను భారతదేశంలో నెలకొల్పింది ఎవరు?
5. సూఫీ భావాలలో ప్రభావితమైన 15వ శతాబ్ధానికి చెందిన భక్తి సాధువులు ఎవరు?

## 48.5 భక్తి ఉద్యమం :

క్రీ.శ మొదటి శతాబ్ధాల్లోనే కృష్ణుడు, రామున్ని దేవుడిగా కొలవడం మనకు తెలిసిందే. బహుశా ఇదే భక్తికి తొలిరూపమై ఉండవచ్చు. ఏమైనప్పటికి క్రీ.శ.7,12 శతాబ్ధాల మధ్య తమిళనాడులో భక్తిఉద్యమంలో గణనీయమైన అభివృద్ధి జరిగింది. ఇదే శివ భక్తులయిన 'నయనార్లు' వైష్ణవ భక్తులయిన ఆళ్వార్ల సాహిత్యంలో ప్రతిబింబిస్తుంది. ఈ సాధువులు మతాన్ని కేవలం సాధారణ పూజా పునస్కారాల వరకే చూడకుండా భగవంతునికి భక్తునికి మధ్య నిజమైన ప్రేమబంధానికి ప్రతీకగా భావించారు. వారు తమ భావాలను స్థానిక భాషలయిన తెలుగు, తమిళంలో రాయడం వల్ల అత్యధిక ప్రజానీకం వాటిని అర్థం చేసుకొనగలిగారు.

ఈ భావాలు దక్షిణ భారతదేశం నుండి ఉత్తర భారతదేశానికి నెమ్మదిగా చేరగల్గాయి. ఈ భావాల వ్యాప్తికి ఒక వాహకంగా సంస్కృతం కొత్త రూపాన్ని తీసుకుంది. అందువల్లనే తొమ్మిదవ శతాబ్ధపు భాగవత పురాణం పాత పురాణ పద్ధతిలో రాయలేదు. ఇందులోని ప్రధాన విషయాలైన శ్రీకృష్ణుని బాల్యం, యౌవ్వనం, కృష్ణతత్వం తేలికైన పదాలతో అందరికి అర్థమయ్యేవిధంగా వివరించారు. వైష్ణవ ఉద్యమానికి చరిత్రలో ఇది ఒక మైలురాయిగా చెప్పవచ్చు. అయితే ఈ భక్తి భావాల వ్యాప్తిలో స్థానిక భాషల పాత్ర చిరస్మరణీయమైనది. భక్తి ఉద్యమ సాధువులు తమ పద్యాలను స్థానిక భాషలలో రాశారు. విస్తృతస్థాయిలో ప్రజానీకానికి తమ భావాలు చేరువకావడానికి సంస్కృత భాషలో ఉన్న సాహిత్యాన్ని కూడా స్థానిక భాషల్లోకి అనువదించుకున్నారు. అందుకే మరాఠిలో జ్ఞానదేవుని సాహిత్యాన్ని , హిందీలో కబీర్, సూర్‌దాస్, తులసీదాస్‌ల సాహిత్య కృషిని గమనించవచ్చు. అదేవిధంగా అస్సాంలో శంకరదేవుడు, బెంగాలీలో చైతన్య, చండీదాస్, హిందీ, రాజస్థానీలలో మీరాబాయిల సాహితీ కృషి ప్రశంసార్హం. దీంతోపాటు కాశ్మీరీ, తెలుగు, కన్నడ, ఒరియా, మళయాలం, మైధిలి, గుజరాతీలలో భక్తి కవిత్వం విరివిగా సృష్టించబడింది.

భక్తి ఉద్యమం హిందూమత పునరుజ్జీవనానికి కారకమైంది. భగవంతుని పూజా రూపాలలో సగుణ, నిర్గుణ అనే రెండురకాల విశ్వాసాలున్నాయి. నిర్గుణ సాంప్రదాయాలను పాటించేవారు. కుల, మతాలలో పాతుకుపోయిన అన్ని రకాల మూఢాచారాలను, విగ్రహారాధనను వ్యతిరేకించారు. సచ్ఛీలత, మానవత ప్రాధాన్యాన్ని వారు నొక్కి చెప్పారు.

ఇక 'సగుణ' విశ్వసించేవారు దేవుని ఒక్కో ప్రత్యేక రూపంలో పూజించేవారు. ఉదాహరణకు రాముడు, కృష్ణుడు. వీరిలో రామభక్త తులసీదాస్ కృష్ణ భక్తురాలు మీరాబాయి మున్నగువారు ఉన్నారు.

భక్తి ఉద్యమం మోక్షసాధనకు అందరూ అర్హులేనని విశ్వసించేది. దేవుని ముందు కుల, మత బేధాలు ఏవీ ఉండవని భావించేవారు. ఈ భక్తి ఉద్యమ సాధువులంతా కూడా భిన్న నేపథ్యాల నుండి వచ్చినవారే. రామానందుడి శిష్యులలో సాంప్రదాయ బ్రాహ్మణ కుటుంబాల నుండి వచ్చినవారే కాక హిందూ, ముస్లింలు కూడా ఉన్నారు. అతని శిష్యుడు కబీర్ నేతకారుల కుటుంబం నుండి వచ్చినవాడు. అదేవిధంగా గురునానక్ గ్రామ పట్వారి కుమారుడు. నామ్‌దేవ్ దర్జీ. ఈ భక్తి ఉద్యమం సాధువులంతా కూడా మూఢాచారాలతో కూడిన మతతత్వాన్ని, కులవ్యవస్థను నిరసిస్తూ సమానత్వ సిద్ధాంతాన్ని ప్రోత్సహించారు. వీరంతా కేవలం మత భావాల వరకే పరిమితం కాకుండా సాంఘీక సంస్కరణలను కూడా ప్రతిపాదించారు. భ్రూణ హత్యలను, సతిని తీవ్రంగా వ్యతిరేకించారు. స్త్రీలను కూడా కీర్తనలలో పాల్గొనడానికి సృష్టించడానికి ప్రోత్సహించారు. ఈనాటికి మీరాబాయి, కాశ్మీర్‌కు చెందిన లల్లాదేరిలు రాసిన పద్యాలు ప్రజాదరణను నోచుకుంటూనే ఉన్నాయి.

నిర్గుణ భక్తి సాధువులలో కబీర్, గరునానక్ సేవలు ప్రశంసనీయమైనవి. వారి భావాలు హిందూ, ముస్లిం సాంప్రదాయాల నుండి తీసుకున్నవే. హిందూ, ముస్లింల మధ్య ఐక్యతకు తోడ్పడేవే. వీరి గురించి వివరంగా తెలుసుకుందాం. కబీర్ (క్రీ.శ.1440–1518) బ్రాహ్మణ వితంతువుకు జన్మించి విడిచిపెట్టబడినాడు. ఇతనిని ముస్లీం నేతకారుడు పెంచి పెద్ద చేశాడు. భక్తిని వ్యక్తిగతంగా అనుభవించడమే దేవుడిని చేరే మార్గమని కబీర్ విశ్వసించాడు. భగవంతుడు ఒక్కడేనని నమ్మాడు. అయితే తన దేవుడిని రామా, హరి, అల్లా, రహీం, ఖుదా, నిర్గుణ అని పిలుస్తారన్నాడు. ముస్లింలు ఇతనిని సూఫీ అన్నారు. హిందువులు రామభక్తుడన్నారు. సిక్కులు కబీర్ పాటలను తమ పవిత్ర గ్రంథమైన ఆదిగ్రంథ్‌లో చేర్చారు.

బాహాడంబరాలతో కూడిన మతం అర్ధరహితమని కబీర్ బోధించారు. రాతి విగ్రహాన్ని పూజిస్తే దేవుడు అనుగ్రహిస్తాడనుకుంటే తాను పెద్ద పర్వతాన్నే పూజిస్తానని చెప్పారు. పూజించాలనుకుంటే రాతి విగ్రహంకన్నా రుబ్బురోలును పూజించడం నయమని కనీసం అది కడుపునన్నా నింపుతుందని రాశారు.

అదేవిధంగా పుష్కరాలలో స్నానం చేయడం నమాజ్, దేవాలయాలను సందర్శించడం ఉపయోగంలేనివని మోక్షసాధనకు పవిత్రమైన భక్తే మార్గమని ఆయన బోధించాడు. కబీర్ మతవ్యవహారాలలో నిరాడంబరత ప్రాధాన్యాన్ని నొక్కి చెప్పారు. భక్తి ద్వారానే భగవంతుడిని చేరడం సులభమని పేర్కొన్నాడు. తర్కరహితమైన మతనమ్మకాలను కబీర్ అంగీకరించలేదు. కష్టపడకుండా విజయము సాధ్యమని కబీర్ భావించాడు. హిందూ, ముస్లింలు కబీర్ భావాలకు ఆకర్షితులై శిష్యులయ్యారు.

కబీర్ భావాలు మతం వరకే పరిమితమైనవి కావు. సమాజంలోని సంకుచిత భావాలను మార్చడానికి ప్రయత్నించాడు. అతని కవిత్వం వ్యాకరణ రహితంగా ఉన్నప్పటికి ప్రజలు దైనందిన భాషలో ఉండటం వల్ల భావాలను సులభంగా అర్థంచేసుకొని ఆదరించగలిగారు.

నిర్గుణ భావాలను వ్యాప్తి చేసిన మరొక ప్రఖ్యాత వ్యాఖ్యాత గురునానక్(క్రీ.శ.1469–1539) ఇతను దాల్వండి (నకాలాసాహిద్)లో జన్మించాడు. బాల్యంనుండే ఆధ్యాత్మిక జీవితం పట్ల ఆసక్తి కనబర్చాడు. పేదలను అవసరమున్న

వారిని అన్నివేళలా ఆదుకునేవాడు. తన భావాల వ్యాప్తి కోసం తనతోపాటు సంగీతకారుడు మిర్దనాతో కలిసి భారతదేశం సిలోన్, మక్కా, మదీలాలలో విస్తృతంగా పర్యటించాడు. గురునానక్ బోధనలు కులరహిత, సమాజాన్ని కాంక్షిస్తూ విశ్వజనీన ప్రేమను బోధించాయి. మూఢాచారాలకు వ్యతిరేకంగా ఏకేశ్వరోపాసనను వివరించాయి. ఇతని శిష్యులనే సిక్కులు అంటారు. ఈ పదాన్ని సంస్కృతంలో ఉన్న సిస్యా నుండి తీసుకున్నారు.

దేవుడు సర్వాంతర్యామి అని గురునానక్ బోధించాడు. ఈ సృష్టిలోని ప్రతి దాంట్లో దేవుడుంటాడని అతనికి రూపంలేదని అనంతమైనదని బోధించాడు.

గురునానక్ వ్యక్తిత్వం నిరాడంబరత, ప్రశాంతతో కూడినటువంటిది. పతనమవుతున్న నైతిక విలువలు అవినీతి చర్యలను ఈ సమాజం నుండి రూపుమాపడం గురునానక్ లక్ష్యం. సమసమాజాన్ని రూపొందించడానికి అతను నూతన దారిని చూపించాడు. కబీర్ మాదిరిగానే ఇతను కూడా సంఘసంస్కర్త ఇంకా మతగురువు కూడా. సమాజంలో మహిళల స్థాయి పెరగాలని కాంక్షించాడు. చక్రవర్తులకు జన్మనిస్తున్న స్త్రీ చెడు మాట్లాడకూడదని బోధించాడు. ఇతని బోధనలను ఇతర సిక్కు గురువుల బోధనలను సిక్కుల పవిత్ర గ్రంథమైన గురుగ్రంథ్‌సాహిబ్‌లో వివరించారు.

## వైష్ణవ ఉద్యమం :

నిర్గుణ స్వరూపుడైన భగవంతుని గురించి బోధించిన కబీర్, నామ్‌దేవ్, గురునానక్‌ల గురించి ఇంతకుముందే చదువుకున్నాము. అదే సమయంలో సాకర్ అనే ఇంకొక దైవమతం కూడా అభివృద్ధి చెందింది. దీన్ని వైష్ణవ ఉద్యమం అంటారు. విష్ణువు అవతారాలయిన రాముని, కృష్ణుడిని పూజించడం ఇందులో ప్రధానమైంది. ఈ భావాలను ప్రధానంగా వ్యాప్తి చేసినవారు సూర్‌దాస్, మీరాబాయి, తులసీదాస్, చైతన్యుడు. వీరు తమ భావాల వ్యాప్తికోసం, మోక్షసాధనకోసం, కవిత్వం, పాట, నాట్యం, కీర్తనలను వాహకాలుగా చేసుకున్నారు.

సూర్‌దాస్ (క్రీ.శ. 1483–1563) ప్రఖ్యాత ఉపాధ్యాయుడు వల్లభాచార్యుని శిష్యుడు. ఇతడు అంధకవి. కృష్ణుని కేంద్రంగా ఇతని పాటలుంటాయి. ఇతను తాను రాసిన సూర్‌సాగర్‌లో కృష్ణుడి బాల్యం, యౌవ్వనం స్వచ్ఛమైన ప్రేమ గురించి వివరించారు.

అదేవిధంగా కృష్ణప్రేమను పాటల రూపంలో రాసిన మరొకరు మీరాబాయి(1503–1573). చిన్న వయస్సులోనే వితంతువయిన మీరాబాయి తన దేవుడు కృష్ణుడితో అధ్యాత్మిక వివాహం జరిగిందని విశ్వసించేది. ఈమె కవిత్వం ఈనాటికి ప్రజాదరణ కలిగిఉంది.

ఈ వైష్ణవ ఉద్యమం చైతన్యుడి(1485–1533) కృషివల్ల తూర్పుకు వ్యాపించింది. చైతన్యుడు కృష్ణుని విష్ణువు అవతారం మాత్రమే కాదని దేవుడి అత్యున్నత రూపమని చెప్పాడు. సంకీర్తనల ద్వారా కృష్ణ భక్తిని ఇళ్ళలో, దేవాలయాలలో, చివరికి వీధులలో కూడా ప్రచారం చేశాడు. ఇతర భక్తి ఉద్యమ సాధువులు మాదిరిగానే చైతన్యుడు కూడా కుల,మత రహితంగా ప్రతి ఒక్కరిని సాదరంగా ఆహ్వానించాడు. ప్రజలలో సమైక్యతా భావాలను వీరు ప్రోత్సహించారు.

రామానందుడు(1400–1470) రామభక్తిని వ్యాప్తి చేశాడు. రాముని అత్యున్నత దేవుడిగా అతడు భావించాడు. ఇతను కూడా కుల, కట్టుబాట్లను నిరసించాడు. మహిళలను, దళితులను ప్రధాన స్రవంతిలోకి ఆహ్వానించాడు. వీరిలో ప్రఖ్యాతిగాంచినవాడు తులసీదాస్, (క్రీ.శ. 1562–1623). ఇతని భక్తిలో స్వచ్ఛమైన ప్రేమతో కూడిన గురుశిష్యుల

సంబంధాలు కనిపిస్తాయి. అతని ప్రఖ్యాతగ్రంధం 'రామచరితమానస' బాధ్యత, నైతికలు, దయ, మానవత వంటి అత్యున్నత విలువలను వ్యాప్తిచేసింది. సులభమైన శైలితో కూడిన భాషతో ఉన్న 'రామచరిత్‌మానస'ను శతాబ్ధాలుగా ప్రజలు ఆదరిస్తూనే ఉన్నారు.

ఈ వైష్ణవ సాధువులు తమ తాత్వికతను హిందూమత చట్రంలోనే అభివృద్ధి చేశారు. మత సంస్కరణల కోసం వారు పాటుపడ్డారు. వారి తత్వం మౌళికంగా మానవత్వంతో కూడిఉన్నది.

## 48.6 భక్తి ఉద్యమ ప్రాముఖ్యత :

భక్తి ఉద్యమం ప్రధానంగా సాంఘీక, మత ఉద్యమం. ఇది మతమౌఢ్యాన్ని సాంఘీక రుగ్మతలను వ్యతిరేకించింది. ఇది మంచి వ్యక్తిత్వాన్ని ఆలోచనా విధానాన్ని కలిగి ఉండాలని నొక్కి చెప్పింది. సబ్దతలో ఉన్న మధ్యయుగ సమాజాన్ని భక్తి ఉద్యమం చైతన్యపరిచింది. ఆత్మవిశ్వాసాన్ని కలిగించింది. సాంఘీక, మత విలువలను పునర్‌నిర్వచించింది. కబీర్, నానక్‌వంటి సాధువులు సమసమాజాన్ని కాంక్షించారు. వీరి పిలుపు అణచబడ్డ వర్గాలకు ఆశాదీపమైంది. కబీర్, నానక్‌లకు నూతన మతాల ఏర్పాటు పట్ల ఆసక్తి లేకపోయినప్పటికి వారు చనిపోయిన తర్వాత కబీర్ పంచ్‌గా నానక్ శిష్యులు సిక్కుమతంగా ఏర్పాటు చేసుకున్నారు.

ఈ భక్తి ఉద్యమ సాధువుల కృషి వల్ల సమాజంలో నూతన పరిస్థితులు నెలకొన్నాయి. వారి భావాల ప్రభావం తర్వాతి శతాబ్ధాలలో భారతీయుల సాంఘీక, మత, రాజకీయ జీవితంపై పడింది. అక్బర్ చక్రవర్తి ఉదార భావాలకు ఈ భక్తి ఉద్యమం సృష్టించిన వాతావరణమే కారణం. ఇంకా 17వ శతాబ్ధంలో మరాఠాల విజృంభణకు కూడా ఇదే కారణమైంది. జ్ఞానదేవ, నామ్‌దేవ్, తుకారాంల భోధనలు మరాఠా సమాజాన్ని బలోపేతం చేసింది. వారు సృష్టించిన సాహిత్యం, మరాఠీలో వారురాసిన పాటలు శివాజీకి, మరాఠాలకు ప్రేరణ కల్గించాయి. అదేవిధంగా గురునానక్ బోధనలు కూడా ఒక తరం నుండి ఇంకొక తరానికి వ్యాప్తి చెందాయి. దీని ఫలితంగా ప్రత్యేక భాష 'గురుముఖి' ప్రత్యేక మతం ప్రత్యేక మతగ్రంధం 'గురుగ్రంధ్‌సాహబ్'లు సృష్టించబడ్డాయి. మహారాజా రంజిత్‌సింగ్ నాయకత్వంలో సిక్కులు ఉత్తర భారతదేశంలో ఒక బలీయమైన రాజకీయశక్తిగా ఎదిగారు.

భక్తి ఉద్యమకారుల, సూఫీ సాధువుల కలయిక భారతీయ సమాజంపై ప్రభావం చూపింది. సూఫీల తత్వమైన సహజీవనానికి హిందూ ఉపనిషత్తులతో పోలిక కలిగి ఉంది. భావాలను వివరించడానికి సూఫీ కవులు పర్షియన్ పద్యాలకన్నా హిందీ పదాలనే ఎక్కువగా వాడారు. సూఫీ కవి మాలిక్‌మహమ్మద్ జైసీ హిందీ భాషలో కవిత్వం రాశారు. వారి సాహిత్యంలో అనేకచోట్ల కృష్ణ, రాధ, గోపి, జమున, గంగా పదజాలం అత్యంత సాధారణంగా కనిపిస్తోంది.

భక్తి ఉద్యమం స్థానిక భాషల అభివృద్ధికి సాహిత్యానికి ఎనలేని సేవలందించింది. ఈ సాధువులు తమ భావాల ప్రకటనకు స్థానిక భాషలనెంచుకున్నారు. దీనికి ఉదాహరణగా సూర్‌సాదర్ 'రామచరిత మానస' కంబన్ 'రామీయులు(తమిళ్), జయదేవుని గీతాగోవిందం(బెంగాలి) జ్ఞానదేవుని జ్ఞానేశ్వరిలను(మరాఠి) చెప్పవచ్చు.

ఈ భక్తి సాధువుల పాటలు, పద్యాలు, సంగీత రంగంలో పునరుజ్జీవనానికి కూడా తోడ్పడ్డాయి. కీర్తనల వంటి సామూహిక (గ్రూపు) పాటలకు నూతన సంగీతాన్ని సృష్టించారు. ఈనాటికి కూడా ప్రార్ధనలలో, సమావేశాల్లో మీరాబాయి భజనలు, తులసీదాస్ 'చౌపాయిస్' గానం చేయబడుతున్నాయి.

స్వచ్ఛమైన ప్రేమతో అంకితభావంతో భక్తితో భగవంతుడిని పూజించాలని భక్తి ఉద్యమ సాధువులు నొక్కి చెప్పారు. నిరర్థకమైన పూజా విధానాలతో వాఖ్యాలతో పూజించడం వల్ల ఫలితం లేదని వీరు బోధించారు. హిందూ, ముస్లిం ఐక్యతకోసం కబీర్, గురునానక్ విశేషంగా కృషి చేశారు. తులసీదాస్, చైతన్యులు హిందూమతంలో విప్లవాత్మక మార్పుల కోసం నిబద్ధనతో కృషి చేశారు.

**పాఠ్యాంశ ప్రశ్నలు**

1. 'నయనార్లు', 'ఆళ్వార్లు' ఎవరు?

2. దేవుని నిర్గుణ, సుగుణ రూపాల గురించి వర్ణించండి. ఈ రెండు విశ్వాసాలపై రెండు ఉదాహరణలివ్వండి.

3. కబీర్, గురునానక్ బోధనలలోని పోలికలను గురించి రాయండి.

4. వైష్ణవమత కేంద్రంగా ఉన్న ఇద్దరు దేవుళ్ళు ఎవరు?

5. భక్తి ఉద్యమం ద్వారా వచ్చిన రాజకీయ ఫలితాలను వివరించండి.

**సారాంశం :**

హిందూ, ముస్లిం మతాలలోని ఉదారవాద భావాల ప్రతికలుగా ఈ భక్తి, సూఫీ ఉద్యమాలను చెప్పవచ్చు. ఈ సాధువులు మనిషికి దేవుడికి మధ్యగల నూతన వ్యక్తిగత సంబంధాలను గురించి నొక్కి చెప్పారు. 11, 12వ శతాబ్దాలలో ఈ సూఫీతత్వం భారతదేశానికి వచ్చింది. విశ్వజనీనప్రేమ, మనుష్యుల మధ్య సోదరభావం దీని సందేశంగా ఉంది. సూఫీలు సిల్‌సిలాస్‌గా విడిపోయారు. వీటిలో చిష్టీ, సుహ్రావాది, ఫిర్దౌసిలు భారతదేశంలో ప్రధానంగా ఉన్నాయి. మొయినొద్దీన్ చిష్టీ, బాబా ఫరీద్, నిజామొద్దీన్ ఔలియాలను నేటికి కూడా భక్తులున్నారు.

సూఫీలు కుల మతాలను ప్రత్యేకంగా విభజించలేదు. వారు సహజీవనాన్ని విశ్వసించారు. ఇది హిందూ భావాలకు కూడా దగ్గరగా ఉండడం వల్ల ఈ సూఫీలు వారి ఆలోచనా విధానంలో తాత్విక సంబంధాలు ఏర్పాటు చేసుకోగలిగారు. అందువల్ల అనేకమంది హిందువులు సూఫీలను భక్తితో కొలిచారు.

ఇక భక్తి ఉద్యమం మొదట దక్షిణ భారతదేశంలో నాయనార్లు, ఆళ్వార్లుగా అభివృద్ధి చెందింది. సంపూర్ణ ప్రేమపూర్వక భక్తిని ఇది వివరించింది. ఈ భక్తి ఉద్యమ సాధువులు నిర్గుణ, సుగుణ విశ్వాసకులుగా విడిపోయారు. వీరు పరస్పర ప్రేమ, ఏకమత, భావన గురించి నొక్కి చెప్పారు. కబీర్, నానక్ ప్రఖ్యాత నిర్గుణ విశ్వాసకులు. సుగుణ విశ్వాసకులు దేవుడికి రాముడు, కృష్ణుడు మాదిరిగా స్పష్టమైన రూపముందని భావిస్తారు. సూరదాస్, మీరాబాయి, చైతన్యుడు, తులసీదాస్ దీనికి సంబంధించినవారు.

మధ్యయుగ భారతీయ సమాజానికి ఈ భక్తి, సూఫీ సాధువులు విలువైన సేవలందించారు. అక్బర్ చక్రవర్తి తన ఉదారవాద పాలనకు పునాదులు ఈ భావాల నుండి ఉద్భవించినవే. సమాజంలో ఐకమత్యాన్ని పెంపొందించడానికి వారు కృషి చేశారు. గురునానక్ బోధనలతో సిక్కు మతం ఉద్భవించింది. ఈ రెండు ఉద్యమాల వల్ల స్థానిక భాషలు సాహిత్యం అభివృద్ధి చెందింది.

**ప్రశ్నలు :**

1. ప్రాచీనయుగం నుండి 12వ శతాబ్దం వరకు ఇస్లాం మతంలో వచ్చిన మార్పులను వర్ణించండి.

2. ఉలేమాలకు, సూఫీ సాధువులకు మధ్యగల బేధాలను తెల్పండి.

3. సూఫీ తత్వ సిద్ధాంతాలు పేర్కొనండి. వాటిని ఏవిధంగా భక్తి ఉద్యమంతో పోల్చవచ్చు?

4. భక్తి ఉద్యమం మూలాలను వివరిస్తూ దాని సిద్ధాంతాలను తెల్పండి.

5. భక్తి ఉద్యమం, సూఫీతత్వం స్థానిక భాషా సాహిత్యాల అభివృద్ధికి ఏవిధంగా తోడ్పడింది?

6. మధ్యయుగ భారతదేశంలో సాంఘీక, మత ఉద్రిక్తతలను తగ్గించడంలో భక్తి ఉద్యమ, సూఫీ తత్వ పాత్రను రాయండి.

7. క్రింది వాని అర్థాలను వివరించండి.

| | |
|---|---|
| 1) సిల్‌సిలా | 2) పిర్ |
| 3) ఖ్వాంకా | 4) వాహద్–ఉల్–వాజద్ |
| 5) మదర్‌సా | 6) నిర్గుణ, సుగుణ |
| 7) కీర్తన | 8) అవతార్ |

**కార్యక్రమాలు :**

1. సూఫీ, భక్తి ఉద్యమ సాధువులు సంగీత, సాహిత్య రంగాలలో చేసిన కృషిని గురించి చదవండి.

**పాఠ్యాంశ ప్రశ్నలకు సమాధానాలు :**

**48.ఎ**

1. సున్నీలు, షియాలు  2. ఖురాన్ బోధించిన సమానత్వ సిద్ధాంతాలను ఉలేమాలు పాటించడం లేదని సూఫీలు విశ్వసించారు. ఉలేమాల సంపద ప్రదర్శనను సూఫీలు అంగీకరించలేదు.

3. బా–షరియా అనుసరించే సిల్‌సిలాస్ బా–షరియా షరియోను అనుసరించని సిల్‌సిలాస్ బే–షరియా.

4. చిస్తీ సిల్‌సిలాస్ – షేక్ మొయినొద్దీన్

   సుహ్రావాది సిల్‌సిలాస్ – షేక్ బహుద్దీన్ ఘకారియా

5. కబీర్, గురునానక్

**48. బి.**

1. శివ భక్తులను నయనార్లు, విష్ణువు భక్తులను ఆళ్వార్లు అంటారు. భగవంతునికి మనిషికి మధ్య ప్రేమ పూర్వక భక్తి కలిగిఉండాలని బోధించారు.

2. నిర్గుణ అంటే భగవంతుకి ప్రత్యేక రూపం కానీ పేరుగానీ లేకపోవడం 'ఏకేశ్వరోపాసన' ప్రధాన సూత్రంగా ఉంటుంది. సగుణలో దేవుడికి ఒక రూపం ఉంటుంది. అది రాముడు లేదా కృష్ణుడు కావచ్చు. నిర్గుణను కబీర్, గురునానక్ విశ్వసించారు. సుగుణను తులసీదాస్, మీరాబాయిలు నమ్మి పాటించారు.

3. కుల మత రహితంగా ప్రజలంతా సమానమేననే భావనను వ్యాప్తి చేశారు. ఆడంబరాలతో కూడిన మాతాచారులను భక్తి విధానాలను వీరు విభేదించారు.

4. రామ, కృష్ణుడు

5. 1. అక్బర్ ఉదార విధానాలు

2. మరాఠాల విజృంభణ

3. సిక్కుల పెరుగుదల

# 49

# మొఘల్ చక్రవర్తుల మతవిధానం

## 49.1 పరిచయం :

భారతదేశంలో మొఘల్ సామ్రాజ్యాన్ని క్రీ.శ.1526లో బాబర్ స్థాపించాడు. భౌగోళికంగా, పరిపాలనాపరంగా విశాల భారతావనిగా మొఘల్ చక్రవర్తి ఔరంగజేబ్ కాలంలో మొఘల్ సామ్రాజ్యం రూపుదిద్దుకుంది. ఈ భాగంలో మొఘల్ సామ్రాజ్యం ప్రారంభం నుండి ఔరంగజేబు కాలంవరకు వారి మతవిధానం గురించి తెల్సుకుంటాం.

మొఘల్ చక్రవర్తులు రాజకీయ అవసరాలకు తగ్గ మతవిధానాలను అవలంభించారు. జాతీయ సమైక్యతను పెంపొందించే విధంగా రాజ్య వ్యవహారాలలో, మతవిధానాలలో మార్పులు తీసుకొచ్చిన మొదటి మొఘల్ చక్రవర్తి అక్బర్. ఈ కాలంలో రాజ్యంలో లౌకిక భావాలు ఉదార విధానాలు పరిఢవిల్లాయి. సమైక్య హిందుస్థాన్ ప్రతీకగా మొఘల్ చక్రవర్తి ఉండేవారు. అక్బర్ ఉదార మతవిధానాలు జహంగీర్, షాజహాన్‌ల వరకు కొనసాగాయి. ముస్లీమేతరులు కూడా సైన్యంలో, పరిపాలనలో అత్యున్నత పదవులు నిర్వహించారు. అయితే ఈ లౌకిక రాజ్య భావనకు ఔరంగజేబు కాలంలో పెనుసవాలు ఎదురైంది. ఈ పాఠంలో మొఘలుల మతవిధానానికి కారణమైన రాజకీయ, ఆర్థిక కారణాల గురించి చదువుకుందాం.

## 49.2 లక్ష్యాలు :

ఈ పాఠం చదివిన తర్వాత క్రింది విషయాలు గ్రహించగల్గాలి.

1. బాబర్, హుమాయూన్‌ల మత విధానాలు.
2. అక్బర్ ఉదార మత విధానాలు రూపొందించుకోవడానికి దోహదం చేసిన పరిస్థితులు
3. అక్బర్ మతవిధానంలోని ప్రధాన లక్షణాలు.
4. అక్బర్ మతవిధాన ఫలితాలు.
5. అక్బర్ మతవిధానాలను జహంగీర్, షాజహాన్‌లు అనుసరించిన విధం.

6. తన ముందు పాలకులు వలె కాకుండా ఔరంగజేబు నూతన మతవిధానాన్ని అవలంబించడానికి దారితీసిన పరిస్థితులను గుర్తించగల్గాలి.

## 49.3 బాబర్ హుమాయూన్‌ల మత విధానం :

బాబర్ ఆత్మకథ తుజుకీ–ఇ–బాబరీ బాబరును మతభావాలు గల వ్యక్తిగా వర్ణిస్తూనే మత ఛాందసుడు మాత్రం కాదని వివరిస్తుంది. బాబర్ ఉదారవాదే కాక ప్రజల హృదయాలను గెల్చుకోవడానికి ఉదారవాద మతవిధానాలు అవలంభించాడు. తన కొడుకు హుమాయూన్‌కు సలహా ఇచ్చాడు. అయితే బాబరు రాణాసంగలో యుద్ధ సమయంలో జీహాద్ ప్రకటించినప్పటికి అది రాజకీయ కారణాలతో జరిగింది. తన సైన్యంలో స్ఫూర్తిని, ధైర్యసాహసాలను పెంపొందించుకోవడానికి బాబరు ఈ నినాదాన్ని వినియోగించాడు. తన రాజ్యాన్ని రాజకీయంగా సుస్థిరపరచుకోవడంలోనే కాలమంతా గడపటం వల్ల హుమాయూన్ ప్రత్యేక మతవిధానాన్ని రూపొందించలేకపోయాడు.

## 49.4 అక్బర్ మత విధానం :

15వ శతాబ్ధ చివరి భాగంలో దేశవ్యాప్తంగా కొనసాగిన ఉదారవాద పాలకులు మతవిధానాల గురించి గతపాఠాల్లో చదువుకున్నారు. వారు తమ ఆస్థానాలలో సైన్యంలో అత్యున్నత పదవులలో ముస్లిమేతరులను నియమించారు. ఈ కాలంలోనే సూఫీ సాధువులు నిజామొద్దీన్ ఔలియా, భక్తి ఉద్యమ నాయకులయిన కబీర్, గురునానక్, చైతన్యుడు ప్రేమ భావాల వ్యాప్తికోసం కృషి చేశారు. వీటన్నింటి ప్రభావంతో అక్బర్ జన్మించేనాటికి(1542) సమాజంలో పరమత సహనంతో కూడిన వాతావరణం నెలకొంది.

అక్బర్ రాణా కోట అయిన అమీర్‌కోటలో జన్మించెను. తల్లి హమీదాబానో ఉదార భావాలు గల షియాస్త్రీ. బాల్యంలో గురువు అబ్దుల్ లతీఫ్, సంరక్షకుడు భైరంఖాన్‌ల ఉదార భావాల ప్రభావం అక్బర్‌పై ఉది. దీని ఫలితంగా ఉదారవాదం, పరమత సహనం వారసత్వంగా పరిసరాల ప్రభావంతో అక్బర్‌లో పెంపొందింది.

అక్బర్ గొప్ప సామ్రాజ్య నిర్మాతనే గాక దూరదృష్టి కల్గినవాడు. తనకు వారసత్వంగా వచ్చిన చిన్న సంస్థానాన్ని పెద్ద సామ్రాజ్యంగా తీర్చిదిద్దిన ఘనట అక్బర్‌దే. రాజ్యాన్ని బలోపేతం చేయడం వల్ల చిరకాలం స్థిరంగా ఉంటుందని భావించాడు. అంటే రాజ్యాన్ని బలోపేతం చేయడానికి కేవలం ముస్లింల మద్ధతు మాత్రమే సరిపోదని అన్ని వర్గాల ప్రజల ప్రేమను, అభిమానాన్ని పొందడం అవసరమని అక్బర్ భావించాడు. తన భావాలను ఆచరణ రూపం ధరించడానికి ఉదారవాదం, పరమత సహనం అత్యంతావశ్యకమని గమనించిన అక్బర్ ఉదారవాద మతవిధానాన్ని పాటించాడు. ముస్లీంలకు, ముస్లిమేతరులకు తన రాజ్యంలో సమానస్థాయి కల్పించాడు. జిజియాపన్నును, తీర్ధయాత్రల పన్నును రద్దు చేశాడు. అంతేకాకుండా యుద్ధ ఖైదీలను బలవంతంగా ఇస్లాంలో చేర్పించడాన్ని కూడా రద్దు చేశాడు.

ముస్లిమేతరులు తమ ప్రాంతాలలో దేవలయాలను నిర్మించడానికి అనుమతించాడు. రాజామాన్‌సింగ్ బనారస్, బృందావన్‌లలో అద్భుతమైన దేవాలయాలను నిర్మించారు. అమృతసర్ నగరానికి పునాదులు వేసిన గురురామ్‌దాస్‌కు నామమాత్రపు ధరకే అక్బర్ 500 బిఘాల భూమిని ఇచ్చినట్లు ఇదివరకే చదువుకున్నాం. ముస్లిమేతరులంతా తమ పండుగలను ఘనంగా నిర్వహించుకోవడానికి అనుమతించాడు. అంతేకాకుండా తన కోటలో రక్షాబంధన్, దసరా, దీపావళి, హోలి వంటి పండుగలు, ఉత్సవాలు నిర్వహిస్తూ అక్బర్ స్వయంగా ఇందులో పాల్గొనేవాడు. ఉదారభావాల

పట్ల తన విశ్వాసాన్ని ప్రకటించుకోవడానికి ముస్లిమేతరులతో ముఖ్యంగా రాజపుత్రులతో తన స్నేహ సంబంధాలను పటిష్టపర్చుకున్నాడు. వీరితో వైవాహిక సంబంధాలు ఏర్పరచుకోవడమే కాక తన ఆస్థానంలో ఉన్నత పదవులను ఇచ్చారు.

అక్బర్ రాజరిక సిద్ధాంతం ఉదార వాదులలో పరమత సహనంతో కూడుకున్నది. ఇతని సిద్ధాంతం టర్కీ పర్షియన్, భారతీయ రాజరిక సిద్ధాంతాల మిశ్రమం. రాజు పవిత్రంగా ఉండాలని ఆధ్యాత్మిక జ్ఞానాన్ని కలిగి ఉండాలని అక్బర్ విశ్వసించాడు. నిజమైన రాజుకు దేవుడికి మధ్య ఎవరు నిలబడలేరని భావించారు. అందువల్లనే కుల మత రహితంగా పేద,ధనిక తేడా లేకుండా తన ప్రజలను కన్నబిడ్డవలె చూసుకునేవాడే నిజమైన రాజు అని అక్బర్ భావించాడు.

మొదటి నుండి అక్బర్‌కు మతం, తాత్వికతలపై ఆసక్తి ఎక్కువ. ప్రారంభంలో అక్బర్ ఛాందసవాద ముస్లీం. ఎక్కువ సమయం ప్రార్ధనలను ముస్లిం మత పెద్దలతోను గడిపేవాడు. కాలక్రమేణా ఛాందసవాద మత భావాల నుండి దూరమయ్యారు. అజ్మీర్‌లోని షేక్ సలీం చిస్తీ దర్గాను సందర్శించాడు. ఉదార భావాలు గల అనేకమంది తెలివైనవారిని ఒకచోట చేర్చారు. అక్బర్‌లోని ఈ ఉదార భావాలు కార్యక్రమాలు ఛాదస ముస్లింలకు కోపం తెప్పించాయి.

వివిధ మతాల సారాన్ని అర్ధం చేసుకోవాలనే తన కాంక్షను సంతృప్తి పర్చుకోవడానికి అక్బర్ క్రీ.శ.1575లో ఆగ్రా సమీపంలోని తన నూతన రాజధాని ఫతేపూర్ సిక్రిలో ఇబాదత్‌ఖానా(ప్రార్ధనా మందిరం)ను నిర్మించారు. ఇందులో ప్రతి గురువారం వివిధ మత విషయాలపై చర్చలు జరిగేవి. మొదట్లో కేవలం ముస్లిం మతపెద్దలు మాత్రమే ఇందులో పాల్గొనేవారు. అయితే స్వల్ప విషయాలపై వారిలో వారే కలహించుకోవడం జరిగేది. ముఖ్యంగా షేక్ అబ్దుల్ నబీఖాన్, షేక్ ముఖ్దుం–ఉల్–మల్క్ అక్బర్‌ను చాలా నిరుత్సాహపరిచారు. అందువల్ల ఇబాదత్‌ఖానాకు ఇతర మత ప్రముఖులను కూడ చర్చలలో పాల్గొనడానికి ఆహ్వానించారు. మతానికి సంబంధించిన వివిధ అంశాలపై చర్చలు సాగేవి. వీటన్నింటిలో ఇస్లాంలో మాత్రమే కాకుండా అన్ని మతాలలోను, భావాలలోను నిజం ఉందని అక్బర్ గ్రహించాడు. అన్ని మతాలకు తన రాజ్యంలో పూర్తిగా స్వేచ్ఛనిచ్చాడు.

అంతేకాకుండా రాజ్యంలో తన స్థానాన్ని పటిష్టపర్చుకోవడానికి ఖ్వాజీలతో, ముల్లాలతో వ్యవహారాలు నడిపించాల్సి ఉంటుందని అక్బర్ తెలుసుకున్నాడు. దీన్ని సాధించడానికి మహజర్‌నామా ప్రకటనను పొందాడు. ఈ ప్రకటనను అబుల్‌ఫజల్ తండ్రి షేక్ ముబారక్ షా, ఫైజీ రూపొందించారు. దీనిపై ఛాందసవాద ముస్లింలైన అబ్దుర్‌నబీఖాన్, షేక్ ముఖ్దుమ్–ఉల్–మల్క్‌లు సంతకం చేశారు. ఖురాన్‌ను వ్యాఖ్యానించేటప్పుడు ఏ మతపెద్దల మధ్యనైనా విభేదాలు వచ్చినప్పుడు రాజ్య సమగ్రత దృష్ట్యా, అత్యధిక ప్రజలు ప్రయోజనాల రీత్యా నిర్ణయం తీసుకునే అధికారాన్ని అక్బర్‌కు ఈ ప్రకటన కల్పించింది. దీంతో మత వ్యవహారాలలో అక్బర్ నిర్ణయమే అత్యున్నతమైనదైంది. ఇప్పటివరకు ఈ హక్కును ఉలేమాలు కలిగిఉన్నారని మనకు తెలిసిందే.

మత వ్యవహారాలలో అంతిమ అధికారం తానే పొందినప్పటికీ అక్బర్ దీంతో సంతృప్తి చెందలేదు. సమాజంలో అన్ని వర్గాల మధ్య ఐకమత్యాన్ని సాధించాలని కోరుకున్నాడు. ఇబాదత్‌ఖానా చర్చల వల్ల ఎలాంటి ప్రయోజనం లేదని గ్రహించిన వెంటనే క్రీ.శ.1582లో అక్బర్ దీన్ని ఆపివేశాడు. ఐనప్పటికి సత్యం కోసం చేస్తున్న అన్వేషణను మాత్రం నిలిపివేయలేదు. హిందూ, జైన, పార్శి, క్రిస్టియన్ మత పెద్దలను తన ఆస్థానానికి ఆహ్వానించి మతానికి సంబంధించిన అంశాలపై వారితో చర్చలు జరిపేవాడు. వీరందరితో సన్నిహిత సంబంధాలు కొనసాగించబడి, చర్చలు జరపడం,

వివిధ మత గ్రంథాలు అధ్యయనం వల్ల మతాల మధ్య, జాతుల మధ్య విభేదాలు ఉన్నప్పటికీ అన్ని మతాలలోను కొన్ని మంచి విషయాలున్నట్లు అక్బర్ భావించారు. వివిధ మతాలలోని మంచి విషయాలను స్నేహ సంబంధాలను, పరమత సహనాన్ని వ్యాప్తి చేయాలని ఆశించాడు. ఈ ఆలోచనా దృక్పథంతోనే అన్ని మతాల సారాన్ని క్రోడీకరించి నూతన ఆధ్యాత్మిక మార్గాన్ని అన్వేషించాడు. అదే తౌహిద్-ఇ-ఇలాహి. దీనర్థం భగవంతుడొక్కడే, దీని ప్రకారం ఏకేశ్వరోపాసనను పాటించారు. (దిన్ లేదా నమ్మకం(ఫెయిత్) అనే పదం 80 సంవత్సరాల తర్వాత వినియోగించారు.

నిజానికి తౌహిద్-ఇ-ఇలాహికి సూఫీతత్వానికి సన్నిహిత సంబంధం ఉంది. దీంట్లో చేరడానికి అక్బర్ అనుమతి తప్పనిసరి. ఈ తౌహిద్-ఇ-ఇలాహి మతంలో చేరదల్చుకున్నవారు తమ శిరస్సును అక్బర్ చక్రవర్తి పాదాల ముందు ఉంచవల్సిందే. చక్రవర్తి అలా చేసిన వారిని తన పాదాల చెంతనుండి తట్టిలేపి 'షస్ట్' అని పిలిచి దానిలో చేర్చేవాడు. కొత్త సభ్యులను కూడా ఇందులో చేర్చుకొని వారిని ఉద్ధరించేవారు. ప్రార్థనా సమయాలలో అల్లాహోఅక్బర్ అని ఉచ్ఛరించేవారు. దీనర్థం దేవుడు చాలా గొప్పవాడు. ఇందులోని సభ్యులు మంచి ప్రవర్తన కలిగి ఉండాలని ఇతరులతో మర్యాదపూర్వక సంబంధాలు కొనసాగించాలని, దాని స్వభావం కలిగి ఉండాలని, మాంసాహారానికి దూరంగా ఉండాలని కోరుకున్నారు. ఈ తౌహిద్-ఇ-ఇలాహి సభ్యులు అగ్నిని, సూర్యుని పూజిస్తారు. ఇది వృద్ధులు బాలికలను వివాహం చేసుకోవడాన్ని వ్యతిరేకిస్తుంది. ఇందులో దేవాలయాలు, మసీదుల మాదిరిగా ప్రార్థనకోసం ప్రత్యేక ప్రదేశం ఉండదు. దీనికి ప్రత్యేక మత గ్రంథం కూడా లేదు. ఇందులో చేరినవారికి రాయితీలు ఇవ్వడం గానీ లేదా వారిని చేరమని బలవంతం చేయడం గానీ అక్బర్ చేయలేదు. దీనిలో ఎలాంటి కఠిన మతాచారాలు, నిబంధనలు లేనప్పటికి ప్రజాదరణను పొందలేకపోయింది. అక్బర్ మరణం తర్వాత అంతర్థానమైంది. ఆ కాలంలో 18మంది ముఖ్యులతో సహా దాదాపు 18వేల మంది దీన్ని అనుసరించారు.

సమకాలీన చరిత్రకారుడు బదౌని తౌహిద్-ఇ-ఇలాహిని విమర్శిస్తూ అక్బర్‌ను 'కాఫిర్'గా సంబోధించాడు. ఇందులో అక్బర్‌కు ప్రధానంగా లక్ష్యాలపై అవగాహన లేదని విమర్శించాడు. నిజానికి అక్బర్ దూరదృష్టిగల రాజకీయవేత్త, సామ్రాజ్య నిర్మాత గానీ మత పెద్ద కాదు. ఆ కాల అవసరాలను అర్థం చేసుకున్న నాయకుడు అక్బర్. ముస్లీమేతరుల మద్ధతు లేకుండా భారతదేశంలో బలమైన సామ్రాజ్యానికి పునాదులు వేయలేమని అక్బర్ గ్రహించాడు. అతని తౌహిద్-ఇ-ఇలాహి ప్రధాన ఉద్దేశం అన్ని వర్గాల ప్రజలను ఐక్యం చేయడం. తద్వారా ప్రజలకు మతపరమైన లౌకిక సలహాలందించడం. సామ్రాజ్యంలో శాంతి, సౌభ్రాతృత్వాలను నెలకొల్పడమే అక్బర్ మతవిధాన లక్ష్యంగా చెప్పవచ్చు.

> తౌహిద్-ఇ-ఇలాహి ద్వారా అక్బర్ విశ్వశాంతిని కాంక్షించాడు. సంస్కృతం, అరబిక్, పర్షియన్ భాషలలో ఉన్న అద్భుతమైన సాహిత్యాన్ని స్థానిక భాషలలోకి అక్బర్ అనువాదం చేయించాడు. అక్బర్ తన సామ్రాజ్యంలో సాంస్కృతిక సమైక్యతను ప్రోత్సహిస్తూ లౌకిక భావాల నిలయంగా తీర్చిదిద్దాడు.

## పాఠ్యాంశ ప్రశ్నలు 49.ఎ

1. అక్బర్ జన్మించే నాటికి భారతదేశంలో ఉన్న మతపరిస్థితులను వివరించండి.
2. అక్బర్‌లో ఉదారవాదం, పరమత సహన భావాలు పెంపొందడానికి కారకులు ఎవరు?

3. ఉదారవాదం పరమత సహనం చూపించడానికి అక్బర్ చేపట్టిన చర్యలు ఏంటి?

4. అక్బర్ తన సామ్రాజ్యంలో ఉదారవాదాన్ని పరమత సహన భావాలను ఎందుకు అభివృద్ధి చేయాలనుకున్నాడు?

5. ఛాందసవాద ముస్లింలు, ఉలేమాలు ఎందుకు అసంతృప్తికి లోనయ్యారు?

6. తౌహిద్-ఇ-ఇలాహి ప్రధాన లక్షణాలను పేర్కొనండి.

## 49.5 జహంగీర్, షాజహాన్ మత విధానాలు :

జహంగీర్ అక్బర్ మతవిధానాన్ని అనుసరించాడు. ఇతను కూడా రాజపుత్రులతో వైవాహిక సంబంధాలు నెలకొల్పాడు. జిజియాపన్ను, తీర్థయాత్రల పన్నులను పునరుద్ధరించలేదు. ముస్లిమేతరుల మత విషయాలలో జోక్యం చేసుకోలేదు. రాజాంతఃపురాలలో అక్బర్ ప్రవేశపెట్టిన ఉత్సవాలను, పండుగలు జరుపుకోవడాన్ని జహంగీర్ కూడా కొనసాగించాడు. స్వల్ప తేడాలున్నప్పటికీ చాలావరకు జహంగీర్ కూడా ఉదారవాదాన్ని, పరమత సహనాన్ని ప్రదర్శించాడు.

ఇక షాజహాన్ ఛాందసవాద సనాతన ముస్లిం. అతను ఇతర మతస్తులతో వైవాహిక సంబంధాలు నెలకొల్పుకోలేదు. అక్బర్, జహంగీర్ కాలం నాటికే రాజపుత్రులతో సంబంధాలు స్థిరపడటం దీనికి కారణమని పరిశోధకులు భావిస్తున్నారు. ఏమైనప్పటికీ షాజహాన్‌లో ఈ విషయంపై కొంత కాలానికి మార్పు కనిపిస్తోంది. దీనికి కారణం బహుశా ఉదారభావాలు గల కొడుకు దారా ప్రభావం కావచ్చు. షాజహాన్ కూడా జిజియా, తీర్థయాత్రల పన్నులను పునరుద్ధరించలేదు. ఇతని పాలనాకాలంలో కూడా ముస్లిమేతరులు పాలనలో, సైన్యంలో అత్యున్నత పదవులలో పనిచేశారు.

## 49.6 ఔరంగాజేబ్ మత విధానం :

ఘనత వహించిన మొఘలులలో చివరివాడు ఔరంగజేబ్. ఇతని కాలంలో భౌగోళికంగా సామ్రాజ్యం అత్యంత విశాలమైందిగా ఏర్పడింది. అతని కాలంలోనే మొఘల్ సామ్రాజ్యానికి బీటలు వారడం ప్రారంభమైంది. అందువల్లనే పాలకుడిగా ఔరంగాజేబ్ విజయాలపై చరిత్రకారులలో భిన్నాభిప్రాయాలున్నాయి. ఈ భాగంలో వివాదస్పదమైన ఔరంగాజేబ్ మతవిధానాలను గురించి చదువుకుందాం.

ఔరంగాజేబ్ వ్యక్తిగత జీవితం నిరాడంబరమైంది. పొదుపును పాటించేవాడు. ఇతను కఠినశ్రమ చేసే ఛాందసవాది. దైవభక్తిగల సున్నీ ముస్లీం. సాధువుగా అందరితో పిలవబడేవాడు. ఏమైనప్పటికీ అక్బర్ పరమత సహన విధానాలకు భిన్నంగా ఇతని విధానాలున్నాయిని కొంతమంది చరిత్రకారులు భావిస్తున్నారు. హిందువుల విశ్వాసం కోల్పోవడంతోనే సామ్రాజ్యానికి పతన దశ ప్రారంభమైంది. అయితే ఔరంగాజేబ్ అన్యాయంగా విమర్శించబడ్డాడని కొంతమంది చరిత్రకారులు భావిస్తున్నారు. అక్బర్, జహంగీర్‌ల ఉదార విధానాల వల్ల హిందువులు ధనవంతులుగా, పలుకుబడిగల వారిగా తయారయ్యారు. చక్రవర్తిని ధిక్కరించే స్థాయిలో ఉన్నారు. అందువల్లనే ముస్లింల మద్ధతు తప్పని సరైన పరిస్థితులలో ఔరంగాజేబ్ ఈ మతవిధానాను అవలంభింక తప్పలేదని వారు భావించారు. అయితే ఔరంగాజేబ్ మతవిధానం పైన ఆనాటి సాంఘీక, ఆర్థిక, రాజకీయ పరిస్థితుల ప్రభావం కూడా ఉందని చాలామంది చరిత్రకారులు వ్యాఖ్యానిస్తున్నారు.

ఔరంగాజేబ్ వారసత్వపోరులో విజేయుడైనాడని మీకు తెలుసు. నిజానికి దారాషికోను చక్రవర్తిగా నియమించాలని షాజహాన్‌కుండేది. ఉదారభావాలు గల దారాకు హిందువుల మద్ధతు ఉండేది. ఈ పోరులో విజయం సాధించిన

తర్వాత సామ్రాజ్యంపై పట్టు సాధించడానికి, రాజకీయ లక్ష్యాలను నెరవేర్చుకోవడానికి మతాన్ని ఉపయోగించుకోవాలని ఔరంగాజేబ్ భావించాడు. క్రీ.శ1659లో దారాకు ద్రోహంచేసి ఔరంగజేబ్ పట్టాభిషేకం చేసుకున్నాడు. షాజహాన్ జీవించే ఉన్నందువల్ల ఔరంగజేబ్ పేరుపైన 'ఖుత్బా'(Khutba) చదవడానికి ప్రధాన ఖాజీ నిరాకరించాడు. అప్పుడు అబ్దుల్‌వాహెబ్ అనే గుజరాత్‌కు చెందిన మరొక ఖాజీ 'ఖుత్బా' చదివాడు. చక్రవర్తి షాజహాన్ సామ్రాజ్య బాధ్యతలు నిర్వహించే పరిస్థితులలో లేడని అందువల్ల దీన్ని 'షరియా' ఒప్పుకుంటుందని ఆయన సమర్థించుకున్నాడు.

ఔరంగజేబ్ మత విధానలలో మొదట నైతిక, మత రంగాలలో తీసుకున్న నిర్ణయాలను గమనించవచ్చు. సింహాసనం అధిష్టించిన వెంటనే నాణేలపై 'కల్మా'ను నిలిపివేసాడు. దానికి కారణం పొరపాటున ఎవరైనా నాణేలను తొక్కి అపవిత్రం చేస్తారేమోననుకోవడం. అదేవిధంగా ఇరాన్ పాలకులైన సఫాలిద్‌లకు ఇష్టమైన జొరాష్ట్రియన్ సాంప్రదాయ 'నౌరోజ్' ఉత్సవాలను నిలిపివేశాడు. దీంతోపాటు అక్బర్ కాలంలో కింది స్థాయి ఉద్యోగులైన 'మహ్తాసిబ్స్'(mahtasibs)కు ఎక్కువ జీతాలతో 'మన్సబ్'(mansabs)గా పదోన్నతి కల్పించాడు. వీరు 'షరియా' ప్రకారం ప్రజల జీవనం సాగించేలా చూస్తారు. ఎవరైనా అతిక్రమిస్తే ఇస్లాం ద్రోహులుగా పరిగణించేటట్లు వీరు చర్యలు తీసుకుంటారు.

చక్రవర్తి వరండా నుండి ప్రజలను సందర్శించే సాంప్రదాయం 'ఘరోకాదర్శన్'ను కూడా ఔరంగజేబ్ నిలిపివేశాడు. ఇంకా మనష్యుల, జంతువుల ప్రతిమలను వినియోగించడాన్ని నిషేధించాడు. ఇస్లాంకు వ్యతిరేకమని భావించి 'టికా'(Tika) సాంప్రదాయాన్ని కూడా నిషేధించాడు. పంచాంగం తయారు చేసే జ్యోతిష్యులను నిషేధించాడు. అదేవిధంగా చక్రవర్తిని బంగారు, వెండి నాణేలతో తూకం వేసే తులాబార సాంప్రదాయాన్ని కూడా నిలిపివేసాడు. దీంతోపాటు పుట్టినరోజు ఉత్సవాలను కూడా ఔరంగజేబ్ నిషేధించాడు. శిధిలమైన మసీదులను మరమ్మతు చేయించి అందులో తగినంత మంది ఉద్యోగులను నియమించాడు. ఈ చర్యల వల్ల ఔరంగజేబ్ సనాతన ముస్లీంల ఆదరణను చూరగొన్నాడు.

యాసఫ్ జెయిస్(1667), జాట్(1669), ఖటక్స్, అఫ్రిది(1672) సత్నామీలు(1672)ల తిరుగుబాట్లు వల్ల ఔరంగాజేబ్ ఆర్థిక, రాజకీయ రంగాలలో కొన్ని కఠినమైన చర్యలు చేపట్టారు. వృధాఖర్చులు, తగ్గించుకోవడం కోసం ఆస్థానంలో నిరాడంబరతను ప్రవేశపెట్టెను. సాంప్రదాయంగా చేస్తున్న కొన్ని ఉత్సవాలను రద్దు చేశాడు. గానం నిషేధించబడింది. సంగీతం, రాయల్‌బాండ్‌ని నిలిపివేశాడు. (అయినప్పటికి ఔరంగజేబ్ కాలంలోనే సాంప్రదాయ భారతీయ సంగీతంపై అత్యధిక సంఖ్యలో పర్షియన్ పుస్తకాలు రాయబడ్డాయి) అంతేకాకుండా అధికారికంగా పనిచేస్తున్న చరిత్ర రచనా శాఖను కూడా మూసివేశాడు.

ఔరంగాజేబ్ ముస్లింల మద్ధతు పొందడానికి వ్యాపారంలో కూడా ప్రోత్సహించాడు. క్రీ.శ.1667లో వారికి కస్టమ్స్ సుంకాలను రద్దు చేశాడు. అయితే తిరిగి ఇతరులు చెల్లిస్తున్న కస్టమ్స్ సుంకంలో ముస్లింలు 50% చెల్లించాలని ఆదేశించాడు. క్రీ.శ.1671లో హిందూ పేష్కార్లు, కారోరిలు, దివాన్‌ల స్థానంలో ముస్లింలను నియమించడానికి ఔరంగజేబ్ ఆదేశించాడు. అయితే తగినంత మంది సమర్థులైన వారు దొరకనందున ఇందులో 50శాతం ఉద్యోగాలను మాత్రమే ముస్లింలకు కేటాయించాలని నిర్ణయించాడు.

ఆర్థికంగా, రాజకీయంగా బలోపేతం కావడం కోసం ఔరంగజేబ్ తరచుగా మతాన్ని ఉపయోగించుకున్నట్లు పై చర్యల ద్వారా తెలుస్తోంది. ప్రజల ఆలోచనలకు ప్రభావితం చేయగల మతపెద్దలు తనవైపు ఉండాలని కోరుకున్నాడు. అందుకోసమే మక్కాలోని మతపెద్దలపై బంగారు కాసులు కురిపించాడు. బహుశా తన తండ్రిని జైలులో బంధించిన

విషయం, సోదరులను చంపించిన విషయం ప్రజలు మరచిపోవాలని కోరుకొని ఉంటాడు. దీనిపై చరిత్రకారుడు జాదునాథ్ సర్కార్ ఔరంగజేబ్ సనాతన ముస్లీంల హక్కులను, అధికారాలను కాపాడే వీరుడిగా ముద్రపడాలని కాంక్షించాడని అభిప్రాయపడ్డాడు. అయితే ఈ పరిస్థితులనుండి బయటికి రాలేక ఒకదాని తర్వాత మరొకటి ఇదే విధమైన చర్యలు చేపట్టవలసి వచ్చింది.

నిజానికి ఔరంగజేబ్ చేపట్టిన ఈ నైతిక చర్యలు ప్రత్యేకంగా ఏ వర్గానికి హానీ కల్గించలేదు. అయితే దీని తర్వాత వివక్షపూరితమైన కొన్ని చర్యలను చేపట్టాడు. అవి దేవాలయాలను కూల్చేయడం, జిజియాపన్నును పునరుద్ధరించడం వంటి వాటివల్ల ఔరంగజేబ్‌ను చరిత్రకారులు తీవ్రంగా విమర్శించారు.

మొదట్లో ఔరంగజేబ్ అనుసరించిన సుల్తానత్‌యుగ పరిస్థితులను పునరుద్ధరించాలని ఔరంగజేబ్ ఫర్మానాలు జారీచేశాడు. అందులో షరియా ప్రకారం పురాతన దేవాలయాలను కూల్చివేయకూడదని అయితే నూతన దేవాలయాలను మాత్రం నిర్మించకూడదని(1665) పేర్కొన్నాడు. అయితే ఔరంగజేబ్ పాలన మొదటి దశలో దేవాలయాల కూల్చివేత ఎక్కువగా జరిగినప్పటికి తర్వాత కాలంలో విధానాలలో మార్పు వచ్చింది. ఔరంగజేబ్‌కు ఇబ్బంది కలిగించిన జాట్, సత్నామీల తిరుగుబాట్ల గురించి మనమిదివరకే చదువుకున్నాం. ఈ తిరుగుబాటు భావాలు దేవాలయాలు కేంద్రంగా పనిచేస్తూ వ్యాప్తి చేస్తున్నాయని ఔరంగజేబ్ భావించాడు. క్రీ.శ.1669లో దేవాలయాలను, పాఠశాలలను నాశనం చేయమని ఆదేశాలు జారీ చేశాడు. ఈవిధంగా కూల్చివేసిన దేవాలయాలలో బనారస్‌లోని విశ్వనాధ దేవాలయం, మధులో కేశవరాయి దేవాలయం ప్రఖ్యాతిగాంచినవి. అదేవిధంగా క్రీ.శ.1679–80 లలో మార్వార్ రాజులకు మొఘలులకు మధ్య సంబంధాలు దెబ్బతిన్నప్పుడు జోద్‌పూర్‌లో అనేక పురాతన దేవాలయాలు మొఘలులు కూల్చివేశారు. దేవాలయాల కూల్చివేత ద్వారా మొఘలులకు వ్యతిరేకంగా రాజద్రోహం చేసేవారని తీవ్రంగా శిక్షిస్తాడనే సందేశమిచ్చినట్లు కన్పిస్తోంది.

దీని తర్వాత అంతే స్థాయిలో ప్రజల మనోభావాలను గాయపర్చే విధంగా ఔరంగజేబు తీసుకున్న నిర్ణయం జిజియాపన్ను పునరుద్ధరణ. ప్రజలంతా తనకు సమానమేనని భావించి దీన్ని అక్బర్ రద్దు చేసిన విషయం తెలిసిందే. ఆనాడు అక్బర్ నిర్ణయాన్ని సనాతన ముస్లింలు వ్యతిరేకించారు. ఔరంగజేబ్ ఈ పన్నును పునరుద్ధరించడానికి రాజకీయ పరిస్థితులు కూడా కారణం. ఒకవైపు మరాఠాలు, రాజపుత్రులు మొఘల్ సామ్రాజ్యానికి బలమైన శత్రువులుగా తయారయ్యారు. మరోవైపు క్రీ.శ.1675లో గురు తేజ్‌బహదూర్‌ను చంపించినందు వల్ల సిక్కులు కూడా మొఘలులకు దూరమయ్యారు. జాట్‌లు, సత్నామీలు పూర్తిగా లొంగిపోలేదు. ఇటువంటి పరిస్థితులలో సామ్రాజ్యాన్ని కాపాడుకోవడానికి ముస్లీంలలో బలమైన పునాదిని వేసుకోవడానికి ఔరంగజేబ్ జిజియాపన్నును రాజకీయ, తాత్విక ఆయుధంగా వినయోగించుకున్నాడు.

హిందువులను బలవంతంగా ఇస్లాంమతంలో చేర్చడానికి తీసుకున్న నిర్ణయంగానో లేదా రాజ్య ఆర్థిక పరిస్థితిని మెరుగుపర్చడానికి తీసుకున్న చర్యగానో జిజియాపన్నును చూడలేము. ఈ పన్ను వలన ఆర్థికంగా వచ్చే లాభం చాలా స్వల్పం. పైగా ఇందులోనుండి స్త్రీలకు, పిల్లలకు వికలాంగులకు మినహాయింపునిచ్చాడు. ఈ పన్నువల్ల మతమార్పిడి జరిగిన దాఖలా కూడా కనిపంచదు. ఇంకా జిజియాపన్ను ద్వారా నింపాల్సినంత ఖాళీగా కూడా ఔరంగజేబ్ ఖజానా ఏమీలేదు. ఇది కేవలం అక్బర్ కాలం నుండి ఈ పన్నును పునరుద్ధరించమని కోరుతున్న చాందస ముస్లిం పెద్దల మద్ధతు పొందడానికే ఉపయోగపడింది. ఈ జిజియాపన్ను ద్వారా లభించిన ఆదాయాన్ని దైవభక్తిగల ఉత్తమ ముస్లింలకు,

ఉలేమాలకు చెల్లించేవారు. అందువల్ల జిజియాపన్ను కొంతమందికి ఉపాధిగా ఉపయోగపడటంలో వారు ఔరంగజేబ్‌కు కృతజ్ఞతగా ఉండేవారు. అదే సమయంలో దీనివల్ల అనేకమంది ప్రజల విరోదాన్ని కూడా ఔరంగజేబు కొనితెచ్చుకున్నాడు. మొఘల్ సామ్రాజ్యం మతపరంగా చీలిపోయింది. పరస్పర అవిశ్వాసం అసంతృప్తి వేళ్ళూనుకు పోయింది. దీంతో జిజియాపన్ను పునరుద్దరణ లాభం  కన్నా నష్టాన్నే ఎక్కువ తెచ్చిపెట్టింది.

ఔరంగజేబు తన సామ్రాజ్యానికి ఇస్లామిక్ వ్యక్తిత్వాన్ని ఆపాదించినప్పటికి దాన్ని మతంపట్ల మూఢ విశ్వాసంగా చెప్పడం సరైందికాదు. పెద్ద సంఖ్యలో బలవంతపు మతమార్పిడిలు జరిగినట్లు సాక్ష్యాలు ఏమీ లేవు. పాలనా వ్యవస్థలో హిందువులు అత్యున్నత పదవులలోనే కొనసాగారు. నిజానికి షాజహాన్ కాలం నాటికన్నా ఔరంగజేబు కాలంలోనే మారాఠాలతో కలిపి హిందువులలో ఎక్కువమంది అత్యున్నత పదవులలో వున్నారు. అందువల్ల ఆ కాలంనాటి సాంఘిక, ఆర్థిక పరిస్థితులను దృష్టిలో ఉంచుకొనే ఔరంగజేబు మతవిధానాన్ని అర్థం చేసుకోవల్సి ఉంటుంది.

## పాఠ్య ప్రశ్నలు 49.బి

1. కింది వాటికి ఒక ఉదాహరణలిమ్ము

1. ఇస్లాంకు వ్యతిరేకమని భావించి నిషేధించిన సాంప్రదాయం ఏది?
2. ప్రజలు అత్యున్నత నైతిక జీవితాన్ని గడపడానికి తీసుకున్న చర్య లేవి?
3. రాజాస్థానంలో పొదుపు కోసం తీసుకున్న చర్య లేవి?
4. ప్రజలలో మూఢనమ్మకాలను తగ్గించడానికి తీసుకున్న చర్య లెట్టివి.

2. ముస్లీంల అభిమానం పొందడానికి ఔరంగజేబ్ తీసుకున్న ఆర్థిక చర్యలను రాయండి.
3. ఔరంగజేబ్ దేవాలయాల కూల్చివేత గల రాజకీయ కారణం ఏమిటి?
4. ఔరంగజేబ్ తీసుకున్న ఏ రెండు చర్యలు హిందువుల పట్ల వివక్ష పూరితమైనవిగా చెప్పవచ్చు.

**సారాంశం :**

ప్రేమ భావాలను, సహనం, భక్తిని బోధించిన భక్తి ఉద్యమ సాధువులు, సూఫీ సాధువుల ప్రభావంతో 15వ శతాబ్దం చివరి భాగంలో ఉదారభావాలు, పరమత సహనం సమాజంలో నెలకొన్నాయి. ఈ పరిస్థితులలో అక్బర్ జన్మించాడు.  సహజంగానే అతనిపై కూడా ఈ భావాల ప్రభావం పడింది. సామ్రాజ్యాన్ని పటిష్టపర్చుకోవడానికి అత్యధిక సంఖ్యలో ఉన్న ముస్లిమేతరుల విశ్యాసం పొందడం కూడా అవసరమని అక్బర్ గ్రహించాడు. వీటిని పొందడానికి అక్బర్ జిజియాపన్ను, తీర్థయాత్రల పన్నులను రద్దుచేశాడు. అదేవిధంగా హిందువులను బలవంతంగా ఇస్లాం మతంలో చేర్పించడాన్ని కూడా రద్దుచేశాడు. దీంతోపాటు హిందూ పండగలను జరుపుకోవడం, వైవాహిక సంబందాలు నెలకొల్పుకోవడం, ఆస్థానంలో అత్యున్నత పదవులను ముస్లిమేతరులకు ఇవ్వడాన్ని ప్రారంభించాడు. ఖాజీలలో, ముల్లాలలో తన స్థానాన్ని బలోపేతం చేసుకోవడానికి మహజర్‌నామా ప్రకటనను ఉపయోగించాడు. అన్ని మతాలలో ఉన్న మంచి విషయాలను క్రోడీకరించి తౌహిద్-ఇ-ఇలాహిని స్థాపించాడు. సామ్రాజ్యంలో లౌకికవాదం, సాంస్కృతిక సమైక్యతను ప్రోత్సహించడం, శాంతి, సహనాలను పెంపొందే విధంగా అక్బర్ తన మతవిధానాన్ని రూపొందించుకున్నాడు.

అయితే ఔరంగజేబ్ కాలంనాటికి ఈ పరిస్థితి మారిపోయింది. భౌగోళికంగా సామ్రాజ్యం చాలా విశాలమై అత్యున్నత స్థాయికి చేరుకుంది. ఔరంగజేబ్ అనేక నైతిక, మతపరమైన నిర్ణయాలు తీసుకున్నారు. వాటిలో ముఖ్యంగా ఘరోకాదర్శన్‌ను పాటలు పాడటాన్ని నిలిపివేయడం వంటివి ఉన్నాయి. దేవాలయాలు కూల్చివేత, జిజియాపన్ను విధించడం వంటి వివక్షాపూరిత చర్యలు కూడా మరికొన్ని ఉన్నాయి. వీటివల్ల హిందువులలో అసంతృప్తి చెలరేగింది. మొత్తానికి ఔరంగజేబ్ రాజ్యానికి ప్రాధమికంగా ఉన్న ఇస్లామిక్ వ్యక్తిత్వాన్ని పునరుద్ధరించాడు.

**అభ్యాసం :**

1. అక్బర్ ఉదార భావాలకు, పరమత సహనం భావాలు ఏర్పడటానికి కారణాలేంటి?
2. తౌహిద్-ఇ-ఇలాహి లక్ష్యాలను, సిద్ధాంతాలను పేర్కొనండి.
3. అక్బర్ పరమత సహన విధానాన్ని ఔరంగజేబ్ ఎందుకు మార్చాడు? దాని ప్రభావం మొఘల్ సామ్రాజ్యంపై ఏవిధంగా ఉంది?

**పాఠ్య ప్రశ్నలకు సమాధానాలు**

**49.ఎ**

1. ఉదార, మతసహనం కలిగి ఉంది.
2. తల్లి హమీదాబానో, సంరక్షకుడు భైరాంఖాన్, గురువు అబ్దుల్ లతీఫ్
3. 1) జిజియా, తీర్థయాత్రల పన్ను రద్దుచేసెను.

   2) యుద్ధఖైదీలను బలవంతంగా ఇస్లాంలోకి మారమని ఒత్తిడి చేయడం

   3) రాజపుత్రులతో వైవాహిక సంబంధాలు నెలకొల్పుకోవడం

   4) ముస్లిమేతరులకు ఉన్నతమైన బాధ్యతాయుత పదవులు ఇవ్వడం

   5) రాజాస్థానంలో హిందూ పండుగలను జరుపుకోవడం
4. రాజ్యాన్ని బలోపేతం చేయడం కోసం
5. ఉలేమాల అధికారాలను తగ్గించడం
6. మాంసాహారాన్ని, పుట్టినరోజు పండుగలను జరుపుకోవడాన్ని నిషేధించడం. బదులుగా దానధర్మాలు చేయడం

**49. బి.**

1 1) ఘరోకాదర్శన్ 'టికా' ఉపయోగించండి.

2) ' మహర్‌సబ్‌లను నియమించడం

3) చరిత్ర రచనా శాఖను మూసివేయడం, సాంప్రదాయ ఉత్సవాలను నిలిపివేయడం

4. పంచాంగం తయారీని ఆపివేయడం

2. 1) కస్టమ్స్ సుంకాలను తగ్గించడం

2. ముస్లీంపేష్కార్, కరోరీలు దివాన్‌లను నియమించడం

3. జాట్, మరాఠాల తిరుగుబాట్లు

4. 1) దేవాలయాల కూల్చివేత

2) జిజియాపన్నును పునరుద్ధరించడం

# 50

# మధ్యయుగ భారతదేశ సాంస్కృతికాభివృద్ధి

## 50.1 పరిచయం

మధ్యయుగ భారతదేశ చరిత్ర అంతా వివిధ సంస్కృతుల మిశ్రమం. టర్కుల సాంప్రదాయాలు భారతదేశ సంస్కృతిలో కలిసిపోవడం వెంటనే ప్రారంభమైంది. మధ్య, పశ్చిమాసియా నుండి వచ్చిన టర్కులకు జీవించడానికి దేవతారాధనకు ప్రదేశాలు అవసరమయ్యాయి. దీనికోసం అంతకుముందు ఉన్న దేవాలయాలను, ఇతర కట్టడాలను మసీదులుగా, గృహాలుగా మార్చుకున్నారు. తర్వాత కాలంలో జరిగిన నూతన నిర్మాణాలను సాంప్రదాయ స్వదేశీ పనివారే చేశారు. అందువల్ల సల్తానత్ కాలంలో జరిగిన నిర్మాణాలలో భారతీయ, టర్కీ శైలులు కలిసిపోయి కన్పిస్తాయి.

సల్తానత్ కాలంలో ప్రారంభమైన ఈ సాంప్రదాయాలు మొగల్ కాలంలో కూడా కొనసాగాయి. టర్కో-ఇరానియన్ సంస్కృతిలోని నూతన అంశాలు భారతీయ శైలిలో కలిసిపోయాయి. అక్బర్ నిర్మాణాలలో హిందూ. జైన, బౌద్ధ దేవాలయాలు, విహారాల శైలులు కన్పిస్తాయి. జహంగీర్ కాలంలోని చిత్రాలలో మతపరమైన వాటితోపాటు లౌకికమైనవి కూడా కన్పిస్తాయి. మధ్యయుగంలో పర్షియన్, అరబిక్, ఉర్దూ, సంస్కృత భాషలతోపాటు ప్రాంతీయ భాషలలో కూడా సాహిత్య సృష్టి జరిగింది. ఉర్దూ వంటి కొత్త భాష ఆవిర్భావం కానీ, రాహబ్, సారంగి వంటి సంగీత పరికరాలను ఉపయోగించడం కానీ ఆ కాలంలో జరిగిన సంస్కృతుల మేళవింపుకు నిదర్శనంగా ఉన్నాయి. టర్కులు మొగలాయిలు భారతదేశాన్ని తమ మాతృభూమిగా చేసుకోవడంతోపాటు భారతీయ సంస్కృతిని సుసంపన్నం చేయడానికి ఏ విధంగా కృషి చేశారో మీరు ఈ పాఠంలో నేర్చుకుంటారు.

## 50.2 లక్ష్యాలు :

ఈ పాఠం చదివిన తర్వాత క్రింది విషయాలు గ్రహించగలగాలి.

1. సుల్తానత్ యుగంలో ఇండో-ఇస్లామిక్ శైలిలో జరిగిన వాస్తు కళ అభివృద్ధి.
2. బానిస వంశ సుల్తానులు, ఖిల్జీలు, తుగ్లక్‌లు, లోడీల కాలంలో జరిగిన నిర్మాణాలు, వాస్తు శైలి.
3. అక్బర్ నిర్మాణాల ద్వారా తెలుస్తున్న అతని లౌకికతత్వం.
4. అక్బర్, జహంగీర్, షాజహాన్, ఔరంగాబాద్‌ల నిర్మాణాలలోని వాస్తు శైలి అంశాలు.

5. అక్బర్, జహంఈర్ కాలంలో జరిగిన మొగల్ చిత్రకళాభివృద్ధి.

6. పర్షియన్, సంస్కృతం, ఉర్దూ భాషలలో జరిగిన సాహిత్య సృష్టి.

7. మధ్యయుగంలో ప్రాంతీయ భాషల అభివృద్ధికిగల కారణాలు.

## 50.3 సల్తానత్ యుగంలో వాస్తు

టర్కులు ప్రవేశపెట్టిన నూతన వాస్తు శైలుల గురించి మీరు ఇప్పుడు చదువుకుంటారు. గల్లి సుల్తానత్ కాలంలో జరిగిన వాస్తు అభివృద్ధిని మూడు దశలుగా విభజించవచ్చు. మొదటిది ఖిల్జీ వంశ అంతం వరకు కాగా రెండవ దశ తుగ్లక్‌ల వరకు. మూడవది లోడీల వరకు ఉంటుంది. ఇండో-ఇస్లామిక్ వాస్తు శైలిలో జరిగిన అభివృద్ధి ఈ యుగంలో ప్రధానంగా కన్పిస్తోంది. టర్కులు తీసుకువచ్చిన నూతన వాస్తు శైలి భారతీయ వాస్తుతో కలిసిపోయింది. టర్కుల నిర్మాణాలలో ఎక్కువగా కన్పించే గుమ్మటాలు, తోరణాలు అలంకార రహితంగా ఉండే భారతీయ పై కప్పులను ఆక్రమించాయి. టర్కులు గుమ్మటాలలో కూడిన ఆకర్షణీయమైన పెద్ద భవనాలు అనేకం నిర్మించారు. ఆ భవనాల పై భాగంలో గుమ్మటాలు నిర్మించేవారు. పై కప్పును ఆధారంగా పెద్ద సంఖ్యలో స్తంభాల అవసరం లేకుండానే ఈ తోరణాలను, గమ్మటాలను నిర్మించేవారు. ప్రార్థనల కోసం ఉపయోగించే పెద్ద హాలులను నిర్మించారు. వాటిలో చాలా నాణ్యమైన సున్నం మిశ్రమాన్ని ఉపయోగించేవారు.

| టర్కులు రాకతో తోరణాలు, గుమ్మటాలతో పాటు నాణ్యమైన సున్నాన్ని నిర్మాణాలలో ఉపయోగించడం అధికమైంది. |
|---|

టర్కుల రాకపూర్వం ఈ తోరణాలు, గుమ్మటాల నిర్మాణం గురించి భారతీయులకు తెలియదనడం సరైంది కాదు. పైగా ఈ నిర్మాణాలలో శాస్త్రీయ పద్ధతిని కూడా అవలంభించలేదు. అయితే భారతీయ వాస్తులో ప్రధానంగా నిలువుగా, అడ్డంగా ఉన్న దూలాలు (బీమ్స్) పెద్ద స్థలాలను కలుపుతూ కన్పిస్తాయి. ఈ పద్ధతిలో ఒత్తిడి ప్రధానంగా నిలువుగా ఉన్న స్థంభాలపై ఉంటుంది. భారతీయులు సున్నం మిశ్రమాన్ని చాలా తక్కువగా ఉపయోగించారు. టర్కీ పాలకులు నిర్మాణాలలో తోరణం, గుమ్మటాల పద్ధతితోపాటు సాంప్రదాయ స్వదేశీ పద్ధతిని కూడా అనుసరించారు.

ఇంకా టర్కులు నూతన అలంకరణశైలిని తీసుకువచ్చారు. మనుష్యుల, జంతువుల బొమ్మలు ఇస్లాంకు విరుద్ధమని భావించి ఉపయోగించలేదు. భవన నిర్మాణాలను పుష్పాలంకరణలతో, క్షేత్ర ఆకృతితో, ఖురాన్ పద్యాల చిత్రీకరణతో అందంగా తీర్చిదిద్దేవారు. ఇలా ఉన్న అలంకరణశైలిని 'అరబెస్ క్యూ' అనే వారు. దీంతోపాటు టర్కులు హిందూమతంలోని వివిధ గాథల మూలాంశాలను, రూపురేఖలను వారి నిర్మాణాలలో విరివిగా ఉపయోగించేవారు. గంట, స్వస్తిక్, కమలం, పూర్ణ కుంభం వంటివన్నీ కూడా ఢిల్లీ సుల్తానుల నిర్మాణాలలో కన్పిస్తాయి. ఇంకా టర్కులు వారి భవనాలను, నిర్మాణాలను రంగులతో అలంకరించేవారు. వీటిలో ఎర్ర ఇసుకరాయిని అధికంగా వినియోగించేవారు. కొన్ని ప్రత్యేక ప్రదేశాలను సుందరంగా అలంకరించడానికి పసుపుపచ్చ ఇసుకరాయిని పాలరాతిని ఉపయోగించేవారు.

బానిస వంశ చక్రవర్తులు వాస్తురంగంలో సాధించిన విజయాలకు ప్రతీక 'కుతుబ్‌మీనార్'. టర్కుల సైనిక విజయాలను ఇది ప్రతిబింబిస్తుంది. ఈ మినార్ నిర్మాణాన్ని కుతుబుద్దీన్ ఐబర్ ప్రారంభించగా ఇల్‌టూన్‌మిష్ పూర్తి చేశారు. దీన్ని సూఫీగురువు కుతుబుద్దీన్ భక్తియార్‌కాకి 3 అంకితమిచ్చారు. ఇతనిని ఢిల్లీ ప్రజలు గొప్పగా గౌరవించేవారు.

ఈ నిర్మాణంలో సరిపోల్చదగ్గవాటిని భారతదేశంలో గాని ఇస్లామిక్ కళ విస్తరించిన ప్రాంతాలలోగానీ చూడలేము. ఈ కుతుబ్‌మినార్ నాలుగు అంతస్తులతో విడివిడిగా ఉన్న వరండాలలో ఉంటుంది. దీని నిర్మాణంలో చాలా నైపుణ్యంగల కళాకారుల శ్రమ కన్పిస్తోంది. ఇసుకరాయిని పాలరాతిని వలయాలుగా, చారలుగా వినియోగించి అందంగా అలంకరించారు. దీనిపై ఖురాన్ నుండి గ్రహించిన మంచి పద్యాలను శిలాశాసనాలుగా అందంగా చిత్రీకరించారు. ఇది గుండ్రంగా అత్యంత ఎత్తుగా ఉండి, ఇంకా ఎత్తు పెరుగుతున్న భ్రాంతికి లోనుచేస్తూ ఉంటుంది. ఇందులో ఉన్న ప్రధాన ఆకర్షణ దీని సుస్థిరతగా చెప్పవచ్చు.


కుతుబ్‌మినార్
ఢిల్లీ

ఢిల్లీ సుల్తానత్ యుగంలో జరిగిన వాస్తు ప్రయోగాలకు నిదర్శనంగా ఇల్‌టుట్‌మిష్ సమాధి కన్పిస్తోంది. కింద హాలు అంతా చదరంగా నాల్గువైపులా ఉండి పై భాగంలో గుమ్మటమున్న సమాధుల కట్టడాలకు ఇది మొదటి ఉదాహరణగా నిలుస్తుంది. వాస్తు శాస్త్ర అభివృద్ధిలో బాల్బన్ సమాది నిర్మాణాన్ని కూడా ఒక మైలురాయిగా చెప్పవచ్చు. దీనికి కారణం మొట్టమొదటిసారిగా నిజమైన తోరణ ద్వార నిర్మాణం ఇందులో కన్పిస్తోంది.

ఢిల్లీ వంశ చక్రవర్తులు కూడా అందమైన భవన నిర్మాణాలను ప్రారంభించారు. ఇందులో క్రీ.శ. 1305లో అల్లా ఉద్దీన్ ఖిల్జీ ప్రారంభించిన 'ఆలైదర్వాజా' ఇస్లామిక్ వాస్తు అభివృద్ధిలో ఒక ప్రథమ ఘట్టం. ఇది కుతుబ్ మసీదుకు దక్షిణ ద్వారం. ఈ ఆలైదర్వాజా గుమ్మటం శాస్త్రీయ పద్ధతిలో నిర్మించిన మొదటి కట్టడం. ఈ దర్వాజాకు చాలా తోరణ ద్వారాలున్నాయి. ఒక తోరణ ద్వారంలో గుర్రపు డెక్క మాదిరి చిత్రం కన్పిస్తోంది. ఇటువంటి శైలి ఖిల్జీల తర్వాత కన్పించదు. దీంతోపాటు ఢిల్లీలోని 'సిరి' వద్ద అల్లాఉద్దీన్ తన రాజధానిని నిర్మించాడు. దురదృష్టవశాత్తు ఈనాడు దీని ఆనవాళ్ళు ఏమీ నిలిచిలేవు.

దీని తర్వాత క్రీ.శ. 1320 – 1415 మధ్యకాలంలో పరిపాలించిన తుగ్లక్ వంశ చక్రవర్తుల కాలంలో


ఘియాసుద్దీన్ తుగ్లక్ సమాధి
ఢిల్లీ

ఇండో–ఇస్లామిక్ వాస్తు శైలి ఒక స్వతంత్ర శైలిగా స్థిరపడింది. అయితే తుగ్లక్‌ల వాస్తు శైలిలో కొన్ని నూతన అంశాలను కలిగిఉంది. తుగ్లక్‌ల నిర్మాణాలు సాధారణంగా మొరటుగా కన్పిస్తాయి. అవి ఏటవాలు గోడలతో బలమైన నిర్మాణాలుగా ఉన్నాయి. పూర్వం కంటే ఈ తుగ్లక్‌ల గుమ్మడాలను ఇంకా ఎత్తుతో విశాలంగా బలంగా శత్రు దుర్భేద్యంగా నిర్మించారు. అయితే ఫిరోజ్‌షా తుగ్లక్ నిర్మాణాలపై మాత్రం ఎలాంటి శత్రువుల దాడుల జాడలు కన్పించవు.

తుగ్లక్‌ల కాలం నాటి వాస్తులో ఉన్న మరో అంశం కమానులను అడ్డ దూలాలను బీంలను కలిపి భవనాలను నిర్మించే పద్ధతి. దీన్ని ఫిరోజ్‌షా తుగ్లక్ నిర్మాణాలయిన హౌజ్‌ఖాస్ వంటి వాటిలో గమనించవచ్చు. తర్వాత తుగ్లక్‌లు వారి నిర్మాణాలలో ఖరీదైన ఎర్ర ఇసుకరాయికి బదులుగా తేలికగా లభించే బూడిదరంగు రాయిని వినియోగించారు. వీరు అలంకరణకు ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చేవారు కాదు. బూడిదరంగు రాయిలో అలంకరణ సాధ్యం కాదు కూడా. తుగ్లక్‌ల భవన నిర్మాణాలలో హిందూ మత గాథలలో కన్పించే మూలాంశాలను అలంకరణకు వినియోగించేవారు. కమలం, పూర్ణ కుంభం వంటివి అధికంగా కన్పించేవి అయితే తుగ్లక్‌ల వాస్తు శైలి ఆడంబరాలకు దూరంగా సాధారణంగానే ఉండేది.

ఘియాసుద్దీన్ తుగ్లక్ 'తుగ్లకాబాద్'పేరుతో ఢిల్లీ మూడవ నగరాన్ని వారి వాస్తుశైలికి అనుగుణంగా నిర్మించారు. ఇందులో మొదటిసారిగా నగరాన్ని కోటను, రాజు మందిరాన్ని కలుపుతూ విశాలమైన భవన సముదాయాలను నిర్మించారు. తర్వాత ఘియాసుద్దీన్ తుగ్లక్ సమాధి కూడా వాస్తులో నూతన శైలికి ప్రతిబింబంగా ఉంది. ఇది అత్యంత ఎత్తుగా వుంది వరండాను కలిగివుంది. దీని అలంకరణలో తెల్ల పాలరాతిని ఎర్ర ఇసుకరాయిని ఉపయోగించారు. దీని గుమ్మటం



సికిందర్ లోడీ సమాధి
ఢిల్లీ

నిర్మాణం కూడా ఇండో–ఇస్లామిక్ వాస్తు శైలి లక్షణమైన 'టార్టర్' మాదిరిగా ఉంటుంది. హిందూ దేవాలయాలలో ఉండే 'కలశ', ఆమ్లలతో, ఆ గుమ్మటాలను అలంకరించినట్లు కన్పిస్తోది. తోరణాలు బీముల మద్దతుతో చేసే నూతన నిర్మాణ శైలిని ఈ ఘియాసుద్దీన్ తుగ్లక్ సమాది తెలుపుతుంది. దీన్ని యుద్ధ వీరుల సమాధిగా వర్ణించారు. ఘియాసుద్దీన్ తర్వాత అధికారంలోకి వచ్చిన మహమ్మద్ బీన్ తుగ్లక్ 'జహన్‌పనా' పేరుతో ఢిల్లీ నాల్గవ నగరాన్ని నిర్మించారు.

తుగ్లక్ వంశంలో ఫిరోజ్‌షా తుగ్లక్‌ను గొప్ప భవన నిర్మాతగా చెప్పవచ్చు. క్రీ.శ. 1354లో 'ఫిరోజాబాద్' పేరుతో ఢిల్లీ ఐదవనగరాన్ని ఈయన నిర్మించారు. ఇందులో 'కుష్కి ఫిరోజ్' పేరుతో ఉన్న రామమందిరం, ఫిరోజ్‌షా కోట్ల దుర్గం ఉన్నాయి. హౌజ్‌ఖాస్ నిర్మాణంతోపాటు ఘియాసుద్దీన్ మహమ్మద్ తుగ్లక్‌ల సమాధులను కూడా మరమ్మత్తు చేయించాడు. దీంతోపాటు కుతుబ్‌మీనార్‌కు కూడా మరో రెండు అంతస్తులను జతపర్చాడు. సమకాలీన చారిత్రక ఆధారం ప్రకారం ఈ నగరంలో 8 జమామసీదులు, 120 సత్రాలు ఉన్నట్లు తెలుస్తోంది. ఇంకా తోప్రా మీరాట్‌లలో ఉన్న మౌర్య చక్రవర్తి అశోకుని స్తంభాలను ఢిల్లీకి తీసుకువచ్చాడు. వీటిని ఈనాటికి మనం చూడవచ్చు.

కొత్త రకమైన సమాధి నిర్మాణాన్ని ఫిరోజ్‌షా తుగ్లక్ ప్రధాన మంత్రి ఖాన్–ఐ–జహర్ తిలంగణి సమాధి నిర్మాణంలో చూడవచ్చు. అంతకుముందు సమాధులు నాల్గువైపులా సమానంగా ఉండేవి. అయితే ఈ తిలంగణి సమాధి మాత్రం అష్టభుజి ఆకారంలో ఉంది. పైగా వీధిలో పూర్వం ఉండే చూరు కూడా ఉండేది. దీనిని తర్వాత కాలంలో కూడా కొనసాగించారు. తర్వాత ఇండో–ఇస్లామిక్ కళా సాంప్రదాయాలను లోడీలు అభివృద్ధి పరిచారు. తోరణ ద్వారం, అడ్డు దూలం బీం పద్ధతులను వారి నిర్మాణాలలో ఉపయోగించారు. వరండాలు, చూరులతో కూడిన రాజస్తానీ, గుజరాత్ శైలులను వారు వినియోగించారు. ఇంకా ఇతర భవన నిర్మాణాలు ముఖ్యంగా సమాధులు బయటకు అందంగా

కనిపించే విధంగా విశాలమైన వరండాలను నిర్మించడం లోడీల ప్రత్యేకత. కొన్ని సందర్భంలో ఈ సమాదుల చుట్టూ అందమైన ఉద్యాన వనాలను నిర్మించేవారు. ఢిల్లీలో ఉన్న లోడీ ఉద్యానవనాలు దీనికి ఉదాహరణగా ఉన్నాయి.

ఢిల్లీలోని లోడీ ఉద్యానవనంలో ఉన్న సికిందర్ లోడీ సమాధి నిర్మాణంలో జరిగిన మార్పు గమనించదగింది. మొదట గుమ్మటాలను రాతి పనితో మందంగా నిర్మించేవారు. కానీ సికిందర్ లోడీ సమాధి నిర్మాణంలో రెండు గుమ్మటాల వాస్తు శైలిని అనుసరించారు. ఈ పద్ధతిలో ఒక గుమ్మటం ఎత్తుగా ఉన్న దాని చుట్టూ అందంగా కనిపించే విధంగా మరొక నిర్మాణం ఉంటుంది. దీని ద్వారా గుమ్మటం పెద్దగా అందంగా కన్పిస్తోంది. తర్వాత కాలంలో మొగల్ యుగంలో నిర్మించిన అనేక గుమ్మటాలను ఈ పద్ధతిలోనే నిర్మించారు.

ఇదే భాగంలో షేర్షా సూరి ఈ రంగంలో చేసిన సేవలను చర్చించడం సమంజసంగా ఉంటుంది. ఇతను గొప్ప భవన నిర్మాత. షేర్షా జీవించి ఉన్నప్పుడే ససరాంలో తన సమాధిని నిర్మించాడు. ఇది అద్భుతమైన నిర్మాణంగా చరిత్రలో నిలిచిపోయింది. ఈ ససరాం సమాధి లోడీల అష్టభుజ శైలిలో ఉన్నప్పటికీ దానికంటే అనేకరెట్లు పెద్దది. దీనిలో కృత్రిమమైన నీటి కొలనుతోపాటు సమాధి మందిరం ఉన్నాయి. ఢిల్లీకి దగ్గరలో ఉన్న యమునా నది సమీపంలో షేర్షా ఆరవ నగరాన్ని నిర్మించాడు. ఇందులో పాత కోట, మసీదు ఉన్నాయి. షేర్షా వాస్తు శైలి అంతకుముందున్న సుల్తానత్ వాస్తు శైలికి కొనసాగింపుగా షేర్షా తర్వాత మొగలుల వాస్తు శైలికి అనుసంధానంగా అద్భుతంగా ఉపయోగపడింది.

## పాఠ్యాంశ ప్రశ్నలు 50 ఎ:

1. సరైన సమాధానాలను గుర్తించండి.

ఎ) టర్కులు భవన నిర్మాణాలలో ______________ ఉపయోగించారు

(చదునైన పై కప్పు, గుమ్మటం)

బి) టర్కుల భవన నిర్మాణాలలో అలంకరణకు ______________ వినియోగించేవారు.

(మానవ చిత్రాలు, జంతువుల చిత్రాలు, కాలగ్రఫీ, చేతివ్రాత కళ)

సి) ఫిరంగులతో పడగొట్టునటువంటివి ______________ భవన నిర్మాణాలలో ఉన్నాయి

(తుగ్లక్‌లు, ఖిల్జీలు, లోడీలు)

డి) 'సిరి' నిర్మించిన వారు ______________

(ఇల్‌టుట్‌మిష్, అలాఉద్దీన్ ఖిల్జీ, ఫిరోజ్‌షా తుగ్లక్).

ఇ) రెండు గుమ్మటాల నిర్మాణంను మొదట ______________ సమాధిలో చూస్తాము.

(బాల్బన్, ఘియాసుద్దీన్ తుగ్లక్, సికిందర్ లోడి)

ఎఫ్) ససరాంలోని షేర్షా సూరి సమాధి ఎవరి వాస్తుశైలికి కొనసాగింపుగా ఉంది.

(తుగ్లక్, లోడీ, తొలి మొగలులు)

## 50.4 మొగలుల వాస్తు శైలి.

ఢిల్లీ సల్తానత్ కాలంలోని వాస్తు శైలుల గురించి ఇప్పటి వరకు మనం చదువుకున్నాం. టర్కో-పర్షియన్, భారతీయ సాంప్రదాయ వాస్తు శైలుల సమ్మేళనం ఢిల్లీ సల్తాన్త్ కాలంలో ప్రారంభమై మొగలుల కాలంలో ఉచ్ఛస్థితికి చేరింది. అదేసమయంలో వాస్తు శైలి టెక్నిక్‌లో మొగల్ యుగంలో జరిగిన ప్రమాణాల వల్ల మొగల్ వాస్తు శైలి ఢిల్లీ సుల్తానత్ కన్నా ఆధునికంగా కనిపిస్తుంది.

అక్బర్ కాలం నాటికి మొగల్ వాస్తు శైలి ఒక స్థిర రూపాన్ని సంతరించుకుంది. భవన నిర్మాణాలను పెద్ద స్థాయిలో ప్రారంభించిన మొట్టమొదటి మొగల్ చక్రవర్తి అక్బర్. చరిత్ర లేఖకులు అబుల్ ఫజల్ నుడివినట్లు 'అక్బర్



హుమాయిన్ సమాధి, ఢిల్లీ

చక్రవర్తి గొప్ప కట్టడాలను మనస్సులోనే ప్రణాళికలు చేసుకొని దానిని వాడవల్సిన రాయి, మట్టిలను నిర్ణయిస్తారన్నారు'. అక్బర్ వాస్తు శైలి ద్వారా అతని ఉదార స్వభావం, లౌకిక తత్వం, విశాల భారత సామ్రాజ్య రూపకల్పన భావాలు కన్పిస్తాయి. ఇతని నిర్మాణ శైలి ఏ ఒక్క మతాన్ని ప్రతిబింబించే విధంగా ఉండదు. అంతేకాకుండా వాస్తులో ప్రత్యేకమైన ప్రాంతీయ శైలులను ప్రోత్సహించే విధంగా ఉండదు. అక్బర్ కాలంలో బెంగాల్, గుజరాత్‌లతోపాటు తన సామ్రాజ్యంలోని ఇతర ప్రాంత కళాకారులకు పని కల్పించేవారు. ఇతని నిర్మాణాలలో ప్రధానంగా ఎర్ర ఇసుకరాయి అత్యధికంగా వినియోగించారు. దీంతోపాటు తెల్లపాలరాతిని అందంగా చెక్కించడం, పై కప్పులను, లోపలిభాగాలను అందమైన బొమ్మల చిత్రీకరణ ద్వారా అలంకరించడం కన్పిస్తోంది.

క్రీ.శ. 1565లో ఢిల్లీలో నిర్మించిన హుమాయిన్ సమాధి తొలి మొగలుల వాస్తు శైలికి నిదర్శనంగా ఉంది. ఈ హుమాయున్ సమాధి అంతకుముందున్న నిర్మాణాలలోని ప్రత్యేకతలను నిలుపుకుంటూనే రెండు నూతన వాస్తు శైలులకు ప్రతిబింబంగా ఉంది. మొదటిది ఈ సమాధి పర్షియన్ ఆకారంలో ఉన్న పెద్ద గుమ్మటం కలిగివుంది. ఈ గుమ్మటం లశునాకారంలోని నిర్మాణంగా ఉండి రెండు గుమ్మటాలుగా ఉంటుంది. పైకి కన్పించే భాగం తెల్ల పాలరాతిలో ఉంటుంది. రెండవది ఈ భవనమంతా పెద్ద పోడియంపై మధ్య భాగంలో ఉంటుంది. నలువైపులా తీర్చిదిద్దినట్లు ఉండే

చార్‌బాగ్ ఉద్యానవనాలు ఉండేవి. ఇదే నిర్మాణశైలిని వాస్తు అంశాలను అంతకుముందు లోడీ సమాధుల నిర్మాణంలో గమనించవచ్చు.

అక్బర్ అనేక కోటలను నిర్మించాడు. ఇందులో ప్రఖ్యాతిగాంచింది క్రీ.శ. 1556లో నిర్మించిన ఆగ్రా కోట. ఇందులో ఎర్ర ఇసుకరాయిని విరివిగా వినియోగించారు. ఇందులో పెద్ద గోడలు, 70 అడుగుల ఎత్తులో బురుజులు, పెద్ద ద్వారాలు, విశాలమైన అష్టభుజ స్తంభాలు ఉన్నాయి. ఈ మొగల్ కోటల నిఆర్మణాలపై రాజపుత్రలు దుర్గం నిర్మాణాల ప్రభావం ఉంది. దీనికి ఉదాహరణగా ఆగ్రాకోటలోని జహంగీర్ మహల్, జీవించి ఉన్న పక్షుల చిత్రాలను నిర్మాణాలలో ఉపయోగించడాన్ని ఖురాన్ ఆక్షేపించినప్పటికి పురాణగాథల మూలాంశంగా ఉన్న చిత్రాలను వీరు విరివిగా వినియోగించడం గమనార్హం. దీనివల్ల అక్బర్ కాలంలో జరిగిన నిర్మాణాల లౌకికతత్వాన్ని ప్రధానంగా గమనించవచ్చు.

క్రీ.శ. 1572లో ఆగ్రా సమీపంలో సతేపూర్ సిక్రి అనే నూతన రాజధానిని అక్బర్ నిర్మించాడు. ఇది అక్బర్ పరిపాలనకు రాజకీయాలకు అనువుగా ఉంది. భారత సామ్రాజ్యాన్ని కేవలం ఖగోళికంగా విస్తరించడమే కాకుండా పరిపాలనపరమైన, రాజకీయమైన అంశాలను చర్చించడానికి అనుకూలంగా ఇది నిర్మించబడింది. రాజకీయ చర్చలకు, నివాసాలకు, అధికారులకు, మతపరమైన చర్చలకు విడివిడి భవనాలు ఫతేపూర్ సిక్రిలో ఉన్నాయి. ఇవన్నీ కూడా ఒకే భవన సముదాయంగా ఉన్నాయి.

మరియు సుల్తానా, బీర్బల్‌ల నివాసమైన జోథ్‌బాయి మందిరం ఫతేపూర్ సిక్రి నిర్మాణాలలో ప్రఖ్యాతిగాంచింది. అందంగా చెక్కబడిన అలంకరణలతో పశ్చిమ భారతదేశం (గుజరాత్)లోని దేవాలయ వాస్తు పోలికలతో ఈ జోథ్‌భాయి మందిరం ఉంది. పర్షియన్ శైలిలో ఉన్న చిత్రాలలో మరియు మందిర లోపలిభాగం అలంకరించి ఉంటుంది. ఇవి మొగల్ చిత్ర కళ ప్రాథమిక దశను తెల్పుతాయి. ఇక ఐదు అంతస్తులతో పిరమిడికల్ నిర్మాణ శైలిలో పంచమహల్ నిర్మించబడింది. ఇది బహుళా బౌద్ధ విహారాల స్ఫూర్తితో నిర్మించబడి ఉంటుంది. పై కప్పులకు మద్దతుగా దేవాలయాలలో ఉండే అన్నిరకాల స్తంభాలను ఇందులో వినియోగించారు. ఇక బీర్బల్ మహల్ కూడా సూక్ష్మంగా ఉన్న చెక్కడాలలో, చజ్జాలలో అందమైన స్ఫూర్తిదాయమైన హిందూ బ్రాకెట్స్‌లో ఉంటుంది.

ఫతేపూర్ సిక్రిపై కప్పు, గోడలపై నీలిరంగు టైల్స్‌ను అలంకరించడంలో పర్షియన్, మధ్య ఆసియా ప్రభావం కన్పిస్తోంది.

ఫతేపూర్ సిక్రిలో ప్రేక్షకుల కోసం, పరిపాలనా అవసరాల కోసం నిర్మించిన దివానీ ఖాస్ అద్భుతమైన నిర్మాణం. ఇందులోని ఇబాదద్‌ఖానాలో అక్బర్ వివిధ మతాల పెద్దలతో తత్వవేత్తలతో, పరిశోధకులతో మతపరమైన, ఆధ్యాత్మిక పరమైన చర్చలు జరిపేవాడు. ప్రేక్షకుల హాలులో విశాలమైన ఒకే గది ఉండేది. మధ్య భాగంలోనే ఒక పెద్ద స్తంభముండి మిగతా ప్రదేశాలు అప్పటి అవసరాలు తీర్చే విధంగా నిర్మాణ శైలి ఉంది. ఇందులోనే చక్రవర్తి కూర్చోవడానికి అనువుగా ఆ స్తంభానికే ఒక గద్దె కూడా నిర్మించారు.

ఈ ఫతేపూర్ సిక్రితోపాటు మూడు నిర్మాణాలు అక్బర్‌కు శోభను కల్గించాయి. అవి బులంద్ దర్వాజా, జామా మసీదు, సలీం చిస్తీ అక్బర్ గుజరాత్‌పై విజయాలకు చిహ్నంగా బులంద్ దర్వాజ్ సమాధి నిర్మించారు. ఇది స్ఫూర్తివంశంగా శక్తిని ప్రదర్శించే దిశగా ఉండి, సగం గుమ్మటం శైలిలో ఉండేది. దీన్ని ఇరాన్ నుండి తీసుకువచ్చినప్పటికి తర్వాత కాలంలో మొగల్ వాస్తులో భాగమైంది. ఇక జామా మసీదు భారతదేశంలోని పెద్ద మసీదులలో ఒకటి. దీన్ని మూడు వైపుల ఉన్న దారులకు మధ్యలో పెద్ద ద్వారంలో సాంప్రదాయ పద్ధతిలో నిర్మించారు. ఇక సలీం చిస్తీ పాలరాతి



బీరబాల్ ప్యాలెస్, ఫతేపూర్ సిక్రీ



బులంద్ దర్వాజా, ఫతేపూర్ సిక్రీ



ఇత్మాదుద్-దౌలా సమాధి, ఆగ్రా


సికింద్రాలోని అక్బర్ సమాధి

సమాధి సర్పిలాకార డబ్బాలు తెరలు కల్గి ఉన్న గొప్ప నిర్మాణం. అక్బర్ తర్వాత జహంగీర్ కాలంలో భవన నిర్మాణ రంగంలో కొంత స్తబ్దత చోటు చేసుకుంది. జహంగీర్ చిత్రకళపై ఎక్కువ మక్కువ చూపేవాడు. అయితే జహంగీర్ కాలంలో కూడా నూర్జహాన్ తన తండ్రి కోసం ఆగ్రా దగ్గర నిర్మించిన ఇత్మాదుద్-దౌలా సమాధి మొగల్ వాస్తు శైలిలో ఒక మైలురాయి వంటిది. రుద్రదురా అలంకరణతో పూర్తి తెల్ల పాలరాతితో మొగలుల మొదటి నిర్మాణంగా ఇది పేరొందింది. అందమైన పూల చిత్రాలతో, పాలరాతితో కూర్చబడిన విలువైన రాళ్లతో ఈ శైలిలో ఉండేవి. ఇంకా సికింద్రాలోని అక్బర్ సమాధిని జహంగీర్ పూర్తి చేశాడు. ఇందులో పెద్ద వేదిక ఉండేది. సమాధి మందిరం ఐదు అంతస్తులు కలిగి ఉండి పైకి వెళ్తున్న కొద్ది వైశాల్యం తక్కువవుతూ ఉంది. అయితే దీనిపైన మధ్యలో ఎలాంటి గుమ్మటం లేదు. ఇది బహుశా బౌద్ధ విహారాల స్ఫూర్తితో నిర్మించబడి ఉంటుంది.

ఇక మొగల్ వాస్తు షాజహాన్ కాలం నాటికి పతాక స్థాయికి చేరింది. మొగల్ చక్రవర్తులందరిలో గొప్ప భవన నిర్మాత షాజహాన్. భవన నిర్మాణాలలో ఉపయోగించిన వస్తువులలో, సాంకేతికత నైపుణ్యాలలో, శైలిలో షాజహాన్ ప్రత్యేక ముద్ర కన్పిస్తోంది. ఎర్ర ఇసుకరాయి స్థానంలో పాలరాయి చేరింది. పిట్రాదురా ద్వారా అలంకరణ ఉండేది రంగు ఇటుకలను అరుదుగా వినియోగించేవారు. అక్బర్ పెద్ద స్థాయి నిర్మాణాల స్థానంలో అందమైన అలంకరణలతో విశాలమైన భవనాలను షాజహాన్ నిర్మించాడు. దీర్ఘచతురస్రాకార నిర్మాణాలు ఒంపు గీతలతో కూడిన వాటిగా ఉన్నాయి. గుమ్మటాల చుట్టూ ఇంకొక అందమైన నిర్మాణం వచ్చే విధంగా ఉన్న పర్షియన్ శైలి నిర్మాణాలు, రెండు గుమ్మటాల నిర్మాణాలు అధికమయ్యాయి.

కోట నిర్మాణాలలో కూడా షాజహాన్ కాలం ఉచ్ఛస్థితికి చేరింది. ఇతను ఢిల్లీలో ప్రఖ్యాత ఎర్రకోట నిర్మించాడు. ఆ కోటలో దివానీ ఖాస్, దివాని ఆమ్, రంగు మహల్‌లు ఉన్నాయి. దివానీఖాస్ విలువైన వెండిపై కప్పులతో ఉండి

బంగారం, విలువైన రాళ్ళు, పాలరాతి కలిపిన అలంకరణలో అద్భుతంగా ఉండేది. ఇక షాజహాన్ కాలంలో మసీదు నిర్మాణాలు కూడా ప్రఖ్యాతిగాంచినవి. ఇందులో ఢిల్లీలోని జమా మసీదు, ఆగ్రాలోని మోతి మసీదులు ముఖ్యమైనవి. మోతిమసీదు పూర్తి పాలరాతితో నిర్మించబడింది. ఇక జమామసీదు అందమంతా దాని నిరాడంబరత, స్వచ్ఛతలోనే ఉంది. దీన్ని ఎర్రకోటకు సమీపంలో ఎర్ర ఇసుకరాయితో నిర్మించారు. వివిధ గుమ్మటాలు, సన్నని ఎత్తయిన గోపురాలు, పర్షియన్ శైలిలో ఉన్న ద్వారాలు వరండాలలో అందంగా ఉంటుంది.

షాజహాన్ నిర్మాణాలలో అత్యద్భుతమైన దానిగా తాజ్‌మహల్‌ను పేర్కొనవచ్చు. యమునా నది సమీపంలో ఉన్న దీనిని షాజహాన్ తన ప్రియమైన భార్య ముంతాజ్ పేరుతో నిర్మించారు. మొగలులు అభివృద్ధి పరిచిన అన్ని వాస్తు శైలులు ఈ నిర్మాణంలో ఉన్నాయి. పెద్ద పాలరాతి గుమ్మటం దీని ప్రధాన ఆకర్షణ. ఇంకా ఇది పర్షియన్ శైలిలో ఉన్న రెండు గుమ్మటాలు కలిగివుంది. నాల్గువైపులా సన్నని ఎత్తయిన గోపురాలున్నాయి. అయతే ఇవీన్న కూడా ప్రధాన గుమ్మటాన్ని కలుపుతూ ఉన్న ప్లాట్‌ఫాంలో ఉన్నాయి. సున్నితమైన పాలరాతి తెరలతో, అందమైన చేతిరాతతో ఉన్న ఖురాన్ పంక్తులలో మొత్తానికి పరిమితమైన అలంకరణలోనే తాజ్‌మహల్ ఉంది. అయితే దాని అసలైన అందమంతా పొడవు, వెడల్పులలో ఉన్న సమానత్వంవల్లేనని చెప్పవచ్చు. ముఖభాగపు ఎత్తు మధ్యలో ఉన్న గుమ్మటం సరిసమానంగా ఉండడంవల్ల అది చాలా ఆకర్షణీయంగా కన్పిస్తోంది. ఈ నిర్మాణం చుట్టూ అందమైన ఉద్యానవముండటం అదనపు ఆకర్షణ.

ఇక ఔరంగజేబు పరిపాలనా కాలంలో భవన నిర్మాణాలకు అధిక ప్రాధాన్యత లభించలేదు. సున్నితమైన పాల రాతి అలంకరణతో ఢిల్లీలోని ఎర్రకోటలో ఔరంగజేబు మోతి మసీదును నిర్మించాడు. అది ఆ మాదిరిగా లాహోర్‌లో బాద్షాహి సమాధిని నిర్మించినప్పటికి అది ఆ స్థాయి ప్రమాణాలలో లేదు. ఇంక ఔరంగాబాద్‌లో తన భార్య సమాధి మందిరాన్ని కూడా ఔరంగజేబు నిర్మించాడు. ఇది తాజ్‌మహల్ ఆకారంలో ఉన్నప్పటికీ అందులో సగం మాత్రమే ఉంది.

ఔరంగజేబు నిర్మాణాలు ఎక్కువగా చేయనప్పటికి హిందూ, టరోపర్షియన్, విధానాలలో అలంకరణలతో ఉన్న మొగల్ వాస్తు శైలి 18, 19వ శతాబ్దం తొలినాళ్ళ వరకు నిరాటంకంగా కొనసాగింది. ఈ మొగల్ సాంప్రదాయాలు స్థానిక రాజ్యాల, రాజమందిరాల, కోటల నిర్మాణాలపై ప్రభావం చూపాయి.

మొగల్ నిర్మాణాలలో ఉన్న ప్రధానమైన అంశాలు పర్షియన్ శైలిలో ఉన్న గుమ్మటాలు. దాని చుట్టూ అందంగా కట్టిన బాల్బస్, రెండు గుమ్మటాలు, మూలలో ఉన్న సన్నని స్తంభాలు, విశాలమైన అద్భుతమైన హాలు, పెద్ద ముఖ ద్వారాలు, మధ్యలో పెద్ద సమాధులు, ఉద్యానవనాలు.

మితవ్యయంలో మొరటుగా, నిరాడంబరంగా ఉన్న ఢిల్లీ సుల్తానత్ వాస్తు శైలికి భిన్నంగా పర్షియన్ నిర్మాణాల ప్రభావంతో మొగల్ భవన నిర్మాణాలు ఆధునికరించబడ్డాయి. దీంతోపాటు మొగలులు భారతీయ వాస్తు కళకు ప్రతిబింబాలయిన గంటలు, కమలం, పెద్ద ఆభరణాలు, పూల చిత్రాల చిత్రీకరణ పిల్లర్స్‌లు, బీంలలో తమ నిర్మాణాలకు వన్నె తీసుకొని వచ్చి ప్రపంచంలోనే ప్రసిద్ధిచెందిన కొన్ని గొప్ప నిర్మాణాలు చేశారు.

## పాఠ్యాంశ ప్రశ్నలు

1. కింది పదాలను వివరించండి.

ఎ. పర్షియన్ శైలిలో ఉన్న గమ్మటాలు.

బి. పిట్రాదురా.

2. అక్బర్ నిర్మాణాలు తన వ్యక్తిత్వాన్ని విధానాలను ఏ విధంగా తెలియపరుస్తాయో తెల్పండి.

3. అక్బర్ బులంద్ దర్వాజా నిర్మించడానికి గల కారణాన్ని పేర్కొనండి.

4. ఇత్మద్-ఉద్దౌలా సమాధి ప్పుడు ఎవరి చేత నిర్మించబడింది - ఇందులోని ప్రత్యేకతను రాయండి.

5. అక్బర్ కౌలా నిర్మాణాలు షాజహాన్ నిర్మాణాలు ఏ విధంగా భిన్నమైనవి?

6. మొగల్ వాస్తు శైలికి పతాక స్థాయి నిదర్శనంగా తాజ్‌మహల్ ఎందుకు కన్పిస్తోంది?

## 50.5 మొగల్ చిత్రకళ

మొగలులు చిత్రకళకు కూడా గొప్ప సేవలందించారు. వారు కొత్త భావనలను, రంగులను, విధానాలను సాంకేతికపరమైన అంశాలను ఇందులో ప్రవేశపెట్టారు.

సమకాలీన చిత్రకారులు బాబర్‌కు చిత్రకళపై అవగాహన ఉందని పేర్కొన్నారు. హుమాయున్ ఇరాన్ రాజుషా దగ్గర ఆశ్రయం పొందుతున్న సమయంలో ఉన్న ఇద్దరు ప్రఖ్యాత చిత్రకారులు మీర్ సయ్యిద్ అలీ, ఖ్వాజా అబ్దుల్ సమద్‌లను తనలో తిరిగి భారతదేశానికి వచ్చేటప్పుడు తీసుకువచ్చి తన రాజస్థానంలో ఉంచుకున్నాడు. తర్వాత మొగల్ చిత్రకళకు అక్బర్ ఎనలేని ప్రోత్సాహమందించాడు. చిత్రకారులకు ప్రభుత్వ వేతనాలు చెల్లిస్తూ వారి కోసం పెద్ద కార్ఖానాలు కూడా నిర్వహించేవారు. పెద్ద సంఖ్యలో హిందూ, ముస్లిం చిత్రకారులను దేశం నలుమూలల నుండి పిలిపించుకొని వారికి తగిన శిక్షణ ఇచ్చి నియమించుకునే వారు. వారిలో పేరుగాంచిన చిత్రకారులు దసవంత్, ముకుంద్, కేశవ్‌లు. ఈ చిత్రకారులు రాజాపుతానా, మాళ్వా, గుజరాత్ తదితర ప్రాంతాల నుండి రావడం వల్ల చిత్రకళలో వారి వారి ప్రాంతీయ సాంప్రదాయాలను కూడా ఒప్పించువారు. అబ్దుల్ సమద్, సయ్యద్ అలీ అనే ఇద్దరు పర్షియన్ గురువుల పర్యవేక్షణలో భారతీయ చిత్రకారుల సహకారంతో ఈ మొగల్ చిత్రకళ అభివృద్ధి చెందింది. దీనిలో భారతీయ, పర్షియన్ శైలులు పూర్తిగా కలిసిపోయాయి. అక్బర్ కాలంలోని హమీర్ హంజా చిత్రాలు దాదాపు 1,400 వరకు ఉండేవి. వీటిని గుడ్డపై చిత్రీకరించారు. దురదృష్టవశాత్తు వీటిలో చాలా వరకు నాశనమయ్యాయి.

1560-70లలోని హంజానామా చిత్రాలలో భారతీయ పర్షియన్ అంశాలు కలగలిసి ఉన్నాయి. ఒక దశాబ్దంలోనే ఈ రెండు కూడా పూర్తిగా కలిసిపోయాయి. అయితే నిజానికి పర్షియన్ ప్రభావాల నుండి, సాంప్రదాయాల నుండి మొగలుల చిత్రకళ దూరమై భారతీయ భవనాలు, దృశ్యాలు, ఉద్యానవనాలు ప్రధాన స్థానాన్ని ఆక్రమించాయి. భారతీయ రంగులయిన నీలం, భారతీయ ఎరుపు వాడుక పెరిగిపోయింది. మొత్తానికి చిత్రకళలో పర్షియన్ స్థానాన్ని భారతీయ కుంచె భర్తీ చేసింది. పోర్చుగీసు గురువు ద్వారా యూరోపియన్ చిత్రాలు కూడా అక్బర్ కాలంలోనే ప్రవేశపెట్టబడ్డాయి.

అక్బర్ కాలంలోని చిత్రాలన్నింటిలో కూడా 'బాబర్ నామా' అక్బర్ నామా వంటి చారిత్రక గ్రంథాల సమాచారాన్ని చిత్రీకరించారు. అయితే పర్షియన్ చిత్రకారులు హిందూ పురాణేతిహాసాలైన మహా భారతం, రామాయణం, పర్షియన్ కవిత్వం, పురాణ గాథల సమాచారాన్ని చిత్రీకరించారు. ఈ చారిత్రక విషయాలను చిత్రీకరించేటపుడు ఇద్దరు చిత్రకారులు కలిసి పనిచేసేవారు. అందులో మొదటివారు ప్రణాళిక, డిజైన్ వేయగా రెండవవారు రంగులను పులిమేవారు. అయితే

కొన్ని అరుదైన సందర్భాలలో మాత్రమే ఆ చిత్రకారుల పేర్లు తెలిసేవి.

మొగల్ చిత్రకళను పతాక దశ జహంగీర్ కాలంలో వచ్చింది. అతను స్వతహాగా చిత్రకారుడు. ఆ కళ పట్ల మక్కువ కల్గి ఉండేవాడు. ఇతని కాలంలోని చిత్రాలు అక్బర్ కాలంనాటి వాటికంటే భిన్నంగా ఉండేవి. అక్బర్ పుస్తక సమాచార చిత్రీకరణ వంటివి క్రమంగా కనుమరుగయ్యాయి. జహంగీర్ ఆత్మకథ తుజుకి – జహంగీరి చిత్రాలు కూడా చాలా స్వల్పంగా మాత్రమే అందుబాటులో ఉన్నాయి. తర్వాత 'షాజహాన్ నామా'ను చిత్రీకరించారు.

జహంగీర్‌కు పోర్ట్రెట్ చిత్రకళపై ఆసక్తి ఉండడంవలన్ల దానికి ఎక్కువ ప్రాధాన్యత ఉండేది. ఇతని కాలంలోనే దర్బార్ చిత్రీకరణ ప్రారంభమైంది. జహంగీర్ తన మిత్రుడు ఇనాయిత్ ఖాన్ చిత్రాన్ని గీయమని తన చిత్రకారులను పంపించాడు. అది ఆ కాలంలోనే ఒక గొప్ప చిత్రంగా నిలిచిపోయింది. అదేవిధంగా షా అబ్బాస్ చిత్రాన్ని గీయమని తన  చిత్రకారులను పర్షియా పంపించాడు. ఇది వేసినందుకు బిషన్‌దాస్‌కు ఏనుగును బహుకరించారు.

జహంగీర్ కాలంనాటి చిత్రాలలో ప్రకృతిపై ప్రేమ కూడా కన్పిస్తుంది. జహంగీర్ కూడా ప్రకృతి ఆరాధకుడు. జంతువుల, పక్షుల జీవితాలు అనేకం ఆనాడు చిత్రీకరించబడ్డాయి. జహంగీర్ కాశ్మీర్‌ను సందర్శించినప్పుడు తనతోపాటు తీసుకెళ్ళిన చిత్రకారులు అక్కడ ఉన్న అరుదైన పూలను అందంగా చిత్రీకరించారు.

జహంగీర్ ఆస్థానంలో అద్భుతమైన చిత్రకారులుండేవారు. తనకు నచ్చినవారిని జహంగీర్ గొప్పగా సత్కరించేవారు కూడా. హెరిట్ నుండి వచ్చి తన తుజుకీ– జహంగీరికి చిత్రీకరించిన అబుల్ హసన్‌ను గొప్పగా ఆరాధించేవారు. జంతువుల, పక్షుల బొమ్మలు గీయడంలో నిష్ణాతుడైన ఉస్తాద్ మన్సూర్‌ను అభినందించేవారు. బిషన్ కూడా గొప్ప చిత్రకారుడు. గుర్రాలను బొమ్మలు వేయడంలో మనోహర్ గొప్ప నేర్పరి. సాధారణ ప్రజలను గుంపులను గీయడంలో గోవర్థన్ అందెవేసిన చెయ్యి. మనుష్యుల బొమ్మలను వేయడంలో ఫరూక్ బేగ్ ప్రసిద్ధి.

సాంకేతికత, భావనలను మిళితం చేయడంలో జహంగీర్ కాలం నాటి చిత్రకారులు కొన్ని అంశాలను పాటించేవారు. జహంగీర్ కాలంలో రాజు దైవాంశ సంభూతుడు అనే భావన ప్రబలంగా ఉండేది. ఈ భావనను చిత్రీకరించడంలో  యూరోపియన్ పురాణగాథల మూలాంశాన్ని కూడా ప్రతీకాత్మకంగా తీసుకొని గొప్ప చిత్రాలను సృష్టించారు. కొంతమంది కులీనుల చిత్రాలను కూడా వేశారు. చక్రవర్తి గుర్రపు స్వారిని వేట, రాత్రి దృశ్యాల చిత్రీకరణ ప్రసిద్ధి చెందింది.

జహంగీర్ కాలంలోనే చిత్రకళలో ప్రత్యేక విషయాలపై చిత్రాలు గీయడం ప్రారంభమయ్యాయి. వివిధ చిత్రకారుల చేత ముఖం, శరీరం, మనుష్యుల కాళ్ళు, విడివిడిగా ఒక చిత్రంలోనే చిత్రీకరించడం ఇప్పుడే ప్రారంభమయింది. దీనివల్ల పోర్రైట్స్ అందంగా సంపూర్ణంగా వచ్చేవి. ఇటువంటి చిత్రాలలో ఏ ఏ చిత్రకారుడు ఏ భాగాన్ని వేశాడో గుర్తించగల కళాత్మక నైపుణ్యం జహంగీర్‌కు ఉండేది. పర్షియన్ సాంప్రదాయంగా ఉన్న పూర్వం శైలికి భిన్నంగా జహంగీర్ ఈ చిత్రాలను గీయడంలో నూతనత్వాన్ని ప్రవేశపెట్టాడు.

ఇంకా 'సియాహి ఖాలమ్' అనే నూతన చిత్రకళా పద్ధతిని కూడా జహంగీర్ ప్రవేశపెట్టాడు. దీనిలో నల్లని ఇంకు ద్వారా సన్నని నీడ వేయడంలో చిత్రానికి పరిపక్వత్వం చేరుతుంది. దీన్ని మధ్య ఆసియా, పర్షియా నుండి తీసుకువచ్చారు.

ఈ చిత్రకళా సాంప్రదాయాలు షాజహాన్ కాలంలో కూడా కొనసాగినప్పటికి అతనికి ప్రధానంగా నిర్మాణ

రంగంపై ఆసక్తి ఎక్కువ. ఇక ఔరంగా జేబుకు చిత్రకళపై ఆసక్తి లేకపోవడంవల్ల చిత్రకారులు దేశంలోని వివిధ ప్రాంతాలకు తరలివెళ్ళారు. దీనివల్ల పంజాబ్, రాజస్తాన్‌లలో చిత్రకళ అభివృద్ధి చెందింది. దీంతోపాటు రాజస్తాన్ శైలి. పహరీ చిత్రకళ ఈ కాలంలోనే అభివృద్ధి చెందాయి.

మొగలుల చిత్రకళ అక్బర్ కాలం నుండే అభివృద్ధి చెందడం ప్రారంభమై జహంగీర్ కాలం నాటికి పతాక స్థాయికి చేరుకుంది. హిందూ, ముస్లిం చిత్రకారులు మొగలుల చిత్ర కళ అభివృద్ధికి పాటుపడ్డారు. పర్షియన్, యూరోపియన్ అంశాలలో భారతీయ శైలి, కలిసి మొగల్ శైలిగా రూపొందింది. పుస్తకంలోని అంశాలను చిత్రీకరించడం అక్బర్ కాల ప్రత్యేకత అయితే మనుష్యుల నిలువెత్తు చిత్రాలను, ప్రకృతిని చిత్రించడం జహంగీర్ కాల ప్రత్యేకత.

## 50.సి. పాఠ్యాంశ ప్రశ్నలు

1. హుమాయూన్ పర్షియాలో నిర్వాసితుడుగా ఉండటం మొగల్ చిత్రకళపై ఏ విధమైన ప్రభావం చూపింది?
2. చిత్రాలలో ప్రధానంగా ఉన్న అంశాలేవి (ఎ) అక్బర్ పాలన (బి) జహంగీర్ పాలన.

   ఉదాహరణలివ్వండి.

3. మొగల్ చిత్రాలపై ప్రభావం కలిగించిన దానికి రెండు ఉదాహరణలివ్వండి.

   (ఎ) భారతీయ అంశాలు (బి) ఐరోపా పురాణేతిహాసాలు మూలాంశాలు.

## 50.6 మధ్యయుగ సాహిత్యం :

(ఎ) టర్కుల రాకతో భారతదేశంలో పర్షియన్ అనే నూతన భాష ఆవిర్భవించింది. మధ్య ఆసియాలో మాదిరిగానే భారతదేశంలో కూడా క్రీ.శ. 10వ శతాబ్దం నుండి పర్షియన్ సాహిత్య, పరిపాలనా పరమైన భాష అయింది. ఈ పర్షియన్ భాష ద్వారా భారతదేశం మధ్య ఆసియా, ఇరాన్ దేశాలతో సన్నిహిత సాంస్కృతిక సంబంధాలను అభివృద్ధి చేసుకోగల్గింది. కాలక్రమంలో పర్షియన్ ఉన్నత వర్గాల భాష అయింది. అయితే ఇది మొదట ఉత్తర భారతదేశానికే పరిమితమయినప్పటికి ఢిల్లీ సల్తానత్ సామ్రాజ్యం దక్షిణ భారతదేశానికి విస్తరించిన తర్వాత, దేశంలోని వివిధ ప్రాంతాలలో ముస్లిం రాజ్యాలు ఏర్పడిన తర్వాత పర్షియన్ భాష అందరి భాషగా రూపాంతరం చెందింది.

పర్షియాలో రాసిన ప్రఖ్యాత భారతీయ పరిశోధకుడు అమీర్ ఖుస్రూ (1252) పద్యం, గద్యం సంగీత రంగాలలో అద్భుతమైన సాహిత్యాన్ని సృష్టించారు. ఇతను మొదట బాల్బన్ కాలంలో ప్రసిద్ధి చెందాడు. ఇతనిలోనే భారతదేశంలో పర్షియన్ సాహిత్య సృష్టి ప్రారంభమైంది. అమీర్‌ఖుట్రూ అన్ని కవిత్వ ప్రక్రియలపై ప్రయోగాలుచేసి సబిక్ ఇ.హిందీ (Sabaq-I-hindi) అనే నూతనశైలిని ప్రవేశపెట్టాడు.

కవిత్వంతోపాటు పర్షియన్‌లో చరిత్ర రచన కూడా మధ్య యుగంలోనే భారతదేశంలో అభివృద్ధి చెందింది. మహమ్మద్ బిన్ తుగ్లక్, ఫిరోజ్‌షా తుగ్లక్‌ల సమకాలీనుడైన జియాద్దీన్ బురౌని ఆ నాటి ప్రసిద్ధ చరిత్రకారుడు. ఫిరోజ్‌షా పాలనా కాలంలోనే షామ్స్ సిరాజ్ (Shams-I-siraz) లూరిఖ్ ఫిరోజ్ షా రాశాడు.

రాజకీయాలు, మతం, తత్వశాస్త్రం, సాహిత్యాలలలో పర్షియన్, సంస్కృతాలు అనుసంధాన భాషగా ఉన్నాయి. ఈ రెండు భాషల మధ్య పరస్పరం మార్చుకోవడం పరిమితంగానే జరిగేది. ఫిరోజ్ షా తుగ్లక్ కాలంలో సైన్యం సంగీతంపై సంస్కృతంలో ఉన్న పుస్తకాలను పర్షియన్ భాషలోకి అనువదింపజేశాడు. కాశ్మీర్ రాజైన, సుల్తాన్ జైనుల్

అబిదిన్ ప్రఖ్యాత చారిత్రక గ్రంథం. రాజతరంగణిని, మహాభారతాన్ని పర్షియన్ భాషలోకి అనువదింపజేశారు. అతనికాలంలోనే వైద్యం, సంగీతంపైనున్న కొన్ని పుస్తకాలు పర్షియన్ భాషలోకి అనువదించారు.

పర్షియన్ సాహిత్యం అక్బర్ కాలం నాటికి ఉన్నత స్థితికి చేరుకుంది. అందులో ప్రధానంగా చారిత్ర గ్రంథాలు, అనువాదాలు, పద్యం, గద్యం ఉన్నాయి. ఇందులో అబుల్ ఫజల్ రాసిన అక్బర్ నామా, ఐనీ అక్బరీ ప్రఖ్యాతి గాంచినవి. దీంతోపాటు ఒడాని ముంతఖాల్ తవారిఖ్, ఫెజ్రీ అక్బర్ నామా ప్రసిద్ధి చెందినవి. సంస్కృతంలో ఇతర భాషలలో ఉన్న మంచి గ్రంథాలను పర్షియన్ భాషలోకి అనువదించమని చక్రవర్తి ఆదేశించాడు. మహాభారతా, రామాయణ, అధర్వణవేద, లీలావతి అనే గణిత గ్రంథం పర్షియన్‌లోని అనువదించబడ్డాయి. ఈ అనువాదాలను ఫెజ్రీ అబ్దుల్ రహీం ఖాన్ – ఖిన్నన్ పర్యవేక్షించారు. ఈ అనువాద కార్యక్రమాల్లో అనేకమంది హిందువులు కూడా పాల్గొన్నారు. అనేక పద కోశాలు పూర్తి చేయబడ్డాయి. ఉద్బి, నజిరి అనే పర్షియన్ కవులు మొగల్ రాజస్థానానికి ఇరాన్ నుండి వలసవచ్చారు.

జహంగీర్ కూడా ఈ పరిశోధనలకు పూర్తి సహకారమందించాడు. జహంగీర్ కాలంలోనే ఇక్బాల్ నామా, జబ్బ్–ఉల్–తవారిఖ్ అనే చరిత్ర గ్రంథాలు రాయబడ్డాయి.

షాజహాన్ కూడా తన ముందు పాలకుల మాదిరిగానే మేథావులను గౌరవించాడు. ఇతని ఆస్థానంలో పాదుషానామా రాసిన అబ్దుల్ హమీద్ లాహోరి, ఇంకొక పాదుషా నామా రాసిన అమినయి ఖజ్వాని ఉండేవారు.

(బి) ఉర్దూ : 14వ శతాబ్దం చివర్లో ఇది స్వతంత్ర భాషగా ఆవిర్భవించింది. దీని అర్థం యుద్ధ స్థావర భాష. ఇందులో పర్షియన్ పదాలు, సామెతలు, సాహిత్య పద్ధతులను తనలో ఇముడ్చుకుంది. ఇది హిందూ ముస్లిం మధ్య మిశ్రమ భాషగా ఏర్పడి వారి సంబంధాలను బలోపేతం చేయడమే కాకుండా ముస్లింలు భారతదేశాన్ని తమ మాతృభాషగా చేసుకోవడానికి ఇది ఎంతో ఉపయోగపడింది. మహమ్మద్ బిన్ తుగ్లక్, అల్లాఉద్దీన్ ఖిల్జీ సైన్యంతోపాటు ఉర్దూ భాష సాహిత్యం కూడా దక్షిణ భారతదేశానికి చేరింది. 15వ శతాబ్దం ప్రథమార్థంలో గేసుదిరాజ్ రాసిన మిరాజ్–ఉల్–అష్కిన్ దక్కనీ ఉర్దూలో వచ్చిన సాహిత్యం. బహుమనీ రాజ్య విచ్ఛిన్నం తర్వాత బీజాపూర్, గోల్కొండలను పాలిస్తున్న ఆదిల్ షా, కుతుబ్‌షాహీలు 16, 17వ శతాబ్దాల వరకు ఉర్దూను ఆదరించాడు. మహమ్మద్ కులీ కుతుబ్‌షా స్వయంగా కవి. ఇంకా ఆనాడు గోల్కొండలో ఉన్న ప్రఖ్యాత రచయితలు ముల్లా రజాహి, ఘవాసిలు.

దక్కన్‌లో అభివృద్ధి చెందిన తర్వాత ఉర్దూ తిరిగి ఉత్తర భారతదేశంలో కూడా మొగలులు, అవధ్ రాజుల ఆదరణను పొందింది. తర్వాత ఉర్దూలో సొంతమైన సాహిత్య శైలిని ఢిల్లీకి చెందిన మిర్జాజన్–జనన్ మజార్ ఆగ్రాకు చెందిన మిర్ తాఖి మిర్ (1720–1808), మహమ్మద్ రఫీసాదా (1713–1780), మిర్ హసన్ (1735–1786)ల రచనలో చూడవచ్చు.

(సి) సంస్కృతం : మధ్యయుగంలో కూడా సంస్కృతం గొప్ప ఆలోచనలకు, సాహిత్య సృష్టికి ఒక వాహకంగా పనిచేస్తూనే ఉంది. ఎక్కువ సాహిత్యం దక్షిణ భారతదేశంలోనే సృష్టించబడినప్పటికి బెంగాల్, మిథిలి, పశ్చిమ భారతదేశాలలో కూడా రాజుల ఆదరణతో అభివృద్ధి చెందింది. తత్వశాస్త్రం, కవిత్వం, నాటకం, గద్యం, వైద్యం, జ్యోతిష్యం, సంగీతం వంటి వివిధ రంగాలపై సంస్కృతంలో పుస్తకాలు వెలువడ్డాయి. ముస్లిం ఆధీనంలో ఉన్న ప్రాంతాలతో పాటు దేవంలోని వివిధ ప్రదేశాలలో సంస్కృతం బోధించే ప్రత్యేక పాఠశాలలు వర్ధిల్లాయి. పూర్వం ఈ భాషలో ఉన్న పుస్తకాలను తిరిగి ముద్రించడం జరిగింది. బెంగాల్, మిథిలిలలో స్మృతులు, వ్యాకరణ సాహిత్యం వర్ధిల్లింది. ఆనాడు పద్మనాభ దత్త, విద్యాపతి ఉపాధ్యాయ, మిథిలకు చెందిన వాచస్పతి బెంగాల్‌కు చెందిన రఘునందన్ ప్రసిద్ధి చెందిన రచయితలు.

అయితే సంస్కృత పరిశోధకులు దేశంలో ఉన్న ముస్లింల ఉనికిని గుర్తించలేదు. ఇస్లామిక్, పర్షియన్ భాషలలో ఉన్న ఉత్తమ సాహిత్యాన్ని సంస్కృతంలోకి అనువదించడానికి ఎలాంటి ప్రయత్నం చేయలేదు.

ప్రఖ్యాత పర్షియన్ కవి జమి రాసిన యూసఫ్, జులైఖాల జీవిత చరిత్ర అనువాదం దీనికి మినహాయింపు. దీనిపై అల్ బెరూని అన్నట్లు బ్రాహ్మణ పెద్దలు, సంస్కృత పండితులు ఆనాటి వాస్తవ పరిస్థితిని అర్థం చేసుకోవడంలో విఫలమయ్యారు. అందుకే ఇతర భాషా సాహిత్యాలను స్వేచ్ఛగా ఆహ్వానించలేకపోయారు.

(డి) ప్రాంతీయ భాషలు : మధ్యయుగంలో తమిళ్, బెంగాలీ, మరాఠి, భాషా సాహిత్యంలో అభివృద్ధి జరిగింది. తమిళం పూర్వం నుండి ఉన్న భాషకాగా హిందీ, బెంగాలీ, మరాఠి భాషలు తమ మూలాల కోసం 8వ శతాబ్దంలో వెతుక్కున్నాయి. అమీర్ ఖుస్రూ ఈ ప్రాంతీయ భాషల అభివృద్ధి గురించి వ్యాఖ్యానిస్తూ, ఈ భాషలు అనాది నుండి మనిషి పరినామ క్రమాన్ని పదిలపరుస్తూనే ఉన్నాయన్నారు.

ఈ ప్రాంతీయ భాషల అభివృద్ధికి అనేక కారణాలున్నాయి. అందులో మొదటిది బ్రాహ్మణులు అధికారం కోల్పోవడం వల్ల సంస్కృతానికి ప్రాధాన్యత తగ్గింది. రెండవది భక్తి ఉద్యమకారులు తమ బోధనలను ప్రాంతీయ భషలలోనే చేశారు. ఇది ప్రాంతీయ భాషలో గొప్ప సాహిత్య సృష్టికి దోహదపడింది. మూడవది ఈ ప్రాంతీయ భాషలను పాలనావసరాల కోసం వినియోగించడం. ఇది ఎక్కువగా ప్రాంతీయ రాజ్యాలలో కొనసాగింది.

తమిళం : చోళ, పాండ్య రాజ్యాల పతనం తర్వాత తమిళ సాహిత్యం వైభవాన్ని కోల్పోయింది. అయినప్పటికి తత్వశాస్త్ర గ్రంథాలు ఆ భాషలోనే రాశారు. వైష్ణవ, శైవ, కొంతమంది జైనులు కూడా ఈ భాషలోనే ముఖ్యమైన గ్రంథాలు రాశాడు. 13వ శతాబ్దంలో మకందర్ శివజనం బోధం, ఆరునది శివజనన సట్టియార్ రాశారు. 15వ శతాబ్దంలో అరుణ గిరినాథ తిరుప్పుణన్ను కూర్చారు. వైష్ణవ పరిశోధకులు పూర్వ సాహిత్యంపై తమ వ్యాఖ్యానాలు రాశారు. వైద్యనాథ్ దేశిక చేత 17వ శతాబ్ది ప్రారంభంలో నూతన సాహిత్య శైలి ప్రారంభమైంది. 18వ శతాబ్దంలో ఇమన్ ప్రొఫెట్ మహమ్మద్ జీవిత చరిత్రను పద్య రూపంగా ఉమర్ పులవార్ 'శివప్పురాణం' పేరుతో రాశారు. ఇదే సమయంలో తమిళ భాషలో గద్య సాహిత్య విధానాన్ని క్రిష్టియన్ మిషనరీలు ప్రవేశపెట్టాయి.

హిందీ : హిందీ భాష అనేక మాండలికాల సమూహం. బ్రజ్‌భాష అవధి, రాజస్థాని, బోజ్‌పురి, మైధాలి మాగాహివంటి వ్యవహారిక మాండలికాలు ఇందులో ఉన్నాయి. హింది భాషా మూలాలు 7, 10 శతాబ్దాల మధ్య కనిపిస్తున్నప్పటికి దీని అభివృద్ధి 1206 తర్వాత మాత్రమే ఊపందుకుంది. రాజపుత్ర రాజుల ఆస్థానంలో 'పృధ్విరాజ్ రాసో' అనే పద్య కావ్యాన్ని స్థానిక కవులు కూర్చారు. తొలి హిందీ సాహిత్యమంతా కవితా శైలిలో మతపరమైన విషయాలతో నిండి ఉంది. ఈ కాలంలోని ప్రఖ్యాత కవులు అమీర్‌ఖుస్రూ, నరపాటి వల్హా (బిసలాదే రాసో) ఇంకా భక్తి ఉద్యమ కాలంలోనే ఉత్తమ హిందీ సాహిత్యం వెలువడింది. ముందే చర్చించినట్లు భక్తి ఉద్యమ కారులు తమ రాతలను సామాన్య మానవుడు కూడా అర్థం చేససుకోవాలనే లక్ష్యంతో రాయడంవల్ల ఇది సాధ్యమైంది. వారిలో కబీర్ (1518) సేవలు ప్రశంసనీయమైనవి. అతను హిందీలోనే తన బోధనలు కొనసాగించడంవల్ల ఇతర హిందీ ముస్లిం మతంలోని సాంఘిక మూఢాచారాలపట్ల యుద్ధం ప్రకటించడంవల్ల సృష్టించబడ్డ హిందీ సాహిత్యంలో భాష కూడా సుసంపన్నమైంది. తర్వాత మరో భక్తి ఉద్యమ కారుడు సూర్ దాస్ (1483–1565) తన బ్రజ్‌భాషలో రాసిన సూర్‌సాగర్‌లో కృష్ణుని బాల్య జీవితంపై రాధాకృష్ణుల ప్రళయంపై అద్భుతమైన వర్ణనలు చేశాడు. ఇతనా తర్వాత కాలంలో ప్రసిద్ధి చెందిన తులసీదాస్

రామభక్తుడు. ఇతను తన కవిత్వాన్ని హిందీ భాష మాండలికమైన 'అవధి'లో రాశాడు. ఇతను రచించిన 'రామ చరిత మానస్' తరతరాలుగా భారతీయుల ఆదరణను పొందుతూనే ఉంది. ఇందులో పుట్టుకలో వర్ణ వ్యవస్థను నిర్ణయించకుండా అతని సామర్థ్యాలను బట్టి చూసే విధంగా సంస్కరణలు చేపట్టాలని ఆకాంక్షించాడు.

గొప్ప మానవతా విలువలను బోధించిన తులసీదాస్ రామున్ని సేవించడం వల్ల కులమత రహితంగా మోక్షం సాధించవచ్చని బోధించాడు. సూఫీ గురువులు కూడా హిందీ భాషలో ఉత్తమ సాహిత్యాన్ని సృష్టించారు. వారు కూడా భావాలు అందరికి చేరువయ్యే విధంగా స్థానిక భాషలనే ఉపయోగించారు. మాలిక్ మహమ్మద్ జైసి 1540లో హిందీలో 'పద్మావతి' గ్రంథాన్ని రచించాడు. ఇందులో అల్లాఉద్దీన్ ఖిల్జీ చిత్తోర్ కోటపై దాడి చేయడాన్ని మేవార్ రాణి పద్మిని కథను వివరించాడు. ఇది ఈ కాలంలో సృష్టించబడ్డ గొప్ప గ్రంథంగా పేరొందింది.

హిందీ కవిత్వంపై అక్బర్‌కున్న ఆసక్తివల్ల హిందీ సాహిత్యానికి గొప్ప ఉద్దీపన లభించింది. అక్బర్ ఆస్థానంలోని దీవులలో బీర్బర్ ప్రఖ్యాత కవి. ఇతను కవి ప్రియ అనే బిరుదు కూడా పొందాడు. రహీం అనే కులం పేరుతో రాసిన అబ్దుల్ రహీం ఖాన్ ఖాసన్ కూడా అక్బర్  కాలం నాటి పేరొందిన రచయితలు. అతని దోహాలు మానవ జీవిత సంక్లిష్టత, లౌకికతత్వాన్ని వివరించేవి. అక్బర్ ఆస్థానంలోని నవరత్నాలలో రహీం, బీర్బర్ కూడా ఉన్నారు.

బెంగాలి : 10, 12వ శతాబ్దంలోని పాటల ద్వారా బెంగాలీ సాహిత్యాన్ని గుర్తించవచ్చు. 13వ శతాబ్దంలో జరిగిన ముస్లింల ఆక్రమణల తర్వాత సంస్కృతం ఆదరణను కోల్పోయి స్థాయి జానపద భాషలు ముందుకొచ్చాయి. ఈ కాలంలో బెంగాలీ సాహిత్యంలో మూడు దశలను చూడవచ్చు. అవి వైష్ణవ కవిత్వం, మంగళ కావ్యంవంటి సంస్కృతం నుండి అనువదించబడ్డవి. 15వ శతాబ్దంలో బెంగాలి వైష్ణవ కవి చండీదాస రాధాకృష్ణుల ప్రణయంపై అనేక కావ్యాలు రచించారు. అతని పాటలు సామాన్య బెంగాలీల ఆదరణను కూడా పొందాయి. ఇవి మరో బెంగాలీ కవి చైత్రన్యునాలో స్ఫూర్తి కల్గించాయి. మలి వైష్ణవ సాహిత్యం చైత్రన్యుడిపై అతని వర్గంపై ప్రభావం కల్గించింది. ఈ వర్గంలోని కవులలో మరారి గుప్త, నరహరి సర్కార్, వాసుదేవ ఘోగు, జ్ఞానదాస్, గోవిందదాస్ మున్నగువారు.

వీరిలో కొంతమంది ముస్లిం కవులు కూడా ఉన్నారు. 16వ శతాబ్దం నుండి అభివృద్ధి అయిన వైష్ణవ సాహిత్యంలో చైతన్యుని వ్యక్తిత్వాన్ని స్తుతించే ఆత్మ కథాత్మక శైలి ఎక్కువగా కన్పిస్తోంది. ఇందులో 1581లో క్రిష్ణదాస కవిరాజు రాసిన చితయ చరితమృత ప్రసిద్ధి చెందింది.

తర్వాత క్రీ.శ. 14 నుండి 18వ శతాబ్దం వరకు సంస్కృతంలో ఉన్న రామాయణ, మహాభారత, భాగవత పురాణం. ఇంకా ఇతర గ్రంథాల అనువాదాలు అన్వయింపుల దశ కొనసాగింది. ఇది బెంగాల్‌లోని టర్కీ రచయితల ఆధ్వర్యంలో జరిగింది. గౌర్ సుల్తాన్ నస్రత్ షా మహాభారతాన్ని బెంగాలీలోకి అనువదించారు. 15వ శతాబ్దానికి చెందిన క్రిత్తివాస్ రామాయణాన్ని బెంగాల్‌లో రాశాడు. ఇతనికి గౌర్ రాజు సహకారం లభించింది. తర్వాత మటాధర్ బసు భగవత్  పురాణాన్ని బెంగాలీలోకి అనువదించారు. ఇతనికి సుల్తాన్ హుస్సేన్ షా పూర్తి సహకారమందించడమే కాకుండా 'గుణరాజఖాన్' అనే బిరుదు కూడా ప్రధానం చేశాడు.

బెంగాల్‌కే ప్రత్యేకమైన మరో కవితా శైలి 'మంగళకావ్య' ఇది సాహిత్య ప్రజల జీవితాలను ప్రతిబింబించేది. ఇందులో వర్ణనలన్నీ కూడా దేవుళ్లు, దేవతలు వారి శత్రువులపై ఆధిపత్యాన్ని  నిరూపణపై ఉండేవి. ఈ శైలిలో రాసిన వారిలో 15, 16 వ శతాబ్దాలకు చెందిన మానక దత్త, ముకుందరామలు ప్రసిద్ధి చెందినవారు.

మరాఠీ : మరాఠీ సాహిత్యం 13వ శతాబ్దపు మలి అర్థభాగంలో స్థిరపడింది. ఈ సాహిత్యంలో మతపరమైన తాత్విక అంశాలకు అధిక ప్రాధాన్యత ఉండే పద్య రూపంలో ఉండేది. 'వివేక్ సింధు రాసిన ముకుందరాజు ఆనాటి ప్రసిద్ధ కవి. తొలి మరాఠీ సాహిత్య నిర్మాతలైన మహానుభావ వర్గ భక్తి కవుల తత్వాన్ని ఇతను అనుసరించేవాడు. వీరు భక్తిపరమైన, తాత్వికత నిండిన పద్యాలను రాసేవారు. ఈ మహానుభావ వర్గకవులు మూఢాచార బ్రాహ్మణ ఆధిపత్యాన్ని ప్రశ్నించారు. లీలా చరిత, గోవింద ప్రభు చరిత, సిద్ధాంత సూత్రపాట్న వీరి ప్రసిద్ధ రచనలు. భక్తి ఉద్యమం మరాఠీ సాహిత్యంపై ఎనలేని ప్రభావం కల్గించింది. భక్త జ్ఞానదేవ్ రాసిన 'భావర్థ దీపిక' (దీన్నే జ్ఞానేశ్వరి అంటారు). మరాఠీ సాహిత్యంలో ప్రసిద్ధ రచనగా పేరొందింది. మరొక మరాఠీ రచయిత ఏకనాథుడు మరాఠీ ప్రజలను తన రచనలతో స్ఫూర్తిని కల్గించాడు.

ఇక 17వ శతాబ్దపు మరాఠీ సాహిత్యం మతపరమైన, లౌకిక లక్షణాలు కల్గి ఉంది. ఈ కాలంలో తుకారామ్, రాందాస్, వామన పండిట్ ప్రసిద్ధ రచయితలు. వీళ్ళ రచనల ప్రభావంతోనే దక్కన్‌లో తర్వాత కాలంలో మరాఠీలు మొగలుల ఆక్రమణలను విజయవంతంగా అడ్డుకున్నారు. రామదాస కవిత్వం జాతీయత, స్వేచ్ఛల గురించి వివరిస్తూ మతపరమైన ఐక్యత కోసం కూడా కృషి చేశారు. ఇది శివాజీని విశేషంగా ప్రభావితం చేసింది. ఈ కాలంనాటి పోవదాస్, లావనీస్‌లు లౌకిక కవిత్వంగా పేరొందాయి.

## 50.7 సంగీతం :

మధ్యయుగ పాలకుల ప్రోత్సాహం పొందిన మరొక కళ సంగీతం. టర్కులు వారసత్వంగా గొప్ప అరబ్ సంగీత సాంప్రదాయాన్ని కలిగి వున్నారు. తర్వాత కాలంలో ఇదే మధ్య ఆసియా, ఇరాన్‌లలో అభివృద్ధి చెందింది. టర్కులు భారతదేశానికి వచ్చేటపుడు రాహబ్, సారంగి వంటి నూతన సంగీత పరికరాలను తీసుకువచ్చారు. అనేక పర్సో – అరబిక్ రాగాలను ప్రవేశపెట్టిన అమీర్ ఖుస్రూ ప్రసిద్ధ సంగీతవేత్త సూఫీ గురువు నిజామొద్దీన్ జాలియా నిర్వహించిన అనేక మతపరమైన సంగీత సమ్మేళనాలలో అమీర్ ఖుస్రూ పాల్గొన్నాడు. స్వదేశీ రాజ్యాలు కూడా సంగీతాన్ని ప్రోత్సహించాయి. జాన్‌పూర్ సుల్తాన్ హుస్సేన్ షార్కి సంగీత ప్రేమికుడు. సుఫీ గురువు సిర్ బంధీనా కూడా గొప్ప సంగీతకారుడు.

మొగలులు కూడా సంగీతాన్ని ప్రోత్సహించే సాంప్రదాయాన్ని కొనసాగించారు. అనేక కొత్త రాగాలను సృష్టించిన గ్వాలియర్‌కు చెందిన తాన్‌సేన్‌ను అక్బర్ విశేషంగా ప్రోత్సహించాడు.

ఔరంగజేబు కాలంలో సంగీతాన్ని పూర్తిగా నిషేధించారనడం సత్యదూరమని ఇటీవల పరిశోధనలు తెలుపుతున్నాయి. ఔరంగజేబు గానాన్ని నిషేధజంచాడు. రాణి సంగీత కారుల ప్రదర్శనలను కాదని అవి తెలుపుతున్నాయి. నిజానికి ఔరంగాబాద్ వీణా వాయిద్యంలో ప్రావిణ్యమున్న వ్యక్తి. అతని కాలంలోనే శాస్త్రీయ సమగీతంపై పర్షియన్ భాషలో అనేక పుస్తకాలు వెలువడ్డాయి. అయితే మహమ్మద్ షా (1720648) పాలనా కాలంలోనే సంగీత ప్రపంచంలో గణనీయ అభివృద్ధి జరిగింది.

హిందూ, ముస్లింల మధ్య ఐక్యతను పెంపొందించడంలో సంగీతం ప్రధాన పాత్ర నిర్వహించింది. రెండు మతాలకు చెందిన మేధావులు సంగీతంలో అభివృద్ధికి కృషి చేశారు. వీటిలో ముఖ్యమైనవి పర్షియన్ భాషకు

అనువదించబడ్డాయి కూడా.

మధ్యయుగంలో ప్రాంతీయ భాషల అభివృద్ధి జరిగింది. భక్తి ఉద్యమ కారుల కృషి, రాజుల ప్రోత్సాహం వల్ల హిందీ సాహిత్యానికి గొప్ప ఉద్దీపన లభించింది. ఉర్దూ ఢిల్లీ సల్తానత్ కాలంలో సంధాన భాషగా మారింది. అక్బర్ పాలనా కాలంలో పర్షియన్ భాష ఉన్నత స్థితికి చేరింది.

## పాఠ్యాంశ ప్రశ్నలు

1. ప్రాంతీయ భాషలపై భక్తి ఉద్యమ ప్రభావమేంటి?
2. కింది వాటి రచయితల పేర్లు తెలియపర్చండి.
3. (ఎ) పద్మావత్ (బి) రామచరిత మానస్ (సి) ఐనీ, అక్బరీ (డి) సూర్ సాగర్.

## సారాంశం

భారతదేశంలో టర్కుల సంపర్కం వల్ల కళలలో, వాస్తులో, సాహిత్యాలలో అశేష అభివృద్ధి జరిగింది. టర్కులు తమ నిర్మాణాలలో తోరణాలు, గుమ్మడాలు విరివిగా ఉండేవి. టర్కులు వారితోపాటు నూతన అలంకరణ శైలులను కూడా తీసుకువచ్చారు. వారు అలంకఅణలలో క్షేత్ర ఆకృతిని, పూల అలంకరణను ఖురాన్ పద్యాల చిత్రణను అందంగా చేసేవారు. అంతేకాకుండా గంట, స్వస్తిక్, కమలం వంటి హిందూ పురాణ గాధాంశాలను కూడా వారు తమ అలంకరణకు వినియోగించారు.

ఢిల్లీ సుల్తానుల కాలంలో వాస్తు అభివృద్ధిని మూడు దశలుగా విభజించవచ్చు. అవి ఖిల్జీ వంశం అంతమయ్యే వరకు తుగ్లక్ తర్వాత లోడీలది. 13వ శతాబ్దపు ఉత్తమ నిర్మాణం కుతుబ్‌మినార్. దాని తర్వాత వాస్తు శైలిలో వచ్చిన అభివృద్ధి చిహ్నంగా బాల్బన్ సమాధి ఉంది. 1305లో ఖిల్జీ కాలంలో నిర్మించిన అలైదర్వాజా కూడా ఈ రంగంలో ప్రత్యేక స్థానం కలిగివుంది. దీన్ని శాస్త్రీయ పద్ధతిలో నిర్మించారు. ఇక తుగ్లక్ కాలంలో ఇంజ్ – ఇస్లామిక్ శైలి ఒక స్వతంత్ర శైలిగా రూపాంతరం చెందింది. ఈ కాలంలోని నిర్మాణాలలో ప్రసిద్ధి చెందినవి హౌజ్‌ఖాస్, ఘియాసుద్దీన్ తుగ్లక్ సమాధి. వీరి తర్వాత లోడీల నిర్మాణ ప్రత్యేకత వారి భనవాలు, ముఖ్యంగా సమాధుల చుట్టూ పెద్ద వేదికల నిర్మాణాలు. లోడీల కాలంలోనె రెండు గుమ్మటాల నిర్మాణాలు ప్రాధాన్యత సంతరించుకున్నాయి.

మొగలులు టర్కో పర్షియన్, భారతీయ సాంప్రదాయాల సమ్మేళనంతో ఏర్పడ్డ వస్తు కళను కొనసాగించారు. వీరి నిర్మాణాలలోని ప్రధాన అంశాలు పర్షియన్ శైలి, రెండు గుమ్మటాలు. మూలాలలో ఉన్న స్తంభాలు, సభా మందిరాలు, పెద్ద ముఖ ద్వారాలు, ఉద్యానవనాల మధ్య సమాదుల నిర్మాణాలు ఉన్నాయి.

అక్బర్ పాలనా కాలంలో మొగల్ వాస్తు శైలి ఒక స్థిర రూపాన్ని సంతరించుకుంది. ఆగ్రా కోటతో సహా చాలా కోటలను అక్బర్ నిర్మించాడు.

దీనితోపాటు ఫతేపూర్ సిక్రీ, జోథ్‌బాయి ప్యానెల్, దివాని ఆమ్, దివాని ఖాస్, జుమా మసీదు, బుంద్ దర్వాజా, పంచమహల్ వంటి గొప్ప నిర్మాణాలు చరిత్ర ప్రసిద్ధికెక్కినవి. తర్వాత సికింద్రాలోని అక్బర్ సమాధిని జహంగీర్ నిర్మించాడు. ఇది కూడా గొప్ప నిర్మాణం. ఇతని కాలంలోని ఆగ్రాలోని ఇత్మదుల్ –దౌఆలా సమాధిని నిర్మించారు. లోడీ ప్రఖ్యాత నిర్మాణం షాజహాన్ గొప్ప భవన నిర్మాత. ఇతని కాలంలోని ఆగ్రాలోని మోతి మసీదు. ఢిల్లీ జమా మసీదు,

తాజ్‌మహల్, ఢిల్లీలోని ఎర్రకోట ప్రసిద్ధ నిర్మాణాలు. ఔరంగజేబు పాలనా కాలంలో పెద్ద నిఆర్మణాలు ఏమీ జరగలేదు.

వాస్తు శైలి మాదిరిగానే చిత్రకళ కూడా పర్షియన్ భారతీయ సమ్మేళనంగా ఉంది. అక్బర్ ఆస్థానంలో జస్వంత్, దసవన్ అనే ఇద్దరు గొప్ప చిత్రకారులుండేవారు. 'హంజానామా' ఆనాట గొప్ప చిత్రాలు కలిగివుంది. జహంగీర్ కాలంలో చిత్రకళ పతాకస్థాయికి చేరింది. నిలువెత్తు చిత్రాలు, ప్రకృతి చిత్రాలు ఈ కాలంనాటి ప్రత్యేకతలుగా పేరొందాయి. షాజహాన్ పాలనా కాలంలో కూడా ఇది కొనసాగింది. కానీ ఔరంగజేబుకు దీనిపై ఆసక్తి లేకపోవడం వల్ల కళాకారులు దేశంలో ఉన్న ఇతర చిన్న రాజ్యాలకు వలసపోయారు. దీనివల్ల రాజస్తాన్, పంజాబ్‌లలో చిత్రకళ అభివృద్ధి చెందింది.

భక్తి సాధువులు తమ స్థానిక భాషలలో సాంఘిక, మత సంస్కరణలను బోధించారు. దీనివల్ల ప్రాంతీయ భాషలలో విలువైన సాహిత్యం వెలువడింది. పర్షియన్ సంస్కృతి కూడా దేశ వ్యాప్తంగా అనుసంధాన భాషలుగా అభివృద్ధి చెందాయి. అక్బర్ కాలంలో పర్షియన్ గద్యాలు, పద్యాల స్థాయి ఉన్నత శిఖరాలను అధిరోహించింది. భక్తి ఉద్యమ కారులు హిందీలోనే రాసి బోధించారు. దీనివల్ల సామాన్య మానవునికి కూడా తేలికగా అర్థమవుతుంది. ఆనాటి గొప్ప భక్తి సాధువులు కబీర్, తులసీదాస్, సూర్‌దాస్, చండీదాస్, చైతన్య అనే వైష్ణవ కవులు బెంగాలీలో రాశారు. 14వ శతాబ్దం చివరి నాటికి ఉర్దూ స్వతంత్ర భాషగా స్థిరపడింది.

## అభ్యాసం

100 పదాలతో జవాబులివ్వండి :

1. కుతుబ్ మినార్ వాస్తు శైలిలోని ప్రధాన లక్షణాలను పేర్కొనండి.
2. తొలి సుల్తానుల వాస్తు తుగ్లక్‌ల వాస్తుకు ఏ విధంగా భిన్నమైంది.
3. కింది వాటిలో గల వాస్తు ప్రాముఖ్యతను తెల్పండి.

   ఎ. ఇల్‌టుట్‌మిష్ సమాధి బి. ఖాన్ ఐ జహన్ తిరంగణి సమాధి

   సి. సికిందర్ లోడి సమాధి డి. ఇత్మద్ ఉద్‌దౌలా సమాధి.
4. సల్తానత్ కాలంలో వాస్తు అభివృద్ధిని వర్ణిస్తూ టర్కులు భాతదేశానికి వచ్చిన సూచన శైలి గురించి వ్రాయండి.
5. అక్బర్ నిర్మాణాలు అతని లౌకికతత్వానికి ప్రతీకలని ఎలా చెప్పగలవు.
6. 'మొగల్ వాస్తు శైలుల అన్నింటి సమ్మేళనం తాజ్‌మహల్' చర్చించండి.
7. జహంగీర్ పాలనా కాలం మొగల్ చిత్రకళకు పతాక స్థాయి అని ఎందుకంటారు?
8. హిందీ, పర్షియన్, ఉర్దూ అనే సాహిత్యాలను వివరిస్తూ మధ్యయుగంలో జరిగిన సాహిత్య అభివృద్ధిని వర్ణించండి.

పాఠ్యాంశ ప్రశ్నల సమాధానాలు

**50.ఎ. (1)**

(ఎ) గుమ్మటాలు (బి) కాలిగ్రఫి (సి) తుగ్లక్‌లు (డి) అల్లాఉద్దీన్ ఖిల్జీ (ఇ) సికిందర్ లోడి (డి) లోడీలు.

**50 బి (1)**

(ఎ) పర్షియన్ శైలిలో నిర్మించిన గుమ్మటాల చుట్టూ ఆనుకుని మరో అందమైన నిర్మాణం ఉండేది.

(బి) పిట్రదురా పద్ధతిలో పాలరాతిలో విలువైన రాళ్ళు, పూల చిత్రాలను కూర్చేవారు.

(2) (ఎ) అక్బర్ సుల్తా–ఐ–కుల్‌లో హిందూ, ముస్లిం వాస్తు లక్షణాలు ఉండేవి. డబ్బాలు, చజ్జాలు, చిన్న తోరణాలలో చెక్కడాలు, పక్షుల అలంకరణలు ఇతర హిందూ మత అంశాలు ఉండేవి.

(బి) అక్బర్‌కు విశాల భారత సామ్రాజ్యాన్ని ఏర్పరిచి సుస్థిర పర్చాలనే కోరిక ఉండేది. దీన్ని పొందడానికి ఆయన ఎన్నుకున్న పద్ధతి ఈ నిర్మాణాల్లో కన్పిస్తుంది. వీటి ద్వారా అక్బర్ లౌకికతత్వం ఉదారవాదం సహనం తెలుస్తోంది.

3. మొగలులు గుజరాత్‌పై సాధించిన విజయాలకు గుర్తుగా జరిగిన నిర్మాణం.

4. జహంగీర్ పాలనా కాలంలో నూర్జహాన్ ప్రభావంతో 'పిట్రాదుర' అనే పద్ధతి అభివృద్ధి అయింది. ఈ పద్ధతిలో తెల్లపాలరాతిపై అలంకరణ ప్రధానంగా ఉంటుంది.

5. అక్బర్ నిర్మాణంలో ఎర్ర ఇసుకరాయి రంగుల ఇటుకలు వినియోగించేవారు. సాధారణంగా ఇవి పెద్ద నిర్మాణాలుగా కనిపించేవి. షాజహాన్ నిర్మాణాలు పాలరాతితో చేశారు. పిట్రదురా అలంకఅణను సాంకేతికతను వినియోగించారు.

6. మొగలులు అన్ని వాస్తు శైలులను అభివృద్ధి చేసి కలిపారు. ఇవి రెండు గుమ్మటాలు, సన్నని పొడవైన స్తంభాలు, వేదికలు సున్నితమైన తెరలు, అందమైన చేతి రాతతో రాసిన ఖురాన్ పంక్తులు.

**50. సి**

1. హుమాయున్ ఇద్దరు చిత్రకారులను పర్షియా నుండి భారతదేశానికి తీసుకువచ్చారు. మొగల్ చిత్ర కళపై పర్షియన్ చిత్రకళ ప్రభావం అధికంగా ఉంది.

2. (ఎ) గ్రంథంలోని విషయాలను వర్ణించడం, హంజానామా, అక్బర్ నామా, హహాభారత్.

(బి) నిలువెత్తు చిత్రాలు, దర్బార్ చిత్రాలు పర్షియా, ఇనాయిత్‌ఖాన్‌షా చిత్రాలు.

3.

(ఎ) ఎరుపు, నీలిరంగు వంటి భారతీయ రంగుల వాడకం, భారతీయ బ్రష్ వినియోగం.

(బి) వింజిడ్ చెరుబ్స్ హాలో, గ్లోబ్‌పై జహంగీర్ నిలబడడం.

**50. డి**

1. భక్తి ఉద్యమకారులు తమ కవిత్వాన్ని ప్రాంతీయ, స్థానిక భాషలలో రాయడంవల్ల ఆ భాషలు కూడా ప్రజాభిమానాన్ని పొందాయి.

2. (ఎ) మాలిక్ మహమ్మద్ జైసి (బి) ఫెర్జి (సి) సూరదాస్.

# 51

# భారతదేశంలో బ్రిటీష్ రాజ్య స్థాపన

## 51.1 పరిచయం :

భారతదేశ చరిత్రను గమనిస్తే, భారత సమాజం మొదటి నుంచి అంతర్జాతీయ వ్యాపారం ముఖ్యంగా ప్రాశ్చ్యంతో నెరిపింది. పురాతన భారతీయ చరిత్ర అయిన హరప్పా కాలం నుండి భారతీయ వస్తువులపట్ల ప్రాశ్చ్యంలో మక్కువ ఉండేది. ఇంత ప్రాముఖ్యత కలిగిన వ్యాపారం మధ్యయుగంలో కూడా భారత్ – యూరప్‌ల మధ్య కొనసాగడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. కాలగమనంలో భారత్‌లో పోర్చుగీస్, డచ్, ఫ్రెంచి మరియు ఇంగ్లీషువారు వ్యాపార కేంద్రాలు ఏర్పాటుచేసుకున్నారు. ఈ అధ్యాయంలో భారతదేశంలో అడుగిడిన ఆంగ్లేయులు వ్యాపార సంస్థ స్థాయి నుండి తిరుగులేని అధికారం చెలాయించే వరకు ఎదిగిన వైనం చూద్దాం.

## 51.2 లక్ష్యాలు :

ఈ పాఠ్యాంశం చదవడం ద్వారా మీరు క్రింది విషయాలను తెలుసుకుంటారు.

1. భారతదేశానికి కొత్త వ్యాపార మార్గాలు అన్వేషణ అవసరాలు.
2. ఈస్టిండియా కంపెనీ అభివృద్ధికి దారితీసిన పరిస్థితులు.
3. మిగతా ఐరోపా దేశాలైన ఫ్రెంచి ఈస్టిండియా కంపెనీపై ఇంగ్లీష్ వారి విజయానికి కారణాలు.
4. బెంగాల్ నవాబుకు బ్రిటీష్‌వారికి మధ్య జరిగిన ప్లాసీయుద్ధానికి దారితీసిన పరిస్థితులు.
4. డల్హౌసి కాలం వరకు ఆంగ్లో – అవధ్ సంబంధాలు.
6. పాలకులగు హైదరాలీ మరియు టిప్పు సుల్తాన్ బ్రిటీష్ కంపెనీ యొక్క రాజకీయ ఆసక్తులు.
7. ఆంగ్లో– మరాఠా సంబంధాలు మొదటి, రెండో, మూడవ ఆంగ్లో, మరాఠా యుద్ధాలు దారితీసిన విధానం.
8. నేపియర్ స్టేట్‌మెంట్ ద్వారా "సింధూ భూభాగం ఆక్రమించుకునే హక్కు లేనప్పటికి, మనం చేస్తున్నది అదే" తెలుసుకోవటం.

9. ఆంగ్లో – సిక్కు సంబంధాలు గమనించి వారి మధ్య జరిగిన మొదటి, రెండవ ఆంగ్లో – సిక్కు యుద్ధాలను విశ్లేషించగలం.

10. నేపాల్ – బర్మా, ఆఫ్ఘనిస్తాన్, టిబెట్, సిక్కిం, మరియు భూటాన్‌లపట్ల బ్రిటీష్ వారి వైఖరి గమనించగలం.

## 51.3 భారత్‌కు కొత్త వ్యాపార మార్గాలు ప్రారంభం :

మధ్యయుగం నుండి కూడా భారత్‌కు యూరప్ నుండి మరియు మధ్య ఆసియాకు రకరకాల భూ, సముద్ర మార్గాలు కొనసాగుతూ వచ్చాయి. ఆ మార్గాలలో ఒకటి సముద్ర మార్గం పర్షియన్ గల్ఫ్ నుండి ఇరాక్ భూ భాగాల నుండి టర్కీ ద్వారా మళ్ళీ సముద్ర మార్గం గుండా వెన్నీస్ మరియు జెనీవాల ద్వారా చేరడం, రెండవ మార్గం ఎర్ర సముద్రం గుండా తదుపరి భూభాగం గుండా ఈస్ట్‌లోని అలెగ్జాండ్రియాకు అక్కడి నుండి సముద్ర మార్గం ద్వారా వెన్నీస్ జెనీవాలకు మరి మూడవ మార్గం తక్కువ తాకిడి గలిగిన భూ మార్గం పశ్చిమోత్తరం పరిగణాలోకి కనుమల ద్వారా మధ్య ఆసియా తర్వాత రష్యా ద్వారా చివరకు బాల్డిరో వరకు, ఆసియాలోని ఎక్కువ వ్యాపారం అంతా అరబ్ వర్తకులు మరియు నావికులు నెరుపుతూ ఉంటే మధ్యధరా మరియు యూరప్ వ్యాపారం అంతాకూడా నిశ్చయంగా ఇటాలియన్‌లే నెరపేవారు. కష్టతరమైన ఈ వ్యాపారం అంతా కూడా చాలా లాభదాయకమైనదే. ఇదంతా కూడా సుగంధ ద్రవ్య అవసరాలకే!

1453 సంవత్సరంలో కాన్‌స్టంట్ నోపిల్‌ను తురుష్కుల ఆక్రమణలో ఈ మొత్తం వ్యాపారం మార్గం తురుష్కుల ఆక్రమణలో ఉండిపోయింది. భూ, మార్గ వ్యాపారానికి యూరప్ వారిని నిషేధించబడ్డారు. దీనితోపాటు ఏకస్వామ్యం కలిగిన వెనీషియా, జెనీవా వ్యాపారులు కొత్త రాజ్యాలు వ్యాపారంలోనికి రావడానికీ, తమ మార్గాలను వాడుకోడానికి నిరాకరించారు. ప్రత్యేకంగా స్పెయిన్ పోర్చుగల్‌లకు పై వ్యాపారాలలో ఏ మాత్రం భాగం లేకుండా ఉంది. తద్వారా యూరోపియన్‌లు సుగంధ ద్రవ్యాల వ్యాపారం కొరకు కొత్త మార్గాల అన్వేషణ కొనసాగించారు.

భారత సుగంధ ద్రవ్యాలతోపాటు అద్భుతమైన సంపదల నిలయమైన భారత్ ఒక ప్రత్యేక ఆకర్షణగా నిలిచింది. పశ్చిమ యూరప్ రాజ్యాలైన స్పెయిన్ మరియు పోర్చుగల్‌లు కొత్త మార్గాల అన్వేషణకు ఉపక్రమించాయి. నౌకా నిర్మాణంలో ముందంజకూ, పునరుజ్జీవనోద్యమం ద్వారా జనితమైన అద్భుతాలు ఆవిష్కరణ రాజకీయ వారసత్వం కొరకు స్పెయిన్, పోర్చుగీసు పాలకుల నావికులను ప్రోత్సహించారు. భారత్ అన్వేషణకు స్పెయిన్ నుండి బయలుదేరిన కొలంబస్ 1494లో భారత్‌కు బదులుగా అమెరికాను కనుక్కొన్నాడు. 1498లో పోర్చుగీస్ నావికుడు వాస్కోడిగామ కొత్త సముద్ర మార్గం ఆఫ్రికా ద్వారా కేఫ్ ఆఫ్ గుడ్‌హోప్ గుండా భారత్‌లోని కాలికట్‌కు చేరాడు. ఇతను తన తిరుగు ప్రయాణంలో తీసుకొచ్చిన సుగంధ ద్రవ్యాల ద్వారా అరవైరెట్లు లాభం పొందాడు.

పోర్చుగల్ మరియు స్పెయిన్‌లు వ్యాపారలోనూ నౌకాబలంలోను 15 మరియు 16వ శతాబ్దం మొదటి సగం వరకు పోటీగా ఉన్నాయి. 1500లో పోర్చుగీస్ వారు కాలికట్‌లో మొదటి వ్యాపార కేంద్రాన్ని స్థాపించారు. అల్ఫాన్స్–డి–అత్బాక్రస్ నాయకత్వంలోని పోర్చుగీస్‌వారు గోవాలో 1510లో ఆసియా వ్యాపారాన్ని ప్రారంభించారు. పోర్చుగీసు వారి దోపిడీ విధానం ద్వారా అరబ్‌లకు నేరుగా వ్యాపార శత్రువులుగా మిగిలారు. వారు కలికట్, కొచ్చిన్, గోవా, దయ్యూ, డామన్, బొంబాయి, హుబ్లీ మొదలైనచోట్ల స్థావరాలు నిర్మించారు. పోర్చుగీసువారు మొఘల్ నావికా దళాన్ని ఇబ్బంది పెట్టడం ద్వారా మొఘల్స్ నంఉడి కొంత రాయితీ పొందారు.

ఆసియా వ్యాపార రంగంలో పోర్చుగీసువారు 100 సంవత్సరాల పోటు ఇతర కంపెనీలన్నింటిపై ఆధిక్యత వహించారు. కానీ ఐరోపాలో జరిగిన సంఘటనలు తూర్పు దేశ వ్యాపార రంగాన్ని ప్రభావితం చేశాయి. క్రీ॥శ 1580వ సంవత్సరంలో పోర్చుగల్ స్పెయిన్ ఆధిపత్యంలోకి వెళ్ళింది. 16వ శతాబ్దం ద్వితియార్థ భాగంలో బ్రిటన్ హాలెండ్, ఆ తరువాత ఫ్రాన్స్, స్పెయిన్, పోర్చుగీసు దేశాల వర్తక ఏకస్వామ్యంపై యుద్ధాలు ప్రకటించాయి. క్రీ॥ శ॥ 1588లో బ్రిటీష్‌వారు ఆర్మెడాలోని స్పెయిన్ నౌకాదళాన్ని ఓడించింది. ఫలితంగా ఆంగ్లేయులు డచ్‌వారు కేఫ్ ఆఫ్ గుడ్ హోప్ అగ్రాన్ని తూర్పు దేశాలలో వర్తక వ్యాపారుల కోసం ఉపయోగించడం మొదలగునవి.

ఇండోనేషియా ద్వీపాలైన జావా, సుమిత్రాలోని సుగంధ ద్రవ్యాల వ్యాపారంపై డచ్‌వారు ఆసక్తి చూపారు. అంతేగాక సూరత్, బ్రోచ్, కాంబే, అహమ్మదాబాద్, కేరళలోని కొచ్చిన ప్రాంతంలోని నాగపట్నం, మద్రాసు, ఆంధ్ర – బీహార్, ఉత్తరప్రదేశ్ మొదలైనచోట్ల వర్తక కేంద్రాలు ఏర్పాటుచేశారు. సిలోన్‌ను డచ్‌వారు పోర్చుగీసు నుంచి జయించారు. తూర్పు ఇండియా దేశాలలో డచ్‌వారు తమ వలసలు స్థాపించడానికి సంకల్పించడంతో తూర్పు ఇండియా మరియు ఇండియాతో సహా అన్ని ప్రాంతాల్లో బ్రిటీష్‌వారిపై ఘర్షణ తప్పలేదు. బెడారా యుద్ధంలో బ్రిటీష్ వారు డచ్‌వారిని క్రీ॥శ 1759లో ఓడించడంతో డచ్‌వారి ప్రాభల్యం క్షీణించింది.

## 51.4 ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీ అభివృద్ధి (లేక) ఎదుగుదల:

క్రీ॥శ 1600లో ఎలిజిబెత్–1 మహారాణి బ్రిటీష్ ఈస్టిండియా కంపెనీకి చార్టర్ చట్టం ద్వారా అధికారాన్నిచ్చింది. క్రీ॥శ 1617వ సంవత్సరంలో మొగలు చక్రవర్తి జహంగీర్ సూరత్‌లో ఫ్యాక్టరీలు స్థాపించడానికి ఫర్మానా వారిని జారీ చేశాడు. క్రీ॥శ 1687 సంవత్సరం వరకు సూరత్ ఇంగ్లీషువారి వ్యాపార కేంద్రంగా ఉన్నది. క్రీ॥శ 1623 లో సూరత్, బ్రోచ్, అహ్మదబాద్, ఆగ్రా, మచిలీపట్నంలలో ఇంగ్లండు ఫ్యాక్టరీలు స్థాపించింది. సెయింట్ జార్జి కోట పేరుతో మద్రాసులో ఒక బలమైన స్థావరం నెలకొల్పబడెను. ఒరిస్సా, బెంగాల్, బీహార్‌లలో ఫ్యాక్టరీలు నెలకొల్పబడ్డాయి. దీనితో బెంగాల్ రాష్ట్రంలో ప్రత్యేక ఒప్పందాలు చేసుకోవలసిన అవసరం ఇంగ్లీషు వారికి కలిగింది. క్రీ॥శ 1668లో ఈస్ట్ ఇండియా కంపెనీ బొంబాయిలో కూడా బలమైన స్థావరంను నెలకొల్పింది. అప్పటి నుంచి బ్రిటీష్ కంపెనీకి పశ్చిమ సముద్ర తీరంలో ముఖ్య స్థావరంగా బొంబాయి నిలిచింది.

చౌకగా ముడి సరుకులు కొనడానికి, అధిక ధరలకు వారి ఉత్పత్తులు అమ్ముకోడానికి ఏ అడ్డంకి లేకుండా చేసుకోడానికి బ్రిటీష్ కంపెనీ అధికారం స్థాపించడానికి బ్రిటీష్ కంపెనీ ఆలోచించింది. అధికార స్థాపన ద్వారా స్వేచ్ఛా వ్యాపారం కొనసాగించడానికి స్వదేశీ సంస్థానాధీశులతో స్వతంత్ర విధానాలు అనుసరించడానికి, భారతీయుల నుంచి పన్ను వసూలు చేయడానికి మరియు ఇతర ప్రాంతాలు ఆక్రమించడానికి ఈస్టిండియా కంపెనీ సంకల్పించింది.

క్రీ॥శ 1686వ సంవత్సరం దాకా బ్రిటీష్ వారు మొగలు చక్రవర్తుల ముందు వినయంతో వ్యవహరించారు. వర్తక వ్యాపారులలో విజయం, కోటలు నిర్మించబడ్డ మద్రాసు, బొంబాయి వర్తక స్థావరాలు మహారాష్ట్ర రాజకీయాల్లో ఔరంగజేబు జోక్యం మొదలగు అంశాలు రాజకీయ పాత్రను పోసించడానికి అనుకూలించిన అంశాలుగా కంపెనీ భావించింది. మొగలు చక్రవర్తి మీద హుగ్లీని ఇవ్వమని యుద్ధాన్ని ప్రకటించింది. కానీ మొగలు చక్రవర్తుల చేతుల్లో తేలికగా ఓడిపోయింది. వెంటనే కంపనీ తన బలహీనతలు గమనించి క్షమాపణ కోరింది.

క్రీ॥శ 1691లో సంవత్సరానికి 3 వేల రూపాయలు  చెల్లించవలసిన సుంకాన్ని రద్దు చేయించుకోకలగింది. అంతేగాక క్రీ॥శ 1698లో బెంగాల్, కలకత్తా మరియు గోవింద్ పూర్‌లలో జమిందార్లను సంహరించగలిగింది. ఇక్కడే విలియం కోటను బ్రిటీష్  వారు నిర్మించారు. కలకత్తా చుట్టూ ఉన్న గ్రామారీ కలకత్తాగా మార్పుచెందింది.

క్రీ॥శ 1717లో మొగలు చక్రవర్తి ఫరూక్ సియర్ పర్మనాల్ ద్వారా ఇదేరకమైన హక్కులను గుజరాత్, దక్కన్ ప్రాంతాలను కూడా సంపాదించుకోగలిగింది. బెంగాల్ గవర్నరు ముష్రిఫ్ ఆలీఖాన్ వ్యతిరేకించిన కలకత్తా చుట్టూ అదనపు ప్రాంతాలను సంపాదించగలిగింది. ఈ ఫర్మానా ద్వారా మద్రాసు, బొంబాయి మరియు కలకత్తాలో బ్రిటీష్ వలస సామ్రాజ్యానికి కేంద్ర బిందువులైనాయి.

క్రీ॥శ 1717లో సంపాదించిన ఫర్మానా కారనంగా ఇంగ్లీషు, బెంగాలు నవాబుల మధ్య సంఘర్షణ మొదలైంది. ఇంగ్లీషు కంపెనీ తమ సరుకులను ఎగుమతి, దిగుమతి చేయడానికి ఏ సుంకం చెల్లించకుండా లైసెన్సులు సంపాదించింది (దస్తక్). కంపెనీ ఉద్యోగులు ఈ ఫర్మానా ద్వారా వర్తక హక్కులు సంపాదించినఫర్మానాలో భారతీయ వ్యాపారులకు మాత్రమే ఏ రాయితీ లభించలేదు. కానీ కంపెనీ ఉద్యోగులు పన్ను ఎగవేయడాన్ని బెంగాల్ నవాబు తీవ్రంగా వ్యతిరేకించాడు. నవాబుల ఆధిపత్యాన్ని బలంగా ఉన్నంత కాలం కంపెనీ తలదూర్చుతునే ఉండేది. కానీ సిరాజుద్దౌలా బెంగాల్ నవాబును అయినప్పటి నుండి కంపెనీ ధిక్కరించడమైనది. దీనిని మీరు రాబోయే అధ్యాయాలలో చదువబోతున్నారు.

## 51.5 ఆంగ్లో – ఫ్రెంచి ప్రత్యర్థులు – ఆధిక్యత కొరకు పోరాటం :

క్రీ॥ శ 1664లో ఫ్రెంచి ఈస్టిండియా కంపెనీ స్థాపించబడెను. వీరి స్థానం కేంద్రాలు కలకత్తా దగ్గర ఉన్న చంద్రనగర్ మరియు తూర్పు తీరాన పాండిచ్చేరి. ఫ్రెంచి వారి కొన్ని ఫ్యాక్టరీలు తూర్పు, పశ్చిమ తీరాలలో ఉన్నాయి. వీరు హిందూ మహాసముద్రంలో మరల ఐక్యతను సాధించు, మారటస్ దీవులలో ఆధ్యక్షతన సంపాదిచారు.

క్రీ॥ శ 1742లో ఫ్రెంచి, ఇంగ్లాడుల మధ్య యుద్ధాలు లేకుండా, వారి మధ్య మంచి సంబంధాలు ఏర్పడినాయి. క్రీ॥శ 1745లో ఫ్రెంచి పడవలను ఇంగ్లీషు వారు పట్టుకొని, పాండుచ్చేరిలో బెదిరించారు. అపుడు ఫ్రెంచి గవ్నరు జనరల్ డూప్లే ఇంగ్లీషు వారిని ఓడించి మద్రాసును ఆక్రమించెను. ఆంగ్లేయులు కర్నాటక నవాబు సహాయం కోసం వెతికినారు. ఫ్రెంచి వారి కొద్దిపాటి సైన్యం తేలికగా నవాబు సైన్యం (10,000)ను అధ్వార్ యుద్ధంలో ఓడించెను. క్రీ॥శ 1748లో ఇంగ్లీషు, ఫ్రంచి వారి మధ్య యుద్ధం ముగిసి, మద్రాసును ఇంగ్లీషు వారికి ఇచ్చినారు. మొగలుల అధికారం తుగ్గతున్నప్పుడు ఈ ఇద్దరు ప్రత్యర్థుల మధ్య వ్యాపారం సఫలమైంది. ఈ ఇద్దరు ఎక్కువ సంపదను, ప్రదేశమును పొందినారు.

కర్నాటక విజయం వలన ఫ్రెంచి వారు ఇండియాకన్న యూరోపియన్లు, ఆయుధాలు, సైన్య క్రమశిక్షణలో మిన్న అని భావించారు. ఫ్రెంచివారు స్థానిక రాజులకు యుద్ధ సమయంలో సైనిక సహాయం చేసే ప్రదేశాలు, సంపదను పొందినారు. ఎక్కువగా ఫ్రెంచివారు కర్నాటక విషయాలలో తలదూర్చినారు. ఈ ఫ్రెంచివారు అన్వరుద్దీన్‌ను, చాందసాహెబ్‌ను అండగా చేసుకున్నారు. హైదరాబాద్‌లో అసఫ్‌జా మరణించిన తరువాత ఫ్రెంచివారు ముజఫర్ జంగ్ అండతో నజీర్ జంగ్‌కున్నతిరకంగా మారి కొత్త నైజాం కావలెనని కోరుతున్నారు. ఇద్దరు పోటీదారులు సింహాసనం

ఎక్కిన తరువాత ఫ్రెంచివారు వారికి ధనం, కొన్ని ప్రదేశాలను ఇచ్చినారు. ఈ విధంగా ఫ్రెంచివారి ప్రాబల్యం ఇండియాలో పెరిగింది.

ఈ మధ్యలో ఇంగ్లీషువారు రహస్యంగా నజీర్ జంగ్, మహమ్మద్ ఆలీతో మంతనాలు జరిపినారు. అన్వరుద్దీన్ కుమారుడైన మహమ్మద్ ఆలీ నవాబు కావాలని చందాసాహెబ్ మరియు ప్రెంచి వారు అనుకున్నారు. కర్నాటక రాజధాని ఆర్కాట్‌పై ఇంగ్లీషు కమెండర్ అయిన యువ గుమస్తా రాబర్ట్ క్లైవ్ దాడి చేశాడు. ఆర్కాట్‌ను రక్షించాలని చాంద సాహెబ్‌ను, ఫ్రెంచివారు వత్తిడిచేశారు. ఫ్రెంచివారు ఇంగ్లీషువారి చేతిలో ఓడిపోయెను. చాందసాహెబ్ చనిపోయెను. ఫ్రెంచి వారు ఆర్థికంగా దెబ్బతిన్నారు. అపుడు ఫ్రెంచివారు డూప్లే కాలంలో ఏమి జరిగిందో గుర్తించుకోమని ఇంగ్లీషు వారితో చెప్పెను. ఈ విధంగా ఇంగ్లీషు వారు దక్షిణ భారతదేశంలో విస్తరణ ప్రారంభమయింది.

క్రీ॥శ 1756లో మరల ఫ్రెంచి, ఇంగ్లీషు వారి మధ్య యుద్ధం జరిగింది. బెంగాల్‌లో ఇంగ్లీషు వారు దాడిచేయుటకు వీలుపడకుండ ఉండేలా కలకత్తాకు రక్షణ కల్పించారు. ఎందుకనగా, ఫ్రెంచివారు చంద్రనగర్ దగ్గర దాడి చేయుటకు సిద్ధంగా ఉన్నారని తలచి ఆ విధంగా కలకత్తాకు రక్షణ కల్పించారు. నవాబు ఇంగ్లీషు వారు చేసిన రక్షణను తిరస్కరించాడు. దానికి ఇంగ్లీషు వారు ఒప్పుకోక నవాబును లెక్కచేయలేదు. దీనిని తరువాత విభాగములో ప్లాసీ యుద్ధంగా చదివెదరు. దీనినిబట్టి ఇంగ్లీషు వారి ప్రభావం ఎంత బలంగా ఉన్నదో అర్మగుచున్నది. ఫ్రెంచివారు తమ బలంను పెంచుకొను మరలా ప్రయత్నించారు. ఫ్రెంచి వారు కౌంట్-డి-లాలీ ఆధ్వర్యంలో తప్పించుకొనును ఫ్రెంచి వారి దళాలు కర్నాటకలో ఇంగ్లీషు వారితో ఏ విధంగా సరితూగలేదు. క్రీ॥శ 1760లో ఫ్రెంచి వారికి, ఇంగ్లీషు వారికి వాండివాష్‌లో జరిగిన యుద్ధంలో ఫ్రెంచి వారు తమ ఓటమిని ఒప్పుకొనక తప్పలేదు.

క్రీ॥శ 1783లో ఫారిస్ సంధి ప్రకారం వారి ఫ్యాక్టరీలు వారి ఆధీనంలోకి తెచ్చుకోగలిగినారు. కాని వారు వాటిని రక్షించుకోలేకపోయారు. ఫ్రెంచివారి వ్యాపారం ఉన్నతి స్థితి నుంచి, మధ్యస్థ వ్యాపారులుగా మారినారు. ఇంగ్లీషు వారి వ్యాపారంను ఇండియాలో ఎదిరించేవారు లేకపోయినారు. ఎవరి అండదండలు లేకుండానే ఇంగ్లీషు వారు ఇండియాలో రాజ్య స్థాపన చేయుటకు సిద్ధమైనారు.

## 51.6 ఈస్టిండియా కంపెనీ వారి విజయానికి గల కారణాలు :

ఈస్టిండియా కంపెనీ వారి విజయానికి అనేక కారణాలు ఉన్నాయి. ఆ కాలంలో ఇండియాలో, బ్రిటన్‌లో అంతర్గత మార్పులు జరుగుతుండెను. ఇండియాలో ఆర్థిక పరిస్థితి దిగజారిపోయెను. ఆఆర్థిక పరిస్థితుల వల్ల జాగీర్దారీ పద్ధతి దెబ్బతిన్నది. మొగలు సామ్రాజ్యం అంతర్గత వివాదాల వల్ల, లంచగొండితనం, స్వార్థం వల్ల పతనమైంది. అపడు బ్రిటీష్‌వారు క్రీ॥శ 1686లో ఔరంగజేబును దెబ్బకొట్టెను. అతని మరణం తరువాత ఔరంగజేబు లాంటి బలమైన మొగలు చక్రవర్తి లేదు.

క్రీ॥శ 18వ శతాబ్ది మధ్యలో ఇంగ్లాండులో పారిశ్రామిక విప్లవము జరిగింది. నూతన శాస్త్రాల ఆవిర్భావం, సాంకేతిక అభివృద్ధిని ఈ విప్లవం కల్గించింది. పెట్టుబడిదారి విధానం, భూస్వామ్య విధానం ఉన్న. ఇండియా సాంకేతిక, శాస్త్ర, ఆర్థిక రంగాలలో ఇంగ్లాండు కంటే వెనుకబడి ఉన్నది. ఈ విప్లవం వలన బ్రిటీష్ వారి గొప్పతనం పెరిగింది.

బ్రిటీష్ వారి విజయానికి కారణాలు వారి సమర్థమైన నాయకులు, వారి మిలటరీ సైన్యం దోహదపడెను. ఇండియా సైన్యం కన్న కంపెనీ సైన్యం ఉన్నత స్థాయిలో ఉన్నది. కంపెనీ వారి సైన్యం క్రమశిక్షణలో, ఆయుధాలలో ఇండియా వారి కంటే ఉన్నతంగా ఉండెను. కంపెనీ వారు ఉపయోగించే ఫిరంగి దళం భారతీయుల ఫిరంగి దళం కన్నా మన్నిక కలది. బ్రిటీష్ వారి యుద్ధ వాహనాలు ఇండియా వారి కంటె ఉన్నతంగా ఉన్నాయి. బ్రిటీష్ ఆఫీసర్లు అందరూ బ్రిటీష్ మిటరీలో ముందుగా శిక్షణ పొంది ఉన్నారు. వీరు భారతీయుల మధ్య ఉన్న అనైక్యతను అవకాశంగా తీసుకొని, భారతీయుల మధ్య వివాదాలు సృష్టించేవారు. ప్లాసీ యుద్ధం తరువాత, బెంగాల్‌ను బ్రిటీష్ వారు కలిగిఉండుటవలన చాలా ధనం, ప్రదేశంను సంపాదించుకోగలిగారు.

ఇండియా నాయకులు చాలా ధైర్యవంతులు. వీరికి సరైన శిక్షణ, యుద్ధ సామాగ్రి లేకపోవుటవలన హైదర్ ఆలీ, మాధవరావ్ సింధియా, నానా పాడ్నవీస్, రంజిత్ సింగ్ లాంటి వారు బ్రిటీష్‌వారి మీద విజయం సాధించలేకపోయాయి.

క్రీ॥శ 18వ శతాబ్దిలో బ్రిటీష్ వారు మిలటరీ, రాజకీయ పలుకుబడి ఉండుటవలన, ఖండాంతర యుద్ధాలు చేయుట వలన సముద్రాల మీద ఆధిక్యతను సాధించారు. దీనివలన 18వ శతాబ్దిలో కంపెనీ వారు విజయం పొందగలిగారు. మొగలులు తమ ఖజానాను, తమ వ్యాపారంను కొనసాగించుటకు దృఢమైన సైన్యంను కలిగియున్నారు. వ్యాపారాలు భూమి మీదకాక, ఇతర విధాలుగా చేసేవి కష్టం మరియు రక్షణ లేనటువంటివి అయినాయి. అందుకే ఇండియా వ్యాపారులు, బ్రిటీష్ వ్యాపారుల మీద ఆధారపడవలసి వచ్చింది.

అరబ్బులు, పోర్చుగీసు వారు క్రీ॥శ 16వ శతాబ్దిలో దచ్చివారు, క్రీ॥శ 17వ శతాబ్ది మొదటిలో విదేశీ వ్యాపారం మీద ఆధారపడినారు. కంపెనీ వారు బ్రిటిషు నౌకాదళాలతో మంతనాలు జరిపి వారి పనలు చేయించుకుంటూ, శత్రువుల నుంచి వారి ద్వారా రక్షణ పొందుతున్నది. ఇండియాలో ఫ్రెంచివారు రాజ్యస్థాపన చేయుటలో విఫలమైనారు. అంతేకాక ఫ్రెంచివారు నౌకాదళం మీద ఆధిపత్యంను కోల్పోయినారు. ఇంగ్లీషు నౌక దళ అధికారులకు చాలా ప్రాముఖ్యత ఉన్నది. ఎందువలన అనగా! వారికి రక్షణకరమైన హార్బరు మరియు నౌకా దళం కలదు.

అన్ని యూరప్ దేశాలకన్నా ఇంగ్లీషు ఈస్ట్ ఇండియా కంపెనీ వారు అన్ని విషయాలు బాగా నిర్వహించగలరు. వారు చెప్పేమాట నెరవేర్చుకొనే స్థితికి ఎదిగినారు. చార్టర్ 1600 ప్రకారం, ఎలిజిబెత్ రాణి-1 ఈస్టిండియా కంపెనీ వారు కేప్ ఆఫ్ గుడ్ హోప్ ద్వారా 15 సంవత్సరాలు వ్యాపారం కనొసాగించవచ్చునని ప్రకటించెను. ఎలిజిబెత్ రాణి-1 కూడా ఈస్టిండియా కంపెనీ వ్యాపారంలో భాగస్తురాలు. ఈ కంపెనీ వారు, ఇండియాలో ఉన్న నాయనకులను తృప్తిపరచుట ద్వారా కంపెనీ వ్యాపారము ఇండియాలో ఎదురులేకుండా పోయింది. క్రీ॥శ 1609-1676 వరకు ఈస్టిండియా కంపెనీ 1,70,000 రూపాయలను చార్లెస్-2కు అప్పుగా ఇచ్చింది. దానికి బదులు కంపెనీ కోటలను కట్టుటకు, యుద్ధానికి తగిన సైన్యము సమకూర్చుకొనుటకు, కంపెనీ వారే యుద్ధ ప్రకటన చేసేందుకు అర్హత పొందినారు. ఈ విధంగా అనేక లాభాలు కంపెనీ వారు పొందినారు. అంతేగాక రాజకీయంగా ఎదిగినారు. దీని నుంచి మనం గుర్తుంచుకోవలసినది ఏమనగా, కంపెనీ వారు బ్రిటన్‌కు ఇచ్చిన 1,70,000 రూపాయలు భారత ప్రజలు కంపెనీకి చెల్లించిన పన్ను అని. క్రీ॥శ 1683లో కోర్టు కార్యనిర్వహణ అధికారాలు మద్రాసు అధికారులు ఈ విధంగా వ్రాసినారు. “మేము మీ కోటలకు రక్షణ కల్పిస్తాం. మీ పట్టణాలను బలపరుస్తాం. కాని మీరు మాతో వ్యాపార సంబంధాలు కలిగి ఉండాలి. మీరు మాకు పూర్తి ఖర్చులు చెల్లించాలి”.

ఫ్రెంచి కంపెనీ విషయం చూస్తే, అది ఆ దేశం మీద ఆధారపడి ఉన్నది. దానిని వారి ప్రభుత్వం అదుపులో ఉంచుతుంది. ఈ ఫ్రెంచి దేశం ఎవరి సలహాలు అడగకుండా తన పనిని తాను చేసుకొనును. ఫ్రెంచి దేశము తక్కువ నీతికి, విలువలకు ప్రాధాన్యతను ఇస్తుంది. ఈ దేశంలో లంచగొండితనం యుండుటవలన పరిపాలనలో స్థిరత్వం లేదు. ఫ్రెంచివారు, ఫ్రెంచి కంపెనీలో భాగస్వాములుగా ఉన్నారు. ఫ్రెంచి వారు విడిపోవుటకే శ్రద్ధ చూపుతారు. ఫ్రెంచి కంపెఈకి వచ్చే సొమ్మును కంపెనీ నిర్వాహకులు తమ వంతు వారు తీసుకొని ఫ్రెంచి కంపెనీ వృద్ధికి తోడ్పడుట లేదు. అందుకే ఫ్రెంచి కంపెనీ ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీతో పోటీలో నిలువలేకపోయింది.

## పాఠ్య ప్రశ్నలు 51.ఎ:

1. ఏ రాజకీయ పరిస్థితులు కొత్త వ్యాపార మార్గాలను కనుగొనుటకు కారణమైనాయి?
2. వాస్కోడిగామా, కొలంబస్ కనుగొనుట వలన ఏ ఆర్థిక ప్రభావ ప్రాముఖ్యత కలిగింది?
3. తూర్పు వ్యాపారంలో ఆధిక్యతను సంపాదించుకున్న యూరోపియన్లు ఎవరు. ఎట్లు, ఏ విధంగా వారి గొప్పతనము ముగిసింది?
4. ఫ్రెంచి కంపెనీ విజయానికి డూప్లే తీసుకున్న నిర్ణయాలు ఏవి?
5. ఇండియా పాలకుల కన్న ఇంగ్లీషు మిలటరీ ఎందుకు ఉన్నతంగా ఉన్నదో రెండు కారణాలు తెలుపుము.

## సెక్షన్ -3

## ఈస్టిండియా కంపెనీ ప్రదేశ విస్తర్ణం

మనం గడచిన భాగాలలో ఈస్టిండియా కంపెనీకి వ్యాపారాభివృద్ధి ద్వారా రాజకీయ కోరిక ఏర్పడినది. ఈ కంపెనీ ఇండియా వారి అంతర్గత విషయాలలో తలదూర్చుట వలన ఆర్థిక లాభం ఏర్పడినది. ఇపుడు చదువబోయే భాగంలో కంపెనీవారు బెంగాల్, బీహార్, సింధూలోనే కాక, నేపాల్, బర్మా, ఆఫ్ఘనిస్తాన్‌లలో కూడా వారి ప్రదేశ విస్తర్ణ జరిగింది.

### 51.7 బెంగాల్ :

ఇండియాలో వలసల స్థాపన బెంగాల్‌లో ప్రారంభమయింది. కంపెనీవారు తమ సరకులను ఎగుమతులు, దిగుమతులకు ఏ పన్నులు చెల్లించకుండా వ్యాపారం చేయు అధికారం వారికి ఉన్నది. బెంగాల్ నవాబులకు కంపెనీ వ్యాపార విధానాలు నచ్చలేదు. ఈ విషయాన్ని గత భాగంలోనే చదివినాము.

క్రీ॥శ 1756లో సిరాజ్ ఉద్దౌలా నవాబు అయినాడు. ప్రయివేటు వ్యాపారాన్ని సిరాజ్ ఉద్దౌలా ఆపినాడు. క్రీ॥శ 1717లో కంపెనీ ఎగుమతి, దిగుమతులు ఆపుచేసెను. ఇండియా వస్తువులు కలకత్తా వెళుతుంటే, వాటి మీద అధిక పన్నులు కంపెనీ వారు వసూలు చేస్తున్నారు. దీని వలన కంపెనీవారికి, బెంగాల్ వారికి సంబంధాలు తెగిపోయినాయి. ఫ్రెంచి వారికి వ్యతిరేకంగా బెంగాల్‌ను కంపెనీవారు స్వాధీన పరచుకొనుట వలన బెంగాల్‌కు, కంపెనీ వారికి మధ్య మనస్పర్థలు వచ్చుటకు మరొక కారణమయింది. సిరాజ్ ఉద్దౌలా వ్యతిరేకులైన గాస్తిబేగం చేస్తున్న తప్పులను కంపెనీ

వారు బలపరచుచున్నారు. ఏ రాజకీయ నాయకులనైతే సిరాజ్ ఎదుర్కోవాలనుకొనుచుండెనో, వారిని కంపెనీ వారు బలపరచుచుండెను.

క్రీ॥శ 1757లో సిరాజ్ ఉద్దౌలా కలకత్తా కాశింబజారులోని కంపెనీవారి ఫ్యాక్టరీలను, కలకత్తా పోర్టు విలియంను మూసివేసెను. సిరాజ్ తాత్కాలిక విజయంతో ముర్షిదాబాద్ తిరిగి వెళ్ళెను. ఇంగ్లీషు వారు మద్రాసును, వత్తిడి ద్వారా మద్రాసు నుంచి ఎడ్మిరల్ వాట్సన్‌ను, రాబర్ట్ క్లైవ్‌లు కలకత్తాలోని కొంత భాగాన్ని ఆక్రమించి, కొన్ని నిబంధనలకు ఒప్పుకునేలా నవాబు మీద వత్తిడి చేసినారు. ఈ నిబంధనలు ఒప్పుకొనకపోతే నవాబు అసమర్థుడని రుజువుచేసి, వారికి అనుకూలమైన నవాబును అధికారంలో ఉంచవచ్చునని కంపెనీ భావించెను. కంపెనీ పెట్టిన నిబంధనలు నవాబు ఒప్పుకొనేటట్లుగా లేవు. అందువలన ప్లాసీ యుద్ధం నవాబుకు, కంపెనీకి మధ్య జరిగింది.

ప్లాసీ యుద్ధం క్రీ॥శ 1757లో జరిగింది. అప్పుడు సిరాజ్ ఉద్దౌలా ఓడిపోయెను. అతని సైన్యాధికారి మీర్జాఫర్ బెంగాల్ నవాబు అయినాడు. మీర్జాఫర్ కాలంలో కంపెనీవారు ఎలాంటి విభేదాలు లేకుండా వ్యాపారం కొనసాగించారు. మీర్జాఫర్ కంపెనీవారు వ్యాపాంర బెంగాల్, బీహార్, ఒరిస్సాలలో చేసుకొనుటకు అనుమతి ఇచ్చెను. అంతేగాక 24 పరగణాల జమిందారీ ఇంగ్లీషు కంపెనీకి లభించింది. క్లైవ్‌కు వెలకట్టలేని బహుమతులు లభించాయి. మరియు బ్రిటీష్ అధికారులకు, వ్యాపారస్తులకు పన్ను కట్టుకొనకుండా వ్యాపారం చేసుకొనేందుకు అర్హత పొందినారు.

## ప్లాసీ యుద్ధ గుర్తింపు

మిలటరీ విధానంలో ప్లాసీ యుద్ధం అంత ప్రాముఖ్యమైనది కాదు. ఎందువలనంటే ఇంగ్లీషువారు మీర్జాఫర్ సహాయంతో విజయం సాధించారు. కాని ఈ యుద్ధానికి చారిత్రాత్మకమైన ప్రాముఖ్యం ఉన్నది. ఇది బ్రిటీష్ వారికి ఒక కొత్త మార్గంను చూపెను. బెంగాల్‌లో చాలా వనరులు ఉండుట వలన కంపెనీ వారు మంచి మిలటరీ దళాన్ని సమకూర్చుకోగలిగినారు. బెంగాల్ మీద ఆధిక్యత ఇంగ్లీషు వారికి ఉండుటవలన ఫ్రెంచి వారిని ఓడించగలిగినారు. ప్లాసీ యుద్ధం తరువాత కంపెనీ వారు బెంగాల్ వారితో వ్యాపార లావాదేవీలు బాగా కొనసాగించెను. ప్లాసీ యుద్ధం తరువాత కంపెనీ వారిలో మార్పును తెచ్చెను. కంపెనీ వారు వ్యాపార అభివృద్ధి కాక సైనిక అభివృద్ధి చెందినవారు. కంపెనీ మిలటరీ దళం నియంత్రణ చేయలేనంత ప్రదేశమును కంపెనీ ఆక్రమించెను.

మీర్జాఫర్ బెంగాల్‌కు నవాబు అయిన తరువాత కంపెనీ వారి ఉద్దేశాలు తెలుసుకొనెను. అంతేగాక కంపెనీ ఆఫీసర్స్ కోరికలు కూడా తెలుసుకొన్నాడు. బొంబాయి, మద్రాసు కాకుండా ఇండియాలో అనేక ప్రదేశాలకు ఎగుమతులు కంపెనీ చేస్తే దాని ఖర్చును బెంగాల్ వారే భరించాలి. ఇపుడు మీర్జాఫర్ కంపెనీ వారిని నెట్టివేయుటకు డచ్చివారితో స్నేహ సంబందాలు ఏర్పాటుచేసుకొనెను. కాని ఇంగ్లీషువారు డచ్చివారిని బిడారం వద్ద క్రీ॥శ 1759 నవంబరులో ఓడించెను. మీర్జాఫర్ కంపెనీ వారితో సంధి చేసుకొనుటకు ప్రయత్నించి విఫలుడైనాడు ఇంగ్లీషు వారు బెంగాల్ నవాబు మీర్జాఫర్ అల్లుడైన మీర్ ఖాసింను నియమించెను.

**బాక్సర్ యుద్ధం :** మీర్‌ఖాసిం కోరిక కలిగిన నవాబు. ఇతడు కంపెనీ వారి అవినీతి వ్యాపారం, కంపెనీ ఉద్యోగుల అవినీతిని అదుపు చేయాలనుకున్నాడు. ఎందుకనగా, దీనివలన బెంగాలులో ఉన్న వ్యాపారులు పన్నులు చెల్లించవలసి వచ్చింది. కంపెనీ ఉద్యోగులలో అవినీతి బాగా పెరిగిపోయింది. దస్తాక్స్‌ను కొంతమంది బెంగాల్ వ్యాపారులకు అమ్ముతున్నారు.

వీటన్నిటిని ఆపుటకు మీర్‌ఖాసిం అంతర్గత వ్యాపారంను ఆపెను. దీనివలన బెంగాల్‌లోని వ్యాపారులకు ఎలాంటి నష్టం ఉండదు. కంపెనీ వారు మేము కూడా వ్యాపారం చేసుకుంటామని నవాబును కోరెను. నవాబు దానికి ఎదురుతిరుగుటవలన క్రీ॥శ 1763లో అనేక యుద్ధాలు జరిగినాయి. ఈ మధ్యలో కంపెనీవారు మీర్జాఫర్‌ను నవాబును చేసెను. మీర్ ఖాసింతనే చట్టపరమైన నవాబునని ఎదురుతిరిగెను. మీర్‌ఖాసిం బ్రిటీష్ వారి మీద ఎదురుతిరుగుటవలన, అవధ్‌కు మీర్‌ఖాసిం పారిపోవలసి వచ్చింది. అవధ్ నవాబు సుజుఉద్దౌలా, మొగలు చక్రవర్తి షా ఆలం–2లు మీర్‌ఖాసింతో కలసి ఇంగ్లీషువారితో యుద్ధానికి దిగినారు. కాని బాక్సర్ యుద్ధంలో ఇంగ్లీషువారే విజయం పొందినారు. కాని బాక్సర్ యుద్ధం వలన ఉత్తర భారతదేశంలో బ్రిటీష్ వారు శక్తివంతమైన వారుగా మారినారు. వారి రాజకీయ ఆధిక్యతను పెంచుకోవాలంటే మహారాష్ట్రను, ఆఫ్ఘనిస్తాన్‌ను ఆక్రమించాలి.

ఓడిపోయిన పాలకులు, చివరికీ బ్రిటీష్‌వారితో అనేక సంధులను చేసుకున్నారు. సుజ–ఉద్దౌలా, షా ఆలమ్–2 కంపెనీ మీద ఆధారపడినారు. అలహాబాద్ సంధి గుర్తుగా మొగలుల వద్ద నుంచి కంపెనీ బెంగాల్ దివాన్‌ను, బీహార్, ఒరిస్సాను అందుకున్నది. చట్టబద్ధంగా ఆ ప్రదేశాల నుంచి పన్నులు కంపెనీ వసువులు చేసుకోవచ్చును. అంతేకాదు సంవత్సరమునకు 2.6 మిలియన్ల రూపాయలు, అలహాబాద్, కారా జిల్లాలను ఇచ్చెను. అవాద్ నవాబు ధనం ఎక్కువగా చెల్లించెను. అవధ్ నవాబు తరువాత అతడు బ్రిటీష్ వారి అండకొరకు ప్రార్థించెను. అనుకోకుండానే అవధ్ నవాబు సేవ చేయుటకు శ్రద్ధ చూపెను. మరాఠి మరియు బ్రిటీష్ ప్రదేశాల మధ్య ఏమిలేని వాడుగ అవధ్ నవాబు అయినాడు.

బెంగాల్‌లో మీర్జాఫర్ చనిపోయెను. ఇతనికుమారుడైన నిజాం ఉద్–దౌలాను నవాబుగా కంపెనీ నియమించెను. అప్పుడు బెంగాల్ గవర్నరుగా రాబర్ట్ క్లైవ్ అయినాడు. నవాబు అధికారమును తోసిపుచ్చి, క్లైవ్ బెంగాలులోని సంపదను వెతికిపట్టుకొనెను. క్రీ॥శ 1765 ఫిబ్రవరిలో నవాబుకు, కంపెనీ వారికి సంధి జరిగినది. ఈ సంధి వలన నవాబు సైన్యం శక్తిలేనిదైనది. ఉప సుబేదారును రాజ్యపాలన నిమిత్తం కంపెనీ నియమించెను. కంపెనీకి తెలుపకుండా ఈ బేదారును తొలగించుటకు వీలులేదు. ఇటు కంపెనీ తెలివిగా పరిపాలనను (నిజామత్) బెంగాలులో నియంత్రించెను.

బెంగాల్, బీహార్, ఒరిస్సా దివాని అధికారంను మొగలుల నుంచి పొందింది. ఇంగ్లీషు వారు ధనం అపారంగా గల సంస్థానమైన బెంగాల్‌కు నిజమైన పాలకులుగా మారినారు. నామమాత్రపు అధికారులుగా నవాబులు మిగిలిపోయినారు. ఇంగ్లీషువారు బాధ్యతలేని అదికారం కలిగి ఉన్నారు. కానివారి అధికారం తగ్గలేదు. బెంగాల్ ప్రజల దురదృష్టం వలన ద్వంద్వ ప్రభుత్వం బెంగాల్‌లో ఏర్పడింది. మీరు తరువాతి పాఠంలో వివరంగా చదువుతారు.

బ్రిటీష్ వారు ఇండియాలో బెంగాల్‌ను మొదటిగా జయించినారు. ప్లాసీ, బాక్సర్ యుద్ధాల వలన ఇండియాలో స్థిరపడినారు. బెంగాల్ సంపదను కొల్లగొట్టినారు. బెంగాల్‌లోని ద్వంద్వ ప్రభుత్వం వలన బెంగాల్ దారిద్ర్యమును అనుభవించెను.

## 51.8 అవధ్:

అలహాబాద్ సంధి ప్రకారం అయోధ్య నవాబుకు తిరిగి ఇవ్వబడి, సరిహద్దు సంస్థానంగా రూపొందించబడింది. దీనివల్ల ఆఫ్ఘన్, మహారాష్ట్రల దాడుల నుంచి కంపెనీ తప్పించుకోగలిగింది. క్రీ॥శ 1773లో గవర్నర్ జనరల్‌గా వచ్చిన లార్డ్ వెలస్లీ తన పాలనా కాలంలో కంపెనీ సామ్రాజ్యానికి మరికొన్ని ఇతర ప్రాంతాలు ఆక్రమించడానికి పూనుకున్నాడు.

యుద్ధాలు, దురాక్రమణలేకాక వెలస్లీ అదనంగా సైనిక సహకార పద్ధతిని ప్రవేశపెట్టాడు. దీని ప్రకారం బ్రిటీష్ వారి రక్షణకు అవసరమయిన స్వదేశీ సంస్థానాలకు కొంత పరిహారం చెల్లించబడం ద్వారా తమ సైనిక రక్షణ పొందవచ్చును. ఈ పద్ధతిలో చేరిన రాజులు బ్రిటీష్ ప్రతినిధిని తమ రాజధానిలో ఉంచుకోవాలి. ఇతర రాజ్యంతో బ్రిటీష్ వారి అనుమతి లేకుండా యుద్ధాలు ప్రకటించడం కాని, సంధులు చేసుకోవడం కాని చేయరాదు. ఈ పద్ధతిలో అందరికంటే ముందుగా చేరిన బలమైన సంస్థానం హైదరాబాదు. క్రీ॥శ 1801లో అయోధ్య సంస్థానం చేరడమేకాక అయోధ్య సంస్థానంలో దాదాపు సగ భాగమే సైనిక ఖర్చుల కోసం బ్రిటీష్ వారి ఆధీనం చేసింది.

లార్డ్ డల్హౌసి క్రీ॥శ 1848-1856 పాలనా కాలంలో అయోధ్య సంపూర్ణంగా ఆక్రమించబడింది. దీనికి కారణం అయోధ్య నవాబు వజీం ధానీషా దుష్పరిపాలన అని బ్రిటీష్ వారు ప్రచారం చేశారు. డల్హౌసీ దృష్టిలో మున్ బెస్టర్ మరియు ఇతర కేంద్రాల నుంచి వచ్చే సరుకులు అమ్మడానికి అయోధ్య లాభసాటి మార్కెట్ అయింది.

బ్రిటీష్ విస్తరణ మొదటి కాలంలో అయోధ్య బ్రిటీష్ తీర రాజ్యాలకు రక్షణ రాజ్యంగా ఉన్నది. కాని క్రీ॥శ 1801లో వెలస్లీ నవాబును సైనిక సహకార పద్ధతిలో సభ్యరాజ్యంగా చేరమని బలవంతం పెట్టెను. డల్హౌసీ కాలంలో అయోధ్య సంపూర్ణంగా ఆక్రమించబడింది.

## 51.9 మైసూర్ :

క్రీ.శ. 1565లో జరిగిన తళ్ళికోట యుద్ధ కాలం దాకా మైసూర్ సంస్థానం స్వతంత్ర సంస్థానంగా ఉంది. క్రీ.శ. 1761లో హైదరాలీ మైసూర్ రాజును పదవి భ్రష్టుడ్ని చేసి అధికారం హస్తగతం చేసుకున్నాడు. హైదరాలీ అనంతరం అతని కుమారుడు టిప్పుసుల్తాన్ బ్రిటీష్ రాజ్య విస్తరణను అడ్డుకోవడంలో కీలకపాత్ర నిర్వహించాడు.

హైదరాలీ ఫ్రెంచి కంపెనీ సహకారంతో బలమైన సైన్యంను రూపొందించడమేకాక మహారాష్ట్ర, నిజాం మరియు బ్రిటీష్ రాజ్యాల వరకు తన రాజ్యాన్ని విస్తరింపజేశాడు. క్రీ.శ. 1769లో మొదటి ఆంగ్లో – మైసూర్ యుద్ధంలో బ్రిటీష్ వారు నిజాం సైన్యాలను ఓడించారు. రెండో ఆంగ్లో – మైసూర్ యుద్ధంలో (1786) మొదట్లో హైదరాలీ విజృంభించినప్పటికీ హైదరాలీ ఓడిపోయి చనిపోయాడు. హైదరాలీ కుమారుడు టిప్పు సుల్తాన్ బ్రిటిష్ నిజాం పాలకులలో మంగూబార్ సంధిని (1784) చేసుకోవడం ద్వారా రాజ్యంలో శాంతి నెలకొల్పబడింది.

మొదటి మైసూరు యుద్ధం విజేతలు ఎవరో తెలియకుండానే ముగియడంతో తిరిగి టిప్పుసుల్తాన్ ఇంగ్లీషు వారి మధ్య సంఘర్షణ ప్రారంభమైనది. ఈసారి నిజాం మహారాష్ట్ర, ఆంగ్ల త్రిపక్ష కూటమిని రూపొందించి టిప్పుసుల్తాను 1792లో శ్రీరంగ పట్టణ సంధికి ఒప్పుకోక తప్పలేదు. దాదాపుగా సగం రాజ్యాన్ని ఆంగ్లేయులకు వదిలివేయలేక తప్పలేదు. మూడవ ఆంగ్లో– మైసూరు యుద్ధం టిప్పుసుల్తాన్ ప్రాభవాన్ని దక్షిణ భారతదేశంలో దాదాపుగా నిర్మూలించడమే కాకుండా బ్రిటీష్ కంపెనీ తన ఆధిక్యతను ప్రదర్శించింది.

ఇదే సమయానికి ఐరోపాలో ఆంగ్లో – ఫ్రెంచి సంఘర్షణ ప్రారంభం అయింది. దీనిని అవకాశంగా తీసుకొని ఫ్రెంచి వారి సహాయంతో బ్రిటీష్‌వారిని వెళ్ళగొట్టడానికి ఆరేబియా, కాబూల్, కానిస్టాంట్ నోబుల్, ఫ్రాన్స్ పాలకులతో సంప్రదింపులు ప్రారభించాడు. మైసూర్ సంస్థానం సైనిక సహకార పద్ధతి నుంచి విడిపోతున్నది అని కూడా చెప్పాడు. ఫ్రెంచి సహాయంతో టిప్పుసుల్తాన్‌ను బాగా బలపడినాడని ఇంగ్లీషు వారికి అర్థమయింది. అంతిమంగా టిప్పుసుల్తానును

నిర్మూలించడానికి మైసూరు సంస్థానంపై యుద్ధం ప్రకటించెను. ఈ యుద్ధం (1798 మే 4)న టిప్పుసుల్తాన్ మరణించాడు. టిప్పు రాజ్యమును దోచుకోవడమే కాకుండా, ఇంగ్లీషు సైనికులు గృహాల మీద కూడా దోపిడీలు కొనసాగించారు. వెలస్లీ దీనిని గూర్చి ఈ విధంగా వ్రాశాడు. మే 4 రాత్రి "ఒక ఇల్లు కూడా వదలకుండా నగరమంతా దోచుకోబడింది. ఇండ్లకు చేరిన ప్రజలు తమ గృహాల్లో సమస్తం దోచుకున్నారని తెలుసుకొని విలపించారు".

దీనితో ఇంగ్లీషు వారికి ముఖ్యమైన రాజ్యంగా మైసూరు మారిపోయింది. మైసూరు సంస్థానంపై వెలస్లీ చూసినా పరిష్కారం కంపెనీకి విశాల ప్రాంతాలను చేర్చటమే కాక ఆర్థిక, వ్యాపార సైనిక సంబంధమైన లాభాలు ఎన్నో కలిగాయి. కంపెనీ రాజ్యాన్ని తూర్పు పశ్చిమ సముద్రాల మధ్య దక్కని పీఠభూమి మొత్తం వ్యాపించెను. అంతేకాక ఫ్రెంచి వారి ప్రాభవాన్ని ఇంగ్లీషువారు దక్షిణ భారతదేశంలో పూర్తిగా తొలగించారు.

హైదరాలీ, టిప్పు సుల్తాన్‌లు బ్రిటీష్ వారి నుండి మైసూర సంస్థానానికి కలుగబోయే ప్రమాదం ముందుగానే పసిగట్టారు. మైసూరు సంస్థానానికి బ్రిటీష్ వారిని దూరంగా ఉంచడానికి స్వదేశీ, ఫ్రాన్స్ దేశాల సైన్యం సహాయం తీసుకోవడానికి వెనుకాడలేదు. టిప్పుసుల్తాను సైన్య సహకార పద్ధతిలో చేరడానికి నిరాకరించడమేకాక బ్రిటీష్‌వారితో చివరిదాకా పోరాడారు.

## 51.10 ఆంగ్లో – మరాఠా సంబంధాలు :

పశ్చిమ, మధ్య భారతదేశంలో బ్రిటీష్ ఆధిక్యత పెరగడాన్ని తీవ్రంగా వ్యతిరేకించింది మహారాష్ట్రులే. మొగలు సామ్రాజ్యాన్ని మహారాష్ట్రులు ఏ విధంగా భయపెట్టింది, మీరు చదివే ఉన్నారు. మహారాష్ట్రులకు – బ్రిటీష్ వారికి మధ్య నిరంతర అంతర్గత సంఘర్షణల వలన మహారాష్ట్రులు కొద్దిగా బలహీనపడ్డారు. శివాజీ మనవడు సాహు, అతని పినతల్లి తారాబాయికి మధ్య అంతర్‌యుద్ధం ప్రారంభమయింది. తారాబాయి తన కొడుకు రెండవ శివాజీ అని మహారాష్ట్రుల మధ్య అంతర్గత విభేదాలు ఏర్పడి విభజనను తెచ్చారు. దీని ప్రభావం మహారాష్ట్రుల రాజకీయాలలో పీష్వా ఆధిక్యతపైన కూడా పడింది. బాలాజీ విశ్వనాథ్, సాహూను పీష్వాగా వ్యవహరించడమే కాకుండా మహారాష్ట్ర పాలకులకు కేంద్ర బిందువుగా మారెను. మహారాష్ట్రలో చత్రపతి నామమాత్ర పాలకుడు మాత్రమే. బాలాజీ విశ్వనాద్ కుమారుడు మొదటి బాజీరావ్ మహారాష్ట్రుల రాజ్యానికి అనేక ప్రాంతాలను చేర్చాడు. మహారాష్ట్ర రాజ్యంలో ఉత్తరాన మాల్వా, గుజరాత్, బుంధేల్‌ఖండ్ మొదలైన ప్రాంతాలు అంతర్భాగాలు అయ్యాయి. క్రీ.శ. 1740లో పీష్వా పదవి వంశపారంపర్యమైనది. మహారాష్ట్ర సంస్థానాధిశులులల్లో, గైక్వార్, హోల్కార్, సింధియా, బాన్‌స్లేలు వేర్వేరు ప్రాంతాలలో తమ బలాన్ని పెంచుకున్నారు. మొదటి బాజీరావ్ కుమారుడు బాలాజీ బాజీరావ్ పీష్వా అయ్యాడు. ఇతని నాయకత్వంలో మహారాష్ట్రులు ఒరిస్సాని తమ ఆధీనం చెయ్యాలని బెంగాల్ నవాబు మీద ఒత్తిడి తీసుకొని రాగలిగారు. ఇతని చిన్న ప్రాంతాలు మహారాష్ట్రులకు కప్పం కట్టడానికి ఒప్పుకున్నాయి. హైదరాబాద్ నిజాం కూడా పశ్చిమ హైదరాబాద్ ప్రాంతాలను మహారాష్ట్రులకు ఇవ్వక తప్పలేదు. ఢిల్లీలోని మొగలుల రాజకీయాలలో మహారాష్ట్రులు మొగలు వారసులను నిర్ణయించడంలో కీలకపాత్ర వహించారు.

క్రీ.శ. 1761లో ఆఫ్ఘన్ పాలకుడు మహారాష్ట్రులను ఓడించడానికి రావటంతో మహారాష్ట్రుల అధికార దాహానికి తొలి దెబ్బ తగిలింది. అబ్దాలీ మహారాష్ట్ర ప్రతినిధిని పంజాబ్ రాజకీయాల నుంచి నెట్టివేయడమే కాకుండా, మహారాష్ట్రులలో

వైరంపూని మొగల్సుకు ఉత్తరభారతదేశంలో ఎవరి సహాయం దక్కనీయకుండా నిరోధించగలిగాడు. క్రీ.శ. 1761లో మూడో పానిపట్టు యుద్ధంలో అబ్దాలీ చేతిలో ఓడిపోయారు. ఈ ఓటమి మహారాష్ట్ర ప్రతిష్టను అధికారాన్ని సంపూర్ణంగా నిర్మూలించింది. అంతేకాక బెంగాల్‌లో, దక్షిణ భారతదేశంలో ఇంగ్లీషువారు తమ అధికారాన్ని, సుస్థిరం చేసుకోవడానికి ఉపయోగపడెను.

పీష్వా, మాధవరావు కొంతవరకు పూర్వ వైభవంను సంపాదించి పెట్టగలిగినప్పటికీ క్రీ.శ. 1772లో అతడు ఆకస్మికంగా మరణించాడు. దీనివలన మహారాష్ట్ర రాజ కుటుంబాలలో గందరగోళం ఏర్పడింది. ఇదే సమయంలో మహారాష్ట్ర నాయకుల్లో వచ్చిన రెండవ తరం నాయకులు అధికార స్థాపన కోసం అర్రులు చాచటం మొదలుపెట్టారు. మహారాష్ట్ర నాయకులు స్వయంగా తమ సంస్థానాలను విస్తరించడానికి ప్రయత్నించారు. ఈ కారణమే అంతర్గత విభేదాలకు, ఇతర స్వదేశీ సంస్థానాధీశులకు, బ్రిటీష్‌వారి మధ్య సంఘర్షణకు దారితీసింది. బాలాజీ బాజీరావ్ తమ్ముడు రఘునాద్ రావుకు, నారాయణరావుకు, అతని సోదరులైన మాధవరావుకు తీవ్రమైన అభిప్రాయ భేదాలు మొదలైనాయి. నారాయణరావు క్రీ.శ. 1773లో చంపబడ్డాడు. మాధవరావు పీష్వాగా ప్రకటించబడ్డాడు.

## మొదటి ఆంగ్లో - మరాఠా యుద్ధం (క్రీ.శ. 1776-82)

మహారాష్ట్ర అంతఃకలహాలే మొదటి ఆంగ్లో మహారాష్ట్ర యుద్ధానికి కారణం. రఘునాద్‌రావ్, మాధవరావ్‌కు వ్యతిరేకంగా బ్రిటిష్‌వారి బలంను సంపాదించి మాధవరావుకు వ్యతిరేకంగా అతని మద్దతుదారులైన నానా పడ్నిస్‌ను ధిక్కరించాడు. ఈ యుద్ధం ఇంగ్లీషు వారికి సుదీర్ఘ యుద్ధంగా పరిగణించి క్రీ.శ. 1882 మేలో సాల్భే సంధితో ముగిసింది. దీని ప్రకారం ఇద్దరూ తమ తమ సరిహద్దులను గుర్తించి, ఇంగ్లీషు, మహారాష్ట్రుల మధ్య 20 సంవత్సరాలు శాంతిని స్థాపించగలిగింది. దీంతో కంపెనీ మైసూర్ వ్యవహారాన్ని చక్కబెట్టుకోగలిగింది.

## రెండో ఆంగ్లో- మరాఠా యుద్ధం : (క్రీ.శ. 1798-1805):

సామ్రాజ్యవాది పాలన అయిన వెలస్లీ సైన్య సహకార పద్ధతి ద్వారా అనేక భారత సంస్థానాలను తన ఆధీనంలోక తేగలగడమేకాక, ఫ్రెంచి ప్రమాదం నుంచి భారతదేశంలోని బ్రిటీష్ సామ్రాజ్యాన్ని కాపాడగలిగాడు. కొత్త ప్రాంతాలు కూడా ఈ విధానం ద్వారా ఆక్రమించబడ్డాయి. బ్రిటీష్‌వారి ఆధీనంలోని అతి పెద్దదైన ఒకే ఒక ప్రాంతం మహారాష్ట్ర సంస్థానమే. ప్రముఖులైన మరాఠా నాయకులు క్రీ.శ. 1800 సంవత్సరాలకే చనిపోయారు. మహారాష్ట్ర సర్దారులు ఘర్షణ పడడంలో మునిగిపోయారు. ఈ క్రమంలో దౌలత్‌రావ్ సింధియా, పీష్వా బాజీరావు-2ల సమిష్టి సైన్యాన్ని యశ్వంతరావ్, హోల్కార్‌లు ఓడించాడు. పీష్వా రెండవ బాజీరావ్ సైన్య సహకార పద్ధతిలో చేరటమే కాకుండా భేసిన్ సంధిని క్రీ.శ. 1802 డిసెంబరులో చేసుకున్నాడు. ఇదే సమయంలో సింధియా బాన్‌స్లేలు వెలస్లీ చేతిలో క్రీ.శ. 1803 సెప్టెంబరులో ఓడించబడి సైన్య సహకార పద్ధతిలో చేరటమే కాక వారి రాజ్యాల నుంచి చాలా భూభాగాలు ఇచ్చివేశారు. క్రీ.శ. 1806లో సుదీర్ఘ పోరాటం తర్వాత కంపెనీ హోల్కారుతో సంధి చేసుకున్నది.

## మూడవ ఆంగ్లో - మరాఠా యుద్ధం : (క్రీ.శ. 1817):

1817 సంవత్సరంలో పీష్వా నాయకత్వంలో భాన్‌స్లే - హోల్కాలు పూర్వపు స్వతంత్ర ప్రతిపత్తిని సంపాదించడానికి చివరి ప్రయత్నం చేసి బ్రిటీష్ వారి చేతుల్లో ఓడిపోయారు. సింధియా, హోల్కాలు, భాన్‌స్లేలు బ్రిటీష్ సార్వభౌమాధికారాన్ని అంగీకరించక తప్పలేదు. మహారాష్ట్రుల ఆధీనంలో ఉన్న రాజ్యపుత్ర సంస్థానాలను బ్రిటీష్‌వారి ఆధిక్యతను తక్షణమే

అంగీకరించాయి. ఈ విధంగా పంజాబ్ మరియు సింధూ తప్ప మిగిలిన భారత ఉపఖండం అంతా క్రీ.శ. 1818 నాటికి బ్రిటీష్ ప్రత్యక్ష బ్రిటీష్ పాలనకు లోనుగాక మిగిలిన ఇతర భాగాలు బ్రిటీష్‌వారి పరోక్ష నియంత్రణలో భారతపాలకలు పరిపాలించసాగారు. మొత్తం భారతదేశాన్ని 1818–1857 సంవత్సరాల మధ్య బ్రిటీష్‌వారు ఆక్రమించడంలో సఫలీకృతులయ్యారు. సింధు, పంజాబ్ ఆ తర్వాత జయించబడి అయోధ్య మధ్య రాష్ట్రాలు సంపూర్ణంగా ఆక్రమించబడ్డాయి.

## 51.11 సింధూ :

ఆంగ్లేయులకు, రష్యన్‌లకు ఐరోపా ఆసియా ఖండాలలో ఉన్న వైరుధ్యాల వలన రష్యా, ఆఫ్ఘనిస్తాన్ లేక పరిష్యల మీదుగా ఇండియాలోని బ్రిటిష్ సామ్రాజ్యంపై దండయాత్ర చేస్తున్న అనుమానమే బ్రిటీష్ వారు సింధుని ఆక్రమించడానికి కారణమైంది. క్రీ.శ. 1832 సంధి ప్రకారం సింధులోని రోడ్ల, నదులు, బ్రిటీష్ వారి వర్తక వ్యాపారానికి అనుమతింపబడ్డాయి. కాని తర్వాత వచ్చిన సింధు పాలకులు అనుబంధ సంధి చేయాలని క్రీ.శ. 1839లో డిమాండు చేశారు. సింధు పాలకుడు అమేర్‌కు ఏకారణం చెప్పకుండానే సింధుని బ్రిటీష్‌వారు క్రీ.వ. 1843లో ఆక్రమించారు. "ఆ విధంగా చేయకపోతే సింధుపైన మనకు ఏ హక్కు ఉండేది కాదు" అని సింధును జయించిన చార్లెస్ నేపియర్ వ్యాఖ్యానించారు. మొదటి ఆఫ్ఘన్ యుద్ధానికి సింధు ఆక్రమణే ప్రధాన కారణమయింది. సింధు ఆక్రమణవల్ల ఆఫ్ఘనిస్తాన్ ఆక్రమించుటకు తేలికయింది.

## 51.12 సిక్కులు :

సిక్కులు ప్రారంభం ఖాల్సా సైన్యం రూపొందించడాన్ని గూర్చి ఇంతకు ముందే మీరు చదివి ఉంటారు. గురుగోవింద్‌సింగ్ మరణంతో సిక్కు నాయకత్వం బంధా బహుదూర్ చేతుల్లోకి వచ్చింది. ఈయన మొగలులతో క్రీ.శ. 1717లో మరణించేదాకా నిరంతర యుద్ధాలు కొనసాగించాడు. ఆ తర్వాత సిక్కుల అధికారం పతనం కావటం ప్రారంభమైనది. మొగలులు అధికార బలహీనత మరియు అహ్మద్‌షా అబాలీ ఆఫ్ఘాన్ దండయాత్ర పంజాబ్, జమ్మూలో అరాచక స్థితి నెలకొన్నది. పంజాబ్ 12 మంది సిక్కు మిజిల్స్ (ప్రజాస్వామిక సైనిక స్నేహ బంధం) సమానత్వ ప్రాతిపదికపై ఏర్పడింది. నాయకుడుని ఎన్నుకోవడంలో నిర్ణయం చేయడంలో అందరికి సమాన భాగస్వామ్యం ఉంటుంది. మొదట్లో ఈ ప్రజాస్వామిక ఏర్పాట్లు బాగా పనిచేసింది. తర్వాత కాలంలో సుకర్‌చౌకియా మిజిల్‌ని పాలించిన రంజిత్‌సింగ్ (క్రీ.శ. 1780–1839) సట్లజ్ నదికి పశ్చిమాన ఉన్న మిజిల్స్‌ను తన ఆధీనంలోకి తెచ్చి పంజాబ్ రాజ్యం ఏర్పాటు చేశాడు. ఈ రాజ్యం బలంగా వున్న, బ్రిటీష్ వారి ముందు సరితూగదని రంజిత్‌సింగ్ గ్రహించాడు. అందుచేతనే క్రీ.శ. 1809లో బ్రిటీష్ వారితో అమృత్‌సర్ సంధిని చేసుకొని, సట్లజ్‌నది తన రాజ్యానికి సరిహద్దుగా అంగీకరించాడు. ఈ విధంగా సట్లజ్‌కు తూర్పున వున్న సిక్కు రాజ్యాన్ని జయించాలనే కాంక్షను వదిలేశాడు.

### మొదటి, రెండో సిక్కు యుద్ధాలు :

క్రీ.శ. 1839లో మహారాజ రంజిత్‌సింగ్ మరణించడంతో పంజాబ్‌ను రాజకీయ అనిశ్చితి పరిస్థితి ఏర్పడి పంజాబ్ ప్రభుత్వాన్ని వేగంగా మార్చివేసెను. సిక్కు సైన్యం రాజ్య అధికారం మొత్తాన్ని హస్తగతం చేసుకున్నది. ప్రభుత్వ సభ్యులు, ముఖ్య నాయకులు సైన్యం యొక్క అధికారం తగ్గించాలంటే బ్రిటీష్‌వారితో యుద్ధం సరియైన మార్గంగా గుర్తించాడు. సిక్కు సైన్యం బ్రిటీష్‌వారితో ధైర్యంగా క్రీ.శ. 1845లో పోరాడెను. సిక్కు సైన్యాధిపతుల కుట్రచేత బ్రిటీష్

వారి చేతిలో ఓడిపోయింది. అంతేగాక అవమానకరంగా లాహోర్ సంధికి క్రీ.శ. 1846లో ఆమోదించి పంజాబ్‌ను బ్రిటీష్ సంరక్షణకు అప్పగించి దిలిప్‌సింగ్‌ను (రంజిత్‌సింగ్ కొడుకు) సింహాసనంపై ఉంచారు. 5 మిలియన్ల డబ్బును లంచంగా ఇచ్చి గులాబ్‌సింగ్ జమ్మూ కాశ్మీర్ మహారాజ్ అయ్యాడు. వీటికి బ్రిటీష్ ప్రభుత్వ ప్రతినిధి వాస్తవ పాలకుడైనాడు. ఆ విధంగా మొదటి ఆంగ్లో సిక్కు యుద్ధం ముగిసింది.

రెండవ ఆంగ్లో సిక్కు యుద్ధం క్రీ.శ. 1848లో మొదలైంది. స్వేచ్ఛాకాముకులైన సిక్కులు బ్రిటీష్ సామ్రాజ్యం కూలద్రోయడానికి స్థానిక తిరుగుబాట్లు లేపారు. కాని క్రీ.శ. 1849లో డల్హౌసీ కాలానికి ఈ తిరుగుబాట్లు అణిచివేయబడి పంజాబ్‌ని శాశ్వతంగా డల్హౌసీ ఆక్రమించాడు. ఈ విధంగా ఉత్తర వాయువ్య ప్రాంతంలో రంజిత్‌సింగ్‌చే నిర్మింపబడ్డ, శక్తివంతమైన సిక్కు రాజ్యం అంతరించింది.

మహారాజ రంజిత్‌సింగ్ నాయకత్వంలో బలమైన సిక్కు రాజ్యం స్థాపించబడింది. వీరి అధికారం సట్లజ్‌నదికి పశ్చిమవైపు పరిమితం చేయబడింది. క్రీ.శ. 1845లో సిక్కు సైన్యము బ్రిటీష్ వారితో ఘర్షణ పడి ఓడిపోయింది. లాహోర్ సంధి ద్వారా సిక్కు రాజ్యం బ్రిటీష్ ఆధీనంలోకి వెళ్ళింది. క్రీ.శ. 1848లో డల్హౌసి పంజాబ్‌ను బ్రిటీష్ సామ్రాజ్యంలో భాగంగా విలీనం చేశాడు.

## పాఠ్య ప్రశ్నలు 51 బి

1. భారతదేశం చరిత్రలో ప్లాసీ యుద్ధం ఎందుకు ప్రాధాన్యత వహించింది?
2. అలహాబాద్ సంధి నుంచి బ్రిటీష్ వారు ఎలాటి ఆర్థిక లాభం పొందినారు?
3. అయోధ్యను డల్హౌసీ తన సామ్రాజ్యంలో ఎందుకు కలుపుకొనెనో వివరించండి.
4. టిప్పు సుల్తాను బ్రిటీష్‌వారితో యుద్ధానికి తలపడినపుడు ఏ విదేశశక్తి సాయం కోరాడు?
5. మూడవ పానిపట్టు యుద్ధ ప్రభావము

   ఎ) మహారాష్ట్ర, బి) బ్రిటీష్ వారి మీద ఎలా ఉన్నది.
6. 18వశతాబ్ది మధ్యలో సిక్కుల పరిపాలన ఎవరి క్రింద ఏ విధంగా బలంగా మారెను.

సెక్షన్ – 3

## నేపాల్, బర్మా, ఆఫ్ఘనిస్తాన్, సిక్కిం, భూటాన్‌లలో బ్రిటీష్ విధానం

ఇండియా రాజ్యాలను జయించిన తర్వాత బ్రిటీష్ వారు సరిహద్దుల కోసం తమ దృష్టిని మరల్చినారు. దీనికి ప్రధాన కారణం :

ఎ) మరింత ప్రాంతాన్ని ఆక్రమించడం

బి) బ్రిటిష్ సరుకులకు మరింత మార్కెట్టు సంపాదించం.

సి) ఇతర ఐరోపా రాజ్యాలను ఇండియాపైకి రాకుండా బ్రిటన్ కాపాడుకోవడం.

బ్రిటన్ తన అవసరాలను దృష్టిలో పెట్టుకొని పొరుగు రాజ్యాలతో సంబంధాలను ఏర్పాటుచేసుకొనెను. కొన్ని దేశాలతో సంఘర్షణకు దిగెను. నేపాల్, బర్మా, ఆఫ్ఘనిస్తాన్, సిక్కిం మరియు భూటాన్‌లతో బ్రిటన్ సంఘర్షణలను క్లుప్తంగా చర్చిద్దాం:

### 51.13 నేపాల్ :

భారతదేశంలో బ్రిటీష్ రాజ్యానికి సహజ భౌగోళిక సరిహద్దును నిర్ణయించాలని ఉద్దేశ్యమే నేపాల్‌యుద్ధానికి కారణం. (1814–16) నేపాల్‌లోని గూర్ఖాలు 1816లో జరిగిన యుద్ధంలో బ్రిటీష్ వారిని సాహసంగా నిరోధించిన నేపాల్ సగౌళీ సంధిని అంగీకరించక తప్పలేదు. ఈ సంధిని అంగీకరించడమంటే నేపాల్

1. బ్రిటన్ పరిధిని మళ్ళీ రాజ్యంలోకి అనుమతించాలి. గర్భాల్, కౌమాద్, కుమారన్ (సిమ్లా, ముసోరి, నైనిటాల్ ప్రముఖ వేసవి విడుదలుగా పేరుగాంచాయి).

ప్రాంతాలను బ్రిటీష్ వారికి ఇచ్చివేయాలి. సిక్కులతో సంబంధాలను వెనుకకు తీసుకోవాలి. దీనితోపాటు బ్రిటీష్ వారు నేపాల్‌లో సంబంధాలు కొనసాగించారు. గూర్ఖాలు బ్రిటీష్ సైన్యానికి నమ్మకమైన సైనికులు అయ్యారు. బ్రిటీష్ సామ్రాజ్యం ఇపుడు హిమాలయాల దాకా వ్యాపించింది.

### 51.14 బర్మా :

19వ శతాబ్దంలో స్వంతంత్ర బర్మా రాజ్యాన్ని మూడువరుస యుద్ధాలతో బ్రిటిష్ వారు జయించారు. దీనికి కారణం బ్రిటీష్ వారు తమ రాజ్యాన్ని బర్మా వరకు వ్యాప్తి చేయాలని అంతేగాక వారి వ్యాపారాన్ని బర్మాలో నిర్వహించాలని మొదటి (బర్మా యుద్ధం 1824–26) ఈ యుద్ధానికి కారణం కొంతవరకు సరిహద్దు తగాదాలు మరి కొంతవరకు వాస్తవానికి బర్మా బ్రిటీష్ వారితో వ్యాపార ఒప్పందానికి అంగీకరించకపోవడం. యాండబు సంధి ద్వారా యుద్ధం ఆగింది. (1826 ఫిబ్రవరి) యుద్ధ నష్టపరిహారంగ ఆకోటి రూపాయలు చెల్లించడం ఆర్కాన్ మరియు టెనాగరిన్ జిల్లాలను బర్మా బ్రిటీష్ వారికి ఇచ్చివేయడం తూర్పు, ఉత్తర ప్రాంతంలోగాని అస్సాంలోగాని బర్మాకు ఎటువంటి హక్కులు లేకుండా రద్దుచేయడం బర్మా కోస్తా ప్రాంతాన్ని బ్రిటీష్‌వారు భవిష్యత్తులో బలమైన స్థావరంగా

రూపొందించుకోగలిగింది. అంతేగాక బర్మా బ్రిటీష్ ప్రభుత్వ ప్రతినిధిని ఆవలో ఉంచడానికి బ్రిటన్‌తో వ్యాపారానికి ఒప్పుకున్నది.

### రెండో బర్మా యుద్ధం క్రీ.శ. (1852) :

బ్రిటీష్ వారి దురాశాపూరితమై వ్యాపార అవసరాలే యుద్ధానికి కారణం. బర్మాలోఇ దట్టమైన అడవులలో పెరిఏ కలప, వెదురు బ్రిటిష్ వారిని ఆకర్షించింది. అంతేకాక బ్రిటీష్ వారి వర్తక వ్యాపారాలు బర్మాలో కూడా లాభాలు సంపాదించాలనుకున్నారు. కాని బర్మా ప్రభత్వం బ్రిటీష్ వారి వ్యాపార సంబంధాలను బర్మాలో కనొసాగించడాన్ని తోసిపుచ్చింది. సామ్రాజ్యవాది డల్హౌసి బ్రిటీష్ సామ్రాజ్యాన్ని ప్రతిష్టగా భావించి బర్మాను ఆఫ్ఘనిస్తాన్‌కు సంకల్పించింది. బర్మాలో బ్రిటీష్ ఆంక్షలను బ్రిటీష్ ప్రతిష్టగా తీసుకొని అవకాశం కోసం ఎదురుచూశారు. ఇద్దరు బ్రిటీష్ సముద్రపు కెప్టెన్లు రంగును గవర్నర్‌కు ఇచ్చిన చిన్న ఫిర్యాదుల ఆధారంగా (వేయి రూపాయల జరిమాన) పూర్తి యుద్ధం ప్రారంభమైనది. బ్రిటీష్ వారు తమకు తామే ఉన్నత జాతిగా భావించి వారి వ్యాపారం బర్మావైపు తక్కువ ప్రాంతంలో సైతము విస్తరింపచేయటం తమ హక్కుగా భావించారు. రంగూనును గవర్నర్‌ను సంప్రదించకుండానే బర్తరఫ్ చేయమని బ్రిటీష్ వారు ఆదేశించారు. బ్రిటీష్ సైనిక శక్తికి భయపడి బ్రిటీష్ అధికార ప్రతినిధిని రంగూన్‌లో ఉంచుకోవటానికి అంగీకరించింది. దీనితోపాటు నష్టపరిహారాన్ని చెల్లించడానికి కూడా అంగీకరించింది. బర్మాలో అధికార స్థాపనే బ్రిటీష్‌వారి ధ్యేయం కనుక వెంటన కొత్త రిమాండులు కూడా బర్మాముందు ఉంచింది. అవి బర్మా ప్రభుత్వానికి అంగీకారంగా లేవు. దీనితో బ్రిటీష్ సైన్యాలు బర్మాపై దాడి చేసి రంగూన్, బేసిన్ ప్రొమ్‌లపై బ్రిటీష్ సైన్యం దారి చేసింది. పెగూ ఆక్రమించుకోవడం ద్వారా పూర్తి బర్మా కోస్తా ప్రాంతాన్ని సముద్ర వ్యాపారాన్ని తన హస్తగతం చేసుకున్నది.

మూడో బర్మా యుద్ధం క్రీ.శ. 1885 : రెండవ బర్మా యుద్ధంలో దొరికిన లాభాలతో బ్రిటీష్ వారికి ఆశ తీరలేదు. ఉత్తర బర్మా ద్వారా చైనాలో వ్యాపారానికి బ్రిటీష్ వ్యాపార వర్గాలు దురాశతో ఆలోచింపసాగారు. క్రీ.శ. 1862లో బర్మాలోనే తయారయ్యే వస్తువులపై బర్మా కొనే ఏకస్వామ్య హక్కునే తొలగించమని బ్రిటన్ ఒత్తిడి తెచ్చింది. ఈ సమయంలోనే బర్మా ప్రభుత్వం ఫ్రాన్స్‌తో ఒప్పందానికి సిద్ధమైనది. క్రీ.వ. 1885లో కొత్తగా రాజైన థైన్ ఫ్రాన్స్‌తో కొత్త వ్యాపార వర్తకానికి సంతకం చేశాడు. ఇండో-చైనా వియత్నాం, థాయిలాండ్, అప్పటికే పై జేయిగా ఉన్న ఫ్రాన్స్ బర్మాతో ఒప్పందం చేసుకోవటానికి దానిని బ్రిటీష్‌వారు ఒప్పుకోలేదు. ఈ విధంగా బర్మాను ఒకసారిగా ఆక్రమించడానికి అవకాశం కోసం ఎదురుచూసింది.

బాంబే బర్మా వర్త వ్యాపారం బర్మాటేకు అడవులను లీజుకు తీసుకున్న బ్రిటీష్ కంపెనీ బర్మా ప్రభుత్వం దగ్గర నుండి ఒప్పందాన్ని మించి ఉద్యోగులకు లంచం ఇవ్వడం ద్వారా టేకును అదనంగా సేకరించడంలో అటువంటి యుద్ధము చేసేటటువంటి అవకాశం వచ్చింది. బర్మా ప్రభుత్వం దీనికి నష్టపరిహారం చెల్లించమని డిమాండ్ చేసింది. దీనికి ప్రతిగా ఆమోదించవీలులేనట్టి డిమాండ్లను బ్రిటన్ కూడా తక్షణమే విడుదల చేసింది. వీటిలో కొన్ని బర్మా విదేశాంగ విధానం, భారత వైస్రాయ్ చేతిలో ఉండాలి. 13 నవంబరు 1885లో యుద్ధం మొదలైంది. బర్మాను ఇంగ్లీషు వారు చాలా తేలికగా క్రీ.శ. 1885లో జయించగలిగారు. 1935 సంవత్సరం వరకు బ్రిటీష్ ఇండియన్ సామ్రాజ్యంలో భాగంగా బర్మా ఉండిపోయింది. క్రీ.శ. 1948 జనవరిన బర్మా స్వాతంత్ర్యం సంపాదించుకున్నది.

బర్మా దండయాత్రను కేవలం బ్రిటీష్ వారి సామ్రాజ్యవాద ఫలితమే. వ్యాపార, రాజకీయ అధికార స్థాపనే బ్రిటీష్ వారి ధ్యేయం. బర్మా జయించడానికి కేవలం అబద్ధ పూరితమైన వాదనలే బ్రిటన్ ఉపయోగించింది.

## 51.15 ఆఫ్ఘనిస్తాన్ :

ఆసియా ఖండంలోని ఆంగ్లో-రష్యా విరోధమే ఇండియాలో ఆంగ్లో-ఆఫ్ఘన్ సంబంధాలకు ముడిపడి ఉన్నాయి. 19వ శతాబ్దాం నుంచి రష్యా, ఆఫ్ఘనిస్తాన్ మీదుగా దండయాత్ర చేస్తున్నదని ఇండియాలో బ్రిటీష్ పాలకులు భయపడ్డారు. ఆఫ్ఘనిస్తాన్ ఇండియాకు ఉత్తర, వాయువ్య సరిహద్దు, బ్రిటీష్‌వారికి రష్యా వారికి మధ్య ఆసియా ప్రాంతంలో ఉన్న వ్యాపార శత్రుత్వం ఈ యుద్ధానికి మరొక కారణం. రష్యాను నిరోధించి బ్రిటీష్ వ్యాపార అవసరాలను రక్షిండానికి ఆఫ్ఘనిస్తాన్ వ్యూహాత్మక స్థానంలో ఉండుటవలన బ్రిటన్ ఆఫ్ఘనిస్తాన్‌పై తన ప్రభావం చూపాలనుకున్నది. బ్రిటన్ ప్రభావంతో ఆఫ్ఘనిస్తాన్ బలహీనపరచాలని బ్రిటన్ భావించింది. కాని ఆఫ్ఘన్, ఆకూర్ అయిన దోస్త్ మహమ్మద్ సమర్థుడు, స్వతంత్ర దృక్పథం కలవాడు కావడంతో సమస్య జఠిలమైనది.

### మొదటి ఆఫ్ఘన్ యుందం :

బ్రిటన్ పక్షాన ఉండటానికి దోస్త్ మహమ్మద్ ఒప్పుకొన్నా బ్రిటీష్ వారి వ్యాపార రాజకీయ హారతులను అతడు అయిష్గత చూపాడు. దీనివలన దోస్త్ మహమ్మద్ రష్యావైపు దృష్టి సాగించాడు. దీనికి ప్రతిగా బ్రిటీష్ వారు అతని స్థానంలో బలహీనుడైన షాఘుజా ప్రతిష్టించాలని భావించాడు. 1838 త్రిపక్ష ఒప్పందం లాహోర్‌లో ఒప్పదం చేసుకుంది. దానిలో భారత ప్రభుత్వం మహారాజ రంజిత్‌సింగ్ షాఘుజా భాగస్వామ్యం. ఈ సంధి ద్వారా దోస్త్ మహమ్మద్‌ను ఆఫ్ఘన్, అమెరికా తప్పించి షాఘుజాను పాలకుడుగా నిర్మించడం ముఖ్య ఉద్దేశ్యం. దానికి ప్రతి ఫలంగా షాఘుజా ఇండియా, పంజాబ్ ప్రభుత్వాలలో నిమిత్తం లేకుండా బ్రిటీష్ వారితో చర్చలకు అంగీకరించాడు. 1839లో కాబూల్ ఆక్రమం తర్వాత ఆఫ్ఘనిస్తాన్‌పై షాఘుజాను కొత్త పాలకుడుగా నిర్వహించబడ్డాడు. అయితే ఆఫ్ఘన్ ప్రజలు బ్రిటీష్ విదేశీ పాలనా దేశంపై రుద్దడానికి ప్రయత్నించిన షాఘుజాను ప్రజలు వ్యతిరేకించారు. ఆఫ్ఘన్ స్వేచ్ఛను కోరుకుఏవారు, దోస్త్ మమమ్మద్ పక్షాన నిలబెట్టారు. దోస్త్ మహమ్మద్ పట్టుబడి కలకత్తా ప్రాంతానికి పంపబడిన ఆఫ్ఘన్ ప్రజలు తిరుగుబాటు కొనసాగింది. డిసెంబరు 18, 1941న దోస్త్ మహ్మద్‌ను వెనుకకురప్పించి కొత్త సంధి చేసుకోక బ్రిటీష్ వారికి తప్పలేదు. బ్రిటీష్ సైనికులు తిరుగు ప్రయానంలో ఆఫ్ఘన్ ప్రజలు రాళ్ళు, తూటాలు కొండ అంచుల నుంచి వర్షాలుగా కురిపించడంతో 16 వేల బ్రిటీష్ సైనికులు మరణించారు.

ఒక్కరు మాత్రమే తప్పించుకొని, జలాలాబాద్ చేరుకొని జరిగిన నష్టం చెప్పాడు. ఆ విధంగా వాయువ్య సరిహద్దు ప్రాంతాన్ని ఆక్రమించాలని చివరకు ఏమి సాధించకుండానే విఫలమయింది.

### రెండో ఆఫ్ఘన్ యుద్ధం :

1885 నుండి ఆఫ్ఘన్ వ్యవహారాల్లో బ్రిటీష్ ప్రభుత్వం ఏ విధమైన జోక్యం కలిగించుకోలేదు. కాని 1870లో మధ్య ఆసియాపై రష్యా దండెత్తిపోతుంది అనే భయం బ్రిటీష్ వారికి కలిగింది. ఈ దండయాత్ర వల్ల ఇండియాలో బ్రిటీష్ సామ్రాజ్యానికి నష్టం కలుగుతుందని భావించి ఆఫ్ఘన్ పాలకుడైన షేర్ ఆలీని బ్రిటీష్ వారి బృందాన్ని కచ్చితంగా కాబూల్‌లో ఉంచి ఆఫ్ఘన్ విదేశీ వ్యవహారాలను నియంత్రించాలని ప్రయత్నించింది. షేర్ ఆలీ దీనిని వ్యతిరేకించడంతో

ఆఫ్ఘనిస్తాన్‌పై యుద్ధం మొదలైంది. ఆఫ్ఘనిస్తాన్‌ను ఓడించి బ్రిటీష్ షరతులను ఆమోదింపజేయడంలో సఫలీకృతమైనది. దానినే గంధమార్క్ మే 1879 సంధి అంటారు. బ్రిటన్‌లో వచ్చిన కొత్త ప్రభుత్వం ఆఫ్ఘన్ విధానం విఫలమైనదని అంగీకరించి ఆఫ్ఘనిస్తాన్ నుండి బ్రిటన్ నిష్క్రమించింది. అబ్దుల్ రహమాన్ (దోస్‌మహమ్మద్ మనవుడు) దండయాత్ర భయం నుంచి రక్షించుకోవడానికి సంవత్సరానికి కొంత మొత్తం ఇవ్వడానికి కూడా అంగీకరించింది. ఆఫ్ఘన్ పాలకుడు రాజకీయ సంబంధాలను బ్రిటన్‌లో మత్రమే కొనసాగించడానికి మాత్రమే ఇష్టపడ్డాడు.

**మూడో ఆఫ్ఘన్ యుద్ధం :**

మొదటి ప్రపంచ యుద్ధందాకా యధాస్థితి కొనసాగింది. అయితే తర్వాత సంవత్సరంలో అమానుల అనే కొత్త పాలకుడు నాయకత్వంలో ఆఫ్ఘన్ సంపూర్ణ స్వాతంత్ర్యం పొందారు. మొదటి ప్రపంచ యుద్ధం బ్రిటీష్ వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక భావాలను రేపగా, రష్యా విప్లవం ఆఫ్ఘన్ లోని సామ్రాజ్యవాద ఎత్తుగడలను నిలిపివేసింది. బ్రిటీష్ వారు కూడా ఆఫ్ఘనిస్తాన్‌కు పూర్తి స్వాతంత్ర్యాన్ని ఇస్తూ కొత్త సంధికి అంగీకరించక తప్పలేదు.

రష్యా సామ్రాజ్యవాదాన్ని మధ్య ఆసియాలో విస్తరించకుండా నిరోధించడానికి ఆఫ్ఘనిస్తాన్‌లో తన అధికారాన్ని స్థాపించాలని బ్రిటన్ భావించింది. అయినా స్వేచ్ఛా కాముకులైన ఆఫ్ఘన్ ప్రజలను లొంగదీయడం వారికి అర్థం కాలేదు. చివరకు ఆఫ్ఘనిస్తాన్ విషయంలో తన వాదనలన్నీ వెనుకకు తీసుకొని వారికి సంపూర్న స్వాతంత్ర్యం ఇవ్వడం తప్పలేదు.

## 51.16 టిబెట్, సిక్కిం, భూటాన్ :

బ్రిటన్, రష్యాలు రెండు పూర్తిగా బ్రిటన్‌తో సంబంధాలు పెట్టుకొనెను. ఇది ఎందుకనగా, వాణిజ్య రాజకీయ అవసరాలకు, బ్రిటన్ గనిలోని దొరికిన వస్తువులను టిబెట్ నుంచి పొందాలనే మరియు ఇండియాకు సరిహద్దుగా టిబెట్ ఉంటుందని తలంచెను. క్రీ.వ. 1904 మార్చితో లార్డ్ కర్జన్ మిలటరీ సేన్యంతో “లాసా” మీద దండెత్తెను. లాసా, టిబెట్ రాజధాని, టిబెట్ తేలికగా లొంగిపోయింది. టిబెట్ స్వేచ్ఛను పొంది అంతరంగిక సంబంధాలతో ఏ విదేశీయులు వచ్చినా టిబెట్ చేరుతానని వాగ్దానం చేసినప్పటికి రష్యా, టిబెట్‌కు కావలిగా ఉంచబడెను. చైనా వారి ప్రభావం పెరిగింది.

సిక్కిం నేపాల్‌కు దగ్గరగా ఉంది. ఇండియా అంచున టిబెట్ ఉన్నది. క్రీ.శ. 1861లో దీని గొప్పతనం తగ్గింది. క్రీ.శ. 1890లో ఆంగ్లో – చైనావారు ఒప్పందం మీద సంతకాలు పెట్టుట వలన సిక్కింకు బ్రిటీష్ వారి రక్షణ లభించి గుర్తింపు పొందింది.

బూటాన్ భారత ఉత్తర సరిహద్దులో సిక్కింకు తూర్పుగా ఉండి, 1865 నవంబరులో కలుపుకోబడెను. భారత దేశంలోని బ్రిటీష్ వారు ఒక చక్కని రక్షణాయుతంగా ఉన్న హద్దును మరియు బ్రిటీష్ పెంపకందారులకు ఉపయోగకరమైన టీతోటలను సంపాదించి పెట్టినారు.

## పాఠ్య ప్రశ్నలు 51. సి

1. పైన చెప్పబడిన పాఠ్యభాగంలో ప్రతి పొరుగు సంస్థాన అంతర్గత విషయాలను బ్రిటీష్‌వారి జోక్యం చదివి ఉన్నారు. ఈ దురాక్రమణ విధానానికి రెండు ప్రధాన కారణాలను వివరించండి?
2. రెండవ బర్మాయుద్ధం ఎందుకు జరిగింది?
3. బర్మా మరియు ఆఫ్ఘనిస్తాన్‌లు ఎపుడు స్వాతంత్ర్యం సంపాదించాయి?
3. ఆఫ్ఘనిస్తాన్‌లో బ్రిటీష్ విధానం ఎందుకు విజయవంతం కాలేకపోయింది.

**సంగ్రాహంగా :**

చాలా శతాబ్దాల నుంచి ఇండియా, పశ్చిమ దేశాల మధ్య వ్యాపారం జరుగుచుండెను. కానిస్టాంట్ నోపుల్ తప్పిపోయిన తర్వాత యూరోపియన్లు ఇండియా వచ్చుటకు కొత్త మార్గమును కనుగొనుట ప్రారంభించారు. పోర్చుగీసువారు మొదట ఇంఇయాలో వ్యాపార కేంద్రాన్ని ఏర్పాటుచేశారు. పోర్చుగీసువారి శక్తి తగ్గి స్పెయిన్‌వారి అధికారం ప్రారంభమయింది. డచ్చి, ఫ్రెంచి వారు ఆసియా వ్యాపారంలో ప్రవేశించారు. ఈస్ట్ ఇండియా కంపెనీ అన్ని యూరోపియన్ల కంపెనీల కన్న ఎక్కువ విజయాలు సాధించెను. ఇండియా, తూర్పు, పశ్చిమ తీర ప్రాంతాలలో ఎక్కువ ఫ్యాక్టరీలు స్థాపించెను. వీరు మొగలులు బెంగాల్ పాలకుల నుంచి ఫార్మనాస్ అందుకున్నారు. మొగలుల శక్తి అంతరించి ఈస్ట్ ఇండియా కంపెనీ విజయం సాధించెను. వీరికి రాజకీయ కాంక్ష ఏర్పడినది.

ఇంగ్లీషు వారి రాజకీయ కాంక్ష వలన ఫ్రెంచి వారు వీరికి ప్రత్యర్థులు అయినారు. ఫ్రెంచి వారి అధికారం కర్నాటక మరియు హైదరాబాద్‌లో బాగా పెరిగెను. ఇంగ్లీసువారికి ఫ్రెంచి వారికి జరిగిన మూడు కర్నాటక యుద్ధాలలో ఇంగ్లీషు వారు విజయం పొందారు. క్రీ.శ. 1763లో ఫ్రెంచి వారి అధికారం తగ్గింది. వారు బ్రిటీష్ వారిని ఎదుర్కొనలేకపోయినారు. బ్రిటీష్ వారు బెంగాల్ మీద దండెత్తి క్రీ.శ. 1757లో శిరాజ్ ఉద్దౌలాను ప్లాసీ యుద్ధంలో ఓడించెను. బాక్సార్ యుద్ధం వలన బ్రిటీష్‌వారు బెంగాల్, బీహార్, ఒరిస్సాలలో దివానీ అధికారం పొందినారు. వారు అనుకున్నట్లుగా బెంగాలీలో శిస్తులను వసువులు చేసే అర్హతను పొందినారు. బెంగాలులో ద్వంద్వ ప్రభుత్వమును రాబర్ట్ క్లైవ్ ప్రవేశపెట్టెను.

బ్రిటీష్ వారు దక్షిణ భారతదేశంలో మైసూరు వారి వ్యతిరేకంగా యుద్ధాలు చేసెను. హైదరాలీ, అతని కుమారుడు టిప్పుసుల్తానులు నిరంతరం బిటీష్ వారితో యుద్ధాలు చేసి సహాయక సంబంధాలు తిరస్కరించి, క్రీ.శ. 1799లో టిప్పుసుల్తాను చనిపోయెను. 4వ ఆంగ్లో–మైసూరు యుద్ధంలో మైసూరు సహాయక సంబంధాలకు వచ్చెను.

బ్రిటీష్‌వారి గొప్పతనాన్ని మహారాష్ట్రులు కూడా వ్యతిరేకించారు. పీష్వాల క్రింద మహారాష్ట్రులు బలమైన శక్తిగా మారినారు. మూడవ పానిపట్టు యుద్ధ సమయాన మహారాష్ట్రుల శక్తి నాశనం అయింది. దక్షిణ ఇండియా, బెంగాల్‌లో బ్రిటీష్‌వారు తమ అవకాశాల ద్వారా వారి స్థితిని సుస్థిర పరచుకున్నారు. అంతరంగిక యుద్ధాల ద్వారా మహారాష్ట్రుల సర్దారులు బలహీనులైనందుకు, బ్రిటీష్ వారు పశ్చాతాపపడ్డారు. బ్రిటీష్‌వారికి మహారాష్ట్రులకు మధ్య మూడు పెద్దయుద్ధాలు జరిగినాయి. మహారాష్ట్రులలో అనైక్యత ఉండటం వల్లనే వారు ఓడిపోయినారు.

బ్రిటీష్‌వారు సింధు మరియు పంజాబ్‌పై దండెత్తినారు. పంజాబ్ మహారాజు రంజిత్‌సింగ్ కాలంలో చాలా శక్తివంతంగా ఉంది. కాని అతని మరణం తర్వాత బ్రిటీష్ వారు సిక్కులతో చేసిన రెండు యుద్ధాలలో సిక్కులు ఓడిపోయారు.

తర్వాత బ్రిటీష్‌వారు తమ స్థితిని సుస్థిరపరుచుకొని, ఇండియా ఇరుగుపొరుగు దేశాలతో వ్యాపారాభివృద్ధిని, గొప్పతనాన్ని చాటుకున్నారు. క్రీ.శ. 1816లో నేపాల్ బ్రిటీష్ స్థావరాలను అంగీకరించి, క్రీ.వ. 1826లో బర్మా బ్రిటీష్ వారితో వాణిజ్య సంబంధాలు ఏర్పాటుచేసుకొనెను. బ్రిటీష్ వారు వ్యాపారం చేసుకొనుటకు బర్మా ప్రభుత్వం పూర్తిగా అంగీకరించెను. బ్రిటీష్‌వారు పద్ధతిలేని నిబంధనలను బర్మా వారి మీద మోపారు. క్రీ.శ. 1885లో బర్మా ఇండియా బ్రిటీష్ సామ్రాజ్యంలో కలిసినది.

ఆఫ్ఘనిస్తాన్ ద్వారా రష్యావారి గొప్పతనానికి బ్రిటీష్ వారు భయపడెను. బ్రిటీష్‌వారి ప్రభావం క్రింద ఆఫ్ఘనిస్తాన్ బలహీనం కావాలని బ్రిటీష్‌వారు కోరుకున్నారు. బ్రిటీష్ వారు ఆఫ్ఘనిస్తాన్‌తో సంబంధాలు ఏర్పరచుకొనటంవలన ఆఫ్ఘనిస్తాన్‌లో స్వేచ్ఛ, ప్రేమ కలిగెను. దీని ద్వారా ఆఫ్ఘనిస్తాన్ చక్రవర్తి షాసుజా సింహాసనం బలహీనం అయింది. బ్రిటీష్ వారు వెనుకనుంచి, దోస్త్ మహమ్మద్‌ను తీసుకొని వచ్చినారు. బ్రిటీష్ వారి సైన్యం వలన ఆఫ్ఘనిస్తాన్‌లో ఆఫ్ఘనిస్తాన్‌లు చంపబడినారు. క్రీ.శ. 1879లో బ్రిటీష్‌వారు ఆఫ్ఘనిస్తాన్‌లో స్థావరాలను ఏర్పరచుకున్నారు. అతడు 6 నెలలలో చంపబడినారు. మొదటి ప్రపంచ యుద్ధం తరువాత ఆఫ్ఘనిస్తాన్‌లో పూర్తి స్వేచ్ఛను బ్రిటీష్‌వారు మళ్ళీ స్థాపించారు.

**అదనపు ప్రశ్నలు**

100 మాటలతో జవాబులు రాయండి:

1. 1. క్రీ.శ. 15వ శతాబ్దంలో ఇండియాలో వ్యాపార రహదారుల ద్వారా ఫ్యాక్టరీలు ఎట్లు ప్రారంభించబడ్డాయి?
2. ప్లాసీ యుద్ధ కారణాలేవి?
3. అయోధ్యను డల్హౌసీ ఎట్లు కలుపుకున్నాడు? కలుపుకొనటానికి వెనుక ఉన్న ఉద్దేశ్యమేమి?
4. చార్లెస్ నేఫియర్ చెప్పిన “మనం సింధు మీద దండెత్తుటకు, ఇంకా మనం ఏమి చేయాలి” వివరించండి?
5. ఆఫ్ఘనిస్తాన్‌లో బ్రిటీష్ వారు రాజ్య స్థాపన చేయాలని ఎందుకు కోరుకున్నారు?

2. 1. భారతదేశంలో ఈస్ట్ ఇండియా కంపెనీ అభివృద్ధి చెందుటకు, వారు విజయం పొందుటకు గల కారణాలేవి?
2. బ్రిటీష్‌వారు బెంగాల్‌ను జయించారు. అది వారి ఉన్నతికి ఎలా దోహదపడిందో వివరింపుము?
3. బ్రిటీష్ వారు దక్షిణ భారతదేశంలో ఎంత అభివృద్ధిలో ఉన్నారు? హైదరాలీ టిప్పు సుల్తాన్‌ల ద్వారా మనం ఎంత రుజువు చేస్తాము?
4. మూడవ ఆంగ్లో-మరాఠా యుద్ధాల వలన ఆంగ్లో మరాఠా సంబంధాలను చర్చించండి.
5. బ్రిటీష్ వారు బర్మా మీద ఉన్న ముఖ్య ఆసక్తి ఏమిటి? ఎట్లు దానిని సంపాదించారు?
6. ఆఫ్ఘనిస్తాన్‌లో బ్రిటీష్‌వారు సామర్థ్యం లేకపోయినా ఎలా విజయం సాధించారు?

**కార్యక్రమాలు :**

కాల నిర్ణయాన్ని నీవు తప్పనిసరిగా తెలుసుకోవాలి. ఈ కాల నిర్ణయ సహాయంతో నీవు తేలికగా ముఖ్యమైన విషయాలను తెలుసుకుంటావు. ఈ కాల నిర్ణయం ఇతరులకు తెలియపరచుటకు అనుకూలంగా ఉంటుంది.

ఈ క్రింది ఢిల్లీ సుల్తాన్ యుగపు కాల నిర్ణయం ఇవ్వబడింది.




ఈ కాల నిర్ణయాన్ని జాగ్రత్తగా చదివితే సంవత్సరాలు క్రింది ఇవ్వబడినాయి. ఏ సంవత్సరాలలో ఏమి సంభవించినవో, ఏ కుట్రలు జరిగెనో కాల నిర్ణయంలో తెలుసుకుంటాం.

1600, 1707, 1757, 1764, 799, 1819, 1843, 1849, 1856.

**అదనపు సమాచారం**

**టిప్పుసుల్తాన్**

ఇండియాలో బ్రిటీష్ సామ్రాజ్య స్థాపనకు వ్యతిరేకంగా పోరాడిన గొప్ప గుణగణాలు కలవాడు టిప్పుసుల్తాను. ఇతనిని మైసూరు పులి అంటారు. ఇతడు బ్రిటీష్ వారి ఆధిపత్యం మీద యుద్ధం చేసెను. కాని భారతదేశ రాజులు అందుకు ఇష్టపడలేదు. బ్రిటీష్ వారు వ్యాపారులేకాదు. వారు దేశాన్ని జయిస్తారని టిప్పుసుల్తాను తెలుసుకొని, వారు ఇండియాకు ప్రమాదమని, వారిని ఎదిరించుటకు ఇండియాలోని పాలకులు అందరు ఐక్యం కావాలని కోరెను. ఇండియాలో ఉన్న ఇతర పాలకులు పశ్చాత్తాప పడవలసి వస్తుందని ఈస్టిండియా కంపెనీ వారి గూర్చి తెలిపెను.

టిప్పుసుల్తాన్ కష్టపడి తన రాజ్యంను సుసంపన్నం చేసెను. ఇతడు కొత్త కేలండర్, కొత్త నాణెముల తయారీ మరియు కొత్త తూకికలు, కొలతలను ప్రవేశపెట్టి ఆర్థిక పరిస్థితులను మెరుగుపరచెను. ఇతడు జమిందారీ విధాన ప్రభావాన్ని తగ్గించుటకు ప్రయత్నించెను. బ్రిటీష్ వారు మైసూరును క్రీ.శ. 1799లో జయించెను. అప్పటి గవర్నరు జనరల్ జాన్ షోర్ ఇట్లు వ్రాసెను. టిప్పుసుల్తాన్ బ్రిటీష్‌వారు ఆశ్చర్యపోయినారు. ఎక్కువ సంపదను బ్రిటీష్ వారు ఆక్రమించిన మద్రాసు నుంచి పొంది, టిప్పుసుల్తాన్ నూతన పరిశ్రమలు స్థాపించి, వ్యాపారం ప్రోత్సహించెను. టిప్పు తన పరిశ్రమలలోనికి దూర ప్రాంతాల నుండి పనివారిని తెప్పించుకొని, ఎక్కువ వ్యాపారాభివద్ధి చేసి, ఎగుమతులు పెంచెను. టిప్పుసుల్తాన్ సైన్యం అన్ని ప్రాంతాలకంటే నూతనమైనది. ఇతని సైన్యానికి ఫ్రెంచి వారిచేత శిక్షణ ఇప్పించెను. ఇతని కాల్బలం, తుపాకులు, ఫిరంగులు యూరోపియన్ల వారి వలె ఉంటాయి. వీటిని మైసూరులో తయారుచేయించెను.

టిప్పు మంచి మనస్సు కలిగిఉండుట వలన గొప్ప పేరు పొందెను. ఇతడు శాస్త్రము, చరిత్ర, లెక్కలు, మతం, తత్వం విభాగాలను చదివినాడు. ఇతడు స్వేచ్ఛాయుత కార్యక్రమాలు నిర్వహించుటకు కారణం, ఇతర ఫ్రెంచి విప్లవం గూర్చి బాగా చదవటం అక్కడ సంభవించిన సంఘటనల వలన అమెరికా వారు జాగ్రత్త పడినారు. జాకబిన్ ఇతడు ఫ్రెంచి వారితో దగ్గర సంబంధాలు కలిగిఉన్నాడు. కొంతమంది చరిత్రకారులు టిప్పుసుల్తాన్‌ను మత ద్వేషిగా నిందించారు. అది నిజం కాదు. ఇతడు అనేక దేవాలయాలకు ఇచ్చిన బహుమతులు, దానధార్మలకు సంబంధించిన అనేక ఉదాహరణలను బట్టి అతని పరమత సహనం కలవాడని తెలుస్తుంది.

**జవాబులు :**

**51.ఎ.**

1. తురుష్కులు క్రీ॥శ. 1453లో కానిస్టాంట్ నోపుల్‌ను ఆక్రమించాడు.
2. ప్రపంచ వ్యాపార అభివృద్ధి.
3. పోర్చుగీసు. క్రీ.శ. 1588లో ఇంగ్లీషువారి చేత స్పానిష్ ఆర్మిద ఓడించబడినపుడు.
4. డూప్లే భారత పాలకుల అంతర్గత కలహాలలో కలుగజేసుకొని ఒకరిపక్షం వహించి వారికి ఆయుధాలు, సైనికులను అందించుటకు నిశ్చయించాడు.
5. 1. నాణ్యమైన ఆయుధాలు, క్రమశిక్షణ కలిగిన సైన్యం.
   2. బలమైన నౌకాదళం.

**51.బి**

1. ఇండియాలో బ్రిటీష్‌వారి విజయయాత్రలకు ఇది మార్గాన్ని చూపెను.
2. వారు బెంగాల్, బీహార్, ఒరిస్సాలకు దివాని పొందినారు.
3. వజీద్ ఆలీషా దుష్పరిపాలనకు నిందించెను.
4. ఫ్రెంచి
5. మహారాష్ట్రుల శక్తి, గౌరవం నాశనమైంది.
2. బెంగాల్‌లో వారి స్థితిని సుస్థిరపరచే అవకాశంను బ్రిటీష్‌వారు దానికి ఇచ్చెను.

**51. సి.**

1. ఎ. రాజకీయ ఉద్దేశాలతో ఇతర ఐరోపా రాజ్యాల నుండి రక్షణ కోసం భారతదేశంలో భూభాగాలు సంపాదించి అక్కడ బ్రిటీష్ దళాలను ఉంచుట.
   బి. ఆర్థిక ఉద్దేశాలు ఉంటే బ్రిటీష్ వస్తువులకు భారత దేశములో మార్కెట్లను బట్టి లాభాలు గడించుట.
2. ఎ. బ్రిటీష్ వర్తకులు ఎగువ బర్మాపైన వ్యాపారం చేయాలని కోరుకొనెను.
   బి. ఎగువ బర్మా ద్వారా చైనాకు వ్యాపార మార్గం ఉన్నది.
3. క్రీ.శ. 1948, 1921.
4. ఆఫ్ఘనిస్తాన్ వారు స్వాతంత్ర్య ప్రేమికులు మరియు వారి వ్యవహారాలలో బ్రిటీష్ వారిని నిరంతరాయంగా ఇబ్బంది పెట్టారు.

# 52

# బ్రిటీష్ పాలన - ఆర్థిక వ్యవస్థ ప్రభావం

## 52.1 పరిచయం :

భారతదేశంలో బ్రిటీష్ పాలన చరిత్రలో పెద్ద ఆర్థిక దోపిడీగా చెప్పబడుతుంది. ఈస్ట్ ఇండియా కంపెనీ యుద్ధవ్యయాలు, లాభాలు అన్ని కూడా భారతీయ రైతును దోపిడీ చేయడం ద్వారా సంపాదించినవే. ఈ పాఠంలో దానికి కారణాలు. ఉపయోగించిన విధానాలు వ్యవసాయ, పారిశ్రామిక రంగాలపై బ్రిటీష్ పాలన ప్రభావం గురించి చర్చిద్దాం.

## 52.2 లక్ష్యాలు :

ఈ పాఠం చదవడం ద్వారా క్రింది విషయాలు గ్రహించగల్గాలి.

1. బ్రిటీష్ వారు ప్రవేశపెట్టిన శాశ్త శిస్తు విధానం రైత్వారి, మహల్వారి శిస్తు విధానాలు.
2. ఈ విధానాలలోని ప్రధాన లక్షణాలు, లోపాలు
3. భారతదేశంలో బ్రిటీష్ వారి వాణిజ్య విధానం
4. భారతీయ కుటీరపరిశ్రమలపై బ్రిటీష్ విధానాల ప్రభావం.
5. భారతదేశంలో పరిశ్రమల పెరుగుదల

## 52.3 శాశ్వత శిస్తు విధానం :

బెంగాల్, బీహార్, ఒరిస్సా దివానీలు క్రీ.శ.1765లో పన్ను వసూలు చేసుకునే అధికారం కంపెనీకి ఇచ్చారు. దీంతో వారన్‌హెస్టింగ్స్ వేలం ద్వారా (అత్యధికంగా డబ్బు చెల్లిస్తానన్నవ్యక్తికి) పన్ను వసూలు అధికారం కల్పించే నూతన పద్ధతిని ప్రారంభించాడు. అయితే దీనివల్ల కంపెనీ ఎంత ఆదాయం పొందగలదనే విషయంలో సందిగ్ధత నెలకొంది. అంతేకాకుండా రైతులు మరింత పేదరికంలోకి నెట్టివేయబడ్డారు. ఈ పరిస్థితులలో కంపెనీకి ఖచ్చితంగా, కంపెనీకి వసూలయ్యే శిస్తు ముందే తెలిసేవిధంగా, జమీందారి వర్గాన్ని తమకు మద్ధతుదారులుగా చేసుకునే విధంగా క్రీ.శ.1793లో కారన్‌వాలీస్ బెంగాల్, బీహార్‌లలో శాశ్వత శిస్తు విధానాన్ని ప్రవేశపెట్టాడు.

ఈ శాశ్వత శిస్తు విధానం మొదట జమీందారులను, పన్ను వసూలు దారులను వంశపారంపర్య భూయజమానులుగా మార్చారు. మరోవిధంగా చెప్పాలంటే పన్ను వసూలు అధికారంతోపాటు కంపెనీ వారిని భూయజమానులుగా కూడా గుర్తించింది. రెండవది నిర్ణయించిన శిస్తుకూడా శాశ్వతంగా ఉంటుంది. జమీందారులు రైతుల నుండి వసూలు చేసిన దానిలో 10/11 భాగం కంపెనీకి చెల్లించి మిగిలిన 1/11 భాగం వారి స్వంతానికి ఉంచుకోవచ్చు. ఒకవేళ ఎక్కువ భూమిని వ్యవసాయయోగ్యం చేయడం ద్వారా గాని, లేదా రైతులను పీడించిగాని జమీందారులు ఇంకా ఎక్కువ పన్ను వసూలు చేసినట్లయితే, దానిని కంపెనీ తనకివ్వమని కోరదు. అయితే తనకిచ్చే భాగంలో మాత్రం కంపెనీ చాలా కఠినంగా ఉంటుంది. ఈ రోజు సాయంకాలం వరకు శిస్తును చెల్లించని పక్షంలో 1794లో రూపొందించిన సూర్యాస్తమయ చట్టం(Sunset laws) ద్వారా భూమిని తిరిగి వేలంవేసి అధిక మొత్తం చెల్లించినవారికి ఇస్తుంది.

ఈ విధానం వల్ల ఫలతాలు.

1. శిస్తు ద్వారా ఎంత డబ్బు వసూలవుతుందో ఖచ్చితంగా తెలుస్తోంది.
2. ఈ శిస్తు శ్వాత పద్ధతిలో నిర్ణయించడం వల్ల అధికారులు ఎక్కువమొత్తంలో వసూలు చేయడానికి అధిక అంచనాలు వేసేవారు.
3. ఇందులో వసూలయ్యే మొత్తాన్ని ముందే నిర్ణయించినప్పటికీ రైతు జమీందారుకు ఖచ్చితంగా ఎంత చెల్లించాలో నిర్ణయించకపోవడం ఒక లోపం. దీనివల్ల జమీందారు రైతును పరోక్షంగా దోపిడీ చేసేవాడు.
4. భారతీయ వ్యవసాయ రంగంలో సూర్యాస్తమయ చట్టాలు.(Sunset laws) కొత్తరకమైన భూస్వామ్య పద్ధతికి తెరతీశాయి. పట్టణాలలో ఉన్న ధనికులు గ్రామంలోని భూమిని కొనుగోలు చేసేవారు. వారక్కడ నివసించకుండా వారు నియమించిన వ్యక్తులు ద్వారా పన్ను వసూలు చేయించేవారు. ఈ వ్యక్తులు రైతులను దోపిడీ చేస్తూ శాశ్వత శిస్తు విధానం ద్వారా వారి జీవితాలను దుర్భరం చేసేవారు.

శాశ్వత శిస్తు విధానాన్ని క్రీ.శ.1793లో బెంగాల్‌లో కారన్‌వాలీస్ ప్రవేశపెట్టాడు. దీనివల్ల వసూలు శాశ్వత పద్ధతిగా రూపొంది పన్ను వసూలుదారులను భూస్వాములుగా మార్చింది.

## పాఠ్య ప్రశ్నలు 52.ఎ

1. శాశ్వత శిస్తు విధానం ఎందుకు ప్రవేశపెట్టబడింది?
2. శాశ్వత శిస్తు ప్రధాన లక్షణాలను పేర్కొనండి.
3. శాశ్వత శిస్తు విధాన లోపాలను ఫలితాలను వివరించండి.

## 52.4 రైత్వారి శిస్తు విధానం :

18వ శతాబ్ధం వరకు దక్షిణ భారతదేశంలోని చాలా ప్రాంతాలు కంపెనీ ఆధీనంలోకి వచ్చాయి. దీంతో పరిపాలనా సమస్యలు కూడా ఏర్పడ్డాయి. ఈ ప్రాంతాలలో పెద్ద భూస్వాములు లేకపోవడం వల్ల రైతు తనంతట తానే పన్ను చెల్లించేపద్ధతిని రూపొందించాలని రీడ్, మన్రోల నాయకత్వంలో పనిచేస్తున్న మద్రాస్ అధికారులు ప్రతిపాదించారు. శాశ్వతశిస్తు విధానం వల్ల కంపెనీకి నష్టం వస్తుందని అదనపు ఆదాయాన్ని జమీందారులు పొందుచున్నారని అధికారులు భావించారు. అంతేకాకుండా ఈ విధానం వల్ల రైతు జమీందారు చేత దోపిడీకి గురవుతూ, అతని దయాదాక్షిణ్యాలపై జీవించాల్సి వస్తుందని వారనుకున్నారు.

దీని ఫలితంగా మద్రాస్, బొంబాయి ప్రెసిడెన్సీలలో ఈ రైత్వారీ శిస్తు విధానాన్ని ప్రవేశపెట్టారు. దీంతో కంపెనీకి రైతుకు దీనిపై నేరుగా ఒప్పందం కుదిరినట్లయింది. అయితే పన్ను చెల్లించినంత కాలం రైతును కంపెనీ భూయజమానిగా గుర్తిస్తుంది. ఈ విధానాన్ని 20,30 సంవత్సరాల కొకసారి సమీక్షిస్తారు.

ఈ రైత్వారి శిస్తు విధానం వెనుక ఎలాంటి తాత్విక భూమిక లేదు. ఇది కేవలం ప్రభుత్వానికి పౌరునికి మధ్య పన్ను చెల్లింపులో వసూలులో సులభంగా వ్యవహారాలు నడిపించే విధంగా పాలనలో మార్పులు తీసుకురావడం ప్రధాన ఉద్దేశం.

ఈ విధానం వల్ల వ్యవసాయరంగంలో మా రైతుల్లోనుఎలాంటి మార్పులు రావటంగానీ రైతుకు కల్గించడం గానీ జరగలేదు. ఈ వసూలు ప్రక్రియలో ఉన్న మధ్యవర్తులు తొలగించబడినప్పటి2కీ అధికారుల దోపిడీ అదేవిధంగా కొనసాగింది. పైగా ప్రభుత్వ వాటాను చాలా ఎక్కువగా నిర్ణయించారు(ఉత్పత్తి చేసిన దాంట్లో సగటున 40శాతం కూడా రైతు పొందకపోయేవాడు). ప్రభుత్వం కూడా తన ఇష్టమొచ్చినపుడు పన్నును పెంచే హక్కును కలిగిఉండేది. అయితే ప్రజలు పన్ను కట్టలేని దారుణ పరిస్థితులలో ఉన్నప్పటికి ప్రభుత్వం పన్ను చెల్లింపు మొత్తాన్ని తగ్గించటం గానీ రద్దు చేయడం గానీ చేయకపోయేది. ఉదాహరణకు కరువు, వరదలు లేదా పంట అనుకున్నంత రానపుడు వంటి పరిస్థితులలో కూడా ప్రభుత్వం రైతుల నుండి పన్ను మొత్తాన్ని నిర్ధాక్షిణ్యంగా వసూలు చేసేది. (రైతు తన భూమిలో కొంత భాగాన్ని వడ్డీవ్యాపారి కుదువపెట్టిగానీ అమ్మిగానీ పన్ను చెల్లించవల్సి వచ్చేది.) ఈ విషయంలో బంజరుభూమిని వ్యవసాయ యోగ్య భూమిగా (అడవుల నరికివేతద్వారా గానీ లేదా నీటివసతి కల్పించడం ద్వారాగానీ) మార్చడం పన్నులు వసూలు మొత్తాన్ని పెంచుకోవడం కోసం చేసినప్పటికీ అది రైతులతో సహా అందరికి ప్రయోజనం చేకూర్చింది. అదేసమయంలో రైతులు భూయాజమాన్య హక్కులను కాపాడే ఛాంపియన్‌గా కనిపించాలని బ్రిటీష్‌వారు ప్రయత్నించేవారు.

బొంబాయి, మద్రాస్ ప్రెసిడెన్సీలలో రీడ్, మన్రోలు రైత్వారీ శిస్తు నిర్ణయ విధానాలను ప్రవేశపెట్టారు. రాజ్యానికి, రైతుకు మధ్య మధ్యవర్తుల ప్రమేయం లేకుండా నేరుగా శిస్తు చెల్లింపు వ్యవస్థ ఉంటుంది. కాలానుగుణంగా శిస్తు చెల్లింపును సమీక్షిస్తారు.

### పాఠ్య ప్రశ్నలు 52.బి

1. రైత్వారి శిస్తు నిర్ణయ విధానమంటే ఏమిటి?
2. రైత్వారి పద్ధతిని ఎప్పుడు ఎందుకు ప్రవేశపెట్టారు?
3. రైత్వారీ పద్ధతిలోని ప్రధాన లోపాలేవి?

## 52.5 మహల్వారి శిస్తు నిర్ణయ విధానం :

గంగానది పరివాహక ప్రాంతం. ఆగ్నేయ ప్రావిన్స్‌లు, మధ్య ఇండియాలోని కొన్ని భాగాలు పంజాబ్‌లలో జమీందారి శిస్తు విధానాన్ని ఆధునీకరించారు. అప్పటికి అమలులో ఉన్న శాశ్వత శిస్తు విధానం పట్ల బోర్డ్ ఆఫ్ కంట్రోల్‌లో ఉన్న అసంతృప్తి వల్ల ఆ నిర్ణయం తీసుకున్నారు.

1822 రెగ్యులేషన్ VII ఆధారంగా ఉన్న హోల్ట్, మెఖంజీల ప్రఖ్యాత తీర్మానం మహల్వారి పద్ధతికి పునాది వేసింది. ఈ పద్ధతి ప్రకారం శిస్తు వసూలు గ్రామం(మహల్) మొత్తానికి లేదా ఎస్టేట్ మొత్తానికి గ్రామపెద్ద గానీ కుటుంబ పెద్దగానీ చేస్తాడు. వారికి ఆ గ్రామానికి లేదా ఎస్టేట్‌కు ఉమ్మడి అనేవారు. మొదట్లో కంపెనీ వాటా ఇందులో 85 శాతంగా నిర్ణయించినప్పటికీ, 1833 రెగ్యులేషన్ IX ప్రకారం 66 శాతంగా, 1855 సహరాన్‌పూర్ విధానం ప్రకారం దాన్ని 50శాతంగా కాలానుగుణంగా సమీక్షిస్తూ తగ్గించడం జరిగింది.

గ్రామం లేదా మహల్‌కు కంపెనీకి మధ్య మహల్వారి శిస్తు నిర్ణయం జరిగింది. దీన్ని ఉత్తర, మధ్య భారతదేశంలో ప్రవేశపెట్టడం జరిగింది.

### పాఠ్య ప్రశ్నలు 52.సి

1. మహల్వారి శిస్తు నిర్ణయ పద్ధతి ప్రధాన లక్షణాలేవి?
2. ఏఏ ప్రాంతాలలో మహల్వారి పద్ధతి ప్రవేశపెట్టారు?

## 52.6 ఆర్థిక దోపిడి :

బ్రిటీష్ ఈస్ట్ ఇండియా కంపెనీ భారతీయ వస్తువులతో వ్యాపారం చేసి లాభాలు గడించాలనే లక్ష్యంతో భారతదేశానికి వచ్చింది. కొంతకాలానికి వ్యాపారం కోసం వచ్చిన వారే తమ దేశ ప్రయోజనాల కోసం వలస ఆర్థిక వ్యవస్థలు సృష్టించుకోవడం కోసం పాలకులుగా మారారు. బ్రిటీష్ ప్రభుత్వ వ్యవసాయ, పారిశ్రామిక విధానాలను విశ్లేషిస్తే అవన్నీ కూడా భారతదేశాన్ని ఆర్థిక దోపిడీకి గురిచేసేవే అని తెలుస్తోంది.

బ్రిటీష్ వారి ఆర్థిక విధానాలను దశలవారిగా పరిశీలించడం సమంజసం. ఇందులో మొదటి దశ(1600–1757)ను 'మర్కన్‌టాలిజం'గా(Mercantilism) చెప్పవచ్చు. క్రీ.శ.1717కు ముందే ఎలాంటి సుంకాలు చెల్లించకుండా ఇండియాలో వ్యాపారం చేసుకోవడానికి మొఘల్ చక్రవర్తి నుండి కంపెనీ అనుమతి పొందిన విషయం

మీకు తెలిసిందే. దానివల్ల భారతీయ వర్తకులకన్నా వారికి వ్యాపారావకాశాలు మెరుగుగా దీనితోపాటు కంపెనీ గుమస్తాలు భారతీయ చేతివృత్తి కళాకారులను తమకోసం పనిచేయమని ఒత్తిడి చేసేవారు. ఈ దశలో భారతీయ వస్తువులను విదేశాలలో అమ్మడం ద్వారా కంపెనీ లాభాలను గడించేది. యూరప్‌లో భారతీయ వస్త్రాలు, సిల్క్, సుగంధ ద్రవ్యాలు, విలువైన రాళ్ళకు గిరాకీ ఎక్కువగా ఉండటం వల్ల వర్తకులు లాభాలు గడించేవారు. కంపెనీ ఈ వస్తువులను భారతదేశంలో చాలా తక్కువ ధరలకు కొని అత్యంత ఎక్కువ ధరలకు ఇంగ్లాండ్‌లో అమ్మేవారు. కొన్ని సందర్భాలలో వాటిని ఇంగ్లాండ్‌నుండి ఇతర ఐరోపా దేశాలకు ఎగుమతి చేసేవారు.

అయితే భారతీయ వస్త్రాలకున్న డిమాండ్, లాభాలు బ్రిటీష్ ఉత్పత్తిదారులకు అసూయ కల్గించాయి. వీటివల్ల వస్తున్న పోటీని అవమానకరంగా భావించారు. దీంతో బ్రిటీష్ వస్త్ర ఉత్పత్తిదారులు భారతీయ వస్తువులను బ్రిటన్‌లోకి రాకుండా నిలువరించమని పార్లమెంటుపై ఒత్తిడి చేయడం ప్రారంభించారు. క్రీ.శ.1720 వరకు భారతీయ వస్త్రాన్ని వినియోగించడాన్ని, ధరించడాన్ని నిషేధిస్తూ పార్లమెంట్ చట్టం రూపొందించింది. దీంతో భారతీయ చేనేతకారుల ప్రధాన ఆదాయవనరుగా ఉన్న ఎగుమతులు ద్వారా వస్తున్న ఆదాయాన్ని కోల్పోవడం ప్రారంభమైంది.

భారతదేశంపై భౌగోళికంగా కంపెనీకి ఆధిపత్యం కల్పించిన ప్లాసీ యుద్ధం క్రీ.శ.1757లో జరిగింది. దీని తర్వాత భారతదేశ పరిస్థితి మరింత దిగజారింది. కంపెనీ పొందిన 24 ఏకగణాలతో పాటు అత్యధికంగా లాభాలు గడించడానికి తగినంత రాజకీయ అధికారం కూడా దీనివల్ల లభించింది. ఇక తక్కువ వేతనాలకే వారికోసం పనిచేయమని బెంగాల్ చేనేత కళాకారులపై కంపెనీ ఒత్తిడి చేయడం ప్రారంభించింది. దీంతో పాటు తమ దగ్గర ముడిసరుకులను అత్యధిక ధర చెల్లించికొనమని, తయారైన వారి వస్తువులను మాత్రం చాలా తక్కువ ధరకు అమ్మమని కూడా వారిపై ఒత్తిడి ప్రారంభమైంది. దీంతో భారతీయ చేనేత కార్మికుడి పరిస్థితి క్రమంగా దిగజారింది.

ఇంగ్లాండ్‌లో వచ్చిన పారిశ్రామిక విప్లవం తర్వాత బ్రిటన్ ఆర్థికవ్యవస్థ, ఇండియాలో సంబంధాలు పూర్తిగా మారిపోయాయి. పారిశ్రామిక విప్లవానికి అత్యంత అవసరమైనవి రెండు. అందులో మొదటిది ముడిసరుకులు, రెండవది తయారైన వస్తువులను అమ్మడానికి అవసరమైన విపణీలు. ఆ రెండూ కూడా ఇంగ్లాండ్‌కు లేవు. ఆ రెండింటి కోసం ఇంగ్లాండ్ చేసిన అన్వేషణకు భారతదేశంలో సమాధానం దొరికింది.

పారిశ్రామిక విప్లవం ద్వారా రూపొందిన కొత్త పెట్టుబడిదారీ వర్గం భారతదేశంలో మార్కెట్‌పై గుత్తాధిపత్యం చెలాయిస్తున్న కంపెనీని రద్దుచేయాలని పార్లమెంటుపై ఒత్తిడి చేయడం ప్రారంభించింది. క్రీ.శ.1793-1813 మధ్య దీన్ని ఇంకా ఉధృతం చేశారు. కంపెనీ పొందుతున్న లాభాలే కాక అందులో పనిచేస్తున్న వారు కూడా విపరీతమైన సంపదను ఇంగ్లాండ్‌కు తీసుకురావడం ఇంకా ఒత్తిడి పెంచడానికి కారణమైంది. వారి కృషి ఫలించి ఛార్టర్ చట్టం, 1813, భారతీయ వ్యాపారంలో కంపెనీ గుత్తాధిపత్యాన్ని రద్దు చేసింది.

దీంతో క్రీ.శ. 1813 నుండి భారతదేశంలో బ్రిటన్ సాగిస్తున్న ఆర్థిక దోపిడీ రెండోదశను చేరుకుంది. వలస ఆర్థిక వ్యవస్థలో లాంకషైర్ మాంచెస్టర్ మిలుల అవసరాలకు తగ్గట్టు మార్పులు జరిగాయి. భారతదేశం ముడి సరుకులకు, తయారైన బ్రిటన్ వస్తువుల అమ్మకానికి కేంద్రంగా తయారైంది. నూలుకు పుట్టినిల్లు అయిన భారతదేశం బ్రిటన్ మిల్లు వస్త్రాల దిగుమతులతో నిండిపోయింది. బ్రిటీష్ వస్తువులు ఎలాంటి సుంకాలు చెల్లించకుండా నేరుగా ఇండియాలోకి ప్రవేశించవచ్చు. కానీ భారతీయ వస్తువులు బ్రిటన్‌లో ప్రవేశించడానికి అత్యధిక సుంకాలు విధించారు. బ్రిటన్ ప్రవేశపెట్టిన

ఈ విధానాన్ని 'ఒకే మార్గంలో స్వేచ్ఛావ్యాపారం' ఉంటారు. నిజానికి భారతీయ వస్తువులకు బ్రిటన్‌లో దాదాపు 400శాతం పైగా సుంకం ఉండేది. దీంతో భారతీయ చేతివృత్తుల పరిశ్రమ రెండువిధాల నష్టపోయి పతనావస్థకు చేరింది. ఇందులో మొదటిది విదేశీ విపణిని కోల్పోవడమైతే, రెండవది బ్రిటన్ మిల్లు వస్త్రాలతో వస్తున్న అనైతిక, అసమాన పోటీ. దీనిపై బ్రిటన్ చరిత్రకారుడు హెచ్.హెచ్.విల్సన్ "ఎలాంటి సుంకాలు చెల్లించకుండా బ్రిటిష్ వస్తువులు భారతీయ మార్కెట్‌లో ప్రవేశించడం. అదేవిధంగా స్థానికంగా ఉత్పత్తి అవుతున్న వస్తువులపై అనేక ఆంక్షలు విధించడం నైతికంగా రాజకీయంగా కూడా అన్యాయమని" అభిప్రాయపడ్డారు.

బ్రిటీష్ వారి ఆర్థికదోపిడి వల్ల భారతీయ ఆర్థికవ్యవస్థ సర్వనాశనమైంది. భారతీయ వస్త్ర పరిశ్రమ, హస్తకళలు పతానావస్థకు చేరుకున్నాయి. భారతదేశం వలస ఆర్థిక వ్యవస్థగా మారిపోయింది. ఫలితంగా ముడిసరుకుల ఎగుమతిదారుడిగా, తయారైన వస్తువుల దిగుమతిగారుడిగా రూపాంతరం చెందింది.

### పాఠ్య ప్రశ్నలు 52.డి

1. ఈస్ట్ ఇండియా కంపెనీ భారతదేశానికి ఎందుకు వచ్చింది?
2. 'మర్కంటలిజమ్' అనగానేమి?
3. 1813 ఛార్టర్ చట్టం ఫలితాలు ఏవి?

## 52.7 ఆధునిక పరిశ్రమల వృద్ధి, ఎగుమతి విధానం :

భారతీయ వస్త్ర పరిశ్రమ, హస్తకళలపై బ్రిటన్ పాలన ప్రభావం గురించి ముందు భాగంలో చదువుకున్నాం. భారతీయ ఆర్థికవ్యవస్థ బ్రిటిష్ సామ్రాజ్యవాద విధానాల వల్ల క్రమంగా పారిశ్రామిక రంగానికి దూరమైంది. కేవలం భారతీయ వస్త్ర పరిశ్రమ పతనాన్ని మాత్రమే పరిశీలించడం ద్వారా బ్రిటీష్ పాలన ఆర్థికరంగంపై చేసిన ప్రభావాన్ని పూర్తిస్థాయిలో అంచనావేయలేం. అందువల్ల 19,20 శతాబ్ధాలలో భారతదేశంలో ఆధునిక పరిశ్రమల పెరుగుదల గురించి స్థూలంగా పరీక్షించాల్సి ఉంటుంది.

ఆధునిక పరిశ్రమల ఏర్పాటు అభివృద్ధి బ్రిటీష్ పాలనాకాలంలోనే జరగడం వల్ల భారతదేశంలో అధునీకరణను ప్రవేశపెట్టిన ఘనత బ్రిటీష్‌వారిదేనని కొంతమది చరిత్రకారులు వాదిస్తున్నారు. భారతదేశంలో పారిశ్రామిక అభివృద్ధి క్రీ.శ.1850 తర్వాత ప్రధానంగా రెండు విషయాలపై కేంద్రీకృతమైంది. అందులో మొదటిది టీ, కాఫీ, ఇండిగో వంటి తోటలు పెంచడం. రెండవది నూలు, జూట్, బొగ్గు, ఖనిజాలు వంటి పరిశ్రమల ఏర్పాటు.

క్రీ.శ.1859–55 మధ్య మొట్టమొదటి నూలు మిల్లు, కొన్ని జూట్ మిల్లులు, బొగ్గుగని పరిశ్రమలు ప్రారంభమయ్యాయి. బొగ్గుగనులు బెంగాల్‌లోని రాణిగంజ్, మధ్య ప్రావిన్స్‌లోని మెహిపని వరకు పరిమితమయ్యాయి. ఇక జూట్ మిల్లుల సంఖ్య క్రీ.శ.1882లోనే 20కి చేరాయి. ఇవి ప్రధానంగా ఐరోపావారి సారధ్యంలో నడిచేవి. క్రీ.శ.1880 వరకు మూడు ప్రధాన పరిశ్రమలు భారతదేశంలో పనిచేసేవి. క్రీ.శ.1880–1895 మధ్య పాత పరిశ్రమలను ఆధునీకరించడం గానీ కొతత పరిశ్రమలను ఏర్పాటు చేయడం గానీ జరగలేదు. క్రీ.శ.1894–95లలో జూట్‌మిల్లుల

సంఖ్య 29కి బొగ్గుగనుల సంఖ్య 123కి చేరింది. క్రీ.శ.1914వరకు దేశంలో 264 నూలు పరిశ్రమలు ఉండగా అందులో 182 బొంబాయి ప్రెసిడెన్సీలోనే ఉన్నాయి. ఇక 64 జూట్ మిల్లులలో దాదాపు 1,54,376 మంది వ్యక్తులు పనిచేసేవారు.

క్రీ.శ.1890–1914 మధ్య పెట్రోలియం, మాంగనీసు, మైకా, వంటి నూతన పరిశ్రమలు ప్రారంభించబడ్డాయి. కొన్ని బియ్యం టింబర్ పరిశ్రమలు కూడా అప్పుడే ప్రారంభమయ్యాయి. దీంతోపాటు ఇనుము, ఉక్కు పరిశ్రమలు కూడా వేగంగా అభివృద్ధి చెందాయి. 1930లలో సిమెంట్, కాగితం, అగ్గిపెట్టెలు, చక్కెర, గాజు పరిశ్రమలు అభివృద్ధి చెందాయి.

అయితే ఈ ఆధునిక పరిశ్రమల ఏర్పాటు ద్వారా భారతదేశాన్ని ఆధునీకరించాలని బ్రిటీష్ వారు ప్రయత్నించారనుకోవడం సరైంది కాదు. నిజానికి వీటిలో అత్యధిక పరిశ్రమలకు బ్రిటీష్‌వారే యజమానులు. భారతీయ పెట్టుబడిదారులకు ఇందులో స్థానం సంపాదించారు. ఇది చాలా కష్టమైన విషయం. అయితే పరిశ్రమలపై, తోటల పెంపకంపై పూర్తి ఆధిపత్యం బ్రిటీష్‌వారికే ఉన్నప్పటికీ, 1914–18ల మధ్య జరిగిన మొదటి ప్రపంచయుద్ధం భారతీయ ఉత్పత్తిదారులకు భారతీయ విపణిలో ప్రవేశించడానికి తగిన వాతావరణం కల్పించింది. ఈనాడు దేశంలో అత్యున్నతస్థాయిలో ఉన్న భారతీయ పరిశ్రమలకు పునాది ఆనాడు వేసిందే. భారతదేశంలో పారిశ్రామికీకరణను ప్రోత్సహిస్తామని అందుకోసమే 1916లో పారిశ్రామిక కమీషన్ ఏర్పాటు చేస్తున్నట్లు ప్రభుత్వం ప్రకటించింది.

భారతీయ వ్యాపారవేత్తలు అనేక ఆంక్షలను, అడ్డంకులను ఎదుర్కొనేవారు. అందులో ముఖ్యమైంది వర్ణవివక్ష. రైల్వేలు కూడా ఎగుమతి వ్యాపారానికి చాలా ఉపయోగపడ్డాయి. ఐరోపావారి స్థానిక వాణిజ్యవేత్తల సంఘంలో చాలా కొద్దిమంది భారతీయ వ్యాపారవేత్తలకు మాత్రమే ప్రవేశం ఉండేది. బ్యాంకులు, రుణసదుపాయం కల్పించే ఇతర సంస్థలన్నీ కూడా బ్రిటీష్ వారి ఆధీనంలోనే ఉండేవి. భారతీయ వ్యాపారంపై బ్రిటీష్‌వారి గుత్తాధిపత్యం ఉండేది. క్రీ.శ.1923లోని టారిఫ్ బోర్డు ప్రతిపాదించిన టారిఫ్ సుంకాల విధానం కూడా భారతీయ వస్తువుల ఎగుమతిని నిరసించేవిధంగానే రూపొందింది.

దీన్ని బట్టి బ్రిటీష్ వారి ఎగుమతి విధానమంతా కూడా భారతీయులను దోపిడీ చేసి బ్రిటీష్ వారి సంపదనే పెంచడానికి రూపొందిందనే విషయం అర్ధమౌతుంది. బ్రిటీష్ ఆర్థిక దోపిడీకి గురయిన వారిలో ప్రధానంగా భారతీయ వ్యవసాయం, పరిశ్రమలు, రైతులు, చేనేతకారులు, తోట కార్మికులు ఉన్నారు.

క్రీ.శ.1854 నుండి టీ, ఇండిగో, నూలు, జూట్ వంటి ఆధునిక పరిశ్రమలు భారతదేశంలో అభివృద్ధి చెందినప్పటికీ, ఇవన్నీ కూడా బ్రిటీష్‌వారి ఆధీనంలోనే ఉన్నాయి.

## పాఠ్య ప్రశ్నలు 52.ఇ

1. భారతదేశంలో ఏ రెండింటిపై ప్రధానంగా బ్రిటీష్‌వారు పెట్టుబడులు పెట్టారు?
2. భారతదేశాన్ని అభివృద్ధి చేయాలనే లక్ష్యంతో బ్రిటీష్‌వారు భారతదేశాన్ని పారిశ్రామికీకరణ చేయలేదనడానికి ఒక కారణాన్ని చూపించండి.

3. భారతదేశం విషయంలో 'ఒకే మార్గపు స్వేచ్ఛావ్యాపారం' అర్థాన్ని విశదీకరించండి.

**సారాంశం :**

సాంప్రదాయ భారతీయ ఆర్థిక, సామాజిక వ్యవస్థను బ్రిటీష్ వ్యవసాయ విధానం నాశనం చేసింది. బ్రిటీష్ వారు భారతదేశంలో మూడు శిస్తు నిర్ధయ పద్ధతులను ప్రవేశపెట్టారు. అవి శాశ్వత, రైత్వారి, మహల్వారి శిస్తు విధానాలు. శాశ్వతశిస్తు విధానం 1793లో బెంగాల్ జమీందారులతో రైత్వారి విధానం బొంబాయి, మద్రాస్ ప్రెసిడెన్సీలలో రైతులలో మహల్వారి విధానంలో గ్రామం(మహల్)లో రూపొందించారు. ఈ విధానం వల్ల బ్రిటీష్‌వారు సంపదను పోగుచేసుకోగా భారతీయ రైతులు మాత్రం దారుణ పరిస్థితికి దిగజారారు. చేనేత, హస్తకళల వంటి సాంప్రదాయ కుటీర పరిశ్రమలను కూడా బ్రిటీష్‌వారు నాశనం చేశారు. ఇదంతా కూడా భారతదేశం నుండి సంపద తరలింపుకు దారితీసింది. ఇక్కడ ఆధునిక పరిశ్రమలను స్థాపించిన ఘనత బ్రిటీష్ వారిదే అయినప్పటికీ వాటిని వారి ఆధీనంలోనే ఉంచుకున్నారు.

**ప్రశ్నలు :**

1. శాశ్వత శిస్తు విధానానికి గల కారణాలు, ప్రధాన లక్షణాలు, లోపాలను వివరించండి.
2. రైత్వారి, మహల్వారి శిస్తు విధానాలు శాశ్వత శిస్తు విధానాన్ని మెరుగుపర్చి రూపొందించినవా? విశ్లేషించండి.
3. భారతదేశంలో బ్రిటీష్‌వారి పారిశ్రామిక విధాన లక్ష్యాలను, ప్రధానాంశాలను తెల్పండి.
4. భారతదేశంలో బ్రిటీష్‌వారి ఆర్థిక సంబంధాలపై పారిశ్రామిక విప్లవ ప్రభావాన్ని పరిశీలించండి.

**అదనపు సమాచారం :**

ఒక దేశాన్ని మరోదేశం భౌతికంగా ఆక్రమించుకోవడం గానీ, లేదా ఆదేశ ఆర్థిక, రాజకీయ అంశాలపై పూర్తి అధికారం కలిగి ఉండటాన్ని 'సామ్రాజ్యవాదం' అంటాము. సామ్రాజ్యవాద దేశం తమ స్వంతదేశ ప్రయోజనాల కోసం ఆక్రమించుకున్న వలసదేశాలను దోపిడీ చేయడానికి అనువైన విధానాలను రూపొందిస్తారు.

19వ శతాబ్దంలో ప్రపంచవ్యాప్తంగా సామ్రాజ్యవాదానికి అనువైన పరిస్థితులేర్పడ్డాయి. పారిశ్రామిక విప్లవం ముడిసరుకుల, విపణిలకు గిరాకిని సృష్టించింది. అదే సమయంలో రవాణా వ్యవస్థ, సమాచార ప్రసార వ్యవస్థలు అభివృద్ధి చెందాయి. ఇదిలా ఉండగా 19వ శతాబ్ధం జాతీయ వాదానికి తమ బలాన్ని ప్రదర్శించడం ప్రారంభించాయి. కొన్ని సామ్రాజ్యవాద దేశాలు దీనిద్వారా తాము ఆక్రమించుకున్న వలస దేశాలకు నాగరికత నేర్పుతున్నామని భావించాయి.

క్రీ.శ.1858లో భారతదేశం బ్రిటీష్ రాణి ప్రత్యక్ష పాలనలోకి వచ్చింది. బ్రిటన్ రాణి 'ఇండియా సామ్రాజ్ఞి' బిరుదు పొందింది. దాంతో బ్రిటీష్ సామ్రాజ్యవాదానికి ఇండియా బాధితురాలైంది. ఈ సామ్రాజ్యవాదర బ్రిటన్‌లోనే పరిమితమైంది కాదు. ఫ్రెంచి, జర్మనీ, డచ్, రష్యన్, జపాన్, అమెరికాలు ఆసియా, ఆఫ్రికాలలోని దేశాలను వలసలుగా చేసుకోవడానికి తమలోతాము యుద్ధాలకు పాల్పడేవారు.

**పాఠ్య ప్రశ్నలకు జవాబులు :**

**52.ఎ**

1. శాశ్వత శిస్తు విధానం కంపెనీకి ఖచ్చితమైన ఆదాయం రావడానికి అనుకూలంగా రూపొందించారు. దీని ద్వారా రైతుకు, జమీందారుకు, జమీందారు కంపెనీకి నమ్మకమైన మద్ధతుదారుగా మారారు.

2. శాశ్వత శిస్తు లక్షణాలు.

1. భూస్వాములను పన్ను వసూలు దారులుగా, భూ యజమానులుగా కంపెనీ గుర్తిస్తుంది.

2. శిస్తును 10/11 భాగం బ్రిటీష్ వారికి చెల్లించేవిధంగా మిగతా 1/11 భాగం జమీందారులు ఉంచుకునే విధంగా నిర్ణయించబడింది.

3. ఒకవేళ జమీందారు బ్రిటీష్‌వారు నిర్ణయించిన పన్నుమొత్తం చెల్లించలేనట్టయితే సూర్యాస్తమయ చట్టం ద్వారా వేలంవేసి అధికమొత్తం చెల్లించడానికి అంగీకరించిన మరొకరికి ఇస్తారు.

2. శాశ్వత శిస్తు విధాన ఫలితాలు

1. కంపెనీకి స్థిరాదాయం

2. అత్యాశగల అధికారుల అధిక అంచనాలు

3. జమీందారుల చేత రైతుల దోపిడీ

4. భూస్వామ్య విధానంలో మార్పులు

**52.బి.**

1. రైత్వారి శిస్తు విధానం రైతుకు, రాజ్యానికి మధ్య ప్రత్యక్ష ఒప్పందం, రైతును సకాలంలో పన్ను చెల్లించినట్లయితే భూ యజమానిగా రాజ్యం గుర్తిస్తుంది.

2. రైత్వారి విధానాన్ని మద్రాస్, బొంబాయి ప్రెసిడెన్సిలలో ప్రవేశపెట్టారు. దానికి అక్కడ భూస్వాములు లేకపోవడం ఒక కారణమైతే మరొకటి కంపెనీ అంతకుముందున్న పద్ధతి ద్వారా నష్టాలు పొందడం. ఇంకా జమీందారులు పొందుతున్న ఆదనపు ఆదాయాలు కూడా దీనికి మరో కారణమైంది.

3. రూపం మారినప్పటికీ (ఇప్పుడు రాజ్యం) ఈ రైత్వారి విధానం ద్వారా రైతు దోపిడీ కొనసాగుతూనే ఉంది. కంపెనీ అధికమొత్తంలో పన్నును నిర్ణయిస్తూ ఎటువంటి పరిస్థితిలో కూడా దాన్ని తగ్గించకపోయేది.

**52.సి**

1. మహల్వారి పద్ధతిలో పన్ను విధానం కంపెనీకి గ్రామ(మహల్)పెద్దలకు, కుటుంబ పెద్దలకు మధ్య ఒప్పందంగా ఉంటుంది. వారినే ఆగ్రామ లేక ఎస్టేట్ ఉమ్మడి జమీందార్లుగా పిలుస్తారు.

2. మహల్వారి పద్ధతిని గంగా పరివాహక ప్రాంతం, ఆగ్నేయ ప్రావిన్స్, మధ్య భారతదేశంలోని కొన్ని భాగాలలో పంజాబ్‌లలో ప్రవేశపెట్టారు.

**52.డి**

1. కంపెనీ తమ భాగస్వాములకు లాభాలను తెచ్చిపెట్టే వాణిజ్యసంస్థ అయింది.
2. 'మార్కంటలిజమ్' సిద్ధాంతం క్రీ.శ.17,18వ శతాబ్దాలలో ఐరోపాలో కొనసాగింది. ఇందులో దేశసంపదను దాని ఆధీనంలో ఉన్న విలువైన ఖనిజాలపై ఆధారంగా చూస్తారు. అందువల్ల ఆ యా ప్రభుత్వాలు వలసలను పెంపొందించుకోవడం ఎగుమతి విధానాల ద్వారా సంపదను పెంచుకోవడం వంటి వాటిపై అధికంగా శ్రద్ధ పెట్టేవారు.
3. క్రీ.శ. 1813 ఛార్టర్ చట్టం ద్వారా కంపెనీ గుత్తాధిపత్యం రద్దు చేయబడింది.

**52.ఇ**

1. ఎ. టీ, కాఫీ, ఇండిగో వంటి తోటలపెంపకం

   బి. నూలు, జూట్, బొగ్గు పరిశ్రమల స్థాపన
2. దేశ అభివృద్ధిలో భారతీయుల భాగస్వామ్యాన్ని బ్రిటీష్‌వారు ప్రోత్సహించారు. పైగా అనేక ఆంక్షలు విధించారు. బ్రిటీష్ వ్యాపారవేత్తలు భారతదేశంలో పెట్టిన పెట్టుబడుల ద్వారా విపరీతంగా సంపద పోగు చేసుకోగా భారతీయులను మాత్రం తక్కువ వేతనంతో పనివారుగా ఉపయోగించుకునేవారు.
3. భారతీయ వస్తువులకు బ్రిటన్‌లో ప్రవేశం లేదని దీనర్ధం. అదే సమయంలో బ్రిటన్ వస్తువులు భారతదేశంలో గుమ్మరించారు. భారతదేశంలో తమ వస్తువుల ప్రవేశానికి నామమాత్రపు సుంకాన్ని మాత్రమే వారు చెల్లించేవారు. ఇది పూర్తిగా న్యాయవిరుద్ధ వ్యాపారం.

# 53

# బ్రిటీష్ పాలనా సమీక్ష

## 53.1 పరిచయం

క్రితం పాఠంలో మీరు ఆంగ్ల సామ్రాజ్య స్థాపన, విస్తరణ, ఆంగ్ల ఆర్థిక విధానాలు తమదేశ అవసరాలను తీర్చటానికే ఉద్దేశింపబడ్డాయని చదివాం. ఈ పాఠంలో ఆంగ్ల సామ్రాజ్య విస్తరణలో బ్రిటీష్‌వారు అనుసరించిన నూతన విధానాలను గురించి చదువుతాం. ఆ విధానాలే ద్వంద్వ పాలన, సైన్య సహాయక పద్ధతి, రాజ్య సంక్రమణ సిద్ధాంతం. ఆంగ్లేయులు అనుసరించిన వ్యవసాయక, పారిశ్రామిక విధానాలు మన ఆర్థిక వ్యవస్థను ఎట్లు నాశనం చేశాయో తెలుసుకుంటాం. వీనినిబట్టి బ్రిటీష్‌వారు చాలా సంవత్సరాలు భారతదేశాన్ని పాలించినా అందులో వీరు అంతర్భాగం కాలేదు. కేవలం విజేతలుగానే మిగిలారు.

## 53.2 లక్ష్యాలు

**ఈ పాఠం చదివిన తరువాత ఈ కింది విషయాలు తెలుసుకుంటారు.**

1. బెంగాలు ద్వంద్వ పాలనకు దోహదం చేసిన అంశాలు.
2. ద్వంద్వపాలన స్వభావం, లాభ నష్టాలు.
3. సైన్యసహాయక పద్ధతి లక్ష్యాలు, లక్షణాలు.
4. రాజ్యసంక్రమణ సిద్ధాంతం స్వభావం, ఫలితాలు.
5. బ్రిటీష్‌వారు అనుసరించిన వ్యవసాయక, పారిశ్రామిక విధానాలు.
6. బ్రిటీష్ ఆర్థిక విధానాల వలన చేతివృత్తుల క్షీణత, భారతీయ సంపద కొల్లగొట్టిన వైనం.

## 53.3 బెంగాలులో ద్వంద్వ పాలన

బక్సార్ యుద్ధానంతరం (1765) నెలకొన్న పరిస్థితులను చక్కబెట్టుటకు క్లైవ్ (Clive) ప్రజాదరణకు నోచుకోని ద్వంద్వ పాలనను (Dual or Double Government) బెంగాల్‌లో ప్రవేశపెట్టాడు. ద్వంద్వ పాలన వలన బెంగాల్ రాష్ట్రంలో అధికారం కంపెనీ వారికి, బాధ్యతలు నవాబుకు పంచబడ్డాయి.

ద్వంద్వ పాలనకు పూర్వం బెంగాల్ మొఘల్ సామ్రాజ్యంలోని ఒక సుబా (రాష్ట్రం). కేంద్ర ప్రభుత్వం సుబేదార్, దివాన్ అను ఇద్దరు ఉద్యోగులను రాష్ట్ర పాలనాధికారులుగా నియమిస్తుంది. సుబేదార్ నిజాము అధికారాన్ని అనగా శాంతిభద్రతలు (క్రిమినల్), దివాన్ ఆర్థిక వ్యవహారాలను, పౌరపాలన (సివిల్)ను కల్గియుంటారు. ఈ ఇద్దరు ఉద్యోగులు ఒకరిపై ఇంకొకరికి నియంత్రణ అధికారం ఉంటుంది. అయితే వీరిద్దరు కేంద్ర ప్రభుత్వానికి ప్రత్యక్షంగా బాధ్యత వహిస్తారు. ఔరంగజేబు మరణానంతరం కేంద్ర ప్రభుత్వం బలహీనపడుట వలన బెంగాల్‌లో ముర్షిద్‌కుంఖాన్ స్వతంత్రుడై నవాబు అను బిరుదు వహించి నిజామత్, దివానీ అధికారాలను రెండింటిని తానే హస్తగతం చేసికొన్నాడు.

బక్సారు యుద్ధానంతరం జరిగిన అలహాబాద్ సంధిలో (1765) కంపెనీవారు మొఘల్ చక్రవర్తియైన షాఆలం నుండి బెంగాల్‌లో దివానీ అధికారంను పొందారు. దీనికి బదులు కంపెనీవారు సాలుకు 26లక్షల రూపాయలు షాఆలంకు, 53 లక్షల రూపాయలు బెంగాల్ నవాబుకు పాలనా ఖర్చుల కింద చెల్లించుటకు అంగీకరించింది. ఈలోపల బెంగాల్‌లో అధికారములోనికి వచ్చిన నజీమ్ ఉద్దౌలా కంపెనీ వారితో బెంగాల్ పాలనను డిప్యూటీ సుబేదార్ నిర్వహించుటకు, అతడు కంపెనీ వారిచే నియమింపబడుటకు, తన అనుమతి లేకుండా అతనిని తొలగించుటకు వీలులేని విధంగా ఒప్పందం కుదుర్చుకున్నాడు. ఇట్లు కంపెనీవారు మొఘల్ చక్రవర్తి నుండి దివానీ అధికారాలను పొందుటయేగాక నిజామత్ అధికారాన్ని సైతం తమ ఆధీనంలోనికి తెచ్చుకున్నారు.

కంపెనీవారు రెవిన్యూ వసూలు (దివానీ) చేయడానికి ప్రత్యక్షంగా బాధ్యతలను చేపట్టటానికి సుముఖంగా లేదు. ఇందుకు ఒక ఇండియన్ డిప్యూటీ దివాన్‌ను నియమించి తన నియంత్రణలో నుండునట్లు చేసింది. కొన్ని సందర్భాలలో డిప్యూటీ సబేదార్, డిప్యూటీ దివాన్ రెండూ ఒకేవ్యక్తి నిర్వహించేవాడు. ద్వంద్వ పాలనలో కంపెనీ, నవాబు ఇద్దరు భాగస్వాములు. కాని ఆచరణలో కంపెనీవారికే వాస్తవ అధికారం.

ద్వంద్వపాలన కంపెనీకి అనేక లాభాలు కలిగాయి. బెంగాల్ పాలనపై, ఆర్థిక వనరులపై పూర్తి నియంత్రణ ఏర్పడింది. ఇట్లు కంపెనీ బాధ్యతారాహిత్యమైన అధికారాన్ని సంపాదించింది. బెంగాల్ వనరులు పూర్తిగా దోచుకొనటానికి కంపెనీకి స్వేచ్ఛ లభిస్తుంది. క్లైవ్ ద్వంద్వ పాలనను ప్రవేశపెట్టుట నాటి పరిస్థితులలో సమంజసం. బాహాటంగా కంపెనీ పాలనను హస్తగతం చేసుకుంటే స్వదేశీ రాజులందరూ ఏకమై కంపెనీ వారితో సంఘర్షణ పడే ప్రమాదముంది. అలాగే మిగిలిన ఐరోపారాజ్యాలు సైతం కంపెనీ విస్తరణకు అడ్డుకట్టవేసే అవకాశముంది.

బెంగాల్ పాలనను ప్రత్యక్షంగా నిర్వహించటానికి కంపెనీకి సుశిక్షితులైన ఉద్యోగి బృందము లేదు. వ్యాపారం కోసం వచ్చిన కంపెనీ రాజ్యస్థాపన చేసి పాలించటానికి రాజ్యాంగపరమైన సమస్యలున్నాయి. అటు బ్రిటీషు ప్రభుత్వం, ఇటు కంపెనీ నిర్దేశకుల సంఘం కంపెనీ వ్యవహారాలలో జోక్యం చేసుకోవచ్చు.

ద్వంద్వ పాలన బెంగాల్ ప్రజలకు అశనిపాతం. బెంగాల్ ఆర్థిక వనరులన్ని తరలిపోగా, ప్రజలు సర్వనాశనమైనారు. నవాబు వీరి బాగోగులను పట్టించుకోవటానికి అధికారాలు లేవు. కనీస ప్రయత్నం కూడా చేయలేదు. క్లైవ్ మాటలలో చెప్పాలంటే... "నాడు బెంగాల్‌లో నెలకొన్న అరాజకం, గందరగోళం, లంచం, అవినీతి, దోపిడీ అంతకు ముందెన్నడూ ఉన్నట్లు వినలేదు, చూడలేదు. ధనిక, పేద అని తారతమ్యం లేకుండా వారు దోచుకొన్నారు". క్రీ.శ. 1766–68 సంవత్సరాల మధ్య సుమారు 5.7 మిలియన్ల పౌండ్ల ధనాన్ని కంపెనీవారు మనదేశాన్ని నుండి కొల్లగొట్టారు. కంపెనీ ఉద్యోగులు ఎంతటి ధనవంతులయ్యారంటే తాము వ్యాపారం చేయటానికి కావలసిన డబ్బులను ఇంగ్లండ్ తెప్పించుకోవటం మానేశారు. ఈ అక్రమ ఆర్జనతో వారు సొంత వ్యాపారం సాగించి విదేశీ వాణిజ్యాన్ని సాగించి సంపన్నులైనారు.

బెంగాల్ రాష్ట్ర పాలన అస్తవ్యస్తమైంది. పరిపాలనను చక్కబరచే అధికారాలుగాని, శక్తి సామర్థ్యాలు గాని నవాబుకు

లేవు. కంపెనీ బాధ్యతారహితమైన అధికారాన్ని చలాయించటం వలన బెంగాల్ పాలన కుంటుపడింది. ఈ తరుణంలో బెంగాల్‌లో కరవు సంభవించి సుమారు మూడవ వంతు జనాభా ప్రాణాలు కోల్పోయారు. ఏమైనా ద్వంద్వ పాలన సస్యశ్యామలమైన బెంగాల్ రాష్ట్రాన్ని సర్వనాశనం చేసింది.

ద్వంద్వ పాలన బెంగాల్‌లో కంపెనీకి పాలనా, ఆర్థిక వ్యవసాయాలపై పూర్తి నియంత్రణ కల్పించింది. కాని బెంగాల్‌కు తీవ్ర నష్టం కల్గించింది.

## 53.4 సైన్య సహాయక సంధి

క్రీ.శ. 1798–1805 సంవత్సరాల మధ్య గవర్నర్ జనరల్‌గా పనిచేసిన లార్డ్ వెల్లస్లీ – సామ్రాజ్యవాది. భారతదేశంలో స్వదేశీ సంస్థానాలను తన ఆధీనంలోనికి తెచ్చుకోవటానికి బ్రిటీష్ రాజ్యానికి ఫ్రెంచి బెడదను (నెపోలియన్ పథకాలు) నివారించటానికి వెల్లస్లీ సైన్య సహాయక సంధిని ప్రవేశపెట్టాడు. ఈ పద్ధతి వలన కంపెనీకి అనేక నూతన ప్రాంతాలు దక్కి రాజ్యవిస్తరణ జరిగింది.

### సైన్యసహాయక సంధికి దారితీసిన పరిస్థితులు:

1. క్రీ.శ. 1797 నాటికి మహారాష్ట్రులను, మైసూరు వారిని బ్రిటీష్‌వారు అణచివేశారు. బ్రిటీష్‌లోని పారిశ్రామిక, వర్తకవర్గాలు తమ ఉత్పత్తులను ఇండియాలో విరివిగా అమ్ముకోవాలంటే రాజ్యవిస్తరణ జరగాలనే కోరుకున్నాయి.
2. కంపెనీవారు తమ ఆర్థిక ప్రయోజనాలను దెబ్బతినకుండా రాజ్యవిస్తరణ జరిగితే మంచిదనే భావనతో ఉండేవి.
3. బ్రిటీష్‌వారు తమ అధికారాన్ని సుస్థిరపరచుకోవటానికి ఐరోపాలో నెపోలియన్ నేతృత్వంలోని ఫ్రాన్సు సాగించే దండయాత్రలను అడ్డుకోవాలని దృఢనిశ్చయంతో ఉంది. అందుకు భారత్‌లోని స్వదేశీ రాజులను కట్టడి చేయాలనే మైసూరు పాలకులను అణచివేసింది. ఇట్టి స్థితిలో కాబూల్ పాలకుడైన జామాన్‌షా భారత్‌పై దండెత్తుతాడని, అతనికి భారత్‌లోని స్వదేశీ రాజులు మద్ధతు ఇవ్వగలరని ఆశించడం జరిగింది. జామన్‌షాను టిప్పుసుల్తాన్ సైతం ఆహ్వానించారు.

తన రాజకీయ లక్ష్యాలను సాధించటానికి వెల్లస్లీ మూడు పద్ధతులను అనుసరించాడు. 1. యుద్ధాలు, 2) సైన్య సహాయక సంధి, 3) సామంతుల రాజ్యాలను ఏదో ఒక నెపంతో ఆక్రమించుట.

కంపెనీవారు స్వదేశీ రాజుల ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం చేసుకున్నా, వెలస్లీ రాకతో స్వదేశీ రాజులను ఆంగ్ల సార్వభౌమత్వ పరిధిలోనికి తీసుకొని రావటానికి నిర్దేశింపబడింది.

### సైన్య సహాయక సంధి–ముఖ్యలక్షణాలు

1. స్వదేశ రాజులు తమ సైన్యాన్ని పూర్తిగా రద్దుచేసి, తమ రక్షణకు ఆంగ్లేయులపై (ఆంగ్ల సైన్యంపై) ఆధారపడాలి.
2. ఆంగ్ల సైన్య పోషణకు స్వదేశీరాజులు తమ రాజ్యంలోని కొంత భూభాగాన్ని లేదా ధనాన్ని కంపెనీకి దత్తత చేయాలి.
3. స్వదేశీ రాజులు ఆంగ్ల సార్వభౌమత్వాన్ని గుర్తించాలి.

4. ఆంగ్లేయులు తప్ప మిగిలిన ఐరోపావాసులను తమ రాజ్యం నుండి బహిష్కరించాలి.

5. ఆంగ్లేయుల అనుమతి లేనిదే ఇతర స్వదేశీ రాజులతో ఎట్టి ఒడంబడికలుగాని, యుద్ధాలు గాని చేయకూడదు.

6. ఈ షరతుల్ని సరిగా అమలు పరచునట్లు చూచుటకు ఒక ఆంగ్ల ప్రతినిధి స్వదేశీరాజుల కొలువులో ఉంటాడు. ఈ ఆంగ్ల ప్రతినిధికి అగు ఖర్చు స్వదేశీ రాజులు భరించాలి.

**ఫలితాలు:**

**ఎ) స్వదేశీరాజులకు కలిగిన నష్టాలు**

1. స్వదేశీరాజులు తమ సార్వభౌమత్వాన్ని, హక్కులను, స్వేచ్ఛను కోల్పోయారు. ఆంతరంగిక, విదేశీ విధానాలలో పూర్తిగా ఆంగ్లేయులపై ఆధారపడాలి.

2. ఆంగ్లేయులు స్వదేశీరాజులలో వ్యవహారాలలో నిత్యం జోక్యం చేసుకొనేవారు.

3. సైన్య పోషణార్థం చెల్లించు వ్యయం అధికంగా ఉండుట వలన చాలా స్వదేశీ సంస్థానాలు ఆర్థిక దుస్థితికి లోనైనాయి.

4. తమకు స్వదేశ, విదేశ దాడుల నుండి రక్షణ కలదని స్వదేశ రాజులు సోమరులై, భోగలాలసులై ప్రజా సంక్షేమాన్ని విస్మరించారు. తత్ఫలితంగా స్వదేశీ సంస్థానాలలో దుష్పరిపాలన నెలకొంది.

5. స్వదేశరాజులు తమ సైన్యాన్ని రద్దు చేయుట వలన, వారు అకస్మాత్తుగా జీవనోపాధి కోల్పోయి, హంతకులుగను, దారి దోపిడీ దొంగలుగా మారారు. ఉదా: పింజారులు

**బి) బ్రిటీషువారికి కల్గిన ప్రయోజనాలు**

1. పైసా ఖర్చు లేకుండా బ్రిటీషువారు తమ సైన్యాన్ని విస్తృతపరచి, తద్వారా సామ్రాజ్య విస్తరణ గావించారు.

2. స్వదేశీ రాజుల కొలువులో ఆంగ్ల సైన్యముండుట వలన, అవసరమైతే స్వదేశీ రాజునే తొలగించి ఆ రాజ్యాన్ని ఆక్రమించుకొనడానికి వీలు కల్గింది.

3. రక్తపాతం లేకుండా ఐరోపావాసులను నెపమున ఫ్రెంచివారికి భారత్‌లో నిలువ నీడలేకుండా చేశారు.

4. సైన్య సహాయక సంధిలో చేరిన స్వదేశీ (రాజులు) సంస్థానాలు ఏవనగా హైదరాబాద్ (సెప్టెంబర్ 1798 మరియు 1800), మైసూరు (1799), తంజావూరు (అక్టోబరు 1799), అయోధ్య (నవంబరు 1801), మరాఠా పీష్వా (డిసెంబర్ 1801), బీరార్ (భాన్‌స్లే) (డిసెంబర్, 1803), సింధియా (ఫిబ్రవరి 1804), రాజపుత్ర రాజ్యాలైన జోధ్‌పూర్, జైపూర్,మంచేరి, బుంది, భరత్‌పూర్.

| సైన్య సహాయక సంధి ద్వారా వెలస్లీ కంపెనీ రాజ్యాన్ని కంపెనీ సామ్రాజ్యంగా మార్చాడు. |
|---|

## 53.5 రాజ్యసంక్రమణ సిద్ధాంతం

వెల్లస్లీ ప్రారంభించిన సామ్రాజ్యవాదాన్ని తారాపథానికి తీసుకెళ్లినవాడు గవర్నర్ జనరల్ లార్డ్ డల్హౌసీ (1848–1856). ఇతడు గొప్ప సామ్రాజ్యవాది. రాజ్య విస్తరణలో నీతినియమాలను, ప్రజల మనోభావాలను లెక్కచేయలేదు.

స్వదేశీ రాజుల పాలన అవినీతి, నియంతృత్వంతో కూడుకొని ఉన్నదని, వానికంటే ఆంగ్లేయ పాలన మెరుగైందని డల్హౌసీ విశ్వాసం.

స్వదేశీ సంస్థానాలో బ్రిటీషు ఉత్పత్తులను నిరాటంకంగా అమ్ముకోవాలంటే, వాని ఆక్రమణల తప్ప మరేమార్గం లేదు.

డల్హౌసీ రాజ్యవిస్తరణలో మూడు పద్ధతులనుసరించాడు. ఎ) యుద్ధాలు, బి) దుష్పరిపాలన, సి) రాజ్యసంక్రమణ సిద్ధాంతం. యుద్ధం ద్వారా పంజాబ్ (1849), పెగూ (1852)లను; దుష్పరిపాలన ద్వారా అయోధ్యను (1856) ఆక్రమించాడు. రాజ్యసంక్రమణ సిద్ధాంతం ద్వారా ఈ కింది స్వదేశీ సంస్థానాలను హస్తగతం చేసుకొన్నాడు. అవి ఏమనగా... సతారా (1848), జైపూర్ (1849), సంభల్‌పూర్ (1849), సిక్కిం (1850), భగత్ (1850), ఉదయపూర్ (1882), ఝాన్సీ (1853), నాగపూర్ (1854).

ఈ మూడింటిలో రాజ్య సంక్రమణ సిద్ధాంతాన్ని ఎక్కువగా అనుసరించాడు. ఈ పద్ధతి ప్రకారం ఆంగ్ల రక్షిత రాజ్య పాలకులు సంతానహీనులైతే, బ్రిటీషువారి అనుమతి లేకుండా ఎవరిని దత్తత తీసుకొనరాదు. ఇట్టి అనుమతి లేకుండా ఏ స్వదేశ రాజైనా దత్తత చేసికొనిన ఆ దత్త కుమారునికి వ్యక్తిగత ఆస్తి సంక్రమించునేగాని, ఆ స్వదేశ సంస్థానం సంక్రమింపదు. పైగా ఆ స్వదేశీ సంస్థానం కంపెనీకి సంక్రమిస్తుంది. దత్తత అంగీకరించుట, అంగీకరింపక పోవుట కంపెనీ ఇష్టం. కాని డల్హౌసీ అన్ని సందర్భాలలోను దత్తత అంగీకరింపక స్వదేశీ సంస్థానాలను ఆక్రమించాడు. కర్ణాటక నవాబు, సూరత్, తంజావూరు పాలకుల బిరుదులను రద్దు చేశాడు. కడపటి పీష్వా రెండవ బాజీరావు దత్త కుమారుడైన నానాసాహెబ్‌కు చెల్లిస్తున్న భరణాన్ని కూడా రద్దు చేశాడు.

డల్హౌసీ ఆక్రమణలో యావద్భారతానికి ఆంగ్ల రాజ్యం విస్తరింప చేసింది. డల్హౌసీ ఏకీకృత పాలనా సంస్కరణలకు వీలుకల్గింది. అయితే రాజ్యసంక్రమణ సిద్ధాంతం, భారతీయుల సంప్రదాయానికి విరుద్ధం. పైగా ఎవ్వరికి దత్తత అంగీకరింపక పోవుట వలన సంస్థానాధీశులు, ప్రజలలో తీవ్ర అసంతృప్తి, అభద్రతాభావం నెలకొంది. తత్ఫలితంగా తమ సంస్థానాలను కోల్పోయినవారు 1857 తిరుగుబాటులో పాల్గొన్నారు. ఉదా: నానాసాహెబ్, ఝాన్సీ పాలకురాలైన లక్ష్మీబాయి, అయోధ్య బేగమ్‌లు ఏదైనా రాజ్య సంక్రమణ సిద్ధాంతం 1857 తిరుగుబాటుకు గల కారణాలలో నొకటి యని చెప్పక తప్పదు.

> స్వదేశీ సంస్థానాలను ఆక్రమించుకోవటానికి డల్హౌసీ రాజ్య సంక్రమణ సిద్ధాంతాన్ని ఆయుధంగా వాడుకున్నాడు. తత్ఫలితంగా సంస్థానాలు కోల్పోయిన స్వదేశీ రాజులు 1857 తిరుగుబాటులో పాల్గొన్నారు.

## 53. ఎ. పాఠ్య ప్రశ్నలు

1. ద్వంద్వ పాలన కంపెనీని బెంగాల్‌లో నిజమైన పాలకులుగా చేసిందని ఏల చెప్పలగలవు?
2. ద్వంద్వ పాలన బ్రిటీష్‌వారికెట్టి ప్రయోజనాలను కల్గించింది?
3. బెంగాల్ ప్రజలపై ద్వంద్వ పాలన ఎట్టి ఫలితాన్ని కల్గించిందో ఒకదానిని తెలుపుము.
4. సైన్య సహాయక సంధిపై సంతకం చేసిన స్వదేశీ రాజులు తమ స్వాతంత్ర్యాన్ని కోల్పోవుటకు చేసిన సంతకం అని ఏల చెప్పగలవు?

5. సైన్య సహాయక సంధిపై సంతకం చేయుటకు ముందు, వెల్లస్లీ ఏ రెండు సంస్థానాలతో యుద్ధం చేశాడు?

6. రాజ్య సంక్రమణ సిద్ధాంతం అనగానేమి?

7. దుష్పరిపాలన అను నెపం ద్వారా డల్హౌసీ ఆక్రమించిన రాజ్యమేది?

**సెక్షన్-2**

**వ్యవసాయ, పారిశ్రామిక విధానాల సమీక్ష**

బ్రిటీష్‌వారు అనుసరించిన ఆర్థిక విధానాలు తమ స్వీయ ప్రయోజనాలను కాపాడుకోవటానికి ఉద్దేశింపబడ్డాయి. తత్ఫలితంగా భారతీయుల జీవన విధానం పూర్తిగా మారిపోయింది. ముఖ్యంగా గ్రామీణ వ్యవస్థ దెబ్బతింది.

## 53.6 వ్యవసాయ విధానం

బ్రిటీషువారు రాక పూర్వం భారతదేశ గ్రామాలు స్వయం పోషకములై, స్వయం సమృద్ధి కల్గియున్నాయి. గ్రామీణవాసులు తమకు కావలసిన వస్తువులను తాము ఉత్పత్తి చేసుకొనేవారు. రైతులకు భూమిపై హక్కులుండేవి. ఎట్టి పరిస్థితులలోనూ వారి భూమిని ఇతరులకు ధారాధత్తం చేసేవారు కాదు. సాగు చేసిన భూమికి ప్రభుత్వానికి శిస్తు చెల్లించేవారు. గ్రామ పెద్ద ఈ శిస్తును వసూలు చేసి ప్రభుత్వానికి జమచేసేవాడు. రైతుల వివాదాలను గ్రామ పంచాయితీలు పరిష్కరించేవి.

కాని ఆంగ్ల సామ్రాజ్య స్థాపనతో గ్రామీణ వ్యవస్థ అనేక మార్పులకు లోనైంది. బ్రిటీషువారు గ్రామీణ వ్యవస్థలో జోక్యం చేసికొని, పాత వ్యవస్థను తమకు అనుకూలంగా మార్చుకున్నారు. పంట దిగుబడిని పరిగణనలోనికి తీసికోకుండా ఎక్కువ మొత్తంలో భూమిశిస్తు నిర్ణయించి, అది నగదు రూపంలో చెల్లించాలని ఆదేశించారు. బ్రిటన్‌లో ఉత్పత్తియైన వస్తువులు చౌకగా గ్రామాలకు తరలించుట వలన చేతి పనివాండ్రు ఇబ్బందులకు గురియైనారు.

భారతదేశం నుండి వచ్చే ఆదాయంతో కంపెనీవారు బ్రిటీష్ పార్లమెంటుకు కప్పం చెల్లించుటేగాక, మన దేశంలో లభ్యమయ్యే వస్తువులను కొనుగోలు చేసి విదేశాలకు ఎగుమతి చేసేవారు. కంపెనీ వారికి వచ్చు నికర ఆదాయం భూమిశిస్తు. అందువలన భూమిశిస్తు వసూలులో ఏ పద్ధతి ప్రవేశపెట్టినా, (జమీందారీ, మహల్వారీ, రైత్వారీ) రైతులను దోచుకొనుటే వారి పరమావధి.

భూమి ప్రైవేటు ఆస్తి. నిర్ణీత గడువులోపల భూమిశిస్తు చెల్లించటానికి రైతులు తమ భూమిని తాకట్టు పెట్టడంగాని, లేక అమ్మటం గాని చేసేవారు. ఇట్లు గ్రామీణ భారతంలో పేదరికం వృద్ధి చెందటానికి దోహదం చేసింది.

చాలా సందర్భాలలో కంపెనీ సాయం లభింపక, రైతులు తమ ఆర్థికావసరాలను తీర్చుకోవటానికి వడ్డీ వ్యాపారులను ఆశ్రయించక తప్పలేదు. భూమిని తాకట్టు పెట్టుకొని అధిక వడ్డీలు వసూలు చేసి, దొంగ లెక్కలతో అమాయక రైతులను వడ్డీ వ్యాపారులు పీల్చి పిప్పి చేశారు. సకాలంలో రుణం చెల్లించనపుడు ఆ భూములను వడ్డీ వ్యాపారులు హస్తగతం చేసుకొనేవారు. ఇట్లు క్రమంగా రైతు, రైతు కూలిగా మారిపోగా, మధ్యతరగతి భూస్వామ్య వర్గం ఏర్పడింది.

వ్యవసాయోత్పత్తులు వ్యవసాయ వాణిజ్యీకరణతో దెబ్బతిన్నాయి. మార్కెట్ అవసరాలను తీర్చటానికి, బ్రిటన్‌లోని పరిశ్రమలకు కావలసిన ముడిసరకులను ఉత్పత్తి చేయటానికి అనుగుణంగా భారతదేశంలో వ్యవసాయం మలచబడింది. ఇట్లు ఉత్పత్తి చేసిన ముడిసరకులను చౌకగా కొని, విదేశాలలో ఉత్పత్తియైన వస్తువులను అధిక ధరలకు అమ్మేవారు.

ఇట్లు రైతు రెండువిధాల దోపిడీకి గురియై దరిద్రుడుగా మారాడు. పైగా పంట వచ్చిన సమయంలో భూమిశిస్తు చెల్లించటానికి, రుణాలు తీర్చుకోవటానికి తమ పంటకు గిట్టుబాటు ధర లేకపోయినా తెగనమ్ముకోవలసిన పరిస్థితి కలిగింది.

వ్యవసాయ రంగంలో పాత భూస్వాములు అంతరించి వడ్డీ వ్యాపారులు తమ అప్పులకు బదులు భూమిని హస్తగతం చేసుకొనుటతో నూతన భూస్వామ్యవర్గం ఏర్పడింది. ఇట్లు నూతన భూస్వామ్యవర్గం వ్యవసాయరంగంపై తీవ్ర ప్రభావాన్ని కల్గించింది. అదెట్లనగా ...

1. ఈ భూస్వాములు భూమి సాగుచేయక కౌలుకిచ్చేవారు. ఈ కౌలుదార్లు సైతం ఆ భూమిని భూమిని సాగుచేసే రైతులకు మరల కౌలుకిచ్చేవారు.
2. భూమిశిస్తు అధికంగా నిర్ణయింపబడేది.
3. భూమిశిస్తు నిర్దాక్షిణ్యంగా వసూలు చేయబడేది. భూమిశిస్తు వసూలుకు ఏజెంట్లను నియమించేవారు. ఇట్టి దళారీ వ్యవస్థలో రైతుల దోపిడీ నిరాటంకంగాసాగింది. ఈ భూస్వాములు తమ ప్రయోజనాలను కాపాడుకోవటానికి జాతీయోద్యమంలో పాల్గొనక బ్రిటీషువారికి అండగా నిలిచారు.

ఇట్లు వ్యవసాయం ప్రతిష్టంభనలో చిక్కుకొంది. వ్యవసాయరంగం సాంకేతిక పరిజ్ఞానానికి నోచుకొనలేదు. భూమిపై ఆధారపడే వారిసంఖ్య పెరిగిపోయింది. రైతు అధిక పన్నుల భారంతో (ప్రభుత్వం విధించే) అధిక భూమిశిస్తు, జమీందారుకు చెల్లించ వలసిన కౌలు, వడ్డీవ్యాపారికి చెల్లించవలసిన వడ్డీతో క్రుంగిపోయాడు. కరవు, కాటకాలు, దారిద్ర్యంతో రైతు కంపెనీ పాలనలో అష్టకష్టాలు పడ్డాడు.

## 53.7 పారిశ్రామిక విధానం

క్రీ.శ. 1600–1757 సంవత్సరాల మధ్య కాలంలో కంపెనీవారు భారత్‌లో తయారు వస్తువులను ఇంగ్లండ్‌లో అమ్మి అధిక లాభాలు గడించారని, అందుకే వారు మనదేశంలో ఉత్పత్తులు పెంచారని మనం చదివాం. కంపెనీ లాభాలు ఇంగ్లండ్‌లోని ఉత్పత్తిదారుల ప్రయోజనాలను దెబ్బతీశాయి. అందుకు వారు బ్రిటీషు ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చి, భారతదేశ వస్తువులను ఇంగ్లండ్‌లో అమ్మకుండా చర్యలు తీసుకోవాలని కోరారు. తత్ఫలితంగా బ్రిటీషు ప్రభుత్వం 1720లో భారతదేశం నుండి వచ్చే వస్త్రాలను ధరింపరాదని శాసించెను.

ఇంగ్లండ్‌లో పారిశ్రామిక విప్లవం సంభవించుటతో, నూతన సాంకేతిక పరిజ్ఞానం వలన ఉత్పత్తులు అనూహ్యంగా పెరిగాయి. ఈ ఉత్పత్తులను అమ్ముకోవటానికి బ్రిటన్ ప్రపంచవ్యాప్తంగా నున్న వలస రాజ్యాలను అనగా భారత్, ఆఫ్రికా, చైనా, ఆస్ట్రేలియా, లాటిన్ అమెరికా వంటి దేశాలను ఎంచుకొంది. ఇట్లు ఇంగ్లండ్‌లో పెట్టుబడిదారులు లేక పారిశ్రామికవేత్తలు అనే నూతన వర్గం ఏర్పడింది. ఈ వర్గం ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చి తమ ప్రయోజనాలను కాపాడుకోవటానికి సదా యత్నించాయి. దీని కనుగుణంగానే 1813, బ్రిటీషు పార్లమెంటు కంపెనీ వర్తక గుత్తాధిపత్యాన్ని రద్దు చేసింది. ఇట్లు 1857 వరకు బ్రిటీషు ఆర్థిక విధానం ఇంగ్లండ్‌లోని పరిశ్రమలకు కావలసిన ముడిసరకులను సరఫరా చేసి, అచటి ఉత్పత్తి అయ్యే వస్తువులను కొనుగోలు చేసే మార్కెట్‌గా భారత్‌ను వినియోగించుకొంది. దిగుమతులపై ఆంక్షలు విధించి, ఎగుమతులపై సుంకాలు తగ్గించి, చౌకగా తమ వస్తువులను భారత్‌లో అమ్ముకొనుట వలన స్థానిక పనివాండ్రు ఆపోటీకి తట్టుకోలేక కుదేలైనారు.

19వ శతాబ్ద ద్వితీయార్ధంలో బ్రిటీషు పారిశ్రామిక విధానం మారింది. పరిశ్రమలను ఇండియాలోనే స్థాపించటం ప్రారంభమైంది. ఇట్లు నూలు, జనపనార, పంచాదార మిల్లులు, బొగ్గుగనులు, ఖనిజ పరిశ్రమలు భారత్‌లో బ్రిటీషు పారిశ్రామికవేత్తలు స్థాపించారు. ఈ పరిశ్రమల స్థాపన బ్రిటీషు పారిశ్రామికవేత్తలకు అధిక లాభాలు గడించుటకు ఉద్దేశించినవేగాని భారత్‌కు ఎట్టి ప్రయోజనం లేదు.

భారత్‌లో పరిశ్రమల స్థాపన వలన ముడిసరుకులు స్థానికంగా లభించుట వలన రవాణా ఖర్చులు తగ్గటం, భారతీయులే కార్మికులుగా తక్కువ వేతనాలతో పనిచేయటం వలన పారిశ్రామికవేత్తల లాభాలు పెరిగాయి. దీనికితోడు ప్రభుత్వం పారిశ్రామికవేత్తలకు అనేక ప్రోత్సాహకాలు ప్రకటించింది. రైల్వే రవాణా ఛార్జీలలో రాయితీలు ఇచ్చింది. తక్కువ వడ్డీ రేటుతో పారిశ్రామికవేత్తలకు రుణ సౌకర్యాలు కల్పింపబడ్డాయి. ఇదే సమయంలో భారతీయ పారిశ్రామికవేత్తల పట్ల విచక్షణా విధానాన్ని పాటించారు.

వ్యవసాయ వాణిజ్యీకరణం, పారిశ్రామిక విధానం వలన అనేకమంది రైతులు, పనివాండ్రు జీవనోపాధిని కోల్పోయి, బ్రిటీషువారి వ్యవసాయంలో కూలీలుగా చేరవలసి వచ్చింది. దీర్ఘకాలిక పనిగంటలు, స్వల్పవేతనాలతో వీరు దారిద్ర్యం అనుభవించారు. అయితే కాలగమనంలో వీరు, భారతీయ పారిశ్రామికవేత్తలు భారతదేశ ఆర్థికాభివృద్ధిలో కీలకపాత్ర పోషించారు.

19వ శతాబ్ద యుగాంతానికి భారత్‌లోని గుజరాతీలు, పార్శీలు, శెట్టియార్‌లు సైతం పరిశ్రమలు స్థాపించారు. భారత పారిశ్రామికవేత్తలకు ప్రభుత్వం నుండి ఎట్టి ప్రోత్సాహకాలు లేవు. భారత్‌లో భారీ, కీలక పరిశ్రమల స్థాపన జరగలేదు. సరియైన ఆర్థిక సాయం లేక, బ్రిటీషువారి ఆంక్షలతో కొరవడిన నూతన సాంకేతిక పరిజ్ఞానంతో, భారత్‌లోని పారిశ్రామిక అభివృద్ధి నత్తనడకన సాగింది.

## 53.8 కుటీర లేక దేశీయ పరిశ్రమల క్షీణత

బ్రిటీషువారు అనుసరించిన ఆర్థిక విధానాల ఫలితాలలో నొకటి-దేశీయ లేక కుటీర పరిశ్రమల క్షీణత. సంప్రదాయబద్ధమైన గ్రామీణ ఆర్థిక వ్యవస్థ బ్రిటీషు ఆర్థిక విధానాల వలన దెబ్బతింది. దీని స్థానంలో ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో కూడుకొనిన పరిశ్రమల స్థాపన జరగలేదు. తత్ఫలితంగా చేతపనివాండ్రు జీవనోపాధి కోల్పోయి వ్యవసాయంపై ఆధారపడవలసి వచ్చింది.

దీనికితోడు 1813 నుండి బ్రిటీషువారు ఏకపక్ష స్వేచ్ఛా వ్యాపార విధానాన్ని అనుసరించారు. విదేశాలకు ఎగుమతి అయ్యే వస్తువులపై ఆంక్షలు విధించారు. వీని స్థానంలో ఇంగ్లండ్‌లో తయారైన వస్తువులను చౌకగా మనదేశంలో అమ్ముకొన్నారు. స్వదేశీ రాజులు దేశీయ పరిశ్రమలను ప్రోత్సహిస్తే, బ్రిటీషువారు మనదేశం నుండి ముడిసరకులను తమ దేశానికి పంపించటానికి యత్నించారు. తత్ఫలితంగా అసంఖ్యాక భారతీయ పనివాండ్రు, చేతివృత్తులవారు తమ సంప్రదాయ వృత్తులను వదలుకొని వ్యవసాయ కూలీలుగా మారిపోయారు. ఈ విషయాన్ని గవర్నర్ జనరల్ విలియం బెంటింక్ 1834-35 నివేదికలో "నేత పనివాండ్రు బక్క చిక్కి, వారి ఎముకలు సైతం శల్యమై (తెల్లబారి)నాయి. ఇట్టి దుస్థితి నాటి సమకాలీన వాణిజ్య చరిత్రలో లేదు" అని పేర్కొన్నాడు. దేశీయ పరిశ్రమలకు పేరుగాంచిన సూరత్, ముర్షిదాబాద్, ఢాకా వంటి నగరాలు దేశీయ పనివాండ్రు లేక నిర్మానుష్యంగా మారాయి.

ఇట్లు ఆంగ్ల పాలన కళకళలాడే భారతీయ కుటీర పరిశ్రమలను నాశనం చేసింది. తత్ఫలితంగా వ్యవసాయ రంగంపై ఒత్తిడి పెరిగింది.

## 53.9 భారతీయ సంపద తరలిపోవటం

(Drain of Wealth)

భారతీయ సంపద లేక ఆర్థిక వనరులు ఇంగ్లండ్‌కు నిరాటంకంగా తరలిపోవుట. ఆంగ్ల వలస ఆర్థిక విధానాల ఫలితములలో నొకటి.

భారతదేశానికి దిగుమతి అయ్యే వస్తువుల విలువ కంటే, ఇంగ్లండ్‌కు ఎగుమతి అయ్యే వస్తువుల విలువ ఎక్కువగా ఉండుటను 'డ్రెయిన్ థియరీ' అంటారు. అనగా ఎక్కువ విలువ గల సరకులను బ్రిటన్‌కు ఎట్టి ప్రతిఫలం లేకుండా, ఉచితంగా పంపటం. దీనినే దాదాబాయ్ నౌరోజీ, రమేష్‌చందత్ వంటి ఆర్థిక శాస్త్రవేత్తలు 'డ్రెయిన్' అని వ్యవహరించారు. ముస్లిం పాలకుల వలె బ్రిటీషువారు తాము భారత్‌లో అంతర్భాగమనే దృష్టితో పాలింపలేదు. వారు మాతృదేశానికి భారత వనరులను తరలించి తమ దేశ ఔన్నత్యానికి పాటుపడ్డారు. తత్ఫలితంగా భారతదేశ సంపద నిరాటంకంగా దోచుకోవటం జరిగింది.

భారతీయ సంపద తరలిపోవటం అనేక రూపాలలో జరిగింది. తొలుత బెంగాల్ నవాబులు తమ పదవుల కోసం కంపెనీ వారికి అధిక మొత్తంలో నజరానాలు చెల్లించారు. 1765 అలహాబాదు సంధిలో బెంగాల్ నందు రెవెన్యూ వసూలు చేసుకొనే దివానీ అధికారాన్ని పొందారు. దస్తర్‌ల దుర్వినియోగం, చేతిపని వాండ్ర పట్ల మోసపూరితంగా వ్యవహరించి దోచుకోవటం, చివరకు కంపెనీ ఉద్యోగుల అవినీతి పరులై కంపెనీ దివాలా తీసే స్థాయికి దిగజార్చటం వంటి చర్యలకు పాల్పడ్డారు. ఒకవంక కంపెనీ దివాలా తీస్తుంటే, ఉద్యోగులు మాత్రం సంపన్నులగుచున్నారు. రాబర్ట్‌క్లైవ్, వారన్‌హేస్టింగ్స్ సైతం విపరీతమైన అక్రమార్జనకు పాల్పడి కుబేరులైనారు.

కంపెనీ బెంగాల్‌ను పూర్తిగా దోచుకుంది. భారత్‌లోని వస్తువులను కొనుగోలు చేయటానికి అవసరమైన ధనాన్ని కంపెనీ ఇంగ్లండ్ నుండి తెప్పించుకోవటం మానేసి, భారతదేశ వాణిజ్యంతో వచ్చే లాభాలనే పెట్టుబడిగా వినియోగించింది. ఇవియే కంపెనీ పెట్టుబడులుగా చలామణి అయ్యాయి. ఇట్లు 1766-68 సంవత్సరాల మధ్య సుమారు 5.7 మిలియన్ పౌండ్ల ధనం బెంగాల్ నుండి తరలింపబడింది. ఇవిగాక కంపెనీ ఉద్యోగుల జీతభత్యాలు, కూడబెట్టిన ధనం, ఇతర రాబడులు సైతం ఇంగ్లండ్‌కు తరలిపోవటం జరిగింది.

బ్రిటీష్ ప్రభుత్వం గైకొనే ఆర్థిక చర్యలన్నీ భారతదేశాన్ని ఆర్థికంగా దోపిడీ చేయుటకు ఉద్దేశించినవే. ఇంగ్లండ్ పెట్టుబడులతో రైల్వేలను స్థాపించి, వానికి అధిక వడ్డీరేట్లు చెల్లించారు. ఈ విధంగా రైల్వేల నుండి వచ్చే లాభాలు బ్రిటన్‌కు తరలిపోయాయి. ఇవిగాక పాలనా వ్యయమంతా, తుదకు సైనిక వ్యయం కూడా హోంఛార్జీల పేరిట వసూలు చేశారు.

ఇంకనూ ఆంగ్లేయులు చేసిన ఆఫ్ఘన్, బర్మా, పారశీక మున్నగు విదేశీ దండయాత్రలకు, హేస్టింగ్, వెల్లస్లీ మున్నగువారు సాగించిన స్వదేశీరాజులతో యుద్ధాల ఖర్చులు సైతం భారత ఆర్థిక వనరుల నుంచి సమకూర్చుకొన్నవే.

దాదాబాయి నౌరోజీ ఈ సంపద ఎలా తరలిపోతుందో తన గ్రంథమైన 'Poverty and Un British Rule in India' లో సవిస్తరంగా వివరించాడు. ఆయన గణాంకాల ప్రకారం 1905లో 51.5 కోట్ల రూపాయలు ధనాన్ని భారత్ నుండి బ్రిటన్ అన్యాక్రాంతంగా దోచుకుంది. ఇట్లు ఒకవంక భారతదేశంలోని అన్నివర్గాల వారు (స్వదేశీ రాజులు, చేతిపనివాండ్రు, కర్షకులు కూడ దారిద్ర్యంలో మ్రగ్గుతూఉంటే ఇంగ్లీషువారు కుబేరులుగా ఎదిగారు.

ఆంగ్ల రాజ్య స్థాపనతో సంప్రదాయ భారత ఆర్థిక వ్యవస్థ చిన్నాభిన్నమైంది. బ్రిటీషు ప్రయోజనాలను కాపాడే రీతిలో భారతదేశ వలసరాజ్యం మలచబడింది. దేశీయ పరిశ్రమలు క్షీణించి, భారతదేశ సంపద అనేక రూపాలలో ఇంగ్లండ్‌కు తరలింపబడింది.

## 53. బి పాఠ్యప్రశ్నలు

1. భూమిశిస్తు వసూలు విధానంలో బ్రిటీషువారు వేలం పాట పద్ధతి ప్రవేశపెట్టారు. వేలంపాటదారుడు భూమిశిస్తు చెల్లించకపోతే ఎవరు లబ్ది పొందుతారు?
2. భూమిని సాగు చేయని భూస్వాములనగా నెవరు?
3. నూతన భూస్వామ్య వ్యవస్థ ఏర్పడటానికి గల రెండు కారణాలను తెలుపుము.?
4. భారతదేశ పారిశ్రామిక రంగంపై 1720, 1813, బ్రిటీషు ప్రభుత్వ చట్టాల ప్రభావమెట్టిది?
5. సంపద తరలిపోవటం అనగానేమి?

### సారాంశం

బక్సారు యుద్ధం తరువాత జరిగిన అలహాబాదు సంధిలో (1765) కంపెనీవారు బెంగాల్ రాష్ట్రంలో దివానీ అధికారాన్ని పొందారు. రాబర్ట్‌క్లైయివ్ బెంగాలులో ద్వంద్వ పాలనను ప్రవేశపెట్టాడు. బెంగాల్ పాలనను కంపెనీ నియమించే డిప్యూటీ సుబేదార్ నిర్వహిస్తాడు. ఇట్లు దివాన్‌తో (రెవెన్యూ వసూలుతో) ప్రత్యక్షంగా, డిప్యూటీ సుబేదార్‌తో పరోక్షంగా కంపెనీ బెంగాల్ పాలనను నియంత్రించింది. ద్వంద్వ పాలన బెంగాల్‌కు అశనిపాతం. బెంగాల్ ఆర్థిక వనరులను కంపెనీ దోచుకుంది.

ఆంగ్ల రాజ్య విస్తరణలో కీలకపాత్ర వహించినవారు – వెల్లస్లీ, డల్హౌసీ. వెల్లస్లీ సైన్య సహాయక సంధి ద్వారా శాంతియుతంగా బ్రిటీష్ సార్వభౌమత్వాన్ని నెలకొల్పాడు. సైన్య సహాయక సంధి అంగీకరించిన స్వదేశీ రాజులు ఆంగ్ల సార్వభౌమత్వాన్ని గుర్తించి, తన ఆస్థానంలో ఆంగ్ల సైన్యాన్ని, ఆంగ్ల ప్రతినిధిని ఉంచుకొని వారి ఖర్చులను భరించాలి. వారు స్వదేశీ, విదేశీ విధానాలను కంపెనీ ద్వారానే నిర్వహించాలి. రాజ్యవిస్తరణకు డల్హౌసీ అనుసరించిన వినూత్న సిద్ధాంతం – రాజ్య సంక్రమణ సిద్ధాంతం. ఈ సిద్ధాంతం ప్రకారం స్వదేశీ రాజులు సంతానహీనులైన కంపెనీవారి అనుమతి లేకుండా ఎవ్వరినీ దత్తత తీసుకోరాదు. దత్తత అంగీకరిస్తే ఆ రాజ్యం దత్త కుమారునికి చెందుతుంది. దత్తత అంగీకరింపకపోతే కంపెనీకి సంక్రమిస్తుంది. డల్హౌసీ అన్ని సందర్భాలలో దత్తత అంగీకరింపక, చాలా స్వదేశీ రాజ్యాలను హస్తగతం చేసుకున్నాడు. దీనితో స్వదేశీ రాజులలో భయాందోళనలు చెలరేగి 1857 తిరుగుబాటుకు ఒక కారణంగా పరిణమించింది.

బ్రిటీషు వారి ఆర్థిక విధానాలు వారి స్వీయ ప్రయోజనాలను పెంపొందించుకునే రీతిలో మలచబడ్డాయి. బ్రిటీషు వారు సంప్రదాయ భారత గ్రామీణ వ్యవస్థను నాశనం చేశారు. అధిక భూమిశిస్తు, వ్యవసాయ వాణిజ్యీకరణం, వడ్డీ వ్యాపారుల దోపిడీకి భూమి అమ్మకాలు పెరిగి నూతన భూస్వామ్యవర్గం ఏర్పడటం జరిగింది. భూమిపై ఒత్తిడి పెరగటం, కౌలుదారీ వ్యవస్థ మున్నగు కారణాల వలన వ్యవసాయ రంగంలో ప్రతిష్ఠంభన ఏర్పడగా, జమీందారులు, ప్రభుత్వ, వడ్డీవ్యాపారులు కబంధ హస్తాలలో రైతులు నలిగిపోయారు.

బ్రిటీషు పారిశ్రామిక విధానం బ్రిటన్ పారిశ్రామిక అవసరాలను తీర్చేవిధంగా రూపొందించారు. బ్రిటన్‌లో తయారయ్యే వస్తువులకు మార్కెట్‌గా, బ్రిటన్ పరిశ్రమలను ముడిసరకులను సరఫరా చేసే దేశంగా భారత్‌ను మార్చారు. తొలుత భారతదేశ వస్తువులను విదేశాలలో అమ్ముకోవటం వలన కంపెనీవారు అధిక లాభాలు గడించారు. కాని 1813లో బ్రిటీషు ఉత్పత్తిదారుల ఒత్తిడి మేరకు ప్రభుత్వం భారత్ నుండి వచ్చే దిగుమతులపై ఆంక్షలు విధించింది. 1858 తరువాత బ్రిటీషు పారిశ్రామికవేత్తలే భారత్‌లో పరిశ్రమలు స్థాపించారు. తత్ఫలితంగా భారత వాణిజ్యం పూర్తిగా బ్రిటీషువారి నియంత్రణలోనికి పోగా, అందు భారతీయులకు ఎట్టి అవకాశం లేకుండా పోయింది. తమ వస్తువులను అమ్ముకోవటానికి బ్రిటన్ రైల్వేలను అభివృద్ధి చేసింది. చౌకగా ముడి సరుకులు, చౌకగా కార్మికులు లభ్యమగుట వలన పరిశ్రమలతోబాటు వ్యవసాయ క్షేత్రాలను సైతం బ్రిటీషువారు స్థాపించి కుబేరులైరి. భారీ, కీలక పరిశ్రమల స్థాపన జరగలేదు. శ్రామికవర్గం జాతీయోద్యమంలో చురుకుగా పాల్గొన్నారు.

బ్రిటీషు వాణిజ్య విధానం భారత్‌లో కుటీర పరిశ్రమల క్షీణతకు, భారత సంపద బ్రిటన్‌కు తరలిపోవటానికి దోహదంచేసింది. బ్రిటన్‌లో ఉత్పత్తి అయ్యే పారిశ్రామిక వస్తువులు చౌకగా లభ్యమగుట వలన స్థానిక పనివాండ్రు ఉత్పత్తులకు గిరాకీ తగ్గి వారు జీవనోపాధిని కోల్పోవటానికి కారణమైంది. దీనికితోడు భారత్ నుండే వచ్చే వస్తువులపై ఆంక్షలు విధింప బడటం, స్థానిక చేతిపని వాండ్రకు ఆదరణ కొరవడటం వలన చేతివృత్తుల వారి పరిస్థితి దయనీయంగా మారింది. ఇట్లు జీవనోపాధిని కోల్పోయిన వీరు వ్యవసాయ కూలీలుగా మారిపోయారు.

ఆంగ్ల ఆర్థిక విధానంలో దారుణమైనది – భారత్‌లోని సంపదను దోచుకోవటం. ఆంగ్ల పాలనా వ్యయమంతా హోంచార్జీల పేరిట భారత ఆర్థిక వనరుల నుండి చెల్లించబడేవి. ఇంకా బ్రిటన్ సాగించే యుద్ధాలకు సైతం భారత వనరులను వినియోగించారు. ఇట్టి మితిమీరిన ఆర్థిక దోపిడీతో భారతదేశం కడు పేదదేశంగా మారింది.

## అభ్యాసం

1. బక్సారు యుద్ధ ప్రాముఖ్యమేమి?
2. బెంగాల్ పాలనకు క్లైవ్ ప్రవేశపెట్టిన ప్రభుత్వమేమి? బెంగాల్‌పై దాని ప్రభావమెట్టిది?
3. ఏ పరిస్థితులలో స్వదేశ రాజులు సైన్య సహాయక సంధిలో చేరారు? ఈ సంధి ముఖ్యాంశంలేమి?
4. ఆంగ్ల రాజ్య విస్తరణకు డల్హౌసీ అనుసరించిన ముఖ్యమార్గమేది? ఈ విధంగా బ్రిటీషువారు ఆక్రమించిన రెండు సంస్థానాల పేర్లను వ్రాయుము.
5. ఆంగ్ల పాలన ఏ విధంగా రైతుల దుస్థితికి, దేశీయ (కుటీర) పరిశ్రమల క్షీణతకు దోహదం చేసిందో తెలుపుము?
6. బ్రిటీషువారు అనుసరించిన పారిశ్రామిక విధానం భారతీయ పరిశ్రమలపై ఎట్టి ప్రభావాన్ని కల్గించింది?
7. బ్రిటీషువారు అనుసరించిన ఏ ఆర్థిక విధానాలు భారత సంపద బ్రిటన్‌కు తరలిపోవటానికి దోహదం చేసింది?
8. భారతదేశ ఆర్థిక వ్యవస్థపై ఆంగ్ల పాలనా ప్రభావమెట్టిది?

## అదనపు సమాచారం

ఆంగ్లేయులు రాజ్యవిస్తరణ కోసం నాల్గు మార్గాలను అనుసరించారు. అవి ఏమనగా – యుద్ధం, సైన్య సహాయక పద్ధతి, రాజ్య సంక్రమణ సిద్ధాంతం, ఏదో ఒక నెపం. ఈ కింద ఇచ్చిన పట్టికలో 'A' వరుస ఇచ్చిన రాజ్యాలు ఏ పద్ధతి

ద్వారా బ్రిటీషువారు ఆక్రమించారో 'B', 'C', 'D', 'E' అనే వానితో గుర్తింపుము.

| స్వదేశీరాజ్యం | యుద్ధం | సైన్యసహాయక పద్ధతి | రాజ్యసంక్రమణ సిద్ధాంతం | ఏదో ఒక నెపం |
|---|---|---|---|---|
| A | B | C | D | E |
| సింధ్ | | | | |
| అయోధ్య | | | | |
| హైదరాబాద్ | | | | |
| ఝాన్సీ | | | | |
| పంజాబ్ | | | | |
| మైసూర్ | | | | |

**పాఠ్య ప్రశ్నలకు జవాబులు**

**53.ఎ.**

1. దివానీ అధికారాన్ని ప్రత్యక్షంగా, నిజామత్ అధికారాన్ని పరోక్షంగా డిప్యూటీ సుబేదార్ ద్వారా కంపెనీ బెంగాల్‌లో నిజమైన పాలకులైనారు.
2. బాధ్యతారహితమైన అధికారాన్ని పొందడమేగాక, బెంగాల్ ఆర్థిక వనరులను సైతం వినియోగించుకొని, కంపెనీ తమ స్థానాన్ని పదిలం చేసుకోవటానికి వీలు కల్పించింది.
3. బెంగాల్ ఆర్థిక దుస్థితికి, కరువుకు లోనైంది.
4. స్వదేశీ రాజ్యం సహాయక సంధిలో చేరుట వలన తమ ఆంతరంగిక, విదేశీ విధానాలను పూర్తిగా బ్రిటీషువారి అనుమతితో నిర్వహించటం, తమ సైన్యాన్ని రద్దు చేసి తమ రక్షణకు ఆంగ్ల సైన్యంపై ఆధారపడటం.
5. మైసూర్, మరాఠా రాజ్యాలు
6. ఆంగ్ల సార్వభౌమత్వం గుర్తించిన స్వదేశీ రాజులు సంతానహీనులైతే, వారి దత్తతను కంపెనీ అంగీకరింపకపోతే ఆ రాజ్యం బ్రిటీషు వారికి సంక్రమించటాన్ని – రాజ్యసంక్రమణ సిద్ధాంతం అంటారు.
7. అయోధ్య

**52. బి.**

1. ధనవంతులు, వర్తకులు, సంపన్న రైతులు

2. భూములకు దూరంగా పట్టణ ప్రాంతాలలో నివసించే నూతన భూస్వామ్య వర్గం. వీరు తమ ఏజెంట్ల ద్వారా రెవిన్యూ వసూలు చేసుకుంటారు.

3. 1. భూములను కౌలుకివ్వటం, 2. అధిక కౌలు, 3. సాగు చేయని భూస్వాములు, 4. ఆంగ్లేయులకు మద్దతునిచ్చి జమీందారుల ఆవిర్భావం (వీనిలో ఏ రెండైనా)

4. ఎ. 1720 చట్టం – భారతదేశంలో తయారయ్యే వస్త్రాలను ధరించటంపై ఆంక్షలు విధించింది. తత్ఫలితంగా భారతీయ ఎగుమతులు తగ్గాయి.

   బి. 1813 చట్టం – కంపెనీ భారతదేశ వర్తక గుత్తాధిపత్యాన్ని రద్దు చేసింది. బ్రిటీషువారి శ్రామిక ఉత్పత్తులు భారత మార్కెట్‌ను ముంచేశాయి.

5. ఎట్టి ప్రతిఫలం లేకుండా భారతీయ సంపద వివిధ రూపాలలో (పన్నులు, హోంఛార్జీలు వగైరా) బ్రిటన్‌కు తరలిపోవటం.

# 54

# భారతదేశంలో ఆంగ్లవిద్య

## 54.1 పరిచయం

బ్రిటీష్‌వారు ప్రాచీన భారతీయ సంస్కృతికి భిన్నమైన సంస్కృతిని, విద్యను తీసుకొచ్చారని మనకు తెలుసు. ఆధునిక విద్య, సాంకేతిక పరిజ్ఞానము ఐరోపావాసులను భారతీయుల కంటె మిన్నగా తీర్చిదిద్దింది. కంపెనీ వారు తొలి రోజులలో నాటికే అమలులో ఉన్న భారతీయ విద్యావ్యవస్థలో జోక్యం చేసుకోవడానికి ఇష్టపడలేదు. రాజారామ్‌మోహన్‌రాయ్, ద్వారాకానాథ్ ఠాగూర్, మున్నగు భారతీయులు ఆంగ్ల విద్య ఆవశ్యకతను నొక్కిచెప్పారు. కాలగమనంలో కొంతమంది ఇంగ్లీషువారు భారతీయులు మరియు ముస్లింలు ఆధునిక విద్యావ్యాప్తి బోధనకు పాఠశాలలు, కళాశాలలు స్థాపించారు. ఈ కొద్ది కాలములోనే పాశ్చాత్య విద్య జాతీయతా భావానికి, నవభారత నిర్మాణానికి పునాదులు వేసింది.

## 54.2 లక్ష్యాలు

ఈ పాఠం చదివిన తరువాత ఈ కింది విషయాలు తెలుసుకుంటాం.

1. ఆంగ్ల విద్యావ్యాప్తికై క్రైస్తవ మిషనరీలు, వ్యక్తులు చేసిన కృషి.
2. ఆంగ్ల విద్యావ్యాప్తికి కంపెనీ, బ్రిటీష్ ప్రభుత్వము చొరవ తీసుకోవడానికి కారణాలు.
3. ఆంగ్ల విద్యావ్యాప్తికి రాజారామ్‌మోహన్‌రాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, మహదేవ గోవింద రనడే మున్నగువారి కృషి.
4. ఆంగ్ల విద్యావ్యాప్తిలో మెకాలే, విలియమ్ బెంటిక్, ఉడ్ కమిటీ, హంటర్ కమీషన్ వహించిన పాత్ర.
5. 20వ శతాబ్దిలో ఆంగ్ల విద్యాభివృద్ధి.

## 54.3 మిషనరీల, ప్రైవేటు వ్యక్తుల తొలి ప్రయత్నాలు

ఆంగ్ల విద్యావ్యాప్తికి తొలుత శ్రీకారం చుట్టినవారు క్రైస్తవ మిషనరీలు, కంపెనీలో పనిచేసే ఉన్నత ఉద్యోగులు, విద్యా సంస్థల స్థాపనలో క్రైస్తవ మత వ్యాప్తికి ఉద్దేశించినా, ఆంగ్ల విద్యావ్యాప్తికి అఖండ సేవ చేశాయి. మిషనరీలు అనేక ఉచిత విద్యా సంస్థలను స్థాపించాయి. ఉదా: బొంబాయిలో సెయింట్ మేరీస్ ఛారిటి పాఠశాల (క్రీ.శ.1715),

రివరెండ్ రిచర్డ్ కాబ్ ఛారిటి పాఠశాల (క్రీ.శ.1718) మున్నగునవి.

మిషనరీలు, వారి మద్దతుదారులు, మేధావులు పాశ్చాత్య విద్యా విధానము మాదిరిగా భారత్‌లో విద్యా విధానాన్ని అభివృద్ధి చేయాలని కంపెనీపై ఒత్తిడి తెచ్చారు. కేవలం వ్యాపారం కొరకు మన దేశానికి వచ్చిన కంపెనీవారు తొలుత విద్య పట్ల శ్రద్ధ వహించలేదు. కానీ వారన్‌హేస్టింగ్స్ రాకతో ఈ దృక్పథం మారింది. క్రీ.శ.1781లో కొంతమంది కలకత్తా ముస్లింలు మదర్‌సాను స్థాపించాలని వారన్‌హేస్టింగ్స్‌ను కోరారు. తత్ఫలితంగా కలకత్తాలో ఒక మదర్‌సా స్థాపించబడింది. క్రీ.శ.1791లో జోనాథన్ డంకన్ హిందూ న్యాయ స్మృతులను, గ్రంథాలను అధ్యయనం చేయడానికి వారణాసిలో ఒక సంస్కృత కళాశాలను స్థాపించాడు. గొప్ప పాత్రికేయుడు, పండితుడైన సర్ విలియం జోన్స్ క్రీ.శ.1789లో 'ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్'ను స్థాపించాడు. కంపెనీ ఉద్యోగులకు స్థానిక భాషల పరిజ్ఞానానికి అనేక శిక్షణా సంస్థలు స్థాపించబడ్డాయి. అవియే క్రీ.శ.1800లో కలకత్తాలో స్థాపించబడ్డ ఫోర్ట్ విలియమ్ కళాశాల, క్రీ.శ.1818లో మద్రాస్‌లో స్థాపించబడిన ఫోర్ట్ సెయింట్ జార్జి కళాశాల.

క్రైస్తవ మిషనరీలు, ప్రైవేటు వ్యక్తులు తొలుత ఆంగ్ల విద్యా విధానాన్ని ప్రవేశపెట్టారు. 1781లో వారన్‌హేస్టింగ్స్ కలకత్తాలో ఒక మదర్‌సాను స్థాపించాడు.

## 54.-ఎ పాఠ్య ప్రశ్నలు

1. కంపెనీ వారి తొలి రోజులలో ఆంగ్ల విద్యావ్యాప్తికి కృషి చేసిన రెండు సంస్థల పేర్లు తెలుపుము?
2. కంపెనీ వారు తొలి రోజులలో ఆంగ్ల విద్యావ్యాప్తికి విముఖంగా ఉండుటకు కారణమేమి?
3. ఏ గవర్నర్ జనరల్ కలకత్తాలో మదర్‌సాను స్థాపించడానికి చొరవ తీసుకున్నాడు?

## 54.4 బ్రిటీష్ ప్రభుత్వ విద్యా విధానం

తొలి రోజులలో బ్రిటీష్‌వారు ఆంగ్ల విద్య పట్ల విముఖత ప్రదర్శించినా, తదుపరి రాజ్య విస్తరణ, ఇతర అవసరాల దృష్ట్యా ఆంగ్ల విద్యావ్యాప్తికి కృషి చేయక తప్పలేదు.

కంపెనీ పాలనలో క్రిందిస్థాయి ఉద్యోగాలను భర్తీ చేయడానికి ఇంగ్లీషు వారిని నియమించడం సాధ్యం కాదు. కనుక స్థానికులైన భారతీయులను నియమించాలి. ఇట్లు నియమింపబడే భారతీయులకు ఆంగ్ల భాషా పరిజ్ఞానం అవసరం. అందుకు బ్రిటీష్‌వారు ఆంగ్ల విద్యా సంస్థలు స్థాపించి తమ పరిపాలనా అవసరాలను తీర్చుకున్నారు. ఆంగ్ల రాజ్య సుస్థిరతకు, ఆంగ్ల సంస్కృతి వ్యాప్తికి ఆంగ్ల విద్యా విధానం దోహదం చేసి, భారతీయులను ఆంగ్లేయులకు సన్నిహితులను చేస్తుందని వారి విశ్వాసం. రామ్‌మోహన్‌రాయ్ వంటి భారతీయులు మాత్రం పాశ్చాత్య విద్యను అభ్యసించుట ద్వారా పాశ్చాత్య విజ్ఞానాన్ని సంతరించుకొని భారత్ అభివృద్ధి పథంలో కాలిడుతుందని విశ్వసించారు.

ఆంగ్ల విద్యా వ్యాప్తిలో తొలి చర్య – కంపెనీ వారు క్రీ.శ.1813 చార్టర్ చట్టంలో ప్రతిఏటా లక్ష రూపాయలు కేటాయించడం. ఈ కేటాయింపులు క్రీ.శ.1833 వరకు ఖర్చు చేయలేదు. ఈ నిధులను ఏ విద్యా విధానానికి వినియోగించాలో నిర్ణయించడానికి కంపెనీ ఒక కమిటీని నియమించింది. ఈ కమిటీ రెండుగా చీలి, ప్రాచ్య విద్యా విధానం (పారశీక, అరబ్బీ, సంస్కృత భాషల బోధన) ప్రవేశపెట్టవలెనని విల్సన్, హంటర్ మున్నగువారు వాదింపగా, ఆంగ్ల లేక పాశ్చాత్య విద్యావిధానం ప్రవేశపెట్టవలెనని సర్ ఛార్లెస్ ట్రైవెలియన్, మెకాలే మున్నగువారు వాదించారు.

క్రీ.శ.1835లో ప్రభుత్వం ఆంగ్ల భాషను రాజభాషగా ప్రకటించింది. ప్రభుత్వ ఉత్తర్వుల ప్రకారం ప్రభుత్వ నిధులు ఆంగ్ల విద్యా విధానానికి వినియోగించాలని ఆదేశించింది. క్రమంగా పాలన, న్యాయ శాఖలలో పారశీక భాష బదులు ఇంగ్లీషు భాష వాడుకలోనికి వచ్చింది.

## మెకాలే నివేదిక

క్రీ.శ.1834లో మెకాలే గవర్నర్ జనరల్ సలహా సంఘంలో న్యాయసభ్యుడిగా మనదేశానికి వచ్చాడు. కంపెనీవారు విద్యకు కేటాయించిన నిధులు ఏ విద్యావిధానానికి వినియోగించాలో తేల్చడానికి మెకాలే అధ్యక్షతన ఒక కమిటీని నియమించింది. ఈ కమిటీ సభ్యుల సిఫార్సులన్నింటిని కూలంకషంగా పరిశీలించి క్రీ.శ.1835లో ఒక నివేదిక సమర్పిస్తూ ప్రభుత్వ నిధులను ఆంగ్ల భాష ద్వారా పాశ్చాత్య విద్యావిధానానికి వినియోగించాలని పేర్కొన్నారు. గతంలో శాస్త్రీయ, సాంకేతిక రంగాలలో భారతీయులు సాధించిన విజయాలేమిటో వారికి తెలియదు. ప్రస్తుతం భారతీయుల పరిజ్ఞానం కంటె పాశ్చాత్య పరిజ్ఞానం మిన్న. భారతీయ భాషల అధ్యయనం వలన ఎట్టి ప్రయోజనం లేదు. ఆంగ్ల భాషా జ్ఞానము ప్రాచ్య భాషా జ్ఞానం కంటే ఎన్నో రెట్లు ఉన్నతమైనదని మెకాలే పేర్కొన్నారు.

## లార్డ్ విలియమ్ బెంటిక్

విలియమ్ బెంటిక్ రాకతో ఆంగ్ల విద్యా విధానానికి ఒక నిర్దిష్టమైన రూపు వచ్చింది. ఆంగ్ల భాషను ప్రజా భాషగా యావత్ భారతదేశం విస్తరించుటయే బెంటిక్ లక్ష్యం. దీనికి అనుగుణంగా బెంటిక్ మార్చి 7, 1835లో ఒక ఉత్తర్వును జారీ చేశాడు. దీని ప్రకారం

1. పాశ్చాత్య, సారస్వత, శాస్త్రీయ జ్ఞానాన్ని ఆంగ్ల భాష ద్వారా ప్రోత్సహించి ప్రభుత్వ నిధులను దానికే వినియోగించాలి.
2. ప్రాచ్య విద్యాసంస్థలు రద్దు చేయబడవు. ప్రాచ్య భాషలలో ఇప్పటికే అసంఖ్యాక గ్రంథాలు ఉండుట వల్ల నూతన గ్రంథాల ప్రచురణ నిలిపివేయాలి. ఇట్టి నిలుపు ద్వారా చేకూరిన ధనాన్ని ఆంగ్ల విద్యావ్యాప్తికి వినియోగించాలి.

ఈ ఉత్తర్వుకు అనుగుణంగా అనేక ఆంగ్ల బోధన విద్యాసంస్థలు దేశవ్యాప్తంగా ఎక్కువగా బెంగాల్ రాష్ట్రంలో స్థాపింపబడ్డాయి.

బెంటిక్ ఉత్తర్వుల ప్రభావం వలన చిరకాలంగా వచ్చే సాంప్రదాయ విద్యా విధానం దెబ్బతిన్నది. బ్రిటీష్ ప్రభుత్వం ప్రవేశపెట్టిన నూతన విద్యావిధానం ప్రజలను చదవడం, వ్రాయడానికే పరిమితం చేసింది. ప్రజలందరిని విద్యావంతులను చేయడానికి ఎట్టి ప్రయత్నం చేయలేదు. ప్రభుత్వం విద్యావ్యాప్తికి 'వడపోత సిద్ధాంతాన్ని' (Downward Filtration Theory) అనుసరించింది. ఈ సిద్ధాంతం ప్రకారం సమాజంలో విద్యను కొంతమందికి మాత్రమే పరిమితం చేయాలని నిర్ణయింపబడింది. ఇట్లు విద్యావంతులైన కొద్దిమంది తాము ఆర్జించిన విజ్ఞానాన్ని మిగతావారికి అందజేస్తారని భావించారు. ఈ సిద్ధాంతం క్రీ.శ.1854లో రద్దు కాబడినా, బ్రిటీష్ పాలనా కాలమంతటా ఇది అమలులో ఉంది.

లార్డ్ హర్డింజ్ విద్యా నివేదికలో (క్రీ.శ.1844) ఆంగ్ల భాషా పరిజ్ఞానం ఉన్నవారికే ఉద్యోగార్హత ఉన్నదని ప్రకటించుటతో ఆంగ్ల విద్యావ్యాప్తికి ఆర్థిక ప్రేరణ లభించింది. తత్ఫలితంగా ఉద్యోగం లభించాలంటే ఆంగ్ల భాషా పరిజ్ఞానం అవసరం.

క్రీ.శ.1853 చార్టర్ చట్టం పునః పరిశీలన సమయంలో బ్రిటీష్‌వారు ఆంగ్ల భాషను ప్రజలందరికి విస్తరింప జేయాలని సంకల్పించారు. ఇందుకు అనుగుణంగా డల్హౌసీ కాలంలో సర్ ఛార్లెస్ ఉడ్ నేతృత్వంలో ఒక కమిటీ నియమింపబడింది.

### ఛార్లెస్ ఉడ్ కమిటీ నివేదిక- క్రీ.శ.1854

ఈ కమిటీ విద్యావ్యవస్థను సమూలంగా మార్పు చేయుటకు అనేక సూచనలు చేసింది.

1. లండన్ విశ్వవిద్యాలయం తరహాలో ముంబాయి, కలకత్తా, మద్రాస్‌లలో విశ్వవిద్యాలయాల స్థాపన.
2. వృత్తి, సాంకేతిక విద్యలకు ప్రాధాన్యత.
3. ప్రతి రాష్ట్రంలో ఒక విద్యాశాఖ ఏర్పాటు చేసి ఒక అధికారి పర్యవేక్షణలో (Director of Public Instruction) ఉంచుట
4. స్త్రీ విద్యను ప్రోత్సహించుట.
5. ఉపాధ్యాయ శిక్షణా సంస్థలు స్థాపించుట
6. వడపోత విధానం రద్దు.
7. ప్రాథమిక విద్యాబోధన ప్రాంతీయ భాషలలో జరుపుట.. మున్నగునవి.

వాస్తవంగా ఈ సిఫార్సులను ప్రభుత్వం పూర్తిగా అమలు పరచలేదు. కేవలం వారి పాలనా సౌలభ్యం కొరకు పనికివచ్చు ఉద్యోగులను తయారు చేయుటకే వారు శ్రద్ధ వహించిరి. మెకాలే మాటలలో చెప్పాలంటే 'మేము పాలించే అసంఖ్యాక ప్రజలకు మాకు మధ్య అనుసంధానకర్తలను తయారు చేయుటయే మా ధ్యేయం. రంగు, రూపు భారతీయులదైనా, సంస్కృతి, ఆలోచనా, వేష భాషలు ఆంగ్లేయులకు ప్రతిబింబంగా ఉండాలని మా ఆకాంక్ష'.

ఆంగ్ల పాలనకు మద్దతుగా ఉండే వర్గాన్ని తయారు చేయుటయే ఆంగ్ల విద్యా విధానం ప్రముఖ లక్ష్యం. కనుకనే యావత్ ప్రజానీకాన్ని విద్యావంతులను చేయడానికి ఎట్టి ప్రయత్నాలు చేయలేదు. స్త్రీ విద్యా వ్యాప్తికి చొరవ తీసుకోలేదు. క్రీ.శ.1857 నాటికి మూడు వైద్య కళాశాలలు, రూర్కిలో ఒక ఇంజనీరింగ్ కళాశాల స్థాపించబడింది. ఏది ఏమైనా సంప్రదాయ విద్యా విధానం నశించి దాని స్థానములో ఆంగ్ల విద్య ప్రభావం చోటు చేసుకుంది.

క్రీ.శ.1813 ఛార్టర్ చట్టంలో లక్ష రూపాయలు కేటాయించుట. భారత్‌లో విద్యకు శ్రీకారం చుట్టింది. 1835 మెకాలే నివేదిక, విలియమ్ బెంటిక్ ప్రభుత్వ ఉత్తర్వులు, క్రీ.శ.1854 ఉడ్ నివేదిక కంపెనీ పాలనలో విద్యాభివృద్ధికి గైకొన్న చర్యలు.

## 54. బి. పాఠ్య ప్రశ్నలు

1. కంపెనీ కార్యకలాపములు విస్తృతమగుటతో కంపెనీవారు ఆంగ్ల విద్యావ్యాప్తికి శ్రద్ధ వహించారు. అందుకు గల రెండు ముఖ్య కారణములు తెలుపుము?
2. 1813 ఛార్టర్ చట్టం విద్యారంగానికి ముఖ్యమైంది. ఏల?
3. మెకాలే నివేదికలోని ముఖ్యాంశములేవి?
4. భారతీయ సమాజంలోని ఏ వర్గాన్ని ఆంగ్ల విద్య నిర్లక్ష్యం చేసింది?

## 54.5 ఆంగ్ల విద్యావ్యాప్తికి భారతీయులు చేసిన సేవ

ఆధునిక సవాళ్లను ఎదుర్కోవడానికి ఆధునిక ఆంగ్ల విద్యా విధానం అవసరమని కొంతమంది భారతీయ మేధావులు గుర్తించి ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చారు. అట్టివారిలో రాజారామ్‌మోహనరాయ్, ఈశ్వర చంద్ర విద్యాసాగర్, మహదేవ గోవింద రనడే – ముఖ్యులు

### రాజా రామ్‌మోహనరాయ్ (1772–1833)

ఆధునిక శాస్త్ర పరిజ్ఞానానికి ఆధునిక భావాల విస్తరణకు ఆంగ్ల విద్యా విధానం అత్యంత ఆవశ్యకమని ఉద్ఘాటించిన మహామనిషి రాజారామ్‌మోహనరాయ్. క్రీ.శ.1817లో కలకత్తాలో హిందూ కళాశాలను స్థాపించాడు. డేవిడ్ హేర్ లాంటి ఉదార భావములు గల బ్రిటీష్‌వారు ఈ కళాశాలతో అనుబంధం కలిగి యున్నారు. ఈ కళాశాలయే కేంద్రంగా యంగ్ బెంగాల్ మూవ్‌మెంట్ అను విప్లవ సంస్థ తన కార్యకలాపములను నిర్వహించింది. ఈ ఉద్యమంలో కీలకపాత్ర వహించినవాడు హెన్రీ వివియన్ దేరోజియో (Henry Vivian Derozio) అనే ఆంగ్లో–ఇండియన్ యువకుడు. 17 సంవత్సరాల ప్రాయముననే హిందూ కళాశాలలో తత్వశాస్త్ర అధ్యాపకుడిగా చేరి విద్యార్థులలో స్వేచ్ఛ, జాతీయత, స్వతంత్ర ఆలోచనలను పెంపొందించాడు. ఇందుకు ప్రభుత్వం ఆయనను ఉద్యోగం నుండి తొలగించింది.

రాజారామ్‌మోహనరాయ్ క్రీ.శ.1817లో కలకత్తాలో ఆంగ్ల పాఠశాలను నెలకొల్పి అందు తత్వ, సాంకేతిక విజ్ఞాన శాస్త్రాలను బోధింప జేశాడు. క్రీ.శ.1825లో వేదాంత కళాశాలను స్థాపించి అచట భారతీయ, పాశ్చాత్య, సాంఘిక విజ్ఞాన శాస్త్రాలను అన్నింటిని పాఠ్య ప్రణాళికలో చేర్చాడు. బెంగాల్ రాష్ట్ర ప్రభుత్వం సంస్కృత కళాశాలను కలకత్తాలో స్థాపింప యత్నించినప్పుడు, ఇది నేటి అవసరములను తీర్చదని దానిని వ్యతిరేకించాడు. పాశ్చాత్య విజ్ఞాన సర్వస్వానికి, ఆధునిక పాశ్చాత్య ప్రజాస్వామ్య వ్యవస్థకు పాశ్చాత్య పరిజ్ఞానం తాళం చెవి లాంటిదని ఆయన విశ్వాసం. ఉదారభావాలు గల విద్యా విధానం, గణిత, తత్వ, జీవ రసాయన శాస్త్ర పరిజ్ఞానంతో కూడుకున్న పాఠ్య ప్రణాళిక అవసరమని రామ్‌మోహనరాయ్  ఉద్ఘాటించాడు.

### ఈశ్వరచంద్ర విద్యాసాగర్

ఈశ్వరచంద్ర విద్యాసాగర్ గొప్ప పండితుడు, సంస్కర్త. క్రీ.శ.1820లో పేద కుటుంబంలో జన్మించి, విద్యాబుద్ధులు నేర్చుకోవడానికి అష్టకష్టాలు పడి చివరకు స్వయం కృషితో క్రీ.శ.1851లో సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్‌గా పదవిని పొందాడు. ఆయన సంస్కృత పండితుడు, విశాల భావాలు కలవాడు. ఆయన భారతీయ, పాశ్చాత్య సంస్కృతుల మేలికలయిక ఉత్తమమని భావించాడు.

### మహదేవ గోవింద రనడే

బొంబాయిలో దక్కన్ విద్యాసంస్థను స్థాపించిన మహదేవ గోవింద రనడే విద్యావ్యాప్తికి కృషి చేశాడు. క్రీ.శ.1870లో ఇతడు 'పూనా సార్వజనిక సభ'ను స్థాపించాడు. ప్రార్థనా సమాజ సభ్యుడుగా హేతువాద బద్ధమైన మతాన్ని, సంఘ సంస్కరణకు పాటుపడ్డాడు. మూఢవిశ్వాసాలతో కూడుకున్న మతము రాజకీయ, సాంఘిక, ఆర్థిక, రంగాలలో ఎట్టి విజయాలు సాధించదని, ఉదారభావాలు గల విద్య కావాలని చెప్పాడు.

ఇట్లు 19వ శతాబ్దం అంతం నాటికి ఆంగ్ల విద్య వ్యాప్తికి గణనీయమైన కృషి జరిగింది. స్వయంగా భారతీయులే ఆంగ్ల విద్యా సంస్థలను స్థాపించుట విశేషం.

పాశ్చాత్య విద్యావిధానం ఆవశ్యకమని ఉద్ఘాటించిన వారిలో రాజారామ్‌మోహనరాయ్ ఒకరు. ఆధునిక భావాల వ్యాప్తికి పాశ్చాత్య విజ్ఞాన పరిజ్ఞానం అవసరమని భావించాడు. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ గొప్ప సంస్కృత పండితుడైనా పాశ్చాత్య సంస్కృతిలోని మంచిని స్వీకరించాలని చెప్పిన విశాల హృదయుడు.

## 54. సి. పాఠ్య ప్రశ్నలు

1. రాజారామ్‌మోహనరాయ్ పాశ్చాత్య విద్యా విధానానికి మద్దతు ఇవ్వడానికి గల కారణములేవి?
2. వివియన్ డేరోజియో ఏ అంశాలను నొక్కి వక్కాణించాడు?
3. కలకత్తాలో సంస్కృత కళాశాల స్థాపనను రాజారామ్‌మోహనరాయ్ ఎందుకు వ్యతిరేకించాడు?
4. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ గొప్ప సంస్కృత పండితుడైనా పాశ్చాత్య విద్యను నేర్చుకోవాలని ఎందుకు చెప్పాడు?

## 54.6. క్రీ.శ.1882-1905 సం. మధ్య విద్యాభివృద్ధి

ఉడ్స్ నివేదిక సిఫార్సులు ఎంతవరకు అమలు అయ్యేనో పరిశీలించి విద్యారంగంలో ఎట్టి మార్పులు అవసరమో సూచింప వలసిందిగా లార్డ్ రిప్పన్ కాలంలో సర్ డబ్ల్యు.డబ్ల్యు.హంటర్ అధ్యక్షతన ఒక విద్యాసంఘం నియమించబడినది. విద్యావ్యాప్తికి ఎట్టి చర్యలు గైకొనాలో సూచించే బాధ్యత కూడా కమీషన్‌కు అప్పగించబడింది.

### ఈ కమీషన్ ముఖ్య సిఫార్సులేమనగా ...

1. ప్రాథమిక విద్యా నిర్వహణను స్థానిక సంస్థలకు అప్పగించి వానికి స్థానిక ప్రభుత్వ నిధులు సమకూర్చుట.
2. మిగిలిన విద్యా సంస్థలను స్థాపించుటలో ప్రైవేటు సంస్థలను ప్రోత్సహించి వారికి ప్రభుత్వం ధన సహాయం (Grant-in-Aid) చేయుట.

ఇట్లు దేశవ్యాప్తంగా అనేక ప్రైవేటు పాఠశాలలు, కళాశాలలు స్థాపించబడినాయి. క్రీ.శ.1882లో పంజాబ్ విశ్వవిద్యాలయం, క్రీ.శ.1887లో అలహాబాద్ విశ్వవిద్యాలయం స్థాపించబడ్డాయి. క్రీ.శ.1901-1902 సంవత్సరం నాటికి 195 కళాశాలలు ఉండగా అందులో 179 ఆర్ట్స్ కళాశాలలు, 16 వృత్తి కళాశాలలు. వీనిలో 4 వైద్య, 4 ఇంజనీరింగ్, 3 వ్యవసాయ కళాశాలలు కాగా, 5 ఉపాధ్యాయ శిక్షణాలయములు. విద్యాసంస్థలలో ఇంగ్లీషు బోధనా మాధ్యమం కాగా, భారతీయ భాషలు నిర్లక్ష్యం చేయబడ్డాయి. క్రీ.శ.1901-1902 కాలం నాటికి అనేక ప్రాథమిక, మాధ్యమిక విద్యాసంస్థలు స్థాపించబడ్డాయి.

1901-21 సంవత్సరాల మధ్యకాలం విద్యాభివృద్ధిలో సంధికాలం విద్యావిధానంలోని పెక్కు లోపలములను తొలగించి విద్యావ్యవస్థను పటిష్ఠం చేయడానికి లార్డ్ కర్జన్ 1902లో సర్‌థామస్ ర్యాలీ అధ్యక్షతన ఒక సంఘాన్ని నియమించాడు. ఈ సంఘం ఈ సిఫారసులకు అనుగుణంగా ఉన్నత విద్యలో ప్రమాణాలు పెంచడానికి 1904లో విశ్వవిద్యాలయ చట్టాన్ని చేశాడు. విశ్వవిద్యాలయాలు పరిశోధన-బోధనా కార్యకలాపాలు చేపట్టాలని నిర్దేశింపబడింది. మాధ్యమిక విద్యలో వృత్తి విద్యతోపాటు భారతీయ భాషలను బోధనా భాషగా ప్రవేశపెట్టారు. ఈ కాలంలో ప్రాథమిక విద్యావ్యాప్తి కూడా కృషి జరిగింది. బొంబాయి శాసనసభ పట్టణ ప్రాంతాలలో నిర్బంధ ప్రాథమిక విద్యను ప్రవేశపెట్టింది.

ఈ కాలంలో జాతీయ విద్యావిధానం అనే భావంతో పాశ్యాత్య విద్యావిధానానికి ధీటుగా పరిణామం. అనిబీసెంట్, లజపతిరాయ్, గాంధీజీ మున్నగువారు భారతదేశానికి జాతీయ విద్యావిధానం కావాలని ఉద్ఘాటించారు. ఈ విద్యావిధానంలో సాంకేతిక, వృత్తిపరమైన విద్యతోపాటు జాతీయభావ ప్రేరితమైన విద్యను బోధించి ప్రజలను మాతృభూమికి సేవ చేయు బిడ్డలుగా తీర్చిదిద్దుటయే లక్ష్యం.

54.7 1921–47మధ్యకాలంలో విద్య రాష్ట్రజాబితాలో చేర్చబడి ఒక శాఖగా ఒక మంత్రి నేతృత్వంలో ఉంచబడింది. ఇట్లు 1947 నాటికి 20 విశ్వవిద్యాలయాలు 140 వృత్తి కళాశాలలు ఏర్పడ్డాయి. ఈ మధ్యకాలంలో పరిశోధన, బోధనా వ్యవస్థ విశ్వవిద్యాలయాలలో మెరుగుపడినా కొన్ని లోపాలు లేకపోలేదు. సాంకేతికవిద్య కళాశాలలు స్వల్పం. అధ్యాపకుల కొరత. గ్రంథాలయములు, ప్రయోగశాలలు కొరత. చివరకు పరీక్షా విధానం డిగ్రీలు పొందుటకే తప్ప ప్రతిభను పరీక్షించునదిగా లేకుండెను.

మాధ్యమిక విధానంలో భారతీయ భాషలను బోధనా భాషలుగా చేర్చినను, ఇంగ్లీషు భాష తప్పనిసరి పాఠ్యాంశముగా చేర్చబడింది. వ్యవసాయ, సాంకేతిక, వ్యాపార, విద్యా సంస్థలు స్థాపింపబడినా సాధారణ విద్యకే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చారు. మాధ్యమిక విద్యా సంస్థలలో ఉపాధ్యాయులకు తక్కువ వేతనం ఇచ్చేవారు. ఏమైనా ఈ కాలంలో 1921–22 సంవత్సరముల కాలం కంటే పాఠశాలల సంఖ్య రెండున్నర రెట్లు పెరిగాయి. నిధుల కొరత ఉన్నా సాధారణ విద్యాభివృద్ధి కుంటుపడలేదు.

స్వాతంత్ర్యం సిద్ధించునాటికి ఆధునిక విద్యా విధానం ప్రవేశపెట్టి సుమారు 150 సంవత్సరాలు అయింది. ఈ విద్యా విధానం తొలుత కంపెనీ స్వీయ ప్రయోజనాలకే ఉద్దేశింపబడినా, పాశ్చాత్య భావాలతో భారతీయులకు పరిచయం ఏర్పడి వారిలో రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక చైతన్యాన్ని కలిగించింది. తత్ఫలితంగా జనించిన జాతీయతా భావం జాతీయోద్యమానికి, తుదకు 1947లో స్వాతంత్ర్య సముపార్జనకు దోహదం చేసింది.

## 54. డి. పాఠ్య ప్రశ్నలు

1. ప్రభుత్వం తొలి ఆదేశాల కంటే హంటర్ కమీషన్ లక్ష్యాలు ఏల భిన్నమైనవి?
2. 20వ శతాబ్దపు ఆరంభంలో విద్యా విధానం ముఖ్య లక్షణాలేమి?
3. 20వ శతాబ్ధిలో అనేక విద్యాసంస్థలు స్థాపించబడ్డా విద్యావ్యవస్థలో నెలకొన్న రెండు ముఖ్య లోపాలేమి?
4. జాతీయోద్యమంపై ఆధునిక విద్యా ప్రభావం ఎట్టిది?

**సారాంశం :**

తొలి రోజులలో కంపెనీ విద్యా వ్యవస్థ పట్ల విముఖత ప్రదర్శించింది. కంపెనీ కార్యకలాపాలు విస్తృతం కావడం, పాలనా వ్యవస్థలో కింది ఉద్యోగుల ఆవశ్యకత మున్నగు కారణముల వలన ఆంగ్ల విద్యా విధాన ఆవశ్యకతను గుర్తించారు. క్రీ.శ.1813 ఛార్టర్ చట్టంలో భారత్‌లో విద్యాభివృద్ధికి కొంత ధనం కేటాయింపబడింది. ఈ విద్యకు కేటాయించిన నిధులు ఏ విద్యావిధానానికి వెచ్చించాలో అనే దానిమీద వివాదం ఏర్పడింది. ప్రాచ్య విద్యావిధానానికా, లేక పాశ్చాత్య విద్యావిధానానికా అనే మీమాంస ఏర్పడింది. చివరకు మెకాలే, విలియం బెంటిక్ చొరవ వలన ఆంగ్ల భాష రాజభాష కాగా, ఆంగ్ల విద్యా విధానానికే నిధులు వెచ్చించాలని నిర్దేశింపబడింది. కంపెనీ వారు విద్యావ్యాప్తికి ఎక్కువ నిధులు కేటాయించకుండా విద్యను సమాజంలోని కొంత మందికి మాత్రమే పరిమితం చేయాలనే వడపోత

సిద్ధాంతాన్ని అనుసరించారు. క్రీ.శ.1854లో ఉడ్స్ నివేదిక ప్రజలందరికి విద్య అనే అంశాన్ని నొక్కి చెప్పింది. మూడు రాష్ట్రాలలో విశ్వవిద్యాలయాలు స్థాపించబడ్డా విద్యావ్యాప్తికి ఆశించిన కృషి జరగలేదు.

పాశ్చాత్య విద్యా విధానం ఆశ్యకతను మేధావులైన భారతీయులు కూడా గుర్తించిరి. ఇట్టివారిలో రామ్‌మోహనరాయ్, ఈశ్వర చంద్ర విద్యాసాగర్, గోవింద రనడే ముఖ్యులు. వీరు అనేక విద్యా సంస్థలు స్థాపించారు. ప్రైవేటు రంగములో అనేక పాఠశాలలు నెలకొల్పబడ్డాయి. 1920–21 సంవత్సరాల కాలం నాటికి జాతీయవాదులైన అనిబీసెంట్, గాంధీజీ మున్నగువారు జాతీయ విద్యా విధానం కావాలని అభిలషించారు.

1921–47 మధ్య కాలంలో అనేక విశ్వవిద్యాలయాలు, పాఠశాలలు నెలకొల్పబడినా నిధుల కొరత, గ్రంథాలయాల కొరత, అధ్యాపకుల కొరత మున్నగు లోపాలతో సతమతమగుట వలన నిజమైన విద్యావ్యాప్తి జరగలేదు. ఏది ఏమైనా ఆధునిక పాశ్చాత్య విద్యా విధానం భారతీయులలో రాజకీయ చైతన్యమును కల్గించి, జాతీయోద్యమం సాగించి, స్వాతంత్ర్య సమూపార్జనకు దోహదం చేసింది.

## అభ్యాసం

ఈ కింది వానికి 100 పదాలలో సమాధానం వ్రాయుము.

1. అ. ప్రాచ్యవాదులు, పాశ్చాత్యవాదులు మధ్య గల భిన్న దృక్పథాలేమి?

   ఆ. సంప్రదాయ బద్ధమైన భారతీయ విద్యావ్యవస్థపై బ్రిటీష్ పాలనా ప్రభావం ఎట్టిది?

   ఇ. విద్యావ్యాప్తికి మహాదేవ గోవింద రనడే చేసిన కృషి ఏమి?

   ఈ. వడపోత సిద్ధాంతం అంటే ఏమిటి?

2. 1854 వరకు ఆంగ్ల విద్యా విధానం ఎట్టిది?

3. ఆధునిక విద్యా వ్యాప్తికి రాజారామ్‌మోహన్‌రాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ చేసిన కృషి ఎట్టిది?

4. ఆంగ్ల విద్యావ్యాప్తిలో 1901–21 సంవత్సరాల మధ్య కాలం సంధి కాలమని ఎందుకు పిలవబడింది?

5. 20వ శతాబ్ధి నాటికి విద్యాభివృద్ధి జరిగినా అది కొన్ని సమస్యలు ఎదుర్కొనవలసి వచ్చింది. ఆ సమస్యలేమిటి?

విజ్ఞానం కోసం

Education has shown progress after India gained independence. We give below certain tables for your information on this subject.

**Number of Educational Institutions**

| Item | 1950-51 | 1960-61 | 1970-71 | 1980-81 | 1984-85 |
|---|---|---|---|---|---|
| Primary Schools ... | 2,09,671 | 3,30,399 | 4,08,378 | 4,85,538 | 5,50,000 |
| Middle schools .... | 13,596 | 49,663 | 90,621 | 1,16,447 | 1,40,000 |
| High/higher sec. schools | 7,288 | 17,257 | 36,738 | 51,594 | 60,000 |
| Art, science & commerce colleges | 548 | 1,161 | 2,587 | 3,393 | 3,500 |
| Professional colleges .... | 147 | 381 | 1,017 | 1,382 | 1,500 |
| Universities ... | 28 | 44 | 93 | 123 | 135 |

**Source: Seventh Five Year Plan, 1985-90**

**Number of Students by Stage of Institutions**

**('000 nos.)**

| Item | 1950-51 | 1960-61 | 1970-71 | 1980-81 | 1984-85 |
|---|---|---|---|---|---|
| Primary Schools ... | 19,155 | 34,994 | 57,045 | 72,888 | 85,377 |
| Middle schools .... | 3,120 | 6,705 | 13,315 | 19,846 | 26,729 |
| High/hig.secondary/intermediate | 1,481 | 3,483 | 7,167 | 11,281 | 16,800 |
| University and above | 174 | 557 | 1,956 | 2,752 | 3,442 |

**Source: Seventh Five Year Plan, 1985-90**

**Elementary Education: Progress of Enrollment Sex-wise**

**(Million persons)**

| Year | Primary level (Class I-V) (Age 6-11 years) | | | Middle level (class VI-VIII) Age 11-14 years) | | |
|---|---|---|---|---|---|---|
| | **Boys** | **Girls** | **Total** | **Boys** | **Girls** | **Total** |
| 1950-51 ... | 13.8 | 5.4 | 19.2 | 2.6 | 0.5 | 3.1 |
| | (60.6) | (24.8) | (42.6) | (20.6) | (4.6) | (12.9) |
| 1960-61 ... | 23.6 | 11.4 | 35.0 | 5.1 | 1.6 | 6.7 |
| | (82.6) | (41.4) | (62.4) | (33.2) | (11.3) | (22.5) |
| 1970-71 ... | 35.7 | 21.3 | 57.0 | 9.4 | 3.9 | 13.3 |
| | (92.6) | (59.1) | (76.4) | (46.5) | (20.8) | (34.2) |
| 1980-81 ... | 44.6 | 28.1 | 72.7 | 13.3 | 6.6 | 19.9 |
| | (99.0) | (66.2) | (83.1) | (52.1) | (27.2) | (40.0) |
| 1984-85* ... | 51.2 | 34.2 | 85.4 | 17.4 | 9.3 | 26.7 |
| | (117.5) | (69.3) | (91.8) | (66.9) | (38.2) | (53.1) |

**Source:** **1. Seventh Five Year Plan, 1985-90.**

2. Ministry of Health and Family Welfare, 1983-14

**Note:** Figures in the brackets relate to percentage to the total population in the age group.

## పాఠ్య ప్రశ్నలకు జవాబులు

**54. ఎ.**

1. క్రైస్తవ మిషనరీలు, ప్రైవేటు వ్యక్తులు.
2. కంపెనీ ధ్యేయం వ్యాపారం ద్వారా లాభాలు గడించుట. అందువలన భారతీయ సంప్రదాయాలలో జోక్యం చేసుకొని వారితో సంఘర్షణ పడుట వారికి ఇష్టం లేదు.
3. వారన్ హేస్టింగ్స్

**54. బి.**

1. ఎ. కంపెనీ రాజ్య విస్తరణతో కింది ఉద్యోగి నియామకం తప్పనిసరి. అందుకు ఇంగ్లాండు నుండి వ్యక్తులను రప్పించుట కష్టం. కనుక భారతీయులను విద్యావంతులను చేయుట తప్పదు.

బి. విద్యావంతులైన భారతీయులు బ్రిటీష్‌వారికి, స్థానికుల మధ్య అనుసంధానకర్తలుగా వ్యవహరించి తమ వస్తువులకు మార్కెటింగ్ పెంచగలరని ఆశించారు.

సి. ఆంగ్ల విద్యా విధానం ఆంగ్ల పాలనను, సంస్కృతిని పొగడటం ద్వారా తమ అధికారాన్ని సుస్థిర పరచవచ్చునని నమ్మకం.

డి. బ్రిటీష్, భారత మేధావులు, దాతలు ఉదారవిద్యా విధానాన్ని ప్రవేశపెట్టాలని బ్రిటీష్ ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకురావడం.

2. క్రీ.శ.1813 ఛార్టర్ చట్టంలో భారత్‌లో విద్యాభివృద్ధికి సాలుకు లక్ష రూపాయలు కేటాయించాలని బ్రిటీష్ ప్రభుత్వం కంపెనీని ఆదేశించింది.

3. ప్రాచ్య విజ్ఞానం కంటే ఐరోపా విజ్ఞానం మెరుగైందని, ఆంగ్ల భాష బోధనా భాషగా పాశ్చాత్య విద్యా విధానానికి నిధులు వెచ్చించాలని సిఫార్సు చేశాడు.

4. అశేష ప్రజానీకం, స్త్రీలు.

**54. సి**

1. రాజారామ్‌మోహనరాయ్ పాశ్చాత్య విద్యకు మద్దతు నిచ్చుటలో ఆయన ఉద్దేశ్యమేమనగా అది శాస్త్రీయ విజ్ఞానాన్ని, ఉదారభావాలను విజ్ఞాన వికాసాలను పెంపొందిస్తుంది.

2. స్వేచ్ఛా భావం, స్వేచ్ఛ, దేశభక్తి.

3. సంస్కృతం నాటి కాల అవసరాలు తీర్చదని ఆయన భావం.

4. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ ప్రాచ్య, పాశ్చాత్య సంస్కృతుల మేలు కలయికను ఆకాంక్షించాడు.

**54. డి.**

1. హంటర్ కమీషన్ విద్యను జన బాహుళ్యానికి విస్తరించాలని భావించింది. విద్యాసంస్థలు ప్రభుత్వ, ప్రైవేటు వ్యక్తులచే నిర్వహింపబడాలని సూచించింది.

2. జాతీయ విద్యావిధానం సాంకేతిక, వృత్తి విద్యనే కాక మాతృదేశాభిమానంను కూడా ప్రవచించింది.

3. ఎ. అధ్యాపక, విద్యార్థి నిష్పత్తి సరిగా లేకపోవుట.

   బి. సాంకేతిక విద్యకొరత

   సి. సరైన గ్రంథాలయాలు, ప్రయోగశాలలు లేకపోవుట

   డి. పరీక్షల చుట్టూ కేంద్రీకృతమైన విద్యావిధానం

4. భారతీయులలో జాతీయతాభావం జనింపజేసి, బ్రిటీష్‌వారికి వ్యతిరేకంగా స్వాతంత్ర్య పోరాటమునకు దోహదం చేసింది.

# 55

# మతసంస్కరణోద్యమాలు

## 55.1 పరిచయం

భారతదేశంలో ఆధునిక విద్య యొక్క పరిచయాన్ని గూర్చి పరిమితంగానైనా, మీరు ఇంతకు ముందే అధ్యయనం చేశారు. 19వ శతాబ్దం ప్రారంభంలోనే రాజారామ్‌మోహనరాయ్, పండిత విద్యాసాగర్ వంటి వివేకులైన భారతీయులు ఆధునిక విద్యావ్యాప్తిని సమర్ధించడం ప్రారంభించారు – అని మీరు గమనించారు. 1858 తదనంతర కాలంలో భారతదేశంలో మత, సామాజిక సంస్కరణ కోసం ఆందోళన వేగవంతమైంది. ఆలోచనాపరులైన కొందరు భారతీయులు భారతీయ సనాతన, సాంప్రదాయక మతాన్ని సంస్కరించుటకు, వైదిక కర్మకాండలు మూఢ విశ్వాసాలు వంటి వాటిని తిరస్కరించుటకు, భారతీయులకు వేదాంత, విజ్ఞాన శాస్త్రములు సాధించిన పురోగతిని పరిచయం చేయడానికి ఆధునిక ప్రపంచం నుండి భారతదేశం ఏకాంత విధానం (వేరుగా ఉండడం) అంతం చేయుటకు పూనుకున్నారు.

ఈ సంస్కరణోద్యమాలు బ్రహ్మ సమాజం, ఆర్య సమాజం, రామకృష్ణ మిషన్, అలీఘర్ ఉద్యమం మరియు తదితర సంస్థల ఆవిర్భావానికి దారితీశాయి. ఈ సంస్కరణోద్యమాలన్నింటిలోను అంతర్లీనంగా ఉన్న ఐక్యత ఒకటే. అది ఏమంటే ఇవి అన్నీ హేతువాదనకు (Rationalizm) మరియు మానవత్వాని(Humanizm)కి ప్రాధాన్యమివ్వడం. ఇవి వివేకహీనమైన సంప్రదాయాలను మతాచార్యుల ఆధిపత్యాన్ని ధిక్కరించి వాటి స్థానంలో తర్కము, మానవ సంక్షేమంల దృక్పథం, ధార్మిక గ్రంథములను వ్యాఖ్యానించుటకు గల వ్యక్తిగత హక్కులను నొక్కి చెప్పాయి. ఈ ఉద్యమాలు మధ్యతరగతి ప్రజలకు హక్కులను నొక్కి చెప్పాయి. ఈ ఉద్యమాలు మధ్యతరగతి ప్రజలకు సుసంపన్నమైన భారతీయ సాంస్కృతిక వారసత్వాన్ని గూర్చి వివరించి వారిని చైతన్యవంతులుగా తయారు చేశాయి. ఈ సంస్కర్తలు వైభవోపేతమైన గతాన్ని ఆధునిక వర్తమానంతో మేళవించటాన్ని సమర్ధించారు. ఆవిధంగా వారు భారతీయులలో ఆత్మగౌరవాన్ని ఆత్మవిశ్వాసాన్ని మరియు దేశాభిమానాన్ని వృద్ధి చేశారు. అదే సమయంలో వారు బాహ్య ప్రపంచానికి చెందిన లౌకికవాదంను, జాతీయ దృక్పథంలను ప్రోత్సహించారు.

ఈ పాఠంలో మీరు 19వ శతాబ్దిలో భారతజాతిని జాగృత మొనర్చుటలో ప్రముఖ పాత్ర పోషించిన మత సంస్కరణోద్యమాలను గురించి చదువబోతున్నారు. అవి విద్యా సంస్థలను గ్రంథాలయాలను, వైద్యశాలలను, అనాథ శరణాలయాలను మరియు ఇతర సేవా సంస్థలను స్థాపించడంలో ప్రముఖ పాత్రను పోషించాయి. అయితే కాలగమనంలో వీటిలో కొన్ని సంస్థలు వివిధ మతాల ప్రజల మధ్య సామరస్యమును దెబ్బతీయటానికి కారణమయ్యాయి. ఈ విధంగా ఇవి ఆధునిక కాలంలో ఒకవైపు జాతీయ చైతన్యాన్ని అభివృద్ధి చేయుటకు, మరోవైపు కుల, మతతత్వం పెరుగుదలకు దోహదపడినవి.

## 55.2 లక్ష్యము

ఈ పాఠం చదివిన తరువాత మీరు క్రింది విషయాలను తెలుసుకొంటారు.

1. మత సంస్కరణలను సాధించుటలో రాజా రామమోహనరాయ్ మరియు బ్రహ్మసమాజము పోషించిన
2. ప్రార్థనా సమాజాన్ని మత సంస్కరణతో పాటు సామాజిక సంస్కరణ కోసం కృషి చేసిన సంస్థగా గుర్తించటం.
3. ఆర్యసమాజ భావజాలమును వివరించటం.
4. 19వ శతాబ్దములో భారత జాతి చైతన్యముతో రామకృష్ణ మిషన్ యొక్క సేవలు
5. సనాతన భారతీయ మతాలను ప్రోత్సహించుటలో దివ్యజ్ఞాన సమాజము యొక్క కృషి.
6. ముస్లింలలో మత సంస్కరణ దిశగా అలీఘర్ ఉద్యమము యొక్క కృషి.

## 55.3 ఆంగ్ల విద్యను ప్రవేశపెట్టుట

వారన్‌హేస్టింగ్స్ వంటి కొంతమంది ఆంగ్లేయులు భారతీయ సాంస్కృతిక వారసత్వ సుసంపన్నతను అభినందించేవారు. ఇది 'ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్' స్థాపనకు, తదనంతరం ప్రాచీన భారత కావ్యాలను అనువదించుటకు మరియు సంస్కృత, పాళీ, పర్షియన్ భాషల అధ్యయనానికి దారితీసింది. కాని అధిక శాతం ఆంగ్లేయులకు తాము గొప్పవారమనే భావమూ, భారతీయులపై అన్ని విషయాలలోను తృణీకార భావమూ ఉండేవి. తత్ఫలితంగా భారతదేశాన్ని 'నాగరికదేశం'గా మార్చుటకు కృషి జరిగింది.

దీనికి మౌలిక సాధనం ఆంగ్లేయ విద్యా విధానాన్ని ప్రవేశపెట్టడం మరియు వివిధ సంస్థలలో ఆంగ్ల భాషను మాధ్యమంగా ఉపయోగించడం. మెకాలే "మనం రక్తం రంగులో భారతీయులు, అభిరుచిలో, అభిప్రాయాలలో, నీతిలో, తెలివితేటలలో ఆంగ్లేయులై, మనకు మనచేత పాలించబడే మిలియన్ల ప్రజలకు మధ్య అనుసంధానకర్తలుగా పనిచేసే ఒక ప్రజావర్గంను తయారు చేయుట మనం శాయశక్తులా కృషిచేయవలసి ఉంది అనే తన అభిప్రాయమును 'మెకాలే మినిట్స్' అనే తన ప్రఖ్యాత తీర్మానం ద్వారా సరియైన వివరణ ఇచ్చాడు.

క్రీ.శ.1854లో ప్రతిపాదించబడిన 'ఉడ్స్ నివేదిక'(Woods Desphatch) 1859లో ఆమోదించబడి, భారత విద్యా విధానాన్ని భారతీయులకు ఆంగ్ల విద్యను అందించడం ప్రాముఖ్యతను నిర్దేశిస్తూ వచ్చింది. ఇది ప్రాథమిక విద్య ప్రాధాన్యతను కూడా నొక్కి చెప్పింది. పర్యవసానంగా పూర్తిగా ప్రభుత్వ నిధులతో నడుపబడు కొన్ని పాఠశాలలు ప్రైవేట్ యాజమాన్యంలో నడపబడేవి. (ప్రభుత్వ గ్రాంటు ఉన్నవీ, లేనివీ) మరికొన్ని ఇలా ఎన్నో పాఠశాలలు, కళాశాలలు వెలిశాయి. వీటిలో అతి ముఖ్యమైనది తర్వాత ప్రెసిడెన్సీ కాలేజీ (presidency college) గా మారిన కలకత్తా హిందూ కళాశాల, దేశంలో మొట్టమొదటి మూడు విశ్వవిద్యాలయాలు, కలకత్తా, బొంబాయి, మద్రాసు నగరాలలో స్థాపించబడ్డాయి. ఆధునిక విద్యతో ఆంగ్ల భాష మాత్రమే కాక పాశ్చాత్యుల ఉదార భావాలు ప్రజాస్వామ్య సంస్థల పరిజ్ఞానం కూడా పరిచయమయ్యాయి.

ఆంగ్ల విద్యను నేర్చిన చాలామంది భారతీయులు కూడా పాశ్చాత్యులు సాధించిన అభివృద్ధిని, విలువలను, సామాజిక మరియు రాజకీయ సంస్థలను, వైజ్ఞానికాభివృద్ధిని ప్రశంసించారు. వారు తమ ఆలోచనలు తమ స్వదేశ

పరిస్థితుల వైపు మరల్చి భారతీయులు, త్యజించవలసినది మార్చుకోవలసినది ఎంతో ఉందని గ్రహించారు.

## 55.4 బ్రహ్మసమాజం మరియు రాజారామ మోహనరాయ్

ఈకాలమునకు చెందిన గొప్ప సంస్కర్తలలో రాజారామమోహనరాయ్ ప్రత్యేకంగా పేర్కొనదగినవాడు. ఈయన ఉన్నతమైన ప్రాచ్య, పాశ్చాత్య భావాల విశిష్ట సమ్మేళనం. గొప్ప సాహితీవేత్త, భారతీయ సంస్కృతిని గురించిన విశేష పరిజ్ఞానం గల వ్యక్తి ఈయన క్రైస్తవ, ఇస్లాం మతాలతో అవగాహనాయుతంగా వ్యవహరించుటకుగాను వాటిని అధ్యయనము చేయుటకు ప్రత్యేకంగా కృషి చేశాడు. మత సమ్మతితో నాటి భారతదేశంలో అమలులో ఉన్న వివిధ దురాచారాలను ఏవగించుకున్నాడు. ఈయన వితంతువులను భర్తల చితిపై దహనం చేసే 'సతి' అనే దురాచారాన్ని తీవ్రంగా వ్యతిరేకించాడు. దీనిపై ఆంగ్లేయులు మొదట్లో ఉదాసీన వైఖరిని అవలంబించారు. కాని తర్వాత భారతీయులు సమర్థించడం వలన సామాజిక సంస్కరణకు పూనుకున్నారు. క్రీ.శ.1829లో ప్రభుత్వము 'సతి' దురాచారాన్ని నిషేధించింది. అందుకు రామమోహనరాయ్ కృషికి అపూర్వం.

రాజారామమోహనరాయ్ ఆనాటి భారత సమాజములో విస్తరించి ఉన్న వర్ణ వ్యవస్థను కూడా తీవ్రంగా వ్యతిరేకించాడు. ఒక గొప్ప మానవతావాదిగా, ప్రజాస్వామ్యవాదిగా ఆయన దీనికి వ్యతిరేకంగా రచనలు చేశాడు. ఉపన్యాసాలిచ్చాడు. హిందూమత విజ్ఞానానికి సంబంధించిన మరొక అంశం వేదాలు, ఉపనిషత్తుల అధ్యయనం. ఏకోశ్వరోపాసనే మౌలికమైన హిందూ విధానమని నిరూపించుటకు, బహుదేవతారాధనను, విగ్రహారాధనను ఖండించుటకు కావలసిన ఆధారాలను అందించింది. ఆయన 'అన్ని మతాలకూ, మానవజాతి అంతటికీ, ఒకే ఒక దేవుడున్నాడు' అని ప్రకటించాడు. ఆయన బెంగాలీ, ఇంగ్లీషులలో పెక్కు రచనలు చేశాడు. నిజానికి ఈయన రచనలు బెంగాలీ సాహిత్యాభివృద్ధికి ఎంతో ఉపకరించాయి. ఈయన ఆంగ్ల విద్యావ్యాప్తికి తీవ్రంగా కృషి చేసిన ఉత్సాహవంతుడు.

తన భావజాలాన్ని దృఢ పరచుకునేందుకు క్రీ.శ.1828లో ఈయన 'బ్రహ్మసభ'ను స్థాపించాడు. తర్వాత ఇది బ్రహ్మసమాజంగా ప్రఖ్యాతి గాంచింది. ఈ బ్రహ్మసమాజం హిందూమత ప్రక్షాళనకు, భగవంతునిపై విశ్వాసాన్ని పెంచడానికి ప్రాధాన్యత ఇచ్చింది. ఇవి మానవ ఔన్నత్యాన్ని ప్రశంసిస్తూ విగ్రహారాధనను వ్యతిరేకించింది. 'సతీసహగమనం' వంటి సామాజిక దురాచారాలను ఖండించింది. ఇది ఒక భిన్నమైన మతశాఖ మాత్రం కాదు. ఒకే ఒకడైన నిజమైన భగవంతుని విశ్వసించే వారంతా కలిసి ప్రార్థించే వేదిక మాత్రమే. ఇక్కడ ఏ విగ్రహాలు అనుమతించబడేవి కావు. బలులు కాని నైవేద్యాలు కాని సమర్పించబడేవి కావు.

రాజారామమోహన్‌రాయ్ వారసునిగా దేవేంద్ర నాథ్ ఠాగూర్ (1817-1905) బ్రహ్మసమాజ నాయకత్వం చేపట్టాడు. ఈయన సమాజంలో నవజీవనాన్ని నింపి రాజారామమోహనరాయ్ భావజాలాన్ని ప్రచారం చేశాడు. ఠాగూర్ నుండి కేశవచంద్రసేన్ (1838-1884), సంస్థ నాయకత్వాన్ని చేపట్టాడు. ఈ విధంగా బ్రహ్మసమాజం వ్యక్తిస్వేచ్ఛ, జాతీయ సమైక్యత, సర్వసామాజిక సంస్థల మరియు సామాజిక సంబంధాల ఏకత్వం, సహకారం, ప్రజాస్వామ్యీకరణ అనే ఆశయాలకు ప్రాతినిధ్యం ఇచ్చింది. ఈ విధంగా బ్రహ్మసమాజం జాతీయ చైతన్యాన్ని వ్యక్తపరచే మొట్టమొదటి వ్యవస్థీకృత సాధనంగా నిలిచి భారతజాతికి ఒక నూతన శకాన్ని ప్రారంభించింది.

## 55.5 ప్రార్థనా సమాజం -రనడే

ప్రార్థనా సమాజం, హేతుబద్ధ ఆరాధన, సామాజిక సంస్కరణల లక్ష్యంగా డాక్టర్ ఆత్మారామ్ పాండురంగచే,

క్రీ.శ.1867లో బొంబాయి నగరంలో స్థాపించబడింది. శ్రీ ఆర్.జి.భండార్కర్ మరియు మహదేవ్ గోవింద రనడే దీనిలో ప్రముఖ సభ్యులు. వీరు (వివిధ వర్ణాల) సహపంక్తి భోజనం, వర్ణాంతర వివాహములు, వితంతు పునర్వివాహములు, అసంఖ్యాక మహిళల, దళిత వర్గాల పురోభివృద్ధికి అంకితమయ్యారు.

మహదేవ్ గోవింద రనడే (1842–1901) యావజ్జీవితమును ప్రార్థనా సమాజానికే అంకితం చేశాడు. ఆయన 'వితంతు పునర్వివాహ సంస్థ' (Widow Remarriage Association) (క్రీ.శ.1861), 'దక్కన్ ఎడ్యుకేషన్ సొసైటీ' (Deccan Education Society) లను స్థాపించాడు. రనడే దృష్టిలో మత సంస్కరణ, సామాజిక సంస్కరణ నుండి భిన్నమైనది కాదు. ఆయన 'మత సంబంధ భావాలు కఠినంగా ఉన్నంత కాలం, సామాజిక, ఆర్థిక, రాజకీయ రంగాలలో సాఫల్యత ఉండదు. అని నమ్మేవాడు.

ప్రార్థనా సమాజం బ్రహ్మ సమాజ భావజాలముచే తీవ్రంగా ప్రభావితమైనప్పటికీ, విగ్రహారాధన కఠిన బహిష్కరణ, వర్ణవ్యవస్థ నుండి నిర్దిష్ట అంతరాన్ని పాటించడం వంటి వాటిపై పట్టుబట్ట లేదు. ఇది వేదాలను అంతిమ ప్రమాణంగా భావించలేదు. మానవ జీవాత్మల పునర్జన్మ సిద్ధాంతాన్ని, దైవావతార సిద్ధాంతాన్ని విశ్వసించలేదు. దీని ముఖ్యోద్దేశం ఏకేశ్వరోపాసన పట్ల మనఃపూర్వక విశ్వాసం.

## 55.ఎ పాఠ్యాంశ ప్రశ్నలు

1. 1854 'ఉడ్స్ నివేదిక' దేన్ని గూర్చి నొక్కి చెప్పింది?
2. బ్రహ్మ సమాజం ముఖ్య సిద్ధాంతాలను పేర్కొనుము.
3. 'రాజారామ మోహనరాయ్ సమకాలీన భారత సమాజంలో వివిధ సంస్కరణలను ప్రవేశపెట్టాడు. ఆయన చేపట్టిన మూడు ప్రధానమైన సంస్కరణలను పేర్కొనుము.
4. ప్రార్థనా సమాజాన్ని ఎవరు, ఏ లక్ష్యంతో స్థాపించారు?
5. మహదేవ్ గోవింద రనడేచే స్థాపించబడిన ఏవైనా రెండు సంస్థలను పేర్కొనుము.

## 55.6 ఆర్యసమాజము మరియు దయానంద సర్వసతి

ఆర్యసమాజము, గుజరాత్‌కి చెంది, తర్వాత దయానంద సరస్వతిగా ప్రసిద్ధిగాంచిన 'మూలశంకర్'చే స్థాపించబడింది. ఆయన ఉద్యమం ఒక ప్రత్యేక కోవకు చెందినది. రాజా రామ్మోహనరాయ్ వలెగాక, ఇతడు వేదాలను దోషరహితాలైన తరతరాలకు చెందిన జ్ఞాన నిధులుగా భావించాడు. ఆయన వేదాలను హిందీలోకి అనువదించి, 'సత్యార్థ ప్రకాశం' (Satyartha Prakasham) వంటి మూడు ప్రముఖ గ్రంథాలను రచించాడు. ఆయన బోధనల సారాంశము 'మళ్లీ వేదాల వైపుకి (Back to Vedas) అనే సూత్రంపై ఆధారపడింది. దయానంద సరస్వతి "ప్రతి వ్యక్తి తనకు తానుగా వేదాలను వ్యాఖ్యానించవచ్చు" అని విశ్వసించాడు. ఆర్యసమాజీకులు "ప్రతి వ్యక్తి దేవునితో ప్రత్యక్ష సాన్నిహిత్యము కలిగి ఉంటాడు" అని భావిస్తారు. వారు వ్యక్తికి పారంపర్య మతాచార్యుల (బ్రాహ్మణుల) నిరంకుశత్వం నుండి స్వేచ్ఛను ప్రసాదించడానికి ప్రయత్నించారు. ఆర్యసమాజము బ్రాహ్మణాధిక్యతను తిరస్కరించి, ప్రజలను పుక్కిటి పురాణాల చట్రంలో బంధించే అనేక కర్మకాండలను, సంస్కారాలను బహిష్కరించి, విగ్రహారాధనను నిరసించింది. ఈ సంస్థ సామాజిక,

ఆర్థిక రంగాలలో స్త్రీ,పురుషుల సమాన హక్కుల కోసం ఎంతో కృషి చేసింది. ఇది అనాదిగా వస్తున్న వర్ణవ్యవస్థను తిరస్కరించింది. అస్పృశ్యతపై పోరు సల్పింది, వర్ణాంతర వివాహాలను ప్రోత్సహించింది. ఈ సంస్థ సంస్కృత, ఆంగ్ల అధ్యయనంతో పాటు ఆధునిక విజ్ఞానశాస్త్ర బోధనకు ప్రాధాన్యత, ప్రోత్సాహాన్నిచ్చే పాఠశాలలు, కళాశాలలను స్థాపించే ప్రక్రియను దేశమంతటా నిర్వహించింది. మొట్టమొదటగా దయానంద ఆంగ్లో -వేదాంత కళాశాల క్రీ.శ.1886లో లాహోర్‌లో స్థాపించబడింది. ఆర్య సమాజికులు సామాజిక సమానత్వాన్ని ఐకమత్యాన్ని ప్రోత్సహించారు. అదే సమయంలో వారు హిందువుల మతాంతీకరణలను వ్యతిరేకించారు. ఆర్యసమాజము భారతదేశములో తొలి జాతీయవాద అభివృద్ధికి కృషి చేసింది. కాని దీని ఆలోచనా విధానంలో లౌకిక స్వభావం లేనందున తర్వాత కాలంలో వివిధ విశ్వాసాలు గల ప్రజల మధ్య ఆందోళనలకు దారితీసింది. ఈవిధంగా ఈసమాజం అభివృద్ధి, అభివృద్ధి నిరోధకత్వం రెండింటినీ కలిగి ఉంది.

## 55.7 రామకృష్ణ మఠం మరియు స్వామి వివేకానంద

అనంతర కాలంలో రామకృష్ణ పరమహంసగా ప్రఖ్యాతిగాంచిన గదాధర ఛటోపాధ్యాయ ఒక నిరుపేద, బ్రాహ్మణ పూజారి. ఆయన విద్య, ప్రాథమిక స్థాయిని దాటలేదు మరియు ఆయనకు ఆధ్యాత్మిక విద్యలో గాని, శాస్త్రాలలోగాని నియత శిక్షణ లేదు. కాని ఈయన తన జీవితాన్ని భగవంతునికి అంకితం చేశాడు. భగవంతుని చేరుటకు అనేక మార్గాలున్నాయని, మానవుడు భగవంతుని ప్రతిరూపం కాబట్టి మానవసేవే మాధవసేవ అని విశ్వసించాడు. కాబట్టి ఈయన బోధనలో సిద్ధాంత విభేదాలకు స్థానము లేదు. ఈయన మానవులలో దైవత్వాన్ని గుర్తించాడు. మరియు 'మానవ సేవే మోక్షమార్గం' అని విశ్వసించాడు.

అనంతర కాలంలో స్వామి వివేకానందగా ప్రఖ్యాతి గాంచిన నరేంద్రనాథ దత్తు (1863-1902) రామకృష్ణ పరమహంసకు మిక్కిలి భక్తిగల శిష్యుడు. ఇతడు ఆంగ్ల భాషను నేర్చుకొని పట్టా పొందాడు. అతడు న్యాయశాస్త్రములో పట్టా సంపాదించుటకు ఇంగ్లండుకు సముద్రయానం చేయుటకు ప్రణాళికను సిద్ధం చేసుకున్నాడు. కాని రామకృష్ణ పరమహంస దర్శనం ఈయన జీవిత గమనాన్ని మార్చింది. ఈయన తన గురువుగారి సందేశాన్ని యూరప్, అమెరికాల అంతటా ప్రచారం చేస్తూ తన జీవితాన్ని గడిపాడు.

వివేకానందుడు "భారతీయులు (ఆంగ్లేయులచే) అణగద్రొక్కబడి, దోపిడీకి గురవుతున్నారు." అని భావించాడు. అయితే భారతీయులు అచేతనంగా ఉన్నారు. కాబట్టి ఈయన వారినే నిందించాడు. ఈయన "మన పతనానికి మనం ప్రపంచంలోని ఇతర జాతులు నుండి ఏకాంతంగా ఉండటం అనేది వాస్తవము అనీ, ఇతర ప్రపంచ స్రవంతిలోకి తిరిగి వెళ్లుటయే దీనికి ఒకే ఒక తరుణోపాయమనీ, చలనమే జీవిత సంకేతం" అని వ్రాశాడు. ఈ విధంగా వివేకానందుడు భారతీయ ఆధ్యాత్మిక వారసత్వాన్ని గూర్చి గర్వించినప్పటికీ "ఏ వ్యక్తిగాని జాతిగాని తనను తాను ఇతర సమాజాల నుండి దూరంగా ఏకాంతంగా జీవించలేదు/లేదు." అని విశ్వసించాడు. ఈయన వర్ణవ్యవస్థను, కఠినమైన ఆచారాలను, శతాబ్దాల నాటి బూజు పట్టిన అంధ విశ్వాసాలను ఖండించాడు. స్వేచ్ఛ, స్వతంత్ర ఆలోచనా విధానం, మరియు సమానత్వాలను సమర్థించాడు.

స్వామి వివేకానంద, రామకృష్ణుని బోధనయైన "సర్వ మతేకత్వము"పై శ్రద్ధ చూపాడు. వివేకానందుడు "మన మాతృదేశానికి, హిందూ, మహమ్మదీయ మతాలు అనే రెండు వ్యవస్థల సహజీవనం మాత్రమే ఒకే ఒక ఆశాకిరణం." అని వ్రాశాడు. ఈయన వేదాంతతత్వాన్ని అత్యధిక సహేతుకమైనదిగా పరిగణించి ప్రోత్సహించాడు.

వివేకానందుని సామాజిక తత్వజ్ఞానం ప్రధాన లక్షణం. పామర జనోద్ధరణ పట్ల ఈయనకు గల దృఢదీక్ష. ఆయనకు నిరుపేద, బాధిత జనసేవయే విశిష్టమైన మతం. ఈ విధమైన సేవ చేయుటకు ఈయన క్రీ.శ.1897లో రామకృష్ణ మిషన్‌ను స్థాపించాడు. ఈ సంస్థ ఇప్పటి వరకు కరువులు, వరదలు, అంటుజాడ్యాలు వంటి జాతీయ విపత్తులలో అవసరమైన సామాజిక సేవను అందించడంలో ప్రముఖపాత్ర పోషించుచున్నది. అనేక పాఠశాలలు, వైద్యశాలలు, అనాథ శరణాలయాలు ఈ సంస్థచే నడుపబడుచున్నవి.

ఈ విధంగా వివేకానందుని సాహసోపేతం, శక్తివంతమైన ఉన్నత వ్యక్తిత్వం రామకృష్ణ పరమహంస యొక్క బోధనలు, జీవితం బీజాలుగా గల రామకృష్ణుని భావజాలానికి ఒక స్థిరమైన రూపాన్ని ఇచ్చింది.

## 55. బి. పాఠ్యాంశ ప్రశ్నలు

1. దయానంద సరస్వతిచే రచించబడిన ముఖ్యమైన గ్రంథమేది?
2. క్రీ.శ.1886 ఆర్యసమాజంచే స్థాపించబడిన కళాశాల ఏది?
3. ఆర్య సమాజపు ముఖ్యమైన లోపం లేక వ్యతిరేక దృక్పథం ఏది?
4. వివేకానందుని సామాజికతత్వం యొక్క ముఖ్య లక్షణము ఏది?
5. వివేకానందుని దృష్టిలో అత్యున్నతమైన మతం ఏది?
6. రామకృష్ణ మిషన్‌ను ఎవరు, ఎప్పుడు స్థాపించారు?

## 55.8 దివ్యజ్ఞాన సమాజం – అనీబీసెంట్

దివ్యజ్ఞాన సమాజము క్రీ.శ.1875లో మేడమ్ హెచ్.పి.బ్లావట్‌స్కీ (H.P.Blavatsky) అనే రష్యన్ ఆధ్యాత్మికవేత్త మరియు కల్నల్ హెచ్.ఎస్.ఆల్కాట్ (H.S.Olcott) అనే అమెరికా జాతీయునిచే అమెరికా సంయుక్త రాష్ట్రములలో స్థాపించబడింది. ప్రాచీన మతములను, తత్త్వశాస్త్రములను మరియు విజ్ఞాన శాస్త్రముల అధ్యయనాన్ని ప్రోత్సహించడం మానవునిలో అంతర్లీనమై ఉన్న దైవిక శక్తులను అభివృద్ధి పరచి మానవులలో అంతర్జాతీయ సోదరభావాన్ని ఏర్పరచడమే దీని లక్ష్యం.

ఈ సంస్థ భారతదేశములో క్రీ.శ.1879లో ప్రవేశపెట్టబడింది. దీని ముఖ్య కేంద్రం క్రీ.శ.1886లో మద్రాస్‌కు సమీపంలోని అడయార్‌లో నెలకొల్పబడింది. క్రీ.శ.1893లో అనీబీసెంట్ నాయకత్వంలో దీని ప్రభావం విస్తరించి స్వాతంత్ర్య పోరాటంలో ఒక ప్రధాన పాత్రను పోషించింది.

ఈ సంస్థ హిందువుల కర్మ సిద్ధాంతాన్ని, జీవాత్మ పునర్జన్మ సిద్ధాంతాన్ని, బౌద్ధుల నిర్వాణ సిద్ధాంతాన్ని ఆమోదించింది. ఇది అస్పృశ్యతపై పోరాడి, స్త్రీ జనోద్ధరణను సమర్థించింది. అనీబీసెంట్ తన జీవితాన్ని హిందూ సమాజానికే అంకితం చేసింది. ఆమె తన సంస్థను గురించి ఇలా వర్ణించింది. 'జాతీయదృక్పథ అభివృద్ధి, భారతీయుల ఆలోచనానుసారం స్థాపించబడి, అభివృద్ధి చెందిన పాశ్చాత్యుల, భావాలు, సంస్కృతి, ఆధిపత్యంలేని విద్య అనేకమైన ఇతరములతోపాటు భారతీయులకు ఆవశ్యకమైనవి పాశ్చాత్యులచే ప్రారంభింపబడి, భారతీయ విలువలను మరియు ఆధ్యాత్మిక సంప్రదాయాలను

శ్లాఘించిన ఈ ఉద్యమం సహజంగానే భారతీయులలో ఆత్మవిశ్వాసాన్ని పురికొల్పి, జాతీయ భావాలను దృఢపరిచింది.

భారతదేశంలో శ్రీమతి అనీబీసెంట్ సాధించిన ఘనకార్యాలలో కేంద్రీయ హిందూ పాఠశాల (Central Hindu School) ను స్థాపించడం ఒకటి. అనీబీసెంట్ భారతదేశాన్ని తన శాశ్వత నివాస స్థానంగా చేసికొని, భారత రాజకీయాలలో ప్రముఖ పాత్ర పోషించింది. "పాశ్చాత్య భావాలు, సంస్కృతుల ప్రాబల్యం లేకుండా భారతీయ భావాలచే స్థాపించబడి, సమృద్ధం చేయబడిన విద్య మరియు జాతీయోత్సాహం, అన్నింటికంటే ఎక్కువగా భారతీయులకు అవసరం". అని ఆమె వక్కాణించింది. ఆమె భారతీయుల స్వపరిపాలన (Home Rule) ను సమర్థించేది. అంతేగాక ఆమె స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న ముఖ్య పాత్రధారులలో ఒకరు.

భారతదేశమంతటా దివ్యజ్ఞాన సమాజం శాఖలు ప్రారంభించబడెను. ఆ సంస్థ పత్రిక 'దివ్యజ్ఞాని' (Theosophist) అత్యధికంగా అమ్ముడయ్యేది.

ఈ సంస్థ భారతదేశంలో ప్రధానంగా దక్షిణ సామాజిక మత సంస్కరణకు సహకారం అందించింది. ఈ సంస్థ చేసిన కార్యక్రమాలలో అధిక భాగం అనీబీసెంట్ వ్యక్తిత్వ ఫలితం.

## 55. సి. పాఠ్యాంశ ప్రశ్నలు

1. క్రీ.శ.1875లో దివ్యజ్ఞాన సమాజం ఏ మూడు లక్ష్యాలతో స్థాపించబడింది?
2. దివ్యజ్ఞాన సమాజం భారతదేశంలో ఎప్పుడు ప్రవేశపెట్టబడినది? దాని ప్రధాన స్థానం ఎప్పుడు, ఎక్కడ ఏర్పరచబడింది?
3. అనిబీసెంట్ తన యావజ్జీవితాన్ని దేనికి అంకితమిచ్చింది. ఆమె సాధించిన ఘనకార్యాలలో ఒకదానిని పేర్కొనుము?
4. దివ్యజ్ఞాన సమాజంచే నడపబడిన వార్తాపత్రికను పేర్కొనుము?

## 55.9 అలీఘర్ ఉద్యమం మరియు సయ్యద్ అహ్మద్‌ఖాన్

మీరు హిందూమతం మరియు ఆచారాలలో వచ్చిన అంతర్గత సంస్కరణలను, సామాజిక సంస్థలను గురించి ఇంతకు క్రితమే చదివారు. ఇస్లాంలో కూడా అదే విధమైన సంస్కరణలు సంభవించాయి. ఉన్నతవర్గాల ముస్లింలు పాశ్చాత్య విద్యను, పాశ్చాత్య సంస్కృతిని దూరంగా ఉంచేందుకు మొగ్గు చూపారు. కేవలం 1857 విప్లవం తర్వాత మాత్రమే మత సంస్కరణల తాలూకు ఆధునిక భావాలు మొగ్గ తొడిగాయి. ఈ మార్పు 1863లో కలకత్తాలో మహమ్మదీయ సాహిత్య సంస్థ (Mohammadan Literary Society) స్థాపనతో ప్రారంభమయింది.

ఈ ఆరంభం మత, సామాజిక, రాజకీయ రంగాలలో గల సమస్యలను, ఆధునిక దృక్పథంతో చర్చించి ఉన్నత, మధ్యవర్గాల ముస్లింలను, పాశ్చాత్య విద్యను పొందేందుకు ప్రోత్సహించింది. బడుగువర్గాల ముస్లింలు కూడా భగవంతుని ఆరాధననే బోధించిన సూఫీ మార్గ చిస్తీలు వంటి వారి ఉద్యమాలచే ప్రభావితులవడమే కాకుండా సన్యాసులను గౌరవించడాన్ని అలవర్చుకున్నారు. ఢిల్లీలో మొదలైన వల్లీ ఉల్లాతో (Walliulla) సంబంధం గల మరొక ఉద్యమం అశాస్త్రీయమైన మతాచారాలను వ్యతిరేకించి షియా తెగను, ఏకేశ్వరోపాసనను పునరుద్ధరించింది. లక్నోలో ఫిరంగి మహల్ (Firangi Mahal) కి చెందిన ఆధ్యాత్మిక మరియు పాండిత్య ప్రకర్షగల సంప్రదాయం కూడా నూతన విద్యా

పాఠ్య ప్రణాళికకు అనుసంధానం చేయబడి 18వ, 19వ శతాబ్దాలలో భారతదేశమంతటా ప్రచారం చేయబడింది.

ముస్లిం మత సంస్కర్తలలో ప్రప్రథమంగా పేర్కొనదగినవాడు. రాయ్‌బరేలీకి చెందిన సయ్యద్ అహ్మద్‌ఖాన్. ఈయన పతనావస్థలో ఉన్న అలహాబాద్, పాట్నా వంటి నేత నగరాలలో ఉన్న చేతివృత్తుల వారు సామాజికంగా అట్టడుగు స్థాయికి దిగజారినపుడు వారికి ఒక సిద్ధ వేదికను ఏర్పరచి, ఒక హోదా కల్పించి, ఉమ్మడి విశ్వాసాన్ని పాదుకొల్పడం ద్వారా వారిని ఆకర్షించాడు. ఆయన బ్రిటీష్ పాలనలో మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా "ముస్లింలు మారకపోతే వారు హోదా, అభివృద్ధులను కల్పించే అన్ని అవకాశాలను కోల్పోతారు." అని గ్రహించాడు. ఆయన ఆధునిక శాస్త్రీయ దృక్పథంచే అత్యధికంగా ప్రభావితుడైనాడు. తన యావజ్జీవితాన్ని శాస్త్రీయ దృక్పథాన్ని ఇస్లాంతో అనుసంధానం చేయటానికి కృషి చేశాడు. ఈయన హేతువాదము, శాస్త్రీయతల దృక్కోణంలో ఖురాన్‌ను వ్యాఖ్యానించాడు. ఆయన ప్రజలను విమర్శనాత్మక దృష్టిని స్వేచ్ఛాయుత ఆలోచనా సరళిని అభివృద్ధి చేసుకోవలసినదిగా అభ్యర్థించాడు. ఆయన మతమౌఢ్యం, సంకుచితత్వం, ప్రత్యేకత్వమునకు (Exclusiveness) వ్యతిరేకంగా ముస్లింలను హెచ్చరించాడు. ఈయన ప్రజలను విశాల దృక్పథం మరియు మత సహనం కలిగి ఉండమని ప్రబోధించాడు. 1883లో ఆయన "మనం (హిందూ, ముస్లింలము) భారతదేశపు గాలి పీల్చుకొని జీవించుచున్నాము. గంగా యమునల పవిత్ర జలాన్ని తాగుతున్నాము. మనం ఇరువురమూ భారత భూమిలో పండిన పంటలను ఆహారంగా స్వీకరిస్తున్నాము. మనమంతా ఒకేజాతి. మన ఇరువురి ఐకమత్యం పరస్పర సానుభూతి ప్రేమల మీద మనదేశ హిందూ ముస్లింల అభివృద్ధి సంక్షేమాలు ఆధారపడి ఉండగా, మన పరస్పర అనంగీకారం, (disagreement) మూర్ఖత్వం, వ్యతిరేకత మరియు శత్రుత్వ భావాలు మనలను నిస్సందేహముగా నాశనము చేస్తాయి." అని ప్రబోధించాడు.

సయ్యద్ అహ్మద్‌ఖాన్ "భారతీయ ముస్లింల మత సామాజిక జీవితాలు, ఆధునిక పాశ్చాత్య శాస్త్రీయ విజ్ఞానము మరియు సంస్కృతుల సహాయంతో మాత్రమే అభివృద్ధి చెందుతాయి" అని విశ్వసించాడు. కాబట్టి ఆధునిక విద్యను ప్రోత్సహించుటయే ఆయన ప్రథమ జీవితాశయం. ఒక ప్రభుత్వ ఉద్యోగిగా ఆయన వివిధ ప్రదేశాలలో పాఠశాలలను స్థాపించాడు. అనేక పాశ్చాత్య గ్రంథాలను ఉర్దూలోనికి అనువదించాడు. అనువదింపజేశాడు. ఆయన 1875లో అలీఘర్‌లో మహమ్మదీయ ఆంగ్లో ఓరియంటల్ కళాశాల ప్రారంభించాడు. ఇది పాశ్చాత్య విజ్ఞానాన్ని, సంస్కృతులను వ్యాపింప చేయడానికి ఒక కేంద్రంగా ఉద్దేశించబడినది. తర్వాత ఈ కళాశాల అలీఘర్ ముస్లిమ్ విశ్వవిద్యాలయము (Aligarh Muslim University) గా అభివృద్ధి చెందింది.

సయ్యద్ అహ్మద్ ఖాన్‌చే ప్రారంభించబడిన ఉదారవాద, సామాజిక, సాంస్కృతిక ఉద్యమం అలీఘర్‌లో జనించింది. కాబట్టి ఇది 'అలీఘర్ ఉద్యమము'గా ప్రఖ్యాతి గాంచింది. ఈ ఉద్యమానికి ఆంగ్లో ఓరియంటల్ కళాశాల ముఖ్య కేంద్రము. ఇది ఇస్లాంలోని, ప్రత్యేక నియమములను బలహీనపరచకుండా ముస్లింలలో ఆధునిక విద్యను ప్రోత్సహించడానికి ఉద్దేశించబడింది. ఇది భారతీయ ముస్లింలకు కేంద్రీయ విద్యాసంస్థగా బాసిల్లింది.

ఈ అలీఘర్ ఉద్యమం తర్వాత కాలములో ముస్లిం పునరుజ్జీవనానికి కారణమైంది. భారతదేశంలో వివిధ ప్రదేశాలలో విస్తరించి ఉన్న ముస్లిం జనాభాకు ఇది ఒక కార్యస్థానమును అందించింది. ఇది వారికి ఒక ఉమ్మడి ఆలోచనా విధాన నిధిని, ఒక ఉమ్మడి భాష అయిన ఉర్దూను ప్రసాదించింది. ఉర్దూ గ్రంథములను సంకలనం చేయడానికి ఒక ముస్లిం ముద్రణాలయం కూడా అభివృద్ధి చెందింది.

తన ఉద్యమం ద్వారా సయ్యద్ అహ్మద్ ఖాన్ ముస్లింలను ఒక ముఖ్యమైన, ప్రభావ సహిత స్థానంలో నిలబెట్టుటకు సహాయపడ్డాడు. అయితే తర్వాత సంవత్సరాలలో సయ్యద్ అహ్మద్‌ఖాన్ భారతీయులు నూతన జనిత జాతీయోద్యమంలో

చేరటాన్ని నిరుత్సాహ పరిచాడు. ఆయన రాజకీయాల కంటే విద్యే తక్షణావసరం అని భావించాడు. ఆయన భారతీయులు కూడా వారి ఆలోచనలలో, క్రియలలో పాశ్చాత్యుల వలె ఆధునికంగా తయారయినపుడు మాత్రమే ఆంగ్లేయులను ఎదుర్కొనగలరు అని భావించాడు. అందుకే ఆయన ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ఏమీ చేయలేదు. ఈ దశలో ఆయన చివరకు మతవాదాన్ని, వేర్పాటువాదాన్ని ప్రోత్సహించాడు. కాబట్టి బ్రిటీష్ ప్రభుత్వం ఆయనను 'సర్' బిరుదుతో సత్కరించింది.

సయ్యద్ అహ్మద్‌ఖాన్ కృషి సామాజిక రంగానికి కూడా విస్తరించింది. ఈయన సామాజిక సంస్కరణ కోసం కూడా కృషి చేశాడు. ఈయన ముస్లిమ్ మహిళలు విద్యావంతులు కావాలని అభిలషించాడు. ఈయన 'పర్దా' విధానాన్ని ఎత్తివేయాలని వాదించాడు. ఈయన బహుభార్యత్వానికి, సులభతర విడాకులకు (easy divorce) కూడా వ్యతిరేకి.

## 55. డి. పాఠ్యాంశ ప్రశ్నలు

1. 19వ శతాబ్దంలో ఇస్లాం మతంలో ఆధునిక భావజాలాన్ని చొప్పించడాన్ని ప్రోత్సహించిన సంస్థను పేర్కొనుము.
2. రాయ్‌బరేలీలో సయ్యద్ అహ్మద్ ఖాన్‌ను ప్రోత్సహించిన తొలి అనుచరులు ఎవరు?
3. సయ్యద్ అహ్మద్‌ఖాన్ 1875లో స్థాపించిన సంస్థ ఏది? దాని లక్ష్యాలేవి? తర్వాత ఇది ఎలా పిలువబడింది?
4. సయ్యద్ అహ్మద్‌ఖాన్ సమర్థించిన మహిళా సామాజిక సంస్కరణలను రెండింటిని పేర్కొనుము.

### సారాంశం

(భారతదేశంలో) బ్రిటీష్ పరిపాలనా ప్రభావము సామాజిక, మత సంబంధ రంగాలలో కనిపిస్తుంది. విద్యావంతులైన భారతీయులు భారత సమాజంలో నిర్దిష్ట సంస్కరణలు చేపట్టినపుడే జాతీయ సమైక్యత మరియు బ్రిటీష్‌వారి అణచివేత నుండి విముక్తి లభిస్తాయి అని గుర్తించారు.

రాజారామ మోహనరాయ్ 'భారతీయ ప్రముఖ వైతాళికుడు'గా గుర్తించబడ్డాడు. ఈయన హిందూ మతంలోని కాఠిన్యం అచేతనత్వం మరియు అవినీతి వంటి వాటిని తొలగించటానికి తీవ్రంగా కృషి చేశాడు. ఈయన ఆధునిక విద్య, విజ్ఞాన శాస్త్రం మరియు సాంకేతిక వ్యాప్తిని సమర్థించాడు. ఈయన భారతీయులను పాశ్యాత్యులను అనుకరించమని చెప్పలేదు కాని పాశ్చాత్యులలో అత్యుత్తమ విషయాలను గ్రహించి దానిని ప్రాచ్యపు (East) మంచితో మిళితము చేయమని కోరారు. ఆయన సతి, బహుభార్యత్వం, బాల్య వివాహాలు, మరియు వితంతువులను అమానుషంగా చూడటం వంటి సామాజిక దురాచారాలకు వ్యతిరేకంగా పోరు సల్పాడు. ఈయన హిందూ మతాన్ని సమాజాన్ని సంస్కరించుటయే ఉద్దేశంగా గల బ్రహ్మసమాజాన్ని స్థాపించాడు.

మహారాష్ట్రలో మత సంస్కరణ కార్యక్రమం ప్రార్థనా సమాజంచే నిర్వహించబడింది. ఈ సంస్థ వర్ణాంతర వివాహాలను, మతాచార్యుల ఆధిపత్యం నుండి విముక్తి, మహిళా జనోద్ధరణలను ప్రచారం చేసింది. ఆర్.జి.భండార్కర్ మరియు మహదేవ్ గోవిందరనడే ఈ సంస్థలో ప్రముఖ సభ్యులు.

1875లో దయానంద సరస్వతిచే ఆర్యసమాజమనే మరియొక సంస్థ స్థాపించబడింది.

ఈయన వేదాలు సకల విజ్ఞాన మూలమని భావించాడు. ఈయన వేదాల వైయుక్తిక వ్యాఖ్యాన హక్కును మతాచార్యుల నిరంకుశత్వం నుండి విముక్తిని ప్రోత్సహించాడు. ఈ ఆర్య సమాజ ఉద్యమం అంటరానితనం, మరియు కాఠిన్యతకు

వ్యతిరేకంగా పోరు సల్పాడు. ఆధునిక విద్యను ప్రోత్సహించడానికి, ఆర్యసమాజీకులు దేశమంతటా ప్రణాళికా బద్ధ పాఠశాలలు, కళాశాలల నిర్వహణా వ్యవస్థను ప్రారంభించాడు.

హిందూ సమాజ పునరుజ్జీవనానికై రామకృష్ణ మఠం (మిషన్) అనబడే మరియొక సంస్థ వివేకానంద స్వామిచే స్థాపించబడింది. వివేకానందస్వామి భారతీయులను చైతన్యారహితులుగా ఉండటాన్ని విమర్శించి, కార్యసాధకులు కమ్మని వారిని అభ్యర్థించాడు. ఆయన మత సంకుచితత్వాన్ని ఖండించి స్వతంత్ర ఆలోచనా విధానాన్ని సమర్థించాడు. ఆయన ఒక గొప్ప మానవతావాది. ఆయనకు 'దీనజనసేవే అత్యున్నత మతం'.

దివ్యజ్ఞాన సమాజం కూడా ఈ సంస్కరణోద్యమంను బలోపేతం చేసింది. అనీబీసెంట్ మార్గదర్శకత్వంలో ఈ సంస్థ పురాతన భారతీయ మత, వేదాంత మరియు సిద్ధాంత అధ్యయనాన్ని ప్రోత్సహించింది. శ్రీమతి అనీబీసెంట్ విద్యను ప్రోత్సహించడానికి, కేంద్రీయ హిందూ పాఠశాలను కూడా స్థాపించింది.

ముస్లింలలో కూడా మత సంస్కరణ జరిగింది. సయ్యద్ అహ్మద్‌ఖాన్ ముస్లింలను ఆధునిక విద్యను నేర్చుకొనమని ప్రోత్సహించాడు. ఈయన పరమత ద్వేషం, అజ్ఞానం, నిర్హేతుకాలకు వ్యతిరేకముగా వాదించాడు. సయ్యద్ అహ్మద్‌ఖాన్ బహుభార్యత్వాన్ని, పరదా విధానాన్ని, సులభ విడాకుల పద్ధతిని ఖండించాడు. ఈయన అలీఘర్‌లో మహమ్మదీయ ఆంగ్లో

## పాఠ్యాంశ ప్రశ్నలకు సమాధానాలు

55.ఎ.

1. భారతీయులకు (ప్రాథమిక విద్యతో కూడిన) విద్య నందించటాన్ని గూర్చి నొక్కి చెప్పింది.

   2. అనుసరించిన ముఖ్య భావాలు హిందూ మత ప్రక్షాళన, ఏకేశ్వరోపాసనపై విశ్వాసం, మానవులలో హుందాతనముపై శ్రద్ధ వహించింది. విగ్రహారాధనను వ్యతిరేకించింది. 'సతి' వంటి సామాజిక దురాచారాలను ఖండించింది. విగ్రహారాధన పనికిరాదు. యజ్ఞయాగాదులు అవసరం లేదు. వ్యక్తి స్వాతంత్ర్యము, జాతీయ సమైక్యత, దృఢత్వం, సామాజిక సంస్థల ప్రజాస్వామీకరణ అనే సూత్రాలపై ఈ సమాజం శ్రద్ధ వహించింది.

   3. సతిని వ్యతిరేకించాడు, బెంగాలీ సాహిత్యాన్ని ప్రోత్సహించాడు. ఇంగ్లీషు విద్యను కూడా ప్రోత్సహించాడు. విగ్రహారాధనను, వర్ణ వ్యవస్థను వ్యతిరేకించాడు.

   4. డా॥ ఆత్మారాం పాండురంగ హేతుబద్ధ ఆరాధన, సామాజిక సంస్కరణ అనే లక్ష్యంతో ప్రారంభించాడు.

   5. వితంతు పునర్వివాహ సంఘం (Widow Remarriage Association) (1861), డెక్కన్ ఎడ్యుకేషన్ సొసైటీ, (Deccan Education Society) పూనా సార్వజనిక సభ

**55.బి.**

1. సత్యార్థ ప్రకాశము

   2. దయానంద ఆంగ్లో వైదిక కళాశాల

   3. ఆర్యసమాజం భారతదేశంలో జాతీయవాద అభివృద్ధికి కృషి చేసినప్పటికీ తర్వాత కాలంలో మత విద్వేష వాతావరణం సృష్టించి వివిధ మతాలకు చెందిన వారి మధ్య మత విద్వేషాలకు కారణమైంది.

   4. సామాన్య జనోద్ధరణ

   5. పేద మరియు బాధిత వర్గ ఉద్ధరణ

   6. 1897లో స్వామి వివేకానంద

**55.సి.**

1. ప్రాచీనమత, సిద్ధాంత మరియు శాస్త్ర అధ్యయనం

   2. మానవునిలో అంతర్గతంగానున్న దైవిక శక్తిని వృద్ధి చేసి, మానవులలో విశ్వమానవ సోదరభావంను పెంపొందించుట.

# 56

# సంఘ సంస్కరణలు

## 56.1 పరిచయం :

ఇంతకు ముందు పాఠంలో మీరు 19వ శతాబ్దంలో మొదలైన మత సంస్కరణ ఉద్యమాల(religious reform movements)ను గురించి చదివియున్నారు. ఈ ఉద్యమాలకు రాజారామమోహనరాయ్, స్వామి దయానంద సరస్వతి, స్వామి వివేకానంద, సయ్యద్ అహ్మద్ ఖాన్ వంటి ఆధునిక భావాలున్న వ్యక్తులు(progressive Indians) మార్గదర్శకులు. ఈ ఉద్యమాలు భారతీయులలో పేరుకుపోయిన జడత్వం(స్తబ్ధత) (rigidness)మరియు నిరుత్సాదకత(degeneration)లను తొలగించుటకు ఉపయోగపడినాయి.

19వ శతాబ్దంలో జరిగిన మత మరియు సంఘ సంస్కరణోద్యమాలకు చాలా దగ్గర సంబంధం ఉంది. దాదాపు మత సంస్కర్తలందరూ సంఘ సంస్కరణలకు కృషి చేశారు. దీనికి కారణం దాదాపు అన్ని సంఘ దురాచారాలకు, మతప్రోద్బలం(religious sanction)ఉండడమే. విద్యావంతులైన భారతీయులు కఠిన సంఘ సంప్రదాయాలను మరియు సనాతన ఆచారాలను వ్యతిరేకించారు. మత సంస్కరణలకు దోహదపడిన అదే హేతువాదతత్వం, సంఘ విలువలలో సంస్కరణలకు కూడా కారణమయింది.

20వ శతాబ్దంలో సంఘ సంస్కరణ ఉద్యమం లౌకిక దృక్పథంతో సాగింది. మతపరంగా సనాతన జీవితం గడుపుచున్న అనేకమంది ప్రజలు ఈ ఉద్యమంలో పాల్గొన్నారు. అంతేగాక, సంఘ సంస్కరణావశ్యాకత అవగాహన విద్యాధికుల వర్గం నుండి మొదలై సంఘంలో అట్టడుగు వర్గం వరకు చొచ్చుకుపోయింది.

ఈ పాఠంలో మీరు భారతదేశ సమాజంలో నెలకొన్న సంఘ దురాచారాల గురించి చదువుతారు. ఈ సంఘ దురాచారాలను తొలగించుటకు చేసిన పోరాటంలో జ్యోతిబాపూలే, బి.ఆర్.అంబేద్కర్ మరియు మహాత్మాగాంధీ వంటి మహానుభావుల కృషిని గురించి చదువుతారు.

## 56.2 లక్ష్యాలు :

**ఈ పాఠాన్ని చదివిన తర్వాత ఈ కింది విషయాలు తెలుసుకుంటారు.**

1. భారత సమాజంలో 19వ శతబ్దంలో అమలులోనున్న రెండు అతి పెద్ద సంఘ దురాచారాలైన స్త్రీల అణచివేత మరియు కులవ్యవస్థ కాఠిన్యతలను గుర్తించుట.
2. 'సతి' మరియు భృణహత్య(female infanticide)ల బహిష్కరణల కొరకు, వివిధ సంఘసంస్కర్తలు మరియు సంస్థల ప్రయత్నాలను పేర్కొనగలుగుట
3. స్త్రీ విద్య, వితంతు పునర్వివాహ చట్టాలు, బాల్యవివాహ వ్యతిరేక ఉద్యమాల విస్తరణకు మహనీయులైన ఈశ్వరచంద్ర విద్యాసాగర్, జ్యోతిబాఫూలె, విష్ణుశాస్త్రి పండిట్ వంటి వారు చేసిన కృషిని గుర్తించగలుగుట
4. సమాజంలో 'సమానత్వభావన' తెచ్చుట కొరకు మరియు అంటరానితనం నిర్మూలనలో మహాత్మాగాంధీ మరియు డా॥ బి.ఆర్. అంబేద్కర్‌ల పాత్రను వివరించగలుగుట మరియు
5. భారతదేశంలో సామాజిక జాగృతి నందు "సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ" పాత్రను పరీక్షించుట.

19వ శతాబ్ధంలో భారతీయ సమాజంలో స్త్రీలకు మరియు కులానికి సంబంధించి అసంఖ్యాక సర్వసాధారణ మయ్యాయి. కావున, స్త్రీ స్వేచ్ఛా సాధన మరియు కులవ్యవస్థ ప్రధాన లక్ష్యాలుగా ఉన్నాయి. ఇప్పుడు మనం దీని గురించి మరింత వివరంగా చదువుదాం.

## 56.3 స్త్రీల విముక్తి (Emancipation of women)

భారతదేశంలో స్త్రీ పరిస్థితి చాలా దిగజారింది. 19వ శతాబ్దంలో స్త్రీల పట్ల సమాజ ఆమోదం పొందిన కొన్ని క్రూరమైన మరియు సిగ్గుపడాల్సిన విధంగా వివక్షలు కొనసాగేవి. వారు కేవలం గృహ కార్యకలాపాలకే పరిమితమయ్యారు. వారు సమాజంలో చాలా తక్కువ సామాజిక స్థాయి కలిగి ఉండటమే గాక వారికి ఏవిధమైన ప్రత్యేక సామాజిక పాత్ర, ఉండేది కాదు. వారు కేవలం భార్యలుగా లేక తల్లులుగా మాత్రమే చూడబడేవారు. హిందువులు మరియు ముస్లింలు ఇరువురులోనూ స్త్రీల పరిస్థితి చాలా దారుణంగా ఉండేది. ముస్లింలలో స్త్రీలు పరదా పద్ధతిని అనుసరించడమే గాక 'బహుభార్యత్వమనే దురాచారం భరించవలసి' వచ్చేది. హిందువులు మరియు ముస్లిం స్త్రీలు ఆర్థికంగా మరియు సామాజికంగా పురుషులపై ఆధారపడేవారు.

### (ఎ) బాలికా శిశుహత్య(భ్రూణహత్య) (Female Infanticide)

భారతీయ స్త్రీలు పుట్టిన నాటినుండి చనిపోవువరకు కూడా చాలా బాధలు భరించాల్సి వచ్చేది. నాడు ఆచరణలో నున్న అత్యంత క్రూరమైన పద్ధతి 'బాలికా శిశుహత్య'. మగపిల్లల కోసం ఆత్రుతగా ఎదురుచేసే అనేకమంది తల్లిదండ్రులు, వారికి ఆడపిల్లలు పుడితే, వెంటనే చంపివేసేవారు. ఆడపిల్లలు (కూతుళ్ళు), ఆయా కుటుంబాల ఆర్థికాభివృద్ధికి ఆటంకంగా భావించి, ఆర్థికంగా చితికిపోతామని భావించేవారు. అంతేగాక, ఆరోజుల్లో కుమార్తెకు వివాహం చేయలేకపోవడం అనేది సామాజికంగా ఒక అవమానంగా మరియు మత సంబంధ విధుల ఉల్లంఘనగా తీసుకొనుట వల్ల ఒక సామాజిక

సమస్యగా భావించబడేది. ఈ సమస్య పరిష్కారానికి 'బాలికా శిశుహత్య' ఒక తేలికైన పరిష్కారంగా భావించారు.

1759సం॥లో శిశుహత్య అనునది ఒక 'హత్య'గా పరిగణిస్తూ చట్టం చేయబడింది. క్రీ.శ.1804సం॥లో మరియొక్క చట్టం చేయబడింది. ఈ దురాచారానికి వ్యతిరేకంగా ప్రజల నుండి తీవ్ర నిరసనలు, శిశుహత్యలకు పాల్పడుతున్న వారిపై ప్రభుత్వం కఠినచర్యలు చేపట్టడంతో ఈ దురాచారం కొంత తగ్గింది. అధిక ప్రజాభిప్రాయం, ప్రభుత్వంచే శిక్షించబడతారనే భయం, ఈ దురాచారానికి వ్యతిరేకంగా చేపట్టిన అనేక చర్యలు, ప్రజల ఆలోచనా విధానంలో వచ్చిన మార్పులు సత్ఫలితాలనిచ్చాయి. 19వ శతాబ్దం ద్వితీయార్ధ భాగంలో ఈ నేరం క్రమేణా తగ్గుముఖం పట్టింది. అయినప్పటికీ ముందు జాగ్రత్త చర్యగా క్రీ.శ.1870లో ఒక చట్టం ఆమోదించబడింది. దాని ప్రకారం ఎక్కడైతే శిశుహత్యలు ఎక్కువగా జరుగుతున్నాయో అక్కడ ప్రతిబిడ్డ జనన వివరాలు అధికారికంగా నమోదు చేయించడం మరియు వారిలో ఆడపిల్లల యొక్క జీవనస్థితిని ఒక క్రమపద్ధతిలో పరిశీలించడం వంటి పనులకు అధికారులు చేపట్టడం జరిగింది.

### (బి) 'సతి' దురాచారాన్ని రూపుమాపుట (Abolition of Sati)

19వ శతాబ్దంలో అత్యంత ముఖ్యమైన సంఘ సంస్కరణ 'సతి' దురాచారాన్ని రూపుమాపడం. 'సతి' హిందువులలో భర్తలు చనిపోతే వారి భార్యలను, వారితోపాటు చితిలో దహనం చేయటం. బెంగాల్, రాజపుటానా మరియు దక్షిణ భారత ప్రాంతాలలో ఈ దురాచారం సర్వసాధారణంగా ఉండేది. ఇది సిద్ధాంతపరంగా మతపరమైన నిర్బంధముగా మాత్రం ఉండేదికాదు. అయితే ఇది మానవులు(స్త్రీలు) పరలోక సౌఖ్యం కోసం చేయదగ్గ చాలా ఉన్నతమైన కార్యంగా పరిగణించబడేది. అంతకు క్రితం జరిగిన కొన్ని సంఘటనలు మరియు ప్రేమ(శృంగార) కథల నేపథ్యం వలన 'సతి' దాదాపుగా సమాజంలో ఒక నిర్బంధంగా మారింది. భర్త చనిపోయిన వితంతువు భర్తతో పాటు తనంతట తానే చితిలోకి దూకి మరణించేటట్లు చేసే ఒక బలమైన సామాజిక ఒత్తిడి అప్పట్లో స్త్రీల మీద ఉండేది.

'సతి' అనునది స్వచ్ఛందంగా ఆచరించినా లేక నిర్బంధంగా అనుసరింపచేసినా, అది ఒక అనాగరిక ఆచారం. బ్రిటీష్ వారి పాలనకు ముందు కూడా 'సతి'ని ఆపడానికి ప్రయత్నాలు జరిగాయి. ఆంగ్లేయుల పాలన మొదలైన తర్వాత కూడా, తూర్పు ఇండియా కంపెనీ వారు హిందువులు మరియు ముస్లింలు ఇరువురి నమ్మకాలను మరియు ఆచారాలను తాము గౌరవిస్తామని ప్రకటించారు. ప్రజల నుండి వ్యతిరేక ధోరణి వ్యక్తమవుతుందన్న భయం వల్ల వారు ఈ సమస్యను పరిష్కరించడానికి ముందుకు రాలేదు. కేవలం లార్డు విలియం బెంటిక్ భారతదేశ గవర్నర్ జనరల్ అయిన తర్వాత మాత్రమే 'సతి' దురాచారాన్ని అంతం చేయడానికి కొన్ని ప్రయత్నాలు జరిగాయి.

ప్రధానంగా గొప్ప సంఘసంస్కర్త అయిన రాజా రామమోహన్‌రాయ్ చేసిన ప్రయత్నాల వల్లనే, సాంఘిక దురాచారమైన 'సతి' రూపుమాపబడింది. క్రీ.శ.1818సం॥ నుండి 'సతి' దురాచారానికి వ్యతిరేకంగా ఆయన ప్రజలను చైతన్య పరిచారు. హిందూమతం 'సతి'కి వ్యతిరేకమని చెప్పడానికి ఆయన ప్రాచీన పవిత్ర గ్రంథాలను ఉదహరించారు. ఆయన ప్రజలలో హేదుబద్ధత మరియు మానవత్వం మరియు కనికరం వంటి మంచి గుణాలుండాలని విజ్ఞప్తి చేశాడు. 'సతి'కి వ్యతిరేకంగా ప్రజలను చైతన్య పరచడానికి ఆయన కొన్ని సమావేశాలను మరియు ఊరేగింపులను నిర్వహించి, ప్రజలందరికి విజ్ఞప్తులు చేశాడు. ఆయన, కలకత్తాలోని కొన్ని స్మశానవాటికలను దర్శించి, అక్కడ మరణిస్తున్న వితంతువులను మరియు వారి బంధువులను వారి అర్ధరహితమైన ఆచారం గురించి చైతన్యవంతులను గావించుటకు

ప్రయత్నించారు. రాజారామ్ మోహనరాయ్ చేసిన అలుపులేని ప్రయత్నాల వల్ల, క్రీ.శ.1829 డిశెంబరు 4న 'సతి'కి ఒక చట్ట వ్యతిరేక కృత్యంగా ప్రకటించారు. 'సతి'కి వ్యతిరేకంగా జరిగిన ఉద్యమం, దేశంలోని నలుమూలలకు విస్తరించింది.

**(సి) వితంతు పునర్వివాహాలు మరియు స్త్రీ విద్య :**

'సతి' దురాచారానికి వ్యతిరేకంగా చట్టాల్ని తీసుకురావడంలో రాజారామ్ మోహనరాయ్ చేసిన ప్రయత్నాలలో విజయవంతమైనాయని మీరు చదివియున్నారు. సమాజంలో స్త్రీ యొక్క పరిస్థితి, ముఖ్యంగా వితంతువుల పరిస్థితి మరీ దారుణంగా ఉండేది. హిందూ వితంతువుల పరిస్థితి చాలా దయనీయంగా ఉండేది. ఒక వితంతువు తనకున్న సర్వస్వము వదులుకొని సమాజంలో బ్రతుకును వెళ్ళదీయాల్సివచ్చేది. ఆమెకు కనీసం మంచి ఆహారం మరియు బట్ట కూడా కల్పించబడేది కాదు. ఆమె ఎటువంటి(శుభ) కార్యములకైనా హాజరవడం ఒక అశుభంగా భావించబడేది. కొన్ని ఉదాహరణలను పరిశీలిస్తే కొంతమంది ఆడపిల్లలకు బాల్య వివాహాలు జరిగి ఆ తర్వాత త్వరలోనే వారి భర్తలు చనిపోయిన పరిస్థితులు ఉండేవి. అటువంటి పరిస్థితులలో, అతిపిన్న వయస్సులోనే వితంతువులుగా మారిన ఆ యువతి పునర్వివాహం గురించి ఆలోచించకుండా బ్రతకాల్సివచ్చేది. వితంతువుల దురావస్థ చాలా దయనీయంగా ఉండేది.

వితంతువులపై జరిగే దారుణాలకు వ్యతిరేకంగా ఈశ్వరచంద్ర విద్యాసాగర్ దృఢ సంకల్పంతో పోరాటం సాగించారు. నిజానికి, ఆధునిక భారత నిర్మాణంలో విద్యాసాగర్ పాత్ర బహుముఖాలుగా ఉంది. వీటన్నిటికంటే ముఖ్యంగా భారతీయ స్త్రీల అభ్యున్నతి కోసం ఆయన చేసిన కృషి గుర్తుంచుకోదగినది.

సమాజంలో అణగారిన మరియు పీడిత ప్రజలు అనుభవిస్తున్న భాధల నుండి వారికి విముక్తి కల్పించడానికి విద్యాసాగర్ తన జీవితాన్నే అంకితం చేశాడు. వితంతు పునర్వివాహములకు అనుకూలంగా పోరాటం చేశాడు. విద్యాసాగర్, తనకున్న అపార సంప్రదాయ జ్ఞానంతో వితంతు పునర్వివాహాలకు అనుకూలంగా తన బలమైన వాదనలు విన్పించారు. క్రీ.శ.1855లో, వితంతు పునర్వివాహాల కొరకు ఒక శక్తివంతమైన ఉద్యమం ప్రారంభమైంది. అసంఖ్యాకంగా ప్రజల సంతకాలు సేకరించి ప్రభుత్వానికి ఆర్జీలు పంపారు. చివరకు క్రీ.శ.1856లో వితంతు పునర్వివాహాలు చట్టబద్ధం చేయబడ్డాయి. పునర్వివాహాలు చేసుకున్న వితంతువుల సంతానాన్ని చట్టబద్ధం చేస్తున్నట్లు ప్రభుత్వం ప్రకటించింది.

మనదేశంలో అగ్రవర్ణాలలో మొట్టమొదటి చట్టబద్ధమైన హిందూ వితంతు పునర్వివాహం క్రీ.శ.1856సంవత్సరం డిశెంబరు 7న కలకత్తాలో జరిగింది. దీనికి విద్యాసాగర్ స్ఫూర్తినిచ్చి, పర్యవేక్షించారు. విద్యాసాగర్ చేపట్టిన ఈ ఉద్యమం పట్ల, సనాతన హిందువుల నుండి తీవ్ర విమర్శలు, నిందలు ఎదురైనా ఆయన భయపడలేదు. ఆయన, అవసరమైన జంటలకు ఆర్థిక సహాయం చేయడంలాంటి ప్రయత్నాల ద్వారా క్రీ.శ.1855 – క్రీ.శ.1860ల మధ్య ఇరవై ఐదు వితంతు పునర్వివాహాలు జరిపించారు. ఈశ్వర చంద్ర విద్యాసాగర్, వితంతు పునర్వివాహాల కొరకు పోరాటం చేయడమే కాకుండా, బాల్యవివాహాలు మరియు బహుభార్యత్వం లాంటి దురాచారాలకు వ్యతిరేకంగా ప్రజలను చైతన్య పరిచారు. స్త్రీల మనుగడకు హానిచేస్తున్న ఇటువంటి దురాచారాలకు వ్యతిరేకంగా క్రీ.శ.1850 సంవత్సరం నుండి ఉద్యమించాడు.

విద్యాసాగర్, స్త్రీల విద్య పట్ల కూడా అత్యంత ఆసక్తి కనబరిచారు. ఆయన ఒక ప్రభుత్వ పాఠశాలల తనిఖీ అధికారిగా ముప్పై ఐదు బాలికా పాఠశాలలను నిర్వహించగా వానిలో చాలా పాఠశాలలను తన సొంత ఖర్చులతో నడిపినారు. "బెతూన్ పాఠశాల"కు కార్యదర్శిగా ఆయనను స్త్రీ ఉన్నత విద్యావ్యాప్తికి కృషి చేసిన ప్రముఖులలో ఒకరిగా చెప్పవచ్చు. నిజానికి క్రీ.శ.1840సం॥లో ప్రారంభమైన స్త్రీ విద్యా ఉద్యమం మొదటి ఫలంగా క్రీ.శ.1849సంవత్సరంలో

కలకత్తా నగరంలో స్థాపించబడిన బెతూన్ పాఠశాలలను(Bethune School)ఉదహరించవచ్చు. ఈ సందర్భంగా అంతకు క్రితం స్త్రీ విద్య బాగా క్షీణించిందని, స్త్రీ విద్యకు వ్యతిరేకంగా దురభిప్రాయాలుండేవని మనం గుర్తుకు తెచ్చుకోవాలి. అప్పట్లో స్త్రీలు విద్య నేర్చుకొనడం వలన వారు భర్తలపై అధికారాన్ని చెలాయిస్తారని మరియు వారు మంచి భార్యలుగా ఉండరని భావించేవారు. బాలికలకు ఆధునిక విద్యను అందించడం కోసం క్రైస్తవ మిషనరీ సంస్థలు క్రీ.శ.1821లో మొదటగా కొన్నిచర్యలు చేపట్టాయి. క్రైస్తవ మిషనరీ సంస్థలు క్రైస్తవ మతవిద్యను ఎక్కువగా బోధించటం వల్ల వారి ఈ ప్రయత్నాలు ప్రజలు ఆదరించలేదు. బెతూన్ పాఠశాలలో విద్యార్థులు చేరటం చాలా కష్టమయింది. యువ విద్యార్థులను ప్రజలు కేకలువేసి తిట్టేవారు. కొన్నిమార్లు వారి తల్లిదండ్రులను సాంఘిక బహిష్కరణ గావించేవారు. అయినప్పటికీ మానసిక స్థైర్యం కలిగిన కొంతమంది మానవతావాదులు స్త్రీ విద్యవ్యాప్తికి కృషి చేశారు.

స్త్రీ అభ్యున్నతి కొరకు సాగిన ఉద్యమాలు బెంగాల్‌కు మాత్రమే పరిమితం కాలేదు. చాలా త్వరితంగా అవి దేశంలోని అనేక ప్రాంతాలకు వ్యాపించాయి. మహారాష్ట్రలో, వితంతు పునర్వివాహ ఉద్యమ రథ సారథి జ్యోతి బాపూలె. పూలె యొక్క జీవిత ధ్యేయం, బ్రాహ్మణాధిక్యతను సవాలు చేయడమే. ఇందుకొరకై ఆయన సర్వజనిక్ సత్య ధర్మం(Sarvajanik Satya Darma Pustak) మరియు గులాంగిరి(Gulamgiri) లాంటి గ్రంథాలను వ్రాయటం ద్వారా సమాజంలో అట్టడుగు వర్గాల వారిని విద్యావంతులుగా చేయాలని వాదించారు. క్రీ.శ.1851వ సంవత్సరంలో 21 సంవత్సరాలు వయస్సులో పూనాలో బాలికల కోసం ఒక పాఠశాలను ప్రారంభించారు. క్రీ.శ.1854లో ఆయన అంటరానితనం వారికోసం ఒకపాఠశాలను ప్రారంభించారు. ఆయన, తన జీవితమంతా సమాజంలో అణగారిన వర్గాల సామాజిక సమానత్వం కోసం పోరాడారు.

పండిట్ విష్ణుశాస్త్రి కూడా వితంతువుల అభ్యుదయం కొరకు చాలా కృషిచేశారు. ఆయన క్రీ.శ.1850లో వితంతు పునర్వివాహ సంఘంను స్థాపించారు. జస్టిస్ రనడె కూడా ఇందుకు సహాయపడ్డాడు. ఆర్.జి.భండార్కర్, అగార్కర్ మరియు డి.కె.కార్వేలు స్త్రీ అభ్యున్నతి కొరకు ఉద్యమాన్ని బలపరిచారు. కార్వే క్రీ.శ.1899లో స్వయంగా ఒక బ్రాహ్మణ వితంతువును వివాహమాడారు. పూనాలో ఆయన ఒక హిందూ వితంతు పునరావాస కేంద్రం స్థాపించారు. దీనికొరకు అఖిల భారత స్త్రీ సమావేశం ఎంతో దోహదపడింది. స్త్రీ ఉన్నతికోసం పాటుపడిన మరియొక ప్రముఖ వ్యక్తి కార్సన్‌దాస్ ముల్జి(Karsandas Mulji)ఆయన క్రీ.శ.1852లో గుజరాతీ భాషలో వితంతు పునర్వివాహాలను ప్రోత్సహించుట కొరకు సత్యప్రకాష్(Satya Prakash)ను ప్రారంభించారు.

శ్రీమతి రమాబాయి, రనడె, ఎస్.జి.కె.దేవధర్ మరియు మరి కొంతమంది స్త్రీ, పురుషులు పూనా సేవాసదనాన్ని(Poona Sevasadan)ప్రారంభించారు. ఇది నర్సులకు మరియు మంత్రసానులకు శిక్షణ నివ్వడం, ప్రసూతి, శిశుసంక్షేమం మరియు వితంతువులకు ఉద్యోగ కల్పన మున్నగు అంశాలను గురించి ప్రధానంగా కృషి చేసింది. బి.యం.మలబారి(B.M.Malabari)మరియు దయారాం గిడామాల్(Dayaram Gidamal)లచే ప్రారంభించబడిన సేవాసదన సంఘం(Sevasadan Sangham)కూడా ఇదేరకమైన కార్యక్రమాలను చేపట్టింది.

క్రీ.శ.1885లో డఫ్రిన్(Dufferin) ప్రభువు రాణి భారతీయ స్త్రీలకు వైద్య సహాయం అందించడానికి భారతీయ స్త్రీలచే 'ద నేషనల్ అసోసియేషన్'(The National Association)ను ప్రారంభించింది. దీని ప్రధాన లక్ష్యం స్త్రీలకు వైద్యులుగా, ఆసుపత్రులలో సహాయకులుగా, నర్సులుగా మరియు మంత్రసానులుగా శిక్షణ ఇవ్వడం మరియు ఆసుపత్రులను,

వార్డులను మరియు చికిత్సకేంద్రాలను అందించడం ఈ సంఘం కార్యక్రమాలలో భాగంగా, భారతీయ స్త్రీల కొరకు ప్రత్యేక వైద్యసేవలు క్రీ.శ.1914లో ప్రారంభించబడ్డాయి. మంత్రసానులకు శిక్షణనిచ్చుట కొరకు క్రీ.శ.1903లో లేడి కర్జన్‌చే "విక్టోరియా మెమోరియల్ ఉపకార వేతన నిధి"(Victoria Memorial Scholarship fund) నిర్వహించబడినది. భారత స్త్రీలకు వైద్యశాస్త్రంలో శిక్షణ నిచ్చుట కొరకు క్రీ.శ.1916లో లార్డు హార్డింజ్ చే ఢిల్లీలో 'లేడి హార్డింజ్ వైద్య కళాశాల'(Lady Hardinge Medical College) ప్రారంభించబడింది. దేశంలోని స్త్రీలను ఆదుకునేందుకు ప్రసూతి మరియు శిశు సంక్షేమ సంస్థ(The Maternity and child Welfare Bureau) మరియు 'చిత్తరంజన్ సేవాసదనం'(Chittaranjan Seva Sadan)అనబడే మరో రెండు సంస్థలు అవిరళ కృషి సల్పినాయి.

20వ శతాబ్దంలో తీవ్రవాద జాతీయ ఉద్యమం ఆవిర్భావ ఫలితంగా స్త్రీ స్వేచ్ఛా ఉద్యమానికి మంచి ప్రోత్సాహం లభించింది. బ్రిటీష్ వారి పరిపాలనకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో స్త్రీలు ప్రముఖ పాత్రను వహించ ప్రారంభించారు. వారు రాజకీయ ఊరేగింపులలో, విదేశీ-వస్త్రాలు అమ్మే దుకాణాలను అడ్డుకోవడంలో ఖాదీ వస్త్రాలను ధరించడాన్ని ప్రచారం చేయడంలో పాల్గొని, కారాగారానికి వెళ్ళారు. శ్రీమతి సరోజని నాయుడు, జాతీయ కాంగ్రెస్‌కు అధ్యక్షురాలయ్యింది. సుభాష్ చంద్రబోస్ స్థాపించిన, భారతీయ జాతీయసైన్యం(Indian National Army I.N.A) ను స్థాపించడంతో పాటు స్త్రీలు కూడా విప్లవాత్మక ఉద్యమాలలో పాల్గొన్నారు. స్త్రీలు ఆవిధంగా రాజకీయ కార్యకలాపాలలో వ్యాపార సంఘాల, రైతు ఉద్యమాలలో, సామాజిక సంస్థలలో భాగస్వాములైనారు. జాతీయ ఉద్యమంలో స్త్రీలు పాల్గొనడం చూస్తే, వారు స్వాతంత్ర్య పోరాటంలో వారి భర్తలకు ఏమాత్రం తీసిపోరని నిరూపించబడింది. దీంతో స్త్రీల ఉద్యమం నూతన శిఖరాలను తాకింది.

భారతీయ సమాజంలో స్త్రీలకు సంబంధించిన అనేక సాంఘిక దురాచారాలు అప్పట్లో సర్వసాధారణమైనాయి. రాజారామ మోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, జ్యోతిబాఫూలె లాంటి సంఘ సంస్కర్తలు, స్త్రీల స్థితిగతులను అభివృద్ధి చేయుటకు కంకణం కట్టుకున్నాయి.

మనకు స్వాతంత్ర్యం వచ్చిన అనంతర కాలంలో భారత ప్రభుత్వం వారు, స్త్రీల పరిస్థితిని ఇంకొంత మెరుగు పరచడానికి చర్యలు చేపట్టారు. సమాన హక్కులను ఇస్తూ చట్టాలు చేయబడ్డాయి. దీని గురించి మీరు మరియొక అధ్యాయంలో వివరంగా చదువుతారు.

## పాఠ్య ప్రశ్నలు 56.ఎ

1. భారతదేశంలో 19 శతాబ్ధంలో నెలకొనియున్న సాంఘిక దురాచారాలలో, ఒకదానిని తెలియచేయండి.

2. ' సతి'ని రూపుమాపులకు రాజారామమోహన్‌రాయ్ అనుసరించిన వివిధ పద్ధతులేవి?

3. వితతు పునిర్వవాహాలు ఎప్పుడు చట్టబద్దం చేయబడ్డాయి? ఎవరి ప్రయత్నాల వల్ల ఈ చట్టం సాధించబడింది?

4. 19వ శతాబ్దంలో మహారాష్ట్రలోని స్త్రీల అభ్యున్నతికి దోహదపడిన ఇరువురు సంఘ సంస్కర్తలను పేర్కొనండి?

5. 20 శతాబ్ధంలో స్త్రీలను (మేల్కొల్పడంలో) చైతన్యవంతుల్ని చేయడంలో ప్రముఖపాత్ర వహించిన ఒక కారణం ఏమిటి?

## 56.4 కుల వ్యవస్థకు వ్యతిరేకంగా పోరాటం :

సంఘసంస్కరణ ఉద్యమం, కులవ్యవస్థ వైపుకు కూడా మరలింది. హిందూ సమాజం, కులం మీద ఆధారపడి విభజింపబడిందని మీరు ఇప్పటికే చదివియున్నారు. ప్రాచీన కాలంలో 'కులం' అనునది ఆయా వ్యక్తులు చేపట్టిన వృత్తులపై ఆధారపడేది కాని ఆ తర్వాత అది అనువంశికం అయింది. మన సమాజంలో అశాంతికి ఒక ప్రధాన కారణం కులమేనని చెప్పవచ్చు. 19వ శతాబ్ధంలో కులం అనునది ప్రజలను మూర్ఖులుగా చేసింది. అగ్రవర్ణాల పరిస్థితి, నిమ్న కులాల పరిస్థితి కంటె చాలా భిన్నంగా ఉండేది. అగ్రవర్ణాల వారు సంఘంలో ఉన్నతమైన స్థితిని అనుభవిస్తూ, ఉత్నత ఉద్యోగాలను చేస్తూ ఉండేవారు. కాని నిమ్న కులాల వారు మాత్రం చాలా ఆంక్షలతో జీవితాన్ని వెళ్ళదీస్తూ, అణచివేతకు గురైనారు. కులవ్యవస్థ సమాజాన్ని విభజించింది. ఇది చాలా అమానుషంగా ఉండి, అసమానత్వాన్ని సృష్టించింది. జాతీయ సమైక్యత లోపించడానికి ఇది ఒక ప్రధానకారణం. మనమంతా ఒకే జాతి అనే భావనకు ఆటంకమైనందు వల్లనే బ్రిటీష్ వ్యతిరేక పోరాటంలో అందరూ ఐక్యంగా పోరాడలేక పోయారు.

ప్రజలలో ఆధునిక, ప్రజాస్వామ్య భావాలు రేకెత్తినందువల్ల వారు కులానికి, అంటరానితనానికి వ్యతిరేకంగా తమ గళాన్ని విప్పారు. జాతీయ ఉద్యమం, కులవ్యవస్థను నిర్వీర్యం చేయడంలో ఒక ప్రధానపాత్ర వహించింది. ఇది మత, వర్గ, కుల, లింగ తారతమ్యాలకు అతీతంగా ప్రతివ్యక్తి అభివృద్ధి సాధించుటకు సమాన హక్కులు మరియు సమాన స్వేచ్ఛలను సాధించుటకు పోరాడింది. నిజానికి గాంధీజీ ప్రజా సంబంధ కార్యక్రమాలన్నింటిలో అంటరానితనం నిర్మూలనకు అత్యధిక ప్రాధాన్యతనిచ్చారు. ఆయన తన పత్రికకు 'హరిజన్' అనే పేరిడి, దాని ద్వారా తన సాంఘిక, రాజకీయ మరియు మతపరమైన భావాలను వ్యాపింపజేశారు. ఆయన, అంటరాని వారిని దేవుని యొక్క నిజమైన బిడ్డలు అనగా 'హరి'జనులుగా నమ్మేవాడు. ఆయన చేసిన కృషి వల్లనే, దేవాలయాలలోకి హరిజనుల ప్రవేశానికి ఉన్న ఆంక్షలు తొలగించబడ్డాయి. క్రీ.శ.1932 సంవత్సరంలో గాంధీజీ 'అఖిల భారత హరిజన సంఘం'(All India Harijan Sangh) ను స్థాపించారు.

డా॥ బి.ఆర్.అంబేద్కర్ కులానికి వ్యతిరేకంగా తీవ్ర పోరాటాన్ని కొనసాగించారు. ఆయన కుల నిరంకుశత్వానికి వ్యతిరేకంగా పోరాటం చేయడానికి తన జీవితాన్ని అంకితం గావించారు. ఆయన, అంటరానితనం నిర్మూలన కొరకు "అఖిల భారత అణగారిన వర్గాల సమాఖ్య"(All India Depressed Classes Federation)ను నడిపారు. కుల వ్యతిరేక పోరాటానికి జాతీయ ఉద్యమానికి చాలా దగ్గర సంబంధం ఉంది. బ్రిటీష్‌వారు భారత సమాజ సంప్రదాయ వ్యవస్థ విషయంలో కలుగు చేసుకోవడానికి సాహసించలేదు. సమాజంలోని సనాతన వర్గాలతో విరోధాన్ని బ్రిటీష్‌వారు కోరుకోలేదు. ఆవిధంగా డా॥అంబేద్కర్ లాంటి స్వాతంత్ర్య ఉద్యమకారులు మనకు " సమన్యాయం " మరియు యోగ్యతను ఇవ్వగలిగి సామాజిక మరియు ఆర్థిక స్వాతంత్ర్యాన్ని ప్రసాదించుటకు గాను సవరణలు చేయటానికి వెరవని వ్యక్తులు అధికారాలలోనున్న ప్రభుత్వం కావాలి అని అనేవారు. కేవలం స్వరాజ్య ప్రభుత్వం ద్వారా మాత్రమే అంటరాని తనాన్ని నిర్మూలించవచ్చని డా॥ అంబేద్కర్ భావించేవారు.

డా॥ అంబేద్కర్, స్వతంత్ర భారత ప్రభుత్వం మాత్రమే అట్టడుగు కులాల ఆర్థిక స్థితిని మెరుగు పరచగలదని నమ్మేవాడు. నిజానికి, అటువంటి అణగారిన కులాలకు చెందిన ప్రజల ఆర్థికస్థితి మారనిదే వారిని సామాజికంగా ఉన్నతస్థితికి గొనిపోవటం సాధ్యం కాదు. క్రీ.శ.1947లో పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, డా॥అంబేద్కర్‌కు భారత

ప్రభుత్వంలో చేరమని ఆహ్వానించారు. ఆయన న్యాయశాఖ మంత్రి అయి, భారత రాజ్యాంగ నిర్మాణంలో ప్రముఖ పాత్ర వహించారు. భారత రాజ్యాంగం (1950), అంటరానితనం నిర్మూలన, ఆంక్షలను తొలగించి వానిలోకి సకల జన ప్రవేశాన్ని అనుమతిస్తూ ప్రకటన చేసింది.

అంటరానితనానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో సామాజిక సంస్థలు కూడా పాల్గొన్నాయి. అటువంటి సంస్థలలో 'సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ'(Servants of India Society)ఒకటి దీనిని క్రీ.శ.1905లో గోపాలకృష్ణ గోఖలె(1866–1915) స్థాపించారు. భారతదేశ సేవ కొరకు సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ జాతీయ మత సంస్థలను(మిషనరీ)లకు శిక్షణ నిచ్చింది. ఈ సంస్థలు, దేశం కొరకు తమ జీవితాలను అర్పించవలసి ఉండేది. వారు భారత ప్రజానీకం నిజమైన అభీష్టాలను రాజ్యాంగ బద్ధ పద్ధతులు ద్వారా ప్రోత్సహించవలసి ఉంటుంది.

ఆవిధంగా సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ వారు ప్రత్యేకంగా రాజకీయ, విద్యా లేక సామాజిక వంటి కొన్ని కార్యక్రమాలకే పరిమితర కాలేదు. వారంతా తమ స్వప్రయోజనాలకు గాక ఇతరులకు సేవ చేయడానికి ఏర్పడిన ఒక సుశిక్షుతులైన జన సమూహం వారు ప్రజామోదం పొంది అంటరానితనం నిర్మూలనకు చర్యలు చేపట్టారు.

ఈ సంఘంతో సంబంధమున్న మరికొంతమంది ప్రముఖులలో రొటేరియన్ గౌ॥ వి.యస్.యస్.శాస్త్రి (V.S.S.Sastry) (గోఖలె మరణం తర్వాత వీరు 1915లో సొసైటీకి 2వ అభ్యర్ధులు అయ్యారు.) నారాయణ మల్హర్ జోషి (Narayana Malhar Joshi) (వీరు ముంబైలో 'సోషల్ సర్వీస్‌లీగ్' స్థాపించారు)Mr. ఎన్.యమ్.జోష(N.M.Joshi)(వీరు 1920లో ఆల్‌ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్'ను స్థాపించారు) Mr. హిందూనాథ్‌కర్జ్రు (Hindunath Kuzru) (వీరు 1914లో అలహాబాద్‌లో సేవాసమితిని ప్రారంభించారు) ఆచార్యులు. డి.యల్.సహస్రబుద్ధ (Prof D.L.Sahasra Budha) గ్రామల అభివృద్ధి కోసం వీరు గ్రామాలను అభివృద్ధి చేసేందుకు ప్రయత్నం(Trial in Improving Villagers)అనే ఒక పథకంను ప్రారంభించారు. మరియు Mr.అమృతలాల్ విఠల్‌దాస్ ధక్కర్(Amritlal Vithaldas Thakkar)(వీరు 1922లో 'భీల్ సేవా మండల్'ను స్థాపించారు)మొదలగు ముఖ్యులున్నారు.

కులవ్యవస్థ భారత సమాజాన్ని చీల్చివేసింది. అంటరానితనం ఒక పెద్ద సామాజిక దురాచారం అయింది. కులవ్యవస్థను బలహీన పరచుటలో 'జాతీయ ఉద్యమం' ఒక ప్రముఖ పాత్ర వహించింది. గాంధీ మరియు అంబేద్కర్‌లు అంటరానితనానికి వ్యతిరేకంగా పోరాడారు వీరిరువురు తమ జీవితాలను అణగారిన వర్గాల అభ్యున్నతికై అంకితం చేశారు.

## 56.బి పాఠ్యప్రశ్నలు

1. కుల కాఠిన్యతల(rigidiaties)ను బలహీనపరచుటకు, జాతీయ ఉద్యమం ఏవిధంగా సహాయపడింది?
2. "బ్రిటీష్ ప్రభుత్వం వారు కులవ్యవస్థను ఏమీ చేయలేరు" అని డా॥ అంబేద్కర్ ఎందుకు భావించారు?
3. సామాజిక అభ్యున్నతిలో ఆర్థిక అభివృద్ధి ఎందుకు ఆశ్యకమై ఉన్నది?

**సారాంశం :**

మతపరమైన మరియు సామాజిక సంస్కరణల ఉద్యమాలు చాలా దగ్గరి సంబంధాన్ని కలిగి ఉన్నాయి. 19వ శతాబ్ధంలో స్త్రీల మరియు కుల సంబంధ సంఘ దురాచారాలుండేవి. స్త్రీలు అణగదొక్కబడేవారు. అంతేగాక వారు

సంఘపరంగా ఎటువంటి ప్రధానపాత్ర వహించడానికి అనుమతించబడేవారు కారు. వారు గృహ సంబంధ బాధ్యతలకు మాత్రమే పరిమితం చేయబడ్డారు. 'బాలికా శిశు(భృణ) హత్య' మరియు 'సతి' వంటి దురాచారాలు అమలులో ఉండేవి. బాల్య వివాహాలు జరుపబడటమే గాక వితంతువులను హీనంగా చూసేవారు. రాజా రామమోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, జ్యోతిబాపూలె, జస్టిస్ రనడెలు స్త్రీల అభ్యున్నతికోసం పాటు పడ్డారు. వారి ప్రయత్నాల ఫలితంగా స్త్రీలపై జరిగినటువంటి అత్యాచారాలకు వ్యతిరేకంగా చట్టాలు చేయబడ్డాయి. జాతీయ ఉద్యమం స్త్రీలలో ఒక నూతన జాగృతిగా సాయపడింది. వారు పురుషులతో సమానంగా భాధ్యతలు తాము భరించారు.

ఇంకొక ప్రధాన సంఘ దురాచారం కులతత్వం. ఇది భారత సమాజాన్ని ముక్కలు చేసింది. అగ్రవర్ణాలు, నిమ్న జాతుల మధ్య చాలా అంతరం ఉండేది. కొంతమంది నిమ్న కులాల వారు, అంటరాని వారుగా పరిగణించబడేవారు. గాంధీజీ, డా॥ అంబేద్కర్ లాంటి నాయకులు, అణగారిన వర్గాల అభ్యున్నతికి అహర్నిశలూ పాటుపడ్డారు. గాంధీజీ 'అఖిలభారత హరిజన సంఘం'ను స్థాపించారు. డా॥అంబేద్కర్ 'అఖిల భారత అణగారిన వర్గాల సమాఖ్య'ను నడిపారు. జాతీయ ఉద్యమం, వేర్వేరు కులాలకు చెందిన వారిని దగ్గరయ్యేటట్లు చేసింది. విభిన్న కులాలకు చెందిన ప్రజలందరూ కలసి ప్రజా సమావేశాలు, ఊరేగింపులను నిర్వహించారు. నేటికీ మన సమాజంలో 'కులం' సర్వ సాధారణమైనప్పటికీ, కుల వ్యవస్థను నిర్మూలించుటకు ప్రయత్నాలు జరుగుతూనే ఉన్నాయి.

**అభ్యాసం :**

1. భారత సమాజంలో 19వ శతాబ్దంలో అమలులో ఉన్న స్త్రీలకు సంబంధించిన ప్రధాన దురాచారాలు ఏవి?
2. స్త్రీ జనోద్ధరణలో (ఎ) రాజారామమోహనరాయ్ (బి) ఈశ్వరచంద్ర విద్యాసాగర్‌ల పాత్ర ఎట్టిది?
3. సంఘ సంస్కర్తలు 'కులం'పై ఎందుకు దాడిచేశారు? జాతీయ ఉద్యమ సమయంలో కాఠిన్యతలు ఎలా బలహీనపడ్డాయి?
4. ప్రస్తుతం మన సమాజంలో స్త్రీల పరిస్థితిని పరీక్షించండి. భారత స్త్రీలను ఇప్పటికీ బాధపెడుతున్న ప్రధాన దురాచారాలు ఏవి?

**అదనపు సమాచారం :**

**సమానత్వ హక్కు :**

రాజ్యాంగం అనునది మనదేశానికి అత్యున్నత చట్టం. రాజ్యాంగంలోని III వ విభాగంలో మనదేశానికి చెందిన ప్రతి పౌరుడికి కొన్ని ప్రాథమిక హక్కులు ఇవ్వబడ్డాయి. ఈ క్రింద సమానత్వపు హక్కునకు సంబంధించి 14,15 మరియు 17 అధికరణములలో పొందుపరచబడిన కొన్ని వాక్య ఖండములు(clauses)లను ఇచ్చుచున్నాం.

14. చట్టం ముందు 'సమానత్వం' : భారత భూభాగం లోపల చట్టం పరిధిలో సమానత్వాన్ని ఏ వ్యక్తికీ ఏ రాష్ట్రం కాదనకూడదు.

**15. మత, జాతి, కుల, లింగ, లేక జన్మ స్థలమును బట్టి విచక్షణ చూపకుండుట :** 1. మత, జాతి, కుల, లింగ మరియు జన్మ స్థలమును బట్టి ఏ రాష్ట్రం, ఏ పౌరునికి వ్యతిరేకంగా విచక్షణ చూపకూడదు. 2. మత, జాతి, లింగ జన్మ స్థలములు లేక వానిలో ఏ ఒక్క దాని పరంగానైనా ఏ పౌరునికీ ఎటువంటి అనర్హత, ఆంక్ష, లేక షరతులను విధించి క్రింది విషయాలలో తిరస్కరించకూడదు.

(ఎ) దుకాణాలు, రెస్టారెంట్స్, హోటళ్ళు(సత్రములు) మరియు ప్రజా వినోదానికి సంబంధించిన ప్రాంతాలలోకి ప్రవేశం.

(బి) బావులు, చెరువులు, స్నానఘట్టాలు, రహదారులు మరియు రాష్ట్ర నిధులచే నడుపబడుతున్న లేక సామాన్య ప్రజానీక అవసరార్థం నిర్మించబడిన ప్రాంతాలనుపయోగించడం

3) స్త్రీలు మరియు పిల్లలకు చేసే ఎటువంటి ప్రత్యేక సదుపాయాల కల్పనకు, ఈ అధికరణంలోని ఏ భాగం రాష్ట్రానికి అడ్డు చెప్పదు.

4) ఈ అధికరణం ప్రకారం లేక 29వ అధికరణం 21వ వాక్యఖండం ప్రకారం సామాజికంగా మరియు విద్యాపరంగా వెనుకబడిన వర్గాల పౌరుల అభ్యున్నతి కొరకు లేదా షెడ్యూలు కులాలు మరియు షెడ్యూలు జాతులకు సంబంధించి రాష్ట్రం ఎటువంటి ప్రత్యేక సదుపాయాలు కల్పించినా అడ్డుపడదు.

**17. అంటరానితనం నిర్మూలన :** అంటరానితనం నిర్మూలించబడాలి. మరియు ఏదో విధంగా దీనిని పారద్రోలాలి. చట్టప్రకారం అంటరానితనం అనే దురాచారంను ఎక్కడైనా ఎటువంటి వాటికైనా అనర్హతగా చేసినట్లయితే దానిని ఒక నేరంగా పరిగణిస్తారు.

## పాఠ్యప్రశ్నలకు సమాధానాలు :

**56.ఎ**

1. సతి, వైధవ్యం, బాల్య వివాహం, బాలికా శిశుహత్య (ఏవైనా రెండు)
2. రాజరామ మోహనరాయ్ ఉపన్యాసాలు ఇచ్చారు. హిందూ ధర్మ శాస్త్రాలను, చూపించి హిందూత్వం 'సతి'కి వ్యతిరేకమని ఉదహరించారు. సమావేశాలు నిర్వహించారు, అర్జీలు ఇచ్చారు, స్మశాన వాటికలను దర్శించారు.
3. 1856, ఈశ్వర చంద్ర విద్యాసాగర్.
4. జ్యోతి బాపూలె, జస్టిస్ యం.జి.రనడె
5. జాతీయ ఉద్యమం

**56.బి**

1. జాతీయ ఉద్యమం, స్వేచ్ఛ, సమానత్వాన్ని ప్రోత్సహించింది. కుల ప్రాబల్యాన్ని వ్యతిరేకించింది. దీంతోపాటు ప్రజా ఊరేగింపులలో, ప్రదర్శనలలో అన్ని మతాల వారు పాల్గొనేటట్లు చేసి వారందరిని దగ్గరచేసి, కుల వివక్షణను బలహీనపరచింది.
2. బ్రిటీష్ ప్రభుత్వం వారు ఎటువంటి సంస్కరణలు చేపట్టలేక పోయారు. వారు అప్పట్లో అమలులో ఉన్న భారతీయ సంప్రదాయాలలో తలదూర్చదలచుకోలేదు.
3. అణగారిన వర్గాల వారు చాలా పేదవారు మరియు వారిలో కనీస అవసరాలు కూడా తీర్చుకోలేని పరిస్థితి ఉండేది. వారిలో ఆర్థికాభివృద్ధి లేనిదే, సామాజికంగా ఎదగలేరు. వారి స్థాయిని మెరుగుచేయుట కొరకు వారికి వైద్య మరియు ఉద్యోగ సౌకర్యాలు తప్పనిసరి.

# 57

# భారత స్వాతంత్ర్యోద్యమ పోరాటం 1857 తిరుగుబాటు

## 57.1 పరిచయము :

భారతదేశ చరిత్రలో క్రీ.శ.1857 సంవత్సరం ఒక విశిష్ట ఘట్టానికి ప్రతీకగా నిలిచింది. భారతదేశంలో ఆంగ్లేయుల పరిపాలనకు మొదటిసారిగా ఒక సంఘటిత సవాలు (formidable challenge) ఎదురైంది. ఉత్తర భారతదేశం మరియు మధ్య భారత ప్రజలు బ్రిటీష్ వారి పరిపాలనకు వ్యతిరేకంగా ఒక మహా తిరుగుబాటును లేవదీసి, దాదాపుగా బ్రిటీష్ వారిని, భారతదేశం నుండి వెళ్లగొట్టుటకు ప్రయత్నం చేశారు. ఈ తిరుగుబాటు రావడానికి ఏ ఒక్క కారణమో జవాబుదారీ కాదు. ఈ తిరుగుబాటు, తూర్పు ఇండియా వర్తక సంఘం (ఈస్టిండియా కంపెనీ) వారి స్వార్థపూరిత మరియు భారతీయులను అణగదొక్కే పాలనా విధానం వలన ఎన్నో బాధలు పడ్డ భారతీయులు సంఘటితమై చేసిన పోరాటం. క్రీ.శ.1857లో జరిగిన సంఘటనలు, తూర్పు ఇండియా వర్తక సంఘం పరిపాలనలో భారత సమాజంలోని దాదాపు ప్రతి వర్గానికి చెందిన ప్రజలు పడ్డ బాధలను ప్రతిబింబిస్తాయి. ఆ విధంగా తూర్పు ఇండియా వర్తక సంఘం వారి ప్రధాన లక్ష్యమైన తక్కువగా పనిచేయడం, ఎక్కువ ఆదాయాన్ని పొందడం అనే దానికి వ్యతిరేకంగా కోపోద్రిక్తులైన భారతీయులు చేసిన పోరాటమే ఈ తిరుగుబాటు.

క్రీ.శ.1857 తిరుగుబాటును గురించి మనం రెండు అధ్యాయాలు (Chapters) లో చదువుకుందాం. ఈ మొదటి పాఠంలో, తిరుగుబాటుకు కారణాలు మరియు తిరుగుబాటు సాగిన పద్ధతి గురించి చదువుదాం. రెండవ పాఠంలో భారతదేశ చరిత్రలో సువర్ణాధ్యాయం (glorious chapter) అయిన దీనియొక్క స్వభావము మరియు ఫలితాలు గురించి చదువుతాం.

## 57.2 లక్ష్యాలు

ఈ పాఠం చదివిన తరువాత మీరు క్రింది విషయాలు తెలుసుకుంటారు.

1. 1857 తిరుగుబాటుకు దారితీసిన వివిధ కారణాలు.
2. 1857 తిరుగుబాటు సాగిన విధానం.
3. ఈ తిరుగుబాటు వ్యాప్తిలో (ఝాన్సీకు చెందిన) రాణి లక్ష్మీబాయి, నానాసాహెబ్, తాంతియాతోపే మరియు ఇతర నాయకుల ప్రధాన పాత్రను గుర్తిస్తారు.

## 57.3 తిరుగుబాటుకు కారణాలు

మీరు గుర్తుకు తెచ్చుకోవలసిన విషయమేమిటంటే బ్రిటీష్‌వారు, భారతదేశ స్వయం ఆధారిత సంప్రదాయ ఆర్థిక వ్యవస్థను నాశనం చేసి (కుంటుపరిచి) భారత మార్కెట్‌లను యంత్రాలతో తయారైన వస్తువులతో నింపివేశారు. వారు భారతదేశ రాష్ట్రాన్ని ఐక్యం చేసి మరియు రాచరిక ఆదరణ (royal patronage) ద్వారా భారతీయులు, వారి జీవనోపాధికి చేయుచున్న వృత్తులను నాశనం చేశారు. కొత్త పరిపాలకుల (బ్రిటీష్) వ్యవసాయ మరియు పారిశ్రామిక విధానాలు, భారత రైతులు, పనివారికి తీవ్ర నష్టాన్ని కలిగించాయి. భారతీయుల తీవ్ర అసంతృప్తి (discontent) కు కారణం, బ్రిటీష్‌వారు భారత ఆర్థిక వ్యవస్థను, వారి స్వార్థానికి ఉపయోగించుకోవడమే. భారతీయ రైతుల, పనివారి దరిద్రం , పేదరికం మరియు నిరాశా నిస్పృహలు, పరిస్థితి మెరుగు పరచుకోవడం కొరకు, తిరుగుబాటులో పాల్గొనేటట్లు చేశాయి. SS/HIST/52 మరియు SS/HIST/53 పాఠాలను చదవండి)

తూర్పు ఇండియా వర్తక సంఘం వారు, భారతీయ రాష్ట్రాలను ఆక్రమించుకోవడం వలన, ఉన్నత, మధ్య తరగతి భారత ప్రజలు నిరుద్యోగులయ్యారు. సంస్థానాల (princely states) లో పరిపాలన, న్యాయ వ్యవస్థలకు సంబంధించిన ఉద్యోగాలు పొందిన భారతీయులు, వారి జీవనోపాధిని కోల్పోయారు. రాజుల ఆస్థానములలోని మత బోధకులు అనగా పండితులు మరియు మౌలావీలు వారి ప్రధాన హోదాల నుండి తప్పించబడినారు. కొంతమంది భారతీయులను పరిపాలనా సంబంధమైన ఉద్యోగాలలోకి తీసుకున్నప్పటికీ, వారికి తక్కువ జీతం మరియు తక్కువ ప్రాధాన్యత గల ఉద్యోగములు మాత్రమే ఇచ్చారు. ఏ భారతీయుడికి కూడా నెలకు రూ. 60 నుండి రూ. 70 వరకు సంపాదించే 'సుబేదారు' ఉద్యోగాన్ని మించిన ఉద్యోగం ఇవ్వలేదు. ఆంగ్ల చరిత్రకారుడైన టి.ఆర్.హోమ్స్, భారత సిపాయి గురించి తన మాటలలో "అతడు, మిలటరీ మేధావి అయిన హైదర్ అంత సామర్థ్యాన్ని కలిగి ఉన్నప్పటికీ, తను కనీసం ఒక చిన్న ఆంగ్ల ఉద్యోగికి వచ్చినంత జీతాన్ని, అతను పొందే హోదాను పొందలేదని, 30 సంవత్సరాలపాటు విధేయతతో సేవ చేసిన తరువాత కూడా, ఇంగ్లండ్‌కు చెందిన అప్పుడే నూతనంగా ఉద్యోగంలో ప్రవేశించిన తక్కువ స్థాయి అధికారి అవలంబించే నీచమైన ప్రవర్తన నుండి తనను తాను కాపాడుకోలేనని తెలుసు."

బ్రిటీష్‌వారి విధానాలు స్థానిక భారతీయులపై వారి ఆధిపత్యం (Superiority) ను ప్రదర్శించుటే లక్ష్యంగా రూపొందించబడినాయి. మొదటి నుండి, బ్రిటీష్‌వారు తమను తాము విదేశస్థులుగానే భావిస్తూ, భారతదేశ పాలన చేస్తూ, ఇచ్చటి సంపదనంతా తమ మాతృదేశమైన బ్రిటన్‌కు తరలించడమే తమ ధ్యేయంగా పెట్టుకున్నారు. బ్రిటీష్‌వారు, వారికీ మరియు భారతీయులకీ మధ్య ఎటువంటి సామాజిక అవగాహన (social communication) ను ఏర్పరచటానికి ప్రయత్నం చేయలేదు. ఈ విధంగా బ్రిటీష్‌వారి ఆధిపత్య ధోరణి, భారతీయుల పట్ల అలక్ష్య భావనలు, భారతీయులలో వారిపట్ల తీవ్రమైన కోపద్వేషాలు రగలడానికి కారణమయ్యాయి. దేశంలో వివిధ ప్రాంతాలలో రేగిన అలజడులు (uprisings), తిరుగుబాట్లు (rebellions) బ్రిటీష్ వారిపట్ల పెరుగుతున్న ద్వేషాన్ని తెలియజేస్తున్నాయి.

డల్హౌసీ ప్రభువు 'అవధ్' రాజ్యాన్ని కబళించటం (annexation) దేశంలోని అనేక ప్రాంతాలలో, మరీ ముఖ్యంగా అవధ్‌లో ఆగ్రహావేశాలకు కారణమయింది. అవధ్ నవాబు లక్నో వదలి వెళ్లేటప్పుడు, అతని రాజ్యంలోని ప్రజలు, అతనిని కాన్పూర్ వరకు విషాద గీతాలతో అనుసరించినట్లు మనకు తెలుస్తోంది. డల్హౌసీ చర్య కంపెనీ సైన్యంలో తిరుగుబాటు వాతావరణాన్ని సృష్టించింది ఎందుకంటే సైన్యంలో ఎక్కువమంది అవధ్ ప్రాంతం నుండి తీసుకోబడినారు. పైగా ఇతర రాష్ట్రాల పాలకులలో అతని చర్య భయాన్ని సృష్టించింది. భారత భూభాగాన్ని ఆక్రమించుకోవాలనే బ్రిటీష్‌వారి సామ్రాజ్య కాంక్ష వలన, వారికి భారత రాజులు తమ పట్ల చూపే విధేయత, పెద్ద మొత్తాలలో చెల్లించు కప్పం, ఇచ్చే

బహుమతులను ప్రక్కన పెడతారేమోనని భయపడసాగినారు. భారత రాష్ట్రాలను తమ అధీనంలోకి తెచ్చుకొనే (annexation) సిద్ధాంతం, బ్రిటీష్‌వారికి, చివరి పీష్వా రెండవ బాజీరావు దత్త పుత్రుడైన నానాసాహెబ్, ఝాన్సీరాణి, బహదూర్‌షాలు శత్రువులుగా మారారు.

బ్రిటీష్ వారి పాలనకి ప్రజలు వ్యతిరేకంగా మారుటకు ఒక ప్రధాన కారణం, వారు తమ మతం అపాయంలో ఉన్నట్లు భయపడటమే. క్రైస్తవ మిషనరీలు భారత ప్రజలను క్రైస్తవులుగా మార్చుటకు తీవ్ర ప్రయత్నాలు చేశాయి. ఆ మిషనరీలు, హిందు, ఇస్లాం మతాల మీద హింసాయుత మరియు నీచమైన దాడులు చేశాయి. మరోవైపు, వారి చర్యలన్నీ వారి పాఠశాలల్లో ఆసుపత్రిలలో మరియు ఇతర దాతృత్వ సంస్థల ద్వారా చేయడం ప్రారంభించాయి. భయం, అపనమ్మకంతో కూడిన ఇటువంటి వాతావరణంలో, ఇంకా వారి చర్యలు ప్రజల మతవిశ్వాసాలు, సంప్రదాయాల నమ్మకాల వంటి సున్నితమైన భావాలను తాకినపుడు, వదంతులు (పుకార్లు) చాలా తేలికగా, ఎక్కువగా వ్యాపిస్తాయి. ఉదాహరణకు, సిపాయిలు తమకి రేషన్‌గా ఇవ్వబడిన గోధుమ పిండిలో ఆవుల, పందుల ఎముకల పొడి కలిపినట్లుగా నమ్మడం మొదలుపెట్టారు. అవధ్ ఒక తాలూకుదార్ (Taluqdar) ఒక బ్రిటీష్ అధికారితో అత్యధిక మంది భారతీయుల ఆలోచనలను, వైఖరులను తన మాటలలో ఈ విధంగా వ్యక్తం చేశాడు. "మహాశయా మీదేశస్థులు మా దేశంలోకి ప్రవేశించి మారాజును వెళ్లగొట్టారు. ఒకే ఒక దెబ్బతో ఎంతో కాలం నుండి మా కుటుంబంలో భాగమైన మా భూమిని మీరు కబళించారు. మీకు వినమ్రంగా చెప్పేదేమంటే, అకస్మాత్తుగా, మిమ్మల్ని దురదృష్టం వెంటాడుతోంది. భారత ప్రజలు మీకు వ్యతిరేకంగా ఉద్యమించారు. మీరు నీచంగా నిందించిన నా వద్దకు వచ్చారు. మిమ్మల్ని నేను కాపాడాను. కానీ, ఇప్పుడు నేను నా సేవకులకు (retainers) నాయకుడిగా ముందుండి నడిపిస్తూ, లఖానో వద్దకు మిమ్మల్ని మా దేశము నుండి వెళ్లగొట్టుటకు వస్తున్నాను".

కంపెనీ పరిపాలన ప్రారంభమైనప్పటి నుండి, కంపెనీ పరిపాలనపై నున్న అపఖ్యాతి (unpopularity) వలన నిరంతరం తిరుగుబాట్లను మనం గమనించవచ్చు. క్రీ.శ.1763లో జరిగిన ప్రసిద్ధిగాంచిన 'సన్యాసి తిరుగుబాటు'లో మత సన్యాసులు, ఆస్తులు కోల్పోయిన జమీందార్లు, నిరుత్సాహ సైనికులు, బెదిరిపోయిన రైతులు బ్రిటీష్ వారికి వ్యతిరేకంగా తమ చేతులు కలిపారు. క్రీ.శ.1766-1772 మరియు క్రీ.శ.1795-1816 సంవత్సరాల మధ్య బెంగాల్, బీహార్‌లోని అనేక జిల్లాలలో ఉద్యమాలు (చేర్ ఉద్యమం) ఉధృతమయ్యాయి. దక్షిణ భారతదేశంలో విజయనగర సామ్రాజ్య పాలకుడు క్రీ.శ.1794లో ట్రావన్‌కోర్ దివాను క్రీ.శ.1805లో మరియు సౌరాష్ట్ర రాజులు క్రీ.శ.1816-32 సం.ల మధ్య ఎదురు తిరిగారు. క్రీ.శ.1814-17 సంవత్సరాల మధ్య ఆలీఘర్ తాలూకుదార్లు, 1824లో పశ్చిమ ఉత్తరప్రదేశ్ మరియు హర్యానాలలోని జాగులు కొన్ని ఆటంకాలను సృష్టించారు. ఆ విధంగా బ్రిటీష్‌వారి మొదటి 100 సంవత్సరాల పరిపాలనా కాలంలో, తిరుగుబాట్లు జరిగాయి. నిస్సందేహంగా, ఈ తిరుగుబాట్లు స్థానికమైనవీ, ఎక్కడికక్కడ విడివిడిగా జరిగినవీ మరియు ఆధునిక భావన ఐన జాతీయ భావన లోపించినవీ అయినప్పటికీ, ఈ తిరుగుబాట్లు, విదేశీ పాలనకు వ్యతిరేకంగా విలువైన స్థానిక సంప్రదాయబద్ధ పోరాటాన్ని ఆరంభించడంలో ప్రముఖపాత్ర వహించాయని చెప్పవచ్చు.

కంపెనీ సైన్యంలోని భారత సిపాయిలలో తీవ్ర అసంతృప్తి నెలకొన్నది. వారికి తక్కువ జీతాలు ఇవ్వడమేగాక, వారు బ్రిటీష్ వారి తిరస్కారానికి గురయ్యారు. వారిలో అసంతృప్తి రగలడానికి ప్రధాన కారణం, సింధు లేక పంజాబ్ ప్రాంతంలలో పనిచేసే సిపాయిలకు, విదేశీ సేవాభత్యం చెల్లించకూడదనే బ్రిటీష్ వారి నిర్ణయం. ఈ నిర్ణయం వలన వారిలో ఎక్కువ మంది జీతాలలో భారీగా కోతలు జరిగాయి. దీంతోపాటు 'అవధ్'ను కలుపుకోవడం, చాలామంది సిపాయిల భావోద్వేగాలకు కారణమై, వారిలో తీవ్ర ఆగ్రహానికి కారణమైంది.

నిజానికి సిపాయిల అసంతృప్తి వెనుక చాలా పెద్ద చరిత్ర ఉంది. క్రీ.శ.1764 సం.లో బెంగాల్‌లో ఒక తిరుగుబాటు మొదలైంది. ఈ తిరుగుబాటులో పాల్గొన్న 30 మంది సిపాయిలను, బ్రిటీష్‌వారు ఫిరంగి గుండ్లకు బలిచేసి, దానిని అణచివేశారు. క్రీ.శ.1806లో వెల్లూరు సిపాయిలు చేసిన తిరుగుబాటును తీవ్ర హింసావాదంతో బ్రిటీష్‌వారు అణిచివేశారు. 1824 సంవత్సరంలో 47వ రెజిమెంట్‌కు చెందిన సిపాయిలు బారక్‌పూర్ వద్ద, బర్మాకు సముద్రమార్గం ద్వారా వెళ్లుటకు నిరాకరించినందున, ఆ రెజిమెంట్‌ను రద్దు చేసి, నిరాయుధులైన వారిని కాల్చడం, ఉరితీయడం చేశారు. తిరుగుబాటు రావడానికి కేవలం కొద్ది నెలలకు ముందే మంగళ్‌పాండే చంపబడ్డాడు. అతనిని, ఉన్నతాధికారులపై దాడి చేశాడని తిరుగుబాటు చేశాడనే అభియోగం మీద క్రీ.శ.1857 మార్చి 29న ఉరితీశారు. సయ్యద్ అహ్మద్‌ఖాన్ తన 'భారత తిరుగుబాటుకు కారణాలు' (causes of the Indian Mutiny) అనే పుస్తకంలో భారత ప్రజల, సైనికులలో రాజుకొన్న భావాల గురించి ఈ విధంగా రాశాడు. (మొత్తం మీద) ఎట్టకేలకు భారతీయులు ఆలోచించే అలవాటును పెంచుకున్నారు. బ్రిటీష్‌వారు చేసిన చట్టాలన్నీ తమ ఉనికికి భంగం కలిగించేటట్లు ఉన్నాయని, తమ మతస్థులను నాశనం చేయడానికి, తమ హక్కులను కాలరాసేందుకు రూపొందించినవే అని భావించారు. ఎట్టకేలకు భారతీయులు, బ్రిటీష్ ప్రభుత్వాన్ని 'దీర్ఘకాల విషం' (slow poison) గా ఇసుకతో నిర్మితమైన తాడుగాను మరియు ద్రోహపూరిత జ్వాలగా భావించసాగారు. ఈ రోజు ప్రభుత్వ కబంధ హస్తాల నుండి బయట పడినా రేపైనా తప్పదని, రేపు తప్పించుకున్నా ఆ తర్వాత రోజైనా తమ నాశనం తప్పదని వారు ఆలోచించడం మొదలు పెట్టారు. భారతీయులు, ప్రభుత్వ మార్పును కోరుకుంటున్నారు. బ్రిటీష్‌వారి పాలన స్థానంలో మరియొక ప్రభుత్వం పాలిస్తుందనే ఆలోచనతో ఆనందించసాగారు.

ఇటువంటి అణచివేతకు గురైన పరిస్థితులలో, వారి భావోద్వేగాలు రాజుకోవడానికి ఎక్కువ కాలం పట్టలేదు. అటువంటి సంఘటన క్రీ.శ.1857, మే 10వ తేదీన జరిగింది. సిపాయిల కివ్వబడిన కొత్త ఎన్‌ఫీల్డ్ తుపాకులలో ఉపయోగించబడిన తూటాలు కొవ్వుతో కూడిన కాగితంతో చుట్టబడ్డాయి. తుపాకిలోకి తూటాలు పెట్టేముందు, ఈ కొవ్వు కాగితాన్ని నోటితో లాగి తీయాలి. అయితే ఇది దున్న లేక పందుల నుండి తీయబడిన కొవ్వుతో తయారైనది. కాబట్టి హిందువులు మరియు ముస్లింలు ఇరువురూ తీవ్ర కోపోద్రిక్తులయ్యారు. ఈ తూటాలను ఉపయోగించడంలో తమ మతం అపాయంలో పడిందని ఇరువురూ భావించారు. దాంతోపాటు, కంపెనీ తమ మతాన్ని నాశనం చేయడానికి కావాలని ప్రయత్నిస్తోందని చాలామంది భావించడం మొదలు పెట్టారు. కాబట్టి వారు ఎదురు తిరగాల్సిన సమయం ఆసన్నమైంది.

> క్రీ.శ.1857 సంవత్సరపు తిరుగుబాటుకు నెమ్మదిగా పరిస్థితులు రాజుకోవడం మొదలైంది. అన్యాయం, భారతీయుల పట్ల వివక్షత, భారతీయుల అసంతృప్తి భావనలు, వారి విలువలు మరియు భారతీయుల మత నమ్మకాలు ఆచారాల పట్ల బ్రిటీష్ వారి నిర్లక్ష్యం సహించలేక చివరకు పై పరిస్థితులన్నీ దేశవ్యాప్తంగా తిరుగుబాటు రావడానికి దారితీశాయి.

## 57. ఎ. పాఠ్యాంశ ప్రశ్నలు

1. డల్హౌసి ప్రభువుచే, భారత రాష్ట్రాలను తమ పాలన కిందకు తెచ్చుకోవడానికి అమలు పరిచిన సిద్ధాంతం ఏది?
2. బ్రిటీష్‌వారు, భారతీయుల మధ్య సామాజిక సమైక్యత ఎందుకు లేదు?
3. భారతీయ రాజ్యాలను కలుపుకోవడం అనునది వివిధ వృత్తుల వారిపై ఎలా ప్రభావం చూపింది?

4. 19వ శతాబ్దం తొలి భాగంలో బ్రిటీష్‌వారి పాలనకు వ్యతిరేకంగా తిరుగుబాట్లు ఎందుకు జరిగాయి?

5. కంపెనీవారు క్రైస్తవ మిషనరీలను ప్రోత్సహించడాన్ని, భారతీయులు ఏ విధంగా భావించారు?

## 57.4 తిరుగుబాటు గమనం

ఢిల్లీకి 36 మైళ్ల దూరంలో ఉన్న మీరట్‌లో తిరుగుబాటు ప్రారంభమైంది. కొత్త తూటాను ఉపయోగించడానికి నిరాకరించిన 3వ స్వదేశీ అశ్వికదళానికి చెందిన 85 మంది సిపాయిలను ఉద్యోగముల నుండి తొలగించి, క్రీ.శ.1857 మే 9న వారికి పదేళ్ల జైలు శిక్ష విధించి, సంకెళ్లు తగిలించారు. ఈ సంఘటన, మీరట్ సిపాయిలలో తిరుగుబాటు ధోరణులను రగిల్చేలా చేసింది. ఆ తర్వాత రోజు, సిపాయిలు జైలు మీద దాడి చేసి, ఖైదీలను విడుదల చేసి, అధికారులను చంపి తిరుగుబాటుకు సంబంధించిన జెండా ఎగురవేశారు. ఆతర్వాత వారు ఢిల్లీకి బయలుదేరారు. ఆతర్వాత రోజు ఉదయానికి వారు ఢిల్లీకి చేరేసరికి, స్థానిక కాల్బలం వారితో కలిసి బ్రిటీష్ అధికారులను చంపి నగరాన్ని తమ అధీనంలోకి తీసుకున్నారు. వారి కొత్త అధికారానికి చిహ్నం కావలసి వచ్చింది. కాబట్టి వారు భారతదేశం చక్రవర్తిగా వృద్ధుడు మరియు అధికారంలేని బహదూర్‌షాను అధికారికంగా భారతదేశ చక్రవర్తిగా ప్రకటించారు. ఈ తిరుగుబాటులో చేరినవారు, మొఘల్ చక్రవర్తికి వారి విధేయతను అధికారికంగా ప్రకటించడం ఆసక్తికర పరిణామం. ఆ తర్వాత చక్రవర్తి, భారత పాలకులకు మరియు ముఖ్యుల (Chiefs) ను బ్రిటీష్ ప్రభుత్వాన్ని కూలదోసేందుకు జరుగుతున్న కుట్రలో పాల్గొనమని వ్రాశారు.

ఈ తిరుగుబాటు దేశంలోని మిగిలిన ప్రాంతాలకు త్వరగా వ్యాపించింది. బెంగాల్ సైన్యం మొత్తం త్వరలోనే తిరుగుబాటులో పాలుపంచుకుంది. అవధ్, రోహిల్‌కండ్, దోఆబ్, బుందేల్‌ఖండ్, మధ్య భారతదేశం, బీహార్‌లోని కొన్ని ప్రాంతాలు, తూర్పు పంజాబ్ ప్రాంతాలలో బ్రిటీష్‌వారి అధికారం వారి బాధల నుండి విముక్తి పొందుటకు ప్రయత్నించాయి. ఇండోర్ సైనిక దళాలలో అనేక సైనిక దళాలు తిరుగుబాటులో చేరాయి అలాగే 20వేల మంది గ్వాలియర్ సైన్యం తాంతియాతోపె, ఝాన్సీ రాణిలతో కలిశారు. (ఇండోర్ గ్వాలియర్‌లు బ్రిటీష్‌వారికి విధేయలుగా ఉండిపోయాయి.)

సిపాయిల తిరుగుబాటు జరిగిన వెంటనే ఈ తిరుగుబాటు లాగా, సాధారణ ప్రజలచే గొడ్డళ్లు, బల్లేలు, బాణాలు, లాఠీలు మొదలగు దొరికిన మారణాయుధాలతో పరిపాలకులకు వ్యతిరేకంగా పోరాటాన్ని సాగించారు. రైతులు, వివిధ వృత్తులవారు, దీర్ఘకాల బాధితులు, బ్రిటీష్‌వారి స్వార్ధానికి బలైన వారందరూ పోరాటంలో పాల్గొని, ఈ సంఘటనకు ఒక విశిష్ట ప్రాధాన్యతను తెచ్చారు. రైతులు మరియు జమిందార్లు, వారిని తమ స్వార్ధానికి ఉపయోగించుకొని నివసించే ప్రాంతం నుండి స్థానభ్రంశం గావించిన వడ్డీ వ్యాపారులను, బనియాలు మరియు కొత్త జమిందార్లపై దాడి చేశారు. డబ్బు అప్పుగా ఇచ్చిన వివరాలు కల లెక్కల పుస్తకాలను దొంగిలించి, నాశనం చేశారు. బ్రిటీష్‌వారి న్యాయస్థానాలు, తాశీలు కార్యాలయాలు, ఠాణాలపై దాడి చేశారు. సామాన్య పౌరులు చాలా పెద్ద సంఖ్యలో తిరుగుబాటులో పాల్గొన్నారు అనడానికి ఒక ఉదాహరణ. కేవలం అవధ్‌లోనే బ్రిటీష్‌వారికి వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో 1లక్షా 50వేల మంది చనిపోతే వారిలో 1లక్ష మంది సామాన్య పౌరులే.

ఈ తిరుగుబాటునందు మతపరమైన ఉత్సుకతతో కూడిన బలమైన అంతర్గత భావనలు కలిగి ఉన్నాయి. నిజానికి, చాలామంది నాయకులు ఈ తిరుగుబాటును హిందువుల, ముస్లింల మతాల మీద ప్రభావాన్ని చూపే 'పవిత్ర యుద్ధం'గా అభివర్ణించారు. అప్పటి నుండి మన దేశంలో నుండి ఫిరంగిని బహిష్కరించడం అవశ్యమని పిలుపునివ్వడమైనది. ప్రధాన విషయమేమిటంటే సిపాయిలు వేర్వేరు మతాలకు చెందిన వారైనప్పటికీ. వేర్వేరు మూలాలు కలిగి ఉన్నప్పటికీ

వారందరిలో గొప్ప మత సామరస్యం కలదు. బెంగాల్ సైన్యానికి చెందిన సిపాయిలు (ఎక్కువగా ఉన్నత కులస్థులైన హిందువులు) అవధ్ బేగమ్ కుమారుడైన బిర్జిస్ ఖాదర్‌ను కన్నయ్య (కృష్ణుడు) అని పొగిడారు. అదేవిధంగా, బ్రిటీష్‌వారు ఖాన్ బహదూర్‌ఖాన్ (రోహిల్‌ఖండ్ నాయకుడు)కు వ్యతిరేకంగా బరేలీ హిందువులను ప్రేరేపించినప్పటికీ, వారి ఉద్దేశం నెరవేరలేదు. అంతగాక తిరుగుబాటుదారులు, ముస్లిమ్‌ఐన బహదూర్‌షాను వారి చక్రవర్తిగా గుర్తించారు. ముస్లిమ్‌లు, హిందువులు ఇరువురూ బ్రిటీష్‌వారిపై వారి పోరాటాన్ని ఇరువురికీ చెందిన సామాన్య పోరాటంగా చూశారు.

57.1 బహదూర్‌షా 57.2 జీనత్ మహల్

తిరుగుబాటు ప్రధాన కేంద్రాలైన ఢిల్లీ, కాన్పూర్, లక్నో, బరేలీ, ఝాన్సీ, అర్రా (బీహార్)లలో సాగింది. ఢిల్లీలో సైనికులు రెండవ బహదూర్‌షా చక్రవర్తిని, 'భారత చక్రవర్తి'గా అధికారికంగా ప్రకటించారు. అయితే చక్రవర్తి వృద్ధుడు, బలహీనంగా ఉండెను. కాబట్టి, ఆ సమయంలో కావలసిన రాజకీయ నాయకత్వాన్ని, అతడు చేయలేకపోయాడు. అతడు, చక్రవర్తిగా రాజ్యపాలన చేయాలనే తన కోరిక బ్రిటీష్‌వారితో మంచిగా ఉండాలనే మరియొక కోరికల మధ్య ఊగిసలాడే ధోరణి అవలంబించడంతో తిరుగుబాటు విఫలమైంది. చక్రవర్తిగారికి ఇష్టమైన రాణి అయిన జీనత్‌మహల్, ఒక ముఖ్యపాత్రను పోషించింది.

తిరుగుబాటు మరియొక ముఖ్య నాయకుడు నానాసాహెబ్. మీరు ఈ సందర్భంగా గుర్తుకు తెచ్చుకోవలసిన విషయం ఒకటున్నది. అదేమిటంటే డల్హౌసీ ప్రభుత్వ దత్తస్వీకార సిద్ధాంతం (Doctrine of Lapse) ను అమలు చేసి మాజీ పీష్వా రెండవ బాజీరావు దత్త కుమారుడైన నానాసాహెబ్‌కు పింఛను ఇచ్చుటకు తిరస్కరించాడు. తిరుగుబాటు సమయంలో నానాసాహెబ్ తన విధేయులైన సైనికుల సహాయంతో కాన్పూర్ నుండి ఇంగ్లీష్ వారిని బహిష్కరించి, తనను తాను పీష్వాగా ప్రకటించుకున్నాడు. నానాసాహెబ్ తరపున పోరాటానికి ముఖ్య నాయకత్వం వహించే బాధ్యత అతనికి అత్యంత విధేయుడైన సేవకుడు, సమర్థుడు, ధైర్యవంతుడైన తాంతియాతోపె భుజస్కంధాలపై పడింది. తాంతియాతోపె గొప్ప దేశభక్తికి, నిర్భయంగా పోరాటం సల్పుటలో మరియు గెరిల్లా పోరాటాలలో అతని నైపుణ్యాలకు గొప్ప ఖ్యాతి గడించి కొనియాడబడ్డాడు. నానాసాహెబ్‌కు మరో విధేయుడైన సేవకుడు అజీముల్లా.

అవధ్ రాణి బేగమ్ తిరుగుబాటును ప్రోత్సహించడమే కాకుండా, ధైర్యంగా నడిపింది. బేగమ్, తన చిన్న కుమారుడైన బిర్జిస్ ఖాదర్‌ను అవధ్ రాజ్యానికి నవాబుగా అధికారికంగా ప్రకటించింది. (దీనిని SS/HIST/51. 51.8 లలో చదివారు) లక్నో వద్ద నేటికీ అవధ్ సైనికులకు, రెసిడెన్సీని ఆవాసం చేసుకొన్న బ్రిటీష్ పటాలాలకు మధ్య జరిగిన తీవ్ర యుద్ధానికి ఒక మౌన జ్ఞాపక చిహ్నంగా మిగిలిపోయాయి.

తిరుగుబాటు సమయంలో ప్రస్తుత ఉత్తరప్రదేశ్ ఉన్న ప్రాంతమంతా పోరాటం కొనసాగింది. తిరుగుబాటులో పాల్గొన్న సైనికులు బరేలీ వద్ద జనరల్ భక్త్‌ఖాన్ నాయకత్వంలో ఒక దళంగా ఏర్పడి, ఢిల్లీ చేరుకున్నారు. నిజానికి ఢిల్లీలో వారు నిజమైన శక్తులయ్యాయి. భక్త్‌ఖాన్, క్రీ.శ.1859 మేలో లక్నోలో, తాను చంపబడేదాకా బ్రిటీష్ వారితో తన పోరాటాన్ని కొనసాగించాడు.

క్రీ.శ.1857 తిరుగుబాటులో అత్యంత ప్రఖ్యాత వీరవనిత ఝాన్సీ రాణి లక్ష్మీబాయి. డల్హౌసీ ప్రభుత్వ సిద్ధాంతమైన దత్త స్వీకార సిద్ధాంతం వలన ఝాన్సీలక్ష్మీబాయి తన సామ్రాజ్యాన్ని పోగొట్టుకొనే పరిస్థితి తలెత్తింది. బ్రిటీష్‌వారు, ఆమె దత్త కుమారుడిని ఝాన్సీ సింహాసనమునకు వారసుడిగా అంగీకరించలేదు. వారు ఝాన్సీని తమ అధీనంలోకి తెచ్చుకొని, లక్ష్మీబాయిని ఝాన్సీ వద్ద తిరుగుబాటును పురిగొల్పుతుందని, చర్యలు తప్పవని బెదిరించ సాగారు. మొదట్లో రాణి సంశయించినా, ఆ తర్వాత తిరుగుబాటు దళంలో చేరి, బ్రిటీష్ వారికి ఒక బలమైన ప్రత్యర్థిగా నిలిచింది.

ప. 57.3 రాణి లక్ష్మీబాయి　　　　　　ప. 57.4 తాంతియాతోపే

రాణి లక్ష్మీబాయి ధైర్య పరాక్రమములకు చెందిన కథలు, ఆమె దేశభక్తిని కొనియాడుతూ రాయబడిన కవితలు నేటికీ మనదేశస్థులకు స్ఫూర్తిగా నిలిచాయి. బ్రిటీష్‌వారికి విధేయులైన మహారాజ సింధియా లాంటివారు, రాణీ లక్ష్మీబాయిని అణగద్రొక్కడానికి ప్రయత్నించినప్పటికీ, సింధియా సొంత సైనికులే ఆమె వైపుకు చేరారు. రాణి లక్ష్మీబాయి, తాంతియాతోపె మరియు ఆమె ఆఫ్ఘన్ సైనికులతో సహా గ్వాలియర్ వద్ద పట్టుబడింది. ఆమె పోరాటం సల్పుతూ క్రీ.శ.1858 జూన్ 17న వీరమరణం పొందింది. ఆమెతోపాటు జీవితమంతా ఆమెతో నిల్చిన ఆమె స్నేహితురాలు మరియు సహచరి ముస్లిం బాలిక ఆమె ప్రక్కనే పడి మరణించింది. అర్రా (Arrah) ప్రాంతంలో తిరుగుబాటు పూర్వ జమీందారైన కున్వర్‌సింగ్ ఆధ్వర్యంలో జరిగింది. అతని కుశాగ్ర బుద్ధితో కూడిన యుద్ధతంత్రాలు, అనేక బ్రిటీష్ దాడులను నిష్ఫలం గావించాయి. అతని బలగాలు కాన్పూర్ చేరుకొని నానాసాహెబ్‌తో కలిశాయి. ఇంకొక అతి ముఖ్య తిరుగుబాటు నాయకుడు ఫైజాబాద్‌కు చెందిన మౌలావి అహ్మదుల్లా. అతని స్వరాష్ట్రం మద్రాస్, ఆ తర్వాత ఫైజాబాద్‌కు చేరాడు. బ్రిటీష్ వారికి వ్యతిరేకంగా స్వాతంత్ర్య పోరాటంలో ఆయన ఒక గొప్ప దేశభక్తుడిగా పాల్గొన్నాడు.

## 57.5 తిరుగుబాటు అణచివేత

తిరుగుబాటుకు లభించిన అత్యంత ప్రజాదరణ బ్రిటీష్ వారిని విస్మయానికి గురిచేసింది. బ్రిటీష్‌వారు తిరుగుబాటును అణచివేయుటకు ప్రయత్నించినపుడు సైనికులు మరియు సాధారణ ప్రజానీకం నుండి కూడా తీవ్ర నిరసనలు పెల్లుబికాయి. బ్రిటీష్‌వారు, తిరుగుబాటులో పాల్గొన్న సైనికులపై మాత్రమేగాక ఢిల్లీ, అవధ్, ఈశాన్య రాష్ట్రాలు, ఆగ్రా, మధ్య భారతం, పశ్చిమ బీహార్‌లకు చెందిన ప్రజలపై తీవ్రమైన యుద్ధాన్ని కొనసాగించారు. ఇంకా దారుణమైన విషయమేమిటంటే తిరుగుబాటులో పాల్గొన్న సైనికులు ఎవరైతే ఆవు లేక పంది కొవ్వు పూయబడిన తూటాలను ఉపయోగించడానికి నిరాకరించారో వారే తమ బ్రిటీష్ శత్రువులపై యుద్ధం చేయడానికి అవే తూటాలను ఉపయోగించారు. బ్రిటీష్‌వారు గ్రామాలకు గ్రామాలు తగులబెట్టించారు. గ్రామాలు, పట్టణాలలోని ప్రజలను ఊచకోత కోశారు. ప్రజలలో భయోత్పాతాలు సృష్టించటానికి, అసంఖ్యాక ప్రజలకు బహిరంగ మరణశిక్షలు విధించారు. తత్ఫలితంగా తిరుగుబాటు నిలిచిపోయింది. అంతేగాక కొన్ని వేలమంది తమ ప్రాణాలను ఫణంగా పెట్టారు. కాని బ్రిటీష్‌వారు, భారతీయులు కొన్ని విలువైన గుణపాఠాలు నేర్చుకున్నారు. భారతదేశంలోని ప్రజలంతా సంఘటితమై, ఒక్కత్రాటిపై నిలచి, నిద్రావస్థ నుండి మేల్కొనడం ప్రారంభించారు. నూతన జాతి ఆవిర్భావం జరిగింది. చరిత్రకారులు ఈ సంఘటనను అనేక పేర్లతో పిలవసాగారు. కొంతమంది దీనిని సైనిక తిరుగుబాటు అనీ, 'విప్లవం' అనీ, 'తిరుగుబాటు' అనీ పిలిచారు. కాని ఈ పేర్లు సరిపోతాయా? లేక స్వాతంత్ర్య పోరాటమా? లేక బ్రిటీష్ వారికీ మనకూ ఉన్న బంధాన్ని తెంచుటకు దృఢసంకల్పం కల్గిన జన సమూహం లేవదీసిన పోరాటమా? ఈ విధంగా ఎక్కువ మొత్తాల్లో పాల్గొన్న సామాన్య ప్రజానీకం వలన ఇది ఒక సైనిక తిరుగుబాటు కంటె కూడా ఎక్కువ ప్రభావవంతంగా కన్పించింది. గమనించాల్సిన సత్యమేమిటంటే సాధారణ రైతులు, వివిధ వృత్తులవారు, ఇతరులు చాలా చిన్న ఆయుధాలైన ధనస్సులు, బాణాలు బల్లేలతో బ్రహ్మాండమైన బ్రిటీష్‌వారి తుపాకులను ఎదిరించడం అనేది, ప్రజలంతా ఎంతో కాలం నుంచి విదేశీ పాలనలో తాము అనుభవిస్తున్న బాధలను, ఆ బాధలనుండి విముక్తి పొందాలనే వారి తపన అర్థమవుతోంది.

అందుకే అనేకమంది భారతదేశంలోని చరిత్రకారులు ఈ తిరుగుబాటును మొట్టమొదటి స్వాతంత్ర్య పోరాటంగా అభివర్ణించారు.

క్రీ.శ.1857 తిరుగుబాటు ఉత్తర, మధ్య భారత ప్రాంతాలకు వేగంగా వ్యాప్తి చెందింది. సైనికులు, సామాన్య ప్రజలు బ్రిటీష్‌వారి బలమైన పునాదులపై దాడులు చేశారు. ఢిల్లీ, తిరుగుబాటు ప్రధాన కేంద్రంగా మారింది. బహదూర్‌షా దీనికి గొప్ప గుర్తుగా అయ్యాడు. ఈ తిరుగుబాటు భారతదేశంలో బ్రిటీష్‌వారి అధికారాన్ని కదల్చివేసింది.

## 57.బి. పాఠ్యాంశ ప్రశ్నలు

1. ఒక బ్రిటీష్ అధికారి "ఈ సందర్భంలో మహ్మదీయులను హిందువులకు వ్యతిరేకంగా చిత్రీకరించలేకపోయాం" అని అన్నాడు. తిరుగుబాటు సమయంలో హిందూ-ముస్లిం సఖ్యతను చూపించే ఒక ఉదాహరణనివ్వండి.
2. తిరుగుబాటుకు చిహ్నంగా ఏ భారతీయ నాయకుడు నిలిచాడు?
3. తిరుగుబాటుదారుల ఆగ్రహం ఏ భారతీయ వర్గానికి వ్యతిరేకంగా నిర్దేశింపబడినది?

## సారాంశం

1857 తిరుగుబాటు అనునది బ్రిటీష్‌వారు అనుసరించిన విధానాల (సిద్ధాంతాల) పట్ల పెరిగిపోయిన విముఖత ఫలితమే. కంపెనీవారి ప్రధాన లక్ష్యం, భారతీయ రైతు, చేతి పనివారినుపయోగించుకొని వీలైనంత ఆర్థిక లాభం పొందడమే. భారతదేశ ఆర్థిక వ్యవస్థ నాశనం చేయబడింది మరియు భారతదేశ సంపద బ్రిటన్‌కు తరలించబడింది. బ్రిటీష్ గవర్నర్ జనరల్‌ల రాజకీయ విధానాల ఫలితంగా, భారత భూభాగంలోని కొన్ని ప్రాంతాలను అసంబద్ధంగా తమ అధీనంలోకి కలుపుకోవడం జరిగింది. బ్రిటీష్‌వారు ఒక పెద్ద దేశానికి పరిపాలకులైనప్పటికీ, వారు భారతదేశంలో విదేశస్థులుగానే మిగిలిపోయారు. భారత సమాజంలో కలిసిపోయిన తరుష్కులు, మొఘల్ వారిలా కాకుండా, బ్రిటీష్‌వారు తమ జాతి ఉన్నతమైనదిగా భావించారు. వారు భారతీయులను నీచంగా, తక్కువ జాతివారిగా చూడసాగారు. ఇంకా, బ్రిటీష్‌వారు స్థానిక భారతీయుల సంప్రదాయాలను, విలువలను అర్థం చేసుకోవడానికి ఎటువంటి ప్రయత్నమూ చేయలేదు. బ్రిటన్ నుండి వచ్చిన క్రైస్తవ మిషనరీలు, హిందు మరియు ముస్లిం మతాలపై నీచమైన దాడులు చేశాయి. క్రైస్తవ మిషనరీలకు బ్రిటీష్ ప్రభుత్వం వారు ఇచ్చిన రక్షణ మరియు పాఠశాలలు, ఆసుపత్రులు నిర్మించడంలో వారికిచ్చిన ప్రోత్సాహం వలన, హిందువులు మరియు ముస్లింలు తమ మతాలను బలహీనపర్చడానికి బ్రిటీష్ ప్రభుత్వం వారు ప్రయత్నిస్తున్నారన్న వాదనలకు బలం చేకూరింది.

తిరుగుబాటు రావడానికి అత్యంత ముఖ్య మరియు తక్షణ కారణం బ్రిటీష్ వారిచే కొత్త ఎన్‌ఫీల్డ్ తుపాకులు ప్రవేశపెట్టడమే. సిపాయిలు, ఈ కొత్త తుపాకులలోకి తూటాలను నింపడానికి ముందు తూటాపై వేయబడిన కొవ్వుపూత గల కాగితాన్ని నోటితో లాగవలసి వచ్చింది. దున్న మరియు పంది కొవ్వుల నుండి ఈ కాగితాలు తయారైనందు వలన, సిపాయిలు ఈ తూటాలనుపయోగించడానికి తిరస్కరించారు. అనేకమంది సైనికులు, ప్రభుత్వం తమ మతాలను కావాలనే నాశనం చేయడానికి పూనుకున్నదని భావించారు. ఆ విధంగా సిపాయిలు ఎంతకాలం నుండో అణచుకున్న భావోద్వేగాలను అసంతృప్తిని బహిర్గతం చేయటానికి ఒక మార్గం తిరుగుబాటు రూపంలో లభించినట్లయింది.

తిరుగుబాటు క్రీ.శ.1857 మే 10వ తేదీన మీరట్‌లో ప్రారంభమైంది. సైనికులు తిరుగుబాటు చేసి, వారి బ్రిటీష్ అధికారులను చంపి ఢిల్లీవైపు బయలుదేరారు. వృద్ధ చక్రవర్తి అయిన రెండవ బహదూర్‌షా, ఈ తిరుగుబాటుకు చిహ్నంగా నిలిచారు. లక్నో, కాన్పూర్, బరేలీ, ఆగ్రా, ఝాన్సీలు అన్ని తిరుగుబాటుకు ప్రధాన కేంద్రాలు అయ్యాయి. సిపాయిలు, ధైర్యసాహసాలు కల్గిన నాయకులైన నానాసాహెబ్, రాణి లక్ష్మీబాయి, తాంతియాతోపే, అవధ్ బేగమ్

లాంటి వారి ఆధ్వర్యంలో ముందుకు నడిచారు. ఆ తర్వాత సిపాయిలతో, సామాన్య ప్రజానీకం కలిశారు. బ్రిటీష్ రెవెన్యూ కార్యాలయాలు, రక్షకభట నిలయాలు, న్యాయస్థానాలపై దాడి చేశారు. తిరుగుబాటులో పాల్గొనని ప్రజలు కూడా, తిరుగుబాటుదారులపై సానుభూతిని చూపించారు.

బ్రిటీష్‌వారు, తమ బృహత్ సైన్యాలతో తిరుగుబాటును అణచడానికి ప్రయత్నించారు. క్రీ.శ.1859 సం.నికల్లా వారు తిరుగుబాటును అణచగలిగారు. ఈ తిరుగుబాటు విఫలమైనా, భారత చరిత్రలో ఇది ఒక గొప్ప సంఘటనగా మిగిలిపోయింది.

**అంత్య అభ్యాసాలు:**

1. "1857 తిరుగుబాటు అనునది బ్రిటీష్‌వారి విధానాలు (సిద్ధాంతాలు) మరియు సామ్రాజ్యవాదాల పట్ల పెరిగిన తీవ్ర అసంతృప్తి ఫలితమే" పై వాక్యానికి సంబంధించి క్రీ.శ.1857 తిరుగుబాటుకు గల వివిధ కారణాలను పరీక్షించండి.
2. కంపెనీ సైన్యంలోని సిపాయిలు ఎందుకు తిరుగుబాటు చేశారు?
3. తిరుగుబాటు ఎప్పుడు మొదలైంది మరియు తిరుగుబాటు జరిగిన ప్రధాన కేంద్రాలు ఏవి?
4. క్రీ.శ.1857 తిరుగుబాటులో నానాసాహెబ్ మరియు రాణి లక్ష్మీబాయిలు పోషించిన పాత్రను విశ్లేషించండి.
5. కొంతమంది చరిత్రకారులు క్రీ.శ.1857 తిరుగుబాటును మొదటి స్వాతంత్ర్య పోరాటంగా అభివర్ణించారు. మీరు ఈ అభిప్రాంతంతో ఏకీభవిస్తారా? సరియైన కారణాలతో వివరించండి.

**కృత్యము:**

1. మీకు దగ్గరలో ఉన్న గ్రంథాలయాన్ని దర్శించి, 1857 తిరుగుబాటుకు సంబంధించి విషయాన్ని, సామగ్రిని సేకరించండి. చిన్న చిన్న జీవిత చరిత్రలు, నాయకుల చిత్రాలు, పత్రాలు, తిరుగుబాటు వివరణలతో ఒక ఆల్బం తయారు చేయండి.
2. భారతదేశ ఔట్‌లైన్ మాప్‌లను, తిరుగుబాట జరిగిన ప్రధాన కేంద్రాలను చూపండి.

**పాఠ్యాంశ ప్రశ్నలకు సమాధానాలు**

**57.ఎ.**

1. దత్త స్వీకార సిద్ధాంతం (Doctrine of Lapse)
2. బ్రిటీష్‌వారు తమను ఉన్నత జాతీయులుగా భావిస్తూ, స్థానిక భారతీయులతో కలవడానికి తిరస్కరించారు.
3. చేతివృత్తులవారు (వివిధ వృత్తులవారు) తమ వృత్తులను బ్రిటీష్ వారి విధానాల వలన కోల్పోవలసి వచ్చింది. అప్పటిదాకా వారు రాజుల ఆదరణ వలన జీవనోపాధి సాగించారు.

4. ఈ తిరుగుబాట్లు స్థానికమైనవి, విడివిడిగా జరిగినవి.

5. భారతీయులు అనగా హిందువులు మరియు ముస్లింలు, తమ తమ మతాలపై జరిగిన దాడులుగా వాటిని భావించారు.

**57.బి.**

1. ఎ. హిందువులు మరియు ముస్లింలు, బహదూర్‌షాను వారి చక్రవర్తిగా గుర్తించారు. మీరట్‌కు చెందిన హిందూ సైనికులు ఢిల్లీకి వెళ్లి, బహదూర్‌షాను తమ చక్రవర్తిగా అధికారికంగా ప్రకటించారు.

   బి. ఝాన్సీ రాణి అధీనంలో ఆఫ్ఘన్ సైనికులు కలరు. నానాసాహెబ్ యొక్క విధేయుడైన సేవకుడు అజీముల్లా. హిందువులు, ముస్లింలు నాయకత్వంలోని అన్ని స్థాయిలలో తమ ప్రాతినిధ్యాన్ని నిరూపించారు.

2. ఢిల్లీ పరిపాలకుడు రెండవ బహదూర్‌షా

3. వడ్డీ వ్యాపారులు

# 58

# 1857 తిరుగుబాటు (17)

## 58.1 ఉపోద్ఘాతం :

ముందు పాఠంలో, మీరు 1857 తిరుగుబాటుకు కారణాలు మరియు అది జరిగిన తీరుగురించి చదివారు. ఈ తిరుగుబాటు మొత్తంగా ఒక పురాతన చారిత్రక దశను అంతం చేసి, క్రొత్త దశకు బీజంనాటిన ఒక చారిత్రాత్మక ఘటనగా నిలిచింది. ఈ తిరుగుబాటు వలన భారతదేశంలో కంపెనీ పరిపాలన అంతమై, బ్రిటీషు పాలకుల ఆధీనంలో ప్రత్యక్ష ప్రభుత్వం ఏర్పడింది. భారతీయుల దృక్పథం నుండి చూస్తే, ఈ తిరుగుబాటు విఫలమైనప్పటికీ ఈ అనుభవం నుండి నేర్చుకున్న పాఠాల ద్వారా, ఒక విజయవంతమైన జాతీయ పోరాటం చేయడానికి నాంది అయింది. ఆ విధంగా ఈ తిరుగుబాటు బ్రిటీష్‌వారు మరియు భారతీయులు ఇరువురికి చాలా ప్రధాన అంశంగా నిలిచింది.

ఈ పాఠంలో, తిరుగుబాటు స్వభావానికి సంబంధించిన అంశాలను తెలుసుకుందాం. ఈ తిరుగుబాటు విఫలమవడానికి గల కారణాలను కూడా చదువుతారు. చివరిగా 1857 తిరుగుబాటు ఫలితంగా భారతదేశం (స్వరూపం)లో వచ్చిన మార్పులను గురించి చదువుతారు.

## 58.2 లక్ష్యాలు

ఈ పాఠం చదివిన తర్వాత మీరు క్రింది విషయాలు తెలుసుకుంటారు.

1. 1857 తిరుగుబాటు స్వభావం
2. బ్రిటిష్ సైన్యానికి వ్యతిరేకంగా తిరుగుబాటు దారులు విఫలమవడానికి కారణాలు
3. తిరుగుబాటు తర్వాత భారతదేశంలో బ్రిటీష్ వారి పరిపాలనలో వచ్చిన మార్పులు
4. బ్రిటీష్ వారి పాలన పట్ల విద్యావంతులైన భారతీయుల వైఖరిలో వచ్చిన మార్పు

## 58.3 తిరుగుబాటు స్వభావం :

1857 తిరుగుబాటు స్వభావం చరిత్రకారులలో చర్చకు దారితీసింది. ఇది కేవలం సిపాయిలు చేసిన పోరాటమా, బ్రిటీష్ చరిత్రకారులు తలచినట్లు భారత సిపాయిలలో వచ్చిన తిరుగుబాటా లేక జాతీయవాదులైన భారతీయులు

చెప్పినట్లు ఇది ఒక స్వాతంత్ర్యోద్యమ పోరాటమా? చక్కటి వ్యవస్థీకృతమైన కుట్ర లేక ఎటువంటి కారణం లేకుండా (spontoneous)) అప్పటికప్పుడు మొదలైన తిరుగుబాటా? ఇది భారత ప్రజలందరి మనోభావాలను ప్రతిబింబింపచేస్తుందా లేక కేవలం స్థానికంగా మాత్రమే రేగిన తిరుగుబాటా? పై ప్రశ్నలకు ఈ తిరుగుబాటు గురించి చదవడంలో ఎదురయ్యే కొన్ని ప్రశ్నలుగా చెప్పవచ్చు.

ఈ తిరుగుబాటు మీరట్‌లో 1857వ సంవత్సరం మే 10న మొదలైందని మీరు గుర్తుకు తెచ్చుకోగలరు. ఇంతకు ముందు, కొవ్వుపూత పూయబడిన తూటాలను ఉపయోగించడానికి నిరాకరించిన 85 మంది భారతీయ సిపాయిలను ఉద్యోగాల నుండి తొలగించి, 10సంవత్సరాల జైలు శిక్ష విధించి కాళ్ళకు సంకెళ్ళు వేసి కారాగారంలో పడవేశారు. ఈ చర్యకు ప్రతిచర్యగా, వారి తోటి సిపాయిలు వారి బ్రిటీష్ అధికారులను చంపి, కారాగారంలో ఉన్న సిపాయిలను విడిపించి, తిరుగుబాటును లేవదీశారు. అలా తిరుగుబాటు మొదటగా సిపాయిల నుండే ప్రారంభమైంది. కాని, దీనిని ఆవిధంగా కొట్టివేయటం సరైనది కాదు. ఈ సిపాయిలు ఢిల్లీకి తరలివెళ్ళి, బహదూర్‌షాను భారతదేశ చక్రవర్తిగా అధికారికంగా ప్రకటించారు. ఈ విధంగా చేయడం ద్వారా వారు తిరుగుబాటును ఒక విప్లవంతో కూడిన యుద్ధంగా మార్చారు. ఆ విధంగా పోరాటం సిపాయిలు, వారి అధికారుల మధ్య కాకుండా, రెండు రాజకీయ శక్తుల మధ్య మొదలైనట్లయింది.

ఒక ముఖ్యమైన విషయమేమిటంటే ఈ తిరుగుబాటు కేవలం సిపాయిలకు మాత్రమే పరిమితం కాలేదు. సిపాయిల తిరుగుబాటు మొదలైన వెంటనే సామాన్య ప్రజల(పౌరులు)లో కూడా అలజడులు రేగాయి. సిపాయిలు బ్రిటీష్ అధికారాన్ని నాశనం చేసిన తర్వాత, సామాన్య ప్రజలు బల్లేలు, బరిసెలు, గొడ్డళ్ళు, లాఠీలు వంటి (ఏది దొరికితే దానిని) ఆయుధాలను ఉపయోగించసాగారు. అలా, చాలా ప్రాంతాలలో సిపాయిల ఈ చర్య, గ్రామీణ జనాభాకు పాలకుల పట్ల ఉన్న భయం తొలగిపోయింది. ఇతర ప్రాంతాలలో సిపాయిలు తిరుగుబాటు చేయకముందే ప్రజలు తిరుగుబాటు చేశారు మరియు సిపాయిల దళాలు లేనిచోట కూడా వీరు తిరుగుబాటు మొదలుపెట్టారు. బాధ, ఆగ్రహంతో ఉన్న రైతులు, ఇతర వృత్తులవారు సాధుసన్యాసులు, పదవులు కోల్పోయిన జమీందార్లు అందరూ తిరుగుబాటులో పాలుపంచుకుని క్రోధాన్ని వెలిబుచ్చారు. ఇక్కడ, మనం ముఖ్యంగా గుర్తుకు తెచ్చుకోవలసిన విషయం, బ్రిటీష్ అధికారులను చంపిన సిపాయిలు సామాజికంగా పైన చెప్పిన వర్గానికి చెందినవారే. దాదాపుగా అయోధ్య ప్రాంతంలోని ప్రతి వ్యవసాయ కుటుంబం నుండి కనీసం ఒకరు సైన్యంలో ప్రాతినిధ్యం వహించారు. ఆ విధంగా సిపాయిని 'యునిఫాం'లో నున్న రైతుగా చెప్పవచ్చు. బ్రిటీష్ వారు చేసిన ఏవిధమైన రెవెన్యూ నిర్ణయమైనా అతనిపై ప్రభావం చూపింది. ఈ రకంగా చూస్తే ఈ 'అలజడి'(mutiry)బ్రిటీష్ వారిపై తిరుగుబాటునే గాక రాజకీయ చర్యగా మారింది. సిపాయిల ఆసక్తులను సామాన్య ప్రజానీక ఆసక్తులతో సమన్వయం చేయటంతో తిరుగుబాటుకు ఒక రాజకీయరూపం (Political character)వచ్చింది.

కొంతమంది చరిత్రకారులు ఈ తిరుగుబాటును విస్తృతంగా వ్యాపించిన చక్కటి వ్యవస్థీకృత కుట్రగా అభివర్ణించారు. వీరి అభిప్రాయం ప్రకారం, అనేక భారతీయ సైనిక దళాలు అన్నీ కలసి ఒక రహస్య సంస్థగా ఏర్పడి, 1857 మే 31 తేదీన తిరుగుబాటు చేయాలని సంకల్పించారు. నానాసాహెబ్ మరియు ఫైజాబాద్‌కు చెందిన మౌలావి అహ్మద్‌షాలు అనేక సైనిక శిబిరాల(contonments)తో సంబంధాలు కలిగి ఉండి, తిరుగుబాటులో ప్రధాన భూమిక వహించారు. ఈ కుట్రకు సంబంధించిన విషయాన్ని వివిధ ప్రాంతాలకు చపాతీలు మరియు ఎర్ర కలువలను పంపడం

ద్వారా వ్యాపింపచేశారు. ఈ కుట్రలోని అంశాలను, ఫకీర్లు మరియు సన్యాసిలు విభిన్న ప్రాంతాలలో సంచరిస్తూ, ఆయా ప్రాంతాలకు తెలియపరిచారు. మరి కొంతమంది చరిత్రకారులు పై వాదనతో ఏకీభవించలేదు. వారి అభిప్రాయంలో ఇది పథకం ప్రకారం జరిగిన కుట్ర కాదు. తిరుగుబాటు నాయకుల మధ్య ఎటువంటి అవగాహన(communication) ఉన్నట్లుగా గాని లేక తిరుగుబాటుదార్లచే ఎటువంటి విశ్వసనీయ సమాచారం అందించినట్లుగా గాని వ్రాతపూర్వక సాక్ష్యాలు గాని తిరుగుబాటుదార్లు వ్రాసిన గ్రంథ ఆధారాలు గాని లేవు. కాబట్టి తిరుగుబాటును ఈ విధమైన భావనపై వ్యాఖ్యానించడం కష్టమవుతుంది. తిరుగుబాటు వెనుక ఒక వ్యవస్థీకృతమైన కుట్ర ఉన్నట్లు అనిపించినా, తిరుగుబాటు అకస్మాత్తుగా మొదలయ్యే సమయానికి ఆ పథకం అనుకొన్నంతగా ముందుకు వెళ్ళలేక పోయింది.

తిరుగుబాటు ఉత్తం, మధ్య భారతదేశమంతటా వ్యాపించింది. ఎప్పుడైతే మీరట్ సిపాయిలు, బహదూర్‌షాను భారతదేశ చక్రవర్తిగా ప్రకటించారో అప్పటినుండి ఈ తిరుగుబాటులో దేశంలో ఇతర ప్రాంతాల నుండి వచ్చిన అనేక మంది సిపాయిలు వారితో చేరారు. బెంగాల్ సైన్యమంతా తిరుగుబాటులో పాల్గొన్నారు. సుమారు 20,000 సైనిక దళాలకు పైగా విధేయులైన గ్వాలియర్ సంస్థానం సైనికులు వంటివారు తాంతియాతోపే, ఝాన్సీరాణిల పక్షాన చేరారు. అవధ్, రోహిల్‌ఖండ్, దోఆబ్, బుందేల్‌ఖండ్, మధ్య భారతదేశం, బీహార్‌లోని చాలా ప్రాంతాలు మరియు తూర్పు పంజాబ్ ప్రాంతాలు బ్రిటీష్ అధికారులను వణికించడంలో కృతకృత్యులైనారు. హిందూ, ముస్లిం రాజ్యాలు, వారి నాయకులు మరియు సాధారణ ప్రజానీకం అందరూ ఈ తిరుగుబాటు సందర్భంగా ఏకమయ్యారు. తిరుగుబాటుదారులందరూ బహదూర్‌షాను తమ చక్రవర్తిగా అంగీకరించారు. వారు ఇతరుల మతాలను గౌరవించారు. బ్రిటీష్‌వారు ఈ ఉద్యమాన్ని అణచివేయడానికి చేసిన కృషిని బట్టి దీనియొక్క పరిధి, స్వభావాలు వారికి అర్థమయ్యాయి. బ్రిటీష్‌వారు నిర్దయగా, విచక్షణారహితంగా తమ బలాన్ని ప్రయోగించారు. వారు జనాల్ని బహిరంగంగా ఉరితీశారు. గ్రామాలకు గ్రామాలను తగలబెట్టారు. అప్పుడు 'ద లండన్ టైమ్స్' అనే పత్రికా ప్రతినిధి "బ్రిటీష్ వారు భారతదేశంపై పునఃవిజయం సాధించాల్సి ఉంది" అని వ్రాయడంలో ఆశ్చర్యం ఏమీ లేదు.

> సిపాయిల, రైతుల మరియు ఇతర వృత్తుల వారి అభిరుచులతో పాటు, వారి భాగస్వామ్యాల గుర్తింపు, ఈ తిరుగుబాటుకు నిజమైన బలాన్ని మరియు నిర్దిష్ట రూపాలనిచ్చింది.

## పాఠ్య ప్రశ్నలు 58.ఎ

1. 1857లో జరిగిన సంఘటనలను 'సిపాయి తిరుగుబాటు' గా చెప్పడం సరికాదు. ఎందుకు?

2. కొంతమంది చరిత్రకారులు, తిరుగుబాటును ఒక పథకం ప్రకారం చేసిన కుట్రగా భావించలేదు. ఎందుకు?

3. తిరుగుబాటు మొదట ఎక్కడ ప్రారంభమైంది?

4. సామాన్య ప్రజానీకంలో ఏఏ వర్గాల వారు తిరుగుబాటులో ప్రముఖ పాత్ర వహించారు?

5. భారతదేశ ప్రజలు, రాజకీయాలు 1857 సంవత్సరానికి ముందు మతపరమైన(communal)కాదు అనే సత్యాన్ని తెల్పు సాక్ష్యం ఏది?

## 58.4 తిరుగుబాటు వైఫల్యంనకు కారణాలు :

1857 తిరుగుబాటు, భారతదేశంలో బ్రిటీష్ సామ్రాజ్యానికి ఒక పెను సవాలు విసిరింది. ఈ తిరుగుబాటు క్రీ.శ.1859 వరకు కొనసాగింది కాని ఆ తర్వాత బ్రిటీష్‌వారు దానిని అణచివేసి భారతదేశంలో తిరిగి పూర్తిస్థాయిలో తమ సామ్రాజ్యాన్ని నెలకొల్పారు. ఇంతటి అతిముఖ్యమైన ఉద్యమం, విఫలమవడానికి కారణాలు ఏమిటి? ఇప్పుడు మనం పరీక్షిద్దాం.

తిరుగుబాటుదారులు, ప్రజల సానుభూతిని పొందినప్పటికీ, దేశం మొత్తంగా వారి వెనుక నిలువలేదు. వ్యాపారులు, వడ్డీ వ్యాపారులు, విద్యావంతులు, పెద్ద జమీందార్లు, భారతదేశంలోని అనేక రాష్ట్రాల పాలకులు, తిరుగుబాటుదారులను అణచివేయడంలో బ్రిటీష్ వారికి సహాయపడ్డారు. తిరుగుబాటుదారులు, వ్యాపారులు మరియు వడ్డీ వ్యాపారులపై దాడిచేశారన్న విషయాన్ని మీరు ఈ సందర్భంగా గుర్తు చేసుకోగలరు. తిరుగుబాటుదారుల ఆహారావసరాలు తీర్చడానికి వ్యాపారులు తమ ధన మరియు వస్తు రూపంలో సాయం ద్వారా చేయూతనివ్వాలని తిరుగుబాటు దారులు ఒత్తిడి చేశారు.

వడ్డీ వ్యాపారుల ఖాతా పుస్తకాలను, తిరుగుబాటుదారులు కాల్చివేశారు. వ్యాపారులు, బ్రిటీష్‌వారి పాలన వలననే ఆలా ధనమును సంపాదించారు. బొంబాయి, కలకత్తా మరియు మద్రాస్‌లకు చెందిన పెద్ద వ్యాపారులు, విదేశీ వ్యాపారం ద్వారానే అత్యధిక లాభాలు గడించారు. అందుకు, వారందరూ తిరుగుబాటు అణచివేయబడాలని మనః స్ఫూర్తిగా కాంక్షించారు.

విద్యావంతులైన భారతీయులు తిరుగుబాటుకు సహకరించలేదు. ఎందుకంటే తిరుగుబాటుదారులు, తమ సంప్రదాయం, ఆచారాలు(superstition) మరియు భూస్వామ్య విధానాలలో కలుగచేసుకుంటున్నారని వారు భావించారు. విద్యావంతులైన భారతీయులు ఈ తిరుగుబాటకు దూరంగా ఉన్నారు ఎందుకంటే బ్రిటీష్ వారిని, వీరు అభివృద్ధి మరియు ఆధునికతల శక్తులుగా భావించారు. బ్రిటీష్ వారు అభిరుచుల కొరకు, భారత ప్రజల అభిరుచులు తుంగలో తొక్క బడతాయన్న విషయాన్ని వీరు అర్ధం చేసుకోలేక పోయారు. తిరుగుబాటుదారులు 1857లోనే బ్రిటీష్‌వారి అంతరంగాన్ని అర్ధం చేసుకుంటే, ఈ విషయం అవగాహన చేసుకోవడానికి విద్యావంతులైన భారతీయులకు చాలా కాలం పట్టింది.

పెద్ద జమీందార్ల విషయానికి వస్తే, వారిలో ఎక్కువమందిని బ్రిటీష్ వారు, వారి వైపుకు త్రిప్పుకున్నారు. రైతులకు వ్యతిరేకంగా బ్రిటీష్‌వారికి సహాయపడటం వీరికి చాలా ఆనందంగా ఉండటమేగాక గొప్పగా భావించేవారు. కాబట్టి వీరు బ్రిటీష్‌వారికి సహాయం చేయడంలో చురుకుగా వ్యవహరించేవారు. అవధ్ లాంటి ప్రాంతాలలో, తిరుగుబాటులో పాల్గొన్న తాలుకుదార్లు (పెద్ద జమీందార్లు)లో ప్రభుత్వం వారు తాము ఆధీనంలోకి తీసుకొని వారి 'ఎస్టేట్'లను తిరిగి వారికి ఇచ్చివేస్తామని హామీ ఇవ్వగానే, వారు తిరుగుబాటు నుండి దూరంగా వచ్చారు. కాబట్టి దీనివలన, తిరుగుబాటుకు పెద్ద జమీందార్లు సహకారం(support) కేవలం వారి స్వార్ధ ప్రయోజనాల కోసమేనని, అవి తీరగానే వారు ప్రక్కకు తప్పుకున్నారని మనకు తెలుస్తోంది.

భారతదేశంలో రాజ్యాల(రాష్ట్రాల) పాలకులలో కూడా ఇదే వైఖరి వ్యక్తమయింది. వారు స్వార్ధపూరితులు మరియు బ్రిటీష్ వారికి భయపడ్డారు. గ్వాలియర్, సింధియా, ఇండోర్, హోల్కర్, హైదరాబాద్ నిజామ్, జోధ్‌పూర్

రాజా, భోపాల్ నవాబు, పాటియాలా, నభా, జింద్(jind), కాశ్మీర్, నేపాల్‌ల పాలకులు తిరుగుబాటును అణచివేయడానికి బ్రిటీష్‌వారికి సహాయపడ్డారు. ఈ కారణం వలననే ఆ తర్వాత బ్రిటీష్ గవర్నర్ జనరల్ కానింగ్ తన మాటలలో ఈ పాలకులు మరియు నాయకుల(chiefs) గురించి, “తుఫానును ఆపడానికి వీరు అడ్డుకట్టలయ్యారు(breakwaters) లేకుంటే ఆ మహాజనాల అలలో మేము కొట్టుకుపోయి ఉండేవాళ్ళం” అని చెప్పారు. ఇటువంటి పరిస్థితులలో తిరుగుబాటుదారులు విదేశీయులతోను మరియు తోటి భారతీయులతో పోరాటాలు చేయవలసి వచ్చింది. ఈ విధంగా ఇద్దరిని ఎదుర్కోవడం, తిరుగుబాటుదారులకు చాలా కష్టమయింది.

తిరుగుబాటు విఫల మవడానికి మరొక ప్రధాన కారణం. తిరుగుబాటు చేసిన భారతీయులలో కొనసాగిన అనైక్యతే. నాయకుల వైఖరులు అనుమానం, అసూయతోను కూడి ఉన్నాయి. అజీముల్లా, నానాసాహెబ్‌కు ఢిల్లీని సందర్శించవద్దని లేనిచో తన చక్రవర్తి ముందు తక్కువైపోతాడని(over-shadowed)సలహా ఇచ్చాడు. వారికి కేంద్రీకృతమైన నాయకత్వం లేదు. బహదూర్‌షాను తమ చక్రవర్తిగా ప్రకటించినా, ఆయన ఎవరిలోను స్ఫూర్తి నింపలేక పోయాడు. నిజానికి, బహదూర్‌షా మరియు జీనత్‌మహల్‌లు సిపాయిల పట్ల కొంతమాత్రంగా విధేయత చూపి, వారి స్వార్ధ ప్రయోజనాల  కోసం బ్రిటీష్ వారితో సంప్రదింపులు (negotions) జరిపారు.

బ్రిటీష్‌వారి పట్ల గల సాధారణ ద్వేషం తప్పితే, తిరుగుబాటుదారులకు ఒక స్పష్టమైన భవిష్యత్ రాజకీయ వ్యూహం గాని లేక సత్వర ప్రణాళిక గాని ఏమీలేవు.“ తాము కోల్పోయిన సౌకర్యాలు, హక్కులను తిరిగి పొందుటకు గాను పోరాటం చేసిన స్వయం ఖైదీలు”గా వారిని చెప్పవచ్చు. బ్రిటీష్ వారిని పారద్రోలిన తర్వాత, ఎటువంటి రాజ్యపాలనను అందించాలో వీరికి తెలియదు. సరియైన రాజకీయ, సైనిక ప్రణాళిక లోపించుట వలన, ఈ అలజడులు(uprisings) ఒకదానితో మరొకటి సంబంధం లేకుండా, ఒకక్రమ పద్ధతి లేకుండా కొనసాగాయి. అటువంటి పరిస్థితులలో విలువైన ప్రాణాలు పోగొట్టుకోవలసి వచ్చింది. అంతేకాక బ్రిటీష్‌వారు తిరుగుబాటుదారులను ఒకరి తర్వాత మరొకరిని వరుసగా అణచడంలో కృతకృత్యులైనారు. భారతీయులలో ఈ అనైక్యతకు కారణం, వారిలో ఆధునిక జాతీయవాద భావన లోపించడమే. ఎవరి దేశభక్తి అయినా, వారి ప్రాంతాన్ని ప్రేమించడాన్ని బట్టి గుర్తించబడుతుంది. అయితే ఇక్కడ ఢిల్లీని తిరిగి సంపాదించడంలో కేవలం 1700 బ్రిటీష్ సైన్యం గల ఐదు పటాలాలు మరియు 3200 భారతీయులు పాల్గొన్నారని తెలుసుకోవడంలో ఆశ్చర్యం పడనక్కరలేదు అని చెప్పవచ్చు.

తిరుగుబాటుదారులు, నిస్సందేహంగా, చాలా ధైర్యంగా పోరాడారు కాని వారు వారి పట్టును కలసికట్టుగా కొనసాగించలేక పోయారు. వారికి ఆధునిక ఆయుధాలు, ఇతర యుద్ధసామగ్రి అందుబాటులో లేదు. వ్యాపారులను కొల్లగొట్టడం అనే వీరి పద్ధతి వలన, వ్యాపారులు వీరిని ద్వేషించసాగారు. సిపాయిలు ఆయుధ సంపత్తి కోసం బ్రిటీష్ వారి ఆయుధాగారాల నుండి స్వాధీనం చేసుకున్న ఆయుధసామగ్రిపై ఆధారపడేవారు. ఇది సహజంగానే ఎక్కువకాలం పనిచేయలేదు. సామాన్య పౌరులు, బల్లేలు, గొడ్డళ్ళు, ధనుస్సు, బాణాలు, లాఠీలు మరియు కొడవళ్ళతో పోరాటం చేశారని మీరు గుర్తుకు తెచ్చుకోగలరు. మరొకవైపు బ్రిటీష్‌వారు ఆధునిక ఆయుధ సంపత్తిని కలిగియున్నారు. ఈ కాలంలో బ్రిటీష్ వారి సామ్రాజ్యవాదం అంతిమదశ(climax) కు చేరింది. బ్రిటీష్ ప్రభుత్వం భారత్‌లోని వలస ప్రభుత్వం పట్టును కొనసాగించాలని తలచింది. కాబట్టి వారు తిరుగుబాటును అణచివేయడానికి, భారతదేశంలోకి మనుషులను, డబ్బును, ఆయుధాలను ప్రవహింపచేశారు. బ్రిటీష్‌వారి అతిపెద్ద సైనిక బలం ముందు, తిరుగుబాటుదారుల ధైర్యం నిలబడ లేకపోయింది.

1857 సెప్టెంబర్ 20న బ్రిటీష్ దళాలు, ఢిల్లీని ఆక్రమించాయి. యువరాజుల శిరచ్ఛేదనం జరిగింది. మరియు బహదూర్‌షా దేశం నుండి వెళ్ళగొట్టబడగా రంగూన్‌కు పారిపోయాడు. అలా తిరుగుబాటుకు ప్రతీక(symbol)తొలగించబడింది. 1858 జూన్ 17న ఝాన్సీరాణి పోరాటం సల్పుతూనే మరణించింది. తాంతియాతోపే ఒక జమీందారుచే నమ్మకద్రోహానికి గురై 1858 ఏప్రిల్ 15న మరణానికి గురయ్యాడు. నానాసాహెబ్, కాన్పూర్‌లో ఓటమిపాలై నేపాల్‌కు పారిపోవలసి వచ్చింది. అలా క్రీ.శ.1859 సంవత్సరానికి తిరుగుబాటుదారుల నాయకులు చనిపోయారు భారతదేశంలో బ్రిటీష్‌వారి అధికారం పునఃస్థాపన జరిగింది.

1857 తిరుగుబాటు, బ్రిటీష్‌వారి సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా భారతీయులు జరిపిన ఒక గొప్ప పోరాటం. అయితే ఐక్యత, స్పష్టమైన కార్యాచరణ ప్రణాళిక, ఆధునిక ఆయుధ సంపత్తి, అన్ని వర్గాల ఆదరణ లేకపోవడంచే బ్రిటీష్‌వారు తిరుగుబాటును అణచివేయడం జరిగింది.

## పాఠ్య ప్రశ్నలు 58.బి

1. విద్యావంతులైన భారతీయులు తిరుగుబాటును ఎందుకు ఆదరించలేదు?

2. గరవ్నర్ జనరల్ కానింగ్ "(వారు) తుఫానును ఆపే అడ్డుకట్ట(breakwaters)లాగా పనిచేశారు లేకపోతే ఆ మహాజన ప్రవాహంలో కొట్టుకుపోయేవాళ్ళం" అన్నాడు. ఈ ఇందు 'వారు' అనగా ఎవరెవరు?

3. భారతీయులలో ఐక్యత లోపించడం వల్ల తిరుగుబాటు విఫలమైంది. అయినప్పటికీ ఈ తిరుగుబాటు భారతీయులను ఏకం చేసింది. ఎలా?

4. తిరుగుబాటుదారులు ధైర్యవంతులైనప్పటికీ ఓటమి పాలైనారు. దీనికి సైనిక కారణాలు ఏమిటి?

## 58.5 1857 తిరుగుబాటుకు బ్రిటీష్‌వారి ప్రతిస్పందన :

'1857' బ్రిటీష్ వారికి ఒక దిగ్భ్రాంతికరమైన అనుభవాన్ని మిగిల్చింది. ఇది భారతదేశంలో, బ్రిటీష్‌వారి (అధికారాన్ని) ఆధిపత్యాన్ని గడగడలాడించింది. తత్ఫలితంగా దేశంలో అనేక పరిపాలనా సంస్కరణలు తేబడ్డాయి. ఈ మార్పులు భారతీయ సమాజాన్ని, భారతీయ ఆర్థిక స్వరూపాన్ని, భారతీయ ప్రభుత్వాన్ని అనూహ్యరీతిలో ప్రభావితం చేశాయి.

### (ఎ) పరిపాలనా సంస్కరణలు :

భారతదేశంలో అధికారాన్ని తూర్పు ఇండియా వర్తక సంఘం నుండి బ్రిటీష్ చక్రవర్తి(ణి)(crown)కి బదలాయిస్తూ 1858లో, పార్లమెంట్‌నందు ఒక చట్టం చేయబడింది. తత్ఫలితంగా, అధికారం కంపెనీ డైరక్టర్ల నుండి భారతదేశ రాజ్యవ్యవహారాల కార్యదర్శి(secretary of state)కి బదలాయించబడింది. ఈయనకు కౌన్సిల్(మండలి) సహాయం చేస్తుంది. 'స్టేట్ సెక్రెటరీ', బ్రిటీష్ కేబినెట్‌లో ఒక సభ్యుడు అయి ఉంటాడు, మరియు పార్లమెంట్‌కు జవాబుదారీగా ఉంటాడు. గవర్నర్ జనరల్ పదవి కొనసాగించబడింది, ఆయనకు వైస్రాయిగా పిలిచేవారు. అప్పటినుండి సమర్ధ నియంత్రణాధికారం భారతదేశంలో కాకుండా, లండన్‌కు బదలాయించారు. బ్రిటన్ మరియు భారతదేశాల మధ్య క్రీ.శ.1870లో ఎర్రసముద్రం

ద్వారా ఏర్పాటు చేసిన సముద్రాంతర కేబుల్ వ్యవస్థ మన స్టేట్ సెక్రెటరీ, భారతదేశానికి సంబంధించిన వ్యవహారాలు మరియు నిర్ణయాలకు సంబంధించి వెంటనే సంప్రదింపులు చేసే వీలయ్యింది. కొద్దిమంది భారతీయులతో 25 ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్(Imperial legislative council)ని ఏర్పాటు చేయుటమేగాక చట్టాన్ని చేసే అధికారమిచ్చిన ఇది కేవలం ఒక సలహా సంఘంగా మాత్రమే మిగిలిపోయింది. మండలికి చెందిన భారతీయ సభ్యులు ఎన్నుకోబడకుండా నియమించబడటం వలన, ఎంపికలో విధేయులైన భారత యువరాజులు, నాయకులు, పెద్ద జమీందార్లు మరియు వ్యాపారాలకు ఎక్కువ అవకాశాలువచ్చాయి.

క్రీ.శ. 1861లో చేయబడిన 'భారతీయ మండలుల' చట్టం(Indian council bill)అప్పటివరకు ఉన్న కేంద్రీకృత పరిపాలనుండి, రాష్ట్రాలకు ఎక్కువ అధికారాలు ఇచ్చింది. అదేవిధంగా శాసనమండళ్ళు మద్రాస్, బొంబాయి, బెంగాల్ మరియు ఇతర రాష్ట్రాలలో నెలకొల్పబడ్డాయి. ఆర్థిక విధానం మరింత కేంద్రీకరించబడింది. లార్డు మాయో(Mayo)1870లో కేంద్ర మరియు ఆర్థిక వ్యవహారాలను వేరు చేయుటకు చర్యలు చేపట్టాడు. తత్ఫలితంగా, రాష్ట్ర ప్రభుత్వాలు విద్య, పోలీసు, జైళ్ళు, వైద్యసేవలు మరియు రహదారులు మున్నగు సేవలనందించుటకు తాము పొందిన కొంత మొత్తాల డబ్బును ఖర్చు పెట్టుటకు పథక రచన చేశాయి. ఈ చర్య ద్వారా, రాష్ట్రాల(provinces)కు స్వతంత్ర ప్రతిపత్తి వాస్తవంగా కల్పించబడిందా లేదా అనే విషయం మనకు అర్థం కాదు. వాస్తవానికి కేంద్ర ప్రభుత్వమే నియంత్రణ, పర్యవేక్షణలను కొనసాగించింది.

అనేకమంది ఆంగ్లేయులను నిర్దిష్ట అధికారాలతో సంస్థలు ఏర్పరచాలనే భారతీయుల అభిప్రాయంతో ఏకీభవించారు. అటువంటి స్థానిక సంస్థలు 1864–68 మధ్యకాలలో మొదటిగా ఏర్పాటు చేయబడినా దాదాపుగా వీటన్నింటిలో ప్రభుత్వంచే నామినేట్ చేయబడిన సభ్యులుండగా జిల్లా మేజిస్ట్రేట్ వీటికి అధ్యక్షునిగా ఉండేవారు. అయితే క్రీ.శ. 1882లో లార్డు రిప్పన్ ధైర్యంగా ఒక ప్రభుత్వ తీర్మానాన్ని జారీ చేశారు. ఈ తీర్మానం ప్రకారం స్థానిక వ్యవహారాలను నిర్వహించే గ్రామీణ, నగర స్థానిక సంస్థలలో అనధికారులై ప్రజల చేత ఎన్నుకోబడిన వారు సభ్యులుగా ఉంటారు.

**(బి) ప్రజా సేవలు :**

హోదా మరియు అధికార స్థానాలన్నీ ఇండియన్ సివిల్ సర్వీసెస్(Indian civil services)కు చెందిన సభ్యుల చేతిలో ఉండేవి. I.C.S సభ్యులు, లండన్‌లో నిర్వహించబడే ఒక సాంవత్సరిక (బహిరంగ) సార్వత్రిక పోటీ పరీక్ష ద్వారా ఎంపిక చేయబడేవారు. చాలామంది భారతీయులు ఈ పరీక్షకు హాజరైనప్పటికీ కేవలం కొద్దిమంది మాత్రమే ఎంపికయ్యేవారు. దీనికి ప్రధానకారణం. ఈ పరీక్ష లండన్‌లో ఆంగ్లమాధ్యమంలో నిర్వహించబడేది. అంతేగాక ఇది శాస్త్రీయ గ్రీకు మరియు లాటిన్ భాషల పరిజ్ఞానం అవసరం కాబట్టి భారతీయులకు ఈ పరీక్షలో కృతార్థులవడం చాలాకష్టం గా ఉండేది. దీంతోపాటు ఈ పోటీ పరీక్షలో పాల్గొను అర్హత వయస్సును క్రీ.శ. 1859లో ఉన్న 23సం॥ నుండి క్రీ.శ. 1878లో 19సం॥కు తగ్గించడం వలన భారతీయులు ఈ పరీక్షలో పోటీ పడటం అసాధ్యమయ్యింది. ఆవిధంగా ఐరోపావారు ఈ సేవావిభాగంలో వారి ప్రాబల్యాన్ని పొందుతూ వచ్చారు. బ్రిటీష్‌వారు వారి సామ్రాజ్యాన్ని సక్రమంగా నడుపుటకు పై విషయం చాలా ముఖ్యంగా పరిగణించబడ్డది.

**(సి) సైన్యం నందు చేయబడిన మార్పులు :**

1857 తర్వాత సైన్యం నందు మార్పులు చేయడం అనివార్యమైంది. 'తూర్పు ఇండియా కంపెనీ" దళాలు బ్రిటీష్ రాణి(Crown) దళాలతో కలిసిపోయాయి. సైన్యం పునర్వ్యవస్థీకరించబడింది. బెంగాల్‌లో ఐరోపావారు మరియు భారతీయుల నిష్పత్తిని పెంచిన 1:2గాను, మద్రాస్ మరియు బాంబేలలో 2:5గాను, సైన్యం కూర్పు చేయడమైనది. తిరుగుబాటులో పాల్గొన్న సైనికులను యుద్ధేతరులు(non-martial)అని, తిరుగుబాటును అణచివేయడంలో బ్రిటీష్ వారికి సహాయపడ్డ గూర్ఖాలు, పఠాన్లు మరియు సిక్కులను యుద్ధ సైనికులు(martials) ప్రకటించబడ్డారు. పర్యవసానంగా మొదట్లో బ్రిటీష్‌వారికి, భారతదేశాన్ని జయించడంలో సహాయపడి, ఆ తర్వాతి తిరుగుబాటులో పాల్గొన్న అవధ్, బీహార్, మధ్యభారతదేశం మరియు దక్షిణ భారతదేశానికి చెందిన సైనికులను దూరంగా ఉంచారు. వారు ఉద్దేశ్యపూర్వకంగా సమతౌల్య మరియు అసమతౌల్య(balance and counterpoise) విధానంతో పాటు 'విభజించి పాలించు'(Divide and rule)సిద్ధాంతాలను గురించి, భారతీయులలో ఐక్యతను దూరం చేయుటకు దేశంలోని భిన్న ప్రాంతాకు చెందిన మరియు విభిన్న మతాలకు చెందినవారిని ఒక సైనిక దళంలో (regiment) ఉండునట్టు చేశారు. అంత పెద్ద సైన్యాన్ని నిర్వహించడానికి పెద్ద మొత్తాలలో ఖర్చు చేయాల్సి వచ్చింది. క్రీ.శ.1904 సంవత్సరానికి భారతదేశ రాబడి(revenue)లో 52% సైన్యం మీద ఖర్చు చేయాల్సి వచ్చింది.

**సంస్థాన రాజ్యాలతో సంబంధాలు**(Relations with Pricncely States)

1857 తిరుగుబాటు బ్రిటీష్‌వారు అంతకు క్రితం అమలుచేసిన భారతరాష్ట్రాల విలీనం(Reunion of pricncely states) అనే తమ సిద్ధాంతాన్ని మార్చుకున్నారు వారి కష్టసమయంలో ఈ పరిపాలకులే తమ పక్షాన నిలిచారని వారు తెలుసుకున్నారు. ఈ పాలకులు చూపిన విధేయత వల్ల, ఆయారాజ్యాల పాలకులచే, ఆయా రాజ్యాల సింహాసనాన్ని అధిష్టించుటకు వారసుడిని నియమించుకునే హక్కు కల్పించడంతో పాటు భవిష్యత్‌లో వారి రాజ్యాలను విలీనం చేయబోమనే హామీలు పాలకులివ్వబడ్డాయి. బ్రిటీష్ చరిత్రకారుడు, పి.ఇ.రాబర్ట్స్ "అప్పటి నుండి వారిని, సామ్రాజ్యానికి బురుజుల్లాగా రక్షించటం బ్రిటీష్‌వారి" విధానమయింది. అయితే బ్రిటీష్‌వారు, రాష్ట్రాల అంతర్గత విషయాలలో జోక్యం చేసుకోవడం కొనసాగించారు. అంతేగాక వారిని సార్వభౌములుగా అంగీకరించమని ఆయాపాలకులు బలవంత పెట్టబడ్డారు. కానింగ్ 1862లో "ఇంగ్లండ్ మహారాణి ఎదురులేని పాలకురాలుగా, భారతదేశంలో ఒక ప్రధాన శక్తిగా ఎదిగి ముందు నిలిచింది" అని ప్రకటించారు.

క్రీ.శ.1876లో విక్టోరియారాణిని భారతదేశానికి 'రాణి'గా పదవిని స్వీకరించినపుడు, భారతదేశంపై బ్రిటీష్ సార్వ భౌమాధికారం సుస్థిరమైంది. బ్రిటీష్ వైస్రాయ్‌లు, భారతదేశ రాష్ట్రాల పరిపాలకులపై స్వేచ్ఛగా తమ అధికారాన్ని చెలాయించారు. బ్రిటీష్ వారు భారతదేశ రాష్ట్రాలలో జాతీయ ఉద్యమాలను ఒకవైపు నుండి అణచి వేయడానికి అవసరమైన ఏర్పాటు చేసి, మరొక వైపున కొన్ని రాష్ట్రాలలో ఆధునిక పరిపాలనను ప్రవేశపెట్టడానికి ప్రయత్నించారు.

**(ఇ) రాజులు, భూస్వాములు, జమీందార్ల పట్ల బ్రిటీష్ వైఖరి :**

ఈ వర్గానికి చెందిన వారందరూ, బ్రిటీష్ వారిచే బాగా సహాయం పొంది, భూములలో అధికభాగం పొందారు. వీరికి రైతుల ఖర్చులతో భూమి ఇవ్వబడింది. లార్డు లిట్టన్ చెప్పినట్లు శక్తివంతమైన స్థానిక ఉన్నత వర్గాలవారి సహకారం పొందటం, బ్రిటీష్‌వారి ప్రధాన విధానం అయింది. ఆయన 1876లో "ఇప్పటినుండి ఇంగ్లండ్ రాణి(crown)ఈ

శక్తివంతమైన స్థానిక ఉన్నత వర్గాల ఆశలు, ఆశయాలు, సానుభూతులు, ఆసక్తులతో ఖచ్చితంగా గుర్తించబడుతుంది" అన్నాడు. కాని జమీందార్లు వారి పూర్వ సార్వభౌమాధికారాన్ని తిరిగి పొందలేక పోయారు. మొదట్లో వీరు, వీరి ప్రాంతాల నుండి సరుకులను పంపుటకు ప్రత్యేక విధులమీద పనిచేస్తూ, కోటలలో నివసిస్తూ, తుపాకులను మరియు ఆయుధాలను కలిగియుండి స్వతంత్రంగా సైన్యాన్ని కలిగి ఉండేవారు. 1857 తర్వాత ఈ కోటలు కూల్చివేయబడ్డాయి. తుపాకులు జప్తు చేయబడ్డాయి. సైన్యం నిలిపివేయబడింది. మరియు వీరికి కేటాయించిన భూములపై ప్రభుత్వ ఆజ్ఞ లేక సనద్(sanad) ద్వారా వీరికి పూర్తి హక్కులు కల్పించబడ్డాయి. రైతువర్గం కౌలుదారులుగా మిగిలి, రాజాలు భూస్వాములుగా అయ్యారు. వాస్తవానికి, నిజమైన అధికారం బ్రిటీష్ వారు చెలాయించసాగారు.

### (ఎఫ్) ఆధునికతా దృక్పధం పట్ల ప్రతిచర్య :

19వ శతాబ్ధపు తొలి సంవత్సరాలలో బ్రిటీష్‌వారు భారతదేశాన్ని ఆధునీకరించాలని ప్రయత్నించారు. ఆచరణలో సాధ్యం కాకపోయినా కనీసం మాటలలో (lipsorvice)భారతీయులు వారి స్వయం ప్రభుత్వం ఏర్పాటు చేసేలా కృషి చేయాలని భావించబడేది. ఇప్పుడు భారతీయులు తమను తాము పరిపాలించుకొనుటకు పనికిరారు అన్న విషయం బహిరంగంగా చెప్పబడింది. పరిపాలనా ప్రతిచర్యాపరంగా ప్రభుత్వ నిర్మాణంలో భారతీయులకు చోటు కల్పించబడలేదు.

'సతి' రద్దు చేయబడిందని, వితంతు పనర్వివాహాలకు అనుమతి నివ్వబడిందన్న విషయం మీరు గుర్తుకు తెచ్చుకోగలరు. ఇటువంటి సంఘ సంస్కరణలు తిరుగుబాటుకు ప్రత్యక్ష సంబంధం కలిగి ఉన్నాయని భావించబడింది. కాబట్టి ప్రభుత్వం క్రమేణా సనాతన విధానాల నుండి ప్రక్కకు తప్పుకొని, సంస్కర్తలకు తమ సహకారం అందించడం మానివేసింది.

అదేవిధంగా బ్రిటీష్‌వారు భారతదేశంలో తమ పరిపాలనను మతరహితమైన విధంగా అందించుటకు, మిషనరీలకు మతమార్పిడి(proselytisation)విషయంలో అంతకుక్రితం అందించిన ప్రోత్సాహాన్ని ఆపివేశారు. క్రొత్త విధానం ప్రకారం వారు మత విషయాలలో తటస్థంగా ఉండసాగారు. దానికి ఉదాహరణను చూస్తే, ప్రభుత్వంవారు హిందూ దేవాలయాలకు మంజూరి చేసిన నిధుల గురించి బొంబాయి మిషనరీ సంఘం వారు ఆరోపించినపుడు, వారి ఆరోపణలను వెనక్కు తీసుకోవలసి వచ్చింది. వారి ఆరోపణలు తిరస్కరించబడ్డాయి.

### (జి) శ్రామిక చట్టాలు(Labour legislation)

కర్మాగారాలలో, పొలాలలో పనిచేసే శ్రామికుల(కార్మికులు) పరిస్థితి చాలా దయనీయంగా ఉండేది. వీరి పరిస్థితి, ఇంగ్లాండ్‌లో పారిశ్రామిక విప్లవం జరిగిన మొదటినాళ్ళలో ఉన్న పరిస్థితిని ప్రతిబింబించింది. వారు వారాంతపు సెలవు లేకుండా రోజుకు 12 నుండి 16 గంటలు పనిచేయాల్సి వచ్చేది. అంతేగాక వారికి నెలకు 4రూ. నుండి 20 రూ. మాత్రమే పారితోషికం(remuneration) దక్కేది. వారి చర్యలు, అరోగ్య సంరక్షణ గురించి శ్రద్ధ వహించే వారు కాదు. బ్రిటీష్ తయారీదారులు, కర్మాగార చట్టాలు చేయవలసిందిగా ప్రభుత్వం మీద ఒత్తిడి తెచ్చారు. బ్రిటీష్ తయారీదారులు, భారతీయ మార్కెట్‌లో భారతదేశంలోని తమ పోటీదారులు తమకంటే ఎక్కువగా అమ్మకాలు సాగిస్తారేమోనని భయపడసాగారు. క్రీ.శ.1881లో భారతప్రభుత్వం మొట్టమొదటి భారత కర్మాగార చట్టం చేసింది. ఇది బాలకార్మికులకు సంబంధించినది. రెండవ భారత కార్మిక చట్టం క్రీ.శ.1891లో చేయబడింది. దీని వలన స్త్రీలకు 11 గం॥ల పనిదినంగా నిర్ణయించడమైనది. మరియు అందరూ కార్మికులకు వారంలో ఒక రోజు సెలవుగా

ప్రకటించడమైనది. కాని ఈ రెండు చట్టాలలో ఏ ఒక్కటీ బ్రిటీష్‌వారి ఆధీనంలో నడుస్తున్న తేయాకు, కాఫీ తోటలకు వర్తించలేదు. కార్మికుల పరిస్థితి దయనీయంగా ఉండిపోయింది.

### (హెచ్) మతపరమైన అనైక్యతను ప్రోత్సహించుట :

హిందువులు మరియు ముస్లింలలో అనైక్యతను ప్రోత్సహించుటకు ఉద్దేశ్య పూర్వకమైన ప్రయత్నాలు చేయబడ్డాయి. హిందువుల, ముస్లింల ఐక్యతవల్లనే తిరుగుబాటు విజయవంతమయ్యింది. బ్రిటీష్‌వారు ముస్లింల మీద ఉక్కుపాదం(heavy hand) మోపారు. ముస్లింలతో కలవనీయకుండా ఉండటానికి హిందువులపై మక్కువ చూపారు. దీనికి వ్యతిరేకంగా క్రీ.శ.1870లో బ్రిటీష్ వారు ముస్లింలకు అనుకూలంగా, హిందువులను దూరం చేసి జాతీయ ఉద్యమాన్ని నీరుగార్చే ప్రయత్నం చేశారు.

### (ఐ) విద్యా విధానం మరియు మేధావుల వర్గం :

మొదట్లో ప్రభుత్వం క్రీ.శ.1833 తర్వాత ఆధునిక విద్యను ప్రోత్సహించింది. క్రీ.శ.1857లో కలకత్తా, బొంబాయి మరియు మద్రాస్‌లలో విశ్వవిద్యాలయాలు నెలకొల్పబడ్డాయి. విద్యావంతులలో ఎక్కువమంది తిరుగుబాటులో పాల్గొనలేదు. కాని, త్వరలోనే వీరు తాము నేర్చుకున్న ఆవిద్యతోటే బ్రిటిష్‌వారి పథకాలు ఉద్దేశాలను విశ్లేషించి, భారత పాలనలో భాగస్వామ్యులు కావటానికి బలమైన వాదనలు వినిపించారు. అప్పటి నుండి భారతీయులకు ఉన్నత విద్యావకాశాలు తగ్గించబడ్డాయి.

బ్రిటీష్‌వారితో సమాన హోదా పొందాలన్న విద్యావంతుల ఆశలు, అడియాసలయ్యేసరికి వారు తీవ్ర నిరాశకు గురయ్యారు. వారి దిగ్భ్రాంతికర చేదు అనుభవాలతో పాటు వారిలో పెరుగుతున్న జాతీయవాద అనుభూతులు సాహిత్య(literature) రూపంలో వ్యక్తమయ్యాయి. ఉదాహరణకు, ఠాగూర్ రచనల్లో ఝూన్సీరాణి, తాంతియాతోపెల గురించి లేక బంకించంద్ర ఛటర్జీ రాతల్లో కనబడే దేశభక్తి అంశాలను పరిశీలింవచ్చు. వారి ఆసక్తులు కొనసాగింపుకు, వారి గుర్తింపును అందరికీ తెలియచేయుటకు కొన్ని ప్రత్యేక సంఘాలు ఏర్పాటు చేయవలసి యున్నదని, అభిప్రాయపడ్డారు. అతర్వాత ఈ అంశాలే ఒక అఖిల భారత సంఘంగా ఏర్పడటానికి భారత జాతీయ కాంగ్రెస్ ఏర్పాటుకు దోహదం చేశాయి.

### (జె) జాత్యహంకారం (Racial Arrongance)

తిరుగుబాటు మరియు ఇరువైపుల నుండి చేయబడిన అకృత్యాలు ఇరుజాతుల మధ్య అగాధాన్ని మరింత పెంచాయి. బ్రిటీష్‌వారు జాత్యహంకార దోరణిని(racial superority) ప్రదర్శిస్తూ భారతీయులను, రైళ్ళలో, పార్కులలో, ఈతకొలనుల వద్ద, హోటళ్ళు, క్లబ్బులు మొదలగు ప్రాంతాలలో హీనంగా చూసేవారు. జవహర్‌లాల్ నెహ్రూ ఈ క్రింది విధంగా ఉటంకించారు.

"భారతదేశంలో మేము(మనము) బ్రిటీష్‌వారి పాలన మొదలైనప్పటి నుండి జాతి(వర్ణ) విచక్షణను అన్ని రూపాలలోను ఎదుర్కొంటున్నాం. ఇందులో ఎత్తుగడ అనేది ఏమీ లేదు. ఇది అధికారంలో ఉన్నవారిచే మాటలలో చెప్పలేని భాషలలో నిస్సందేహంగా తమ అధికారిక చర్యలలో చూపబడేదే. మాటలలో కన్నా వారి చేతల ద్వారా తరతరాలుగా, ప్రతి సంవత్సరం, భారతదేశం ఒక జాతిగా, భారతీయులు వ్యక్తులుగా అవమానింపబడి, హేయంగా

చూడబడుతున్నారు" తత్ఫలితంగా, "బ్రిటీష్‌వారు మరియు భారతీయుల మధ్య మానసిక(మనస్థత్వ) అగాధాలు పెరగడానికి, జాతివిచక్షణ ఇంకా పెరగడానికి కారణమైంది"

> 1857 తిరుగుబాటు భారతదేశంలో బ్రిటీష్ ప్రభుత్వాన్ని వణికించింది. అప్పటినుండి ఇచ్చటి పరిపాలనా ప్రాంతాలపై వారి సైన్యాల్లో వారి నిర్ణయాలపై గట్టి నియంత్రణ చేస్తూ మార్పులు చేశారు. బ్రిటీష్ పాలనలో జాత్యంహంకారం పెరిగిపోయింది. ఇది మేధావి వర్గంలో బలమైన ప్రతిచర్యను ప్రేరేపించింది. వారు చేసిన రచనలు జాతీయ భావోద్వేగముం(sentiment)మరియు జాతీయ సమైక్యత (National Unity)ఏర్పడటానికి ఒక మూలధారాలైనాయి.

## పాఠ్య ప్రశ్నలు 58.సి

1. 1857 తిరుగుబాటు అతిముఖ్య ఫలితం ఏమిటి?
2. 1858 తర్వాత సైన్యం యొక్క పునర్వ్యస్థీకరణకు మూలం ఏమిటి?
3. తిరుగుబాటు సమయంలో తమకు సహకారం అందించిన భారతీయ పాలకులకు బ్రిటీష్ వారు ఎలా సహాయపడ్డారు?
4. విద్యావంతులైన భారతీయులు తిరుగుబాటుకు సహకారం అందించనప్పటికీ వారి పట్ల బ్రిటీష్‌వారు ఎందుకు శత్రుత్వ వైఖరిని ప్రదర్శించారు?
5. బ్రిటీష్‌వారిచే ప్రవేశపెట్టబడిన కార్మిక చట్టాలు వాస్తవానికి మానవతానుభూతులను ప్రేరేపించలేదు అని ఎందుకు చెప్పగలం?

## సారాంశం :

కంపెనీ సిపాయిలు వారి బ్రిటీష్ అధికారుల పట్ల విధేయతను చూపుటకు తిరస్కరించినందు వలన మీరట్‌లో తిరుగుబాటు మొదలైంది. తిరుగుబాటు ఇతర సిపాయిలలో, సామాన్య ప్రజలలోకి చాలా త్వరితంగా మరియు విస్తృతంగా వ్యాపించింది. తిరుగుబాటుదారులు కంపెనీ వారి అధికారాన్ని (ఎదిరించి) తిరస్కరించి, బహదూర్‌షాను వారి చక్రవర్తిగా అధికారికంగా ప్రకటించారు. ఆ విధంగా ఇతర తిరుగుబాటు రాజ్యాలు చక్రవర్తి పట్ల తమ విధేయతను తెల్పిన ఫలితంగా తిరుగుబాటు రాజకీయ రూపాన్ని సంతరించుకున్నది.

తిరుగుబాటు ప్రత్యేక (ప్రముఖ) గుణం వలన బలాన్ని సంతరించుకున్నది. రైతులు, ఇతర వృత్తులవారు సాధు సన్యాసులు మరియు ఆస్తులను, పదవులను కోల్పోయిన జమీందార్లు బ్రిటీష్‌వారికి వ్యతిరేకంగా యుద్ధంలో పాల్గొన్నారు. వారు వారికి దొరికిన ఆయుధాలతో ధైర్యంగా పోరాడారు.

తిరుగుబాటు ఒక పథకం ప్రకారం చేయబడిన కుట్ర అను విషయం మీద భిన్న వాదనలు వచ్చాయి. దురదృష్టవశాత్తు తిరుగుబాటుదారులకు సంబంధించి విశ్వసనీయ వివరాలు అందుబాటులో లేవు. తిరుగుబాటు వెనుక ఒక పథకం ఉన్నదని అయితే అది అనుకున్న తేది కంటే ముందే మొదలైందని మనకు అర్థమవుతోంది.

తిరుగుబాటుదారులు ధైర్యంగా ప్రయత్నించినప్పటికీ వారు విజయవంతం కాలేకపోయారు. దీనికి అనేక

కారణాలున్నాయి. ధనిక వ్యాపారులు మరియు విద్యావంతులైన వర్గాలు దీనికి సహకారం అందించలేదు. భారతీయ పాలకులు, నాయకులు వారి సొంత ప్రయోజనాల కోసం, తిరుగుబాటును అణచివేయుటలో బ్రిటీష్‌వారికి సహాయపడ్డారు.

తిరుగుబాటుదారులందరు కలసికట్టుగా సాగలేదు. వారికి ఒక సమర్థుడైన నాయకుడు లేకుండా పోయాడు. ప్రతినాయకుడు ఎవరికి వారే ఒంటరిగా పోరాడసాగారు. దీంతోపాటు, తిరుగుబాటుదారులకు ఒక స్పష్టమైన రాజకీయ, సైనిక కార్యాచరణ పథకం లోపించింది. వారికి భారతదేశ స్థాయిలో జాతీయవాదం దేశభక్తులకు సంబంధించిన ఆధునిక భావనలను గురించి తెలియదు. తిరుగుబాటుదారులకు ఆయుధాలు, ఇతర ఆయుధ సంపత్తి(ammunition)లేకపోవడం సరియైన సమాచార వ్యవస్థ లేకపోవడం వలన తిరుగుబాటును బ్రిటీష్‌వారు అణచివేయగల్గారు.

1857 తిరుగుబాటు తర్వాత భారతదేశం పరిపాలనలో అనేక మార్పులు చోటు చేసుకున్నాయి. క్రీ.శ. 1858లో చేయబడిన పార్లమెంట్ చట్టం ద్వారా పరిపాలన చేసే అధికారం తూర్పు ఇండియా కంపెనీ నుండి బ్రిటీష్ రాణి(crown)కు బదలాయించబడినది. గవర్నర్–జనరల్ కార్యనిర్వాహక మండలి ఏర్పాటు చేయబడినది. పరిపాలన ఒక ప్రతిచర్యగా మారి, భారతీయుల పట్ల నిర్లక్ష్యవైఖరి ప్రదర్శించబడింది. ప్రభుత్వ పరిపాలన వ్యవహారాలలో ఏ ఒక్క భారతీయునికి సముచిత స్థానం కల్పించబడలేదు.

బ్రిటీష్ వారు ఒక ఉద్దేశ్యపూర్వకంగానే 'విభజించు పాలించు' సిద్ధాంతాన్ని పాటించారు. సైన్యాన్ని యుద్ధ సైనికులు(martials) యుద్ధేతర సైనికులు(non-martials)పునర్వ్యవస్థీకరించబడ్డారు. అదేవిధంగా హిందువులు, ముస్లిం ఇద్దరిపట్లా అనుకూలంగా ఉంటూ, మతకారణాలతో ఇరువురిని విభజించారు.

తిరుగుబాటును అణచడంలో సహాయపడిన భారతీయ నాయకులు, ప్రధాన రాష్ట్రాల పట్ల దయా పూర్వకంగా ప్రవర్తించారు. ఇంకోవైపు బ్రిటీష్ వారి స్వార్థపూరిత సిద్ధాంతాలను విశ్లేషించిన విద్యావంతుల వర్గం బ్రిటీష్ వారిపై గుర్రుగా ఉన్నారు. భారతీయులందరి పట్ల జాత్యంహంకార ధోరణి అవలంభించారు.

## అభ్యాసం

1. ఒక మిలటరీ అధికారి డల్‌హౌసిని ఇలా హెచ్చరించాడు "మీ సైన్యం దేశంలో రైతువర్గం నుండి తీసుకోబడ్డది మీరు కనుక ఈ దేశ ప్రజల వ్యవస్థలను విచ్ఛిన్నం చేస్తే, సైన్యం వారిపై సానుభూతి ప్రదర్శిస్తుంది. ఎందుకంటే వారు ప్రజలలో భాగమే కాబట్టి" పై మాటలను పరిశీలించిన మీదట, 1857 తిరుగుబాటు స్వభావాన్ని పరీక్షించండి.
2. 1857 తిరుగుబాటు విఫలమవడానికి ప్రధాన కారణాలు తెల్పండి?
3. తిరుగుబాటు తర్వాత, పరిపాలనా వ్యవస్థ, సైన్యం, ప్రజాసేవల పరంగా భారతదేశ పరిపాలనలో తీసుకొని రాబడిన మార్పులను పరీక్షించండి.
4. తిరుగుబాటు తర్వాత, భారతపాలకులు, జమీందార్లు, విద్యావంతులైన భారతీయులు, సంఘ సంస్కర్తల పట్ల బ్రిటీష్ వారిలో వచ్చిన మార్పులేవి?

**కార్యక్రమాలు :**

తిరుగుబాటు తర్వాత భారతదేశ పాలన, కంపెనీ నుండి బ్రిటీష్ రాణి చేతులలోకి వెళ్ళిందని మీకు తెలుసు. మీరు, కంపెనీ, బ్రిటీష్ రాణుల పరిపాలనా విధానాలను సరిపోల్చండి. దీనియందు పరిపాలనా నిర్మాణం, ఆర్థిక విధానం, సంస్థానాల పట్ల వైఖరి, సైన్యం, సామాజిక చట్టాల రూపకల్పన, విద్యావిధానం అంశాలను పరిగణనలోకి తీసుకోండి.

**పాఠ్య ప్రశ్నలకు సమాధానాలు**

**58.ఎ**

1. తిరుగుబాటు నందు సిపాయిలు, సామాన్యపౌరులు పాల్గొన్నారు. బ్రిటీష్‌వారి పాలనలో అనుభవించిన బాధల ఫలితమే ఈ తిరుగుబాటు. ఎప్పుడైతే సిపాయిలు, బహదూర్‌షా తమ చక్రవర్తిగా అధికారికంగా ప్రకటించారో అప్పుడు అది ఒక సాధారణ అలజడి కాదని, ఒక విప్లవాత్మక సంగ్రామమని నిరూపించారు.
2. తిరుగుబాటు నాయకుల మధ్య ఎటువంటి సమాచార వ్యవస్థ ఉన్నట్లుగా చూపే వ్రాతపూర్వక ఆధారాలు లేవు.
3. మీరట్‌లో 1857 మే 10 వ తేదీన
4. రైతులు, ఇతర వృత్తులవారు, మతపరమైన సాధు, సన్యాసులు, పదవులు, ఆస్తులు కోల్పోయిన జమీందార్లు
5. హిందువులు, ముస్లింలలో పూర్తి ఐక్యత ఉన్నది. వారిరువురు కలసి పోరాడారు. వారు తమ చక్రవర్తిగా మొఘల్ పాలకుని అంగీకరించి పరస్పరం వారి వారి మతాలను గౌరవించారు.

**58.బి**

1. తిరుగుబాటుదారులు భారతదేశాన్ని అభివృద్ధి పథం నుండి తిరోగమింప చేయుచున్నారని విద్యావంతులైన భారతీయులు తలిచారు. ఆధునిక బ్రిటీష్ జాతిచే పరిపాలింపబడటం తమ అభిమతమని భావించారు.
2. తిరుగుబాటును అణచి వేయడంలో బ్రిటీష్ వారికి సహాయం చేసిన భారత పాలకులు మరియు నాయకులు.
3. భారత ప్రజలందరినీ ఒక్క త్రాటిపై తెచ్చుటకు తిరుగుబాటు ఒక ముఖ్యపాత్ర వహించింది. ఇది వారిలో తామంతా ఒకే దేశానికి చెందిన వారమనే స్పృహ తెచ్చింది. ఇది భారతీయులలో స్ఫూర్తిని, దేశభక్తిని ప్రేరేపించింది. ఇది ఆధునిక జాతీయ ఉద్యమానికి బాటలు వేసింది.
4. తిరుగుబాటుదారులకు సమర్ధ నాయకత్వం లోపించింది. సరియైన నాయకుడు ఒక్కరు కూడా లేరు. వారికి ఆధునిక ఆయుధాలు లేక యుద్ధ సామగ్రి అందుబాటులో లేవు. దారిలో సరియైన యుద్ధ తంత్రం లేక, ఎవరికి వారే ఒంటరిగా పోరాటాలు సల్పుట వలన బ్రిటీష్‌వారు చాలా తేలికగా వీరిని అణచివేశారు.

**58.సి**

1. భారతదేశ పరిపాలనాధికారం తూర్పు ఇండియా కంపెనీ నుండి బ్రిటీష్ రాణికి బదలాయించబడింది.
2. యుద్ధంలో పాల్గొనే (martial)మరియు (non-martial)యుద్ధానికి దూరంగా ఉండే వర్గాలు

3. వారి వారసులను దత్తతు తీసుకొనే హక్కును అంగీకరించారు. వారి వారి భూభాగాల సమగ్రతను కాపాడతామని వాటిని భవిష్యత్‌లో విలీనం చేయబోమని హామీ ఇచ్చారు.

4. విద్యావంతులైన భారతీయులు తాము నేర్చుకున్న జాతీయవాదం, ఆధునిక ప్రజాస్వామ్య భావాలతో భారతదేశంలో బ్రిటీష్ వారి పాలనను ప్రశ్నించడం మొదలు పెడతారని బ్రిటీష్‌వారు భావించారు. ప్రభుత్వం వారు ఈ వర్గం తమ సామ్రాజ్యవాద సిద్ధాంతాలను అడ్డుకుంటారని భావించారు.

5. బ్రిటీష్‌వారు చేసిన కార్మిక చట్టాలు, కర్మాగారాలలో పనిచేసే కార్మికులకు ఎటువంటి ప్రయోజనాన్ని చేకూర్చలేక పోయాయి. పైగా ఈ చట్టాలు బ్రిటీష్‌వారి అధీనంలో ఉన్న తేయాకు, కాఫీ తోటలలో పనిచేసే వారికి వర్తింపచేయలేదు. ప్రభుత్వం తోటల పెంపకం దార్లను వారి తోటలలో పనిచేసే భారత కార్మికులను దోపిడి చేయ ప్రోత్సహించినట్లు స్పష్టమయింది.

# 59

# భారతదేశంలో జాతీయభావాల వృద్ధి

## 59.1 పరిచయం :

1858 తదనంతరం 'నవభారతం' వేగవంతంగా వృద్ధి చెందింది. జాతీయస్థాయిలో ప్రజలలో రాజకీయ చైతన్యం పెంపొందెను. భారతీయులు క్రమంగా దేశంలో ఆంగ్లేయుల విధానంలను తెలుసుకొనగలిగిరి. ఆంగ్లేయుల విధానముల ఫలితంగా జరుగుచున్న ఆర్థిక దుస్థితిని అర్థము చేసుకొనగలిగిరి. ఆంగ్లేయుల వివక్షవిధానాలను, ఏ రంగంలో స్థానికులకు సమ అవకాశాలు ఇవ్వని వారి వైఖరి స్పష్టమయ్యెను. సంఘ సంస్కర్తలు, విద్యావంతులు ప్రజలను మేల్కొనవలసినదిగా, సమయానుకూలంగా మార్పును స్వీకరించవలసినదిగా మేల్కొలిపిరి. ప్రజలలో ఆత్మాభిమానమును, స్వేచ్ఛా భావాలను, సమగ్రతను పెంపొందించసాగిరి.

ఆంగ్లేయులు దేశంలో అనుసరించిన ఏకీకృత పాలనావిధానాలు భారతీయులలో జాతీయతాభావ వృద్ధికి మార్గమును సులభతరం చేసెను. రైల్వేలు, టెలిగ్రాం సదుపాయాలు భారతీయ నాయకుల మధ్య అవగాహన మరింత పెంపొందుటకు ఉపకరించినవి. దేశములో ప్రవేశపెట్టబడిన పాశ్చాత్య విద్యా భారతీయులకు ఆధునిక ప్రపంచానికి దగ్గరకు చేర్చినది. ముద్రణా యంత్రాల ఫలితంగా జాతీయభావాలను ప్రచురించు అనేక పత్రికలు ప్రజలకు అందుబాటులోనికి వచ్చినవి. వీటి అన్నింటి ఫలితం దేశప్రజలు తామంతా ఒక్కటే అను భావనకు దగ్గరైరి.

ఈ పాఠంలో భారతీయులలో జాతీయవాదంను పెంపొందించిన వివిధ అంశాలను పరిశీలించుట జరుగును. తమ ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించు ప్రభుత్వాన్ని ఏర్పరచుకొను దిశలో భారతీయులు అడుగులు వేయుట ఈ పాఠ్యాంశంలో గమనించవలెను.

## లక్ష్యాలు :

**ఈ పాఠ్యాశ అధ్యయనం ద్వారా క్రింది విషయాలు తెలుసుకుంటారు**

1. ఆంగ్లపాలన స్వభావం, జాతీయ ఐక్యతకు ప్రజలకు ఏవిధంగా ఉపయోగపడిన విధానం
2. దేశంలో ప్రవేశపెట్టబడిన పాశ్చాత్య విద్య భారతీయులలో జాతీయభావాలను, స్వేచ్ఛావాదంను, ప్రజాస్వామ్య వ్యవస్థను గురించి ఏవిధముగా దోహదం చేసినవో అన్న విషయం

3. దేశంలో ముద్రించబడిన వార్తాపత్రికలు ప్రజలలో పెంపొందించిన రాజకీయ చైతన్యం

4. ప్రజలను జాగృతి పరుచుటలో సంఘసంస్కర్తల పాత్ర

5. ఆంగ్లేయులు అనుసరించిన వివక్ష విధానాలు, జాతి అహంకార విధానాలు భారతీయులను ఏవిధంగా ప్రభావితమొనర్చినవో అన్న విషయం

6. రాజ ప్రతినిధి లిట్టన్ అనుసరించిన అణిచివేత విధానాలు ప్రజలలో జాతీయతా వృద్ధికి దోహదపడిన విధం

## 1. దేశంలో ఆంగ్లపాలన స్వభావం :

భారతీయులలో జాతీయ భావాలు చిగురించుటకు అంగ్లేయులు అనుసరించిన పాలనా స్వరూప స్వభావాలు ముఖ్యంగా దోహదపడినవి. ఆంగ్లేయుల విధానాలు ప్రజలలో జాతీయ చింతనను ప్రేరేపించినవి. ఆంగ్లేయులు తమ ప్రయోజనాలను పరిరక్షించుకొనుటకు, భారతీయులను తమ విధేయులుగా అదుపులో పెట్టుకొనుటకు మాత్రమే తమ దేశాన్ని జయించారని తెలుసుకొనగలిగిరి.

ఇంతకు ముందు పాఠాలలో ఆంగ్లేయుల దోపిడి స్వభావంను గురించి తెలుసుకొని యున్నాము. ఈ విధానాలు దేశంలోని స్వయం సంవృద్ధి స్వభావం గల ఆర్థిక వ్యవస్థను ఆంగ్లేయులు సర్వనాశనం చేసి ఆస్థానంలో జాతీయస్థాయిలో వర్తక వాణిజ్యాలను ప్రవేశపెట్టిరి. దీని ఫలితంగా భారతదేశం ఆంగ్లేయులకు వలసగా మారి వారికి ముడిపదార్థాలను సరఫరా చేయు సాధనమయింది. వారి వస్తువులను విక్రయించు కొనుటకు ఒక మార్కెట్‌గా మాత్రమే చూడబడెను. వీరి విధానాలను ప్రముఖ భారతీయులైన ఎం.జి.రనడే, దాదాబాయ్ నౌరోజి, ఆర్.సి.దత్తా మొదలగు వారు తమ రచనల ద్వారా ప్రజలకు తెలియచేసిరి.

ఆంగ్లేయులు ఆధునిక రవాణా సాధనాలను దేశంలో ప్రవేశపెట్టిరి. వీరు దేశములో రైల్వేలను, జాతీయ రహదారులను, వంతెనలను, తపాలా కార్యాలయాలను, టెలిగ్రాఫ్ సౌకర్యాలను అందుబాటులోనికి తెచ్చిరి. ఇవి అన్ని ప్రజలను దగ్గరికి తీసుకొని వచ్చుటలో ఎంతగానో దోహదపడినవి. ఈ సౌకర్యాలను దేశంలో ప్రవేశపెట్టుట ద్వారా వాణిజ్యంగా దేశాన్ని కొల్లగొట్టుటకు, దేశంలో ఆంగ్ల పాలనను పరిరక్షించుటకు ఆంగ్లేయులు ప్రయత్నించిన ఇవి పరోక్షంగా భారతీయులలో చైతన్యం చిగురించుటకు చాలావరకు దోహదపడినవి. దేశంలో జరుగుచున్న పరిణామాలను ప్రజలు ఆధునిక రవాణా సదుపాయాల ద్వారా పరస్పరం అవగాహన చేసుకొనగలిగిరి. జాతీయవాద నాయకులు ఈ రవాణా సదుపాయాల సాయంతో దేశవ్యాప్తంగా విస్తృతంగా పర్యటించి ప్రజలలో గొప్ప జాతీయభావాలను పెంపొందించగలిగిరి.

ఆంగ్లేయులు దేశంలో కేంద్రీకృత, ఏకీకృత పాలనా విధానమును ప్రవేశపెట్టిరి. ఫలితంగా రాజకీయ, న్యాయ పాలనారంగాలలో దేశం ఐక్యతను సాధించెను. ఏకీకృత పాలన ప్రజలను విధేయులుగా మార్చుటకే గాక, ప్రజలలో చైతన్యానికి ఉపకరించెను. అందరికీ ఒకేవిధమైన సమస్యలు ప్రజలను ఒకేత్రాటిపై తెచ్చి జాతి సమైక్యతకు తోడ్పడింది.

## 59.4 ఆధునిక విద్యను ప్రవేశపెట్టట :

జాతీయతాభావ వృద్ధిలో ఆధునిక విద్య ప్రధానపాత్ర పోషించింది. క్రైస్తవ మిషనరీలు, బ్రిటీష్ ప్రభుత్వ ఆధునిక భావాలున్న భారతీయుల కృషి ఫలితంగా ఆంగ్లవిద్య వ్యాప్తి చెందింది.

ఆంగ్ల విద్య భారతదేశంలో బ్రిటీష్‌వారి రాజకీయ, పాలనా, ఆర్థిక ప్రయోజనాలను పరిరక్షించు ఉద్దేశ్యముతో ప్రవేశపెట్టబడినది. దేశంలో ఆంగ్లపాలన సాఫీగా నడుచుటకు అవసరమైన గుమస్తాలను, ఏజంట్లను, ఇతర క్రిందిస్థాయి ఉద్యోగులను సమకూర్చుకొనుటకు ఆంగ్ల విద్యను పాలకులు ప్రోత్సహించిరి. ఆంగ్లేయులు భారతీయులను 'నాగరీకులు'గా తీర్చిదిద్దుటకు ఆంగ్ల విద్యను ప్రవేశపెట్టబడినదని చెప్పుకొనిరి. కాని ఇతరులు ఆంగ్లపాలనను భారతీయులచే ఒప్పించుటకు ఆంగ్ల విద్యను ఒక సాధనంగా వాడిరని అభిప్రాయపడిరి.

భారతీయ కోణంనుండి పరిశీలించిన పాశ్చాత్య విద్య అనేకమంది భారతీయులు ఐరోపానందలి ఆధునిక భావాలను అర్థం చేసుకొనుటకు ఉపయోపడిన దనుట నిర్వివాదాంశం. అంగ్లభాషను అధ్యయనం చేయుట ద్వారా భారతీయులు శాస్త్రీయ, భౌతిక, తాత్విక ఆలోచనా విధానాలను పెంపొందించుకొనగలిగిరి. ఈ విద్య ఫలితముగా భారతీయులు ఓల్టేర్, రూసో, లాక్, బర్క్, బెంథాం, థామస్ పెయిన్, మార్క్స్ మొదలగు మేధావుల రచనలను, ఆలోచనా విధానాలను ఆకళింపు చేసుకొని ప్రభావితమైరి. జాతీయత, స్వపరిపాలన, ప్రజాస్వామ్యం, స్వాతంత్ర్యం మొదలగు భావనలను గుర్తించగలిగిరి. ఐరోపా నాయకులైన మాజిన, గారిబాల్డి మొదలగు వారిని అభిమానించుట మొదలిడిరి. ఫ్రెంచి విప్లవం యెడల ప్రభావితమై స్వేచ్ఛ, సమానత్వం, సోదరభావాల యెడల ఆకర్షితులైరి.

ఆంగ్ల విద్య దేశంలో అమిత ప్రజాధరణ పొంది అనేకమంది భారతీయులు 19వ శతాబ్దినాటికి నూతన పరిస్థితులను అవగతం చేసుకొనిరి. ఇంగ్లాండ్‌కు వెళ్ళిన భారతీయులు స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు కలిగి భారతీయులకు హక్కులను నిరాకరించుచున్న వారి వైఖరిని అర్థం చేసుకొనిరి.

ఆంగ్ల భాష దేశంలో సంస్కృతం, పర్షియా, హిందుస్థానీ భాషల స్థానంలో ఒక అనుసంధాన భాషగా ప్రాధాన్యతను సంపాదించుకొనెను. కేవలం ఆంగ్ల భాషద్వారా మాత్రమే కాక భారతీయ ప్రాంతీయ భాషలు సైతం జాతీయతను ప్రజలలో పెంపొందించుట కీలకపాత్ర పోషించినవను వాస్తవాన్ని విస్మరించరాదు. ప్రాంతీయ భాషలలో రచించిన నవలలు, వ్యాసాలు, కవిత్వాలు ప్రజలను గొప్పగా చైతన్యవంతులను చేసినవి. ప్రజలలో ఆంగ్ల వ్యతిరేకత, దేశభక్తిని పెంపొందించుటలో బంకిం చంద్ర ఛటర్జీ రచించిన 'ఆనందమఠం', దీనభందుమిత్ర రచించిన 'నీల్‌దర్పణ్' మొదలగునవి అత్యంత ప్రధానపాత్ర పోషించినవి ఇతర జాతీయ రచయితలలో అస్సామిలో లక్ష్మీనాద్ బైజుబారువ, మరాఠిలో విష్ణుశాస్త్రి చిప్లూంకర్, తమిళంలో సుబ్రమణ్యభారతి, హిందీలో భారతేందు హరీష్ చంద్ర, ఉర్దూలో అల్తాఫ్ హుస్సేన్ ఆలి మొదలగువారు ముఖ్యులు.

ఆధునిక భావాలైన జాతీయత, స్వేచ్ఛ, సమానత్వం, ప్రజాస్వామ్యం మొదలగు భావనలను భారతీయులలో పాశ్చాత్య విద్య పెంపొందించినవి. భారతీయులు ఆంగ్లపాలన యొక్క వాస్తవ స్వభావాన్ని అర్థం చేసుకొనగలిగిరి. అంగ్లవిద్య, భారతీయ సాహిత్యాల ఫలితంగా జాతీయభావాలు అమిత వేగవంతంగా భారతీయులలో పెంపొందినవి.

## 59.5 పత్రికలు :

ప్రజాభిప్రాయంను సృష్టించుటలో, వ్యాప్తి చేయుటలో, ప్రభావితమొనర్చుటలో 19వ శతాబ్ధి చివరినుండి పత్రికలు అత్యంత శక్తివంతమైన పాత్రను పోషించినవి. ప్రాంతీయ భాషలో వెలవడు పత్రికల సంఖ్య నానాటికి పెరిగినవి. 1875 నాటికి దేశంలో 374 వార్తాపత్రికలు ప్రాంతీయ భాషలలోను, పాక్షికంగా ఆంగ్ల భాషలోను, పాక్షిక ప్రాంతీయ భాషలలోను వెలువడుచుండెడివి. ఇవికాక 147 పత్రికలు కేవలం ఆంగ్లంలో ముద్రించబడుచుండెడివి. ఆంగ్ల పత్రికల కన్నా ప్రాంతీయ భాషా పత్రికలు అత్యధికంగా ప్రజలు చదివేవారు. విద్యావంతులై అనేకమంది జాతీయ నాయకులు ఈ పత్రికలను నడిపిరి. ప్రభుత్వ విధానాలను ఈ పత్రికలలో చర్చించుట, విమర్శించుట, వ్యాఖ్యానించుట జరిగెడిది. ప్రజలలో బ్రిటీష్ వ్యతిరేకతను పెంపొందించుట పత్రికల పాత్ర ఎంతైనా ఉంది.

పత్రికలు ప్రజలలో రాజకీయ విద్యను పెంపొందించినవి. కేవలం పత్రికల ఫలితంగా కలకత్తాకు చెందిన ఈశ్వరచంద్ర విద్యాసాగర్, బొంబాయికి చెందిన దాదాబాయ్ నౌరోజీ, ఆలీఘర్‌కు చెందిన సయ్యద్ అహమ్మద్‌ఖాన్ జాతీయస్థాయి నాయకులు కాగిలిగిరి.

ఈ కాలం నాటి ముఖ్య పత్రికలు ఏవనగా

**బెంగాల్ :** ది హిందూ, పాట్రియాట్(ఆంగ్ల పత్రికలు, అమృతబజార్ పత్రిక, (ఆంగ్ల, బెంగాలీ)

**బొంబాయి :** మరాఠి (ఆంగ్లం), కేసరి (మరాఠి)

**మద్రాస్ :** ది హిందు (ఆంగ్లం), స్వదేశీమిత్రన్ (తమిళం) కేరళపత్రిక (మళయాళం)

**ఉత్తరప్రదేశ్ :** ది అడ్వకేట్ (ఆంగ్లం) అజాద్ (ఉర్దూ) హిందూస్థాన్; భారత్‌జీవన్ (హింది)

**పంజాబ్ :** దిట్రిబ్యూన్ (ఆంగ్లం) కోహినూర్, అక్బరీ-ఇ-ఆమ్ (ఉర్దూ)

పత్రికలు ప్రజలలో జాతీయ భావాలను, రాజకీయ చైతన్యంను పెంపొందించుటలో ప్రముఖపాత్ర పోషించినవి.

## 59.6 పునరుజ్జీవనం:

ఐరోపా పండితులైన మాక్స్‌ముల్లర్ జేమ్స్‌ప్రిన్సిప్, మోనార్ విలియం, సర్‌విలియం జోన మొదలైనవారు భారతీయులైన ఆర్.జి.భండార్కర్, దయానంద సరస్వతి, స్వామి వివేకానంద, మొదలగువారు పూర్వ భారతీయ వారసత్వాన్ని సమకాలీన సమాజానికి వివరించి చైతన్యవంతులుగా చేయుటకు గొప్ప కృషి చేసిరి.

ఆంగ్లేయులు అనుసరించిన జాత్యంహంకార విధానాలు భారతీయుల ఆత్మాభిమానంను దెబ్బతీసెను. స్వపరిపాలనకు భారతీయులు అనర్హులు అను ఆంగ్లేయుల నమ్మకం భారతీయులను కించపరచెను. ఈ విధంగా అసంతృప్తికి లోనైన భారతీయులను సాంఘిక, మత సంస్కర్తలు చైతర్యపరిచిరి. 19వ శతాబ్ది ప్రారంభంనుండి మొదలైన ఈ సంఘ సంస్కరణ ఉద్యమాలు జాతీయ స్వభావముతో ప్రజలను జాగృతపరచెను. ఈ సంస్కర్తలు ప్రజలలో దేశభక్తిని ప్రేరేపించిరి. ఆర్యసమాజంను స్థాపించిరి. దయానంద సరస్వతి వేదాలు విజ్ఞాన సర్వస్వాలని చాటెను. ఈతని సిద్ధాంతాలు

స్వదేశీ భావనకు పునాదులు వేసినవి. దయానందునికి పూర్వమే నవయుగ వైతాళికునిగా భారత పునరుజ్జీవన పితామహునిగా ఖ్యాతిగాంచిన రాజారామ్మోనరాయ్ భారతీయ సమాజాన్ని సంస్కరించుటకు గొప్పకృషి చేసెను. హిందూ–ముస్లిం సంబంధాలను గురించి సయ్యద్ అహమ్మద్‌ఖాన్ అనేక ఉపన్యాసములను ఇచ్చెను. భారతీయుల ఔన్నత్యంను గురించి స్వామివివేకానందుడు ప్రపంచానికి తెలియచేసి దేశీయులలో ఆత్మవిశ్వాసంను పెంపొందించెను.

కాలక్రమేణా భారతీయులు ఆధ్యాత్మిక భారతీయ సంస్కృతి పాశ్చాత్య భౌతిక సంస్కృతికన్నా గొప్పదని విశ్వసించసాగిరి. భారతీయులలో స్వాభిమానం పెంపొందెను. విదేశీ పాలన వలన కలుగు నష్టాలను తెలుసుకొనిరి. ఫలితముగా వైభవమును తెలుసుకొనుట వలన పై ప్రయోజనాలే గాక కొన్ని నష్టాలు సైతము సంభవించినవి. తదనంత కాలంలో కొంతమంది అతిజాతీయవాదులు గుడ్డిగా దేశ గత వైభవాన్ని కీర్తించుచూ అందలి వెనుకబాటుతనమును బలహీనతలను విస్మరించిరి. పరోక్షంగా ఈ అతిజాతీయత తదనంతర కాలంలో దారుణ మతతత్వ ధోరణులు బలపడుటకు దోహదపడినవి.

సాంఘిక, మత ఉద్యమాలు ప్రజలలో దేశభక్తిని పెంపొందించినవి. ప్రజలలో చైతన్యం కలిగించి స్వతంత్ర భావాలను పెంపొందించినవి.

## 59.7 ఉద్యోగ సదుపాయాలు :

ఇచ్చిన హామీలను ఆంగ్లేయులు విస్మరించుట, విద్యావంతులైన భారతీయులకు ఉన్నత ఉద్యోగాలను నిరాకరించుట భారతీయులలో జాతీయతా భావాలు పెంపొందుటకు ముఖ్యకారణమయ్యెను. ఇందుకు వయస్సు అభ్యంతరముగా అరవిందఘోష్‌ను, గుర్రపు స్వారి రానందున సురేంద్రనాద్ బెనర్జీ ఇండియన్ సివిల్ సర్వీసులకు అనర్హులుగా ప్రకటించుటను గమనించవలెను. 1858లో చేసిన విక్టోరియా మహారాణి ప్రకటన, 1813 చార్టర్ చట్టములలో ఇచ్చిన హామీల ప్రకారం జాతి, కుల, మత ఆధారంగా ఉద్యోగ అవకాశాలు నిరాకరించబడవు అను విషయమును ఆంగ్ల ప్రభుత్వం పూర్తిగా విస్మరించెను. సివిల్ సర్వీస్ ఉద్యోగాలలో భారతీయులను ఎంపిక చేయుటకు ఆంగ్ల ప్రభుత్వం పూర్తిగా విముఖత చూపెను. సివిల్ సర్వీస్ పరీక్ష కేవలం ఇంగ్లాండ్‌లోనే జరిగెడిది. ఈ పరీక్షకు వయోపరిమితి కేవలం 21 సంవత్సరములుగా నిర్ణయించిరి. కాని ఈ పరిమతిని లిట్టన్ కాలంలో 19 సంవత్సరాలకు తగ్గించిరి. దీని ఫలితంగా సివిల్ సర్వీస్ ఉద్యోగవకాశాలు భారతీయులకు పూర్తి మృగ్యమయ్యెను.

ఆంగ్లేయులు ఆధిపత్య ధోరణి, వివక్ష విధానాలు భారతీయులను తీవ్ర అసహనానికి గురిచేసినవి. ఈ అసహనాన్ని వ్యక్తపరచుటకు విద్యావంతులైన భారతీయులు తమ ప్రయత్నాలు చేసిరి. ఇందులో భాగమే సురేంద్రనాద్ బెనర్జీ ఇండియన్ అసోసియేషన్‌ను స్థాపించెను. సివిల్ సర్వీస్ వివాదంపై జాతీయస్థాయిలో ఉద్యమించుటకు చేసిన ప్రయత్నాలలో మొట్టమొదటిది.

విద్యావ్యాప్తి ఫలితంగా క్రమముగా అనేక మంది భారతీయులు పత్రికా వ్యాసంగము, న్యాయవాద, ఉపాధ్యా వృత్తులలో ప్రవేశించిరి. ఆంగ్లేయులు ప్రదర్శింఇన అహంకార విధానాలు భారతీయులలో జాతీయ భావాలను మరింత పెంపొందించినవి.

## 59.8 జాతి అహంకారం, వివక్ష విధానాలు :

1857 తిరుగుబాటు తదనంతరం ఆంగ్లేయులలో జాతి అహంకార ధోరణులు అధికమయ్యెను. భారతీయులపై వారు ఏహ్యాభావమును ప్రదర్శించిరి. ఆంగ్లేయులు తమ నివాసాలను భారతీయులకు దూరంగా వేరుగా నిర్మించుకొనిరి. వారి క్లబ్‌లలో భారతీయులకు ప్రవేశం లేదు. వారితో సమానంగా భారతీయులు రైళ్ళలో ప్రయాణించుటకు వీలులేదు. వారికి సేవలను అందించు భారతీయులను హీనంగా చూచెడివారు. ఇటువంటి విధానాల ఫలితంగా అనేక ప్రాంతాలలో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా తిరుగుబాట్లు సైతము జరిగినవి. కాని ఇటువంటి తిరుగుబాట్లను ఆంగ్ల ప్రభుత్వం దారుణముగా అణిచివేసెను. ఉదాహరణకు 1872లో మాలెర్‌కోట్లలో 49మంది శిక్కులను ఎటువంటి విచారణ లేకనే కాల్చిచంపిరి. న్యాయపాలనలో సైతము ఈవివక్షతను ప్రదర్శించిరి. ఒకే తరహా నేరం చేసిన భారతీయునికి కఠినశిక్షను, తెల్లవారికి తేలికపాటి శిక్షను ఇచ్చెడివారు. భారతీయులు తమదేశంలో తాము బానిసల వలె జీవించవలసి వచ్చెను. ఇటువంటి అవమానకర పరిస్థితులు ప్రజలను ఏకం చేయుటలో ప్రధానపాత్ర పోషించినవి.

### పాఠ్య ప్రశ్నలు 59.ఎ

1. భారత జాతీయోద్యమంపై ఆంగ్లేయులు ప్రవేశపెట్టిన ఆధునిక రవాణా, వార్తా సాధనాలు ఏవిధమైన ప్రభావంను చూపినవి.
2. భారతదేశంలో ఆంగ్ల విద్యను ప్రవేశపెట్టుటలో బ్రిటీష్‌వారి ఉద్దేశ్యములు ఏవి?
3. బెంగాల్, బొంబాయి నుండి ముద్రించబడిన ఆంగ్ల పత్రికలు ఏవి?
4. 19వ శతాబ్దిలో జరిగిన సాంఘిక, మత ఉద్యమాలు ఏల జాతీయ ఉద్యమాలుగా పిలువబడినవి?
5. సివిల్ సర్వీస్ ఉద్యోగాల నుండి భారతీయులను దూరం చేయుటకు ఆంగ్ల ప్రభుత్వం చేపట్టిన చర్యలు ఏవి?
6. ప్రపంచమంతా జాతివివక్ష విధానంను వ్యతిరేకింపగా ఏ దేశం ఈ విధానాన్ని కొనసాగించెను.

## 59.9 తక్షణ కారణాలు :

1870నాటికి భారతజాతీయ భావాలు పూర్తిగా బలపడి జాతి శక్తివంతముగా రూపొందినను లిట్టన్ ప్రవేశపెట్టిన ప్రజావ్యతిరేక విధానాలకు లేక ఇల్బర్ట్‌బిల్‌ను తిరస్కరించిన ఆంగ్ల నైజానికి వ్యతిరేకంగా నేరుగా ఎటువంటి చర్యలు తీసుకొనలేకపోయెను. 1885లో కాంగ్రెస్ స్థాపన నుండి జాతీయోద్యమ సంఘటితంగా నిర్దిష్టమైన ప్రణాళికలో సాగుట ప్రారంభమయ్యెను. దీనికి సంబంధించిన మరిన్ని వివరాలను అధ్యయనము చేద్దాము.

లిట్టన్ పాలించిన నాలుగు సంవత్సరాల (1876–80) పాలనాకాలం అనేక భారత వ్యతిరేక చర్యలతో సాగెను. భారతీయుల మనోభావాలను లిట్టన్ ఎంతమాత్రం పరిగణలోనికి తీసుకొనలేదు. ఇంగ్లండ్‌లోని నూలుమిల్లుల యజమానులకు అనుకూలంగా ఇతడు భారత వ్యతిరేక విధానాలను అవలంభించెను. లిట్టన్ విధానాలు భారతీయులలో జాతీయ భావాలను మరింత బలోపేతం చేసి ఉద్యమము దేశవ్యాప్తంగా విస్తరించుటకు మార్గం సులభతరమయ్యెను. భారతదేశం తీవ్ర కరువులతో ఇబ్బందులకు ఎదుర్కొనుచుండగా లిట్టన్ అనవసరంగా ఆఫ్ఘన్ యుద్ధము చేయుట, లేని

రష్యా యుద్ధభయాన్ని ప్రచారం చేయుట, ఇంగ్లాండ్ కైజర్-ఇ-హింద్ బిరుదును స్వీకరించిన సందర్భంలో ఆడంబరంగా ఢిల్లీ దర్బార్‌ను ఏర్పాటు చేయుట మొదలగు లిట్టన్ చర్యలను భారతీయులు తీవ్రముగా ఏవగించుకొనిరి.

అంతేకాక లిట్టన్ 1878లో భారతీయులు ఆయుధాలు ధరించుటపై లైసెన్సింగ్ విధానాన్ని రూపొందించెను. దీనినుండి ఐరోపా వాసులను మినహాయించెను. లిట్టన్ అనుసరించిన జాతి వ్యతిరేక విధానాలలో 1878లో చేసిన ప్రాంతీయ భాషా పత్రికల నిషేధచట్టము పరాకాష్ఠ. దీనిని భారతీయులు తీవ్రముగా గర్హించిరి. ఈ చట్టము నుండి ఆంగ్ల పత్రికలను మినహాయించెను. 1878లోనే సివిల్ సర్వీస్ పరీక్షలకు హాజరగు అభ్యర్థుల వయోపరిమితిని 21 నుండి 19కి తగ్గించెను. దీని ఫలితం సివిల్ సర్వీస్ అవకాశాలకు భారతీయులు మరింత దూరమైరి. ఈ చర్యను విద్యావంతులైన భారతీయులు నిరసించిరి. ఈ సందర్భముగా సురేంద్రనాద్ బెనర్జీ ఒక బ్రహ్మాండమైన ఉద్యమాన్ని నడిపెను. ఈవిధంగా లిట్టన్ చర్యలు భారతీయులలో జాతీయభావాలు పెంపొందుటకు చాలావరకు దోహదపడినవి. లిట్టన్ తదనంతరము రాజప్రతినిధిగా వచ్చిన రిప్పన్ భారతీయ మెజిస్ట్రేట్‌లకు తెల్లజాతి ముద్దాయిలను విచారించు అధికారాలను కల్పించుచూ ఒక చట్టంను తెచ్చుటకు ప్రయత్నించెను. ఈ బిల్లునే ఇల్బర్ట్ అనిపిలిచిరి. (ఈ బిల్లును రిప్పన్ న్యాయ సలహాదారుడు పి.ఇ.ఇల్బర్ట్ రూపొందించెను) కాని ఈ బిల్లును తెల్లవారు వ్యతిరేకించిరి. ఎంతటి ఉన్నత విద్యావంతులైనను భారతీ న్యాయమూర్తులు తెల్లవారిని విచారించుటకు అనర్హులని బ్రిటీష్‌వారు అభిప్రాయపడిరి. చివరికి ఆంగ్ల ప్రభుత్వం ఈ విషయములో ఐరోపావాసులకు అనుకూలంగానే వ్యవహరించి విమర్శలకు గురయ్యెను. ఈ చర్యతో భారతీయులు తీవ్ర అసంతృప్తికి లోనై ఆంగ్లేయుల జాత్యాహంకార విధానాలను ఏవగించుకొనిరి. ఇల్బర్ట్ బిల్ విధానం భారతీయులను సంఘటిత పరచుటలో ప్రముఖపాత్ర పోషించెను.

ఇల్బర్ట్ బిల్ విషయంలో రిప్పన్ వైఫల్యం కొంతమేరకు సివిల్ సర్వీస్ వయోపరిమితిని పెంచుట ద్వారా కొంత మేరకు ప్రజల మెప్పును సంపాదించుటలో సఫలమయ్యెను. తుదకు 1815 డిశంబర్‌లో అఖిల భారత స్థాయిలో ఉద్యమవేదికగా జాతీయకాంగ్రెస్ స్థాపన ద్వారా ఉద్యమము నిర్దిష్టరూపు దిద్దుకొనెను.

ఇల్బర్ట్ బిల్ విధానం జాతీయస్థాయిలో భారతీయులు ప్రయోజనాలను రక్షించుకొను దిశలో ఉద్యమం రూపాంతరం చెందుటకు తక్షణకారణమయ్యెను.

## పాఠ్య ప్రశ్నలు 59.బి

1. లిట్టన్ చేపట్టిన భారత జాతివ్యతిరేక చర్యలను పేర్కొనుము.
2. 1877-78 సంవత్సరాల మధ్యకాలంలో సురేంద్రనాద్ బెనర్జీ ఏ విషయంపై జాతీయస్థాయిలో ఉద్యమాన్ని నడిపెను.
3. ఇల్బర్ బిన్ వివాదం నుండి భారతీయులు ఎటువంటి గుణపాఠాలను నేర్చుకొనిరి?

## సారాంశం :

19వ శతాబ్ది రెండవ భాగంలో భారతీయ జాతీయతాభావాల త్వరితగతిలో వృద్ధిచెందినది. దీనికి ప్రధానంగా బ్రిటీష్‌పాలనా స్వభావం ముఖ్యకారణం. భారతీయులు ఇండియన్ ఆంగ్లేయులు తమ స్వంతదేశంగా భావింపలేదని, దేశ సంపదను తరలించుకొను పోవుటయే వారి లక్ష్యమని గ్రహించగలిగిరి. దీని ఫలితంగా విదేశీ పాలనకు ముగింపు చెప్పవలెనను ఆలోచనలు భారతీయులలో ప్రవేశించినవి.

నూతన భారతదేశంను ఆవిష్కరించుటలో ఆధునిక రవాణా వార్త సాధనాలు, ఇంగ్లీషు విద్య, ఇతర ఆధునిక భావాలు తోడ్పడినవి. తమ ప్రయోజనాలను తమ సామ్రాజ్యంను పరిరక్షించుకొనుటకే ఆంగ్లేయులు ఆలోచింపసాగిరి. జాతీయనాయకులు దేశవ్యాప్తంగా పర్యటించి ఆంగ్లపాలన ఫలితాలను ప్రజలకు వివరించి వారిని చైతన్యవంతులను చేయుటలో సఫలీకృతులైరి. దేశంలోని ప్రాంతీయ భాషాపత్రికలు, ఇతర సాహిత్యాలు జాతీయతా భావవృద్ధికి దోహదపడినవి.

ఆంగ్లేయులను వ్యతిరేకించే స్థాయికి భారతీయులను బలోపేతం చేయుటలో 19వ శతాబ్ది సంఘసంస్కరణ ఉద్యమాలు ఎంతగానో ఉపకరించినవి. విదేశీ పాలన భారతీయ సంస్కృతిని దిగజార్చుటకు, స్వాభిమానంను దెబ్బతీయుటకు పలు ప్రయత్నాలు చేయసాగినవి. ఇటువంటి కుట్రలను బ్రహ్మసమాజం, ఆర్యసమాజం, రామకృష్ణ మఠాలు మొదలగు సంస్థలు ప్రతిఘటించుటయే గాక ప్రజలను జాగృతి చేయసాగినవి. ఈ సంస్థలన్నీ స్వతంత్ర భారతదేశాన్ని గురించిన ఆలోచనలను ప్రజలలో రేకెత్తించినవి.

భారతీయులకు ఆంగ్లేయులు ఇచ్చిన హామీలను విస్మరించుట ఫలితంగా ప్రజలలో బ్రిటీష్ పాలకులపై విశ్వాసము సన్నగిల్లెను. అనేకమంది విద్యావంతులైన భారతీయులకు ఉపాధి కరవయ్యెను. ప్రతిస్థాయిలో వివక్ష విధానాలు స్పష్టంగా అమలు చేయబడినవి. సివిల్ సర్వీస్ సంస్కరణ ప్రాంతీయ భాషాపత్రికల చట్టం ఇల్బర్‌బిల్ వివాదం మొదలగు అంశాలన్నీ భారతీయుల కన్నా తామే అధికులమను భావన ఆంగ్లేయులు ప్రదర్శించసాగిరి.

బ్రిటీష్‌వారి భారత వ్యతిరేక విధానాలను తిరస్కరించుచూ  సురేంద్రనాద్ బెనర్జీ 'ఇండియన్ ఆసోసియేషన్'ను నెలకొల్పెను. 1885లో భారత జాతీయ కాంగ్రెస్ అవతరించెను.

**పాఠ్య ప్రశ్నలు :**

1. పాశ్చాత్య ఆలోచనలు, విద్యావిధానాలు ఏవిధంగా భారత జాతీయోద్యంను ప్రభావితం చేసినవి.
2. ఇల్బర్ట్ బిల్ వివాదం అనగా ఏమి?
3. భారత జాతీయోద్యమం ఏవిధంగా భారత ప్రజల ప్రయోజనాలకు బ్రిటీష్ జాతికి జరిగిన ఘర్షణ ఫలితమని చెప్పవచ్చును.
4. క్రింది వాక్యాలను చదివి ఇవ్వబడిన ప్రశ్నలకు సమాధానాలు వ్రాయుము.

' 'లిట్టన్ అనుసరించిన చర్యలకు ప్రతిచర్యలుగా భారతీయులు చేపట్టిన చర్యలు ప్రజాజీవితాన్ని సంఘటితపరచినవి. రాజకీయ ప్రగతి కారణంగా సమైక్య జీవనానికి అనుకూలంగా మలచుటకు, సుదీర్ఘ పోరాటానికి అనుకూలముగా మార్చెదరు"

1. లిట్టన్ పాలనాకాలం ఏవిధంగా జాతి వ్యతిరేక కాలంగా అభివర్ణించబడెను? అతని విధానాలకు ఉదాహరణలనిమ్ము.
2. లిట్టన్ ప్రవేశపెట్టిన విధానాలను విద్యావంతులైన భారతీయులు ఏవిధముగా నిరసించిరి?

# 60

# భారత జాతీయోద్యమము (1885-1905)

## 60.1 పరిచయం :

19వ శతాబ్ది ద్వితీయ భాగంలో భారతీయులలో రాజకీయ చైతన్యం పెంపొందుటకు దోహదపడిన వివిధ అంశాలను గత పాఠంలో అధ్యయనం చేయుట జరిగెను. ఆంగ్ల పాలన నందలి వాస్తవ స్వభావమును అవగాహన చేసుకున్న భారతీయులు తామంతా సంఘటితమై పలు సంస్థలను ఏర్పాటు చేసుకొని ఉద్యమించుటకు సిద్ధమైరి. క్రీ.శ.1857లో తొలిసారిగా ఆంగ్లేయులను ఎదిరించి పోరాడిన భారతీయులు పిమ్మట క్రీ.శ.1859-60లో నీలిమందు తోటల యజమానులకు వ్యతిరేకంగా పోరాడి తమ సత్తాను చూపిరి. క్రీ.శ.1875లో రైతులకు అశాంతి మహారాష్ట్రనందలి అహమ్మద్‌నగర్, పూనాలలో ఉద్యమం రూపుదాల్చెను. రైతులే కాక కొన్ని గిరిజన వర్గాలు, నగరాలలోని ఉన్నత వర్గాలు సైతం తమ నిరసనను తిరుగుబాట్ల రూపంలో వ్యక్తపరిచిరి. విద్యావంతులైన భారతీయ మేధావులు బ్రిటీష్ సామ్రాజ్య వాద విధానాలను, ఆర్థిక దోపిడీ వ్యతిరేకించిరి. ఆంగ్లేయులు పెంచిన పన్నులను, పత్రికలపై ఆంక్షలను, విద్యా విధానాలను, లోపించిన ఉపాధి సౌకర్యాలను, ఆంగ్లేయ జాత్యాంహకారంను తీవ్రముగా భారతీయులు నిరసించిరి. భారతీయులు ప్రజాస్వామ్యానికి అనర్హులని ఆంగ్లేయులు చేసిన ప్రకటన భారతీయుల తీవ్ర ఆగ్రహానికి కారణమయ్యెను.

క్రీ.శ.1885లో 72 మంది రాజకీయ ప్రతినిధులతో భారత జాతీయ కాంగ్రెస్ అవతరించెను. జాతీయ స్థాయిలో అవతరించిన తొలి వేదిక కాంగ్రెస్. నూతన జాతీయ చైతన్యానికి రాజకీయ ఆలోచనలకు కాంగ్రెస్ ప్రతీకగా భావించబడెను. 1885 నుండి కాంగ్రెస్ కొద్దికాలంలోనే ఒక సామాన్య వేదిక స్థాయినుండి ఉద్యమ సంస్థగా మారి దేశంలోని భిన్న వర్గాల ప్రజలను, భిన్న సిద్ధాంతాల నాయకులను కలుపుకొనగలిగింది. ఈ కాలంలో భారతదేశం ఒక నూతనజాతిగా రూపాంతరం చెందగలిగెను. విస్తృతపునాదిపై నిర్మించబడిన జాతీయోద్యమం ప్రపంచ చరిత్రలోనే అతిపెద్ద ప్రజా పోరాటంగా ప్రసిద్ధి చెందెను. మొదటి భాగంలో తొలి 20 సంవత్సరముల (1885-1905) జాతీయోద్యమంను అధ్యయనం చేద్దాము. కాంగ్రెస్ స్థాపన, దాని లక్ష్యాలు, విధానాలు, కాంగ్రెస్ యెడల బ్రిటీష్ వైఖరిని ఈ పాఠములో అధ్యయనము చేద్దాము.

## 60.2 లక్ష్యాలు

ఈ పాఠంను అధ్యయనం చేసిన పిమ్మట క్రింది అంశాల యెడల పూర్తి అవగాహన ఏర్పడును.

1. కాంగ్రెస్ స్థాపనకు ముందుగల సామాజిక, రాజకీయ సంస్థలు
2. కాంగ్రెస్ స్థాపనలో విద్యావంతులైన భారతీయులు చేసిన కృషి
3. 1885-1905 మధ్యకాలంలో కాంగ్రెస్ ఆశయాలు
4. కోర్కెల సాధనకొరకు జాతీయవాదులు అనుసరించిన విధానాలు
5. కాంగ్రెస్ యెడల బ్రిటీష్ వైఖరి
6. తొలితరం జాతీయవాదులు జాతీయోద్యమానికి చేసిన కృషి

## 60.3 తొలి రాజకీయ సంస్థలు:

కాంగ్రెస్ స్థాపనకు పూర్వమే దేశంలో అనేక సామాజిక, రాజకీయ సంస్థలు ఆవిర్భవించినవి. ప్రారంభంలో ఇటువంటి సంస్థలు సమాజంనందలి ఒక వర్గంవారి ప్రయోజనాల కొరకు ఏర్పడినవి. ఈ సంస్థలకు జాతీయస్థాయిలో ప్రాధాన్యత లోపించింది ఇవి సమాజంలోని అన్ని వర్గాల ప్రయోజనాలకు గురించి ఆలోచింప లేకపోయినవి. వీటి పనితీరు క్లుప్తముగా పరిశీలించి ఈ విషయం స్పష్టమగును.

భారతదేశంలో రాజకీయ ఉద్యమాలకు నాంది పలికిన తొలివ్యక్తి రాజారామ్మోహనరాయ్. భారతీయుల సమస్యలను ఆంగ్లేయుల దృష్టికి తీసుకొని వచ్చి వాటిని పరిష్కరింపవలసినదిగా ఇతడు ప్రభుత్వాన్ని కోరెను. క్రీ.శ.1818లో భూస్వాముల సమాజంను రాయ్ స్థాపించి భూస్వాముల ప్రయోజనాలను పరిరక్షించుటకు ప్రయత్నించెను. సంఘటితమైన రాజకీయ వ్యవస్థలు ఏర్పాటుకు, రాజ్యాంగబద్దమైన ఉద్యమాలకు ఈ పరిణామం నాంది అనిచెప్పవచ్చును. క్రీ.శ.1843లో బ్రిటీష్ ఇండియన్ సొసైటీ అను మరొక రాజకీయ వేదిక బెంగాల్‌లో స్థాపించడి సామాన్య ప్రజల సమస్యలను ప్రభుత్వ దృషిటకి తీసుకొని వచ్చు ప్రయత్నం చేసెను. పై రెండు సంస్థలు క్రీ.శ.1851 నాటి విలీనమై బ్రిటీష్ ఇండియన్ అసోసియేషన్‌గా ఏర్పడెను. 1852లో మద్రాస్ నేటివ్ అసోసియేషన్, బొంబాయి అసోసియేషన్‌లు స్థాపించబడినవి.

ఈ కాలంలో నెలకొల్పబడిన సంస్థలలో సమాజంనందలి ప్రముఖ వ్యక్తులు ధనికవర్గం ప్రముఖపాత్ర పోషించిరి. ఇటువంటి సంస్థలు స్థానిక, ప్రాంతీయ స్వభావము కలిగి ఉండెను. భారతీయులను పాలనా విధానములలో, విద్యావ్యాప్తిలో మమైకం చేయుటకు ఈ సంస్థలు కృషి చేసెను. భారతీయుల కోర్కెలను ఫిర్యాదుల రూపంలో బ్రిటీష్ పార్లమెంట్‌కు సమర్పించెడివారు.

క్రీ.శ.1857 తదనంతరం విద్యావంతులైన భారతీయులకు బ్రిటీష్ ఇండియా పాలనావ్యవస్థకు మధ్యదూరం క్రమంగా అధికమయ్యోను. బ్రిటీష్ విధానాల యెడల భారతదేశ మేధావి వర్గము మరింత కఠిన వైఖరిని అవలంబింపసాగెను. వీరు ఆంగ్లేయ దోపిడి విధానాలను స్పష్టంగా అర్థం చేసుకొనిరి. క్రీ.శ.1860-1870 మధ్యకాలంలో భారతీయ సమాజం అనేక మార్పులకు చేర్పులకు లోనయ్యెను. ప్రజాదరణ పొందిన వేదికలు నానాటికి బలపడినవి.

ఈ సంస్థలు విద్యావంతులైన భారతీయుల లక్ష్యాల సాధనకు మార్గాలుగా నిలిచినవి.

క్రీ.శ.1866లో దాదాబాయ్ నౌరోజి లండన్‌లో 'ఈస్ట్ ఇండియా అసోసియేషన్'ను స్థాపించెను. భారతీయుల సమస్యలను ఈ సంస్థ ప్రధానంగా చర్చించెను. పిమ్మట ఈ సంస్థ శాఖలు భారతదేశంలో అనేక నగరాలలో నెలకొల్పబడినవి. క్రీ.శ.1870లో ఎం.జి రనడే ప్రజల మనోభావాలను ప్రభుత్వ దృష్టికి తీసుకొని వెళ్ళు లక్ష్యంతో పూనా సార్వజనీక మహాసభను స్థాపించెను. గొప్ప తత్వవేత్త, మార్గదర్శి అయిన రనడే నాయకత్వములో ఈ సభ గొప్ప ప్రజాభిప్రాయ వేదికగా పనిచేసెను. క్రీ.శ.1881లో మద్రాస్ మహాజన సభ అను రాజకీయ వేదిక వెలుగులోనికి వచ్చెను. క్రీ.శ.1885లో ఫిరోజ్‌షామెహత, కె.జె.తెలంగ, బద్రుద్దీన్ త్యాబ్జిల కృషి ఫలితముగా బొంబాయి ప్రెసిడెన్సి అసోసియేషన్ స్థాపించబడెను. ఈ సంస్థలన్ని ఆంగ్లేయుల వివక్ష విధానాలను, లోపభూయిష్టమైన చట్టాలను వ్యతిరేకించినవి.

కాంగ్రెస్ స్థాపనకు పూర్వం దేశంలో నెలకొల్పబడిన ప్రధాన జాతీయ వేదికగా కలకత్తాలో స్థాపించబడిన ఇండియన్ అసోసియేషన్‌ను చెప్పవచ్చును. ఈ సంస్థ విధి విధానాలలో దాదాపు కాంగ్రెస్‌కు చాలా దగ్గరి పోలికలను కలిగియుండెను. ఈ సంస్థ స్థాపనలో సురేంద్రనాద్ బెనర్జీ ప్రధాన సూత్రదారి. ఆనందమోహన్ బోస్, ద్వారకానాద్ గంగూలి మొదలగు వారి సహకారంతో సురేంద్రనాద్ బెనర్జీ ఇండియన్ అసోసియేషన్‌ను క్రీ.శ.1876 జులై 26న స్థాపించిరి. ఉమ్మడి లక్ష్యసాధనకొరకు, భారతీయులను సమైక్యపరచుటకు, జాతికి ఉపకరించు రాజకీయ వేదికగా తీర్చిదిద్దుటయే దీని లక్ష్యం.

గత పాఠంలో సివిల్ సర్వీస్ పరీక్షల వయో పరిమితిని 21 నుండి 19కి తగ్గించిన విషయమును గమనించియున్నాము. ఇండియన్ అసోసియేషన్ ఈ నిర్ణయాన్ని తీవ్రంగా వ్యతిరేకించి దేశవ్యాప్తంగా దీనికి వ్యతిరేకంగా ప్రజలను ఏకం చేయుటకు ప్రయత్నించెను. క్రీ.శ.1877-78 సంవత్సరముల మధ్య సురేంద్రనాద్ విస్తృతంగా దేశపర్యటన చేసి ఈ విషయములో ప్రజలను జాగృతపరచెను. ఇండియన్ అసోసియేషన్ లిట్టన్ చేసిన ఆయుధ చట్టమును, ప్రాంతీయ భాషా పత్రికల నిషేధ చట్టాలను సైతం తీవ్రంగా విమర్శించెను. ఇండియాలో బ్రిటీష్‌వారి యజమాన్యంలోని తేయాకు తోటలలో పనిచేయుచున్న భారతీయుల స్థితి గతులను మెరుగు పరచుటకు ఇండియన్ అసోసియేషన్ కృషి చేసెను. ఈ సంస్థ శాఖలు బెంగాల్‌లో మాత్రమే కాక వెలుపల భారతదేశంలో అనేక ప్రాంతాలలో నెలకొల్పబడినవి. కాని ఈసంస్థ క్రీ.శ.1886నాటికి జాతీయకాంగ్రెస్‌లో విలీనమయ్యెను.

ఈ విధముగా క్రీ.శ.1875-85 సంవత్సరముల మధ్య నూతన రాజకీయ పరిణామాలు అనేకం చోటుచేసుకొనెను. విప్లవ భావాలు గల యువకులు రాజకీయాలలో చేరిరి. పాత రాజకీయ ఆలోచనల స్థానంలో నూతన ఆలోచనలు ప్రవేశించినవి. వీటికితోడు జాతీయ పత్రికలు సైతం రాజకీయ కార్యక్రమాలను ప్రజలలో వేగవంతం చేయుటలో చురుకైన పాత్రను పోషించినవి. ఇటువంటి పత్రికలలో దిహిందూ, ట్రిబ్యూన్, బెంగాలి, మరుధ, కేసరి మొదలగునవి ముఖ్యమైనవి. నేటికి ఇండియన్ అసోసియేషన్ జాతీయ స్థాయిలో ప్రాముఖ్యతను సంతరించుకొనెను.

| క్రీ.శ.1885లో జాతీయ కాంగ్రెస్ స్థాపన ఆకస్మికంగా సంభవించిన చారిత్రక సంఘటన కాదు. దేశంనందలి రాజకీయ చైతన్యం ముఖ్యంగా, క్రీ.శ.1860-1870 మధ్యకాలంలో వెలుగులోనికి వచ్చిన వివిధ వేదికల అంతిమ రూపకల్పనగా కాంగ్రెస్ అవతరించెను. |
|---|

## పాఠ్య ప్రశ్నలు 60.ఎ

1. క్రింది ప్రశ్నకు ఇవ్వబడిన సమాధానాలలో సరిఅయిన దానిని గుర్తించుము.

A. కాంగ్రెస్‌కు ముందు స్థాపించబడిన సంస్థలలో క్రిందివానిలో వేటి కార్యక్రమాలను కాంగ్రెస్‌తో పోల్చదగినదిగా చెప్పవచ్చును.

i) బ్రిటీష్ ఇండియా అసోసియేషన్

ii) పూనా సార్వజనీక మహాసభ

iii) ఇండియన్ అసోసియేషన్

iv) బొంబాయి ప్రెసిడెన్సీ అసోసియేషన్

B. 1830–1840 సంవత్సర మధ్యకాలంలో స్థాపించబడిన సంస్థలు ఈ లక్షణంను ప్రధానంగా కలిగి ఉన్నవి.

i). సంకుచిత, స్థానిక లక్షణములను కలిగి ఉన్నవి.

ii) జాతీయ స్థాయిలో అత్యంత ప్రజాధరణను పొందినవి.

iii). రాజకీయ లక్షణాలతో వర్గప్రాతిపదికపై ఉండెడివి.

iv) వీటి ప్రాధాన లక్ష్యం సాంఘిక, మత సంస్కరణలు

2. ఇండియన్ అసోసియేషన్ ఏ విషయమై అఖిల భారత స్థాయిలో నిరసన ప్రారంభించెను?

3. 1830 నాటి సంస్థలు 1860 కాలంలో వచ్చిన సంస్థలకు భిన్నమైనవి.

## 60.4 భారత జాతీయ కాంగ్రెస్ స్థాపన :

భారతదేశంనందలి బ్రిటీష్ పాలిత రాష్ట్రాలలో ప్రారంభమైన రాజకీయ కార్యకలాపాల ఫలితంగా జాతీయస్థాయిలో ఒక రాజకీయవేదిక ఏర్పాటుకు దారితీసెను. దేశమునందలి వివిధ ప్రాంతాలలోని నాయకులందరు జాతీయస్థాయిలో ఒక రాజకీయ వేదిక ఆవశ్యకతను గుర్తించిరి. ఆంగ్లేయుడైన ఏ.ఓ.హ్యూమ్ అను సివిల్ సర్వీస్‌కు పదవీ విరమణ చేసిన అధికారి భారతీయ నాయకులను కలుపుకొని కాంగ్రెస్ స్థాపనకు కృషి చేసెను. భారత జాతీయ కాంగ్రెస్ తొలి సమావేశం క్రీ.శ. 1885 డిశంబర్‌లో బొంబాయి నగరంలో డబ్ల్యు.సి.బెనర్జీ అధ్యక్షతన జరిగెను. ఈ సమావేశానికి దేశ వివిధ ప్రాంతాల నుండి 72 మంది ప్రతినిధులు పాల్గొనిరి. ప్రముఖ జాతీయ నాయకుడైన సురేంద్రనాథ్‌బెనర్జీ ఇండియన్ అసోసియేషన్ ఆధ్వర్యంలో 'ఇండియన్ నేషనల్ కాన్ఫరెన్స్' ఏర్పాటులో ఉన్నందున కాంగ్రెస్ సమావేశంలో పాల్గొనలేదు.

జాతీయ కాంగ్రెస్ అఖిల భారత జాతీయ సంస్థగా అవతరించెను. దేశంలో పెంపొంది, జాతీయ, రాజకీయ చైతన్యానికి కేంద్రంగా భారత జాతీయ కాంగ్రెస్ అవతరించెను.

## 60.5 భారత జాతీయ కాంగ్రెస్ స్థాపన :

ప్రజలకు శిక్షణ ఇచ్చుట, ప్రజాభిప్రాయ వేదికగా తీర్చిదిద్దుట, జాతీయవాద నాయకుల మధ్య స్నేహపూర్వక సంబంధాలను పెంపొందించుట, జాతీయ ఐక్యతను పెంపొందించి సుస్థిర పరచుట, కుల,మత, ప్రాంతాల వివక్షత లేక అందరి అవసరాలను ప్రభుత్వం దృష్టికి తెచ్చుట తన ప్రధాన లక్ష్యమని కాంగ్రెస్ ప్రారంభంలో ప్రకటించెను.

విద్యావంతులైన, రాజకీయ చైతన్యం కలిగిన భారతీయులందరు ఒక ఉమ్మడి వేదికను ఏర్పాటు చేసుకొనవలెనను ఆలోచనకు ప్రతిరూపమే కాంగ్రెస్ స్థాపన. ఈ సంస్థ ద్వారా జాతీయ భావాలను వృద్ధి పరచవలెనని లక్ష్యము. నానాటికి పెరుగుచున్న ప్రజా అసంతృప్తిని నిరోధించి ఒక 'రక్షక కవాటం'(safety value)గా కాంగ్రెస్‌ను ఏర్పాటు చేయుట తన ఉద్దేశ్యమని ఏ.ఓ.హ్యూమ్ ప్రకటించెను. హ్యూమ్ సహకాంం లేకపోయిన కొంతముందు లేదా వెనకగా కాంగ్రెస్ స్థాపన జరిగి ఉండెడిది. విద్యావంతులైన భారతీయులు ఏకమై జాతీయ స్థాయిలో రాజకీయ వేదికలను ఏర్పాటు చేయు ప్రయత్నాలను అప్పుడే ప్రారంభించియుండుట మనము ప్రస్తావించినాము. ఈ కోవకు చెందిన నాయకులు కేవలం ఏ కొద్దిమంది ప్రజలకు ప్రాతినిధ్యం వహించువారిగా కాక, జాతి ప్రతినిధులుగా వ్యవహరించుట ప్రారంభించిరి. కనుక ఈ తరం తొలి నాయకులను జాతీయతకు పునాదులు వేసిన విశిష్టులుగా పేర్కొనవచ్చును.

కాంగ్రెస్ పార్టీ చరిత్రను వివిధ దశలుగా వర్గీకరించవచ్చును. ఎ) 1885-1905 బి) 1905-1919 సి) 1919-1939 డి) 1939-1947. ముందుగా ఈ పాఠంలో 1885-1905 దశలో కాంగ్రెస్ డిమాండ్లు, వాటిపై బ్రిటీష్ ప్రభుత్వ వైఖరిని గురించి తెలుసుకొనెదము.

కాంగ్రెస్ తొలి దశలోనే దేశంనందలి అన్నీ ప్రాంతాల నాయకులు కాంగ్రెస్‌కు దగ్గరైరి. వీరిలో దాదాబాయ్ నౌరోజి, డబ్ల్యు.సి బెనర్జీ, ఫిరోజ్‌షామెహతా, గోపాలకృష్ణ గోఖలే ఎం.జి.రనడే, ఎస్.యన్.బెనర్జీ, మదన్‌మోహన్ మాలవ్య, జి.సుబ్రమణ్యఅయ్యర్ మొదలగు వారిని ముఖ్యముగా చెప్పవచ్చును.

మితవాద, ఉదారభావాల పునాదులపై కాంగ్రెస్ అవతరించెను. ఈ తొలి దశలో కాంగ్రెస్ ప్రధానంగా న్యాయవాదులు, పత్రికా సంపాదకులు, వైద్యులతో కూడి యుండెను. అంతేకాక ఈ దశలో కాంగ్రెస్ ప్రభావము పట్టణ ప్రాంత విద్యావంతులకే పరిమితమైయుండెను. తొలి కాంగ్రెస్ నాయకులకు ఆంగ్లపాలన, వారి న్యాయంపై అచంచల విశ్వాసము కలదు. వీరి అభిప్రాయంలో దేశానికి ఆంగ్లపాలన మంచిదని, వారి మార్గదర్శకత్వంలో, వారి శిక్షణలో దేశములో ప్రాతినిధ్య ప్రభుత్వ స్థాపన సాధ్యమని నమ్మిరి. బ్రిటీష్ పార్లమెంట్‌ను వీరు ప్రగాఢముగా విశ్వసించిరి. మితవాద నాయకులు బ్రిటీష్ రాజరికానికి తిరుగులేని విధేయులు, స్వేచ్ఛను అభిమానించు ఆంగ్లేయులు చట్టములను గౌరవించుచూ, దేశంలో ప్రజావ్యతిరేక పాలనను చేయజాలరని అభిప్రాయపడిరి. దేశ పాలనలో పాలకులు మితవాదుల దృష్టిలో ప్రధానకొరకు ప్రభుత్వంలోని ఉన్నత పాలనాధికారులే గాని, బ్రిటీష్ పాలకులు కాదు.

తొలి దశలో కాంగ్రెస్ ప్రధాన కోర్కెలు ఏవనగా ఎ) ప్రాతినిధ్య శాసనశాఖ బి) అన్ని సర్వీసులలో భారతీయులకు అవకాశాలు సి) సైనిక ఖర్చును నియంత్రిచుట డి) భారతీయులకు సైనిక శిక్షణ ఇ) సాధారణ, సాంకేతిక విద్యను వ్యాప్తిచేయుట ఎఫ్) ఉన్నత పదవులలో భారతీయులకు అవకాశాలు, సివిల్ సర్వీస్ పరీక్షలను ఇంగ్లండ్, ఇండియాలో నిర్వహించుట జి) రైతులపై భారమును తగ్గించుట హెచ్) పౌర హక్కులను పరిరక్షించుట ఐ) న్యాయశాఖను

కార్యనిర్వహణను, కార్యనిర్వాహక శాఖనుండి వేరు చేయుట జె) ఉప్పుపై పన్నును తగ్గించుట కె) భూస్వాముల నుండి కౌలుదారుల హక్కులను రక్షించుచూ చట్టములను మార్చుట.

పై కోర్కెల సాధనకు కాంగ్రెస్ రాజ్యాంగబద్ధమైన విధానాలను అనుసరించినది. ఈ విధానాలలో ముఖ్యమైనవి. తీర్మానాలు చేయుట, ఉపన్యాసములు, ప్రభుత్వానికి అర్జీలు సమర్పించుట, నాయకులను ఇంగ్లండుకు పంపుట మొదలగునవి అంతేగాక, తమ రచనల ద్వారా ప్రజలను చైతన్యవంతులను చేసిరి. తమ ప్రయత్నాల ద్వారా ప్రభుత్వాన్ని కదలించలేని పరిస్థితులలో నాయకులు ఇండియాలో, ఇంగ్లండ్‌లో తమ ఉపన్యాసాల ద్వారా ప్రజాభిప్రాయమును ప్రభుత్వానికి తెలియచేయు ప్రయత్నాలు చేసిరి. ఇంగ్లాండ్‌లో వివిధ కరపత్రాలను ముంద్రించుటయే గాక 'ఇండియా' అను పత్రికను నడిపిరి. కాని వీరి విధానాలకు బ్రిటీష్ ప్రభుత్వం గొప్ప స్పందనలేక పోయెననెడి విమర్శలను మితవాదులు ఎదుర్కొనిరి.

దేశంలో లౌకిక భావాలతో, ప్రజాస్వామ్యయుతమైన జాతీయ ఉద్యమంను ప్రారంభించి, ప్రజలను రాజకీయంగా చైతన్యవంతులను చేయవలెననెడిది తొలిదశలో కాంగ్రెస్ నాయకుల లక్ష్యం. దీనికొరకు ఒక జాతీయ వేదికను ఏర్పరచి దాని ద్వారా వలస వాదంను వ్యతిరేకించుచు, జాతీయ భావాలను ప్రజలలో పెంపొందించుటకు కృషి చేసిరి.

## 60.6 కాంగ్రెస్ పై బ్రిటీష్ ప్రభుత్వ వైఖరి :

భారత జాతీయ కాంగ్రెస్‌పై ఆంగ్ల ప్రభుత్వ వైఖరి ప్రస్తుతం అధ్యయనం చేద్దాము. క్రీ.శ.1885లో కాంగ్రెస్ స్థాపన జరిగిన కాలంలో ఆంగ్ల ప్రభుత్వంనకు కాంగ్రెస్‌పై ఏవగింపు లేదు. కాంగ్రెస్ సమావేశాలలో ఆంగ్ల అధికారులు సైతం పాల్గొనెడివారు. క్రీ.శ.1886లో నాటి గవర్నర్ డఫరిన్ కాంగ్రెస్ నాయకులను విందుకు ఆహ్వానించెను. కాని కాంగ్రెస్ – ప్రభుత్వ సఖ్యత ఎక్కువ కాలం కొనసాగలేదు. క్రీ.శ.1887నుండి బ్రిటీష్ వైఖరిలో మార్పు వచ్చెను. ప్రభుత్వ నిరుపేక్ష వైఖరిని విమర్శించుచూ కాంగ్రెస్ కొన్ని కరపత్రములను ముద్రించెను. ఆంగ్ల ప్రభుత్వము కాంగ్రెస్‌కు వ్యతిరేకముగా సర్‌సయ్యద్ అహమ్మద్‌ఖాన్, రాజ శివప్రసాద్ వంటి వారిని ప్రోత్సహించి 'యునైటెడ్ ఇండియన్ పాట్రియాటిక్ అసోసియేషన్' అను సంస్థ స్థాపనను కాంగ్రెస్‌కు పోటీగా ప్రోత్సహించెను. డఫిరిన్ తన పదవీ విరమణ సమయంలో కాంగ్రెస్ విధానాలను, పద్ధతులను తిరస్కరించుచున్నట్లు ప్రకటించెను. కాంగ్రెస్ దేశంలో అతిస్వల్ప అల్ప సంఖ్యాకుల ప్రయోజనముల కొరకు పనిచేయుచున్నది, దీనిలో జాతీయ ధోరణులు లేవని డఫరిన్ ప్రకటించెను. కాంగ్రెస్ ఎటువంటి లక్ష్యం లేక గెంతులు వేయుచున్నదని అవహేళన చేసెను. భారతదేశానికి ప్రాతినిధ్యము వహించు హక్కు కాంగ్రెస్‌కు లేదని ప్రభుత్వం ప్రకటించెను. దీని ఫలితము అధికార వర్గము కాంగ్రెస్‌కు దూరమయ్యెను. క్రీ.శ.1890లో ప్రభుత్వ అధికారులు ఎవ్వరు కాంగ్రెస్ సమావేశాలకు హజరు కారాదని ప్రభుత్వం ప్రకటించెను. జాతీయ భావాలను ప్రచారం చేయుట ప్రదాన ప్రభావము గల విద్యావ్యవస్థను అంగ్ల ప్రభుత్వం మార్చుటకు ప్రయత్నాలు ప్రారంభించెను. మతఛాందసవాదుల ఆధ్వర్యములోని విద్యాసంస్థలను ప్రభుత్వం ప్రోత్సహించుట ప్రారంభించెను. క్రీ.శ.1903 విద్యాచటంలో విద్యపై ప్రభుత్వ పూర్తి నియంత్రణ ఉండగలదని ప్రభుత్వంప్రకటించెను. క్రీ.శ.1898లో పత్రికా స్వేచ్ఛపై ఆంక్షలు విధించెను. ప్రభుత్వ వ్యతిరేక వార్తలను ప్రచురించెనను ఆరోపణలపై తిలక్‌ను నిర్బంధించిరి ముఖ్యంగా రాజప్రతినిధి కర్జన్ కాంగ్రెస్‌ను బలహీన పరచుటకు కంకణం కట్టుకొనెను.

## 60.7 మితవాదుల కృషి – పరిశీలన :

కాంగ్రెస్ తొలి 20 సంవత్సరములలో జాతీయోద్యమంలో ఏమి సాధించెను? ప్రభుత్వము వీరి కోరికలను ఎంతమాత్రం నేరవేర్చెను? కాంగ్రెస్ నాయకులందరూ కాంగ్రెస్ విధానాలతో సంతృప్తి చెందుట జరిగినదా? మొదలగు ప్రశ్నలకు సమాధానాలను పరిశీలించవలసిన అవసరం కలదు.

తొలిదశకు చెందిన కాంగ్రెస్ నాయకత్వం పరిమిత స్థాయిలో ఫలితాలను సాధించగలిగెను. లాలాలజపతిరాయ్ అభిప్రాయములో రాయితీలకు, సమస్యల పరిష్కారానికి 20 సంవత్సరములు చేసిన ఉద్యమం ఫలితంగా సాధించినది శూన్యం. ప్రభుత్వానికి వీరి ప్రయోజనాలను నెరవేర్చు ఉద్దేశ్యం లేదు. సామాన్య ప్రజానీక స్థాయి ఉద్యమాన్ని విస్తరింప చేయుటలో మితవాదులు విఫలమైరి. క్రీ.శ.1886లో పబ్లిక్ సర్వీస్ కమీషన్ ఏర్పాటును వీరి పరిమిత విజయంగా చెప్పవచ్చును. ఇంకను క్రీ.శ.1892 ఇండియన్ కౌన్సిల్ చట్టం, భారతదేశములో, లండన్‌లో ఏకకాలంలో సివిల్ సర్వీస్ పరీక్షల నిర్వహణ మొదలగునవి మితవాదుల విజయాలుగా చెప్పవచ్చు.

తమ లక్ష్యాలను నెరవేర్చలేనంత మాత్రమున మితవాద నాయకులు విఫలం చెందిరని భావించుటకు వీలులేదు. వీరి మౌలిక విజయము ప్రజలలో రాజకీయ చైతన్యంను పెంపొందించుట. వీరు అనుసరించిన 'అభ్యర్థించుట, విజ్ఞాపనలు, ఫిర్యాదులు చేయుట' అను విధానం వికసించిన రాజకీయ పరిజ్ఞానానికి నిదర్శనం. కాంగ్రెస్ వార్షిక సమావేశాలకు హాజరగు ప్రతినిధుల సంఖ్య ప్రతిసంవత్సరం గణనీయంగా పెరిగినవి. ఇది మితవాదులు సాధించిన ఐక్యతకు నిదర్శనం. భారతదేశంపై బ్రిటీష్ ఆర్థిక విధానాలను, ఫలితాలను ఈ కాలానికి చెందిన దాదాబాయ్ నౌరోజి, ఆర్.సి.దత్త, వాచ మొదలగు వారు నిరతముగా అధ్యయనం చేసిరి. సంపదను దోచుకొని పోవు బ్రిటీష్ విధానాలను వీరు ఎండగట్టిరి. ప్రత్యక్ష ఫలాలను మితవాదులు తక్షణమే భారతీయులకు అందించ లేకపోయినను భారతజాతీయోద్యమానికి బలమైన పునాదులు ఏర్పాటు చేయుటలో వీరు పూర్తిగా సఫలీకృతులైరి. కనుక వీరు జాతీయోద్యమానికి సరిఅయిన ప్రారంభంను అందించారని చెప్పవచ్చును.

## 60.8 అతివాదుల విజృంభణ :

మితవాదుల అభ్యర్థనలు, ఫిర్యాదులు, విజ్ఞప్తుల విధానాలను కాంగ్రెస్‌లోని కొంతమంది జాతీయవాదులు వ్యతిరేకించిరి. వీరి దృష్టిలో ఈ విధానాలు నిరర్థకం, నిరుపయోగం. ఈ దశను రాజకీయ బిక్షాటన దశ అని అభివర్ణించిరి. సంస్కరణలు చర్యతోనే సాధ్యమని, మాటలతో కాదని వీరినమ్మకం. అందువలన బ్రిటీష్ వారిని అభ్యర్థించుటకు బదులు వారిపై వత్తిడి తేవలెనని వీరు నిర్ణయించిరి. రాజ్యాంగ రాయితీల స్థానంలో అతివాదులు 'స్వరాజ్యాము'ను కోరిరి. మితవాదుల అసమర్థ విధానాలు అతివాద ధోరణులు బలపడుటకు దోహదపడినవి.

### పాఠ్య ప్రశ్నలు 60.బి

1. కాంగ్రెస్ తొలిదశలో ఏ సామాజిక వర్గం కాంగ్రెస్‌కు ప్రధాన మూలంగా ఉండెను.
2. కాంగ్రెస్‌ను హ్యూమ్ 'రక్షక కవాటము' అని అభివర్ణించుటకు ఏవిధంగా వివరించవచ్చును లేదా విమర్శించవచ్చును.
3. ఏ విధమైన ఆర్థిక దోపిడీ విధానాలను దాదాబాయ్ నౌరోజి, ఆర్.సి దత్త మొదలగు నాయకులు విమర్శించిరి.

4. కాంగ్రెస్ అనుసరించు 'విజ్ఞప్తులు, ప్రార్థించు' విధానాలను కాంగ్రెస్ నందలి ఏ వర్గము నాయకులు వ్యతిరేకించిరి. వీరిని ఏమని పిలిచిరి?

### సారాంశం :

19వ శతాబ్ది తొలి భాగంలో అనేక సామాజిక, రాజకీయ వేదికలు నెలకొల్పబడినవి. వీటిలో క్రీ.శ.1836 భూస్వాముల సంఘం. క్రీ.శ.1856 మద్రాస్ నేటివ్ అసోసియేషన్, బొంబాయి నేటివ్ అసోసియేషన్ మొదలగునవి ముఖ్యమైనవి. ఈ సంస్థలు సమాజంలోని ఒక ప్రాంత లేదా ఒక వర్గ ప్రయోజనాలను పరిరక్షించుటకు ఉపకరించినవి.

క్రీ.శ.1857 తదనంతరం దేశంలో రాజకీయ కార్యకలాపాలు తీవ్రతరమయ్యెను. విద్యావంతులైన భారతీయ నాయకులు ఆంగ్లేయుల దోపిడి విధానాలను క్రమంగా తెలుసుకొనిరి. క్రీ.శ.1866లో దాదాబాయ్ నౌరోజి లండన్‌లో ఒకసంస్థను స్థాపించెను. క్రీ.శ.1876లో సురేంద్రనాద్ బెనర్జీ 'ఇండియన్ అసోసియేషన్'ను స్థాపించెను. మద్రాస్, బొంబాయి నగరాలలో ఆర్థిక ఇబ్బందులకు వ్యతిరేకముగా అనేక వేదికలు వెలుగులోనికి వచ్చినవి.

క్రీ.శ.1885లో భారత జాతీయ కాంగ్రెస్ స్థాపించబడెను. ప్రాతినిధ్య ప్రభుత్వ స్థాపన కొరకు జాతీయ స్థాయిలో అవతరించినది కాంగ్రెస్. రాజ్యాంగ విధానాల ద్వారా సమస్యల పరిష్కారానికి కాంగ్రెస్ తొలుత కృషి చేసెను. నాయకులు ఉపన్యాసాల ద్వారా, కరపత్రాల ద్వారా ప్రభుత్వానికి తమ నిరసనను తెలిపిరి.

క్రమంగా కాంగ్రెస్ ప్రభుత్వ ప్రత్యర్థిగా మారెను. కాంగ్రెస్ విధానాలను ప్రభుత్వం నిరాకరింపసాగెను. విద్యను నియంత్రించుటకు ప్రభుత్వం అనేక చట్టాలను చేసెను. కొన్ని నామమాత్రపు రాయితీల ద్వారా కాంగ్రెస్‌ను అనుకూలంగా మార్చుకొనుటకు ప్రయత్నించెను. ఈ కాలంలో తక్షణ రాజకీయ ప్రయోజనాలను సాధించలేకపోయినను ప్రజలలో రాజకీయ చైతన్యంను పెంపొందించుటలో మితవాదులు విజయం సాధించిరి.

### ప్రశ్నలు

1. "కాంగ్రెస్ స్థాపన ఆకస్మికంగా జరిగిన చారిత్రక సంఘటన కాదు" ఈ అభిప్రాయంతో నీవు ఏకీభవించెదవా? నీ అభిప్రాయంను తెలుపుచు తగిన కారణాలు వ్రాయుము.

2. మొదటి 20 సంవత్సరాలలో కాంగ్రెస్ ప్రధాన లక్ష్యాలు ఏవి? నాయకులు ఈ లక్ష్యాల సాధనకు చేసిన కృషి ఎట్టిది.

3. సమస్యల పరిష్కారానికి కాంగ్రెస్ తొలిదశలో చేసిన ప్రయత్నాలు ఏవి

4. కాంగ్రెస్ యెడల బ్రిటీష్ ప్రభుత్వ వైఖరిని వివరింపుము.

5. బ్రిటీష్ పాలనకు వ్యతిరేకంగా జరిగిన ఉద్యమాలలో మితవాదుల కృషిని అంచనా వేయుము.

### అభ్యాసం :

ప్రజా చైతన్యంలో పత్రికలకు ప్రధాన పాత్ర కలదు. అందువలన స్వాతంత్ర్యానికి ముందు కాలంనుండి ప్రచురింపబడుచున్న పత్రిక కార్యాలయమునకు వెళ్ళి నాటి పత్రికలు పోషించిన పాత్రను, జాతి నిర్మాణంలో వాటి కృషిని తెలుసుకొనుము.

**విస్తృత అధ్యయనము:** బ్రిటీష్ వారి ఆర్థిక దోపిడి విధానాలు భారతీయులు అసంతృప్తికి మూలకారణం. దాదాబాయ్ నౌరోజి ప్రచారం చేసిన 'సంపదను తుడిచిపెట్టు విధానం'ను అధ్యయనం చేయుము.

# 61

# భారత జాతీయోద్యమము (1905–1918)

## 61.1 పరిచయం :

జాతీయోద్యమ పురోగతికి తొలి తరానికి చెందిన నాయకులు గట్టి పునాది వేసిరి. ఈ నాయకుల కృషి ఫలములు జాతికి అందించలేకపోయినను తదనంతర కాలపు నాయకులకు సరిఅయిన మార్గంను చూపగలిగిరి.

క్రీ.శ. 1905 – 1918 సంవత్సరముల మధ్యకాలంలో జాతీయోద్యమం మరింత ముందుకు సాగెను. స్వాతంత్ర్య ఉద్యమములో అన్ని ప్రధాన ధోరణులు ప్రవేశించినవి. ఈ పాఠంను బెంగాల్ విభజన (క్రీ.శ. 1905)తో ప్రారంభించెదం. బెంగాల్ విభజన వ్యతిరేక ఉద్యమం జాతీయోద్యమానికి నూతన దిశను చూపించినది. ఈ ఉద్యమకాలము నుండి మహిళలు, విద్యార్థులు జాతీయోద్యమంలో భాగస్వామ్యులు కాగిలిగిరి. ఈ కాలంలో మితవాదుల రాజ్యాంగ ధోరణులు, అతివాదుల ఉద్యమాలు సమాంతరంగా కొనసాగినవి. స్వాతంత్ర్యము కొరకు తీవ్రవాదులు చేసిన త్యాగాలను ఈ పాఠములో అధ్యయనము చేయగలరు. ఈ కాలంలో ఆంగ్లేయుల 'విభజించు పాలించు' విధానంను మీరు తెలుసుకొనగలరు. ఈ విధాన ఫలితముగా హిందూ–ముస్లిం ఐక్యత దెబ్బతిని వేర్పాటు ధోరణులు ప్రారంభమయ్యెను. ఈ అధ్యాయంలో మింటో–మార్లే సంస్కరణలు, మాంటేగ్–ఛేమ్స్‌ఫర్డ్ రాజ్యాంగ సంస్కరణలను గురించి తెలుసుకొనగలరు.

ఈ పాఠం ముగింపుకు జాతీయోద్యమం ఎంత తీవ్రస్థాయికి చేరుకొనెనో అవగతం అగును. క్రీ.శ. 1918 నాటికి గాంధీ ఆగమనంనకు రంగం సిద్ధమై ఉద్యమం చివరి అంకానికి చేరుకొనెను.

## 61.2 లక్ష్యాలు

**ఈ పాఠ్యాంశ అధ్యయనం ద్వారా క్రింది విషయాలు తెలుసుకుంటారు**

1. తీవ్రవాద జాతీయ భావాలు ఏవిధంగా వృద్ధిచెందినవి
2. బెంగాల్ విభజన ద్వారా ఆంగ్లేయుల రాజకీయ ప్రయోజనాలు
3. స్వదేశీ, బహిష్కరణ ఉద్యమాల స్వభావం
4. 20వ శతాబ్దిలో మతతత్వ ధోరణుల వ్యాప్తి
5. మింటో–మార్లే సంస్కరణలు

6. విప్లవ ఉద్యమాలు

7. స్వాతంత్ర్య సమరంలో స్వదేశీ ఉద్యమ ప్రభావం

## 61.3 తీవ్ర జాతీయవాద విజృంభణ :

గత పాఠంలో అతివాద భావనలు కాంగ్రెస్‌లో ప్రవేశించుటను గురించి తెలుసుకున్నాము. ఈ వర్గం నేరుగా ప్రత్యక్ష చర్యల ద్వారా కోర్కెల సాధన సాధ్యమని విశ్వసించిరి. ఈ పాఠంలో తీవ్రజాతీయవాదం బలపడుటకు గల కారణములను ముందుగా పరిశీలించెదము.

మితవాదులు నమ్మిన రాజ్యాంగబద్ధమైన పోరాట విధానాలు సఫలం చెందలేక పోయిన విషయంను మనం అధ్యయనం చేయుట జరిగెను. ప్రభుత్వం భారతీయులకు ఎటువంటి రాయితీలను ఇవ్వలేదు. మితవాదులు శాసన మండలులను విస్తృతపరచవలెనని కోరిరి. ఫలితముగా క్రీ.శ.1892 ఇండియన్ కౌన్సిల్ చట్టం చేయబడెను. ఈ చట్టం ద్వారా శాసన మండలులు కొంతమేర విస్తరించబడినవి. కాని ఈ చట్టం ద్వారా ఒనగూరిన వాస్తవ ప్రయోజనాలు శూన్యం. శాసనమండలిలో అధికార వర్గానిదే పైచేయి. కార్యనిర్వాహక శాఖపై అవిశ్వాస ప్రకటన చేయు అధికారం లేదు. ఈ చట్టం మితవాదులనే అసంతృప్తికి గురిచేసెను. ఈ విధంగా తీవ్ర అసంతృప్తిలో భారతీయులు 20వ శతాబ్దిలో ప్రవేశించిరి. సంస్కరణల కొరకు ఆంగ్లేయులను ప్రార్థించిన మితవాదులు ప్రజలలో అపఖ్యాతి పొందిరి. ఇటువంటి మితవాదులకు బదులు అతిజాతీయ భావాలు గల నాయకులకు ప్రజాదరణ పెరిగెను.

అతివాద భావాలు గల నాయకులు భారతీయుల స్వపరిపాలనకు అర్హులని నమ్మిరి. బ్రిటీష్ విధానాల ఫలితముగా స్వయం సంవృద్ధి కలిగిన భారతీయ గ్రామీణ ఆర్థిక సర్వనాశనమయ్యెను. క్రీ.శ.1896-97 సంవత్సరముల మధ్యకాలంలో వచ్చిన భయంకర క్షామానికి 20 మిలియన్‌ల ప్రజలు బలిఅయిరి. బ్రిటీష్ ప్రభుత్వం చేపట్టిన క్షామనివారణ చర్యలు ఎంతమాత్రము సంతృప్తికరము లేకపోయెను. ప్రభుత్వ విధానాలను తిలక్ విమర్శించుచూ క్షామానికి గురైన మహారాష్ట్ర రైతులను పన్నులు చెల్లించవద్దని పిలుపునిచ్చెను. క్రీ.శ.1897లో ప్రబలిన ప్లేగు వ్యాధి ప్రాంతాలలో ఆంగ్లేయులు అనుసరించిన అమానుష చర్యలను సైతం తిలక్ విమర్శించెను. ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలను ప్రోత్సహించు వ్యక్తిగా ఆంగ్ల ప్రభుత్వం తిలక్‌ను నిర్బంధించెను. ప్లేగ్ వ్యాధి నిరోధక కమీషనర్ రాండ్ హత్యకు తిలక్ విధానాలే ప్రేరణమని ఆంగ్ల ప్రభుత్వము విశ్వసించెను. తిలక్‌కు 18నెలల జైలుశిక్ష విధించబడెను. క్షమాపణ కోరుటకు తిలక్ నిరాకరించెను. ఇతడు జాతికి గొప్ప నాయకునిగా అవతరించెను. ప్రజలు ఇతనిని 'లోకమాన్య' అని కీర్తించి జాతికి లభించిన నూతన శక్తిగా భావించిరి. ఇటువంటి ఆలోచనా విధానాలే గల అరవిందఘోష్, బిపిన్ చంద్రపాల్ మొదలగువారు ప్రజాదరణ పొందిన నాయకలు కాగలిగిరి.

ఈ కాలంలో భారతీయ పూర్వ వైభవంను చాటిచెప్పిన పలువురు సంఘసంస్కర్తల కృషి మనము చదివియున్నాము. దయానంద సరస్వతి, వివేకానంద మొదలగు వారు ఘనమైన భారతీయ వారసత్వాన్ని ప్రజలకు విశదపరిచిరి. పాశ్చాత్య నాగరికత గొప్పదన్న భ్రమనుండి బయటకు రావలసినదిగా దయానంద సరస్వతి, వివేకానంద మరియు తిలక్ గణపతి నవరాత్రులను, శివాజి జయంతి ఉత్సవాలను వేడుకగా జరుపుకొనవలసినదిగా పిలుపునిచ్చెను. శివాజిని ఆదర్శంగా తీసుకొని దేశాన్ని విదేశీ పాలన నుండి విముక్తి కలిగించ వలసినదిగా తిలక్ యువతను కోరెను. అదేవిధంగా అరవింద ఘోష్ స్వరాజ్యంను, స్వపరిపాలనను ప్రబోధించెను.

అతివాద జాతీయ భావాలను ప్రచారం చేయుటలో నాటి పత్రికలు చురుకైన పాత్రను పోషించినవి. బంకించంద్రచటర్జీ రచించిన ఆనంద మఠం నవల అందలి వందేమాతర గేయం ప్రజలను గొప్పగా ప్రభావితమొనర్చినవి. వందేమాతరం గేయము క్రీ.శ.1906–07 మధ్యకాలంలో ప్రారంభమైన బెంగాల్ విభజన వ్యతిరేక ఉద్యమానికి ఊపిరిపోసెను. ఈ గేయ ఆలాపనను ప్రభుత్వం నిషేధించెను. కేసరి, మరాఠి, అమృతబజార్, హిందూ, కరాచి క్రానికల్, యుగాంతర్ మొదలగు పత్రికలు తీవ్ర జాతీయ భావాలను విస్తృతంగా ప్రచారం చేసినవి.

విద్యా రంగములో జరిగిన కృషి ఫలితంగా జాతీయ భావాలు, ప్రజాస్వామ్య సిద్ధాంతాలు విస్తరించినవి. ఈ విద్యావంతులు జాతీయోద్యమానికి ప్రధాన నాయకత్వంగా ఎదిగి మరింత ప్రేరేపించెను. వారి అర్హతలకు తగిన అవకాశాల స్వతంత్ర భారతదేశంలో సాధ్యపడగలవని వారు గట్టిగా నమ్మిరి.

సమకాలీనంగా ఇతర దేశాలలో జరిగిన పరిణామాలు, తీవ్రవాద జాతీయ భావాల వ్యాప్తికి దోహదపడినవి. ఇంగ్లాండుకు వ్యతిరేకంగా జరిగిన ఐర్లాండ్ పోరాటం, ఇటలీపై అబిసీనియా విజయం(1896), ఆంగ్లేయులకు వ్యతిరేకము బోయర్లు చేసిన ఉద్యమాలు (1899–1902) మొదలగునవి భారతీయ పత్రికలు ప్రధానంగా ప్రచురించినవి. క్రీ.శ.1858 తదనంతరం జపాన్ విజృంభణ, జపాన్ చేతిలో రష్యా ఓటమి(1805) మొదలగు సంఘటనలు భారతీయులను గొప్ప ప్రభావితం చేసినవి. కేసరి పత్రికలో తిలక్ భారతీయులు జపాన్‌ను ఆదర్శంగా తీసుకొనవలెనని కోరెను. జపాన్ చేతిలో రష్యా ఓటమి ఐరోపా ఆధిపత్యంపై చావుదెబ్బ తీసెను. తెల్లవారు అప్రతిహతులు అను నానుడి పటాపంచలయ్యెను. జపాన్ రష్యాకు చేసిన శాస్తిని ఇండియా ఇంగ్లాండ్ చేయగలదని కరాచి క్రానికల్ క్రీ.శ.1905లో వార్తను ప్రచురించెను.

ఇటువంటి నేపథ్యంలో కాంగ్రెస్ వార్షిక సమావేశం క్రీ.శ.1905లో బెనారస్‌లో జరిగెను. బహిష్కరణ, స్వదేశీ విషయాలలో కాంగ్రెస్ నందలి రెండు వర్గాల మధ్య అభిప్రాయభేదాలు ఏర్పడెను. అయినను క్రీ.శ.1906లో కాంగ్రెస్ అధ్యక్షుడు దాదాబాయ్ నౌరోజి ఇండియా బ్రిటీష్ రాజ్యంలో భాగంగా స్వయం పాలనను పొందగలదని ప్రకటించెను. మితవాద, అతివాద వర్గముల మధ్య దూరము మరింత అధికమయ్యెను. ఫలితంగా క్రీ.శ.1907సూరత్ సమావేశంలో తిలక్ తన వర్గంతో కాంగ్రెస్‌ను వీడిపోయెను.

కాంగ్రెస్‌లో రెండు వర్గాలు ఏర్పడెను. మితవాదులు బ్రిటీష్ పాలనలో సంస్కరణలను కోరగా అతివాదులు సుపరిపాలనకు మారుగా స్వపరిపాలనను కోరిరి.

## పాఠ్యాంశ ప్రశ్నలు 61.ఎ

1. అతివాదులు ఏవిషయమై మితవాదులతో విభేదించారు?
2. దాదాబాయ్ నౌరోజి రచనలు ఏవిధంగా భారతీయులలో అతివాద జాతీయభావాల వృద్ధికి దోహదపడెను?
3. సాంఘిక, మత సంస్కరణల ఉద్యమాలు భారతీయులను గొప్పగా చైతన్యపరచినను కొన్ని వ్యతిరేక ప్రభావాలను చూపించినవి అటువంటి ప్రభావాలలో ఒకదానిని వివరించండి?
4. తీవ్ర జాతీయవాద వృద్ధికి విద్య ఏవిధంగా దోహదపడెను? ఒక ఉదాహరణ తెలుపుము?
5. ఆంగ్ల పాలనకు వ్యతిరేకంగా భారతీయులను ఉత్సాహపరచిన ప్రపంచ సంఘటన ఏది? ఏ నానుడి ఈ సంఘటన ద్వారా అదృశ్యమయ్యెను?

## 61.4 బెంగాల్ విభజన :

క్రీ.శ.1899లో నథానియల్ కర్జన్ భారతదేశానికి రాజప్రతినిధిగా నియమించబడెను. భారతదేశ పాలనా వ్యవస్థను అత్యవసరంగా మార్పులు చేయవలెనని కర్జన్ భావించెను. ఈ కాలానికి భారత జాతీయనాయకులు సంఘటితమై కాంగ్రెస్ అధ్వర్యములో పూర్తి చైతన్యవంతులైయుండగా, కొంతమంది తిలక్ నాయకత్వంలో అతివాద నాయకులుగా మారిరి. ఈ అతివాద నాయకుల ఉపన్యాసాలు, రచనలు, సామాన్య ప్రజానీకమును గొప్పగా ఉత్తేజపరచినవి. అందువలన కర్జన్ తన తక్షణ చర్యల ద్వారా నానాటికి బలపడుచున్న జాతీయవాదుల కాలరాచుటకు తీవ్రప్రయత్నాలు చేసెను.

తన లక్ష్య సాధనలో భాగంగా కర్జన్ పలుమార్పులకు శ్రీకారం చుట్టెను. పోలీస్, సైనిక వ్యవస్థలను పునర్‌నిర్మించెను. క్రీ.శ.1904లో విశ్వవిద్యాలయ చట్టం చేసి వాటిని ప్రభుత్వ అధికారులతో నింపెను. స్థానిక స్వపరిపాలనా సంస్థల స్వయం ప్రతిపత్తి నివారించెను. భూమిశిస్తు, నీటి పారుదల, రైల్వే రంగాలలో అనేక చట్టాల ద్వారా మార్పులు చేర్పులు చేసెను. ఈ విధంగా భారతదేశంపై బ్రిటీష్ సామ్రాజ్య వాద నియంత్రణను మరింత సుస్థిరపరచుటకు అన్ని ప్రయత్నాలు చేసెను.

కర్జన్ జాతివ్యతిరేక కార్యకలాపాలలో అత్యంత వివాదమైనది క్రీ.శ.1905లో చేసిన బెంగాల్ విభజన. బెంగాల్‌ను రెండుగా విభజించు నిర్ణయం తీసుకొనబడెను. బెంగాల్ సువిశాల రాష్ట్రమైనందున పాలనా సౌలభ్యము కొరకు బెంగాల్ విభజన అనివార్యమని కర్జన్ ప్రభుత్వము ప్రకటించెను. కాని విభజనకు విశాల భూభాగము వాస్తవ కారణము కాదు. నాటి దేశియాంగ కార్యదర్శి రిస్లీ మాటలలో బెంగాల్ విభజన యొక్క రాజకీయ ప్రయోజనము ఏమనగా బ్రిటీష్ ప్రత్యర్థులను విడదీయుట మరియు బలహీనపరచుట. భారతీయుల ఐక్యతను దెబ్బతీయుట బెంగాల్ విభజన ఏకైక లక్ష్యం. బెంగాల్ విభజన హిందూ-ముస్లిం ఐక్యతను బలహీనపరచుటకు ఒక ఆయుధంగా భావించిరి. తూర్పు బెంగాల్‌లో పాలనాధికారంను మహమ్మదీయులకు కట్టబెట్టుటకే బెంగాల్ విభజన జరిగినదని కర్జనే స్వయంగా డాకాలో ప్రకటించెను. ఇటువంటి ఆలోచనలతో అంగ్ల ప్రభుత్వం మత నాయకులను ప్రోత్సహించి వారి సహాయ సహకారాలను పొందు ప్రయత్నము చేసెను.

బెంగాల్ విభజనను భారతీయులందరూ ఏకకంఠముతో వ్యతిరేకించిరి. బెంగాల్‌ను కించపరిచి అవమాన పరచుటకే విభజన జరిగినదని బెంగాలీలు అభిప్రాయపడిరి. ప్రజాభిప్రాయానికి, ప్రజల మనోభావాలకు ఏమాత్రము ఆంగ్ల ప్రభుత్వం ప్రాధాన్యతను ఇవ్వలేదని క్రీ.శ.1905లో స్టేట్స్‌మన్ అను పత్రిక పేర్కొనెను. బెంగాల్ విభజన కాంగ్రెస్ అభిప్రాయంలో ప్రణాళిక ప్రకారం చేసిన ద్రోహం. బెంగాల్ నుండి హిందీ ప్రాంతాలైన బీహార్, ఒరిస్సా ప్రాంతాలను వేరు చేయవలెననెడి కాంగ్రెస్ కోర్కెను ప్రభుత్వం తిరస్కరించెను. అందువలన బెంగాల్ విభజన అసలు ఆంతర్యం స్పష్టంగా వ్యక్తమయ్యెను.

బెంగాల్ విభజనతో దేశావ్యాప్త ఉద్యమానికి నాంది పలికెను. విభజన అమలులోనికి వచ్చిన క్రీ.శ.1905 అక్టోబర్ 6వ తేదిన జాతీయ సంతాప దినంగా పాటించిరి. ఊరేగింపుగా, సమావేశంలు, హర్తాళ్ కార్యక్రమాలు అనేక ప్రాంతాలలో జరిగినవి. ప్రజలు వందేమాతరం గీతాన్ని ఆలపించుచూ వీధులలోనికి వచ్చిరి. రవీంద్రనాధ్ ఠాగూర్ బెంగాల్‌కు ఒక జాతీయగీతాన్ని రచించెను. ప్రజలు తమ ఐక్యతను తెలియచేయుచూ పరస్పరం రాఖీలు కట్టుకొనిరి.

## స్వదేశీ, బహిష్కరణ ఉద్యమాలు :

క్రీ.శ.1905 ఆగస్టు 7న విభజన వ్యతిరేక ఉద్యమానికి నాంది పలికిరి. ఆరోజు ఆనందమోహన్‌బోస్ 50వేల మంది ప్రజలను ఉద్దేశించి ప్రసంగించెను. ఈ సమావేశంలో బ్రిటీష్ ఉత్పత్తులను బహిష్కరించుటకు పిలుపు ఇచ్చెను. దేశీయ పరిశ్రమలను ప్రోత్సహించుట, బ్రిటీష్ ప్రయోజనాలను దెబ్బతీయుట ఈ బహిష్కరణ ముఖ్య ఉద్దేశ్యం. ఈ విధంగా బహిష్కరణ కార్యక్రమం రెండు విధముల ఉపయోగపడెను. దీని ఫలితంగా స్వదేశీ పరిశ్రమలు బలపడుటయే గాక ఉపాధి సౌకర్యములు పెంపొందుటకు వీలు కలిగెను.

స్వదేశీ ఉద్యమ ఫలితంగా భారతీయులలో స్వయంశక్తిపై విశ్వాసం పెంపొందెను. బహిష్కరణ కార్యక్రమాన్ని ప్రచారం చేయుచూ వేలాది సమావేశాలు జరిగినవి. బ్రిటీష్ వస్తువులను బహిరంగంగా దహనము చేసిరి. విదేశీ వస్తు విక్రయశాలల వద్ద పికెటింగ్‌లు చేసిరి. దేశంనందలి జమిందార్లు, వ్యాపారులు, రాజకీయ నాయకులు ఈ ఉద్యమంలో పాల్గొనిరి. విద్యార్థులు ఈ ఉద్యమంలో ముఖ్యపాత్ర పోషించిరి. వీరు విదేశీ కాగితం వాడుటకు వ్యతిరేకించిరి. వీరు స్వదేశీ ఉద్యమాన్ని ఆచరణలో పెట్టి బ్రిటీష్ వారి అణిచివేత విధానాలను ప్రతిఘటించిరి. గృహాల నుండి బయటకు వచ్చి స్త్రీలు సైతం ఉద్యమంలో పాల్గొనిరి. ఈ ఉద్యమ కాలం నుండి స్త్రీలు జాతీయోద్యమంలో భాగస్వాములైరి.

బెంగాల్ విభజన వ్యతిరేక ఉద్యమం బెంగాల్‌కే పరిమితము కాలేదు. స్వదేశీ ఉద్యమం స్వరాజ్యం లక్ష్యంగా దేశవ్యాప్తంగా జరిగెను. ఈ ఉద్యమానికి తిలక్ నాయకత్వం వహించగా బహిష్కరణ ఉద్యమం దేశ ప్రాంతాలలో జరిగెను. పూనాలో తిలక్ ఆధ్వర్యంలో పెద్దఎత్తున విదేశీ వస్త్ర దహనకాండ జరిగెను. క్రమంగా ఈ ఉద్యమం హరిద్వార్, ఢిల్లీ, ఆగ్రా, జమ్ములకు వ్యాపించెను. ఢిల్లీలో ఈ ఉద్యమానికి సయ్యద్ హైదర్‌రజా నాయకత్వం వహించెను.

బెంగాల్ విభజన వ్యతిరేక ఉద్యమం జాతీయోద్యంపై సుదీర్ఘ ప్రభావంను చూపినది. జాతీయతను ఈ ఉద్యమం మరింత బలపరచి దేశభక్తిని ప్రజలలో పెంపొందించినది. దేశభక్తితో రవీంద్రనాద్ ఠాగూర్, రజనీ కాంతసేన్, ముకుందదాస్ మున్నగు వారి రచనలు ప్రజలను గొప్పగా ప్రభావితమొనర్చినవి. సమైక్య ప్రతిఘటన ఎంత బలమైనదో ఈ ఉద్యమం ద్వారా బహిర్గతమయ్యెను. క్రీ.శ.1911లో ఆంగ్ల ప్రభుత్వం బెంగాల్ విభజనను రద్దుచేసెను. ఆసియాలో ఒక చిన్న దేశమైన జపాన్ రష్యాను ఓడించిన కాలంలో ప్రారంభమైన వందేమాతరం ఉద్యమం మాతృదేశం కొరకు ఎంతటి త్యాగానికైన ప్రజలను సంసిద్ధపరచినది. జపాన్ రష్యాను ఓడించగా భారతీయులు విదేశీ పాలనను ఎందుకు నిరోధించలేరని భారతీయులు ప్రశ్నించుకొని జాతీయ భావాలను మరింత దృఢంగా పెంపొందించుకొనుటకు దోహదపడెను.

కాంగ్రెస్ స్వభావంపై బెంగాల్ విభజన వ్యతిరేక ఉద్యమం గొప్ప ప్రభావంను చూపినది. మితవాదులు స్వదేశీని బలపరచి బహిష్కరణను వ్యతిరేకించిరి. కాని అతివాదులు స్వదేశీతో పాటు బహిష్కరను సమర్ధించిరి. బహిష్కరణ అతివాదుల దృష్టిలో మాంచెస్టర్ పై ఆర్థిక ఒత్తిడిని తెచ్చుటకు, అంగ్లేయుల సామ్రాజ్యవాదం పై రాజకీయ ఉద్యమానికి స్వయం సంవృద్ధిని సాదించు విషయంలో ఉపకరించేది. తదుపరి జాతీయోద్యమ గమనంలో అనుసరించవలసిన విధానాల విషయమై రెండు వర్గాలు (అతివాదులు, మితవాదులు) వేరువేరు గమన మార్గాలను ఎంచుకున్నవి. క్రీ.శ.1907చీలిక తదనంతరం కాంగ్రెస్ మితవాదుల ఆధీనములో ఉండగా, అతివాదులకు దాదాపు 9 సంవత్సరములు కాంగ్రెస్ దూరమైంది.

బెంగాల్ విభజన జాతీయోద్యమ సమగ్రతను దెబ్బతీయుటకు లక్ష్యంగా చేయబడెను. విభజనను భారతీయులు తీవ్రంగా వ్యతిరేకించిరి. ఈ ఉద్యమ కాలంలో స్వదేశీ, బహిష్కరణ కార్యక్రమాలను చేపట్టిరి.

## పాఠ్య ప్రశ్నలు 61.బి

1. బెంగాల్ విభజనను బ్రిటీష్ పాలకులు ఏవిధంగా సమర్థించుకొనిరి.
2. బెంగాల్ విభజన వెనుక ఆంగ్లేయుల రాజకీయ లక్ష్యం ఏమి?
3. బెంగాల్ విభజన ఏవిధంగా జాతీయోద్యమంను సంఘటిత పరచుటకు ఉపకరించెను?
4. స్వదేశీ ఉద్యమం ఏవిధంగా దేశీయ పరిశ్రమలకు ప్రోత్సాహంను ఇచ్చెను?

## 61.5 ముస్లిం లీగ్ స్థాపన (1906) :

19వ శతాబ్ది ద్వితీయ భాగంలో దేశంలో రాజకీయ చైతన్యం గొప్పగా వృద్ధిచెందిన తీరును మనం అధ్యయనం చేసాము. ఈ కాలంలో ఈ చైనత్యంతో పాటు మతఛాందసవాదాలు సైతం పెంపొందినవి. బ్రిటీష్ వారి కుతంత్రాల ఫలితంగా సఖ్యత కలిగి ఉన్న హిందూ–ముస్లిం వర్గాల మధ్య వైషమ్యాలు పెరిగినవి. దీనికి ఆంగ్లేయులు అనుసరించిన 'విభజించు–పాలించు' విధానం ప్రధానంగా కారణమైనది.

1857లో మహమ్మదీయులు అధికసంఖ్యలో పాల్గొనిరి. నాటినుండి ఆంగ్లేయులు మహమ్మదీయులను విశ్వశనీయులుగా పరిగణించలేదు. అంతేకాక ఆంగ్లేయులు దేశంలో రాజ్యాధికారాలు మహమ్మదీయుల నుండి ఆక్రమించిరి. అందువలన మహమ్మదీయులను తమకు తొలిశత్రువులుగా భావించిరి. కాని క్రీ.శ.1870 తదనంతరం దేశంలో జాతీయవాదం బలపడెను. అందువలన మెజారిటి హిందువులకు మారుగా మైనారిటీలు అయిన మహమ్మదీయులతో స్నేహసంబంధాలను పెంపొందించుటకు ఆంగ్లేయులు ప్రయత్నాలు ప్రారంభించిరి. ఈ ప్రయత్నాలు దేశంలోని నవాబులు, భూస్వాములు బలపరిచిరి. నాటికే పాశ్యాత్య విద్యావిధానాలను సమర్థించిన ముస్లిం సంస్కర్త సయ్యద్ అహమ్మద్‌ఖాన్ అంగ్లేయులకు పూర్తిగా సహకరించెను. 1880లోనే హిందూ–ముస్లింల రాజకీయ ప్రయోజనాలు ఒకే విధమైనవి కావని అహమ్మద్‌ఖాన్ ప్రకటించెను. ఇతడు కాంగ్రెస్‌ను వ్యతిరేకించుతూ, మహమ్మదీయులను కాంగ్రెస్‌లో చేరవద్దని పిలుపు ఇచ్చెను. ప్రభుత్వ సర్వీసులలో మహమ్మదీయులకు ప్రత్యేక హోదాలు కల్పించవలెనని ఇతడు వాదించెను. ఈవిధంగా హిందూ–ముస్లిం వేర్పాటు ధోరణులకు అహమ్మద్‌ఖాన్ తొలిబీజాలు నాటెను.

దేశంలో మతతత్వ ధోరణులు పెంపొందుటకు సామాజిక, ఆర్థిక పరిస్థితులు సైతం దోహదపడినవి. మహమ్మదీయులు పాశ్యాత్య, ఆంగ్ల విద్యకు చాలాకాలం దూరం ఉండిరి. ఫలితంగా వీరు వెనుకబాటు తనంతో విద్యాహీనులుగా మిగిలిపోయి పాలనారంగంలో పదవులకు దూరమైరి. వీరు వ్యాపార రంగంలో పెద్దగా శ్రద్ధ చూపలేక పోయిరి. ఎక్కువమంది భూస్వాముల ఆధీనంలో ఉండిపోయిరి. ఈ ముస్లిం భూస్వాములు ఆంగ్లేయులకు విధేయులుగా మారి తమ ఆధీనములోని మహమ్మదీయులను హిందువులకు వ్యతిరేకంగా వినియోగించుకొనిరి.

మతతత్వం విస్తరించుటకు మరొక ముఖ్య కారణం దేశంలో బలపడిన తీవ్రవాద జాతీయభావాలు. ఈ భావాలు ప్రధానంగా హిందుమత, సంస్కృతుల ప్రాతిపదికపై బలపడినవి. వీరు చేపట్టిన శివాజి జయంతి, గణపతి నవరాత్రులు

మొదలగు కార్యక్రమాలు హిందూ ముస్లింల మధ్య దూరంను పెంచుటకు దోహదకారి అయినవి. శివాజీని ఔరంగజేబును ఎదిరించిన గొప్పనాయకునిగా కీర్తించుటను ముస్లింలు జీర్ణించుకొనలేక పోయిరి. ప్రాచీన భారతీయ సంస్కృతిని ప్రశంశించుతూ మధ్యయుగ వ్యవస్థలను విమర్శించుటను మహమ్మదీయ సమాజం సహించలేకపోయెను. ప్రాచీన, మధ్యయుగ సమాజాలు మత ప్రాతిపదికపై కాక ఆర్థిక, రాజకీయ ప్రయోజనాల ఆధారంగా ఏర్పడినవన్న వాస్తవాన్ని ఈ వర్గాలు గమనించలేకపోయినవి. భారతీయ ఉమ్మడి సంస్కృతి దెబ్బతిని హిందు-ముస్లింలలో ఆలోచనలు విషపూరితమైనవి.

వేర్పాటు శక్తులు క్రీ.శ.1906 నాటకి మరింత బలపడిరి. ఆంగ్లేయుల ప్రోత్సాహంతో ముస్లిం పెద్దలు ఢాకా నవాబు ఆగాఖాన్, నవాబు మొహిసిన్-ఉల్-ముల్క్‌ల నాయకత్వంలో ముస్లిం లీగ్‌ను స్థాపించిరి. దీనికి ముందే ముస్లిం ప్రతినిధి వర్గం ఆగాఖాన్ నాయకత్వంలో రాజప్రతినిధి మింటోను కలియుట గమనార్హము. దేశంలో ఎటువంటి ఎన్నికల్లోనైన మహమ్మదీయులకు ప్రత్యేక ప్రాతినిధ్యంను కల్పించవలెనని వీరు మింటోను కోరిరి. దీనిని మింటో వెంటనే అంగీరించుటయే గాక క్రీ.శ.1909 మింటో-మార్లే సంస్కరణలో అమలు చేసెను.

భారత జాతీయోద్యమ చరిత్రలో దేశంనందలి ముస్లిం రాజకీయ చరిత్రలో ఇండియన్ ముస్లిం లీగ్ స్థాపన అత్యంత ముఖ్య సంఘటన. ఆంగ్లేయులకు భారతీయ ముస్లింలను విధేయులుగా చేయు లక్ష్యముతో ముస్లిం లీగ్‌ను స్థాపించిరి. ప్రభుత్వం ముస్లింల రాజకీయ ప్రయోజనాలు హిందువుల ప్రయోజనాలకు భిన్నమైనవని ప్రకటించిరి. ఈ విధమైన చర్యల ద్వారా దేశీయ మహమ్మదీయులను తమకు అనుకూల వర్గంగా మార్చుకొనుటయే గాక విద్యావంతులైన కొంతమంది ముస్లింలను కాంగ్రెస్‌లో చేరనివ్వకపోవుటలో ఆంగ్లేయులు విజయం సాధించిరి. ముస్లింలీగ్ బెంగాల్ విభజనను సమర్థించెను.

ముస్లింలీగ్ చర్యలు చాలావరకు ఆ వర్గానికి చెందిన ఉన్నత తరగతులకు వారి ప్రయోజనాల కొరకు కృషిచేసెను. మహమ్మదీయులలో పేదతరగతి వారిని గురించి లీగ్ ఎంతమాత్రం శ్రద్ధ చూపలేదు. తదనంతర కాలంలో మౌలాన మహమ్మద్ ఆలి, మౌలానా అబుల్‌కలాం మొదలగు వారు నవాబులకు, ముస్లిం జమీందార్లకు వ్యతిరేకంగా మాట్లాడగలిగిరి. హిందూ-ముస్లిం జాతీయవాదంలో ఎటువంటి వివాదంలేదని ఆజాద్ ప్రకటించెను. జాతీయోద్యం పెంపొందిన మత వైషమ్యాలను వివరంగా తదుపరి పాఠ్యాంశంలో చర్చించెదము.

బ్రిటీష్ వారి చర్య ఫలితంగా దేశంలోని హిందూ-ముస్లిం సఖ్యత దెబ్బతినెను. ఒక వర్గానికి వ్యతిరేకంగా మరొకరిని ప్రోత్సహించు విధానాల ద్వారా భారత జాతీయ వాదంను దెబ్బతీయుటకు ఆంగ్లేయులు ప్రయత్నించిరి.

## పాఠ్య ప్రశ్నలు 61.సి

1. విద్యావంతుడైన సయ్యద్ అహమ్మద్‌ఖాన్ వంటి నాయకుడు ఎందువలన ముస్లిం వేర్పాటు వాదాలను సమర్థించెను?

2. మతఛాందస వాదం బలపడుటకు దోహదపడిన ఆర్థిక కారణాలలో ఒక దానిని తెలుపుము?

3. దేశంలో మతవాదం పెంపొందుటకు ఆంగ్లేయులు భారతదేశచరిత్రలో రూపొందించిన హిందు, ముస్లిం యుగాలు అను విభజన ఏవిధంగా ఉపకరించెను?

4. ముస్లింలీగ్ ఎప్పుడు స్థాపించబడెను?

## 61.6 మింటో-మార్లే సంస్కరణలు :

బెంగాల్ విభజన వ్యతిరేక ఉద్యమ విజయం, కాంగ్రెస్ కార్యకలాపాలు ఆంగ్లేయులను ఆందోళనకు గురిచేసినవి. అందువలన ఆంగ్లేయులు 'విభజించు పాలించు' ఆయుధంను దేశంలో ప్రయోగించిరి. మితవాదులను సంతృప్తిపరచి అతివాద జాతీయవాదంను నియంత్రించుటకు ప్రయత్నించిరి. ఇందులో భాగంగా క్రీ.శ.1909 ఇండియన్ కౌన్సిల్ చట్టంను రూపొందించిరి. (ఈ చట్టమే మింటో-మార్లే సంస్కరణలుగా పిలువబడెను). అంతేకాక, క్రీ.శ.1911లో బెంగాల్ విభజన రద్దుచేయబడి నూతనంగా బీహార్, ఒరిస్సా రాష్ట్రాలను ఏర్పాటు చేసిరి. అదే సంవత్సరంలో రాజధానిని కలకత్తా నుండి రాజధానిని ఢిల్లీకి మార్చిరి.

క్రీ.శ.1909 రాజ్యాంగ చట్టం కేవలం క్రీ.శ.1892 చట్టానికి కొనసాగింపు మాత్రమే. ఈ చటం ద్వారా ఎటువంటి గొప్ప మార్పులు సంభవించలేదు. కేంద్రశాసనమండలిలో అదనపు సభ్యుల గరిష్ట సంఖ్య 60కి పెంచబడెను. రాష్ట్ర శాసనమండలిలో సభ్యుల సంఖ్య 30-60గా నిర్ణయించిరి. కేంద్రములో అధికార సభ్యులే అధికశాతంగా ఉండిరి. రాష్ట్రాలలో మాత్రము భిన్నంగా ఉండెను. నామినేట్ సభ్యులు సాధారణంగా ఆంగ్ల అనుకూల వైఖరినే అవలంభించిరి. ఈ సంస్కరణ ద్వారా గవర్నర్-జనరల్ కార్యవంంలో ఒక భారతీయునికి సభ్యత్వం లభించెను. ఎస్.పి.సిన్హా ఈ పదవిని పొందిన తొలిభారతీయుడు. క్రీ.శ.1909 చట్టం కౌన్సిళ్ళ పనితీరులో కొన్ని మార్పులను తెచ్చెను. తీర్మానాలను ప్రవేశపెట్టుటకు, బడ్జెట్ అంగీకారానికి ముందు దానిపై చర్చించుటకు వీలు ఇవ్వబడెను. కాని సైనిక, విదేశీ, సంస్థానాల విషయంలో ఎటువంటి తీర్మానాలు చేయుటకు వీలులేదు. బడ్జెట్‌పై ఓటింగ్‌కు అవకాశం ఇచ్చిరి.

వాస్తవానికి ఆచరణలో ఈ సంస్కరణల ఫలితంగా భారతీయులకు ఎటువంటి ప్రయోజనం కలగలేదు. శాసన మండలులు కేవలం సలహ సంఘాలుగా మాత్రమే పనిచేసినవి. స్థానిక స్వపరిపాలన, ప్రజాస్వామ్య వ్యవస్థల దృష్ట్యా ఈ సంస్కరణలు ఎటువంటి చర్యలు తీసుకొనలేదు. బ్రిటీష్ వారి విదేశీ విధానాలను, అప్రజాస్వామ్య పద్ధతులలో దోపిడీ స్వభావంలో ఎటువంటి మార్పు రాలేదు.

ఈ చట్టంలోని అత్యంత దుర్మార్గమైన అంశం ఈ సంస్కరణలు దేశంలో మతప్రాతిపదికన ఎన్నికల వ్యవస్థకు ప్రాణం పోయటం. మహమ్మదీయులకు ఈ చట్టం ద్వారా ప్రత్యేక నియోజక వర్గాలు కేటాయించబడినవి. ఈ నిర్ణయం ద్వారా ప్రజలను విడదీసి రాజకీయ, ఆర్థిక ప్రయోజనాలకన్నా మతతత్వ ధోరణులకే అధికప్రాధాన్యతను పెంపొందించుకొను స్థితికి భారతీయులను దిగజార్చుటకు ఆంగ్లేయులు ప్రయత్నించిరి. మహమ్మదీయులకు జనాభాలో వారి ప్రాతినిధ్యంను మించిన స్థానాలను కేటాయించిరి. ఫలితం హిందూ-ముస్లింల మధ్య దూరం అధికమయ్యెను. మహమ్మదీయుల చుట్టూ ఒక చట్రంను ఏర్పాటు చేసి వారిని దేశములో మిగిలిన వారికి దూరం చేయుటకు ఈ చట్టము వినియోగపడినదని నెహ్రూ అభిప్రాయపడెను. ఈ సంస్కరణ తదనంతరం సమాజంనందలి ఇతర వర్గాలు ప్రత్యేక స్థానాల కొరకు ఉద్యమించిరి. క్రీ.శ.1935 నాటికి హరిజనులకు, ఆంగ్లో ఇండియన్‌లకు సైతం ప్రత్యేక నియోజక వర్గాలను కేటాయించిరి ఇటువంటి చర్యల ద్వారా జాతీయతా భావాలు ఛిన్నాభిన్నమగు ప్రమాదం వాటిల్లెను. గాంధీ అభిప్రాయంలో ఈ చట్టాలు చేయకూడని సంస్కరణలు.

మితవాద నాయకులను గందరగోళానికి గురిచేసి, వారిని విడతీసి తద్వారా వృద్ధిచెందుచున్న ఐక్యతను భారతీయులలో దెబ్బతీయు లక్ష్యంగా క్రీ.శ.1909 సంస్కరణలు చేయబడినవి.

## పాఠ్య ప్రశ్నలు 61.డి

1. మింటో–మార్లే సంస్కరణలు విప్లవాత్మక మార్పులను ప్రవేశపెట్టలేకపోయినవిఅని ఎట్లు చెప్పవచ్చును?
2. గవర్నర్–జనరల్ కార్యవర్గ సభ్యులుగా నియమించబడిన తొలి భారతీయుడు ఎవరు?
3. క్రీ.శ.1909 చట్టంనందలి ఏ అంశం దేశంలో మతతత్వం వృద్ధి చెందుటకు ఉపకరించెను?
4. గాంధీ ఏల ఈ సంస్కరణలను చేయకూడని సంస్కరణంగా అభివర్ణించెను?

## 61.7 విప్లవ కార్యకలాపాలు :

20వ శతాబ్దంలో జాతీయోద్యమంలో సంభవించిన మరొక పరిణామం విప్లకార్యకలాపాల వృద్ధి. మాతృదేశానికి బ్రిటీష్ పాలననుండి తక్షణమే విముక్తి కలిగించవలెనని అనేకమంది యువకులు విప్లవ మార్గాన్ని ఎంచుకొనిరి. స్వరాజ్యంను తెచ్చుటలో అతివాదుల వైఫల్యం యువతను నిరాశకు గురిచేసెను. అతివాదులు ప్రజాఉద్యమాలు, విదేశీవస్తు బహిష్కరణ, న్యాయస్థానాలు, విద్యాసంస్థల బహిష్కరణను ప్రధానంగా చేపట్టెను. వీరి కృషి ఫలితంగా నాటి యువతలో త్యాగంతో కూడిన దేశభక్తి పెంపొందెను. ఇటువంటి యువకులందరూ ఆంగ్ల పాలనపై భౌతిక దాడులకు సిద్ధపడిరి.

విప్లవవాదులు దేశంలో అనేక రహస్య విప్లవ సంఘాలను నెలకొల్పిరి. క్రీ.శ.1904లో వి.డి.సావర్కర్ 'అభినవ భారత్' అనే విప్లవ సంఘాన్ని స్థాపించెను. అనుశీలన సమితి, యుగాంతర్ అను విప్లవ సంఘాలు వెలుగులోనికి వచ్చినవి. 1907–08 నాటికి ఈ విప్తవాలు తీవ్రతరమై ఆంగ్లేయులపై బాంబు దాడులకు పురికొల్పాయి. నాటి కొన్ని పత్రికలు సైతం విప్లవ భావాలను ప్రచారం చేయుటలో ముఖ్యపాత్ర పోషించినవి. అటువంటి పత్రికలలో యుగాంతర్, సంధ్య, వందేమాతరం మొదలగునవి ముఖ్యమైనవి. మహారాష్ట్రలో కాల్‌పత్రిక, భవాని మందిర్ మొదలగు పత్రికలు విప్లవకారుల కార్యకలాపాలను గొప్పగా ప్రచురించినవి. గెరిల్లా యుద్ధ వ్యూహాలను గురించి అవినాష్ చంద్ర భట్టాచార్య వ్యాసాలను ప్రచురించెను.

ప్రజావ్యతిరేక ఆంగ్ల అధికారులను, దేశద్రోహులను, విప్లవద్రోహులను వధించు కార్యక్రమాన్ని విప్లవ సంఘాలు చేపట్టినవి. ఆయుధ సంపత్తి కొరకు దోపిడీ కార్యక్రమాలను సాగించిరి. క్రీ.శ.1897లోనే ప్లేగ్ కమీషనర్ రాండ్ హత్య ఈ సందర్భంలో జ్ఞప్తికి తెచ్చుకొనవలెను. క్రీ.శ.1906 తదనంతరం విప్లకార్యకలాపాలు తీవ్రతరమయ్యెను. క్రీ.శ.1907లో బెంగాల్ గవర్నర్‌పై హత్యాప్రయత్నం చేసి విఫలులైరి. న్యాయమూర్తి కింగ్స్‌ఫర్డ్‌ను హత్య చేయుటకు ప్రఫుల్లఛాకి, కుదీరాం బోస్‌లు బాంబులు వేయగా, ఆ ప్రయత్నం విఫలమయ్యెను. ఈ ప్రయత్నంలో కింగ్స్‌ఫర్డ్ మారుగా ఇరువురు మహిళలు ప్రాణాలు కోల్పోయిరి. చాకి ఆత్మహత్య చేసుకొనగా, కుదీరాం వురితీయబడెను. జాతి ఈ ఇరువురి విప్లకారులకు నివాళి సమర్పించెను. క్రీ.శ.1909లో కలకత్తాలో ఒక పబ్లిక్ ప్రాసిక్యూటర్, ఒక డిప్యూటి పోలీస్ సూపరిండెంట్ హత్యకు గురైరి.

క్రీ.శ.1912లో రాజప్రతినిది హర్డింజ్‌పై చాందినిచౌక్ వద్ద రాస్‌బిహారి బోస్, సచిన్ సన్యాల్ అను విప్లవకారులు బాంబులు వేసిరి. ఈ దాడిలో రాజప్రతినిధి గాయపడగా అతని అంగరక్షకుడు మరణించెను. లండన్‌లో మదన్‌లాల్ డింగ్రా అను విప్లవకారుడు కర్జన్‌వైలి అను ఆంగ్లేయుని హత్యచేసెను. క్రీ.శ.1908–1918 సంవత్సరముల మద్యకాలములో

186 మంది విప్లవకారులను వధించుట జరిగెను. ఈ విప్లవకార్య కలాపాలు క్రమంగా బీహార్, ఒరిస్సా , ఉత్తరప్రదేశ్‌లకు విస్తరించెను.

భారతీయ విప్లకారులు తమ చర్యలను మనదేశానికే పరిమితం చేయలేదు. ఇతర దేశాలలో పలువురు భారతీయులు విప్లవ కార్యకలాపాలకు సిద్ధపడిరి. వీరిలో శ్యాంజికృష్ణవర్మ, వి.డి.సావర్కర్, లాల హరదయాళ్, అజిత్‌సింగ్, మేడంచికాజికామ మొదలగు వారు ముఖ్యులు.

విప్లవకారుల యెడల ప్రభుత్వం అణచివేత విధానంను అవలంబించెను. విప్లవకారులను ప్రభుత్వం చుట్టుముట్టి అణచివేయుటకు ప్రయత్నించెను. పత్రికలపై ఆంక్షలు విధించెను. సమావేశాలపై నిషేధంలు పెట్టిరి. క్రీ.శ.1908లో ఆయుద చట్టము చేయబడినది. భారతీయ క్రిమినల్ చట్టము సవరించబడెను.

మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో తిరిగి విప్లవ కార్యక్రమాలు ప్రారంభమయ్యెను. క్రీ.శ.1912 నాటికి విప్లవ సంఘాలు పునరేకీకరణ చెందినవి. ఈ కాలంలో ఇతర దేశాలలో భారతీయ విప్లవ సంఘాలు మరింత బలపడినవి. క్రీ.శ.1915లో తారకానాద్ దాస్, సోహన్‌సింగ్, లాల హరదయాళ్ మొదలగు వారు గదర్ పార్టీని స్థాపించిరి. ఆయుధాలను సేకరించి, విప్లవ సాహిత్యంను ముద్రించి ఆంగ్ల అధికారులను అంతమొందించుటకు లక్ష్యంగా గద్దర్ పార్టి అవతరించెను. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో ఈ విప్లకారులు బ్రిటీష్ వ్యతిరేక దేశాలైన జర్మనీ, దాని మిత్ర దేశాలతో కలిసి బెర్లిన్‌లో 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్'ను ఏర్పాటుచేసిరి.

ఈ కాలంలో 'కోమాగటమరు' అను సంఘటన సంచలనం కలిగించెను. క్రీ.శ.1914లో కోమాగటమరు అను జపాన్ నౌకలో శిక్కులు, కొంతమంది పంజాబి మహమ్మదీయులు హాంగ్‌కాంగ్ నుండి కెనడా నందలి వాంకోవార్‌కు పయనమైరి. కాని వీరిని కెనడా ప్రభుత్వం అనుమతించలేదు. వీరు తిరిగి ఇండియాకు బయలుదేరగా వీరందరిని విప్లకారులుగా భావించి ఆంగ్ల ప్రభుత్వం వారిని కలకత్తాలో దించి నిర్బంధించెను. ప్రయాణీకులను బలవంతంగా రైలులో పంజాబ్‌కు పంపు ప్రయత్నంలో జరిగిన సంఘటనలో 20 నుండి 40 మంది ప్రాణాలు కోల్పోయిరి. ఈ సంఘటన ఆంగ్ల వ్యతిరేకతను మరింత పెంచినది.

క్రీ.శ.1915 ఫిబ్రవరి 21న గద్దర్ పార్టీ సభ్యులు పంజాబ్‌లో సాయుధ తిరుగుబాటుకు ప్రణాళిక సిద్ధం చేసుకొనిరి. కాని ప్రభుత్వం ముందుగా దీనిని తెలుసుకొని విప్లవకారులను నిర్బంధించెను. 42మంది గద్దర్ పార్టి సభ్యులను ఈ సందర్భంగా ఉరి తీసిరి. 114 మందికి యావజ్జీవ కారాగార శిక్ష, 93 మందికి దీర్ఘకాల జైలుశిక్షను విధించిరి.

కాలక్రమేణా విప్లవకార్యకలాపాలు తగ్గుముఖం పట్టినవి. విప్లవకారులు తమలక్ష్య సాధనలో సఫలీకృతులు కాలేక పోయినను జాతీయతాభావములను పెంపొందించుట వారి కృషిని, త్యాగాలను తక్కువగా అంచనా వేయుటకు వీలులేదు. వీరు చేసిన త్యాగాలు అనేకమంది భారతీయులకు గొప్ప ప్రేరణను కల్పించినవి.

క్రీ.శ.1907 తదనంతరం కాంగ్రెస్ విధానంతో విసిగిపోయిన యువత విప్లవ కార్యకలాపాలపై ఆసక్తి చూపిరి. ఫలితంగా దేశంలో అనేక విప్లవ సంఘాలు ఆవిర్భవించి దౌర్జన్య సంఘటనలు చోటు చేసుకొనెను.

## పాఠ్య ప్రశ్నలు 61.ఇ

1. విప్లవకారులు స్థాపించిన ఒక విప్లవ సంఘం పేరు తెలపండి?

2. గద్దర్ పార్టీ విధానాలు ఏవి?

3. మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో విదేశాలలోని భారతీయ విప్లవకారులు ఏవిధంగా ఆంగ్ల పాలనను అంతమొందించుటకు ప్రయత్నాలు చేసిరి.

4. విప్లవ కార్యకలాపాలను ఆంగ్ల ప్రభుత్వము ఏవిధముగా అణిచివేసెను.

## 61.8 హోమ్‌రూల్ (స్వదేశీ) ఉద్యమం :

క్రీ.శ.1914లో మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభమైన వెంటనే కాంగ్రెస్ యుద్ధంలో ఇంగ్లండ్‌ను సమర్ధించుటకు నిర్ణయించెను. దీనికి ప్రతిఫలంగా బ్రిటీష్ ప్రభుత్వము భారతీయులకు స్వపరిపాలనను ఇచ్చెదరని కాంగ్రెస్ భావించెను. వాస్తవానికి యుద్ధం ఇంగ్లాండ్ వలస రాజ్యాలపై తన అదుపును నిలుపుకొనుటకే చేయుచున్నదని కొంతమంది కాంగ్రెస్ నాయకులు అర్ధం చేసుకొనిరి. అందువలన స్వపరిపాలనకు అంగ్లేయులు వ్యతిరేకులని గ్రహించిరి.

క్రీ.శ.1914లో సంవత్సరం జైలు శిక్షను పూర్తిచేసుకొని తిలక్ విడుదలయ్యెను. ఈ జైలు జీవితం తిలక్ ఆలోచనా విధానాలలో అనేక మార్పులను తెచ్చెను. కాంగ్రెస్‌ను జాతీయోద్యమానికి ప్రతీకగా భావించెను కాంగ్రెస్ ఆమోదం లేనిదే ఎటువంటి రాజకీయ చర్య సాధ్యంకాదని అభిప్రాయపడెను. అందువలన ముందుగా తిలక్ కాంగ్రెస్‌కు దగ్గరగుటకు ప్రయత్నాలు ప్రారంభించెను. అతివాదులు కాంగ్రెస్‌కు చేరువ అగుటను అనిబిసెంట్ సమర్ధించెను. అంతవరకు దివ్యజ్ఞాన సమాజ కార్యక్రమాలకు పరిమితమైన అనిబిసెంట్ కాంగ్రెస్‌లో ప్రవేసించెను. భారతీయులు స్వపరిపాలనకు పూర్తి అర్హులని, యుద్ధానంతరం అటువంటి స్వపరిపాలనను ఇవ్వవలెనని అనిబీసెంట్ పేర్కొనెను. క్రీ.శ.1914 నుండి అనిబిసెంట్ స్వపరిపాలన(హోమ్‌రూల్) కొరకు పనిచేయుట ప్రారంభించెను. ఈ ఉద్యమానికి అనిబిసెంట్ న్యూఇండియా కామన్‌వోల్ అను తన పత్రికలను ప్రధానంగా వినియోగించెను. అనిబిసెంట్, తిలక్‌ల కృషి ఫలితంగా అతివాదులను తిరిగి కాంగ్రెస్‌లో విలీనమగుటకు క్రీ.శ.1915 వార్షిక సమావేశంలో కాంగ్రెస్ సమ్మతిని తెలిపెను. క్రీ.శ.1916 ఏప్రియల్‌లో తిలక్, సెప్టెంబర్‌లో అనిబిసెంట్‌లు హోమ్‌రూల్ లీగ్‌లను ప్రారంభించిరి. తిలక్ నాయకత్వంలోని లీగ్ మహారాష్ట్ర, కర్నాటక, మధ్యభారత ప్రాంతాలు, బీరర్‌లకు ప్రాతినిధ్యం వహించగా, అనిబిసెంట్ హోమ్‌రూల్ కార్యకలాపాలను మిగిలిన ప్రాంతాలలో వ్యాపింపచేసెను. ఈ రెండు లీగ్‌లు దేశానికి స్వపరిపాలనను అందించు లక్ష్యంతో కృషి చేసినవి. తిలక్ “స్వపరిపాలన నా జన్మహక్కు, దానిని సాధించి తీరుతాను” అని గర్జించెను.

క్రమంగా హోమ్‌రూల్ ఉద్యమం తీవ్రస్థాయికి చేరుకొనెను. ఉద్యమ ప్రచారానికి నూతన పద్ధతులను నాయకులు వినియోగించారు. పత్రికల ద్వారా మాత్రమే కాక అనేక ప్రాంతీయ భాషలలో నాయకులు కరపత్రములను ముద్రించి ప్రజలలో హోమ్‌రూల్ లక్ష్యాలను ప్రచారం చేసిరి. బహిరంగ సభ, గీతాలు, గేయాలు ఉద్యమ వ్యాప్తికి గొప్పగా దోహదపడినవి. ఈ ఉద్యమం మహిళలను, విద్యార్థులను విశేషముగా ఆకట్టుకొనెను. కాంగ్రెస్ నాయకులైన తేజ్‌బహదూర్ శాస్త్రి, మోతీలాల్ నెహ్రూ, చిత్తరంజన్ దాస్, లాలాలజపతిరాయ్, భూలబామ్‌దేశాయి, సి.ఆర్.రామస్వామి అయ్యంగార్

మొదలగువారు ఉద్యమంలో చేరిరి. క్రీ.శ.1918 నాటి తిలక్ ప్రారంభించిన లీగ్‌లు 32,000 మంది, అనిబిసెంట్ లీగ్‌లో 27,000 మంది సభ్యులుగా చేరిరి.

హోమ్‌రూల్ ఉద్యమ వ్యాప్తి ఆంగ్ల ప్రభుత్వంను ఇబ్బందులకు గురిచేసెను. ఈ ఉద్యమాన్ని అదుపుచేయుటకు పలుచర్యలు చేపట్టెను. క్రీ.శ.1916లో బీహార్,మధ్య భారత ప్రాంతాలలో అనిబిసెంట్ ప్రదేశాన్ని ప్రభుత్వం నిషేధించెను.తిలక్‌ను ఢిల్లీ, పంజాబ్ ప్రాంతాలలో అనుమతించలేదు. క్రీ.శ.1917లో మద్రాస్ ప్రభుత్వము అనిబిసెంట్‌ను ఆమె అనుచరులైన జార్జి అరుండేల్, బి.పి.వాడియాలతో సహ నిర్బంధించెను. దీనిని దేశవ్యాప్తముగా ప్రజలు నిరసించిరి. ఈ కాలంలోనే మితవాద నాయకులైన మదన్‌మోహన్ మాలవ్య, ఎస్.యన్.బెనర్జీ, ఎం.ఏ.జిన్నా మొదలగు వారు హోమ్‌రూల్ ఉద్యమాన్ని బలపరిచిరి. సుబ్రమణ్యం అయ్యంగార్ అంగ్లేయులు ప్రకటించిన 'నైట్‌హుడ్' గౌరవాన్ని తిరస్కరించెను. అనిబిసెంట్ విడుదలకు ప్రభుత్వంపై ఒత్తిడి అధికమయ్యెను. క్రీ.శ.1917 కాంగ్రెస్ సమావేశంలో తిలక్ శాంతియుత ప్రతిఘటనను శాసనఉల్లంఘనను ప్రతిపాదించెను. ప్రభుత్వ విధానాలు నాయకులను మరింతగా ఉద్యమాన్ని తీవ్రతరం చేయుటకు పురికొల్పెను. గత్యంతరం లేక క్రీ.శ.1917 సెప్టెంబర్‌లో ప్రభుత్వం అనిబిసెంట్‌ను విడుదల చేసెను. కాంగ్రెస్ అనిబిసెంట్‌ను 1917 కలకత్తా సమావేశంలో అధ్యక్షురాలిగా ఎన్నుకొనెను.

**లక్నో ఒడంబడిక (1916) :**

హోమ్‌రూల్ ఉద్యమ ప్రాముఖ్యతను సమీక్షించుటకు ముందుగా క్రీ.శ.1916లో జరిగిన పరిణామాలను గురించి తెలుసుకొనవలెను. క్రీ.శ.1916లో మితవాదులు అతివాదులు ఏకమైరి. లక్నో ఒడంబడిక ఫలితంగా ముస్లింలీగ్ కాంగ్రెస్‌కు చేరవయ్యెను.

భారతదేశ ముస్లింలలో అధికశాతం ఆంగ్లేయులకు విధేయులుగా ఉన్న విషయము మనము ఇంతకు ముందు పాఠములో అధ్యయనము చేసి యున్నాయి. సయ్యద్ అహమ్మద్‌ఖాన్, ఆగాఖాన్ మొదలగు వారి అభిప్రాయములో ఆంగ్లేయుల పాలనలోనే ముస్లింల రక్షణ సాధ్యపడగలదు. కాని ప్రపంచ యుద్ధానికి ముందు జరిగిన పరిణామాలు మహమ్మదీయులను అంగ్లేయులకు దూరమగుటకు దోహదపడినవి. క్రీ.శ.1911లో బెంగాల్ విభజన రద్దు మహమ్మదీయులను నిరాశకు గురిచేసెను. మొదటి ప్రపంచ యుద్ధంలో ముస్లిం రాజ్యం టర్కీ ఇంగ్లాండ్‌కు వ్యతిరేకంగా పోరాడి ఓడిపోయాడు. భారతీయ ముస్లింలు టర్కీని తమ తమ నాయకత్వ దేశంగా భావించెడివారు. బ్రిటన్ అనుసరించిన టర్కీ వ్యతిరేక విధాన ఫలితముగా ఇస్లాం సంస్కృతికి ఆంగ్లేయులు ప్రధాన శత్రువులని మహమ్మదీయులు భావించిరి. టర్కీ సమస్యను ఆల్–హలాల్, కామ్రెడ్ మొదలగు పత్రికలు విస్తృతంగా ప్రచారం చేసినవి. ఇటువంటి పరిస్థితులలో యువ ముస్లిం నాయకులైన మౌలానా నాయకత్వ బాధ్యతలను చేపట్టిరి. దీని ఫలితంగా ముస్లిం లీగ్‌పై ఆలిఘర్ సాంప్రదాయ ప్రభావము తొలగిపోయెను. ఫలితముగా ముస్లిం లీగ్ కాంగ్రెస్‌లు సమిష్టిగా ఉద్యమంను నడుపుటకు క్రీ.శ.1916 లక్నో ఒడంబడికలో అంగీకారానికి వచ్చిరి.

కాంగ్రెస్, హోమ్‌రూల్ లీగ్‌లు సమిష్టిగా రాజ్యాంగ సంస్కరణలకొరకు ఉద్యమించుటకు ఒప్పందము కుదిరెను. ఉమ్మడి లక్ష్యమును, దేశములో స్వపరిపాలనా దిశగా ప్రణాళికల ఏర్పాటుకు అంగీకారము కుదిరెను. శాసనమండలుల అధికారాలను విస్తృతపరచుటకు, రాజప్రతినిధి మండలిలో భారతీయుల ప్రాతినిధ్యము, కేంద్రశాసన మండలిలో మహమ్మదీయులకు ప్రత్యేక ప్రాధాన్యతను ఇచ్చుటకు కాంగ్రెస్ ముస్లింలీగ్‌ల మధ్య అంగీకారం కుదిరెను. అదేవిధంగా

హిందువులు అల్పసంఖ్యాకులుగా గల బెంగాల్, పంజాబ్‌లలో హిందువుల ప్రయోజనాలకు లీగ్ ఆమోదం తెలిపెను. హిందూ, ముస్లిం వర్గాలలో 3/4 సభ్యుల ఆమోదము లేనిదే ఎటువంటి తీర్మానమును ప్రతిపాదించరాదని నిర్ణయించబడెను.

లక్నో ఒడంబడిక వాస్తవానికి మనస్ఫూర్తిగా జరిగిన ఒడంబడికగా భావించుటకు వీలులేదు. మహమ్మదీయులకు శాసనమండలులలో ప్రత్యేక రిజర్వేషన్‌లు జాతి వ్యతిరేకమని వాదించిన కాంగ్రెస్ తన అభిప్రాయంను మార్చుకొని దానిని అంగీకరించవలసి వచ్చెను. ఈ నిర్ణయం కాంగ్రెస్-లీగ్‌ల సఖ్యతకు, తద్వారా హిందూ-ముస్లిం ఐక్యతకు దోహపడగలదని భావించిరి. తాత్కాలికముగా ఈ ఒప్పందం జాతీయవాదానికి తాత్కాలికంగా బలాన్ని చేకూర్చినను దీర్ఘకాలములో గొప్ప నష్టాన్ని మిగిల్చినది. ఈ ఒప్పందం ఫలితంగా ఏర్పడిన హిందూ-ముస్లిం ఐక్యత దీర్ఘకాలము నిలువలేక పోయెను. కాంగ్రెస్ ఆమోదించిన ప్రత్యేక నియోజకవర్గాలు రిజర్వేషన్‌ను ప్రతిపాదనకును తిరిగి తిరస్కరించెను. ఫలితముగా ఇరువర్గాలను కలుపుటకు వీలులేనంత అభిప్రాయ భేదములు పొడసూపినవి.

కాంగ్రెస్-ముస్లిం లీగ్‌ల మధ్య కుదిరిన ఒప్పందం జాతీయోద్యమ చరిత్రలో గొప్ప ప్రాముఖ్యత కలిగిన సంఘటన. ఈ ఒప్పందం ఆంగ్లేయులను అప్రమత్తం చేసెను. జాతీయవాదులను సంతృప్తి చేయవలసిన ఆవశ్యకత ప్రభుత్వానికి కలిగెను. అందులో భాగంగా నాటి భారత వ్యవహారాల కార్యదర్శి, మాంటేగ్ క్రీ.శ.1917 ఆగస్టులో బ్రిటన్‌నందలి కామన్స్ సభలో ఒక ప్రకటన చేసెను. పరిపాలనలో ప్రతిశాఖనందు భారతీయుల ప్రాతినధ్యంను పెంపొందించి, దేశంలో స్వపరిపాలనను, బాధ్యతాయుత పాలనను ప్రవేశపెట్టుటయే ప్రభుత్వ ప్రధాన ఆశయమని ప్రకటించెను. మాంటేగ్ క్రీ.శ.1917 నవంబర్‌లో భారతదేశానికి వచ్చి విస్తృతంగా పర్యటించి ప్రజాభిప్రాయాలను సేకరించెను. క్రీ.శ.1918 ఏప్రియల్‌లో మాంటేగ్ ఛేమ్స్‌ఫర్డ్ పోర్ట్‌ను ప్రచురించిరి. దీని ఆధారంగా క్రీ.శ.1919 భారతచట్టం చేయబడెను. ఈ చట్టంను గురించి తదుపరి పాఠంలో చర్చిద్దాం.

హోమ్‌రూల్ ఉద్యమం, లక్నో ఒడంబడికల సత్ ఫలితాలు అనేకం గోచరించెను. ఇవి శాశ్వతంగా నిలువలేక పోయినవి. క్రీ.శ.1918 తదనంతరం ఉద్యమం క్రమముగా బలహీనపడెను. ఉద్యమంలోనికి వచ్చిన మితవాదులు మాంటేగ్ ప్రకటనతో శాంతించి ఉద్యమం నుండి నిష్క్రమించిరి. తిలక్ ప్రతిపాదించిన శాసన ఉల్లంఘనను అనేకమంది వ్యతిరేకించిరి. ఉద్యమాన్ని ముందుకు తీసుకొని వెళ్ళు సమర్ధ నాయకత్వం లోపించెను. కాని హోమ్‌రూల్ ఉద్యమ కృషిని జాతీయోద్యమంలో తక్కువగా అంచనా వేయుటకు వీలులేదు. జాతీయోద్యమానికి వెన్నెముకవంటి నాయకులను ఈ ఉద్యమం వెలుగులోనికి తెచ్చినది. ఈ ఉద్యమ తదనంతరమే గాంధీ జాతీయోద్యమ నాయకత్వంను చేపట్టెను. అన్ని వర్గాలు తమ భావాలను విస్తృతంగా ప్రచారం చేసుకొనగలిగిరి. గ్రామాలు, నగరాల మధ్య పటిష్టమైన అనుసంధానాలు ఏర్పడి, తదనంతర కాలపు ఉద్యమాలకు మరింత బలమైన వ్యవస్థలు ఏర్పడినవి. ఈ విధంగా హోమ్‌రూల్ ఉద్యమం మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ జాతీయ నాయకత్వాన్ని చేపట్టుటకు మార్గంను కల్పించగలిగెను.

క్రీ.శ.1915-1916 సంవత్సరాలలో హోమ్‌రూల్ లీగ్‌ను ఒక దానిని తిలక్, మరొక దానిని అనిబిసెంట్ ప్రారంభించిరి. హోమ్‌రూల్ లేదా స్వపరిపాలన యుద్ధానంతరం ఇచ్చితీరవలెనని నాయకులు ఉద్యమించిరి.

**పాఠ్య ప్రశ్నలు 61.ఎఫ్**

1. ప్రపంచ యుద్ధంలో జాతీయ నాయకులు ఎందువలన ఇంగ్లాండ్‌ను సమర్ధించిరి?
2. హోమ్‌రూల్ లీగ్ లక్ష్యం ఏమి? తన ఆశయాలను లీగ్ ఏవిధంగా ప్రచారం చేసెను?
3. 1916 లక్నో ఒడంబడిక ప్రాధాన్యత ఎట్టిది?
4. 1918 తదనంతరం హోమ్‌రూల్ ఉద్యమం గణనీయమైన ఘనతను సాధించలేక పోవుటకు ఒక కారణం తెలుపుము.

**సారాంశం :**

1905లో కర్జన్ బెంగాల్‌ను విభజించెను. పాలనా సౌలభ్యం కొరకు చేయబడిన విభజన అని ప్రకటించినను ఇది దేశ జాతీయతను దెబ్బతీయుటకు పన్నిన కుట్ర అని ప్రజలు తెలుసుకొనిరి. ఈ చర్యను భారతీయులు వ్యతిరేకించిరి. బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా అన్ని వర్గాలు ఉద్యమించిరి. బ్రిటీష్ వస్తువలును బహిష్కరించుతూ స్వదేశీ ఉద్యమం జరిగెను. దీని ఫలితంగా జాతీయవాదం ఉధృతమయ్యెను.

ప్రభుత్వపు అమానుష విధానాలు, మితవాదుల వైఫల్యముల ఫలితంగా 19వ శతాబ్ధి చివరి కాలానికి ప్రజలలో రాజీకయ చైతన్యం వృద్ధిచెందెను. ఫలితంగా తిలక్ వంటి అతివాదులు అవతరించిరి. బహిరంగ సభల ద్వారా తీవ్ర జాతీయతావాదమును ప్రచారం చేసిరి. దయానంద, వివేకానంద మొదలగు వారి రచనలు, జపాన్ చేతిలో రష్యా ఓటమి మొదలగునవి అతిజాతీయవాదంను ప్రభావితం చేసిన అంశాలు. కాంగ్రెస్‌లో ఏర్పడిన భిన్న సిద్ధాంతంల ఫలితంగా కాంగ్రెస్ 1907లో రెండుగా చీలిపోయెను.

దేశంలో పెరిగిన జాతీయవాదం ఆంగ్లేయులను అప్రమత్తం చేసెను. హిందూ-ముస్లింలను వేరుచేయు ప్రయత్నాలు చేయసాగిరి. ఫలితంగా బెంగాల్ విభజన జరిగెను. ఆర్థిక వెనుకబాటుతనం, ఆధునిక విద్య లోపించుట మొదలగు కారణముల వలన మహమ్మదీయులలో ప్రగతి భద్రతాభావం లోపించెను. హిందువుల ఘనమైన వారసత్వ చరిత్రను ఆంగ్లేయులు కీర్తించుట, దేశంలో పెరిగిన హిందూ మతఛాందస వాదం, మహమ్మదీయులను మరింత ఆందోళనకు గురిచేసెను. 1906లో ఇండియన్ ముస్లింలీగ్ అవతరించెను.

క్రీ.శ.1909లో మింటో-మార్లె సంస్కరణల ద్వారా మహమ్మదీయులను శాసనమండలులలో రిజర్వేషన్ కల్పించుచూ తిరిగి విభజించు-పాలించు విధానాన్ని ఆంగ్లేయులు ప్రదర్శించిరి. ఈ చర్య ప్రజలలోని జాతీయభావాలపై తీవ్ర ప్రభావంను చూపెను.

జాతీయోద్యమంలో ఈ కాలంనందు అనేక ఉగ్రవాద కార్యకలాపాలు చోటు చేసుకొనెను. బ్రిటీష్ పాలన వలన అసంతృప్తి చెందిన యువకులు ఆయుధపోరాట మార్గంను ఎంచుకొని ఆంగ్లేయులపై బాంబు దాడులకు సిద్ధపడిరి. ఇటువంటి చర్యలు విదేశాలలో సైతము భారతీయులు చేయసాగిరి. ఇటువంటి కార్యకలాపాలకు గద్దర్ పార్టీ ప్రసిద్ధి చెందెను. కాని బ్రిటీష్ ప్రభుత్వం అనుసరించిన అణిచివేత విధానం ఫలితంగా ఉగ్రవాదుల కార్యకలాపాలు క్రమంగా బలహీనపడెను.

మొదటి ప్రపంచ యుద్ధకాలములో ఆంగ్లేయులు దేశానికి స్వపరిపాలనను ఇచ్చెదరనెడి భ్రమతో భారతీయులు గ్రహించి క్రీ.శ.1915–16 సంవత్సరములలో తిలక్, అనిబిసెంట్‌ల హోమ్‌రూల్ లీగ్‌లను ప్రారంభించిరి. వీరు అధినివేశ ప్రతిపత్తిని (self govenment) కోరిరి. 1917లో మాంటేగ్ ప్రకటనతో హోమ్‌రూల్ ఉద్యమం బలహీనపడెను. తదనంతరం జాతీయోద్యమానికి గాంధీ నాయకత్వం వహించెను.

**ప్రశ్నలు :**

I. 100 పదాలలో సమాధానాలు వ్రాయుము.

i పాశ్చాత్య విద్య ఏవిధంగా భారతీయుల తీవ్ర జాతీయ భావాలను పెంపొందుటకు దోహదపడెను.

ii స్వదేశీ ఉద్యమంలో స్త్రీలు, విద్యార్ధులు ఎటువంటి పాత్రను పోషించిరి?

iii దేశంలో మతతత్వ ధోరణులు ప్రబలుటకు చరిత్ర బోధన ఎట్లు ఉపకరించెను?

2. 19వ శతాబ్ది చివరి దశాబ్ధంలో దేశంలో ఉగ్రవాద భావాలు పెంపొందుటకు గల కారణాలు ఏవి?

3. స్వదేశీ ఉద్యమ ప్రారంభంలో జాతీయోద్యమంలో ఒక గొప్ప మలుపు ప్రారంభమయ్యెను. స్వదేశీ ఉద్యమ ప్రాముఖ్యతను,స్వభావంను అంచనా వేయుము.

4. 'మింటోమార్లే సంస్కరణలు దేశంలో ప్రజాస్వామ్య వ్యవస్థలను ఏర్పాటు చేయలేకపోగా మితవాద నాయకులను తీవ్ర గందరగోళానికి గురిచేసినవి' ఈ అభిప్రాయం ఆధారంగా మింటోమార్లే సంస్కరణలను అంచనా వేయుము.

5. 20వ శతాబ్ది ప్రారంభంలో దేశంలో మతఛాందసవాద భావాలు పెంపొందుటకు గల కారణాలు ఏవి?

6. లక్నో ఒడంబడిక జాతీయోద్యమంలో ఏవిధంగా ఒక గొప్ప సంఘటన అని చెప్పవచ్చును.

7. హోమ్‌రూల్ ఉద్యమ లక్ష్యాలు ఏవి? అవి ఎంతవరకు సఫలమైనవి

**అదనపు సమాచారం :**

క్రీ.శ.1907లో కాంగ్రెస్ రెండుగా చీలిపోయెను. మితవాదులు, అతివాదులు వేరు పడిరి. గోఖలే, తిలక్ సిద్ధాంతాలను వాటిమధ్య వైరుధ్యమును లోతుగా అధ్యయనము చేయండి.

## 61.ఎ పాఠ్య ప్రశ్నలకు సమాధానాలు

### 61.ఎ.

1 మితవాదుల విధానాలను అతివాదులు వ్యతిరేకించిరి. ఆంగ్ల ప్రభుత్వంతో వచ్చు మార్పులను వీరు వ్యతిరేకించిరి. వీరు స్వరాజ్యంను కోరిరి.

2. ఈ రచనలు దేశంపై కలిగించు ఆర్థిక దుష్ఫలితాలపై ప్రజలను చైతన్యంను కలిగించినది. దేశ సంపద ఏవిధంగా బ్రిటన్‌కు తరలించబడెనో నౌరోజి వివరించెను. ఆర్థికాభివృద్ధి స్వతంత్ర వ్యవస్థలో సాధ్యపడగలదని గ్రహించి భారతీయులు స్వరాజ్యంను కోరిరి.

3. మతతత్వవాదం

4 (ఎ) విద్యావంతులైన భారతీయులు ఆధునిక జాతీయ భావాలను అధ్యయనం చేసిరి. ఆంగ్ల పాలనలోని అన్యాయాలను వీరు తెలుసుకొనిరి.

(బి) అర్హతలకు తగిన ఉద్యోగాలు పొందలేని విద్యావంతులైన భారతీయ యువకులు అసంతృప్తి చెంది ఉగ్రవాద భావాల యెడల ఆకర్షితులైరి.

5. అబిసీనియా చేతిలో ఇటలీ ఓటరు, ఆంగ్లేయులకు వ్యతిరేకంగా బోమర్లా పోరాటం, రష్యాపై జపాన్ విజయం మొదలగు సంఘటనలు ఐరోపా రాజ్యాలు ఆధిపత్యాన్ని, వారు అప్రతిహతులు అన్న వాదాన్ని త్రోసిపుచ్చినవి.

**61.బి.**

పరిపాలనను సమర్ధవంతంగా నిర్వహించుటకు వీలులేని విధంగా బెంగాల్ పెద్ద రాష్ట్రమని ఆంగ్ల అధికారులు ప్రకటించారు. అందువలన బెంగాల్ రాష్ట్ర విభజన అనివార్యమని ప్రకటించింది.

2. భారతీయులలోని జాతీయవాదాన్ని నివారించవలెనని ఆంగ్లేయులు అభిప్రాయపడిరి. హిందూ, ముస్లింలను విడదీస్తే వారి ఐక్యతను దెబ్బతీయుట.

3. విభజనకు వ్యతిరేకంగా జమీందార్లు, వ్యాపారులు, రాజకీయ నాయకులు అందరూ చేతులు కలిపిరి. స్త్రీలు, విద్యార్థులు చురుకుగా బెంగాల్ విభజన వ్యతిరేక ఉద్యమంలో పాల్గొనిరి. అన్ని వర్గాలు పాల్గొనుట వలన ఉద్యమానికి నూతన బలం చేకూరెను.

బ్రిటిష్ వారి భిన్నవైఖరి ఫలితంగా దేశవ్యాప్తంగా శాసన ఉల్లంఘన ఉద్యమానికి దారితీసెను. గాంధీ స్వయంగా ఉప్పు సత్యాగ్రహంను ప్రారంభించెను. జాతీయోద్యమం గొప్ప ప్రజాఉద్యమంగా మారెను. ప్రభుత్వం ఉద్యమాన్ని దమన పద్ధతులలో అణిచివేయుటకు ప్రయత్నించెను. ప్రభుత్వం రౌండ్‌టేబుల్ సమావేశం ఏర్పాటు చేసెను. 1931లో గాంధీ – ఇర్విన్ ఒడండిక కుదిరెను. కాని ఒడంబడికు నాటి వామపక్షాలు, యువకులు వ్యతిరేకించిరి. ప్రజలలో విభజనను తెచ్చు కుట్రలో భాగంగా ఆంగ్ల ప్రభుత్వం 1932లో కమ్యూనల్ అవార్డును ప్రకటించెను. దీనికి నిరసనగా గాంధీ నిరాహారదీక్ష చేసెను. తుదకు పూనా ఒడంబడిక ద్వారా సంక్షోభం ముగిసెను.

1935 భారత రాజ్యాంగ చట్టము ద్వారా అఖిల భారత సమాఖ్య అవతరించెను. 1987 ఎన్నికలలో కాంగ్రెస్ పాల్గొని అధిక స్థాయిలలో గెలుపొందెను. అనేక రాష్ట్రాలలో కాంగ్రెస్ పార్టి అధికారాన్ని చేపట్టెను.

**61.సి.**

1. ఆంగ్లేయులు దేశంను వదిలిన మెజారిటీ హిందువులు అల్ప సంఖ్యాకులైన మహమ్మదీయులపై ఆధిపత్యంను చలాయించెదరని అహమ్మద్‌ఖాన్ అభిప్రాయం. మహమ్మద్‌దీయులు పాశ్చాత్యవిద్యాను అభ్యసించి, ఆంగ్ల పాలనకు విధేయులుగా ఉండగలరని ఇతని వాదన.

2. వర్తక, పారిశ్రామిక రంగాలలో మహమ్మదీయులు చురుకుగా పాల్గొనలేదు. వీరు పేదలుగా, భూస్వాములు ఆధీనంలో ఉండిరి. వారిని హిందువులకు వ్యతిరేకులుగా రూపొందించుట సులభతరమయ్యెను.

3. చరిత్రను ఈవిధముగా వ్యాఖ్యానించుట రాజకీయ పరిణామాలకు మూల కారణమయ్యెను. అంటే చరిత్రకారుల అభిప్రాయంలో మధ్యయుగంలో ముస్లింలు పాలకులుకాగా మిగిలిన వారందరూ పాలితులైరి.

4. 1905

**61.డి.**

1. శాసనమండలులను విస్తృతపరచినను ప్రభుత్వం అధిక సభ్యులను తమ పక్షం వహించు విధంగా చేసుకొనగలిగెను. శాసనమండలులు కేవలం సలహా మండలులుగా మిగిలిపోయెను. ఈ చట్టం ఏవిధంగాను స్వపరిపాలనకు దోహదపడలేదు.

2. ఎస్.పి.సిన్హా

3. మహమ్మదీయులకు ప్రత్యేక నియోజకవర్గాల ఏర్పాటు

4. తదనంతరం సంవత్సరములలో ఇతర వర్గాలకు చెందిన వారు ప్రత్యేక రిజర్వేషన్‌లను కోరిరి. ఫలితంగా రాజకీయ సమైఖ్యత దెబ్బ తినెను.

**61.ఇ.**

1. అభినవ భారత్, అనుశీలన సమితి, యుగాంతర్

2. అధికారులను అంతమొందించుట, విప్లవ సాహిత్యాన్ని ప్రచురించుట, ఆయుధాలను, సామగ్రిని సమపార్జించుట గద్దర్ విధానాలు

3. బ్రిటన్‌కు వ్యతిరేకంగా జర్మనీతో చేతులు కలుపుట, జర్మనీ నుండి ఆయుధాలను సముపార్జించుట.

4. అణిచివేత విధానాలను అమలు పరచుట, పత్రికలపై ఆంక్షలు విధించుట.

**61.ఎఫ్.**

1. భారతీయుల సహకారం ఫలితంగా బ్రిటీష్ పాలకులు దేశానికి స్వపరిపాలనను అందించెదరని అభిప్రాయపడిరి.

2. కరపత్రాలను ముద్రించుట, బహిరంగ ప్రజాసమావేశాల ఏర్పాటు, నృత్య, నాటకాల ద్వారా స్వపరిపాలన సాధ్యమగునని నమ్మిరి.

3. స్వపరిపాలన కొరకు కాంగ్రెస్, ముస్లింవాదులు ఒక సమైక్య కార్యాచరణను అంగీకరించిరి.

4. బ్రిటీష్ వారి సంస్కరణలపై మితవాదులకు విశ్వాసం కలదు. మితవాదుల ఉద్యమానికి సమర్ధవంతమైన నాయకత్వాన్ని అందించలేకపోయింది.

# 62

# భారత జాతీయోద్యమం (1919–1939)

## 62.1 పరిచయం :

1919–1947 మధ్యకాలంను జాతీయోద్యమంలో చివరి అంకంగా చెప్పవచ్చును. ప్రపంచ చరిత్రలోనే వినూత్నమైన అహింస అను ఆయుధంతో గాంధీ జాతీయ ఉద్యమ అంతిమలక్ష్యంను 1947 నాటికి సాధించెను.

ఈ పాఠంలో 1919–1939 మధ్యకాలంలో జాతీయ ఉద్యమ గమనాన్ని మనం అధ్యయనం చేద్దాం. ఈ కాలంలో జాతీయ ఉద్యమంలో భిన్న సిద్ధాంతాలు ప్రవేశించినవి. గాంధీ సత్యాగ్రహం, భగత్‌సింగ్ విప్లవ పోరాటం, స్వరాజ్య వాదుల శాసనసభల ప్రవేశం, నెహ్రూ సామ్యవాద భావాలు, సుభాష్‌చంద్రబోస్ ఫార్వర్డ్‌బ్లాక్ మొదలైన వేరు వేరు రాజకీయ భావాలు జాతీయోద్యమంలో చూస్తాము. ఈ దశలో యువకులు, వృద్ధులు, స్త్రీలు, పిల్లలు, మేధావులు, కార్మికులు, రైతులు అందరూ ఉద్యమంలో భాగస్వాములైరి. ఈ అధ్యాయంలో జాతీయ ఉద్యమ గమనంతో పాటు మహిళల జాగృతి, అంటరానితనానికి వ్యతిరేకంగా చేపట్టిన ఉద్యమాలు, మద్యపాన వ్యతిరేక ఉద్యమాలు మొదలగునవి అంతర్భాగాలుగా చూడగలం. కాని ఈ దశలో హిందూ–ముస్లిం సంబంధాలు నానాటికి బలహీనపడి మతోన్మాదం పెచ్చుపెరిగెను.

పూర్ణస్వరాజ్ దిశగా సాగిన ఉద్యమంలోని ముఖ్య పరిణామాలను అధ్యయనం చేసెదము.

## 62.2 లక్ష్యాలు :

ఈ పాఠ్యాంశ అధ్యయనం ద్వారా క్రింది అంశాలు తెలుసుకుంటారు.

1. 1919 చట్టరూప కల్పనకు దారితీసిన అంశాలు, ఈ చట్ట ముఖ్య అంశాలు, చట్ట లోపాలు
2. రౌలట్ చట్ట వ్యతిరేక ఉద్యమం, ప్రజా నాయకునిగా గాంధీ తిరుగులేని స్థానంను సంపాదించుట
3. ఖిలాఫత్ సహాయనిరాకరణ ఉద్యమాలకు కారణాలు, ఉద్యమ కార్యక్రమాలు
4. జాతీయ ఉద్యమంలో స్వరాజ్యవాదుల కృషి, సహాయనిరాకరణ ఉపసంహరణ
5. 1922 తదనంతర కాలంలో వృద్ధి చెందిన సామ్యవాద, విప్లవ పోరాటాలు

6. 1930 సంపూర్ణ స్వరాజ్ తీర్మానం, ఆంగ్లేయుల మొండివైఖరి

7. శాసన ఉల్లంఘున ఉద్యమం

8. 1935 చట్ట ముఖ్యంశాలు

9. 1935-39 సంవత్సరంల మధ్యకాలం నాటి పరిణామాలు- కాంగ్రెస్ మంత్రివర్గాలు, జాతీయ, విదేశీ విధానాల వృద్ధి, స్వదేశీ సంస్థానాల పరిణామాలు, మతోన్మాద విజృంభణ

## 62.3 1919 భారత ప్రభుత్వ చట్టం :

1919-1914 సంత్సరంల మధ్య కాలంలో కాంగ్రెస్ ముస్లింలీగ్‌ల మధ్య సంబంధాలు గత అధ్యాయంలో ప్రస్తావించిన సఖ్యత ధోరణుల నుండి భిన్న వైఖరిలోనికి మారినివి. యుద్దంలో ఆంగ్లేయులకు పూర్తి సహాయ సహకారాలను అందించిన దేశంలోని అన్ని వర్గాలు యుద్దానంతరం దేశ ప్రయోజనాలను పరిరక్షించుతూ ఆంగ్లేయులు నూతన రాజ్యాంగ సంస్కరణలను అందించెదరని ఎదురు చూడసాగిరి. కాని వాస్తవానికి భిన్నంగా జరిగెను. యుద్ధం భారతీయులకు కష్టాలనే మిగిల్చినది. భారతీయ పరిశ్రమలు అనేక ఇబ్బందులను ఎదుర్కొన్నవి. కార్మికులకు ఉపాధికరువయ్యెను. రైతులపై పన్నుల భారం అధికమయ్యెను. విద్యావంతులైన భారతీయులకు తగిన ఉపాధులు లేకపోయినవి.

యుద్ధం స్వయం నిర్ణయ సిద్ధాంతంను ప్రచారంలోనికి తెచ్చెను. సామ్రాజ్యవాద శక్తులు వలస ప్రజలకు ప్రజాస్వామ్య వ్యవస్థలను అందించెదమని నమ్మపలికిరి. కాని యుద్ధం ముగిసిన పిమ్మట ఈ పలుకులన్నీ అదృశ్యమయ్యెను. నమ్మి మోసపోయిన ప్రజలలో విప్లవభావాలు మిన్నంటినవి. యుద్ధం, ఐరోపా శక్తుల డొల్లతనంను బహిర్గతం చేసెను. యుద్ధంలో అనేక వ్యతిరేక ఫలితాలను ఎదుర్కొనిన ఐరోపా రాజ్యాలు 'తెల్లవాని ఔన్నత్యం' అను సిద్ధాంతానికి అర్హులుకారని తేటతెల్లమయ్యెను.

యుద్ధకాలంలో ప్రపంచంలో సంభవించిన అత్యంత ముఖ్య సంఘటన 1917 రష్యా విప్లవం శ్రామిక, కర్షక తిరుగుబాటు ఫలితంగా రష్యాలో జారుచక్రవర్తుల పాలన అంతమయ్యెను. సామ్యవాద రాజ్యంగా అవతరించిన రష్యా తన ఆధీనంలో గల వలస రాజ్యాలకు స్వయం పాలనను ప్రసాదించెను. దీనిని మార్గదర్శకంగా తీసుకొని ఇతర వలసరాజ్యాల ప్రజలు స్వయంపాలన దిశల గమనంను ప్రారంభించిరి.

ఇటువంటి పరిస్థితులలో భారతీయులకు కొన్ని రాయితీలను ఇవ్వవలసిన ఆవశ్యకత కలదని బ్రిటీష్ ప్రభుత్వము నిర్ణయించెను. ఇందులో భాగంగా 1919 రాజ్యాంగ చట్టంను చేసిరి.

**1919 చట్టం :**

దేశపాలనా వ్యవస్థలో ఈ చట్టం అనేక మార్పులను తెచ్చెను. ఈ చటం కేంద్రంలో ద్విశాశసభా విధానాన్ని ప్రవేశపెట్టెను. ఈ రెండు సభలు ఏవనగా సెంట్రల్ లెజిస్లేటివ్ అసెంబ్లీ(దిగుసభ) కౌన్సిల్ ఆఫ్ స్టేట్(ఎగువసభ). దిగువ సభలో నామినేటెడ్ సభ్యులతో కూడి సభ్యుల సంఖ్య 144. రెండవ సభ సభ్యుల సంఖ్య 60. వారిలో 34 మంది ఎంపిక సభ్యులు 26 మంది నామినేటెడ్ సభ్యులు. ఈ శాసనశాఖకు గవర్నర్ జనరల్. అతని కౌన్సిల్‌పై

ఎటువంటి అధికారం లేదు. కాని గవర్నర్ జనలర్‌కు శాసనశాఖను నియంత్రిచు అధికారం కలదు. అందువలన ఈ చట్టం ద్వారా కేంద్ర పాలనలో వచ్చిన మార్పులకు ఎటువంటి ప్రాధాన్యత లేదని చెప్పవచ్చును.

**ద్వంద్వ పాలన :**

ఈ చట్ట ముఖ్యఅంశం ఏమనగా రాష్ట్రాలలో ప్రవేశపెట్టబడిన ద్వంద్వ పాలన. పాలనాంశాలను కేంద్రజాబిత, రాష్ట్రజాబితా అని విభజించిరి. దేశరక్షణ, విదేశీ వ్యవహారాలు, పోస్ట్, టెలిగ్రాఫ్ వంటి జాతీయ ప్రాముఖ్యత గల అంశాలు కేంద్ర జాబితాలో కలవు. వీని రిజర్వ్‌డు జాబితా అనిరి. వీటిని గవర్నర్‌ల ఆధీనంలో ఉంచిరి. ప్రాంతీయ ప్రాధాన్యత గల అంశాలైన ఆరోగ్యము, స్థానిక ప్రభుత్వాలు, విద్యా మొదలగునవి ట్రాన్స్‌ఫర్డ్ జాబితాగా శాసనసభకు విధేయులైన మంత్రులకు అప్పగించిరి. కాని అవసరమని భావించిన మంత్రులపై గవర్నర్ అధికారాలను బదలాయించగలడు.

**చట్ట లోపాలు :**

చట్టం ద్వారా అమలులోనికి వచ్చిన ద్వంద్వ ప్రభుత్వం 1921 నుండి 1937 వరకు అమలులో ఉండెను. ఈ ద్వంద్వ ప్రభుత్వం సమర్ధవంతంగా పనిచేయలేక పోయెను. ఈ చట్ట వైఫల్యంనకు అనేక కారణాలు కలవు.

ద్వంద్వ ప్రభుత్వం అను ప్రయోగమే లోభూయిష్టమైనది. పాలనాధికారాలను రెండుగా విభజించి ప్రతిదానిని స్వతంత్రముగా రూపొందించుట రాజకీయ సిద్ధాంతానికి వ్యతిరేకం. రాజ్యం ఒక సంస్థ. కనుక అందలి పాలనా విభాగాలను రెండుగా విడదీయలేము. అధికారాల విభజన అశాస్త్రీయంగా జరిగెను. ట్రాన్స్‌ఫర్డ్ జాబితాలోని అంశాలపై తిరిగి గవర్నర్‌కు అధికారమిచ్చుట పూర్తిగా విరుద్ధం.

ఈ చటం ద్వారా ప్రజలకు ప్రాతినిధ్యము వహించు మంత్రులకు కార్యనిర్వాహక వర్గంనందలి అధికార బృందానికి నిరంతర ఘర్షణ తెరతీయబడెను. ఈ ఘర్షణలో గవర్నర్ ఎల్లప్పుడు అధికార వర్గాన్ని సమర్ధించెడివాడు. మంత్రుల పరిస్థితి చాలా బలహీనం. మంత్రిని గవర్నర్ నియమించవచ్చు, తొలగించవచ్చును కూడా. శాసనసభ సైతం మంత్రిని తొలగించగలదు. శాసనశాఖకు గవర్నర్ జనరల్. అతని కౌన్సిల్‌పై ఎటువంటి నియంత్రణ లేదు.

ఆర్థికశాఖ కార్యనిర్వాహక అధీనంలో ఉండుట వలన ద్వంద్వ ప్రభుత్వ తీరు మరింత బలహీనపడెను. సంక్షేమ కార్యకలాపములన్నీ మంత్రుల బాధ్యత కాగా, వారికి ఎటువంటి ఆదాయాలు లేకుండెను. నిధుల కొరకు మంత్రులందరు ఆర్థిక కార్యదర్శి దయపై ఆధారపడవలసి యుండెను. ఆర్థిక కార్యదర్శి రిజర్వ్‌డ్ శాఖలపై అధికదృష్టి నిలిపి ట్రాన్స్‌ఫర్డ్ శాఖలను పట్టించుకొనలేదు.

స్థూలంగా ఈ చటం ప్రజాప్రతినిధి ఎటువంటి బాధ్యతలను ఇవ్వలేకపోయెను. తిలక్ అభిప్రాయంలో ఈ చటం 'ఎంతమాత్రం ఆమోదయోగ్యం కానిది' కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల పనితీరును మార్చుటలో ఈ చట్టం పూర్తిగా విఫలము చెందెను. గాంధీ ఈ సంస్కరణలను ముందుగా స్వాగతించినను సంవత్సర కాలంలోనే ప్రభుత్వం రౌలట్ చట్టాలు చేసి జాతీయతను అణిచివేయు ప్రయత్నం చేయుటలతో తన వైఖరిని మార్చుకొనెను.

మాంటేగ్ ఛేమ్స్‌ఫర్డ్ సంస్కరణలు జాతీయ నాయకుల ఆశయాలకు, అంచనాలకు చాలా వ్యతిరేక స్వభావంను కలిగియున్నవి. శాసనశాఖకు గవర్నర్ జనరల్, కార్యవర్గంపై ఎటువంటి అదుపు లేకపోయెను. రాష్ట్రాలకై కేంద్రంపూర్తినియంత్రణ కలిగి యుండెను. ఓటు హక్కు చాలా పరిమితం.

## 62.4 రౌలట్ చట్టం (1919) :

భారతీయులపై 1919లో ప్రయోగించిన రౌలట్ చట్టంను నాయకులు తీవ్రంగా వ్యతిరేకించిరి. మొదటి ప్రపంచ యుద్ధంలో భారతీయులు ఆంగ్లేయులకు చేసిన సేవకు ప్రత్యుపకారంగా ప్రజాస్వామ్య రాయితీలను ఆశించగా రౌలట్ చట్టం ప్రజల ఆశలను పూర్తిగా అడియాశ చేసెను. రౌలట్ చట్టంలు (న్యాయమూర్తి రౌలట్‌చే రూపొందించబడినవి) పూర్తిగా జాతివ్యతిరేక స్వభావం కలిగినవి. పౌర స్వేచ్ఛను హరించి, ఏ వ్యక్తినైన విచారణ లేకనే నిర్బంధించు అధికారం, ప్రభుత్వ వ్యతిరేక కార్యక్రమాలపై ఆంక్షలు, ఉద్యమాలు, ఊరేగింపులపై నిషేధాలు మొదలగునవి లక్షణములుగా గల రౌలట్ చట్టమును భారతీయులు ఏకకంఠంతో వ్యతిరేకించిరి.

గాంధీ రౌలట్ చట్టాలను తీవ్రంగా ఖండించెను. ఈ చట్టాలకు వ్యతిరేకంగా ఉద్యమంను ప్రారంభించెను. ఈ ఉద్యమం ద్వారా జాతీయోద్యమంలో గాంధీ నాయకత్వం మొదలయ్యెను. ఈ సందర్భముగా గాంధీకి సంబంధించిన ముఖ్య సమాచారంను కొంత తెలుసుకొనవలెను.

## 62.5 గాంధీ తొలి జీవితం :

మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ 1869 అక్టోబర్2న గుజరాత్‌నందలి పోర్‌బందర్‌లో జన్మించెను. పోర్‌బందర్ సంస్థానానికి ఇతని తండ్రి ప్రధానిగా పనిచేసెను. గాంధీ ఇంగ్లాండ్‌లో న్యాయశాస్త్రంలో పట్టాను పొంది తదనంతరం దక్షిణాఫ్రికాలో కొంతకాలం న్యాయ సలహాదారునిగా పనిచేసెను. సామాజిక, ఆర్థిక అసమానలతో గల నాటి దక్షిణ ఆఫ్రికా గాంధీని అమితంగా కలవరపరిచెను. అచ్చటగల భారతీయులకు ఎటువంటి పౌరహక్కులు, ఓటుహక్కులు లేవు. అంతేగాక వీరు నగరాలలో కొన్ని ప్రత్యేక ప్రాంతాలలోనే నివసించవలెను. రహదారులపై వీరి రాక పోకలపై ఆంక్షలు ఉండెడివి. శ్వేతజాతీయుడు కానందున గాంధీని మొదటి తరగతి రైలు భోగీ నుండి నెట్టివేసిన సంఘటన అందరికి తెలిసినదే.

ఇటువంటి జాత్యాంహకార విధానానికి తెరదించవలెనని గాంధీ నిర్ణయించుకొనెను. కాని లక్ష్యసాధనకు హింసను మార్గంగా గాంధీ సమ్మతించలేదు. గాంధీ సత్యాగ్రహంను తన ప్రధాన ఆయుధంగా స్వీకరించెను. దీనికి ఉపకరణములుగా సత్యం, అహింసలను చేర్చి పీడనను కలిగించు శక్తులు పెట్టు బాధలను స్వచ్ఛందంగా భరించవలెనని గాంధీ సిద్ధాంతం. గాంధీ అభిప్రాయంలో మానవప్రవృతి స్వతహాగా మంచిది కనుక సత్యాగ్రహం అనే ఆయుధం ద్వారా ఎటువంటి దుష్టశక్తులనైనా మార్చవచ్చును. గాంధీ చెడును ద్వేషించెను. కాని చెడు చేయువారిని ద్వేషించలేదు. అందువలననే గాంధీ తన సత్యాగ్రహ ఆయుధంను బ్రిటీష్ సామ్రాజ్యవాదంపై ప్రయోగించెనే గాని బ్రిటీష్ ప్రజలపై కాదు. గాంధీ అభిప్రాయంలో సత్యాగ్రహం అత్యంత ధృఢమైనది, ధైర్యంతో కూడి ఉన్నది.

దక్షిణాఫ్రికా ఉద్యమ మరొక కోణం ఏమనగా సమాజంనందలి అన్ని మత, భాషల ఐక్యత సాధించుట. గాంధీ ఉద్యమంలో హిందు, ముస్లిం, క్రైస్తవ, పార్శి, గుజరాతి, ఉన్నత వ్యాపార వర్గాలు, కార్మికులు అందరు పాల్గొనిరి. ఈ ప్రయోగమే సమాజంలోని అందరి అభిమానానికి, ప్రేమకు గాంధీని పాత్రుని చేసెను.

గాంధీ దక్షిణ ఆఫ్రికానుండి 1915లో భారత దేశానికి తిరిగి వచ్చెను. పిమ్మట రెండు సంవత్సరములు విస్తృతంగా దేశ పర్యటన చేసెను. ఎటువంటి రాజకీయ కార్యకలాపాలలో పాల్గొనలేదు. 1916లో గుజరాత్ నందలి సబర్మతిలో ఆశ్రమమును నెలకొల్పెను. 1917-1918 మధ్యకాలంలో గాంధీ మూడు ఉద్యమాలను చేపట్టెను. అవి చాంపరాన్ సత్యాగ్రహం, అహమ్మదాబాద్ నూలు మిల్లు కార్మికుల సమ్మె, గుజరాత్ నందలి ఖేడా నందలి కార్మికుల సమ్మె. ఈ మూడు స్థానిక సమస్యలకు సంబంధించిన ఉద్యమాలు. ఈ ఉద్యమాల ద్వారా గాంధీ భారతదేశ సామాన్య ప్రజానీకంను పూర్తిగా తనదైన రాజకీయ శైలిలో అధ్యయనం చేసెను.

బీహార్ నందలి చాంపరాన్‌లో రైతులు విధిగా తమ భూమిలో 3/20 వంతులో నీలిమందును పండించి దానిని బ్రిటీష్ యజమానులకు నిర్ణయించిన ధరకు విక్రయింపవలెను. గాందీ ఈ సమస్యను చేపట్టెను. గాంధీ ప్రవేశాన్ని బీహార్‌లో నిషేధించిన ధిక్కరించి తుదకు ఈ సమస్యపై ప్రభుత్వము ఒక కమిటి వేయుటకు ఒప్పించి ఆ కమిటీలో తాను సభ్యుడయ్యెను. ఫలితంగా ప్రభుత్వము రైతులకు కొన్ని రాయితీలను మంజూరుచేసెను. ఇది గాంధీ దేశంలో సాధించిన తొలి విజయమని చెప్పవచ్చును.

1918లో అహమ్మదాబాద్ నందలి నూలుమిల్లు కార్మికులు యాజమాన్యానికి వ్యతిరేకంగా అధిక వేతనాల కొరకు చేయుచున్న సమ్మెను బలపరచెను. అహింసాయుతంగా సమ్మెను చేయవలసినదిగా గాంధీ కార్మికులకు ఉద్భోదించెను. ఈ విషయమై గాంధీ నిరాహార దీక్షను చేపట్టెను. ఈ సమ్మె దేశవ్యాప్తంగా ప్రజల దృష్టిలో పడెను. తుదకు కంపెనీ యాజమాన్యం వేతనాలను 35% పెంచుటకు అంగీకరించెను.

గాంధీ తదుపరి ఉద్యమం గుజరాత్ నందలి ఖేడాలో జరిగెను. ఇచ్చట పంటలు పండకపోయిననురైతులను పూర్తి పన్నులను చెల్లించవలసినదిగా రెవిన్యూ అధికారులు ఒత్తిడి చేసిరి. గాంధీ రైతులతో కలిసి సత్యాగ్రహం చేపెట్టెను. ఈ ఉద్యమంలో ఇందూలాల్ యాజ్ఞిక్, వల్లభాయ్ పటేల్ మొదలగువారు గాంధీతో చేరిరి.

గాంధీ సత్యాగ్రహము ఆయుధంతో చేసిన పై మూడు ప్రయోగాలు నిద్రావస్థలో గల భారతీయ గ్రామాలను కార్మాగార కార్మికులను మేల్కొలిపినవి. రైతులతో, కార్మికులతో గాంధీ పెంపొందించుకొనిన సంబంధాలు ఆయన నిరాడంబర జీవన శైలి గాంధీని ఒక గొప్ప ప్రజానాయకునిగా నిలిపినవి. గ్రామాలు తిరిగి శక్తివంతము కాగలిగినవి. యువత సైతం గాంధీని అభిమానింపసాగిరి. ఖాదీవస్త్ర ధారణను అందరూ ప్రారంభించిరి. ఆవిధంగా ఆంగ్లేయులు రౌలట్ చట్టాలు చేయునాటి దేశప్రజలు గాంధీ నాయకత్వాన్ని మనస్ఫూర్తిగా ఆమోదించి ఆయన సత్యాగ్రహ ఆయుధాన్ని ప్రజలు స్వీకరించిరి.

## 62.6 జలియన్‌వాల బాగ్ మారణకాండ :

రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా 1919 ఏప్రిల్ 6న గాంధీ ఇచ్చిన పిలుపుకు స్పందించి దేశవ్యాప్తంగా ఊరేగింపులు, హర్తాళ్ కార్యక్రమాలు జరిగినవి. ఈ ఉద్యమంలో హిందూ-ముస్లిం వర్గాలు అన్ని పాల్గొనినవి. ఈ వ్యతిరేక ఉద్యమాన్ని

కఠినంగా అణిచివేయుట ప్రభుత్వం అన్ని చర్యలు గైకొనెను. అనేక దౌర్జన్యాలకు ప్రభుత్వం పంజాబ్, బొంబాయి, అహమ్మదాబాద్, కలకత్తా, ఢిల్లీ మొదలగు నగరాలలో పాల్పడెను. పంజాబ్ నందలి డా॥సత్యపాల్, డా॥సైఫుద్దీన్‌కిచ్లూలను ప్రభుత్వం నిర్బంధించెను. ఈ విషయమై పంజాబ్‌నందలి అమృతసర్‌లో జరిగిన సంఘటన భారత చరిత్రలోనే దారుణ సంఘటనగా చెప్పవచ్చును. ఈ నగర శాంతిభద్రతలను ప్రభుత్వం జనరల్ డయ్యర్‌కు అప్పగించెను. ఇతడు నగరంలో ఊరేగింపులను, సభలను నిషేధించెను.

1919 ఏప్రియల్ 13న జరియన్ వాలా భాగ్‌లో ఒక బహిరంగ సభను ఏర్పాటు చేయగా వేలాదిమంది ప్రజానీకము సభకు హజరైరి. ఈ చర్యను డయ్యర్ క్రమశిక్షణా రాహిత్యంగా భావించి ప్రజలను భయభ్రాంతులకు గురిచేయ నిశ్చయించెను. తన పటాలంతో మైదానంను చుట్టుముట్టెను. మైదానానికి గల ఒకే ఒక ద్వారంను సైన్యంతో నింపెను. ప్రజలకు ఎటువంటి హెచ్చరికలు ఇవ్వకనే కాల్పులకు ఆదేశమిచ్చెను. ఈ దారుణకాండలో వందలాది మంది ప్రాణాలు కోల్పోయిరి.

జలియన్ వాలా బాగ్ మారణకాండతో యావత్‌జాతి దిగ్భ్రాంతి చెందెను. పరాకాష్టకు చెందిన బ్రిటీష్ సామ్రాజ్యవాదానికి తీవ్రంగా ఏవగించుకొనిరి. ఈ సంఘనటకు నిరసనగా రవీంద్రనాధ్ ఠాగూర్ నైట్‌హుడ్ గౌరవాన్ని తిరస్కరించెను. కాని ఈ చర్యలు ఆంగ్లేయులను కదిలించలేకపోయెను. పంజాబ్‌లోని అమృత్‌సర్ ప్రజలు తీవ్రంగా మనస్థాపం చెందిరి. ఈ సంఘటన జాతీయోద్యమ గమనాన్ని మార్చెను.

గాంధీ సామాన్య ప్రజానీకంతో సన్నిహిత సంబంధాలను పెంపొందించుకొని జాతీయోద్యమాన్ని నూతన పంధాలోనికి తీసుకొనివచ్చెను.

## పాఠ్య ప్రశ్నలు 62.ఎ

1. మొదటి ప్రపంచ యుద్ధానంతరం ఆసియా, ఆఫ్రికాలలోని వలస రాజ్యాలలో జాతీయ ఉద్యమాలు తీవ్రతరమగుటకు ఒక కారణం తెలుపుము.
2. ద్వంద్వ ప్రభుత్వం ఏవిధంగా పనిచేసెను.
3. సత్యాగ్రహంనందలి రెండు లక్షణములు ఏవి?
4. గాంధీ నడిపిన చాంపరాన్, అహమ్మదాబాద్, ఖేడా ఉద్యమాలలో గల సామీప్య లక్షణము ఏది?
5. భారతదేశ చరిత్రలో 1919 ఏప్రియల్ 13 ఏల చీకటి రోజుగా పరిగణించబడెను.

## 62.7 ఖిలాఫత్ ఉద్యమం :

మొదటి ప్రపంచ యుద్ధానంతరం దేశంలో రాజకీయంగా చైతన్యవంతులైన మహమ్మదీయులు ఖిలాఫత్ ఉద్యమంను చేసిరి. యుద్ధంలో టర్కిని ఓడించుటలో, తురుష్క సామ్రాజ్యంను విచ్ఛిన్నం చేయుటలో బ్రిటన్ ప్రధానపాత్ర పోషించిన విషయమును అద్యయనం చేసియున్నాం. అనేకమంది మహమ్మదీయులు టర్కీసుల్తాన్‌న తమ మతపెద్దగా (ఖలీఫా) గౌరవించెదరు. టర్కీ యెడల బ్రిటీష్ విధానాలు మహమ్మదీయుల మతవిశ్వాసాలను దెబ్బతీసినవి.

ఆలీ సోదరుల(మహమ్మద్ ఆలి, షోకత్ ఆలి) నాయకత్వంలో ఖిలాఫత్ ఏర్పడినవి. ఈ కమిటీనందలి సభ్యులలో హకీం అజ్మత్‌ఖాన్, మౌలాన అజాద్, హస్రత్ మొహని మొదలగువారు ముఖ్యులు. టర్కీ సమస్యకు సరిఅయిన సమాధానాలు తెలుసుకొని సమస్యను పరిష్కరించవలసినదిగా వీరు ప్రభుత్వముపై ఒత్తిడి తెచ్చిరి. 1919 నవంబర్‌లో అఖిలభారత ఖిలాఫత్ సమావేశము జరిగెను. ఈ సమావేశం గాంధీని అధ్యక్షునిగా ఎన్నుకొనెను. తమ కోర్కెలను అంగీకరించునంతవరకు ఆంగ్లేయులకు ఎటువంటి సహకారం అందించరాదని సమావేశంలో తీర్మానించెను. అదేవిధంగా ముస్లింలీగ్ కాంగ్రెస్ విధానాలకు పూర్తి సహకరించవలెనని నిర్ణయించెను. తిలక్, గాంధీ వంటి నాయకులు ఖిలాఫత్ అంశం హిందూ-ముస్లిం ఐక్యతకు దోహదపడు చక్కటి అవకాశంగా భావించిరి.

1920 జూన్‌లో జరిగిన అన్ని పార్టీ సమావేశంలో విద్యాసంస్థలను బహిష్కరించవలెనని నిర్ణయించిరి. 1920 ఆగస్టు 1న ఖిలాఫత్ కమిటి సహాయ నిరాకరణను ప్రారంభించెను. అదే రోజున బాలగంగాధర్ తిలక్ పరమపదించెను. సహాయనిరాకరణ, తిలక్ మరణం ప్రజలలో ఉద్వేగం పెంపొందించి ప్రభుత్వ వ్యతిరేక ఊరేగింపులు సర్వత్రా జరిగినవి. ప్రజలు నిరాహారదీక్షలు చేసి ప్రార్ధనలు జరిపిరి, మొదటి ప్రపంచ యుద్దంలో తన సేవలను గుర్తుగా ఆంగ్లేయులు ఇచ్చిన కైజర్-ఇ-హిత్ గౌరవంను గాంధీ పరిత్యజించెను.

## 62.8 సహాయ నిరాకరణ ఉద్యమం (1920-22) :

గాంధీ ప్రతిపాదించిన సహాయనిరాకరణ పథకంనుకాంగ్రెస్ అమోదించెను. పంజాబ్, ఖిలాఫత్ సమస్యలకు ఆమోదయోగ్యమైన పరిష్కారాలు లభించునంతవరకు సహాయ నిరాకరణ చేయవలెననెడి గాంధీ నిర్ణయాన్ని కాంగ్రెస్ 1920 సెప్టెంబర్‌లో జరిగిన ప్రత్యేక సమావేశంలో ఆమోదించెను.

సహాయ నిరాకరణలో బ్రిటీష్ వారి బిరుదులు, గౌరవాలను విసర్జించుటకు,స్థానికసంస్థల నుండి రాజీనామాలు చేయుటకు, ప్రభుత్వ సర్వీసులను వదిలివేయుటకు, ప్రభుత్వ సమావేశాలు, దర్బార్‌లను బహిష్కరించుటకు నిర్ణయించిరి. అంతేకాక న్యాయస్థానాలను బహిష్కరించి, విదేశీ వస్త్రములను వాడరాదని తీర్మానించిరి. న్యాయస్థానంలకు బదులు పంచాయితీలను ఏర్పాటు చేసిరి. ఖద్దర్‌ను విధిగా వాడవలెనని నిర్ణయించిరి. హిందూ-ముస్లిం ఐక్యతకు పాటుబడవలెనని, అంటరానితనంను విడనాడవలెనని, అహింసాయుతంగా ఈ కార్యక్రమములన్నింటిని నిర్వహించవలెనని గాంధీ పిలుపు ఇచ్చెను.

కాంగ్రెస్ తన నూతన విధానాలకు అనుగుణంగా అనుసరించవలసిన నియమాలను మార్చుకొనినది. రాజ్యాంగ పద్ధతుల ద్వారా స్వరాజ్యంను సాధించవలెనని లక్ష్యమును శాంతియుతగా, అహింసా విధానాల ద్వారా సాధించుకొనవలెనని మార్చుకొనెను. సహాయ నిరాకరణ నిర్వహణ కొరకు 15 మంది సభ్యులతో కూడిన ఒక కమిటీని ఏర్పాటుచేసెను. ఈ కమిటి ద్వారా అన్ని ప్రాంతాల స్థానిక ప్రజలతో సన్నిహిత సంబంధాలను పెంపొందించుటకు కృషి చేయవలెను. కాంగ్రెస్ సభ్యత్వ రుసుం సంవత్సరానికి 4 అణాలకు తగ్గించిరి. ఈ రుసుం సైతం నిర్బంధం కాదు. కాంగ్రెస్‌లో చేరుటకు వయోపరిమితిని 1921 లో 21 నుండి 18కి తగ్గించిరి. కాంగ్రెస్‌లో హిందూ-ముస్లింలకు సమానప్రాతినిధ్యంను ఇచ్చిరి. 1923 నాటికి కాంగ్రెస్ సభ్యత్వ సంఖ్య నగరాలలోని సభ్యులతో పోల్చిన గ్రామీణసంఖ్య రెట్టింపుఅయ్యెను. కాంగ్రెస్ రాట్నం వడుకుట, అంటరానితనంను నిర్మాలించుట, జాతీయ విద్యవ్యాప్తి, మహిళలను చైతన్యపరచుట,

హిందూ–ముస్లిం ఐక్యత వంటి నిర్మాణాత్మక కార్యక్రమాలను చేపట్టెను. ఈ విధంగా కాంగ్రెస్ సామ్రాజ్యవాద శక్తులను నిర్మూలించుటకు సత్యాగ్రహం అనే ఆయుధం ద్వారా ఒక విస్తృతమైన ప్రాతిపదికగల లౌకిక వేదికగా అవతరించెను.

1921–22 సంవత్సరంలలో బెంగాల్, పంజాబ్, బొంబాయి, ఉత్తరప్రదేశ్, బీహార్‌లలో వేలాదిమంది విద్యార్థులు విద్యాసంస్థలను బహిష్కరించిరి. ప్రసిద్ధ న్యాయవాదులు సి.ఆర్.దాస్, ఎం.యల్.నెహ్రూ, వల్లభాయ్ పటేల్ మొదలగు వారు న్యాయవాద వృత్తి బహిష్కరించి కాంగ్రెస్‌లో చేరిరి. ప్రజలు స్వచ్ఛందంగా విదేశీ వస్తు విక్రయశాలలను, కల్లు దుకాణాలను పికెటింగ్ చేసిరి. ఇటువంటి చర్యల ఫలితంగా ప్రభుత్వ ఆదాయం గణనీయంగా తగ్గెను. సహాయనిరాకరణ ఉద్యమ నిర్వాహణ కొరకు కాంగ్రెస్ 'తిలక్‌నిధి'ని ఏర్పాటుచేసెను. 6 నెలల కాలములో ఈ నిధికి కోటి రూపాయలు వసూలు అయ్యెను. రాట్నం ప్రతి ఇంటికి చిహ్నంగా మారి ఖద్దరు జాతీయోద్యమానికి యూనిఫారంగా మారెను. ఈ కాలంలో దాదాపు 30,000 మంది కార్యకర్తలు జైళ్ళకు వెళ్ళిరి. జైలుకు వెళ్ళుట అనునది గౌరవ చిహ్నంగా భావించిరి.

నానాటికి సహాయ నిరాకరణ తీవ్రమయ్యెను. స్త్రీలు ఉద్యమంలో చురుకుగా పాల్గొనిరి. ఉద్యమం కొరకు వారు తమ ఆభరణంలను విరాళంగా ఇచ్చిరి. బ్రిటీష్ సైన్యములో మహమ్మదీయులు కొనసాగుట మతవిరుద్ధమని 1921 జూలైలో మహమ్మద్ ఆలి ప్రకటించెను. అందులకు ప్రభుత్వం ఆలిని నిర్బంధించెను. గాంధీ ఈ చర్యను ఖండించుతూ భారతీయులు ఎవ్వరు ఆంగ్ల కొలువులలో ఉండరాదు అని పిలుపు ఇచ్చెను.

1921 నవంబర్‌లో వేల్స్ రాకుమారుడు భారత పర్యటనకు వచ్చెను. బొంబాయి నగరానికి వేల్స్ రాకుమారుడు చేరెను. దేశవ్యాప్తంగా హర్తాళకు కాంగ్రెస్ పిలుపు ఇచ్చెను. వేల్స్ రాకుమారునికి నిర్మానుష్యమైన వీధులు, తాళాలు వేసిన దుకాణాలు స్వాగతమిచ్చెను. బ్రిటీష్ విధేయులకు, గాంధీ అనుచరులకు కొన్ని ప్రాంతాలలో ఘర్షణలు జరిగెను. పోలీసుల కాల్పులలో 53మంది చనిపోయిరి. ఇటువంటి చర్యలు గాంధీని తీవ్రంగా అలజడికి గురిచేసినవి.

సహాయ నిరాకరణతో ప్రభుత్వం తీవ్రంగా ఆందోళన చెందెను. ఉద్యమ అణిచవేతకు అన్నిచర్యలను తీసుకొనెను. కాంగ్రెస్, ఖిలాఫత్ వాలంటీర్ల దళాలను నిషేధించెను. బహిరంగ సభలు, ఊరేగింపులను నిషేధించెను. గాంధీని మినహాయించి మిగిలిన నాయకులందరిని నిర్బంధించెను.

1921 డిశంబర్‌లో అహమ్మదాబాద్‌లో జరిగిన కాంగ్రెస్ సమావేశంలో అహింసాయుతంగా సహాయ నిరాకరణను కొనసాగించవలెనని అంతేకాక శాసన ఉల్లంఘనకు శ్రీకారం చుట్టుటకు నిర్ణయించెను. నిర్బంధించిన వారిని విడుదల చేయుటకు, పత్రికలపై ఆంక్షలు తొలగించుటకు గాంధీ ఆంగ్లేయులకు ఒకవారం గడువును ఇచ్చుచూ 1922 ఫిబ్రవరి 1న ఒక ప్రకటన చేసెను. 7 దినముల తదనంతరం సహాయ నిరాకరణను శాసనఉల్లంఘనంగా మార్చెదమని ప్రభుత్వంను హెచ్చరించెను. గుజరాత్‌నందలి బార్డోలీలో శాసన ఉల్లంగనకు నిర్ణయించిరి.

కాని సహాయ నిరాకరణ ఉద్యమాన్ని గాంధీ 1922 ఫిబ్రవరి 12న అర్ధాంతరంగా నిలిపివేసెను. దీనికి ప్రధానముగా 1922 ఫిబ్రవరి 5న గోరక్‌పూర్ నందలి చౌరీచౌరా గ్రామంలో జరిగిన హింసాత్మక సంఘటన కారణమయ్యెను. ఆగ్రామ ప్రజలు పోలీసులపై ఎదురుదాడి చేసి పోలీస్‌స్టేషన్‌ను తగులబెట్టిరి. ఈ దహనకాండలో 22మంది సజీవదహనమైరి. ఈ సంఘటనతో కలతచెంది గాంధీ సహాయ నిరాకరణను నిలిపివేసెను. గాంధీ నిర్ణయంమేరకు కాంగ్రెస్ తలపెట్టిన శాసన ఉల్లంఘన నిలచిపోయెను. ఈ నిర్ణయం అనేకమంది కాంగ్రెస్ నాయకులను నిరాశపరచెను. ఈ చర్యను సుభాస్‌చంద్రబోస్ జాతికి కలిగిన గొప్ప విపత్తు అని వర్ణించగా జవహర్‌లాల్ నెహ్రూ సైతం

నిరుత్సాహపడెను. అయిన వీరందరూ గాంధీ నిర్ణయాన్ని ఆమోదించిరి. గాంధీ అభిప్రాయంలో సహాయ నిరాకరణకు, శాసన ఉల్లంఘనకు ఇంకా దేశంలో కావలసిన వాతావరణం నెలకొనలేదు. భారతీయులు సాయుధ పోరాట మార్గాన్ని ఎంచుకొనిన దాని ఆంగ్లేయులు చాలా సులభంగా అణిచివేసెదరు. కనుక ఆ మార్గం ఆమోదం కాదు.

సహాయ నిరాకరణ ఉద్యమ ఉపసంహరణను ఆంగ్ల ప్రభుత్వం అవకాశంగా తీసుకొనెను. 1922 మార్చి 10న గాంధీని దేశద్రోహ నేరం క్రింద నిర్భంధించిరి. గాంధీని ప్రత్యేక న్యాయస్థానం విచారించెను. గాంధీకి 6 సంవత్సరముల జైలు శిక్ష విధించబడెను.

ఈ కాలములోనే ఖిలాఫత్ ఉద్యమం పూర్తిగా బలహీనపడెను. టర్కీలో ముస్తాఫాకెమెల్ పాషా ఖలీఫాకు వ్యతిరేకంగా ఉద్యమించి రాజ్యంను మతం వేరుచేసెను. ఫలితంగా ఇండియాలో ఖిలాఫత్ సమస్య ప్రాధాన్యతను కోల్పోయెను.

పై రెండు ఉద్యమాలు లక్ష్యసాధ్యనలో విఫలమైనప్పటికీ జాతీయోద్యమంలో ప్రాధాన్యతనకు సంతరించుకొనినవి. ఖిలాఫత్ ఉద్యమం ద్వారా అనేకమంది ముస్లిం నాయకులు జాతీయ ఉద్యమంలో ప్రవేశించిరి. సహాయ నిరాకరణ ఉద్యమం ద్వారా రైతులు, శ్రామికులు, వృత్తిపనివారు, దుకాణదారులు, ఉద్యోగ వర్గాలు జాతీయోద్యమంలో చేరిరి. గాంధీ సిద్ధాంతాలు మారుమూల గ్రామాలకు విస్తరించి జాతీయోద్యమానికి నూతన శక్తిని సముపార్జించుకొనెను. ఈ ఉద్యమకాలంలో చేపట్టిన ఖాదీ, విదేశీ బహిస్కరణల ఫలితంగా ప్రజలలో స్వయం సంవృద్ధి, ఆత్మవిశ్వాసాలు పెంపొందినవి. ఉద్యమములో మహిళల ప్రవేశంను మరొక శుభ పరిణామం. ఈ ఉద్యమాల ఫలితంగా కొంతమేర మతసామరస్యం సాధ్యపడెను. హిందూ–ముస్లింలు కలిసి ఉద్యమించిరి.

సహాయ నిరాకరణ ఉపసంహరణకు కేవలం తాత్కాలికంగానే సామాన్య ప్రజానీకం భావించెను. 1922 ఫిబ్రవరి 23న యంగ్ ఇండియా పత్రికలో గాంధీ 1920లో ప్రారంభించిన పోరాటం తుదివరకు జరుగు పోరాటంగా గుర్తించవలసిన సమయం ఆంగ్లేయులకు వచ్చినది. ఆ తుది పోరాటం ఒక నెల లేదా ఒక సంవత్సరం లేదా అనేక సంవత్సరాలు కావచ్చును.

సహాయ నిరాకరణ, ఖిలాఫత్ ఉద్యమాలు జాతీయోద్యమముపై గొప్ప ప్రభావంను చూపినవి. లక్షలాధి భారతీయులలో ఈ ఉద్యమాలు ఆత్మ విశ్వాసంను పెంపొందించినవి.

## పాఠ్య ప్రశ్నలు 62.బి

1. ఖిలాఫత్ సమస్యకు ప్రధాన కారణాలు ఏమి?
2. సహాయ నిరాకారణ ఉద్యమ లక్ష్యం ఏమి?
3. జాతికి నాయకత్వం వహించు క్రమంలో 1920లో కాంగ్రెస్‌లో ఎటువంటి వ్యవస్థాగత మార్పులు వచ్చినవి.
4. ఏ సంఘటన సహాయ నిరాకరణ ఉద్యమ నిలుపుదలకు కారణం మయ్యెను.

## 62.9 స్వరాజ్ పార్టీ :

సహాయ నిరాకరణ ఉద్యమ నిలుపుదల, గాంధీ నిర్బంధం మొదలగు అంశాలు జాతీయోద్యమంపై ప్రభావంను చూపినవి. ఈ సమయంలో శాసనసభలను బహిష్కరించు విధానాలను విడనాడవలసినదిగా సి.ఆర్.దాస్, ఎం.యల్.నెహ్రూలు పిలుపునిచ్చిరి. శాసనమండలులకు జరుగు ఎన్నికలలో పాల్గొని వాటిలో ప్రవేశించి ప్రభుత్వ పనితీరును అడ్డుకొనవలెనని వీరి అభిప్రాయం. కాని వీరి అభిప్రాయాలను కాంగ్రెస్ ఆమోదించలేదు. వల్లభాయ్‌పటేల్, రాజేంద్రప్రసాద్, సి.రాజగోపాలాచారి మొదలగువారు దాస్ అభిప్రాయంతో విభేదించిరి.

కాంగ్రెస్‌లో భాగంగా 1922లో సి.ఆర్.దాస్ కాంగ్రెస్ ఖిలాఫత్ స్వరాజ్ పార్టీని నెలకొల్పెను. శాసన సభల ఎన్నికలను బహిష్కరించు విషయంలో మినహాయించి మిగిలిన అన్ని కాంగ్రెస్ విధానాలను స్వరాజ్‌పార్టీ అంగీకరించెను. 1923 ఎన్నికలలో స్వరాజ్‌పార్టీ పాల్గొనెను. కేంద్ర శాసనమండలిలో 101 స్థానాలలో 42 స్థానాలను గెలుచుకొనెను. ఈ పార్టీ 1919 చట్ట లోపాలను ప్రధానంగా వ్యతిరేకించెను. 1925లో ఈ పార్టీ విఠల్‌బాయ్ పటేల్‌ను కేంద్ర శాసనసభకు అధ్యక్షునిగా ఎన్నుకొనుటలో విజయం సాధించెను. శాసన సభలలో ఈ పార్టీ తమ ఉపన్యాసాల ద్వారా ప్రభుత్వ చర్యలను విమర్శించెను. ప్రభుత్వ బడ్జెట్‌లోని కేటాయింపులను పలుమార్లు తిరస్కరించిరి. ప్రభుత్వం వీటో అధికారాన్ని వినియోగించవలసి వచ్చెను. ప్రజలు నిరాశ, నిస్పృహల్లో ఉన్న కాలంలో స్వరాజ్యవాదుల కార్యకలాపాలు కొంత ఉత్సాహమును కలిగించెను.

1925 జూన్ 16న సి.ఆర్.దాస్ మరణంతో స్వరాజ్‌పార్టీ బలహీనపడెను. దేశంలో పెరిగిన మతతత్వ ధోరణులు స్వరాజ్ పార్టీ బలహీనపడుటకు మరొక కారణంగా చెప్పవచ్చును. ముస్లింలీగ్, హిందూ మహాసభ కార్యకలాపాలు రాజకీయాలను ప్రభావితమొనర్చినవి. స్వరాజ్ వాదులు కొంతమది మతతత్వం వైపు మరలిరి. గాంధీ చేసిన మతసామరస్య పిలుపు నిష్ప్రయోజనమయ్యెను.

1926 ఎన్నికలలో స్వరాజ్‌పార్టీ సఫలం చెందలేకపోయెను. గత ఎన్నికలలో సాధించిన విజయాలను వారు తిరిగి పొందలేక పోయిరి. కాంగ్రెస్ శాసన ఉల్లంఘనకు పిలుపు ఇచ్చిన సమయంతో వీరు శాసన సభలనుండి నిష్క్రమించిరి. స్వరాజ్యవాదులు, గాంధేయవాదులు వారి వారి పరిధిలో కొంత నిర్మాణాత్మకంగా వ్యవహరించిరి. కాని ఈ కాలములో జాతీయ ప్రయోజనాలను కాంక్షించుచూ ఆ మార్గంలో ఉద్యమం పయనించలేక పోయెను. తిరిగి సైమన్ కమీషన్ నియామకం జరిగిన వెంటనే జాతి ఏకమై ఉద్యమ మార్గంలో నడిచినది.

5 సంవత్సరముల కాలంలో స్వరాజ్య వాదులు తమ విధానాల ద్వారా జాతీయోద్యమంలో నూతన ప్రయోగాలను చేసిరి. శాసన సభలలో వీరి కార్యకలాపాలు ప్రజల ప్రయోజనాలకు జీవంను నిలిపినవి. సహాయ నిరాకరణ నిలుపుదల వలన ఏర్పడిన నిరాశ నుండి కొంత వూరట కల్పించినది.

## 62.10 తీవ్రవాద ఉద్యమాల పునరుద్ధరణ :

సైమన్ కమీషన్ బహిష్కరణకు ముందు 1922 తదనంతరం దేశంలో జరిగిన వివిధ సంఘటనలను గురించి అధ్యయనం చేయవలెను.

సహాయనిరాకరణ ఉద్యమ నిలుపుదల దేశంలో ఒక విధమైన నిరాశను కల్పించెను. సహాయనిరాకరణ ఉద్యమంలో పాల్గొనిన అనేకమంది యువకులను గాంధీ సత్యాగ్రహ సిద్ధాంతాలపై విశ్వాసం సన్నగిల్లెను. పంజాబ్, ఉత్తరప్రదేశ్, బీహార్, బెంగాల్ ప్రాంతాలలోని యువకులు రష్యాలో సంభవించిన కమ్యూనిస్టు విప్లవ భావాల పట్ల ఆకర్షితులై తిరిగి సాయుధ పోరాట మార్గాన్ని ఎంచుకొనిరి. 1925లోని ఎం.యన్.రాయ్ అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీకి ఎంపికయ్యెను. ముఖ్యంగా రైతులు, కార్మికులు విప్లవ పోరాట(మార్గాన్ని) విధానాల వైపు ఆకర్షితులైరి. బెంగాల్‌కు చెందిన పత్రికలు విప్లవ భావాలను విశేషంగా ప్రచారం చేసినవి. కాన్పూర్‌లో హిందూస్థాన్ రిపబ్లికన్ అసోసియేషన్ అను విప్లవ సంఘం స్థాపించబడెను. ఈ సంఘం బ్రిటీష్ వలస పాలనకు వ్యతిరేకంగా ఆయుధ పోరాటంను ప్రారంభించెను. తమ పోరాటాలకు కావలసిన ఆదాయ వనరులు వీరు ప్రభుత్వ ఆస్తులను కొల్లగొట్టిరి. 1925లో జరిగిన కకోరీ దోపిడీ ఇందులకు చక్కటి ఉదాహరణ. ఈ కేసులో ఆంగ్ల ప్రభుత్వం అనేకమందిని నిర్బంధించి కఠిన శిక్షలు విధించెను.

1928 నాటి దేశంలో విప్లవకారుల సంఖ్య గణనీయంగా పెరిగెను. హిందుస్థాన్, రిపబ్లికన్ అసోసియేషన్ చంద్రశేఖర్ ఆజాద్ నాయకత్వంలో హిందుస్థాన్ సోషలిస్టు అసోసియేషన్‌గా బలబడెను.

1928 అక్టోబర్‌లో పంజాబ్ కేసరి, లాలాలజపతిరాయ్ సైమన్ వ్యతిరేక ఉద్యమంలో పాల్గొని పోలీసుల లాటిదెబ్బలకు గురి అయి, ప్రాణాలు కోల్పోయెను. ఈ అమానుష చర్యను విప్లవకారులు తీవంగా వ్యతిరేకించిరి. జాతి గౌరవించె ఒక గొప్ప నాయకుడు ఒక బ్రిటీష్ అధికారి లాఠీలకు బలి అగుట భారత జాతికి కలిగిన అవమానంగా భావించిరి. 1928 డిశంబర్‌లో భగత్‌సింగ్, రాజగురు అను విప్లవకారులు లజపతిరాయ్ మరణానికి కారకుడైన సాండర్స్‌ను కాల్చి చంపిరి.

1929 ఏప్రియల్‌లో భగత్‌సింగ్ తన అనుచరుడైన బి.కె.దత్తాతో కలిసి కలకత్తా శాసనసభలో బాంబ్‌లు వేసెను. కేవలం బ్రిటీష్ వారి దృష్టికి తమ లక్ష్యాలను తెలియజేయుటకు ఇటువంటి చర్యలు చెయ్యవలసి వచ్చిందని వీరు ప్రకటించిరి. ఆంగ్ల ప్రభుత్వం వీరిని, రాజగురుని నిర్బంధించెను. విప్లవకారల జైలు జీవితం అత్యంత దుర్భరంగా ఉండెడిది. వీరి కనీస సదుపాయాల కొరకు జతిన్‌దాస్ అను విప్లవకారుడు జైలులో 64రోజులు నిరాహార దీక్ష చేసి ప్రాణత్యాగం చేసెను. దేశ ప్రజలు ఎంత వ్యతిరేకించినను బ్రిటీష్ ప్రభుత్వం పెడచెవిన పెట్టి 1931 మార్చి 23న లాహోర్‌లో భగత్‌సింగ్, రాజగురు, సుఖ్‌దేశ్‌లను ఉరితీసెను. భారత జాతియావత్తు వీరు చేసిన ప్రాణ త్యాగాలను జోహార్లు అర్పించెను.

ఇటువంటి విప్లవ కార్యకలాపాలు బెంగాల్‌లో సూర్యసేన్ నాయకత్వంలో జరిగినవి. 1930లో చిట్టగాంగ్ బ్రిటిషు ఆయుధ కార్మాగారంపై సూర్యసేన్ దాడిచేసి ఆయుధాలను కొల్లగొట్టెను. ఇతనికి గణేష్‌గోష్ లోకనాద్‌పాల్ మొదలగువారు సహకరించిరి. ఈ విప్లవకారులకు బెంగాల్‌లో అనేకమంది స్త్రీలు సహాయసహకారాలు అందించిరి. వారిలో ప్రీతిలత వడేకర్, కల్పనదత్తా, బినాదాస్, శాంతిగోష్, సునీత చౌదరి మొదలగు వారు ముఖ్యులు.

దేశంలో మితిమీరిన విప్లవ కార్యకలాపాలను నియంత్రించుటకు ప్రభుత్వం అనేక కఠినచర్యలను తీసుకొనెను. విప్లవకారులను నియంత్రించుటకు ప్రత్యేక చట్టాలను రూపొందించిరి. అనేకమంది విప్లవ కారులను నిర్భంధించి ఉరితీసిరి. 1931లో చంద్రశేఖర్ ఆజాద్‌ను అలహాబాద్‌లో కాల్చి చంపిరి. ఇటువంటి చర్యలు ఫలితంగా విప్లవ పోరాటాలు క్రమక్రమంగా బలహీనపడినవి.

మితిమీరిన దేశభక్తి ధైర్యసాహసాలు త్యాగశీలత గల విప్లవకారుల కృషిని దేశంనందలి సామాన్య మానవులు విశేషంగా ఆరాధించి విప్లవకారులకు నివాళులను అర్పించినది.

## 62.11 సైమన్ కమీషన్ (1927) :

1919 రాజ్యాంగ సంస్కరణలు భారత జాతీయ నాయకులను ఎంత మాత్రం సంతృప్తి పరచలేక పోయినవి. 1927లో నాడు ఇంగ్లాండులో అధికారంలో గల కన్‌జర్‌వేటివ్ పార్టీ త్వరలో జరగబోవు ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని 1919 రాజ్యంగ చట్టపనితీరును పరిశీలించుటకై ఒక కమీషన్‌ను నియమించుటకు నిర్ణయించెను.

1927 డిశంబర్‌లో బ్రిటీష్ ప్రభుత్వం నియమించిన కమిటియే సైమన్ కమీషన్‌గా పిలువబడును. సర్‌జౌన్ సైమన్ ఈ కమీషన్‌కు ఛైర్మన్ కాగా, ఈ కమీషన్‌లో 7గురు సభ్యులను నియమించిరి. సైమన్‌తో సహ కమీషన్ మొత్తం తెల్లజాతి వారితో కూడి ఉండుట వలన భారతీయులు సైమన్ కమీషన్‌ను వ్యతిరేకించిరి. భారత రాజ్యాంగ సంస్కరణలను రూపొందించవలసినది. భారతీయులే గానీ విదేశీయులు కాదని కాంగ్రెస్ అభిప్రాయ పడెను. భారతీయులు స్వరాజ్యానికి అర్హులు అయినది కానిది ఆంగ్లేయులు ఏవిధంగా నిర్ణయించెదరు? అని కాంగ్రెస్ ప్రశ్నించెను. కాంగ్రెస్‌తో సహ హిందూ మహాసభ ముస్లింలీగ్ మొదలగు అన్ని రాజకీయ పక్షాలు సైమన్ కమీషన్‌ను బహిష్కరించుటకు నిర్ణయించినవి.

సైమన్ కమీషన్ 1928 ఫిబ్రవరి 3న బొంబాయి నగర పర్యటనలో భారత సందర్శనను ప్రారంభించెను. భారతదేశంలో సైమన్ కమీషన్ పర్యటించిన ప్రతి నగరంలో నల్ల జెండాలతో, సైమన్ గో బాక్ నినాదాలతో ప్రజలు వ్యతిరేక ప్రదర్శనలను చేసిరి. ఈ ప్రదర్శకులపై పోలీసులు దారుణంగా లాఠీచార్జీలు చేసిరి. ఈ సందర్భంగా 1928 అక్టోబర్ 30న లాహోర్‌లో లాలాలజపతిరాయ్ నాయకత్వంలో జరిగిన ప్రదర్శన పై పోలీసులు చేసిన లాఠీ చార్జిలో తీవ్రంగా గాయపడిన లజపతిరాయ్ 1928 నవంబర్ 17న మరణించెను.

## 62.12 నెహ్రూ నివేదిక విపరిణామాలు :

భారతదేశంలో అన్ని వర్గాల ప్రజలను సంతృప్తి పరచగల రాజ్యాంగ సంస్కరణలను ఏ భారతీయుడైనా రూపొందించగలడా? అని నాటీ భారత వ్యవహారాల కార్యదర్శి బర్కెన్ హెడ్ సవాలు విసిరెను. ఈ సవాలును స్వీకరించి కాంగ్రెస్ నాయకుడైన మోతీలాల్ నెహ్రూ ఒక రాజ్యాంగ ముసాయిదాను రూపొందించెను. దీనినే నెహ్రూ రిపోర్ట్ అని పిలిచిరి. ఇందులో భారత రాజ్యంగం అధినివేష ప్రతిపత్తిని కలిగి ఉండవలెనని భాషా ప్రాతిపదికపై రాష్ట్రాలతో కూడిన సమాఖ్యగా ఏర్పడవలెనని, దేశంలో ఎన్నికలు మత ప్రాతిపదికపై జరగరాదని, వయోజనలందరికీ ఓటు హక్కును ఇవ్వలెనని నెహ్రూ ప్రతిపాదించెను. కానీ ఈ నివేదికను హిందూ మహాసభా, ముస్లింలీగ్, సిక్కు సమాఖ్య తిరస్కరించెను. నెహ్రూ నివేదికకు భిన్నంగా ముస్లింలీగ్ నాయకుడైన జిన్నా 14 సూత్రాల రాజ్యాంగ పథకాన్ని ప్రకటించెను. ఈ

పథకంలో జిన్నా మతప్రాతిపదిక ఎన్నికలను బలపరిచెను. నెహ్రూ నివేదికను యువ నాయకులైన జవహర్‌లాల్ నెహ్రూ, సుభాస్ చంద్రబోస్ మొదలగు వారు వ్యతిరేకించిరి. 1928లో కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ సమావేశంలో ఈ యువ నాయకులు పూర్వ స్వాతంత్ర్య తీర్మానం చేయవలెనని ప్రయత్నించిరి. కాని గాంధీ, మోతీలాల్ నెహ్రూ మొదలగు వారు అధినివేష ప్రతిపత్తిని సాధించకనే పూర్ణ స్వరాజ్య తీర్మానమును చేయుట తొందరపాటు చర్య అని అభిప్రాయపడిరి. భారత దేశానికి 1929 డిశంబర్ 31లోపు అధినివేష ప్రతిపత్తిని ఇచ్చుటకు గడువుగా నిర్ణయించి అది అమలు కానీ పక్షంలో పూర్ణ స్వాతంత్రమును ప్రతిపాదించి దాని సాధన కొరకు శాసన ఉల్లంఘనను చేసెదమని హెచ్చరించిరి.

రాజప్రతినిధి ఇర్విన్ కాంగ్రెస్ హెచ్చరికను పరిగణించపోవుటతో కాంగ్రెస్ 1929 డిశంబర్‌లో లాహోర్‌లో సమావేశమై సంపూర్ణ స్వాతంత్రమే ఏకైక లక్ష్యంగా ప్రకటించెను. ఈ సమావేశంలో జవహర్‌లాల్ నెహ్రూ కాంగ్రెస్‌కు అధ్యక్షుడు అయ్యెను. డిశంబరు 31, 1929న నెహ్రూ లాహోర్‌లో రావినదీ తీరంలో భారత త్రివర్ణ పతాకంను ఎగురవేసి పూర్ణ స్వరాజ్ ప్రతిజ్ఞను చేయించెను.

స్వాతంత్ర ప్రతిజ్ఞలో ఆంగ్ల ప్రభుత్వము భారతీయుల స్వేచ్ఛా స్వాతంత్రాలను హరించుటయే గాక సామాన్య వర్గాలను దోచుకొని దేశ ఆర్థిక రాజకీయ, సాంస్కృతిక ఆధ్యాత్మిక వ్యవస్థలను నాశనం చేసినందువలన ఆంగ్లేయులతో సంబంధాలను వదులుకొని పూర్వస్వరాజ్‌ను సాధించుటయే మా లక్ష్యం అని ప్రకటించెను.

ఈ విధంగా లాహోర్ కాంగ్రెస్ సమావేశానికి స్వాతంత్రయోద్యమంలో విశేష ప్రాధాన్యత చోటుచేసుకొనెను. నాటి నుండి స్వరాజ్యమనగా పూర్తి రాజకీయ స్వేచ్ఛ అని గుర్తించిరి. జాతీయోద్యమ సారధిగా గాంధీని అంగీకరించి పూర్ణస్వాతంత్ర్యానికి శాసన ఉల్లంఘనను ఆయుధంగా స్వీకరించిరి.

### పాఠ్య ప్రశ్నలు 62.సి

1. స్వరాజ్ పార్టీ విధానాలు ఏవిధంగా కాంగ్రెస్‌కు భిన్నమైనవి?
2. స్వరాజ్ పార్టీ నాయకులలో ఇరువురి పేర్లు తెలుపుము.
3. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఇంటర్నేషన్‌కు ఎన్నికైన తొలి భారతీయుడు ఎవరు?
4. సైమన్ కమీషన్‌ను ఎందువలన భారతీయులు వ్యతిరేకించిరి
5. 1930 స్వాతంత్ర్య ప్రతిజ్ఞలో జాతీయవాదులు లక్ష్యము ఏది

## 62.13 శాసన ఉల్లంఘన ఉద్యమం :

గాంధీ శాసన ఉల్లంఘనను 1930 ఏప్రిల్ 6న చేపట్టెను. ఆరోజు గాంధీ దండిగ్రామాన్ని చేరి సముద్ర తీరానికి వెళ్ళి చట్ట వ్యతిరేకంగా ఉప్పును తయారుచేసెను. భారతీయులందరిని ప్రభావితం చేసే ఉప్పు చట్టంను ధిక్కరించవలెనని గాంధీ నిర్ణయం.

శాసన ఉల్లంఘన ఉద్యమం సహాయ నిరాకరణకు భిన్నమైనది. సహాయనిరాకరణలో భారతీయులు ఆంగ్లేయులకు సహకరించక కేవలం ప్రేక్షక పాత్ర వహించిరి. కాని శాసన ఉల్లంఘనలో ప్రజావ్యతిరేక చట్టాలను ధిక్కరించి తద్వారా

ప్రభుత్వంను స్తంభింపచేయుట లక్ష్యంగా పెట్టుకొనిరి ఈ ఉద్యమం ద్వారా ఆంగ్ల పాలనను దేశంలో ఆమోదం కాదని భారతీయులు స్పష్టం చేసిరి.

గాంధీతో ప్రారంభమైన ఉప్పు సత్యాగ్రహం దేశ వ్యాప్తంగా జరిగెను. తమిళనాడులో ఉప్పు సత్యాగ్రహం సి.రాజగోపాలాచారి నాయకత్వంలో జరిగెను. అస్సాంలో ఉప్పు సత్యాగ్రహంతో పాటు ఇతర శాసనాల ధిక్కరణ జరిగెను. తూర్పు భారతదేశంలో పన్నుల నిరాకరణ జరిగెను. గుజరాత్ నంది ఖేడా గ్రామరైతులు భూమిశిస్తులను చెల్లించుటకు నిరాకరించిరి. మహారాష్ట్ర, కర్నాటకలలోని గిరిజనులు అటవీ చట్టాలను ధిక్కరించిరి. ఉత్తరప్రదేశ్‌లో రైతులు శిస్తులను, జమీందారులు కౌలును చెల్లించలేదు.

పశ్చిమోత్తర భారతదేశంలో శాసన ఉల్లంఘన ఉద్యమం అద్వితీయంగా జరిగెను. 'సరిహద్దు గాంధీ'గా ఖ్యాతిగాంచిన ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్ నాయకత్వంలోని ఖుదాయే ఖిదేమత్‌గార్(భగవంతుని సేవకులు) అను స్వచ్ఛంద దళమును ఏర్పాటు చేసెను. ఈ దళంను 'రెడ్‌షర్ట్స్' అని పిలిచిరి. ఈ దళంపై పెషావర్‌లో కాల్పులు జరపవలసినదిగా ఆంగ్ల అధికారులు ఆదేశించగా నిరాయుధులపై కాల్పులు జరుపుటకు సైనికులు తిరస్కరించిరి. ఫలితంగా సైనిక న్యాయస్థానం ఆ సైనికులను విచారించి వారికి జైలు శిక్షను విధించెను. దేశంలోని అన్ని వర్గాలలో పెంపొందించిన జాతీయ భావాలకు ఈ సంఘటన నిదర్శనం.

ఈ ఉద్యమంలో మహిళలు చురుకుగా పాల్గొనిరి. వీరు గృహాల నుండి బయటకు వచ్చి సత్యాగ్రహ శిబిరాలలో పాల్గొనిరి. విదేశీ వస్త్రాలను, కల్లును విక్రయించు దుకాణాలను స్త్రీలు పికెటింగ్ చేసిరి. లాఠీచార్జిలలో గాయపడిన వారికి ప్రథమచికిత్సలను చేయుటకు అనేకమంది మహిళలు ముందుకు వచ్చిరి. విదేశీ వస్తువులను బహిష్కరించటకు, కల్లు వ్యతిరేక ఉద్యమంలో విద్యార్థులు, యువకులు పెద్ద సంఖ్యలో పాల్గొనిరి. చిన్నపిల్లలు సైతము 'వానరసేనలు' అను పేరుతో ఉద్యమంలోనికి వచ్చిరి. గాంధీ సముద్రంనుండి తయారు చేసిన గుప్పెడు ఉప్పు దేశవ్యాప్తంగా గొప్ప ఉద్యమానికి దారితీసెను.

ప్రారంభములో ఈ ఉద్యమ విషయంలో ప్రభుత్వం జోక్యం చేసుకొనలేదు. సముద్రతీరం వెంబడి యాత్రలు చేసి ఉప్పును తయారుచేసినంత మాత్రమున జరుగు ప్రమాదం ఏమీలేదు అంగ్లేయులు ఈ ఉద్యమాన్ని అవహేళన చేసిరి. కాని ఉద్యమం నానాటికీ తీవ్రమై అన్ని ప్రాంతాలకు విస్తరించుటతో ప్రభుత్వం మేల్కొని ఉద్యమాన్ని సహజమైన దౌర్జన్య చర్యలతో అణిచి వేయుటకు అన్ని ప్రయత్నాలను చేసెను. 90,000 మందిని జైళ్ళలో నిర్బంధించెను. ఈ సంఖ్య సహాయ నిరాకరణలో నిర్బంధించబడిన దానికన్నా 3రెట్లు అధికం. గాంధీతో సహనాయకులందరు జైళ్ళకు వెళ్ళిరి. కాంగ్రెస్ సంస్థలన్నింటిని చట్ట వ్యతిరేకమైనవిగా ప్రకటించిరి. పత్రికలపై ఆంక్షలు విధించబడెను. ఈ కాలంలో విదేశీ వస్తువులు ముఖ్యముగా వస్త్రాలు, సిగరెట్లు మొదలగు దిగుమతులు 50% తగ్గిపోయెను. ప్రభుత్వానికి మద్యం అమ్మకాల నుండి లభించు ఎక్సైజ్ పన్నులు గణనీయంగా తగ్గిపోయెను. శాసన సభలకు జరుగు ఎన్నికలను బహిష్కరించిరి.

## 62.14 రౌండ్ టేబుల్ సమావేశాలు :

సైమన్ కమీషన్ నివేదికను చర్చించుటకు లండన్‌లో1930లో మొదటి రౌండ్ టేబుల్ సమావేశంను ఏర్పాటు చేసిరి. దీనివలన ఎటువంటి ఫలితం ఉండదని ఈ సమావేశంను జాతీయ కాంగ్రెస్ బహిష్కరించెను.

**గాంధీ – ఇర్విన్ ఒడంబడిక తదనంతర పరిణామాలు**

దౌర్జన్యంగా శాసన ఉల్లంఘన ఉద్యమాన్ని అణిచివేయుట కష్టమని గ్రహించిన ఆంగ్ల ప్రభుత్వం గాంధీని చర్చలకు ఆహ్వానించెను. 1931 మార్చి 5న గాంధీ–రాజప్రతినిధి ఇర్విన్‌ల మధ్య ఒక ఒడంబడిక కుదిరెను. ఫలితంగా ఉద్యమము తాత్కాలికంగా నిలిపివేయబడెను. గాంధీ రెండవ రౌండ్ టేబుల్ సమావేశంలో పాల్గొనుటకు అంగీకరించెను. హింసాయుత పోరాటము చేసిన వారిని మినిహాయించి మిగిలిన వారిని విడుదల చేయుటకు ప్రభుత్వము అంగీకరించెను. తీరప్రాంత గ్రామాలలోని ప్రజలు తమ అవసరాల కొరకు ఉప్పును తయారుచేసుకొనే హక్కును కల్పించిరి. శాంతియుతం పికెటింగ్‌లను జరుపుకొనుటకు ప్రభుత్వం అంగీకరించెను.

గాంధీ–ఇర్విన్ ఒప్పందంలో జాతీయ ప్రయోజనం గల ఒక్క సమస్యకు ఆమోదం లభింపకనే గాంధీ ఉద్యమంను నిలుపుదల చేయుటను వామపక్ష భావాలు గల యువత అంగీరింపలేక పోయెను కాని గాంధీ ప్రభుత్వమును విశ్వసించెను. జైళ్ళ నుండి విడుదలైన వారికి అత్యంత ఘనమైన స్వాగతాలు లభించినవి. ఈ ఉద్యమం ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడగలమనెడి విశ్వాసంను భారతీయులలో పెంపొందించెను.

రాజ్యాంగ సంస్కరణల విషయమై గాంధీ రెండవ టేబుల్ సమావేశములో పాల్గొని చర్చించెను. కాని ఈ చర్చలు విఫలమై గాంధీ 1931లో ఇండియాకు తిరిగి వచ్చెను. 1932లో నిలిపివేసిన శాసన ఉల్లంగన ఉద్యమాన్ని తిరిగి ప్రారంభించిరి. కాని ఉద్యమాన్ని ప్రభుత్వం అణిచివేసెను. గాంధీని వెంటనే నిర్బంధించి కాంగ్రెస్‌ను ప్రభుత్వం నిషేధించెను. అనేక అణిచివేత చట్టాలను చేసెను. ఎదురు తిరిగిన వారిని ప్రభుత్వం నిర్ధాక్షిణ్యంగా అణిచివేసెను. 1934 ఏప్రిల్ వరకు ఈ ఉద్యమం కొనసాగెను. కాని క్రమంగా బలహీనపడెను. గాంధీ కొంతకాలం క్రియాశీలక రాజకీయాలకు దూరమయ్యెను.

## 62.15 కమ్యునల్ అవార్డ్ 1932 :

భారతీయులలోని జాతీయ వాదాన్ని నీరుగార్చుటలో భాగంగా 1932 ఆగస్టులో బ్రిటీష్ ప్రభుత్వం కమ్యునల్ అవార్డ్‌ను ప్రకటించెను. దీని ప్రకారం దేశంలో సిక్కులు, మహమ్మదీయులు, క్రైస్తవులు మరికొందరు మైనారిటీలు. వీరిందరికి శాసనసభలలో ప్రత్యేక రిజర్వేషన్‌లు కల్పించబడెను. అంతేగాక అణగారిన వర్గాలైన హరిజనులకు రిజర్వేషన్‌లు కల్పించిరి.

ఈ చర్య ద్వారా హరిజనులను హిందువుల నుండి వేరుచేసి వారిని ప్రత్యేక రాజకీయ వర్గంగా పేర్కొనుటకు జాతీయవాదులందరూ వ్యతిరేకించిరి. ఈ అవార్డ్‌కు వ్యతిరేకంగా గాంధీ, జైలులోనే నిరాహార దీక్షను ప్రారంభించెను. అంటరానితనంకి వ్యతిరేకంగా జరుగుచున్న ఉద్యమానికి ఈ అవార్డ్ గొడ్డలి పెట్టు వంటిదని గాంధీ అభిప్రాయపడెను. ప్రత్యేక నియోజక వర్గాల ద్వారా అంటరాని వర్గాలు ఎన్నటికి అంటరాని వర్గముగానే మిగిలిపోగలదని నాయకులు అభిప్రాయపడిరి. తుదకు ఈ వివాదం పూనా ఒడంబడిక ద్వారా ముగిసెను. హరిజనులకు కేటాయించిన స్థానాల సంఖ్య రెట్టింపు అయ్యెను.

## 62.16 1935 భారత ప్రభుత్వ చట్టం :

1919 రాజ్యాంగ చట్టము భారతీయులను పూర్తిగా నిరుత్సాహపరచిన విషయంను మనం అధ్యయనం చేసాము. 1930 తదనంతర కాలంలో జాతీయ ఉద్యమాలు తీవ్రస్థాయిలో జరిగినవి. అందువలన భారతీయులను సంతృప్తిపరచుటకు వారికి కొన్ని రాయితీలు ఇవ్వవలసిన పరిస్థితి ఏర్పడెను. 1932లో మూడవ రౌండ్ టేబుల్ సమావేశం జరిగిన పిమ్మట బ్రిటీష్ ప్రభుత్వం ఒక శ్వేత పత్రంను విడుదల చేసి దాని ప్రాతిపదికపై 1935 భారత ప్రభుత్వ చట్టమును రూపొందించెను.

**1. అఖిల భారత సమాఖ్య :**

ఈ చట్టం సమాఖ్య తరహ ప్రభుత్వ ఏర్పాటుకు కృషిచేసెను. బ్రిటీష్ పాలితరాష్ట్రాలన్ని ఈ సమాఖ్యలో చేరగలవు. స్వదేశీ సంస్థానాలు సమాఖ్యలో చేరు స్వేచ్ఛను వాటికే వదిలివేసిరి. అధికార విభజన జరిగి కేంద్ర జాబితాలో 59 అంశాలను చేర్చిరి. వీటిలో రైల్వేలు, సైనిక వ్యవహారాలు, తంతి,తపాలా మొదలగునవి కలవు. రాష్ట్ర జాబితాలో 54 అంశాలు కలవు. వీటిలో విద్యా, భూమిశిస్తు, స్థానిక ప్రభుత్వాలు మొదలగునవి ముఖ్యమైనవి. ఉమ్మడి జాబితాలో 34 అంశాలు కలవు. ఇందులో క్రిమినల్ న్యాయం, సివిల్ న్యాయం మొదలగునవి కలవు. ప్రాంతీయ ప్రభుత్వాలకు ఫెడరల్ ప్రభుత్వానికి మధ్య తలెత్తు వివాదంలను పరిష్కరించుటకు ఢిల్లీలో ఒక ఫెడరల్ న్యాయస్థానం నెలకొల్పిరి. క్రింది న్యాయస్థానాలపై ఈ కోర్టు పునర్విచారణాధికారాలు కలిగి ఉండును.

ఈ చట్టం ద్వారా రాష్ట్రాలలోని ద్వంద్వ పాలన కేంద్రానికి విస్తరించెను. పరిపాలనలో గవర్నర్ జనరల్‌కు కార్యవర్గ సభ్యులు, కొందరు మంత్రులు సహకరించెదరు. వీరిలో కార్యవర్గ సభ్యులకు రిజర్వ్‌డు జాబితాపై, మంత్రులకు ట్రాన్స్‌ఫర్డ్ జాబితానందలి అంశాలపై అధికారాలు ఇవ్వబడినవి. మంత్రులందరు శాసనసభలో సభ్యులు. వారు శాసనసభకు బాధ్యత వహించెదరు. కేంద్ర పాలనలో గవర్నర్ జనరల్ అత్యంతశక్తివంతుడు. మంత్రులు తమ శాఖల విషయంలో గవర్నర్ జనరల్‌కు సలహాలను ఇవ్వగలరు. ఆ సలహాల స్వీకరణ గవర్నర్ జనరల్ విజ్ఞతకు వదిలివేసిరి. శాసన సభ ఆమోదించిన ప్రతి బిల్లుకు గవర్నర్ జనరల్ ఆమోదం అనివార్యం శాసనసభ సమ్మతి లేకనే బడ్జెట్ నందలి కొన్ని అంశాలను గవర్నర్ జనరల్ రూపొందించగలడు. అత్యవసర సమయాలలో గవర్నర్ జనరల్ ఆర్డినెన్స్‌లను జారీ చేయగలడు.

**2. రాష్ట్రాలకు స్వయం ప్రతిపత్తి :**

ఈ చట్టం ద్వారా సంభవించిన ముఖ్యమైన మార్పు ఏమనగా రాష్ట్రాలకు స్వయంపాలనను ఇచ్చుట. రాష్ట్ర జాబితాలోని అంశాలపై రాష్ట్రాలకు పూర్తి అధికారాలు ఇవ్వబడినవి. బెంగాల్, బొంబాయి, మద్రాస్, ఉత్తరప్రదేశ్, బీహార్, అస్సాం రాష్ట్రాలలో ద్విశాసన వ్యవస్థ ప్రవేశపెట్టబడెను. ఎగువసభను శాసనమండలి అని, దిగువ సభను శాసన సభ అని పిలిచిరి. పంజాబ్, మధ్యరాష్ట్రం వాయువ్య సరిహద్దు రాష్ట్రం, ఒరిస్సా, సింధ్‌లలో ఏకశాసనసభ వ్యవస్థ అమలులోనికి వచ్చెను. రాష్ట్రజాబితాలో అంశాలపై చట్టాలు చేయు అధికారం శాసనసభలకు ఇవ్వబడినను గవర్నర్‌కు అధికారాలు ఎక్కువగా ఇవ్వబడినవి. రాష్ట్ర శాసన బిల్లులన్నింటికి గవర్నర్ ఆమోదము అనివార్యం. రాష్ట్ర శాసనసభను రద్దు చేయుటకు ఆర్డినెన్స్‌లను జారీచేయుటకు గవర్నర్‌కు అధికారాలు కలవు.

ఈ చట్టం 1909, 1919 చట్టాలు ప్రవేశపెట్టిన మతప్రాతిపదిక ఎన్నికల వ్యవస్థను కొనసాగించెను.

రాష్ట్రాలలో కార్యనిర్వహక అధికారాలు గవర్నర్‌కు ఇవ్వబడినవి. ఇతనికి మంత్రులు సహాయపడెదరు. ఈ మంత్రులను శాసన సభలో మెజారిటి పార్టినుండి గవర్నర్ ఎంపిక చేసుకొనును. ఈ మంత్రుల సలహాలను గవర్నర్ స్వీకరించవచ్చును లేదా తిరస్కరించవచ్చును. ప్రభుత్వములోని అన్ని శాఖలపై ఇతనికి అదుపు కలదు.

ఈ చట్టం భారత వ్యవహారాల కార్యదర్శి పదవిలో పలుమార్పులను తెచ్చెను. భారత కార్యదర్శి కౌన్సిల్ రద్దు అయ్యెను. ఇకనుండి భారత కార్యదర్శి, స్వయంగా నియమించుకొనిన కౌన్సిలర్ల సహాయంను తీసుకొనును. వీరి సంఖ్య 6కు మించకుండా 3కు తక్కువ లేకుండా ఉండవలెను. వీరి సలహాలు సెక్రటరీకి తప్పనిసరికాదు. ఈ విధంగా భారత కార్యదర్శి పదవి మునుపటి కన్నా శక్తివంతమయ్యెను. ఈ చట్టము ద్వారా రాష్ట్రాలకు స్వయం పాలనను అందించినను దానిపై అనేక ఆంక్షలు విధించబడినవి. అందువలననే ఈ చట్టంను నెహ్రూ 'బ్రేకులు, ఇంజన్ లేని యంత్రం' వంటిదని అభివర్ణించెను. జిన్నా సైతం ఈ చట్టంను ఎట్టి పరిస్థితులలో ఆమోదించుటకు వీలులేని చట్టముగా అభివర్ణించెను.

**62.17 1935-39 సంవత్సరముల మధ్య పరిణామాలు**

**(ఎ) కాంగ్రెస్ మంత్రివర్గాల ఏర్పాటు :**

1935 చట్టం స్వభావముపై కాంగ్రెస్ తీవ్ర అసంతృప్తి వ్యక్తపరిచినను ఈ చట్ట ప్రాతిపదికపై 1937లో జరిగిన రాష్ట్ర శాసనసభల ఎన్నికలలో కాంగ్రెస్ పాల్గొని 7 రాష్ట్రాలలో మెజారిటీ స్థానాలలో గెలుపొంది మంత్రివర్గాలను ఏర్పాటు చేసెను. రెండురాష్ట్రాలలో (బెంగాల్, పంజాబ్) సంకీర్ణ ప్రభుత్వాలను ఏర్పాటు చేసెను.

కాంగ్రెస్‌కు ఎన్నికలలో లభించిన ఘన విజయం దాని ప్రతిష్టను ఇనుమడింపచేసెను. రాష్ట్రాలలోని కాంగ్రెస్ ప్రభుత్వాలు కేంద్ర ప్రభుత్వ వ్యతిరేక విధానాలను నిరోధించుటకు ప్రయత్నించగలవని విశ్వసించిరి. తమకు గల పరిమిత అధికారాలతో కాంగ్రెస్ ప్రభుత్వాలు ప్రజల సమస్యల పరిష్కారానికి కృషి చేసినవి. రైతుల పరిస్థితులు మెరుగుపరచుటకు, శ్రామికుల ప్రయోజనాలను పరిరక్షించుటకు, అంటరాని తనమును నిర్మూలించుటకు, ప్రాధమిక, సాంకేతిక విద్యను అభివృద్ధి చేయుటకు కాంగ్రెస్ ప్రభుత్వాలు కృషి చేసినవి.

**(బి) అంతర్జాతీయ పరిణామాలు - కాంగ్రెస్ :**

కాంగ్రెస్ ప్రారంభంనుండి అంతర్జాతీయ పరిణామాలను ఆసక్తిగా గమనించెను. జాతీయవాదులు బ్రిటీష్ అనుసరించు సామ్రాజ్యవాద విధానాలను, భారతీయ సైన్యాలను తమ ప్రయోజనాల పరిరక్షణ కొరకు యుద్ధాలకు పంపుటను వ్యతిరేకించింది. స్వాతంత్ర్యం, విముక్తి కొరకు ప్రపంచంలో ఇతరులు చేయుచున్న పోరాటాలకు కాంగ్రెస్ తన సానుభూతిని, సహకారాన్ని అందచేసెను. ఐర్లాండ్, ఈజిప్టు, టర్కీ, ఆఫ్ఘన్, దక్షిణ ఆఫ్రికాలలో జరిగిన పోరాటాలను ఇండియా సమర్ధించెను.

1927లో జవహర్ లాల్ నెహ్రూ వలసవాద, సామ్రాజ్యవాద వ్యతిరేకంగా జరిగిన అంతర్జాతీయ సదస్సుకు హాజరయ్యెను. ఈ సభకు నెహ్రూ అధ్యక్షునిగా ఎన్నికయ్యెను. సామ్రాజ్యవాదానికి, వ్యతిరేకంగా, జాతీయ స్వాతంత్ర్యం కొరకు ఏర్పడిన అంతర్జాతీయ లీగ్ కార్యవర్గ సభ్యునిగా నెహ్రూ ఎన్నికయ్యెను. అంతేగాక కాంగ్రెస్ ఈ లీగ్‌కు అనుబంద సంస్థగా చేసెను. భారతజాతీయోద్యమం ప్రపంచ వ్యాప్తంగా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జరుగుచున్న పోరులో భాగమని ప్రకటించెను.

1936 తదనంతరం జాతీయ విదేశీ విధానములో వేగవంతమైన మార్పులు సంభవించెను. ఇటలీ ఫాసిస్ట్ సిద్ధాంతాలు ప్రచారంలోనికి వచ్చినవి. ఇటువంటి ప్రమాదకర ధోరణులు జర్మనీ జపాన్‌లలో బయలుదేరినవి. భారతదేశ భవిష్యత్ ఈ ఫాసిస్ట్ శక్తులకు, ప్రజాస్వామ్య శక్తుల మధ్య జరుగు వైరముపై ఆధారపడియున్నదని గ్రహించిరి. 1936 లక్నో కాంగ్రెస్ సభలో అధ్యక్షుడై నెహ్రూ ప్రసంగించుచూ ప్రపంచం సామ్రాజ్యవాద, ఫాసిస్ట్ వర్గముగాను, సామ్యవాద, జాతీయ వాద వర్గంగా రెండుగా విడిపోయిరి. 1939లో నెహ్రూ మన పోరాటంను ప్రభావితం చేయు అంశాలు మన దేశంలో కాక స్పెయిన్, చైనాలలో కలవని ప్రకటించెను. కాంగ్రెస్ హిట్లర్ చెకొస్లవేకియాను ఆక్రమించుటను ఖండించెను. అరేబియా, పాలస్తీనాలకు తన సానుభూతిని తెలియచేసెను. అదేవిధంగా సోవియట్ రష్యాను అభిమానించెను. కాంగ్రెస్ 1936లో ఒక తీర్మానము ద్వారా బ్రిటీష్ అని విదేశీ విధానాల నుండి పూర్తిగా వైదొలగుచున్నట్లు ప్రకటించెను.

తదుపరి పాఠంలో రెండవ ప్రపంచ యుద్ధంను, జాతీయోద్యమముపై దాని ప్రభావంను అధ్యయనం చేయగలరు.

**(సి) సామ్యవాద భావాల వృద్ధి :**

రాజకీయ చైతన్యం పొందిన భారతీయులలో సామ్యవాద భావాల వృద్ధిని 1930నుండి మనము గమనించగలం. భారతీయ యువకులు రష్యా విప్లవం యెడల గొప్ప ఆకర్షితులైరని ఇంతకుముందు మనం తెలుసుకొని యున్నాం. జవహర్‌లాల్ నెహ్రూ, సుభాష్ చంద్రబోస్‌లు రష్యాను సందర్శించిరి. చంద్రశేఖర ఆజాద్, భగత్‌సింగ్‌లు సామ్యవాద భావాలను విశ్వసించిరి. ఎం.యన్.రాయ్ ఈవిషయమై ప్రపంచ వ్యాప్తంగా పేరు తెచ్చుకొనెను.

1929లో పెట్టుబడిదారి రాజ్యాలలో తీవ్ర ఆర్థిక మాంధ్యం ఏర్పడెను. ఉత్పత్తి, వర్తకాలు దెబ్బతిని నిరుద్యోగము ప్రబలెను. అదే సమయములో రష్యాలో గొప్ప పురోగతి సాధ్యపడెను. రెండు పంచవర్ష ప్రణాలికలలో రష్యా సాధించిన ప్రగతిని భారతీయులు గమనించిరి. 1932 తదనంతరము దేశంలో అనేక కార్మిక సంఘాలు, రైతు సంఘాలు ఏర్పడినవి. అంతకు మునుపే 1928లో అఖిలభారత కార్మిక, కర్షక పార్టీ అవతరించెను. 1934లో జయప్రకాష్ నారాయణ, ఆచార్య నరేంద్రదేవ్‌లు కలసి కాంగ్రెస్ సోషలిస్టు పార్టీని స్థాపించిరి. 1936లో అఖిలభారత కిసాన్ మహాసభ అవతరించెను.

1936-39 సంవత్సరముల మధ్య కాలంలో నెహ్రూ, బోస్‌లు కాంగ్రెస్ అధ్యక్షులుగా ఎన్నికైరి. ఫలితముగా కాంగ్రెస్‌లో బలమైన వామపక్ష భావాలు పెంపొందినవి. 1931 కరాచి సమావేశంలో కాంగ్రెస్ ప్రాధమిక హక్కులు, ఆర్థిక విధానాలపై ఒక తీర్మానంను ఆమోదించెను. 1938లో జాతీయ ప్రణాళిక కమిటి ఏర్పడెను. 1938లో వామపక్ష భావాల గల సుభాష్‌చంద్రబోస్ ఎన్నిక అయ్యెను. ఫలితంగా గాంధీ బోస్‌ల మధ్య అభిప్రాయభేదాలు తలెత్తినవి.

**(డి) అఖిలభారత స్వదేశీ సంస్థానాలలో ప్రజా ఉద్యమాలు :**

ఆంగ్లేయుల పాలనలో భారతదేశంలో పెరిగిన జాతీయభావాలు, రాజకీయ చైనత్యం, స్వదేశీ సంస్థానాలలోని అణిచివేత విధానాలు, రైతులు, కార్మికుల దుస్థితి స్వాతంత్ర పోరాటాలకు మార్గంను సులభతరం చేసెను.

దేశంలోని స్వదేశీ సంస్థానాల బ్రిటీష్‌వారి సార్వభౌమాధికారమును అంగీకరించిన విషయం అధ్యయనం చేసి యుంటిమి. ఈ స్వదేశీ రాజ్యాలలో ఎటువంటి తిరుగుబాట్లు జరిగినా వాటిని అణిచివేయుటను తమ బాధ్యతగా ఆంగ్లేయులు తీసుకొనిరి. ఈ రాజ్యాలలో ప్రజలకు ఎటువంటి పౌరహక్కులు లేవు. విద్యా, వార్తా పత్రికలు అభివృద్ధికి నోచుకొనలేదు. పన్నుల భారం అధికం. సంస్కరణలను అనుమతించలేదు. ఈ రాజ్యాల పాలనలో నిరంతరం బ్రిటీష్

జోక్యము అధికంగా ఉండెను. బరోడా మహరాజు జాతీయ వాదులకు సానుభూతి తెలుపగా బ్రిటీష్ ప్రభుత్వం అభ్యంతరం తెలిపెను.

1920 దశాబ్దంలో జరిగిన ఖిలాఫత్, సహాయ నిరాకరణ ఉద్యమాలు సంస్థానాలలోని ప్రజలను విశేషంగా ప్రభావితమొనర్చినవి. సంస్థానాల ప్రజల సమావేశాలు బరోడా, హైదరాబాద్, జామ్‌నగర్‌లలో జరిగినవి. ఈ సంస్థానాలలో ప్రజల రాజకీయ కార్యకలాపాలను సమన్వయ పరచుటకు అఖిలభారత స్వదేశీ రాజ్యప్రజల సమావేశం (AISPC) జరిగెను.

బ్రిటీష్ ప్రభుత్వం ఇటువంటి చర్యలను నిరోధించు ప్రయత్నాలు ముమ్మరం చేసెను. 1935 చట్టం ద్వారా అఖిలభారత సమాఖ్య అవతరించెను. ఈ సమాఖ్యకు సంస్థానాధీశులు తమ ప్రతినిధులను పంపిరి. కాంగ్రెస్ (AISPC)పార్టీ ఈ విధంగా సంస్థానాధీశులు ఎంపిక ద్వారా కాక తమ ఇష్టమైన వారిని సమాఖ్యకు పంపుటను వ్యతిరేకించెను. 1937లో అన్ని రాష్ట్రాలలో కాంగ్రెస్ అధికారానికి వచ్చుట ఫలితంగా సంస్థానాలలోని ప్రజలు విశ్వాసం మరింత బలపడెను. ఇటువంటి పరిణామాలు జైపూర్, కాశ్మీర్ పాటియాలలో చోటుచేసుకొనినవి.

స్వదేశీ సంస్థానాలలో వచ్చిన మార్పులు ఫలితంగా కాంగ్రెస్ తన విధానాలను మార్చుకొనినది. 1939లో జవహర్‌లాల్ నెహ్రూ(AISPC)అధ్యక్షునిగా ఎన్నికై స్వదేశీ సంస్థానాలలో స్వాతంత్ర్య పోరాటంను మరింత బలపరుచుటకు పలుచర్యలు గైకొనెను.

1942లో క్విట్ ఇండియా ఉద్యమం ప్రారంభమైన వెంటనే సంస్థానాలలోని ప్రజలు అందులో భాగస్వాములైరి. సంస్థానాలు ఇండియాలో భాగమని, ఆంగ్లేయులు వెంటనే దేశం నుండి తొలగవలెనని ఉద్యమించిరి.

ఈ స్వదేశీ సంస్థాలన్నియు ఇండియన్ యూనియన్‌లో ఏ విధముగా విలీనమైనదీ SS/4IST/65 ద్వారా తెలుసుకొనగలరు.

## (ఇ) నూతన మతవాద ధోరణులు :

స్వాతంత్ర్య పోరాట చివరి దశలో దేశంలో మతఛాందసవాద ధోరణులు వికృతరూపం దాల్చినవి. మహమ్మదీయులకు ప్రత్యేక నియోజకవర్గముల కేటాయింపును గురించి అధ్యయనం చేసాము. 1939 ఎన్నికలలో మహమ్మదీయులకు కేటాయించిన 482 స్థానంలలో కాంగ్రెస్ కేవలము 26 స్థానములలో గెలిచెను. మతభావాలతో ప్రచారము చేసిన ముస్లింలీగ్ 482 స్థానాలలో 109 స్థానాలలో గెలిచెను. హిందూ మహసభ కూడా గొప్ప విజయాలను సాధించలేకపోయెను. కాంగ్రెస్ ముస్లింల విశ్వాసంను పొందలేకపోయెను. కాంగ్రెస్ ముస్లింల విశ్వాసం పొందుటకు ఒక విస్తృత కార్యక్రమాన్ని చేపట్టవలెనని నెహ్రూ అభిప్రాయపడెను. కేవలం ముస్లింలీగ్ మాత్రమే మహమ్మదీయుల ప్రయోజనాలను పరిరక్షించగలదని జిన్నా ప్రచారం చేసెను.

1937 తదనంతరం మతఛాందసవాదం తీవ్రవాదంగా మారెను. జిన్నా నాయకత్వంలో ముస్లింలీగ్ మత ఉన్మాదానికి మారుపేరుగా మారెను. జిన్నా తాను ముందు మహమ్మదీయుడనని, పిమ్మటనే భారతీయుడనని ప్రకటించుకొనెను. సమైక్య భారతదేశంలో ముస్లింలు అల్పసంఖ్యాకులని, వారు అధిక సంఖ్యాకులైన హిందువులచే అణిచివేయబడుదురని జిన్నా వాదన. అందువలననే ముస్లింలీగ్ 1940లో పాకిస్థాన్ తీర్మానంను ఆమోదించెను.

మతోన్మాదం హిందువులలో సైతం వృద్ధిచెందెను. హిందూ మహాసభ దేశాన్ని హిందూ దేశంగా ప్రకటించెను. మహమ్మదీయులకు రాయితీలను ఇచ్చుటకు, ద్విజాతి సిద్ధాంతంను ఆమోదించుటకు హిందూ మహాసభ నిరాకరించెను. వి.డి.సావర్కర్ నాయకత్వములో రాష్ట్రీయ స్వయంసేవక సంఘం దేశములో తమవాదాలను మరింత తీవ్రతరం చేసెను. హిందూ-ముస్లింల మధ్య ఎటువంటి వ్యత్యాసంలు లేవని అభిప్రాయపడిన గాంధీపై అనేక విధములైన దాడులు జరిగినవి.

మతతత్వ ధోరణుల ఫలితంగా రాజ్యములో ద్వేషాలు, భయాలు పెరిగినవి. ఈ మతద్వేషాలు ఫలితంగా 1946 తదనంతరము దేశంలో అమానుషముగా ప్రాణహాని జరిగెను. వేలాదిమంది అమాయకప్రజలు ఈ మతోన్మాదానికి బలిఅయిరి. ఈ మత వైషమ్యాలు ముగింపు చివరకు దేశ విభజనకు ఏవిధంగా దారితీసెనో తదుపరి పాఠంలో అధ్యయనం చేసెదం.

## పాఠ్య ప్రశ్నలు 62.డి

1. శాసన ఉల్లంఘన ఉద్యమంలో గాంధీ ఉప్పు చట్టంను అతిక్రమించుటకు గల కారణం ఏమి?
2. కమ్యునల్ అవార్డ్‌ను  జాతీయవాదులు ఏల వ్యతిరేకించిరి.
3. 1935 చట్టంనందలి రెండు ముఖ్య అంశాలుఏవి?
4. స్వాతంత్ర్య ఉద్యమంలో భాగంగా ఇండియా అనుసరించిన విదేశీ విధాన లక్షణాలలో రెండింటిని తెలపండి.
5. 1935 ఎన్నికల తదనంతరం ముస్లిం లీగ్ స్వభావంలో వచ్చిన మార్పులు ఏవి?

## 62. సారాంశం :

మొదటి ప్రపంచ యుద్ధ ప్రారంభానికి ముందు బ్రిటీష్‌వారి యుద్ధ ప్రయత్నాలను భారతీయులు సమర్ధించిరి. దీని ద్వారా కొన్ని రాజకీయ ప్రయోజనాలను పొందగలమని వీరు భావించిరి. దాని ఆచరణలో ఎటువంటి ప్రయోజనాలు దేశానికి కలుగలేదు. 1909 భారత ప్రభుత్వం చట్టం దేశంనందలి జాతీయవాదులను ఎంతమాత్రం సంతృప్తిపరచలేక పోయెను. అంతేకాక ప్రజల స్వేచ్ఛను హరించు రౌలట్ చట్టంను ప్రయోగించిరి. గాంధీ ఈ విద్రోహ చట్టాలకు వ్యతిరేకముగా దేశవ్యాప్త ఉద్యమాన్ని ప్రారంభించెను. ఈ ఉద్యమంలో భాగంగా జలియన్‌వాలాభాగ్ మారణకాండ సంభవించెను.

1920-22 సంవత్సముల మధ్య కాలంలో దేశములో ఖిలాఫత్ ఉద్యమం ప్రారంభమయ్యెను. ఈ ఉద్యమం ద్వారా నూతన రాజకీయ చైతన్యంను పెంపొందించుటమే కాక అనేక మంది మహమ్మదీయులను జాతీయ ఉద్యమం యెడల ఆకిర్షించుటకు దోహదపడెను. కాంగ్రెస్ పెద్ద ప్రజాసంస్థగా రూపాంతరం చెందెను. కాని చౌరీచౌరా సంఘటన సహాయ నిరాకరణ ఉద్యమం ఉపసంహరణకు కారణమయ్యెను.

1922-23లో కాంగ్రెస్ నాయకులైన సి.ఆర్.దాస్, మోతీలాల్ నెహ్రూలు స్వరాజ్‌పార్టీని స్థాపించిరి. పరిపాలనను ప్రశ్నించుటకు శాసనసభలలో ప్రవేశము అనివార్యమని వీరు భావించిరి. ఈ కాలంలోనే దేశంలో ఉగ్రవాద కార్యకలాపాలు

హెచ్చుపెరిగినవి. భగత్‌సింగ్, చంద్రశేఖర్ అజాద్, రాజగురు, సుఖదేవ్, సూర్యాసేన్ మొదలగు వారు విప్లవ కార్యకలాపాలకు పాల్పిడిరి. సామ్యవాద భావాలు విస్తృతంగా ప్రచారంలోనికి వచ్చినవి. జవహర్‌లాల్ నెహ్రూ, సుభాష్‌చంద్రబోస్ మొదలగువారు సామ్యవాదం యెడల మొగ్గుచూపిరి.

1928లో సైమన్ కమీషన్ నియామకంతో జాతీయోద్యమం నూతన మలుపు తిరిగెను. ఈ కమీషన్‌లో ఆంగ్లేయులు ఉండుటంవల్ల దీనిని భారతీయులు బహిష్కరించిరి. 1928లోనే నెహ్రూ నివేదిక రూపొందించెను. ఈ నివేదిక అధినివేశ ప్రతిపత్తిని ఆమోదించెను. కానీ జవహర్‌లాల్ నెహ్రూ, సుభాస్‌చంద్రబోస్‌లు దీనిని వ్యతిరేకించి పూర్ణస్వరాజ్‌ను ప్రతిపాదించిరి. ఫలితముగా 1930 జనవరి 26 దేశవ్యాప్తంగా జండాలు ఎగురవేసి ఉత్సవాలు జరుపుకొనిరి.

**అభ్యాసం :**

1. క్రింది ప్రశ్నలకు 100 పదాలలో సమాధానంను వ్రాయుము.
1. జాతీయోద్యమంపై రౌలట్ చట్టాల తక్షణ ప్రభావంను పేర్కొనుము.
2. ఏవిధంగా శాసన ఉల్లంఘన ఉద్యమం సహాయ నిరాకరణ ఉద్యమం కన్నా భిన్నమైంది.
3. 1935 తదనంతరం ఉగ్రవాద కార్యకలాపాలు తగ్గుటకు గల కారణాలు ఏవి
4. కాంగ్రెస్ విధానాలకు సామ్యవాద సిద్ధాంతాలు ఏవిధంగా ప్రభావితం చేసెను.
2. సహాయ నిరాకరణ ఉద్యమం అర్థాంతరంగా నిలిపివేయబడినను అది విఫలమైదనుటకు వీలులేదు. ఈ ఉద్యమము జాతీయ వాదాన్ని ఏ మేరకు ప్రభావితమొనర్చెను.
3. ఉద్యమాన్ని ప్రజాఉద్యమంగా మార్చుటకు, గాంధీ అనుసరించిన విధానాలు ఏవి.
4. 20వ శతాబ్దిలో మతతత్వం పెరుగుదలను వివరించండి.
5. క్రింది వాక్యాలు చదివి ఇవ్వబడిన ప్రశ్నలకు 3 సమాధానాలు వ్రాయుము.

   గాంధీ మాటలలో దేశంలోని పేదలు ఈ దేశాన్ని తమ దేశంగా భావించుటకొరకు నేను పనిచేస్తాను. తద్వారా దేశములో ఉన్నత వర్గం బడుగు వర్గం అను వ్యత్యాసములు లేక సమభావం ఏర్పడగలదు. అంటరానితనానికి అవకాశం లేకుండా చేయవలెను. పురుషులతో పాటు స్త్రీలు సమాన హక్కులు కలిగి ఉండవలెను. అటువంటి భారతదేశాన్ని నేను చూడవలెనని కలలు  కనుచున్నాను.
6. దేశీయ, ఉత్పత్తుల వాడకం, విదేశీ వస్తు బహిష్కరణ అను స్వదేశీ భావన ఒక ఆర్థిక ఆయుధంగా ఉపకరించెను. ఫలితంగా దేశీయ ఉత్పత్తుల గిరాకి పెరిగి దేశంలో నూతన పరిశ్రమ స్థాపనకు, ఉపాధి అవకాశాలు పెంపొందుటకు వీలు కలిగెను.

**కృత్యాలు :**

1. 1930 జనవరి 26ను తొలి స్వాతంత్ర్య దినముగా జరుపుకొనిరి. ఈ స్వాతంత్ర్య ప్రతిజ్ఞతను చదవండి.
2. సహాయ నిరాకరణ, శాసన ఉల్లంఘన ఉద్యమాలలో పాల్గొనిని వారిని నీవు, నీ కుటుంబసభ్యులతో కలిసి వారి వ్యక్తిగత అనుభవాలను తెలుసుకొనవలసినది.
3. విప్లవకారులైన భగత్‌సింగ్, చంద్రశేఖర్ అజాద్ మొదలగు వారి భావాలను అధ్యయనం చేయండి.

## పాఠ్య ప్రశ్నలకు సమాధానాలు

**62.ఎ.**

1. యుద్ధకాలంలో సామ్రాజ్యవాద దేశాలు తమ ఆధీనంలోని వలస రాజ్యాలకు ప్రజాస్వామ్యాన్ని ప్రకటించిరి. కాని యుద్ధానంతరం ఈ మాటను పూర్తిగా విస్మరించిరి.
2. ద్వంద్వ ప్రభుత్వం ద్వారా ప్రభుత్వ అధికారాలు కేంద్ర, రాష్ట్ర జాబితాలుగా తిరిగి రిజర్వ్‌డు, ట్రాన్స్‌ఫర్డ్ జాబితాలుగా విభజించబడినవి.
3. సత్యము మరియు అహింస
4. సత్యాగ్రహంను చేపట్టుట
5. నిరాయుధులైన ప్రజలపై జనరల్ డయ్యర్ కాల్పులు జరిపించెను.

**62.బి.**

1. యుద్ధానంతరం టర్కి యెడల బ్రిటీష్ వైఖరి
2. దేశములో ఆంగ్లపాలనను స్తుతింపచేసి సహాయంను నిరాకరించుట.
3. 1. లక్ష్యమును మార్చుకొని అహింసా పద్ధతుల ద్వారా పూర్ణ స్వరాజ్యంను సాధించుట

2. కాంగ్రెస్ సభ్యత్వ రుసుంను తగ్గించుట
3. కార్యవర్గ కమిటీని భాషా ప్రాతిపదికపై ఏర్పరచుట
4. కాంగ్రెస్ సభ్యుల వయోపరిమితిని తగ్గించుట
5. సామాన్య ప్రజలు పాల్గొను విధంగా నిర్మాణాత్మక కార్యక్రమాలు చేపట్టుట.

# 63

# పూర్ణ స్వరాజ్య సాధన (1939-1947)

## 63.1 పరిచయం :

క్రితం పాఠంలో మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ నూతన జాతీయ నాయకుడుగా ఆవిర్భవించిన వైనాన్ని చదివాం. ఆయన నేతృత్వంలో స్వాతంత్ర్యోద్యమం నూతన మలుపు తిరిగింది. ఆధునిక యుగంలో ప్రంచంలో కనివినీ ఎరుగని ప్రజా ఉద్యమంగా జాతీయోద్యమం మారిపోయింది.

ఎంతటి శక్తి వంతమైన సామ్రాజ్యమైన శాంతియుత ప్రజా ఉద్యమ ధాటికి నిలువలేదని జాతీయోద్యమం నిరూపించింది. శాంతియుత రాజ్యాంగ పద్ధతుల ద్వారా స్వాతంత్ర్యాన్ని ఎలా పొందవచ్చు మన జాతీయోద్యమం ఒక ఉదాహరణ.

ఈ పాఠంలో జాతీయోద్యమంలోని తుది ఘట్టాలను గురించి చదువుతాం. రెండవ ప్రపంచ యుద్ధం జాతీయోధ్యమంపై కల్గించిన ప్రభావం, బ్రిటిషు వైఖరిలో వచ్చిన మార్పును ప్రముఖంగా ప్రస్తావిస్తాం. అధికార మార్పిడిలో, దేశ విభజనలో తలెత్తిన సమస్యలను గుర్తిస్తాం. మన పెద్దల యొక్క త్యాగ ఫలంగా స్వాతంత్ర్యం సిద్ధిఇంచిందని మనన చేసుకుంటాం. ఈ స్వాతంత్ర్యాన్ని గౌరవించి, దేశ సమైక్యతకు కృషి చేయడం మన విధి.

## 63.2 లక్ష్యాలు :

ఈ పాఠం చదివిన తరువాత ఈ క్రింది విషయాలు తెలుసుకుంటారు.

1. ఆగస్టు ప్రతిపాదన, క్రిప్సు రాయబారంలోని ముఖ్యాంశాలు :
2. ఆగస్టు ప్రతిపాదనను, క్రిప్సు ప్రతిపాదనలను కాంగ్రెస్ తిరస్కరించడానికి గల కారణాలు.
3. క్విట్ ఇండియా ఉద్యమ ప్రాముఖ్యం.
4. స్వాతంత్ర్య పోరాటంలో భారత జాతీయ సైన్యం వహించిన పాత్ర.
5. 1945 తరువాత భారత్ పట్ల బ్రిటిష్ వైఖరిలో మార్పుకు కారణాలు.

6. స్వాతంత్ర్య సముపార్జనకు మంత్రిత్రయ రాయబారం, మౌంట్ బాటన్ ప్రణాళిక దోహదం చేసిన వైనం.

7. దేశ విభజనకు కాంగ్రెస్ అంగీకరించుటకు కారణాలు.

## 63.3 రెండవ ప్రపంచ యుద్ధం – కాంగ్రెస్ మంత్రివర్గాల రాజీనామా :

భారతీయులకు స్వీయ పాలనను అందించిన వరప్రసాదియని, 1935 భారత ప్రభుత్వ చట్టాన్ని బ్రిటిష రాజకీయ మేధావి వర్గం ప్రశంసించింది. కాని అది నిజం కాదు. ఆచరణలో కార్యనిర్వహణ శాఖ శాసనసభ కెట్టి బాధ్యత కల్గియుండక పోవుటవలన, పార్లమెంటరీ ప్రభుత్వ విధానమనేది ఆదర్శంగానే ఈ చట్టంలో మిగిలిపోయింది. అయినా కాంగ్రెస్ ప్రభుత్వాలు చట్ట పరిధిలోనే ప్రజల స్థితిగతులను మెరుగుపరచటానికి కృషి చేశాయి. ప్రజారోగ్యం, విద్య, పత్రికాస్వాతంత్ర్యం – మున్నగువానిపై నిర్మాణాత్మక చట్టాలు చేయబడ్డాయి. జాతీయ కాంగ్రెస్ ప్రపంచ రాజకీయాలలో వచ్చే మార్పులను ముఖ్యంగా రెండవ ప్రపంచ యుద్ధానికి దారితీసే పరిస్థితులపై కూడా దృష్టిని సారించింది.

1939, సెప్టెంబరులో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. సామ్రాజ్య కాంక్షతో హిట్లర్ పోలాండ్‌పై దాడి చేశాడు. పోలాండ్‌కు మద్దతుగా బ్రిటన్, ఫ్రాన్సులు జర్మనీపై యుద్ధానికి దిగాయి. బ్రిటన్ జాతీయ కాంగ్రెస్‌గాని, కాంగ్రెస్ మంత్రివర్గాలకు గాని సంప్రదించకుండా మన దేశాన్ని కూడా జర్మనీకి శత్రు రాజ్యంగా ప్రకటించింది. ఈ యుద్ధం ప్రజాస్వామ్య రక్షణ కోసమని బ్రిటన్, ఫ్రాన్స్‌లు ఉద్ఘాటించాయి. ఫాసిస్టు, నాజిస్టు నియంతృత్వానికి వ్యతిరేకంగా సాగే ప్రజాస్వామ్య పోరాటానికి జాతీయ కాంగ్రెస్ సానుభూతి అయింది. కాని బానిసత్వంలో మ్రగ్గే భారతదేశం ఇతరుల స్వాతంత్ర్యానికి ఎలా సాయపడగలదన్నది కాంగ్రెస్ భావం. యుద్ధ లక్ష్యాలేమిటో చెప్పవలసిందిగా కాంగ్రెస్ బ్రిటన్‌ను పదే పదే కోరింది. మా స్వాతంత్ర్యాన్ని గుర్తిస్తే ఫాసిస్టు శక్తులకు వ్యతిరేకంగా పోరాడానికి మా మద్దతు ఉంటుందని కూడా కాంగ్రెస్ పేర్కొంది. ఈ సూచనలను బ్రిటన్ పట్టించుకోనకపోవుటంతో బ్రిటిష్ వైఖరికి నిరసనగా, అక్టోబర్ – నవంబరు, 1939లో కాంగ్రెస్ మంత్రివర్గములన్నీ రాజీనామా చేశాయి. “భారతీయులకు నాజీ నియంతృత్వానికి భారత్‌లోని బ్రిటిష్ ప్రభుత్వ నియంతృత్వానికి తేడా లేదని” – గాంధీజీ బ్రిటిష్ ప్రభుత్వానికి విశదపరచాడు.

## 63.4 ఆగస్టు ప్రతిపాదన (ఆగస్టు, 1940) :

1940లో రెండవ ప్రపంచ యుద్ధంలో జర్మనీ ఘన విజయాలను సాధించింది. కనీసం కేంద్రంలో తాత్కాలిక జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసినా యుద్ధంలో బ్రిటన్‌కు సాయపడగలమని కాంగ్రెస్ ప్రతిపాదించింది. ఈ సమయంలో వైస్రాయి లార్డ్ ఎన్‌ఎలోగో ఒక ప్రకటన చేశాడు. దీనినే ఆగస్టు ప్రతిపాదన అంటారు. ఈ ప్రతిపాదనలోని ముఖ్యాంశాలు ఏమనగా, 1. యుద్ధ విరమణ తరువాత జామనియన్ ప్రతిపత్తి పద్ధతిలో పూర్తి బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపన, 2. అల్ప సంఖ్యాకుల సమ్మతికానిదే బ్రిటిష్ ప్రభుత్వ ప్రస్తుత బాధ్యతలేని ఏ ప్రభుత్వానికి బదిలీ చేయబడవు. ఈ ప్రతిపాదనలు దేశంలో మతోన్మాద శక్తులకు బలం చేకూర్చింది. ఈలోపు అనగా మార్చి, 1940లో ముస్లింలీగ్ జిన్నా అధ్యక్షతన లాహోర్‌లో సమావేశమై, హిందూ, ముస్లింలు వేరే జాతులని, ముస్లింలకు ప్రత్యేక రాజ్యం కావాలని ‘ద్విజాతి సిద్ధాంతాన్ని’ ప్రకటించారు.

## 63.5 క్రిప్సు రాయబారం, మార్చి 1942 :

1941లో రెండవ ప్రపంచ యుద్ధంలో రెండు ముఖ్య సంఘటనలు జరిగాయి. ఒకటి సోవియట్ యూనియన్‌పై జర్మనీ దాడి, రెండవది అమెరికా నౌకా స్థావరంపైన రురల్ హర్బర్‌పై జపాన్ దాడి. ఆసియా యుద్ధ రంగంలో జపాన్ మార్చి 1942 నాటికి రంగూన్‌నాక్రమించి భారత సరిహద్దులను తాకింది.

ఇట్టి స్థితిలో బ్రిటన్ యుద్ధంలో భారతీయుల సహకారం అవసరాన్ని గుర్తించి, మార్చి, 1942లో కాబినెట్ మంత్రియైన సర్ స్టాఫర్డ్, క్రిప్సును భారత్‌కు రాయబారిగా పంపెను. క్రిప్సు భారతీయ నాయకులతో సంప్రదించి కొన్ని ప్రతిపాదనలు చేశాడు. ఈ ప్రతిపాదనలలోని ముఖ్యాంశాలు ఏమనగా :

1. యుద్ధానంతరం భారతదేశానికి డొమినియన్ ప్రతిపత్తి ఈయబడును.

2. యుద్ధం ముగిసిన తరువాత రాష్ట్ర శాసనసభలచే ఎన్నుకొనబడిన, స్వదేశీ రాజులు నియమించిన సభ్యులతో కూడిన రాజ్యాంగ పరిషత్ ఏర్పడి భారత్‌కు నూతన రాజ్యాంగాన్ని రూపొందిస్తుంది. 3. పాకిస్తాన్ కోర్కెను పరోక్షంగా మన్నిస్తూ, నూతన రాజ్యాంగాన్ని ఆమోదించడానికి సిద్ధపడని రాష్ట్రాలు, బ్రిటిష్ వారితో ప్రత్యేక ఒడంబడిక చేసుకొని తమ భవిష్యత్‌ను వారే నిర్ణయించుకోవచ్చు. 4. తక్షణమే అధికార బదిలీ జరగదు. పూర్తి స్వీయ పరిపాలనయే బ్రిటిష్ లక్ష్యం. 5. ప్రస్తుతం రక్షణ విషయాలపై బ్రిటిష్ ప్రభుత్వ నియంత్రణ కొనసాగుతుంది. ఈ ప్రతిపాదనలకు గాంధీజీ "దివాలాతీయు బ్యాంకు మీద రాబోయే తేదీ వేసి ఇచ్చిన చెక్కు"యని విమర్శించారు. ఈ ప్రతిపాదనలను చదవగానే చాలా నిరాశ, నిస్పృహలకు లోనైనామని నెహ్రూ పేర్కొన్నాడు. క్రిప్సు ప్రతిపాదనలకు అంగీకరిస్తే దేశం ముక్క చెక్కలవటానికి అంగీకరించినట్లేనని వక్కాణించాడు. జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయనిదే బ్రిటిష్‌వారితో సహకరించే ప్రసక్తి లేదని జాతీయ నాయకులు ప్రవచించాడు. తక్షణమే పాకిస్తాన్ కోర్కె ఈ ప్రతిపాదనలలో లేకపోవుటచే ముస్లిం లీగ్ సైతం క్రిప్స్ ప్రతిపాదనలను త్రోసిపుచ్చింది.

## 63.6 క్విట్ ఇండియా ఉద్యమం, ఆగస్టు 8, 1942 :

క్రిప్స్ ప్రతిపాదనలను అన్ని రాజకీయ పక్షాలు తిరస్కరించుటతో జాతీయ ఉద్యమం నూతన మలుపు తిరిగింది. బ్రిటిష్ పాలనను అంతం చేయాలంటే "ప్రజా యుద్ధం" తప్ప మార్గాంతరం లేదని జాతీయ కాంగ్రెస్ భావించింది.

1948 ఆగస్టు 8వ తేదీన అఖిల భారత కాంగ్రెస్ కమిటీ బొంబాయిలో సమావేశమై "సుప్రసిద్ధ క్విట్ ఇండియా తీర్మానంను" ఆమోదించింది. ఈ సందర్భంలో గాంధీజీ మాట్లాడుతూ, బ్రిటిష్ పాలనను అంతం చేయుటే మన తక్షణ కర్తవ్యం. అందుకు మనం ఎట్టి త్యాగానికైనా సిద్ధపడాలి "స్వాతంత్ర్యమో, లేదా మరణమో" (Do or Die) తేల్చుకోవాలి. ఇందుకు శాంతియుత సహాయ నిరాకరణ ఉద్యమాన్ని పాటించాలని ఆదేశించాడు. భారత్ చోడో (Bharat Chodo) అనే నినాదంతో క్విట్ ఇండియా ఉద్యమం ప్రారంభమైంది. ఈ ఉద్యమంలో ప్రజలు ప్రదర్శించిన ధైర్యసాహసాలు, త్యాగనిరతి నిరుపమానమైనవి.

ఇట్టి ప్రజా ఉద్యమాన్ని అణచివేయటానికి బ్రిటిష్ ప్రభుత్వం అఇన్న చర్యలు గైకొంది. ఉద్యమం ప్రారంభం కావటానికి ముందే అనగా, ఆగస్టు 9వ తేదీన గాంధీజీ, నెహ్రూలతో సహా జాతీయ నాయకులందరిని అరెస్టు చేసింది.

కాంగ్రెస్‌ను చట్టవిరుద్ధమైన సంస్థగా ప్రకటించి, దమనకాండకు పాల్పడింది.

కాంగ్రెస్ నాయకుల అరెస్టుతో ప్రజలలో ఆగ్రహావేశాలు ప్రజ్వరిల్లి దేశ వ్యాప్తంగా హర్తాళ్ళు, నిరసన ప్రదర్శనలు, సభలు జరిగాయి. ఈ ఉద్యమానికి దశదిశ నిర్దేశించే నాయకుడు లేకపోవుటచే ప్రజలు తమకు ఇష్టమొచ్చిన రీతిలో స్పందించారు. ప్రముఖ నగరాలైన బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, అహమ్మదాబాద్, నాగపూర్, అమృత్‌సర్‌తో సహా అనేక నగరాలు ఈ ఉద్యమంతో అట్టుడికాయి. తాతా స్టీలు కర్మాగారం 13 రోజులు మూతపడింది. నూలు మిల్లులలో సమ్మె మూడున్నర నెలలుగా ఉంది. అన్ని రాజకీయ పక్షాలు ఉద్యమంలో పాల్గొన్నాయి. ఉద్యమం హింసాత్మకంగా మారింది. పోలీసు స్టేషన్లపై దాడి, రవాణా సౌకర్యాల విచ్ఛిన్నం, సహాయ నిరాకరణ సర్వసాధారణమైనాయి. మిగ్నపూర్, మహారాష్ట్రలోని కొన్ని ప్రాంతాలలో పోటీ ప్రభుత్వాలు నెలకొల్పబడ్డాయి. రైతులు పన్నులు చెల్లించుటమానివేసి ఆంగ్లాధికారాన్ని ధిక్కరించారు. బ్రిటిష్ ఇండియాలో పనిచేసే భారతీయ ఉద్యోగులపై పోలీసులు జైలు అధికారులు సైతం ఎంతటి ప్రభావాన్ని కల్గించిందంటే వారు ఉద్యమకారులకు తినుబండారాలను, ఆర్థిక సహాయాన్ని అందజేశారు. ఒక్కమాటలో చెప్పాలంటే ఈ ఉద్యమం బ్రిటిష్ ప్రభుత్వంపై గొప్ప మహత్తర తిరుగుబాటు.

ప్రభుత్వ ఉద్యమాన్ని అణచివేయటంలో పాశవికంగా వ్యవహరించింది. అరెస్టులు, సామూహిక జరిమానాలు, స్త్రీలపై అత్యాచారాలు, లాఠీచార్జీలు, కాల్పులు సర్వసాధారణమైనాయి. అధికార లెక్కల ప్రకారం ఈ ఉద్యమంలో 60 వేల మంది అరెస్టుకాగా, 18 వేల మంది ఎట్టి విచారణ లేకుండా నిర్బంధింపబడ్డారు. పదివేల మంది కాల్పుల్లో మరణించారు. 1942 డిసెంబరు నాటికి ఉద్యమం పూర్తిగా అణచివేయబడింది. దీని ప్రభావం వలననే లార్డ్ వెనల్ (రాజ ప్రతినిధి), బ్రిటిష్ ప్రధానియగు చర్చిల్‌కు లేఖ రాస్తూ యుద్ధం తరువాత భారత్ తమ అధికారాన్ని కొనసాగించడం కష్టంయని పేర్కొన్నాడు.

ఈ ఉద్యమం అణచివేయబడిన జాతీయోద్యమ చరిత్రలో ఇది కీలకఘట్టం. నాయకత్వం లేకపోయినా ప్రజలే ఉద్యమం నిర్వహించగల శక్తి సామర్థ్యాలున్నాయని రుజువైనాయి. ఈ ఉద్యమం బ్రిటిష్ వారికి రోజులు దగ్గరపడ్డాయని, ఇంక అధికార బదిలీ తప్ప వేరే మార్గం లేదని విధితం చేసింది. డొమినియన్ ప్రతిపత్తి ఆగస్టు అగ్ని జ్వాలలలో ఆహుతికాగా, ఈ ఉద్యమం స్వాతంత్ర్య సముపార్జనకు దగ్గరకు చేర్చింది.

| క్విట్ ఇండియా ఉద్యమం స్వాతంత్ర్య సముపార్జన తమ తక్షణ కోర్కెయని (కాంగ్రెస్ ఎజెండా) విధితం చేసింది |
|---|

## 63.ఎ పాఠ్య ప్రశ్నలు :

1. బ్రిటీష్ వారి యుద్ధ సన్నాహాలకు కాంగ్రెస్ ఎందువలన సహకరించలేదు?
2. ఆగస్టు ప్రతిపాదన లేవి? కాంగ్రెస్ వానిని ఎందుకు తిరస్కరించింది?
3. క్రిప్స్ ప్రతిపాదనలను ముస్లింలీగ్ ఎందుకు తిరస్కరించింది?
4. ఏ ఉద్యమాలకంటే క్విట్ ఇండియా ఉద్యమం ఏల భిన్నమైంది?

## 63.7 సుభాస్ చంద్రబోస్ భారత జాతీయ సైన్యం :

క్విట్ ఇండియా ఉద్యమానంతరం జాతీయోద్యమంలో కొంత స్తబ్ధత ఏర్పడింది. ప్రముఖ జాతీయ నాయకులంతా జైళ్ళలో ఉండటం నూతన నాయకత్వం నాయకత్వ బాధ్యతలు చేపట్టకపోవడం – దీనికి ముఖ్య కారణం. అయితే స్వాతంత్ర్య పోరాటం నశించలేదు. భారతదేశ వెలుపల నుండి ఈ పోరాటాన్ని కొనసాగించిన ధీరోదాత్తుడు – సుభాస్ చంద్రబోస్. ఆయన అజాద్ హింద్ ఫౌజ్ (భారత జాతీయ సైన్యం)ను స్థాపించాడు.

విదేశీ సహకారంతో భారతదేశాన్ని విముక్తి చేయాలన్నదే బోస్ లక్ష్యం. అందుకు మార్చి 1941లో ఇండియా నుండి తప్పించుకొని సోవియట్ యూనియన్ వెళ్ళాడు. సోవియట్ యూనియన్ మిత్ర రాజ్యాల పక్షాన యుద్ధంలో ప్రవేశించుటవలన బోస్ ప్రయత్నం విజయవంతం కాలేదు. తదుపరి బోస్ జర్మనీ వెళ్ళి, అచట నుండి సింగపూర్ మీదుగా జపాన్ వెళ్ళి, ఆదేశ సాయమర్థించాడు. జపాన్ ప్రధాని పూర్తి సహకారాన్ని అందిస్తూ, తమకు భారత్‌ను ఆక్రమించుకోవాలనే కాంక్షలేదని, బ్రిటన్ తమ శత్రువని ప్రకటించాడు. 1943, అక్టోబర్‌లో బోస్ సింగపూర్ వెళ్ళి అచట జాద్ హింద్ విప్లవ ప్రభుత్వాన్ని (స్వేచ్ఛా భారత తాత్కాలిక ప్రభుత్వాన్ని) స్థాపించాడు. ఈ ప్రభుత్వాన్ని తొమ్మిది దేశాలు గుర్తించాయి. బోస్ ఆగ్నేయాసియాలోనున్న భారతీయులను, జపాన్ చేతిలో చిక్కిన భారతీయ యుద్ధ ఖైదీలను కలసి భారత జాతీయ సైన్యాన్ని పునర్వ్యవస్థీకరించాడు. జాతీయ సైన్యంలో ఝాన్సీ రాణి పేరిట మహిళా విభాగాన్ని కూడా ఏర్పాటుచేశాడు. జైహింద్, ఛలో ఢిల్లీ అనే నినాదాలతో జాతీయ సైన్యం, జపాన్ సైన్యంతో కలసి బర్మా నుండి ఇండియాకు బయలుదేరింది. ఈ సైన్యాలు తొలుత కొన్ని విజయాలు సాధించినా, తుదకు విఫలమైనాయి. జపాన్‌పై అమెరికా దాడులు తీవ్రతరం చేయుటవలన జపాన్ సైన్యం స్వదేశానికి వెళ్ళవలసివచ్చింది. అంతిమంగా జపాన్‌పై అమెరికా అణుబాంబులు వేయటం, జపాన్ యుద్ధాన్ని విరమించి మిత్ర రాజ్యాలకు లొంగిపోవడం జరిగింది. ఈ పరిణామాల వలన బోస్ లక్ష్యం నెరవేరలేదు. దీనికితోడు ఆయన విమాన ప్రమాదంలో మరణించుట జాతీయ సైన్యానికి అశనిపాతమైంది. జాతీయ సైన్యం వీరోచిత పోరాటం ముగిసింది.

బ్రిటన్ జాతీయ సైన్యంలోని చాలా మందిని అరెస్టు చేయటమేగాక, వారికి నాయకత్వం వహించని షానవాజ్‌ఖాన్, గురుదయాళ్ సింగ్ థిల్లాన్, ప్రేమ్‌కుమార్ సెహగాల్‌పై రాజద్రోహ నేరం మోపింది. వీరి ముగ్గురిని ద్రోహులుగా నిర్ధారించి సైనిక న్యాయ స్థానం ఉరిశిక్ష విధించింది. కాని భారతీయులు వీరి ముగ్గురిని జాతీయ హీరోలుగా భావించి, శిక్షకు వ్యతిరేకంగా ప్రజా ఉద్యమం ప్రారంభమైంది.

పత్రికా సంపాదకీయాలు ఈ శిక్షను తీవ్రంగా గర్హించాయి. కరపత్రాలు పంచబడ్డాయి. సమావేశాలు, నిరసనలు పెల్లుబికాయి. కులం, మత, వర్గ భేదం లేకుండా యావత్ భారత్ ఈ ఉరిశిక్షలను రద్దు చేయవలసిందిగా ఆందోళన చేశాయి. చాలా మంది ప్రభుత్వ ఉద్యోగులు, సైనికులు జాతీయ సైన్య నాయనకుల పట్ల సానుభూతి వహించారు. గత్యంతరం లేక, ప్రజాభిప్రాయాన్ని మన్నించి బ్రిటిష్ ప్రభుత్వం ఈ ఉరిశిక్షలను రద్దుచేసి, అరెస్టు చేయబడిన జాతీయ సైనికులను సైతం విడుదల చేసింది. ఇది ప్రజా విజయం.

క్రమంగా బ్రిటిష్ వైఖరిలో మార్పు వచ్చింది. అమెరికా, సోవియట్ రష్యాలు అగ్రరాజ్యాలుగా ఆవిర్భవించాయి. ఈ రెండు దేశాలు భారత స్వాతంత్ర్య పోరాటానికి మద్దతు పలికాయి. రెండవ ప్రపంచ యుద్ధంలోని విజేతయైన, బ్రిటిష్ సైనికంగా, ఆర్థికంగా బాగా దెబ్బతినుటతో దాని రాజకీయ ప్రాబల్యం సైతం క్షీణించింది. దీనికి తోడు

1945లో బ్రిటన్‌లో జరిగిన ఎన్నికలలో భారత్‌కు స్వాతంత్ర్యమివ్వటానికి అంగీకరించిన, సామ్రాజ్యవాద వ్యతిరేకమైన లేబర్ పార్టీ (క్లెమెంట్ అట్లీ ప్రధాని) అధికారంలోనికి వచ్చింది. పైగా బ్రిటిష్ ఉక్కు ప్రభుత్వ యంత్రంగం (Steel frame) ఉద్యోగిస్వామ్యం, పోలీసులు, సైనికులు ప్రభుత్వ అధికారాన్ని ధిక్కరించే ధోరణిలోయున్నారు. ఇట్టి స్థితిలో జాతీయోద్యమాన్ని అణచివేయటం సాధ్యం కాదని బ్రిటన్ గుర్తించింది.

ఇంగ్లండ్ 1945–46 సంవత్సరాల మధ్య జాతీయ శక్తులు పరికాష్టకు చేరుకున్నాయి. 1948 నవంబరులో కలకత్తాలోని విద్యార్థులు జాతీయ సైన్యంపై విచారణ మధ్య అనేకంగా నిరసన తెలుపుతూ పోలీసులతో ప్రత్యక్ష సంఘర్షణకు దిగారు. 1946, ఫిబ్రవరి 11న రాయల్ ఇండియన్ నౌకాదళంలోని ఒక విభాగం తిరుగుబాటు చేసింది. బొంబాయి, కలకత్తా వంటి నగరాలలో హర్తాళ్‌లు, లూటీలు, పోలీసు స్టేషన్లపై దాడులు నిత్యకృత్యమైనాయి. రవాణా వ్యవస్థ స్థంభించంది. రైళ్ళు నిలిచిపోయాయి. ఈ పరిణామాలన్నీ బ్రిటిష్ అధికారానికి సవాలుగా మారాయి. వీటినణచుట సాధ్యం కాదని బ్రిటిష్ గుర్తించింది.

## 63.8 మంత్రిత్రయ రాయబారం, మార్చి 1946 :

అధికారాన్ని బదిలీచేయటానికి తగు సూచనలను చేయవలసిందిగా అట్లే తమ మంత్రివర్గంలోని ముగ్గురు వ్యక్తులను (పెథిక్ లారెన్స్, క్రిప్స్, ఎ.వి. అలెగ్జాండర్) భారత్‌కు పంపెను. మంత్రిత్రయం భారతీయ నాయకులను సంప్రదించి కొన్ని సూచనలు చేసింది. దేశ సమైక్యతను కాపాడుతూనే రాష్ట్రాలకు ఎక్కువ స్వేచ్ఛ ఇవ్వాలని, కేంద్ర జాబితాలో విదేశీ వ్యవహారాలు, రక్షణ, రవాణా ఉండాలని, మిగిలినవి రాష్ట్ర జాబితాలో యుండాలని సూచించింది. బ్రిటిష్ ఇండియాను మూడు ప్రాంతీయ రాష్ట్ర గ్రూపులుగా (వాయువ్య, ఈశాన్య, మధ్య) విభజించి, మతవర్గ ప్రాతిపదికగా పరోక్ష ఎన్నికలు జరిపి నూతన రాజ్యాంగ రూపకల్పనకు 296 మంది సభ్యులుగల రాజ్యాంగ పరిషత్, వివిధ రాజకీయ పార్టీలతో కూడిన తాత్కాలి ప్రభుత్వాన్ని కూడా ఏర్పాటు చేయాలని ఈ రాయబార వర్గం సూచించింది.

ఈ సూచనలను కాంగ్రెస్, ముస్లింలీగ్ అంగీకరించినట్లు సమిష్టిగా, దీనిని అన్వయించుటలో భేదాభిప్రాయాలు వ్యక్తం చేశాయి. 1946, జులైలో జరిగిన రాజ్యాంగ పరిషత్ ఎన్నికలలో కాంగ్రెస్, దాని మిత్రపక్షాలకు 210 స్థానాలు లభించగా, ముస్లింలీగ్‌కు 75 స్థానాలు లభించాయి. ఈ పరిణామంతో లీగ్ మంత్రిత్రయ ప్రతిపాదనలను త్రోసిపుచ్చింది. దీనితో రాజ్యాంగబద్ధంగా పాకిస్తాన్ సాధించుట కష్టమని, ఆగస్టు 16, 1946లో ప్రత్యక్ష చర్యా దినోత్సవ పిలుపునిచ్చి మత కలహాలకు పాల్పడింది. తత్ఫలితంగా దాదాపు సంవత్సరకాలం మత కలహాలు కొనసాగి అమాయకులైన ప్రజలు దారుణంగా వధింపబడ్డారు.

## 63.9 తాత్కాలిక ప్రభుత్వం, సెప్టెంబరు 1946 :

1946 సెప్టెంబరులో జవహర్‌లాల్ నెహ్రూ నాయకత్వంలో తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడింది. ముస్లింలీగ్ అక్టోబరులో మంత్రివర్గంలో చేరింది. రాజ్యాంగ పరిషత్ 1946 డిసెంబరు 9న సమావేశమైంది. ఈ సమావేశానికి ముస్లింలీగ్ హాజరుకాలేదు. రాజ్యాంగ పరిషత్‌తో అధ్యక్షుడుగా బాబు రాజేంద్ర ప్రసాద్ ఎన్నికైనాడు. రాజ్యాంగ రూపకల్పనకు అనేక కమిటీలు కూడా ఎంపిక చేయబడ్డాయి. 1947 ఫిబ్రవరి 20వ తారీఖున, బ్రిటిష్ ప్రధానియైన క్లెమెంట్ అట్లీ, జూన్ 1948 నాటికి బ్రిటన్ భారత్ వదలివెళ్ళుతుందని ప్రకటించుటతో స్వాతంత్ర్య సముపార్జన సులభతరమైంది. ఈ

అధికార బదిలీ కార్యక్రమాన్ని పూర్తిచేయటానికి లార్డ్ మౌంట్ బాటన్‌ను కడపటి రాజప్రతినిధిగా పంపారు.

## 63.10 స్వాతంత్ర్యంగా దేశ విభజన :

మౌంట్ బాటన్ కాంగ్రెస్, ముస్లింలీగ్ నాయకులతో సుధీర్ఘ చర్యలు జరిపి, జూన్ 1947 ప్రణాళికను సిద్ధం చేశాడు. ఈ ప్రణాళికననుసరించి 1947, ఆగస్టు 15వ తేదీన భారత్‌కు స్వాతంత్ర్యం ఈయబడుతుంది. భారత్ రెండుగా ఇండియన్ యూనియన్, పాకిస్తాన్ అను రెండు స్వతంత్ర్య రాజ్యాలుగా విభక్తమగుతాయి. ముస్లింలీగ్ కోర్కెయైన పాకిస్తాన్ సాధింపబడింది. స్వదేశీ రాజులు ఇండియన్ యూనియన్‌లుగాని లేక పాకిస్తాన్‌లో గాని చేరవచ్చు. లేక స్వతంత్ర్యంగా యుండవచ్చునను స్వేచ్ఛ ఈయబడింది.

దేశ విభజన కాంగ్రెస్ నాయకులకు ఇష్టం లేకపోయినా అంగీకరింపక తప్పలేదు. 1906లో ఏర్పడ్డ ముస్లింలీగ్ మత రాజకీయాలకు, బ్రిటిష్ ప్రభుత్వం పెట్టిపోషించి ఈ విభజనకు కారకురాలైంది. జవహర్‌లాల్ నెహ్రూ అన్నట్లుగా : 'దేశ విభజనలో బ్రిటిష్ వారు వహించిన పాత్ర క్షంతవ్యం కాదు'. దేశ్యాప్తంగా అసంఖ్యాక అమాయక హిందూ, ముస్లింల ప్రాణాలు కాపాడలేని నిస్సహాయ స్థితిలో అనగా మత కలహాలను నిరోధించుటలోని వైఫల్యం వలననే కాంగ్రెస్ విభజనను అంగీకరించక తప్పలేదు.

1947 ఆగస్టు 15వ తేదీ ముందు రాజ్యాంగ పరిషత్ అర్ధరాత్రి సమావేశంలో జవహర్‌లాల్‌నెహ్రూ అన్నమాటలు చిరస్మరణీయం. 'నడిరేయి సమయంలో ప్రపంచమంతా నిద్రావస్థలోనున్నపుడు భారతదేశం స్వేచ్ఛా జీవితానికి మేల్కొంటుంది' (At the stroke of mid night hour, when the world spleeps, India will awake to life and freedom) ఇంకా ఇట్టి సంఘటనలు చరిత్రలో చాలా జరుగుతాయని, పాత నుండి కొత్త యుగంలో కాలెడుతున్నామని, మనందరం కలసి కట్టుగా భారతదేశానికి, భారతదేశ ప్రజలకు, విశ్వమానవాళికి సేవ చేయటానికి సంసిద్ధులుగా యుంటామని ప్రమాణం చేద్దాం' అని నెహ్రూ ప్రజలనుద్దేశించి చెప్పాడు.

దురదృష్టమేమంటే స్వాతంత్ర్యం వచ్చిందనే సంతోషం కంటే, పంజాబ్, బెంగాల్‌లలో మత కలహాలు సృష్టించిన మారణకాండ విషాదాన్ని మిగిల్చింది. సరిహద్దుల నుండి కాందిశీకులు తన ఆస్తిపాస్తులను, కుటుంబ సభ్యులను కోల్పోయి వలస రావడం మరీ భయానకం. ఈ మారణహోమాన్ని ఆపటానికి గాంధీజీ చేసిన యత్నాలు విజయవంతంగాకపోగా తుదకు తానే ఒక ఉన్మాది చేతిలో ప్రాణాలు కోల్పోయాడు.

## 63.11 భారత సర్వస్వతంత్ర, సామ్యవాద, లౌకిక, ప్రజాస్వామ్య, గణతంత్ర దేశంగా ఆవిర్భావం :

రాజ్యాంగ పరిషత్ రూపొందించిన నూతన రాజ్యాంగంలో జాతీయోద్యమంలో ప్రజల ఆకాంక్షలు, జాతీయ నాయకుల ఆదర్శాలు చక్కగా పొందుపరచబడ్డాయి. సుదీర్ఘ సమావేశాల సుదీర్ఘ చర్యల అనంతరం భారత రాజ్యాంగం 1949, 26 నవంబరు నాటికి పూర్తయింది.

భారత రాజ్యాంగంలోని ప్రస్తావనలో రాజ్యాంగం ఆశయాలు, లక్ష్యాలు వివరింపబడ్డాయి. సర్వస్వతంత్రమనగా భారతదేశం సార్వభౌమాధికార రాజ్యం. అంతరంగికంగా, బాహ్యంగా మరే ఇతర అధికారాలకు లోబడి యుండదు.

2. సంక్షేమ రాజ్య సాధన మరియు ఆర్థిక అసమానతలు తొలగించే సామ్యవాద సాధనే లక్ష్యాలుగా ఎంచుతుంది.

3. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం, న్యాయం ప్రాతిపదికగా ప్రజాస్వామ్య బద్ధమన సమాజాన్ని నెలకొల్పటం, 4. ఏ మతంను ప్రోత్సహించని, పరమత సహనం లేక మత స్వేచ్ఛను ప్రసాదించే లౌకిక రాజ్య స్థాపన, 5. ప్రజాస్వామ్య గణతంత్ర అనగా ప్రజలే సార్వభౌమాధికారులు. దేశాధ్యక్షుడు ప్రజలచే పరోక్షంగా ఎన్నుకొనబడతాడు. కనుకనే ఈ ప్రస్తావన రాజ్యాంగంనకు ప్రాణప్రదమైనది లేక కొహినూరు వజ్రం వంటిది.

| 1947, ఆగస్టు 15వ తేదీన భారత స్వతంత్ర దశమైంది |
|---|

## 63.బి పాఠ్య ప్రశ్నలు :

1. స్వాతంత్ర్య సిద్ధికి గాంధీజీ, సుభాస్ చంద్రబోస్ అనుసరించిన మార్గాలలోని ముఖ్య తేడాలేవి?
2. బ్రిటిష్ ప్రభుత్వ ఉక్కు యంత్రాంగం విచ్ఛిన్నమైపోతుందనటానికి ఒక కారణం తెలుపుము?
3. మంత్రిత్రయ రాయబార సూచనలేమి?
4. కడపటి భారతీయ రాజప్రతినిధి ఎవరు?
5. రాజ్యాంగంలోని తొలి ప్రస్తావన భారత్ ఏ రకమైన రాజ్యంగా తీర్చిదిద్దాలని నిర్దేశించింది?

## సారాంశం :

రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభం కాగానే బ్రిటన్ జాతీయ కాంగ్రెస్‌కు సంప్రదించకుండా మిత్ర రాజ్యాల పక్షాన భారత్‌ను యుద్ధంలోకి దించింది. బానిసత్వంలో మ్రగ్గే భారత్ వేరొక దేశంలోని ప్రజల స్వాతంత్ర్యం కోసం ఎలా పోరాడుతుంది అని జాతీయ నాయకులు బ్రిటిష్ చర్యలను ఖండించారు. జాతీయ కాంగ్రెస్ తక్షణమే స్వాతంత్ర్యం ఇవ్వాలని బ్రిటిన్‌ను కోరింది. వీనిలో దేనికి సరియైన సమాధానం చెప్పకపోవుటచే అందుకు నిరసనగా 1939లో కేంద్ర, రాష్ట్రాలలోని కాంగ్రెస్ ప్రభుత్వాలన్ని రాజీనామా చేశాయి. 1940లో రాజ ప్రతినిధి లిన్‌లిత్‌గో ఆగస్టు ప్రతిపాదనను కాంగ్రెస్ తిరస్కరించింది. కాని 1941లో బ్రిటన్ యుద్ధంలో తిరోగమన దశలో యున్నపుడు భారత్ సహకారమవసరమని భావించి, క్రిప్స్ రాయభారాన్ని పంపించింది. క్రిప్స్ రాయబార సూచనలను జాతీయ కాంగ్రెస్‌యేగాక, ముస్లింలీగ్ కూడా తిరస్కరించింది.

ఇట్టి బ్రిటిష్ వైఖరితో విసిరివేసారని ప్రజలు బ్రిటిష్ వారిని తరిమివేయుట తప్ప వేరే మార్గంలేదని భావించారు. తదనుగుణంగా 1942, ఆగస్టు 8న కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ క్విట్ ఇండియా ఉద్యమ పిలుపునిచ్చింది. బ్రిటీష్‌వారు భారతదేశాన్ని వదలివెళ్ళండి (అంగ్రేజీ భారత్ చోడో) అనే నినాదంతో, స్వాతంత్ర్యమో లేక మరణమో తేల్చుకోవాలనే గాంధీజీ పిలుపుతో క్విట్ ఇండియా ఉద్యమం ప్రారంభమైంది. ఇది ప్రజా ఉద్యమమై బ్రిటీష్ అధికారాన్ని కదలించింది. బ్రిటీష్ ప్రభుత్వం ఈ ఉద్యమాన్ని అతి దారుణంగా అణచివేసింది.

జాతీయోద్యమంలో తదుపరి ఘట్టం – సుబాస్ చంద్రబోస్, అజాద్ హింద్ ఫౌజ్ వహించిన పాత్ర. జపాన్ సాయంతో భారత్‌ను బ్రిటీష్ పాలన నుండి విముక్తి చేయడానికి బోస్ అజాద్ హింద్ ఫౌజ్‌ను తీర్చిదిద్దాడు. ఈ

ప్రయత్నంలో కొంత విజయం సాధించినా, రెండవ ప్రపంచ యుద్ధంలో జపాన్ ఓటమితోనే లక్ష్యం నెరవేరలేదు. దీనినవకాశంగా గైకొని ప్రభుత్వం భారత జాతీయ సైనికులను అరెస్టుచేసి, రాజద్రోహ నేరంమోపి శిక్షించింది. ఈ చర్యను యావత్ భారత్ ముక్త కంఠంతో వ్యతిరేకించుటతో, ప్రభుత్వం తలొగ్గి వారినందరినీ విడిచి పెట్టింది. ఇది ఒక ప్రజా విజయం.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం పరిణామాలు జాతీయోద్యమాన్ని నూతన మలుపుకు తిప్పింది. భారత జాతీయోధ్యమం పట్ల సానుభూతి వహించే అమెరికా, రష్యాలు అగ్ర రాజ్యాలుగా ఆవిర్భవించడం, బ్రిటన్ సైనికంగా, ఆర్థికంగా దెబ్బతినటం వలన వచ్చాయి. దీనికి తోడు భారతదేశ స్వాతంత్ర్యానికి మద్దుతు పలికే లేబర్ పార్టీ 1945 సాధారణ ఎన్నికల్లో గెలుపొందడం మరొక శుభపరిణామం. ఏదైనా భారతదేశంలో ఇంకా తమ పాలన కొనసాగలేదనే విషయాన్ని బ్రిటన్ గుర్తించింది.

1946, మార్చిలో బ్రిటిష్ ప్రభుత్వం మంత్రిత్రయ రాయబారాన్ని భారత్‌కు పంపించింది. ఈ రాయబార సూచనల మేరకు నూతన రాజ్యాంగ రూపకల్పనకు రాజ్యాంగ పరిషత్, తాత్కాలిక జాతీయ ప్రభుత్వం ఏర్పడ్డాయి. కాని ముస్లింలీగ్ రాజ్యాంగ పరిషత్ నుండి వైదొలగింది.

ఈ లోపల పాకిస్తాన్ సాధన కోసం ముస్లింలీగ్ ప్రత్యక్ష చర్యా దినోత్సవ పిలుపునిచ్చి మత విద్వేషాలు సృష్టించింది. ఈ నేపథ్యంలో కడపటి రాజ ప్రతినిధి యగు లార్డ్ మౌంట్ బాటన్ కాంగ్రెస్, ముస్లింలీగ్‌లను సంప్రదించి, ఒప్పించి, జూన్ 3, 1947 ప్రణాళికను సిద్ధం చేశాడు. ఈ ప్రణాళిక ప్రకారం దేశ విభజన జరిగింది. భారతదేశం రెండుగా, అనగా ఇండియన్ యూనియన్, పాకిస్తాన్‌గా చీలింది. ఈ రెంటికి 1947 ఆగస్టు, 15వ తేదీన స్వాతంత్ర్యం సిద్ధించింది. మత కలహాల వలన జరిగిన, జరుగుతున్న రక్తపాతాన్ని అరికట్టలేక కాంగ్రెస్ దేశ విభజనను అంగీకరించింది.

## అభ్యాసం :

1. క్రిప్స్ రాయబారంలోని ప్రతిపాదనలు ఏవి? అది ఎందువలన విఫలమైంది?
2. క్విట్ ఇండియా ఉద్యమానికి దారితీసిన పరిస్థితులను, అది జాతీయోద్యమానికి చేసిన సేవను వివరింపుము?
3. 1945 తరువాత భారత్‌పట్ల బ్రిటీష్ వైఖరిలో మార్పు వచ్చుటకు గల కారణంలేవి?
4. స్వాతంత్ర్య పోరాటంలో సుబాస్ చంద్రబోస్, భారత జాతీయ సైన్యం వహించిన పాత్ర ఎట్టిది?
5. దేశ విభజనకు దారితీసిన పరిస్థితులను వివరింపుము. కాంగ్రెస్ దేశవిభజనకు ఎందుకు అంగీకరించింది?
6. ఈ పాఠం చదివిన తరువాత జాతీయోద్యమంలో గాంధీజీ వహించిన పాత్రను, దానిని ప్రజా ఉద్యమంగా మలచటానికి గాంధీజీ అనుసరించిన పద్ధతులను వివరింపుము?

## అదనపు అధ్యయనం :

మీ గ్రంథాలయానికివెళ్ళి: 1. క్విట్ ఇండియా తీర్మానంలో 1947 ఆగస్టు 15న రాజ్యాంగ పరిషత్ సమావేశంలో నెహ్రూ చేసిన ప్రసంగాన్ని క్షుణ్ణంగా చదువుము.

## పాఠ్య ప్రశ్నలకు జవాబులు:

**63.ఎ.**

1. కాంగ్రెస్ తక్షణమే స్వాతంత్ర్యం ఇవ్వాలని బ్రిటన్‌ను కోరింది. బానిసత్వంలో మగ్గే భారతీయులు విదేశాలలోని ప్రజలు సాగించే స్వాతంత్ర్య పోరాటానికి ఎలా సాయం చేయగలరు.

2. ఆగస్టు ప్రతిపాదన ఇండియాకు డొమినియన్ ప్రతిపత్తి ఇవ్వజూపింది. కాని కాంగ్రెస్ పూర్తి స్వయం పాలన కావాలని కోరింది.

3. క్రిప్స్ ప్రతిపాదనలలో పాకిస్తాన్ ఏర్పాటుకు ఎట్టి ప్రతిపాదన చేయకపోవుట.

4. క్విట్ ఇండియా ప్రజా యుద్ధం. ఇందు ప్రజలు 'స్వాతంత్ర్యమో లేక వీర మరణమో? అనే నినాదంతో స్వచ్ఛందంగా పాల్గొన్నారు. విద్యార్థులు, కార్మికులు, రైతులు, కొంతమంది ప్రభుత్వ ఉద్యోగులు ఇందులో పాల్గొన్నారు. కొన్నిచోట్ల హింసగా మారింది. ఈ హింస ప్రభుత్వ దమనకాండ కంటే మిన్న కాదని గాంధీజీ ఈ హింసాత్మక చర్యలను ఖండించలేదు.

**63. బి :**

1. గాంధీజీ అహింసయుత ప్రజా ఉద్యమం పాటింపగా, నేతాజీ జపాన్ సాయంతో యుద్ధం ద్వారా భారత్‌ను విముక్తి చేయాలని ఆశించాడు.

2. నౌకాదళ తిరుగుబాటు, వీరికి సానుభూతిగా సైనిక, వైమానిక దళ సభ్యులు సమ్మె, జాతీయోద్యమానికి పోలీసు, పాలక యంత్రాంగం లోపాయికారి మద్దతునిచ్చుట.

3. అధికార బదిలీకి సూచనలు చేయటం.

4. లార్డ్ మౌంట్ బాటన్.

5. సర్వసత్తాక, సామ్యవాద, లౌకిక, ప్రజాస్వామ్య, గణతంత్ర రాజ్యం.

# 64

# జాతీయోద్యమం, ఒక సమీక్ష

## 64.1 పరిచయం :

ప్రతిపాఠంలో జాతీయోద్యమ పురోగమతిని గూర్చి, 1947 ఆగస్టు 15న పూర్ణ స్వరాజ్యం పొందిన రీతిని గురించి చదివాం.

ఈ పాఠంలో జాతీయోద్యమాన్ని సమీక్షించదలచాం. అందుకు ఈ పాఠాన్ని రెండు భాగాలుగా విభజించడం జరిగింది. మొదటి భాగం జాతీయోద్యమ ప్రధానాంశాలు, రెండవ భాగంలో ప్రముఖ జాతీయ నాయకులు వహించిన పాత్రను గూర్చి చదువుతాం.

## 64.2 లక్ష్యాలు :

ఈ పాఠం చదివిన తరువాత ఈ క్రింది విషయాలు తెలుసుకుంటారు.

1. జాతీయోద్యమం ఒక ప్రజా ఉద్యమమని.
2. జాతీయోద్యమం సంఘ సంస్కరణలపై దృష్టిని పెట్టిన అంశం.
3. కాంగ్రెస్ ఆర్థిక విధానాలలో భాగంగా ప్రణాళికలు, గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమాలు.
4. జాతీయోద్యమం లౌకిక స్వభావం గలదని గుర్తించుట.
5. జాతీయోద్యమంలో భిన్న ప్రాంతాలకు చెందిన నాయకులు వహించిన పాత్ర.

**భాగం – 1**

## 64.3 ప్రజా ఉద్యమం :

జాతీయోద్యమం ఆధునిక సమాజం కనివిని ఎరుగని మహత్తర ప్రజా ఉద్యమమని చరిత్రకారులు అభివర్ణించారు.

జాతీయ కాంగ్రెస్ స్థాపించబడిననాడు కేవలం విద్యావంతులైన న్యాయవాదులు, వైద్యులు, మేధావులకు మాత్రమే పరిమితం. రాజకీయ చైతన్యం దినదినాభివృద్ధి చెందుటతో ప్రజలు బ్రిటీష్ పాలన భారత ప్రయోజనాలకు ఎలా హాని

కల్గిస్తున్నాయో గ్రహించి కాంగ్రెస్ ఛత్రం క్రింద చేరారు. క్రీ.శ. 1905లో బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా ప్రారంభమైన వందేమాతరం ఉద్యమం తొలి ప్రజా ఉద్యమం. ఇందు మేధావులు, స్త్రీలు, విద్యార్థులు అసంఖ్యాకంగా పాల్గొన్నారు. క్రీ.శ. 1906–1918 సంవత్సరాల మధ్య కాంగ్రెస్‌లోని మితవాదులు, అతివాదులు, విప్లవకారులు తమ కార్యక్రమాల ద్వారా జాతీయతా భావాన్ని ప్రజలలో చొచ్చుకొనిపోవటానికి దోహదం చేశారు. ఇట్టి తరుణంలో గాంధీజీ నేతృత్వంలో జాతీయ ఉద్యమం ప్రజా ఉద్యమంగా మారిపోయింది.

ప్రజల త్యాగనిరతిపై గాంధీజికి అచంచల విశ్వాసం కలదు. వారిని క్రియాశీలక రాజకీయాలలోకి తీసికొని వచ్చుట ఆయన లక్ష్యం. అధికారాన్ని చేజిక్కించుకొన్నప్పుడే స్వరాజ్యం సిద్ధిస్తుందని ప్రజలకు చెప్పాడు. సైనిక లేక హింసాయుత మార్గాల ద్వారా స్వరాజ్య సాధన ఎప్పటికి సాధ్యం కాదని, ఆ మార్గం అనుసరిస్తే సర్వశక్తివంతమైన బ్రిటన్ దానిని నిర్దాక్షిణ్యంగా అణచివేస్తుందని ఆయన విశ్వాసం. కనుక ప్రజల సహకారంతో సాగే శాంతియుత సత్యాగ్రహమే స్వరాజ్య సాధనకు అనువైన మార్గమని గాంధీజీ అభిలషించాడు.

క్రీ.శ. 1920 నాగపూర్ సమావేశంలో కాంగ్రెస్‌ను పటిష్టమైన, నిర్మాణాత్మకమైన సంస్థగా దిగువ స్థాయి నుండి పై స్థాయి వరకు తీర్చిదిద్దాడు. గ్రామ, తాలూకా, జిల్లా స్థాయిలలో కాంగ్రెస్ శాఖలు స్థాపింపబడ్డాయి. అలాగే రాష్ట్ర స్థాయిలో అఖిల భారత స్థాయిలో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీలు ఏర్పాటుచేయబడ్డాయి. ఇట్లు గ్రామీణ, నగర ప్రాంతాలలో జాతీయోద్యమానికి బలమైన పునాదులు వేయబడ్డాయి.

జాతీయ నాయకులు జాతి, కుల, మత, ప్రాంతీయ భేదాలు లేకుండా నిస్వార్థంగా ఈ ఉద్యమాన్ని సత్పరిపాలనకు, దుష్పరిపాలనకు మధ్య జరిగిన సంఘర్షణగా అభివర్ణించి ప్రజల హృదయాలను, మనోభావాలను చూరగొన్నారు. క్రీ.శ. 1920, జూన్‌లో గాంధీజీ నాటి రాజ ప్రతినిధికి లేఖ రాస్తూ 'దుష్పరిపాలనను తిరస్కరించే హక్కు ప్రజలకు అనాదిగా సంక్రమించిందని' వివరించాడు. క్రీ.శ. 1930లో గాంధీజీ బ్రిటీష్ పాలనను దుయ్యబడుతూ ఇట్లు ప్రకటించాడు. "బ్రిటిష్ పాలన భారతదేశాన్ని నైతికంగా, భౌతికంగా, సాంస్కృతికంగా, ఆధ్యాత్మికంగా, సర్వనాశనం చేసింది. ఈ పాలన మన పాలిటి శాపం. ఈ ప్రభుత్వాన్ని నేను నాశనం చేయదలచాను... రాజద్రోహాన్ని నేను మతంగా ఎంచుకున్నాను. మనమెవ్వరినీ చంపవద్దు. ఈ ప్రభుత్వ దుష్పరిపాలనను అంతం చేయుట మన ధర్మం'.

ప్రజలు జాతీయోద్యమంలో మమేకమగుటే దాని బలం. మార్గాలు వేరైనా యావత్ ప్రజల లక్ష్యం – స్వరాజ్య సాధనే. భారతీయ భాషలలో ప్రచారం చేయుటవలన విద్యావంతులకు, నిరక్షరాస్యులకు మధ్యగల అడ్డగోడలు తొలగాయి. ఖాదీ ధారణ, ధనిక, పేద వర్గాలకు మధ్య తేడాలను అంతం చేసింది. మత, లింగ, వయో, విద్యార్హత భేదం లేకుండా ఒక్క పిలుపుతో ప్రతి ఒక్కరు పికెటింగ్, ప్రదర్శనలలో పాల్గొన్నారు.

ఇట్లు మేల్కొనిన ప్రజా బాహుళ్యం ధైర్యంతో, పట్టుదలతో జాతీయ ఉద్యమాన్ని ముందుకు నడిపించింది.

## 64.5 సంఘ సంస్కరణలపై దృష్టి :

జాతీయోద్యమం కేవలం స్వరాజ్య సాధనకేగాక, సమాజాన్ని పట్టిపీడించే రుగ్మతలను కూడా రూపుమాపటానికి కృషి చేసింది.

### 1. అంటరాని తన నిర్మూలన :

అంటరానితనం భారతీయ సమాజాన్ని నిలువునా చీల్చే మాయని మచ్చ. దీని నిర్మూలనకు జాతీయ కాంగ్రెస్ నాయకులు ముఖ్యంగా గాంధీజీ అంటరాని తన నిర్మూలనకు కృషిచేశాడు. వారిని హరిజనులను అనగా భగవంతుని బిడ్డలని పిలిచాడు. హరిజన సేవక్ సంఘ్‌ను స్థాపించి వారి సామాజిక స్థితిగతులు మెరుగుపరచి, విద్యావంతులు చేయటానికి కృషిచేశాడు. హరిజన్ అనే పత్రికను స్థాపించాడు. ఇందుకు అనుగుణంగానే బ్రిటన్ ప్రకటించిన కమ్యూనల్ అవార్డును వ్యతిరేకించాడు. ఆయన హరిజనోద్ధరణ హేతువాద బద్ధమైన మానవతావాదంతో కూడుకొన్నది.

ఈ అంటరానితన నిర్మూలన కార్యక్రమాన్ని డా.బి.ఆర్. అంబేద్కర్ కొనసాగించాడు. అంబేద్కర్ అఖిల భారత అణగారిన (దళిత) వర్గ సమాఖ్యను (All India Depressed Classes Federation)ను స్థాపించాడు. అంటరానితన నిర్మూలన స్వతంత్ర భారతదేశంలోనే జరగాలని ఆకాంక్షించాడు.

### 2. స్త్రీ విముక్తి :

జాతీయ కాంగ్రెస్ ప్రారంభించిన మరో ఉద్యమం స్త్రీ విముక్తి. స్త్రీ విమోచన ఉద్యమం 19వ శతాబ్దిలో ప్రారంభమైనా, 20వ శతాబ్దిలోనే ఉరవడిని పొందింది. 1905లో ప్రారంభమైన వందేమాతరం ఉద్యమం స్త్రీలను జాతీయోద్యమంలో పాల్గొనునట్లు చేసింది. 'స్త్రీ అబలయని ముద్ర వేయుట మగవాడు స్త్రీకి చేసిన అన్యాయం' అని గాంధీజీ వక్కాణించాడు. 1930లో ప్రారంభమైన ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనవలసిందిగా స్త్రీలను కోరాడు. ఆయన పిలుపునందుకొని సంప్రదాయ ఘోషాను వదలి అసంఖ్యాక స్త్రీలు దేశవ్యాప్తంగా ఈ ఉద్యమంలో పాల్గొన్నారు. సంప్రదాయ నగరంగా ప్రసిద్ధికెక్కిన ఢిల్లీ నగరంలోనే సుమారు 1600 మంది స్త్రీలు రాజకీయ కార్యకలాపాలకు అరెస్టుయగుట విశేషం.

స్త్రీలు నిర్భయంగా రాజకీయ ప్రదర్శనలలో పాల్గొన్నారు. గంటలతరబడి మద్య విక్రయ కేంద్రల వద్ద, నల్లమందు దుకాణాల వద్ద పికెటింగ్ జరిపారు. నిర్భయంగా తుపాకి గుండ్లను ఎదుర్కొన్నారు. అరెస్టులై జైలుకెళ్ళారు. కేంద్ర, రాష్ట్ర శాసనసభలకు ఎన్నికయ్యారు. సరోజినీ నాయుడు జాతీయ కాంగ్రెస్ అధ్యక్షురాలిగా ఎంపికైంది. ఇందుకు ముఖ్య కారణం గాంధీజీ అహింసాయుత పోరాటం. ఇదే సాయుధ పోరాటమైతే సాధ్యమయ్యేది కాదు.

## 64.6 ఆర్థిక ప్రణాళికలు, గ్రామ పునర్నిర్మాణం :

స్వాతంత్ర్య పోరాటం స్వరాజ్యం కోసమేగాక దేశ ఆర్థికాభివృద్ధికై సాగిన పోరాటం కూడా. బ్రిటీష్ వారు అనుసరించిన ఆర్థిక విధానాలు భారత ఆర్థిక వ్యవస్థను సర్వనాశనం చేశాయి. బ్రిటీష్ వారు ఆర్థిక దోపిడీ భారతీయులకు కనువిప్పు కల్గించింది. కనుక జాతీయవాదులు భారతదేశాన్ని స్వయం పోషక సుసంపన్నదేశంగా తీర్చిదిద్దాలని భావించారు.

రష్యన్ విప్లవం, గాంధీజీ సిద్ధాంతాలు, వామపక్ష పార్టీల కార్యకలాపాలు మన ఆర్థిక విధానాలను ప్రభావితం చేశాయి. నెహ్రూ, నేతాజీ వంటి నాయకులు దేశవ్యాప్తంగా పర్యటించి సామ్యవాద భావాలను ప్రచారం చేశారు. 1931 కరాచీ కాంగ్రెస్ సమావేశంలో ప్రాథమిక హక్కులు, జాతీయ ఆర్థిక కార్యక్రమాలపై తీర్మానాలు చేయబడ్డాయి. "ప్రజల దోపిడీని అంతం చేయాలంటే ఆకలి దప్పులతో అలమటించే మిలియన్ల ఆర్థిక స్వాతంత్ర్యాన్ని రాజకీయ స్వాతంత్ర్య ఎజెండాలో పొందుపరచాలని" ఈ సమావేశం ప్రకటించింది. ఇంకా ఈ సమావేశంలో ప్రజల పౌర

హక్కులతోపాటు, వ్యవసాయ ఋణాలకు ఉపశమనం, భూమిశిస్తు తగ్గింపు, కార్మికులకు మెరుగైన సౌకర్యాలు కల్పించడం, స్త్రీలకు రక్షణ, కీలక పరిశ్రమలు ప్రభుత్వ ఆధీనంలోనుండుట, మున్నగు తీర్మానాలు కూడా చేయబడ్డాయి.

గ్రామీణ పునర్నిర్మాణానికి కాంగ్రెస్ తీవ్ర కృషి చేసింది. నిజమైన భారత్ గ్రామాల్లోనే వుందని, గ్రామీణ ప్రజానీకం పాల్గొననిదే ఏ ఉద్యమం విజయవంతంకాదు. గాంధీజీలోని సత్యాగ్రహం చంపారన్ రైతుల స్వత్యాగ్రహం, రాట్నంతో నూలు తీయుట, ఖాదీ ధారణ, జాతీయ విద్యా విధానం మున్నగు నిర్మాణాత్మక చర్యలను కాంగ్రెస్ చేపట్టింది.

క్రీ.శ.1930లో జాతీయ ఉద్యమం వలన ప్రేరణను పొందిన రైతులు కిసాన్ సభలనేర్పాటుచేసి శిస్తు తగ్గింపు, కౌలు కాలానికి భద్రత, కట్టుబానిసత్వ నిర్మూలనవంటి కోర్కెలతో ముందుకు సాగారు.

## 64.7 లౌకిక స్వభావం :

లౌకిక స్వభావం భారతీయుల నైజం. జాతీయ కాంగ్రెస్ స్థాపననుండే లౌకికతత్వం జాతీయోద్యమంలో అంతర్భాగమైంది. జాతీయోద్యమంలో సదా హిందూ ముస్లిం సమైక్యతను నొక్కి చెప్పబడింది. క్రీ.శ.1884లో సయ్యద్ అహ్మద్ ఖాన్ చెప్పిన మాటలు ఈ సందర్భంలో గుర్తుచేసుకొందాం. ఆయన మాటలలో చెప్పాలంటే "హిందూ, ముస్లిం అనేవి మత భేదాలు మాత్రమే, ఈ దేశంలో నివసించే హిందువుయైన, ముస్లింయైనా, తుదకు క్రైస్తవుడైనా అందరూ ఒకే దేశానికి, ఒకే జాతికి చెందినవారు" "భారతీయ సంస్కృతి హిందూ కాదు, ముస్లింకాదు, సకలమతాల సమ్మేళనం" అని గాంధీజీ పేర్కొన్నాడు.

దురదృష్టవశాత్తు మతతత్వాన్ని జాతీయ ఉద్యమం తుడిచిపెట్టలేకపోయింది. బ్రిటీష్ వారి విభజించు పాలించు విధానం, సాంఘిక, ఆర్థిక కారణాలు, జిన్నావంటి వ్యక్తుల సంకుచితత్వం వలన స్వరాజ్యం సాధించి మతతత్వాన్ని నిర్మూలించలేకపోయింది.

### పాఠ్యప్రశ్నలు :

**64.ఎ**

1. ఎవరి నాయకత్వంలో జాతీయోద్యమం ప్రజా ఉద్యమంగా మారింది?
2. జాతీయ కాంగ్రెస్ సామాజిక నిర్మాణం తొలి రోజులకు, గాంధీయుగానికి ఏల భిన్నమైంది?
3. గాంధీజీ, అంబేద్కర్ ఎలా అంటరానితన నిర్మూలనకు కృషి చేశారు? అంటరాని తన నిర్మూలనకు స్వతంత్ర భారతదేశం గైకొన్న రెండు చర్యలను తెల్పుము?
4. స్త్రీ విముక్తికి అహింసాయుత జాతీయ ఉద్యమం ఎలా తోడ్పడింది.
5. కరాచీ కాంగ్రెస్ (1931) సమావేశ ప్రాముఖ్యమేమి?

**భాగం -2**

జాతీయోద్యమం దేశంలోని భిన్న ప్రాంతాలకు చెందిన నాయకుల వలన బలవత్తరం చెందింది. అట్టివారిలో ముఖ్య నాయకుల జీవిత విశేషాలను చదువుదాం :

## 64.8 మౌలానా అబుల్ కలామ్ అజాద్ (1888-1958):

మక్కాలో పుట్టి, కలకత్తాలో స్థిరపడి జాతీయోద్యమంలో కీలకపాత్ర వహించిన ప్రముఖ జాతీయవాది మౌలానా అబుల్ కలామ్ అజాద్. ఆయన బహుభాషా పరిజ్ఞాని. అరబిక్, పర్షియన్, ఉర్దూ, ఇంగ్లీషు భాషలలో ఉద్దండ పండితుడు. నాటి ఉర్దూ పత్రికలకు మతం, సారస్వతాలపై వ్యాసాలు రాసేవాడు.

స్వదేశీ ఉద్యమం వలన ప్రభావితుడై బెంగాల్‌లోని విప్లవకారులతో సాన్నిహిత్యం పెంచుకొన్నాడు. జాతీయ భావాలను ప్రచారం చేయటానికి 1912లో 'అల్‌హైలాల్' (Al Hailal) అను ఉర్దూ వార పత్రికను స్థాపించాడు. ఈ పత్రిక ద్వారా ముస్లింలకు జాతీయోద్యమంలో పాల్గొనవలసిందిగా కోరాడు. అన్ని వర్గాల ప్రజల అవసరాలు సమ్మిళితమైనదేగాని, వర్గపరమైనవికావుయని ఆయన భావం. 1915లో "అల్ బలాఘ్" (Al Balagh) అనే మరొక ఉర్దూ వారపత్రికను స్థాపించాడు. ఈ పత్రికలో బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా వ్రాయుటవలన ప్రభుత్వం జరిమానా విధించింది.

క్రీ.శ.1920లో మౌలానా అజాద్‌కు గాంధీజీతో పరిచయం ఏర్పడింది. ఖలీఫా పదవి రద్దుకు పంజాబు దురంతరాలకు వ్యతిరేకంగా ప్రారంభమైన సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నాడు. అఖిల భారత ఖిలాఫత్ అధ్యక్షుడుగా, క్రీ.శ.1923 ప్రత్యేక కాంగ్రెస్ సమావేశానికి అధ్యక్షుడుగా ఎంపికయ్యాడు. ముస్లింలలోని సంప్రదాయ వాదులను, ఆధునిక వాదులను సమైక్యపరిచాడు. క్రీ.శ.1924లో జమైత్-ఉల్-ఉలేమామ్, క్రీ.శ.1929లో జాతీయ ముస్లిం సమావేశానికి అధ్యక్షత వహించాడు.

క్రీ.శ.1935 భారత ప్రభుత్వ చట్టాన్ని అనుసరించి జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్ విజయాన్ని సాధించి (1937) కేంద్రంలోను, రాష్ట్రంలోను అధికారాన్ని చేపట్టింది. కాంగ్రెస్ మంత్రివర్గాలు ఎలా పనిచేయాలో సలహాలివ్వటానికి ఏర్పాటుచేయబడిన కాంగ్రెస్ పార్లమెంటరీ సబ్ కమిటీలో అజాద్ సభ్యుడుగా నియమింపబడ్డాడు. 1940 నుండి 1946 వరకు అజాద్ కాంగ్రెస్ అధ్యక్షుడిగా పనిచేవాడు. కాంగ్రెస్ అధ్యక్షునిగా జాతీయోద్యమంలో జరిగిన అన్ని సంఘటనలలో, రాయబారాలలో పాల్గొన్నాడు. క్రిప్స్ రాయబారంతో సంప్రదింపులు జరిపాడు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని అరెస్టయై అహ్మద్‌నగర్ కోటలో నిర్బంధింపబడ్డాడు. జైలు నుండి విడుదలైన పిమ్మట సిమ్లా సమావేశంలో పాల్గొన్నాడు. మంత్రిత్రయ రాయబార వర్గంతో సహకరించాడు.

రాజ్యాంగ పరిషత్ సభ్యుడుగా నెహ్రూ నేతృత్వంలోని తాత్కాలిక ప్రభుత్వంలో విద్యా శాఖా మంత్రిగా పనిచేశాడు. తొలి సాధారణ ఎన్నికల తరువాత పార్లమెంటరీ పార్టీ డిప్యూటీ లీడర్‌గా ఎన్నికయ్యాడు.

స్వతంత్ర భారతదేశంలోని విద్యాశాఖా మంత్రియై పటిష్టమైన విద్యా విధానానికి రూపకల్పన చేశాడు. విశ్వవిద్యాలయ, మాధ్యమిక విద్యా కమిషన్లు నియమించాడు. అఖిల భారత సాంకేతిక విద్యా సంస్థను పునర్ వ్యవస్థీకరించాడు. యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్, బెంగళూరులోని ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ సైన్స్, ఖరగ్‌పూర్‌లోని (ఐఐటి) ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ ఆయన చొరవ, కృషి వలన ఏర్పడినవే. దేశవ్యాప్తంగా శాస్త్రీయ పరిశోధనకు అనేక ప్రయోగశాలలు స్థాపించాడు.

ఇట్లు అజాద్ గొప్ప విద్యావేత్త, లౌకిక విద్య, జాతీయవాది, రాజనీతిజ్ఞుడు.

## 64.9 అనిబిసెంట్ (1847-1933) :

జాతీయోద్యమంలో పాల్గొని భారతీయులను, భారతదేశాన్ని ప్రేమించిన విదేశీవనిత అనిబిసెంట్. ఐర్లండ్‌లో పుట్టి, దివ్య జ్ఞాన సమాజ సభ్యురాలుగా క్రీ.శ.1893లో భారత్‌కు వచ్చి, భారత్‌నే తన గృహంగా మార్చుకుంది. తొలుత ఆమె తనకార్యకలాపాలను మత, సామాజిక విద్యా రంగాలకు పరిమితం చేసింది. భూ చట్టాలు సంస్కరింపబడాలని, కార్మికుల స్థితిగతులు మెరుగుపడాలని, స్త్రీలకు పురుషులతో సమాన హక్కులు ఉండాలని కాంక్షించింది. పేద పిల్లలకు తగు వసతి, విద్య, ఆహారం సమకూర్చుటానికి కృషి చేసింది. స్కౌట్ ఉద్యమానికి చేయూత నిచ్చింది. బాల్య వివాహాలను వ్యతిరేకించి సమాజంలో అణగారిన వర్గాల ప్రయోజనాల కోసం అహర్నిశలుపాటు పడింది.

ప్రాచీన విలువలను, సంస్థలను పునరుద్ధరించుట ద్వారా భారతదేశం ఎదుర్కొనే సమస్యలు పరిష్కారమవుతాయని ఆమె నమ్మకం. భారతీయుల సాంస్కృతిక, ఆధ్యాత్మిక వారసత్వం ద్వారా భారతీయులలో ఆత్మవిశ్వాసాన్ని నెలకొల్పింది. క్రీ.శ.1915లో తొలిసారిగా అనిబిసెంట్ కాంగ్రెస్‌లోని రెండు గ్రూపులను మితవాదులు, అతివాదుల పరంచేయుటతో ఆమె రాజకీయ జీవితం ప్రారంభమైంది. అనతికాలంలోనే జాతీయ కాంగ్రెస్‌లో ప్రముఖ నాయకురాలై జాతీయ కాంగ్రెస్ అధ్యక్షురాలిగా (తొలి మహిళా అధ్యక్షురాలు) ఎన్నికైంది. 1917లో హోమ్‌రూల్ ఉద్యమాన్ని నిర్వహించి స్వీయ పాలన కావాలని కోరింది. క్రీ.శ.1919 సంస్కరణలను తీవ్రంగా విమర్శించింది. వానిని బ్రిటీష్‌వారు ప్రతిపాదించుట, భారతీయులు అంగీకరించుట వ్యర్థమని చెప్పింది. క్రీ.శ.1920లో కాంగ్రెస్‌ను వదలి ఉదారవాదులతో చేరింది.

ఆమె గొప్ప రచయిత, పాత్రికేయురాలు. ఆమె "న్యూ ఇండియా", కామన్ 'వీల్' అనే పత్రికలను స్థాపించింది. భగవద్గీతను ఇంగ్లీషు భాషలోనికి అనువదించింది. బెనారస్‌లో కేంద్ర హిందూ పాఠశాలను స్థాపించింది. ఈ పాఠశాలే, కళాశాలలై తుదకు 1915లో బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంగా పరిఢవిల్లింది.

## 64.10 లోక్‌మాన్య బాలగంగాధర్ తిలక్ (1856-1920) :

దేశభక్తులలో రాజు (Prince of Patriots)గా పేరుమోసిన బాలగంగాధర్ తిలక్ అతివాది. యావత్ భారతం ఆంగ్లేయులపై ఆగ్రహావేశం పెల్లుబికిన సమయంలో అనగా 1856లో తిలక్ మహరాష్ట్రలో జన్మించాడు. క్రీ.శ.1879లో న్యాయశాస్త్రంలో పట్టా పుచ్చుకొన్నాడు.

అగార్కర్, రనడే నేతాజీ బోధనల వలన తిలక్ ప్రభావితుడైనాడు. నేటి రాజకీయ, దౌష్ట్యాలపై, సాంఘిక దురాచారాలపై ధ్వజమెత్తాడు. ఇతడు గొప్ప విద్యావేత్త. క్రీ.శ.1880లో పునా న్యూ స్కూల్‌ను, 1885లో, పునాలో ఫెర్గూసన్ కళాశాలను స్థాపించాడు. పునాలో దక్కన్ విద్యా సంస్థ స్థాపనకు సైతం కృషిచేశాడు. ఆయన గొప్ప పండితుడు. వేదాలపై గ్రంథ రచన చేసి, ఉపనిషత్తులందు చెప్పబడిన తత్వశాస్త్రం నుండి ప్రేరణ పొందాడు. "కేసరి" అనే మరాఠా పత్రికను, "మరాఠా" అనే ఇంగ్లీషు పత్రికను స్థాపించి బ్రిటీష్ పాలనలోని లోపాలను దుయ్యబట్టుతూ భారతీయులను చైతన్యవంతం చేశాడు. బ్రిటీష్ పాలనకు వ్యతిరేకంగా వార్తలు వ్రాయుటవలన ఆయన అనేకసార్లు (1882, 1897, 1908) జైలుకు వెళ్ళాడు. 1908లో అరెస్టయి మాండలే జైలులో ఆరేళ్ళు గడిపాడు. జైలు జీవితం ఆయనను దేశభక్తునిగా, జాతీయవాదిగా మార్చింది. ప్రజలతో సంబంధాలు పెట్టుకొన్న తొలి జాతీయ నాయకుడు తిలక్. అందుకు అఖాడాలను (Akaras) లాంటి క్లబ్బులను, 'గోవధ నిషేధ సంఘాల'ను స్థాపించాడు.

మితవాదులు అనుసరించిన ప్రార్థన, విజ్ఞాపన, నిరసన – మున్నగు వానిలో ఆయనకు నమ్మకంలేదు. మాటల ద్వారాగాక చేతల ద్వారానే సంస్కరణలు సాధించాలి, 'యాచన కాదు, శూరత్వం కావాలి"అని ఉద్ఘాటించాడు. ప్రజలలో దేశభక్తి జనింప చేయటానికి గణేష్, శివాజీ ఉత్సవాలను జరిపాడు. ఈ ఉత్సవాలు అనేక మిలియన్ల ప్రజలను సంఘటితపరచి స్వాతంత్ర్య స్ఫూర్తిని కల్గించింది.

లజపతిరాయ్, బిపిన్‌చంద్రపాల్‌లతో కలసి తిలక్ అతివాద పార్టీ (జాతీయ పార్టీని) స్థాపించాడు. బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా ప్రారంభమైన వందేమాతరం ఉద్యమంలో బహిష్కరణ, స్వదేశీ, జాతీయ విద్య, స్వరాజ్ మున్నగు భావాలను ప్రచారం చేసి ఉద్యమం విజయవంతం చేయడానికి కృషి చేశాడు. ఈ నాలుగు సూత్రాలు, క్రీ.శ.1906 జాతీయ కాంగ్రెస్ సమావేశంలో ఆమోదింపబడ్డాయి. బ్రిటిష్ పాలనలోని డొమినియన్ ప్రతిపత్తిలోగల స్వీయ ప్రభుత్వము తిలక్‌కు ఇష్టంలేదు. స్వరాజ్యమే నా జన్మహక్కు. దానిని సాధించి తీరుతాను" అని ప్రకటించాడు. ఇట్టి అతివాద భావాల వలన క్రీ.శ.1907 సూరత్ సమావేశంలో కాంగ్రెస్ రెండుగా చీలిపోయింది. అతివాదులు కాంగ్రెస్ నుండి బహిష్కరించబడ్డారు. 1914లో జైలు నుండి విడుదల కాగానే తిలక్ కాంగ్రెస్‌తో సంబంధం లేకుండా జాతీయ శక్తులను బలోపేతం చేశాడు. 1916లో అతివాదులు తిరిగి కాంగ్రెస్‌లో చేర్చుకోబడ్డారు. ఆ తరువాత 1916లో అనిబీసెంట్ మాదిరిగా తిలక్ హోమ్‌రూల్ ఉద్యమాన్ని ప్రారంభించాడు.

బ్రిటీష్ వారిపట్ల అభిమానధనులుగా నున్న కాంగ్రెస్ వారిని బ్రిటీష్ సామ్రాజ్య వ్యతిరేక శక్తులుగా తిలక్ మార్చాడు. ఆయన వేసిన సుస్థిర జాతీయ పునాదులపైననే గాంధీజీ, నెహ్రూ, బోస్ వంటి వారు స్వాతంత్ర్య పోరాట సౌధాన్ని నిర్మించారు. బ్రిటీష్ ప్రభుత్వం తిలక్‌ను తమ పరిపాలనకు ప్రమాదకారి అని భావించింది.

ఏమైనా ఆధునిక భారత నిర్మాతలలో ఒకడుగా తిలక్ చరితార్థుడైనాడు.

## 64.11 భగత్‌సింగ్ (1907-1931) :

చిరుత ప్రాయంలోనే దేశ స్వాతంత్ర్యం కొరకు ప్రాణాలర్పించిన విప్లవ వీరుడు – సర్దార్ భగత్‌సింగ్. భగత్‌సింగ్ పశ్చిమ పంజాబ్‌లోని లైల్‌పూర్ జిల్లాలోని బంగా గ్రామంలో జన్మించాడు. ఇతడు దయానంద ఆంగ్లో – వేదిక్ కళాశాలలో చేరి విద్యార్థి సంఘ నాయకుడయ్యాడు. తదుపరి లజపతిరాయ్ స్థాపించిన జాతీయ కళాశాలలో విద్యను కొనసాగించాడు. గాంధీజీ పిలుపునందుకొని చదువుకు స్వస్తి చెప్పి సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నాడు.

క్రీ.శ.1923లో హిందుస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ అసోసియేషన్‌లో సభ్యుడుగా చేరి ఆ తరువాత, కేంద్ర కమిటీ జనరల్ సెక్రటరీగా ఎన్నికై ఈ సంస్థ కార్యకలాపాలను పర్యవేక్షించాడు. ఇతడు సామ్యవాద భావాలకు బాగా ప్రభావితుడయ్యాడు. క్రీ.శ.1925లో లాహోర్‌లో నవజవాన్ భారత సభను స్థాపించాడు. యువతరంలో విప్లవ భావాల్ని రగుల్కొల్పడానికి కృషి చేశాడు. నాటి విప్లవకారులైన యశ్‌పాల్, సుఖదేవ్, భగవతి చరణ్, భతుకేశ్వర దత్, చంద్రశేఖర్ ఆజాద్, జతిన్‌దాస్, సురేంద్రనాథ్ పాండ్య మొదలైనవారితో పరిచయాలు పెంచుకొని విప్లవ కార్యకలాపాలను కొనసాగించాడు. 1926లో కాకోరి కుట్ర కేసులో నిందితులను విడిపించడానికి కుందన్‌లాల్, చంద్రశేఖర్ ఆజాద్, జతిన్‌దాస్, సురేంద్రనాథ్ పాండ్య మొదలైన వారితో పరిచయాలు పెంచుకొని విప్లవ కార్యకలాపాలను కొనసాగించాడు. 1926లో కాకోరి కుట్ర కేసులో నిందితులను విడిపించడానికి కుందన్‌లాల్, చంద్రశేఖర్ ఆజాద్‌లతో ప్రయత్నించాడు.

కాని ఆ ప్రయత్నం విజయవంతం కాలేదు. భగత్‌సింగ్ నేతృత్వంలో 1928 నాటికి పంజాబ్ రాష్ట్రమంతటా 'హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ అసోసియేషన్' శాఖలు స్థాపించబడ్డాయి.

సైమన్ కమిషన్ బహిష్కరణ ఉద్యమంలో లాలా లజపతిరాయ్‌ను స్కాట్ ఆదేశాల మేరకు సౌండర్స్ తీవ్రమైన లాఠీ దెబ్బలతో గాయపర్చాడు. ఈ దెబ్బలకు కొద్ది రోజులకే లజపతిరాయ్ మరణించాడు. ఇది సహింపలేక భగత్‌సింగ్, రాజ్‌గురు ఇరువురూ 1928, డిసెంబరు 17న సాండర్స్‌ను కాల్చి చంపాడు. కాని వారు పట్టుబడలేదు.

క్రీ.శ.1923 ఏప్రిల్ 29వ తేదీన భగత్‌సింగ్, భతుకేశ్వర దత్తులు కేంద్ర శాసనసభ సమావేశం జరిగే సమయంలో బాంబులు వేసి భయభ్రాంతులు సృష్టించారు. "ఇంక్విలాబ్ జిందాబాద్", "సామ్రాజ్యవాదం నాశ్‌హో" అనే నినాదాలతో ఎర్రకరపత్రాలను విసిరివేశారు. వీరు పారిపోవుటకు అవకాశం ఉన్నను పారిపోక అచటనున్న పోలీసులకు లొంగిపోయారు. వీరిపై రాజ ద్రోహ నేరం క్రింద లాహోర్ న్యాయస్థానం భగత్‌సింగ్‌కు ఉరిశిక్ష, బతుకేశ్వర దత్తుకు ద్వీపాంతర శిక్ష విధించింది. 1931 మార్చి 23న భగత్‌సింగ ఉరితీయబడ్డాడు. విప్లవవీరుడుగా, జాతీయవాదిగా భగత్‌సింగ్ షాహిద్–ఇ–అజమ్'గా నేటికినీ భారతీయులకు చిరస్మరణీయుడు. ఆయన అరాచకవాది కాదు. కొన్ని ప్రత్యేక పరిస్థితులలోనే బాంబులు వేయాలి తప్ప కేవలం రక్తపాతం ద్వారానే స్వరాజ్య సాధన జరుగుతుందని ఎప్పుడూ చెప్పలేదు. భగత్‌సింగ్ గొప్ప పాత్రికేయుడు. ఇతడు అకాలీ (పంజాబ్ భాషలో), కీర్తి (ఉర్దూ) పత్రికల సంపాదకుడుగా పనిచేశాడు. ఢిల్లీ నుండి వెలువడే 'అర్జున్, కాన్పూర్ నుండి వెలువడే ప్రతాప్' అను పత్రికలకు 'బల్వంత్‌సింగ్' అనే కలం పేరుతో వ్యాసాలు వ్రాశాడు.

## 64.12 చక్రవర్తి రాజగోపాలాచారి (1878–1972) :

స్వతంత్ర భారతదేశ తొలి భారతీయ గవర్నర్ జనరల్ చక్రవర్తి రాజగోపాలా చారి క్రీ.శ.1878 సంవత్సరంలో సేలం జిల్లాలో ఒక కుగ్రామంలో జన్మించాడు. ఆయన సుప్రసిద్ధ న్యాయవాది. 1917లో సేలం మున్సిపల్ ఛైర్మన్‌గా ఎన్నికయ్యాడు.

రౌలట్ బిల్లులకు వ్యతిరేకంగా జరిగిన సత్యాగ్రహంలో రాజగోపాలాచారి పాల్గొన్నాడు. గాంధీజీ పిలుపునందుకొని న్యాయవాద వృత్తిని త్యజించి 1920లో సహాయ నిరాకరణోద్యమంలో చేరాడు. 1912లో కాంగ్రెస్ జనరల్ సెక్రటరీగా నియమించబడి ఆ తదుపరి చాలా సంవత్సరాలు వర్కింగ్ కమిటీ సభ్యుడుగా పనిచేశాడు. సహాయ నిరాకరణ ఉద్యమం నిలుపుదల చేసిన తరువాత శాసనసభలలో ప్రవేశించాలనే నిర్ణయాన్ని వ్యతిరేకించాడు. దక్షిణ భారతంలో సాగిన శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొని అరెస్టు అయ్యాడు. చాలా కాలం తమిళనాడు కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడుగా పనిచేశాడు. 1935 భారత ప్రభుత్వ చట్టం ప్రకారం జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్‌ను విజయపంథాలో నడిపించి మద్రాసు రాష్ట్ర తొలి ముఖ్యమంత్రిగా (1937–39) పనిచేశాడు. ఇతని పదవీ కాలంలో మద్యపాన నిషేధం, వ్యవసాయ ఉపశమన చట్టాన్ని ప్రవేశపెట్టాడు. 1944లో నెలకొన్న రాజ్యాంగ సంక్షోభాన్ని పరిష్కరించడానికి ఒక పథకాన్ని రచించాడు (రాజాజీ పథకం). 1946–47 సంవత్సరం మధ్యకాలంలో గవర్నర్ జనరల్ కార్యనిర్వాహక సంఘంలో సభ్యుడుగా పనిచేశాడు. తాత్కాలిక ప్రభుత్వంలో కొన్నాళ్ళు మంత్రిగా పనిచేశాడు. లార్డ్ మౌంట్ బాటన్ వెళ్ళిన తరువాత స్వతంత్ర భారతదేశ తొలి భారతీయ గవర్నర్ జనరల్‌గా నియమించబడి (1948–1950) ఇండియా రిపబ్లిక్ అయ్యే వరకు పదవిలో కొనసాగాడు.

నెహ్రూ మంత్రి వర్గంలో హోమ్‌శాఖా మంత్రిగా (1951), 1952-54 సంవత్సరం మధ్యకాలంలో మద్రాసు ముఖ్యమంత్రిగా పనిచేశాడు. క్రమంగా కాంగ్రెస్‌కు దూరమై 1959లో స్వతంత్ర పార్టీని స్థాపించాడు. తన భావాలను 'స్వరాజ్' అను పత్రిక ద్వారా వ్యక్తపరిచాడు.

రాజాజీగా పేరుగాంచిన రాజగోపాలాచారి గొప్ప రాజకీయ నాయకుడు. ఖాదీ ఉద్యమానికి, మద్యపాన నిషేధానికి, హరిజన ఉద్ధరణకు జీవితాంతం పాటుపడ్డాడు. క్రీ.శ.1938లో హరిజనుల దేవాలయ ప్రవేశం కల్పించుటలో కీలకపాత్ర వహించాడు. రాజాజీ గొప్ప రాజనీతిజ్ఞుడు, సంఘ సంస్కర్త.

## 64.13 గోపాల కృష్ణ గోఖలే 1866-1915 :

గోపాలకృష్ణ గోఖలే మితవాద జాతీయ కాంగ్రెస్ నాయకుడు. క్రీ.శ.1866లో కొల్హాపూర్‌లో జన్మించి, ఉపాధ్యాయుడుగా జీవితాన్ని ప్రారంభించాడు. పూనాలోని ఫెర్గూసన్ కళాశాలలో ఆచార్యుడుగా చేరి, తదుపరి ఆ కళాశాల ప్రిన్సిపల్‌గా పదోన్నతి పొందాడు. కొన్నాళ్ళు గోవింద రనడే స్థాపించిన దక్కన్ విద్యా సంస్థలో పనిచేశాడు. రనడే అనుచరుడిగా మితవాద భావాలను సంతరించుకున్నాడు. పూనా సార్వజనిక సభ కార్యదర్శిగా కూడా పనిచేశాడు.

క్రీ.శ.1892లో బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడిగా, 1902లో కేంద్ర లేజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడిగా ఎంపికయ్యాడు. ఈ కౌన్సిల్ సమావేశాలలో చేసిన ప్రసంగాలు ముఖ్యంగా బడ్జెట్‌పై చేసిన ప్రసంగాలు అందరికీ ఆకట్టుకున్నాయి. లార్డ్‌కర్జన్ విద్యా విధానాన్ని తీవ్రంగా విమర్శించాడు. నిర్బంధ ప్రాథమిక విద్య కోసం పోరాటం చేశాడు. 1909 మింట్లో - మార్లే సంస్కరణల రూపకల్పనలో పాల్గొన్నాడు. జాతీయ కాంగ్రెస్‌లో మితవాదిగా, ఉదారవాదిగా, సంస్కరణల కోసం ఆందోళన చేశాడు. బెంగాల్ విభజనను వ్యతిరేకించాడు. కాకపోతే అతివాదుల కార్యకలాపాలకు మద్దతు ఇవ్వకపోడం వల్ల అపఖ్యాతి పాలయ్యాడు. 1905లో బెనారస్ జాతీయ కాంగ్రెస్ సమావేశానికి అధ్యక్షుడుగా ఎంపికై కొన్ని పరిస్థితులలో బహిష్కరణ అనే ఆయుధం న్యాయ సమ్మతమేనని ఉద్ఘాటించాడు.

మాతృదేశ అభ్యున్నతికి, స్త్రీ జనోద్ధరణకు, సామాజిక సేవకు పునరంకితం చేసేందుకు 1905లో గోఖలే 'సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ'ని స్థాపించాడు.

## 64.15 జవహర్ లాల్ నెహ్రూ 1889-1964 :

ప్రపంచ సుప్రసిద్ధ నాయకులలో ఒకడు, స్వతంత్ర భారతదేశ తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ. ఆయన క్రీ.శ.1889 నవంబరు 14వ తేదీన అలహాబాద్‌లో సుప్రసిద్ధ న్యాయవాది మోతీలాల్ నెహ్రూ, స్వరూపరాణి దంపతులకు జన్మించాడు. ఇంగ్లాండ్‌లో విద్యనభ్యసించి బారిస్టర్ డిగ్రీని పుచ్చుకొని 1912లో ఇండియాకు తిరిగి వచ్చాడు. హోమ్‌రూల్ ఉద్యమంలో చేరాడు. గాంధీజీతో పరిచయమేర్పడి ఆయన సిద్ధాంతాల ప్రభావానికి లోనయ్యాడు. జలియన్‌వాలాబాగ్ దురంతాలను తీవ్రంగా ఖండించాడు. 1920లో ప్రారంభమైన సహాయ నిరాకరణ ఉద్యమాన్ని అలహాబాద్‌లో నిర్వహించి అరెస్టు అయి జైలు పాలయ్యాడు.

1923లో అలహాబాద్ మున్సిపల్ ఛైర్మన్‌గా, కాంగ్రెస్ జనరల్ సెక్రటరీగా ఎన్నికయ్యాడు. జాతీయ కాంగ్రెస్ అధ్యక్షుడుగా అనేక పర్యాయాలు (1929, 1936, 1937, 1946 మరియు 1951 - 1954) ఎన్నికయ్యాడు.

1927లో బ్రస్సెల్స్‌లో జరిగిన అణగారిన జాతీయుల సమావేశానికి హాజరయ్యాడు. సైమన్ కమిషన్ బహిష్కరణ ఉద్యమాన్ని లక్నోలో విజయవంతంగా నిర్వహించాడు. సంపూర్ణ స్వరాజ్య విషయమై మోతీలాల్ నెహ్రూ సమర్పించిన నివేదికను తోసిపుచ్చాడు.

నెహ్రూ ప్రజాభిమానం చూరగొన్న వ్యక్తి, సామ్యవాది. 1929లో 'ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్'కు అధ్యక్షుడయ్యాడు. 1936లో సామ్యవాదమే గమ్యంగా చేసుకోవాలని కాంగ్రెస్‌ను అర్థించాడు.

1929లో జరిగిన లాహోర్ కాంగ్రెస్ సమావేశానికి అధ్యక్షుడై సంపూర్ణ స్వరాజ్య సాధనే కాంగ్రెస్ లక్ష్యమని తీర్మానించాడు.

నెహ్రూ శాసన ఉల్లంఘనోద్యమంలో చురుకుగా పాల్గొన్నాడు. ఉత్తరప్రదేశ్‌లో రైతు ఉద్యమానికి నాయకత్వం వహించాడు. రెండవ ప్రపంచ యుద్ధంలో ఫాసిస్టు నియంతృత్వాన్ని తీవ్రంగా విమర్శించాడు. 1క్రీ.శ.945లో సిమ్లా సమావేశానికి హాజరై, 1946 మంత్రిత్రయ రాయబారం చర్చలలో పాల్గొన్నాడు. 1946-47 సంవత్సరాల మధ్య ఏర్పడ్డ తాత్కాలిక ప్రభుత్వానికి నేతృత్వం వహించాడు.

స్వతంత్ర భారతదేశ తొలి ప్రధానమంత్రిగా తాను మరణించే వరకు (1864) ఆ పదవిలో ఉన్నాడు. తొలి ప్రధానిగా అనేక సమస్యలను అనగా శాంతి భద్రతలు, దేశ విభజన, మతకలహాలు మున్నగువానిని సమర్థవంతంగా ఎదుర్కొని దేశ ఆర్థికాభివృద్ధికి, విదేశాంగ విధానానికి పునాదులు వేశాడు.

భారతదేశ విదేశాంగ విధాన రూప శిల్పి జవహర్‌లాల్ నెహ్రూ. అహింసావాదిగా వివిధ రాజ్యాల మధ్య నెలకొన్న వివాదాలను బలప్రయోగం ద్వారా కాకుండా, సంప్రదింపుల ద్వారా పరిష్కరించుకోవాలని సూచించాడు. రెండవ ప్రపంచ యుద్ధానంతరం ప్రపంచం రెండు కూటములుగా (అమెరికా, రష్యా) విభక్తమైనప్పుడు ఏ కూటమిలోనూ చేరక అలీన విధానాన్ని అనుసరించాడు. ఐక్యరాజ్య సమితి కార్యకలాపాలకు పూర్తి మద్దతు నిచ్చాడు. ఎరచశీల ప్రాతిపదికగా పొరుగు రాజ్యాలతో సంబంధాలు ఏర్పరచుకున్నాడు. అంతర్జాతీయ వాదిగా ఆసియా, ఆఫ్రికా దేశాలు వలసవాదానికి, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రారంభించిన జాతీయవాద పోరాటాలకు మద్దతు పలికాడు.

ప్రజాస్వామ్యం, లౌకిక వాదం సామ్యవాదంలే దేశ లక్ష్యాలుగా ఎంచుకున్నాడు. ఆయన నేతృత్వంలో భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు, జమిందారీ వ్యవస్థ రద్దు, పంచాయతీరాజ్ పునరుద్ధరణ, భూ సంస్కరణలు మున్నగు ప్రగతిశీల చట్టాలు చేయబడ్డాయి.

సామ్యవాద తరహా సమాజ స్థాపనకై ఆర్థిక ప్రణాళికలను ప్రవేశపెట్టాడు. ప్లానింగ్ కమిషన్ అధ్యక్షుడుగా పనిచేశాడు. శాస్త్ర, సాంకేతిక రంగాలను అభివృద్ధి పరిచాడు.

నెహ్రూ గొప్ప రచయిత. ఆయన రచనలలో ముఖ్యమైనవి ఆటోబయోగ్రఫీ, Glimpses of World History, Discovery of India. ఆయన పుట్టిన రోజును బాలల దినోత్సవంగా జరుపుకుంటున్నాం. పిల్లలు ఆయనను అత్యంత ప్రేమాభిమానంతో 'చాచా నెహ్రూ' అని పిలుస్తారు.

1955లో దేశ అత్యున్నత పురస్కారమైన భారతరత్న బిరుదు నెహ్రూకు ప్రదానం చేయబడింది. 20వ శతాబ్ది భారతదేశ చరిత్రలో కీలక భూమికను పోషించిన ఒక మహా మనిషి - నెహ్రూ.

## 64.16 లాలా లజపతిరాయ్ (1865-1928) :

లాలా లజపతిరాయ్ నిష్కళంక దేశభక్తుడు. న్యాయవాది, జాతీయవాది, పాత్రికేయుడు, విద్యావేత్త, ధైర్యశాలి. అతివాద నాయకత్రయంలో ఒకడు. హిందూమతం, సంస్కృతి ప్రభావంనకు లోనై పంజాబ్‌లో ఆర్య సమాజ కార్యకలాపాలకు నేతృత్వం వహించాడు. లాహోర్‌లో 'దయానంద 'ఆంగ్లో వేదిక' కళాశాల స్థాపనలో అవిరళ కృషి చేశాడు.

కాంగ్రెస్‌లో అతివాద పక్షనాయకుడిగా తిలక్, బిపిన్ చంద్రపాల్‌లతో కలసి పనిచేశాడు. 1905లో గోఖలే వెంట ఇంగ్లాండ్ వెళ్ళి భారతదేశం ఎదుర్కొనే సమస్యలను బ్రిటిష్ ప్రజలకు విన్నవించాడు. మితవాదుల పోరాట పద్ధతుల వలన సాధించేది ఏమీలేదని, కేవలం స్వశక్తితో, చేతలతోనే ఏదైనా సాధించవచ్చునని చెప్పాడు. 1906-07 సంవత్సరాల మధ్యకాలంలో సర్దార్ అజిత్‌సింగ్‌తోపాటు జైలుకెళ్ళి ఆరు నెలల తదుపరి విడుదల చేయబడ్డాడు.

మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో లజపతిరాయ్ అమెరికా పర్యటనకు వెళ్ళినపుడు క్రీ.శ. 1919 వరకు భారతదేశానికి రావడానికి వీలు లేకుండా బ్రిటిష్ ప్రభుత్వం ఆంక్షలు విధించింది. 1920లో "ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్" అధ్యక్షుడుగా, కలకత్తా కాంగ్రెస్ సమావేశానికి అధ్యక్షుడుగా ఎంపికయ్యాడు. 1922లో సహాయ నిరాకరణ ఉద్యమం నిలుపుదల చెయ్యడాన్ని తప్పుపట్టాడు. మోతీలాల్ నెహ్రూ, చిత్తరంజన్‌దాస్‌లతో కలసి స్వరాజ్ పార్టీని స్థాపించాడు.

1923లో స్వరాజ్ పార్టీ తరపున కేంద్ర శాసనసభకు ఎంపికయ్యాడు. భారతీయుల ప్రాతినిధ్యంలేని ప్రభుత్వం కమిషన్‌లను బహిష్కరించాలని శాసనసభలో తీర్మానం ప్రవేశపెట్టాడు.

మదన్ మోహన్ మాలవ్యాతో కలసి (Nationalist Party) జాతీయ పార్టీని స్థాపించాడు. ఆయన గొప్ప పాత్రికేయుడు. 'వందేమాతరం' 'The People' పత్రికల సంపాదకులుగా పనిచేశాడు. ఆయన 'ఆర్య సమాజ్', 'యంగ్ ఇండియా' అనే గ్రంథాలను వ్రాశాడు. 'యంగ్ ఇండియా'ను బ్రిటిష్ ప్రభుత్వం ఇండియాలోను, బ్రిటన్‌లోను నిషేధించింది.

సైమన్ బహిష్కరణ ఉద్యమంలో ఆయన ప్రదర్శించిన ధైర్య సాహసాలకు షేర్-ఇ-పంజాబ్ (పంజాబ్ కేసరి)గా కీర్తింపబడ్డాడు. ఈ బహిష్కరణ ఉద్యమంలో లాఠీ దెబ్బలకు 1928 నవంబరు 17న ఆయన మరణించాడు.

## 64.17 మోహన్‌దాస్ కరమ్ చంద్ గాంధీ 1869-1948 :

మోహన్‌దాస్ కరమ్ చంద్‌గాంధీ 1869 అక్టోబర్ 2వ తేదీన కయవాడ్‌లోని పోర్‌బందర్‌లో జన్మించాడు. 1887లో ఇంగ్లాండ్ వెళ్ళి బారిస్టర్ పట్టాపుచ్చుకొని 1891లో స్వదేశానికి వచ్చి రాజ్‌కోట్‌లో న్యాయవాదిగా ప్రాక్టీసు ప్రారంభించాడు. 1893లో 'అబ్దుల్లా అండ్.కం' అనే భారత సంస్థ కేసు విచారణకై దక్షిణాఫ్రికా వెళ్ళాడు.

దక్షిణాఫ్రికాలో శ్వేత జాతీయుల పాలనలో భారతీయులు పడే కడగండ్లు ఆయనను బాధించాయి. భారతీయులకు జరిగిన అన్యాయానికి, శ్వేతజాతి ప్రభుత్వ జాతి విచక్షణా విధానానికి వ్యతిరేకంగా పోరాటం ప్రారంభించాడు. 'ఇండియన్ ఒపీనీయన్' అనే పత్రికకు సంపాదకత్వం వహించాడు. ఈ పోరాటంలో శాంతియుత సత్యాగ్రహానికి శ్రీకారం చుట్టి

1908లో ఆఫ్రికాలో స్థిరపడిన ఆసియావాసుల కోసం తొలి ప్రయత్నం చేశాడు. ఇందుకు ఆయన అనేకసార్లు జైలుకు వెళ్ళి ప్రభుత్వ దమనకాండకు గురయ్యాడు. అయినా గాంధీపట్టు వీడలేదు. ఆఫ్రికాలోని భిన్న మతాల వారిని (హిందూ, ముస్లిం, క్రిస్టియన్) భిన్న ప్రాంతాలవారిని (గుజరాత్, దక్షిణ దేశం), భిన్న వర్గాల వారిని (ధనిక, పేద, వర్తక, కార్మిక) సమైక్యం చేసి పోరాటాన్ని సాగించి విజయాన్ని సాధించాడు. 1915లో గాంధీజీ స్వదేశానికి తిరిగి వచ్చి అహమ్మదాబాద్ వద్ద సబర్మతీ ఆశ్రమాన్ని స్థాపించాడు. 1917లో బీహార్ నందు చంపరన్ రైతులకు నాయకత్వం వహించి వారిని ఆంగ్లో-ఇండియన్ తోట యజమానుల బారి నుండి కాపాడాడు. అలాగే అహమ్మదాబాద్ మిల్లు కార్మికుల కోరికల సాధనలో, గుజరాత్‌లో 'ఖేడా' రైతుల పన్ను నిరాకరణ ఉద్యమంలో పాల్గొని విజయం సాధించాడు.

మొదటి ప్రపంచ యుద్ధానంతరం రాజద్రోహాన్ని అణచునెపంతో బ్రిటిష్ ప్రభుత్వం 'రౌలట్' బిల్లును ప్రవేశపెట్టాలని నిర్ణయించింది. 1919లో దీనికి వ్యతిరేకంగా గాంధీజీ రౌలట్ సత్యాగ్రహాన్ని నిర్వహించాడు. జలియన్ వాలాబాగ్ దురంతాలపై విచారణకు కాంగ్రెస్ తరపున ఒక కమిషన్‌ను నియమించాడు. పంజాబ్ మారణకాండకు, ఖలీఫా పదవి రద్దుకు నిరసిస్తూ పిశాచిక (Satanic) బ్రిటిష్ ప్రభుత్వానికి సహకరించుట పాపమని గాంధీజీ ఉద్ఘాటించాడు. 1920లో దేశవ్యాప్తంగా సహా నిరాకరణ ఉద్యమాన్ని ప్రారంభించాడు. తన భావాలను ప్రజలకు తెలియజేయటానికి నవజీవన్, యంగ్ ఇండియా (హరిజన్) పత్రికలకు సంపాదకుడయ్యాడు. 1922లో ఈ పత్రికలలో వ్రాసిన వ్యాసాలకు రాజద్రోహం నేరంమోపి, ప్రభుత్వం ఆరు సంవత్సరాలు కారాగార శిక్ష విధించింది. కాని అనారోగ్య కారణములవలన గాంధీజీ 1924లోనే విడుదల చేయబడ్డాడు.

గాంధీజీ సిద్ధాంతాల వలన, వ్యక్తిత్వం వలన ప్రభావితులై అసంఖ్యాక ప్రజలు జాతీయోద్యమంలో పాల్గొన్నారు. ఆయన నేతృత్వంలో జాతీయ ఉద్యమం ప్రజా ఉద్యమంగా మారింది. 1930 మార్చి 12న దండి సత్యాగ్రహం నిర్వహించి అరెస్టు అయ్యాడు. 1931లో జరిగిన గాంధీ – ఇర్విన్ ఒడంబడిక ప్రకారం గాంధీజీ విడుదల చేయబడగా, సత్యాగ్రహాన్ని నిలుపుదల చేశాడు. కాంగ్రెస్ ప్రతినిధిగా రెండవ అఖలపక్ష సమావేశానికి హాజరై ఆ సమావేశంలో ఏమి సాధించక రిక్తహస్తములతో తిరిగి వచ్చాడు. హరిజనులకు ప్రత్యేక నియోజకవర్గాలను కేటాయిస్తూ బ్రిటన్ కమ్యూనల్ అవార్డును ప్రకటించింది. దీనికి నిరశిస్తూ గాంధీజీ ఆమరణ దీక్షకు పూనుకున్నాడు. చివరకు పూనా ఒడంబడికతో ఈ సమస్య పరిష్కారమైంది. రెండో ప్రపంచయుద్ధంలో భారత్‌ను యుద్ధంలో దించడానికి నిరసనగా వ్యక్తి సత్యాగ్రహాన్ని నిర్వహించాడు. 1942లో క్రిప్సు రాయబారం విఫలమగుటతో "స్వాతంత్ర్యమో లేక మరణమో" అను నినాదంతో క్విట్ ఇండియా పిలుపునిచ్చాడు. ఈ పిలుపు వినగానే బ్రిటిష్ ప్రభుత్వం గాంధీజీని 'ఆగాఖాన్' ప్యాలెస్‌లో నిర్బంధించింది. ఈ జైలులో ఉండగానే కస్తూరీబాయి మరణించింది. అధికార బదిలీలో ఏర్పడ్డ సంక్షోభాన్ని పరిష్కరించడానికి జిన్నాతో సమావేశమయ్యాడు, మంత్రిత్రయ రాయబారంతో చర్చలు జరిపాడు. జిన్నా ప్రత్యక్ష చర్యా దినోత్సవం పిలుపు వలన మత కలహాలు చెలరేగిన నౌఖాలి, బీహార్‌లలో పర్యటించాడు. స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత మతసామరస్యం కోసం నిరాహారదీక్ష చేపట్టాడు. దురదృష్టవశాత్తు 1948, జనవరి 30వ తేదీన హత్యకు గురయ్యాడు.

1919-1947 సంవత్సరాల మధ్య కాలంలో మకుటం లేని మహారాజుగా వెలుగొందిన గాంధీజీ దేశానికి, ప్రజలకు చేసిన సేవలు చిరస్మరణీయం. శాంతి, అహింసా మార్గం, ఖాదీ ఉద్యమం, జాతీయ విద్య, మద్యపాన నిషేధం, లౌకికతత్వం, గ్రామ స్వరాజ్యం, అక్షరాస్యత, హరిజనోద్ధరణ – మున్నగు ప్రజాహిత ఆశయాల కోసం అహర్నిశలు పాటుపడ్డాడు. హిందూ ముస్లిం సమైక్యత కోసం జీవితాంతం కృషి చేసిన తన ప్రాణాలనే పోగొట్టుకున్నాడు. గృహాలకే

పరిమితమైన స్త్రీలకు చైతన్యవంతం చేసి వారిని జాతీయోద్యమంలో పాల్గొనునట్లు చేశాడు.

గాంధీజీ భావాలు భారతీయులనేగాక యావత్ ప్రపంచాన్ని ప్రభావితం చేసింది. హింసామార్గంకంటే శాంతి, అహింసా మార్గముల ద్వారానే ఏమైనా సాధింపవచ్చునని విశ్వమానవాళికి చాటిన మహాపురుషుడు. గాంధీజీ ఆయన 'Hind Swaraj, My Experiments with Truth' (స్వీయ చరిత్ర), అనే గ్రంథాలు రాశాడు. మనం ఆయనను 'జాతిపితగా' (Father of the Nation)యని భావిస్తే జె.హెచ్. హోమ్స్ 'ఏసుక్రీస్తు అనంతరం ప్రపంచం కనివినీ ఎరుగని మహామనిషి' – గాంధీజీ యని కీర్తించాడు.

## 64.18 మహమ్మద్ ఆలీ జిన్నా (1875–1948) :

పాకిస్తాన్ నిర్మాతయైన మహమ్మద్ ఆలీజిన్నా 1875 అక్టోబర్ 30వ తేదీన కరాచీలో జన్మించాడు. ఇంగ్లండ్ వెళ్ళి న్యాయశాస్త్రంలో పట్టాపుచ్చుకున్నాడు. ఇంగ్లండ్‌లో దాదాబాయి నౌరోజీతో పరిచయం ఏర్పడి, ఆయన వలన ప్రభావితుడై 1906లో ఆయనకు ప్రైవేటు కార్యదర్శిగా నియమితుడైనాడు. తొలుత సురేంద్రనాథ్ బెనర్జీ, గోఖలే, నౌరోజీల ఆశయాల వలన ప్రభావితుడై లౌకికవాదిగా రాజకీయ జీవితాన్ని ప్రారంభించాడు. కాని ఆ తరువాత సర్‌సయ్యద్ అహ్మద్‌ఖాన్, ఇక్బాల్ భావాలకు బాగా ఆకర్షితుడయ్యాడు.

జిన్నా రాజకీయ జీవితాన్ని నాల్గుదశలుగా విభజించవచ్చును.

1. 1906–1920 సంవత్సరాల మధ్య జిన్నా జాతీయవాది, లౌకికవాది, దేశ సమైక్యవాది.

2. 1920–1928 సంవత్సరాల మధ్య కాంగ్రెస్‌కు దూరమగుతున్నా సమైక్యతవాదిగా, లౌకికవాదిగానే యున్నాడు.

3. 1928–1937 సంవత్సరాల మధ్య జిన్నాలో మార్పు వచ్చింది. 1906లో ఏర్పడ్డ ముస్లింలీగ్‌కు దగ్గరై వేర్పాటువాదంవైపు మొగ్గుచూపుతున్నాడు. 4. 1937–47 సంవత్సరాల మధ్య ముస్లింలీగ్‌కు తిరుగులేని నాయకుడై, ద్విజాతి సిద్ధాంతాన్ని ప్రకటించాడు. మతోన్మాదియై, ప్రత్యేక ముస్లిం రాజ్యమైన పాకిస్తాన్‌ను సాధించాడు.

జిన్నా 1906–1920 సంవత్సరాల మధ్య హిందూ – ముస్లిం సమైక్యతను కాంక్షించిన లౌకికవాది. ముస్లింల ప్రత్యేక నియోజకవర్గానికి కేటాయించిన బొంబయి నుండి, 1910లో కేంద్ర శాసనసభకు ఎన్నికైనాడు. శాసనసభలో ఉదారవాదిగా వ్యవహరించాడు. రౌలత్ బిల్లులు చట్టరూపందాల్చగానే వానిని నల్లచట్టాలుగా అభివర్ణించి, వానికి వ్యతిరేకంగా తన శాసనసభ సభ్యత్వానికి రాజీనామా చేశాడు.

1920–1928 సంవత్సరాల మధ్య కాంగ్రెస్ ప్రారంభించిన సహాయ నిరాకరణోద్యమానికి మద్దతునీయగా జాతీయ కాంగ్రెస్ నుండి వైదొలగాడు. 1927లో 14 సూత్రాలు తన కనీస కోర్కెలుగా కాంగ్రెస్‌కు ప్రతిపాదించాడు. ఇందులో ప్రత్యేక ముస్లిం రాజ్య ప్రస్తావన కాంగ్రెస్‌కు రుచింపలేదు. జిన్నా నేతృత్వంలో ముస్లింలీగ్ (1928)న సైమన్ బహిష్కరణోద్యమంలో పాల్గొంది. 1928లో ఇంగ్లండ్ వెళ్ళి ప్రివి కౌన్సిల్‌లో న్యాయవాదిగా ప్రాక్టీసు చేశాడు. 1936లో ఇండియాకు తిరిగివచ్చి ముస్లింలీగ్‌కు నాయకత్వం వహించి దేశ రాజకీయాలలో కీలకపాత్ర పోషించాడు.

1935 భారత ప్రభుత్వ చట్ట ప్రకారం 1937లో కేంద్ర, రాష్ట్ర శాసనసభలకు ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికలలో ముస్లింలీగ్ ఘోర పరాజయాన్ని చవిచూసింది. లీగ్‌కు ప్రజలలో సత్సంబంధాలు లేకపోవడం, ముస్లిం

నాయకులలోని విభేదాలు ఈ ఓటమికి దోహదం చేశాయి. ఇట్టి స్థితిలో జిన్నా ముస్లింలీగ్‌కు తిరుగులేని నాయకుడై దానిని పునరుజ్జీవింప చేయుటేగాక, పునర్నిర్మించి బలీయమైన సంస్థగా తీర్చిదిద్దాడు.

1937 తరువాత ముస్లింలీగ్ ముఖ్యంగా జిన్నా వైఖరిలో అనూహ్యమైన మార్పు వచ్చింది. 1940లు ముస్లింలీగ్ లాహోర్‌లో సమావేశమై ద్విజాతి సిద్ధాంతాన్ని ప్రవచించి, ప్రత్యేక ముస్లిం రాజ్యమైన పాకిస్తాన్ సాధనే తమ లక్ష్యంగా తీర్మానించింది. ఇట్టి జిన్నా సంకుచిత మత రాజకీయాల వలన వేవల్ ప్రణాళిక, మంత్రిత్రయ రాయబార ప్రతిపాదనలు రాజకీయ సమస్యను పరిష్కరించుటలో విఫలమైనాయి. రాజ్యాంగ పద్ధతుల ద్వారా పాకిస్తాన్ సాధించుట దుర్లభమని, ప్రత్యక్ష చర్య దినోత్సవ పిలుపునిచ్చి హిందువులపై దాడులు ప్రారంభించెను. జిన్నా ప్రత్యక్ష చర్యలకు పాల్పడ్డాడు. జిన్నా పద్ధతులతో విసిగివేసారి, తుదకు కాంగ్రెస్ దేశ విభజనను అంగీకరించింది. 1947 ఆగస్టు 15న పాకిస్తాన్ అను ముస్లిం రాజ్యం ఏర్పడింది. ఆయన 'ఖయిద్-ఇ-అజమ్" (Quaid-I-Azam)గా కీర్తింపబడ్డాడు. జిన్నా కలలు ఫలించాయి. కాని పాకిస్తాన్‌ను పూర్తిగా పునర్నిర్మించకముందే జిన్నా 1948, సెప్టెంబరు 10వ తేదీన మరణించాడు.

## 64.19 సర్దార్ వల్లభాయ్ పటేల్ (1875-1950) :

సమైక్య భారత నిర్మాణ స్వాతంత్ర్య పరిరక్షకుడు, వజ్ర సంకల్పుడైన వల్లభాయ్ పటేల్ 1875 అక్టోబరు 31వ తేదీన గుజరాత్‌లోని నాదియాడ్ (Nadiad)లో జన్మించాడు. ఇంగ్లండ్ వెళ్ళి బారిస్టర్ పట్టా పుచ్చుకొని 1915లో స్వదేశానికి తిరిగి వచ్చి అహ్మదాబాద్‌లో న్యాయవాద వృత్తినిచేపట్టాడు. 1916లో గాంధీజీతో పరిచయమేర్పడి ఆయన అనుచరుడుగా మారాడు. పటేల్ నీతి నిజాయితీలు, పట్టుదలకు గాంధీజీ ముగ్ధుడయ్యాడు.

1917లో వల్లభాయ్ పటేల్ అహ్మదాబాద్ మున్సిపల్ కౌన్సిలర్‌గాఎన్నికయ్యాడు. 1924-28 సంవత్సరాల మధ్య అహమ్మదాబాద్ మునిసిపాలిటీ అధ్యక్షుడుగా పనిచేసి, ఆ నగర సర్వతోముఖాభివృద్ధికి ఎనలేని కృషిచేశాడు. 1917లో ప్లేగు వ్యాధి, 1918 కరువు సంభవించినపడు పటేల్ ప్రజల ఇక్కట్లను తొలగించే పునరావాస కార్యక్రమాలను చేపట్టారు.

గాంధీజీ సాన్నిహిత్యమేర్పడిన తరువాత ఆయన నేతృత్వంలో సాగిన ఖేడ, చంపారన్ రైతు ఉద్యమాలలో, అహ్మదాబాద్ మిల్లు కార్మికుల సమ్మెలో పటేల్ పాల్గొన్నాడు. 1920లో న్యాయవాద వృత్తిని వదలి, సహాయ నిరాకరణోద్యమంలో చురుకుగా పాల్గొన్నాడు. విస్తృత పర్యటనలుచేసి బహిష్కరణ, స్వదేశీ భావాలను ప్రచారంచేశాడు.

పటేల్‌కు అఖండ కీర్తి ప్రతిష్టలను తెచ్చిపట్టినది 1928 బార్డోలీ సత్యాగ్రహం. బీడు భూములపై ప్రభుత్వం విధించిన పన్నుకు నిరసనగా ఈ ఉద్యమం ప్రారంభమైంది. ఈ ఉద్యమ నిర్వహణలో ప్రభుత్వ అణచివేతకుపాల్పడినపుడు పటేల్ ప్రదర్శించిన ఓర్పు, సహనం యావత్ భారతాన్ని ఆకట్టుకుంది. తుదకు ప్రభుత్వం భూమి శిస్తును రద్దుచేసింది. ఈ విజయాన్ని అభినందిస్తూ గాంధీజీ పటేల్‌కు 'సర్దార్' బిరుదును ప్రసాదించాడు. నాటి నుండి వల్లభాయ్ పటేల్, సర్దార్ వల్లభాయ్ పటేల్‌గా గణనకెక్కాడు.

క్రీ.శ.1931లో కరాచీలో జరిగిన జాతీయ కాంగ్రెస్ సమావేశంలో అధ్యక్షుడయ్యాడు. 1935-40 సంవత్సరాల మధ్య కాంగ్రెస్ అధిష్టాన వర్గంనకు అధ్యక్షుడుగా వ్యవహరించి జాతీయ కాంగ్రెస్‌లో క్రమ శిక్షణను పెంపొందించాడు. 1941 వ్యక్తి సత్యాగ్రహంలోను, 1942 క్విట్ ఇండియా ఉద్యమంలోను పాల్గొన్నాడు. క్విట్ ఇండియా ఉద్యమం

సందర్భంగా గాంధీజీ, నెహ్రూ మున్నగు నాయకులతోబాటు పటేల్ అరెస్టయి అహమ్మద్‌నగర్ కోటలో జూన్, 1945 వరకు నిర్బంధింపబడ్డాడు. తాత్కాలిక ప్రభుత్వంలో దేశీయాంగ శాఖా మంత్రిగా పనిచేశాడు.

స్వతంత్ర భారతదేశంలో డిప్యూటీ ప్రధానియై, దేశీయాంగ శాఖ, సమాచార శాఖా మంత్రిగా పదవీ బాధ్యతలు చేపట్టాడు. 1947 ఆగస్టు 15 నాటికి స్వతంత్రమైన సుమారు 560 స్వదేశీ సంస్థానాలను భారత్‌లో విలీనం చేయుట, పటేల్ కార్యదీక్షకు, రాజనీతిజ్ఞతకు నిదర్శనం. కనుకనే ఆయన 'ఇండియన్ బిస్మార్క్'గా, 'ఉక్కు మనిషిగా' (Iron man of India) ప్రసిద్ధికెక్కాడు.

పటేల్ గొప్ప పాలనా దక్షుడు. దేశ విభజనవలన ఉత్పన్నమైన సమస్యలను అనగా శరణార్థులు, శాంతి భద్రతుల, మత కలహాలు – మున్నగు సమస్యలను సమర్థవంతంగా ఎదుర్కొన్నాడు. ఆంగ్లపాలనలోనున్న ఇండియన్ సివిల్ సర్వీస్ రద్దుచేసి (ఐసిఎస్), ఐఎఎస్ (ఇండియన్ ఎడ్మినిస్ట్రేటివ్ సర్వీస్) అనే అఖిల భారత సర్వీసును ప్రవేశపెట్టాడు. సమైఖ్య భారత నిర్మాతగా ఆయన చేసిన సేవలు చిరస్మరణీయం.

## 64.20 సరోజినీ నాయుడు (1879–1949) :

సరోజినీ నాయుడు ప్రముఖ శాస్త్రవేత్త అఘోర నాథ ఛటోపాధ్యాయ ప్రథమ కుమార్తె. 1879, ఫిబ్రవరి 13న హైదరాబాద్‌లో జన్మించి, పన్నెండవ ఏటనే మెట్రిక్యులేషన్ పరీక్షలో ప్రథమరాలుగా ఉత్తీర్ణురాలయ్యెను. ఇంగ్లండ్ వెళ్ళి, కింగ్స్ కళాశాలలోను, కేంబ్రిడ్జిలోని గిర్టన్ కళాశాలలోను విద్యనభ్యసించి, ఆంగ్ల సారస్వతంపై మక్కువతో గద్య రచనలుచేసింది. ఆమెది శ్రావ్యమైన గొంతు. కనుకనే ఆమెకు 'భారత కోకిల' (Nightingale of India) యనిపిలిచారు. 1917 నుండి భారత రాజకీయాలపై దృష్టి సారించింది.

గోఖలే పిలుపునందుకొని బెంగాల్‌లో విభజనకు వ్యతిరేకంగా కలకత్తాలో 1907లో సమావేశమైన జాతీయ కాంగ్రెస్ సమావేశానికి హాజరైంది. ప్లేగు వ్యాధి బారిన పడినవారికి సేవచేసి "కైజర్–ఇ–హింద్' అనే బంగారు పతకాన్ని పొందింది. 1915–1918 సంవత్సరాల మధ్య అనిబిసెంట్, సిపి రామస్వామి అయ్యర్‌తోపాటు ఆమె యావత్ భారతాన్ని పర్యటించి జాతీయవాదం, స్త్రీ విమోచన, యువత సంక్షేమం, కార్మికుల గౌరవం, మున్నగు అంశాలపై ఉపన్యాసము లిచ్చి ప్రజలను చైతన్యవంతులను చేసింది. తొలిసారిగా ఆమె 1916 లక్నో కాంగ్రెస్ సమావేశంలో కలిసింది. ఈ సమావేశంలో స్వీయ ప్రభుత్వ తీర్మానాన్ని సమర్థిస్తూ అనర్గళంగా మాట్లాడి అందరి దృష్టిని ఆకర్షించింది. 1925లో కాన్పూర్‌లో జరిగిన కాంగ్రెస్ సమావేశానికి అధ్యక్షురాలిగా ఎంపికైంది. జాతీయ కాంగ్రెస్ అధ్యక్ష పదవినలంకరించిన తొలి భారతీయ మహిళ – సరోజినీ నాయుడు. మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలిలో రెండవది.

1917–1919 సంవత్సరాల మధ్య కాలంలో ఆమె జాతీయోద్యమంలో చురుకుగా పాల్గొంది. రౌలత్ బిల్లులకు వ్యతిరేకంగా, ఖిలాఫత్ సమస్యకు మద్దతుగా ప్రచారం చేసింది. 1919లో గాంధీజీకి కుడి భుజమై సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొంది. జలియన్ వాలాబాగ్ దురంతాలు, అమృత్‌సర్‌లో ప్రవేశపెట్టిన సైనిక శాసనాన్ని దుయ్యబట్టుతూ చేసిన ప్రసంగాలలో అసమాన ధైర్య సాహసాలను ప్రదర్శించుచు జలియన్ వాలాబాగ్ మారణకాండను నిరసిస్తూ ప్రభుత్వం తనకు ప్రసాదించిన "ఖైజర్–ఇ–హింద్'ను త్యజించింది. 1919లో అఖిల భారత హోమ్ రూల్ ప్రతినిధిగా ఇంగ్లండ్ వెళ్లింది.

స్వదేశానికి తిరిగిరాగానే (1919) బొంబాయిని కేంద్రంగా చేసుకొని తన కార్యకలాపాలను కొనసాగించింది. బొంబాయి రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షురాలిగా జాతీయ శక్తులు బలవత్తరం చేసింది. 1922లో సిల్కు వస్త్రములను త్యజించి ఖాదీ బట్టలను ధరించింది. హిందూ ముస్లిం సమైక్యతకు పాటుపడింది.

డొమీనియన్ ప్రతిపత్తి అంశంపై చర్చించటానికి గాంధీజీ, జిన్నా, పటేల్, మోతీలాల్ నెహ్రూలతో బాటు ఆమె రాజప్రతినిధియగు ఇర్విన్‌ను కలిసింది. రెండవ అఖిల పక్ష సమావేశానికి హాజరై కమ్యూనల్ అవార్డ్‌ను వ్యతిరేకించింది. అనేక పర్యాయాలు జైలు కెళ్ళింది. 1942లో ఆగాఖాన్ పాలస్‌లో నిర్బంధింపబడింది.

స్వతంత్ర భారతదేశంలో గవర్నర్ పదవిని పొందిన తొలి మహిళ సరోజినీ నాయుడు. ఆమె ఉత్తర ప్రదేశ్ గవర్నర్‌గా మరణించువరకు అనగా మార్చి 2, 1949 వరకు వ్యవహరించింది. 'ఆమె జాతీయోద్యమంలో పద్యాన్ని, నేర్పరితనాన్ని ప్రవేశపెట్టిందని' నెహ్రూ ఆమె మరణ వార్త వినగానే వ్యాఖ్యానించాడు.

## 64.21 సుబాస్ చంద్రబోస్ (1897-1945) :

సుబాస్ చంద్రబోస్ 1897లో కటక్‌లో జన్మించాడు. స్కాటిష్ చర్చి కళాశాలలో విద్యనభ్యసించిన పిమ్మట ఐసిఎస్ పరీక్షకు హాజరుకావడానికి ఇంగ్లండ్ వెళ్ళి, ఆ పరీక్షలో నాల్గవ ర్యాంకును సాధించాడు. జలియన్ వాలా బాగ్ దురంతంవలన కలత చెంది తన అప్రంటీసు శిక్షణా కాలాన్ని కూడా పూర్తి చేయలేదు. గాంధీజీ పిలుపునందుకొని ప్రభుత్వ ఉద్యోగానికి రాజీనామా చేసి సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నాడు.

ఆయన చిత్తరంజన్‌దాస్ భావాల వలన ప్రభావితుడైనాడు. సహాయ నిరాకరణోద్యమాన్ని నిలుపుదల చేయటాన్ని తీవ్రంగా గర్హించాడు. స్వరాజ్య పార్టీ స్థాపనలో, నిర్వహణలో చిత్తరంజన్ దాస్‌కు చేయూత నిచ్చాడు. ప్రిన్స్ ఆఫ్ వేల్స్ పర్యటన సందర్భంగా బహిష్కరణోద్యమాన్ని నిర్వహించాడు. కలకత్తా కార్పొరేషన్ ముఖ్య కార్యనిర్వహణాధికారిగా సమర్థవంతంగా పనిచేశాడు. విప్లవ కార్యకలాపాలలో పాల్గొన్నందుకు మూడు సంవత్సరాలపాటు మాండలే జైలులో శిక్ష అనుభవించాడు. జైలు నుండి విడుదల కాగానే బెంగాల్ రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడై సంపూర్ణస్వరాజ్య సాధనే లక్ష్యంగా ఎంచుకొన్నాడు. నెహ్రూ నివేదికలో (1928) సూచించిన డొమీనియన్ ప్రతిపత్తిని త్రోసిపుచ్చాడు. ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ (Indian Independence Leegue)ను స్థాపించి యువతకు విప్లవ నాయకుడైనాడు.

1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని అరెస్టు అయ్యాడు. గాంధీ ఇర్విన్ ఒడంబడిక (1931)ను తీవ్రంగా వ్యతిరేకించాడు. కొన్నాళ్ళు దేశ బహిష్కరణకు గురి అయ్యాడు. 1938లో హరిపూర్ కాంగ్రెస్ సమావేశానికి అధ్యక్షుడుగా ఎన్నికైనాడు. కాని 1939లో అప్పుడు కాంగ్రెస్ అధ్యక్ష పదవికి బోస్‌నుగాకుండా పట్టాభిసీతారామయ్య చేయాలని గాంధీజీ నిర్ణయించాడు. కాని బోస్ జనరల్ ఎన్నికలలో పోటీ చేసి గెలుపొందాడు. బోస్ 1938, అక్టోబర్‌లో జాతీయ ప్రణాళికా కమిటీని (National Planning Committee) స్థాపించాడు. గాంధీజీతో విభేదాలవలన బోస్ కాంగ్రెస్ అధ్యక్ష పదవికి, కాంగ్రెస్‌కు రాజీనామా చేశాడు.

1939లో ఫార్వర్డ్ బ్లాక్‌ను స్థాపించి, రామ్‌ఘర్‌లో స్వరాజ్యాలపై రాజీలేని పోరాట సమావేశాన్ని (Anti - Compromise Conference) ఏర్పాటుచేశాడు. రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభంకాగానే దోపిడీ బ్రిటిష్ ప్రభుత్వానికి

ఎట్టి ధన, సైనిక సహాయం చేయరాదని పిలుపునిచ్చాడు. తాత్కాలిక జాతీయ ప్రభుత్వాన్ని తక్షణమే నెలకొల్పాలని బ్రిటిష్ వారిని కోరాడు.

హాల్‌నెల్ ఉద్యమంలో పాల్గొన్నందుకు బోస్ పై గృహ నిర్బంధం విధింపబడింది. కాని బోస్ గృహం నుండి తప్పించుకొని ఆఫ్ఘనిస్తాన్, ఇటలీ మీదుగా జర్మనీ చేరాడు. అచట నుండి జపాన్ చేరి, నాటికే ఆగ్నేయాసియాలో స్వాతంత్ర ఉద్యమాన్ని నడుపుతున్న రాష్ బిహారీ బోస్ నుండి నాయకత్వం స్వీకరించాడు.

జాతీయ సైన్యాన్ని పునర్వ్యవస్థీకరించి (అజాద్ హింద్ ఫౌజ్) జపాన్‌కు చిక్కిన భారతీయ యుద్ధ ఖైదీలను అందుచేర్చుకున్నాడు. అండమాన్, నికోబార్ దీవుల రాజ్యంగా అజాద్ హింద్ విప్లవ ప్రభుత్వాన్ని స్థాపించాడు. 1944 జనవరిలో 'ఛలో ఢిల్లీ' 'జైహింద్' అనే నినాదాలతో జపాన్ సాయంతో భారతదేశాన్ని విముక్తి చేయటానికి బర్మా అనే నినాదాలతో జపాన్ సాయంతో భారతదేశాన్ని విముక్తి చేయటానికి బర్మా సరిహద్దు దాటి, కొహిమా, ఇంఫాల్‌కు చేరుకొని త్రివర్ణ జాతీయ పతాకాన్ని ఎగురవేశాడు. కాని రెండవ ప్రపంచ యుద్ధంలో జపాన్ ఓటమిపాలగుటచే నేతాజీ భారతదేశ విముక్తికై సాగించిన పోరాటం అర్ధంతరంగా నిలిచిపోయింది. తుదకు ఆయన జాగకూడాసరిగా తెలియరాలేదు.

1945 ఆగస్టు 18వ తేదీన తైవాన్ (ఫార్మోజా) వద్ద జరిగిన విమాన ప్రమాదంలో మరణించాడని భావిస్తున్నారు. స్వాతంత్ర పోరాటంలో ఆయన ప్రదర్శించిన ధైర్యసాహసాలు మరపురానివి. కనుకనే భారతీయుల హృదయాలలో 'నేతాజీ' నిలిచిపోయాడు.

## 64.22 సుబ్రమణ్య భారతి (1882-1921) :

సుబ్రమణ్య భారతి తమిళనాడులోని అరుశ్వులి జిల్లాలోని ఎట్టయపురం గ్రామంలో 1882, డిసెంబరు 11న జన్మించాడు. ఉపాధ్యాయుడుగా జీవితాన్ని ప్రారంభించి, మద్రాసు నుండి వెలువడే 'స్వదేశీమిత్రన్' పత్రికలో చేరి వ్యాసాలు రాశాడు. ఆయన గొప్ప కవి, పండితుడు. ఆయన గేయాలు తమిళనాడులో దేశభక్తిని రగులుకొల్పాయి.

సుబ్రమణ్య భారతికి అతివాద ఉద్యమంతో సంబంధాలున్నాయి. బ్రిటిష్ వారి వేధింపులకు దూరంగా ఉండుటకు 1908లో పాండిచేరి వెళ్ళి అచట పది సంవత్సరాలు గడిపాడు. ప్రవాస జీవితంలో విసిగి తిరిగి బ్రిటిష్ ఇండియాకుచేరి, మరల 'స్వదేశీ మిత్రన్'లో చేరాడు. 1917లో తనే స్వయంగా 'ఇండియా' అనే పత్రికను స్థాపించి ఆంగ్లేయుల సామ్రాజ్యవాదాన్ని ఖండిస్తూ రచనలు సాగించాడు.

సుబ్రమణ్య భారతి గొప్ప జాతీయవాది, తమిళ సాహిత్యంలో నూతన ఒరవడిని సృష్టించిన మహాకవి, పండితుడు.

కనుకనే ఆయన 'ఆధునిక తమిళ శైలి పిత' (Father of Modern Tamil Style)గా ప్రస్తుతింపబడ్డాడు. భారతీయుల ప్రాంతీయ విభేదాలను విస్మరించి సమైక్య భారతదేశ నిర్మాణం చేయాలని పదేపదే తన రచనలో ఉద్ఘాటించాడు. మనం భారత మాత బిడ్డలం, అందరం కలసి మెలసి, భారతదేశానికి బంగారు భవిష్యత్‌ను సాధించే దిశగా కృషి చేయాలని ఆకాంక్షించాడు. భారతమాతను గూర్చి భారతి ఈ క్రింది పద్యాన్ని రాశాడు.

"ఆమెకు ముప్పది కోట్ల (ప్రజలు) ముఖాలు,

కాని హృదయం ఒక్కటే.

ఆమె పదునెనిమిది భాషలు మాట్లాడుతుంది.

కాని ఆమె మనస్సు ఒక్కటే.

ఇట్లు ఆయన జాతీయ సమైక్యతకు అహర్నిశలు కృషి చేశాడు.

## 64.23 వినాయక్ దామోదర్ సవార్కర్ (1883-1966) :

క్రీ.శ.1883లో జన్మించిన వినాయక్ దామోదర్ సావార్కర్ విప్లవవాది, కవి, పండితుడు, సంఘ సేవకుడు. 1897లో ప్లేగు వ్యాధి ప్రబలినపుడు ఆంగ్ల ఉద్యోగియైన రాండ్ అమానుష ప్రవర్తనను గాంచి చాపేకర్ సోదరులు అతనిని చంపారు. తదుపరి చాపేకర్ సోదరులు ఉరితీయబడ్డారు. ఈ సంఘటన వలన ప్రభావితుడై తాను కూడా చాపేకర్ సోదరుల మాదిరిగా దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడాలని సవార్కర్ నిర్ణయించుకున్నాడు.

దేశ స్వాతంత్ర్యం కోసం, అవసరమైతే సాయుధ పోరాటాన్ని సాగించటానికి 1899లో మిత్రమండల్ అను సంస్థను స్థాపించాడు. 1900లో పునాలోని ఫెర్గూసన్ కళాశాలో చేరి, అచట యువకులను దేశభక్తి పరాయణులుగా తీర్చిదిద్ది, సాయుధ పోరాట లక్ష్యాలను వివరించాడు. సెలవులలో మహారాష్ట్రలోని భిన్న ప్రాంతాలలో పర్యటించి యువతను మాతృదేశ విముక్తికై ఎట్టి త్యాగానికైనా సిద్ధం కావాలని ప్రమాణం చేయించాడు.

యావత్ భారత్‌లో పర్యటిస్తూ 'మిత్రమండల్‌ను, అభినవ భారత్'గా మార్చాడు. ఉపకార వేతనంతో విద్యాభ్యాసానికై ఇంగ్లండ్ వెళ్ళి అచట భారతీయ విద్యార్థులందరినీ కలసి 'Free India Society'ని స్థాపించాడు. ఈ సంస్థ విప్లవ కార్యకలాపాలకు కేంద్రమైంది. ఈ సంస్థ సభ్యులు బాంబులను ఎలా తయారుచేయాలో రాసిన పుస్తక ప్రతులను భారత్‌కు పంపేది. మాజినీ రచనలను సవార్కర్ మరాఠీ భాషలోనికి అనువదించాడు.

సవార్కర్ 1857 తిరుగుబాటును 'ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం'గా అభివర్ణించాడు. 'ఇండియన్ సోషలిస్టు' 'తల్వార్' అను పత్రికలలో విప్లవ భావాలు వ్యక్తం చేస్తూ వ్యాసాలు రాశాడు. వీనినే కలకత్తా నుండి వెలువడే 'యుగంతర్', బొంబాయి నుండి వెలువడే 'విహరీ' పత్రికలు అనువదించి ప్రచురించేవి. ఆయన అనేక నాటకాలు, పద్యాలు, నవలలు వ్రాశాడు. నవలలో ముఖ్యమైనవి – 'కాలాపానీ, మోప్లా తిరుగుబాటు'.

లండన్‌లో గద్దర్‌పార్టీ వ్యవస్థాపకుడైన లాలా హరదయాళ్‌ను సవార్కర్ కలిశాడు. 1910లో సవార్కర్ అరెస్టు చేయబడి ఇండియాకు పంపబడ్డాడు. దారిలో ఫ్రాన్సు దేశంలోని మార్సైల్స్ వద్ద సవార్కర్ తప్పించుకొని పోవటానికి యత్నించి పట్టుబడ్డాడు. ఇందుకు అతనికి అండమాన్ దీవుల్లో జీవిత జైలు శిక్ష విధింపబడింది. 1924లో రత్నగిరి జిల్లాను వదలివెళ్ళరాదను షరతుతో విడుదల చేయబడ్డాడు. 1924-37 సంవత్సరాల మధ్య రత్నగిరి జిల్లాలో అంటరానితన నిర్మూలనకు, కుల వ్యవస్థకు వ్యతిరేకంగా సంఘ సంస్కరణోద్యమాన్ని నడిపాడు. రత్నగిరిలో హిందూ హహాసభ శాఖను ప్రారంభించాడు.

1937 నాటికి సవార్కర్‌పై నున్న ఆంక్షలన్నీ తొలగిపోయాయి. హిందూ మహాసభ అధ్యక్షుడుగా హిందూ మతోద్ధరణను, హిందూ సమాజ సంస్కరణకు తన శేష జీవితాన్ని అంకితం చేశాడు. గాంధీ హత్యతో సంబంధమున్నదను నేరారోపణ సవార్కర్‌పై మోపబడింది. న్యాయస్థానం ఆయనను నిర్దోషిగా ప్రకటించింది.

వీర సవార్కర్  జాతీయోద్యమానికి, సంఘ సంస్కరణకు, సమాజానికి చేసిన సేవలు మరపురానివి.

**సారాంశం :**

జాతీయోద్యమం బహుముఖ సమరం. కేవలం స్వరాజ్యసాధనకే గాక ఈ ఉద్యమం స్త్రీ విముక్తి కోసం, అంటరానితన నిర్మూలనకోసం, హిందూ – ముస్లిం సమైక్యత కోసం సైతం పోరాటం చేసింది.

గాంధీజీ నేతృత్వంలో జాతీయోద్యమ ప్రజా ఉద్యమంగా మారింది. కుల, మత, వర్గ, ప్రాంతీయ భేదములు లేకుండా యావత్ జాతిని ఈ ఉద్యమంలో పాల్గొనునట్లు చేసింది. మహిళలు సైతం చురుకుగా పాల్గొన్నారు.

ఈ ఉద్యమం భారత్‌ను రాజకీయంగా, ఆర్థికంగా, సామాజికంగా శక్తివంతమైన దేశంగా తీర్చిదిద్దాలని భావించింది. కరాచీ కాంగ్రెస్ సమావేశంలో దేశ ఆర్థిక ప్రగతికి ప్రణాళికల ఆవశ్యకతని సామ్యవాదాన్ని గ్రామ పునర్నిర్మాణాన్ని నొక్కి చెప్పింది. దాని కనుగుణంగానే స్వతంత్ర భారతదేశ ఆర్థిక విధానాలు రూపొందింపబడ్డాయి. ఈ ఉద్యమం లౌకిక తత్వాన్ని శక్తివంతం చేసింది. మత రాజకీయాలను సైతం వ్యతిరేకించినా దేశ విభజనను నిరవారింపలేకపోయింది.

ఈ ఉద్యమం విజయవంతం కావటానికి భిన్న ప్రాంతాల నాయకులు – అనగా గాంధీజీ, నెహ్రూ, తిలక్, బోస్, అజాద్ వంటి వారు ఎందరో నిస్వార్థ సేవ చేశారు.

**అభ్యాసం :**

1. గాంధీ యుగంలో జాతీయ ఉద్యమం ప్రజా ఉద్యమ స్వభావంను పరిశీలింపుము?
2. అంటరానితన నిర్మూలనలో గాంధీజీ, అంబేద్కర్‌లు వహించిన పాత్ర ఎట్టిది?
3. క్రితం పాఠంలోని అంశాలను దృష్టిలో నుంచుకొని స్త్రీ విముక్తికై జరిగిన ఉద్యమాన్ని సమీక్షించుము?
4. జాతీయ వాదులు అనుసరించి ఆర్థిక విధాన స్వభావమెట్టింది?
5. ఈ క్రింది వానికి లఘు వ్యాఖ్యలు రాయుము?

   1. సర్దార్ పటేల్  2. లాలా లజపతిరాయ్

   3. సరోజిని నాయుడు  4. బాలగంగాధర్ తిలక్.

   5. మౌలానా అజాద్.

**కార్యకలాపాలు :**

భారతదేశ రేఖాపటంలో జాతీయోద్యమంలోని ప్రముఖ స్థలాలను, ప్రముఖ జాతీయ కాంగ్రెస్ సమావేశాలు జరిగిన ప్రదేశాలను గుర్తింపుము?

# 65

# స్వాతంత్ర్యానంతర భారతదేశం

## 65.1 పరిచయం :

ఇంతకుముందే మీరు భారతదేశం, స్వాతంత్ర్యం కొరకు చేసిన అద్భుత పోరాటాన్ని గూర్చి చదవటం ముగించారు. దాదాపు 200సంవత్సరాల పాటు జరిగిన దోపిడీయుత వలసపాలన వలన దేశం అన్ని రంగాలలో అణగద్రొక్కబడి అభివృద్ధి సాధించడంలో వెనుకబడింది. కాబట్టి స్వాతంత్ర్యం సాధించిన మీదట, స్వాతంత్ర్య పోరాట సమయంలో కలలుగన్న బలమైన రాజకీయ పునాదులు, పరిణతి చెందిన ఆర్థిక వ్యవస్థ మరియు ఆధునిక సామాజిక వ్యవస్థలు కలిగిన ఆధునిక భారతదేశ నిర్మాణం ఒక పెనుసవాలుగా మారిందనేది స్పష్టమయింది. క్రొత్తగా స్వేచ్ఛావాయువులు పీల్చుకున్న దేశం, అనేక ప్రయత్నాలు, కష్టనష్టాలకోర్చి ప్రస్తుతస్థాయికి చేరుకుంది. ఈ పాఠంలో మనం ఒక ప్రజాస్వామ్య గణతంత్ర విధానం ఏర్పాటు, రాష్ట్రాల పునర్వవస్థీకరణల ద్వారా భారత జాతీయ ప్రభుత్వ నిర్మాణం జరిగిన తీరును నేర్చుకుందాం. ఇంకా మనం, భారతదేశములో జరిగిన సామాజిక, ఆర్థిక పునఃనిర్మాణం, విదేశీవిధానం, చివరగా మన పొరుగు దేశాలతో గల సంబంధాలను గురించి కూడా తెలుసుకుందాం.

## 65.2 లక్ష్యాలు :

ఈ పాఠం అధ్యయనం చేసిన తర్వాత మీరు ఈ క్రింది విషయాలు తెలుసుకుంటారు

1. భారతదేశంలో ప్రజాస్వామ్య గణతంత్రం యొక్క (ప్రాధాన్యత) విశిష్టతను మదింపు చేయగల్గుట.
2. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కొరకు చేయబడిన రాజ్యాంగ ఏర్పాట్లను వివరించగల్గుట.
3. భారత రాజ్యాంగం ద్వారా సృష్టించబడిన వివిధ రకాల రాష్ట్రాలను గుర్తించగల్గుట
4. ఇంకనూ రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కొరకు చేస్తున్న నిరంతర ఆకాంక్షలను (demand) గుర్తించగల్గుట.
5. సామాజిక, మార్పుకు దోహదపడుతున్న కొన్ని కారకాలను చెప్పగల్గుట
6. జాతి నిర్మాణానికి దోహదం చేసే అతి ముఖ్య కారకాలలో సామాజిక పరిణామంను కూడా ఒక కారకంగా గుర్తించుట.

7. జాతీయ సమైక్యత ప్రాముఖ్యతను మదింపు చేయుట.

8. భారతదేశంలో స్వాతంత్ర్యానంతరం ప్రణాళికను తయారుచేయడంలో సాధించిన ప్రగతిని గుర్తించుట

9. ప్రపంచంలో శాంతి స్థాపనకు భారతదేశం, అలీనోద్యమం ద్వారా చేసిన కృషిని మదింపు చేయగల్గుట.

10. భారతదేశానికి, చైనా, పాకిస్థాన్ మరియు బంగ్లాదేశ్‌లతో గల ఇరుపక్షాల వివాదాలను గుర్తించుట.

11. భారతదేశానికి పొరుగు దేశాలతో గల తగవులను పరిష్కరించుకోవడంలో చూపిన చొరవను గుర్తుకు తెచ్చుకొనుట

## 65.3 భారతదేశం - ఒక ప్రజాస్వామిక గణతంత్ర రాజ్యం

(INDIA - A DEMOCRATIC REPUBLIC)

దీర్ఘకాలిక పోరాటం తర్వాత, మనం క్రీ.శ.1947లో స్వాతంత్ర్యం సంపాదించామని, ఆ తర్వాత మన చిరాకాల ఆదర్శాల కనుగుణంగా క్రొత్త రాజ్యాంగంను ఏర్పాటు చేసుకున్నాం అని మీరు చదివియున్నారు.

డా॥ బాబూ రాజేంద్రప్రసాద్ అధ్యక్షతన ఒక రాజ్యాంగ నిర్మాణసభ (Constituent Assembly) ఏర్పాటు చేయబడింది. రాజ్యాంగ నిర్మాణసభ(Constituent Assembly)మొదటి సమావేశం పార్లమెంట్ సెంట్రల్ హాల్‌లో, డిశంబర్ 9, 1946న 207 మంది సభ్యులతో జరిగింది.

ఆ సమయంలో భారతదేశంలో రాజకీయ పరిస్థితి చాలా ఆందోళనకరంగా ఉంది. జిన్నా రాజ్యాంగ నిర్మాణసభను బహిష్కరించి ప్రత్యక్షచర్య(Direct Action)ను ప్రకటించారు. ఈ పరిస్థితులలో లార్డు మౌంట్‌బాటన్ భారతదేశానికి వైస్రాయ్‌గా వచ్చారు. ఆయన భారతదేశ నాయకులను వాస్తవ పరిస్థితిని వివరించి సంతృప్తిపరిచాడు. ఆయన హామీతో, బ్రిటీష్ పార్లమెంట్‌ను భారతదేశాన్ని రెండు స్వతంత్ర దేశాలైన భారతదేశం మరియు పాకిస్థాన్‌లుగా విభజిస్తూ భారతదేశ స్వాతంత్ర్య చట్టంను ఆమోదింపచేశారు.

స్వాతంత్ర్యానంతరం రాజ్యాంగ నిర్మాణసభ మొదటి లక్ష్యం, జాతీయ లక్ష్యాలును నిర్ధేశించటం. క్రీ.శ.1947, జనవరి 22న రాజ్యాంగసభ పండిట్ జవహర్‌లాల్ నెహ్రూచే ప్రవేశపెట్టబడిన లక్ష్యాత్మక తీర్మానాన్ని ఆమోదించారు. భారతదేశంలోని ప్రతిపౌరుడికి ప్రాథమిక హక్కులు కల్పించడం అల్పసంఖ్యాక వర్గాలు(minorities) మరియు వెనుకబడిన వర్గాల వారికి ఈ హక్కుల కల్పనకు చర్యలు చేపట్టే సర్వసత్తాక ప్రజాస్వామిక గణతంత్రాన్ని (Sovereign Democratic Republic) స్థాపించాలని తీర్మానం చేశారు.

డా॥ బి.ఆర్ అంబేద్కర్ అధ్యక్షుడుగా రాజ్యాంగ ముసాయిదా కమిటీ భారతదేశ రాజ్యాంగాన్ని రూపొందించే బృహత్ కార్యాన్ని పూర్తి చేశారు. నవంబర్ 4, 1948న రాజ్యాంగ సభలో ముసాయిదా ప్రవేశపెట్టబడింది. రాజ్యాంగం, అందరి సభ్యుల ఆమోదం పొంది వారు సంతకాలు చేసి, 1949 నవంబర్ 26న ఆమోదించినప్పటికీ వాస్తవంగా 1950 జనవరి 26నుండి మాత్రమే అమలులోకి వచ్చింది. రాజ్యాంగం అమలులోకి రావడంతో, భారతదేశం ఒక గణతంత్ర రాజ్యం(Republic)అయ్యింది. స్వతంత్ర భారతదేశానికి డా॥సి.రాజగోపాలాచారి మొదటి గవర్నర్ జనరల్ అయ్యారు. ఆ తర్వాత డా॥ రాజేంద్రప్రసాద్ భారత యూనియన్‌కు అధ్యక్ష స్థానాన్ని పొందారు.

**పీఠిక (నాందీప్రస్తావన)** (Preamble) :

రాజ్యాంగం, 'పీఠిక' అనుపేరుతో ఉపోద్ఘాతంతో మొదలవుతుంది. ఈ పీఠిక రాజ్యాంగం ఆశయాలు, లక్ష్యాలను ప్రకటిస్తుంది మరియు విశ్వాసం, ధర్మము(soul and spirit) లను అభివర్ణిస్తుంది. ఇది రాజ్యాంగకర్తల, భారత ప్రజల ఆశయాలను ప్రతిబింబిస్తుంది. ఇది ఈ క్రింది విధంగా రాయబడి ఉంది.

**రాజ్యాంగ పీఠిక (ప్రవేశిక)** (Preamble of the Constitution) :

"భారతదేశ ప్రజలమైన మేము భారతదేశాన్ని సర్వసత్తాక (సార్వభౌమ) సామ్యవాద, లౌకిక, ప్రజాస్వామ్య, గణతంత్ర రాజ్యంగా నిర్మించుకోవడానికి పౌరులందరికి సామాజిక, ఆర్థిక, రాజకీయ న్యాయాన్ని, ఆలోచన, భావప్రకటన, విశ్వాసం, ధర్మం, ఆరాధనా స్వాతంత్ర్యాన్ని హోదాలోను, అవకాశాల్లోను, సమానత్వాన్ని చేకూర్చుటకు వారందరిలో వ్యక్తి గౌరవాన్ని, జాతీయ సమైక్యతను సంరక్షిస్తూ, సౌభ్రాతృత్వాన్ని పెంపొందించడానికి 1949 నవంబర్ 26న మన రాజ్యాంగ పరిషత్తులో (రాజ్యాంగ నిర్మాణసభ) ఎంపిక చేసుకొని (ఆమోదించుకొని) శాసనంగా రూపొందించుకొన్న ఈ రాజ్యాంగాన్ని మాకు మేమే ఇచ్చుకున్నాం".

**భారతదేశం -ఒక సర్వసత్తాక ప్రజాస్వామ్య గణతంత్ర రాజ్యం**

ఇది సార్వభౌమాధికారం గలది(సర్వసత్తాకమైనది) ఎందుకంటే మనం అంతర్గతంగా, బాహ్యంగా కూడా స్వేచ్ఛను కలిగియున్నాము. భారతదేశంపై ఏ బాహ్యశక్తి అయినా నియంత్రణ చెలాయించలేదు. మన ప్రజాస్వామిక వ్యవస్థ, 'సార్వత్రిక వయోజన ఓటుహక్కు' అనే సూత్రంపై ఆధారపడింది. అనగా ప్రజలు తమ సార్వజనిక ఓటుహక్కును వినియోగించి తమ తరపున నిర్ణయాలను తీసుకొని, ప్రభుత్వాన్ని నడిపే ప్రతినిధులను ఎన్నుకుంటారు. భారతదేశాన్ని ఒక గణతంత్ర రాజ్యంగా చెప్పవచ్చు. ఎందుకంటే ఇచ్చట రాజ్యాధిపతిలేక అధ్యక్షుడు ఎన్నుకోబడతాడు. కానీ అనువంశికంగా ఈ పదవిని పొందినవాడు కాదు. రాజ్యాంగ పీఠికలో స్పష్టంగా పేర్కొన్న విధంగా, రాజ్యాంగాన్ని వారికి వారు సమర్పించుకున్న ఇచ్చటి ప్రజలు దేశంలో సార్వభౌమాధికారం కలవారు లేక సర్వోన్నతమైన వారుగా రాజ్యంగం పేర్కొంటుంది. పార్లమెంట్ యొక్క లోక్‌సభ లేక దిగువసభ, ప్రజలచేత ఎన్నుకోబడిన ప్రతినిధులచే ఏర్పాటు చేయబడుతుంది. ఈ ఏర్పాట్లన్నీ దేశం ప్రజాస్వామ్య నిబద్ధతను నిరూపించుచున్నవి.

మన రాజ్యాంగంలో పొందుపరచబడిన ప్రాధమిక హక్కులు, మన ప్రజాస్వామ్యాన్ని అర్ధవంతంగా చేశాయి.

**పార్లమెంట్ వ్యవస్థ :**

భారతదేశం ప్రజాస్వామ్య ప్రభుత్వం యొక్క పార్లమెంటరీ వ్యవస్థను చేపట్టింది. దీంట్లో పార్లమెంట్ లేక దేశ శాసన నిర్మాణశాఖకు (legislative)అత్యున్నతాధికారం (అంతిమాధికారం) ఉంటుంది. రాజ్యాంగ పరంగా అధిపతిగా అధ్యక్షుడు ఉంటాడు. ప్రజలచే ప్రత్యక్షంగా ఎన్నుకోబడిన ప్రధానమంత్రి అధికారాన్ని చెలాయిస్తాడు. ప్రజాప్రతినిధులచే ఏర్పడే పార్లమెంట్‌లోని దిగువ సభకు, ప్రధానమంత్రి, అతని మంత్రివర్గ సభ్యులు బాధ్యత వహిస్తారు. ఆవిధంగా మంత్రులందరూ సమిష్టిగా, వ్యక్తిగతంగా కూడా తమతమ చర్యలకు ప్రజలకు జవాబుదారీగా ఉంటారు. అత్యధిక స్థానాలు (మెజారిటీ) సాధించిన రాజకీయ పార్టీ నాయుకుడిని ప్రధానమంత్రిగా, రాష్ట్రపతి నియమిస్తాడు. కేంద్రం మరియు రాష్ట్రాలు కూడా పార్లమెంటరీ వ్యవస్థను అనుసరిస్తాయి.

**సమాఖ్య వ్యవస్థ** (Federal Structure)

భారత రాజ్యాంగంలో అనేక సమాఖ్య రాజ్య లక్షణాలున్నాయి. అధికరణం 1, భారతదేశాన్ని రాష్ట్రాల యూనియన్‌గా ప్రకటించింది. భారతదేశంలో రెండు రకాల ప్రభుత్వాలుంటాయి. కేంద్ర ప్రభుత్వం, ప్రతి రాష్ట్రంలో రాష్ట్ర ప్రభుత్వం ఉంటాయి. శాసనాలను నిర్మించే అధికారం ఈ రెండు ప్రభుత్వాలకు, మూడు జాబితాలు క్రింద ఉంటుంది. అవి: కేంద్ర జాబితా(Central list), రాష్ట్ర జాబితా (State list), ఉమ్మడి జాబితా(Concurrent list)లు. అన్ని ఇతర సమాఖ్య దేశాల్లాగానే, భారతదేశంలో కూడా ఒక సుప్రీంకోర్టు మరియు ఒక లిఖిత రాజ్యాంగం ఉన్నాయి. అయితే, ఇతర సమాఖ్యల్లాగా కాకుండా, భారతదేశంలో కేంద్ర ప్రభుత్వం ఎక్కువ అధికారాన్ని కలిగి ఉంది. కనుక భారతదేశం ఏకకేంద్ర లక్షణాలున్న సమాఖ్య రాజ్యం. కేంద్ర జాబితానందు ఎక్కువ అంశాలు పొందుపరచబడి ఉన్నాయి. కేంద్ర, రాష్ట్ర చట్టాల మధ్య ఏవైనా భేదాభిప్రాయాలు వస్తే, కేంద్రంచే చేయబడిన చట్టానికే అధిక ప్రాధాన్యముంటుంది. ఏదైనా అంశం రెండు జాబితాలలో లేకపోతే దానిపై అవశిష్టాధికారం(residuary power)కేంద్రానికే ఉంటుంది. రాష్ట్రాల యూనియన్ (Union of states) అనే పదం రాష్ట్రాలపై కేంద్రానికి గల గొప్ప అధికారాన్ని తెలియజేస్తుంది. రాష్ట్రపతికి గల అత్యవసర అధికారాలు కూడా కేంద్రాన్ని ఒక బలమైన వ్యవస్థగా రూపొందించాయి.

ప్రస్తుతం భారతదేశంలో 28 రాష్ట్రాలు, 7 కేంద్రపాలిత ప్రాంతాలు మరియు కేంద్రపాలిత ప్రాంతాలలో ఒకటైన ఢిల్లీ జాతీయ రాజధానిగా ఉన్నాయి. కేంద్రపాలిత ప్రాంతాలను ప్రత్యక్షంగా కేంద్రం ఒక లెఫ్టినెంట్ గవర్నర్ లేక చీఫ్ కమీషనర్ ద్వారా పరిపాలన సాగిస్తుంది.

## 65.4 భారత రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ :

మీరు ఇంతకు ముందు చదివినట్లుగా స్వాతంత్ర్యం రాకపూర్వం, భారత భూభాగం రెండు భాగాలుగా విభజింపబడింది. వాటిలో ఒక భాగం క్రింద బ్రిటీష్ పాలిత ప్రాంతాలు అనగా ఇవి బ్రిటీష్ పరిపాలకులచే ప్రత్యక్షంగా పరిపాలింపబడేవి. రెండవభాగం స్వదేశీ సంస్థానాధీశుల క్రింద ఉండేవి. అనగా ఇవి అంతర్గతంగా స్వతంత్రంగా పాలించుకుంటూ ఉన్నా విదేశీ వ్యవహారాలలో మాత్రం బ్రిటీష్ వారి పాత్ర చాలా ప్రముఖంగా ఉండేది.

ఈ స్వదేశీ సంస్థానాలు(Princely states)దేశమంతా వ్యాపించి ఉన్నాయి. అవి అనువంశిక రాజకుమారులచే పరిపాలించబడుతూ అధికారమంతా ఒకరి చేతులలో(autocracy) కేంద్రీకృతమై ఉండేది. ఆ రాజ్యాలు పరిమాణంలో గాని లేక స్థాయిలో గాని ఏకరీతిగా ఉండేవి కావు. హైదరాబాద్, జమ్మూ కాశ్మీం, మైసూర్ లాంటి పెద్ద రాజ్యాలతో పాటు, ఒరిస్సాలోని త్రిచార్(Trichar)లాంటి చాలా చిన్న రాజ్యాలుండేవి. ప్రజల సాధారణ పరిస్థితి ద్వారా దయనీయంగా ఉండేది. అనగా వారు బ్రిటీష్ వారి పాలనలో ఉన్నారా లేక స్వదేశీ సంస్థాన రాజకుమారుల పాలనలో ఉన్నారా? అనే సందేహం కలిగేది.

క్రీ.శ. 1947లో స్వాతంత్ర్యానంతరం, భారత స్వాతంత్ర్య చట్టం ద్వారా, స్వదేశీ సంస్థానాలకు అవి భారతదేశంతో గాని లేక కొత్తగా ఏర్పాటైన పాకిస్తాన్‌తో గాని విలీనమయ్యే స్వేచ్ఛ కల్పించబడింది. ఈ రాష్ట్రాలను సమైక్య భారతదేశం చట్టం(frame work)క్రిందకు తేవడం, భారతదేశాన్ని ఒక సర్వసత్తాక ప్రజాస్వామిక గణతంత్రంగా మార్చడం, ఈ పనిని విజయవంతంగా, శాంతియుతంగా ఎటువంటి ఘర్షణ, రక్తపాతాలు లేకుండా పూర్తి చేయడం ఒక సమస్య అయ్యింది.

సర్దార్ పటేల్ 1947 జూలైలో రాష్ట్రమంత్రి వర్గంలో చేరగానే, ఈ రాష్ట్రాలను భారతదేశంలో విలీనం చేయాల్సిన తక్షణ అవసరాన్ని గమనించారు. వీరు, దేశభక్తి మరియు జాతీయ భావాలు కలిగిన రాజకుమారులను భారతదేశంలో చేరమని, భారతదేశ రాజ్యాంగాన్ని తయారు చేయడంలో పాల్గొనడానికి, రాజ్యాంగసభకు వారి ప్రతినిధులను పంపమని అభ్యర్థించారు.

అదృష్టవశాత్తు కొన్ని రాజ్యాలు తప్ప, సంస్థానాలలో అధికభాగం స్వచ్ఛందంగా విలీనమై భారతదేశంలో అంతర్భాగం అయ్యాయి. విలీనం కాని వాటిలో ప్రముఖమైనవి హైదరాబాద్, జమ్మూ కాశ్మీర్ మరియు జునాగఢ్‌లు.

సర్దార్ పటేల్ తీవ్రమైన ప్రయత్నాల వల్ల చివరకు ఈ రాష్ట్రాలు కూడా విలీన ఒప్పందమైన (Instrument of Accession)అనబడే ఒప్పందంపై సంతకం చేయడానికి అంగీకరించాయి. జునాగఢ్ నవాబు పాకిస్తాన్‌కు పారిపోగా, ఆ ప్రాంత ప్రజలు 'రిఫరెండం' ద్వారా భారతదేశంలో విలీనమవ్వడానికి మొగ్గు చూపారు.

హైదరాబాద్ విషయానికి వస్తే, మతసంస్థ అయిన రజాకార్ సహకారంతో నిజాం మతహింసను ప్రోత్సహిస్తూ, ఉండేవాడు. 1948 సెప్టెంబర్ 30న భారతసైనిక దళాలు వారిని అణచడానికి పంపబడ్డాయి. గత్యంతరం లేక నిజాం, కేవలం నాలుగు రోజుల వ్యవధిలో విలీనమవడానికి అంగీకరించాడు.

జమ్మూ కాశ్మీర్‌కు చెందిన హిందూరాజు, రాజాహరిసింగ్, తమ ప్రాంతంపై దాడిచేస్తూ తమ భూభాగం లోకి చొచ్చుకొని వస్తున్న పాకిస్తాన్ చొరబాటుదార్లను తరిమికొట్టడానికి భారతీయ సైన్యం సహకార మందిస్తే, భారతదేశంలో విలీనమవడానికి ఒప్పుకున్నాడు. భారతప్రభుత్వం ఈ విషయాన్ని ఐక్యరాజ్య సమితికి విన్నవించగా, జనవరి 1949లో కాల్పుల విరమణ ప్రకటించబడింది. దీనితో జమ్ము కాశ్మీర్ సమైక్య భారతదేశంలో ఒక (భాగం) రాష్ట్రంగా ప్రకటించబడింది. అలా, సర్దార్ పటేల్ తన దౌత్యనీతితో, అత్యంత క్లిష్టమైన సమస్య అయిన భారతదేశంలో స్వదేశీ సంస్థానాల విలీనాన్ని అధిగమించడంలో సహాయపడినాడు.

## భాషా ప్రయుక్త రాష్ట్రాల కొరకు ఆందోళన

(Demand for linguistic states)

20వ శతాబ్దం మొదలయ్యే సరికి, భాషాప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు కోసం ఆందోళనలు మొదలయ్యాయి. అలా 1912లో బెంగాల్ ప్రెసిడెన్సీని (అ)అస్సాం (ఆ) బెంగాల్ (ఇ) బీహార్ మరియు (ఈ) ఒరిస్సాలుగా విభజింపబడినప్పటి నుండి మద్రాస్ ప్రెసిడెన్సీ నుండి తెలుగు మాట్లాడే ఆంధ్ర ఏర్పాటుకోసం, ఆంధ్ర మహాసభచే డిమాండ్ మొదలైంది. మొత్తం మీద బ్రిటీష్ ప్రభుత్వం భాషాపరంగా, భారతరాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ చేయడానికి అంగీకరించింది. అయితే అలాంటి పునర్వ్యవస్థీకరణ అంతకుముందెన్నడూ జరగలేదు.

ఈలోగా కాంగ్రెస్ భాషా ప్రయుక్త రాష్ట్రాల కొరకు డిమాండ్‌లను అంగీకరించి, క్రీ.శ.1920లో అది ఆయాచోట్ల మాట్లాడే భాషలను దృష్టిలో ఉంచుకొని 21 ప్రాంతీయ, కాంగ్రెస్ కమిటీలను సృష్టించింది. ఆయా ప్రాంతాల్లో ఒక ప్రత్యేక భాష మాట్లాడే వారందరూ ఒక ప్రత్యేక రాష్ట్రం ఏర్పరచుకునేందుకు మార్గం సుగమమైంది. బ్రిటీష్ ప్రభుత్వం వారు ఇప్పుడు భాషాప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు భావనకు అంగీకరించినట్లు కనిపించింది. ఇది భారత ప్రభుత్వ చట్టం 1935లో ప్రతిబింబించింది. ఆవిధంగా బీహార్, ఒరిస్సా రాష్ట్రం నుండి ఒరిస్సాను విడదీయడం, బాంబే ప్రెసిడెన్సీ

నుండి సింద్ ప్రాంతాన్ని వేరుచేయడం జరిగింది. భారతదేశం నుండి బర్మా విడిపోయి బ్రిటీష్ సామ్రాజ్యంలో భాగంగా ఒక ప్రత్యేక దేశంగా ఏర్పడింది.

1947లో బ్రిటీష్ పార్లమెంట్, భారత స్వాతంత్ర్య చట్టాన్ని చేసినప్పుడు అవిభక్త భారతదేశం 11 రాష్ట్రాలను కలిగి ఉంది. అవి : 1) అస్సాం 2) బెంగాల్ 3) బీహార్ 4) ఒరిస్సా 5) బాంబే 6) మద్రాస్ 7) యు.పి.(యునైటెడ్ ప్రావిన్సెస్) 8) సి.పి.(సెంట్రల్ ప్రావిన్స్) 9) పంజాబ్ 10) సింద్ 11) ఎన్.డబ్ల్యూ.ఎఫ్.పి (వాయువ్య సరిహద్దు ప్రాంతరాష్ట్రము)

వీనితోపాటు ఢిల్లీ, అజ్మీర్ మార్వార్ మరియు బ్రిటీష్ బెలూచిస్తాన్ లాంటి ప్రాంతాలు కేంద్ర ప్రభుత్వ ఆధీనంలో ఉన్నాయి. వీనిని ముఖ్య కమీషనర్ రాష్ట్రాలు (Chief Commissioner's Provinces) అని పిలిచేవారు. బ్రిటీష్ ఇండియాతోపాటు, అధిక సంఖ్యలో రాజకుమారులచే పరిపాలింపబడుతున్న సంస్థానాలు బ్రిటీష్‌వారి సార్వభౌమాధికారం క్రింద పనిచేసేవని మనం గమనించాం. 1947లో చేయబడిన భారత స్వాతంత్ర్య చట్టం, భారతదేశాన్ని రెండు స్వతంత్ర దేశాలైన భారతదేశం మరియు పాకిస్తాన్‌లుగా విభజించుటకు వీలు కల్పించింది క్రొత్తగా ఏర్పడిన పాకిస్తాన్, సింధ్, ఎన్.డబ్ల్యు.ఎఫ్.పి(వాయువ్యసరిహద్దు ప్రాంతం(NWFP)) బెలూచిస్తాన్, పశ్చిమ పంజాబ్, తూర్పు బెంగాల్ రాష్ట్రాలతో ఏర్పడవలసి ఉంది.

భారత స్వాతంత్ర్య చట్టం స్వదేశీ సంస్థానాధీశులకు భారతదేశం లేక పాకిస్తాన్‌లలో దేనిలోనైనా చేరే హక్కును కల్పించింది. అతి తక్కువ సమయంలో 562 సంస్థానాలు భారతదేశంలో విలీనమవడం మనం చూశాం.

రాజ్యాంగ సభ, రాజ్యాంగాన్ని తయారుచేయడంలో నిమగ్నమై ఉండగా భాషాపర సమస్యలు ప్రభుత్వానికి తలనొప్పిగా మారాయి. ఉదాహరణకు సెంట్రల్ ప్రావిన్స్‌లో హిందీ, మరాఠీ మాట్లాడే వారున్న ప్రాంతాల మధ్య, బాంబేలోని మరాఠీ, గుజరాతి మాట్లాడే ప్రాంతాల మధ్య, మద్రాస్‌లో తమిళం మరియు తెలుగు మాట్లాడే ప్రజల మధ్య మరియు దక్షిణ భారతదేశంలో తమిళులు మరియు మళయాళీల మధ్య ఘర్షణలు జరిగాయి. ఈ సమయంలో జాతీయ సమైక్యత, పునర్నిర్మాణాలు చాలా ముఖ్యఅంశాలైనందువల్ల నెహ్రూ, పటేల్, రాజాజీ కె.యం.మున్షీ, జయప్రకాష్ నారాయణ్ లాంటి నాయకులు కొంతకాలం వరకు భాషాప్రయుక్త విభజన వాయిదా వేయాలని నిర్ణయించారు. 1947 నవంబర్‌లో మహాత్మాగాంధీ కూడా భాషాపరంగా రాష్ట్రాల విభజన వల్ల దేశానికి కలిగే ప్రమాదం గురించి వివరించారు.

భాషాప్రయుక్త పునర్వ్యవస్థీకరణ ఒత్తిడిని నిరోధించలేని పరిస్థితి తలెత్తినపుడు, రాజ్యాంగసభ, తన అధ్యక్షునికి ఈ సమస్య గురించి నిశిత పరీక్ష జరపాలని అధికారాలిచ్చింది. దాని ప్రకారం డా॥ రాజేంద్రప్రసాద్, జూన్ 1948లో నలుగురు సభ్యులున్న కమీషన్‌ను ఏర్పాటు చేశారు. ఇది జస్టిస్ ఎస్.కె.ధార్ నాయకత్వంలో పనిచేసింది. దేశమంతటా విస్తృత పర్యటనలు జరిపి దాదాపు 1000కి పైగా విజ్ఞాపన పత్రాలు స్వీకరించిన మీదట ఈ కమీషన్ "భాషాపరంగా రాష్ట్రాల ఏర్పాటు అనేది భారతజాతి మనసుల్లో అంతగా పాతుకొనలేదు కాబట్టి దానికి ప్రాధాన్యత నివ్వవలసిన అవసరం లేదు" అని నివేదించింది. ఈ కమీషన్ నివేదిక ప్రజలలో తీవ్ర మనోవేదనకు దారితీసింది.

కాంగ్రెస్, 1948 డిశంబర్‌లో పార్టీస్థాయిలో జరిగిన జైపూర్ సమావేశాల్లో "జె.వి.పి కమిటీ" అని పిలవబడే అత్యున్నత అధికారాలు కలిగిన సంఘాన్ని జవహర్‌లాల్ నెహ్రూ, వల్లభాయ్ పటేల్ మరియు పట్టాభి సీతారామయ్యలు సభ్యులుగా పై సమస్యను పునః సమీక్షించడానికి ఏర్పాటు చేసింది. ఈ కమిటి తన నివేదికలో పార్టీ రాష్ట్రాల భాషా

ప్రయుక్త పునర్వ్యవస్థీకరణకు కట్టుబడి ఉన్నది కాబట్టి ఈ ప్రక్రియను కొంతకాలం వరకు వాయిదా వేయాలని చెప్పింది. ఈ అభిప్రాయాల పట్ల కర్ణాటక మరియు ఆంధ్రలకు చెందిన కొందరు నాయకులు తీవ్ర ఆగ్రహాన్ని, నిరసల్ని వ్యక్తం చేశారు.

ఈ నేపథ్యంలో రాజ్యాంగం ఆమోదించబడి భాషాపరమైన అంశాల జోలికి పోకుండా, నాలుగు విభిన్న తరహాలుగా రాష్ట్రాల్ని ఏర్పాటు గావించింది. 1951లో పురుషోత్తం దాస్ టాండన్ అధ్యక్షతన ఏర్పాటైన కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ "భాషాప్రయుక్త రాష్ట్రాల తక్షణ ఏర్పాటుకు పిలుపునివ్వాలి" అని తీర్మానించింది. కాని నెహ్రూ, ఆయన మంత్రివర్గం దీనిని ఒక 'తొందరపాటు నిర్ణయం'గా త్రోసిపుచ్చింది.

1950 జనవరి 26న నూతన రాజ్యాంగం అమలులోకి వచ్చింది. అధికరణం 1.'భారతదేశం అనగా భారత్ కొన్ని రాష్ట్రాల యూనియన్' అని చెబుతోంది. రాజ్యాంగం యొక్క 2వ అధికరణం, కొత్త రాష్ట్రాల ఏర్పాటు చట్టం ద్వారా గాని లేక పరిస్థితులకు తగ్గట్లుగా రాష్ట్రాలు ఏర్పాటు చేసేటట్లు పార్లమెంట్‌కు అధికారాన్ని కల్పించింది. రాజ్యాంగంలోని 3వ అధికరణం ప్రకారం, "చట్టం ద్వారా పార్లమెంట్ (అ) ఏ రాష్ట్రం నుండైనా ఒక భూభాగాన్ని వేరుచేసి క్రొత్త రాష్ట్రాన్ని ఏర్పాటు చేయవచ్చు లేక ఏ రాష్ట్రంలోని భాగానికైనా ఏ ప్రాంతాన్నైనా కలపవచ్చు.

(ఆ) ఏ రాష్ట్రం భూభాగాన్నైనా పెంచవచ్చు.

(ఇ) ఏ రాష్ట్రం భూభాగాన్నైనా తగ్గించవచ్చు.

(ఈ) ఏ రాష్ట్రం సరిహద్దులనైనా మార్చవచ్చు.

(ఉ) ఏ రాష్ట్రం పేరునైనా మార్చవచ్చు.

ఈ మార్పు చేయడానికి, రాష్ట్రపతి యొక్క సిఫారసు పై మాత్రమే బిల్లు తయారుచేసి, పార్లమెంట్‌లో ప్రవేశపెట్టాలి. ప్రభావిత రాష్ట్రాల శాసనసభ అభిప్రాయాల్ని పరిగణనలోకి తీసుకోవాలి. పార్లమెంట్‌లో ఆబిల్లు ప్రవేశపెట్టడానికి ముందు, రాష్ట్రపతి అటువంటి అభిప్రాయాలను అంగీకరించి, కట్టుబడి ఉండాల్సిన అవసరం లేదు. పార్లమెంట్, కేవలం సాధారణ మెజారిటీతో, సరిహద్దులలో మార్పులు లేక రాష్ట్రాల పేర్ల మార్పిడి చేయవచ్చు. అదేవిధంగా ఒక కేంద్రపాలిత ప్రాంతం స్థాయిని పెంచి రాష్ట్రంగా చేయవచ్చు. రాజ్యాంగం అన్ని బ్రిటీష్ భారత రాష్ట్రాలు, సంస్థానాలను 4 భాగాలుగా వర్గీకరించింది.

**రాష్ట్రాలు మరియు భారత భూభాగ ప్రాంతాలు**

| విభాగం 'ఎ' | విభాగం 'బి' | విభాగం 'సి' | విభాగం 'డి' |
|---|---|---|---|
| అస్సాం | హైదరాబాద్ | అజ్మీర్ | అండమాన్ & నికోబార్ దీవులు |
| బీహార్ | జమ్ము కాశ్మీర్ | భోపాల్ | |
| బాంబే | మైసూర్ | బిలాస్‌పూర్ | |
| మధ్యప్రదేశ్ | పెప్సు(Pepsu) | కూర్గ్ | |
| మద్రాస్ | రాజస్థాన్ | ఢిల్లీ | |
| ఒరిస్సా | సౌరాష్ట్ర | హిమాచల్‌ప్రదేశ్ | |
| తూర్పుపంజాబ్ | ట్రావన్‌కోర్-కొచ్చిన్ | కచ్ | |
| ఉత్తరప్రదేశ్ | మధ్యభారత్ | వింధ్యప్రదేశ్ | |
| | | మణిపూర్ | |
| | | త్రిపుర | |

స్వాతంత్ర్యం తర్వాత కూడా, 'విలీన ప్రక్రియ' కొనసాగింది. చిన్న సంస్థాన రాజ్యాలు తమ సమీపంలో పెద్ద రాష్ట్రాతో కలిసిపోయాయి. ఉదాహరణకు 1948లో ఒరిస్సా, చండీగడ్‌లలోని 39 ప్రాంతాలు వరుసగా ఒరిస్సా మరియు మధ్యప్రదేశ్‌లలో విలీనమయ్యాయి.

**ఆంధ్రరాష్ట్ర ఏర్పాటు :**

కేంద్ర నాయకులను భాషాప్రయుక్త రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణను తక్షణమే చేయాలని లేకపోవటంతో విశాలాంధ్ర ఏర్పాటుకై చేస్తున్న ఆందోళన వేగం పుంజుకోసాగింది. భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుకొరకు, 1952 జూలైలో పార్లమెంట్‌లో ఒక కమ్యూనిస్ట్ సభ్యుడు ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టాడు. ముఖ్యమైన కాంగ్రెస్ నాయకులు అనేకమంది దీనికి అనుకూలంగా స్పందించారు. కాని ప్రభుత్వం వ్యతిరేకించింది. ఆతీర్మానం ఆగిపోయినప్పటికీ ఆంధ్రకోసం పోరాటం కొనసాగింది. 1952 జూలైలో మద్రాస్ శాసనసభలో ఆంధ్రకు చెందిన తెలుగు మాట్లాడేవారిలో 160మందిలో 71మంది, మద్రాస్ రాష్ట్రాన్ని విడగొట్టి, ప్రత్యేక ఆంధ్ర ఏర్పాటుకోసం పిలుపునిస్తూ జరిగిన సభలో పాల్గొన్నారు. కాంగ్రెస్ లాంటి పెద్ద పార్టీలు కూడా ఈసభపై నిషేధం విధించినప్పటికీ ఈ సభ జరిగింది. ఆ తర్వాత టంగుటూరి ప్రకాశంగారు 1952 డిశంబర్‌లో మద్రాస్‌నందు అఖిలపక్ష ఆంధ్రసభను ఏర్పాటు చేయుటకు పిలుపునిచ్చారు. ఇందు, అనేక పార్టీలకు చెందిన ప్రతినిధులు పాల్గొన్నారు. ప్రభుత్వం కఠినంగా వ్యవహరించినప్పటికీ, ఆంధ్రకు అనుకూలంగా ఉద్యమం వేగం పుంజుకోసాగింది.

ఈ దశలో పొట్టి శ్రీరాములు ఆంధ్ర ఏర్పాటుకొరకు ఆమరణ నిరాహార దీక్ష చేశారు. ఆయన 26రోజులపాటు ఉపవాసం చేసి మరణించారు. ఈ సంఘటన తీవ్రమైన హింసకు దారితీసి, అనేకమంది ప్రజలు చంపబడ్డారు. దీంతో

ప్రభుత్వం దిగివచ్చి, ప్రధాని నెహ్రూ 1952 డిశంబర్ 19న ఆంధ్ర, రాష్ట్రాన్ని ఏర్పాటు చేయబోతున్నట్లు ప్రకటించారు. 1953, అక్టోబర్ 1 నుండి ఏర్పాటు అయ్యే క్రొత్త తెలుగు మాట్లాడే వారుండే ఆంధ్రరాష్ట్రం సరిహద్దులను నిర్ణయించవలసినదిగా జస్టిస్ వాంఛూ నియమించబడ్డాడు. ఈవిధంగా ఆంధ్రరాష్ట్రం, భాషాప్రయుక్త రాష్ట్రాలలో మొట్టమొదటిగా ఏర్పడినట్లైంది.

## రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కమీషన్ (ఎస్.ఆర్.సి) (States Reorganisation Commission (SRC))

ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు, భాషాప్రయుక్త రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కోసం అనేక ప్రాంతాల నుండి డిమాండ్లకు దారితీసింది. ఆవిధంగా, కేంద్రప్రభుత్వం, రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సమస్యను స్థూలంగా పరిశీలించేందుకు ఒక కమీషన్‌ను నియమించింది. ఆ కమీషన్‌కు రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సంఘం (States Reorganisation Commission)(ఎస్.ఆర్.సి)గా నామకరణం చేసి జస్టిస్ ఫజల్ ఆలీని ఛైర్మన్‌గా, శ్రీ హెచ్.ఎన్.కుంజ్రూ, శ్రీ కె.యం.ఫణిక్కర్‌లను సభ్యులుగా నియమించారు. ఛైర్మన్ పేరుతో ఈ కమీషన్, ఫజల్ ఆలీ కమీషనగా పిలవబడేది.

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం దేశమంతా పర్యటించి సుమారు 9000మంది వ్యక్తుల అభిప్రాయాలను తెలుసుకొని, దాదాపు 1,52,000కి పైగా వచ్చిన విజ్ఞాపన పత్రాలను, విన్నపాలను పరిశీలించింది. ఇది తన నివేదకను 1955, సెప్టెంబర్ 30న కేంద్ర ప్రభుత్వానికి సమర్పించింది.ఆ కమీషన్ తన నివేదికలో, కేవలం భాష, సంస్కృతుల ఆధారంగా రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ మనజాతి అభీష్టం కాదని అభిప్రాయపడింది. విభిన్న సంస్కృతుల సమ్మేళనం, ఐక్యత మరియు దేశం జాతీయ సమైక్యతను కాపాడటం చాలా ముఖ్యం. అయినప్పటికీ, రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం, రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ భాషా పరంగా మామూలుగా చేపట్టమని సిఫారసు చేసింది.

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం సిఫారసులను కేంద్ర ప్రభుత్వం జాగ్రత్తగా పరిశీలించింది. ఈ సంఘం సూచనలలో ఎక్కువ సూచనలను అంగీకరించినప్పటికీ, దాని యొక్క అన్ని సిఫారసులను యధాతథంగా అమలు చేయడం అసాధ్యమని ప్రభుత్వం భావించింది. ఆవిధంగా, సంఘం సిఫారసు చేసినట్లు, విదర్భ రాష్ట్రం ఏర్పాటు చేయరాదని నిర్ణయించింది.

అదేవిధంగా, కమీషన్ సిఫారసు మేరకు హైదరాబాద్ 'బి' విభాగం రాష్ట్రం ఏర్పాటు కాలేదు. దానిని విభజించి తెలుగు మాట్లాడే వారున్న ప్రాంతాన్ని ఆంధ్రతో కలిపి పెద్దదైన ఆంధ్రప్రదేశ్‌గాను, కన్నడ భాష మాట్లాడేవారున్న ప్రాంతాలను మైసూర్‌కు కలపడం, మరాఠీ మాట్లాడే వారున్న ప్రాంతాలు బొంబాయిలో కలపడం జరిగినాయి. మొత్తం రాష్ట్రాల సంఖ్య ప్రతిపాదించిన 16నుండి 14కు తగ్గించడం జరిగింది. దీంతోపాటు, కేంద్ర ప్రభుత్వ ఆధీనంలో ఉండే 3 కేంద్ర పాలిత ప్రాంతాలకు బదులు కేంద్రపాలిత ప్రాంతాలను ఏర్పాటు చేయడం జరిగింది.

ప్రభుత్వ నిర్ణయాలను పార్లమెంట్ 1956లో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ చట్టం రూపంలో ఆమోదముద్ర వేసింది. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లును పార్లమెంట్ సిఫారసు చేయడానికి ముందు రాజ్యాంగ అధికరణాలకు అనుగుణంగా, రాష్ట్ర శాసనసభల అభిప్రాయాన్ని వాటి ఏర్పాటుకు సంబంధించిన వారిఅభిప్రాయాలను రాష్ట్రపతి తెలుసుకున్నారు. 1956లో ఏర్పాటైన 14 రాష్ట్రాలు ఈ క్రింద ఇవ్వబడ్డాయి.

1. ఆంధ్రప్రదేశ్ 2. అస్సాం

3. బీహార్ 4. బొంబాయి

5. జమ్ము & కాశ్మీర్ 6. కేరళ

7. మధ్యప్రదేశ్ 8. మద్రాసు

9. మైసూరు 10. ఒరిస్సా

11. పంజాబు 12. రాజస్థాన్

13. ఉత్తరప్రదేశ్ 14. పశ్చిమబెంగాల్

**6 కేంద్రపాలిత ప్రాంతాలు :**

1. అండమాన్ మరియు నికోబార్ దీవులు 2. ఢిల్లీ 3. హిమాచల్ ప్రదేశ్ 4. మణిపూర్ 5.త్రిపుర 6. లక్షదీవులు, మినికోయ్ & అమిందివి దీవులు

ఎస్.ఆర్.సి సిఫారసు చేసిన విధంగా ఎ.బి.సి మరియు డిలుగా పేర్కొనబడిన రాష్ట్రాల మధ్య తేడాలను తొలగించి, రాజప్రముఖుని కార్యాలయం రద్దు చేయబడింది. అన్నిరాష్ట్రాలకు గవర్నర్లను నియమించారు. కేంద్రపాలిత ప్రాంతాలను లెఫ్టినెంట్ గవర్నర్ లేక ముఖ్య కమీషనర్‌లు కేంద్ర ప్రభుత్వం తరపున పరిపాలన జరిపేవారు.

పూర్వం ట్రావన్‌కోర్ –కొచ్చిన్ రాష్ట్రంగా పిలవబడే రాష్ట్రానికి 'కేరళ' అనే కొత్తపేరు పెట్టారు. అంతకుముందు గల పెప్సు(Pepsu)పంజాబ్‌లో విలీనమై పంజాబ్‌లోని కొండప్రాంతాలు మరియు పెప్సు(Pepsu)లను కలిపి హిమాచల్‌ప్రదేశ్‌గా ఏర్పాటు చేశారు. మధ్యభారత్ ('బి'విభాగం), వింధ్యప్రదేశ్, భోపాల్, భిలాస్‌పూర్('సి'విభాగం) రాష్ట్రాలను కలిపి మధ్యప్రదేశ్‌గా పునర్వ్యవస్థీకరించారు. అంతకు పూర్యపు సౌరాష్ట్ర మరియు కచ్‌లను కలిపి పెద్దదైన బొంబాయి రాష్ట్రంగా మార్చారు. అజ్మీర్, రాజస్థాన్‌లో భాగమయ్యింది. (ఆ తర్వాతి కాలంలో ఆయా ప్రాంతాలలోని స్థానిక ప్రజల కోరిక ప్రకారం మద్రాస్, తమిళనాడుగాను, మైసూర్, కర్ణాటకగాను మరియు లకదీల్ ద్వీపాలు లక్షదీవులుగాను పేర్లు మార్చబడ్డాయి).

ఆవిధంగా, దేశానికి ఒక అంతిమ రాజకీయ రేఖాపటాన్ని ఇచ్చినట్లయింది. దీంతో ఆపై భాషాప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు కొరకు డిమాండ్లు రావనుకోవచ్చు. కాని అటువంటి డిమాండ్లు నెరవేరబోవని ఆశించవచ్చు. ఆ తర్వాతి కాలంలో ఆడపాదడపా ప్రజల అభీష్టాల మేరకు కొన్ని కొత్త రాష్ట్రాలు, కేంద్ర పాలిత ప్రాంతాల ఏర్పాటు చేయబడ్డాయి.

1960 మేలో, బొంబాయి రాష్ట్రం విభజన చేయబడి మహారాష్ట్ర మరియు గుజరాత్‌లుగా ఏర్పడ్డాయి. బొంబాయి నగరం, మహారాష్ట్రలోని మరాఠీ మట్లాడే వారున్న ప్రాంతంగా మారింది. మిలిటెంట్లు, పూర్తి స్వాతంత్ర్యంకోసం చేస్తున్న డిమాండ్‌ను వ్యతిరేకిస్తూ నాగాలాండ్ భారతదేశంలో 16 వ రాష్ట్రంగా ఏర్పడింది. 1960లో పంజాబ్ విభజన కొరకు అకాలీదళ్ ఒక ఆందోళనను చేపట్టింది. కాని ప్రభుత్వం లొంగక, మంత్రివర్గ సంఘం సిఫారసుల మేరకు, పార్లమెంట్ చట్టం ద్వారా పూర్వపు ద్విభాషా రాష్ట్రమైన పంజాబీ భాష మాట్లాడే ప్రాంతం పంజాబ్‌గాను, హిందీ మాట్లాడే ప్రాంతం

హర్యానాలు గాను, మరియు చండీఘడ్ నగరం పంజాబ్ నుండి విడదీసి, కేంద్రపాలిత ప్రాంతంగాను ఏర్పాటుచేయబడింది. 1961లో పోర్చుగీసు వారినుండి గోవా, డామన్, డయ్యూలు స్వాతంత్ర్యాన్ని పొంది, రెండు స్వతంత్ర కేంద్రపాలిత ప్రాంతాలు దాద్రా  నగర్ హవేలి మరియు గోవా, డామన్ దయ్యూలుగాను ఏర్పాటు చేయబడ్డాయి. అంతకుముందు ఫ్రెంచి వారి వలస రాజ్యాలైన మహి(Mahi) మరియు కరేకల్(Karekal), మద్రాస్‌లో విలీనం చేయబడగా పాండిచ్చేరి ఒక కేంద్రపాలిత ప్రాంతంగా చేయబడింది. అంతేగాక 1987లో గోవా ఒక రాష్ట్రంగా ఏర్పాటైంది. 1969 డిశంబర్‌లో అస్సాం రాష్ట్రంలోపల ఒక స్వతంత్ర ప్రతిపత్తిగల మేఘాలయ ప్రాంతం ఏర్పాటు చేయబడింది. కాని ప్రజల నుండి తీవ్ర వ్యతిరేకత రావడంవలన, 1971లో మేఘాలయకు పూర్తి రాష్ట్రప్రతిపత్తి మంజూరు చేయబడింది. మిజోరాం, అరుణాచల్ ప్రదేశ్ కేంద్రపాలిత ప్రాంతాలుగా చేయబడ్డాయి. 1971లోనే హిమాచల్‌ప్రదేశ్ దేశంలోని 18వ రాష్ట్రంగా ఏర్పాటైంది. మణిపూర్, త్రిపురలకు పూర్తిస్థాయి రాష్ట్రాలుగా ఏర్పాటవడంతో, రాష్ట్రాల సంఖ్య 21కి చేరింది. 1975లో భారతదేశంలో సిక్కిం 22వ రాష్ట్రంగా ఏర్పాటు చేయబడింది.

**ఇటీవల కాలంలో రాష్ట్రాలు, కేంద్రపాలిత ప్రాంతాలు పెంచటం :**

1985లో మాజీ ప్రధాని శ్రీ.శే॥ రాజీవ్‌గాంధీ శ్రీ.శే॥ సంత్ హరిచంద్‌సింగ్ లొంగోవాల్‌ల మధ్య ఒక ఒప్పందం కుదిరింది. దీనిప్రకారం చండీగఢ్, 1986 జనవరి 26న పంజాబ్‌కు బదలాయించగా పంజాబ్‌లోని కొన్ని హిందీ మాట్లాడే వారున్న ప్రాంతాలు హర్యానాకు బదలాయించేందుకు ఒప్పందం కుదిరింది. ఈ కార్యం కోసం ప్రభుత్వం ఒక సంఘాన్ని ఏర్పాటు చేసినప్పటికీ ఏమీ ఉపయోగం జరగలేదు. పంజాబ్ మరియు హర్యానాలకు రాజధాని అయినప్పటికీ చండీగఢ్ ఆ తర్వాత కూడా కేంద్ర పాలిత ప్రాంతంగా కొనసాగింది.

1987లో ప్రభుత్వం, మూడు కేంద్రపాలిత ప్రాంతాలకు పూర్తి రాష్ట్రస్థాయి కల్పించడానికి చేసిన డిమాండ్లను అంగీకరిస్తూ కొన్ని ప్రభుత్వ చట్టాల ద్వారా రాష్ట్రపతి, మిజోరాం,అరుణాచల్‌ప్రదేశ్, గోవాలకు పూర్తి రాష్ట్ర హోదా కల్పించారు. గోవాకు రాష్ట్ర హోదా మంజూరు చేసేటప్పుడు డామన్ మరియు దయ్యూలు వేరు చేయబడి, ప్రత్యేక కేంద్రపాలిత ప్రాంతంగా కొనసాగించబడ్డాయి. 2000సంవత్సరంలో జార్ఖండ్, ఉత్తరాంచల్ మరియు ఛత్తీస్‌గఢ్‌లు బీహార్, ఉత్తరప్రదేశ్ మరియు మధ్యప్రదేశ్ రాష్ట్రాల నుండి విడగొట్టబడ్డాయి. ఈ మధ్యకాలంలో కూడా చిన్న రాష్ట్రాల ఏర్పాటు కొరకు డిమాండ్లు పెరుగుతూనే ఉన్నాయి. ఉదాహరణకు అస్సాంలో బోడోలాండ్ మరియు పశ్చిమ బెంగాల్‌లో గూర్ఖాలాండ్‌ల కొరకు డిమాండ్లు చేయబడ్డాయి. రాష్ట్రాల మరియు కేంద్రపాలిత ప్రాంతాల పునర్వ్యవస్థీకరణ ప్రక్రియ ఇంకనూ అంతమవ్వలేదని ఈడిమాండ్లు మనకు తెల్పుతున్నాయి. ఇది చూడటానికి నిరంతర ప్రక్రియలాగా కనిపిస్తోంది. ప్రస్తుతం మనదేశంలో 28 రాష్ట్రాలు, 6 కేంద్రపాలిత ప్రాంతాలు మరియు పూర్తి రాష్ట్రస్థాయి కోసం డిమాండ్లు వస్తున్న ఢిల్లీకి జాతీయ రాజధాని (ఎన్.సి.టి) హోదా కల్పించబడింది.

## 65.1 పాఠ్యప్రశ్నలు

1. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ చేసే అధికారాన్ని పార్లమెంటుకు రాజ్యాంగంలోని ఏ అధికరణం ద్వారా సంక్రమించింది?

2. 1953లో భారతదేశంలో ఏర్పాటు చేయబడిన మొట్టమొదటి భాషాప్రయుక్త రాష్ట్రం ఏది?

3. హైదరాబాద్ రాష్ట్రం ఎన్ని భాగాలుగా విభజింపబడింది?

4. 1960లో బొంబాయిని రెండు ప్రాంతాలుగా విభజించినపుడు ఏర్పడిన రాష్ట్రాలేవి?

5. పంజాబ్ నుండి వేరు చేయబడిన హిందీ మాట్లాడబడే రాష్ట్రం ఏది?

## 65.5 సామాజిక పరిణామం : భారతీయ అనుభవం

భారతదేశంలో విభిన్న జాతులు, మతాలకు చెందినవారు, విభిన్న భాషలు మాట్లాడేవారు నివసిస్తున్నారు. మనం ఒక విశిష్ట, విభిన్న సంస్కృతిని కూడా కలిగిఉన్నాం. మనదేశంలో సుమారు 200సం॥ల పాటు సాగిన బ్రిటీష్‌వారి పాలన మనదేశ సామాజిక, ఆర్థిక పరిస్థితులలో మార్పులు తెచ్చింది. మనదేశం పేదదేశంగా మారటమేగాక ప్రజలలో అనైక్యత ఏర్పడింది. అదేసమయంలో బ్రిటీష్ పాలన అనుకూల అంశాలు కూడా మనం పరిగణనలోకి తీసుకోవాలి. ఆధునిక విద్య, రైల్వే సమాచార వ్యవస్థల లాంటి అంశాలు ప్రవేశపెట్టబడటంతో, భారతీయులు వారి లోపాలను గ్రహించి, క్రొత్త క్రొత్త ఆలోచనలను స్వీకరించగలిగారు. మీరు, భారత సమాజాన్ని సంస్కరించేందుకు జరిగిన ప్రయత్నాలలో భాగమైన సామాజిక, మత సంస్కరణ ఉద్యమంలను గురించి గతంలోనే చదివారు.

స్వాతంత్ర్యం తర్వాత, సామాజిక దురాచారాలను రూపుమాపుటకు భారతదేశం తీవ్ర ప్రయత్నాలు చేసింది. అటువంటి ప్రయత్నాలు కేవలం స్థూల సామాజిక మార్పు మాత్రమేగాక ప్రజల వైఖరి మరియు దృక్పధాలలో కూడా మార్పును కోరుకుంటాయి. దీనంతటికి, దేశంలోని ప్రజలందరూ ఒక్కత్రాటిపై నిలబడాలని ఆవిధంగా జాతీయ సమైక్యత, భారత సామాజిక ఐక్యతలు తప్పనిసరి అయినప్పుడే ఆధునిక ప్రజాస్వామ్య సమాజం ఏర్పడడానికి అవసరమైన పూర్తి సామాజిక మార్పును మనం సాధించగల్గుతాం.

కాని, సామాజిక పరిణామం అంటే ఏమిటి? సమాజానికి చెందిన విభిన్న భావనలు, అంశాలు క్రమేణా గాని లేక అకస్మాత్తుగా గాని మారితే లేక రూపాంతరం సంభవిస్తే దానినే సామాజిక పరిణామం(Social transformation)అని చెప్పవచ్చు. ఈ మార్పు సంబంధితమైన(relevant) అర్ధవంతమైన సమాజ నిర్మాణం కొరకు, సమాజ నిర్మాణాన్ని మార్చి, దానికి తగ్గట్లుగా ప్రజల వైఖరులలో, దృక్పధాలలో మార్పు తేవడమే కాక, సరిక్రొత్త ఆలోచనలను రేకెత్తిస్తుంది. అటువంటి అనేక ముఖ్యమైన మార్పులు స్వాతంత్ర్యానంతరం భారతదేశంలో సంభవించాయి.

ఈ విభాగంలో మనజాతి నిర్మాణంలో ముఖ్య అంతర్భాగాలైన సామాజిక మార్పు జాతీయ సమైక్యతలను సాధించడానికి చేయబడిన ప్రయత్నాలను మనం పరిశీలిద్దాం.

**మార్పులను చవిచూచుట** (Experiencing the changes)

మన దేశానికి స్వాతంత్ర్యం రాకపూర్వం పరిపాలనా విధానం రాష్ట్రానికి, రాష్ట్రానికి వేర్వేరుగా ఉండేది. అత్యంత ప్రయాసతో, దేశమంతటా ఇప్పుడు ఏకరీతి పరిపాలనా విధానం సాధ్యమైంది. రవాణా రంగంలో త్వరితగతిన జరిగిన అభివృద్ధి ప్రజలను దగ్గరకుచేర్చి, మొత్తం భారతజాతి గురించి ఆలోచించేటట్లు చేసింది. సమాచార రంగం విస్తరించడంతో మరియు దృశ్య-శ్రవణ మాధ్యమం (దూరదర్శన్) వలననూ ప్రజలలో జాతీయ స్పృహ పెరిగింది. పారిశ్రామికీకరణ వలన, క్రొత్త ఆర్థిక అవకాశాలకు మార్గాలు ఏర్పాడ్డాయి. మన జాతీయ లక్ష్యమైన సామ్యవాదం(Socialism) ఆర్థిక

మరియు సామాజిక న్యాయాన్ని సాధించేందుకు శాసన నిర్మాణ శాఖ(legislation)ను ప్రభావితం చేయుచున్నది. వివిధ ప్రాంతాల మధ్య ఉన్న అభివృద్ధి అసమానతలు, జాతీయ ప్రణాళికా ఉత్పత్తి ద్వారా చెప్పుకోదగ్గరీతిలో తొలగించబడ్డాయి.

మన సమాజాన్ని కొంతకాలం నుండి పట్టిపీడించుచున్న మతతత్వ(communalism) సమస్యను పరిష్కరించుటకు అనేక ప్రయత్నాలు జరిగాయి. శాస్త్ర, సాంకేతిక రంగాలలో గణనీయపరిశోధన అభివృద్ధి కొనసాగుతోంది. ఇది మన సమాజంలో వేళ్ళూనిన మూఢాచారం అజ్ఞానాంధకారం(obscurantism)లకు కళ్ళెం వేయడంలో సహాయపడింది.

ఆ సామాజిక మార్పునకు సంబంధించి ముఖ్య అంశాలను గురించి మనం చర్చిద్దాం.

**సామాజిక చలనం( చైతన్యం)** (Social Mobility)

భారత సమాజంలో ప్రజలందరూ సమానమైన సామాజిక స్థాయిని గాని లేక ఆర్థికస్థాయిని గాని అనుభవించడం లేదు. ఇటువంటి అసమానతలకు మూలకారణం మనదేశంలో సర్వసాధారణమైన కులవ్యవస్థే. దాని కారణం జాతి, మత, భాషలతో పాటు కులం కూడా మనసమాజంలో విభజనకు ముఖ్యకారక మయ్యింది. మన కరడుగట్టిన కులవ్యవస్థ అత్యంత ప్రాధాన్యతా విషయం దీనితో ఇమిడియున్న సామాజిక అణచివేత. ఉన్నత కులాలు నిమ్న కులాలతో పోల్చితే చాలా ఉన్నత స్థాయిలో ఉండేవారు. నిమ్నకులాలుగా పిలవబడే వారు అంటరానివారుగా పరిగణింపబడేవారు. వారు ఆర్థికంగాను, విద్యా విషయకంగాను వెనుకబడ్డారు. సామాజిక–ఆర్థిక అసమానత్వం, సామాజిక–రాజకీయ అసమానత్వానికి కూడా దారితీసింది. ప్రస్తుతం వేర్వేరు కుల సమాజాలు వారి వారి కుల సంఘాలుగా ఏర్పడి వారి అభివృద్ధి కొరకై రాజకీయంగా ఒత్తిడులు తెస్తున్నారు. గ్రామీణ ప్రాంతాలలో కరడు గట్టిన కులవ్యవస్థ ప్రభావం ఎక్కువగా ఉండటంతో, ఆ ప్రాంతాలలోని నిమ్నకులాలకు చెందిన వారిలో చాలామంది నగర ప్రాంతాలకు వలసవెళ్తున్నారు. ఇది సామాజిక చలన ప్రక్రియను తేలిక పరచుటమేగాక వేగిరపరిచింది. "సామాజిక చలనం"(Social mobility) అంటే నిమ్న కులాలుగా పిలవబడే జనాభా ఆర్థికంగా, రాజకీయంగా ఎదిగి, ఉన్నతమైన సామాజికస్థితిని చేరుకోవడం అనిచెప్పవచ్చు. అగ్రవర్ణాల ఆధిపత్యం గణనీయంగా తగ్గడమే కాక సమాజంలో సామాజిక సమానత్వం గురించిన సామాజిక స్పృహ వ్యాప్తి చెందింది. గతంలో నిమ్నకులాలుగా పిలవబడేవారు ప్రస్తుతం షెడ్యూల్డు కులాలుగా పిలవబడుచున్నారు. భారతరాజ్యాంగం, దేశంలోని పేద, అణగారిన కులాల జాబితా రూపొందించుటకు ఒక వ్యవస్థ కూడా ఏర్పరచింది. ఈ కులాలకు చెందిన ప్రజలు ప్రత్యేక రాయితీలు, కేటాయింపులు (రిజర్వేషన్లు) పొందుటకు అర్హులు.

బ్రిటీష్ వారి పాలనాకాలంలో ఆర్థిక అసమానత ఒక తీవ్రమైన సమస్యగా పరిణమించింది. బ్రిటీష్ ప్రభుత్వం మన భూ ఒడంబడిక పద్ధతులు(Land tenure systems) ను చాలా సంక్లిష్టం చేసింది. బ్రిటీష్‌వారు, దళారులుగా జమీందార్లుగా పిలవబడే రెవిన్యూ కలెక్టర్లను నియమించారు. బ్రిటీష్ ప్రభుత్వం భూమిశిస్తు(revenue) వసూలు చేయుటకు ఎక్కువసంఖ్యలో ఉద్యోగులను నియమించింది. గ్రామాలతో కూడిన కొంత ప్రాంతాన్ని వీరి పరిధిలోకి తెచ్చారు. వారు, వారికి కేటాయించబడిన ప్రాంతం భూమి రికార్డులను నిర్వహిస్తూ, వారిచే వసూలు చేయబడిన శిస్తులో కొంత భాగాన్ని తీసుకునేవారు. ఆ తర్వాత కాలక్రమేణా వీరు ఆ భూమికి యజమానులై, జమీందార్లుగా పిలవబడేవారు. అప్పటికే విడిపోయిన మన సమాజం, జమీందారీ వ్యవస్థను ప్రవేశపెట్టడంలో మరియొక సామాజిక వర్గం ఏర్పడినట్లయింది. తత్ఫలితంగా అనేకమంది రైతులు, భూమిలేని వ్యవసాయ కార్మికులుగాను, శిస్తు వసూలు చేయు రెవిన్యూ కలెక్టర్లు భూ

యజమానులు లేక జమీందార్లుగాను మారడమైనది. వారు తమ స్వార్థపూరిత ప్రయోజనాల కోసం, రైతులను పావులుగా మార్చారు. జమీందారీ వ్యవస్థ రద్దు చేయడం వలన మరియు భూసంస్కరణలు ప్రవేశపెట్టడం వలన, గ్రామీణ వ్యవసాయ వర్గంలో మార్పు వచ్చింది. భూస్వాముల ప్రాధాన్యత చాలావరకు తగ్గింది.

**అంటరానితనం నిర్మూలన :**

భారత ప్రజలలో చెప్పుకోదగ్గ స్థాయిలో ఉన్న ఒకవర్గం ప్రజలు చాలా కాలంపాటు జనజీవన స్రవంతి నుండి వేరు పరచబడి ఉన్నారని, వీరు అంటరానివారుగా పరిగణించబడేవారని మనం ఇదివరలోనే చదివి ఉన్నాం. దీనివలన కేవలం ఒక సామాజిక విభజన జరగడమేకాక అతిపెద్ద నిరంతర సామాజిక సంఘర్షణకు దారితీసి, జాతీయ సమైక్యత అనే స్ఫూర్తికి అడ్డుగా నిలిచింది. భారత రాజ్యాంగం, సామాజిక న్యాయం చేయాలనే తలంపుతో అంటరానితనాన్ని నిషేధించింది. రాజ్యాంగాన్ని అనుసరించి షెడ్యూల్డు, కులాలకు కొన్ని ప్రత్యేక సౌకర్యాలు(Preferential treatment)కల్పించబడుతూ, అనేక విధానాలు అమలుపరచబడ్డాయి.

ఇన్ని మార్పులు చోటుచేసుకున్నప్పటికీ, అంటరానితనం నిషేధించినప్పటికీ, ఇప్పటికీ కులవ్యవస్థ అమలులో ఉన్నది. సామాజిక సమానత్వ మరియు సామాజిక న్యాయాల అమలు కొరకు భారతదేశంలో కులాల ఆధిపత్యం(కుల వివక్ష) సంప్రదాయ రూపాన్ని పూర్తిగా రూపుమాపవలసిన అవసరమున్నది.

భారతదేశంలో కొండజాతులు(గిరిజనులు) కూడా సామాజికంగా వెలివేయబడినారు. అడవులు కేవలం వారి నివాసంగా మాత్రమేగాక వారి ముఖ్య ఆదాయ వనరులుగా ఉన్నాయి. బ్రిటీష్ ప్రభుత్వం వారు వీరి దారుణమైన ఆర్థిక పరిస్థితిని పట్టించుకోకుండా వీరికి అడవులపై సహజంగా సంక్రమించిన హక్కులను కూడా కాలరాసి, వారి ఆధీనంలోకి తెచ్చుకున్నారు. నిజానికి, భారతదేశంలో వలసపాలన అనుసరించిన విధానాల వలన గిరిజనులు(tribals)జాతీయ జీవన స్రవంతి నుండి వెలివేయబడినారు.

మనరాజ్యాంగం అమలులోకి వచ్చినప్పటి నుండి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రెండునూ షెడ్యూల్డ్ కులాల, తెగలను వారి విద్యా, ఆర్థిక రంగాలలో వెనుకబాటు తనాల నుండి బయటపడ వేయడానికి తగిన విధానాలు రూపొందించి, వానిని కొనసాగిస్తూ ఉన్నారు. సమాజంలోని ఈ బలహీన వర్గాల వారికి పార్లమెంట్ మరియు రాష్ట్ర విధానసభలలో కొన్ని సీట్లు కేటాయిస్తూ(reservation)ఒక నిబంధన రూపొందించబడ్డది. ఒకవేళ వీరికి ఈ రిజర్వేషన్ కల్పించకపోతే పార్లమెంట్, శాసనసభలందు వీరికి తగినంత ప్రాతినిధ్యం కూడా కరువవుతుంది.

వివిధ ప్రభుత్వ శాఖలలో, పబ్లిక్ సంస్థలలో కూడా బలహీన వర్గాల వారికి కొన్ని ఉద్యోగాలు ప్రత్యేకంగా కేటాయించబడ్డాయి(reserved). బలహీనవర్గాలవారు, వారికి కల్పించబడిన ప్రత్యేక సదుపాయం(reservation)తో కేంద్ర, రాష్ట్ర సర్వీసులలో వారికి సముచిత స్థానం కల్పించబడినది. షెడ్యూల్డ్ కులాల మరియు షెడ్యూల్డ్ జాతుల వారికి ప్రవేశానికి కళాశాలలు, విశ్వవిద్యాలయాలు లాంటి విద్యాసంస్థలలో కొంతశాతం సీట్లు కేటాయించబడ్డాయి. ఈవిధంగా రిజర్వేషన్లు అమలు చేయడం వల్ల దేశంలో సామాజిక ఆర్థిక సమానత్వం ఏర్పడి, గతంలో షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు జాతుల వారికి జరిగిన అన్యాయం ఇకముందు జరగడానికి ఆస్కారముండదు. సమాజంలోని ఏ వర్గంవారి పట్ల విచక్షణ చూపించకుండా ఉండుటకు అవసరమైన చర్యలు చేపట్టాలి. భవిష్యత్‌లో రాబోయే సవాళ్ళను ఎదుర్కోవడానికి తగిన విధంగా భారతీయులందరూ ఏకమై కలిసికట్టుగా కదలాలి.

**మహిళా విమోచన** (Emancipation of Women)

మన సమాజంలో అసమానత్వం మరియు సామాజిక అణచివేతకు గురైన మరొక చెప్పుకోదగ్గ వర్గం స్త్రీలు. మగబిడ్డకు అనాదిగా ప్రాధాన్యత ఇవ్వబడింది. స్త్రీలు ఆర్థికంగా స్వతంత్రులగుటకు అవసరమైన నియత విద్య వారికి కల్పించబడలేదు. వీరికి అనువంశికంగా వచ్చు వంశనామాలు గాని, ఆస్తులుగాని సంక్రమించేవి కావు. క్లుప్తంగా చెప్పాలంటే, స్త్రీల నిరక్షరాస్యత, అజ్ఞానం ఆర్థికంగా పురుషులపై ఆధారపడటం లాంటి బాధలు అనుభవించడం వల్ల వీరి సామాజిక స్థాయి చాలా తక్కువగా ఉండేది. ఎక్కువ కుటుంబాలలో, స్త్రీలకు నిర్ణయాధికారం కూడా ఉండేదికాదు. కొంతమది భారత నాయకులు చేసిన కృషి ఫలితంగా బ్రిటీష్ ప్రభుత్వం స్త్రీలకు సంబంధించిన కొన్నిచట్టాలను రూపొందించారు. వీనిలో 'సతి', 'బాల్యవివాహాల'పై నిషేధం విధించడం లాంటి చట్టాలున్నాయి. ఐతే ఈ చట్టాలు రూపొందించినప్పటికీ సమాజంలో స్త్రీల స్థితిగతులలో ఏమాత్రం అభివృద్ధి కన్పించలేదు.

స్వాతంత్ర్యానంతరం స్త్రీల స్వేచ్ఛ ముఖ్యమైన అంశంగా భావించి, వారిలోని కొన్ని లోపాలను తొలగించి వారిని దోపిడీ నుండి తప్పించేందుకు కొన్ని చట్టాలు చేయబడ్డాయి. జవహర్‌లాల్ నెహ్రూ ప్రధానిగా ఉన్న సమయంలో హిందూవారసత్వ చట్టం(Hindu succession Act)చేయబడి, మొదటిసారిగా స్త్రీలకు వారి తల్లిదండ్రుల ఆస్తిలో వాటా కల్పించబడింది. వరకట్న నిషేధం, స్త్రీల అక్రమ రవాణాలను నిరోధించుటకు కూడా చట్టాలు చేయబడ్డాయి. క్లుప్తంగా చెప్పాలంటే పైచర్యలన్నీ సమాజంలో స్త్రీలకు ఉన్నత స్థితిని కల్పించడానికి చేపట్టినవే.

మనదేశంలో బాల్యవివాహాలు సర్వసాధారణం. చాలా మంది పిల్లలకు, వారు వివాహం చేసుకొనే సమయానికి వివాహ వ్యవస్థ గురించిన విషయాలు పట్ల ఎటువంటి అవగాహన ఉండేది కాదు. పెండ్లి కుమారుడు (భర్త) కనుక తక్కువ వయసులో చనిపోతే, ఆ బాల వితంతువు బ్రతుకు చాలా దుర్భరంగా ఉండేది. ఎటువంటి కార్యక్రమాలలోను ఈమె పాల్గొనే అవకాశముండేది కాదు. ఆమెకు కడుపునిండా తినడానికి మంచి ఆహారం కూడా ఉండేది కాదు. రంగుదుస్తులు కూడా ధరించడానికి వీలుండేది కాదు. అంతేగాక ఏదైనా శుభకార్యంలో ఈమె కనిపిస్తే అశుభంగా భావించేవారు. భార్య చనిపోయిన భర్తకు ఎన్నిసార్లైనా పునర్వివాహం చేసుకొనే స్వేచ్ఛ ఉన్నప్పటికీ భర్త చనిపోయిన భార్య(వితంతువు)కు మాత్రం పునర్వివాహం చేసుకునే వీలుండేది కాదు. ఇది చాలా దారుణం. బాల్య వివాహాలను నిరోధించడానికి 'శారదా చట్టం' చేయబడ్డది. ఆ తర్వాత వెంటనే వితంతు పునర్వివాహాలకు చట్టబద్ధత కల్పించబడింది. కాని ఆచరణలో కొచ్చేసరికి బాల్యవివాహాలను పూర్తిగా నిరోధించడం గాని లేక వితంతు పునర్వివాహాలు ప్రాచుర్యం పొందటం గాని జరగలేదు. ఈ విషయం ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో, సామాజిక బలహీన వర్గాల ప్రజలలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. కొన్ని ఉత్తర భారత రాష్ట్రాలలో, ఆడశిశు(భ్రూణ) హత్యలు సర్వసాధారణం అంటే ఆడశిశువులను వద్దనుకుంటున్నారు కాబట్టి, ఆ శిశువు జన్మించగానే చంపివేసేవారు. ఈ దురాచారాన్ని రూపుమాపుటకు అనేక సంస్థలు, వ్యక్తులు పవిత్రయుద్ధాన్ని ఆరంభించారు. వ్యభిచారం అనేది మరొక సామాజిక రుగ్మత. ఇది కేవలం కుటుంబ జీవితాన్ని నాశనం చేయడం కాకుండా, సామాజిక జీవితం హుందాతనాన్ని, నైతికతలను నాశనం చేస్తుంది. దీనికి సంబంధించిన నేరాలకు కఠిన శిక్షలను విధిస్తూ ఒక నిబంధన చేయబడింది.

మన సమాజంలో వరకట్నం అనునది ఒక పెద్ద సాంఘిక దురాచారం. ఈ దురాచారం వరుడు, అతని తల్లిదండ్రుల ధనదాహం వల్ల జనించిందని చెప్పవచ్చు. ఈ దురాచారాం వలన వివాహ సమయంలో వరుడికి, వధువు

తల్లిదండ్రులు ఖరీదైన దుస్తులు, ఆభరణాలు, వంటపాత్రలు, మంచాలు, బల్లలు, కుర్చీలు మొదలైన సామాగ్రి ఇవ్వడానికి చాలా పెద్ద మొత్తంలో డబ్బు ఖర్చు చేయాల్సి ఉంటుంది. చాలా వివాహాలలో, వివాహానికి ముందే వరకట్నానికి సంబంధించి బేరసారాలు నిర్ణయం జరిగి కొంతమొత్తం ఇవ్వబడుతుంది. అయితే వధువు తల్లిదండ్రులు ఈ మొత్తాన్ని భరించలేకపోతే చివరి క్షణంలోనైనా వివాహం రద్దు అవుతుంది లేదా ఒకవేళ అది జరిగినా వధువును, కట్నంకోసం ఆమె భర్త, అతని బంధువులు వేధిస్తారు. కాబట్టి వరకట్నం అనేది మన సమాజంలో ఒక సిగ్గుపడాల్సిన దురాచారం, దీనిపై ఒక దృఢ సంకల్పంతో పోరాడాలి.

కోరినంత కట్నం తేలేదని, వధువులను కాల్చిచంపడం మీరు వినే ఉంటారు. ప్రస్తుతం వరకట్న నిషేధనానికి చాలాబలమైన చట్టాలు చేయబడ్డాయి. ఈ విషయానికి సంబంధించి 'అఖిల భారత మహిళా సంఘం'(All India Women's Association)లాంటి స్వచ్ఛంద సంస్థల పాత్ర చేప్పుకోదగ్గది. ఈ సంస్థలు పోలీసులచే చట్టాలు అమలు చేయించడంతో పాటు, పై నేరానికి పాల్పడిన వారిని సంఘ బహిష్కరణ(Social boycot) చేయడంద్వారా, వరకట్నానికి వ్యతిరేకంగా ప్రజలలో సామాజిక స్పృహను కలిగించుచున్నది. స్త్రీలను అణచివేతకు గురిచేసిన మరియొక దురాచారం 'సతి' ప్రస్తుతం ఈ దురాచారం దాదాపుగా అదృశ్యమైపోయినా అక్కడక్కడా కనబడుతోంది. 1988లో రాజస్తాన్‌లోని దేవరాలాలో(Deorala)జరిగిన ఉదంతం దీనికి ఉదాహరణగా చెప్పవచ్చు. వాస్తవానికి అనేక సందర్భాలలో భార్యకు ఇష్టం లేకపోయినా, భర్త చితిపైకి దూకి భార్యను ఆత్మహత్య చేసుకునేటట్లు బలవంతపెట్టేవారు. మన సమాజంలో స్త్రీలపై జరిగిన ఈ సామాజిక అత్యాచారం సార్వత్రికంగా ఖండించబడినది. స్త్రీలను 'సతి'కి ప్రేరేపించడాన్ని ప్రచారం చేయడాన్ని, బలవంత పెట్టడాన్ని వ్యతిరేకిస్తూ ఒక చట్టం చేయబడింది.

చట్టాలు లేక నియమాలు లేక నిబంధనలలో మార్పుల ద్వారా కేవలం నియంత్రిత సమానత్వం మాత్రమే వస్తుంది. కాని వాస్తవంగా స్త్రీ స్వేచ్ఛ కేవలం పురుషులకు. స్త్రీలకు మధ్య తేడాలు తొలగినప్పుడే వస్తుంది. స్త్రీలను సమాజ జీవితానికి సంబంధించిన వివిధ రంగాలలో ఎక్కువగా, చురుకుగా పాల్గొనేటట్లు చేయడం ద్వారా, వారిపై వారికి నమ్మకం పెరిగి, వారు స్వేచ్ఛగా జీవించడం సాధ్యపడుతుంది. రేడియో, దూరదర్శన్(టి.వి)ల ద్వారా, బాల్యవివాహాలు చేయడానికి వ్యతిరేకంగా ప్రజలను చైతన్య పరచడంలో ప్రయత్నాలు జరుగుతున్నాయి. స్త్రీ విద్య స్థాయి పెరగుతుండటంతో, రాబోయే కాలంలో స్త్రీల వివాహ వయస్సు పెరగడానికి అవకాశముంది. ప్రభుత్వ కార్యాలయాలల్లో, వ్యాపారసంస్థలో, అనేక ఇతర వృత్తులలో పనిచేసే స్త్రీల సంఖ్య క్రమంగా పెరుగుతోంది. స్త్రీ ఆర్థిక స్వాతంత్ర్యానికి, వారికి ఉద్యోగాలు తప్పనిసరి, ఉద్యోగం పొందాలంటే స్త్రీ విద్య తప్పనిసరి. అయితే అనేక సందర్భాలలో స్త్రీలకు ఉద్యోగం వారికి గృహిణి లేక తల్లి బాధ్యతలకు అదనంగా అది ఒక బాధ్యతగా మాత్రమే అయ్యింది.

ప్రస్తుతం స్త్రీలలో చైతన్యం పెరుగుతోంది. స్త్రీ హక్కులు, సమాజంలో వారికి ఒక సముచిత స్థానం పొందడానికి విజయవంతంగా వ్యవస్థీకృతమైన వారి స్వరాన్ని వినిపించడంలో కృతకృత్యులయ్యారు. స్త్రీ స్వేచ్ఛ వారికి సముచిత విద్య, ఆర్థిక స్వాతంత్ర్యం, వరకట్నం, సతి లాంటి దురాచారాల నిర్మూలన ఉన్నతమైన భారత సమాజ ఏర్పాటుకు అవసరం.

**జనాభా :**

సామాజిక పరిణామం(Social transformtion) అతిపెద్ద మౌలిక అంశం జనాభా. భారతదేశంలో జనాభా

చాలా ప్రమాదకర రీతిలో పెరుగుతోంది. మనఅభివృద్ధి జరుగుతున్న ప్రయత్నాలకు ఇది అవరోధంగా మారడమే కాకుండా, జీవనోపాధి దొరకక పోవడంవల్ల మానవశక్తి వృధా అవుతోంది. మనదేశంలో కుటుంబ నియంత్రణ కొరకు ఒక బృహత్తర కార్యక్రమం చేపట్టబడింది. నగర మరియు గ్రామీణ ప్రాంతాలలో నివసించు ప్రజలు కుటంబ నియంత్రణపై ఆసక్తి కనబరుస్తున్నారు. అసంఖ్యాకంగా పెరిగిన జనాభాను అదుపు చేయడానికి సమాజం తన ప్రయత్నాలు చేస్తోంది.

**జాతీయ సమైక్యత** (National Integration) :

ఒక జాతి నిర్మాణానికి జాతీయ సమైక్యత మౌలిక ఆవశ్యకం. మీరు, దీని గురించి చదువుతూ, వింటూ ఉంటారు కాని, జాతీయ సమైక్యత అంటే ఏమిటి? జాతీయ సమైక్యత అంటే, దేశంలోని ప్రజలంతా వారి వారి మతాలు, భాషలు వేరైనా తామంతా ఒక్కటే అన్న భావన కలిగిఉండటం. పూర్తి వైవిధ్యంతో నిండిన మనదేశంలో, ప్రజలందరు తాము ముందు భారతీయులం అని ఆ తర్వాతనే హిందువులు లేక ముస్లింలు లేక సిక్కులు లేక క్రైస్తవులు అనే భావన కలిగి ఉండాలి. భారతదేశంలో జాతి-నిర్మాణం ఒక గొప్ప అనుభవం. దీనికోసమై విభిన్న వర్గాలకు చెందిన ప్రజలు మరియువారి కార్యకలాపాలు అనుసంధానం చేయబడటమేగాక, ఒక సమైక్యకృషి చేయగలిగిన ప్రజల అవసరం ఉంది. మనమందరం ఏకంగా నిలిచి, ఈ అతిపెద్ద కార్యక్రమంలో భాగస్వాములు కావాలి. దీనికొరకు, మనం అనేక సమస్యలను అధిగమించాలి.

**మతతత్వం** (Communalism) :

మతతత్వం అనగా రాజకీయ ప్రయోజనాల కోసం, మతాన్ని దుర్వినియోగ పరచడమే. ఇది వివిధ మత సమూహాల మధ్య వైరుధ్యాన్ని పెంచింది. ఇది ప్రజలు వారి వారి మతాల గుర్తింపు కోసం అనవసర పట్టుదల అత్యుత్సాహం ప్రదర్శించడం తద్వారా అది విభిన్న మతాల మధ్య పరస్పర ద్వేషాలు, పగలు పెరగడానికి దారి తీసింది. ఇది తరచుగా హేయమైన హింసకు దారితీస్తుంది. మన జాతీమ ఐక్యతకు ఇది ఒక పెద్ద అవరోధంగా మారింది.

మతతత్వంను మనజాతీయ సమైక్యతా మార్గంలో ఉన్న అతి ముఖ్యమైన అవరోధాలలో ఒకటిగా చెప్పవచ్చు. విభిన్న వర్గాలకు చెందిన ప్రజలు అంతా కలిసి మెలిసి శాంతియుతంగా జీవించారు. బ్రిటీష్‌వారి పరిపాలనా కాలంలో బ్రిటీష్ ప్రభుత్వం ముస్లింలను ప్రధాన జాతీయ స్రవంతినుండి దూరంగా ఉంచడానికి, వారికి ప్రత్యేక సదుపాయాలు (Provision)కల్పించారు. భారత ఓటర్లు, మతప్రాతిపదికపై విభజింపబడి, చివరకు అది దేశ విభజనకు దారితీసింది. స్వాతంత్ర్యానంతరం భారత రాజ్యాంగం సామ్యవాదాన్ని అంగీకరించి, అన్ని మతాలను సమానంగా చూస్తూ అవకాశాలు కల్పించింది. అప్పటినుండి, మతతత్వంపై అన్నివైపుల నుండి పోరాటం జరుగుతూఉంది.

స్వాతంత్ర్యానంతర కాలంలో క్రొత్తతరం వారు లౌకిక దృక్పధంతో ఉన్నారు. మతమౌఢ్యంతో మనశక్తిని వృధా చేసుకునే కంటే అభివృద్ధికి పెద్దపీట వేయడం కోసం వారు పట్టుదల వహించారు. అయితే మతతత్వం పూర్తిగా అంతరించిందని చెప్పలేం కాని, నేటి యువతలో ఎక్కువ భాగం లౌకికవాద విశాల దృక్పధాన్ని అలవరచుకుంటున్నారు. మనమంతా మతతత్వానికి వ్యతిరేకంగా ప్రజల్ని చైతన్యవంతుల్ని చేసి, దానికి వ్యతిరేకంగా పనిచేసి మనమంతా ఒకే జాతిగా ఉంటూ సంతోషంగా నివసించేటట్లు బాటలు వేయాలి.

**భాష మరియు ప్రాంతీయతత్వం** (Language & Regionalism) :

జాతీయ ఆలోచనా దృక్పథంలో మరియొక అవరోధం భాష. భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో ప్రజలు వివిధ భాషలను మాట్లాడతారు. ప్రతిభాషకు తనదైన సొంత సాహిత్యం, సంస్కృతి ఉంటాయి. ప్రతిభాష, దాని సాహిత్యం మన జాతీయ సంస్కృతి విరాజిల్లడానికి కారణమైనప్పటికీ, భాష అనేది ఒక అడ్డంకిగా మారకూడదు. మీరు ఇప్పటికే, భాష అనేది భారతదేశంలోని వివిధ రాష్ట్రాల ఏర్పాటుకు ఎలా మూలమైందో చదివియున్నారు. బ్రిటీష్‌వారి పాలన చివరిభాగంలో భాషను గురించి ఏర్పడిన వివాదం చాలా ముఖ్యపాత్ర వహించింది. భారత జాతీయ కాంగ్రెస్, అన్ని జాతీయ భాషలకు రక్షణ కల్పించాలని, భారతదేశంలోని రాష్ట్రాలను భాషాప్రాతిపదికపై పునర్వ్యవస్థీకరించాల్సిందిగా తీర్మానం చేసింది. అయితే రాష్ట్రాల మధ్య భాషాపరంగా సరిహద్దు సమస్యలు తలెత్తాయి. ప్రాంతీయతత్వం, సంకుచితత్వం(Parochialism)అనేవి ఈ భాషా సమస్యనుండి రేకెత్తి, జాతీయ సమైక్యతకు విఘాతంగా పరిణమించాయి. అన్ని భాషలు అభివృద్ధి చెందినప్పటికీ విడివిడిగా ఉన్న మనజాతి ప్రజలందరూ ఒకరితో ఒకరు సంభాషించడానికి ఒక అనుసంధాన భాష అవసరం. అందుకే ఆంగ్లభాష స్థానంలో, హిందీని జాతీయ అనుసంధాన భాషగా అభివృద్ధిచేయాలని తలంచబడింది. అయితే కొంతమంది ప్రజలు తమ స్వప్రయోజనాలు దెబ్బతింటాయని భావించి దీనికి సమ్మతించలేదు. అందుకే పండిట్ నెహ్రూ "హిందీ మాట్లాడని రాష్ట్రాలలో హిందీతోపాటు ఆంగ్లం కూడా వారు కోరుకున్నంత కాలం అధికార భాషగా కొనసాగుతుంద"ని హామీ ఇచ్చారు. ఇది జాతి పునరేకీకరణ(reconciliation)కు తోడ్పడుతుంది. క్రమేణా ప్రజలు, వారి వారి మాతృ భాషలతో పాటు, అధికార భాషను నేర్చుకోవడంలో ఆసక్తిని కనబరుస్తున్నారు. మనమందరమూ 22 భారత భాషలను మన అధికారిక భాషలుగా గుర్తించి వాటి అభివృద్ధికి తోడ్పడాలి. అధికారిక ప్రయోజనాలతోపాటు తేలికగా మాట్లాడుకోవడానికి ఒక అనుసంధాన భాష అవసరమని గుర్తించాలి.

ప్రాంతీయతత్వం, జాతీయ సమైక్యతకు మరియొక ఆటంకం అయ్యింది. ఇటువంటి సంకుచిత ధోరణులు(parochialism), రాజకీయాలను కూడా ప్రభావితం చేశాయి. స్థానిక ప్రజలు పేదరికం, నిరుద్యోగ స్థితులు వారిలో వారిపట్ల నిర్లక్ష్య ధోరణి కలుగజేసి జాతీయ సమైక్యతకు ఆటంకంగా మారింది. ప్రజలలో ఉన్నటువంటి వ్యతిరేక భావనలు పోగొట్టడానికి వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధిపై ప్రత్యేక శ్రద్ధ వహించాలి. దేశంలోని ఏ ప్రాంతమూ నిర్లక్ష్య ధోరణికి గురికాకుండా, గిరిజన జాతుల, ఇతర వెనుకబడిన ప్రజల అభ్యున్నతికి చేపట్టే కార్యక్రమాలలో ప్రత్యేక కేంద్ర సహాయం అందజేయబడుతుంది. ఎవరి రాష్ట్రంపై వారికి, ఎవరి ప్రాంతంపై వారికి ప్రత్యేక అభిమానం ఉండటంలో తప్పులేదు కాని ఈ భావన జాతీయ ఆసక్తులకు గాని లేక ఇతర రాష్ట్రాల ఆసక్తులకు గాని అడ్డంకి కారాదు. ఇతర రాష్ట్రాలపైగాని లేక మొత్తం దేశంపైగాని ద్వేషాన్ని రెచ్చగొట్టి ప్రాంతీయతత్వం మాత్రం ఒక చెడు ఆలోచన అని చెప్పవచ్చు.

సంకుచిత ధోరణి, ప్రాంతీయతత్వం, కులతత్వం, ఇతర ధోరణులకు ఒకే ఒక మన సమాధానం జాతీయ సమైక్యత కాబట్టి మనమందరం మనరాష్ట్ర, మనజిల్లా, మనగ్రామ ప్రగతిని త్యాగం చేయనవసరం లేని పటిష్టమైన భారతదేశం కొరకు పనిచేయాలి.

## 65.2 పాఠ్యప్రశ్నలు :

1. సామాజిక పరిణామం అర్థాన్ని ఒక వాక్యంలో తెల్పండి.
2. 'సామాజిక అసమానత్వానికి' కారణమైన భారతదేశంలోని సంప్రదాయ వ్యవస్థ ఏది?
3. 'శారదా చట్టం' ఎందుకు చేయబడింది?

## 65.6 ఆర్థిక అభివృద్ధి మరియు ఆర్థిక ప్రణాళికా విధానం :

(Economic Development & Economic Planning)

బ్రిటీష్ వారి పారిశ్రామిక విధానాన్ని గురించి భారత సంపదంతా ఇంగ్లండ్‌కు తరలిపోవడం గురించి మీరు ఇప్పటికే చదివియున్నారు. 200సంవత్సరాల బ్రిటీష్ వారి పాలన భారతదేశాన్ని ఆధారితంగాను(dependant) వెనుకబడినది గాను, నిరుపేద దేశంగాను మార్చింది. బ్రిటీష్ పాలన మన పరిశ్రమలను మరియు మన ఆర్థిక రంగాన్ని నాశనం చేసింది.

భారతదేశానికి 1947లో స్వాతంత్ర్యం రావడంతో జాతీయ నాయకులకు, ప్రజలకు ఉపశమనం కలిగి క్రొత్త క్రొత్త ఆశలు చిగురించాయి. దీనిని, నాయకులు ఒక సవాలుగా తీసుకొని ఒక నూతన రాజ్యాంగం ద్వారా దేశం సర్వతోముఖాభివృద్ధి కొరకు లక్ష్యాన్ని నిర్దేశించుకున్నారు. 1950లో అమలులోకి వచ్చిన రాజ్యాంగం స్పష్టంగా సామాజిక ఆర్థిక లక్ష్యాలను ప్రకటించింది. రాజ్యాంగంలోని పీఠికనందు పొందుపరచబడిన మార్గదర్శక సూత్రాలు, ప్రభుత్వం ప్రజలందరికీ జీవనోపాధి కల్పించాలని, ప్రజలందరికీ ఉపయోగపడే వనరులను, సమీకరించాలని, సంపదను, ఉత్పత్తి వనరులను అందరికి సమానంగా పంచాలని, జీవన ప్రమాణస్థాయిని పెంచాలని నిర్దేశించే ఆదేశిక సూత్రాల ద్వారా నొక్కి చెప్పబడినది. సూక్ష్మంగా చెప్పాలంటే ప్రభుత్వం కేవలం ఆకారంలో మాత్రమే కాక యాధార్ధంగా కూడా ప్రజలందరి శ్రేయస్సుకోసం విశాల లక్ష్యాలను ఏర్పరచుకోవాలని రాజ్యాంగం ప్రభుత్వానికి స్పష్టంగా ఆదేశించింది. రాజ్యాంగం విధులను నిర్వర్తించడానికి ప్రభుత్వం అందుబాటులో ఉన్న వనరులను గరిష్టంగా ఉపయోగించుకోవడానికి ఆర్థిక ప్రణాళికా రచనను అమలు చేసింది. జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షునిగా 1950లో ప్రణాళికా సంఘం ఏర్పాటు చేయబడింది.

ప్రణాళికా విధానం కొన్ని నిర్ధేశించిన లక్ష్యాలను స్పష్టమైన గుర్తించదగ్గ మార్గాల ద్వారా సాధించడానికి చేయబడిన ఒక మంచి ఆలోచనగా నిర్వచించవచ్చు. ఆర్థిక ప్రణాళికా రూపకల్పన అంటే అందుబాటులో ఉన్న వనరులను సక్రమంగా వినియోగించి కొన్ని ఆర్థిక లక్ష్యాలను సాధించడానికి చేయు ఉద్దేశ్యపూర్వక సమిష్టి ప్రయత్నం. భారతదేశంలో ప్రణాళికా రచన ప్రతి ఐదేళ్ళకు, చేయబడి అది మొత్తం దేశానికి సంబంధించినదిగా ఉంటుంది. ఇప్పటికి 10 పంచవర్ష ప్రణాళికలు పూర్తి కాబడి, 11వ ప్రణాళిక కొనసాగుతోంది. ప్రతి ప్రణాళికకు నిర్ధిష్ట లక్ష్యాలున్నప్పటికి అన్ని ప్రణాళికలు దాదాపు కొన్ని సామాన్య లక్ష్యాలు కలిగి ఉంటాయి.

### భారతదేశంలో ప్రణాళికా విధానం ప్రధాన లక్ష్యాలు :

ప్రణాళికా రచన యొక్క లక్ష్యాలు ఏవి? భారతదేశంలో ప్రధానంగా మనం నాలుగు లక్ష్యాలను గుర్తించవచ్చు.

ఇవి ఆర్థిక పెరుగుదల (అభివృద్ధి), స్వావలంబన, సామాజిక న్యాయం మరియు పూర్తి ఉద్యోగిత. ఈ పదాలకు అర్థమేమిటో ప్రస్తుతం మనం గమనిద్దాం.

**అధికస్థాయి ఆర్థిక పెరుగుదల** (High rate of economic growth) ;

ప్రణాళికా రచన ప్రధాన లక్ష్యాలలో ఒకటి ఆర్థిక పెరుగుదల. దీనిని వ్యవసాయం, పారిశ్రామిక రంగాలలో అభివృద్ధి ద్వారా సాధించవచ్చు. ఆర్థిక పెరుగుదల సాధించడం ద్వారా జాతీయ ఆదాయంలో పెరుగుదల సాధించవచ్చు. వ్యవసాయ సౌకర్యాలైన విత్తనాలు, ఎరువులు, యంత్రాలు మొదలగు వానిని సమకూర్చడం ద్వారా ఎక్కువ భూమిని వ్యవసాయ యోగ్యంగా మార్చి, తద్వారా వ్యవసాయ ఉత్పత్తిని పెంచవచ్చు. నూతన పరిశ్రమలు స్థాపించడం, ఉన్నవాటిని విస్తృతం చేయడం ద్వారా పారిశ్రామికాభివృద్ధిని సాధించవచ్చు. కాబట్టి, ప్రభుత్వం ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన వివిధ రంగాలలో ఉత్పత్తిని పెంచడానికి ఒక వివరణాత్మక పథక రచన చేయాలి. వ్యవసాయ యంత్రాలు లాంటి ఉత్పత్తి యంత్రాల అభివృద్ధి చేయడం అనేది ఉత్పత్తిని పెంచడానికి ఒక ముఖ్యమైన కారకంగా చెప్పవచ్చు. ఆవిధంగా భారతదేశంలో ప్రణాళికా విధానం కూడా ఉత్పత్తి సాధనాల ఆధునికీకరణపై దృష్టి సారించింది. ఈ ఉద్దేశ్యంతోనే ఆధునిక శాస్త్ర పరిజ్ఞానాన్ని ఉపయోగించడంపై ప్రత్యేక శ్రద్ధ పెట్టడం జరిగింది.

**స్వయం సమృద్ధి** (Social Justice) :

ప్రణాళికా రచన మరియొక లక్ష్యం మన జాతీయ ఆర్థిక వ్యవస్థను స్వాలంబన (Self reliant) కలదిగా చేయడం ఇది ప్రపంచ ఆర్థిక వ్యవస్థలోని ఇతర దేశాలతో సమాన సంబంధ బాంధవ్యాలకు హామీనివ్వడమే కాక ఏదైనా దేశం, మనదేశం ఆర్థిక వ్యవస్థ బలహీనతలను తన స్వప్రయోజనాలకు వాడుకోవడాన్ని తగ్గించడమే ప్రపంచంలోని ఏదేశమూ తనకవసరమైన అన్ని వస్తువులను ఉత్పత్తి చేసుకోలేదు. కాని, ఒకదేశం తనకవసరమైన ముఖ్య ఉత్పత్తులలో ఎక్కువభాగం ఇతరదేశాల నుండి పొందుతుంటే ఆదేశాన్ని ఆర్థిక స్వాలంబనగల దేశంగా పేర్కొనలేం. ధనరూపంలో గాని లేక వస్తురూపంలో గాని విదేశీ సహాయంపై ఆధారపడటాన్ని తగ్గించడం మరియు అంతిమంగా అసలు ఆధారపడకుండా ఉండేలా చేయటమే భారతదేశంలో ఆర్థిక స్వాలంబన భావన. మనదేశంలోకి విదేశాలనుండి ప్రస్తుతం దిగుమతి చేసుకుంటున్న వస్తువులను మనదేశంలోనే ఉత్పత్తి చేసుకోవడం, మనదేశంలోనే చాలినంత ఆర్థిక పరిపుష్టి కలిగించడం, మనదేశం ప్రణాళికా లక్ష్యంగా పెట్టుకొని తద్వారా విదేశీ సహాయాన్ని తొలగించే విధంగా ఈ విధానాలు జయప్రదమైతే క్రమేణా భారతదేశం ఆర్థిక స్వావలంబనాన్ని పెంపొందిస్తుంది.

**సామాజిక న్యాయం** (Social Justice)

మనదేశంలోని పేదవారికి సామాజిక న్యాయం ఏర్పరచడాన్ని కూడా ప్రణాళికా రచన తన లక్ష్యంగా పెట్టుకుంది. ఈ వర్గానికి చెందిన ప్రజలు ఆర్థికంగా చాలా బలహీనంగా ఉండి వారి ఉత్పాదక సామర్థ్యం, ఆదాయం పెంచుకోలేని పరిస్థితిలో ఉండటం వలన వీరికి ప్రభుత్వం సహాయ సహకారాలు అవసరం. సామాజిక న్యాయం అనే లక్ష్యంలో రెండు దృక్పథాలున్నాయి. ఒకటి, భూమిలేని నిరుపేద వ్యవపాయ కార్మికులు, ఇతర వృత్తుల వారు షెడ్యూల్డ్ కులాలు మరియు షెడ్యూల్డ్ జాతాల లాంటి బలహీనవర్గాల అభ్యున్నతికోసం ప్రత్యేక శ్రద్ధ చూపింది. సామాజిక న్యాయం మరియొక దృక్పథం సంపద అసమాన పంపిణీని నిరోధించడం, సమాజం బలహీన వర్గాలకు అది చెందేట్లు చూడటం. ప్రభుత్వం ఈ లక్ష్యాన్ని, భూసంస్కరణలు మరియు పన్ను మదింపులాంటి విధానాల ద్వారా సాధించదలచింది.

**సంపూర్ణ ఉపాధి** (Full Employment) :

భారతదేశం అధిక జనాభా కలిగిన చాలా పెద్ద దేశం కాబట్టి ఉపాధి అవకాశాలు సమృద్ధిగా కన్పించడం మనదేశ ప్రణాళికా విధాన ముఖ్యలక్ష్యమయ్యింది. నిరుద్యోగులకు ఉద్యోగాలు కల్పించడం అనే అంశాన్ని పదే పదే నొక్కి చెప్పడం ద్వారా అధిక ప్రాధాన్యత ఇవ్వడం మన ప్రభుత్వం నిరంతర లక్ష్యమయ్యింది. ఎందుకంటే మనకు స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుండి, మనదేశ జనాభా చాలావేగంగా పెరుగుతోంది. ఆ విధంగా, ప్రభుత్వం ప్రజలందరికి ఎక్కువ ఉత్పాదకత గల వృత్తిని కల్పించవలసి ఉంది. ప్రభుత్వం కనుక వీరికి ఉత్పాదక వృత్తిని కల్పించ లేకపోతే, పేదరికం మరింత పెరిగి, సామాజిక అసమానత అనే సమస్య ఇంకొంత క్లిష్టతరమవుతుంది. కాబట్టి ప్రభుత్వం పనిచేయగలిగిన వారికి పూర్తి ఉపాధి కల్పించడం అనేది భారతదేశం ప్రణాళికా విధాన ప్రధాన లక్ష్యమయ్యింది.

**ప్రణాళికా నిర్మాణం – చేపట్టబడిన విధానం** (Planning Structure - How is planning carried out) :

భారతదేశంలో కేంద్ర స్థాయిలో ప్రణాళికా సంఘం అనేది ప్రణాళికా రచనా యంత్రాంగంలో అత్యున్నత అంగం. భారత ప్రభుత్వం దీనిని ఒక తీర్మానం ద్వారా 1950 మార్చిలో స్థాపించింది. జాతీయ పంచవర్ష ప్రణాళికలు రూపొందించడం, భారత ఆర్థిక వ్యవస్థలో వివిధ రంగాలలో నమోదుచేసిన అభివృద్ధి సరళులను నిశితంగా పరిశీలించడం దీని ప్రధాన బాధ్యత. ప్రణాళికా సంఘం అధ్యక్షుడు ప్రధానమంత్రి. దీనియందు ఎనిమిది మంది సభ్యులుంటారు. వీరిలో కొంతమంది మంత్రులు, ఇతరులు జీవితకాల సభ్యులు. ఇది ప్రణాళికలు రూపొందించడంలో ఇతర సాంకేతిక నిపుణుల సహకారం కూడా తీసుకుంటుంది.

జాతీయ పంచవర్ష ప్రణాళికలు రూపొందించటంలో ప్రణాళికా సంఘంతోపాటు, ఒక జాతీయ అభివృద్ధి మండలి(NDC)కూడా సహాయ పడుతుంది. ఈ మండలిలో ప్రణాళికా సంఘం నందున్న అందరు సభ్యులతోపాటు భారతదేశంలోని రాష్ట్రాలు, కేంద్ర పాలిత ప్రాంతాల నుండి ప్రతినిధులు సభ్యులుగా ఉంటారు. జాతీయ అభివృద్ధి మండలి సమావేశాలలో, ఆయా రాష్ట్రాలు, కేంద్రపాలిత ప్రాంతాల అవసరాలు, ఒత్తిడులు, సామర్థ్యాల కనుగుణంగా ప్రణాళికలలో సవరణలు చేయును.

జాతీయ స్థాయికి క్రింద ప్రణాళికా రచనా ప్రక్రియకు దోహదపడే రాష్ట్ర ప్రణాళికా సంఘం(State planning board) జిల్లా ప్రణాళికా సంఘం(District planning board)లాంటి సంస్థలు పనిచేస్తున్నాయి. ప్రణాళికలు తయారుచేయడంలో ప్రభుత్వ అధికారులతో పాటు వివిధ సామాజిక సంఘాలు, సాంకేతిక నిపుణులు పాల్గొంటారు. ఇది అతి సంక్లిష్ట ప్రక్రియ కాబట్టి దేశానికి ఒక పంచవర్ష ప్రణాళిక తయారుచేయాలంటే సుమారు మూడు సంవత్సరాల కాలం పడుతుంది.

**పంచవర్ష ప్రణాళికలు :**

భారతదేశంలో ప్రణాళికా రచన ప్రధాన లక్ష్యాలు అభివృది(growth),స్వావలంబన(self-reliance), సామాజిక న్యాయం(social justice)మరియు పూర్తి ఉపాధి కల్పన(full employment)అయినప్పటికీ, ప్రతి పంచవర్ష ప్రణాళికకు కొన్ని ప్రత్యేక నిర్దేశిత లక్ష్యాలుంటాయి. ఈ స్వల్పకాలిక లక్ష్యాలే, భారత ఆర్థిక వ్యవస్థ స్వభావాన్ని మార్చగల్గునట్లు నిర్దేశించబడతాయి.

మొట్టమొదటి పంచవర్ష ప్రణాళిక 1951లో రెండవ ప్రపంచ యుద్ధం మరియు దేశవిభజనల వలన ఏర్పడిన అసమతౌల్యములను పరిష్కరించుటకు రూపొందించబడింది. అందుబాటులో ఉన్న అతి తక్కువ వనరులతో ఈ ప్రణాళిక ఎక్కువగా వ్యవసాయం, నీటి పారుదల వరకే పరిమితమయింది. ప్రజల సామర్థ్యం, పెంపుదల, వారి జీవన ప్రమాణస్థాయిని పెంచుట అనే లక్ష్యాలలో దేశమంతటా సామాజిక అభివృద్ధి పథకాలను విస్తరించడం ఈ ప్రణాళిక ఒక ముఖ్య ఉద్దేశ్యం. ఈ ప్రణాళిక ముఖ్యంగా వ్యవసాయం మరియు సామాజిక సేవా రంగాలలో గమనించదగిన విజయాన్ని సాధించింది.

రెండవ ప్రణాళిక, ఆర్థిక స్థిరత్వం కల్గించాలనే లక్ష్యంతో 1956లో తయారుచేయబడింది. రెండవ ప్రణాళిక మౌలిక లక్ష్యం సామ్యవాద సమాజ స్థాపన (socialist pattern of society)సాధించడం. పారిశ్రామిక రంగానికి ఎక్కువ ప్రోత్సాహం కల్పించడంతో భారత ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి త్వరితగతిన జరగడం సాధ్యపడింది.

క్రీ.శ. 1961-66, కాలానికి తయారుచేయబడిన మూడవ పంచవర్ష ప్రణాళిక స్వీయస్థిరత్వం పెరుగుదల(self-sustaining growth)దిశగా ప్రయానించడాన్ని నిర్దేశించబడింది. మూడవ ప్రణాళిక అభివృద్ధి సాధించడంలో ఎదుర్కొంటున్న సమస్యలపై విశాల దృక్పధాన్ని కలిగిఉండి, వ్యవసాయం, విద్యుత్, రవాణా రంగాలలో మెరుగుదలకై, పారిశ్రామిక శాస్త్ర సాంకేతిక రంగాలలో వస్తున్న మార్పులను వేగిరపరచడానికి అత్యవసర, తీవ్ర ప్రయత్నాలకై పిలుపునిచ్చింది. అయితే, ఈ ప్రణాళికపై 1962 మరియు 1965లో వరుసగా చైనా మరియు పాకిస్తాన్‌లతో జరిగిన యుద్దాలు ప్రభావం చూపాయి. వ్యవసాయ ఉత్పత్తి, పారిశ్రామిక ఉత్పత్తి రెండింటిలోనూ నిర్దేశించిన లక్ష్యాలలో సగానికంటే కూడా తక్కువగా మాత్రమే సాధించబడ్డాయి. మూడవ ప్రణాళిక ముగిసేసరికి ఆర్థికరంగం పరిస్థితి 4వ పంచవర్ష ప్రణాళిక ఆలస్యం చేయవలసి వచ్చేంత క్లిష్ట పరిస్థితులలో ఉంది. దీనికి బదులుగా 1966-69ల మధ్య ఒక సంవత్సర కాల వ్యవధికల వార్షిక ప్రణాళికలకు పరిమితం చేయబడ్డాయి.

నాల్గవ ప్రణాళిక ఆర్థికరంగ స్థిరత్వ పరిస్థితులను కొనసాగిస్తూ అభివృద్ధిలో పెరుగుదల వేగాన్ని సాధించుటకై ఉద్దేశించబడింది. మంచినీటి సదుపాయం గల సాంద్ర సాగు వ్యవసాయం(intensive irrigated agriculture), మౌలిక పరిశ్రమల అభివృద్ధి కొరకు ప్రయత్నాలు కొనసాగిస్తూనే, భవిష్యత్ శాస్త్ర సాంకేతిక రంగాలలో ముందంజ కోసం ప్రతిపాదించటమే గాక అదే సమయంలో దేశవ్యాప్తంగా పారిశ్రామిక కార్యకలాపాలను వ్యాప్తి చేయుటకు ఉద్దేశింపబడింది. ఇది సమాజంలోని బలహీనవర్గాల పరిస్థితులను మెరుగుపరచడం, సంపదలో అసమానతలు తొలగించడం ద్వారా సమానత్వం, సామాజిక న్యాయాలను సాధించడంపై శ్రద్ధ వహించింది. అయితే ఈ ప్రణాళిక ఏర్పరచుకున్న లక్ష్యాలలో యాభైశాతం మాత్రమే సాధించగలిగింది. ఈ ప్రణాళికా సమయంలో దేశంలో ధరలలో కూడా 70శాతం పెరుగుదల కన్పించింది.

5వ పంచవర్ష ప్రణాళికకు ముందే 1971 సాధారణ ఎన్నికలలో కాంగ్రెస్ (ఆర్) పార్టి అనూహ్య మెజారిటీతో విజయం సాధించింది. ఎన్నికలలో ఆపార్టీ నినాదం 'గరీబీహఠావో' అనగా 'పేదరికాన్ని తొలగిద్దాం'. ఇదే 5వ పంచవర్ష ప్రణాళిక ప్రధాన లక్ష్యంగా మారింది. ఈ ప్రణాళికలో పేద, బలహీన వర్గాల కనీస అవసరాలను తీర్చే ఒక జాతీయ కార్యక్రమం ఈ ప్రణాళికలలో చేర్చబడింది. సమాజంలోని బలహీన వర్గాల వారికి ఉపాధి కల్పన కొరకు అత్యధిక అవకాశాలు కల్పించడం ఈ ప్రణాళికలోని ప్రధాన అంశం. అయితే, పేదరిక నిర్యూలనా కార్యక్రమాల కొరకు అత్యధిక ప్రాధాన్యం ఇచ్చినా, ప్రభుత్వం పారిశ్రామిక అభివృద్ధిపై నుండి ప్రభుత్వం తనదృష్టి మరల్చలేదు. ప్రణాళికా వ్యయంలో

అత్యధిక వాటా పారిశ్రామిక రంగానికే కేటాయించబడింది.

6వ పంచవర్ష ప్రణాళిక నందు అనుసరించిన వ్యూహంలో వ్యవసాయం, పారిశ్రామిక రంగాలు ఏకకాలంలో వేగంగా అభివృద్ధి చెందుటకు విద్యుత్, రవాణా సౌకర్యాలను కల్పించడం వంటి అంశాలు ఉన్నాయి. ఆయాపథకాల అమలుపై సునిశిత పర్యవేక్షణ జరపటం, ప్రజలు చురుకుగా పాల్గొనేటట్లు చేయడం ఈ పథకం దృష్టి పెట్టింది. ఈ వ్యూహం సత్ఫలితాలనిచ్చింది. ఇంధనవనరుల(energy)రంగంలో చెప్పుకోదగ్గ అభివృద్ధి కనబడింది. వ్యవసాయం, పారిశ్రామిక రంగాలలో నిర్దేశించుతున్న లక్ష్యాలు పూర్తిగా గాని లేక అవసరమైనంత మేర సాధించబడ్డాయి.

1985-90 కాలానికి 7వ పంచవర్ష ప్రణాళిక తయారు చేయబడింది. ఈ ప్రణాళిక ఆహారధాన్యాల ఉత్పత్తిలో పెరుగుదల, ఉపాధి అవకాశాల పెంపు, ఆర్థికరంగ ఉత్పాదకతలో పెంపు అను మూడు ప్రధాన లక్ష్యాలను నిర్దేశించింది. ఇది అంతకు క్రితం ప్రణాళికకు భిన్నంగా ప్రభుత్వ రంగం కంటే ప్రైవేట్ రంగంలో(52%) ఎక్కువగా పెట్టుబడులు పెట్టుటకు ఉద్దేశించింది. ఇది ఆర్థికరంగంపై ప్రభుత్వ నియంత్రణ తగ్గుదలను సూచిస్తోంది. 8వ పంచవర్ష ప్రణాళిక (1992-1997) కేంద్రీయ ప్రణాళికా ఆర్థిక వ్యవస్థ నుండి సూచనాత్మక ప్రణాళికా రచన (indicative planning) ద్వారా మార్కెట్ ఆధారిత ఆర్థిక వ్యవస్థవైపు మారుతున్నట్లు(transition) సూచిస్తుంది. 9వ పంచవర్ష ప్రణాళిక(1997-2002) సామాజిక న్యాయం, సమానత్వంతో కూడిన అభివృద్ధిని లక్ష్యంగా పెట్టుకుంది. 10వ పంచవర్ష ప్రణాళిక (2002-2007)), ద్రవ్య సుస్థిరత(fiscal consolidation),వ్యవసాయం, దేశ విదేశీ మౌలిక రంగాలలో పెట్టుబడులు వంటి వాటిపై శ్రద్ధ వహించింది.

మన పారిశ్రామిక విధానం అంతిమ లక్ష్యం, పారిశ్రామిక ఉత్పత్తిని మరియు ఉత్పాదకతను అత్యున్నత స్థాయికి పెంచడం, పారిశ్రామిక అభివృద్ధిని వేగిరపరచుటకు, ప్రభుత్వ, ప్రైవేటు రంగాల భాగస్వాములను ప్రోత్సహించే మిశ్రమ ఆర్థిక వ్యవస్థా విధానాన్ని ప్రభుత్వం అమలు చేసింది.

పారిశ్రామిక అభివృద్ధి సాధించుట కొరకు ఆధునిక శాస్త్ర, సాంకేతిక రంగాలను ఉపయోగించటానికి అనుగుణంగా భారతదేశం నిరంతరం ప్రయత్నిస్తూనే ఉంది. ప్రభుత్వ సంస్థలు, శాస్త్ర మరియు పారిశ్రామిక పరిశోధనా మండలి(CSIR), రక్షణ పరిశోధన మరియు అభివృద్ధి సంస్థ(DRD)లు పౌర మరియు రక్షణ అవసరాలకు పరిశోధనలు కొనసాగిస్తూనే ఉన్నాయి.

జాతీయ అభివృద్ధిలో శాస్త్ర, సాంకేతిక రంగాల పాత్ర ప్రభుత్వంచే సరిగా గుర్తించబడింది. రెండవ పంచవర్ష ప్రణాళిక "ఆర్థికాభివృద్ధిని సాధించడంలో అతి ప్రధానమైన ఏకైక కారణం, ఆధునిక శాస్త్ర, సాంకేతికతలను ఉపయోగించడంలో సమాజ సంసిద్ధత"అని ఉద్ఘాటించింది. 1971లో శాస్త్ర, సాంకేతిక శాఖ (Department of science and technology) ఆయా రంగాలలో నూతన అంశాలలో అభివృద్ధి సాధించడం కొరకు స్థాపించబడింది. రాష్ట్రస్థాయిలో కూడా శాస్త్ర, సాంకేతిక రంగాల కొరకు ఇటువంటి రాష్ట్రమండళ్ళు ఏర్పాటు చేయబడ్డాయి. జాతీయ విధానంలో భాగంగా శాస్త్రీయ కార్యక్రమాలను ప్రోత్సహించుటకు ప్రభుత్వం అనేక విభిన్నమైన పరిశోధన మరియు అభివృద్ధి పథకాలను ప్రోత్సహిస్తోంది. ఆవిధంగా నిరంతర ప్రయత్నాల వలన నేడు భారతదేశం ఒక పెద్ద, వైవిధ్య భరితమైన సాంకేతిక మానవశక్తి మరియు సామర్థ్యాలను కలిగిఉంది.

ఈరోజు మనదేశంలో అనేక నూతన పద్ధతులు, ఉత్పత్తులు, నాణ్యమైన వస్తూత్పత్తి వంటివి అభివృద్ధి చేయబడ్డాయి.

నేడు భారతదేశం, ఉక్కును అత్యధికంగా ఉత్పత్తి చేసే దేశాలలో ఒకట, పారిశ్రామిక ఉత్పత్తులలో ప్రపంచంలో మొదటి 15 దేశాలలో ఒకటిగా తన స్థానాన్ని సుస్థిరం చేసుకుంది. భారతదేశం, రోదసి పరిశోధన, అణుశక్తి మరియు ఎలక్ట్రానిక్స్‌లలో ప్రగతిని సాధించింది. ఆర్యభట్ట ఉపగ్రహం 1975లో రోదసిలోకి పంపబడింది. ఆ తర్వాత భాస్కర 1 మరియు 2లు కూడా రోదసిలోకి పంపబడ్డాయి. ఈ విజయాలు తర్వాత అనేక ఇతర ఉపగ్రహాలు, రాకెట్లు ప్రయోగించబడ్డాయి. విద్యారంగంలో సుదూర ప్రాంతాలకు చేరే ప్రయోగాత్మక కార్యక్రమం 1975లో ఉపగ్రహం (SITE)ఆవిష్కరించబడింది. ఉపగ్రహధారిత కార్యక్రమాలు, రేడియో, టెలివిజన, ఇతర కార్యక్రమాలలో గొప్ప విప్లవాన్నే తెచ్చాయి.

భారతదేశం (న్యూక్లియర్) అణుధార్మిక శక్తిని శాంతియుత ప్రయోజనాల కోసం ఉపయోగించుకోవడానికి ఉద్దేశించింది. 1948లో అణుశక్తి కమీషన్(Atomic energy commission)స్థాపించబడింది. అప్పటినుండి భారతదేశం అణుధార్మిక సాంకేతిక రంగంలో చెప్పుకోదగ్గ ప్రగతి సాధించింది. 1957లో ట్రాంబే వద్ద బాబా అణుధార్మిక కర్మాగారం స్థాపించబడింది. అది దేశంలో ఏర్పాటు చేయబడిన అతిపెద్ద ఏకైక విజ్ఞాన కేంద్రం. మహారాష్ట్రలోని తారాపూర్, రాజస్థాన్‌లోని 'కోట'(kots), తమిళనాడులోని కల్పాకం(kalpakam)ల వద్ద అణుధార్మిక విద్యుత్ కేంద్రాలు(Nuclear power stations)నెలకొల్పబడ్డాయి. ఉత్తరప్రదేశ్‌లోని నరోరా(Narora), గుజరాత్‌లోని కక్రాపార్(kakrapar)ల వద్ద అణు రియాక్టర్‌లు నెలకొల్పబడ్డాయి.

### ప్రణాళికా విధానం - మూల్యాంకనం :

ప్రణాళికా విధానం భారత ఆర్థిక వ్యవస్థలో చెప్పుకోదగిన ప్రగతిని సాధించిందనడంలో కొంచెం సందేహముంది. భారతదేశ వ్యవసాయం పారిశ్రామిక ఉత్పత్తులలో స్వాతంత్ర్యానంతరం మెచ్చుకోదగిన విధంగా పెరుగుదల కన్పించింది. ఈ పెరుగుదలను 1980లలో మరింత స్పష్టంగా గమనించవచ్చు. 4వ పంచవర్ష ప్రణాళిక వరకు భారతదేశం రెండు అతి ప్రధానరంగాలైన ఆహారం, పంట నూనెలపై విదేశాల మీద ఆధారపడగా ఆ తర్వాత చెప్పుకోదగ్గ ప్రగతి సాధించింది. ఈ రోజున భారతదేశం అత్యధిక స్థాయిలో వైవిధ్య భరితంగా పారిశ్రామిక ఉత్పత్తులను కలిగి ఉంది. ఈ ప్రగతి వల్లనే విద్యుత్, రవాణా మరియు సమాచారం వంటి మౌలిక రంగాలలో కూడా అంతే అభివృద్ధి సాధ్యమయింది. ఆవిధంగా ఈ రోజున భారత ఆర్థిక వ్యవస్థ ప్రణాళికల ప్రారంభం నాటికన్నా స్థిరంగాను, సమతూకంతోను ఉంది.

భారత ఆర్థిక వ్యవస్థ పునర్నిర్మాణం, పునరుద్ధరణల కొరకు ఈ క్రింది వ్యూహాలు అమలు చేయబడ్డాయి.

1. సమగ్రమైన ప్రణాళికా రచన
2. మిశ్రమ ఆర్థిక వ్యవస్థ
3. ప్రభుత్వ రంగ అభివృద్ధికి ప్రాధాన్యత
4. వేగమైన పెరుగుదల
5. సమతౌల్య పెరుగుదల
6. ఉపాధి కల్పనపై దృష్టి కేంద్రీకరించుట

7. వెనుకబడిన ప్రాంతాల యందు వేగంగా జరిగిన అభివృద్ధి

8. వెనుకబడిన వర్గాల అభ్యున్నతి

9. సాంఘిక సంక్షేమం

సమగ్ర ప్రణాళికా విధానంలో ఆర్థిక అభివృద్ధికి చేపట్టిన కార్యక్రమాలే కాక సంస్థాగత మార్పులు సాంస్కృతిక అభివృద్ధి కార్యక్రమాలు కూడా ఉంటాయి. పరిశ్రమలు, వ్యవసాయ రంగాలలో అభివృద్ధి సాధించడానికి గృహవసతి, విద్య, కుటుంబం లాంటి వ్యవస్థలలో మెరుగుదల అవసరం. మిశ్రమ ఆర్థిక వ్యవస్థ ప్రభుత్వరంగం అని పిలవబడే ప్రభుత్వరంగ సంస్థలు, ప్రైవేటు రంగం అని పిలవబడే ప్రైవేట్ రంగ సంస్థలతో కూడా ఉంటుంది. ప్రతి ప్రణాళికనందు 'ప్రభుత్వ రంగం' కార్యకలాపాలను విస్తృతరీతిలో చేపట్టుటకు అత్యధిక నిధులు కేటాయించబడ్డాయి. ప్రభుత్వరంగంలో కొన్ని భారీ, అతిముఖ్య పరిశ్రమలు అభివృద్ధి చెందుటకు చాలాకాలం(high gestation) పడుతుంది.అటువంటి పరిశ్రమలకు పోటీగా ప్రైవేటు వ్యాపారం ఆర్థిక వ్యవస్థపై తమ ఆధిపత్యాన్ని నిలపకుండా ప్రభుత్వం, ప్రభుత్వరంగ పరిశ్రమలలో అధిక పెట్టుబడులు పెట్టాల్సివచ్చింది. ఆర్థికరంగంలో త్వరితగతిన సంభవించిన అభివృద్ధి వలన అధికస్థాయిలో మూలధన సృష్టి (capital formation) కొరకు చేయూత నిచ్చినట్లయింది. అధిక ఉపాధి అవకాశాలు కల్పించే త్వరితగతిన జరిగే ఆర్థిక అభివృద్ధి కొరకు వేగిరమయిన, సమతౌల్య అభివృద్ధి(growth)తప్పనిసరి అని చెప్పవచ్చు. సమతూకంతో కూడిన అభివృద్ధి సాధనకు ఆర్థికరంగంలోని అన్ని విభాగాలకు వాటికి తగ్గ ప్రాధాన్యత కల్పించబడింది. ప్రణాళికాయుత అభివృద్ధి యొక్క వ్యూహం, సాంఘిక సంక్షేమమే వెనుకబడిన ప్రాంతాలను త్వరగా అభివృద్ధి పరచడం ద్వారా మరియు వెనుకబడిన తరగతుల అభ్యున్నతి జరినప్పుడు మాత్రమే అది సాధించబడుతుంది.

భారతదేశంలో వ్యవసాయం ప్రధాన భూమిక వహించడం వలన, ద్రవ్య సంస్కరణలు(fiscal reforms) రెండవ ప్రణాళిక నందు ప్రవేశపెట్టబడ్డాయి. జమీందారి వ్యవస్థ రద్దు పరచబడింది. భూపరిమితి విధించబడి మిగులు భూమిని భూమిలేని నిరుపేదలకు, చిన్న చిన్న రైతులకు పంచబడింది. ఇతరుల భూములలో పనిచేసే వారికోసం 'కౌలు చట్టాలు'(tenancy laves) చేయబడ్డాయి. భూకమతాల స్థిరీకరణ వల్ల కమతాల సంఖ్య తగ్గి అధిక ఉత్పత్తి సాధ్యమైంది. సహకార సేద్యం ప్రోత్సహించబడింది. ఈ సంస్కరణల వల్ల వ్యవసాయంలో ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంను ఉపయోగించడానికి మార్గం సుగమమై తత్ఫలితంగా 'హరితవిప్లవం' నకు దారితీసింది. హరిత విప్లవం అనగా వ్యవసాయ రంగంలో ఆధునికతను చొప్పించడం ద్వారా అధిక దిగుబడినిచ్చే వంగడాలు మరియు రసాయనిక ఎరువులనుపయోగించడం ద్వారా ఎక్కువ దిగుబడిని సాధించడానికి చేపట్టిన ఉద్యమం. ఈ ప్రయత్నాలలో భారత వ్యవసాయ 'పరిశోధనా మండలి'(ICAR) ఒక ముఖ్యపాత్ర వహించింది.

ఈ విభాగం చదివిన తర్వాత, 'ఆర్థికాభివృద్ధితో కూడిన సామాజిక న్యాయం అనే లక్ష్యాన్ని సాధించగల్గడం ఒక పెద్ద సవాలు' అని అర్థం చేసుకొని ఉంటారు. అధిక జనాభా కలిగిన భారతదేశం లాంటి దేశాల్లో జరిగిన అభివృద్ధి మరియు సాంకేతికరంగ పురోగతుల వల్ల వచ్చిన ఫలాలు ఇంకనూ సామాన్య ప్రజలకు అందుబాటులోకి వచ్చి, ఉపయోగపడాలి. జనాభా పెరుగుదల రేటు, ఆదాయ పెరుగుదల రేటుకంటే తక్కువ ఉన్నప్పుడు మాత్రమే జాతీయ ఆదాయ పెరుగుదల రేటు స్థిరంగా కొనసాగుతుందని మనం ఇప్పటికే తెలుసుకున్నాం. మన ఆర్థికరంగంలో తీవ్రమైన పెరుగుదలను నిరోధించే పెరుగుతున్న జనాభాతో పాటు చిన్న చిన్న సమస్యలు ప్రస్తుతం మన సమాజంలో ఉన్నాయి.

ఆర్థికరంగంలో పెరుగుదల, రోజు రోజుకీ పెరుగుతున్న జనాభా అవసరాలకు తగ్గట్లుగా సంతృప్తిగా లేదు. ఆర్థిక అభివృద్ధికి సంబంధించిన ఫలాలు, సమాజంలోని అన్ని వర్గాల వారికి సమానంగా అందడం లేదు. భారతదేశంలో షుమారు 27 కోట్ల మంది జనాభా నేటికీ వారి జీవనోపాధికి కావలసిన కనీసమొత్తాన్ని సంపాదించలేని పరిస్థితిలో ఉన్నారు. సమాజంలోని ఈ వర్గ ప్రజలకు ప్రణాళికా విధానం వాస్తవంగా ఏమీ సహాయపడలేక పోయింది. ప్రణాళికా విధానం మనదేశ ఆర్థిక వ్యవస్థకు పరిపుష్టి కల్గించినప్పటకీ, అది పేదరికాన్ని పూర్తిగా మనదేశం నుండి నిర్మూలించ లేకపోవడం దురదృష్టకరం.

## 65.సి పాఠ్య ప్రశ్నలు :

1. భారతదేశంలో ప్రణాళికా విధానం నాలుగు ప్రధాన లక్ష్యాల జాబితా వ్రాయండి.
2. జాతీయ ప్రణాళిక ఎన్ని సంవత్సరాలకు తయారు చేయబడుతుంది?
3. రెండవ పంచవర్ష ప్రణాళిక ఏరంగంపై ప్రధానంగా దృష్టి పెట్టింది?
4. ఐదవ పంచవర్ష ప్రణాళిక ప్రధాన లక్ష్యమేమి?

## 65.7 భారతదేశ విదేశాంగ విధానం

(Foreign Policy of India) :

విదేశాంగ విధానం అంటే విదేశాలతో ఒక దేశ సంబంధాన్ని సూచించే విధానం. ఈ విధానం జాతీయ ఆసక్తులను దృష్టిలో పెట్టుకొని రూపొందించినప్పటికీ, ఇది చారిత్రక నేపథ్యం, భౌగోళిక పరిస్థితులు, ఆర్థిక సమస్యలు, దాని సంప్రదాయాలు. ఆధ్యాత్మిక భావనలు, వారి ఆదర్శాలచే ప్రభావితం కాబడటమేగాక నిర్దేశించబడుతుంది. ఇది జాతీయ నాయకత్వం వ్యక్తిత్వాలు, అప్పటి ప్రపంచ కాలమాన పరిస్థితులచే కూడా ప్రభావితం కాబడుతుంది.

1920–1927 మధ్య భారత జాతీయ కాంగ్రెస్, భారత అంతర్జాతీయ సంబంధాలకు సంబంధించిన కొన్నిసూత్రాలను రూపొందించింది. భారతదేశం, అంతర్జాతీయ సహకారం కాంక్షిస్తుందని అణగారిన దేశాల ప్రజాస్వామ్యయుత ఉద్యమాలు, జాతీయ పోరాటాలకు సహకరిస్తుందని, వర్ణవివచక్షణ, వలసవాదం(colonialism), సామ్రాజ్యవాదం(imperialism), ఫాసిజం(fascism)ఇంకా యుద్ధాలకు వ్యతిరేకంగా నిలవాలని ప్రపంచశాంతికి కృషి చేయాలని అది నిర్ణయించింది.

### స్వతంత్ర భారత విదేశాంగ విధానం :

ఈ విధానం యొక్క పొడిగింపుగా చెప్పవచ్చు. ఈ విధానం మన సాంస్కృతిక నైతిక విలువలైన శాంతి సందేశవ్యాప్తి, మానవ మర్యాద, శాంతియుత సహజీవనం, మానవాళి అంతా ఒకే కుటుంబము అనే “వసుదైక కుటుంబం” భావనలతో పోలి ఉంది. భారతదేశం ఈ లక్ష్యాన్ని ఇతర దేశాలతో ద్వైపాక్షిక సంబంధాలలో పంచశీల(లేక ఐదుసూత్రాలను) అనుసరించటం ద్వారా సాధించదలచింది. ఈ సూత్రాలు : 1) ఇతర దేశాల భౌగోళిక సమగ్రత, సార్వభౌమత్వాలను పరస్పరం గౌరవించుకొనుట. 2) పరస్పర దాడులు జరపకుండుట 3) ఇతరుల అంతర్గత వ్యవహారాలలో పరస్పరం

కలుగజేసుకోకుండటం 4) సమానత్వం పరస్పరం మేలు చేసుకోవడం 5) శాంతియుత సహజీవనం. భారతదేశం, వివాదాలను శాంతియుతంగా పరిష్కరించుకోవడం, అలీనోద్యమ సూత్రాలను అమలు చేయడం ప్రపంచశాంతి కొరకు నిరాయుధీకరణను వ్యాప్తి చేయడం అనే విషయాలందు నమ్మకాన్ని కలిగియుంది.

**అలీనోద్యమం** (Non-Alignment)

భారతదేశ విదేశాంగ విధానం ముఖ్య సూత్రాలలో ఒకటైన అలీన విధానం(non-alignment)ను శక్తివంతంగా అమలు చేయటం. అలీనవిధానం అనునది ఒక శాంతి – సమయ భావన. దీని అర్థం దేశాలతో శాశ్వత మిత్రత్వం కలిగియుండక, ప్రతి అంశం నందుగల మేలు లేక ప్రయోజనాలకు తగ్గట్లు వ్యవహరించుటకు స్వేచ్ఛ కలిగిఉండుట. ఇది అగ్రరాజ్యాలకు దూరంగా ఉండటంగాని సూత్రప్రాయ తటస్థ విధానం గాని కాదు. ఏ అలీన దేశమైనా తన సొంత విధానాల్ని అమలు చేయడంలో స్వేచ్ఛకు భంగం కలగని వేరే దేశాలతో ఎటువంటి శాశ్వత రాజకీయ, సైనిక ఒప్పందంలను కలిగి ఉండని ఒక స్వతంత్ర విదేశాంగ విధానం కలిగి ఉండవచ్చు.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం, ప్రపంచం రెండు శక్తి కూటములుగా విడిపోయింది. పాశ్చాత్యదేశాలు అమెరికా నాయకత్వంలోను, కమ్యూనిస్టు విభాగం సోవియట్ యూనియన్ నాయకత్వంలోను చేరాయి. ఈ రెండింటి మధ్య ఉన్న ఘర్షణలు వాటిమధ్య ప్రచ్ఛన్న యుద్ధానికి(cold war)దారితీశాయి. ఈ పరిస్థితుల్లో ఆసియా, ఆఫ్రికా ఖండాలకు చెందిన దేశాలు, భారతదేశంతో సహ అనేక ఇతర దేశాలు ఈ రెండు పక్షాలలో దేనిలో చేరకుండా అలీన దేశాలుగా ఉండి వారి వారి స్వతంత్ర విదేశాంగ విధానాన్ని అనుసరించాయి.

అలీన ఉద్యమానికి భారత ప్రధాని నెహ్రూ, ఈజిప్టు అధ్యక్షుడు నాసం, యుగోస్లావియా అధ్యక్షుడు టిటోలు 1950 దశకం చివరలో శ్రీకారం చుట్టారు. (initiated)కాని ఈ ఉద్యమం వాస్తవానికి 1955సంవత్సరంలో ఆఫ్రో–ఆసియాలకు చెందిన 29 దేశాలు బాండుంగ్(ఇండోనేషియా)లో వలసవాదంపై పోరాటానికి సంబంధించిన ప్రణాళికలు రూపొందించడానికి ఏర్పాటుచేసిన సమావేశంతో మొదలైందని నమ్ముతుంటారు. ఈ స్వాతంత్ర్యం కోసం జరిపిన సుదీర్ఘ పోరాటం నాడు జరుగుచున్న ప్రచ్ఛన్న యుద్ధమే ఈ ఉద్యమ ఆవిర్భావానికి ముఖ్యకారణాలు అని చెప్పడంలో సందేహం లేదు. ఈ ఉద్యమ చోదక శక్తులలో ఒకరైన జవహర్‌లాల్ నెహ్రూ 1946లో ఆకాశవాణిలో ప్రసంగిస్తూ "గతంలో రెండు ప్రపంచ యుద్ధాలకు కారణమవ్వటమే గాక భవిష్యత్‌లో మరల భయంకరమైన భారీ నాశనాలకు కారణం కాగల ఆధిపత్య రాజకీయ కూటములకు వీలైనంత దూరంగా ఉండాలని మనం ఉద్దేశిస్తున్నాం".

శతాబ్దాల కొద్దీ వలసపాలనలో, వలసవాదుల స్వలాభాలకు గురియై, అభివృద్ధి జరగకుండా అణచివేయబడ్డ ఆసియా, ఆఫ్రికా మరియు లాటిన్ అమెరికా దేశాల ప్రజల యొక్క మనోభావాలను, ఈ మాటలు ప్రతిధ్వనింపచేశాయి. వారున్యాయం మరియు స్వేచ్ఛల కోసం పరితపించారు. అలీనోద్యమం వారికి ఆశ, విశ్వాసం, భద్రతా భావనలనిచ్చింది. వారు ఒకరికి అనుకూలంగా గాని ప్రతికూలంగా గాని ఉండాల్సిన అవసరం లేకుండా నిర్భయంగా ప్రతి అంతర్జాతీయ పరిస్థితిని తమకిష్టమైన రీతిలో నిర్ణయించుకునే అవకాశాన్ని కల్పించింది.

**అలీన ఉద్యమ ఆవిర్భావం – ఉద్దేశాలు లక్ష్యాలు :**

అలీన దేశాలుగా పిలవబడే కొన్ని దేశాలు కలిసి 1961 సెప్టెంబర్‌లో బెల్‌గ్రేడ్ (యుగోస్లోవియా)లో ఒక

అంతర్జాతీయ ఉద్యమంగా ఆవిర్భవించాయి. అలీన దేశాల ఈ మొదటి సమావేశంలో, ఒక ఐరోపా 25 ఆఫ్రో–ఆసియా దేశాలు పాల్గొన్నాయి. దీనికి తోడు, 3 లాటిన్ అమెరికా దేశాలు పరిశీలకులుగా పాల్గొన్నాయి. నెహ్రూ, నాసర్, టిటోలు చూపిన చొరవ ఫలితంగా, బెల్‌గ్రేడ్ సమావేశం జరిగింది. ఈ సమావేశం అంతర్జాతీయ శాంతికి దోహదపడే మరియు కాపాడే 27 ముఖ్యాంశాలను రెండు అగ్రరాజ్యాలకు(Super powers) విన్నవించాయి. ఇందు అభివృద్ధి చెందుతున్న దేశాల మధ్య జరుగు వ్యాపారానికి సంబంధించిన విషయాలను చర్చించడం జరిగింది. ఈ దేశాలు సాధించిన సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక ప్రగతి గురించి కూడా చర్చించబడింది. ఈ అలీనోద్యమం సామ్రాజ్యవాదం(imperialism),జాతి వివక్ష(racism)వలసవాదాలకు వ్యతిరేకంగా చేపట్టిన ఉద్యమం.

ఆసియా, ఆఫ్రికాలకు చెందిన దేశాలకు చెందిన ప్రజలు ఆర్థికంగా వెనుకబడినవారు కావడంతో వారు వారి మధ్య పరస్పర సంబంధాలను పెంపొందించుకోవాలనే కాంక్షతో పరస్పరం సహకరించుకోవాలని నిర్ణయించుకున్నారు. ఈ దేశాలు సామ్యవాద దేశాలైన లేక పెట్టుబడిదారీ దేశాలైనా ధనిక లేక పేద దేశాలైనా, పెద్దవి లేక చిన్న దేశాలైనా ఇవన్నీ పరస్పర శాంతియుత సహజీవనం సాగించాలని నిర్ణయించాయి. అలీనోద్యమం స్వాభావికంగా రాజకీయ పరమైనదైనా ఈ మధ్యకాలంలో అది ఆర్థిక విషయాలకు ఎక్కువ ప్రాధాన్యత నిచ్చుచున్నది. వేర్వేరు దేశాల మధ్య ఆర్థిక సంబంధాలలో వచ్చిన సమూల మార్పుల ఫలితంగా ఒక నూతన అంతర్జాతీయ ఆర్థిక విధానం(New International Economic order(NIEO)కోసం డిమాండ్ మొగ్గ తొడిగింది. ఇది ప్రపంచంలోని అన్ని దేశాల మధ్య వనరుల సమానమైన పంపిణీపై దృష్టి పెట్టింది. మానవహక్కుల అమలుకు నిరాయుధీకరణను ప్రోత్సహించుటపై కూడా ప్రత్యేక శ్రద్ధ వహించటం జరిగింది.

మూడవ ప్రపంచ దేశాలలో అధికభాగం వారు స్వాతంత్ర్యం పొందేనాటికి చాలా పేదవిగాను మరియు అంతగా అభివృద్ధి చెందని దేశాలుగాను ఉన్నవి. వారు సామ్రాజ్యవాద, వలసవాద పాలనలో బాధలు అనుభవించారు. వారు ఆర్థికంగా వెనుకబడి ఉండడమే కాక నిరక్షరాస్యత, నిరుద్యోగం, పారిశ్రామికీకరణ జరుగకపోవడం వంటి సమస్యలతో బాధపడ్డాయి. అవి వాటి సొంత కలలను కలిగి ఉండటం వల్ల అలీనోద్యమంలో పాల్గొనటం ద్వారా ప్రపంచశాంతి కాంక్షిచి వారి వారి ప్రగతిపై దృష్టి పెట్టడం సాధ్యమైంది.

కాని, ఈ ఉద్యమం దాదాపుగా అన్ని ఖండాలకు చెందిన దేశాలు, జాతులు, వర్ణాలచే అంగీకరించబడిందని చెప్పవచ్చు. ఇది ప్రాచ్య(east) పాశ్యాత్య(west)దేశాలలో అభివృద్ధి చెందిన దేశాల నుండి కూడా గొప్ప గౌరవాన్ని పొందింది. ఈ ఉద్యమం కేవలం అనుసరణీయమే కాక, గతిశీలకమైనదనీ(dynamic)మనకు పై విషయాలు ద్వారా తెలుస్తుంది.

ఈ ఉద్యమంలో పాల్గొనే సభ్యదేశాల సంఖ్య 109కి పెరిగింది. బెల్‌గ్రేడ్‌లో జరిగిన అలీన దేశాల మొట్టమొదటి శిఖరాగ్ర సమావేశం తర్వాత సమావేశాలు ఆగకుండా జరుగుతూ ప్రపంచశాంతి, ఆర్థిక కార్యకలాపాలలో స్వావలంబనలు సాధించేదిశలో తమ ప్రయత్నాలను ముమ్మర పరిచాయి.

7వ అలీనోద్యమ(NAM)శిఖరాగ్ర సమావేశం శ్రీమతి ఇందిరాగాంధీ అధ్యక్షతన 1983వ సం॥ మార్చి 7నుండి 12వరకు ఢిల్లీలో జరిగింది. పెరుగుతున్న ఉద్రిక్తతలు అణుయుద్ధ(Nuclear war) ప్రమాద భయం నేపథ్యంలో అలీనదేశాలు ఈ సమావేశంలో రెండు అగ్రరాజ్యాలు ఆయుధ పోటీని ఆపవలసిందిగా అభ్యర్థించారు. వీరు న్యాయం, సమానత్వంపై

ఆధారపడిన నూతన అంతర్జాతీయ ఆర్థిక విధానం(NIEO)ఏర్పాటుకోసం మనస్ఫూర్తిగా పనిచేశారు.

గతమూడు దశాబ్దాల సమయంలో అలీనోద్యమం(NAM)అంతర్జాతీయ సంబంధాల వ్యవస్థలో మార్పు తేవడంతో కృషి చేయడానికి సమకాలీన చరిత్రలో ఒక వేదికగా మారింది. ప్రపంచమంతా అలజడి, అశాంతి నిండి ఉన్న ఈ తరుణంలో అలీనోద్యమం శాంతియుత – సహజీవనం, నిరాయుధీకరణ ప్రపంచశాంతులకు సందేశాలను వ్యాప్తి చేయడానికి కట్టుబడి దోపిడీకి వ్యతిరేకంగా స్వరాన్ని పెంచింది.

### అలీనోద్యమం – దాని అన్వయం, ప్రాముఖ్యత :

ప్రస్తుత ప్రపంచంలో అలీనోద్యమం ఒక గొప్ప శాంతిదళంగా పేరొందింది. దీని ప్రాముఖ్యతను, ఇది సాధించిన విజయాలు లేక పొందిన పరాజయాలపై ఆధారపడి కాకుండా దాని లక్ష్యాలు, సూత్రాలు అంతర్జాతీయ సంబంధాలపై వాని ప్రభావం పరంగా చూడాలి. దాదాపుగా 2/3వ వంతు ప్రపంచ జనాభాకు ప్రాతినిధ్యం వహిస్తున్న ఈ అంతర్జాతీయ ఉద్యమం, అన్యాయానికి వ్యతిరేకంగా స్వరాన్ని వినిపించి, శాంతికి గుర్తుగా మిగిలింది. ఈ సందర్భంలో 1961లో బెల్‌గ్రేడ్ సమావేశంలో అలీనదేశాల కూటమి ఆవిర్భవించినట్లుగా ఇది నేడు ప్రపంచానికి అన్వయించబడుతుంది.

అలీన ఉద్యమం, రెండు ప్రధాన పక్షాల ఆగ్రహానికి నిరక్ష్యానికి గురికావడంతో తొలికాలం నుండి చాలా కష్టాలకోర్చి ఈ దశకు చేరింది. ప్రస్తుతం దీని సభలు లేక సమావేశాలు, దాని నిర్ణయ సరళులు వాటికి ముఖ్యమైన విధానంగా మారి వాట భయభక్తులు గౌరవం ద్వారా ప్రభావితం చేస్తున్నాయి. అలజడి, అసమానత్వం సంక్షేభంలతో కూడియున్న ప్రపంచంలో అలీనోద్యమానికి ఇంతకు ముందెన్నడూ లేనివిధంగా విలువ పెరిగింది. స్వయం నిర్ణయాధికార హక్కును గురించి గట్టిగా మట్లాడటం, కొంత భౌతిక, భావపూర్వక సహాయాన్ని అందించడం ద్వారా అది వలసదారుల అధీనంలో ఉన్న ప్రపంచంలోని దాదాపు సగభాగానికి స్వేచ్ఛ కల్పించడంతో సహాయపడింది.

అలీనోద్యమ విమర్శకులు దీనిని ఒక ప్రత్యేక చారిత్రక ఘట్టం అయిన రెండు అగ్రరాజ్యాలు ఆవిర్భావనకు ప్రతిచర్యగా ఆవిర్భవించిందని నాటి స్థితి ప్రస్తుతం లేదు కాబట్టి నేటి దాని అవసరం లేదని కొట్టివేశారు. ఈ ఉద్యమం తన ప్రధాన లక్ష్యమైన వలసవాద నిర్మూలనను సాధించిన తర్వాత, క్రొత్తగా ఏర్పడిన రాజ్యాల సమైక్యత సాధించిన తర్వాత, దీనిని ఎత్తివేయవలసిన అవసరముందని మరికొందరు చెప్పారు. ఇంకనూ కొంతమంది, ఇది అలజడులు, అశాంతి తగ్గించడంలో నిరాయుధీకరణలపై తక్కువ ప్రభావం చూపించడంతో కూడా ఇది పెద్దగా చేయగల్గింది ఏమీ లేదని భావించారు. ఈ పై విమర్శల కారణంగా వారు, ఈ ఉద్యమానికి గౌరవ పూర్వకమైన ముగింపు పలకాలని అంతిమంగా భావించారు. "ఈ ఉద్యమం, గొప్పసైనిక శక్తులను బలహీన పరచలేకపోగా వాస్తవానికి వాటి శక్తి మరియు సామర్థ్యాలు ఇంకా ఎక్కువైనాయి"అని వారు భావించారు.

దురదృష్టవశాత్తు, ఈ విమర్శకులు, అలీన భావన ప్రాధాన్యతను దీని విలువలను అర్థం చేసుకోవడంలో విఫలమయ్యారు. ప్రపంచ స్థాయిలో ఘర్షణలకు, వైరుధ్యాలకు ఇది సరియైన ప్రత్యామ్నాయం అని అర్థం చేసుకోవడంలో వీరు విఫలమయ్యారు. అధికార కూటములున్నంతకాలం, శాంతికి అడ్డంకులున్నంత కాలం వివిధ దేశాల మధ్య ఆర్థిక అసమానతలున్నంత కాలం అలీన ఉద్యమం ఎప్పటికీ తన ఉనికిని కోల్పోదు అనేమాట వాస్తవం కాబట్టి అలీనోద్యమం, ప్రచ్ఛన్న యుద్ధం(cold war)ప్రచ్ఛన్న యుద్ధానంతర రెండు కాలాల్లోను వాటి ప్రాధాన్యతను కలిగి ఉంది.

దీనితోపాటు ప్రపంచ ఆర్థిక వ్యవస్థ వాస్తవిక స్థంభన(Virtual stagnation) కొత్త సమస్యను సృష్టించింది.

అంతేకాకుండా పెరుగుతున్న నిరుద్యోగ సమస్య, ఎగసిపడుతున్న ఋణసమస్య ముడి సరుకుల ధరలు పడిపోవటం, అభివృద్ధి చెందిన దేశాలు దిగుమతి ఆంక్షలను పెంచటం, వేగంగా పెరిగిన జనాభాతో పాటు కుంచించుకుపోయిన ఆర్థిక సహాయంతో సతమతమౌతున్న మూడవ ప్రపంచానికి నూతన అంతర్జాతీయ ఆర్థిక విధానం(NIEO)క్రొత్త ఆశలు రేపింది. ఆవిధంగా అలీన ఉద్యమం దేశంలోని ప్రతి ఒక్కరికి మంచి జీవితాన్ని ప్రసాదించటం, అసమానతలు, అంతర్జాతీయ అన్యాయానికి వ్యతిరేకంగా పోరాటం జరపటానికి ఆజ్ఞ పొందినట్టయింది. (తప్పనిసరి అయింది).

ఇప్పటికి మీరు భారతదేశం అలీనోద్యమ విధానానికి పూర్తిగా కట్టుబడి ఉందని తెలుసుకున్నారు. పండిట్ నెహ్రూతోపాటు ఈజిప్టు ప్రధాని నాసర్, ఇండోనేషియా అధ్యక్షుడు సుకరో, యుగోస్లావియా అధ్యక్షుడు టిటోలు ఈ ఉద్యమ మార్గదర్శకులు, నిర్మాతలు అని కూడా మీరు తెలుసుకున్నారు. ఈ ఉద్యమాన్ని అనుసరించడం ద్వారా భారతదేశం తన సొంత విదేశాంగ విధానాన్ని రచించుకోగలగటమే కాక, ప్రపంచ రాజకీయ సమాజం, అంతర్జాతీయ రాజకీయాలపై అత్యంత ప్రభావాన్ని ఈ ఉద్యమం సృష్టించగల్గింది. భారతదేశం ప్రపంచంలోని అగ్రరాజ్యాల సహకారం పొందడంలో అలీనోద్యమం ఎంతగానో సహాయపడింది.

మనం ఇప్పుడు భారతదేశానికి, తన పొరుగు దేశాలతో గల సంబంధాలను పరీక్షిద్దాం.

భారతదేశం అతి సమీప పొరుగుదేశాలైన చైనా, పాకిస్తాన, బంగ్లాదేశ్‌లతో దీర్ఘకాల సంబంధాలను కలిగిఉంది. భారతదేశానికి ఈశాన్యంలో చైనా, పడమటివైపు పాకిస్తాన్ మరియు తూర్పున బంగ్లాదేశ్ కలవు. 1947కు పూర్వం భారతదేశం, పాకిస్తాన్ మరియు బంగ్లాదేశ్‌లు కలిసి ఒకే దేశంగా ఉండేవని మీకు తెలుసు. స్వాతంత్ర్య సమయంలో భారతదేశం విభజింపబడి రెండు స్వతంత్ర దేశాలైన భారతదేశం, పాకిస్తాన్‌లు ఏర్పడ్డాయి. 1971లో పాకిస్తాన్ రెండుగా విడిపోయి బంగ్లాదేశ్ ఏర్పడింది. భారతదేశం, తన శాంతియుత సహజీవనం అనే విధానం ద్వారా తన పొరుగు దేశాలైన చైనా, పాకిస్తాన్, బంగ్లాదేశ్‌లతో చక్కటి స్నేహపూర్వక సంబంధాల కొరకు కృషి చేస్తోంది.

### చైనాతో భారత్ సంబంధాలు :

గుప్తులు, హర్షవర్ధనుని కాలం నుండే భారతదేశానికి, చైనాతో సంబంధాలు ఏర్పడ్డాయి. చైనాయాత్రికులు, ప్రాచీన భారత విశ్వవిద్యాలయాలలో కల బౌద్ధ సాహిత్యం, తత్వ శాస్త్రాల అధ్యయనానికి భారతదేశానికి వచ్చారు.

భారతదేశాన్ని ఆంగ్లేయులు పరిపాలించే కాలంలో,ఆంగ్లేయులు చైనాపై ఆధిపత్యానికి ప్రయత్నించారు. ఆ క్రమంలో, వారు చైనా భారత్ సంబంధాలను కొంతవరకు విచ్ఛిన్నం చేశారు. కాని రెండవ ప్రపంచ యుద్ధకాలంలో స్వాతంత్ర్యం కోసం భారతదేశం జరుపుతున్న పోరాటానికి చైనా నాయత్వం ఊతాన్నిచ్చింది. అదేవిధంగా 1949లో 'పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ చైనా'ను గుర్తించిన మొట్టమొదటి కమ్యూనిస్టేతర దేశం భారతదేశమే. భారతదేవం, చైనా ప్రధాన భూభాగం(main land)నుంచి పారిపోయిన(fled)పునాతన చైనా జాతీయవాద పాలకులతో సంబంధాలను తెగతెంపులు చేసుకుంది.

1949 చైనా కమ్యూనిస్టు విప్లవానంతరం కొంతకాలం వరకు చైనా–భారత్‌ల మధ్య సంబంధాలు బాగుండేవి. "హిందీ–చీనీ భాయి భాయి"అనే నినాదం సర్వసాధారణంగా వాడబడేది. అయితే ఈ రెండింటి మధ్య 'టిబెట్' సమస్య తలెత్తడంతో, చైనా భారతదేశం పట్ల శత్రుత్వ వైఖరి ఏర్పరచుకుంది. 1962 అక్టోబర్‌లో చైనా, భారతదేశంపై జరిపిన

సాయుధదాడితో ఈ రెండు దేశాలమధ్య సంబంధాలు అడుగంటినాయి. అయితే ఈ సరిహద్దు వివాదం ఉన్నప్పటికీ దౌత్య సంబంధాలు ఈమధ్యకాలంలో కొంత మెరుగైనప్పటికీ, స్నేహ పూర్వక సంబంధాలు నెలకొల్పబడలేదు. భారతదేశం–చైనాల మధ్య విభేదాలు తలెత్తడానికి ముఖ్యకారణాలు రెండు. సరిహద్దు సమస్య, టిబెట్ సమస్యలు. ప్రస్తుతం మనం టిబెట్ విషయాన్ని పరిశీలిద్దాం.

**టిబెట్ సమస్య :**

చైనాలో సంస్థానమైన టిబెట్‌కు దక్షిణాన నేపాల్, బర్మా, భారత్‌దేశాలతో, ఉత్తరం వైపున చైనా(నికియాంగ్)తో సరిహద్దులు కలవు. చైనా మరియు భారత్‌ల మధ్య నున్న టిబెట్ రక్షిత రాజ్యమై(Buffer state) నందున భారత్, టిబెట్‌పై వ్యూహాత్మక ఆసక్తిని పెంచుకుంది. బఫర్ రాజ్యమంటే, రెండు వేర్వేరు రాజ్యాల మధ్య నెలకొని ఉండి వాని మధ్య సంబంధాన్ని శాసించగలిగే ప్రాంతం. చారిత్రకంగా (భారతదేశంలో ఆంగ్లేయుల పాలన కాలంలో నుండగా) టిబెట్, చైనా రక్షిత రాజ్యంగా భావించబడేది. క్రమేణా, టిబెట్‌వారు, చైనా వారి ఆధిపత్యంలో అణగ తొక్కబడినట్లుగా భావించి, వారి స్వతంత్ర గుర్తింపు కోసం తపించసాగారు. 1937లో టిబెటన్ల రాజకీయ, మత నాయకుడైన దలైలామా, టిబెట్‌కు స్వతంత్ర ప్రతిపత్తిని ప్రకటించాడు. అదేకాలంలో టిబెట్ పూర్తి స్వాతంత్ర్యం తిరిగి సంపాదించటం కోసం ఉద్యమం ప్రారంభమైంది. టిబెట్‌నుండి తీవ్ర వ్యతిరేకత ఎదురైనప్పటికీ, రెండవ ప్రపంచ యుద్ధం అంతమయ్యేనాటికి చైనా, టిబెట్‌లోని అనేక ఇతర ప్రాంతాల్ని ఆక్రమించుకుంది. 1949లో, చైనాలో ఏర్పడిన క్రొత్త ప్రభుత్వం టిబెట్‌ను ఆక్రమించుకోవాలనే తన ఉద్దేశాన్ని ప్రకటించింది. టిబెట్‌పై చైనావారి ప్రత్యక్ష అజమాయిషి భారతదేశ రక్షణకు ప్రమాదకరంగా మారే అవకాశం ఉండటం వల్ల భారతదేశం టిబెట్ సమస్యను శాంతియుతంగా పరిష్కరించుకుందామని చైనాని అభ్యర్థించింది. చైనా దౌత్యవేత్తలు మరియు టిబెట్ ప్రతినిధుల మధ్య భారతదేశం మధ్యవర్తిత్వం వహించగా ఢిల్లీలో సంధి ప్రయత్నాలు జరిగినప్పటికీ, ఆ ప్రయత్నాలు ఫలప్రదం కాలేదు.

1950 అక్టోబర్‌లో టిబెట్ తనను తాను రక్షించుకోలేక పోవడంతో చైనా ఆక్రమించుకుంది. దీనిని భారతదేశం ఖండించినప్పటికీ, ఆ తర్వాత చైనావారి చర్యను వారి అంతర్గత వ్యవహారంగా వదలివేసింది. ఈ తర్వాత, చైనావారు టిబెట్‌తో తనకు అంతర్గతంగా స్వతంత్ర ప్రతిపత్తిని కల్పిస్తూ విదేశీ వ్యవహారాలలో మాత్రం టిబెట్‌ను చైనా పరిధిలో నిధిగా భావించాలని ఒప్పందం కుదుర్చుకుంది. టిబెట్‌పై పెరిగిన చైనావారి ఆధిపత్యాన్ని నిరసిస్తూ భారతదేశంలో విస్తృతంగా నిరసన జ్వాలలు రగిలి, టిబెట్‌లు స్వతంత్ర దేశంగా చేయాలనే డిమాండ్ అనేక ప్రాంతాల నుండి వచ్చింది. అయితే భారతదేశం ఇంకా చైనాతో స్నేహాన్ని కోరుకొని, చైనా అంతర్గత వ్యవహారాలలో తలదూర్చక టిబెట్‌ను చైనాలో అంతర్భాగంగానే గుర్తించింది. భారత్ ప్రధాని(prime minister) జవహర్‌లాల్ నెహ్రూ, చైనా ప్రధాని(prime minister)చౌ–ఎన్–లైల మధ్య 1964లో కుదిరిన ఒప్పందం ప్రకారం భారతదేశం, చైనా టిబెట్‌ను చైనాలో అంతర్భాగంగా గుర్తించింది. ఈ ఒప్పందంతో అంతకుక్రితం టిబెట్ చైనాలో అంతర్భాగం కాదని బ్రిటీష్ ఇండియా, చైనాల మధ్య కుదిరిన పురాతన ఒడంబడిక రద్దైంది. వారు 'పంచశీల' అనే ఒప్పందాన్ని కూడా కుదుర్చుకున్నారు.

టిబెట్లను చైనావారి చర్యను నిరసించారు. 1959సంవత్సరాల నాటికి టిబెటన్లు చేస్తున్న అవిశ్రాంత పోరాటాన్ని అణచివేశారు. ఎక్కువ సంఖ్యలో బందీలు అయ్యారు. వేలసంఖ్యలో టిబెట్ శరణార్థులు, భారతదేశానికి పారిపోయి వచ్చారు. దలైలామా కూడా భారతదేశానికి ప్రవాసం వచ్చి రాజకీయ ఆశ్రయాన్ని పొంది, అప్పటినుండి ఇక్కడే

నివసిస్తున్నారు. భారతదేశం, చైనాకు టిబెట్‌పై నున్న హక్కుల్ని వ్యతిరేకించక పోగా టిబెట్‌పై చైనా అధికారాన్ని పూర్తిగా గుర్తించింది. కాని బలప్రయోగానికి మాత్రం ఒప్పుకోలేదు. దలైలామా, ఇతర టిబెటన్లకు భారతదేశం ఆశ్రయం ఇవ్వడాన్ని చైనా తనకు వ్యతిరేక చర్యగా భావించడంతో సంబంధాలు క్షీణించడం ప్రారంభమైంది.

**ఇండియా, చైనాల మధ్య సరిహద్దు సమస్య :**

చారిత్రకంగా భారతదేశం ఆధీనంలో ఉన్న పెద్ద భూభాగాలపై చైనా కన్నేయటంతో భారత్,చైనాల మధ్య సరిహద్దు వివాదం మొదలైంది. చైనా-భారతదేశం సరిహద్దులోని పడమటి భాగంలో చైనావైపు సికియాంగ్ సంస్థానం, భారత భూభాగం వైపు జమ్ము  కాశ్మీర్ రాష్ట్రాలున్నాయి. లడఖ్ ప్రాంతంలో 2/3వ వంతు, చైనా సరిహద్దులో కలిసి ఉండగా, భారతదేశం, చైనాల మధ్య ఈశాన్యం వైపు బాహ్య టిబెట్ మరియు చైనాల మధ్య అతి ఎత్తైన పర్వతశ్రేణిపై ఆవరించి యున్న మెక్ మోహన్ రేఖ(Mec mahon line)సరిహద్దుగా ఉంది. 1914లో ఆంగ్లేయులు, చైనా అధికారుల్ని సంప్రదించి మెక్‌మోహన్ రేఖను సరిహద్దు రేఖగా గీశారు. కాని ఇప్పుడు చైనావారు ఈ రేఖను సరియైన సరిహద్దు రేఖగా గుర్తించడం లేదు. సరిహద్దు మధ్యభాగంలో మన రాష్ట్రాలైన ఉత్తరప్రదేశ్ మరియు హిమాచల్‌ప్రదేశ్‌లతో సరిహద్దు రేఖని చైనా భూభాగం వైపునుండి వచ్చే నదీ ప్రవాహాన్ని బట్టి గుర్తించారు. తూర్పువైపు మనరాష్ట్రమైన అరుణాచల్ ప్రదేశ్, చైనాతో ఉమ్మడి సరిహద్దును కలిగిఉంది.

1950-51లో చైనా ప్రభుత్వం, భారత భూభాగంలోని చాలా ప్రాంతాన్ని తన భూభాగంలో చూపుతూ పటాలను విడుదల చేసింది. ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ, చైనా ప్రధాని చౌ-ఎన్-లై అంగీకరించిన దానికి భిన్నంగా జరిగిన ఈ మార్పును సరిచేయమని కోరడం జరిగింది. చౌ-ఎన్-లై, తన భారత పర్యటనలో, చైనా మెక్ మహెన్ రేఖను గుర్తిస్తుందని హామీ ఇచ్చారు. క్రమేణా, చైనా సరిహద్దును దాటి, భారతదేశ భూభాగాన్ని (ముఖ్యంగా టిబెట్‌ను కలుపుకున్న తర్వాత) ఆక్రమించుకుంటూ, మెక్‌మోహెన్‌రేఖ ప్రాముఖ్యతను నిరాకరించటం ప్రారంభించింది.

భారతదేశం, చైనాల మధ్య మొదటి సాయుధ పోరాటం 1959లో లాంగ్ జు (భారత ఈశాన్య ప్రాంతంలో టిబెట్ సరిహద్దుల్లో ఉంది) వద్ద జరిగింది. మొదటిసారిగా చైనా మెక్‌మోహెన్ రేఖను అతిక్రమించింది. 1959, సెప్టెంబర్ 8న నెహ్రూకు వ్రాసిన జాబులో చౌ-ఎన్-లై తమ దేశ ఉద్దేశాన్ని మారుస్తూ, భారత భూభాగంలోని అనేక ప్రాంతాలను తమవిగా పేర్కొన్నాడు. ఆయన, భారతదేశ పటంలో చూపబడిన సరిహద్దుని అంగీకరించకుండా, ఆరేఖ సరిగా గుర్తించబడలేదని వాదించాడు. కొన్ని భౌతిక లక్షణాలతో కూడిన ఆచార, సంప్రదాయాల ఆధారంగా భారత్-చైనా సరిహద్దు గుర్తించబడిందని భారత్ అభిప్రాయపడింది. ఈ సరిహద్దు తర్వాత కుదుర్చుకున్న ఒప్పందం మరియు అంగీకారాల ప్రకారం దృఢపరచబడి, శతాబ్దాల పర్యంతం అలా గుర్తించబడింది.

ఇరుపక్షాల మధ్య ఆందోళనలు కొనసాగుతూనే ఉన్నాయి. ఈ పోరాట వాతావరణంలోనే ఢిల్లీలో శిఖరాగ్ర సమావేశంలో సంభాషణలు జరిగాయి. ముందు అనుకున్నట్లుగానే చర్చలు విఫలమయ్యాయి. 1962 జూలైలో చైనా సైనిక దళాలు లడఖ్ ప్రాంతంపై దాడి చేశాయి. అక్టోబర్‌లో చైనా మెక్‌మోహెన్ రేఖను దాటి, తూర్పువైపున మన భూభాగం లోకి చొరబడటంతో భారతదేశంపై అప్రకటిత యుద్ధం ప్రారంభించినట్లైంది. భారతదళాలు, చైనాని అడ్డుకొన్నప్పటకీ, ఓడిపోయాయి. భారతదళాలు అవమానకరమైన రీతిలో ఓటమి నెదుర్కొనగా 1962 నవంబర్ 21న చైనా ఏకపక్ష కాల్పుల విరమణను ప్రకటించింది. చైనా, లడఖ్(జమ్ము & కాశ్మీర్ నందలి) మరియు(NEFA) (ప్రస్తుతం

అరుణాచల్ ప్రదేశ్‌లోని అనేక ప్రాంతాలను ఆక్రమించుకొంది. భారతదేశం, చైనా అక్రమంగా ఆక్రమించుకున్న భారత భూభాగ ప్రాంతాన్ని వదలి వెళ్ళాల్సిందిగా చైనాను కోరింది. మరియు ఈ విషయాన్ని అంతర్జాతీయ న్యాయస్థానానికి నివేదించాలని భావించింది. పై రెండు ప్రతిపాదనలను చైనా తిరస్కరించింది. 1964లో భారతదేశం ఈ వ్యవహారాన్ని పరిష్కరించాలను కున్నప్పటికీ, చైనా తాను ఆక్రమించుకున్న ప్రాంతాలను ఖాళీ చేయాల్సింది పోయి మరిన్ని భారత భూభాగాల్ని ఆక్రమించుకుంది.

పొరుగు దేశాలతో సంబంధ బాంధవ్యాలను పెంపొందించుకోవాలనే ఉద్దేశ్యంతో, భారతదేశంలోని జనతా ప్రభుత్వం (1977-79) క్రొత్త ప్రయత్నాలు ప్రారంభించింది.

1980, జూలైలో చైనా తాను మెక్ మహెన్ రేఖను గుర్తిస్తూ దానికి దక్షిణం వైపునున్న ప్రాంతాలను భారత భూభాగంగానే గుర్తిస్తామంటూ భారతదేశానికి కొత్త ప్రతిపాదన చేసింది. కాని బదులుగా కొంత భారత భూభాగాల్ని అడగటంతో ఈ ప్రతిపాదనను భారతదేశం త్రోసిపుచ్చింది.

అప్పటినుండి ఇరుపక్షాల మధ్య వివిధ స్థాయిలో అనేక సంప్రదింపులు జరిగాయి. క్రీ.శ.1987 నవంబర్‌లో 8వ సారి సంప్రదింపులు అధికారికంగా జరిగాయి. ఇరుదేశ ప్రధానుల సందర్శనలతో రెండు దేశాల మధ్య సంబంధాలు మెరుగయ్యాయి. 2004-05 ఆర్థిక ఒప్పందాలపై సంతకాలు చేశారు. చైనా-భారత సంబంధాలలో మామూలు పరిస్థితి నెలకొనాలంటే ఒక స్నేహపూర్వక ఒప్పందం జరగాలి. ప్రస్తుతం భారత్-చైనాలు వారికున్న అత్యధిక జనాభా (మానవశక్తి)తో ఆసియాలో మరియు ప్రపంచంలో శాంతిని నెలకొల్పడానికి ఇరుదేశాలు తమ మధ్య ఉన్న వైరుధ్యాలను తొలగించుకొని, విద్య, సాంస్కృతిక, ఆర్థిక రంగాలలో క్రొంగొత్త సహకారాన్ని అందించుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

## పాకిస్తాన్‌తో భారతదేశ సంబంధాలు :

దేశంలో వ్యాపించిన మత అల్లర్లు మరియు రక్తపాతాలు భారతదేశ విభజనకు కారణమై పాకిస్తాన్ ఏర్పడిందని మీరు చదివారు. భారతదేశం విడిపోవడానికి కారణమైన తీవ్ర పరిస్థితులు మరియు పాకిస్తాన్ ఏర్పాటుకు కారణమైన పరిస్థితులే ఇరుదేశ ప్రజల మధ్య పరస్పర కోపం, ద్వేషాలకు కారణమైనాయి.

పాకిస్తాన్ కూడా తన విదేశీ విధానంలో భిన్నమైన వ్యూహాన్ని అనుసరించింది. అది అమెరికా నాయకత్వంలోని పక్షంవైపు చేరి సైన్య సహకారం కోసం ఆగ్నేయాసియా సంధి వ్యవస్థ(SEATO)లో ప్రవేశించింది. భారతదేశం అలీన దేశమైనప్పటికీ, దేశరక్షణ కొరకు ఆయుధాల సేకరణకై ఎక్కువ వనరులను ఖర్చు పెట్టాల్సి వచ్చింది. ఇరుదేశాల మధ్య ఉన్న పరస్పర అపనమ్మకం వలన ఈ రెండింటి మధ్య 1947-48, 1965 మరియు 1971లలో మూడు యుద్ధాలు జరిగాయి.

అయితే ఈ రెండు దేశాల మధ్య ఘర్షణలకు ఇంకొన్ని ఇతర కారణాలున్నాయి.

## మైనారిటీ సమస్య :

సింధు, పశ్చిమ పంజాబ్, తూర్పు బెంగాల్, బెలూచిస్తాన్, ఈశాన్య సరిహద్దులు, అస్సాంలోని సిల్హెట్ వంటి ముస్లింలు ఎక్కువగా నివసించే ప్రాంతాలతో కూడుకొని పాకిస్తాన్ ఏర్పడింది. ముస్లింలు మరియు హిందువులు దేశమంతటా విస్తరించి ఉన్నందున, భారతదేశంలో అధిక సంఖ్యలో ముస్లింలు మరియు పాకిస్తాన్‌లో అధిక సంఖ్యలో హిందువులు

నివసిస్తున్నారు. ఆయా దేశాల్లోవారు, అల్పసంఖ్యాక వర్గాలై, అభద్రతా భావంతో బాధలు పడుతున్నారు. ఈ ఆలోచనలే మత ఘర్షణలకు దారితీసాయి. పాకిస్తాన్‌లో మతపరమైన అలజడులు జరిగినప్పుడల్లా, వేలకొద్దీ హిందువులు, సిక్కులు, బౌద్ధులు, క్రైస్తవులు భారతదేశంలో ఆశ్రయం పొందారు. భారతదేశం, ఒక లౌకిక రాజ్యం అవడం వల్ల అల్పసంఖ్యాక వర్గాలవారికి కూడా సమాన హక్కులు, అవకాశాలు కల్పించబడినాయి. అయినప్పటికీ అనేకమంది ముస్లింలు అభద్రతా భావంతో మనదేశాన్ని వదలి మంచి భవిష్యత్ కోసం పాకిస్తాన్ వెళ్ళిపోయారు.

ఇరుదేశాల మధ్య 1950, ఏప్రిల్2న అల్పసంఖ్యాక వర్గాలకు సరియైన హక్కులు మరియు చాలినంత భద్రతలు కల్పించుటకు కుదిరిన ఒక ఒప్పందంను లక్ష్యపెట్టక, తూర్పు పాకిస్తాన్ నుండి హిందూ మైనారిటీలు వెళ్ళిపోవడం కొనసాగటంతో ఆ శరణార్థులకు పునరావాసం కల్పించడం భారతదేశానికి ఒక పెద్ద సమస్య అయ్యింది.

## కాశ్మీర్ సమస్య :

కాశ్మీర్ హిందూరాజు హరిసింగ్ పాకిస్తాన్ చొరబాటుదార్లకు వ్యతిరేకంగా సహాయం చేసినందుకుగాను విలీన ఒప్పందం(Instrument of Accession) పై సంతకం చేసి భారతదేశంలో 1947లో చేరిందని మీరు ఈ పాఠంలో మొదట్లో చదివియున్నారు. కాశ్మీర్ భూభాగాలను, పాకిస్తాన్ అక్రమంగా ఆక్రమించుకుందని కూడా చదివారు. ఐక్యరాజ్యసమితిచే కాల్పుల విరమణ ప్రకటించబడి, నియంత్రణరేఖ(LOC) గుర్తించినప్పటికీ, భారతదేశం, పాకిస్తాన్‌ల మధ్య కాశ్మీర్ విషయం ఘర్షణలకు ప్రధాన కారణమయ్యింది.

కాశ్మీర్, భారతదేశంలో అంతర్భాగమైనందున భారతదేశానికి కాశ్మీర్ సమస్య ఒక వివాదస్పద అంశం కాదు. కాని పాకిస్తాన్, కాశ్మీర్‌లో ప్రజాభిప్రాయ సేకరణ (ప్లెబిసైట్) జరపాలని గట్టిగా వాదిస్తోంది. కాశ్మీర్‌లో ప్రజలచే ఎన్నుకోబడిన శాసనసభ, కాశ్మీర్‌ను భారతదేశంలో విలీనం చేసినందువల్ల కాశ్మీర్ ప్రజల అభిష్టాన్ని ధృవపరిచింది.

ఇరుదేశాల మధ్య 1949 మరియు 1956లలో జరిగిన ద్వైపాక్షిక ప్రయత్నాలలో 'యుద్ధరహిత' ఒప్పందంపై ఇరుదేశాలు సంతకం చేశాయి. కాని పాకిస్తాన్ ప్రతిసారీ దీనిని తిరస్కరించింది. 1965లో భారత్, పాక్‌ల మధ్య జరిగిన రెండవ యుద్ధంలో పాకిస్తాన్ ఓటమి పాలైది. కానీ, కాశ్మీర్ విషయంలో ఘర్షణ వైఖరి కొనసాగుతూనే ఉంది. భారత ప్రధాని లాల్‌బహదూర్‌శాస్త్రి మరియు పాకిస్తాన్ అధ్యక్షుడు జనరల్ అయూబ్ ఖాన్‌లు తాష్కెంట్ ప్రకటపై సంతకం చేసినప్పటికీ, రెండు దేశాల మధ్య 1971లో మరియొక యుద్ధం జరిగింది.

అయితే ఇరుదేశాల ప్రస్తుతం వాటిమధ్య వివాదాలను శాంతియుతంగా పరిష్కరించుకోవాలని ప్రయత్నిస్తూ ఆర్థిక, సాంస్కృతిక రంగాలలో పరస్పర సహకారం అందించుకొనుటకు మార్గాలు అన్వేషించుచున్నవి. ఇరుదేశాల ప్రజలు, సమీప భవిష్యత్‌లో ఒక ఒప్పందం కుదరవచ్చనే ఆశతో ఉన్నారు.

## పెరుగుతున్న పాకిస్తాన్ సైనిక సంపత్తి :

మొదటి నుండీ, పాకిస్తాన్‌కు అమెరికా మరియు చైనాలు సహాయం చేసేవి. 1979లో, పాకిస్తాన్, ఆగ్నేయాసియా సంధి వ్యవస్థ(SEATO) నుండి వైదొలగి అలీనోద్యమంలో సభ్యురాలైంది. కాని, విదేశీ సహాయంతో సైనిక సంపత్తి ఏర్పరచుకోవడం మాత్రం ఆపలేదు. పాకిస్తాన్‌కు ఆధునిక ఆయుధాలు సరఫరా చేయడమే కాకుండా, అమెరికా పాకిస్తాన్‌కు ఆయుధాల పరిశ్రమను అభివృద్ధి చేయుటకు పెద్ద మొత్తంలో సహాయం అందించుచున్నది. పాకిస్తాన్‌కు అణుధార్మిక

సామర్థ్యం ఉందని తెలుసుకున్న భారతదేశం తన భద్రతకు రానున్న ముప్పును గురించి కలవరపడుచున్నది.

అయితే రెండు దేశాల మధ్య పెరిగిన అవగాహన వల్ల, రెండు దేశాలు మంచి పొరుగు దేశాలుగా ఉంటూ వారి శక్తి సామర్థ్యాలు పెంచుకుంటూ ప్రపంచస్థాయి రాజ్యాలు (శక్తులు) అయ్యాయి.

**భారతదేశం, బంగ్లాదేశ్ :**

చారిత్రకంగా బంగ్లాదేశ్ (అంతకు మునుపు తూర్పు బెంగాల్), భారతదేశంలో ఒక భాగం. ఈ భూభాగంలో ముస్లింలు ఎక్కువ సంఖ్యలో నివసిస్తుండడంవల్ల భారతదేశ విభజన సమయంలో 1947లో పాకిస్తాన్‌తో కలుపబడింది. అది తూర్పు పాకిస్తాన్‌గా పిలవబడింది. పాకిస్తాన్‌కు సంబంధించిన ఒక ఆసక్తికరమైన విషయమేమిటంటే, సుమారు 1200మైళ్ళ భారత భూభాగం, పాకిస్తాన్‌ను భౌగోళికంగా రెండు అర్ధభాగాలుగా అనగా పడమర, తూర్పు అర్ధభాగాలుగా విభజించింది. క్రమేణా ఈ భౌగోళిక కారకం ఫలితంగాను తూర్పు పాకిస్తాన్ ఆర్థిక, రాజకీయ మరియు సాంస్కృతికంగా పశ్చిమ పాకిస్తాన్ వశమవడం వల్లనూ స్వతంత్ర ప్రతిపత్తి కోసం ఉద్యమం ఆ తర్వాత తూర్పు పాకిస్తాన్‌లో స్వాతంత్ర్యం కోసం ప్రయత్నం ఊపునందుకుంది. ఈ ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్తున్న 'అవామీలీగ్' 1970–71 సంవత్సరంలో జరిగిన పాకిస్తాన్ ఎన్నికలలో విజయం సాధించింది. కానీ యాహ్యాఖాన్ నాయకత్వంలోని సైనిక ప్రభుత్వం, వారికి అధికారాన్ని బదిలీ చేయడానికి తిరస్కరించింది. పాకిస్తాన్ ప్రధాని పదవిని కోరిన షేక్‌ముజీబ్‌ను తిరస్కరించి, అవామీలీగ్ సభ్యులు మరియు వారి మద్దతుదారులను నిర్బంధించారు. 1971, మార్చి 25న సైనిక పాలకులు తూర్పు పాకిస్తానీయులపై దాడి జరిపారు. ఆ తర్వాత వారి భీతావహ పాలన కొనసాగగా, తూర్పు పాకిస్తానీయులు మార్చి 26న తమ స్వాతంత్ర్యం ప్రకటించుకున్నారు. ప్రస్తుతం బంగ్లాదేశ్‌గా పిలవబడుతున్న తూర్పు పాకిస్తాన్‌కు చెందిన అనేకమంది ప్రజలు మరియు వారి నాయకులు భారతదేశానికి పారిపోయారు. సుమారు 10 మిలియన్ల శరణార్థులు తూర్పు పాకిస్తాన్ సరిహద్దులకు ఆనుకుని ఉన్న భారత భూభాగాలలోకి ప్రవేశించారు. వారు, భారతదేశానికి ఒక ప్రత్యేక ఇబ్బందికర పరిస్థితి కల్పించి, మన ఆర్థిక వ్యవస్థకు భారంగా పరిణమించారు.

భారతదేశం తన సరిహద్దుల చుట్టూ జరుగుతున్న గొడవను ఒక నిశ్శబ్ద ప్రేక్షకురాలిలా చూస్తూ కూర్చోలేదు. భారతదేశం మొదట పాకిస్తాన్‌తో సంప్రదింపులకు ప్రయత్నించింది ఆపై పాకిస్తాన్‌లో జరుగుతోన్న మానవహక్కుల ఉల్లంఘనకు వ్యతిరేకంగా ఇతర దేశాల ప్రజల మద్ధతు కూడగట్టేందుకు ప్రయత్నించింది. భారత పార్లమెంట్, తూర్పు పాకిస్తాన్‌లో కొనసాగుతున్న పోరాటానికి తన సంపూర్ణ మద్ధతు తెల్పుతూ తీర్మానం చేసింది. దీనికి కొనసాగింపుగా, భారతదేశం, తూర్పు పాకిస్తాన్ ప్రజలకు వారి స్వాతంత్ర్య పోరాటంలో ఆర్థిక, రాజకీయ, భౌతిక సహాయ సహకారాలనందించింది.

పాకిస్తాన్ తన అంతరంగిక వ్యవహారాల్లో జోక్యం చేసుకోవద్దని భారత్‌ను హెచ్చరిస్తూ, దానికి ప్రతిచర్యగా 1971, డిశంబర్ 3వ తారీఖున తొమ్మిది భారత వాయు స్థావరాల(airfields)పై దాడి చేసింది. భారతదేశం, తూర్పు పాకిస్తాన్ తరపున యుద్ధంలోకి ప్రవేశించడంతో భారతదేశం, పాకిస్తాన్‌ల మధ్య మూడవ యుద్ధం మొదలైంది. 13రోజుల పాటు జరిగిన యుద్ధానంతరం పాకిస్తాన్ ఓటమి పాలైంది. భారత్ పాకిస్తాన్‌ను లొంగదీసుకుంది. 1971 డిశంబరు 16న భారతదేశం, స్వతంత్ర బంగ్లాదేశ్‌ను గుర్తించి, ఐక్యరాజ్యసమితిలోకి దాని ప్రవేశం కోసం విన్నవించింది.

బంగ్లాదేశ్ ఆవిర్భావానికి కారణమైన భారతదేశమిచ్చిన నైతిక రాజకీయ, సైనిక మద్ధతుతో, భారత–బంగ్లాదేశ్‌ల

మధ్య చక్కటి సంబంధాలు ఏర్పడటానికి బీజం నాటినట్లైంది. బంగ్లాదేశ్ భారతదేశంతో చేసిన స్నేహమే బంగ్లాదేశ్ విదేశీ విధానానికి పునాది రాయి అయ్యింది. ఇరుదేశాలు, 25 ఏళ్ళ శాంతి స్నేహం, సహకార సంధిపై సంతకాలు చేశాయి. ఆర్థిక సంబంధాలు కూడా మెరుగయ్యాయి. షేక్‌ముజీబ్, అతని ప్రభుత్వం, బంగ్లాదేశ్ ప్రజలు భారతదేశానికి కృతజ్ఞతలై ఉన్నారు. కాని 1975లో షేక్ ముజీబ్ హత్యకు గురికావటంతో పరిస్థితులు మారిపోయి బంగ్లాదేశ్‌లో దాడులు, ప్రతిదాడులకు దారితీశాయి.

బంగ్లాదేశ్‌లో ముజీబ్ అనంతరం ఏర్పడిన ప్రభుత్వం భారతదేశం పట్ల అంత అనుకూలత కనబరచలేదు. అయితే భారతదేశం ఈ పరిస్థితులను నిశ్శబ్దంగా చూస్తూ ఊరుకోలేదు. మొదట భారతదేశం, యుద్ధానికి గురైన బలహీనమైన బంగ్లాదేశ్ ఆర్థిక వ్యవస్థకు ఊతాన్నివ్వడానికి, శరణార్థుల పునరావాసానికి ఎక్కువ ఆర్థిక సహాయమందించింది. కాని బలహీన ఆర్థిక వ్యవస్థ కల్గిన భారతదేశం ఎక్కువకాలం పాటు బంగ్లాదేశ్‌కు సహాయం కొనసాగించలేక పోయింది. బంగ్లాదేశ్ బయటి దేశాల ఆర్థిక సహాయం మీద ఆధారపడిన దేశం కావడంతో అది తన అభివృద్ధి కొరకు పాశ్చాత్య, ముస్లిం దేశాల ఆర్థిక సహాయం కొరకు వారికి దగ్గరై భారత్‌కు దూరమయ్యింది. దీంతో బంగ్లాదేశ్‌తో కూడా ఉద్రిక్తతలు మొదలైనట్లయ్యింది.

### గంగాజల వివాదం :

భారత్–బంగ్లాదేశ్ సంబంధాలలో అత్యంత వివాదాస్పద విషయం, ప్రతిసంవత్సరం వేసవికాలంలో అనగా మార్చి నెలమధ్య నుండి మే నెల వరకు గంగా నీటి ప్రవాహం చాలా తక్కువగా ఉన్న సమయంలో ఇరుదేశాల మధ్య నీటి పంపకం, గంగానది భారతదేశం నుండి బంగ్లాదేశ్‌కు ప్రవహిస్తూండటంతో సమస్య ఎదురౌతోంది. కలకత్తా నౌకాశ్రయంలో ఓడల రాకపోకలకు కనీసం 40,000క్యూసెక్కుల గంగానీటి ప్రవాహంపై ఆధారపడి ఉంటుంది. ఈ విధంగా నీటి సరఫరా కొనసాగించడానికి భారతదేశం, ముర్షీదాబాద్ జిల్లా (పశ్చిమబెంగాల్)లో గంగానది కొండలపైకి చేరుకున్నచోట ఫరక్కా ఆనకట్టను నిర్మించింది. గంగా ప్రవాహాన్ని హుగ్లీనదిలోకి తరలించే ఉద్దేశంతో ఇది నిర్మించబడింది. ఇది బంగ్లాదేశ్‌లోని పద్మ (బంగ్లాదేశ్‌లో గంగానది పేరు)నది సహజ మార్గానికి అడ్డుపడింది. కలకత్తా నౌకాశ్రయానికి నీటిని మరలించిన మీదట బంగ్లాదేశ్ కేవలం 15,000 క్యూసెక్కుల నీటిని మాత్రమే పొందుతుండటంతో బంగ్లాదేశ్ అవసరాలకు అదిసరిపోక, దాని ఆర్థిక వ్యవస్థకు హానికరంగా పరిణమించింది.

క్యూసెక్ : ప్రవహించే నీటి కొలత. ఒక క్యూసెక్ = ఒక ఘనపు అడుగు

ఒక సెకండు

అవసరం ఏర్పడినపుడు ఇరుదేశాలూ ఈ సమస్యకు నీటి పంపిణీ సూత్రావళి నందు చిన్న చిన్న మార్పులు చేస్తూ తాత్కాలిక పరిష్కారాలు కనుక్కొంటున్నాయి. ఈ సమస్య పరిష్కారం కొరకు రెండు దేశాలూ రెండు విభిన్న పరిష్కారాలు సూచిస్తూ, గంగానది నీటి సరఫరా పెరుగుదలను అభిలషిస్తూ ఎవరికి వారు ఎదుటివారు సూచించిన ప్రతిపాదనలు అంగీకరించక కఠినంగా ఉన్నారు. భారతదేశం చేసిన ప్రతిపాదన ప్రకారం ప్రతిపాదిత కాలువ అధిక సాంద్రత గల ప్రాంతాన్ని సగానికి కోసివేస్తూ వేలమందిని నిర్వాసితులను చేస్తూండటంతో ఆ ప్రతిపాదనను బంగ్లాదేశ్ తిరస్కరించింది. భారతదేశానికి ఆ కాలువపై ఇరు అంచులపై నియంత్రణ కలిగి ఉండటంతో, బంగ్లాదేవ్ ఆందోళన

చెందింది. నీటి సంప్రదింపులలో నేపాల్‌ని కూడా చేరుస్తూ సమస్యను త్రైపాక్షికంగా చేయడం, బంగ్లాదేశ్ చేసిన ప్రతిపాదన సాంకేతిక సాధ్యాసాధ్యాలను సందేశించిన భారతదేశం విభేదించింది. 1986వ సంవత్సరం చివర్లో భారతదేశం తన అభ్యంతరాలను విరమించింది. ప్రస్తుతం భారతదేశం, బంగ్లాదేశ్, నేపాల్‌లు సమిష్టిగా ఈ సమస్యకు పరిష్కారం కనుగొనవలసిన అవసరముంది. గంగా వివాదం వలన ఇండియా – బంగ్లాదేశ్‌ల మధ్య సంబంధాలు సుమారు ఒక దశాబ్ధం పాటు దెబ్బతిన్నాయి. ప్రస్తుతానికి ఈ సమస్యకు ఎటువంటి పరిష్కారం కనుగొనలేక పోయినా, ఈ మధ్య కాలంలో భారతదేశం అనుసరిస్తున్న విధానాల పరిష్కారాన్ని కనుగొనేందుకు సహాయపడేవిగా ఉంటాయని ఆశించబడుతోంది.

**విదేశీ చొరబాట్లు** (Foreign Infiltration) :

భారతదేశ ఈశాన్య ప్రాంతంలోకి, అంతకుక్రితం తూర్పు పాకిస్తాన్, ప్రస్తుత బంగ్లాదేశ్‌ల నుండి జరుగుతున్న చొరబాట్లు వలన భారతదేశం తీవ్ర ఆందోళనల్లో ఉంది. 1979లో అస్సాంలో మనదేశంలోకి చొరబడిన విదేశీయులను కనుగొని బయటకు పంపడానికి ఒక ఉద్యమం మొదలైంది. 1947లో దేశ విభజనాంతరం తూర్పు పాకిస్తాన్ నుండి ప్రజలు అస్సాం మరియు పశ్చిమ బెంగాల్‌లలోకి చొరబడటం కొనసాగింది. ఆ తర్వాత, పాకిస్తాన్‌లో అశాంతి చోటు చేసుకొన్నప్పుడల్లా అల్పసంఖ్యాక వర్గాలవారు మనదేశంలోకి పారిపోయి వచ్చేవారు. బంగ్లాదేశ్ ఉద్యమం జరిగే సమయంలో 1971లో శరణార్థులు మనదేశ ఈశాన్య ప్రాంతంలోకి పెద్ద సంఖ్యలో ప్రవేశించారు. బంగ్లాదేశ్ ఆవిర్భావం తర్వాత కూడా , బంగ్లాదేశీయులను సైనిక పరిపాలన పట్ల విముఖంగా ఉన్న అనేక శరణార్థుల చొరబాటు కొనసాగింది.

ఈ చొరబాటుదార్ల నిష్పత్తి ఎంత విపరీతంగా పెరిగి పోయిందంటే అస్సామీయులు తమ సొంత ఉనికిని కోల్పోయినట్లయింది. ఈ శరణార్థులు, అస్సామీయుల ఆర్థిక అవకాశాలను కూడా స్థంభింపజేశారు. 1979లో అస్సాం విద్యార్థులు చొరబాట్లను నిరోధించడానికి అప్పటికే దేశంలోకి చొరబడిన విదేశీయులను బయటకు పంపడానికి ఒక ఉద్యమాన్ని చేపట్టారు. భారత ప్రభుత్వం, విదేశీయుల రహస్య చొరబాట్లను నిరోధించడానికి చర్యలు చేపట్టినా, భారత్–బంగ్లాదేశ్‌ల సరిహద్దులు తెంచిఉండటం వలన జయప్రదం కాలేకపోయింది.

1951 తర్వాత భారతదేశంలోకి ప్రవేశించిన విదేశీయులందర్నీ బయటకు పంపాలని, ఆందోళనకారులు డిమాండ్ చేశారు. అయితే, నెహ్రూ లియాఖత్‌ల మధ్య ఒప్పందం ఇందిరా–ముజీబ్‌ల మధ్య అవగాహనల వల్ల భారతదేవం ఆవిధంగా చేయలేకపోయింది. పై చెప్పిన రెండవ అవగాహన ప్రకారం 1971, మార్చి 25 తర్వాత భారతదేశంలోకి ప్రవేశించిన బంగ్లాదేశీయులను బంగ్లాదేశ్ వెనుకకు పిలిపించుకోవాలి. ప్రస్తుతం బంగ్లాదేశ్ విధానం ప్రకారం బంగ్లాదేశ్, బంగ్లాదేశీయులు అన్న గుర్తింపు చూపిన వ్యక్తులను తమదేశంలోకి అనుమతిస్తున్నప్పటికీ, బంగ్లాదేశీయులు ఇంకా భారత్‌లోకి ప్రవేశిస్తున్నారు. లేక ఇప్పటికే ప్రవేశించారు అన్న అపవాదును తిరస్కరించింది. ఇది చాలా క్లిష్ట సమస్య.

భారతదేశం మరిన్ని చొరబాట్లను నిరోధించుటకు బంగ్లాదేవ్ సరిహద్దు వెంబడి ఇనుపముళ్ళ కంచెను ఏర్పాటు చేయాలని నిర్ణయించటంతో ఇరుదేశాల మధ్య సంబంధాలు క్షీణించాయి. భారతదేశ ఈ నిర్ణయాన్ని, బంగ్లాదేశ్ తన సార్వభౌమాధికారానికి పెద్ద దెబ్బగా భావించి వ్యతిరేకించింది. సరిహద్దు కలహాలు ఇంకొంత ఘర్షణకు కారణమయ్యాయి. 1985 ఆగస్టులో భారత ప్రభుత్వం, విద్యార్థి నాయకులకు మధ్య ఒక ఒప్పందం కుదిరినందున అస్సాం ఉద్యమం ఆగిపోయింది. ఐతే విదేశీ చొరబాట్లు ఆగక సమస్యలు సృష్టించటం కొనసాగుతూనే ఉంది.

ప్రస్తుతం బంగ్లాదేవ్ నుండి చక్మా శరణార్థులు(Chakma refugees)అనే జానపదుల సమూహాలు పొరుగున ఉన్న భారత దేశ రాష్ట్రాలలోకి ప్రవేశించటం ప్రారంభించారు. ఈ జాతివారు బంగ్లా జాతీయులచే అణచవేయబడటంతో వీరు రక్షణ కోరుతూ భారతదేశంలో చొరబడుచున్నారు. ఈ చొరబాట్లను నిరోధించటానికి పైగా ఇప్పటికీ చొరబడిన చక్మా శరణార్థులను వెనుకకు పంపటానికి ఇరు ప్రభుత్వాల మధ్య సంప్రదింపులు జరిగాయి. బంగాళాఖాతాలు గల న్యూమూర్‌ద్వీపం(New Moore Island)పై ఆధిపత్యం మరియు తీన్‌బిఘా(Theen Bigha) ప్రాంతాన్ని బంగ్లాదేశ్‌కు అప్పగించడం వంటి వ్యవహారాలు కూడా బంగ్లాదేశ్‌తో వివాదానికి కారణమైనాయి. అయితే కొన్ని సంవత్సరాల నుండి భారత్, బంగ్లాదేశ్‌లు రెండిమధ్య భౌగోళిక, ఆర్థిక ప్రాధాన్యతను గుర్తించటంతో వీరి సంబంధాలలో మార్పు వచ్చింది. బంగ్లాదేవ్ అభ్యర్థనపై దక్షిణాసియా ప్రాంతీయ సహకార సంఘం (SAARC - South Asian Association for Regional co-peration) ఏర్పాటు చేయటంపై విషయాన్ని ధృవపరుస్తుంది. భారతదేశం, పాకిస్తాన్, బంగ్లాదేశ్, నేపాల్, భూటాన్, శ్రీలంక, మాల్దీవులు వంటి ఏడు సభ్యదేశాలతో ఏర్పడిన S.A.A.R.C పరస్పర ఆర్థిక సహకారం ద్వారా మనకు ఇతర దేశాలతో గల సంబంధాలను మెరుగుపరచడంలో తప్పక సాయపడుతుంది.

విదేశీ సంబందాలకు సంబంధించినంతవరకు కాలమాన పరిస్థితుల కనుగుణంగా నిరంతర పునః సవరణల అవసరముంటుంది. కాబట్టి శాంతి, సుస్థిరత మరియు అభివృద్ధి కొరకు పొరుగుదేశాలు తమ విదేశాంగ విధానాలను పునః పరిశీలించుకోవలసిన అవసరముంది. మనం ఎన్నో ఆర్థిక సవాళ్ళను ఎదుర్కొంటున్నాం కాబట్టి మన రక్షణ కొరకు భారీస్థాయిలో ఆయుధాలను పోగు చేయడానికి మన వనరులన్నింటిని ఖర్చు చేయాలంటే చాలా కష్టమైనపని. మనం ఒక మంచి పొరుగుదేశంగా పాత్ర పోషించవలసిన అవసరం ఎంతైనా ఉంది. కాబట్టి పరస్పర విశ్వాసం సహకారాలకు సంబంధించిన రాజకీయ సంకల్పం స్ఫూర్తిలను వారందరిలో(చొప్పంచవలసిన) కల్గించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

## పాఠ్య ప్రశ్నలు 65.4

1. భారతదేశం, చైనాల మధ్య వివాదానికి కారణమైన రెండు ప్రధాన అంశాలు వ్రాయండి.
2. 'సిమ్లా ఒప్పందం' పై ఏ సంవత్సరంలో సంతకం చేయబడింది?
3. అలీనోద్యమాన్ని ఏర్పరచటానికి చొరవ తీసుకున్న మూడుదేశాలను పేర్కొనండి.
4. అలీనోద్యమానికి చెందిన ముగ్గురు ప్రముఖ నాయకుల పేర్లను తెల్పండి.

## సారాంశం :

భారతదేశం స్వాతంత్ర్యం పొందేనాటికి 11 బ్రిటీష్ ఇండియా రాష్ట్రాలు, 562 సంస్థానాలుండేవి. కొత్త రాజ్యాంగం అమలులోకి వచ్చేనాటికి, ఈ సంస్థానాలన్నీ భారత యూనియన్‌లో విలీనమయ్యాయి.

భారత రాజ్యంగం 4రకాల రాష్ట్రాలను ఏర్పరచింది. అవి విభాగం 'ఎ', విభాగం 'బి', విభాగం'సి' విభాగం 'డి' రాష్ట్రాలుగా పేర్కొనబడ్డాయి. చాలాకాలం నుండి భాషాప్రయుక్త రాష్ట్రాలు మరియు సంస్థానాల ఏర్పాటు చేయాలంటూ డిమాండ్ చేయబడుతుంది. సుదీర్ఘ పోరాటం తర్వాత 1953లో మొదటి భాషా ప్రయుక్త రాష్ట్రమైన 'ఆంధ్రరాష్ట్రం'

ఏర్పాటు చేయబడింది. అదే సంవత్సరంలో ప్రభుత్వంచే భారత రాష్ట్రాల పునర్వ్యస్థీకరణ కోసం "రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం" నియమించబడింది. ఈ సంఘం చేసిన సిఫారసుల మేరకు 1956లో విభాగాలు ఎ,బి,సి,డి రాష్ట్రాల తేడాను రద్దుచేస్తూ రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ చట్టం ఆమోదం పొందింది. ఈ చట్టం భారత సమాఖ్యను 14 రాష్ట్రాలు 6 కేంద్రపాలిత ప్రాంతాలుగాను పునర్వ్యవస్థీకరించింది. 1956సంవత్సరాల తర్వాత కూడా అనేక కొత్త రాష్ట్రాలు ఏర్పాటు చేయబడ్డాయి. ఉదాహరణకు 1966లో పంజాబ్ రాష్ట్రం, పంజాబ్ మరియు హర్యానాలు గాను, 1960లో బొంబాయి రాష్ట్రం, మహారాష్ట్ర మరియు గుజరాత్‌లుగాను మరియు 1987లో గోవా, అరుణాచల్ ప్రదేశ్ మరియు మిజోరాం కేంద్ర ప్రాంత పాలితాలు ఏర్పాటు చేయబడ్డాయి.

మనదేశంలో అనేక మతాలు, భాషలు మరియు కులాలు ఉన్నాయి. ఒక ఆరోగ్యకర సమాజ నిర్మాణం కొరకు కులవైషమ్యాలు క్రమేణా తగ్గుముఖం పట్టాయి. రాజ్యాంగంచే 'అంటరానితనం' నిర్మూలించబడటమే కాకుండా, షెడ్యూల్డ్ కులాల వేగిర అభ్యున్నతి కోసం వారికి ప్రత్యేక రాయితీలు కల్పించబడ్డాయి. భూస్వామ్య (పెట్టుబడిదారీ) వ్యవస్థను అంతం చేసే దిశగా జమీందారీ వ్యవస్థ రద్దు చేయబడింది. స్వాతంత్ర్యానంతరం భారతదేశం స్త్రీ స్వేచ్ఛ కోసం తీవ్రంగా కృషి చేస్తుంది. బాల్యవివాహాలు, స్త్రీ శిశు హత్యలు, సతి మరియు వరకట్నాలను నిరోధించడానికి అనేక చట్టాలు చేయబడ్డాయి. స్త్రీలు మరియు పురుషులకు తండ్రి ఆస్తిలో సమాన వాటా కల్పిస్తూ వారసత్వ చట్టం(Law of succession)చేయబడింది. స్త్రీలకు సమాన ఉద్యోగ అవకాశాలు కూడా కల్పించబడ్డాయి.

భారతజాతి నిర్మాణానికి దోహదం చేసే సామాజిక మార్పును కల్గించే ముఖ్యఅంశంగా జాతీయ సమైక్యతను చెప్పవచ్చు. మతతత్వం, ప్రాంతీయవాదం వేర్పాటు భాషా వైరుధ్యాలు ప్రజలలో విభజన తెచ్చి వేర్పాటువాదాలకు కారణమయాయయి. ఈ సమస్యలను అధిగమించటానికి ప్రయత్నాలు జరగాల్సిన అవసరముంది. ఒకదేశం యొక్క ఆర్థికాభివృద్ధిని సాధించుటకు ఒక ముఖ్య విధానం ప్రణాళికా రచన. భారతదేశంలో, భారత ప్రధాని ఛైర్మన్‌గా ఏర్పాటు చేయబడే ప్రణాళికా సంఘం, ప్రణాళికా రచన చేయడానకి ఏర్పడిన అత్యున్నత అంశం. అది దాదాపుగా (2011నాటికి) పది పంచవర్ష ప్రణాళికలను రూపొందించి పూర్తి చేసింది. ఈ ప్రణాళికలు, భారతదేశం తన లక్ష్యాలైన అభివృద్ధి, స్వావలంబన, సామాజిక న్యాయం, పూర్తి ఉపాధి కల్పనలను సాధించేందుకు దోహదపడ్డాయి. అయితే, భారత జనాభాలో ఒక పెద్ద వర్గం వారు ఇంకనూ తీవ్ర పేదరికంలో మగ్గుతున్నారు.

చైనా, పాకిస్తాన్ మరియు బంగ్లాదేశ్‌లు భారతదేశానికి అతి సమీప పొరుగుదేశాలు. ఈ మూడు దేశాలతో మనకు భౌగోళిక, చారిత్రక, సాంస్కృతిక సంబంధాలున్నాయి. అయితే మన పొరుగుదేశాలతో మనకు కొన్ని తప్పనిసరి ఆందోళనకర అంశాలు పొడచూపాయి. చైనాతో టిబెట్ సరిహద్దు సమస్యలు, పాకిస్తాన్‌తో అల్పసంఖ్యాక వర్గాలు, కాశ్మీర్ సమస్యలు, రోజురోజుకూ పెరిగిపోతున్న సైనికబలం సమస్యలు కలవు. మన భౌగోళిక సారూప్యతలు, ఆర్థిక అవసరాల దృష్ట్యా మనం, మన పొరుగు దేశాలవారితో సుహృద్భావంగా మెలగవలసిన అవసరముంది. మనం పొరుగుదేశాలన్నింటిలో స్నేహపూర్వక సంబంధాలకొరకు తీవ్రకృషి సల్పుతున్నాం.

అలీనోద్యమం(NAM)అన్నిరకాల అణచివేతలను, దోపిడీని అన్యాయాల్ని వ్యతిరేకిస్తుంది. ఇది నూతన అంతర్జాతీయ రాజకీయ వ్యవస్థ(NIPO), నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థ(NIEO), నూతన అంతర్జాతీయ సమాచార

వ్యవస్థ(NIICO)లకోసం కృషి సల్పింది అవి, అభివృద్ధి అనే ప్రక్రియ ద్వారా పేద, ధనిక వర్గాల మధ్య ఉన్న అంతరాన్ని పూరించడానికి ప్రయత్నించాయి. అలీన ఉద్యమంలో భారతదేశం ఒక ప్రముఖపాత్ర పోషించింది. ఈ ఉద్యమం ఆవిర్భావానికి ఆరోగ్యకర అభివృద్ధికి దోహదపడిన వ్యక్తి పండిట్ నెహ్రూ. అతి ప్రతి అంతర్జాతీయ సమస్యను తనదైన శైలిలో పరిష్కరించింది. ఈ ఉద్యమం, వివిధ దేశాల మధ్య ఆందోళనలు తగ్గించడం మరియు నిరాయుధీకరణలపై అంతప్రభావం చూపలేకపోయిందని విమర్శించే వారు కూడా ఉన్నారు. కాని, శక్తి కూటములు, ఉన్నంతకాలం ప్రపంచంలో శాంతి నెలకొల్పడానికి విఘాతాలున్నంత కాలం, ఆర్థిక వ్యత్యాసాలున్నంత కాలం అలీన ఉద్యమం ఎప్పటికీ తన ఉనికిని కోల్పోదు.

**అభ్యాసం**

1. 1953, రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం చేసిన సిఫారసులను దృష్టిలో ఉంచుకొని ప్రభుత్వం చేపట్టిన చర్యలను పరీక్షించండి.
2. సామాజిక పరిణామం అనగా నేమి? భారతేశంలో జాతినిర్మాణానికి ఇది ఎలా దోహదం చేస్తుంది?
3. భారతదేశంలో ప్రణాళికా విధానం ప్రధాన లక్ష్యాలు ఏవి? వానిని చర్చించండి.
4. మన ఇరుగు పొరుగు దేశాలతో ఎందుకు స్నేహసంబంధాలు కలిగి ఉండాలి?
5. అలీన ఉద్యమంలో భారతదేశం పోషించిన పాత్రను చర్చించండి.
6. ప్రస్తుత ప్రపంచంలో అలీన ఉద్యమపాత్రను, సంబంధాన్ని చర్చించండి.

## పాఠ్య ప్రశ్నలకు సమాధానాలు

**65.ఎ**

1. అధికరణం 3
2. ఆంధ్రరాష్ట్రం
3. మూడు
4. మహారాష్ట్ర మరియు గుజరాత్
5. హర్యానా

**65. బి**

1. సామాజిక పరిణామం అనగా సమాజం నిర్మాణం, స్ఫూర్తిలలో వచ్చు మార్పు

2. బాల్య వివాహాల నిరోధానికి

**65. సి**

1. ఆర్థికాభివృద్ధి, సంపూర్ణ ఉపాధికల్పన, సామాజిక న్యాయం, స్వావలంబన

2. ఐదు సంవత్సరాలు

3. పరిశ్రమలు

4. పేదరిక నిర్మూలన

**65. డి**

1. టిబెట్ సమస్య మరియు సరిహద్దు సమస్య

2. 1972

3. భారతదేశం, ఈజిప్టు మరియు యుగోస్లేవియా

4. నెహ్రూ, నాసర్, టిటో